

# సమస్త భక్త శిఖామణులు

## గబ్బిట దుర్గాప్రసాద్

దైవ భక్తి తమ జీవితాలను భగవంతుని ఆరాధన, మహిమల తో పేరొందిన మహానుభావులు దేశభక్తి జన్మించిన దేశం మీద గల మక్కువ. ప్రాణాన్ని కూడా త్యాగం కూడా వెనుకాడని వారు. వ్యక్తికంటే దేశానికే ప్రాధాన్యత ఎక్కువ. తమ రాజ్యం కోసం మంత్రులు, కవులు చరిత్ర లో కనబడక పోయినా కృతార్థులు అయ్యారు.

సరసభారతి ఉయ్యూరు

## ఇందులో

Contents

### ఒక్క నిమిషం

కాలం తో పాటు సాంకేతిక మారింది. ఇంతకు ముందు తెలిసినవి అన్నీ పుస్తకం లో రాసుకొని, సమావేశాలలో అందరికి వినిపించటం అనేది అలవాటు గా జరిగేది. 2010 లో సరసభారతి ఉయ్యూరు లో ఒక సాంస్కృతిక సంస్థ గా ప్రారంభం అయ్యి సాహితీ సభలు, ఉగాది కవి సమ్మేళనం, సమావేశాలు స్థానిక గ్రంథాలయాలలో, దేవాలయాలలో జరిగేవి. సరసభారతి చిన్న పత్రిక గా రూపుదిదుకొంది.

సహజం గా సైన్స్ టచర్ అవ్వటం వల్ల ప్రతిదీ నా అవసరాలకు మేరకు నేర్చుకోవటం బాగా అలవాటు.. ఈ వయసులో కంప్యూటర్ నేర్చుకొనటం, తెలుగు లో టైపు చేయటం, నోట్స్ తయారు చెయ్యటం ఈమెయిలు రాయటం. సమాధానాలు రాయటం నేర్చుకోన్నవి. బహుశా మా తరం వాళ్ళకంటే ముందుగా కంప్యూటర్

నేర్చుకుని ఇమెయిల్ ద్వారా సాహితీ రచనలు పంపటం ప్రారంభం అయ్యింది ఈ ప్రయాణం. ఇమెయిల్ తెలుగు లో రాసినవి స్కాన్ చేసి. బంధువులకు, మిత్రులకు పంపటం అలవాటు అయ్యింది.

అప్పుడే ప్రసిద్ధ వ్యక్తులు బ్లాగ్ ద్వారా తమ రచనలను, ఆలోచనలను పంచుతున్నారు. పిల్లలు బ్లాగ్ పెడితే అందులో ఇంగ్లీష్ లో రాయటం. తెలుగు వి స్కాన్ చేసిపెట్టటం. ఇది ఒక మెట్టు. సాహితీ బంధు గ్రూప్ తయారుచేసి. సాహితీ మిత్రులకు పంపటం మలి మెట్టు.

తెలుగు లో రాయాలంటే సాఫ్ట్వేర్, కీబోర్డ్ ఉండాలి ఎందుకో అది కష్టం గా అనిపించింది. అప్పుడే గూగుల్ యూనికోడ్ తో తెలుగు లో రావాలటం. చాలా బాగా ఉండటం. ఇంగ్లీష్ లో కొడితే తెలుగు లో రావటం అది ఇమెయిల్ లో, బ్లాగ్ లో చేరటం. జరిగింది మొరొక మెట్టు. రోజుకు ఒకటి, లేదా రెండు పోస్ట్స్ తో ప్రారంభం అయ్యి. ఒక అలవాటు గా మారి రోజుకు పది.. డజన్ల వరకూ వెళ్ళింది. బ్లాగ్ ప్రారంభం అయ్యిన తరువాత గ్రామీణ ప్రాంతం నుంచి తెలుగు లో ఉసూల గూడు (బ్లాగ్స్) కూడా రాస్తారు అని ప్రపంచానికి తెలిసింది. తెలుగు బ్లాగర్స్ అందరికి సరసభారతి బాగా పరిచయం. కూడలి ద్వారా దేశ విదేశాల తెలుగు వారికీ బ్లాగ్ చేరింది.

ఉదయం వార్తా పత్రికలలో వచ్చే అంశాలతో ప్రారంభం అయ్యి, సాయంత్రం ఒక పుస్తకం, కవి మీద సమీక్ష సాయంత్రం కొన్ని సార్లు రాత్రి పొద్దు పోయేవరకూ రచనలు జరిగేవి. దాదాపు 10-12 గంటలు నోట్స్ రాసుకోవటం. టైపు చెయ్యటం, ఫొటోస్ కాలేక్ట్ చెయ్యటం. ఇమెయిల్ ఇవ్వటం ఇలా...

సోషల్ మీడియా విస్తరించి బ్లాగ్ లో రాసింది ఆటోమేటిక్ గా ఫేస్బుక్, ట్విట్టర్ మొదలైన వాటికి వెళ్ళటం. ప్రపంచమంతా తెలియటం జరిగింది ఇది మరొక్క మెట్టు. అమెరికా ప్రయాణం లో పరిచయం లేని వాళ్ళు కూడా గుర్తు పట్టి బ్లాగ్ గురించి గొప్పగా చెప్పటం విశేష అనుభూతి. బ్లాగ్ లో సాహిత్యం, పుస్తక విశ్లేషణ, సభలు. ప్రయాణాలు. రాజకీయాల, దేవాలయములు, సినిమా, నా దారి. సరసభారతి సమావేశాలు... ఇలా జీవితం లో మనకు తారసపడే ప్రతి అంశం మీద రాయటం అవి సోషల్ మీడియా లో చేరటం జరిగిపోయేవి. టైపింగ్ లో కొన్ని తప్పులు దొర్లినా మంచి మనసుతో దానిని అర్థం చేసుకొని బ్లాగ్ కి సహకరించిన వారి అందరికి ధన్యవాదాలు.

లాభాపేక్ష, వ్యాపార ద్రుష్టి లేకుండా రాసినవి, సేకరించినవి భావి తరాలకు తెలియాలనేదే ఈ ప్రయత్నం. పుస్తకాలలో నిక్షిప్తమైన వి ఈ తరం, రేపటి తరాలకు అందించటమే ఆశయం. వికీపీడియా కూడా తమ రిఫరెన్స్ కోసం సరభారతి పోస్ట్స్ లంకె వెయ్యట జరుగుతోంది.

ప్రపంచం మొబైల్స్ లోకి మారినప్పుడు అందరూ బ్లాగ్స్ ఆపేసినా సరసభారతి కొనసాగించటం విశేషం. వాట్సాప్ లో కూడా మిత్రులకు గ్రూప్ తయారుచేసి పోస్ట్ పంపటం ప్రారంభం.

గత రెండు సంవత్సరాలుగా చాలా సౌకర్యం గా ఉండటం తో రోజు ఉదయం పది గంటలకు లైవ్ ప్రోగ్రాం చెయ్యటం అలవాటుగా మారింది. సరసభారతి బ్లాగ్ లో రాసి పుస్తకం రూపం లో వచ్చినవి దాదాపు. 40.

అంచెలంచలు గా ఎదుగుతూ పదివేల పోస్ట్స్ కు నేను రాసినవి చేరాయి. ముద్రితం కానివి దాదాపు 500 వ్యాసాలు. పదివేల పేజీలు, యాభై లక్షల పదాలు, రెండు కోట్ల అక్షరాలూ. వీటిని సేకరించి తప్పులు సరి దిద్ది క్రమ పరిచి అంకాత్మక (డిజిటల్) పుస్తకాలు గా ఆవిష్కరించి మీకు అందించే ప్రయత్నమే ఇది.

ఇంతక ముందు రాసిన 'సిద్ధ యోగి పుంగవులు' పుస్తకం లో 35 మంది ప్రసిద్ధ సిద్ధులను దర్శించటం జరిగింది.
ఇందులో మనకు తెలియని 200 మందిని దర్శించటం జరుగుతోంది. కొందరి జీవిత చరిత్రలు, ప్రసిద్ధుల చరిత్ర కాకుండా వారి సందేశాలు, జీవిత గమ్యాలు రాయటం జరిగింది.

**75 వ భారతదేశ స్వాతంత్ర దినోత్సవ కానుకగా భారత దేశం లోని వివిధ భక్త శిఖామణులు ఇంతకు 'సిద్ధ యోగి పుంగవులో' పుస్తకం లో ముందు రానివి, పుస్తకాలు చదివి రాసినవి ఈ సమస్త భక్త శిఖామణులు గా పరిచయం చేస్తున్నాము. ఇందులో దైవం కోసం, దేశం కోసం, రాజ్యం కోసం, సాహిత్యం కోసం పాటుపడి చరిత్రలో మిగిలిపోయిన భక్త శిఖామణులు మీకోసం**

సమస్త భక్త శిఖామణులు

# గ్రంథకర్త పరిచయం



| | |
|---|---|
| పేరు | గబ్బిట దుర్గాప్రసాద్ |
| జననం | 27-6-1940 ఉయ్యూరు కృష్ణాజిల్లా |
| తలిదండ్రులు | గబ్బిట భవానమ్మ, మృత్యుంజయ శాస్త్రి |
| భార్య | ప్రభావతి |
| విద్య | ఎం ఏ, తెలుగు, బి.ఎస్ సి. బి.ఎడ్. |
| ఉద్యోగం | ఫిజకల్ సైన్స్ టీచర్, పదానోపాధ్యాయుడు -కృష్ణా జిల్లా పరిషత్ (1963-1998) |
| సంతానం | గబ్బిట మృత్యుంజయ శాస్త్రి, సమత సంకల్ప్, భువన్ సాయి తేజ<br>లక్ష్మీ నరసింహ శర్మ, ఇందిర శ్రీ హర్ష సాయి, హర్షి తాంజని<br>నాగ గోపాల కృష్ణ మూర్తి, రాణి గౌతమ శ్రీ చరణ్, రమ్య<br>వెంకట రమణ, మహేశ్వరి<br>కోమలి విజయలక్ష్మి, సాంబావధాని శ్రీకేత్, ఆశుతోష్, పీయూష్ |
| స్వీయ రచనలు | 1 ఆంద్ర వేద శాస్త్ర విద్యాలంకారులు 2 జనవేమన 3 దర్శనీయ దేవాలయాలు 4 శ్రీ హనుమత్ కథా నిధి 5 శ్రీ ఆంజనేయ స్వామి మహాత్మ్యం 6 సిద్ధ యోగిపుంగవులు 7 మహిళా మాణిక్యాలు 8 పూర్వాంగ్ల కవుల ముచ్చట్లు 9 దర్శనీయ దైవ క్షేత్రాలు 10 గీర్వాణ కవుల కవితా గీర్వాణం (3 భాగాలు) 13 దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు (2భాగాలు) 15 కేమోటాలాజి పిత డా.కొలచల సీతారామయ్య 16 దైవ చిత్తం 17 బ్రహ్మశ్రీ మద్దులపల్లి' శాస్త్రి గారి శతజయంతి కరదీపిక 18 ఆధునిక ప్రపంచ నిర్మాతలు - జీవితాలలో చీకటి వెలుగులు 19 షార్లెట్ సాహితీ మైత్రీ బంధం 20 అణుశాస్త్ర వేత్త డా.ఆకునూరి వెంకట రామయ్య 21 ప్రయోగాత్మక కాంతి శాస్త్ర పరిశోధన పిత డా పుచ్చా వెంకటేశ్వర్లు 22 ఊసుల్లో ఉయ్యూరు 23 సోమనాథ్ నుంచి కాశీ విశ్వనాథ్ దాకా 24 ఆధునిక ఆంధ్ర శాస్త్ర రత్న మాణిక్యాలు 25 వ్యాఖ్యాన చక్రవర్తి కోలాచలం మల్లినాథ సూరి 26 విదేశీ సంస్కృత విద్వాంసులు. |
| సంపాదకత్వం | సరసభారతి ప్రచురించిన పుస్తకాలు 1 జ్యోతిస్సంశ్లేషణం 2 ఉయ్యూరు ఊసులు 3 నవకవితా వసంతం 4 మా అక్కయ్య 5 "ఆదిత్య "హృదయం" 6 త్యాగి పే"రెడీలు" 7 శ్రీరామవాణి 8 మా అన్నయ్య 9 శ్రీ సువర్చలా వాయు నందన శతకం 10 శ్రీ సువర్చలా మారుతి శతకం 11 శ్రీ సువర్చలేశ్వర శతకం 12 వసుధైక కుటుంబం 13 Nuclear Scientist Dr.Akunuri Ramayya 14 సాహితీ స్రవంతి (సాహితీ మండలి తరపున) |
| అంకాత్మక | 1 సమస్త భక్త శిఖామణులు |

మహాభక్త శిఖామణులు

ఆధారం –శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయనమూర్తిగారి రచన "మహా భక్త విజయం "

# 1 చోకమేల




మహారాష్ట్ర ధ్యాన దేవుడు తన కులం నుంచి బహిష్కరిపబడిన తర్వాత పన్ధర్పురానికి వెళ్లి మతోద్యమ విప్లవం విస్తృతం చేశాడు. బ్రాహ్మణుల అధికారాన్ని ఎదిరించాడు. జనసామాన్యానికి భగవద్గీత అర్ధమయేట్లు మారాఠీ భాషలో రాసి జనవ్యాప్తి కలిగించాడు. జంతు హింస మాన్పించి, విశ్వాసం తోసే భగవంతుని చేరవచ్చునని బోధించాడు. జనంలో మంచి పేరు వచ్చి భక్తజనం కవులు బాగా ఆయనకు దగ్గరయ్యారు. దీనితో ప్రజలకు సాంఘిక స్వాతంత్ర్యం ఏర్పడి నూతన రూపు దాల్చింది మహారాష్ట్ర సమాజం. ఆయన భక్తులలో ప్రముఖుడు చండాల వంశానపుట్టిన "చోక మేల".

ఈ మతోద్యమం భీమ నదీ తీరాన ఉన్న ముఖ్య స్థలం అక్కడ ఒక ప్రాచీన దేవాలయం ఉంది. కాని 13 వ శతాబ్ది వరకు దానికి ప్రచారమే లేదు. అదే పన్ధర్ పుర దేవాలయం. ఈ దేవాలయం లోని ఇటుక వేదికపై నిలిచి విఠోబా ను ఆరాధించాలని, భక్తులు, సామాన్య జనం ఉవ్విళ్ళూరే వారు. స్వామి దర్శనంతో పులకించిపోయి జన్మ ధన్యమైనదని భావించేవారు. దీని గురించి కధలు, గాధలు తరతరాలుగా ప్రచారంలో ఉన్నాయి. ఒక కుంటి యోగి పైథాన్ నుంచి పండరీ పురానికి దేక్కుంటూ పాక్కుంటూ చేరి స్వామి దివ్య దర్శనం చేశాడట. ఆలయం పెద్ద గొప్పదేమీకాదు శిల్ప సౌందర్యమూ పెద్దగా లేదు. కాని అదొక గొప్ప ఆకర్షణ. ఆలయం లోని ప్రతిభాగం లో భక్తీ చిప్పిలుతుందని భక్తులు భావించి దర్శించి మురిసిపోయేవారు.

విఠల దేవుని ప్రధానసేవకులలో చోక మేల ఒకడు. తండ్రి సుదాముడు. తల్లి ముక్తాబాయి. వీరిది పండరికి దగ్గరలోని అనాగడ్ అనే పల్లె.మంచి స్థితిపరులే కాని సంతానం లేదు. సుదాముడు తరచూ పండరినాధుని దర్శించి పుత్రభిక్ష ప్రసాదించమని వేడుకొనేవాడు. భర్త ఊరిలో లేనప్పుడు భార్య ముక్తాబాయి తమ తోటలోని 200 మామిడి పండ్లను కోసి బీదర్ లోని ముసల్మాన్ గవర్నర్ కు అందజేయటానికి తీసుకువెళ్ళేది. ఒక రోజు పేద బ్రాహ్మణుడు దారిలో కనిపించి ఆకలిగా ఉంది కొన్ని పళ్ళు ఇస్తే తిని ఆకలి తీర్చుకొంటానని ప్రాధేయపడ్డాడు. సంతోషం తో పండిన పండ్లు అయిదు ఆయన చేతిలో పెట్టింది. వాటిని తీసుకొంటూ "అమ్మా !నీ సౌజన్యం ఎనలేనిది. మీకు పండంటి అయిదుగురు సంతానం కలుగుతారు. నాకు మామిడిపళ్ళు ఇచ్చావు కనుక నీ పెద్ద కొడుకుకు "చోక"(చోక్ సేన్ అంటే మరాటీలో మామిడి పండు అని అర్ధం) అని పేరు పెట్టు అని చెప్పి వెళ్లి పోయాడు.

కొంతకాలానికి ముక్తాబాయి దంపతులకు పుత్రుడు జన్మించగా "చోక "లేక చోక మేల అని పేరు పెట్టుకొన్నారు. తల్లీ తండ్రీ భక్తులే కనుక చిన్నప్పటి నుంచి బాలుడికి కూడా ఆభక్తి సహజంగా అబ్బింది. చండాల వంశజుడు కనుక ఊళ్ళో ఏ పశువు చనిపోయినా ఈడ్చుకు వెళ్లి బయట పారేయటం అతని పని అయింది. ఒక సారి ఊరి పెద్దలతో సహా తండ్రీ ఊర్లో లేనప్పుడు ఒక పెద్ద ఆవు చచ్చిపోతే, దాన్ని కళేబరాన్ని ఈడ్చి పారేయాల్సి వచ్చింది చోక మేల కు, యితడు చిన్నారి బాలుడు. దాన్ని లాగేసే శక్తి లేనివాడు. విఠోబాతన శక్తినిచ్చి సాయం చేశాడు. ఒక సారి పండరి ఆలయం లో స్వామి దర్శనానికి వచ్చి దర్శించి జన సమూహం లో ఉండిపోయిన ఒక సుందరి, అయిన బాలిక చోకమేల ను చూసి, అకస్మాత్తుగా పాదాల మీద వ్రాలి తనను భార్యగా చేసుకోమని కోరింది, సరేనని తల్లిదండ్రుల అనుమతితో వివాహమాడాడు.

కొన్ని రోజుల తర్వాత తన హృదయేశుడు పండరినాథుని సమీపాన నివసించాలని కాపురం పండరిపురానికి మార్చాడు. అనుకూలవతి భార్య సకల విధాలా సాయపడుతోంది. పండరి వెళ్ళాడే కాని, నీచ కులజుడవటం వలన, ఆలయ ప్రవేశం నిషిద్ధం కనుక విఠలుని సేవ చేయటానికి కుదరటం లేదు. బయట గుమ్మం దగ్గర కూర్చునే కనిపించీ కనుపించకుండా స్వామిని దర్శిస్తూ తన్మయుడయేవాడు. ఇలా రోజూ కూర్చుంటూ తర్వాత చీపురుతో గుడి చుట్టూ బాగు చేస్తూ ఉండేవాడు. గుడిలో జరిగే ప్రార్ధనలు భజనలు అన్నీ బయటినుంచే వింటూ కనిపిస్తే చూస్తూ కాలక్షేపం చేసేవాడు. మాదిగవాడు సన్యాసి కావటం ధ్యాన దేవుడి శిష్యులకు కూడా ఇష్టం గా ఉండేదికాదు. అతని భక్తిని అపహాస్యం చేసేవారు.

ఇలా ఉండగా ఒక రోజు ఒక బ్రాహ్మణుడు అసూయతో చోకమేలతో "ఎందుకు వృధాగా రోజంతా ఆలయం బయటే కూర్చుంటావు. బ్రాహ్మణుడి దగ్గర కూర్చుని అతని కుక్క కంచంలోని ఆ పెరుగన్నం తినాలనే ఆశ ఎలా నెరవేరదో, నీకు విఠల దర్శనం అలా నెరవేరదు. బిచ్చగాడు రాజవాటం యెంత అసంభవమో, నువ్వు వైకుంఠం చేరటం అంతే అసంభవం" అన్నాడు. ఆమాటలు ములుకులుగా గుచ్చుకొన్నా, చోకమేల వినయంతో నమస్కరించి "అయ్యా !కోట్ల మైళ్ళలో ఆకాశం లో ఉన్న సూర్యభగవానుడు నేలమీదనీటిలో ఉన్న పద్మాలకు కిరణ శోభకలిగించి వికసింప జేయటంలేదా? దూరంగా ఉన్నా, నా విఠలదేవుడు నామొర ఆలకించి నన్ను కనికరించక పోడు.మనుషుని హృదయం లో ఆ స్వామిని ప్రతి ష్టించు కొన్న ప్రతివాడూ ఆయనకు దగ్గరగా ఉన్నట్లే " అన్నాడు.

అదే రోజు రాత్రి విఠలుడు చోకమేల ను తానే దేవాలంలోకి తీసుకు వెళ్లి, గర్భాలయం లో కూర్చోబెట్టి, అతని భక్తిని ప్రశంసించాడు. ఇంతలో ఆలయం లోని పూజారులు మేలుకొని, ఘోరం జరిగి పోయిందని గగ్గోలు పెట్టి మిగిలిన పూజారులను పిలిచి రప్పించారు. తలుపులన్నీ వేసి ఉంటె ఎలా ప్రవేశించాడనే ఆశ్చర్యంతో పాటు మాదిగావాడి వలన ఆలయం అపవిత్ర మైనదని ఆక్రోశం కలిగింది వారికి, కోపోద్రేకాలను ఆపుకోలేక అతడిని కొట్టి బరబరా గొడ్డును లాగినట్లు లాగించి బయటపడేశారు. అతడు నిశ్చల నిర్మల మనసుతో "పెద్దలారా ! గంగానదిలో మాదిగవాడు స్నానం చేస్తే అది మైలపడుతుందా ?వీచే గాలి చండాలుని సోకితే

మైలపడుతుండా, అతని ఊపిరి వాయువును మైలపరుస్తుందా ?చండాలకులం లో పుట్టిననేను ఏ అపరాధమూ చేయలేదు "అనగా వాళ్లకోపం తారాస్థాయి చేరి "నీచకులం లో పుట్టి, మాకు నీతులు నేర్పుతున్నావా?" అని మండిపడి రాజు దగ్గర నివేదించారు.

రాజు మహమ్మదీయుడు చోకమేల ను పిలిపించి విచారించాడు. అతడు "ఆ విఠోబా దేవుడే నేను అంటరాని వాడిని అని మొరపెట్టినా, వినక తానె తీసుకువెళ్ళి గర్భాలయం లో కూర్చోబెట్టాడు నేనేమి చేయగలను ?" అన్నాడు. ఎన్ని విధాలా చెప్పినా వినక ముస్లిం నవాబు అతడి మెడకు బండపలుపు కట్టించి వీధుల్లోకి ఈడ్పించాడు. గట్టి ప్రాణం కనుక తట్టుకు నిలబడ్డాడు. పండరి నుంచి బహిష్కరించి భీమనదికి అవతల పదేయించి మళ్ళీ రావద్దని శాసించాడు.

హరి లోన కొలువై యున్న భక్తునికి భయమెందుకు ? చోకమేల భీమనది ఒడ్డున "దీపమాల" కట్టించి, తనగుడిసె లో కూర్చునేవాడు. ఒకరోజు నిమ్మ చెట్టుకింద భోజనం చేస్తుంటే పండరి విఠలుడు ప్రత్యక్షమవగా, ఆయనకూ విస్తరి వేసి భార్య వడ్డించింది. వడ్డనలో కుండలోని పెరుగు స్వామి వస్త్రాలపై పొరబాటున పడింది. "దేవాది దేవుడు మనింటికి వస్తే ఇలా అపచారం చేస్తావా ?"అని భార్యను కసిరాడు. అదే సమయంలో ఆలయ పూజారి అటు వస్తూ చోక మేల విఠలుని దూషిస్తున్నాడని భ్రమపడి ముందూ వెనుకలు చూడకుండా చెంపలు వాయించి నీచుని ముట్టుకొన్నందున భీమనదిలో స్నానించి దేవాలయం చేరి పూజ చేస్తుండగా దేవుని వస్త్రం పై పెరుగు కనిపించి, దేవుడి చెంప వాచి ఉండటం, కళ్ళ నుండి కన్నీరు కారటం గమనించాడు. జరిగినది అర్ధమై మహాయోగి అయిన చోకమేల కు తాను చేసిన పరాభవానికి చింతించి దానిప్రభావం స్వామి మీద పడటం గుర్తించి అతడు మహా యోగి అని భక్త శిఖామణి అని తెలుసుకొన్నాడు. క్షణం ఆలస్యం చేయకుండా ఆ చండాల భక్త యోగీశ్వరుని పాదాలపై వ్రాలి క్షమించమని అర్ధించాడు. సగౌరవంగా అతడిని తనతో ఆలయానికి తీసుకు వెళ్ళగా స్వామి బుగ్గ వాపుతగ్గి అశ్రుధార మాయమై, మందస్మిత ముఖారవిందం తో విఠోబా దర్శనమిచ్చాడు. చోకమేల పవిత్ర భక్తి అందరికీ తెలిసి, అతని చరిత్ర మహారాష్ట్రం అంతా వ్యాపించింది.

బీదరునవాబు మంగళ మేఖల అనే పట్టణం చుట్టూ ఎత్తైన రాతి గోడ కట్టాలని నిర్ణయించి, మాదిగలందర్నీ ఆపనిలో నియమించాడు. ప్రభువు ఆజ్ఞ కనుక చోకమేలకూడా పనిలో చేరాడు. ఒకప్రక్కకట్టిన గోడ పూర్తికాకుండానే అకస్మాత్తుగా కూలి, చోకమేల తో సహా కూలీలు దానికిందపడి చచ్చిపోయారు. అతని అస్థికలు గోడకింద కూరుకుపోయినా కీర్తి చంద్రికలు దశ దిశలా వ్యాపించాయి. విఠలుడు తనభక్తుడు నామదేవుని చోకమేల అస్తికలను తెచ్చి పండరిపురం చేర్చమని ఆజ్ఞాపించాడు. ఆయన వెళ్ళగా అక్కడ అందరి ఎముకలు కలిసిపోయి గుర్తించటం కష్టమైంది. ఏం చేయలాని తెగ ఆలోచించి చెవి నేల మీద ఆనించాడు "విఠోబా విఠోబా "అనే శబ్దం వినిపించి, అవి చోకమేల అస్తికలే అని రూఢిగాభావించి పోగు చేసి తీసుకు వెళ్లి పండరి పురంలో భూగర్భం లో పాతిపెట్టించి ఒక శిలా స్థాపించాడు. అక్కడ మహారాష్ట్ర మాదిగలు నిత్యం భజనలు చేస్తారు.

## 2 యవన హరిదాసు



క్రీ.శ. 1314 లో బెంగాల్ లోని నదియ జిల్లా బుడాన్ గ్రామంలో గౌరీ, సుమతీ ఠాకూర్ లకు యవన హరి దాసు జన్మించాడు. ఆరేళ్ళ కే తండ్రి గతించాడు. తల్లి సహగమనం చేసింది. దిక్కులేని వాడై తురకలకు దొరికాడు. మతం లో చేర్చారు. మహమ్మదీయ మతగ్రంధాలన్నీ బాగా చదివాడు. ధర్మం పై శ్రద్ధ ఏర్పడింది. అద్వైతుడు అనే మహాయోగి ని దర్శించాలని శాంతిపురానికి వెళ్ళగా స్వామీజీ మొదట అంగీకరించక పోయినా తర్వాత అతని భక్తీ విశ్వాసాలు చూసి,అనుగ్రహించి హరినామం ఉపదేశించాడు. "కునియా "అనే పల్లెకు దగ్గరలో ఉన్న అరణ్యం లో నివాసమేర్పరచుకొని హరినామ స్మరణం తో గడిపాడు. తురక విష్ణు భక్తుడవటం సహించలేక ఆమతస్థులు నేరం మోపి నవాబు దగ్గరకు తీసుకు వెళ్ళగా భటులతో తీవ్రంగా కొట్టించాడు. రక్తం ప్రవాహంలా కారి స్పృహ తప్పి పడిపోయాడు. చనిపోయాడని భావించి గోతిలో పాతిపెట్ట మన్నారు. అప్పుడు స్పృహ రాగా సేవకులు గురువుకు చెప్పారు. బ్రతికి ఉండగా పాతిపెట్టటం మంచిదికాదని నవాబు నదిలోకి తోసేయించాడు. చాలా దూరం కొట్టుకుపోయి చివరికి ఒడ్డు చేరాడు.

తినటానికి, ఉండటానికి ఏమీ లేక అల్లాడుతుండగా సప్తగ్రామానికి చెందిన బలరామాచార్యులు ఇంటికి తీసుకు వెళ్లి ఆశ్రయమిచ్చాడు. హరి భక్తుడైన ఆచార్యులు పరమత సహనం తో జనం నిందించినా లెక్క చేయకుండా ఈతురకను కాపాడి,ఇంట్లో ఉంచుకొన్నాడు. హరిదాసు నామ సంకీర్తనం తో ఎక్కడికాలిన మహమ్మదీయులు ఆచార్యులను దూషించారు. అతడు తన్మయత్వంలో హరినామ స్మరణ చేస్తూ అందర్నీ ఆశ్చర్యపరిచాడు. పిచ్చివాడని గోల చేశారు. సప్తగ్రామ జమీందార్ కొడుకు రఘునాధుడు ఆచార్యుల వద్ద విద్య నేరుస్తున్నాడు. కాని హరిదాసు భక్తికి ఆకర్షితుడై చదువు సంధ్యలు మానేసి తానూ అదే ధోరణిలో హరి కీర్తన చేస్తుండగా తురక సన్యాసి దగ్గర ఇలా చేయటం తండ్రికి నచ్చక, కేకలేసి వినకపోతే గురువునే దూషించాడు. తనవలన గురువు నిందపడాల్సి వస్తోందని గ్రహించి, గురువుకు కృతజ్ఞత చెప్పి శాంతిపురం చేరి, గంగానది ఒడ్డున ప్రశాంతంగా గడిపాడు.

రోజుకు లక్ష సార్లు తక్కువ లేకుండా హరి నామ స్మరణ చేసి మాత్రమె మంచి నీరు త్రాగేవాడు. అతని తారకమంత్రం "హరే కృష్ణ హరే కృష్ణ -కృష్ణకృష్ణ హరే హరే -హరేరామ హరేరామ రామరామ హరే హరే " ఈ పవిత్రాత్ముని చూసి జనం శిష్యులుగా చేరారు. ఆ వూరి జమీందార్ కు ఇది ఇష్టం లేక, అతని ఏకాగ్రత మరల్చాలని ఒక భోగం స్త్రీని ప్రేరేపించి ఒకార్ధ రాత్రి అతని కుటీరం లోకి పంపాడు. దేహ స్పృహ లేని దాసు హరినామస్మరణతో పరవశమై ఇదేదీ గమనిచ లేదు ఆమె అనేక ప్రయత్నాలు చేసింది కాని అతనికి బాహ్య స్పృహ ఉంటేగా? రాత్రి తెల్లవార్లూ బతిమాలుతూ బామాలుతూ తిడుతూ, కోప్పడుతూ విశ్వ ప్రయత్నం చేసి విఫలమై తెల్లవారగానే వెళ్లి పోయింది. మళ్ళీరాత్రి వచ్చి రెచ్చ గొట్టే మాటలతో ప్రయత్నించి చివరకు తానుకూడా దొంగ భజన చేస్తున్నట్లు నటించింది కాని దాసు ప్రవర్తనలో మార్పు లేక, ఏకాగ్రతకు భంగం కలగక పోవటంతో నిరాశతో ఇంటికి వెళ్ళింది. ఎలాగైనా అతన్ని లొంగ దీయాలన్న జమీందార్ ప్రేరణతో ఎక్కువ

డబ్బు ఆశకు మూడో రోజు వచ్చింది. సకలప్రయత్నాలు చేస్తూ చివరికి "భ్రమర కీటక న్యాయం"లాగా ఆ వేశ్య కూడా భక్తి పారవశ్యంలో తన్మయురాలైంది.ఇప్పుడు కళ్ళు తెరిచిన హరిదాసు ఆమెపై జాలిపడి మంత్రోప దేశం చేశాడు ఆమె కూడా నిరంతర హరినామ స్మరణతో జన్మ చరితార్థం చేసుకొన్నది.

కొంతకాలం తర్వాత హరిదాస ఠాకూర్ నవద్వీపం వెళ్లి అక్కడి వైష్ణవులతో కలిసి తిరిగాడు. అతని భక్తి,ప్రేమలను గుర్తించి అనేక సేవలు చేశారు. చైతన్య మహాప్రభువు "నీలాచలం "అంటే పూరీ జగన్నాధం లో ఉన్నారని తెలిసి భక్త బృందం తో వెళ్లి, చైతన్య సమక్షంలో జీవనం గడిపాడు. "యవన హరిదాసు "గా గుర్తింపు పొందిన యితడు చైతన్యుడు తనువు చాలించక పూర్వమే పరమ పదించాడు. అంత్య సమయంలో చైతన్య ప్రభువు శిష్యులతో వచ్చి హరిదాసు దగ్గర కూర్చుని హరినామ స్మరణ చేశాడు. ఆ హరినామ సంకీర్తన చేస్తూ, వింటూ తనవు పులకంకురాలు పొందగా యవన హరిదాసు దేహం చాలించాడు ఆ మహా భక్త శిఖామణి. చైతన్యుడు అతని పార్థివ దేహాన్ని సింధు నది తీరానికి చేర్చి,దిక్కులన్నీ హరినామ స్మరణతో పిక్కటిల్లుతుండగా సమాధి చేయించి బృందావనం నిర్మించాడు.

## 3 శ్రీమతి కర్మాబాయిజీ



పరిపక్వ పవిత్ర స్వాధీన మనసుగల కర్మాబాయి మహారాష్ట్ర స్త్రీ. 20-1-1615 న నాగూర్ జిల్లా కల్వాగ్రామంలో జివాన్జీ దూది వంశం లో జన్మించింది. మహా కృష్ణ భక్తురాలు జగన్నాథ స్వామి భక్తురాలు. జగన్నాథ క్షేత్రం లోనే జీవితం గడిపింది. ఆచార వ్యవహారాలేమీ తెలీవు. కాలకృత్యాలు స్నానం పూర్తికాగానే జగన్నాథుని ప్రసాదం చేసే పనిలో ఉండేది. స్వామి నైవేద్యానికి అల్లం, ఇంగువ నెయ్యి మసాలావస్తువులుకలిపి" కిచిడీ అన్నం "తయారు చేసేది. ఇది హిందూస్తానీయులకు అత్యంత ఇష్టమైనది. దీనినే స్వామికి అత్యంత భక్తి శ్రద్ధలతో నివేదన చేసేది.

కర్మాబాయి కీర్తి బాగా వ్యాపించగా ఒక రోజు ఒక బైరాగి ఆమె ఇంటికి భిక్షకు వచ్చాడు. సర్వ సద్గుణ శీలి యైన ఆమెను చూసి మహదానందపడ్డాడు. కాని ఆమె ఏ ఆచారాన్ని పాటించకుండా స్వామి ప్రసాదం తయారు చేయటం చూసి బాధ, కోపం వచ్చి, సదాచార విధానం బోధించి ఇకనుండి తాను చెప్పినట్లే చేయమని హితవు చెప్పాడు. మర్నాడు బైరాగి చెప్పిన ఆచార విధానం అంతాపాటించి ప్రసాదం తయారు చేసే సరికి రెండుజాములయింది. కర్మాబాయి ఇంటికి జగన్నథ స్వామి వచ్చి ప్రసాదం తింటాడని ప్రజలలో ఒక గొప్ప నమ్మకం ఉండేది. ఆ రోజుకూడా అలానే వచ్చాడు స్వామి. ఆలస్యమైందని కంగారు పడుతూ బాధపడుతూ స్వామికి ప్రసాదం వడ్డించింది. ఆయనా ఆలస్యమైందని ఆఘమేఘాలమీద తిని ప్రక్షాళనం అంటే నోరు కడుక్కోకుండా మందిరానికి వెళ్ళాడు.

జగన్నాథ మందిర అర్చకస్వాములు స్వామి నోటికి కిచిడీ అన్నం మెతుకులు అంటి ఉండటం గమనించి "పరాత్పరా !ఏ పవిత్ర గృహం పావనం చేసి విందు ఆరగించి జీవితం ధన్యం చేశావు స్వామీ, మూడులోకాల్లోనూ ఆ పుణ్యమూర్తి ధన్య మూర్తి "అన్నారు.

భక్త సులభుడు జగన్నాథుడు "భక్తులారా ! నన్ను సేవించింది పుణ్య చరిత కర్మాబాయిజీ. ప్రతిరోజు మధ్యాహ్నం కాకుండానే నాకు కిచిడీ ప్రసాదం చేసి వడ్డిస్తుంది. ఈ రోజు ఒక సన్యాసి చెప్పిన మాటలు విని ఆచారం తో ప్రసాదం చేయటానికి మధ్యాహ్న సమయం దాటింది. ఆమె చేతి ప్రసాదం తింటేకాని నేను వేరే ప్రసాదం స్వీకరించను. ఇవాళకూడా ఆమె ఇంట అన్నప్రసాదం తిని ఆలస్యమైందని, "దేవి" నాకోసం ఎదురు చూస్తుందని పరుగుపరుగున వచ్చేశాను. మీరు ఆమె ఇంటికి వెళ్లి, రేపటి నుంచి ఆమె ఇదివరకు ఎలా ప్రసాదం చేసేదో అలానే తయారు చేయమని చెప్పండి "అన్నాడు జగత్ప్రభువు స్వామి.

ఈవిషయం వారు కర్మాబాయిజికి ఇంటికి వెళ్లి తెలియజేశారు. ఆమె చాలా సంతోషించి అటుపై పూర్వంలాగానే ఆచారం పాటించ కుండా స్వామికి కిచిడీ అన్నం ప్రసాదం చేసి వడ్డించింది. ఈ విషయం తెలిసిన బైరాగి స్వామి ఒక రోజు ఆమె ఇంటికి వచ్చి "అమ్మా !నీ మహత్తు తెలియకుండా నీకు సుద్దులు చెప్పాను. ఆచారాలతో స్వామికి కష్టం కలిగించేట్లు చేశాను. నువ్వూ, స్వామీ నన్ను మన్నించాలి "అని ప్రాధేయపడ్డాడు. నిష్కల్మష భక్తిమహిమ వెళ్ళ డించటానికి జగన్నాథుడు చేసిన లీల ఇది. కర్మాబాయిజీ కర్మ పరిపక్వమై 25-7-1634 న 29ఏళ్ళ వయసులోనే జగన్నాథ సన్నిధి చేరింది. భక్త శిఖామణి అయిన కర్మాబాయిజీ పై ఒక జానపద గీతం ప్రచారం లో ఉంది. " *Thali bhar'r Iyayi khichado upar ghee ki batki* !

*Jeemo mhara syam dhani jeemavai beti Jat ki* !!

కర్మాబాయి స్మరణార్థం ఇప్పటికీ జగన్నాథ దేవాలయం లో కిచిడీ (ఖేచరాన్నం )తయారు చేసి బంగారు పళ్ళెం లో పెట్టి స్వామికి భోగం చేస్తుంటారు. ఎంగిలి, అంటూ పూరీ జగన్నాథ మందిరం లో ప్రసాదాన్ని అంటుకోవు. అంతా పవిత్రమే అందుకే "సర్వం అగన్నాథం "అంటారు. కర్మాబాయి అంతకరణ విశుద్ధమైనది. అనురాగ భక్తిభావ రంజితమైంది. అక్కడ ఇక దేనికీ స్థానం లేదు. శుభ్రమైన హృదయం లో భక్తి పరిమళిస్తుంది. అందులోంచి పొంగి పొరలే అనురాగం పై, క్షీర సాగర శయనుడు డోలలాడుతాడు.

# 4 ఆవుల్ చాంద్ స్వామి

బెంగాల్ లో "కర్తాభజ "సంప్రదాయ స్థాపకుడు ఆవుల్ చాంద్ స్వామి. పార్శీ భాషలో దేవుడిని "ఆవూలియా అంటారు. అందులోని పుట్టినపేరే స్వామి ది.ఆయన పుట్టుపూర్వోత్తరాలు తెలీవు. బెంగాల్ లో సుమారు 400 ఏళ్ళక్రితం నదియా జిల్లా ఉలా అనే గ్రామం లో మహాదేవ దాసు అనే శూద్రుడు ఉండేవాడు. తనకున్న తమలపాకు తోటలోని ఆకులను కోసి అమ్మి, కొద్దిపాటి వ్యవసాయమూ చేస్తూ జీవనం చేస్తున్నాడు. ఒక రోజు మధ్యాహ్నం తోటలోలో పొదలదగ్గర పసి పిల్లాడి ఏడ్పు వినిపించి, చూడగా, తోటమధ్య ఒక బాలుడు కూర్చుని ఏడుస్తున్నాడు. అతడిని ఊరు పేరు అడిగితె తనకేమీ తెలీదన్నాడు. పిల్లలు లేరుకనుక వాడిని ఇంటికి తీసుకు వెళ్ళాడు. అందమైన ఆపిల్లాడిని చూసి భార్యకూడా సంతోషించి పూర్ణ చంద్ అనే పేరుబెట్టి పెంచారు. కుర్రాడికి అన్ని పనులు పురమాయించి చేయిస్తున్నాడు దాసు. ఏదైనా నాతేడావస్తే తిట్టటం కొట్టటం కూడా చేసేవాడు. ఓర్చుకొంటూ భగవద్యానం చేసేవాడు బాలుడు. ఆ ఇంటి ప్రక్క హరి భక్తుడైన హరిహరుడు అనే ఆయన ఇంట్లో సంకీర్తన జరిగేది. పూర్ణచంద్రుడు రోజూ వెళ్లి వినేవాడు. బుద్ధి చురుకైనదికనుక అక్కడ జరిగే వేదాంత చర్చలన్నీ అవగతం చేసుకొనేవాడు. కొద్దికాలం లోనే సంస్కృతమూ బాగా అబ్బింది. అందరు ఆకుర్రాడి తెలివి తేటలకు, భక్తికి ఆశ్చర్యపోయేవారు. కాని పెంచిన హరిదాసు గుర్తించలేక పోయాడు. అతడి సతాయింపు వేధింపులతో ప్రక్కింటికి వెళ్ళే సమయం దొరికేదికాదు. కాని హరికీర్తనమాత్రం మానలేదు. ఇంటినుంచి వెళ్ళిపోదామని అనుకొన్నాడు. యజమాని గ్రహించి ఆపేశాడు. హరిహర, పూర్ణ చంద్రులు నిర్విరామంగా హరి కీర్తన చేశారు. పెళ్లి చేసుకోమని గురువు చెప్పగా, ఇష్టం లేక ఆఊరు వదిలి "పులియా "గ్రామం చేరాడు. అది బ్రాహ్మణ అగ్రహారం. విద్వాంసులకు నిలయం. వైష్ణవులకు ఆటపట్టు.మహా భక్తుడు గౌరాంగుని ప్రియ శిష్యుడు హరిదాసు ఒకప్పుడున్న చోటు. ఆయనకట్టించిన మఠం ఇప్పటికీ ఉంది. బలరాం దాసు అనే భక్తుడు అక్కడ ఉండేవాడు. ఈయనవద్దకు చేరి తనప్రవర్తనతో మెప్పించి వైష్ణవాన్ని స్వీకరించి "ఆవుల్ చాంద్"పేరుతొ ప్రసిద్ధుడయ్యాడు.

సంవత్సరన్నర కాలం అక్కడే ఉండి, బలరామ దాసు శిష్యులతో తూర్పు బెంగాలు కు వెడుతుంటే వెంట వెళ్ళాడు. కొంతకాలం అలాగడిపి, మళ్ళీ పులియా గ్రామం రాకుండా తీర్ధయాత్రలు చేశాడు. భారత దేశ పుణ్య క్షేత్రాలన్నీ సందర్శించి చివరికి వజ్రా అనే గ్రామంలో స్థిరంగా ఉండిపోయాడు. రోజు భిక్షాటన చేసి వచ్చినదానిలో పేదలకు పంచి తానూ తినేవాడు. రోగార్తులను అన్నార్తులను ఆదరించేవాడు, జ్ఞానబోధలతో అందరినీ ఆకర్షించేవాడు. అతని హరినామ సంకీర్తన వినటానికి భక్తులు బాగావచ్చేవారు. అతని దైవబలం గొప్పది అవటం తో రోగుల బాధలు తీరేవి, కంటి చూపు నోటిమాటకూడా వచ్చేవి. ఏ జబ్బైనా అతని సమక్షం లో నయమౌతుందనే నమ్మకం బాగా పెరిగింది. శిష్యబృందమూ పెరిగింది. అందులో హుటూ ఘోష్, బెబూ ఘోష్ లు ముఖ్యులు.

రామశరణుడు అనే అతనికి శూలవ్యాదివస్తే, ఆవుల్ చాంద్ నయం చేయాగా శిష్యుడైపోయాడు. సామాన్య గృహస్తు ఐన యితడు పెద్ద జమీందార్ దగ్గర మంచి ఉద్యోగం లో చేరి అభిమానం పొంది "ఉఖరా "అనే పరగణాలో పెద్ద ఉద్యోగం పొందాడు. ఈ ఉద్యోగం లో ఉండగానే శూలవ్యాధి వచ్చింది మూర్చలుకూడా వచ్చేవి. ఆవుల్ చాంద్ ను శరణు వెడితే కమండల జలం ముఖం పై చల్లి నయం చేశాడు. స్వామి శిష్యుడై అతని భావవ్యాప్తికి దోహదపడ్డాడు రామ శరణుడు.

వంగశకం 1651 వైశాఖ శుద్ధ పంచమినాడు సాయంత్రం సిద్ధిపొందాడు ఆవుల్ చంద్. సిద్ధి పొందేముందు బోయాలియా అనే గ్రామం లో శిష్యుడు కృష్ణదాసు వ్యాధితో బాధపడుతున్నాడని, తనరాకకోసమే ప్రాణాలతో ఉన్నాడని తెలిసి, అతన్ని చూడటానికి వెడుతూ అక్కడున్నవారిలో కొందరిని తనతో రమ్మనీ ఇక తాను అక్కడికి రానని పరలోకం వెడుతున్నానని చెప్పి కమండలం కాషాయం మాత్రమె తీసుకొని బయల్దేరాడు. కృష్ణదాసు మరణించాడు. స్వామికి జ్వరం వచ్చి చాలా రోజులుంది. తనకు అంత్యకాలం దగ్గరైందని గ్రహించి తనను "తులసీ తలం "తీసుకు వెళ్లి అక్కడ హరినామ కీర్తన చేయమన్నాడు. నామస్మరణ వింటూ, తానూ ఉచ్చరిస్తూ తన్మయం పొంది తన తుది శ్వాస వదిలాడు.

శిష్యులు స్వామి పార్ధివ దేహాన్ని "పరారీ "అనే పల్లెకు తీసుకు వెళ్లి సమాధి చేశారు. ఆయన దగ్గరున్న కాషాయ వస్త్రాన్ని బోయాలియా గ్రామానికి పంపారు. బ్రతికి ఉండగానే చిరిగిన శాటీని రామశరణుడికిచ్చాడు స్వామి.అది ఇప్పటికీ భద్రంగా అక్కడే ఉంది.స్వామికి ఉత్తరాదికారి గా రామశరణుడు ఆశ్రమ బాధ్యతలు చేబట్టాడు. కొద్దికాలమే బ్రతికి మరణించాడు అందరూకలిసి అతని వంశీయుడు ఈశ్వర చంద్రుని మఠాధిపతినిచేశారు. తర్వాత ఇతనికొడుకు హరిదాసు ఆతర్వాత అన్నకొడుకు రసిక్ చంద్రుడు అయ్యారు.

పతివ్రత అయిన రామ శరణుడి భార్యను ఆవుల్ స్వామి "అమ్మా అని సంబోధించేవాడు. ఆమె కీర్తి ఇప్పటికీ ప్రజలకు జ్ఞాపకం ఉంది.

ఆవుల్ చాంద్ స్వామి బోధన సారాంశం –"ఏకమాత్ర పరమ స్వరూపుడైన శ్రీ కృష్ణుని ధ్యానించండి. ఇతర దేవతా దూషణ చేయవద్దు. ఆచార్యుని యెడ భక్తీ మనసులో ఆచరణలో చూపండి. ఉదయం, సాయంత్రం ఉతికినబట్ట లే కట్టుకోండి. అతిధులను సేవించండి. హరినామ స్మరణ సత్కర్మా చరణ వదలకండి. అందర్నీ సోదరభావంతో చూడండి. అన్ని వేళల అన్ని చోట్లాసత్కాలక్షేపమే చేయండి. వైష్ణవ ధర్మాన్ని పాటిస్తూ,అందులోని మహాత్తునుప్రజలకు తెలియ జేయండి. మనసు నిర్మలంగా ఉంచుకోండి. ఉచితాహారమే తినండి. ఆత్మ సత్యం అని నమ్మండి. ధర్మ విషయాలను చర్చించండి "

స్వామీజీ నిషేధించిన క్రియలు –ఇతరుల సొత్తు అపహరించ టం హత్య, పరస్త్రీ పొందు. అబద్ధాలాడటం, కఠినవాక్కు వ్యర్ధ ప్రసంగాలు, దురాలోచన.

## 5 కుపరాబాయి

పురోహితుడి కూతురు కుపరాబాయి. ఈ పిల్ల పుట్టకముందు సంతానం కోసం తల్లి తండ్రులు చాలానోములు వ్రతాలు చేశారు. ద్వారకానగరానికి వెళ్లి శ్రీ కృష్ణ సేవ చేశారు. కృష్ణ కృపవలన కుపరాబాయి పుట్టింది. తల్లి పురుటినొప్పులతో బాధ పడుతుంటే, కృష్ణుడే మంత్ర సానిగా వచ్చి సేవ చేశాడని జనంలో నమ్మకం ఉంది. పుట్టిన పిల్లకు ఆయనే శ్రీ కృష్ణ మంత్రం ఉపదేశించాడనీ అంటారు. తలిదండ్రుల భక్తీ ఆమెకూ అబ్బి నిరంతరం భగవద్ధ్యానంలో గడిపేది. ద్వారక నుంచి తలిదండ్రులు స్వగ్రామం చేరారు.



దినదిన ప్రవర్ధమాన అయిన కూతురు కుపరాబాయికి యుక్తవయసు రాగానే తగిన వరునితో పెళ్లి చేశారు, కాపురానికి అత్తవారింటికి పంపే ప్రయత్నం చేస్తుంటే, సంసార జీవనం ఇష్టం లేక, ఎవరికీ చెప్పకుండా ఇల్లు వదిలి పెట్టి వెళ్లి, అనేక తీర్ధ యాత్రలు చేసి, ద్వారక చేరింది. అక్కడ శ్రీ కృష్ణ నామ సంకీర్తనతో కాలం గడిపింది. కొంతకాలం తర్వాత ఆమెను వెతుక్కుంటూ తండ్రి ద్వారకవచ్చి కూతుర్ని చూసి ఆనందించి తల్లి బెంగతో ఉందని ఇంటికి రమ్మని కోరాడు. కాదనలేక వెళ్ళింది కాని మనసంతా కృష్ణుడే నిండి ఉన్నాడు.

కూతురి ప్రభావం తలిదండ్రులమీద పడి వాళ్ళిద్దరూ కూడా హరినామస్మరణతో రోజంతా గడిపేవారు. ప్రజలలో కుపరాబాయి భక్తీ విశేషం బాగా వ్యాపించి ఆమె దర్శనం కోసం రోజు వందలాది మంది వచ్చి ప్రభావితులయ్యేవారు. పాలనా చేసేవారూ ఆమెకు భక్తులయ్యారు. భక్తి మహాత్మ్యం వాలన వాళ్ళ కష్టాలు బాధలు తొలగి పోయేవి. ఆమె సాన్నిధ్యం లో అందరికీ పవిత్రత చేకూరింది. అంతటి ప్రభావం ప్రజలపై కలిగించింది కుపరాబాయి.



## 6 గుణవతిబాయి

ఉత్తర హిందూస్థాన్ లో ఒక చిన్నరాజ్యం పాలించే క్షత్రియరాజు భార్య గుణవతి బాయి. ఈమె దాసీలలో పరమభక్తురాలు ఒకామె ఉండేది. సేవచేస్తూనే మనసులో నిరంతరం భగవధ్యానం చేసేది. దాసీ భక్తికి ఆశ్చర్యపోయి రాణి తానుకూడా భక్తిలో గడపాలను కొంటున్నానని దాసికి తెలిపింది. ఆమె సంతోషంతో శ్రీకృష్ణమంత్రం రాణికి ఉపదేశించింది. మంత్రోప దేశ ప్రభావంతో రాణి నిరంతరం హరినామ స్మరణలోనే గడిపేది. సంసారం పై వ్యామోహం కలగలేదు. రాజుకు ఈమె ధోరణి నచ్చలేదు. ఆమె భక్తితో పాటు, ఈతని కోపం కూడా హెచ్చింది. అయినా తనపూజాదికాలు మానలేదు.

బైరాగులు వచ్చి ఆమె మనసు చెడ గొడుతున్నారేమో అనే అనుమానంతో ఎవరినీ కోటలోకి రాకుండా రాజు కట్టడి చేశాడు. జాగ్రత్తగా చూస్తూ ఉండమని మంత్రికి చెప్పి ఒకరోజు రాజు వేటకు వెళ్ళాడు. రాణి గుణవతిబాయి యధాప్రకారం భజన పూజలు చేస్తూనే ఉంది. మంత్రి అడవికి వెళ్లి రాజుకు నివేదించాడు. తోక తొక్కినపామే అయిన రాజు తనమాటను ధిక్కరించినందుకు రాణి పై అసహనంతో ఆమె పీడవదిలించుకొందామని నలుగురు భటులను ఆమెను చంపటానికి పురమాయించాడు. అడవినుంచి కోటకు వచ్చిన ఆ నలుగురు రాణి తీవ్ర ధ్యానమగ్నమై ఉండినందువల్ల దగ్గరకు వెళ్ళే సాహసం చేయలేకపోయారు. ఇంతలో వాళ్ళ హృదయాలలో

ఏదో బాధకలిగి, నలుగురూ కుప్ప గూలారు. ధ్యానం నుంచి బయటికి వచ్చిన రాణి వాళ్ళ దీనస్థితి చూసి ప్రేమతో వారికి సేవ చేసి కారణం అడిగింది. ఆమె మాటలు వారికి అమృతం గా అనిపించాయి. ఆమె కన్నులనుండి దివ్య తేజస్సు ప్రసారమౌతున్నట్లు గ్రహించారు. వెంటనే ఆమె పాదాలపై వ్రాలి క్షమించమని కోరి, రాజు పంపిన విషయం చెప్పారు.

కోటలో జరిగిన వృత్తాంతం మంత్రి రాజుకు తెలియ జేయగా, రాజు తన చేస్టకుసిగ్గుపడి, పశ్చాత్తాపం తో కోటకు వచ్చి,రాణి గుణవతి బాయి చేతులు పట్టుకొని తనతప్పు మన్నించమని కోరాడు. ఆమె "మీరు ఇలా అనకూడదు. మీ మనసుమార్చినవాడు ఆ కృష్ణపరమాత్మ. ఆకృష్ణమంత్రం నాకు ఉపదేశించిమనదాసి పుణ్యం కట్టుకొన్నది "అనగా తనకు కూడా మంత్రోపదేశం కావాలని కోరాడు. దాసిని పిలిపించి రాజుకు మంత్రోప దేశం చేయమని చెప్పింది. ఆ దాసీ వినయంగా "మహా రాజా !మీకు మంత్రోపదేశం చేసే అంతటి దాన్నికాను. రాణీగారు కోరినప్పుడు కూడా ఈమాటే చెప్పాను. చివరికి రాణీగాఋ పట్టుబడితే ఉపదేశించాను మన్నించండి "అన్నది.

మంత్రోప దేశ ప్రభావం తెలుసుకొన్న రాజు దాసీని తనకు తప్పక శ్రీ కృష్ణ మంత్రం ఉపదేశించమని అర్థించాడు. కాదనలేక ఉపదేశించింది. ఆమెను పరిచారిక వృత్తి నుంచి విముక్తి చేసి కోటలోనే ఒక మందిరం ఏర్పాటు చేసి ధ్యానం చేసుకొనే వసతి కల్పించాడు. రాజు కూడా రాజకార్యాలతర్వాత కుటుంబంతో అక్కడే కృష్ణస్వామి పూజ భక్తీ శ్రద్ధలతో రోజు చేసేవాడు. దాసీకి గురు పీఠంఏర్పాటు చేసి ఆమెకు తామంతా సేవకులుగా వర్తిల్లారు. రాణి గుణవతిబాయి అమితానందం పొందింది. ఇదివరకటికంటే ఎక్కువగా అతిథి అభ్యాగతులను ఆదరించేది. యోగులను దీనులను పూజించి సేవ చేసేది. ప్రజలుకూడా రాజు, రాణీ లను అనుసరిస్తూ సత్కార్యాలు చేస్తూ కృష్ణ షభక్తిలో తరించారు.

పవిత్ర దాంపత్యాన్ని కొన్నేళ్ళు అనుభవించి గుణవతీబాయి దేహం చాలించింది. గురుపీఠంలో ఉన్న దాసికూడా సిద్ధిపొందింది. రాజు కుమారుడికి రాజ్యమప్పగించి కోటలోని మఠంలోనే భగవద్యానం లో రేయిం బవళ్ళు ఇహలోక ధ్యానం లేకుండా గడిపి సాయుజ్యం పొందాడు. కులం వృత్తి ముఖ్యంకాదు గుణమే గరీయసి అని దాసీ నిరూపించి, గురుపీఠ అర్హత పొందింది. దీన్ని గుర్తించిన రాజు రాణీ గార్లుకూడా తదనుగుణంగా ప్రవర్తించారు.

## 7 అప్పాస్వామి

తమిళనాడుకు చెందిన అప్పాస్వామి అసలుపేరు "మరుల్ నీకియార్ ". తండ్రి పులగానార్. తల్లి మతినియార్. అప్పా అక్క తిలాతవధియార్ ను కలిప్ప హయ్యార్ అనే పల్లవరాజు సైన్యాదికారికిచ్చి పెళ్లి చేయాలనుకోగా, అతడు ఉత్తర దేశం నుంచి వచ్చిన ఒక వీరుడిని ఎదుర్కొని పోరాడుతూ చనిపోయాడు. ఈలోపే ఈపిల్ల తలిదండ్రులూ చనిపోయారు. బాలిక సతీ సహగమనం చేద్దామని ప్రయత్నించింది, కాని ఉన్న ఒక్కగానొక్కతమ్ముడు దిక్కులేని వాడైపోతాడని ప్రయత్నం విరమించుకొన్నది. అప్పాఆలోచనలు వయసు వచ్చినకొద్దీ తత్వ జిజ్ఞాసపై మరలింది. అప్పటికి మంచి ఊపులో ఉన్న జైనమతం ఆకర్షించి, జైనతీర్థం పుచ్చుకొని గ్రంథాలు బాగా పఠించి, అనంత జ్ఞాన సంపన్నుడయ్యాడు. తర్వాత పాటలీ పుత్రం వెళ్లి, తనప్రతిభ చూపి జైనసంఘానికి ఆధ్యాత్మిక నాయకుడయ్యాడని ఒక కథ ప్రచారం లో ఉంది.

తమ్ముడిలా మత భ్రష్టుడయ్యాడని అక్క చాలా విచారించి, స్వగ్రామం లో ఉండలేక కేటిలాం నదీ తీరాన ఉన్న "తిరుఅతి కై "అనే శైవ క్షేత్రం చేరి, పరమ శివారదనలో గడిపింది. కాని తమ్ముడు తిరిగి వస్తాడన్ననమ్మకం ఆమె మనస్సులో గాఢంగా ఉంది. ఆమె ప్రార్ధన పాలించి నట్లుగా, పాట్నాలో సుఖ జీవితం గడుపుతున్న తమ్ముడికి ఒక రోజు కడుపులో భరింపరాని బాధకలుగగా, జైన సన్యాసులు ఎన్నో మంత్రాలు మందులతో తగ్గించే ప్రయత్నాలు చేసినా బాధ పెరిగిందేకాని తగ్గక, మరణ బాద అనుభవించి, దూరాన ఉన్న దిక్కులేని అక్క గుర్తుకు వచ్చి, కన్నీరు జలజలా ఏరులా ప్రవహించగా, చివరికి అక్కకు ఒక పరిచితుడిద్వారా కబురు చేశాడు.

ఆ కబురు విన్న అక్క తాను అన్యమతం వాడి ముఖం చూడనని, ఆప్రదేశానికి రాన నీ ఖచ్చితంగా ప్రత్యుత్తరం పంపింది. అతనిలో మార్పు వచ్చి మతాన్ని వదిలేసి, అక్క అనురాగం పొందాలని తపించి, ఆలస్యం చేయకుండా, అక్క ఉన్న చోటుకు వెళ్లాలని నిశ్చయించి ఒక అర్ధరాత్రి జైన దుస్తులు తీసిపారేసి, భిక్షాపాత్ర, నెమలికన్నులు ఆశ్రమంలో వదిలేసి అక్క ఉన్న చోటికి ఎవరికీ తెలియకుండా బయల్దేరి వెళ్ళాడు. దారిలో కడుపులో బాధ మరింత పెరిగి, చివరికి తిరు అతి కై చేరి అక్కపాదాలపై పడి"నీకు ద్రోహం చేసిన పాపిని క్షమించు అక్కా "అని ఏడ్చేశాడు. అక్క మనసుకరికి అక్కున చేర్చుకొని తమ్ముడిని ఊర డించి ధైర్యం చెప్పి, లేవదీసి ముఖాన భస్మం రాసి దేవాలయ గర్భాలయంలోకి తీసుకువెళ్ళి సాష్టాంగ నమస్కారం చేయించి,శివ ప్రార్ధన చేయించింది. ప్రార్ధన పూర్తికాగానే అతడి ఉదర వ్యాధి తగ్గిపోయింది. ఇది శివమహిమ అని నమ్మకం కలిగి ఆనంద పారవశ్యంపొందాడు. అకస్మాత్తుగా అతని నోటినుంచి మధుమదురమైన శివ భక్తి గీతాలు వెలువడినాయి. అతని రచనలో ఇవే చాలా ఉత్కృష్టమైనవిగా భావిస్తారు.

ఆకాలం లో దక్షిణ దేశంలో కొలేరూన్ నదికి ఉత్తరాన ఉన్న ప్రాంతాలన్నీ బలసంపంనులైన పల్లవరాజుల ఆధీనం లో ఉన్నాయి. అప్పటి రాజు "కదవ "జైనమతావలంబి. కనుక యువ శివస్వామి అప్పాస్వామిని అన్ని రకాలబాధాలకు గురి చేయమని ఆజ్ఞ జారీ చేశాడు. కాని వినకపోతే తనదగ్గరకు తెప్పించుకొవాలని భావించి భటుడికి చెబితే తనవల్లకాదని అంటే మంత్రినే పంపగా రాజు మనసు మార్చాలని స్వామి వెంట వెళ్ళాడు. యువ స్వామిని కొట్టించాడు సున్నపు బట్టీలలో దొర్లించాడు, సముద్రంలోకి విసిరేయిం చాడుకాని అతనికి ఏమీకాలేదు యోగికనుక నీటిపైతేలి, భక్త ప్రహ్లాదునిలాగానే శివభక్తి మహిమతో "తిరుప్ప తిరి పులియూర్ "తీరం చేరాడు. పై సంఘటనలో ఆతడు శివమహిమలను కీర్తిస్తూ రాసినవన్నీ బహుళ ప్రచారమయ్యాయి. చివరికి కేతిలాం నది దాటి

ఉన్న చోటుకు చేరాడు. పల్లవ కదవ రాజు స్వామి మహిమ గ్రహించి జైనం వదిలి శైవం స్వీకరించి స్వామి శిష్యుడయ్యాడు. జైనమందిరాలు పడగొట్టించి శివాలయాలు కట్టించాడు. తిరు అతి కై లో గొప్ప శివాలయం నిర్మించాడు పల్లవరాజు.

అక్క దగ్గర కొంతకాలం గడిపి తీర్ధ యాత్రలు చేస్తూ, చిదంబరం వెళ్లి, నటరాజ స్వామి సన్నిధిలో భక్తి భావబందుర పద్యాలు, గేయాలన్నో రచించాడు. అవి ఇప్పటికీ ప్రజల నాలుకలమీద నర్తిస్తున్నాయి. తర్వాత కావేరి నదీ తీరశైవాలయాలన్నీ, తంజావూరులోని "శియాలీ "తో సహా సందర్శించాడు. తింగలూరులో"అప్పుధి"అనే బ్రాహ్మణ సాధువు ను దర్శించగా స్వామి వెల్లాల కులం వాడని తెలిసినా ఆదరంగా ఆదరించి ఆతిధ్యమిచ్చాడు. ఈ ఇద్దరి కలయిక తమాషాగా జరిగింది. సాదువు కొడుకుకు పాము కరిస్తే అప్పాస్వామి మంత్రం తో నయం చేసి బ్రతికించాడు. అక్కడి నుంచి అప్పాస్వామి కీర్తి దశదిశలా బాగా వ్యాప్తి చెందింది.

తర్వాత తంజావూర్ జిల్లా తిరుఆరూర్ చేరి, అక్కడినుంచి పంప కాలూర్ వెళ్లి స్థిరంగా ఉన్నాడు. చాలామంది సాధువులతో పరిచయమేర్పడింది. సంబంధర స్వామి తో కలిసి అప్పాస్వామి తిరు ఆరూరు కు దక్షిణాన వున్న క్షేత్రాలన్నీ దర్శించాడు. పురాతనమైన వేదారణ్యం వెళ్ళగా అక్కడి దేవాలయం తలుపులు చాలాకాలం నుంచి మూసి ఉందారని తెలిసింది. వేదాలు స్వయంగా వచ్చి ఇక్కడి శివుడిని దర్శించి పూజించేవి. అలాంటి ఆలయం మూయబడి ఉండటం బాధకలిగింది. వేదాలుకూడా వచ్చి పూజించటం మానేశాయట. సంబందార్ అప్పాస్వాములిద్దరూ ఆలయం బయటద్వారం వద్దే నిలబడి భక్తిగా శివస్తోత్రాలు పరవశంగా గానం చేశారు. అప్పాస్వామి మధుర మంజుల స్వరంతో మహేశ్వరుని కీర్తించాడు. అప్పాస్వామి పదవ గేయం ముగించగానే ఆలయం ద్వారాలు వాటంతటికి అవే తెరుచుకొని ఆశ్చర్యం కలిగించాయి. సంబంధస్వామికూడా ఆర్తిగా ఒక గేయం రచించి గానం చేశాడు. ఒకొక్క గేయానికి ఒక్కొక్క తలుపు తెరచుకొని మూసుకున్నాయట. స్వాములగానం జరుగుతున్నంతవరకూ ఇలా తలుపులు తెరుచుకొంటూ మళ్ళీ మూసుకోవటం మహా వింతగా ఉన్నది. ఇదంతా వేదం మహిమ, భక్తిగరిమ తెలిపే విషయం. ఆలయ ప్రవేశం చేసి స్వామి దర్శనం తో పులకించి బయల్దేరారు ఈస్వాములిద్దరూ.

అప్పాస్వామి తంజావూర్ జిల్లా "తిరుప్పన్ తిరుతి " లో ఉంటుండగా ఒకరోజు సంబంధస్వామి పల్లకీలో వచ్చాడు. అప్పాస్వామి ఎదురువెళ్ళి తానూ శిష్యులతోపాటు పల్లకీ మోశాడు., ఇది తెలియని సంబంధస్వామి "అప్పాస్వామి ఎక్కడ ?"అని ప్రశ్నించాడు.. "స్వామీ ఇక్కడే మీ పల్లకి మోస్తున్నాను "అన్నాడు. కంగారుగా పల్లకి దిగి సంబంధస్వామి, ఆనంద బాష్పాలు కారుస్తూ అప్పాస్వామిని కౌగలించుకొన్నాడు. మహాత్ములు యెంత వినమ్రంగా ఉంటారో తెలియేసే సంఘటన ఇది.

అప్పాస్వామి శైవ విజ్ఞానం ఆకళింపు చేసుకోవాలని దేశపర్యటన చేశాడు. కైలాసపర్వతం ఎక్కాడు. కొంత దూరం వెళ్లేసరికి ఆశరీరవాణి"మహాత్మా !నువ్వు శిఖరం ఎక్కనక్కరలేదు. కావేరి తీరం లోని "తిరు యియూరు "చేరి, శివుని తపస్సులో ధన్యుడవై చరితార్ధుడవు కావలసినది "అని చెప్పింది. ఆమాటప్రకారం మళ్ళీ ఆప్రదేశానికే చేరి తపస్సు చేశాడు పరమా శివుడు పార్వతీ సహితంగా పరమ సంతోషంతో ప్రత్యక్షమవగా పరవశంతో ఇద్దరిపై అనేక కీర్తనలు అలవోకగా చెప్పాడు. అవన్నీ గొప్ప ప్రాచుర్యం పొందాయి.

అప్పస్వామి భక్తి పరీక్షకు అనేక సందర్భాలు ఏర్పడ్డాయి. పంపకాలూరులో శివ సేవకు వెడుతుంటే దారిలో బంగారు రాసులు వజ్రాల రాసులు కనిపించాయి. వాటిపై పై దృష్టిపెట్టక శివధ్యానంతో ఆలయం చేరాడు. మరోసారి గంధర్వ స్త్రీలు అతని దగ్గరకొచ్చి ప్రలోభ పెట్టారు. కన్నెత్తి చూడక పశుపతి స్మరణే చేశాడు. ఆలయ ప్రాంతం లోని కలుపు మొక్కలను పీకేసేవాడు, మట్టిని చదును చేసి పూలమొక్కలు నాటి నీరు పోసి పెంచేవాడు. శివభక్తిలో అతడు తరించాడు. అంతాశివమయంగా భావించాడు.

అప్పాస్వామి రచించిన పద్యాలు గేయాలు మూడువందలున్నాయి. ఇవి మూడుగ్రంథాలుగా ప్రచురణ పొందాయి. తమిళ శైవ వాఙ్మయం లో"తిరుమురై"అని ప్రసిద్ధిచెందిన 12గ్రంథాల సంపుటిలో అప్పాస్వామి రచించిన పైమూడు గ్రంధాలు ఉన్నాయి అంటే అతడు ఎంతగొప్ప శివభక్తుడో ఎంతై మహాకవియో అర్ధమౌతుంది.

## 8 మౌనీ బాబా

బెంగాల్ నదియా జిల్లా అజుదియా గ్రామంలో 1856 లో శివనాథ ఘోష్ కు మౌనీ బాబా జన్మించాడు. తండ్రి హరి భక్తుడే కాని పోలంపుట్రా నగలు నట్రా లేని బీదసంసారి. కుటుంబ పోషణకోసం సాబ్నా పట్టణం చేరి కొంత డబ్బు సంపాదించాడు. పెద్దకొడుకు ప్యారేలాల్, చిన్నవాడు కున్జులాల్ ప్రభుత్వబడిలో చదివారు. అందులో ఒక బ్రహ్మసమాజీయ ఉపాధ్యాయుడు ప్యారేలాల్ తెలివితేటలు గుర్తించి "కోపం పనికి రాదనీ సత్వగుణం మంచిదని పరస్త్రీని తల్లిలాగా చూడాలనీ. ధర్మం మాత్రమె చనిపోయాక వెంటవస్తుందని. ధర్మమే అన్నిటినీ కాపాడుతుంది "అనీ తత్వ బోధ చేసేవాడు. ఇలా జ్ఞానామృతం పొందిన ప్యారేలాల్, తమ్ముడితో కలిసి మనోవికాసం పొందాడు. బ్రహ్మసమాజ ప్రార్ధనలలో పాల్గొని జ్ఞాన విజ్ఞానాలు పెంచుకొన్నారు. ఈ సోదరులను హిందూ మతం వెలి వేసింది.

తమ్ముడిని చదివించాలని అన్న ఉపాధ్యాయ వృత్తిలో చేరాడు. జల్పాయి గురి లో కొంతకాలం పని చేసి, తర్వాత రంగాపురం లో ఇంగ్లీష్ పాఠ శాల హెడ్ మాస్టర్ అయి చాలాకాలం పని చేశాడు. పెళ్లి చేసుకొని కాపురం రంగాపురం లో పెట్టాడు. సోదరి కూడా వీరితో ఉండేది. సంసారం చేస్తున్నా, జ్ఞాన వికాసం కోసం అర్ధరాత్రి లేచి ధ్యాన సమాధి లోకి వెళ్ళిపోయేవాడు. రోజుకు మూడు నాలుగు గంటలకంటే ఎక్కువ సేపు నిద్రపోయేవాడు కాదు. సామాన్య ఆహారమే తినేవాడు. ఉపవాసాలెక్కువగా ఉంటూ, తర్వాత జీవితంపై చింతనతో గడిపేవాడు. 12 ఏళ్ళతర్వాత భార్య చనిపోయింది. వైరాగ్యభావం ప్రవేశించింది. మళ్ళీ పెళ్లి చేసుకోమని

బంధువులు ఒత్తిడి చేస్తే, తనను మళ్ళీ సంసారకూపం లోకి లాగవద్దని చెప్పేవాడు. తమ్ముడు ప్రయోజకుడై ధనం తగినంత సంపాదించాడు. ఇంటిబాధ్యత అతనికి అప్పగించి యోగ సాధనకోసం ప్యారేలాల్ చిత్రకూట పర్వతానికి వెళ్ళాడు.



మూడేళ్ళు చిత్రకూట్ లో గడిపి తర్వాత రమ్యమైన ప్రకృతికి ఆలవాలమైన ఓంకార్ నాథ్ పర్వతం చేరి, అనువైన ప్రదేశం లో తపస్సు ప్రారంభించి ఎండ వానల్లో నిద్ర ఉండీ లేక, తినీ తినక తీవ్ర తపస్సు చేశాడు. యోగాసనం నుంచి అతడు లేవటం ఎవరూ చూడలేదు. ఇతని కఠోర సాధన, తపస్సు గమనించి లక్ష్మీ నారాయణ్ అనే మార్వాడీ, ఆపర్వతం పైనే ఒక గుహను వసతులతో ఏర్పాటు చేసి అందులో ఉంచాడు. తపస్సు కు ఎట్టి ఆటంకమూ లేకపోవటంతో, మరింతఘోర తపస్సు చేయగలిగాడు. ఎవ్వరితోనూ మాట్లాడకుండా నిరంతరం మౌనంగానే గడిపాడు. ప్రజలలోకి వెడితే భంగం కలిగిస్తారని గుహ వదిలి వెళ్ళేవాడుకాదు.ఆరునెలలు గడిచాక అతని గొప్పతనం గుర్తించి అందరూ "మౌనీ బాబా " అని పిలవటం మొదలు పెట్టారు. అతని ఆస్తి మూడు ఇత్తడి చెంబులు, ఒక చర్మపు ముక్క, ఒక రాతిపలక. తోలుముక్కపై పడుకొని రాతిముక్కను దిండుగా వాడుకొనేవాడు.

అతన్ని చూడాలని జన ప్రవాహం వచ్చి గుహ ద్వారం వద్ద నిలబడేవారు. రోగవిముక్తికి తత్వజ్ఞానానికి, సిద్ధికి, జ్ఞానోపదేశానికి జనం వచ్చేవారు. ఆ మార్వాడీ "నేను నిరుపేదను బాబా కృప వలన మహా ధనవంతుడనయ్యాను. నా ఐశ్వర్యం అంతా నౌనీ బాబా యే"అనేవాడు. ఓంకారనాథ దేవాలయ అర్చకుడు మౌనీబాబా వంటి తపస్సంపన్నుడిని తాను అంతవరకూ చూడలేదని చెప్పేవాడు. కొద్దిగాపాలు కొంచెం, మారేడు ఆకులపసరే ఆయన ఆహారం. ఇలా చాలాకాలం గడిచాక శరీరం శుష్కించి ఎముకల పోగుగా మారాడు. 1896 లో 40 ఏళ్ళ చిన్నవయసు లోనే సిద్ధిపొందాడు మౌనీబాబా.

## 9-పవుహారీ(పవన్ ఆహారీ =పవుహారీ =గాలి భోం చేసే )బాబా (స్వామి)

ఉత్తరప్రదేశ్ జోన్పూర్ జిల్లా ప్రేమపురం లో అయోధ్యానాథ తివారి అనే వైష్ణవ బ్రాహ్మణుడు రామానుజ మతస్తుడు విశుద్ధ వర్తనుడు. అన్న లక్ష్మీనారాయణ సంసారం వదిలి కుర్దాలో భాగీరధీ నది ఒడ్డున వటవృక్షం కింద కుటీరం ఏర్పాటు చేసుకొని యోగాభ్యాసం, హరికీర్తనం తో గడిపేవాడు. అయోధ్యనాథుని ముగ్గురుకొడుకులు గంగారాం, హరిభజన దాస్, బలరాం. రెండవవాడికి చిన్నతనంలో మశూచి సోకి కుడికన్ను పోయింది. అందరూ శుక్రాచార్య అని పిలిచేవారు. హరిభజనుడు 1840 లో ప్రేమపురం లో పుట్టాడు. పెదనాన్న లక్ష్మీనారాయణకు అంతుచిక్కని వ్యాధి రాగా ఇతడిని సేవకోసం తండ్రికుర్దాకు పంపాడు.



శుక్రాచార్యుడు అందరి చేత పిలువబడే హరిభజన దాస్ పెత్తండ్రి ఆశ్రమంలో సేవ చేస్తూ చదువు నేర్చాడు. చీకటితో లేచి గంగాస్నానం చేసి అధ్యయనం పూర్తి చేసి, వంట మొదలుపెట్టేవాడు. పెదతండ్రికి అతని శిష్యులకు ముందు భోజనం పెట్టి తర్వాత తాను తినేవాడు. ఇలా ఒక ఏడాది గడిచాక, హుసేనుపురం లో ఉన్న శివరత్న శాస్త్రి వద్ద సంస్కృతం నేర్చుకోవటానికి రోజు వెళ్లి వచ్చేవాడు. శంకర గ్రామం లో ఉన్న నంద పండితునివద్ద "బాలబోధం ",శీఘ్రబోధం "అనే జ్యోతిష గ్రంధాలు కూడా అభ్యసించాడు. 13 ఏళ్ళ ఈకుర్రాడు వ్యాకరణం పై మోజు పడి గాజీపురం లోని పేచన పండితుని వద్ద " సారస్వత ",చంద్రిక" గ్రంధాలు చదివి, ఏడాది తర్వాత గోపాలపండితుని దగ్గర "వేదాంత పంచదశి "నేర్చాడు. అసాధారణ మేధావికనుక కొద్దికాలం లో నే ఇవన్నీ నేర్చి, స్వగ్రామం వెళ్లి మాతృమూర్తిని దర్శించాడు.

1856 లో పెదనాన్న లక్ష్మీ నారాయణ యోగి మరణించాక, అంత్యక్రియలు యధావిధిగా నిర్వహించి ఆశ్రమం లోనే ఉన్నాడు శుక్రాచార్య హరిభజనుడు. ఆశ్రమంలో అనేక దేవతవిగ్రహాలు స్థాపించి నిత్య పూజ చేసేవాడు. ఇన్ని సాధించినా మనశ్శాంతి ఉండేదికాదు. ఆహారం తినకుండా కొద్దిగాపాలు తాగేవాడు. పాలుకూడా మానేసి కటిక ఉపవాసాలున్న రోజులెన్నో ఉన్నాయి.

1857 లో ఆశ్రమాన్ని శిష్యులకు అప్పగించి తీర్ధ యాత్రలకు బయల్దేరాడు హరిభజనుడు. ఆసేతు హిమాచల పర్యంతం పాదచారిగా పర్యటించి చివరికి "గిర్నాడ్" పర్వతం చేరి, ఒకమహా పురుషునివలన యోగ సాధన నేర్చి, నిష్ణాతుడై, మళ్ళీ తీర్ధయాత్రలు చేసి మూడేళ్ళ తర్వాత ఇక్కడికే చేరాడు. పెదతండ్రి అస్తికలు గంగలోకలిపి, కొత్త సమాధి నిర్మించి దానిపై నల్లరాతి పాంకోళ్ళను చెక్కించి స్థాపించాడు. అక్కడ ఇంటివద్ద తండ్రి చనిపోయాడు. గిర్నాడ్ వదలి "నేను "పదాన్ని కూడా విసర్జించి తనను "తాను "అని ఇతరులను "బాబు "అని, స్త్రీలను "తల్లి "అని పిలవటం మొదలుపెట్టాడు. ఉదయం పదిగంటలవరకు గంగాస్నానం జపతపాలు, పూజ చేసేవాడు. గంగానది మధ్యలో నిలబడి శ్రీ కృష్ణ స్తవం చేసేవాడు. పూజతర్వాత నాలుగుగంటలు యోగాభ్యాసం చేసి, కాసేపు బయటికి వెళ్లి తిరిగివచ్చి వంట చేసుకొని తిని కాసేపు విశ్రాంతి తీసుకొని మధ్యాహ్నం ఆశ్రమానికి వచ్చినవారితో సత్కాలక్షేపం చేసి, మళ్ళీ యోగసాధనలో మునిగిపోయేవాడు. రొట్టెలుకాల్చటం వలన సమయం వృధా అవుతోందని పాలు, మారేడాకులరసం మాత్రమే తీసుకొనేవాడు. కొన్నేళ్ళతర్వాత స్వగ్రామం వెళ్లి తల్లిని వెంటపెట్టుకొని మాఘ కుంభ మేళా కు ప్రయాగ వెళ్ళాడు. అక్కడినుంచి గంగ ఒడ్డునఉన్న తనపూర్వ కుటీరం చేరి, యోగసాధనకుఒక గుహ తయారు చేసుకొని, వారాలతరబడి యోగం లో గడిపాడు. అతడు ఏ ఆహారం తీసుకోకుండా గాలిమాత్రమే పీల్చి జీవిస్తున్నందున ప్రజలు "పవుహారీ బాబా " పవనం అంటే గాలి ఆహారంగా కలబాబా అని పిలిచేవారు.



విభూతి పూసుకోవటం కాని జడలు పెంచుకోవటం కాని చేసేవాడుకాడు. జుట్టు ముడి వేసుకొనేవాడు. గోచీ ధరించి పాదాలదాకా లుంగీ తో ఉండేవాడు. కొంతకాలం తర్వాత తనగురువును చూడాలని గిర్నార్ బయల్దేరగా అయోధ్యలో ఉండగానే గురువు హిమాలయాలలో ప్రాణత్యాగం చేశాడని తెలిసి, అయోధ్యలో ఒక వైష్ణవయోగి వద్ద నూతన విజ్ఞానం పొంది, తనకుటీరం లో ఉన్నాడు. రథోత్సవం నాడు బయటికివచ్చి రథాన్ని కొంతదూరం లాగి, ఆశ్రమం చేరేవాడు. ప్రతి ఏకాదశికి భక్తులకు అనుగ్రహభాషణం చేసి విజ్ఞాన వంతుల్ని చేసేవాడు. మిగాతకాలమంతా తపస్సులోనే.

తర్వాత వచ్చిన త్రివేణీ పుష్కరాలకు రైల్ లోప్రయాగ వెళ్లి త్రివేణి ఒడ్డున చిన్న కుటీరం లో,వేడి చలికి బాగా ఇబ్బందిపడి, దగ్గు జ్వరం బాగా వచ్చి బాధపడగా జనం మందులు తీసుకోమంటే వద్దని చెప్పి నా వినక ఖరీదైన మందులు రుచికరమైన పదార్ధాలు తెచ్చిపెట్టి పరీక్షించేవారు కొందరు బ్రాహ్మణులు. వాటిని తీసి నదిలోపారేసి వెళ్ళిపోయేవాడు. వాళ్ళు వచ్చి తమకు ద్రోహం చేశాడని ఆరోపిస్తే "ఈ దాసుడు ఏ తప్పూ చేయలేదు. మీరిచ్చిన మందులు రోగానికే సమర్పించాను. కావాలంటే పరీక్షించండి "అన్నాడు. పరీక్షిస్తే వ్యాధి నయమైపోయిందని తెలుసుకొన్నారు. ఇదంతా ఆశ్చర్యంగా ఉండేది వారికి.

ప్రయాగలో ఉండటం ఇష్టం లేక త్రివేణీ సంగమ స్నానం చేసి, తల్లిఉన్న చోటికి వెళ్లి ఇంట్లో ఉండకుండా బయట ఉద్యానవనంలో ఒకరోజు గడిపి మళ్ళీఆశ్రమానికి చేరాడు. పెదతండ్రి ఉన్నరోజుల్లో ధనికులు డబ్బు ధాన్యం ఆశ్రమానికి ఇచ్చేవారు. వాటిని ఆయన పేదలకు అతిధి అభ్యాగతులకు, శిష్యుఅలు ఖర్చుపెట్టేవాడు. ఈయనా అలానే చేసేవాడు. ఒకరోజు ఒక పిచ్చివాడు దుడ్డుకర్రతో వచ్చి బాబాను కొట్టే ప్రయత్నం చేస్తే శిష్యులు అడ్డుపడగా అప్పుడు హోమం చేస్తున్న స్వామి పూర్తయ్యాక కుటీరం బయటికి వచ్చి వాడిపై తీవ్రంగా దృష్టి పెడితే వాడు ఆగిపోయి పిచ్చికుదిరి అతడిని వాడు పరమభక్తుడై స్వామి సేవలో ధన్యుడయ్యాడు. మరో సారి ఒక మాయావి సన్యాసి వేషంలో వచ్చి ఇన్ని విగ్రహాలెందుకు వీటి అలంకారానికి డబ్బు తగలేస్తున్నావు అనగా అక్కర్లేదని కావాలంటే తీసుకోమని ఆశ్రమం తాళం చెవి ఇచ్చి వెళ్ళిపోయాడు. మర్నాడు భక్తులువచ్చి విషయం తెలుసుకొని దొంగసన్యాసి స్వామికి ద్రోహం చేశాడని తన్నటోగా పారిపోయాడు.

పహారీబాబా ఆశ్రమం వదిలి దేశాటనం చేస్తుంటే పూరీజగన్నాధంలో ఒక భక్తుడు చూసి రమ్మని ప్రాధేయపడినా రాకుండా, తీర్ధయాత్రలుచేస్తూ ముర్షిదాబాద్ జిల్లా బ్రహ్మపురం లో గంగా నదిఒడ్డున ధ్యానంలో గడుపుతుంటే ఒక వంగ దేశీయుడు ఆశ్రమం నిర్మించగా, అందులో యోగసాధన చేశాడు. 1888 ఆషాడ పౌర్ణమి నాడు బాబా గొప్ప యజ్ఞం నెలరోజులు చేయగా అందరి నుంచి విపరీతంగా అన్నిరకాల సహాయ సహకారాలు లభించి దిగ్విజయమైంది.

ఒకరోజు అర్ధరాత్రి గంగా స్నానం చేసి ఒడ్డున యోగాభ్యాసం లో ఉంటె విఘ్నాలుకలిగి యోగ దృష్టికి ఆటంకం కలిగి, ఏదో తెలీనిబాధ జీర్ణకోశం లో ఇబ్బంది పెట్టి, క్షీణించటం మొదలుపెట్టగా, ఏం జరిగిందని అందరూ ప్రశ్నిస్తుంటే జవాబివ్వలేదు. 1898 లో స్వామి సోదరుడు, ఆయనకొడుకు బదరీనారాణ, వారణాసి కాలేజి ఆచార్య భగవంతచారి, జనార్ధన పండితుడు, కొందరు పెద్దమనుషులు వచ్చి స్వామి ఆశ్రమందగ్గర పర్ణశాలలో విడిది చేశారు. బాబాకుటీరం లోనే ఉన్నాడు. కుటీరం నుంచి పొగ బయటికి వచ్చింది. హోమధూమం అనుకొన్నారు అందరూ. స్వచ్చమైన ధూమం గమనించి బదరీనారాయణ తలుపు లోపల వేయబడటం గమనించి, కుటీరం పైకెక్కి చూడగా అగ్ని జ్వాలలు గమనించాడు.కెవ్వునకేకవేసి "మహాత్మా అగ్నినార్పటానికి అనుమతివ్వండి "అని ప్రార్ధించాడు. స్వామి పైకి చూసి ఏదో సౌజ్ఞచేశాడు అర్ధంకాలేదు బదరికి. స్వామి శిష్యుడు భ్రుగునాధుడు పెకెక్కి చూడగా, స్వామి అప్పుడే స్నానం చేసినట్లు వెంట్రుకలు తడిసి శరీరం బంగారు రంగులో ఉన్నట్లు,శరీరమంతా నెయ్యి పూసి ఉన్నట్లు, "దర్భగడ్డి గోచి" తడిగా ఉన్నట్లు గమనించాడు. స్వామి పద్మాసనం లో యోగ ముద్రలో ఉన్నాడు. శరీరం నుంచి మంటలు వస్తున్నాయి, యోగదండం కింద పడి ఉంది. కొద్ది కాలానికే మంటలు శరీరమంతా వ్యాపించాయి. కదలక నిశ్చలంగా కూర్చుని ఉన్నాడు బాబా. మరి కొంతసేపులో బ్రహ్మ రంధ్రం బ్రద్దలై స్వామి ప్రాణవాయువు అనంత వాయువులో కలిసిపోయింది. అంటే సరైన ముహూర్తం చూసుకొని పవుహారీ బాబా ఆత్మ త్యాగం చేసుకొన్నాడన్నమాట.



1890 స్వామి వివేకానంద బాబాను ఘాజీపూర్ లో సందర్శించాడు. కానీ బాబాతో మాట్లాడటానికి ఇంటర్వ్యు చేయటానికి కుదరలేదని, 21-1-1890 లో ఒక ఉత్తరం, అదేనెల 31 న మరో ఉత్తరంలో బాబా ఎవరినీ చూడటానికి ఇష్టపడటం లేదని, నాలుగురోజులత్రవాట ఫిబ్రవరి 4 న ఇంకో ఉత్తరం లో". through supreme good fortune, I have obtained an interview with Babaji. A great sage indeed! — It is all very wonderful, and in this atheistic age, a towering representation of marvellous power born of Bhakti and Yoga!" అని ఉత్తరం రాశాడు ఇంటర్వ్యు దొరికిమాట్లాడి నందుకు పరమ సంతోషంతో. తీవ్రమైన నడుం నెప్పితో బాధపడుతూ కూర్చోలేక, కదలలేక, యోగాసనాలు వేయలేక బాధపడుతూ బాబాను చూశాక శిష్యుడిగా స్వీకరించమని కోరితే సరే అన్నాడు బాబా ఈ విషయం తెలియజేస్తూ వివేకానంద " I have sought refuge in his grace; and he has given me hope — a thing very few may be fortunate enough to obtain. It is Babaji's wish that I stay on for some days here, and he would do me some good. So following this saint's bidding I shall remain here for some time. "అని ఫిబ్రవరి 4 న మరో ఉత్తరం రాశాడు. మర్నాడు దీక్షా స్వీకారం అనగా ముందు రోజు రాత్రి స్వామి వివేకానందకు రామకృష్ణ పరమహంస కలలో విషాద వదనం తో కన్పించగా, తనను గురువు పరమహంసమాత్రమే అని నిశ్చయంగా భావించి పవహారీ బాబా శిష్యరికం వద్దనుకొన్నాడు పరమహంస శిష్యుదయ్యాక కూడా పహారీ బాబా ప్రభావం వివేకానదునిపై పోలేదని పరమహంస తర్వాత పహారీ బాబా మాత్రమె గొప్పవాడని చెప్పేవాడని సిస్టర్ నివేదిత చెప్పేది. బాబాపై ఒక పెద్దవ్యాసం రాసి స్వామి ప్రచురించాడుకూడా. ఒకసారి స్వామి బాబా ను "బోధనలతో సామాజిక సేవ చేయవచ్చుకదా "అని అడిగితె ""భౌతిక సేవ మాత్రమె సేవ అనుకొన్నావా ?శారీరక క్రియలు లేకుండానే మనసులను బుద్ధిని ప్రభావితం చేయవచ్చు "అని బదులిచ్చాడు బాబా *Do you think that physical help is the only help possible? Is it not possible that one mind can help other minds even without the activity of the body?*

Pavhari Baba to Vivekananda

**Quotation**

"Remain lying at the door of your *Guru* like a dog."అని వివేకానందకు బాబా బోధించాడు. అంటే గురువుపై అచంచల భక్తీ విశ్వాసాలు ఉంచాలన్న అర్ధం అందులో ఉన్నట్లు వివేకానంద వివరించాడు.

బాబా 1898 లో ప్రాణత్యాగం చేసినట్లు సిస్టర్ నివేదిత తెలియజేసింది. స్వామి నిశ్చలానంద " the saint, having come to realize the approaching end of his earthly life, had offered his body as the last oblation to the Lord, in an act of supreme sacrifice."అని అంజలి ఘటించారు.. పహారీబాబా మరణవార్త స్వామి వివేకానందకు ఆల్మోరాలో ఉండగా చేరింది.

## 10 ఖోజేజీ స్వామి

జీవితమంతా హరినామ సంకీర్తనతో గడిపిన ఖోజేజీ స్వామి ఉత్తరభారతానికి చెందినవాడు. తన అవసాన దశ దగ్గరకు వచ్చిందని గ్రహించి ఒకరోజు శిష్యులను దగ్గరకు పిలిచి "నేను ఈలోకం వదిలి వైకుంఠానికి వెళ్ళే సమయమొచ్చింది. నేను వైకుంఠం చేరగానే ఆశ్రమం లోని శంఖం ఘంట, ఇతరవాయిద్యాలు వాటంతటికి అవే మ్రోగుతాయి. ఆ శుభ ధ్వని విని, నా దేహానికి అంత్యక్రియలు చేయండి "అని చెప్పాడు. కొద్ది నిమిషాలలోనే స్వామీజీ ప్రాణాలు వదిలాడు. కాని శుభానాదం వినిపించలేదు. ఆశ్రమంలోని వాయిద్యాలన్నీ ఎక్కడపెట్టినవి అక్కడే ఉన్నాయికాని వాటిలోంచి నాదం రానేలేదు. శిష్యులదుఖానికి అంతం లేదు విశుద్ధవర్తనుడు నిర్మలమనస్కుడు ఐన స్వామి వైకుంఠం తప్పక చేరతాడని వారి విశ్వాసం కాని ఇప్పుడా సూచన కనిపించలేదు. ఈ స్వామితో సమానుడైన శిష్యుడు యోగానంద సరస్వతి ప్రక్క ఊరిలోనే ఉంటె వెళ్లి తెలియ జేయగా ఆయన హుటాహుటిన వచ్చాడు. స్వామి పార్ధివ దేహానికి నమస్కరించి శిష్యులు చెప్పిందంతావిని, ఆశ్రమం నాలుగు మూలలా పరికించి చూశాడు. అక్కడ ఉన్న మామిడి చెట్టు,దానికి పండిన పండు చూసి ""మన గురూజీ వైకుంఠం చేరలేక పోయారు. అందుకే శంఖధ్వని వినబడలేదు. దీనికి ఒక కారణం కనిపిస్తోంది. దేహ త్యాగ సమయం లో ప్రాణికి దేనిపైన అయిన భోగేచ్చ కలిగితే వెంటనే దానికి అనుకూలమైన చోట శరీరం ప్రవేశిస్తుంది. మనసు పూర్తిగా స్వాధీనమై కోరికలు పూర్తిగా నశిస్తేనే పునర్జన్మ ఉండదు. లేకపోతె పునరపి జననం పునరపి మరణం తప్పదు.ఈ మామిడి చెట్టుకున్న పండు మీద స్వామి వాంఛ ఉండటం చేత, అది ఆపండుమీదే వాలి ఉంది. ఆయన పునర్జన్మ కూడా అందులోనే ఉన్నది. ఆపండుకోసి తెచ్చి, రెండు ముక్కలు చేసి చూడండి. అందులో మనస్వామి పురుగుగా ఉండటం గమనిస్తారు "అన్నాడు.

యోగానందుడు చెప్పినట్లే శిష్యుడు మామిడి పండు కోసి తెచ్చాడు. యోగానంద జాగ్రత్తగా పండును రెండుముక్కలు చేయగా ఆయన చెప్పినట్లే ఒక పురుగు అందులో కనిపించింది. వెంటనే ఆపురుగు చచ్చిపోయింది. ఆ వెనువెంటనే వైకుంఠపతి శ్రీ మహా విష్ణువు దివ్య రథం లో కూర్చుని క్షణకాలం దివ్య దర్శనమిచ్చి అంతర్ధానమయ్యాడు. ఆ వెంటనే ఆశ్రమం లోని స్వామి శంఖం,ఘంటం మొదలైన వాయిద్యాలు దివ్య నాదం చేశాయి. ఆచార్య శేఖరుడు వైకుంఠం చేరాడని చాలా సంతోషించారు శిష్యబృందం. తర్వాత స్వామి పార్థివ దేహానికి అంత్యక్రియలు చేశారు.

మరణ సమయం లో ఏకోరిక ఉంటె ఆకోరిక తీరేదాకా మరో జన్మ ఎత్తుతారని మన శాస్త్రాలు భగవద్గీత చెప్పాయి. కనుక అంత్య సమయంలో చిత్తం ఈశ్వరాంకితం గా ఉంచుకోవాలని ఒక సూచన ఇందులో ఉన్నది.

## 11 లాలాచార్య స్వామి

భగవద్రామానుచార్యుల వారి ముఖ్య శిష్యుడు, అల్లుడే లాలాచార్యస్వామి. గురువే దైవం అని సంపూర్ణంగా నమ్మినవాడు. పరమభాక్తాగ్రేసరుడు. ఒకరోజు నది ఒడ్డున తిరుగుంటే ఒక శవం కొట్టుకు రావటం చూసి, దానికి అంత్యక్రియలు చేయాలనుకొన్నాడు. నదిలో దిగి శవాన్ని వీపుమీద మోసుకొని వచ్చి తన ఇంటికి తీసుకువెళ్ళి పుష్పాలతో శయ్య తయారు చేసి దానిపై పడుకోబెట్టి వైష్ణవ సంప్రదాయం లో అంత్యేష్టి చేశాడు. స్నానం చేసి ఇంటికి వెళ్లి ఆ అపరిచితునికి శ్రాద్ధం కూడా పెట్టి, బంధు మిత్రులను భోజనాలకు పిలిచాడు లాలా. ఎవడో కోన్ కిస్కా కు ఈ పనులు చేయటమేమిటి అని ఎవ్వరూ వెళ్ళలేదు. మనసులో మిక్కిలి బాధపడి గురువు రామానుజులకు నివేదించాడు."నువ్వు చేసింది మహత్తర కార్యం. మూర్ఖులు నీ గొప్పతనం గుర్తించలేరు విచారించక, ఇంటికి వెళ్ళు "అని ఊరడించాడు.

లాలాచార్య ఇంటికి వచ్చి ఒక అద్భుత దృశ్యాన్ని చూసి అవాక్కయ్యాడు. ఇంట్లో ఎందరో అతిధులు దివ్యకాంతి శరీరులై ఊర్ధ్వపుండ్రా లతో పరమ వైష్ణవ శిఖామణులుగా గోచరించారు. వారంతా పరవశంతో విష్ణునామ సంకీర్తనం చేస్తూ ఆనందంతోనృత్యాలు చేస్తున్నారు. ఇంట్లో వండి న భక్ష్య భోజ్య లేహ్య చోష్యాలను కడుపారా వారంతా భుజించారు. ఇదంతా తన గురుమహిమాకటాక్షంగా భావించాడు లాలా చార్య. ఈ కోలాహలం చూసి, ఇరుగు పొరుగు వారు వచ్చి చూసి దివ్య సుందర విగ్రహాకారులు భోజనం చేయటం గమనించి అమితాశ్చర్య పడ్డారు. లాలాచార్య తమను ఎంతో మర్యాదగా భోజనాలకు ఆహ్వానిస్తే తూలనాడి తిరస్కరించి వెళ్లకపోవటం తప్పు అని గ్రహించి ఆయన పాదాలపై వ్రాలి క్షమాపణ కోరారు. అప్పుడు లాలా "దుఖించకండి. ఆమహాత్ములు తిని వదిలేసిన ఉచ్చిస్టం భుజించి అన్ని దుఖాలను చింతలను పోగొట్టుకొని పరమానంద విభూతి పొందండి "అన్నాడు. వారంతా మహా ప్రసాదం అని అలాగే తిన్నారు.

"అనాధ ప్రేత సంస్కారం కోటి యజ్ఞఫలం "అని మనం సూక్తి వల్లిస్తాంకాని ఆచరణ లో అవలంబించం. శవాన్ని చూస్తేనే పాపం అన్నట్లు, ముట్టుకొంటే ఏదో మునిగిపోయినట్లు భావిస్తాం. శవంతో స్మశానానికి వెళ్ళటం నేరం ఘోరం అనుకొంటాం. ముస్లిం సోదరులు ఇందులో గొప్ప ఆదర్శంగా ఉంటారు. శవ పేటిక మోయటం పవిత్ర కార్యంగా భావిస్తారు. మన దక్షిణ దేశంలోకంటే ఉత్తర హిందూ దేశం లో శవాలను మోయటానికి ఏ పట్టింపూ ఉండదు. పిల్లా జెల్లా పిన్నా పెద్దాఅందరూ ఆపని చేసి ఎంతో సంతోషిస్తారు.అది తమ విధిగా ఎంచుకొంటారు. ఆ విశాల హృదయం అందరికీ ఉండాలని కోరుకొందాం.

## 12 దీపాంకుర స్వామి

బౌద్ధరాజు గోవిందపాలుడు విక్రమపురం రాజధానిగా పాలించేకాలం లో, దానికి దగ్గరగాఉన్న వజ్ర యోగిని అనే పల్లెలో క్రీ.శ 980 లో దీపాంకురుడు పుట్టాడు. ఇతడిని ఆదినాథుడు అనిపిలిచేవారు. గొప్ప గురువు వద్ద చేరి మహా విద్వాంసుడయ్యాడు. పెళ్లి చేసుకొని కొంతకాలం సంసార సుఖం పొంది, ఇల్లువదిలి విశేష శ్రమ చేసి హిందూ బౌద్ధ శాస్త్రాలలో గొప్పపాండిత్యం సాధించాడు. ధర్మ రక్షితుని వద్ద బౌద్ధ దీక్ష తీసుకొన్నాడు. ఆకాలం లో బర్మాలో బౌద్ధం బాగా వ్యాపించిఉంది. కొంతమంది వర్తకులు ఏనుగులు ఎక్కి బర్మా వెడుతుంటే వాళ్ళతోకలిసి 13 నెలలు ప్రయాణం చేసి ఆదేశం చేరాడు.



చంద్ర కీర్తి అనే మహనీయుని చేరి యోగ శిక్షపొంది, 12ఏళ్ళు గడిపి సిద్ధుడై భారత దేశం తిరిగి వచ్చాడు. మగధ బౌద్దులాతడిని"ధర్మపాలుడు "గా స్వీకరించగా అతనికీర్తి దశదిశలా వ్యాపించింది. రాజా న్యాయపాల్ అతని ప్రతిభను గుర్తించి ప్రధాన యాజకుని గా (ఋత్విక్కు) నియమిస్తానని అంటె ఒప్పుకోలేదు. ఆకాలం లో టిబెట్ దేశాన్ని ఘ్లాలామల్ అనే రాజు దోరింగ్ నగరాన్ని రాజధానిగా పాలిస్తున్నాడు. ఆదేశంనుంచి కొందరు బౌద్ధ సాధకులను భారత దేశానికి బౌద్ధ ధర్మం విశేషంగా నేర్చుకోవటానికి పంపాడు. వారు చాలా చోట్ల తిరిగి చివరికి మగధ చేరి దీపాకురిని ప్రజ్ఞా విశేషాలు తెలుసుకొని, అతని సేవించి విజ్ఞానం గడించి తమతో టిబెట్టుకు రమ్మని ఆహ్వానించారు. దీపాంకురుని ఎలాగైనా తీసుకురమ్మని వారికీ రాజు లక్షలాది బంగారునాణాలు పంపాడు. కాని యితడు అంగీకరించలేదు.

టిబెట్ రాజు చనిపోయాక అతని కొడుకులు దీపాంకురుని ప్రార్ధించి, ఒప్పుకోకపోతే నిర్బంధించి బలవంతంగా టిబెట్ తీసుకు వెళ్ళారు. అక్కడ 15 ఏళ్ళు బౌద్ధధర్మాన్ని బోధించి విశేషకీర్తి సాధించాడు. 1035 లో 55 వ ఏట దీపాంకురుడు లాసా నగరం లో నిర్యాణం చెందాడు. ఇప్పటికీ టిబెట్, చైనా బౌద్ధులు దీపాంకురుని స్మరిస్తారు.

## 13 కమలాకాంత స్వామి

వంగ దేశం బర్ద్వాన్ ఇల్లా అంబికాకాల్నా గ్రామంలో వంగశకం 1179 లో కమలాకాంత స్వామి పుట్టాడు. తండ్రిది వైదిక వృత్తి.చిన్నతనంలోనే తండ్రి చనిపోతే, తల్లి ఊరిబడిలో చదివించింది. మాతృభాషతోపాటు, సంస్కృతంకూడా పట్టుదలగానేర్చి గొప్పవాడయ్యాడు. చిన్నతనలోనే గ్రంథ రచనలు చేయటం ప్రారంభించాడు. కవిత్వంలో దిట్ట అనిపించాడు రసబందురకవిత్వం రాసేవాడు. సంగీతంలోనూ నిష్ణాతుడయ్యాడు. కంఠ స్వరం మహా మాధుర్యంగా ఉండటం తో వినేవారు పరవశించే వారు. గాన్ధర్వగానాన్ని మరిపించేవాడు. శాంతదయా ప్రేమ పరిపూర్ణుడు. ఇతని గుణ గరిష్టతకు మెచ్చి బర్ద్వాన్ రాజు తేజచంద్ర బహదూర్ ఆస్థాన పండితునిగా 1216 న నియమించి గౌరవించాడు.

రాజధర్మం నిర్వర్తించి మిగిలినకాలం దుర్గా దేవి ఆరాధనలో గడిపేవాడు. రసరమ్య గీతాలు అమ్మవారిపై రచించిపాడేవాడు. ఆ గానానికి జడపదార్థాలు సైతం చైతన్యం అయ్యేవని చెప్పేవారు. రాజు ఇతనిని తన ఆచార్యుని చేశాడు. కోటం హాట్ లో అన్నివసతులతో సుందరభవనం కట్టించి అందులో ఉంచాడు. పూజలకు భజనలకు రాజు మరొక ప్రత్యేక మందిరం నిర్మించి ఇచ్చాడు. పూజలకు భజనలు దసరాలలో ప్రాత్యేకంగా చేసే దుర్గాపూజకు ఖర్చు అంతా రాజే భరించే వాడు. భార్య గుణవతి. సదా పతిసేవలోదుర్గా మాత సేవలో గడిపేది. భర్త సేవలో పగలూ రాత్రి సేవ చేసేది భార్య అని తలచి అతడు భావోద్రేకానికి గురయ్యేవాడు అప్పుడామె శాంతంగా ప్రేమతో అనునయించేది.

ఒక రోజు రాజోద్యోగి వచ్చి "మహాశయా !పవిత్ర జీవితానికి కామినీ కాంచనాలు బంధనాలు కావటం లేదా ??"అని అడిగాడు కమలాకాంతు డు "స్త్రీలు భగవతి స్వరూపులు "స్త్రియః సమస్తః సకల జగత్ ".స్త్రీ రత్నం. అలాంటిది సాధనాలకు అడ్డంకీ కాదు "నాస్తి భార్యా సమో బన్ధుఃనాస్తి భార్యా సమాగతిః-నాస్తి భార్యా సమో లోకే సహాయో ధర్మ సంగ్రహే ". ఆమె శక్తి స్వరూపిణి "అన్నాడు. మనసు తృప్తి చెంది శిష్యుడయ్యాడు.

కొంతకాలానికి భార్య మరణించింది. చితిపై ఆమెను చేర్చి మృదు మధురంగా గీతాలాపన చేస్తూ నృత్యం చేశాడు. తన్మయత్వంలో నృత్యం చేసి ఆమె అంత్యక్రియలు నిర్వర్తించి మహదానందంతో ఇంటికి చేరాడు. ఒకసారి వేరే ఊరికి వెడుతుంటే "ఓడగాయ "అనే గ్రామం దగ్గర బందిపోటు దొంగలు కత్తులూ బల్లాలతో మీదకు ఉరికారు. ఏమాత్రం భయం లేకుండా మృత్యువు సమీపిస్తోంది అన్న పరమానందంతో గానం చేస్తూ నాట్యమాడాడు. ఆమధురమంజుల గానానికి బందిపోట్ల హృదయాలుకరిగి సాష్టాంగ నమస్కారాలు చేసి వెళ్ళిపోయారు. భయరహితుడు భగవతిని స్థిరంగా మనసులో కొలువు చేసుకొన్నవాడు కమలాకాంతుడు తనమరణం దగ్గర పడిందని గ్రహించి రాజును తనదగ్గరకు పిలిపించి ధర్మోపదేశం చేసి, పారమార్ధిక విషయాలు బోధించి రాజు మనసుకు ప్రశాంతత చేకూర్చాడు. తనను కిందపడుకోబెట్టమని చెప్పి, పడుకోబెట్టగానే ప్రాణాలు విడిచాడు. అదే సమయంలో దగ్గరున్న భోగవతీ నది బాగా ఉబికి అందరికీ ఆశ్చర్యం కలిగించిందని ఇప్పటికీ బెంగాల్ లో చెప్పుకొంటారు. సార్ధకజన్ముడు కమలాకాంత స్వామి.

## 14 అర్జున మిశ్రస్వామి



అర్జునమిశ్ర పండితుడు పురుషోత్తమ ధామం లో బిచ్చమెత్తి జీవించే పరమ సాదు, ఉదార, శాంత, భక్తిస్వభావుడు. సదా భగవద్గీత పారాయణ చేసేవాడు. గీతార్థసారం గ్రహించి టీక రాశాడు. ఇప్పటికీ ఉత్తరదేశం లో దీనికి విశేష ఆదరణ ఉంది. గీత 9వ అధ్యాయం 22వ శ్లోకానికి టీకరాస్తూ "యోగ క్షేమ్యం వహామ్యహం "అనేదానిపై సందేహం వచ్చి "ప్రత్యక్ష భావం పూని ఉంటాను "అని చెప్పిన గీతాచార్యుని వాక్యం సత్యం కాదని భావించికొట్టేసి "పరోక్షభావం లో ఉంటాను అనే అర్థం వచ్చే శబ్దాన్ని" ఇరికించాడు. భగవద్గీత భగవానుని శరీరం కనుక, ఈ కొట్టివేత పరమాత్మకు దెబ్బగా తగిలి, మిశ్రాకు జ్ఞానోదయం కలిగించటానికి మొదట్లో గాలివాన కల్పించాడు.

భిక్షాటనం చేస్తేనే కుటుంబపోషణ జరిగేదికనుక, గాలివానకు బయటికి వెళ్ళలేక దంపతులు పస్తు ఉన్నారు. మర్నాడు భిక్షకోసం బయల్దేరితే విపరీతమైన వర్షం లో దూరం పోలేక కూలిపోబోతున్న గుడిసెలో తలదాచుకొన్నాడు. ఇంతలో ఇద్దరు బ్రాహ్మణబాలురు శరీరమంతా రక్తం కారుతూ మిశ్ర ఇంటికి వెళ్లి మిశ్రా ఆహారపదార్థాలు పంపాడని చెప్పి ఒక రెండు మూటలు భార్యకిచ్చారు. ఆమె ఆశ్చర్యపోయి వాళ్ళ శరీరం రక్తమయం అవటానికి కారణం అడిగి అలాంటి కోమల శరీరులను తనభర్త ఎలా అంత పెద్ద బరువుగల మూటలు, ఇచ్చి పంపాడు అని బాధపడి వాళ్ళ వృత్తాంతం అడిగింది. వాళ్ళు తమ తల్లిదండ్రులు బీదవారని తామిద్దరం మూటలు మోసి సంపాదించి కుటుంబ పోషణకు సాయపడుతున్నామని, ఆ మూటలిచ్చి రమ్మంటే వచ్చామని ఆయనకు ఆకలి బాధతో మతి స్తిమితం తప్పి పిచ్చకోపంతో తమను ఒక ఇనుపకడ్డీతో కొట్టడని ఆయనింటికి రాగానే అడిగితె నిజం తెలుస్తుందని చెప్పి మూటలు దించి వెళ్ళిపోయారు.



భర్తకే ప్రమాదం జరిగిందో అని కంగారుతో తన ఇద్దరు పిల్లల్ని వొళ్ళో నేసుకొని ఏడుస్తుంటే పిల్లలిద్దరూ యెగిరి పోయారు. ఇంతలో మిశ్రా వచ్చి విషయం తెలుసుకొని, వాల్లరోపురేఖలెలాఉన్నాయని అడగ్గా, పెద్దవాడు బంగారం రంగులో చిన్నవాడు నలుపురంగులో ఉన్నారని, ముఖాలలో దివ్య తేజస్సుకనిపించిందని చెవులకు బంగారు కుండలాలున్నాయని చెప్పింది. "అయ్యో భగవానుల నుకొట్టింది నేనే "అని మూర్చపోయాడు దురంత వేదనతో. ఆమె కూడా మూర్చితురాలైంది. కాసేపటికి ఇద్దరూ తేరుకోన్నాక అతడు "వచ్చిన వారు శ్రీకృష్ణబలరాములే. వారి దర్శనభాగ్యం పొందిన అదృష్టవంతురాలవు "అని చెప్పాడు.కలం తో గీతలో తాను వహామ్యహం "మాటకొట్టేసి వేరేమాట రాసినందుకు జగదీశుడికి తీవ్రమైన దెబ్బ కొట్టిందని, పశ్చాత్తాప పడి, తను చేర్చినమాట తీసేసి మళ్ళీ యధా ప్రకారమే ఉంచాడు. ఇంకా ఎక్కువ శ్రద్ధాసక్తులతో హరి సేవనం చేశాడు. ఇద్దరి భక్తికీ మెచ్చి కృష్ణుడు సాక్షాత్కరించి ధన్యులనుచేశాడు.

దారిద్ర్యం కఠోర దీక్షకు కారణం కావాలి. సేవాధర్మం, పశ్చాత్తాపం విశ్వాసం, అనుకూల దాంపత్యం జీవన్ముక్తికి హేతువులు.

## 15 మహంతజీ

భక్త మహంత జీ ఒరియా దేశాస్తు డైన నిరుపేద కృష్ణ భక్తుడు. భార్య మహా సాధ్వి. ఒకమగపిల్లాడు ఇద్దరాడపిల్లలు.ఒరిస్సాలో కాటకం వచ్చి తిండిదొరకటం కష్టమైంది. దరిద్రబాద భరించలేక కుటుంబం పోషించలేక మహంత్ కృష్ణుడే దిక్కు అని కటిక ఉపవాసాలతో ఉన్నారు. వీరిని చూడలేక "కృష్ణా, కృష్ణా "అని మూర్చపోయేవాడు. భార్యకూడా అతనిబాధ గ్రహించి అతనికి స్నేహితులెవరైనా ఉంటె వెళ్లి ఆశ్రయిద్దామని సలహా చెప్పింది. "దీనబంధు' అనే స్నేహితుడు ఉన్నాడని, అతడు "నీలాచలం "లో ఉంటాడని, అంతదూరం ఈ పరిస్థితిలో వెళ్ళలేమని చెప్పాడు. ఎలాగైనా వెళ్లి పిల్లలకైనా ఎంతో కొంత ఆహారం సంపాదించాలి అని చెప్పగా అందరూ కలిసి బయల్దేరారు.



చాలాప్రయాణం కష్టనష్టాలుపడి చేసి పూరీ జగన్నాథంచేరారు. ఆలయంలో ఘంటా శంఖానాదాలు మిన్ను ముట్టుతున్నాయి. సింహద్వారం దగ్గర వీరంతా నిలబడ్డారు. జనంబాగా ఉన్నారు తోసుకు వెళ్ళటం కష్టం అనిపించింది. ద్వారం బయటనుంచే జగన్నాథ దర్శనం చేసి పులకించి గంజికాలువదగ్గర చతికిలపడ్డారు. "ఇంకా ఆలస్యం ఎందుకు మీ స్నేహితుడిదగ్గరకు వెళ్లి అడిగి ఏదైనా తీసుకు రండి "అంది భార్య. అతడు "మిత్రుడు ఎంతో మంది జనసమూహం లో ఉన్నాడు. కాసేపు ఓపికపట్టు. అప్పుడు వెళ్లి కలుద్దాం. దూరంగానైనా చూశాం కదా ఆతృప్తి చాలు. దావు గురించి దిగులెందుకు ?.ఇది మిత్రుని ప్రేమపూరిత నివేదన మైన అమృతతుల్యమైన గంజి. దీన్నే అందరం తాగుదాం "అనగా అందరూ దోసిళ్ళతో ఆగంజే పంచభక్ష్య పరమాన్నంగా భావించి కళ్ళకు అద్దుకొని కడుపు నిండా తాగారు. ఆయాసం తో ఆ గట్టుపైనే విశ్రమించి నిద్రలోకి జారారు.

కడుపాకలి తీరక మెలకువవచ్చి "జగన్నాధా జగన్నాధా "అని దిక్కులు పిక్కటిల్లేట్లు ఆర్తిగా అరిచాడు మహంత్. రాతి గోడలలోపల బందీ అయిన జగన్నాథుని హృదయం కరిగిపోయింది. క్షణం ఆలస్యం చేయకుండా బ్రాహ్మణబాలుని వేషం లో ఒక బంగారుపళ్లెం నిండా మధురపదార్ధాలతో చరచరా నడిచి మహంత్ దగ్గరనిలించి "నెచ్చెలీ !లేవండి. మీకోసమే మంచి మిఠాయిలు తెచ్చాను. తీసుకొని తృప్తిగా తినండి " అన్నాడు. మూర్చనుంచి లేచిన మహంత్ కు ఆమాటలు వినిపించాయికాని, కళ్ళు తెరవలేదు. అలా మూడు సార్లు లేపాడు దేవాది దేవుడు. భార్యకు మెలకువవచ్చి "మీ స్నేహితుడు అనుకొంటా ద్వారం దగ్గర నిలబడి పిలుస్తున్నాడు లేవండి "అన్నది. అతని అనుమానాలు పటాపంచలై లేచి పిచ్చివాడిలాగా ఆసుందర బ్రాహ్మణ బాలుడిని చూశాడు. పళ్ళెం బరువుతో బాలుడి చేతులు వణుకుతున్నాయి. మహంత్ చెయ్యి చాపగా బాలుడు ఈతని నెత్తిపై పళ్ళెం పెట్టాడు. శరీరం గగుర్పొడిచింది. ఏదో మాట్లాడాలనుకొంటున్నాడుకాని మాటలు రావటం లేదు. బాలుడి పాదాలపై పడి ఏదో చెప్పాలనుకొన్నా,ఏదీ స్పృహకు రావటం లేదు. బాలుడు అదృశ్యమయ్యాడు.

మిఠాయి పళ్ళెం పిల్లల ముందు పెట్టాడు. ఆనందంగా, సంతృప్తిగా అందరూ భుజించారు. ప్రాసాదమంతా తినేశారు. భార్య పళ్ళెం కడిగి శుభ్రం చేసి మిత్రునికి ఇచ్చిరమ్మని చెప్పగా,ఆలయంలోకి వెళ్లి ఎన్నో సార్లు పిలిచినా జవాబు రాలేదు. తలుపులన్నీ మూసి ఉన్నాయి. నిస్పృహతో బయటికి వచ్చి గుడ్డలో మూటకట్టి తలక్రిందజాగ్రత్తగా పెట్టుకొని,అందరూ గాఢ నిద్రపోయారు. తెల్లవారినా మెలకువ రాలేదు. ఆలయం లో ఏదో కలకలం వినిపించింది. గర్భాలయం లో ఉండే బంగారు పళ్ళెం కనిపించటం లేదని గగ్గోలు పెడుతున్నారు. అన్నిచోట్లా భటులు వెతుకుతుండగా మహంత్ తలకింద ఉన్న పళ్ళెం పై సూర్యకిరణాలు పడి, అందరికీకనిపించింది మహంత్ దొంగ తనం చేశాడని, అనుమానించి అతనికుటుం బాన్ని నిర్దాక్షిణ్యంగా కొట్టారు తిట్టారు. తాను నిరపరాధినని మొరపెట్టినాఎవరూ వినిపించుకోలేదు. రాత్రిజరిగినకథ అంతా చెప్పాడు. పిచ్చోడన్నారు. జగన్నాథస్వామినే ఆర్తిగా అర్ధిం చాడు ప్రార్ధనలతో. జైలులోపెట్టారు. అతని ఆర్తనాదాలు ప్రజలకు వినిపించకపోయినా జగత్ప్రభువుకు వినిపించాయి.

మర్నాడు సూర్యోదయానికి ముందే ప్రతాపరుద్ర మహారాజు కలలో జగన్నాథుడు కనిపించి జరిగినదంతా వివరించి అదృశ్యమయ్యాడు. రాజు వెంటనే మహంత్ దగ్గరకురాగా అతడు గీత గోవిందం మధుమదురంగా గానం చేస్తూ పరవశంలో కనిపించాడు. లోపలి వెళ్లి తానే సంకెళ్ళు తెంపేశాడురాజు. మహంత్ స్పృహలోకి వచ్చిచూడగా మహారాజు అతని పాదాలపై వ్రాలి క్షమించమని కోరుతూ కనిపించాడు. ఇదంతా తన" నెచ్చెలి " లీల అని మహంత్ మురిసిపోతూ చెప్పాడు. అతని భార్యాపిల్లలను పిలిపించి రాజు మహంత్ భార్యపాదాలపై వ్రాలి క్షమించమన్నాడు. బంగారు పల్లకీలో మహంత్ కుటుంబాన్ని కూర్చోబెట్టి, జగన్నాథాలయానికి సాదరంగా మర్యాదగా తీసుకు వెళ్లి తీర్ధస్నానాలు చేయించి నూతనవస్త్రాలు కట్టబెట్టి చందనం అగరు పూలమాలలతో,పుష్పాలతో పూజించి సత్కరించాడు. .అష్టైశ్వర్యాలు మహంత్ కుటుంబానికి ప్రతాపరుద్ర గజపతి మహారాజు ఏర్పాటు చేశాడు. భూమి రాసిచ్చాడు. దేవాలయం లెక్కలు రాసేఉద్యోగం లో నియమించి వంశపారంపర్య హక్కు కల్పించాడు. దైవ విశ్వాసం ఎంతటి కష్టాలు పెడుతుందో, అంతకు వెయ్యి రెట్లు మేలు కూడాచేస్తుంది. కృష్ణుడు కుచేలునిపట్ల చూపిన మిత్రధర్మం, తనను నెచ్చెలిగా భావించిన మహంత్ పట్ల జగన్నాథుడు చూపి స్తవనీయుడయ్యాడు.

## 16 నాగ మహాశయుడు

గృహస్తుడైన నాగమహాశయుడు ఆదర్శ పురుషునిగా కీర్తి గడించాడు.."నేను భూమి మీద చాలా ప్రదేశాలు తిరిగానుకాని నాగమహాశాయుడి వంటి వారెక్కడా కనిపించలేదు "అని స్వామి వివేకానంద తరచుగా చెప్పేవారు. తూర్పు బెంగాల్ లో నారాయణ గంజ్ రేవుకు దగ్గరలో దేవ భోగ్ అనే పల్లెటూరిలో నాగమహాశయుడు 1846 ఆగస్ట్ 21 న జన్మించాడు. పూర్తిపేరు "దుర్గా చరణ నాగ్ ". తండ్రి దీనదయాళు. తల్లి త్రిపురసుందరి. తాత ప్రాణ కృష్ణ, నాయనమ్మ రుక్మిణి.. వీరి పూర్వ నివాసం "తిలారది".కాని మూడు తరాలనుంచి దేవ భోగ్ లోనే ఉంటున్నారు. దీనదయాళ్ కు ఇద్దరు చెల్లెళ్ళు. పెద్దావిడ భగవతి తొమ్మిదేళ్ళకే భర్తను కోల్పోయి, విధవరాలై అన్న ఇంట్లోనే ఉంది. రెండవ చెల్లెలు భారతి సంసారం చేసుకొంటూ, అప్పుడప్పుడు అన్నగారింటికి వచ్చి వెళ్ళేది. దీన దయాళ్ కు

దుర్గా చరణ్, మరో కొడుకు, ఇద్దరు కూతుళ్ళు. నాగమహాశాయుడనే దుర్గా చరణ్ తర్వాత శారదామణిపుట్టింది. ఈమె తప్ప మిగిలిన అనుజన్ములు అందరూ చనిపోయారు. చివరిపిల్ల పుట్టుకలో పురిటిజబ్బు నోకి తల్లికూడా మరణించగా బాధ్యత అంతా ఆడబడుచే చూసింది.

తల్లి పోయే నాటికి నాగ వయసు 8. శారదకు 4 ఏళ్ళు. తండ్రి మళ్ళీ పెళ్లి చేసుకోలేదు పిల్లల పెంపకం మేనత్త చూసింది. "నా మేనత్త పూర్వజన్మలో నాకు తల్లి యై ఉంటుంది" అని నాగమహాశయుడు ఆమె ఎడ అవ్యాజానురాగంతో చెప్పేవాడు. తండ్రి దైవభక్తి తో నిష్టగా ఉండేవాడు. కలకత్తాలో "కుమారటులి" అనే చోట రాజకుమార పాల్, హరిచరణపాల్ అనే సోదరుల వ్యాపారసంస్థలో పనిచేసేవాడు. జీతం తక్కువైనా ఆకుటుంబం తో అన్యోన్యంగా ఉండేవాడు. వేలకొద్దీ డబ్బు అతని చేతులమీదనుంచే నడిచేది. స్వార్ధం లేని నిజాయితీ అతనిది. ఒకసారి కొన్ని వేలరూపాయలు లెక్కతేలకపోయినా దీనదయాళ్ ను అడగనైనా అడగలేదు. అతని ప్రవర్తనపై అంతటి నమ్మకం ఆసోదరులకు. కొన్నేళ్ళకు ఆడబ్బు లెక్క తేలి దీనదయాళ్ పై నమ్మకం విపరీతంగా పెరిగింది వారికి.



పాల్ సోదరులది ఉప్పువ్యాపారం. నారాయణ గంజ్ కు పడవలద్వారా ఉప్పు సరఫరా చేసేవారు. ఆ రేవు పట్నానికి వెళ్ళే కాలువ దట్టమైన అరణ్యం గుండా ప్రవహిస్తుంది. కనుక బందిపోటుదొంగలు పడవలపై దాడి చేసి సరుకు దోచేసేవారు. నమ్మకస్తులనే ఉప్పు పడవలలో పంపేవారు. ఒకసారి దీనదయాళ్ ను అలా పంపారు. పడవ "సుందర్ బన్"అడవి చేరేసరికి చీకటిపడింది. ముందుకు వెళ్ళే సాహసం చేయకుండా అక్కడే లంగరు వేసి, దగ్గరలో శిధిలమైన ఇల్లు, ప్రక్కన రెండు గుడిసెలు కనిపిస్తే అక్కడికి చేరారు. నావికులు రాత్రి భోజనం చేసి నిద్రపోయారు. దీనదాయాల్ దుడ్డు కర్రపట్టుకొని రామనామస్మరణ చేస్తూ హుక్కాపీలుస్తూ పడవలోనే ఉండి కాపలా కాశాడు.

తెల్లారగానే పడవ దిగి, కంచెం దూరం నడవగానే కాలి వ్రేలి తాకిడికి ఏదో తళుక్కున మెరవగా, బంగారునాణాల తోపాటి పెట్ట బడిన బిందె కనిపించింది. కొన్ని నాణాలు పరీక్షించి చూడగా అవి పూర్వకాలం నాణాలు అంటే మొహర్లు అని అర్ధమై మళ్ళీ అన్నీ బిందెలో పోసి కనపడకుండా మట్టి కప్పేసి, పడవవ వాళ్లను తొందర పెట్టి ప్రయాణం సాగించాడు. ధనం మీద వ్యామోహం, పరుల సొత్తుపై ఆపేక్ష లేని సౌశీల్యం అతనిది. ఆసద్గుణాలే కొడుకు నాగమహాశయుడికి సంక్రమించాయి.

నాగ మహాశయునికి ఒక జత వెండి మురుగులుతప్ప ఏ ఆభరణాలు లేని కడుపేద. సహజ సౌందర్య దీప్తి అతనిది. నవ్వుతూ హాయిగా నామకీర్తన గానం చేస్తూ ఉండేవాడు. ముచ్చటపడి ఏదైనా ఇస్తే తీసుకొనేవాడు కాదు. మేనత్త ఆప్యాయంగా దగ్గర కూర్చోబెట్టుకొని పురాణ కథలు చెప్పేది. ఆటలపై ఆసక్తి తక్కువే. ఒకసారి తోటిపిల్లలు అబద్ధం చెప్పమని బలవంతం చేస్తే ససేమిరా చెప్పను అంటే విపరీంగా కొట్టగా, రక్తం కారుతూ గాయాలతో ఇంటికి రాగా మేనత్త విషయం తెలుసుకోవటానికి అనేకరకాల ప్రశ్నలు వేసినా తన స్నేహితులు దండింప బడుతారని అసలు విషయం ఏమీ చెప్పనేలేదు. ఆబాధ అణచుకొన్నాడు. నారాయణ గంజ్ లో బడిలో చేరి కొంత చదువుకొన్నాడు. పై చదువు కలకత్తాలోనే చదవాలి తండ్రితో కలకత్తావెళ్లి చదువు కొంటానని చెప్పగా తనకు పంపి చదివించే స్తోమత లేదన్నాడు తండ్రి. పోనీ ఢాకా లో చదువు దామనుకొంటే 10క్రో శులదూరం. అందరూ వద్దన్నా వినక, ఎవరికీ చెప్పకుండా కొన్ని అటుకులు మూటకట్టుకొని ఢాకా బయల్దేరి వెళ్లి అక్కడతనకు నచ్చిన స్కూలును ఎన్నుకొని రాత్రికి ఇంటికి చేరాడు. మేనత్త తల్లడిల్లి అడిగితె చెప్పి మర్నాడు ఉదయమే అక్కడ బడిలో చేరాలికనుక అన్నం సిద్ధం చేసి ఉంచమని చెప్పాడు. చదువుపై అతనికున్న ఆసక్తికిఆమెమారు మాట చెప్పకుండా "శ్రీరామ రక్ష"అని దీవించింది.

మర్నాడు మేనత్త వండిన అన్నం తిని, చేతిలో కొంచెం డబ్బు తీసుకొని ఢాకా వెళ్లి నార్మల్ స్కూల్ లో చేరి, స్కూలు కాగానే రాత్రికి ఇల్లు చేరాడు. ఇలా 15 నెలలు అక్కడ చదివాడు అతి నడక వలన ఆరోగ్యం కొంత దెబ్బతిన్నది. అయినా దీక్ష వదలలేదు. దారిలో ఒకసారి పిశాచం కనిపించిందని, భయపడకుండా అలాగే ఉండిపోయాననీ, అదీ ఏమీ చేయలేదనీ, తర్వాత నాలుగడుగులు వేశాక అది పకపకా నవ్విందని, మూడు సార్లుఅది కనిపించినా తనకే అపకారమూ చేయలేదని తన అనుభవం చెప్పాడు. ఒక ఉపాధ్యాయుడు నాగ శ్రమ గుర్తించి పితృవాత్సల్యంతో తమ ఇంటనే ఉండి చదువుకోమని చెప్పగా, కృతజ్ఞత చెప్పి అదే వాత్సల్యం సదా తనపై చూపనికోరి మళ్ళీ యధాప్రకారం ఇంటినుంచే వచ్చి చదివాడు.

ఒకరోజు బడి నుంచి తిరిగివస్తుంటే "పతుల్లా "అనే పల్లెటూరిలో గాలివాన చిమ్మచీకటి కమ్మేసి అడుగు వేయటం కష్టమైంది. ఏ ఇంటివారు రమ్మని పిలవలేదు. ఎవరినీ అతడు ఆశ్రయమివ్వమని కోరనూలేదు. ఆజడివాన, హోరుగాలి మెరుపులు, ఉరుములమధ్య అలాగే ఇంటికి నడుస్తూనే ఉన్నాడు. కొంతదూరం పోయాక దారిప్రక్కన ఉన్న చెరువులో పడిపోయాడు. లేవటానికి విశ్వ ప్రయత్నం చేశాడు. ఒక రెల్లు దుబ్బుపట్టుకొని గట్టు చేరదామని ప్రయత్నిస్తే అది తెగిపోయి, మరింత లోతుకు కూరుకు పోయాడు. వర్షం గాలీ ఏమాత్రమూ తగ్గలేదు. మేనత్త గుర్తు కొచ్చి దుఃఖించాడు. రామనామ స్మరణ చేస్తూ ధైర్యంగా అనేకప్రయత్నాలు చేసి చివరికి ఒడ్డుకు చేరి ఆలస్యం చేయకుండా ఇంటికి బయల్దేరాడు. పొలిమేర చేరేసరికి చేతిలో లాంతరుతో మేనత్త ఎదురు చూస్తూ "నాయనా దుర్గా చరణా "అని గద్గదస్వరంతో పిలిచి, దగ్గరకు వెళ్లి ఆప్యాయంగా కౌగిలించుకొని "నీకే అపాయం జరిగిందో అని గుండె తల్లడిల్లి పోయాను. దేవుడి దయవలన సుఖంగా చేరావు "అని తలనిమిరి ముద్దుపెట్టింది. నాగమహాశయుడు "అత్తా !నాకేమీకాలేదు ఎందుకు బాధపడతావు. కొంచెం తడిశాను అంతే"అని ధైర్యం చెప్పాడు,

ఢాకా లో చదివింది కొద్దికాలమే అయినా వంగ వాఙ్మయం లో గొప్ప పట్టు సాధించాడు. అతని దస్తూరి ముత్యాలప్రోవు. రచన సర్వాంగ సుందరం. రాసింది ఎవరికీ చూపించేవాడుకాదు. తర్వాత కలకత్తాలో వైద్య విద్య నేర్వటానికి వెళ్లేముందు తనరచనలను "ఉపన్యాసమంజరి" పేరుతో ప్రచురించాడు. బాలబాలకులకోసం రాసింది కనుక వారికి ఉచితంగా పంచిపెట్టేవాడు. వివాహవయసురాగానే మేనత్త అన్నగారితో ఆలోచించి విక్రమపురికి దగ్గరలో ఉన్న "రాయి జదియా" గ్రామానికి చెందిన ధనికుని 11 ఏళ్ళ కూతురుతో వివాహం చేశారు. అదే రోజు మరో ముహూర్తంలో చెల్లెలు శారద వివాహం కూడా జరిపించారు. అయిదు నెలల తర్వాత నాగమహాశయుడు కలకత్తాలోని కేంప్బెల్ మెడికల్ కాలేజీ లో చేరాడు.

18 నెలలు మెడికల్ కాలేజీలో చదివి నాగామహాశయుడు, ప్రసిద్ధ హోమియో డాక్టర్ బీహారిలాల్ భాదురి వద్ద శిక్షణపొంది రోగులను పరీక్షించటం లో నిపుణుడయ్యాడు, భార్య ప్రసన్నకుమారి పుట్టింట్లోనే ఉండేది. సెలవల్లో ఇంటికి వచ్చినప్పుడు భార్య వచ్చేది. చిన్నారి అయిన ఆమెను చూసి కంపరం వచ్చి చెట్టెక్కి కూర్చుని కనుమరుగయ్యాక దిగేవాడు. మేనల్లుడిలో మార్పు వస్తుందని మేనత్త అనుకొన్నా నిరాశే అయింది. ఆయన కలకత్తాలో ఉండగా భార్యకు రక్తగ్రహణి వ్యాదివచ్చి పుట్టింటే మరణించింది. మరో పెళ్లి చేయాలని తండ్రిభావించినా, వైద్యం మీదే దృష్టి ఉన్నకొడుక్కి ఇష్టం లేదు. రోగాలను శీఘ్రంగా గుర్తించి ఉచితంగా మందులిచ్చి హస్తవాసి మంచిదని, వైద్యో నారాయణోహరిః అనిపించుకొన్నాడు. ఇల్లంతా రోగులతో నిండేది. వారి సేవయే పరమధర్మగా భావించాడు. విసుగు విరామం లేనేలేదు. అభాగ్యులను నిరుపేదలకు అతడుప్రత్యక్ష దైవమె.

### సేవా ధర్మ మహాశయుడు

ప్రేమ చంద్ర ముస్సి అనే ధనికుడు కలకత్తాలో హాట్ ఖోలాలో ఉండేవాడు. ఇంటి పనులకు మనిషులను పెట్టక, ఒక పేద బంధువుతో అన్ని పనులు చేయించుకొనేవాడు. రోజు గంగాస్నానానికి వెడుతూ నాగమహాశాయుని ఇంటికి వచ్చి హుక్కాపీల్చి వెళ్ళేవాడు. కొంతకాలానికి ఆయనింట్లో పని చేస్తున్న బంధువు చనిపోయాడు. పిసినారి ఐన అతనికి సాటివారెవ్వరూ సాయం చేయటానికి రాలేదు. నాగమహాశయుడు పెళ్లి తాను శవాన్ని తీసుకు వెడతానానని చెప్పి, తండ్రికూడా సాయంరాగా స్మశానానికి తీసుకు పెళ్లి దహన సంస్కారాలు చేశాడు.

### శాస్త్ర జిజ్ఞాస, మళ్ళీ పెళ్లి

నాగామహాష్యుని స్నేహితుడు సురేశ చంద్ర దత్తు బ్రహ్మ సమాజీకుడు విగ్రహారాధనకు వ్యతిరేకి ఇద్దరూ తరచూ వాదించుకొన్నా స్నేహం బాగా ఉండేది. కేశవ చంద్ర సేన్ స్థాపించిన బ్రహ్మ సమాజమందిరానికి నాగ ను తీసుకు వెళ్ళేవాడు. కేశవ చంద్రుని ఉపన్యాసాలకు ముగ్ధుడయ్యేవాడు. సచ్చరిత్రుడు పవిత్రుడు ఐన నాగమహాశాయుని చూసి చాలామంది తమ అభిప్రాయాలు మార్చుకొని వైదికాచార విధానాలు అవలంబించేవారు. నాస్తికులు ఆస్తికులయ్యారు. ఏకాదశీ వ్రతం శ్రద్ధగా చేసేవాడు. గంగాస్నానం తప్పని సరి. సాధకులను సన్యాసులను దర్శించి శాస్త్రాలలో సందేహాలు తీర్చుకొనేవాడు. ఒక వృద్ధ బ్రాహ్మణుడి వలన షట్ చక్ర రహస్యం తెలుసుకొన్నాడు. తండ్రి ఎన్నిసార్లు వివాహప్రసక్తి తెచ్చినా వద్దనే చెప్పేవాడు. ఒకరోజు తండ్రి గదిలో వెక్కి వెక్కి ఏడవటం చూసి కారణం అడిగాడు. ఆయన మాట విని పెళ్లి చేసుకొంటానన్నాడు. తండ్రి వెతికి తగిన అమ్మాయితో పెళ్లి చేశాడు.

### వైద్యో నాగమహాశయో హరిః

కలకత్తా వెళ్లి వైద్య వృత్తి సాగించాడు. ఎవరినీ ఏదీ అడిగేవాడుకాడు. ఇస్తే పుచ్చుకోవటమే తప్ప అడగటం రాదు. మేనత్తకు జబ్బు చేసిందని తెలిసి స్వగ్రామం వెళ్లి, ఆమెను రక్షించాలని విశ్వప్రయత్నం చేసి విఫలంకాగా ఆమె ఆశీర్వదిస్తూ దైవ స్మరణతోచనిపోయింది. తీవ్ర దుఖంతో ఏడ్చేశాడు. పిచ్చిపట్టినవాడిలాగా ఉండేవాడు చెల్లెలు శారద వచ్చి సాయం చేసింది ఊరడించినది. కొంతకాలానికి మామూలు అయ్యాడు. మరణం గురించి మళ్ళీ జన్మ గురించి ఆలోచించేవాడు. రోగుల సేవలోనే సమయమంతా గడిపి అంతకు మించి ఆనందం లేదనుకొనేవాడు. ఒకరోజు నిరుపేద కు నాలుగుగంటలు సేవచేసి మందులిచ్చి, వేసి, రాత్రి ఎలాఉందో చూడటానికి వెళ్ళాడు. పూరి గుడిసెలో ఒంటిపై వస్త్రం కూడా లేని స్థితి లో చూసి, తానుకప్పుకొన్న శాలువాకప్పి చలినుంచి కాపాడాడు. మరోకరోగి నేలపైనే పడుకోవటం చూసి, ఇంటికెళ్ళి తనమంచం, దిండు తెచ్చి, వేసి, పడుకోబెట్టి సేవ చేశాడు. ఒకకుటుంబంలో పసిపిల్లకు కలరా సోకితే వెంటనే వెళ్లి అక్కడే ఉండి, మందులిస్తూ సేవ చేశాడు. కాని బ్రతకలేదు. నాగ చాలాడబ్బు పిండి ఉంటాడని స్నేహితుడు సురేష్ ఊహించాడు. శిశువు చనిపోయిందనే మహాశయుని బాధ చూసి తల్లడిల్లాడు. అన్నం కాని నీళ్ళుకానీ తాగలేదు.

నాగమహాసహాయుడు వాడే మందులు గొప్ప గుణాన్ని కలిగి ఉండేవని రోగులు నమ్మారు పాల్ సోదరులు ఆయనను తమ ఇంటి డాక్టర్ గా నియమించుకొన్నారు. పాల్ చుట్టాలవిడకు కలరా సోకితే ఈయనగురువును పిలిపించారుకాని నాగమహాశయుడు చేస్తున్న వైద్యమే సరైనదని గురువు శిష్యుని మెచ్చుకొన్నాడు. ఆమె బ్రతికింది. సంతోషం తో పాల్ బ్రదర్స్ ఒక వెండి పెట్టెనిండా రూపాయలు నింపి ఆయనకివ్వగా, కనీసం ముట్టుకోను కూడా ముట్టుకోలేదు. తండ్రికి తెలిసి బాధపడ్డాడు. ఒకధనికుడు అందగత్తె ఐన వితంతువును చూపించి ఆమె గర్భాన్ని తీసెయ్యాలని కోరి పళ్ళెం నిండా రూపాయలు పెట్టాడు నాగమహాశయుడు "వితంతువుకు కడుపు చేసి ఒకపాపం చేసి, భ్రూణహత్యకోసం మరో పాపం చేస్తున్నావు "అని చెప్పి మాన్పించటానికి బ్రహ్మ సమాజీకుడు,సేవాతత్పరుడు సంస్కారి శివనాధ శాస్త్రికి చెప్పగా ఇద్దరూ కలిసి వచ్చేసరికి ధనికుడు ఆ విధావరాలితో కాశీకిపారిపోయాడని తెలిసింది.



## శ్రీరామకృష్ణ పరమహంస దివ్య సన్నిధిలో

వైద్యం వలన కొన్ని రాబడి కొంత బాగానే ఉన్నా, తండ్రి స్వయంగానే వంట చేసేవాడు చూడలేక బాధపడేవాడు నాగ. జడభరతుడి కథ బాగానచ్చి అలా ప్రవర్తించేవాడు. ఒకసారి గంగ ఒడ్డున పరవశంతో నృత్యం చేస్తూ నదిలోపడిపోతే, స్నేహితులు కాపాడారు. ఒక బైరాగి గురు కటాక్షం లేనిది ఏదీ సాధించలేవని చెప్పాడు అనుకోకుండా ఒక గురువువచ్చి మంత్రోపదేశం చేశాడు. దీక్షగా జపం చేశాడు. తండ్రి ఆరోగ్యం క్షీణించింది. భార్య అతనికి బగా సహకరించింది. ఒకసారి సురేష్ తో కలిసి దక్షిణేశ్వరం వెళ్లి శ్రీ రామకృష్ణ పరమహంసను దర్శించి మంచంపై పడుకొన్న ఆయన పదాలను తాకాలని ప్రయత్నిస్తే, చటుక్కున వెనక్కి లాగుకోగా, బాధపడుతుంటే పరమహంస "ఒక రకం చేప బురదలో ఉన్నా, దానికి బురద అంటుకోనట్లే, సంసారంలో ఉన్నా నీకు సంసారం మాలిన్యం అంటుకోదు" అని చెప్పాడు. దగ్గరలోని పంచవటి లో కాసేపు ధ్యానం చేసిరమ్మని పంపాడు. అలాచేసి పరమహంస ఆశీస్సులు పొంది ఇంటికి చేరాడు పరమానందంగా. మరో సారి వెడితే రామకృష్ణ "ఉన్నతస్థితి పొందావు "అన్నారు. ఇక్కడే వివేకానంద స్వామితో పరిచయభాగ్యం కలిగింది. పరమహంస స్వామితో నాగమహాశయుని చూపిస్తూ " యితడు నిజంగా స్వార్ధ రహితుడు "అనగా స్వామి "అచార్యులన్న మాట కాదనగలవారెవరు?""అన్నాడు. నాగ క్రమంగా వైద్యం మానేశాడు. తండ్రికి తెలిసి పాల్ బ్రదర్స్ కు చెప్పి సంస్థలో పని కుదిర్చాడు. కాని బలవంతం మీద వెళ్ళేవాడు. తండ్రి చనిపోయాడు. దినవారాలు అప్పు చేసి చేశాడు.

## సంసారంలో సన్యాసి

కలకత్తాలో ప్లేగు విజ్రుమ్భించింది. మందులిస్తారుకాని రోగులకు సేవ చేయటానికి ఎవరూ ముదుకు రాకపోతే నాగమహాశయుడే దీక్షగా సేవలో పాల్గొన్నాడు. వీలైనప్పుడల్లా పరమహంస దర్శనం చేసి, సద్గోష్టి లో పాల్గొనేవాడు. తనవూరిలో కుటీరం లో ఉందామనుకొంటే భార్య ఆయనదారికి అడ్డురానని చెప్పగా ఇంట్లోనే ఉన్నాడు. ఒకసారి ఒకభక్తుడు వచ్చి బ్రహ్మ చర్యం బాగానే ఉందికాని సంతానం కోసం ప్రయత్నించమని చెబితే, ఇటుక రాయితో తలబాదుకొని అలాఅనటం భావ్యం కాదనగా ఆయన తన తప్పు తెలుసుకొని క్షమించమన్నాడు.

## పరమ దయామయుడు మహాశయుడు

పాల్ సోదరులకోరికపై భోజేశ్వరానికి పడవపై వెళ్ళాడు. తిరిగివచ్చేటప్పుడు పాల్ బ్రదర్స్ 8 రూపాయలు చలికి ఆగే శాలువా ఇచ్చారు. ఓడరేవు ఆరు మైళ్ళ దూరంలో ఉంది. రేవు చేరగా బీదరాలు పసిపిల్లలతో చలికి ఆగలేక దీనంగా కనిపిస్తే డబ్బులు, శాలువా ఇచ్చేసి పడవ ఎక్కి ఇంటికి చేరాడు. పాల్ సోదరుల దుకాణంలో నాగ బదులు రణజిత్ పని చేస్తూ సగం డబ్బు మహాశాయుడికిచ్చేవాడు. అతనికి ఇంకా ఎక్కువ ఇవ్వాలనుకోనేవాడు. చెరువులలో బియ్యం, పప్పులు చేపలకుఆహారంగా వేసేవాడు. అన్నిప్రాణులనూ సమాదరించే గొప్ప లక్షణం ఆయనది. హింసకు వ్యతిరేకి. ఎప్పుడూ చేతులు జోడించి నమస్కరిస్తున్నట్లే కనిపించేవాడు. ఎవరికి నమస్కారం అంటే "జగదీశ్వరునికి" అనేవాడు. నాగమహాశయుని దర్శనం తోనే దీర్ఘ వ్యాధులు కూడా నయమయ్యేవని విశ్వాసం.

## ఇంటి ముందు ఉప్పొంగిన గంగ

యాభై ఎల్లఏళ్ళకు ఒక సారి వచ్చే "అర్ధోదయం "గంగాతీరంలో గొప్పగా జరుగుతుంది. మూడు రోజులముందే మహాశయుడు కలకత్తా వదిలి స్వగ్రామం వచ్చాడు. గంగ ఉన్న చోటు వదిలి ఇంటికొచ్చావేమితని తండ్రి అడిగాడు. నమ్మకమైన భక్తిఉంటె పావనగంగ తనంతట తానే ఇక్కడికి రాదా ?"అన్నాడు. సరిగ్గా అర్ధోదయం రోజు శుభుహూర్తం లోఆయన పూజామందిరంలో పూజ చేసుకొంటూ ఉండగా, మహాశయునిఇంటికి ఈశాన్యభాగం లో భూమి నుంచి జలధార తటాలున పైకి ఉబికి వచ్చి అందరినీ ఆశ్చర్యపరచింది. "అమ్మా పతితపావని పావన గంగా " అంటూ బయటికి వచ్చి ఆ గంగకు నమస్కరించి, పవిత్ర గంగాజలం తీర్ధంగా తీసుకొని అక్కడే తను, తండ్రీ భార్య అందరూ అర్ధోదయ పవిత్రస్నానాలు చేశారు. భక్తిపారవశ్యంతో "జయజయగంగే "అంటూ నాట్యం చేశాడు మహాశయుడు. ఈఅద్భుత ఘట్టం తెలిసిన వివేకానదస్వామి 'నాగమహాశాయుని వంటి మహాత్మునకు అసాధ్యమైనదేదీలేదు. ఆయన ఇచ్ఛాశక్తి అమోఘం. ఆశక్తివలన ముక్తిపొందటం అతి తేలిక "అన్నాడు. ఈ అద్భుతాన్ని గొప్పగా మహాశయుడు ఎన్నడూ ఎవరితోనూ ప్రస్తావించలేదు.

## గురుభక్తి, శిష్యవాత్సల్యం

నాగ మహాష్యుడిని చూడటానికి శిశ్యుడొకడు ఒకసారి ఢాకా నుంచి బయల్దేరి దారిలో విపరీతైన వర్షం గాలి కారు చీకటిలో ఎలాగగో ఇంటికి వచ్చి గడ్డకట్టుకు పోతే భార్యాభర్త సపర్యలు చేసి స్వాస్త్యం కలిగించి ఎందుకు ఇంతసాహసం చేశావని అడిగితె "ఈ మహాత్ముని చూడకుండా ఒక్క క్షణం కూడా ఉండలేక పోయాను "అన్నాడు ఆనంద బాష్పలతో. అతిధికి వండిపెతట్ట టా నికి ఇంట్లో కట్టెలు లేవు. ఇంటివాసాలు పీకి వాటితో వంట చేయించి భోజనం పెట్టాడు. కలకత్తా విద్యాసాగర కాలేజీలో చిదివే యువకుడొకడు నాగమహాశయుని చూడాలనే కోరిక తీవ్రంగా కలిగి భావోద్రేకం తో ఉండి, సాధ్యంకాక ఆత్మహత్యకు హాస్టలు పై అంతస్తు నుంచి దూకి సిద్ధమవగా ఎవరో వెనకనుంచి "దూకడద్దు నాగమహాశయుని దర్శనం రేపు పొద్దున కలుగుతుంది" అని వినిపించి ఆగిపోగా మర్నాడు ఉదయం మహాశయుడు అతని తలుపుతట్టి లోపలి రాగా పాదాలపై వాలిపోగా ఆప్యాయంగా కౌగిలించి పైకి లేపి ధైర్యం కలిగించి ఆత్మహత్య పాపం నేరం అని చెప్పి బేలూరు తీసుకు వెళ్లి ఆశ్రమ యోగులకు అప్పగించాడు నాటవర ముఖోపాధ్యాయ అనే కుర్రాడు శీలరహితుడై పోగా, మహాశయుడు అతన్ని మంచిమార్గం లోకి

మళ్ళించాడు. "నాగ మహాశయుని సమక్షం లో అయిదు నిమిషాలు ఉంటె చాలు అత్యద్భుత ఆధ్యాత్మిక పరిణతి లభిస్తుంది అన్నారు హరకామి,నీ కైలాస చంద్ర దంపతులు. స్వామి వివేకానంద కూడా ఇలాగే అన్నాడు '.

### మహా నిర్యాణం

వంగశకం 1306 లో దుర్గా ఉత్సవాలకోసం కలకత్తా వెళ్లి సంబారాలకోసం జ్వరం తో కలకత్తా వెళ్ళలేకపోతే భార్య చక్రవర్తి అనే శిష్యుడికి టెలిగ్రాం ఇస్తే, అతడు మఠం లో వేదమతం గురించి ఉపన్యాసం ఇవ్వాల్సి వస్తే, ఎటూ పాలుపోక అద్భుతానందస్వామి గ్రహించి ఉపన్యాసం ఎప్పుడైనా ఇవ్వచ్చు. ముందు నాగమహాశయుని చూసిరామ్మని చెప్పగా, కాళీఘాట్ నుంచి వెంటనే బయల్దేరి మర్నాడు ఉదయం రాగా ఇంటివసారాలో మంచం పై పడుకొని ఉన్న గురువుగారిని చూసి గగ్గోలు పెట్టి గురుపత్నిని అడిగితతే వ్యాధి పెరగ్గానే ఆయనే అక్కడికి వెళ్లి పడుకొన్నారు తానేమీ చేయ లేకపోయాను అని వలవలా ఏడ్చింది. మహాశయుడు శూలవ్యాధి గ్రహణి లతో బాధపడుతున్నాడు. పగలు నాలుగుమెతుకులే తిండి. తనబాద ఎవరికీ చెప్పనేలేదు. సుశ్రూషకు అనుమతి అడిగితె చక్రవర్తి, గురువు అంగీకరించకపోతే, మంచం దగ్గరే కూర్చుని దుర్గాస్తవం భాగవతం భగవద్గీత ఉపనిషత్తులు చదివి వినిపించి గురువు ముఖంలో ఆనందం చూసి సంతృప్తి పొందాడు. మహాశయుడు గంటలకొద్దీ సమాధిలో ఉండేవాడు. సమాధి నుంచి బయటికి వచ్చి "అమ్మా అమ్మా, అని సచ్చిదానంద్, అఖండ చైతన్య "అని పలవరించేవాడు.

ఈయన మంచంలో ఉన్నా ఇంటికి అతిధి అభ్యాగతుల రాక మామూలే. వారికి కావలసినవన్నీ చేకూర్చమని భార్యకు చెప్పేవాడు. తనకై దుఃఖించే వారితో "ఈతుచ్ఛశరీరం పై మక్కువ ఎందుకు?. ఇది ఎంతోకాలం ఉండదు. ఈశ్వరుడు కారుణ్య నిధి ఆయన ప్రేమ అనంతం "అనేవాడు. కళ్ళనుండి నీరు కారేది. ప్రక్కలకు ఒత్తిగిలటమూ చాలాకష్టంగా ఉండేది. దుర్గామాత దుర్గామాత అనే మాటలే తప్ప వేరొక మాట వచ్చేదికాదు. "మాకుదిక్కెవ్వరు ?" అని అక్కడివారు అడిగితె "పరమహంస పదద్వయమే దిక్కు. రామకృష్ణుడే అందరికీ దిక్కు "అనేవాడు.

ఢాకాలో ఉండే శారదానందస్వామి మఠం బాధ్యతలు చూసేవాడు. అప్పుడప్పుడు వచ్చి నాగమహాశయుని సేవ చేసి వెళ్ళేవాడు.ఆయనద్వారా మందులు తీసుకోమని భర్తకు చెప్పించినా "పరమహంస, జగన్మాతల నామాలే నాకు మందులు "అన్నాడు. తండ్రి దినవారాలకు చేసిన అప్పు తీర్చలేకపోయానని బాధపడేవాడు. అప్పు ఇచ్చినాయన ఒక రోజు చూడటానికి రాగా "నాయనా !అప్పు తీర్చజాలని అపరాధిని నేను. నేను చనిపోయాక నా ఇల్లు తీసుకుని నన్ను ఋణ విముక్తుడిని చేయండి. నాభార్య పుట్టింట్లో ఉంటుంది "అన్నాడు. అతడు ఏడుస్తూ "డబ్బుకోసం రాలేదు మహాత్మా మీ దర్శనం కోసమే వచ్చాను "అని కాళ్ళమీద పడి బావురుమన్నాడు. చలించిన మహాశయుడు "ఈశ్వర కటాక్షం. మీ హృదయం మహోన్నతం. జగదీశుని కటాక్షం వలన మీకు సర్వ సుఖాలు కలుగుతాయి "అన్నాడు. మధ్యాహ్నం 3 గంటలైంది వ్యాధి తీవ్రమైనది. సంధి లక్షణాలు వచ్చి తాపం భరించలేక, అకస్మాత్తుగా లేచికూర్చుని విసనకర్రతో విసిర్తే కొంచెం ఉపశమనం కలిగి, చక్రవర్తితో "పంచాంగం చూసి ప్రయాణానికి ముహూర్తం పెట్టు "అన్నాడు. అంతరార్ధం గ్రహించి అతడు "పుష్య శుద్ధ త్రయోదశి పగలు పది గంటలకు దివ్యమైన ముహూర్తం "అన్నాడు. "నువ్వు అనుమతిస్తే ఆముహూర్తానికే తిరిగిరానిలోకాలకు బయల్దేరుతాను "అన్నాడు. భార్యతో సహా అంతా గొల్లుమన్నారు.

రెండు రోజులకు ప్రాణం విడుస్తాడు అనగా మంచం చుట్టూ చేరిన భక్తులందరూ వింటూ ఉండగా చక్రవర్తితో "గురు దేవులు వచ్చారు నాకు అన్ని తీర్ధాలు చూపిస్తారు. నువ్వు ఒక్కోదాని పేరు చెప్పు "అన్నాడు. హరిద్వారం అనగానే త్రివేణీ సంగమం చూసి ఉప్పొంగిపోయినట్లు స్నానిన్చినట్లు తన్మయం లో అన్నాడు సమాదినుంచి లేచాక చూస్తే "సురదుని"లోస్నానం చేసినవాడుగా కనిపించాడు. తెల్లవారు జామున నాలుగు గంటలకు కొద్దిగా నిద్రపట్టి ఉదయం ఆలస్యంగా లేచాడు. తెల్లారి పుష్య శుద్ధ త్రయోదశిఉదయం 8గంటలకు అకస్మాత్తుగా లేవగా ఆయాసం ఎక్కువకాగా చక్రవర్తి మహాశయుని చెవులలో "శ్రీ రామకృష్ణ శ్రీ రామ కృష్ణ "అని ఉచ్చరించాడు. పరమహంస ఫోటో ఒకటి దగ్గర ఉంచి "ఏనామం స్మరించటానికి సర్వం త్యజించారో ఆయన స్వరూపం చూడండి "అన్నాడు. కళ్ళు తెరచి "కృపానిదీ జోహార్ జోహార్ "అని చివరిపలుకులు పలికాడు నాగమహాశయుడు. 9గంటలకు ఆయాసం బాగా ఎక్కువై, అరగంట తర్వాత దృష్టి నాసాగ్రం పై ఉన్నట్లు కన్పించింది. శరీరరోమాలు నిక్క బొడుచుకున్నాయి. పులకింత కనుదోయినుంచి ప్రేమధార కురిసింది. ప్రాణవాయువు మూలాధారం నుంచి క్రమంగా పైకి వెడుతోంది. నాభికి చేరగానే గుండె వేగంగా కొట్టుకొన్నది. పావు గంటకు మహాసమాదిలోకి వెళ్ళాడు. భార్య "వారు గృహస్తాశ్రమంలోనే ఉన్నారుకనుక ఆప్రకారమే కార్యక్రమాలు జరగాలి "అని చెప్పింది. ఆయనను జాగ్రత్తగా పట్టుకొని ఒకబల్లపై మెత్తని శయ్య ఏర్పాటు చేసి పడుకోబెట్టారు. అయిదారు నిమిషాలతర్వాత ప్రాణవాయువు ఆగిపోయింది. వదనం జ్యోతిర్మయంగా కనిపించి కళ్ళనుండి ప్రేమామృతం వర్షిస్తున్నట్లుగా ఉంది. భార్య భర్తమరణానికి తీవ్రంగా రోదించింది.

గ్రామ పెద్దలు వచ్చి శవాన్ని పరీక్షించగా శరీరం వేడిగానే ఉండటం వలన మరో 12 గంటలు అలానే ఉంచి తర్వాత అగ్ని సంస్కారం చేయాలని నిర్ణయించారు. రాత్రి పదిగంటలకు చందన కర్రల పేర్పుతో, శిష్యులే పుత్రులై దహన సంస్కారం శాస్త్రోక్తంగా చేశారు. నాగమహాశయుడు 53 ఏళ్ళ 4 నెలల 7రోజులు మాత్రమె జీవించి పుట్టిన చోటనే మట్టిలో కలిసిపోయిన పుణ్యాత్ముడు. ఆయన జన్మించిన దేవభోగాగ్రమం, ఆయనవలన పవిత్ర క్షేత్రం అయింది. జ్ఞాన, భక్తి యోగి గా నాగమహాశయుడు చరిత్ర ప్రసిద్ధి పొందాడు.

## 17 రవి దాసు

చెప్పులుకుట్టే కులం లో ఉత్తర దేశం లో 15 లేక 16 శతాబ్దిలో వారణాసి దగ్గర గోవర్ధనపురం లో పుట్టిన రవి దాసు, తల్లి ఝర్ బినియా తండ్రి రఘురామ్ తన వృత్తి చేస్తున్నా నిరంతర హరినామస్మరణ చేసేవాడు. సంపాదించిన డబ్బుకొంత పేదలకు ఖర్చుపెట్టే వాడు. తోలుతో విగ్రహాలను చేసి పూజించేవాడు కొందరు దీన్ని ఆక్షేపిచేవారు. అనుకోకుండా కరువు వచ్చింది. తినటానికి కూడు లేకపోయినా కడుపులో కాళ్ళు పెట్టుకొని హరినామజపం చేసేవాడు. గుండెకరిగి శ్రీహరి బైరాగి రూపం లో వచ్చి, సకలైశ్వర్యాలిచ్చే దివ్య శిల చేతిలోపెట్టాడు. "నీనామమే దివ్య ధనం.ఇంకా నాకీ ఐశ్వర్యం ఎందుకు ?"అన్నాడు. ఎంతోబతిమాలినా ససేమిరా అనగా చివరికి అతి బలవంతం మీద ఇంట్లో ఒక మూల విసిరేసి పొమ్మన్నాడు బైరాగితో. మళ్ళీ ఒక సారి వచ్చి శిలను ఉపయోగించావా లేదా అని

అడిగాడు. దాని మొహం కూడా చూడలేదన్నాడు దాసు. పరాత్పరుడు సంతోషించి అమూల్య ధనరాసులు ఇవ్వగా వాటినీ తాకనైనా తాకలేదు. ఆశరీరవాణి ఆ ఆలయ నిర్మాణ చేయి చెప్పింది.



రవిదాసు చక్కని దేవాలయం నిర్మించి, తానె అర్చకుడై నిత్యపూజాదికాలు చేశాడు కాని బైరాగి ఇచ్చిన డబ్బు ముట్టుకో లేదు.ఒక రోజు పూజాద్రవ్యాల బుట్టలో మిలమిల లాడుతూ అయిదు బంగారు నాణాలు కనిపించాయి. దేవుడు పరీక్షిస్తున్నాడని బాధపడగా "ఈశ్వరాజ్ఞ పాలించక తప్పదు "అన్నాడు కలలో. ఆ నాణాలతో ఒక విశ్రాంతి భవనం కట్టించాడు. భక్త రవి దాసు పేరు నలువైపులా మారు మ్రోగి, కొందరికి అసూయ తెప్పించింది. వారు రాజుదగ్గరకు వెళ్లి "ఒక చండాలుడు పూజారియై విష్ణు ప్రసాదం అందరికీ పెట్టి, ఆలయాన్ని మైలపరుస్తున్నాడు. వెంటనే ఆలయం నుంచి తరిమి వేయండి "అని కోరారు. రాజు దాసును పిలిపించి విగ్రహాన్ని ఆలయాన్ని బ్రాహ్మణులకు వశం చేయమని ఆజ్ఞాపించగా సరే అన్నాడు. ఆ రోజు రాత్రి రాజుకు కలలో శ్రీ హరి కనిపించి దాసును తొలగించవద్దని గట్టిగా చెప్పాడు. రవి దాసు భక్తీ, మహత్యం గుర్తించి రాజు అతన్ని ఆలయ సేవలోనే ఉండమని చెప్పి, అనేక విధాల సన్మానం చేశాడు.

చిత్తూరు రాణి" ఝాలీ "రవి దాసు శిష్యురాలైనది. క్షత్రియ కులం లో పుట్టిన ఆమె చండాలునికి దాసురాలవటం అగ్రకులజులు జీర్ణించుకోలేకపోయి గందరగోళం సృష్టించారు. ఒకరోజు రాణి బ్రాహ్మణులందర్నీ పిలిచి, సంతర్పణ చేసింది. అందరూ వచ్చారు. ఆసనాలపై కూర్చున్నారు. ఇద్దరి బ్రాహ్మణుల మధ్య ఒక హరిదాసుకూర్చున్నట్లు కనిపించి విప్రులు అగ్గిమీద గుగ్గిలమయ్యారు. కాని ఆప్రాంగణమంతా రవిదాసు తో నిండిపోవటంతో అమితా శ్చర్య పోయి కిక్కురుమనకుండా కడుపునిండా మెక్కి బొర్రలు తడుముకొన్నారు. రవిదాసు మహత్యం అర్ధమై అందరూ అతనిపాదాలపై పడి క్షమాపణ కోరారు. రవి దాసు తన చర్మం చీల్చి లోపలి యజ్ఞోపవీతం చూపించి పూర్వ జన్మలో తాను బ్రాహ్మణుడను అని చెప్పాడు.

రవి దాసు మహాజ్ఞాని అని పేరుపొందాడు. అతడు రాసినవి "ఆది గ్రంథం లో చేర్చారు. అవి సర్వ జనామోదం,ఆదరణ పొందాయి. అతడు రాసిన శ్లోకాలు కాశీ లో మహా పండితులుకూడా మహా ఆవేశం తో గానం చేస్తారు. రవిదాసు తనవారికోసం వైష్ణవ మతం లో ఒక శాఖ ఏర్పరిచాడు. అతని మహత్వం తెలిసి అన్ని జాతులవారు ఆరాధించారు. ".భక్తిమాల "లో రవి దాసుకు మహోన్నత స్థానం ఉన్నది. కుష్టువ్యాధులకు సేవ చేసేవాడు.అగ్రకులస్తులు కూడా దాసును సేవించి వ్యాదులనుండి విముక్తులయ్యేవారు. 120 ఏళ్ళు జీవించి రవిదాసు పరమపదించి బ్రహ్మపదం చేరాడని అందరి విశ్వాసం. ఆయన స్థాపించిన మతం ఇప్పటికీ సజీవమై అతన్ని నిరంతరం స్మరించేట్లు చేస్తోంది.

## 18 హరిదాస సాధువు

మాహారాష్ట్రలో హరిదాస సాధువు జన్మించాడని శిష్యుడు రామతీర్ధ చెప్పాడు. పదహారేళ్ళ వయసు ఉండగా, ఇంటిప్రక్క ఉన్న సాదు మఠం కు వెళ్లి జ్ఞానబోధ గ్రహించేవాడు. ఇతని విధేయత చూసి సాధువు శిష్యుడిగా స్వీకరించి, ఉపదేశమివ్వగా, యోగాదీక్ష తో గడుపుతూ, గురువుతోపాటు వెళ్ళిపోయాడు. కొంతకాలం తర్వాత ఒక కొండగుహలో ఇద్దరూ ధ్యానంలో ఉన్నట్లు తెలిసింది. దాసు తర్వాత అమృత సర్ వెళ్ళాడు. శిష్యబృందమేర్పడి కీర్తి బాగా వ్యాపించింది. ఆంగ్లదొరలు కూడా అతని యోగ శక్తికి ఆశ్చర్యపోయారు. నిద్రాహారాలు లేకుండా యోగాభ్యసనంలో చాలా నెలలు ఉండి పోయేవాడు.

1835 మార్చి 1న పంజాబు లోని జేసల్మీ నగరం లో మట్టిలో కప్పుకొని వింత సమాధి స్థితిపొందాడు. లెఫ్టినెంట్ బైలో అది చూసి "లోతైన గోతిలో హరిదాసు సమాధిలో ఉన్నాడు పురుగులు తినేయకుండా శరీరానికి కాషాయవస్త్రం చుట్టారు శిష్యులు. బలమైన పెద్ద రాతిపలకలతో గోతిని మూసేశారు. ఇంకాకట్టుదిట్టంగా గోతి చుట్టూ మట్టితో గట్టిగా అలికించి గొయ్యి ఉన్న ఇంటికి తాళం వేసి, ద్వారంవద్ద పెద్దపెద్ద బండరాళ్ళు అడ్డంగా పెట్టించి, ఇంకా అనుమానం తీరక కత్తులు టార్లతో పోలీసు పహారా కూడా ఏర్పాటు చేశారు "అని రాశాడు. నెల రోజులతర్వాత ఏప్రిల్ 1న దాసును పురాదీసుడు బయటికి తీయించే ఏర్పాటు చేశాడు. ఈ వింత చూడటానికి అనేక ప్రదేశాలనుంచి ప్రజలు తండోప తండాలుగా వచ్చారు. చేసిన పకడ్బందీ ఏర్పాట్లన్నీ వరుసగా తొలగించి చూడగా హరిదాసు నిశ్చలం గా సమాధిలో ఉన్నాడు. బయటకు తీసి కాషాయ వస్త్రాలు చుట్టగా యోగి పళ్ళు ఒకదానితో ఒకటి కలిసిపోయి మూసినకళ్ళతో, కాళ్ళు చేతులు కదలకుండా కనిపించేసరికి చనిపోయాడనే అంతా భావించారు. శిష్యులు సపర్య చేశాక కదలిక వచ్చింది కళ్ళు తెరిచాడుకాని చూపు నిలవలేదు దేహం శుష్కించింది. హిందూ, ముసల్మాన్, క్రైస్తవులు ఈ దృశ్యం చూసి అవాక్కయ్యారు.




హరిదాస స్వామి అద్భుత శక్తికి ఆశ్చర్యపోయి రాజా రణజిత్ సింగ్ లాహోరుకు ఆహ్వానించాడు. రాజుమాట కాదనలేక వెళ్ళాడు. రావీ నది ఒడ్డున ఒక సుందరవనం లో వసతులతో యోగాభ్యాసం,సమాధికి ఏర్పాటు చేయగా దాసు అందులో ప్రవేశించాడు. రాజు, కొడుకు, మనవడు సందర్శించటానికి వచ్చారు. అనుష్టానం పూర్తీ చేసి సమాధిలో ఉండటానికి ముందు దాసు రాజుతో "నలభై రోజులతర్వాత ఈ మట్టి సమాదినుంచి నన్ను బయటికి తీయండి "అని చెప్పి పద్మాసనం లో కూర్చుని కొద్ది నిమిషాలకే సమాధి స్థితిలోపొందాడు. భటులుఆయనను ఒక కావడిపెట్టెలో భద్రంగా కూర్చోపెట్టి, గోయ్యిత్రవ్వి అందులో దాన్నిపెట్టి మట్టితో కప్పేశారు. 39రో జులుగడిచాయి. 40 వ రోజు మధ్యాహ్నం రాజా రణజిత్ సింగ్ పొలిటికల్ ఏజెంట్ కెప్టెన్ వార్డ్, డాక్టర్ మెక్ గ్రెగర్,, డాక్టర్ మేరె, జనరల్ వెంజురా మొదలైన ప్రసిద్ధుల సమక్షం లో సమాధిని క్షుణ్ణంగా పరిశీలింపజేసి అనుమాన నివృత్తిలై, లేక గోతిపై చల్లిన గోధుమ మూరెడు పొడవున మొలకెత్తికనిపించగా, పైమట్టి తొలగించి పెట్టెను బయటికి తీయగా వేసిన తాళం వేసినట్లే కనిపించి, తాళం తెరచి చూడగా దాసు అదే సమాధి స్థితిలో కనిపించి ఆశ్చర్య చకితులను చేశాడు. డాక్టర్లు పరీక్షిస్తే శరీరం చల్లబడి నాడీ చలనం లేదు. గుండెచప్పుడు వినిపించలేదు. రెప్పలు వెనక్కి తిప్పి కూడా చూసి అందరూ చనిపోయాడని నిర్ధారించారు. గురు తత్త్వం తెలిసిన శిష్యులు చిరునవ్వుతో శరీరానికి సేవలు చేశారు. నెమ్మదిగాకల్లు తెరిచాడు. చలనం వచ్చింది. అమితాశ్చర్యం పొందటం అధికారుల వంతు అయింది. రాజా రణజిత్ సింగ్ స్వామి యోగానికి అబ్బురపడి ఫిరంగి కాల్పులతో గౌరవం కలిగించాడు. హరిదాసస్వామి నేలమీద నడిచినట్లే నీటిమీదా నడిచేవాడు, గాలిలో చాలా ఎత్తుకు లేచేవాడు. శతమానం భవతిగా జీవించి మహాయోగి హరిదాస స్వామి యోగీశ్వరుడైన దేవదేవుని సన్నిధికి చేరుకొన్న సాధన సార్ధక జీవి.

## 19 రఘునాథ దాసు

చైతన్యుడు వంగదేశం లో హరిభక్తి ఉద్యమం తీవ్రంగా నడుపుతున్న సమయం లో గౌడనవాబు నుంచి హిర్న హిరణ్యదాసు గోవర్ధన దాసు అనే సోదరులు "సప్తగ్రామం "ఇనాం గా పొందారు. అది వర్తకానికి ప్రసిద్ధి. 14 వ శతాబ్దిలో వంగ దేశాన్ని ఢిల్లీ రాజప్రతినిధిగా హుసేన్ సాహ్ గౌడనగరం ముఖ్యపట్టణంగా పాలించేవాడు. రూప సనాతనుడు అతని మంత్రి. ఇతనివల్లనే సోదరులకు సప్తగ్రామం వచ్చింది. ఇద్దరూ సద్గుణాలతో వినయ విధేయతలతో సత్కార్యాలతో ప్రజాభిమానం పొందారు.



చిన్నవాడు గోవర్ధన దాసుకు 1417 లో రఘునాధ దాసు పుట్టాడు. మహాపండితుడు బలరామాచార్యుని వద్ద రఘు విద్య నేర్చాడు. భక్త హరిదాసు ఈ గురువు ఇంట్లోనే ఉండేవాడు. హరిదాసు భక్తి విశేషం తెలియక తోటి విద్యార్థులు గేలి చేసినా, రఘునాథుడు అతనిపై కారుణ్యం చూపేవాడు. గురువు ఇంట్లో లేనప్పుడు దాసు దగ్గరకూర్చుని రఘు భజనలు చేసేవాడు. ఇతడినీ పిచ్చాడు కిందజమ చేసి బాధించేవారు. వీరి బాధ భరించలేక దాసు శాంతిపురం వెళ్ళిపోయాడు.

రఘుమనసులో భక్తి బాగా వేళ్ళుతొడిగి పెరిగి,వైరాగ్యం అబ్బింది. ధనికుడైనా సుఖ భోగాలు అనుభవించకుండా విరాగిలాగా తిరుగుతుండగా అక్కడికి వచ్చిన చైతన్య మహాప్రభువు "ఇంటికి వెళ్లి సంసార సుఖం పొందుతూ ఆత్మసన్యాసంతో గడుపు "అని ఉపదేశించాడు. వెంటనే ఇల్లు చేరి, సుఖాలు అనుభవిస్తుండగా ఒకరోజు కలకత్తా కు దగ్గర పానిహాట్ లో నిత్యానంద స్వామిని కలిసి భక్తి జ్ఞానం పొందాలనుకోగా తండ్రి ఒప్పుకున్నా తల్లి అనుఅమతించలేదు. తండ్రి తల్లికి నచ్చచెప్పగా, ఇద్దరి అనుమతితో నిత్యానంద దర్శనం చేసి "చైతన్య సేవ లభించేట్లు ఆశీర్వదించండి "అనికోరగా "నీ కోరిక సమంజసం. ముక్తి పొందగలవు "అని ఆశీర్వదించి పంపాడు.

ఇంటికి వచ్చి దీక్షగా భగవధ్యానం కొన్నేళ్ళు చేశాడు. ఒక రోజు అర్ధరాత్రి భార్య ను తలిదండ్రులను వదిలి ధర్మమార్గగామి కావాలన్న తపనతో శ్రీ క్షేత్రం వైపుకు బయల్దేరాడు. చాలారోజులు నడిచి పూరీ జగన్నాథం చేరి చైతన్య దర్శనం చేయగానే ఆయన పరమానందంగా స్వాగతించి అక్కున చేర్చి, దారిలో చాలా ఇబ్బందులు పడ్డాడని గ్రహించి గోవిందుడు అనే శిష్యుడిని దాసు సేవచేయమని చెప్పి, సముద్రస్నానం చేసిరమ్మని దాసుతో చెప్పాడు. సముద్రస్నానం చేసి జగన్నాధ దర్శనమూ చేసి ఆశ్రమానికి రాగా గోవిందుడు గురువుగారు తిని వదిలేసినాపాత్ర దాసు ముందుపెట్టి తినమన్నాడు. దాన్ని దైవ ప్రసాదంగా భావించి కళ్ళకు అద్దుకొని తృప్తిగా తిన్నాడు.

ఇలా అయిదురోజులుగడిచాక ప్రసాదం తింటూ ఒళ్ళు పెంచుకోవటం తప్ప ఏమీ చేయలేక పోతున్నానే అని బాధపడి,మర్నాడు సముద్రస్నానం చేసి దైవ దర్శనానికి వెళ్లి దగ్గరలో హరినామ సంకీర్తనలో సాయంకాలం దాకా పాల్గొని, ఒక దుకాణం వద్ద బిచ్చమెత్తుకొని తిన్నాడు. ఎంతసేపటికి ఇంటికిరాకపోతే

గోవిందుడు వెతుకుతూ అతడు భిక్షాన్నం తినటం చూసి చైతన్యుడికి చెప్పగా అమితానందం పొందాడు. మందిరం దగ్గర బిక్ష అడుక్కోవటం బాగాలేదని పించి భజనలు జరిగే సత్రాలకు వెళ్లి భజనలతో గడిపి ప్రజలిచ్చే దాన్ని తిని కొన్ని రోజులు గడిపాడు. ఇదీ బాగాలేదనిపించి యాత్రికులు పారేసిన విస్తళ్ళలోని ఎంగిలి మెతుకులు తిని బతికాడు. ఇవన్నీ గౌరాంగునికి తెలుస్తూనే ఉన్నాయి. ఎంతటి ధనికుడు ఎంతటి దీనావస్థ కొని తెచుకోన్నాడని చైతన్యుడు భావించి ఒకరోజు సరాసరి అతడున్న చోటుకువచ్చి "నువ్వు తినేది నాకు ఎందుకు పెట్టవు?"అని అడిగి అతడు తిన్న ఎంగిలిమెతుకుల ముద్దా పెట్టగా, రెండవముద్దకు చేయి చాచిన గురువు చేయిపట్టుకొని "ఇలాంటి అన్నం మీరు తినతంఏమిటి మహా ప్రభూ "అన్నాడు. చిరునవ్వేసమాధానం.

చైతన్యుని తర్వాత రఘునాథుడు బృందావనం "రాదా కుండం "లో ఉన్నాడు. కొన్నేళ్ళ తర్వాత అక్కడే సిద్ధిపొందాడు ఆయన రాసినగ్రంథాలువంగ దేశ వైష్ణవ భక్తులకు పరమ పారాయణీయాలయ్యాయి. అందులో" ఉపదేశామృతం మనః శిక్ష, శ్రీ చైతన్య స్తబక కల్పవృక్షం విలాప కుసుమాంజలి, శ్రీ ప్రేమామ్బుజ మకరందాఖ్య స్తవరాజం "మొదలైనవి సుప్రసిద్ధమైనవి. అచ్చమైన యోగిగా రఘునాధ దాసు ప్రసిద్ధి చెందాడు.

## 20 రుయి దాస స్వామి

రామానంద స్వామి ని సేవించే ఒక యువకుడు కఠిన బ్రహ్మ చర్యం పాటించేవాడు. ఊరిలో బిచ్చమెత్తి వచ్చిన బియ్యం తో అన్నం వండితే, గురువు ఇష్టదేవతకు నైవేద్యం పెట్టేవాడు. వడ్డీ వ్యాపారం తో "డబ్బు చేసిన "ఒక ధనికుడు ఈ యువకుడికి బిక్షం వెయ్యాలనుకొనగా గురువు అనుమతి లేనిదే స్వీకరించనన్నాడు. ఒక రోజు విపరీతమైన గాలి వాన వచ్చి బయటకు వెళ్ళలేక పోయాడు యువకుడు. ధనికుని ఇంటినుంచి బియ్యం తెప్పించి నైవేద్యానికి అన్నం వండాడు. గురువు మనసు నిశ్చలంగా ఉండలేకపోయి శిష్యుడిని బియ్యంఎక్కడినుంచి తెప్పించావని అడగగా, వడ్డీ వ్యాపారి నుంచి అని చెప్పగా అక్రమ ధనార్జన చేసే అతని నుంచి ఎందుకు తెప్పించావని కేకలేసి తన ఆజ్ఞ ధిక్కరించినందుకు మరుసటి జన్మలో నీచ కులం లో పుడతాడని శపించాడు.

కొద్దికాలానికే ఆ శిష్యుడు చనిపోయి మాదిగ కులం లో పుట్టాడు. కాని పూర్వజన్మ జ్ఞానం ఉండేది. హృదయం హరి భక్తితో పొంగిపోయేది. కాని గురునికి దూరమయ్యాననే బాధ ఉండేది.అందువలన తలిదండ్రులు ఎంతలాలన చేసినా ఏడుపు మానే వాడుకాదు.తండ్రి చేసేదిలేక రామానంద స్వామికి విన్నవించాడు. విషయం గ్రహించిన స్వామి శిష్యుడు తనకు దూరమయ్యాననే బాధతోనే శిశు రూపం లో ఏడుస్తున్నాడని గ్రహించి "నన్ను మీ ఇంటికి తీసుకు వెళ్ళండి. అన్నీ చక్కబరుస్తాను"అనగా "మేము నీచకులం వాళ్ళం. మా ఇంటికి మీరెలా వస్తారు స్వామీ "అన్నారు అమాయకంగా. "సేవా ధర్మం లో అంటరానితనం అనేది లేదు. పరోపకారమే నిజమైన హరి సేవ. నేను నీతో వస్తానుపద "అన్నాడు



మాదిగవానితో కలసి రామానందస్వామి వాళ్ళ ఇంటికి వెళ్లగా బిడ్డను చంకలో పెట్టుకొనితల్లి ఎదురు చూస్తోంది. బాలుడు చాతకపక్షిలాగా గురు చంద్రునికోసం అలమటిస్తున్నాడు. తన దుఖాన్ని కన్నీటి దారలతో చెప్పాడు ఆ పూర్వ శిష్యుడు, ఇప్పటి మాదిగ శిశువు. ఆచార్యుని హృదయం కారుణ్య రసమైప్రవహించి శిశువు శిరసు తాకుతూ "బిడ్డా !ఏడవకు. భక్తరక్షకుడుశ్రీరామ చంద్రుడు నిన్ను కాపాడుతాడు. ధన్యుడవు అవుతావు "అని ఆశీర్వ దించి చెవిలో రామనామ మంత్రం ఉపదేశించి వెళ్లి పోయాడు. ఈ బాలుడు క్రమగా పెరిగి రుయి(ఏడుపు ) దాసు అనే పేరు పొంది పెద్దవాడై శ్రీరామ భక్తిలో మునిగిపోయాడు.రామనామ స్మరణ చేస్తూ,కులవృత్తి నిర్వహించేవాడు. రెండు జతల చెప్పులుకుట్టి ఒక జత కనిపించిన రామభక్తుడికిచ్చి రెండవ జత అమ్మి, ఆడబ్బుతో జీవనం సాగించాడు. డబ్బు తీసుకోకుండా హరిభక్తుల జోళ్ళు బాగు చేసేవాడు.

బంధు మిత్రులను వదిలి గంగాతీరం లో కుటీరం ఏర్పాటు చేసుకొని, శ్రీరామ విగ్రహం పెట్టి, పూజిస్తూ కులవృత్తీ చేస్తూ కాలం గడిపాడు. జోళ్ళు అమ్మలేని రోజు ఉపవాసం ఉండేవాడు. ఆకలి దప్పులు లేకుండా నిత్య హరినామ స్మరణ చేసేవాడు. ఒకరోజు రాముడేస్వయంగా మారు వేషం లో వచ్చి ఒకస్పర్శమణి చూపి దాన్ని తాకిస్తే ఇనుము బంగారం అవుతుందని చెప్పి ఇవ్వబోతే "స్వామీ !ఎవరు నువ్వు నాపై ఇంతటి కరుణ ఎందుకు ?"అని ప్రశ్నించాడు. "నీ కష్టాలు పోగొట్టటానికే పరుసవేది ఇస్తున్నా తీసుకో "అనగా రుయీ "నిజంగా నువ్వు నా ఇష్టదైవం శ్రీ రాముడివే ఐతే, నీ నిజ రూప దర్శనభాగ్యం కలిగించు "అన్నాడు. మర్నాడుకూడా వచ్చి ఆపరుసవేదిని తీసుకోమని చెప్పి మూలనున్న కత్తికి దానిని అం టించగానే అది బంగారుకత్తి గామారింది. దాసు "నువ్వు ఎవరివో గారడీ వాడిలాగా ఉన్నావు బంగారం లాంటి నాకత్తిని నిజంగా బంగారం చేసి నా కడుపుకొట్టావు. నీ రాయీఅక్కర్లేదు నువ్వూ అక్కర్లేదు తీసుకొని పో "అన్నాడు.. "బంగారు కత్తి వలన బోలెడు డబ్బు వస్తుంది "అని ఆశపెట్టాడు. "నాకు బంగారం పై మోజులేదు.ధనం కూడా బెట్టాలన్నతాపత్రయమూ లేదు.నీ రాయి నాకు ముక్తినివ్వదు. కష్టాలు తెస్తుంది. దయతో తీసికెళ్ళు "అన్నాడు. పరుసవేదిని రుయీ దాసు చేతిలోపెట్టి వెళ్ళాడు లీలామానుష రూపుడు.

బంగారు కత్తినీ, తానూ మామూలుగా వాడే కత్తినీ మూలపారేసి, కొత్తకత్తికొని వృత్తికొనసాగించాడు. ఉపవాసాలు చేస్తూ వృత్తికొనసాగిస్తూ, రామనామ స్మరణ చేస్తూనే ఉన్నాడు. కరుణామయుడు భరించలేక మళ్ళీ వచ్చి పరుస వేది ఏమైంది అని అడిగితె మూల పారేశాను కావాలంటే ఎవరికైనా ఇచ్చుకో అనగా,

పరుసవేది తాను తీసు కొంటాకాని, నేనిచ్చేది ఏ దైనా కానీ నువ్వు తీసుకోవాలి, ప్రతిరోజు నీ దేవుడి పీఠం మీద అయిదు బంగారు నాణాలు ఉంటాయి. అవి తప్పక తీసుకో. ఇప్పుడు చూడు అక్కడ నాణాలు ఉంటాయి అని బలవంత పెట్టగా "అసలు నువ్వెవరవయ్యా స్వామీ. ఈ బలవంతం ఏమిటి ?అనగా "నేను నీవాడిని. నీ భక్తికి మెచ్చి ఈ ఏర్పాటు చేశాను "అన్నాడు. "నీ కరుణకు ధన్యవాదాలు కానీ నేను తీసుకోలేను. మన్నించు. నీ దర్శనం ఇప్పించు చాలు "అన్నాడు. వెంటనే నిజరూప దర్శనం కలిగించి సంతృప్తి పరచి శ్రీరామ చంద్ర మూర్తి అదృశ్యమయ్యాడు, దాసుమనసులో అద్భుత జ్యోతి ఏర్పడిన భావం కలిగింది. ఏం జరిగిందో అర్ధంకాక ఉన్మాదిలాగా "రామా రామా "అంటూ అటూ, ఇటూ పరుగులు తీశాడు. తర్వాత రామనామం కలవరిస్తూ మూర్చపోయాడు. తేరుకొని లేచి రాముడు అడిగిన దాన్ని తీర్చటం తన విధి అనుకోని రోజు వచ్చే నాణాలను రామభక్త పూజకు వినియోగించటానికి నిర్ణయించాడు.

ఆరోజు నుంచి భక్తుల రాక పెరిగి కుటీరం రామనామం తో ప్రతిధ్వనించింది. దిక్కు లేనివారంతా రూయీ దాసు దాసులయ్యారు. దాసు పెట్టే భోగాన్నం తీసుకోవటానికి ప్రతిరోజు రాముడు ఏదో ఒక వేషం లో వచ్చేవాడు. కొంతకాలం తర్వాత ఆశ్రమం భక్తులకు అప్పగించి చిత్రకూటం వెళ్లి దగ్గరలో ఉన్న గాయత్రి, పయస్విని మందాకినీ నదులలో మందాకినీ చెంత ఆశ్రమం నిర్మించుకొని, రామ భజన స్మరణ చేశాడు. ఈ మూడు నదులు కలిసే చోటు ఒక త్రివేణీ క్షేత్రమైంది. దీనికి దగ్గరలో హనుమాన్ ధారా, భరత కూపం, భరద్వాజాశ్రమం ఉన్నాయి. సీతా ఝూలీ అనే రాణి రుయీదాసు శిష్యురాలై మంత్రోపదేశం పొందాలనుకొంటే కొందరు పండితులు క్షత్రియరాణి చండాలుని వద్ద మంత్రోప దేశమా అని ఆక్షేపిస్తే రాణి "అతడు నిస్వార్ధ భక్తుడు. "అని చెప్పి తారక మంత్రోప దేశం పొంది, ధ్యాన, మంత్రజప, దీనజన పోషణలో జీవితం గడిపి,రామ సాక్షాత్కారం పొందిన ధన్యురాలు.

ఒక శ్రీరామనవమి నాడు గొప్ప సంతర్పణ చేసింది రాణి. అన్నికులాలవారినీ ఆహ్వానించి, రుయీ దాస స్వామికి ప్రత్యేక ఆసనం వేసి చేయి పట్టుకొని తీసుకు వచ్చి కూర్చోబెట్టింది. బ్రాహ్మణులకు నచ్చక, దూరంగా వెళ్లి కూర్చున్నారు. వడ్డన పూర్తయి నివేదన అయ్యాక ప్రతి బాపడి కుడిపక్కన దాసు కనిపించాడు. కిక్కురుమనకుండా తిన్నారు. భోజనాలతర్వాత దాస స్వామిని బంగారు సింహాసనం పై కూర్చోబెట్టి, రాణి వింజామరతో విసిరింది. బ్రాహ్మలు అతన్ని చూడగా అతనికి బంగారు జందెం ఉన్నట్లు గమనించారు. కాని అహం చావక వెళ్ళిపోయారు. రాణి కొంతకాలం తర్వాత దాసు తో తీర్ధ యాత్రలు చేసి, ఆతడు ముందూ తర్వాత ఆమె సాయుజ్యం పొందారు

## 21 తూము లక్ష్మీ నృసింహ దాసు

#### జననాది విశేషాలు

భక్తీ సంగీత సాహిత్యాలకు ఆలవాలమైన సద్వంశం లో క్రీ శ 1790 ప్రాంతం లో తూము లక్ష్మీ నరసింహదాసు అప్పయ్య, వెంకమాంబ దంపతులకు జన్మించాడు. గోల్కొండ వ్యాపారులు ఆపసంభ సూత్రులు యజుశ్శా ఖాధ్యాయులు. వశిష్ట, శక్తి,పరాశర త్రయార్షేయ పరాశర గోత్రీకులు, తాత వెంకట కృష్ణయ్య గుంటూరుజిల్లా బాపట్ల తాలూకా పొన్నూరులో ఉంటూ శ్రీ భావనారాయణ స్వామి సేవలో తరించాడు. ఈయన కుమారుడైన అప్పయ బుద్ధి, దేహబలం తో రాజగౌరవం పొంది,వెంకమాంబ ను పెళ్లి చేసుకొని, గుంటూరులో స్వంతఇల్లు కట్టుకొని కాపురం పెట్టాడు. ఈ దంపతులకు నరసింహదాసు, కృష్ణ దాసు, రుక్మాబాయి సంతానం. రుక్మాబాయిని జఘూలరావు వంశం వారికిచ్చి పెళ్లి చేశారు. దాసు ద్వయం తెలుగు సంస్కృతాలు నేర్చి రామభక్తులుగా ఉన్నారు. సంబ్రాజు వంశానికి చెందిన లక్ష్మీ బాయమ్మను నరసింహదాసుకు, సీతమ్మను కృష్ణదాసుకు ఇచ్చి వివాహం చేశారు.



నరసింహ దాసు దంపతులకు సంతానం కలగలేదు. దాసు గారు చనిపోయాక భార్య మరిదికొడుకు రామదాసు ను పెంచి, వైదేహి అనే అమ్మాయితో పెళ్లి చేసింది. వీరికీ పిల్లలు పుట్టలేదు. భర్త చనిపోయాక వైదేహమ్మ కూడా లక్షణ రాయడు ను పెంచుకొని పెళ్లి చేసింది వీరి సంతానం ఇప్పటికీ భద్రాద్రిలో ఉన్నారు.

### భద్రాద్రి రామభక్త దాసు

రామభక్త నరసింహ దాసు బాల్యం నుండి మాట్లాడే ప్రతిమాటకు వేసే ప్రతిఅడుగుకు రామ రామ అనటం అలవాటు చేసుకొన్నాడు. దాసు ఇరవై వ ఏట తండ్రి చనిపోవటం తో కుటుంబ భారం మీద పడి,పొన్నూరులో పేష్కారు జీతం తో జీవనం సాగించాడు. రామభజన అతిధి సత్కారం, కవితా రాధన నిత్యకృత్యం. భక్తికి ఉద్యోగానికి లంకె కుదరక ఉద్యోగం మానేసి, ఇంట్లోనే రామ మందిరం నిర్మించి, భద్రాద్రి సీతారామ విగ్రహాలు పెట్టుకొని నిత్య భజన చేస్తూ, గద్య పద్యాలు రాస్తూ, భక్తిశతకాలు గేయాలు రాశాడు.

### శ్రీ రంగ క్షేత్ర దర్శనం

నరసింహ దాసు క్రీ శ 1818-19 బహుధాన్య సంవత్సర కార్తీక మాసం లో శ్రీరంగ క్షేత్రానికి వెళ్లి, పరవశంతో రంగ శాయిని దర్శించి "శ్రీరంగ శాయి తారహారం" మకుటం తో27 సీస పద్యాలు రాసి స్వామికి సమర్పించి, ఇంటికి తిరిగి వచ్చాడు.

### భద్రాద్రి రామ దర్శనం, కాశీయాత్ర

1820-21 లో తల్లీ, భార్య, తమ్ముడు లను సమాధాన పరచి ఒప్పించి, విక్రమ సంవత్సరం చైత్ర శుద్ధ పాడ్యమి శనివారం రేవతీ నక్షత్రం లో ఆప్త మిత్రులతో కలిసి గుంటూరు నుంచి నడిచి అమరావతి వెళ్లి, కృష్ణా స్నానం చేసి అమరలింగేశ్వర దర్శన భాగ్యం పొంది, అక్కడినుండి కాలినడకన భద్రాద్రి చేరి సీతారామ దర్శనం తో పులకించి –"అర్ధికిచ్చిన ధనం బపుడెమరచెదట-పదిలమోహో రామ బహు పరాకు "అనే అనేక సీస పద్యాలతో పరాకు పల్కి, మళ్ళీ ప్రయాణం సాగించి అశ్వారావు పేట, కొవ్వూరు, రాజమండ్రి, మీదుగా పిఠాపురం చేరి కుంతీ మాధవ స్వామిని దర్శించి, సింహాచలం వెళ్లి వరాహ నృసింహ స్వామికి పూజ చేసి, శ్రీకూర్మం చేరి కూర్మావతార విష్ణు సేవ చేసి, పూరీ జగన్నాధం వెళ్లి బలరామ సుభద్రా సహిత జగన్నాధ స్వామి ని సేవించి మార్కండేయాది పుణ్య తీర్ధ స్నానాలు చేసి, పంచ చామర వృత్తంలో –"పరాకు శ్రీ రమాంగ నాస్య పద్మ పద్మ బాంధవా –పరాకనంత పద్మజాండవారపూరి తోదరా " అంటూ పొగడి అయిదు రాత్రులు గడిపి, చాలా కష్టమైన ప్రయాణం చేసి జాజిపురం వెళ్లి అక్కడి నదిలో పితృ కార్యం నిర్వహించాడు. అప్పటికే బాగా అలసి పోవటం తో కాశీ యాత్ర చేయగలనో లేనో అనే సదేహం కలిగింది. కల కన్నాడు దాన్ని పద్యాలలో బంధించాడు –"బ్రహ్మదులకు నైన బడయ సాధ్యముకాని-అప్రత హత శక్తుడైన నీవు –దురితాత్ముడంచునం ద్రోయగా జూడక –యతి దీను డీతడం చాత్మ నెరిగి ---- దాశరధ కుమార రామ భద్రాద్రి ధామ "అని స్తుతిస్తే స్వామి అభయమివ్వగా భయం పోయిందని స్వయంగా దాసు గారే చెప్పాడు.

శ్రీరామ దయతో అభయం తో నూతనోత్సాహం కలిగి, మర్నాడే బయల్దేరి బుద్ధ గయ వెళ్లి, ఫల్గూ నదిలో పవిత్ర స్నానం చేసి, విష్ణు స్వామిని దర్శించి గయా శ్రాద్ధం తో పితృదేవతలకు తృప్తి కలిగించి, పుణ్య రాశి కాశీ చేరి పవిత్ర గంగాస్నానం విశ్వనాథ దర్శనం తో పులకించి నరసింహదాస మహోదయుడు –"రజతాద్రి ఇచటికి రాబోలు నేమొకొ-కాదు కాశీ సౌద కాంతిగాని –"అని భక్తిగా ఆర్తిగా వర్ణించి నృత్యం చేసి, -"తారక బ్రహ్మ మంత్రంబు దయ నొసంగు –హరుని కాపురమగు కాశి నరయగంటి "అని తన జన్మ ధన్యమైందని, అనుకొన్నట్లుగా రామానుగ్రహం తో కాశీ దర్శించగలిగాననీ పరమానంద పడ్డాడు. అక్కడి బిందుమాధవ, డుంఠి గణపతి దండాయుధ కాలభైరవ అన్నపూర్ణ విశాలాక్షి దేవులను దర్శిస్తూ నిత్యగంగాస్నానం,పితృ తర్పణం తో పులకించాడు

అగస్త్య మహర్షిలాగా కాశీని విడువలేక విడువలేక విడిచి పడమరగా బయల్దేరి, ప్రయాగ త్రివేణీ సంగమ పవిత్ర స్నానం చేసి, విధులు నిర్వహించి మళ్ళీ కాళ్ళకు పని చెప్పి గుంటూరు అనే గర్తపురి చేరి, తల్లి వెంకమాంబ పాద పద్మాలకు నమస్కారం చేసి గంగాజలంతో అభిషేకం చేసి ఆశీస్సులుపొంది తనరాకకోసం ఎదురు చూస్తున్న పురజనుల క్షేమం అడిగి తెలుసుకొని కొన్ని రోజులు గుంటూరులో ఉన్నాడు.

### ప్రతి చైత్రం లో భద్రాద్రి రామ దర్శనం

ప్రతి చైత్రమాసం శ్రీరామనవమికి లో భద్రాద్రి వెళ్లి తన కులదైవం శ్రీ సీతారామ దర్శనం,చేసి కళ్యాణ శోభ చూసేవాడు. వృష నామ సంవత్సరం లో తమ్ముడు కృష్ణ దాసుతో కలిసి చైత్ర శుద్ధనవమికి భద్రాచలం చేరి,గోదావరీ స్నాన పులకితగాత్రుడై శ్రీరాముడికి హృదయం సీతమ్మకు కాన్కలు హనుమయ్యకు మ్రొక్కులు సమర్పించి-"గాయయందు నిప్పాసి కనులకు భవదంఘ్రి నీక్షింప జేసినదీవ కావె—గంగాది యాత్రలీ కలుపాత్ము జేతజే-యించి రక్షించిన దీవ కావె"అంటూ అనేక పద్యాలతో భద్రాద్రి రామ స్తుతి చేసి మళ్ళీ గుంటూరు చేరాడు.

## దక్షిణ దేశ యాత్ర

సంపదలు శరీరం బుద్బుదాలని, సత్కార్యాచారణం చేయాలని, తీర్ధ యాత్రలతో జ్ఞాన సౌధ నిర్మాణం చేయాలనీ తల్లికీ తమ్ముడికి ధైర్యం చెప్పి మళ్ళీ దక్షిణ దేశ యాత్రకు 1821-22 వృష సంవత్సర ఆషాఢ శుద్ధ విదియనాడు గుంటూరులో బయల్దేరి పొన్నూరు చేరి. భావనారాయణ స్వామిని దర్శించి పొన్నూరు వెళ్లి అక్కడి భావనారాయణ స్వామి ఆశీర్వచనం పొంది నరసింహ దాసు నెల్లూరు చేరి రంగనాథ స్వాముల దర్శనం పూజ చేసి, తిరువలిక్కేలి వెళ్లి పార్ధసారధి దర్శనం తో తృప్తి చెంది, మద్రాస్ మీదుగా మధ్యలో ఉన్న తీర్ధాలు క్షేత్రాలు చూస్తూ వానకు తడుస్తూ ఎండకు ఎండుతూ చలికి వణకుతూ చిదంబర క్షేత్రానికి వెళ్లి చిదంబరేశ్వరుని దర్శనం తో ఆనందం పొంది ఆకాశలింగ దర్శనం, నమక చమకాలతో అభిషేకం, బిల్వదళ పూజ చేసి, శియాళి వెళ్లి శివదర్శనం చేసి, గౌరీ మయూరం దర్శించి, పంచవటం చూసి, కావేరీ తీరం చేరిపుణ్యస్నానం చేసి, మహేశునర్చించి, కుంభకోణం లో ద్వాదశ తీర్ధాలలో స్నానించి "కుంభేశ హరహరా శంభో "అని పులకితగాత్రుడై, పంచ నాథ శివ దర్శనం చేశాడు.

## నాదబ్రహ్మ త్యాగరాజస్వామి దర్శనం

నాద బ్రహ్మ త్యాగయ్యగారి మహిమలు తెలుసుకొని దర్శనం తో జన్మ ధన్యమైందని భావించి ఆయన ఆదరణ పొంది, త్యాగబ్రహ్మ తాము రచించిన కృతులను స్వయంగా గానం చేయగా పరవశించి, తూము నరసింహ దాస భక్తాగ్రణిఆనంద పారవశ్యంతో "చేతుల దాళము పట్టుక -చేతో మోదంబు తోడ సిగముడి వీడన్-బాతర లాడుచు మింటను –గీతము నారదుడు వాడె గృష్ణా యనుచున్ " అని పోతన గారు భాగవతం లో రాసినట్లు నారద మహర్షిలాగా నృత్యం చేశాడట నరసింహ దాసు. పాముకాళ్ళు పామే ఎరుగున్ అనే సామెత లాగ దాసు గారు త్యాగయ్యగారిని నిజంగా చూశాడా అని అనుమాన పడే వారికి ఆయనే "కేవలానంద సంకీర్తనావళి వింటి –భావ సిద్ధియు శుద్ధ భక్తి గంటి –భక్తులు శిష్యులు బలసి కొల్వగ గంటి-వాఙ్మాధురీ వైభవంబు గంటి –వినయ సత్వం పద్వివేకమున్ కనుగొంటి –శ్రీరామ పద భక్తి చెల్వు గంటి-యజున కందగరాని యనుభవంబును గంటి-దన్మయత్వం బాత్మ దనరగ గంటి –నరసి కనుగొంటి ద్యాగరారార్యునందు-నీల సద్గుణ పుంజమిం కెన్నియైన –దివ్య మహిమాతి శయములు దేజరిలుట –గంటి హర్షాబ్ధినోలాడు చుంటి మదిని "..త్యాగయ్య గారి సన్నిధానం లో కొన్ని రోజులు గడిపి త్యాగరాజ భక్తికి పరవశుడైనాడు "రామ పదభక్తి కీ త్యాగరాయ వరుని –సమముగా నేర నెవ్వారీ క్ష్మాతలమున –ప్రేమ నా ఘను డొకసారి పిలిచె నేని –రాము డోహో యటంచు మార్పలుకునంట'-అట్టి ఘనుని యాజ్ఞనంది యచ్చోటు వాసి –కడు రయంబుతోడ గదలి సాగి – పరగ రాజిలు నవ పాషాణ మహిమంబు –నాలకించి ముదుకరిగి యరిగి " అని తన త్యాగరాజ దర్శనాన్ని చక్కగా చిత్రించాడు రికార్డ్ చేశాడు చరిత్రలో శాశ్వతంగా. భక్తులమనసు భక్తులకే తెలుస్తుంది. నరసింహదాసు త్యాగయ్యగారి చే సత్కారం పొంది దక్షిణ సముద్రం, నవ గ్రహ శిలలు, చక్ర తీర్ధం, స్వేతా రంభ స్థలం, భైరవాది తీర్ధ సందర్శనం చేసి రామేశ్వరం చేరాడు.



అపర కైలాసంగా కనిపించే రామేశ్వరం లో శ్రీరామ ప్రతిష్ఠిత సైకత రామ లింగేశ్వర దర్శనం చేసి "కాశీ పురమునుండి గంగ దెచ్చితిని ఈశ –దీని గ్రహియిపవయ్య"అనిప్రార్ధించి ఆ గంగతో నమక చమకాలతో అభిషేకించి బిల్వపుష్పాదులు సమర్పించి, కోరిన కోరిక తీరి పెన్నిధి లభించి భావించి – "అన్యమేరుగాను దేవ అహర్నిశములు- దైన్యమున నీ పసుజన –దంబుల దలచిసుజన –మాన్యమౌ పరమార్ధ సంపద లభించి –ధన్యమతి నైతి నీదగు దర్శనమున "—అంగములో సగమంగన-కుంగడ మసగంబు భక్తకోటి కోసగితె, -బ్బంగి నిను గానవచ్చు భు –జంగ చయ విభూష దోష సంగ విదూషా"మొదలైన పద్యాలతో స్తుతించాడు నరసింహ దాసు అక్కడి 24 తీర్ధాలలో స్నానించి, గంధమాదన పర్వతం అధిరోహించి, సేతుమాధవ దర్శనం చేసి, ఉభయ సాగర సంగమం లో తీర్ధ విధులు యధోక్తంగా నిర్వహించి, మూడు రోజులుగాడిపి ఏకాంత రాముని సేవించి, అక్కడి చింతలపాటి లక్ష్మీ నారాయణ గారి అభ్యర్ధనపై వారింట్లో కొన్ని రోజులుండి, రామాయణ పురాణం చెప్పి సన్మానితుడై, మళ్ళీ సేతుమాధవ దర్శనభాగ్యం పొంది -"తగ ప్రయాగ పూరి మాధవుడు నీ క్షేమంబు –నడిగినాడని దెల్పు మనియె బ్రీతి ---"'కోరిక దీరె నీ చరణకోమల యుగ్మమునాశ్రయించుటన్ "అని పద్య స్తుతి

చేసి, కోటి తీర్ధాన్ని తీసుకొని,సముద్రుడు ఎంతసేపటికీరాకపోతే దర్భలపై పడుకొని నిరశన తెలియ జేసిన, దర్భశయనం లో శ్రీ రామ దర్శనం చేసి, శ్రీరంగం చేరి రంగనికి తన అనుభవాన్ని –"ప్రాకార సప్తక ప్రకరంబు కనుగొంటి –యదియెవైకుంఠమంచలరు చుంటి "అంటూ పద్య నివేదనం చేశాడు. అక్కడినుండి జంబుకేశ్వరం వెళ్లి జలలింగదర్శనం చేసి, కంచి చేరి –"ఆకలి గొన్న యట్టి జను –డన్నము గైకొను మాడ్కి "అని స్తుతించి డబ్బులివ్వనిదే దర్శనం లేదంటే సొమ్మసిలిపోతేఒక వైష్ణవ భక్తుడు అంతరాలయ దర్శనం చేయించాడు.

వరద రాజ స్వామిని దర్శించి పరవశంతో సాష్టాంగం చేసి ఆనంద బాష్పాలు రాల్చాడు. తిరుపతి వెళ్లి శ్రీనివాస దర్శనం చేయాలని కొండ ఎక్కుతుంటే "నీ తాత తండ్రుల మొక్కుబడులన్నీ తీర్చగలిగితేనే కొండ ఎక్కు" అనే మాటలు వినిపిస్తే ఎవరా అని వెతికితే ఎవరూ లేకపోవటం తో అది వైష్ణవ మాయ అని గ్రహించి "ఈయనే కంచిలో దర్శనం చేయించిన వైష్ణవరూప వెంకటేశ్వరస్వామి" అని మనసులో భావించి, అడుగడుగుకూ ఆపద మొక్కులవాడిని స్మరిస్తూ –"తాతనాటి ఋణము దలచి లెక్కలు తీసి –ప్రీతిమాని బిరుదు ఖ్యతిమాని –కరిన వృత్తి దాల్చి కదలరా వలదంటి –విట్టు లాడ నీక దెట్టులొప్పె"అని ఎడా పెడా పద్యాలతో వాయించి, చేతిలో చిల్లిగవ్వ లేని తాను ఎలా మొక్కులు తీర్చుకోగలను అని నిర్వేదం చెంది మెట్లమీదనే ఉత్తరీయం పరచి నిద్రపోయాడు. స్వప్నంలో "రజతాద్రి కాంతి నిరాకరించెడుమేని –చందంబు గల్గు నశ్వంబు నెక్కి "శ్రీవారు కనిపించి అక్కడి విశేషాలన్నీ దగ్గరుండి చూపించగా –"మేలు కొంటి నంత జాల పేద్క "అని అనుభవం వివరించాడు. వెంకటేశ్వరుని పాద చిహ్నాలు అక్కడ ఆనవాలుగా కనపడితే ఆశ్చర్యపోయి భక్తులందరికీ చూపి పరవశించాడు నరసింహ దాసు. కొండ ఎక్కి శ్రీవారి దర్శనం చేసి ఆనందంతో నృత్యం చేసి అలుమేలు మంగను గోవిందరాజస్వామిని దర్శించి –శ్రీపాద రేణువు చిన్నం వరా యంచుబల్కు –వైష్ణవ పరి భాష వింటి "అని వేడికోలు చెప్పుకొని,శ్రీకాళ హస్తిచేరి శ్రీ కాల హస్తీశ్వర దర్శనం తో చరితార్ధుడై, మళ్ళీ పొన్నూరునుంచి గుంటూరుకు చేరాడు. కోటితీర్ధజలాలతో తల్లికి అభిషేకం చేసి అందరి యోగ క్షేమాలు అడిగి తెలుసుకొని తన యాత్రా విశేషాలను సవివరంగా అందరికీ తెలియ జెప్పి వారు కూడా యాత్రాఫలితం పొందేట్లుచేశాడు నరసింహదాసు..

వృషభ సంవత్సర ఫాల్గుణ శుద్ధ పాద్యమికి దక్షిణ దేశ యాత్ర పూర్తయింది. మళ్ళీ భద్రాచలం వెళ్లి శ్రీరామ దర్శనం చేసి ఇంటికి వచ్చాడు. నిరంతర ప్రయాణాలతో ఆరోగ్యం దెబ్బతిని, వ్యాధి పీడితుడయ్యాడు.

**ఉత్తర దేశ యాత్ర**

1827-28 వ్యయనామ సంవత్సర పుష్య శుద్ధ విదియనాడు ఉత్తర దేశ యాత్రకు బయల్దేరాడు తూము నరసింహ దాసు. నడిచి ముందుగా అయోధ్య చేరి శ్రీరాముడు పుట్టిన చోటు, పెరిగిన చోటు, ఆడిపాడిన చోట్లు, వల్కలాలు కట్టిన చోటు, దశరధుడు చనిపోయిన చోటు, భరతుడు రామపాదుకలు పూజించిన చోటు, అక్కడి స్థానికులు వివరంగా చెప్పి చూపిస్తే చూసి ధన్యమయ్యానని భావించాడు. సరయు నదీ స్నానం చేసి పితృ తర్పణాలిచ్చి, వంశాన్ని పవిత్రం చేసే ఒక్కడు చాలడా అంటూ"జాలడా ఏడు తరములకు నొక్క మహాత్ముడు "అని శ్రీరామ స్తుతి చేసి అక్కడే కొన్ని రోజులు గడిపి, అక్కడి నుంచి హరిద్వారం బదరికా వనం చేరి నరనారాయణ సందర్శనం భాగ్యం పొంది సర్వజిత్ సంవత్సర శ్రావణ శుద్ధ ఏకాదశి కి గుంటూరు చేరాడు. ఎక్కడి గుంటూరు ?ఎక్కడి బదరి? ఇంతదూరం కాలి నడకన తిరిగి రావటం అంటే మాటలుకాదు. సంకల్పబలం రామానుగ్రహం, కుటుంబ జన ప్రోత్సాహం ఉంటేనే జరుగుతుంది. మళ్ళీ భద్రాద్రి వెళ్లి దర్శనం చేసి వచ్చాడు. ఎన్నియాత్రాలు చేసినా అలుపూ సోలుపూలేదు రోగం రోష్టూ లేదు. కాలికి ముళ్ళు కూడా ఎక్కడా గుచ్చుకొని బాధ పెట్టలేదు దొంగలభయం పాము వంటి జంతు భయం కూడా ఆయనకు ఎదురు కాలేదు.

**కంచి గరుడ సేవ**

కంచిలో డోల సేవ చూడాలని ఎన్నాళ్ళనుంచో దాసు మనసులో ఉంది అది నెరవేర్చుకోవటానికి విరోధి సంవత్సర వైశాఖ మాసం లోకొద్దిమంది భక్తులతో కాంచీ పురానికి వెళ్లి గరుడ సేవ ఉయ్యాలసేవ తనివి తీరా చూసి తరించాడు

**మద్రాస్ అనుభవం కొత్త శిష్యుడు**

మద్రాస్ వెళ్లగా అక్కడ భక్తుడు సంపన్నుడు వైదిక బ్రాహ్మణుడు మురికి నాడు శాఖీయుడు నాగండ్ల వరద రాజస్వామి ఆహ్వానించి, తగిన రీతిగా సేవలు చేసి, దాసు గారి వలన తారక మంత్రోప దేశం పొందాడు, మూడు నెలలు వారిట్లో, రామాయణ ప్రవచనం తో అందరినీ సంతృప్తి పరచగా సంతుష్టాంతరంగు డైన వరద రాజస్వామి, దాసు గారికి పాద పూజ చేసి 4వేల రూపాయలు కానుకగా సమర్పించి "స్వామీ !మళ్ళీ ఒక సారి వచ్చి నన్ను భద్రాద్రి రామ దర్శనం చేయించి పుణ్యం కట్టు కొండి "అని ప్రార్ధించాడు. అతని వినయం భక్తీ లకు సంతోషించి దాసుగారు అదంతా శ్రీరామానుగ్రహం అని చెప్పి మళ్ళీ గుంటూరు చేరి, మూడు తరాలనుండి పెరిగిన అప్పు అంతా ఆ నాలుగు వేల రూపాయలతో తీర్చేశాడు-"అప్పు దీరుపనైన హరియింప నైనను దలచు మానిసికి బత్రంబు వలదు "అని అడిదం సూరకవి చెప్పినట్లు నోటూ పత్రం లేకుండా తన కుటుంబానికి అప్పులిచ్చిన వారి గుణ శ్రేష్టతకు కృతజ్ఞత చెప్పుకొన్నాడు '

మళ్ళీ మద్రాస్ వెళ్లి వరద రాజు తో కలిసి వికృతి సంవత్సర చైత్రమాసం ప్రారంభం లో భద్రాద్రి చేరి శ్రీరామనవమి కల్యాణం చూసి ఆయనకు చూపించి మాట నిలబెట్టుకొని గుంటూరు చేరాడు. నరసింహదాసు బుద్ధి గరిమ భక్తీ ప్రపత్తులు శీల విశిష్టత లను గుర్తించి గౌరవించి వరదరాజు ఈ దంపతులను మద్రాస్ తీసుకొని వెళ్లి ఆరు నెలలు తన ఇంట్లో ఉంచి సకల సౌకర్యాలు కలిపించి ధన్యుడయ్యాడు.

**భద్రాద్రి వాసం**

భక్తి జ్ఞాన సంపత్తి దాసుగారి వలన కలిగి వైరాగ్యభావం అంకురించి, తనకున్న సకల సంపాదనను గుర్రబ్బళ్ళపై ఎక్కించి దాసు దంపతులతో తమ దంపతులుకూడా కలిసి వికృతి కార్తీకం లో భద్రాద్రి చేరి అక్కడే కాపురం పెట్టాడు వరదరాజు. రోజూ దాసు దంపతులతో సత్కాల క్షేపం. భద్రాద్రి రామ దర్శనం తో ఆనందంగా రోజులు గడిచి పోతున్నాయి. రామాలయ పూజారులలో స్వార్ధం పెరిగి స్వామి కైంకర్యాలు సరిగ్గా చేయక తమ కైంకర్యం కోసమే డబ్బు వాడుతూ అప్రతిష్ట తెచ్చారు. తన డబ్బే పోయినట్లుగా దాసుగారు బాధపడ్డారు –రామా !నీ సేవలు సరిగ్గా జరగటం లేదు. నేను ఎలా సహించ గలను ?మొన్న కలలో ఒక వైష్ణవుడు కనిపించి విచారించకు చందూలాల్ ను కలిస్తే అంతా చక్కబడుతుంది "అని చెప్పాడు. మెలకువరాగానే ఈవిషయం శిష్యుడు వరద రాజుకు చెప్పాడు. రామాజ్ఞగా భావించి ఒక్కడే హైదరాబాద్ వెళ్ళాడు.

## 22 కూర్మ దాసు

పంగుం లంఘ యతే గిరిం

ఇలపావులూరి వెంకట సుబ్బయ్య అనే కూర్మదాసు బాగా బీద వాడు విద్యా శూన్యుడు, సుందర దేహుడు. తండ్రి శ్రీనివాసులు, తల్లి ఆదెమాంబ. సోదరులు వెంకట కృష్ణయ్య, సీతారామయ్య. 19 వ శతాబ్దం లో దాసు జననం. జన్మతోనే కుంటి వాడు. నివాసం కందుకూరు తాలూకా సింగమనేని పల్లె.. అక్షరాభ్యాసం తోనే భక్తి బీజం మొలకెత్తి,క్రమంగా పూలు పళ్ళూ కాసి స్థిరపడింది. ఉపనయన వేడుకా జరిగింది. భజన మండలి స్థాపించి నిత్య భజనలు చేస్తూ రామ, కృష్ణ, నరసింహ జయంతులు జరిపేవాడు.

#### వెంకట కృష్ణయ్య కూర్మదాసు అవటం

ఆకాలం లో మహాద్భుత తరంగ గానం చేసేవాడు ఏలేశ్వరపు సీతారామాంజనేయులు. ఈయన్ను కలవాలని కోరిక ఎక్కువగా ఉండేది.డబ్బు లేదు కాళ్ళూ లేవు. దేవుడిపై భారం వేసి చంకకర్రల సాయం తో, నడిచి మజిలీలు చేస్తూ, ఒంగోలు రైల్వే స్టేషన్ లో ఒక ఉదారుని సహాయం తో వెల్లటూరు చేరి, అక్కడ మల్లాది సుబ్బావధానులుచేసే సప్తాహం లో పాల్గొనటానికి వెడుతున్న సీతారామాంజనేయులు గారిని కలిసి ఆయనతో వల్లభాపురం వెళ్లి సుబ్బదాసు గారినిదర్శించి ఆయన అభిమానం పొందభక్తి, ఇతడి తత్పరతకు సుబ్బదాసు గారు ఆశ్చర్యపడి హస్తమస్తక న్యాయంగా ఆశీర్వ దించి, అలనాటి పాండురంగని భక్తుడైన కూర్మ దాసు లాగా ప్రసిద్ధి చెందమని "కూర్మ దాసు "అనే పేరు పెట్టి పిలవటం ప్రారంభించగా లోకం అంతా కూర్మదాసు అనే పిలవటం మొదలెట్టారు. సుబ్బదాసు గారు బాలకృష్ణ లీలా తరంగాలతో మైమరపించారు పొద్దు గుంకి చాలా సేపయింది ఎవరికీ బాహ్య జ్ఞానం లేదు అందరూ అంతర్ముఖులై దివ్య గాన లీలలో తన్మయు లయ్యారు. అందరి చేత స్నానాలు చేయించి కొత్త బట్టలు ఇచ్చి షడ్రసోపేత భోజనం పెట్టి చందన తాంబూలాలతో సత్కరించి, సుఖా సీనుల్ని చేసి సుబ్బదాసు గారు కూర్మ దాసుతో "'నాయనా !నా లాంటి కుటుంబీకుడు ఇలాంటి సప్తాహాలు నిర్వహించటం కష్టం. నువ్వు కుంటి అని దిగులు పడకు. అది దేహానికే కాని మనసుకు కాదు నువ్వు ఈ సప్తాహ కాలక్షేపం నిర్వహిస్తూ దేశం లో పేరు పొందాలి ఇదిగో నిరతాన్న దాన శిరోమణి వరంగల్లు వరమ్మ గారు. వారి ఆశీస్సులు పొందు శుభం జరుగుతుంది "అనగా ఆమెకు నమస్కరించి ఆశీస్సులు పొందాడు కూర్మ దాసు.

### పాండురంగ సప్తాహం

పాండురంగ సప్తాహం జరపాలని కూర్మ దాసుకు అనిపించగా వరమ్మగారి సహాయంతో పండరీపురం వెళ్లి పాండురంగ స్వామిని దర్శించి, సప్తాహ దీక్షలు నిర్విఘ్నంగా జరిగేట్లుదీవించమని ప్రార్ధించి, కొన్ని రోజులుండి,అక్కడి నుంచి తెనాలి చేరి, తురగా కృష్ణయ్య గారింట్లో జరిగిన భజనలో పాల్గొని, ఈమని చేరి నేలనూతుల సుబ్బావధానులు గారింట బస చేసి,ఉపవాస దీక్ష చేసి బ్రహ్మ సత్రం చేయటానికి సిద్ధార్ధి సంవత్సర ఆషాఢశుద్ధ పంచమి శుభ ముహూర్తంగా ఏర్పాటు చేసుకొని ఊరివారికి తెలియ జేయాలను కొంటె అక్కడ వైదిక, నియోగి తగాదాలు తీవ్రంగా ఉండటం తో,చందాలు ఇచ్చేవారెవరూ ముందుకు రాకపోతే ఇక మూడే మూడు రోజులు గడువు ఉందనగా, ప్రజలేకాక వాతావరణమూ అనుకూలంగా లేకపోగా ఆ రోజు స్వప్నం లో శ్రీరామ లక్ష్మణులు వైష్ణవ వేషం లో సాక్షాత్కరించి, ముహూర్తాన్ని నవమికి మార్చి కరపత్రాలు పంచిపెట్టమని, మిగిలిన పనులు తామే చూసుకొంటామని అభయమిచ్చారు.

ప్రోగ్రాం పేపర్లు ముద్రించటం, పందిళ్ళు వేయించటం సుబ్బావధానులుగారు ఖర్చుతో పూర్తి చేశారు. పెద్దిరాజు మహాలక్ష్మమ గారిని మొదటి రోజు కు ఉభయం ఇమ్మని కోరితే బదులు చెప్పకుండా తలూపి వెళ్ళింది. నిరాశ పడిన దాసు గారు, మండపం నిర్మించి అర్చా మూర్తులను ఏర్పాటు చేశారు. అర్ధరాత్రి దాటాక వరలక్ష్మమ్మ గారు అయిదు వందల రూపాయల పళ్ళెం తో వచ్చి అంద జేసి, రామాజ్ఞతో మిగులు తరుగు బాధ్యతలన్నీ తనవే అని చెప్పి వెళ్లి పోయింది. మర్నాడు నుంచి బ్రహ్మ సత్రం మొదలై రోజూ ఎవరో ఒకరు ఉభయం ఇవ్వటానికి ముదు కురాగా కొత్తపల్లి, నిడమానూరు, మైనం పాడు నుంచి వచ్చిన భక్త బృందాలకు ఘన సత్కారాలతో బ్రహ్మ సత్రం దిగ్విజయంగా ముగిసింది. దాసుగారి సప్తాహాలలో జాతి కులమత విచక్షణ లేదు అన్ని క్రతువులలో పాళీ భక్త బృందమే పాల్గొనేది

### ఒంగోలు సప్తాహం

ఒంగోలు సప్తాహం లో మూడవరోజు నృసింహో పాసకురాలైన కైవారం బాలాంబ గారిని శాంతపరచటానికి 108 బిందెల పానకం, బస్తా వడ పప్పు నైవేద్యం పెట్టగా యాత్రికుడికి ఒక గిద్దెడు మాత్రమే పానకం లభించింది అంటే ఎంతమంది వచ్చారో ఊహించ లేము లక్షలాది జనం వచ్చారని భావించారు. ఆరోజుల్లో ఉచ్చిష్ట

పాత్రలను తొలగించటానికి రెండు రెండెడ్ల బళ్ళు అనుక్షణం పని చేసేవి. రెండవ రోజు తరంగ గాన భజనలో ఒళ్ళు మరచిబ్రహ్మానంద పరవశంతో నృత్యాలు చేశారు.దాసు గారు అక్కడికి రాగానే కోటి సూర్య ప్రకాశమైన ఆత్మజ్యోతి కూర్మ దాసుగారిని ముంచేసి, ప్రేక్షకులు చూస్తుండగా అజ్ఞాన అంధకారాన్ని పటాపంచలు చేసింది. ఈ అద్భుత సంఘటన చూసిన నీలంరాజు బాలాంబ గారు, చలపతి రావు దంపతులు మిగిలిన నాలుగు రోజుల ఉభయానికి 6 వేల రూపాయలు దాసుగారికి సమర్పించి కృతతకృత్యులై క్రతు సమాప్తికి గొప్పగా తోడ్పడ్డారు. బ్రహ్మ సత్రం లో రోజుకు రెండు నీలిమందు కళాయీల నెయ్యి ఖర్చయ్యేది. దాసుగారు ఎక్కడ సత్రం నిర్వహించినా ఇంతభారీగా జరిగేవి. ప్రజల స్పందనా తోడ్పాటు కూడా వర్ణించ నలవికానిదిగా ఉండేది

## కడప, వేమవరం,నరసరావు పేట సప్తాహాలు

కడప సప్తాహం లో ఒక రోజు గజోత్సవం జరుగుతుంటే, భక్తుల హారతులతో చలువ పందిళ్ళు ఒక్క సారిగా అంటుకొని మండగా, ఒక కొత్త యువకుడు గజవాహనం నుంచి అవతరించి, మంటలను ఆర్పేసి అదృశ్యమయ్యాడు. భగవదనుగ్రహం గా భావించారందరూ.

వేమ వరం సప్తాహం లో సప్తాహం చివర జరిగే అవభ్రుద స్నాన సమయం లో, కూర్మ దాసు కు దగ్గరగా ఉన్న తాడేపల్లి రత్తయ్య మనవడు తటాకం లో పడి చని పోబోతుంటే, ఆయనకు ఆ జన్మ విరోధి అయిన ఒకాయన వచ్చి ప్రాణాపాయం నుంచి కాపాడి రత్తయ్యకు ఆనందం కలిగించాడు. తను ఒక నూతన పురుషుని ప్రోద్బలం తో ఈపని చేశానని అతడు చెప్పాడు. నరసరావు పేట సప్తాహం నియోగి వైదీకి తగాదాలు లేకుండా సవ్యం గా సాగిపోయింది. అన్నదమ్ముల్లా అంతా కలిసి క్రతు విజయానికి తోడ్పడ్డారు.

### రామకోటి సమర్పణ

రామకోటి ని భద్రాద్రి రాముడికి సమర్పించటానికి బయల్దేరితే, చాప రాళ్ళ పల్లి, మొలకలపల్లి మధ్యలో భక్తులు ఒళ్లుమరచి భజనలు చేస్తుంటే మృదంగ ధ్వనులు మిన్ను ముట్టాయి. రామ ప్రభువు దాసు గారికి సాక్షాత్కరించగా ఆయన స్తుతి తో సాయంకాలం దాటింది క్షుత్పిపాసలు మరచిపోయి భక్త యాత్రికులు పరమానందం పొందారు. మర్నాడు ఉదయం భద్రాద్రి చేరి సంరంభంగా శ్రీరామకోటి సమర్పించి కృతార్థులయ్యారు.

### ఇతర సత్ర యాగాలు

సికందరాబాద్ సప్తాహం లో గుండా మహారాజు దగ్గర శ్రీ పాండురంగ మంత్రోప దేశం పొంది, ఆప్రభావం తో లింగ గూడ,గొనవీడు లలో సప్తాహాలు చేసి ధన్యులయ్యారు దాసు. గొనవీడు సత్ర సమయం లో యాత్రికులకు దాసు గారు ఒక్కొక్క లడ్డు మాత్రమె వడ్డించే ఏర్పాటు చేశారు. మారు అడిగితె ఎవరూ మాట్లాడటం లేదు ఇంతలో ఒక తేజో మూర్తి వచ్చి దాసుగారితో "లడ్డూలు చాలవని అను కొంటున్నావా ?దైవానుగ్రహం తో కావలసినన్ని వస్తాయి. అడిగినవారందరికీ ఎన్నికావాలంటే అన్ని వడ్డించమని చెప్పు "అని చెప్పి అంతర్హితుడయ్యాడు. ఇది శ్రీరామ మహిమాప్రభావమే. ఎన్ని లడ్డూలు వేసినా రాసి తరగటం లేదట. గొప్ప వింతగా చెప్పుకొన్నారు.

### దాసుగారి ఇతర సేవాకార్యాలు

లింగ గూడసత్రం లో మగవాళ్లు వెంక బడగా ముందు వచ్చిన ఆడవారు ఆకలికి ఆగలేక భోజనాలు చేస్తుంటే, కమ్మగా వంటవారు వండి వడ్డిస్తుంటే ఒక లావు పాటి ఆయన వచ్చి ఆకలి అని గోల చేస్తే దాసుగారు ప్రత్యేకంగా కూర్చోపెట్టి వడ్డింప జేయగా, అతుడు భోజనం చేస్తూ –"పరులు నిందించు పట్ల గోపంబు గొనక –శాంతమును బూని వినయపుష్కలత నూని –విహిత సంభాష ణంబుల వెలువరించి –స్వాంతమున వారి సంతస పరపు సతము "అనే పద్యం చాలాసార్లు పాడి గోవింద గోవింద అని భోజనం చేసి అంతర్ధానమయ్యాడు. దాసు గారు ఆయన సాక్షాత్తు భగవంతుడే అని, తనకోపాన్ని తగ్గించుకొన్నారు. జీవితకాలం లో దాసుగారు 20 సప్తాహాలు నిర్వహించి, యాత్రిక సౌకర్యార్థం నాలుగేళ్ళు గోనవీడులో ఒక ఏడాది బూర్గం పహాడ్ అనే బూరగొమ్మలపాడు, కొత్తగూడెం లో నాలుగేళ్ళు, పండరి క్షేత్రం లో తొమ్మిదేళ్ళు అన్న సత్రాలు నిర్వహించారు. చీరాలలో పాండురంగాపురం లో పాండు రంగ ప్రతిష్ట చేసి, దీనికి అనుబంధంగా నిరతాన్న సత్రం నిర్వహించారు.

భక్తి ప్రచార కార్యక్రమం లో గుంటూరు నుంచి బయల్దేరి మధ్యలో మజిలీలు చేసి షోలాపూర్ స్టేషన్ లోమకాము చేయగా, అమావాస్య చీకటి లో, అర్ధరాత్రి ఇద్దరు దొంగలు దాసుగారి రెండుమూటలు ఎత్తుకుపోగా ఇద్దరు యువకులు వారిని అడ్డగించి సొమ్ము వారి నుంచి తీసుకొని పోలీసు డ్రెస్ లో వచ్చి అప్పగించి చోరీ విషయం అందరికీ చెప్పి అదృశ్యమయ్యారు. పండరి చేరి రంగని దర్శించి గుంటూరు చేరారు. చీరాల పాండురంగాపుర పాండురంగ దేవాలయం లో నిష్కామ సౌభాగ్య దురంధర, సమయోద్దండ, కోలాహల మొదలైన బిరుదులున్న శ్రీమదద్దంకి తిరు వేంకటాచార్య దేశికోత్తముల ఆధ్వర్యం లో ప్రతిష్టింప బడిన స్వామికి కైంకర్యం మహా వైభవంగా జరుపుతున్నారు.

## 23 భద్రాద్రి "అన్నపూర్ణ సత్ర" నిర్వాహకుడు -వెంకటరమణ బ్రహ్మచారి

### జనన విశేషాలు

గుంటూరు జిల్లా అలవలపాడు లో ఆరు వేల నియోగుల కుటుంబం లో పుట్టిన వెంకట రమణ బ్రహ్మ చారి తండ్రి సుబ్బ రామయ్య. పొట్టిగా సన్నగా, ఎప్పుడూ ధావళీ గోచీ తో మాత్రమే తిరిగేవాడు. గోదావరి నుండి నీళ్ళు మోసుకొని వచ్చి, తన సత్రానికి అందించే వాడు. ఆసత్రానికి యజమాని వంటవాడు నీళ్ళవాడు, పూజారి సేవకుడూ అన్నీసుబ్బ రామయ్యే. ఆల్ ఇన్ వన్. 15వ ఏట భార్య చనిపోతే కొడుకును తీసుకొని భద్రాచల సీతారామ కల్యాణం చూడటానికి వెళ్లి చూసి ఆనందం పొంది అక్కడే ఉండి పోవాలనుకొని, భిక్షా పాత్ర చేబట్టి వచ్చేదానితో తానూ కొడుకు జీవిస్తూ అతిధి అభ్యాగతులను కూడా ఆదరిస్తూ, కొంతకాలానికి చనిపోయాడు.

### భద్రాద్రి అన్న పూర్ణ సత్రం

అన్న పూర్ణ ఉపాసకుడైన వెంకట రమణ తండ్రి మార్గం లోనే,శునక సూకరాలకూ ఇంతపెడుతూ జీవిస్తూ ధన్యుడయ్యాడు. 21 వ ఏట "అన్న పూర్ణ సత్రం "అనే పేరుతో ఒక కుటీరాన్ని యాత్రికులకు ఒక పాకను నిర్మించి, దేవమందిరంగా మరో గుడిసె వేసి అన్నదానం నిర్విఘ్నంగా సాగిస్తూ క్రమంగా సత్రాన్ని పెద్ద అన్న దాన సత్రంగా మార్పు చెందించాడు. వంటపాత్రలు మొదలైన సామగ్రి కూడా బాగా సమకూర్చాడు. బ్రహ్మ చారి చేతిలో చిల్లి గవ్వ లేదు. ఆ వూరు వదలి ఎక్కడికీ వెళ్ళే వాడు కాదు. సత్రం అరణ్యం దగ్గరలో ఉండటం, ధనవంతులు అక్కడ లేకపోవటం ఇబ్బందే కానీ సత్రం మూడు పూలు ఆరుకాయలుగా దిన దినాభివృద్ధి చెంది అందరికీ ఆశ్చర్యం కలిగించింది. తూము నరసింహదాసు గారు పూజించిన అర్చా మూర్తుల పూజ ను బ్రహ్మ చారి గారు భక్తీ శ్రద్ధలతో అర్చిస్తున్నారు.

### శ్రీరామమహిమ

ఒకసారి సీతారామ కల్యాణానికి అనుకోకుండా వేలాది యాత్రికులు వచ్చి గోదావరీ స్నానం చేసి ఈ సత్రానికి భోజనాలకు వచ్చారు. వండిన పదార్ధాలు చాలా స్వల్పం గానే ఉన్నాయి. అంతమందికి చాలవని భయపడుతూ వంటవాళ్లు భగవరాదనలో ఉన్న బ్రహ్మ చారి గారికి. ఆయన చాలా నిబ్బరంగా వంట శాలకు వెళ్లి "శ్రీరామానుగ్రహం ఉంటే మనకు తరుగు లేదు. ముందు వడ్డన పని మొదలు పెట్టండి "అని చెప్పి, ఆ పదార్ధాలపై ఒక వస్త్రం కప్పి, చేతులు జోడించి నందీశ్వర సాన్నిధ్యం పొంది "భగవానుని గుణగానం చేసి, నరసింహదాసు గారి అర్చా వైభవం ఎవరు పొందారో, నా పూర్వజన్మ సుకృతం తో నాకు నాపూజలో ఆత్మ స్వరూపుడుగా ఉన్నడో,ఆ శ్రీ రామ చంద్ర మూర్తి ఈ అన్నోదకాల చేత భూత సంతృప్తి గావించి అనుగ్రహించుగాక "అని చెప్పి యాత్రికులతో –

"తక్కువ లేదు నాకు నిరతంబు సుదర్శన చక్ర ధారియై –ప్రక్కల నిల్చి లోపముల బారగా దోలుచు, సౌఖ్య సంతతుల్ –మిక్కిలి కూర్చు మించు దయ మేలు లొనర్చెడి రాము డుండ –నాకెక్కడి లేమి లెక్కడివి,ఇష్ట ఫల వ్యతి రేక సంగతుల్ "అని చెప్పి వడ్డన మొదలుపెట్టమని వంటవారికి చెప్పి తన పూజా మందిరం లోకి వెళ్లి స్వామికి మంత్రం పుష్పం చెప్పి పూజ ముగించారు. పంచ భక్ష్య పరవాన్న విందు భోజనాలు తృప్తిగా ఆరగించి బ్రహ్మచారి గారి ప్రభావాన్ని స్తుతిస్తూ సీతారామ దర్శనం చేసి కల్యాణం చూసి, నిత్యం ఈ సత్రం లోనే భోజనం చేసి, బ్రహ్మచారి గారి సత్కారాలుపొంది సంతృప్తిగా స్వగ్రామాలకు వెళ్ళి పోయారు.

### మారు వేషాలలో రామ లక్ష్మణ దర్శనం

ఇంకో సారి ఉత్సవాల రోజుల్లో ఒఅ రోజు పగలు రెండు జాములవరకు వంట పదార్ధాలు లేకపోవటం తో వంటవాళ్లు భయపడి పారి పోయారు, రామపాదాలపై వ్రాలి "ఈ కష్టాన్ని ఎలా తీరుస్తావో నీదే భారం "అంటూ స్తోత్రగానాలు చేసి –"తిరు రేఖ లేర్పడ తిరునామములు బెట్టి –దౌత వస్త్రంబులు దనర గట్టి –తులసి పేరులు మెడ దులకరింపగ దాల్చి-ననెమ్మేన గంధంబు నెరి దగిల్చి -వెడ నుత్తరీయముల్ నడుములకు న్గట్టి-పూల దండలు శిఖ ప్రేలగట్టి –కుడి చేత జపమాల కొమరొప్పగా బూని – ఎడమచే బళ్ళెము లెనగ నంది –గక్ష భాగంబుల బుస్తకముల బూని-నలుపు నెరుపు గల మేను లరచు చుండ –బొడుగు గల వైశ్య లిరువురు వడివడిగ వచ్చి – రా భూసురోత్తమ వసతి కడకు " వారిద్దరూ బ్రహ్మ చారి దగ్గరకు వెళ్లి నమస్కరించి "అయ్యా !ఒకసారి సీతారాములకు మా ఆపద తీరితే రెండు వందల రూపాయలు మొక్కు చెల్లిస్తామని మొక్కుకొని అది తీర్చు కోవటానికి ఇప్పుడు వచ్చాం"అని చెప్పి ఒకపళ్ళెం నిండా ఉన్న ఆడబ్బు రెండు కొబ్బరి కాయలు తాంబూలం కర్పూరం సమర్పించగా బ్రహ్మ చారి గారు పరమానందం తో కొబ్బరికాయలు కొట్టించి హారతిప్పించి, కట్నం చదివించి, వారిద్దరిని అన్నప్రసాదం భోజనం చేసి వెళ్ళమని కోరి వారిది ఏవూరో చెప్పమంటే "మేము తూర్పు దేశ వైశ్యులం కుటుంబం తో సహా వచ్చి గోదారి తీరాన మీ కుటీరం లో ఉన్నాం. మొక్కు తీర్చుకొని స్వామి దర్శనం చేసి వెడతాం. మా వాళ్ళు మా కోసం ఎదురు చూస్తుంటారు "అని చెప్పి అదృశ్యమయ్యారు. ఆ ధనం తో పదార్ధాలు తెప్పించి వంటవాళ్లు లేకపోవటం తో తాననే గరిటకు పని చెప్పుదామని అనుకొంటుంటే –"పవిత్ర గోదావరి స్నానం చేసి నుదుట విభూతి తో పిలక జుట్టు నీర్కావి ధోవతి తడిపొడి బట్టలతో, అన్గోస్త్రాలతో చేతులలో ఉదకపాత్రలతో వేదపనసలు చదువుతూ సత్రం ఎక్కడుంది అని వెతుకుతూ ఇద్దరు వచ్చి "బీదవాళ్ళం వంట చేస్తాం. మీ సత్రం లో వంట పని మాకు ఇవ్వండి. మాపని మీకు ఎప్పుడు ఇష్టం లేకపోతే అప్పుడే వెళ్ళిపోతాం "అని చెప్పి బ్రహ్మ చారి చేతిలో ఉండే రెండు జలపాత్రలనూ చేరోకటి తీసుకొని స్నానానికి గోదావరికి వెళ్ళారు. బ్రహ్మచారి గారు పూజామందిరం లో భగవంతుని లీలకు కృతజ్ఞతలు చెప్పుకోనగా, వారిద్దరూ వచ్చి అద్భుతంగా వంటలు చేయాగా, స్వామికి సహస్రనామార్చన చేసి నైవేద్యం పెట్టి "రంగ!ఆరగింపు "అని వేడగా, ఎక్కడి నుంచో ఒక పాము సర్రున వచ్చి నైవేద్యాన్ని ఆఘ్రాణించి బ్రహ్మచారి గారి తొడపై కెక్కి హాయిగా ఆడింది, భోజనాలు పూర్తయ్యాయి. ఆ ఇద్దరు వంట కుర్రాళ్ళు గోదావరికి వెళ్లి వస్తామని చెప్పి మళ్ళీ రాలేదు. సర్పమూ మాయమైంది.

అంటూ భోజనం చేయకుండానే రామ మంత్రం జపిస్తూ, తెల్లవార్లూ జాగారం చేశారు. మర్నాడు ఉదయం ఈ వార్త తెలుసుకొన్న పురజనులు వచ్చి శ్రీరామ దర్శనం పొందిన ఆయనను అభినందించారు.

### గోదారి నీరే నెయ్యి

మరోసారి ఒక బ్రాహ్మణ సమారాధనకు నెయ్యి లేదు. అభ్యాగతులను భోజనానికి కూర్చోమని చెప్పి, ఇద్దరు వంట వాళ్లకు చెరో సేతిపాత్రలిచ్చి "గోదావరికి వెళ్లి ఈ రెండు పాత్రలనిండా నెయ్యి అప్పుగా ఇవ్వమని చెప్పి నీటిని నింపుకొని రండి "అని పంపారు. వాళ్ళు ఇంటికి వచ్చేలోపు నీరు నెయ్యిగా మారిపోయి ఆశ్చర్యం కలిగించింది. దానితో వడ్డన పూర్తి చేసి అందరికీ సంతృప్తిగా అన్న సమారాధన జరిపించారు.

### గురు- శిష్యులు

ఈ సత్రం లోనూ, మరికొన్ని చోట్లా ఊరు పేరు లేని ఒక పిచ్చి వాడు తిరిగే వాడు. సన్నగా పొడుగ్గా చామనచాయతో చింపిరి బట్టలతోమూట, చిళ్ళ పెంకుల హారం తో ఉండేవాడు. బ్రహ్మ చారిగారు అతడిని అత్యధికంగా ప్రేమించేవారు. ఆయన ఎవరు అని ఎవరైనా అడిగితే "నా గురువు "అనిచేప్పేవారు. అతడిని అడిగితే "బ్రహ్మ చారి నా శిష్యుడు "అనేవాడు అతడికి భోజనం పెడితే కానీ, బ్రహ్మ చారిగారు భోజనం చేసేవారు కాదు. అతడు అన్నం తింటుంటే వెంట రెండు కుక్కలు ఉండి అవికూడా తినేవి. ఇలా నిరతాన్న దానాన్ని పెంకట రమణ బ్రహ్మచారి 40 ఏళ్ళు నిర్విఘ్నంగా నిర్వహించి, ఈ భారమంతా వకీలు తుంగతుర్తి నరసింహారావు గారికి అప్పగించి క్రీ శ.1919 లో శ్రీరామ రంగైక్యం పొందారు.

## 24 మహా భక్త వాగ్గేయకారుడు – ఆలూరి వెంకటాద్రి స్వామి

భారద్వాజస గోత్రికులైన ఆరువేల నియోగులు శ్రీఆలూరి వెంకయ్య, శ్రీమతివెంకమ్మ దంపతులకు ఆలూరి వెంకటాద్రి, ఉత్తర ఫల్గుణి నక్షత్రంలో ఫాల్గుణ పౌర్ణమి పర్వదినాన అక్షయ నామ సంవత్సరం 1806లో కృష్ణా జిల్లా జుజ్జూరు పరగణా ఆలూరు లో జన్మించారు. ఆగ్రామం లో వెలసిన శ్రీ లక్ష్మీ నరసింహ స్వామి పై బాల్యం నుండీ అతి భక్తి ఉండేది. విద్యా గురువు లేకుండానే అనేక స్తోత్రాలు, శాస్త్రాలు ఆబాల వెంకటాద్రికి అబ్బటం తలిదండ్రులను అమితాశ్చర్య చకితుల్ని చేసింది. తనకు సన్మార్గదర్శి దర్శి అయిన గురువు లభించాలని ఉబలాట పడుతున్న సమయం లో తూము నరసింహ దాసు గారి దర్శనం లభించి తారక నామ మంత్రోపదేశం చేసి, హరినామ సంకీర్తన మార్గం లో ప్రవేశ పెట్టారు.



దీన, నిర్భాగ్యులను ఉద్ధరించే సత్సంకల్పమున్న వెంకటాద్రి స్వామి, శాయశక్తుల వారికి సహాయ సహకారాలు అందించేవారు. వైష్ణవ సంప్రదాయం లో ఉన్నారుకనుక పవిత్ర వైష్ణవ క్షేత్ర దర్శనం చేసేవారు. అలా భద్రాచలం వెళ్లి అయిదేళ్ళు నిర్విరామం గా శ్రీహరి నామ సంకీర్తన తో మునిగిపోయారు. స్వామి భక్తి యెంత పటిష్టమైనది అంటే స్వప్నం లోనూ,, సామాన్యంగానూ ఆయనకు శ్రీరామ చంద్రుడు సాక్షాత్కరించి సంభాషించి ఆయన గుణ గరిమను అభినందించేవాడు. రామనామం కోటి దాకా రాసి, కీర్తనలు రచించి తన్మయత్వంతో గానం చేసేవారు వెంకటాద్రి స్వామి. కల్యాణిరాగం లో వెంకటాద్రి స్వామి రచించిన "శరణు శరణు, శరణు శ్రీరామ రామ రామ చంద్ర "కీర్తన లో శ్రీరామ వైభవం కళ్ళ ముందు నిలిపారు. పవిత్ర గోదావరి, పరమ పవిత్ర అపర వైకుంఠంభద్రాద్రి ఆర్తత్రాణ శరణ్యుడు సీతారామ చంద్ర మూర్తి ని వదలి ఎక్కడికీ వెళ్లాలని అని పించేదికాదు స్వామికి.

ధారణ నామ సంవత్సరం 1824లో వెంకటాద్రి స్వామి చైత్ర బహుళ సప్తమి నాడు తిరుమల చేరి, పెరుమాళ్ళ పూలంగి సేవలో అయిదు సంవత్సరాలు ఆనందంగా స్వామి వారి సేవ చేసి,దివ్యనామ సంకీర్తన చేస్తూ ధన్యులయ్యారు. "ఇందిరా రమణ నీ విందు రారా "కీర్తనను సహన రాగం లోరచించి భక్తి పారవశ్యం తో గానం చేశారు. పరమ ప్రీతి చెందిన శ్రీవారు స్వప్నం లో సాక్షాత్కరించి కంచి లో తన సేవ చేసుకోమని ఆదేశించారు.

భగవదాదేశం ప్రకారం వెంకటాద్రి స్వామి కాంచీపురం చేరి వేగవతి నదిలో పుణ్యస్నానం చేసి, పేరుందేవి తాయార్ దర్శనం చేసి "నిను నమ్మి ఉన్నా సీతమ్మ "అని కాపీ రాగం లో కీర్తన రచించి, గానం చేసి అమ్మవారికి అర్పించారు. వెంకటాద్రి స్వామి నిశ్చలభక్తికి మెచ్చిన వరదరాజ స్వామి శ్రీదేవీ భూ దేవీ సహితంగా వెంకటాద్రి స్వామికి దివ్య దర్శనమిచ్చాడు. పరవశం చెందిన వేంకటాద్రి స్వామి ఆనంద నృత్యం చేస్తూ నాట రాగం లో "జయ జలధర శ్యామ " మరియు "దేవ దేవ శౌరే మురారే "కీర్తనలు గానం చేసి తరించి భక్తులను తరింపజేశారు.

పుష్ప కైంకర్యం నుంచి చందనం అలదటం కూడా చేస్తూ స్వామివారికి నిత్యం కాచిన పాలను అందించే ఏర్పాటు కూడా చేశారు వెంకటాద్రిస్వామి. బ్రహ్మ తీర్ధ తటం పై సేన ముదలియార్ సన్నిధిలో ఉంటూ సేవలు అందజేసేవారు. ఆయన ఉన్న ఆ గదిని ఇప్పటికీ వెంకటాద్రి స్వామి గదిగా పిలుస్తారు. ఒక రోజు స్వామి సేవకు పూలతోటలో పుష్పాలు కోయబోతుంటే, ఒకపాము ఆయనకాలిపై కాటు వేసింది. ఏమాత్రం కంగారు పడకుండా నిబ్బరం గా పేరుందేవి సన్నిధికి వెళ్లి కమాస్ రాగం లో "కాపాడరా నన్ను "అని కీర్తన రాసి పాడుతూ, ధ్వజస్తంభ సమీపం లో అపస్మారకంగా పాముకాటు ప్రభావం వలన నేలపై పడిపోయారు. కాసేపటికి తేరుకొని దేవరాజ సన్నిధి చేరి, దర్శనం చేసి తీర్ధ ప్రసాదాలు తీసుకొని దైనందిన కృత్యం లో గానం లో కీర్తనలలో నిమగ్నమయ్యారు.

భిక్షాటనం లో జీవిస్తున్నా, మహాదైశ్వర్య వంతులు,మహారాజులు కూడాఇవ్వలేనంత భూరి సంపాదన ను వరదరాజ స్వామి సేవకు అందజేసేవారు వెంకటాద్రి స్వామి. తన శక్తి సామర్ధ్యాల గురించి ఆలోచించకుండా భగవంతుని అపార కరుణా దృష్టిపైనే నమ్మకం తో మహాద్భుతకార్యాలు సాధించి కీర్తిపొందారు స్వామి. భగవంతుని కింకరుడిగా తాను చేస్తున్నాను అనే వినయం ఆయనది. అందులో తన గొప్ప దనం ఏమీ లేదు. తాను నిమిత్తమాత్రుడనే అను కొనేవారు. భక్తులు దాతలు అందజేసిన విరాళాలను జాగ్రత్త చేసి స్వామి కైంకర్యాలకు అనువుగా ఖర్చు చేసేవారు.ఎక్కడా ఎప్పుడూ ఏ లోటు రానీయలేదు.

దివ్య దేశమైన కంచి లో జీర్ణోద్ధరణ కార్యక్రమాలు నిర్వహించారు వెంకటాద్రి స్వామి. అందులో ముఖ్యమైనది విలక్కొలి పెరుమాళ్ సన్నిధి మండపం, గోపుర నిర్మాణం. వేదవిద్యా వాప్తికోసం బాలురకు వేదాభ్యాసం కోసం ధార్మిక సంస్థను నెలకొల్పారు స్వామి. భక్తుల కానుకలనతో భూమికొని, ఆ స్వామి భూములపై వచ్చే ఆదాయం తో వేద విద్య నేర్పించారు. దూసి మామందూర్ లో ఆరోజుల్లో అత్యధిక ధరగా భావించే 5వేలరూపాయలతో పొలం కొని తాను ఏర్పాటు చేసిన ఎండోమెంట్ కు అందజేశారు.

భక్తులు వెంకటాద్రి ని ఆయన తిరునామాలు, కుడి చేతిలో తంబురా,ఎడమ చేతిలో తాళాలు, పారవశ్యం తో కీర్తనలు గానం చేస్తుంటే స్రవించే ఆనంద పరవశంగా వచ్చే ఆనంద బాష్పాలు చూసి " శ్రీ వెంకటాద్రి స్వామి" అని భక్తితో పిలవటం ప్రారంభించారు. ఒకసారి వరదరాజస్వామి వెంకటాద్రి కలలో కన్పించి, తనకు వజ్ర కిరీటం చేయించి అమర్చమని ఆదేశించాడు. దీనికి చాలా డబ్బు ఖర్చు అవుతుదికనుక భూరి విరాళాలు సమర్పించే దాతలకోసం 1835 మన్మధ నామ సంవత్సర వైశాఖ శుద్ధనవమి నాడు మద్రాస్ వెళ్ళారు స్వామి. కైరవానిలో స్నానించి, శ్రీ పార్ధ సారధి స్వామిని దర్శించి కామాస్ రాగం లో "పార్ధసారధి పదభజన చేయవే మనసా "కీర్తన కూర్చి ఆర్తిగా పాడారు.ఈ ఆలయ అర్చకుడు శ్రీ ఘోల సింహపురం శేషా చార్య కు అతిధిగా ఉన్నారు. స్వామి వ్యక్తిత్వం అక్కడి వారు బాగా గ్రహించి వరదరాజ స్వామి వజ్ర కిరీటం కోసం విరాళాలు కురిపించారు. అర్చకస్వామి స్వయంగా 500 రూపాయలు సమర్పించగా, కంచికి చెందిన వెంకట రంగం పిళ్ళై సుమారు పది తులాల స్వచ్చ బంగారం అందించాడు. అనుకున్న దానికంటే తక్కువ సమయం లోనే ధనం సమకూరటం వలన వెంకటాద్రి స్వామి పేరు ప్రఖ్యాతులు మద్రాస్ లో విశేష వ్యాప్తి చెందాయి.

వజ్ర కిరీటం తయారవగానే మద్రాస్ పురవీధులలో,సెవెన్ హిల్స్ ప్రాంతం లో ఊరేగించి, కంచికి చేరి, తెల్లగొడుగు, ధ్వజం మేళతాళాలతో వేలాది పురజనులతో ఊరేగింపు జరిపి కనువిందు చేకూర్చారు. 1858 కాళయుక్తి నామ సంవత్సర వైశాఖ పౌర్ణమి నాడు గరుడసేవ రోజున శ్రీ కంచి వరద రాజ స్వామికి వజ్రకిరీటాన్ని సకల లాంచనాలతో అమర్చారు. ఆ సమయం లో వెంకటాద్రి స్వామి ఆనంద నృత్యం చేస్తూ, కమాస్ రాగం లో "నిగమ గోచరా స్వామీ " మధ్యమావతి రాగం లో "పక్షి వాహనా స్వామీ "కీర్తనలు రాసి సుమధురంగా గానం చేసి ధన్యత చెందారు.ఈనాటికీ ఆ వజ్రకిరీటాన్ని వెంకటాద్రి స్వామి సమర్పితం గా భక్తులు చెప్పుకొంటారు. ఆ రోజు రాత్రి స్వామి స్వప్నం లో శ్రీ దేవి, భూదేవి కనిపించి తమకూ అలాంటి కిరీటాలే చేయించి పెట్టమని కోరారు. అచిరకాలం లోనే వారి కోరిక తీర్చారు వెంకటాద్రి స్వామి. వరదరాజ, శ్రీ దేవి భూదేవులు నగర వీధులలో ఊరేగింపు గా వజ్రకిరీటాలతో జగజ్జేగీయమానంగా ఊరేగుతుంటే జనాలకు చూడటానికి రెండు కళ్ళు చాలలేదు. ఆశోభకు కారణం వెంకటాద్రి స్వామియే.

ఇంతటి అంకిత భావం తో పెరుమాళ్ళ సేవ చేస్తున్న వెంకటాద్రి స్వామి సేవలకు తగిన ప్రతిఫలం ఇవ్వాలని శ్రీ దేవరాజ స్వామి భావించి, అర్చకత్వ విధానం సాంప్రదాయ బద్ధం గా నిర్వహించటానికి ఆచార్య అంగీకారుని గా చేయాలని భావించాడు. వరదరాజ స్వామి వెంకటాద్రి స్వామి స్వప్నం లో దర్శనం అనుగ్రహించి, వైష్ణవ సంప్రదాయ బద్ధమైన పంచ సంస్కారాలు పొందమని ఆదేశించాడు. స్వామి ఆజ్ఞా పాలనా నిమిత్తం కంచిలోని మనవాళ్ళ జీయర్ స్వామి ని దర్శించి సమాశ్రయనం అంటే పంచ సంస్కారాలు పొందారు. శ్రీ వెంకటాద్రి స్వామి.

కంచి వరద రాజ స్వామి సేవలో నిండా మునిగి ఉన్న సమయం లో, శ్రీరంగం లోని శ్రీ రంగ నాథ స్వామి తనకు వెంకటాద్రి స్వామి సేవలు కావాలని అభిలషించాడు. ఒక రోజు స్వామికలలో కనిపించి తనకున్న అత్యంత విలువైన వజ్రకిరీటం దెబ్బతిన్నదని దాని స్థానం లో కొత్త కిరీటం తయారు చేయించే బాధ్యత వెంకటాద్రి స్వామి ఈ తీసుకోవాలని ఆదేశించాడు. ఆ కిరీటం కొలతలేమితో మన స్వామికి తెలియదు. ఏమి చెయ్యటానికీ పాలుపోక వరదరాజస్వామి పైనే భారం వేసి, ఒక నమూనా కిరీటం తయారు చేయించి శ్రీరంగం తీసుకు వెళ్ళారు. తిరుక్కావేరిలో పవిత్ర స్నానం చేసి శ్రీరంగని దర్శించటానికి ఆలయానికి వెళ్ళారు. ఆలయం లో కోవిలన్నన్, భట్టార స్వామి మొదలైన ప్రముఖులు ఘన స్వాగతం ఇచ్చి స్వామి సన్నిధికి తీసుకు వెళ్ళారు. ఆలయం లో రంగనిపైనా, అమ్మవారి పైనాపున్నాగ వరాళి రాగం లో "నిన్ను కోరియున్నా " కీర్తన రాసి పరవశంతో గానం చేసి, తను తెచ్చిన మోడల్ వజ్రకిరీటాన్ని శ్రీరంగనికి

సమర్పించారు. ఆశ్చర్యంగా ఆయనకు సరిగ్గా చక్కగా సరిపోయి అందరికీ అద్భుతమని పించి వెంకటాద్రి స్వామి దైవభక్తికి ముగ్ధులయ్యారు. ఈ సంఘటనతో వెంకటాద్రి స్వామి కీర్తి శ్రీరంగం తో సహా అన్ని ప్రాంతాలలో మిన్నంటింది.

పాండ్య కిరీటం తయారీకి పూనుకున్న వెంకటాద్రి స్వామి దానికి కావలసిన ధనం కోసం ప్రయత్నిస్తూ, రోజుకు కనీసం పది రూపాయల విరాళమైనా రాకపోతే నిరాహార దీక్ష చేస్తానని నిర్ణయం ప్రకటించారు. విరాళాలు రాని రోజున డేర్ హౌస్ వెంకటస్వామి నాయుడు, పుదుచ్చేరి అప్పాస్వామి నాయుడు తామే పది రూపాయలు సమర్పిస్తూ స్వామి కి నిరాహార దీక్ష శ్రమ కలగకుండా చేశారు. విరాళాల వెల్లువ సాగగానే, పాండ్య కిరీట నిర్మాణ పనులు మొదలు పెట్టారు స్వామి. ఈ కిరీటానికి అమర్చటానికి సరిపడే మరకతం అనే పచ్చ రాయి కావాల్సి వచ్చి, ఎక్కడ దొరుకుందా అని నిర్వేదం లో పడిపోయారు వెంకటాద్రి స్వామి. ఒక రోజు రాత్రి స్వప్నం లో స్వామి దర్శనమిచ్చి పాండ్యకిరీటానికి సరిపోయే ఎమరాల్డ్ కలకత్తా లో మాధవ సేట్ వద్ద ఉన్న ఇనుప బీరువాలో ఉత్తర మూల ఉన్నది అని తెలియ జేశారు. వెంకటాద్రిస్వామి భక్తుడు సహాయకుడు కాశీదాస సావుకార్ కలకత్తాలోని మాధవ సేట్ కు ఉత్తరం ద్వారా విషయం తెలియ జేశాడు. ఉత్తరం చదివిన మాధవ సేట్,,తన బీరువాలో వెదికితే ఉత్తరం లో సూచించిన చోటులోనే పచ్చ కనపడగా మహదాశ్చ పడి తన తండ్రి తనకు తన కుటుంబ సభ్యులకూ ఎవరికీ తెలియకుండా దాన్ని అలా దాచి ఉంచటం భగవల్లీల అని భావించాడు. వెంటనే ఆమరకతాన్ని, దానితో పాటు తన విరాళం గా వెయ్యి రూపాయలను మద్రాస్ పంపాడు.

కిరీటం తయారు చేస్తున్న కంసాలి దురాశతో విలువైన ఆ మరకతం దాచేసుకొని సామాన్య రాయి అమర్చి తయారు చేశాడు. వెంకటాద్రి స్వామికలలో శ్రీరంగడు ప్రత్యక్షమై జరిగిన తప్పు చెప్పాడు. శిష్య బృందంతో ఆ కంసాలి ఇంటికి వెళ్లి గదమాయిస్తే ముందు అంతా అబద్ధం అని బూకరించి, వెంకటాద్రిస్వామి శిష్యుడు అప్పా స్వామిరాజు వాడిని వీర బాదుడు బాదితే, తప్పయిపోయిందని లెంపలేసుకొని క్షమాపణ కోరి ఆ అసలు పచ్చ రాయిని అప్పగించాడు. నకిలీ రాయిని తీసేసి అసలు మరకతాన్ని అందులో బిగింప జేసి, శ్రీ రంగానికి శిష్యులతో సహా తీసుకు వెళ్ళారు. 1863 రుధిరోద్గారి సంవత్సర మార్గశిర శుద్ధ ఏకాదశి అంటే పరమ పథ ఏకాదశి అనగా ముక్కోటి ఏకాదశినాడు రంగరంగ వైభవంగా శ్రీరంగానాథునికి పాండ్య కిరీటం అమర్చారు.

చేయించే భక్తులు తేరగా దొరికితే రంగడికి కొదవేముంది. మళ్ళీ వెంకటాద్రి స్వామి కలలో కనిపించి మకరకుండలాలు చేయించమని ఆజ్ఞ జారీచేస్తే చెన్నై నగర వాసుల విరాళాలతో అలాగే చేయించి స్వామికి 1867 ప్రభవ సంవత్సర నవమి నాడు సమర్పించారు. అయిదు శిఖరాలతో బంగారు విమానాన్ని నెల్లూరు శ్రీ రంగ నాద స్వామి పునరుద్ధరణ పనులలో చేయించి అర్పించారు శ్రీ వెంకటాద్రి స్వామి. అలాగే తిరుక్కూడాల్ మల్లై స్థలశయన పెరుమాళ్,తిరు విదా విందై తాయార్, ఆండాళ్ దేవాలయాల జీర్ణోద్ధారణ కూడా దగ్గరుండి జరిపించారు వెంకటాద్రి స్వామి.

వృద్ధాప్యం మీద పడుతుంటే శ్రీరంగంలోనే ఉండి, శ్రీరంగనాధ స్వామి సేవలో అందునా, స్వయంగా తానే సానమీద గంధం నూరి చందనాలంకారం చేసేవారు. అతిరస, వడ సురులమూడు, పాలమూడు ప్రసాదాలు తానే వండి స్వామికి నైవేద్యం పెట్టేవారు వెంకటాద్రి నిత్యమూ. శ్రీరంగ నాచియార్ కు అరవన ప్రసాదం చేసి నిత్య నైవేద్యం పెట్టె ఏర్పాటు కూడా వెంకటాద్రి స్వామియే చేశారు. ఈ సేవలన్నీ నిరాటంకంగా జరగటానికి స్వామికి 25.35ఎకరాల మాగాణి, రెండు మనాల మెట్ట భూమి 5,050 రూపాయలకుతిరుప్పరై తురి గ్రామం లో కొన్నారు వెంకటాద్రి. ఆలయ ధ్వజస్తంభం పై ఈ వివరాలన్నీ చెక్కించారు. రంగ నాచియార్ కు కిరీటం చేయిస్తుండగా గోవర్ధనం రంగాచారి అనే మహాత్ముడు వచ్చి అమ్మవారిని దర్శించగా అక్కడి అధికారులు అర్చకులు అందరూ ఆయనను అమ్మవారి కిరీటం తయారీలో సాయం చేయమని కోరగా, సరే అని చెప్పి కొన్ని నెలలలోనే తయారు చేయించి పంపించి వెంకటాద్రిగారి కోరిక తీర్చారు. మధుర దగ్గర తిరుమలిం చోరి సోమ చంద్ర విమానం పనులు, పాండ్య నాడు దివ్య దేశం పనులు కూడా చేశారు వెంకటాద్రి స్వామి.

72 వ ఏట 1864 రక్తాక్షి సంవత్సరం లో వెంకటాద్రి స్వామి సన్యాసం స్వీకరించారు. త్రిదండం,కాషాయ వస్త్రాలు ధరించి "తిరు వెంకట రామానుజ జియ్యర్ "అయ్యారు.. స్వామి సేవ తప్ప ఇతర వ్యాపకాలు లేకుండా జీవితాన్ని ధన్యం చేసుకొన్నారు వెంకటాద్రి స్వామి. ఈయన ప్రేమ ఆదరణ పొందిన మహా మహులలో 1866-1872 లోస్వామి గొప్పతనాన్ని తెలుసుకొని సందర్శించిన మద్రాస్ గవర్నర్ లార్డ్ ఫ్రాన్సిస్ నేపియర్స్ ఉన్నాడు. గొప్ప వారు వచ్చినా ఆయన ఏమాత్రమూ తన సేవ తపస్సు ధ్యానం నుంచి బయటికి వచ్చేవారు కాదు. జీవిత చరమాంకం లో శ్రీరంగం లో శ్రీరంగని సేవలో పూర్తిగా గడిపారు వెంకటాద్రి జియ్యర్ స్వామి. ఇహ జీవితం చాలించాలనే ఇచ్చ గాఢ మవగా రంగడు కలలో కనిపించి, ఆయన సాయుజ్యానికి సమయం వగైరాలన్నీ చెప్పి అందరికీ తెలియ జేయించాడు.

1877 ధాతు నామ సంవత్సర సప్తమి సోమవారం అర్ధ రాత్రి అష్టాక్షర మంత్రం జపిస్తూండగా, దివ్య జ్యోతి వెంకటాద్రి స్వామి వారి శిరస్సును చీల్చుకొని వెలువడి పరమాత్మలో కలిసిపోయింది. శ్రీరంగం దేవాలయం మహాత్మా వెంకటాద్రి స్వామివారి పార్థివ దేహానికి విధి విధానంగా అంత్యక్రియలు నిర్వహించింది. ఈనాటికీ ఉత్సవాల సందర్భం లో రంగ నాయక దంపతులకు వెంకటాద్రి స్వామి తయారు చేయించిన కిరీటాలు అలంకరించి ఊరేగింపు జరుపుతారు. స్వామివారి ప్రసాద తీర్థాలను వెంకటాద్రి స్వామి వారి బృందావనానికి ఊరేగింపుగా తీసుకొని వెళ్లి సమర్పించి మళ్ళీ ఆలయానికి చేరుస్తారు. కావేరీ నదీ తీరం లో అలవందార్ పడిత్తు రాయి లో వేంకటాద్రి స్వామి వారి స్మారక విగ్రహం ఏర్పాటు చేశారు. 1977 లో శతజయంతి ఉత్సవాలు ఘనం గా జరిపారు. నలనామ సంవత్సర మాఘ మాసం 28వ రోజు 11-3-77 వెంకటాద్రి స్వామి దివ్య తిది నిర్వహించారు. 2006 నుంచి మద్రాస్, లోకూడా ఆరాధన ఉత్సవాలు వైభవంగా నిర్వహిస్తున్నారు. ఆంధ్ర దేశం లో అందునా ఉత్తర కృష్ణాజిల్లా జుజ్జూరు దగ్గర అల్లూరు లో జన్మించిన ఆలూరి వెంకటాద్రి శ్రీ వెంకటాద్రి జియ్యంగార్ గా కీర్తిశిఖరాలు అందించి నిత్యం భవత్ దర్శనం తో తరించి స్వామి అడిగినవన్నీ తయారు చేయించి కట్టు దిట్టమైన పూజ కైంకర్యవ్యవస్థ ఏర్పాట్లు చేసి న దివ్య పురుషులు



## 25 ప్రతాప కోటయ్య శాస్త్రి

గుంటూరు జిల్లా బాపట్లతాలూకా నాగండ్ల లో ప్రతాప కోటయ్య శాస్త్రి పుట్టాడు. తండ్రి జోగయ్య శాస్త్రి. బాల్యం నుండి వైరాగ్య భావనతోనే ఉండేవాడు.వీధి బడిలో కొంతకాలం చదివినా చదువేమీ అబ్బలేదు. ఉపనయనం అయింది వేదం చదివాడో లేదో కూడా తెలీదు. దేనిపైనా ఆపేక్షా భావం లేదు. వినయ, సమత్వం మాత్రం అబ్బాయి. వ్యవసాయం మీదనే కుటుంబం గడుపుతోంది. పొలం పనులకు వెళ్ళినా పండించాలన్న ఆలోచన, ఉత్సాహం పంటను చూసి ఆనందం ఏమీ ఉండేవి కావు. మెట్టపంటలే కనుక పండిన మొక్కజొన్న, జొన్న లను దారిన పోయే వారిని పిలిచి ఇచ్చేవాడు. పంటను పశువులు మేసినా పక్షులు వాలి తినేసినా పట్టేది కాదు. తమ పొలం వలన జీవ రాశులు బతుకుతున్నాయని సంతోష పడేవాడు. తల్లిదండ్రులు కోపించినా ఉదార బుద్ధి మారలేదు.

కొటయ్యకు ఇరవై ఏళ్ళు వచ్చాయి. గొల్లపూడికి చెందిన కూరపాటి వెంకట్రాయుడు కూతురు మహాలక్ష్మమ్మ నిచ్చి పెళ్లి చేశాడు. కోడలు కాపురానికి వచ్చే సమయం రాగానే కొడుకుతో తండ్రి నోమరిగా ఉంటె సంసారం గడవదు కనుక ఎక్కడికైనా వెళ్లి డబ్బు సంపాదించుకొని రమ్మని చెప్పి కోటయ్య ను పంపాడు. డబ్బు సంపాదనకోసం ఆ రోజుల్లో అందరూ నైజాం పోవటం అలవాటు కనుక కోటయ్య కూడా నైజాం వెళ్ళాడు. సికందరాబాద్ సత్రం లో ఒక రాత్రి గడిపి, మర్నాడు వీధుల్లో తిరుగుతుంటే, గుర్రం నారాయణ అనే ధనవంతుడికి తీవ్రంగా జబ్బు చేసి, ఎంతమంది డాక్టర్లు వచ్చి చూసి మందులు ఇచ్చినా తగ్గలేదు. అతనికుటుంబం ఆశ వదిలేసుకొన్నది. ఆ ఇంటి దగ్గర వచ్చే పోయే జనం తో మహా సందడిగా ఉంది. అందరితోపాటు కొటయ్యకూడా లోపలి వెళ్లి చూశాడు. కోటయ్య గొప్ప వైద్యుడనుకొని రోగి బంధువు ఈయన్ను మందు ఇవ్వమని కోరాడు. వైద్యం లో తనకు ఏమాత్రం ప్రవేశం లేదని నెత్తీ నోరూ మొత్తుకున్నా వినలేదు. తప్పని సరి పరిస్థితులలో దేవుడిపై భారం వేసి కోటయ్య శాస్త్రి, తన దగ్గరున్న అక్షతల కుప్పె ను నీటిలో ఆరగ దీసి అదే సంజీవ తీర్థం గా పని చేయాలని భగవంతుని ప్రార్ధించి రోగి నోటిలో పోశాడు. అక్కడే మూడు రోజులుండి తీర్ధమిచ్చాడు. నారాయణ కు స్వస్థత కలిగి ఆయనకు ఆయన బంధు మిత్రులకు కోటయ్య పై అమితమైన భక్తీ శ్రద్ధ కలిగాయి. నారాయణ గారి జబ్బు పూర్తిగా తగ్గాక వైద్య నారాయణ కోటయ్య శాస్త్రిని సత్కరించాలనుకొని ఆయనకు ఏం కావాలో కోరుకో మన్నాడు. ఏ రకమైన ధనా పేక్షా లేని శాస్త్రి తనను కాశీ కి పంపమని కోరాడు.

కోటయ్య అల్ప సంతోషానికి ఆశ్చర్యపడి నారాయణ అలాగే కాశీకి పంపి,కొంత డబ్బును కోటయ్య తండ్రికి పంపాడు, కాశీ చేరి పరమపావని గంగానదిలోని మణికర్ణిక ఘాట్ లో పుణ్య స్నానం చేసి, విశ్వేశ్వర సందర్శనం తో పులకించి నిత్యం అర్చిస్తూ, తనకు ఈభాగ్యం కల్పించిన తండ్రికి గుర్రం నారాయణకు కృతజ్ఞతలు చెబుతూ అన్నపూర్ణ సత్రానికి చేరాడు. అక్కడే ఉంటూ నిత్య గంగాస్నానం విశ్వేశ్వర దర్శనం తో కొన్ని నెలలు గడిపాడు.

ఒక రోజు శ్రీ బాల సరస్వతి స్వామి కోటయ్య శాస్త్రి యోగ్యతను గుర్తించి "నాయనా !నువ్వు దేవి అనుగ్రహానికి పాత్రుడవయ్యావు "అని చెప్పి, తన ఆశ్రమానికి తీసుకు వెళ్లి శ్రీ త్రిపుర సుందరి మహామంత్రం ఉపదేశించి అంగన్యాస కరన్యాసాలతో అభ్యాసం చేయించాడు. సద్గురు కటాక్షం వలన కోటయ్య కు మంత్రం సిద్ధి యోగ సిద్ధి కలిగాయి. పూర్వం కంటే అతి విరాగియై భక్తీ పెరిగి కొన్నేళ్ళ తర్వాత స్వగ్రామం రావటానికి ప్రయత్నం చేశాడు. కోటయ్య ఏమయ్యాడో అని తలిదండ్రులు అత్తమామలు అన్వేషణ సాగించారు. కోతకాలం తర్వాత కోటయ్య శాస్త్రి తండ్రి కోరినట్లు ధనంతో కాకుండా భక్తిజ్ఞాన ధన సంపన్నుడై ఇంటికి వచ్చి అందరికే పరమానందం కలిగించాడు. మామగారు తన ఇంటికి తీసుకు వెళ్ళాడు. ప్రపంచానికి పనికి వస్తాడు అని అతని శీల సౌశీల్యాదులను మెచ్చినా అసంతృప్తి తో ఉన్నాడు.

భార్య కాపరానికి వచ్చినా కోటయ్య తామరాకు పై నీటి బొట్టు గానే ఉన్నాడు. అత్యంత నిష్టా గరిష్టుడైనాడు. వైరాగ్యం పెరిగిపోయింది. మొదటి కొడుకు పుట్టాడు.జన్మ నక్షత్రం మంచిది కాకపోవటం చేత శాంతి చేయాల్సి వచ్చింది. చేతిలో చిల్లిగవ్వ లేదు అధైర్యపడకుండా కాకుమానుకు చెందిన మాజేటి శేషయ్య అనే వర్తకు డి దగ్గరకు వెళ్లి నలభై రూపాయలు అప్పుగా ఇమ్మన్నాడు. తిరిగి తీర్చే స్తోమత అతడికి లేదని తెలిసి డబ్బు ఇవ్వలేదు. ఏమీ మాట్లాడకుండా గొల్లపూడి వెళ్ళాడు. శేషయ్య యధాప్రకారం ఆ సాయంత్రం శివాలయం కి వెళ్లి ఈశ్వర దర్శనం చేసి గుడి ముందు కాసేపు కూర్చున్నాడు. లోకోత్తర సౌందర్యవతి అయిన ఒక యువతి కనిపించి "నా భక్తుడికి నలభై రూపాయలు అప్పు ఇవ్వనన్నావా ?"అని అదృశ్యమైంది. ఆమె శాస్త్రిగారు ఉపాసించే లలితా

పరమేశ్వరి అమ్మవారు అని గ్రహించి శేషయ్య, మర్నాడు ఉదయం కోటయ్య ఇంటికి వెళ్లి "శాంతికోసం యెంతకావాలి శాస్త్రి గారూ ??'అని అడిగితే ఆ విషయాలేమీ తెలీని శాస్త్రి యాభై మందికి సరిపడా సామగ్రి కావాలి "అని చెప్పగా ఆ సామగ్రిని శాంతి నాటికే గొల్లపూడికి చేర్పిస్తానని షావుకారు కోటయ్యకు చెప్పి వెళ్ళాడు.

అసలే ఉదా సీనంగా ఉండే కోటయ్య, శేషయ్య పంపిస్తాడనే నమ్మకం కూడా ఉండటం తో ఏ ప్రయత్నమూ చెయ్యలేదు. శేషయ్య తానిచ్చిన వాగ్దానం మరచికోట్టు పనులతొందరలో బాపట్ల వెళ్ళాడు. అందరూ మర్చిపోయినా అమ్మవారు మాత్రం మర్చిపోకుండా శేషయ్యకు గుర్తు చేసి"వెంటనే వెళ్లి నీ వాగ్దానం తీర్చు "అని ఆజ్ఞాపించింది. తనకేసు వాయిదా కోరమని ప్లీడరుకు చెప్పి ఆఘమేఘాలమీద ఇంటికి వెళ్లి ఆరాత్రే ధాన్యం దంపించి, కావలసిన సామానుతో తానే బండీ లో సర్ది తెల్లవారే లోపు గొల్లపూడి బయల్దేరాడు. కోటయ్యగారు బ్రాహ్మణులను పిలవటానికి ఊళ్లోకి వెళ్ళాడు. ఇంతతంతు జరిపించే స్తోమత లేని కోటయ్య భార్యా వగైరా కాలూ చేయీ ఆడక అటూ ఇటూ ఇటూ తిరుగుంటే శేషయ్య బండీ సామానుతో దిగాడు. హమ్మయ్య అనుకోని ఊపిరి పీల్చుకున్నారు అందరూ. ఊరంతా తిరిగి కోటయ్య ఆలస్యంగా కొంపకు చేరాడు. శాంతి మాత్రం పూర్తయింది. బ్రాహ్మణ భోజనాలు జరగాలి. రెండు వందలమంది బ్రాహ్మణులు వచ్చారు. వంట మాత్రం యాభై మందికే చేయించారు. కోటయ్య గారి ఇల్లు నిప్పచ్చరంగా ఉండటం చూసి శేషయ్య "ఎక్కడికైనా వెళ్లి బియ్యం తెమ్మంటారా ?"అని కోటయ్య ను అడిగితే ఒక నవ్వు నవ్వి "భయం లేదు అందరికీ సరిపోతుంది "అని చెప్పి లోపలి వెళ్ళాడు. బ్రాహ్మణులు వరుసగా భోజనాలకు కూర్చున్నారు.వండిన పదార్ధాలు చాలవేమో అభాసు పాలౌతామేమో అని అనుమానిస్తూ విస్తళ్ళు వేయలేదు కోటయ్య శాస్త్రి అన్నం రాశిని ఒక సారి చూసి, తలూపి తనకు శాంతి పీటలపై అత్తవారు పెట్టిన కొత్త వస్త్రాన్ని నేతిగిన్నెలో ముంచి అగ్ని హోత్రం లో వేశాడు. హవ్యవాహనుడు సంతృప్తి చెందాడని కోటయ్యగారు సంతోషించారు. ఈ వెర్రి బాపని చూసి అందరూ నవ్వు కొన్నారు. కోటయ్య ఇదేమీ పట్టించుకోకుండా అమ్మవారికి అన్నపు రాశి నైవేద్యం పెట్టి మంత్రపుష్పం చెప్పి "వడ్డన మొదలు పెట్టండి "అని ఆనతిచ్చి తాను అన్నం రాశి దగ్గరే నిలబడి పళ్ళాలనిండా అన్నం తోడి వడ్డించే వారికి అందించారు. యాభై మందికి మాత్రమె చేసిన పదార్ధాలు అందరికీ సంతృప్తిగా వడ్డించినా ఇంకా చాలా మిగిలిపోయి అందర్నీ ఆశ్చర్య చకితుల్ని చేసింది. కోటయ్య శాస్త్రిగారి భక్తీ మహాత్మ్యం అమ్మవారికి ఆయనపై ఉన్న అనుగ్రహం అందరూ ప్రత్యక్షం గా చూసి అప్పటి నుంచి ఆయన్ను ఆరాధనా భావంగా చూశారు. శేషయ్య కూడా సంతోషించి తన ఊరు వెళ్ళాడు.

ఇంతటి నిర్లిప్తంగా ఉన్నా, ద్వాదశి వ్రతం చేస్తూ ప్రతినెలా ద్వాదశినాడు బ్రాహ్మణ సమారాధన చేసేవారు. తనకు నచ్చిన గృహస్తు నడిగి సంబారాలు తెచ్చి చేసేవాడు. ఈయన ముఖం చూసి లోభి కూడా ఉదారంగా సాయం చేసేవాడు. విద్య లేదు శాస్త్రజ్ఞానం లేదు డబ్బు లేదు వేష భాషలు ఆడంబరం ఏవీ లేకపోయినా కోటయ్యను మహానుభావుడుగా భావించి ఆదరించేవారు ఊరిజనం. కొంతకాలానికి మన్నవ గ్రామ చేరారు అక్కడ బ్రాహ్మణ కుటుంబాలు ఎక్కువ. అందరూ వేదాధ్యయన సంపన్నులు కర్మిష్టులే, అతిథి అభ్యాగత సేవా తత్పరులే. కోటయ్య శాస్త్రిగారిని ఆఊరి బ్రాహ్మణ్యం అత్యంత గౌరవాదరాలతో ఆహ్వానించి ఘనంగా సత్కరించారు.తాను నివసించటానికి ఇదే తగిన ఊరు అని నిశ్చయించి అక్కడే ఉండిపోవాలనుకొన్నారు. నిత్యం ఎవరో ఒక గృహస్తు పిలిచి భోజనం పెట్టి ఆతిధ్యమిచ్చేవాడు.

కొన్ని నెలలు మన్నవ గ్రామం లో ఉండి, ఒక రోజు సప్తాహం చేయాలనే సంకల్పం కలుగగా బ్రాహ్మణ్యానికి తెలిసి. ధాన్యరూపంగా చందాలు వేసుకొని కొంత ధాన్యం పోగేశారు. పూర్తిగా ధాన్యం సమకూరే దాకా ఉండలేకకోటయ్య శాస్త్రిగారు సప్తాహం మొదటి రోజు నుంచే అన్న సమారాధన ప్రారంభించారు. సప్తాహం పేరుతో దీర్ఘ అన్నసత్రం జరిగింది. శాస్త్రి గారి మహత్తు గ్రహించి ఆయన భార్యాపిల్లల్నీ పిలిపించి మంచి ఇల్లు ఏర్పాటు చేసి కావలసిన జీవనం కల్పించారు. కుటుంబం ఇక్కడే ఉన్నా శాస్త్రిగారు గ్రామగ్రామం తిరుగుతూ ద్వాదశి సమారాధన మాత్రం నిరాటంకంగా సాగించేవారు. నల్లగా ఎత్తుగా లావుగా ఉండే శాస్త్రిగారు ప్రతి రోజూ ఉదయమే తటాక స్నానం చేసి, ఒడ్డున కనులుమూసి ధ్యానమగ్నులై జపం చేసేవారు.అన్నికాలాల్లో అది క్రమ తప్పని విధి విధానం ఆయనది. చిన్న అన్గోస్త్రం లేక గోచి అదీ లేకపోతే దిగంబరంగా బాహ్య స్పృహ లేకుండా ధ్యానం లో గడిపేవారు. బీదవారు కనిపిస్తే తనకొల్లాయి గుడ్డ వారికిచ్చి దిగంబరం గా ఉండిపోయేవారు అంతటి నిరీహులాయన. ఆయన యోగ్యత గుర్తించి ఎవరైనా వస్త్రాలు ఇచ్చినా పేదలకే పంచి పెట్టేవారు. చీమలపుట్ట ల వద్ద బియ్యం చల్లేవారు కోపతాపాలకు కాదు దురాశ లేదు. ఉదార గుణ గరిష్టుడు.

ఒక రోజు కొందరు బ్రాహ్మణులతో ఇంటికి వచ్చి భార్యను వంట అయిందా అని అడిగితె వండటానికి కొంపలో ఏమున్నాయి అని అనగా బ్రాహ్మణులని చెరువుకు వెళ్లి స్నానం చేసి రమ్మని పంపించి, తనకు పరిచయమున్న మన్నవ బాపయ్య గారింటికి వెళ్లేసరికి రెండు జాములైంది. ఈయన వాలకం చూసి భోజనం చేసినట్లు లేదని గ్రహించి అడిగితె తన ఇంటికి నలుగురు బ్రాహ్మణులు వచ్చారు వారికి పెట్టకుండా ఎలా తింటాను అనగా మూడు తవ్వల బియ్యమిచ్చి పంపిస్తే ఇంటికి వెళ్లి భార్యకిచ్చి అన్నం వండించి చుట్టుప్రక్కల ఇళ్ళకు వెళ్లి పచ్చళ్ళు తెచ్చి ఆబ్రాహ్మణులకు భోజనం పెట్టారు. ఇంట్లో ఏమీ లేకపోయినా దారిన పోయే బ్రాహ్మణులను పిలిచి ఏదో విధం గా భోజనం పెట్టేవారు కోటయ్య శాస్త్రి.

కోటయ్య శాస్త్రి గారు ఒకసారి భార్యతో భద్రాద్రి వెళ్లి సీతారామ దర్శనం తో పులకించి, కొన్నాళ్ళు ఉండి ఒక రోజు గౌతమి స్నానం చేస్తుంటే, సికందరాబాద్ వ్యాపారి ఒకాయన దూడతో ఉన్న గోవు నుసద్బ్రాహ్మణుడికి దానం చేయాలన్న సంకల్పం తో ఉండగా శాస్త్రి గారు కనిపిస్తే, గోదానం స్వీకరించమని కోరితే చిరునవ్వుతో అంగీకరించగా ద్రవ్యం తో సహా గోదానం చేసి ధన్యుడనయ్యానని ఆ వర్తకుడు సంతోషించాడు. తన సమీపం లోనే కూర్చుని జపం చేస్తున్న ఒక బీద బాపని చూసి శాస్త్రిగారు వినయంగా చేతులు జోడించి, తానెప్పుడూ ఊరు వదిలి తిరుగుతుంటాను కనుక, తన గోవును భరించి పోషణ చేయమని కోరి ఆ స్వర్ణ సురభిని ఆయనకు సదక్షిణగా సంర్పించగా, భార్య మహాలక్ష్మమ్మ గారు "మనమూ బీద వారమే. అయాచితంగా లభించిన సువర్ణ సురభిని ఇతరులకు అర్పించటానికి మీ మనసు ఎలా ఒప్పింది ?మీ నిర్లిప్తత మన కుటుంబానికి ముప్పు తెస్తోంది. ధన సంపాదన ఆలోచన లేకపోతే కుటుంబం ఆలో లక్ష్మణా అని అఘోరించాలి" అని నిండా క్లాస్ పీకితే. చిరునవ్వుతో శాస్త్రీజీ "హరి యందు జగములుల్లును –హరి రూపము సాచు పాత్ర మందుండుశివం –కర మగు పాత్రము

కలిగిన –నరయగ నది పుణ్య దేశ మనఘ చరిత్రా "అన్న భాగవత పద్యం చదివి "సత్పాత్రత ఎప్పుడూ లభించదు దొరికినప్పుడు సత్పాత్ర దానం చేయాలి, సంతాన పోషణకు మనం కర్తలమా ?"రక్షకులు లేని వారల-రక్షించెద ననుచు జక్రి రాజై ఉండన్ –రక్షింప మనుచు నొకనరు –వక్షము ప్రా ర్థింప నేల యాత్మజ్ఞులకున్"అని, "జనకుండెవ్వడు జాతు డెవ్వడు "అనేపద్యం –"చెలియా మృత్యువు చుట్టమే యముడు "అని మళ్ళీ పోతన గారి భాగవత పద్యం వినిపించి భార్యను సమాధాన పరచారు. కొన్ని రోజులు భద్రాద్రిలో గడిపి మళ్ళీ తన మన్నవ గ్రామానికి చేరారు.

మహిమ గలవారుగా శాస్త్రి గారు కనిపించరు. కాని ప్రజలకు ఆయన అద్భుత శక్తి పై విపరీత విశ్వాసం ఉన్నది. ఒకసారి వల్లూరు జగన్నాధ రావు గారింట్లో కలశం పెట్టి నవరాత్రి పూజ చేస్తున్నారు. అప్పుడే శాస్త్రిగారు వస్తే ఆహ్వానించి భోజనం చేసి వెళ్ళమని యజమాని కోరాడు. ఇప్పుడే వస్తాను అని చెప్పి శాస్త్రి గారు వెళ్లి యే వేళకూ రాకపోతే, అప్పటిదాకా ఎదురు చూసి చెరువు స్నానానికి వెళ్ళారేమో అని అక్క డేమైనా ప్రమాదం జరిగిందేమో అనే అనుమానం కలిగి కారణం నాగేశ్వరరావు అనే ఆయన్ను వెదకటానికి పంపారు. అక్కడ ఒక మరుగ్గా ఉన్న ప్రదేశం లో శాస్త్రిగారు కనిపించారు. ఆయన కళ్ళుమూసుకొని బాహ్య స్పృహ లేకుండా ధ్యానం లో ఉన్నారు. శరీరం నిండా గండు చీమలు పాకి నాయి. రావు గారు చూసి ఆశ్చర్యపోయి భయపడి ఆయన్ను పలకరించేధైర్యం లేక, ఇంటికి వెళ్లి విషయం వివరించాడు. కాసేపటికి సమాధి నుంచి లేచి చీమలు దులుపుకొని గ్రామం లోకి చేరారు. ఇలా అంతర్ముఖులు అయ్యేవారు శాస్త్రి గారు.

నిరపేక్షత, సమత్వం, సకలప్రాణులకు అన్నదానం అనే భాగవత ధర్మాలను చక్కగా ఆచరించేవారు కోటయ్య శాస్త్రి. ఆయన వెంట ఎప్పుడూ కుక్కలు ఉండేవి. నిత్య సంతుష్టి నిత్య సంతోషం ఆయన లక్షణాలు. కాశ్యాంతు మరణం ముక్తిఅని గ్రహించిన శాస్త్రిగారు చివరి రోజులలో కాశీలో గడపాలని గర్భవతి అయిన భార్యతో బయల్దేరి చేరి గంగాస్నానం విశ్వేశ్వర దర్శనం చేసి కొన్ని రోజులుండి,త్రివేణీ సంగమం లో పవిత్ర స్నానాలు చేసి కొన్ని రోజులు ఉన్నారు. అయన వెంట వెళ్ళిన గ్రామకరణం పొండ్రంగి నాగేశ్వర రావు శాస్త్రిగారి అద్భుత శక్తి వివరించి చెప్పారు. ప్రయాగలో ఒక కరోజు ఒంటరిగా లోతైన చోటుకు వెళ్లి, మనుషులకు అందని నీటిపై తేలి ధ్యాన మగ్నులై ఉన్నారని ఎంతసేపటికీ రాకపోతే తానూ వెడితే ఆ దృశ్యం కనిపించిందని చెప్పాడు. బయటికి రాగానే అంతలోతుకు ఎందుకు వెళ్ళారని రావు ప్రశ్నిస్తే "అక్కడ అసలు లోతే లేదు "అని శాస్త్రిగారి జవాబు.

త్రివేణీ సంగమం నుంచి గయ వెళ్ళారు. అక్కడ శాస్త్రి గారికి జ్వరం తగిలింది. నాలుగవ రోజు భార్యతో "నేను ఈ శరీరం వదిలేస్తాను. విచారించకు.నీకు కూతురు పుడుతుంది "అని చెబూతూ ఉండగానే బ్రహ్మ రంధ్ర చేదన జరిగి పుణ్యాత్ముడు నిరీహుడు నిత్య సంతోషి శ్రీ ప్రతాప కోటయ్య శాస్త్రి గారు 1896గంగా పుష్కరాలకాలం లో నలభై రెండవ ఏట పరంధామ సన్నిధిని చేరారు. భార్యాపిల్లలు మన్నవ గ్రామం తిరిగి వచ్చారు. శాస్త్రిగారికి ఇద్దరుకొడుకులు ఒక కుమార్తె. ఇలాంటి పరమ యోగిని గురించి ఇంతకు ముందు మనం విని ఉండలేదు.

## 26 భూత దయాళు తూమాటి రామభొట్లు

19 వ శతాబ్దం లో గుంటూరు జిల్లా మద్దిరాల పాడు కమ్మవారి కులం లో జన్మించిన తూమాటి రామ భొట్లు తండ్రి నరసింహ చౌదరి తల్లి చిలకమాంబ. భార్య పేరమ్మ. గురువు అద్దంకి తాతాచార్యులు. ఒకరోజు గురువుకు సాష్టాంగ నమస్కారం చేసి జీవితం తరించే ఉపాయం చెప్పమని కోరితే రామ తారక మంత్రం ఉపదేశించి దీక్షగా జపించమని "నేను మీ వంశానికి గురు పీఠాదిపతిని. నీకు తారకం ఇచ్చి గురువు కూడా అయ్యాను. గురు దక్షిణ ఏమిస్తావు ?"అని అడుగగా "నా సర్వస్వం మీకు సమర్పించి మీ ఉచ్చిష్టం మాత్రమే తిని జీవిస్తాను "అని సభక్తికంగా అంటే గురువు సంతోషించి "నాకు అదేమీ వద్దు నిత్యం భూత దయతో ప్రవర్తించు చాలు "అని హితవు చెప్పగా అలాగే ప్రవర్తిస్తానని ప్రమాణం చేశాడు రాం భొట్లు.

తక్కెళ్ళ పాడు చేరిన రామ భొట్లు ను చూసి సంతోషించి మర్నాడు ఉదయం కొడుకును పిల్చి"నాకు వయసు మీద పడు తోంది. నా చదలవాడ గ్రామాదికార పదవి తీసుకొని నాకు విశ్రాంతి ఇవ్వు "అని కోరగా సరే అని, పూజాద్రవ్యాలతో ఆ ఊరిలోని శ్రీసీతారామాలాయానికి వెళ్లి స్వామిని అర్చించి, తీర్ధ ప్రసాదాలు తీసుకొని శివాలయానికీ వెళ్లి పార్వతీ పరమేశ్వరారాధన చేసి ఇంటికి చేరి ఒక నిర్జన ప్రాంతం లో ఒక వస్త్రం పరచి దానిపై పక్షులకు ఆహారంగా వారి బియ్యం పోసి, దాని చుట్టూ నీటి పాత్రలు పెట్టి, దానికి కాపలా మనిషిని ఏర్పాటు చేసి రోజూ అలా చేశాడు. ఊర్లో అన్నం లేని బీద జనాలకు అన్నవస్త్రాలు ఇస్తూ భాగవత కాలక్షేపం చేస్తూ కాలం గడుపుతూ గొప్ప కీర్తి పొందాడు.

శిధిల మైన చదలవాడ శివాలయం ప్రహరీ ధ్వజ స్తంభ ప్రతిష్టలు చేశాడు. చదలవాడ –పోతవరం దారిలో మద్దిరాలపాడు లో రెండు మంచి నీటి చెరువులను త్రవ్వించి, తర్వాత పానకాల చెరువు, రావలగుంట, చిత్రచిత్ర గుంట,రామన చెరవు లింగాయ చెరువు అర్వగుంట చెరువులను బాగు చేయించి ఉపయోగం లోకి తెచ్చాడు. యాత్రికులకు కులమత విచక్షణ లేకుండా భోజన వసతి సౌకర్యాలు కల్పించాడు..చీర్వాన్ ఉప్పలపాటి నివాసి కుమ్మర వెంకటాద్రి మద్దిరాల గుడ్డి వీరడు అనే ఇద్దరు దొంగలు చౌదరిగారింట్లో సొత్తు దొంగిలించే ప్లాన్ వేశారు. చౌదరి గారి పెంకుటింటి కి పెంకు నేయిస్తుండగా ఈ దొంగలు కూలీలుగా పని చేస్తూ, సాయంకాలం మండువాలో దాగి, అర్ధరాత్రి అందరు నిద్రించే సమయంలో లోపలి ధనాగారం లోని నగా నట్రా దొంగిలించి, ఎలాబయటపడాలో దారి తెలీక వెన్ను గాడి పై చేరగా "గజ సింహ గమనుల ఖడ్గ తూణీ ధనుర్ధారుల శార్దూల విక్రమముల రాజ సింహుల –గుణరూప చేష్టితంబుల పరస్పర సమానుల, చారు చంద్ర ముఖుల, రమణీయ మూర్తుల గమల పత్ర విశాల నయనుల సురభవ నంబు విడిచి –దరణికి వచ్చిన సురలకైవడి గ్రాలు వారి వీరుల భంగి వరలు వారి –రాజ భానులక్రియ దివ్య తేజము నహా –ర్నికాయ ము వెలిగించు చున్నవారి –గ్రమతర కాక పక్ష ముల్ గలుగు వారి –మహిత కీర్తుల రామ లక్ష్మణుల జూచి " చౌదరి గారి సేవకులే వచ్చారేమో నని భావించి భయపడి వారి చేతుల్లో చావు తప్పదని నిర్ణయించుకొని ఇక జన్మలో దొంగతనం చేయమని శపథం చేసి కిందకి దిగి తప్పించుకొనే ప్రయత్నం చేస్తే అక్కడా ఇద్దరు మహా వీరులు కాపలా కాస్తూ ఉండటం చూసి, ఇంటి సేవకులు దొంగలు దొంగలు అని కేకవేస్తే పట్టు బడ్డారు. చౌదరిగారు వారిద్దర్నీ ఏమీ అనకుండాఇచ్చి రెండు రోజులకు సరిపడా గ్రాసం ఇచ్చి సత్కరించి పంపించారు. దొంగలకు రామ లక్ష్మణులు కనిపించటం అబ్బురంగా భావించి రామునితో "ఎందరో ఇంద్రజాలకుల్ని చూశాను. కానీ నీలాంటి వారిని చూడలేదు –"గారడీ పెద్ద వీవు రాఘవా "అని స్తుతించారు. వీరడి కూతురు మద్దిరాలలో ఇప్పటికీ ఉంది. వెంకటాద్రి భొట్లు గారు చనిపోయాక ఊరు వదిలి వెళ్లి పోయాడు.

## 27 భద్రాద్రి రామ భక్త శిఖామణి అమరవాది వెంకట రామానుజా చార్యులు

**శ్రీరామార్పణం**

గోల్కొండ రాజ్యాన్ని ఔరంగజేబు పాలించి భంగపడ్డాక, 17 వ శతాబ్దిలో భద్రాచలం జమీందారు పాలనలో ఉండేది. స్వామికార్యాలు అవిచ్ఛిన్నంగా జరిగేవి. ఆయన పేరు వగైరాలు ఎవరికీ తెలియవు. ఈ క్షేత్రం లో అమరవాది కామళ్ళ వెంకట రామానుజా చార్యులు అనే దివ్య పురుషుడు ఉండేవాడు. తలిదండ్రుల పేర్లు తెలియవు కానీ ఇప్పటికీ ఈ వంశం వారు అక్కడ ఉన్నారు ఇతడికి ముందుపుట్టిన పిల్లలు వెంటనే చని పోవటం చేత తలిదండ్రులు ఇతడిని శ్రీరాముడికి అర్పించారు. ఇతడు మధ్యాహ్న సమయం లో దేవుడికిచ్చే బలి మెతుకులు తిని,,రామ తీర్థం తాగి జీవించేవాడు.

**సహజ పాండిత్యం, శ్రీ రామ దర్శనం, కళ్యాణోత్సవ విధి విధాన రచన**

సహజ పాండిత్యం అబ్బి ఉపనయనం జరిగి రామభక్తి మరింత పెరిగింది. సర్వావస్థ లలో రామనామం చేసేవాడు. ఉదయమే లేవటం స్నాన సంధ్యాదులు పూర్తి చేసి, రాముడికి షోడశోప చార పూజ చేసి ప్రసాదం తిని దూరంగా వెళ్లి తత్వ విచారం చేస్తూ తాను తరించి, ఇతరులనూ తరింప జేసేవాడు. ఒకసారి సంప్రజ్ఞాత సమాధి లో శ్రీరామ దర్శనం కలిగి, పులకితుడై స్తుతి చేసి ఆనంద పారవశ్యం పొందాడు. రాముడు "వత్సా !నా ఉత్సవ ప్రక్రియ అంతా ఆగమ శాస్త్ర విధానం గా పొందుపరచి, మూల గ్రంథానికి,ఖండ వరుస రాసి నా కోర్కె తీర్చు "అని చెప్పి అదృశ్యమైనాడు. పండిత శ్రేష్టులకే అత్యంత కష్టమైన ఆపనిని సహజ పాండిత్యం తో పూర్తి చేసి శ్రీరామానుగ్రహం పొందాడు ఆయన రాసిన ఆ ప్రక్రియను అనుసరించే ఇప్పటికీ భద్రాద్రి సీతారామకల్యాణ విధి జరుగుతోంది.

**పాల్వంచలో మట్టి సీతారామ విగ్రహ నిర్మాణం భద్రాద్రిలో అదృశ్యమైన శ్రీరాముడు**

ఆలయ ధర్మకర్త ఒకసారి ఆలయానికి వస్తే ఈయన తగిన మర్యాద చేయలేదనే కోపం తో, తనపాలనలో ఎక్కడా ఆయన ఉండకూడదనే చండ శాసనం చేశాడు. చేసేది లేక, భద్రాద్రి వదిలేసి పాల్వంచ చేరి మట్టితో సీతారామ విగ్రహాలు చేసి, ప్రాణ ప్రతిష్ట, కళావాహనం చేసి, పలువిధాల స్తుతించి సుముఖుని చేసుకొన్నాడు. రాముడు సాక్షాత్కరించి "నాయనా !నువ్వు లేని భద్రాద్రి లో నేను ఉండను. ఇక్కడే నీతో పాటు ఉంటాను "అనగా పరమానందం పొందాడు. మర్నాడు భద్రాచలం లో పూజారులకు అర్చా మూర్తులు కనిపించలేదు. జమీందారుకు విషయం తెలిసి నడిచి పాల్వంచకు వచ్చి అమరవాది ఆచార్యుల పాదాలపై వ్రాలి క్షమించమని ప్రార్ధించగా, మనసు కరిగి ఈ మట్టి విగ్రహాలు తీసుకొని భద్రాద్రి చేరాడు.

**యవన సేన నుంచి భద్రాద్రి రాముని కాపాడిన విధం**

ఒకసారి యవన భటులు భద్రగిరి ముట్టడించి, ఆలయ ప్రవేశం చేయ బోతుండగా, జమీందారు ఆచార్యులవారిని పిలిపించి ఈ ఆపద గట్టెక్కించమని కోరాడు. వారి వలన ఏ ప్రమాదం రాదనీ హామీ ఇచ్చారు ఆచార్యులు. ఆయన్ను పంపించేసి తానొక్కడే ఆలయం లో రామభజన చేస్తూ కూర్చున్నారు ఆచార్యస్వామి.. ఆలయం లో హడావిడి లేదుకనుక యవన భటులు ఇద్దరు మాత్రమే ఆలయం లోకి ప్రవేశించగా విగ్రహాలు కనిపించలేదు. ఇక్కడ విగ్రహాలు లేవని భావించి వాళ్ళు వెళ్ళిపోయారు.

**గోదావరి లోదాచిన ఉత్సవవిగ్రహాల విషయం –ఫణిగిరి సీతా దేవి భద్రాద్రి చేరటం**

ఒకసారి అర్చక బృందం ఆచార్యుల వారికి చెప్పకుండా ఉత్సవిగ్రహాలను గోదావరిలో దాచి యవ్వన బారి నుంచి కాపాడారు. గోదారి వరదలతో ఉధృతంగా ప్రవహించి ఉత్సవ మూర్తులను తీయటానికి అవకాశం కలగ లేదు. వరద తగ్గాక దాచిన చోట వెదికితే ఉత్సవ విగ్రహాలు కనిపించలేదు అర్చకులకు. ఈ విషయం జమీందారుకు చెబుతూ "రోజు అర్ధరాత్రి వేళ గోదావరి నీటిలో నుంచి తమల్ని పిలుస్తున్నట్లుగా శబ్దాలు వస్తున్నాయి కాని అంతు పట్టటం లేదు "అని చెప్పారు. ఆలయం లో "ఉత్సవ భేరం" లేదని అర్ధమయి, శ్రీరాముడే గోదావరి నీటి లో నుంచి మాట్లాడుతున్నాడని గ్రహించి, ఆచార్యులవారికి తెలియ జేశాడు. ఆయన "భయం అక్కర లేదు రేపు మధ్యాహ్నం ఉత్సవ భేరం గోదావరి పై తేలుతూ కనిపిస్తాయి "అని చెప్పారు. మర్నాడు పూజారులు వెళ్లి చూస్తె సీతా దేవి విగ్రహం మాత్రం కనిపించలేదు. ఆచార్యుల వారికీ విషయం చెబితే "రాముడు సీతను గోదావరికి అర్పించాడు ఫణిగిరి ఆలయం లోని సీతా దేవి ఉత్సవ విగ్రహం తీసుకు రమ్మని చెప్పి పంపించగా అక్కడి జమీందార్లు ఒప్పుకోక భద్రగిరిపై దండ యాత్ర చేశారు ఫణిగిరి జమీందారు కలలో రాముడు కనిపించి "అనవసరంగా అడ్డు చెప్పకు విగ్రహం ఇచ్చి పంపించు "అని ఆనతి ఇవ్వగా ఇచ్చిపంపాడు. ఇప్పుడు భద్రాచలం లో శ్రీరాముని ప్రక్కన ఉన్న ఉత్సవిగ్రహం ఫణిగిరి నుంచి తెచ్చినదే.

**మహా ప్రస్థానం**

ఈ విధంగా భద్రాచల రామాలయ ఉత్సవాలకు ఆగమ విధి విధానం ఏర్పాటు చేసి ఆలయాన్ని యవన బాధ నుంచి కాపాడి పోయిన సీతమ్మవారి విగ్రహాన్ని ఫణి గిరి నుంచి తెప్పించిన మహోన్నత భక్త శిఖామణులు శ్రీమాన్ అమరవాది రామ చంద్రాచార్యులవారు 70వ ఏట శ్రీరామ సన్నిధి చేరుకొన్నారు.

## 28 మువ్వ గోపాలకృష్ణ పదదాసు -శ్రీ పువ్వాడ శ్రీరామదాసు

శ్రీ పువ్వాడ శ్రీరాములు గారు కృష్ణా జిల్లా దివితాలూకా మువ్వగోపాలుని మొవ్వ క్షేత్ర వాసి. మహా కృష్ణ భక్తులు. పదకవితలు రాసి చరితార్ధులయ్యారు. "ఆయనకీర్తన లలో భక్తి పారవశ్యత ప్రస్ఫుటం. శబ్ద సౌష్టవం, కవితా స్వారస్యం తోపాటు శరణాగతి ఎక్కువగా కనిపిస్తుంది. జప తపో నిష్టులైన దాసుగారు మహామహిమాన్వితులు. ఒకరోజు పొలం లో తిరుగుతుంటే త్రాచు పాము కాటు వేసింది. లెక్క చేయకుండా ఇంటికి వచ్చిజపం లో మునిగిపోతే ఆ పామే ఇంటికి వచ్చి ఆ విషాన్ని పీల్చేసి ఆయనకు ఏ ప్రమాదం రాకుండా కాపాడి వెళ్ళింది. దాసుగారు కృష్ణ, శివ కీర్తనలతో పాటు తెలుగు వారి కే ప్రత్యేకమైన జావళీలు కూడా రాశారు. మొవ్వవాసి క్షేత్రయ్య శృంగారం తో దున్నేస్తే, దాసుగారు భక్తీ ఆర్తీ శరణాగతి తో భావ బంధురంగా రాశారు "అని ప్రసిద్ధ కవి శ్రీ పువ్వాడ తిక్కన సోమయాజి గారి తల్లిగారు శ్రీమతి పువ్వాడ అనసూయమ్మ గారు చెప్పారు. దాసుగారు సోమయాజిగారికి పెద తాతగారనీ, దాసుగారి కీర్తనలకు తానె బాణీలు కట్టి పాడే

దానినని, శివరాత్రి జాగరణ లో వీటితో సంగీత నృత్యం కూడా చేయించానని ఆమె గుర్తు చేసుకొంటూ తమ కుమారుడు సోమయాజిగారు పెదతాతగారి పై పుస్తకం తెస్తూ అందులో వారికీర్తనలు చేర్చి ప్రచురించటం సంతోషంగా ఉందని తెలియజేశారు.




సుమారు 25 ఏళ్ళ క్రితం మొవ్వలో మొవ్వ కాలేజి తెలుగు లెక్చరర్ డా.పై శ్రీలత గారు క్షేత్రయ్య పదకవితోత్సవం రెండు రోజులపాటు నభూతో గా జరిపి నప్పుడు, సోమయాజి గారు నాప్రక్కన కూర్చుని శ్రీరాములు దాసుగారి గురించి కొంత చెప్పారు. రేడియో లో ఉదయం వచ్చే భక్తిరంజని కార్యక్రమం లో దాసు గారి కీర్తనలు వినేవాడిని. చాలా ప్రత్యేకంగానూ బాగున్నాయని అనిపించేవి. ఈ సభలో శ్రీమతి మంగళగిరి ప్రమీలా రాణి గారు కూడా పాల్గొన్నారు ఆమె నాకు బాగా పరిచయం అప్పుడప్పుడు ఫోన్ చేసి మాట్లాడేవారు కూడా. సుమారు నాలుగేళ్ళక్రితం ఆమె పరమపదించి పద కవితకు తీరని లోపం చేకూర్చారు. నిన్న సోమయాజి గారు తాము ప్రచురించిన దాసు గారి పుస్తకం పిడిఎఫ్ పంపుతూ "ఇందులోని పదకర్త ను మీ దృష్టికి తేవటం నాకు ఆనందకరం" అని చినుకు నర్మగర్భంగా చిలికారు. బహుశా నేను మహా భక్త శిఖామనులను గురించిఅంతర్జాలం లో రాస్తున్నందున నా దృష్టికి వారి పెద తాతగారు రాలేదేదనే అభి ప్రాయమూ ఉండి ఉండచ్చు లేక చనువుగా "రాయండి "అనే ఆదేశమైనా కావచ్చు. ఏదైనా ఒక మహా భక్తకవి గురించి పరిచయం చేయటం నా అదృష్టమే కాదు ధర్మం, విధి కూడా. అందుకు మహదానందంగా ఉంది.

ఈ పుస్తకానికి ముందుమాటలు రాసిన పద సంగీత పరిషత్ స్థాపకురాలు, సాహిత్య రత్న డా శ్రీమతి మంగళగిరి ప్రమీలా రాణి పువ్వాడ శ్రీరాములుగారి తండ్రి శ్రీ గుర్రాజు గారు, తాతగారు వెంకటాచలం గారు అనీ వీరిది "చికితస "గోత్రం అనీ, మొవ్వలోని కృష్ణునిపై, భీమేశ్వరునిపై పదాలు రాసి శివ కేశవ భేదం లేని స్మార్తులనీ తెలియ జేశారు."నందీ వాహనుడై వచ్చే నమ్మా ---మేల్ మేల్ భీమలింగా ",జయరామ లింగ జయరామ లింగ "పదాలు చాలా ప్రసిద్ధమైనవనీ విస్తృతంగా వ్యాప్తి చెందాయని చెప్పారు. దాసు గారి కీర్తనలలో బహు ముద్రలు ఉండటం ప్రత్యేకం అన్నారు. మువ్వ మువ్వ గోపాల, శ్రీరామ దాస, మువ్వ నివాస "అనేవి ఆముద్రలు అన్నారు. "ఎన్నడు చూడగ లేదు –ఈత డెవ డమ్మా-పన్నగ శయనుడు -మువ్వ గోపాలుడే కొమ్మా "పదం దశావతార వర్ణనా ప్రాముఖ్యం కలది. ఇది ఇద్దరి స్త్రీల మధ్య సంవాదన గేయం కనుక నాటకీయత ఉండి,వినేవారికి విషయం తేలికగా అర్ధమౌతుందన్నారు ప్రమీలారాణి గారు. పదకర్త శ్రీరాములు దాసుగారు బాగా ప్రచారం లో ఉన్న బిలహరి, ఆనంద భైరవి,కేదార గౌళ, మధ్యమావతి శ్రీరాగాలలో కీర్తనలు సంచరించారు. భగవత్సేవా పరాయణులైన దాసుగారు స్వామివార్లకు నిత్యోత్సవ సేవలు కడు భక్తితో నిర్వహించి తరించేవారు. "యజ్ఞాది కర్మా చర.ణ కంటే నీ భక్తి భాగ్య సుధానిధి దే జన్మము "అని నాదబ్రహ్మ త్యాగ రాజస్వామి జయమనోహరి రాగం లో రాసిన కృతి లోని భావాన్ని గ్రహించి భక్తి భావం తో పదకవితా స్రవంతిని ఆంధ్రులకు అందించిన శ్రీ పువ్వాడ శ్రీరాములు దాసు గారి జన్మ ధన్యం " అని నిండుమనసుతో కీర్తించిన పదకవితా ప్రచారక ప్రమీలారాణి గారి ముందుమాటలు సువర్ణానికి సువాసన అద్దాయి. పుస్తక గౌరవం మరింత పెరిగింది. ఈ చిరుపొత్తం 1991 లో ప్రచురితమైంది. బహుశా వెల అమూల్యం.

ఇందులో శ్రీరామ దాసు గారు మువ్వ గోపాలునిపై 1-ఎక్కడ ఉన్నావు కృష్ణా నేనెంత వేడిన రావు "2-ఎన్నడు చూడలేదు ఈత డెవరమ్మా "3-అదుగో గోపాలుడు వచ్చే నమ్మలారా 4-రారా పోదామురారా లేచి రారా పోదాము 5-బాలెంతరాలనురా కృష్ణా –"అల్ల "పని కోర్వ జాలనురా. కీర్తనలు ఉన్నాయి. భీమేశునిపై 6-మేల్ మేల్ భీమ లింగ 7-జయరామలింగ జయ రామ లింగ 8-నందీ వాహనుడై వచ్చెనమ్మా 9-దశరథ రామ పరాకు "10-రామ సదానంద రామ గోవింద "అనే శిధిలమై కాలగార్భాన కలిసిన వికాక మిగిలిన మొత్తం పది కీర్తనలే దక్కి ముద్రణ భాగ్యం పొందాయి. పెదతాతగారి పై అనన్య భక్తీ గౌరవాలున్న శ్రీ పువ్వాడ తిక్కన సోమయాజి గారు ఈ కరదీపిక ప్రచురించి ఆంధ్రలోకానికి మహోపకారం చేసి, 200 ఏళ్ళ తర్వాత మళ్ళీ మువ్వ గోపాలస్వామికి పద మంజీరాల ధ్వనులతో కనువిందు వీనులవిందు చేకూర్చి నందుకు అభినందనీయులు. ఇందులో పువ్వాడ వారి వంశ వృక్షం కూడా జతచేయటం మరో గొప్ప విషయం

## 29 కృష్ణానందావదూత

18 వ శతాబ్దిలో నెల్లూరు జిల్లా లక్కవరం శివారు నాగ భొట్ల పాలెం 70 వ ఏట చేరిన కృష్ణానందుడు మాంచి దేహ పటిమ కలవాడు. రోజుకు మూడామడల దూరం సునాయాసంగా నడిచేవాడు. లక్కవర మల్లపరాజు శివరాత్రి ఉత్సవాన్ని చూడటానికి శ్రీ శైలం వెడుతూ ఈయన దగ్గరకు వస్తే "శ్రీశైలం వెడుతున్నావా ?సంతోషం. మల్లికార్జున స్వామికి నా నమస్కారం తెలియ జేయి "అని ఆశీర్వదించాడు. ఆయన ఆశ్చర్యపోయి "స్వామీ ! నేనెవరినో ఎక్కడికి వెడుతున్నానో నేను

చెప్పకుండానే మీరు అన్నీ చెప్పిన దైవజ్ఞులు. మీకు తెలియని విషయం ఉండదు "అని కృతజ్ఞతావందనం చేసి వెళ్ళాడు. శ్రీగిరి చేరి ధూళి దర్శనంకోసం అధికారుల అనుమతిని అడుగుతుంటే, మన కృష్ణావధూతగారు మల్లికార్జున దర్శనం చేసి మనరాజు గారికి ఎదురై ఆశ్చర్యం కలిగించారు. చిరు నవ్వుతో రాజు గారిని "ఎంతసేపైంది వచ్చి మీతో ఎవరెవరొచ్చారు ?"అని ప్రశ్నిస్తే అవాక్కై నిలబడితే "నేను కృష్ణావధూతను. మీవెనకాలే నేనూ బయల్దేరి వచ్చాను. శిఖరేశ్వరం దగ్గర మిమ్మల్ని చూశాను. నడవ లేనేమో అనే భయం తో అక్కడ కూర్చోలేదు "అన్నారు. అవధూత సర్వజ్ఞత్వం అర్ధమై రాజు గారు ధూళి దర్శనంచేసి, అవధూత సర్వజ్ఞులని గ్రహించి శివరాత్రి ఉత్సవం కన్నుల పండువుగా చూసి అవధూతగారితో ఇంటికి చేరి,యాత్రా విశేషాలను అందరికీ ఆశ్చర్యం గా తెలియజేశారు.

అవధూతగారు రోజూ అర్ధరాత్రి బయల్దేరి ఋషుల ఆవాసభూమి అని పిలువబడే సీమకుర్తి కొండకు వెళ్లి, మర్నాడు వేకువనే నాగభొట్ల పాలెం చేరేవారు. దీన్ని కనిపెట్టటానికి అన్నం భొట్లుశాస్త్రి ఆయనకు తెలీకుండా వెంట వెళ్ళేవాడు కానీ ఎప్పుడూ కనిపించ లేదు. ఒకసారి అవధూత పడుకున్న ఇంట్లోనే శాస్త్రి గారు కూడా పడుకొన్నాడు. అవధూతగారు యధాప్రకారం అర్ధరాత్రి లేచి ఇంటి బయటకు వచ్చి, తలుపు దగ్గిరికి వేసి వెళ్ళిపోయారు. శాస్త్రి ఆయన వెంట వెళ్ళటానికి వెడితే తలుపు బిగుసుకుపోయి యెంత ప్రయత్నించినాతెరుచుకో లేదు. అరుపులు కేకలతో చుట్టుప్రక్కలవారిని పిలిచే ప్రయత్నం చేసినా, వాళ్ళు వచ్చి తలుపు తీసే ప్రయత్నం చేసినా తలుపులు తెరుచుకోలేదు. వేకువజామున పిట్టలు అరిచే సమయం లో తలుపులు వాటంతటికి అవే తెరుచుకొన్నాయి. శాస్త్రి అప్పుడు బయటికొచ్చి కొంప చేరాడు అవధూత గారు మామూలుగా వచ్చే సమయానికే వచ్చారు.

శాస్త్రి మర్నాడు రాత్రికూడా అవధూత వెంట వెళ్ళే ప్రయత్నం చేశాడు. ఆయన గమనం తెలీలేదుకాని ఒక పెద్ద భూతం కనిపించి భయపెడితే మూర్చపోయాడు అక్కడే. తెల్లారి నిద్ర లేచినట్లు మామూలుగా లేచి, అవధూత దర్శనమై పాదాలపై వ్రాలి క్షమాపణ కోరాడు. క్షమించి మళ్ళీ అలాంటి ప్రయత్నం చేస్తే ప్రమాదం అని హెచ్చరించారు అవధూత.

ఒక సారి చలిజ్వరం తో బాధపడుతున్నఅవధూత గారిని చూడటానికి లక్కవరం గ్రామస్తులు కొందరు అవధూతగారి దగ్గరకు వచ్చారు. వాళ్ళని కూర్చోమని చెప్పి తనకు వాళ్లకు మధ్య అడ్డం గా ఒక కర్ర పడేశారు. కాసేపటికి ఆ కర్ర గజగజ వణకటం ప్రారంభించింది. అదేమీ విచిత్రం అని ఆయనను అడిగితే "ప్రారబ్ధ వశాన నన్ను ఆశ్రయించిన జ్వరం ఈ కర్రలో ప్రవేశ పెట్టటం వలన అలా వణికింది నా చలిజ్వరం తగ్గి, అది అనుభవించింది. పాపం మీరు నన్ను చూడటానికి వచ్చారు నా జబ్బు తగ్గిందని చూపటానికే ఇలా చేశాను. మాయ స్వాధీనమైతే ఏ బాధా ఉండదు మనం పొందే కష్టసుఖాలు మాయావినోదాలు. సహన శక్తి అందరూ అలవర్చుకోవాలి " "అని బోధించారు..

ఒక రోజు శిష్యులను పిలిచి తాము దేహ యాత్ర చాలిస్తున్నామని, శరీరాన్ని లక్కవరం లోసమాధి చేయమని చెప్పి, కపాల భేదం చేసుకొని పరమపదం పొందారు అవధూతగారు. ఆయన కోరినట్లే గ్రామస్తులు శిష్యులు చేసి, వారి బృందావనానికి నిత్య ధూప దీప నైవేద్యాలకోసం గ్రామస్తులు 18 ఎకరాల భూమి సమకూర్చారు. ప్రతి పుష్యమాసం శ్రీవారి వార్షికోత్సవం ఘనంగా నిర్వహిస్తారు. అవధూత గారి ముఖ్య శిష్యులు లక్కవరపు అయ్యపరాజు పంతులుగారు పొతకామూరు నివాసి అయినా, లక్కవరం అనే పేరుతో ఊరు నిర్మించి, శివప్రతిష్ట చేసి నిత్య శివార్చన చేసిన పుణ్యమూర్తి. ఎనిమిది తరాలనుంచి ఈ వంశం వారు ఈ ఊళ్ళో ఉంటున్నారు.

## 30 నృసింహ భక్తురాలు నిరతాన్న దాత -కైవారం బాలాంబ

నిరతాన్న ప్రదాతలు అంటే ఆంధ్ర దేశం లో ముందు గుర్తు కొచ్చేది అపర అన్నపూర్ణ శ్రీమతి డొక్కా సీతమ్మ గారు. ఆ తర్వాత శ్రీ బందా పరదేశి గారు. పిమ్మట శ్రీమతి జిల్లెళ్ళమూడి అమ్మగారు. వీరి చేతి భోజనం తిని తరించని వారు లేరు అంటే అతిశయోక్తికాదు. అంతే కీర్తి వైభవాన్ని నిరతాన్నదానం చేతపొందిన మరో దివ్యవ్యక్తి శ్రీమతి కైవారం బాలాంబ గారు. ఎన్నో ఏళ్ళు గడిచిపోయినా వారి ఆప్యాయత, ఆదరణ,ప్రేమ సేవా భావం తెలుగు జనం గుండెల్లో స్థిరం గా నిలిచిపోయాయి. వీరిలో బాలాంబ గారి గురించి ఈ తరం జనానికి పెద్దగా తెలిసి ఉండక పోవచ్చు. ఆమెను గురించి తెలియ జెప్పటానికే నేను చేస్తున్న ప్రయత్నం ఇది.

### బాలాంబ గారి జీవిత విశేషాలు

గుంటూరు జిల్లా లోని అంగల కుదురు గ్రామం లో బాలాంబ గారు 1849లో జన్మించారు వీరి తండ్రి గారు శ్రీ దేవులపల్లి సుబ్బన్న గారు. తల్లి గారు శ్రీమతి వెంకమాంబ గారు. ఈ కుటుంబం మొదటి నుండి దాన ధర్మాలకు ప్రసిద్ధి చెందినది. బాలాంబ గారు చిన్నప్పటి నుండి దాన ధర్మాలపై గొప్ప శ్రద్ధ చూపేవారు. ఇవి తలి దండ్రుల నుండిఆమె కు సంక్రమించిన సద్గుణాలు. బాల్యం లో నే రామాయణ, భాగవతాదిఆధ్యాత్మిక గ్రంధాలను చదివి సారాన్ని జీర్ణించుకొన్నారు. "అమ్మా !అన్నం "అనే కేక యెంత దూరం నుండి వినిపించినా ఆమెకు వినపడేది. వెంటనే ఇంటి నుండి అన్నం కూరలు, పచ్చళ్ళు తీసుకొని వెళ్లి వాళ్లకు పెట్టి సంతృప్తి చెందేవారు. వారు కడుపునిండా తింటే ఆమెకెంతో సంతోషం గా ఉండేది. వారిలోనే పరమాత్మ ను దర్శించేవారామె.

గుంటూరు జిల్లా మంగళ గిరి నివాసి కైవారం సుబ్బన్న గారితో బాలాంబ గారికి వివాహం జరిగింది. పెండ్లి అవగానే కాపురానికి అత్తవారిల్లు మంగళగిరీ వచ్చారు. సుబ్బన్న గారితో కాపురం ఏంతో అన్యోన్యంగా కొన్నేళ్ళు కొనసాగింది. ఇంతలో దైవ ఘటన మరో రకం గా ఉంది. సుబ్బన్న గారు అకస్మాత్తుగా చనిపోయారు. మొదటి నుంచి శ్రీ మంగళ గిరి లక్ష్మీ నృసింహా స్వామిఉపాసనలో బాలాంబ గారు గడిపేవారు. భర్త మరణం తో ధ్యాస అంతా స్వామి మీదే లగ్నం చేసి స్వామి సేవలో జీవితాన్ని ధన్యం చేసుకొన్నారు. కొంతకాలం మంగళ గిరి కొండపైనే ఉంది తపస్సు చేశారు. అనుకో కుండా బాలాంబ గారికి ఒక రోజు జ్ఞానోదయం అయింది. అన్నదానం చేయాలనే ప్రేరణ కలిగింది.



కైవారం సుబ్బావధాని సత్యమార్గం లో నడిచే వాడు. మధురభాషి. ఎవ్వర్నీ చెయ్యి చాచి అడగని వాడు. నిర్లిప్తుడు. ఆయన భార్య ఉత్తమా ఇల్లాలు కైవారం బాలాంబ. దంపతులకు 18 ఏళ్ళ దాంపత్య జీవితం లో సంతానం కలుగ లేదు. బావగారి కొడుకు నారాయణ ను అల్లారు ముద్దుగా పెంచారు. ఇతడు ఆటలాడు తూ జారి నూతిలో పడ్డాడు. ఎక్కడున్నాడో తెలీక "లక్ష్మీ నృసింహ స్మరణ చేస్తూ "నాయనా నారాయణా !ఎక్కడున్నావు తండ్రీ "అని వాపోతుంటే "అమ్మా భయం లేదు. ఎవరో దివ్యపురుషుడు నన్ను చేతులతో ఎత్తుకొని నూతి గట్టు మీద కూర్చోబెట్టి వెళ్ళిపోయాడు "అని చెప్పాడు. భగవత్ లీలకు ఆశ్చర్యపడుతూ నారాయణ ను ఇంటికి తెప్పించింది.

1888లో తన నలబై వ ఏట భర్త సుబ్బావధాని మరణించగా, శ్రద్ధగా అపరకర్మలు నిర్వహింపజేసి రోజు రెండు సార్లు నృసింహస్వామి దర్శనం చేస్తూ మనశ్శాంతి పొందింది బాలమ్మ. ఋలుమళ్ళనరసింహ్ చారి వలన తిరు మంత్రోప దేశం పొంది, మంత్రం సిద్ధి, దివ్య సాక్షాత్కారం పొందింది. వైదిక విధానం లోకాక వైష్ణవ విధానం లో మంత్రోప దేశం పొందిందని సాటి బ్రాహ్మణులు పీఠాదిపతికి ఫిర్యాదు చేశారు. ఆయన బాలాంబ గారిని పిలిపించి స్వయంగా పరీక్షించి ఫిర్యాదీలను మందలించి తరిమేశారు.

ఒక రోజు కుంభ వృష్టి కురుస్తుంటే, తలదాచుకోవటానికి ఒక గుహ దగ్గరకు వెళ్ళింది. గుహలోపలి నుంచి బురద నీరు ఒక్క సారిగా బయటికి రావటం ఆప్రవాహం ఆమెను ఈడ్చి కొట్టటం తో కింద గుంటలో పడి స్పృహ తప్పింది. వర్షం ఆగాక నీటితో ఆ గుంట నిండి పోయి, ఆమె ఎవరికీ కనిపించలేదు. ప్రతి రోజఉదయమూ బాలాంబ గారి యోగ క్షేమాలు విచారించటానికి వచ్చే హనుంమంతయ్య గారు వచ్చి, అమ్మగారు కనిపించకపోతే చుట్టుప్రక్కల వెతుకుతూ ఆ గుంటలో ఉన్నట్లు తెలుసుకొని మనుషులతో అందులోనుంచి బయటికి తీయించి ఉపచారాలు చేయించగా కొంత సేపటికి బాలాంబ గారికి స్మృతి కలిగింది. అందరూ సంతోషించారు.

మరోసారి బాలాంబగారి నడవడిక పై ప్రత్యర్థులు కొందరు లేని పోనీ ఆరోపణలు చేస్తే భరించలేక ప్రాణత్యాగం చేసుకోవటానికి లోతైన నూతి లోకి దూకగా భక్తవరదుడు లక్ష్మీ నృసింహస్వామి కాపాడి అంతర్హితు డయ్యాడు. ఇలా చాలా సార్లు ఆమె పై ఆరోపణలు రావటం నరసింహస్వామి కాపాడటం జరిగింది. ఒక సారి నరసింహస్వామి అయిదేళ్ళ బాలుడుగా కనిపించి "అమ్మా !నాకు ఆకలిగా ఉంది అన్నం పెట్టు "అని అడిగితే, అమ్మ గ్రహించి చేతులు రెండూ జోడించి "నరసింహ దేవా !ఈ అబలను పరిహసిచ టానికి బాలుడవై వచ్చావా ?విశ్వ గర్భుడవైన నీకు అన్నం పెట్టటానికి నేనెవరి నయ్యా ""అని పాదాలపై పడి స్మృతికోల్పోతే, స్వామి నిజరూప దర్శనం అనుగ్రహించి "అవ్వా !నీ వలన ఇక్కడ నిరతాన్న దానం అవిఘ్నంగా జరుగుతుంది. నీ దీక్ష నిర్విఘ్నంగా సాగు గాక "అని చెప్పి అదృశ్యమయ్యాడు.

మంగళ గిరి గ్రామం లో అన్నదాన కార్య క్రాన్ని బాలాంబ గారు ప్రారంభించారు. అన్నం పెట్టేటప్పుడు ఏ భేదమూ పాటించే వారు కాదు. అదే ఆమె విశిష్ట వ్యక్తిత్వం. ఆ నాటి సంఘ ఆచార వ్యవహారాలలో ఇదొక గొప్ప ముందడుగే. నిరాడంబరం గా, అదొక సేవా భాగ్యం గా అన్నదానాన్ని నిర్వహించేవారు. స్వ,పర భేదాన్ని ఏనాడు పాటించని సమద్రుష్టి బాలాంబ గారిది. ఆడంబరాల జోలికి పోకుండా ప్రశాంత చిత్తం తో నిరతాన్న దానాన్ని కొన సాగించారు.. క్రమంగా బాలాంబ గారి వితరణ అందరికీ తెలిసి అందరి అభిమానానికి పాత్రురాలయ్యారు బాలాంబ గారు. ఆమె వారికి ఒక అన్నపూర్ణా దేవిగా గోచరిం చేవారు.

గ్రామం లోను, చుట్టు ప్రక్కల గ్రామాలలోను బాలాంబ గారి సేవా తత్పరత ను గుర్తించిన దాతలు సహాయం చేయటానికి ముందుకొచ్చారు. వారి సహాయ సహకారాలను స్వీకరించి బాలాంబ గారు అన్నదానాన్ని క్రమం గా విస్తరింప జేశారు. నిత్యం బాటసారులు, పేదలు భక్తులు, వందలాదిగా వచ్చి బాలాంబ గారి "అన్న దాన సత్రం "లో అన్నదానాన్ని స్వీకరించి సంతృప్తిపొంది దీవించి వెళ్ళేవారు. పుణ్య క్షేత్రమైన మంగళ గిరి పానకాల స్వామిని దర్శించటానికి వచ్చే భక్తులకు, బాటసారులకు ఇతరగ్రామాలనుండి స్వంత పనుల నిమిత్తం వచ్చేవారికి అది ఒక కేంద్రమై నిలిచింది. బాలాంబ గారు అనే ఒక వ్యక్తి ఇప్పుడు ఒక మహా సంస్థ గా ఎదిగారు. ఇంతటి భారీకార్య క్రమానికి కావలసిన వనరులు కూడా భారీగానే అవసరం కదా.

స్వామిఅనుగ్రహం తో నిరతాన్నదానం నిర్విఘ్నం గా సాగిపోతోంది.అడగకుండా నే భోజన పదార్థాలు కుప్పలు తెప్పలుగా వచ్చి పడేవి.ఈ వైభవాన్ని కూడా జీర్ణించుకోలేని ప్రత్యర్థులు ఆమె శిరోజాలు తీసేయకపోతే వెలి వేస్తామని బెదిరించారు. వారి బాధ భరించలేక మంగలిని పిలిపించి ముండనంచేయించుకోవటానికి సిద్ధపడింది. క్షురకుడు కత్తిపట్టుకొని జుట్టు గొరుగుదామని ప్రయత్నిస్తే, అమ్మ గారి బదులు సింహం కనిపించి వాడు భయం తో పారిపోయాడు. ఒకసారి ఒక రచయిత మల్లాది సుబ్బదాసు గారి జీవితచరిత్ర రాయాలనుకొని బాలాంబగారిని విశేషాలు తెలియ జేయమనికోరితే వివరాలు చెప్పి ఆరోజులు మహాలయ పక్షం రోజులు కనుక పితృ ప్రీతికరం కనుక ఆ రాత్రి భోజనమా ఫలహారమా అని అడిగితె ఫలహారమే అని చెబితే, పిండి చేయించనా అంటే సరే అనగా, చేయించి పీట వేసి కూర్చోపెట్టగా ఆయన ప్రక్కన మరో పీట మీద ఇంకొక అతిథి కూర్చోగా ఇద్దరికీ అమ్మగారు దోసెడు దోసెడు అరిసెలు వడ్డించారు. రెండు అరిసెలతో కడుపు నిండిపోయింది. మళ్ళీ రెండు పెరుగు ఆవడలు, రెండు లడ్డూలు వడ్డించారు. తినేలోపు "పిండి చేయమన్నావుగా నాయనా "అంటూ విస్తరిలో కుమ్మరించి,

చిక్కని మజ్జిగ పోసి తినమంటే ఆ రచయిత "అమ్మా! అన్నదానం పేరుతో అతిధుల ప్రాణాలు తీస్తున్నావు. ఇది కడుపు అనుకొన్నావా కళ్ళేపల్లి చెరువు అనుకొన్నావా? ఖాళీ ఉండద్దా తినటానికి ?"అని సరదాగా అంటే "నాయనా !నరసింహ నామ స్మరణ చెయ్యి అని మూడు సార్లు నామాన్ని అనిపించగా కడుపుఖాళీ అయి అన్నీ ఆబగా తినేశాడట.

మరో సారి సంక్రాంతి రోజున సత్రం లో బ్రాహ్మణులు భోజనాలు చేస్తుంటే, బాలాంబ గారు బంతులన్నిటినీ తిరుగుతూ పర్యవేక్షణ చేస్తుంటే, వంటవాడు వచ్చి "అమ్మా !దొడ్డి గుమ్మం నుంచి ఒక పంచముడు లోపలి వస్తుంటే బ్రాహ్మణ భోజనాలు అయ్యేదాకా ఆగమంటే ఆగటం లేదు" అని చెప్పగా వెంటనే అతడి దగ్గరకు వెళ్లి దొడ్లో ఒక చోట విస్తరి వేయించి వడ్డింప జేసి తృప్తిగా భోజనం పెట్టించారు బాలాంబ గారు. అమ్మగారు చూస్తుండగానే అతడు అదృశ్యమయ్యాడు పానకాల నరసింహ స్వామి ఆ వేషం లో వచ్చాడని గ్రహించారు. ఒకసారి మంగళగిరి తిరునాళ్ళకు వేలాది మంది వస్తే, 18 మానికల బియ్యం బాలభోగానికి వండించారు. ఐదారువందలమంది బాలురు బాలభోగానికి వచ్చి కూర్చున్నారు. వండిన అన్నం సరిపోదని వంటవాళ్లు గుంజాటన పడుతుంటే ముసలితనంలో ఉన్న బాలాంబగారు వచ్చి అన్నం రాశి పోయించి గుడ్డ కప్పి కర్పూరహారతి పట్టి, తానేఅన్నాన్ని పళ్ళాలలో నింపి ఇస్తుంటే ఎన్ని పళ్ళాలులు తీసినా రాశి తరగక అందర్నీ ఆశ్చర్యపరచింది. అదంతా నరసింహస్వామి ప్రభావం అని వినమ్రంగా అమ్మగారు చెప్పేవారు.

వనరుల సేకరణ: అందుకని బాలాంబ గారు ఎద్దుల బండీ మీద గ్రామాలలో పర్య టిం చేవారు. రైతులు అంద జేసే బియ్యం, పప్పులు కూరలను సేకరిం చేవారు. రైతులు కూడా ఇదొక పవిత్ర యజ్ఞం అని భావించి తామూ అందులో భాగాస్వాములవుతున్నందుకు అధికమైన సంతోషం తో ఇష్టపూర్తిగా అన్నీ అందజేసి, అది తమ పని గా భావించి సహాయ పడేవారు. పంటలు చేతికొచ్చినప్పుడు రైతులు బాలంబ గారి సత్రం లో సరుకులు తోలుకొని వెళ్లి పడేసేవారు మంగళ గిరి స్వామి తిరునాళ్ళకు వచ్చే అసంఖ్యాక భక్త జనాలకు సత్రం లో కమ్మని రుచికరమైన శుచికరమైన భోజనాన్ని వండించి దగ్గరుండి వడ్డింప జేసేవారు బాలాంబ గారు. 1926 లో బాలాంబ గారు "మంగళ గిరి అన్న పూర్ణ సత్రం "అనే పేరుతో ఒక ధర్మ సంస్థను నెలకొల్పారు. అన్నదానం ఒక నిరంతర కార్య క్రమంగా మారిపోయింది. ఆమె కీర్తి ప్రతిష్టలు జిల్లాలు దాటి రాష్ట్రమంతా వ్యాపించాయి

మరోసారి బ్రాహ్మణ సంతర్పణకు విపరీతంగా బ్రాహ్మణులు వచ్చారు. వడ్డనలు పూర్తయ్యాయి. అభేరించటానికి కూడా నెయ్యి లేదు. వడ్డనవారు గుసగుసలాడుతుంటే విని పళ్ళెం లో కర్పూరం వెలిగించి వాకిట్లో నిలబడి నరసింహస్వామికి హారతిచ్చి నిలబడగా కర్నూలు నుంచి సెల్ఫ్ ఆర్డర్ తో నేతి డబ్బాల బండి వాకిట్లోకి వచ్చి, అమ్మగారికి అప్పగించి రసీదు పొంది వెళ్ళిపోయాడు బాలాంబగారి భక్తీ తపరతకుందరూ పొంగిపోయారు. ఈ నెయ్యి తో సంతర్పణ వైభవంగా పూర్తి చేశారు.

ఇదొక పవిత్ర యజ్ఞం అని భావించి తామూ అందులో భాగాస్వాములవుతున్నందుకు అధికమైన సంతోషం తో ఇష్టపూర్తిగా అన్నీ అందజేసి, అది తమ పని గా భావించి సహాయ పడేవారు. పంటలు చేతికొచ్చినప్పుడు రైతులు బాలంబ గారి సత్రం లో సరుకులు తోలుకొని వెళ్లి పడేసేవారు మంగళ గిరి స్వామి తిరునాళ్ళకు వచ్చే అసంఖ్యాక భక్త జనాలకు సత్రం లో కమ్మని రుచికరమైన శుచికరమైన భోజనాన్ని వండించి దగ్గరుండి వడ్డింప జేసేవారు బాలాంబ గారు. 1926 లో బాలాంబ గారు "మంగళ గిరి అన్న పూర్ణ సత్రం "అనే పేరుతో ఒక ధర్మ సంస్థను నెలకొల్పారు. అన్నదానం ఒక నిరంతర కార్య క్రమంగా మారిపోయింది. ఆమె కీర్తి ప్రతిష్టలు జిల్లాలు దాటి రాష్ట్రమంతా వ్యాపించాయి.

### యోగిని బాలాంబ గారు

ఫల ప్రాప్తికోసం కాకుండా అన్నదానం ఒక కర్తవ్యమ్ గా భావించి చేస్తున్న బాలాంబ గారు కేవలం ఒక యోగిని లాగా నే జీవించారు. యోగం లో ఆమెకు కొన్ని అద్భుత శక్తులు అలవడ్డాయి. ఎన్నో మహత్తులు ప్రదర్శించేవారని చెప్పుకొనేవారు. గుంటూరు సీమ అంటేనే ఆ నాడు కరువు ప్రాంతం. మెట్టపంటలేకాని మాగాణి భూములు చాలా తక్కువ. ఇంట్లో ఉన్న బావి నుండి నీరు తోడాలంటేనే మంగళ గిరి కొండ అంత ఎత్తున్న పొడవైన చేంతాడు కావాల్సి వచ్చేది. ఎక్కడో పాతాళం లో ఉన్నట్లు నీరు బావిలో కనిపించేది. దాన్ని చిన్న బొక్కెనతో పైకి తోడాలంటే చేతులు అరిగిపో యేవి బుజాలు నొప్పి పుట్టేవి. ఒక బకెట్ నీరు లాగిన వాడు బాల చంద్రునితో సమాన పరాక్రమం గలవాడనే వారు. అదీ ఆనాటి పరిస్తితి. ఎవరైనా పొడుగ్గా ఉంటె "మంగళ గిరి చాంతాడంత ఉన్నాడు "అనే సామెత లోకం లో బాగా ప్రచారమైంది. ఇవన్నీ బాలాంబ గారు స్వయం గా అనుభవించిన కష్టాలే. ప్రజల బాధ, వారి కాలేకడుపులు, గుక్కెడు మంచి నీటి కోసం అర్రులు చాచే దైన్యం చూసి చూసి ఆమె కడుపు తరుక్కు పోయేది. ఏదో చేయాలనే తపన మొదలై అన్నదానం చేసి వారికి కనీసం రోజు అన్నం తినే యోగ్యం కలిగించాలన్న భావనే ఆమెను అన్నదాన సత్ర నిర్మాణానికి ప్రోత్సహించి ఇంతటి మహత్కార్యాన్ని చేయించింది.

బాలాంబ గారు చిన్నప్పటి నుంచీ పురాణాలు చదివి అర్ధం చేసుకొని పారాయణ చేసేవారని చెప్పుకొన్నాం. ఇప్పుడు వైధవ్యం, దైవ భక్తికి తోడై అన్నదాన మహత్కార్యానికి దోహద పడింది. అందర్నీ తన ఆత్మీయులు గా చూసుకొనే మహత్తర ఆత్మ సంస్కారం వారికి అబ్బింది. బాలాంబ గారిని చూస్తె సంస్కృత శ్లోకం ఒకటి గుర్తుకు వస్తుంది –

"శతేషు జాయతే శూరః –సహస్రేషు చ పండితః –వక్తా శత సహశ్రేషు –దాతా భవతా వా నవా "

అంటే-శూరుడనే వాడు వందల్లో ఒకడు ఉంటాడు. పండితుడు అనేవాడు వేలల్లో ఒకడే ఉంటాడు. వక్త లక్షల్లో ఒకడు ఉండచ్చు. కాని "దాత "అనే వాడు అసలు ఉంటాడో ఉండడో.అంటే దాత అనే వాడు లభించటం బహు అరుదు అని భావం. సంప్రదాయపు కట్టు బాట్లను అతిక్రమించి అన్నదానం అనే పవిత్ర కార్యక్రమానికి ఆమె శ్రీకారం చుట్టారు. కరువు కాటకాతో అలమటించే బీదల కాలే కడుపులకు ఇంత అన్నం పెట్టి ఆదుకొన్న మరో అన్న పూర్ణ, శాంతానికే శోభావైభవం బాలాంబ గారు. ఎవరి మెప్పుదలా మేహర్బానీకోసం చేసిన పనికాదు. ఆత్మ సంతృప్తికోసం బాధితుల కన్నీరు తుడవటానికోసం ఆమె గారు చేసిన ఉడతంత సాయం. అదే మహద్భాగ్యం ఆ రోజుల్లో. అందుకే ఆమె మహా దాతల శ్రేణిలో చేరారు. నిరతాన్న దానం చేస్తూ ఆత్మ సంతృప్తి పొందుతూ దారిద్ర నారాయణ సేవతో పునీతమవుతూ జీవితాన్ని ధన్యం చేసుకొంటూ భగవద్భక్తిలో తాదాత్మ్యం చెందుతూ 95 ఏళ్ళ నిండు జీవితాన్నిసంతృప్తిగా గడిపి, కైవారం బాలాంబ గారు 12-8-1944 న మన స్వాతంత్ర్యం రావటానికి సరిగ్గా ఏడాది ముందు స్వర్గస్తులయ్యారు. "అన్న దాతా సుఖీ భవ"

# 31 మహర్షి పీరోజీ

రామనామ జపసిద్ధి పొందిన పీరోజీ 1829 విరోధి ఆశాఢ శుద్ధ ఏకాదశి నాడు నర్సోజీ, నర్సూబాయ్ దంపతులకు జన్మించాడు. తమ్ముళ్ళు వెంకోజీ, గోపాలరావు. చిన్ననాటనుంచే భగవద్ధ్యానం భక్తీ అబ్బాయి. పదేళ్ళకే సంస్కృతం లో పాండిత్యం అబ్బింది. పన్నెండేళ్ళకే కవిత్వం రాశాడు. సహజ పాండిత్య ప్రకర్ష ఉన్నవాడు. ఒకరోజు అనుకోకుండా చిదానంద యోగి వచ్చి ఇతని అభిలాష గమనించి తారమంత్రం ఉపదేశించి వెళ్ళాడు. భక్తి శ్రద్ధలతో జపం చేసి సిద్ధి పొందాడు.

15 వ ఏట వీరాబాయ్ తో పెళ్లి అయింది. ఆమె సాధ్వి సుశీల. భర్తకు అన్ని విధాలా సహకరించేది. సద్గ్రంథ రచన చేయాలనే కోరికతో పీరోజీభద్రాచలం వెళ్లి ఇష్టదైవం శ్రీరాముని దర్శించి, పులకిత గాత్రుడై స్వీయ కృతులు రామునకర్పించి ధన్యుడయ్యాడు. తనకున్నజ్ఞానాన్ని శిష్యులకు బోధిస్తూ వారిని సన్మార్గం లో నడిపేవాడు. క్రమంగా శిష్యులు పెరిగి జమీందారు అభిమానమూ పొంది పేరుపొందాడు అపరాదత్తావతారం హుస్నాబాద్ నివాసి మాణిక్ ప్రభు పీరోజి శిష్యుడైనాడు. 1889 జులై 9 న విరోధి వత్సర ఆషాఢ శుద్ధ ఏకాదశి నాడు మహర్షి పీరోజి రామనామ స్మరణ చేస్తూ, లింగోద్భవ కాలం లో పరమపదం చేరారు.

మహర్షి పీరోజీ 1-నవ కుసుమమాల 2పన్నగాచల నాయక శతకం 3-గజేంద్ర మోక్షం 4-పరమానంద సుధా లహరి 5-దశావతార దండకం 6-శేష గురు శతకం 7-నమశ్శివాయగేయాలు 8-సాత్రాజితీయం 9-పంచీకరణం 10-శ్రీరామ శతకం 11-స్వప్రకాశం 12-ఆచార్య శతకం 13-తత్వ సంగ్రహం 14-ప్రహ్లాద చరిత్ర రాశారు.

మహర్షి అనేక దివ్యమహిమలు చూపారు. బవిరి శెట్టి ఓబయ్య అనే వైశ్యుడు, తన చేలో పశువులు పడి తిన్నాయనే కోపం తో పశులకాపరి తిట్టి ఆవులను బందలదొడ్డి లో పెడుతుంటే మహర్షి చూసి అతనికి వచ్చే ప్రమాదం తెలీకుండా ఉన్నాడని అతనిపై జాలిపడ్డారు.ఆ రాత్రి ఓబయ్య, భార్య విపరీతం గా పోట్లాడుకొని, భార్యను బయటికి నెట్టి తలుపులు బిగించుకొని ఉరేసుకొని చనిపోయాడు. దీన్ని బట్టి పీరోజీ మహర్షి త్రికాల వేది అనే నమ్మకం కలిగింది. మరోసారి పనిమీద వేశ్యా వీధినుంచి వెడుతూ ఉండగా శ్రీహరి అనే వేశ్య కామ చేష్టలతో మహర్షి ని ఇంట్లోకి రమ్మని కోరింది. లోపలి వెళ్ళగా ఉచితాసనం పై కూర్చోపెట్టి అన్ని రకాల సపర్యలు చేసి తన కోరిక వెళ్ళబెట్టింది. కోప పడకుండా చిరు నవ్వుతో సోదరీ భావం తో జ్ఞానబోధ చేసి, ప్రేమ దృష్టి ప్రసాదించి ఆ రొంపి లో నుంచి ఉద్ధరించారు.

మరోసారి అడవిలో మేసే జమీందారు గారి ఆవును ఒక పెద్దపులి పట్టుకోగా ఆమార్గాన భజన చేసుకొంటూ వెడుతున్న మహర్షి చూసి చేతికర్ర తోయుడిపించి ఇస్,ఇస్ అంటూ అదలించగా అది ఆవును వదిలి పోగా, వెంట ఉన్న భక్తులకు వారి సర్వజ్ఞత్వం అర్ధమైంది. ఒకసారి నీలిమందు వ్యాపారం చేసే కోట అప్పయ్య "ఇప్పుడు నీలిమందు అమ్మితే లాభమా నష్టమా చెప్పండి "అని అడిగితే "లాభ నష్టాల మాట తర్వాత ముందు అర్జెంట్ గా గిడ్డంగి ఖాళీచేయించు "అన్నారు. మహర్షి మాటపై నమ్మకం తో ఆరోజే ఖాళీ చేశాడు మర్నాడు అగ్ని ప్రమాదం లో అతడి నీలిమందు గోడౌన్ పూర్తిగా తగలబడింది.

పంధ్యా కోటప్ప అనే ఆయన "దేవుడిని చూపించండి "అని " పరిహాసంగా అడిగితే "పిచ్చోడా పో పో "అన్నారు. అంతే అతడు నిజంగానే పిచ్చివాడై తిరిగాడు. అతడి బంధుజనం వచ్చి కాళ్ళపై పడి ప్రార్ధిస్తే దయాళువై పిచ్చిని భక్తిగా మార్చి శిష్యుడిని చేసుకొని ఆదరించిన నిష్కళంకుడు పీరోజీ. భార్య నర్సూ బాయి కి కలరాసోకిందని ఉత్తరం వస్తే, అమావాస్య రోజు చిలుకూరు నుంచి సత్తెనపల్లికి వెడుతుంటే నలుగురు దొంగలు అడ్డగించగా, వారిని శ్రీరామ సోదరులుగా భావించి "ఎంతో బ్రహ్మానందమాయెనే-మన చింతలన్నియు తీరిపోయేనే " అని పాడుతూ నృత్యం చేస్తే, దొంగల బుద్ధిమారి, తప్పులు మన్నించమని పాదాలపై పడితే కనికరిస్తే వాళ్ళు సత్తెనపల్లి దాకా తోడు వెళ్ళారు. తర్వాత శిష్యులయ్యారు కూడా. సత్తెనపల్లి చేరి మరణ శయ్యమీద ఉన్న భార్యను తల్లిపాలు లేక అలమటించే పిల్లాడిని చూసి, కలరాభయం తో గజగాజలాడు తున్న ఊరి జన దీన వదనాలను చూసి వెంటనే చెరువుకు వెళ్లి స్నానం చేసి ఒడ్డునున్న చెట్టు కింద కూర్చుని తపం ప్రారంభించగా ఆ సాయంకాలానికే ఊళ్ళో కలరా తగ్గటం మొదలైంది. కలరానుంచి భార్యతో సహా అందరూ తేరుకొని సంపూర్ణారోగ్యం పొందారు.

ఒకసారి భద్రాచల యాత్రకు వెడుతుంటే దారిలో మొలకల పల్లి దగ్గర ఆగి వంట ప్రయత్నం చేస్తుంటే బండీ లో వేసిన బియ్యం బస్తాకనిపించలేదు. ఇంతలో ఒక కొత్తవ్యక్తి దారిలో బియ్యం బస్తా కనిపించిందని చెప్పి అప్పగించి వెళ్ళాడు. వంటలుపూర్తయి అందరూ హాయిగా భోజనాలు చేశారు. ఇది మహర్షి 54వ ఏట జరిగింది. "యెంత దయార్ద్ర మానసుడవు –నే నెంత వేడిన గనపడవు "అని ఆర్తిగా పాడుకొంటూ భద్రగిరి చేరి శ్రీరామ దర్శనం చేశారు మహర్షి పీరోజీ.

# 32 భక్తమణి పాటిబండ్ల వీరయార్య

పాటిబండ్ల వీరయ్య గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా దీపాలదిన్నె గ్రామం లో బాపయ్య, బాపమ్మ దంపతులకు 1867లో పుట్టాడు. భార్య వెంకట నరసమ్మ. ఎనిమిదో ఏట బులహరి పీరోజీ మహర్షి వారం రోజులు ఆధ్యాత్మిక ప్రవచాలు చేస్తున్నప్పుడు, విని అడగకుండా గురు సేవ చేశాడు. నిరంతరం ఆయన వెంటఉంటూ అనుగ్రహం పొందాడు. 12వ ఏట దేవాబత్తుని అచ్చమాంబ ను తనకు పీరోజీ తో ఉపదేశం ఇప్పించమని కోరగా, ఆమె ఆయనకు చెప్పగా, సమయం కోసం వేచి ఉండమని చెప్పారు. 15 వ ఏడు రాగానే పీరోజీ గురువు పిలిపించి కోర్కె తీర్చారు. అప్పటి నుంచి ఇంటిపనులలో తలిదండ్రులకు తోడ్పడుతూ, రాత్రి భోజనం చేసి, సత్తెనపల్లి వెళ్లి, గురు సేవ చేసి ఉదయాన్నే మళ్ళీ ఇల్లు చేరేవాడు. ఇలా మూడేళ్ళు గడిచాయి.

ఒక రోజు గురు సేవలో నిద్రరాగా తనను తానసే సంబాలించుకొని పొరపాటు క్షమించమని గురువును కోరగా ఏమీ అనకుండా అనుగ్రహం చూపాడు. గురూప దేశం పొందిన మూడేళ్ళకు ఏదైనా మహిమ ప్రయోగించమని కోరగా. హస్తమస్తకప్రయోగం తో ఏకత్వాన్ని ప్రసాదించాడు. యోగ సిద్ధి లభించింది. సాత్విక లక్షణాలు పెరిగి, అప్పుడప్పుడు మైమరచిపోతున్నా వ్యవసాయ కార్యాలు యధా విధిగా చేసేవాడు. ఒక రోజు ఉదయం చద్ది తిని అరక దున్నటానికి పొలం వెళ్ళాడు. ఎద్దులని మేతకు వదిలి, తుమ్మచెట్టుకింద ఖేచరీ ముద్రతో కూర్చుని, సమాధిగతుడయ్యాడు. మేత తిన్న ఎడ్లు ఇల్లు చేరాయి. కొడుకు రాలేదని భయపడి తండ్రి వస్తే నిశ్చలలసమాధి లో కనిపించగా ఆశ్చర్యపోయాడు. ఒళ్ళంతా గండు చీమలు పాకుతున్నాయి. తన ఉత్తరీయం తో చీమల్ని దులుపుతుంటే వీరయ్య స్పృహలోకి వచ్చాడు. తండ్రితో ఇంటికి చేరాడు.

కొడుకు ధ్యానయోగం అర్ధం చేసుకొని పొలం పనులు చెప్పటం మానేశాడు తండ్రి. సత్తెనపల్లి లోనే ఉంటూ గురు సేవలో, ఆధ్యాత్మిక విషయ అవగాహనలో ధన్యుడయ్యాడు వీరయ్య. పీరోజీ గారికి నంజువ్యాధి ఎక్కువై నందున కంటికి రెప్పలాగా గురువును కాపాడాడు. 8-7-1886 న ఉదయం 8గంటలకు తండ్రి నుంచి

వచ్చిన ఉత్తరం చూసి ఆయన తీవ్రవ్యాధితో బాధపడుతున్నాడని గ్రహించి గురువు ఆనతి పొంది ఇంటికి చేరి తండ్రి ఆరోగ్యం కుదుటపడటానికి అన్ని ప్రయత్నాలు చేస్తుండగా 19-7-1886 న పీరోజీ గురువు మహా సమాధి చెందినట్లు తెలిసినా వెళ్ళలేక పోయాడు వీరయ్య. పగలంతా తండ్రి సేవలో గడిపి రాత్రి నిద్రపోతే గురువు కలలో కనిపించి తాను శివ సన్నిధికి చేరానని చెప్పి అదృశ్యమయ్యారు. మర్నాడు ఉదయం ఆ వార్త తండ్రికి చెప్పి అనుమతి పొంది సత్తెనపల్లి వెళ్లి, అంత్యక్రియలు యధావిధిగా జరిపించి గురుపత్ని వీరాబాయిని, గురుపుత్రులను ఓదార్చి మైమరచి ఉండగా గురు దర్శనం కలిగి తానూ, శిష్యుడూ శాశ్వతులమే అనీ, ఇద్దరి గమ్యం ఒక్కటే అని బోధచేశారు. ఈ విషయం గురుపత్నికి కుమారులకు అందరికీ తెలిపి అందరి వద్దా సెలవు పొంది స్వగ్రామం చేరాడు.

పెళ్లి చేసుకోను అన్న వీరయ్యను గురుపత్ని ఒప్పించి వెంకట నరసమ్మ అనే కన్యతో వివాహం జరిపించారు. ఒక కూతురుపుట్ట గానే ఆత్మ సన్యాసం తీసుకొని, జీవితాంతం బ్రహ్మ చర్యాన్ని పాటించాడు వీరయ్య. గురువుగారి సమాధికిఅధ్యక్షులైన గురుపుత్రుడు లక్ష్మీ జీ గారికీ నంజు వ్యాధి వచ్చి, పిఠాపురం తీసుకు వెళ్లి మందులు ఇప్పించినా తగ్గకపోతే లక్ష్మీ జీ,గురుపత్నుల కోరికపై వీరయ్యార్యుడు పీఠాధిపత్యం స్వీకరించారు.గురుపత్ని సాయంతో ఆశ్రమాన్ని అన్ని విధాలుగా అభి వృద్ధి చేసి సంస్కృతాంధ్రాలలో గొప్ప పాండిత్యం సాధించి, ఆశుకవిత్వం చెప్పటం తో మహాకవి అయ్యాడు. గురువుగారి మనవడుపీరోజీ బాబుకు ఆశ్రమ బాధ్యత అప్పగించి దుందుభి నామ సంవత్సర కార్తీక శుద్ధ పంచమి 9-11-1922 న హరి నామ స్మరణ చేస్తూ వీరయార్యుడు పరమపదం పొందారు. తనకు జరగాల్సిన అపర కర్మ విధానం శిష్యులకు వివరిస్తూ గురువు రాసిన ఆచలాద్వైత సిద్ధాంత గ్రంథం మననం చేస్తూ, పూర్తి స్పృహతో వీరయార్యుడు దేహం వదిలారు. భార్య వెంకట నరసమ్మ "నాకేమి సందేశం ఇస్తున్నారు ?"అని అడిగితే "ఐహికం అనేది లేదు సర్వ వ్యాపకమైన సచ్చిదానంద పరబ్రహ్మమే ఉంది. దాన్ని అనుభవించు "అని చెప్పారు. పీరోజీ గారి సమాధి దగ్గరే ఈయన సమాధి కూడా ఏర్పాటు చేశారు. ఇనగంటి పున్నమార్యుడు వీరయార్యుని ముఖ్య శిష్యుడు. గురువు గారి వెంట తిరిగే కుక్క అనుకోకుండా వస్తే, దాన్ని తన ఇష్ట దైవంగా భావించి పాదప్రక్షాళనం మొదలైన సపర్యలు చేసి పూజించి, గురువుకు అపగించిన ధన్యజీవి వీరయార్యుడు.

## 33 తారక బ్రహ్మ వంగల నారాయణప్ప

గుంటూరు జిల్లా నరసరావు పేట తాలూకా జగ్గాపురం లో 19వ శతాబ్దిలో వంగల కొండంభొట్లు, కావేరమ్మ దంపతులకు కేశవభొట్లు, సుబ్బమ్మ, నరసమ్మ, సీతమ్మ సంతానం. ఆడపిల్లల పెళ్ళిళ్ళు అయి రామకూరు, వేలూరు, ధర్మవరాలలో హాయిగా కాపురాలు చేసుకొంటూ వృద్ధిపొందారు, కేశవ నే నారాయణ మూర్తి, నారాయణ భొట్లు అనేవారు. వ్యవసాయమే ఆధారమైనా ఎవర్నీ చెయ్యి సాచి అడగని అభిమాన ధనుడు. నిత్యం ఎవరో ఒకరు ప్రక్కన కూర్చుని భోజనం చేస్తేకాని ఆయనకు తృప్తి ఉండేదికాదు.. వారింట్లో ఎప్పుడో ఒకప్పుడు భోజనం చేయని గుంటూరు వాసి ఎవరూ లేరు.

ఒకసారి కోనసీమ నుంచి వేద వేత్తలైన ముగ్గురు బ్రాహ్మణులు దేశాటనం చేస్తూ వస్తే, వారిని బంధువులను ఆదరించినట్లు ఆదరించి భోజనాలు పెట్టి సంతృప్తి చెందించిన పుణ్యమూర్తి.వీరితో పాటు 10 మంది బ్రాహ్మణులు కూడా పంక్తిలో కూర్చుని భోజనం చేస్తున్నారు. నవలాయ పిండి వంటలతో భోజనం తయారు చేసి వడ్డించి తినిపిస్తున్నారు ఆ దంపతులు. చివరికి మరదలు లక్ష్మి నరసమ్మగారు పెరుగు వడ్డించింది. అందరూ తృప్తిగా తిన్నారు కానీ ఒక బ్రాహ్మణుడు పెరుగన్నం లో చెయ్యి పెట్టి ఏడుస్తున్నాడు. "భోజనలోపమా ఆదరణలోపమా ఎందుకు భోజనం చేయట్లేదని అడిగాడు గృహస్తు.అప్పుడాయన "ఏ లోపమూ లేదు. నాకు ముగ్గురు కొడుకులు, నలుగురు కూతుళ్ళు. వాళ్లకు ఎప్పుడూ ఇలాంటి భోజనం నేను పెట్టనే లేదు. నా కడుపున పుట్టి వాళ్ళు నిర్భాగ్యులుగా పెరుగుతున్నారు. మీలాంటి సంపన్నుల ఇంట్లో పుడితే మృష్టాన్న భోజనం తినే వారు కదా అని ఏడుస్తున్నాను "అని బావురుమన్నాడు. నారాయణప్ప "మీ కోరిక భగవంతుడు తప్పక తీరుస్తాడు దుఖిచకండి "అని ఓదార్చి తినిపించాడు.

భోజనాలయ్యాక అందరూ తాంబూలాలు వేసుకొని కబుర్లు చెప్పు కొంటుండగా, పూటకు మానెడు పాలిచ్చే గేదె తో తనదగ్గరకు వచ్చిన పాలేరు చేతిలో కొంత డబ్బు దారి ఖర్చులకోసం పెట్టి, ఆ గేదెను, ఆ బ్రాహ్మణుడి ఇంటికి తోలుకు వెళ్లి అప్పగించి రమ్మని చెప్పాడు. దాని పోషణ కోసం ఒక యకారం భూమికూడా దానం చేశాడు ఉదార హృదయం తో. నిష్కామ సేవా పరుడైన నారాయనప్ప ఆరాధన పేరుతొ ప్రతి ఏడాది తన శిష్యబృందాన్ని అందరినీ పిలిచి సోదరులలాగా ఆదరించి భోజన సత్కారాలు చేసి,బహుమానాలిచ్చి పంపేవాడు. కోనసీమ పండితులు చెప్పుడుమాటలు విని అసూయతో పరీక్షించటానికి వస్తే బ్రహ్మ విద్యలో తన స్వానుభవం చూపించి నిరుత్తరుల్ని చేశాడు.

వరుసగా ఇరవై ఏళ్ళు భద్రాద్రి శ్రీ సీతారామ కల్యాణానికి కాలినడకన వెళ్లి చూసి తరించిన భాగ్య శీలుడు నారాయణప్ప. భక్త బృందం తో ఇంటి నుంచి భజన చేస్తూ బయల్దేరి, భద్రాద్రి కల్యాణ శోభ తిలకించి, పర్ణశాల చూసి, మళ్ళీ ఇంటికి చేరి మహా సంతర్పణ శ్రీ రామార్పణం అంటూ చేసేవాడు. మూడు సార్లు కాశీ యాత్ర, రెండు సార్లు రామేశ్వర యాత్ర చేసి, తెచ్చిన గంగాజలం తో తలిదండ్రులను అభిషే కించేవాడు. చివరి సారి తలిదండ్రులతో కాశీ వెళ్లి దేహాన్ని విశ్వేశ్వరునికి అర్పించి రుణత్రయ విముక్తు డయ్యాడు.

పన్నెండవ ఏట నుంచి గురువు వద్ద చక్కగా వేద శాస్త్రాలు అభ్యసించి, వాటి సూక్తుల్ని అనుభవం లోకి తెచ్చుకొని, పాలేళ్ళతో మంచి వ్యవసాయం చేస్తూ చేయిస్తూ, ధనధాన్య సమృద్ధి పొంది దాన ధర్మాలు నిరంతరం కొనసాగించాడు. తన ఊళ్ళోతన స్థలం లో ఒక చిన్న కుటీరం నిర్మించుకొని పూల వనం పెంచి బావి త్రవ్వించి, ఆ బావి జలం తో ప్రతి ఉదయం స్నానించి సంధ్యావందనం చేసి కుటీరం లో జప దీక్షలో మునిగిపోయేవాడు. నారాయణ భొట్లు. ఆసమయం లో

గాయత్రీ మాట సర్పాకృతి ధరించి ఆకుటీర ప్రాంతం లో తిరుగుతూ, ఆయన సమాధి నుంచి లేచే సమయానికి అదృశ్యమయ్యేది అని అందరూ చెప్పుకొనే వారు. ఈ మాట తెలిసి, ఎవ్వరూ ఆయన దీక్షకు అంతరాయం కలిగించేవారు కాదు.

ఒక సారి శిష్యులైన వేద విద్యార్ధులతో రాత్రి భోజనం చేసి ఆ కుటీరం లో పడుకొని ఉన్నాడు. ఒక నాగు పాము అర్ధరాత్రి సమయం లో వచ్చి నారాయణప్ప ప్రక్కలో పడుకొని, ఆయన చెవిపై పడగ ఉంచిందట. ఇంతలో ఒక శిష్యుడికి మెలకువ వచ్చి ఆ దృశ్యం చూసి నోటమాట రాలేదట. తర్వాత అందర్నీ లేపి ఒళ్ళూ వాళ్ళను పిలిచి చూస్తే పాము కనిపించలేదు. ఈ హడావిడికి గురువు గారు లేచి విషయం తెలుసుకొని "మా రామప్ప ఈ రకంగా దర్శనమిచ్చాడు కాబోలు "అన్నాడట. అప్పటి నుంచి శ్రీరాముడు ఆయన వెంట ఉండేవాడు. అందుకే ఆయన స్పర్శ తగిలితే వ్యాధులు నయమయ్యేవి. ఒకసారి కుమారస్వామి అనే కుష్టు రోగం తో బాధ పడే బ్రాహ్మణుడు నారాయణప్ప పొలం దున్నుతుంటే వెళ్లి తన గోడు చెప్పుకోగానే దగ్గరలో ఉన్న పొదరింట్లోని ఒక ఔషధ మొక్కను తీసి తినిపించగా, గుణం కనిపించి నెలరోజుల్లో వ్యాధి మాయమైపోయింది. ఇలాంటివి చాలా ఉన్నాయి.

## మనమెరుగని మరో" జొన్నల గడ్డ "




జొన్నలగడ్డ అంటే విజయవాడ ఎస్ ఆర్ ఆర్ కాలేజిలో ఇంగ్లీష్ లెక్చరర్,బహుభాషా వేత్త గొప్ప ఆరేటర్, అనేకగ్రందకర్త, అనువాదం చేయించటానికి రష్యాకు ఆహ్వానిపబడిన తత్వ వేత్త రష్యా వెడుతూ "ఆమంచు గడ్డలో ఈ జొన్నలగడ్డ ఏమౌతాడో"అని వీడ్కోలు సమావేశం లో మాతో చమత్కరించిన జొన్నలగడ్డ సత్యనా రాయణ మూర్తిగారు గుర్తుకు వస్తారు. ఇదే పేరుతొ మరొక ప్రసిద్ధులున్నారని చాలామందికి తెలీదు. వారిని పరిచయం చేసే భాగ్యం పొందుతున్నాను.

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తిగారు రాజమండ్రికి చెందిన ఆరువేల నియోగులు. తండ్రి మృత్యుంజయులు. హరితస గోత్రం. ఇలవేలుపు కామేశ్వరమ్మ. తల్లి వేంకమాంబ.తల్లిగారు పెమ్మరాజు నరసింహం గారి కుమార్తె. మూర్తిగారు స్వయం కృషితో అభివృద్ధి సాధించిన ఆదర్శమూర్తులు. ఎం.ఏ. బి ఎల్ పాసై మద్రాస్ హైకోర్ట్ న్యాయవాదిగా ఉన్నారు. కలకత్తా యూని వర్సిటీ లో ఇంగ్లిష్, ఫిలాసఫీ, హిస్టరీ, ఎకనామిక్స్, పాలిటిక్స్, లాజిక్, లా లలో డిగ్రీలు పొందిన బహు విషయవేత్త. బెంగాలీ, పాళీ భాషలలో లోతైన అవగాహన ఉన్నవారు. 1926 కలకత్తాలో "టాగూర్ ప్రైజ్"పొందిన ప్రతిభా శాలి. గిడుగు వెంకట నరసింహ మూర్తి గారి పుత్రిక, విదుషీమణి శ్రీమతి శారదాంబ గారు మూర్తి గారి ధర్మపత్ని. వీరిది ఆదర్శ దాంపత్యం. మూర్తిగారు తెలుగులో చాలా గ్రంథాలు రాశారు. ఆంధ్ర ప్రచారిణీ గ్రంధమాలకు, అద్దేపల్లి లక్ష్మణస్వామిగారి సరస్వతీ గ్రంథ మండలి ఎన్నో విలువైన పుస్తకాలు రాశారు. ఆంధ్ర మహాపురుషుల జీవితాలపై గ్రంథం రచించి, ఆంధ్ర రిసెర్చ్ యూని వర్సిటీలో "సాహిత్య భూషణ "బిరుదు, విజయనగరం లో "భారతీ తీర్థ "బిరుదు అందుకొన్న విద్వద్వరేణ్యులు. ఋషుల చరిత్రపై అమితా

సక్తి ఉన్నవారు. దేశం లో ఏ కొత్త వింత విషయం చెవిన పడినా స్వయంగా అక్కడికి వెళ్లి విషయసేకరణ చేసి రాసి ప్రచురించటం మూర్తిగారి ముఖ్య హాబి.

కాశీ రామేశ్వరాది అనేక పుణ్యక్షేత్రాలను దర్శించిన పుణ్యమూర్తి. కవి, పండిత పక్షపాతి. వీరి గ్రంథాలు విశ్వ విద్యాలయాలలో పాఠ్యగ్రంథాలుగా విరాజిల్లాయి. "సంపూర్ణ భక్త విజయం "పేరిట రెండు బృహద్ రచనలు చేశారు. క్లిష్టత లేకుండా సరళభాషలో అందరికీ అర్ధమయేట్లు రాయటం వీరి ప్రత్యేకత. ఇందులోని మొదటి భాగం లో 65మంది భక్త శిఖామణుల చరిత్ర ఉన్నది. 840 పేజీల బృహత్ గ్రంథం.వీరిలో అతి ప్రాచీన, ప్రాచీన, మధ్యమ నవీన భక్తులందరూ ఉన్నారు. దీనికి శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రిగారు విలువైన ముందుమాటలు రాశారు. ఇది 1943 లో ముద్రితం. ఇంతకంటే మూర్తిగారి వివరాలు తెలియలేదు.

అవతార పురుషులు -భక్త స్వామిలు

ఆంధ్ర మహా భక్తవిజయ కర్త-. శ్రీ పంగులూరి వీర రాఘవుడు

సుమారు 1957 లోనే "ఆంధ్ర మహా భక్త విజయం "అనే అమూల్య రచన చేసినవారు శ్రీ పంగులూరి వీర రాఘవుడు గారు. ఈ పు స్తకం పై రెడ్డిపాలెం ఆనందాశ్రమానికి చెందిన యోగి పుంగవులు శ్రీ లక్ష్మీ కాంత యోగి ఇలా వివరిచారు-"ఇండియాలో ఇతర దేశాలలో మహా బుద్ధిమంతులు అక్కడి మహా భక్తుల జీవిత విశేషాలను విశాల దృక్పధం తో రాశారు.అవి దివ్య జ్యోతుల్లా ప్రకాశిస్తున్నాయి. వీటి వలన భక్తీ జ్ఞాన వైరాగ్యాలు కలుగుతున్నాయి. ఆంధ్ర దేశం లో అలాంటి మహా భక్తుల చరిత్ర రాయటానికి ఎవరూ సాహసించలేదు.

పంగులూరి వారు ముసలితనం లో అలాంటి రచన 80 సంవత్సరాల వయసులో చేసి ధన్యులయ్యారు ".రచయిత ఈపుస్తక రచనలో తన ఉద్దేశ్యాన్ని "మనశ్శక్తిని ఆత్మ శక్తిగా మార్చగలవి కర్మ భక్తీ జ్ఞానాలు. ఆత్మ శక్తిని బయటికి తీసినవాడే సమర్ధుడు. భగవంతుడు శక్తి స్వరూపుడు. భక్తుని భావాన్ని బట్టి ఆ శక్తి ఆకారం దాలుస్తుంది. భక్తుడు భగవంతునిలాగా సర్వ సమర్ధుడు. ప్రత్యక్ష భగవంతుడే భాగవతోత్తముడు. భగత్స్వరూపులైన అలాంటి వారి జీవిత విశేషాలు, వారు చేసినమహాద్భుతాలు వివరించటానికే ఈ పుస్తకం రాశాను.ముద్రణకు ధనసాయం చేసినవారందరికీ కృతజ్ఞతలు. "అని చెప్పుకొన్నారు. ఈ గ్రంథం 7-5-1957 న ముద్రణ పొందింది. వెల 5 రూపాయలు మాత్రమే.

కవి రచయిత అయిన వీర రాఘవుడుగారు బాపట్ల తాలూకా అప్పికట్ల గ్రామ వాసి. శ్రీమాన్ కాశీ కృష్ణాచార్యులవారు "ఆంధ్రలో అనేక వర్ణాలలో పుట్టి మహా భక్తులైన వారెందరో ఉన్నారు. వారి పేర్లు సుపరిచితం అయినా వారి గురించి పూర్తిగా ఎవరికీతెలియదు.ఈలోపాన్ని పూరించిన వారు పంగులూరి వారు. అలాగే మరి కొందరి జీవితాలను బుర్ర కథలు "గా మార్చి లోకానికి అందించాలి "అని ప్రశంసించారు. గుంటూరుకు చెందినశ్రీ రాగం ఆంజనేయులు-పాండిత్య, కవిత్వాల జోలికి వెళ్ళకుండా, అనుభవపేతమైన వాక్యాలతో భక్తుల చరిత్ర సుబోధకం గా రాశారు. దేశాభిమానం, ఆత్మ విశ్వాసం, ఆత్మ గౌరవం కలిగించారు "అన్నారు తిరుమల తిరుపతి దేవస్థాన ఆస్థాన మహా విద్వాన్,పండిత శ్రీమాన్ వేదాంతం జగన్నాధా చార్యులు -"ఈపుస్తకం చదువుతుంటే ఆనాంద బాష్పాలు కారుతాయి, ఆనంద పారవశ్యం కలుగు తుంది "అని శ్లాఘించారు

వీరరాఘవ శర్మగారు మహా భక్త కవి వరేణ్యులు. గుంటూరు లోని శ్రీ రామనామ క్షేత్రం లో వెలసిన శ్రీ కోదండ రామ స్వామి పై ప్రార్ధనా పద్యాలు చెప్పారు.

పోతనతో ప్రారంబించి మొత్తం 43 మహా భక్తుల విజయగాధలను శ్రీ పంగులూరి వీర రాఘవశర్మ గారు ఈ భక్త విజయం లో రాశారు.



వీరి కుమారులు డా శ్రీ పంగులూరి హనుమంతరావు రావు గారు ఈ పుస్తకాన్ని ఆధునీకరించి అందమైన రంగుల ముఖ చిత్రం తో కొంత సరళభాషతో 2014 న శ్రీ కౌండిన్య పబ్లికేషన్స్ అనే తమ స్వంత సంస్థ ద్వారా ముద్రించి పితౄణం తీర్చుకొన్నారు. నాకు సరస భారతికి ఆత్మీయులైన రావు గారు ఆ నూతన గ్రంధాన్ని నాకు పంపారు.

ఇంతకంటే వివరాలు నాకు లభించలేదు.

# 1 కోటంరాజు నాగేశ్వర దాసు

భాస్కర మంత్రి శాయమాంబ లకు పుత్రుడు కోటం రాజు నాగేశ్వర దాసు చిన్నప్పుడే తల్లీ తండ్రీ చనిపోయారు. పోషించే వారు ఎవరూ లేకపోవటం తో సదా చార సంపన్నుడు రామభక్తుడు ఎల్లేపెద్ది పాపన్న శాస్త్రి తీసుకొని వెళ్లి పెంచాడు. పరమ సాధ్వి అయిన అతని భార్య సుబ్బ మాంబ పిల్లాడిని చాలా ప్రేమగా పెంచింది. ఒక ఏడాదికి అ దంపతులకు ఒక కొడుకు కూతురు పుట్టారు. ఇదంతా నాగేశ్వరుని చలువే అని పొంగిపోతూ మరింత జాగ్రత్తగా నాగేశ్వరదాసును పెంచారు.

అయిదవ ఏట నే బడిలో వేశారు. లౌకిక విద్యలపై ఆసక్తి లేక నాగేశ్ ఒకపూటమాత్రమే బడికి వెడుతూ, రెండో పూట ఏకాంతం గా ధ్యానం చేసేవాడు. ఎవరితోనూ ఆడుకోకుండా ముద్దుమటలతో పెంచినవారికి ఆనందం పంచకుండా నిరంతర భగవధ్యానం లో గడిపే అతడిని చూసి పాపన్న పిచ్చి పట్టిందేమో నని అనుమానం తో మందూ మాకు ఇప్పించాడు. ప్రయోజనం శూన్యం. ఎక్కడెక్కడో తిరిగే అతడిని వెదికితెచ్చి భోజనం పెట్టేది తల్లి. ఎనిమిదవయేట ఉపనయనం చేశారు. సంధ్యావందనం చేయటానికి గురువు వద్దకు పంపిస్తే, గురువు సుబ్బావధానులు కూడా శ్రద్ధగా కూర్చోబెట్టి సంధ్యావందనం చేయించేవాడు. ఆమంత్రాల అర్ధం చెప్పమనేవాడు ఇప్పుడు కాదు అని ఆయన అంటే అర్ధం లేని చదువు వ్యర్ధం అని అంటే అర్ధ తాత్పర్యాలు బోధించేవాడు. ఒకరోజు "అన్ని వేళలా దేవుడిని స్మరించేవాడు పవిత్రుడు కదా?"అని అడిగితే ఆచారాలు పాటించకపోయినా, తననే నమ్మితే అతడే సదా చారం కలవాడని కృష్ణ పరమాత్మ చెప్పాడని గురువు వివరించాడు. మరో సారి భగవన్నామ జప మహా భాగ్యం ఉంటె మంత్రాలతో పని లేదనీ చెప్పాడు. ఆమాటకు చిరునవ్వు తో సంధ్యావందన మంత్రాలు పూర్తిగా చెప్పమని కొరగా ఆశ్చర్యం తో నేర్పాడు. ఆకాశాత్పతితం తోయం "శ్లోకానికి తాత్పర్యం అడిగితె చక్కగా వివరించాడు గురువు. ఇక తనకు మంత్రాలతో పని లేదని చెప్పి, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు నాగేశ్వరుడు. ఈ విషయమంతా వెళ్లి పాపన్న శాస్త్రికి గురువు చెప్పేశాడు

నిత్యం సంధ్యావందన జపహోమాలు చేసే పాపన్న శాస్త్రి రోజు ఆధ్యాత్మ రామాయణం పారాయణం చేసేవాడు. ఒక రోజు దానికోసం వెదికితే కనపడకపోతే "పిచ్చినాగన్న పనే "అయి ఉంటుందని కొడుకునుపంపి వెదికించి నాగేశుని ఇంటికి పిలిపించి ఆపుస్తకం ఏమైంది అని అడిగితే తనదగ్గరున్న సంస్కృత తాళపత్ర గ్రందాన్నీ, దానికి తెలుగులో పద్యరూపంగా అనువాదం చేసిన కొత్త రచనను తండ్రికిచ్చాడు. రెండవదాన్ని ఎవరు రాశారని అడిగితే"శ్రీరామ చంద్ర మూర్తి "అని బదులిచ్చాడు. అప్పుడు అతడి పరమభక్తికి సంతోషించి అతడి పద్యానువాదానికి అబ్బురపడి గట్టిగా ఆలింగనం చేసుకొని ఆనందించాడు శాస్త్రి. ఎంతకాలం నుంచి రాస్తున్నావు ?"అని అడిగితె "నిన్న రాత్రి రామాజ్ఞ అయినప్పటి నుంచి "అన్నాడు దాసు. పాపన్న ఆనందానికి పట్టపగ్గాలు లేకుండా పోయింది.

ఒకరోజు నాగేశు తండ్రితో "బాల అయోధ్య కాండలు పూర్తయ్యాయి. అరణ్యకాండ రాయాలి.దానికి దానికి నాలుగు రోజులు ఏకాంతం కావాలి. మన ఇంట్లో ఒక గదిలో నేను కూర్చుని రాస్తాను. ఎవరూ వచ్చి నన్ను ఆటంక పరచవద్దు. నాకు వీలైనప్పుడు వచ్చి భోజనాదికాలు చేస్తాను. అనుజ్ఞ ఇవ్వండి "అని కోరాడు. అలాగే అని ఒకగదిలో అతడిని ఏకాంతంగా ఉంచి అతనికోరికప్రకారమే గదికి బయట తాళం వేసి ముద్రకూడా వేసి రోజు పని చేసే న్యాయస్థానికి వెళ్ళాడు పాపన్న శాస్త్రి. మూడు రోజులు గదిలోనుంచి బయటకు రాలేదు దాసు. శాస్త్రి కూడా ఏమి జరుగుతోందో అనే ఆందోళనతో మూడు రోజులూ గడిపి నాలుగవ రోజు ఉండబట్టలేక తలుపు బద్దలు కొట్టాలనే ప్రయత్నం లో ఉంటె స్నేహితుడు వచ్చి వారించి ఇంకొక్క రోజు ఆగమని చెప్పాడు. సరే అన్నాడు శాస్త్రి. నాలుగవరోజు అసలు నాగేశు బతికి ఉన్నాడో లేదో అనుమానం నాలుగురోజులనుంచి భోజనం లేదని ఆరాటం తో గది తలుపులు బద్దలు కొట్ట టానికిసిద్ధమయ్యారు. ఇంతలో లోపల గొళ్ళెం తీసిన చప్పుడు వినిపించింది. నాగేశ్వరుడు కన్నీరు కారుస్తూ రెండు గ్రంధాలను చేత్తో పట్టుకొని బయటకు వచ్చాడు. కొత్త గ్రంధాన్ని పరిశీలించి చూడగా ఆరణ్యకాండ పూర్తయినట్లు కనిపించి అందరూ అతడిని కావలించుకొని ఆనంద బాష్పాలు కార్చారు శాస్త్రి నాలుగు రోజులనుంచీ భోజనం కూడా చేయలేదు. ఆదుర్దాతో. కొడుకును గట్టిగా ఆశ్లేషించి "నాయనా నాలుగు రోజులనుంచి తిండిలేకుండా ఎలా ఉన్నావు ?"అనిఅడిగితె "రామ చంద్ర మూర్తి అరణ్యవాస విషయాలను వెల్లడిస్తూ దుఖాన్ని ఆపుకోలేక పోవటం చేత దాన్ని రాసే నేను కూడా దుఖం ఆపుకోలేక రచన సాగక అన్నపానీయాలపై ఆసక్తే లేకుండా పోయింది "అని చెప్పగా అతడి భక్తికి శ్రీరామ కరుణా కటాక్షాలకు ఆశ్చర్యపోయారు. అతడికి చక్కగా తలంటి స్నానం చేయించి, మంచి పిండివంటలతో భోజనం తయారు చేయించి అందరూ తృప్తిగా భోజనంచేశారు.

శంకర భక్తమానస వ ♦ శంకర దుష్టమదాసురేంద్ర నా
శంకర పాండునీలరుచి ♦ శంకర వర్ణనిభాంగ భోగిరా
ట్కంకణ పార్వతీహృదయ ♦ కైరవకైరవ మిత్రయోగి హృ
త్పంకజ పంకజాప్తజయ ♦ తాండవ ఖేలన భక్తపాలనా॥
జగన్నాథ ♦ దేవేంద్రవందిత వితతచారిత్ర సం ♦ తతపవిత్ర
హాలాహార ♦ యహిరాజకేయూర బాలేందుభూష స ♦ ద్భక్తపోష
లోకాతీత ♦ సద్గుణసంఘాత పార్వతీహృదయేశ ♦ భవవినాశ
చలస్థాన ♦ గజచర్మపరిధాన సురవైరివిధ్వస్త ♦ శూలహస్త
గీ॥ లోకనాయక సద్భక్త ♦ లోకవరద
సురుచిరాకార మునిజన ♦ స్తుతివిహార
భక్తజనమందిరాంగణ ♦ పారిజాత
సకలలోకైకపూజిత ♦ చరణకమల॥
తే॥ గీ॥ అక్షయుండవ నంతుండ ♦ వచ్యుతుండ
వాదిమధ్యాంతశూన్యుండ ♦ వఖిలభృతివి
నిఖిలమందెల్ల వర్తింతు ♦ నీవు నగిరి
నిఖిలమందెల్ల నీయందె ♦ నెగడు దేవ॥

నాగేశ్వర దాసు రామాయణం మొత్తం తన 13 వ ఏటనే రాయటం పూర్తి చేశాడు. కృష్ణా సాగర సంగమం దగ్గర మొరుతోటలో వెంచేసిన శ్రీ ముక్తేశ్వరస్వామి సన్నిధిలో ఉన్న శ్రీ రంగేశునికి కృతి సమర్పణ చేయాలని భావించి, ఒక శివరాత్రి నాడు తలిదండ్రులు బంధు మిత్రులతో ఆలయం లోకి వెళ్ళే ప్రయత్నం చేస్తే, అక్కడి పూజారులు అనుమతించలేదు. ఏమాత్రం అవమానంగా భావించకుండా ముఖ మండపం చేరి ముక్తేశ్వర స్వామిపై పద్యాలు నిండు భక్తితో చెప్పాడు.

–

పద్యాలు పూర్తికాగేనే ముక్తీశ్వర స్వామి లింగ రూపం లో దాసు దోసిట్లో ప్రత్యక్షమయ్యాడు. దాసు పరవశంతో పరమానందంగా నృత్యం చేశాడు. ఆలయం లో లింగం కనిపించక పూజారులు కంగారు పడుతుతూ బయటికి వచ్చి చూసి విషయం తెలిసి దాసుపాదాలపై వ్రాలి క్షమించమని కోరి లింగాన్ని యధాస్థానం లో ఉండేట్లు చేయమని దాసును ప్రార్ధించారు

భవుని యందును శ్రీరమా ♦ ధవుని యందు
భేదమెంచక సమదృష్టిఁ ♦ బాగుగొప్ప
భక్తిఁ జేసెడివాని ని ♦ [illegible]
మూర్తి స్వీకారసమయంబేరి ♦ [illegible]॥

అని పద్యం చెప్పారు దాసు. ఆలయ పూజారులు సగౌరవంగా దాసును అతని తలిదండ్రులను అందరినీ గర్భాలయం లోకి ఆహ్వానించి ఉచితాసనాలు ఏర్పాటు చేసి గౌరవించారు. తన ఆధ్యాత్మ రామాయణ తెలుగు అనువాదాన్ని నాగేశ్వర దాసు ముక్తేశ్వర సన్నిధానం లో ఉన్న శ్రీ రంగేశునికి సభక్తికంగా అంకిత మిచ్చాడు.

తగిన వధువుతో దాసుకు వివాహం చేసి కొత్త ఇల్లు కట్టించి అందులో గృహప్రవేశం చేయించారు శాస్త్రి దంపతులు. గృహ కృత్యాలమీద ఆసక్తి లేని దాసు భార్యను ఒంటరిగా వదిలి ఎక్కడెక్కడో తిరిగి రాత్రికి చేరేవాడు. కొంతకాలానికి శాస్త్రి చనిపోయాడు. కుటుంబ భారం దాసుపై పడినా పెద్దగా పట్టించుకోలేదు. రేపల్లె, భట్టిప్రోలు వైశ్యులు ఆకుటుంబ భారం తామే వహించారు. రాం భజన చేస్తూ దాసు కాలం వెళ్ళ బుచ్చుతున్నాడు. దాసు భార్య గర్భవతి అయింది. ఆమెకు భట్టిప్రోలు వైశ్యులు ఆమెకు చీని చీనాంబరాలు సమకూర్చి ఒక బ్రాహ్మణుడికిచ్చి పంపారు. దాసుకు ఆబ్రాహ్మణుడు దారిలో కనిపిస్తే అవి తీసుకొని తానె ఇంటికి వెళ్లి భార్యకిస్తానని చెబితే నమ్మి ఇచ్చేశాడు ఆబాపడు. ఆమూట నెత్తిమీద పెట్టుకొని రామభజన చేస్తూ ఇంటికి వస్తుంటే దారిలో ఒక చెట్టు కింద నిండు చూలాలైన భిల్లస్త్రీ కనిపిస్తే "అమ్మా నన్ను సోదరునిగా భావించి వీటిని తీసుకో"అని నెత్తిపైఉన్న మూటను ఆమెకిచ్చేసి బ్రహ్మానందం పొందుతూ ఎక్కడెక్కడో తిరిగాడు. ఈ విషయం తెలిసిన భట్టిప్రోలు ప్రజలు మళ్ళీ అన్నిటినీ సమకూర్చి స్వయంగా తామే ఇంటికి వెళ్లి దాసు భార్యకు ఇచ్చి సంతృప్తి చెందారు. కొడుకు పుట్టగా రామారాయుడు అనే పేరు పెట్టారు.

పుత్ర జననానికి సంతోషించి, భక్తజనాలతో కలిసి గ్రామాలు తిరుగుతూ భజనలు ఉపన్యాసాలతో ప్రజలలో ఆధ్యాత్మిక భావ వ్యాప్తి చేశాడు దాసు. గుంటూరులో శిష్యులు చాలామంది చేరారు. ఒకసారి రేపల్లె ఏడాది కాలంగా వర్షాలేలేవు. జనం బాధ పడుతుంటే అనుకోకుండా అక్కడికి వచ్చిన దాసు "భయం వద్దు. ఒక మూడు గంటలలో వర్షం కోసం రామాజ్ఞ అయింది "అని చెప్పి స్వగ్రామం వెళ్ళాడు. దాసు మాట నమ్మని ప్రజలు శివాలయం లో సహస్రఘటాభిషేకానికి ఏర్పాట్లు చేశారు. సరిగ్గా దాసు చెప్పిన సమయానికే బ్రహ్మాండమైన వర్షం కురిసి అందరికి ఆనందం కలిగి దాసు మాట కు విలువ పెరిగింది.

శిష్యులతో కలిసి దేశ సంచారం చేస్తూ శ్రీరామనవమికి భద్రాచలం చేరి సీతారామ కల్యాణం కనులారా చూస్తూ భజన చేద్దామనుకొంటే పందిళ్ళలో ఇసుక వేస్తె రాలనంత భక్తజనం ఉండటం చూసి, ఆలయ ముఖమండపం చేరి తాళాలు తంబు రాలతో ఆనంద బైరవి రాగం ఆట తాళం లో "కనులకు కనపడవేమి శ్రీరామా ?రామయ తండ్రీ !ఇంత కన్నడ సేయ గ కారణమేమి ?"

ఎక్కడనున్నావో నాస్వామి నాకింకెవరయా దిక్కు సర్వాంతర్యామి "

గుహుడు కడిగిన పదము లేవి ?జనకకూతురు కూర్చున్న వామాంక మేది?పయిడి ముగ్గుల గొలుసు లేవీ ?చేత బట్టిన మంచి తీరు కమానులేవీ ?మంచి పచ్చల పోగులేవీ ?తళుకు మించిన నీ వ్రేళ్ళ యుంగరము లేవీ ?ఘంట మొలనూలుఏదీ ? బొజ్జ గదల తళుకు మను కౌస్తుభమేదీ ?ముద్దులు గులుకు మోమేదీ, జగన్మోహనమైన మీచిరు నగవేదీ ?వరదుడిచ్చిన హారమేదీ ?తూము నరసింహు డర్చించు చరణము లేవీ ?శ్రీ భద్రాచల విహార, తులసీ దళ హార, హే సింధు గంభీర, పరమ దయారస పూర, నాగేశ్వర దాస మందార జగదేక వీరా "అని తన్మయం లో కీర్తించగానె, కల్యాణం లోఉన్న విగ్రహాల షోడశ కళలను లేపి, దాసు ముందు ఆవహింప జేసి ఆనందించాడు కళ్యాణ రాముడు. అది కనులారా చూసిన దాసు కాఫీ రాగం ఆట తాళం లో –"నాపాలి భాగ్య మేమందు, రఘునాధుడు కనిపించే ముందు, పాపము లెల్ల బాపు శ్రీరాముల రూపము కనులకు రూది గా గనిపించే "అని భక్తీ తన్మయం లో గానం చేశాడు. ఈ విషయం తెలిసిన తూము నరసింహ దాసు స్వయంగా వచ్చి దాసును సగౌరవంగా కళ్యాణ వేదిక వద్దకు తీసుకొని వెళ్లగా ఆవిగ్రహాలు మళ్ళీ షోడశ కళలతో విరాజిల్లాయి. నాగేశ్వర దాసు మహాత్మ్యాన్ని అక్కడి వారందరూ గ్రహించి అపూర్వం గా సత్కరించి గౌరవించారు.

భద్రాచలనుంచి మళ్ళీ తీర్ద యాత్రలు చేస్తూ శ్రీరంగం చేరి రంగడిపై శతకం రాసి అంకితమిచ్చాడు నాగేశ్వర దాసు. ఇల్లు వదిలిన ఎనిమిదేళ్ళకు మళ్ళీ ఇంటికి తిరిగి వచ్చాడు. మర్నాడే దాసు గారబ్బాయి అకస్మాత్తుగా చనిపోయాడు. హరి భజన చేస్తూ పుత్ర శవాన్ని శ్మశానానికి తీసుకు వెళ్లి ఖననం చేసి, నిర్వికారంగా ఇంటికి తిరిగి వచ్చాడు దాసు. బంధువులు ఓదారుస్తుంటే "రుణాను బంధ రూపేణ పశు పత్ని సుతాలయః "అన్న వాక్యం బోధించి, రామనామం చేయించాడు.

ఒక సారి తండ్రి తద్దినం రోజున భోక్తలను పిలవటానికి వెడుతుంటే, ఒక బీద వర్తకుడు తనషాపులోని చెన్నూరు పుట్నాలను ఇస్తే, తింటూ, పురోహితుడు ధర్మ సూరి ఇంటికి వెళ్లి తద్దినానికి ఆహ్వానిస్తే వినీ విననట్లు నటించి "దాసుగారు ఏదో భుజిస్తున్నారే ?"'అన్నాడు. "తడవర్తివెంకయ్య శ్రేష్టిభక్తితో సమర్పించిన" తప్త చణక శకలాలు "భక్షిస్తున్నా. ఇవాళ మానాన్న గారి ఆబ్దికం. భోక్తకు రమ్మని ప్రార్ధన "అన్నాడు. "తండ్రి తద్దినం రోజున కోమటిచ్చిన సెనగపప్పు తింటూ నన్ను భోక్తకు పిలుస్తావా ?నేనే కాదు ఊళ్ళో ఏ బ్రాహ్మణుడు మీ ఇంటికి భోక్త గా రాడు"అని కటువుగా చెబితే బ్రతిమాలినా వినిపించుకోకపోతే, చేసేది లేక ఇంటికి వెళ్లి భార్యకు విషయం చెప్పి వంట చెయ్యమన్నాడు రామాజ్ఞతో అంతా సవ్యంగా జరుగుతుందని భరోసా ఇచ్చాడు దాసు. ఆమె అలాగే అని వంట చేసింది. ఇంతలో

ఇద్దరు దూరాధ్వగులైన-అంటే దూర దేశం నుంచి వచ్చిన బాటసారు లైన బ్రాహ్మణులు వస్తే వారినే భోక్తలుగా నియమించి తద్దినం పూర్తి చేశాడు దాసు. ఇలాంటి అతి మానుష కార్యాలు చేసిన భక్త నాగేశ్వర దాసు 72వ ఏట పునరావృత్త రహిత శాశ్వత బ్రహ్మలోకం చేరారు.

## 2 భక్త శిఖామణిసింగిరి దాసు



ఒంగోలు మండలం వెంకటాపురం లో 1840 శార్వరి జ్యేష్ట శుద్ధ ఏకాదశి నాడు కామరాజు కృష్ణయ్య, రామ లక్ష్మమ్మ దంపతులకు సింగిరి దాసు జన్మించాడు. బాల్యం నుంచి జంతువులపై ప్రేమ ఎక్కువ. తల్లి అన్నానికి పిలిస్తే, ఆడుకొనే కుక్కపిల్లల్ని కూడా వెంట తెచ్చుకొని వాటితో కలిసి తినేవాడు. వేరే కంచం లో వాటికి పెట్టించి తాను ఇంకో కంచం లో తినేవాడు. లక్కవరపు వెంకట నరసింహం గారి వద్ద బడి చదువు పూర్తి చేసి, తర్వాత పురాణాలను శ్రావ్యం గా గానం చేసేవాడు. వాటి అంతరార్ధం బోధించే నేర్పు సంపాదించాడు.

తండ్రికి రోజు రామాయణం చదివి వినిపించేవాడు. చదువుతూ మైమరచేవాడు రామమందిరం లో భజన చేస్తూ నిద్రపోయేవాడు కాదు. తర్వాత భగవంతుడి పై ఆలోచన తనకు ఆయనకూ ఉన్న సంబంధం గురించి తర్కించు కోనేవాడు. 12వ ఏట ఉపనయనం జరిగి, అప్పటి నుంచి సింగిరి గిరి నరసింహ స్వామిని ప్రతి ఏడాది సందర్శించే వాడు. ఒకరోజు అర్ధరాత్రి వరకు నరసింహ భజన చేసి, ఇంటికి ఒంటరిగా వస్తుంటే, దారి తప్పితే ముందు మినుకు మినుకు దీపం కాంతి తర్వాత పెట్రోమాక్స్ లైట్ కాంతి కనిపించి భయం,ఆశ్చర్యం కలిగి మనశ్శాంతి కలిగింది. స్పృహ తప్పి నేలపై పడి పోయాడు. స్పృహ వచ్చి చూస్తె, ఆ జ్యోతి కనిపించలేదు. మట్టిలో పడివున్న అతనిని వెతకటానికి వచ్చిన వాళ్ళు జాగ్రత్తగా ఇంటికి చేర్చారు.

ఇంకోసారి ఇంటి నుంచి సాయంత్రం అయిదు గంటలకు బయల్దేరి సింగిరి గిరి నరసింహస్వామి కోవెలకు వెళ్లి నిర్మానుష్యంగా ఉండటం చేత, సంతోషించి లోపలి వెళ్లి, స్వామి పాదాలపై పడి,ప్రత్యక్ష దర్శనం కోసం ప్రార్ధించాడు. కనిపించకపోయేసరికి ధారాపాతం గా కన్నీరు కారుస్తూ దుఃఖించాడు. కాసేపటికి ఇదివరకులాగానే దివ్య జ్యోతి మళ్ళీ కనిపించగా సంతోషం తో ఆనంద బాష్పాలు రాలుస్తూ ఉండగా సంప్రజ్ఞానం లో నృసింహ స్వామి దర్శన మిచ్చాడు. సమాధి నుంచి బయటికి వచ్చి ఆనంద బాష్పాలు రాలుస్తూ నృత్యం చేసి ఆలయం నుంచి బయటకు రాగానే ఒక యోగిని కనిపించి "నాయనా !నీ కోసమే ఎదురు చూస్తున్నాను "అని చెప్పి ఆత్మీయంగా కౌగిలించుకొని "తారకం ఉపదేశిస్తా. దానితో నీ అభీష్ట సిద్ధి కలుగుతుంది "అని చెప్పి ఆలయం లోకి తీసుకు వెళ్లి, సర్వ వేదాంత రహస్యాలు బోధించి తారకమంత్రం ఉపదేశించి, కనిపించకుండా వెళ్ళిపోయింది. ఆమె సీతాంబ అనే శూద్ర యోగిని బ్రహ్మ చారిణి. అంతకంటే వివరాలు తెలీదు. అప్పటినుంచి దాసుగారి జీవితం అంతా రామమయం అయింది. తండ్రి చనిపోగా బాధ్యతా మీద పడి ఆస్తి అంతా అప్పులపాలై, ఊళ్ళో అప్పిచ్చే వారు లేక, ఉద్యోగం చేయటం ఇష్టం లేక,, మేనమామ వెంకట నరసింహం గారి బలవంతం తో ఉద్యోగానికి దరఖాస్తు చేయగా అ ఉద్యోగం ఆర్డర్ చేతి కందేలోపు, ఒకరోజు రాత్రి యాత్రకు వెడుతున్నట్లు చెప్పి, ఇంటినుంచి బయల్దేరి 15రోజులలు నడిచి నెల్లూరు చేరాడు. ఈ ప్రయాణం లో ఒక వింత జరిగింది. పెన్నా నది ని దాటటానికి నదిలోకి దిగి భజన చేస్తూ వెడుతుంటే, ప్రవాహం పెరిగి, చేతిలోని తంబూర, పై గుడ్డ కూడా నీటి వేగానికి కొట్టుకుపోయి నా స్పృహ లేకుండా భజన చేస్తూ, నది మధ్యకు చేరి మైమరచి నిలచిపోయాడు. ఒడ్డుల్ని ఒరుసుకొని నది తీవ్రంగా ప్రవహిస్తోంది. రామనామం విన్న పల్లెకారులు దివిటీలు, పడవలతో వచ్చి, మొలబంటి నీటిలో ఇసుకదిబ్బపై స్పృహ లేకుండా పడి ఉన్న దాసు గారిని చూసి, స్మృతిత వచ్చేవరకు ఉండి,పడవ ఎక్కించుకొని, ఒడ్డుకు చేర్చారు. ఆయనెవరో వాళ్లకు తెలీదు.

నెల్లూరు చేరి శ్రీరంగనాయక దర్శనం చేసి,ఆరాత్రి గుడిలోనే పడుకొని రామనామ సంకీర్తన చేస్తూ తెల్లవార్లూ గడిపారు. ఉద్యోగం పోస్టింగ్ ఇచ్చి ఆయన చేరకపోవటం తో రద్దు చేయగా దాసు గారు చాలా సంతోషించారు. మేనమామ మళ్ళీ ప్రయత్నించి ఉద్యోగం వచ్చేట్లు చేశాడు. రామకూరు ఫిర్కా రెవిన్యు ఇన్స్పెక్టర్ ఉద్యోగం లో బలవంతం మీద చేరి, విధి నిర్వహిస్తూ, జపతపాలలో మునిగి ఆఫీసుకు వేళకు వెళ్లకపోతే, పై అధికారి మందలించి భయపెట్టేవాడు. ప్రయోజనం లేక ఉద్యోగం ఊడ పీకేశాడు. బంధన విముక్తి అయిందని సంతోషించి, భార్య తల్లి తో శ్రీరామ సేవాపరాయణలో గడిపారు. కుటుంబ పోషణ కష్టమైంది. తల్లి అన్నకు బాధ చెప్పుకోనగా, వెల్లూరు తాలూకా కచేరీలో గుమాస్తాఉద్యోగం వేయించి బలవంతం మీద మేనల్లుడిని చేర్చాడు. ఇదీ మూన్నాళ్ళ ముచ్చటే అయింది.

గర్భవతి అయిన భార్యను అత్తారింటికి పంపగా రోజు ఉపవాసాలతో బతకలేక తల్లి చిన్న పిల్లాడితో తన పుట్టింటికి చేరింది. బాదర బందీ లేకపోవటం తో రామనామం తో గడుపుతూ, తిరుపతి యాత్రకు బయల్దేరి మధ్యలో ధేనువకొండ లో రామకృష్ణయ్యగారు కలువగా,ఆయనతో కలిసి యాత్ర చేసిన తర్వాత

అప్పుడప్పుడు ఆయన ఇంటికి వస్తానని చెప్పి, యాత్ర అవగానే బావమరిది ఇంటికి చేరాడు. బావను బతిమాలి బామాలి, చిత్తూరు మండలం పూతలపట్టులో ఒక బడి పెట్టించాడు. అక్కడ పాఠాలు చెబుతూ పురాణ కాలక్షేపాలు చేస్తూ అందరినీ సంతోషింప జేస్తున్నాడు దాసు. భార్య రుక్మిణమ్మ పసి పిల్లతో ఇక్కడికి వచ్చి ఒక ఏడాది గడిపింది భర్తతో.

దాసుగారికి రక్తవిరోచన వ్యాధి వచ్చి, బడికట్టేసి, 1864లో వెంకటాపురం చేరి, వ్యాధి తగ్గాక భార్యాపిల్లల్ని అత్తారింటికి పంపి, శేషాచలం చేరి గోగర్భ ప్రాంతగుహలో, 6 నెలలు తపస్సు చేయగా,కౌపీనం మాత్రమే ధరించిన ఒకముని వచ్చి "నీ తపస్సు ఫలించింది ఇప్పటి నుంచి నువ్వు ఎప్పుడు కోరుకొంటే అప్పుడు శ్రీరామ సాక్షాత్కారం లభిస్తుంది. తపస్సు వదిలేసి వెంకటాపురం చేరి ఆదర్శ గృహస్థ జీవితం కొనసాగించు "అని బోధించగా ఆప్రకారమే ఇంటికి వెళ్లి, నిష్కామకర్మగా జీవించి "శ్రీ భద్రాద్రి రామ దాసు చరిత్ర "రచించి, శ్రీరామాంకితం చేశారు దాసుగారు. 1869లో మామగారు అప్పయ్య అల్లుడిని తన ఇంటికి తీసుకు వెళ్ళాడు. ఒక ఏడాది మామిళ్ళపల్లి లో ఉండి, తర్వాత రేపల్లె చేరి, తమ్ముడి నుంచి వేరై, పిత్రార్జితం తో నాలుగు ఎకరాలమాగాణికొని, ఇల్లు కట్టుకొని భార్యాపిల్లలతో సుఖంగా ఉన్నారు. ఇద్దరు చెల్లెళ్ళు ఒకే రోజు చనిపోయినా, ఐదారుమంది కూతుళ్ళు చనిపోయినా నిర్లిప్తత కోల్పోలేదు.

రేపల్లె పాఠశాల ఇంకా నడుస్తూనే ఉంది. ప్రొద్దున లేచినదగ్గర్నుంచి విద్యార్ధులకు పాఠాలు, భజనలు పురాణ ప్రవచనాలు జపతపాలు అనుష్టానం లతో క్షణం తీరిక లేకుండా గడిపేవారు. కొంతకాలానికి భార్య రుక్మిణమ్మ మరణించింది. రేపల్లె వదిలి పెద్దకొడుకు పని చేసే నూజివీడు చేరి, తత్వార్ధ ప్రధాని యై ఆతర్వాత పొన్నూరు చేరి చవలి పున్నయ్య శాస్త్రిని శిష్యునిగా చేసుకొని,పాతూరి కోటయ్యగారి స్నేహం చేసి,ఆతర్వాత శిష్యుల్తో రామేశ్వరం వెళ్లి స్వామి సేవలో ధన్యం పొంది, ధ్వజస్తంభం దగ్గర భావ సమాధి పొంది మైమరచి పొతే, భక్తులు హారతులు పట్టి ఆదరించారు. తర్వాత జంబుకేశ్వరం వెళ్లి, శ్రీరంగం లో రంగని దర్శించి, దక్షిణ దేశ యాత్ర పూర్తి చేసుకొని, ఇంటికి చేరి, బాపట్లలో ఉన్న రెండవ కొడుకు చెన్న కేశవ ఇంటికి చేరి,అద్దంకి వెంకటరాయుడు స్నేహం పొంది, 74వ ఏట ఆతుర సన్యాసం తీసుకొని నలసంవత్సర జ్యేష్ట శుద్ధ పంచమి నాడు మహా సమాధి చెందారు భక్త శిఖామణి సింగిరి దాసు గారు.

## 3 నిరతాన్న దాత, మహాభక్త శిఖామణి-బందా పరదేశి

17వ శతాబ్దం లో నియోగి కుటుంబం లో గుంటూరు జిల్లా వేటపాలెం లో పుట్టిన బందా పరదేశి కరణీకం చేసేవాడు. ఎవ్వరినీ చెయ్యి చాచిన వాడు కాదు. భార్యకమలాంబ కూడా చక్కగా సహకరించేది. నిత్య అన్నదానం తో దంపతులు తరించేవారు. ఈ వంశం వారు ఇప్పటికీ చీరాల, వేటపాలెం లో ఉన్నారు. వీరిలో బందా వెంకట నరసయ్యగారు ఒకరు. బందాదంపతులు ఒక్క రోజు కూడా అన్న దానం చేయని రోజే లేదు. ఏకాదశి వ్రతం తప్పని సరి. ద్వాదశినాడు 12 మందికి తక్కువకాకుండా, 108 కి మించకుండా అన్న సంతర్పణ చేసేవారు. వ్రతం రోజు జాగరణం చేసేవారు. భోజనం చేసి వెళ్ళే వారిని పంపలేక పంపలేక పంపించే వారు. ఇలా నిత్యఖర్చుతో ఉన్న ఆస్తి అంతా హారతి కర్పూరమై హరించి చివరికి భార్య మెడలో మంగళ సూత్రం కూడా అమ్మే పరిస్థితి కలిగింది.

చేతిలో చిల్లి గవ్వ లేని నిర్భాగ్యం బందా దంపతులను ఆవహించింది. భార్యను వెంటపెట్టుకొని అర్ధరాత్రి ఇల్లు వదిలి బాపట్ల తూర్పు సత్రం చేరి జరగవలసినదాన్ని గురించి భార్యా భర్తలు ఆలోచిస్తున్నారు. ఆ రోజు ఉదయమే ఆ సత్రం లోదిగిన నిరుపేద స్త్రీ ఆకలితోఅలమటిస్తున్న తనపిల్లలకు "ఇదుగో సెనగపప్పు మాత్రమమే ఉంది తిని నీళ్ళు తాగి పడుకోండి.రేపు పొద్దున్న పదింటికి వేటపాలెం లో బందా పరదేశి గారింటికి వెడితేఅమృతాన్నం పెడతారు ఆ మహాదాతలైన దంపతులు "అని ఊరడిస్తుండటం బందాగారి చెవిన పడింది. వెంటనే భార్యకు చెప్పితమింట్లో ఒక కుందీ, రోలు ఉన్నాయికనుక వాటిని అమ్మేసి ఆ పేద స్త్రీకి పిల్లలకు భోజనం ఏర్పాటు చేద్దామని చెప్పి, వారు వచ్చే లోపే తాము ఇంటికి చేరాలని తొందరబెట్టి అప్పటికప్పుడు ఇద్దరు నడిచి వేటపాలెం చేరారు. బొమ్మి శెట్టి సుందర రాజం అనే వైశ్యునికి, రోలు రెండు రూపాయలకు అమ్మేసి,బియ్యం పప్పుఉప్పూ కూరలు తెచ్చి వంట చేసి సిద్ధంగా ఉండగా అతిధులు రాగా వారికి ఆప్యాయంగా వడ్డించి తినిపించి సాగనంపి, తమ బీద స్థితి తెలియజేసి, సంతృప్తి చెందారు బందా దంపతులు. రోలును తీసుకోనిపోమ్మని వైశ్యునికి కబురు పంపారు. అతడు వచ్చి ఆ రోలు తీసే ప్రయత్నం లో ఉండగా దానికింద మొహరీల బిందె కనిపించింది.

వైశ్యుడు ఆబిందేను చూసి దాన్ని పరదేశి గారికి ఇవ్వబోగా, ఆయన తన ఇంట్లో అలాంటి బిందేకాని మొహరీలు కానీ ఎప్పుడూ లేవు అని నిజం చెప్పి రోలుతో సహా ఆ మోహరీ బిందె కూడా వైశ్యుడిదే అని నిష్కర్షగా చెప్పారు. ధర్మాత్ముడైన వైశ్యుడు రోలుమాత్రమే తనది బిందె తనదికాదని చెప్పి రోలు తీసుకు వెళ్ళాడు. శ్రీ రామచంద్ర ప్రభువే తమ నిరతాన్న దానానికి ఇలా మొహరీల బిందె ఏర్పాటు చేశాడని ఆ దేవదేవుని వేనోళ్ళ స్తుతించి మళ్ళీ సంతృప్తిగా నిరతాన్న దానం చేయటం మొదలు పెట్టారు. బందా పరదేశి దంపతుల పేరు దేశం లో గ్రామగ్రామాన మారు మోగింది. ఇది విన్న కొందరు అసూయా పరులు ప్రభుత్వానికిఫిర్యాదు చేశారు. అమరావతి ప్రభువు వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు నిరతాన్న ప్రదాత కనుక ఈ ఫిర్యాదును లెక్క చేయలేదు. దీనితో బందా దంపతులకీర్తి ఆసేతు హిమాచలపర్యంతం వ్యాపించింది.

క్రీ.శ.1670 లో వచ్చిన గంగానది పుష్కర స్నానానికి వాసి రెడ్డి ప్రభువు గురువుగారితో కలిసి కాశీ వెళ్ళారు. పుష్కర స్నానం చేస్తూ ప్రభువు బ్రాహ్మణులకు విపరీతంగా దాన ధర్మాలు చేసి అందరి ప్రశంసలు పొందాడు. అక్కడి వారు " నిరతాన్నదాత బందా పరదేశి గారు ఉండే ఆంధ్ర దేశపు ప్రభువు వెంకటాద్రి నాయుడుగారు "అని చెప్పుకోవటం రాజుగారు విని, మహా సంతోషించి, ఆయనకు తన రాజధానిలో ఘన సత్కారం చేయాలని సంకల్పించుకొన్నాడు. యాత్ర ముగించి రాజధాని అమరావతి చేరి బందా వారిని నోటీసు ఇచ్చి పిలిపించి, "నాకు తెలియ కుండా వేట పాలెం విడిచి వెళ్ళ వద్దు"అని ఆంక్ష విధించాడు. రాజాజ్ఞ కనుక ఒక ఏడాది అమరావతిలోనే ఉండిపోయారు.

ఒక ద్వాదశి నాడు ఉదయం కాలినడక లో వెడుతుంటే ఒక ఇంటిముందు వందలకొద్దీ బ్రాహ్మణులూ చేతులు కడుక్కోవటం చూశాడు. ఏమిటి విశేషం అని వారిని అడుగగా పరదేశి గారి ద్వాదశి పారాయణ భోజనం ఆహ్వానానికి వచ్చినట్లు చెప్పారు. పరమ సంతోషం వెలిబుచ్చి వేటపాలెం వెళ్ళగా పరదేశిగారి భార్య కమలాంబ గారు చేసే అన్నదానం కనులారా చూసి, ఆ అమ్మ భిక్ష తాను కూడా చేయదలచినట్లు కబురుపంపి, సపరి వారంగా వెళ్లి సంతోషంగా భోజనం చేసి, సత్కారం పొందాడు వెంకటాద్రి ప్రభువు. ఆమెకు సంతోషంగా కృతజ్ఞతలు చెప్పగా ఆమె "అన్నగారూ! తోబుట్టువును మరవ కండి "అని చెప్పింది. ఉబ్బి తబ్బిబ్బై ప్రభువు అమరావతి చేరాడు. పరదేశిగారి తో "మిమ్మల్ని అనవసరంగా కష్టపెట్టాను. క్షమించండి "అని విన్నపాలు చెప్పి, అర్ధ సింహాసం మీద తనప్రక్కన కూర్చో బెట్టి విలువైన బహుమతులతో సత్కరించాడుప్రభువు. ఇంతగా అన్నదానం చేయటానికి ద్రవ్యదాత ఎవరని ప్రశ్నిస్తే అద్దేపల్లి సుబ్బయ్య శ్రేష్టి అని చెప్పగా, ఆయన్ను పిలిపించి "పరదేశిగారి అన్న సంతర్పణకు మీరు ఇచ్చిన డబ్బు యెంత ?"అని అడుగగా "ప్రభూ !పరదేశిగారికి తిరిగి తీసుకొనే ఉద్దేశ్యంతో నేను డబ్బు ఇవ్వలేదు. కనుక పద్దు రాయలేదు. కాబట్టి యెంత ఇచ్చానోచేప్పలేను "అన్నాడు. దిమ్మతిరిగి బొమ్మ కనిపించి వెంకటాద్రి నాయుడు "ఔదార్యం అంటే ఇలా ఉండాలి "అనుకోని "నాకు తెలీకుండా ఆయనకు డబ్బు ఇచ్చే అధికారం నీకు ఎక్కడిది ? అనుమతి లేకుండా చేశావు. అయినా క్షమిస్తున్నా. ఆయనకిచ్చిన డబ్బు అంతా నేను నీకు ఇచ్చేస్తా తీసుకో"అన్నాడు. శ్రేష్టి "మీరిచ్చే శిక్షకంటే, భగవంతుడు ఇచ్చే శిక్ష పెద్దది. సత్సంకల్పానికి పాపకూపంలో పడి పోతానేమో నని భయంగా ఉంది మన్నించండి "అన్నాడు వినయంగా. "సరే నువ్వు చెప్పింది కూడా బాగుంది. నేను పరదేశిగారికి నువ్వు ఇచ్చిన డబ్బు అంతా తిరిగి నీకు ఇచ్చేస్తా తీసుకో. ఆయనకు ఘన సన్మానం చేస్తాను. నువ్వుకూడా పాల్గొని ఆ డబ్బు ఆయన సన్మానానికి ఖర్చు చెయ్యి. ఇద్దరం ధన్యులమవుతాం "అన్నాడు సెట్టి సమ్మతించాడు.

అన్నప్రకారమే వెంకటాద్రి నాయుడు బందా పరదేశి గారికి ఘన సన్మానం చేసి, కమలాంబ గారిని పిలిపించి కాశీలో ఆంధ్ర ప్రభుత్వం నిర్వహించే అన్నదాన సత్రానికి పరదేశిగారిని అధికారిగా చేయటానికి ఆమెను ఒప్పించి వేటపాలెం సత్రానికి కమలాంబ గారిని అధికారిని చేశాడు. వారణాశిలో తన బాధ్యతలు అత్యంత సమర్ధంగా సంతృప్తిగా నిర్వహించి పరదేశిగారు, వేటపాలెం చేరి, క్రీ శ 1785 లో ఆ విశ్వేశ్వరుని లో ఐక్యమయ్యారు. రెండేళ్ళ తరువాత భార్య కమలాంబ గారు కూడా కైవల్యం చెందారు.

బందా పరదేశి గారి గురించి నిరతాన్నదాత అపర అన్నపూర్ణ శ్రీమతి డొక్కాసీతమ్మ గారి లాగా ఆంధ్ర దేశంలో పెద్దగా ఎవరికీ తెలియదు. సత్రం సంఘటన ఇద్దరి జీవితాలలొ చోటు చేసుకోవటం తమాషా గా ఉంది. అమరావతి ప్రభువు ఈయనను ఆదరిస్తే, పిఠాపురం రాజా ఆమెను గుర్తించారు. ఇద్దరూ కారణ జన్ములు.ఆంధ్రులకు ప్రాతస్మరణీయులు.

## 4 శ్రీ గబ్బిట కోటయ్య

కోటప్ప కొండ లో"గబ్బిట వారి అన్నసత్రం "

ఆధారం –శ్రీ మద్దులపల్లి గురు బ్రహ్మ శర్మ రాసిన శ్రీ త్రికోటీశ్వర చరిత్రము(వచనం ) –కోటప్పకొండ -

ఈపుస్తకాన్ని కోటప్పకొండ దేవస్థానం నరసరావు పేట శార్వాణీ ప్రెస్ లో 1939 లో ముద్రించారు

కోటప్ప కొండపై వెలసిన శ్రీత్రికోటీశ్వరస్వామి దర్శనానికి వచ్చే యాత్రికులకు భోజన వసతి ఉండేదికాదు. యాత్రికుల బాధలు గుర్తించి బొప్పూడి గ్రామ వాస్తవ్యులు శ్రీ గబ్బిట కోటయ్యగారు, కొండ దిగువన అన్న సత్రం పెట్ట దలచి, శాశ్వత చందాదారులను ఏర్పరచి, ఆద్రవ్యం తో 1991 లో ఖరనామ సంవత్సరం నుంచి అన్నదానం చేయటం ప్రారంభించారు. మొదట్లో వందరూపాయల తో అయిదు వందలమంది బ్రాహ్మణులకు ఒక రోజు భోజనం పెట్టారు. రెండవ ఏడాది శివరాత్రి నాడు రెండు వేలమందికి శనగ గుగ్గిళ్ళు ఫలహారం గా పెట్టారు. మూడవ ఏడాది రెండు రోజులు అన్న సంతర్పణ, శివరాత్రినాడు శనగలఫలహారం పంచిపెట్టారు. ఆతర్వాత వరుసగా మాఘ బహుళ ఏకాదశి మొదలు మాఘబహుళ చతుర్దశి మహా శివరాత్రి వరకు అన్నప్రదానం, శివరాత్రి నాడు అరటిపళ్ళు ఫలహారం, మర్నాడు సంతర్పణ నిర్వహిస్తూ వచ్చారు.



మొదట్లో తాటాకు పందిళ్ళు వేసి కార్యక్రమాలు నిర్వహిస్తూ, 1901 లో ఒక రాతి సత్రం కట్టటం ప్రారంభించి అందులో ఏర్పాటు చేస్తూ, సత్రాన్ని 1909 కీలక నామ సంవత్సరం లో పూర్తి చేశారు. 1910 నుంచి శివరాత్రినాడు శనగలకు బదులు అరటిపళ్ళను ఇవ్వటం ప్రారంభించారు. ప్రతి ఏడాది అన్నసంతర్పణకోసం తెలిసిన బ్రాహ్మణులను రాష్ట్రమంతటా పంపి చందాలు వసూలు చేయించేవారు. వారు ఏడాదికి ఒక్కసారే శివరాత్రికి సుమారు రెండు నెలలముందు ప్రతి బ్రాహ్మణ కుటుంబాల ఇంటింటికీ వచ్చి సంవత్సరానికి రెండు రూపాయల చందా

తీసుకొని రసీదు ఇచ్చి శివరాత్రి తర్వాత స్వామివారి విభూతి అక్షింతలు పోస్ట్ లో పంపేవారు వీరందరూ అంకిత భావం తో పనిచేసే శివ సైన్యమా అనిపించేవారు. నాకు 1951 నుంచీ ఈవిధానం తెలుసు, మానాన్నగారి కాలం లో మాఅమ్మగారి కాలం లో రెండు రూపాయలు కొంతకాలం అయిదు రూపాయలు మరికొంతకాలం ఇచ్చేవారం, నా కాలం లో కూడా వచ్చి చందాలు వసూలు చేసుకు వెళ్ళేవారు ఆతర్వాత దాదాపు నలభై ఏళ్లుగా కోటప్పకొండ గబ్బిటవారి అన్న సత్రానికి చందా కోసం ఎవ్వరూ రావటం లేదు. ఆవచ్చిన ఆయన మా ఇంట్లోనే భోజనం చేసి, ఊరంతా తిరిగి చందాలు వసూలు చేసుకొని చివరిరోజు భోజనం కూడా మా ఇంట్లోనే చేసి వెళ్ళేవారు. ఒక బక్కపలచాటి కొంచెం నలుపు రంగు బ్రాహ్మణుడు వీభూతి కుంకుమబొట్టు పిలక, చెవులకు కుండలాలు నీర్కావి బట్టలతో వచ్చేవారు. పేరు జ్ఞాపకం లేదు అదొక పవిత్రకార్యంగా మా ఇంటిల్లిపాదీ భావించేవారు. మన గబ్బిటవారి అన్నసత్రానికి డబ్బు ఇస్తున్నాం అనే మహా సంతృప్తి ఉండేది మాకందరికీ. అంతకు మించి పెద్దగా చేయి విదిలించింది లేదు. మేము ఇప్పుడు తలచుకొంటే సిగ్గేస్తోంది. ఆమహానుభావుడు గబ్బిట కొటయ్యగారి ఆలోచనకు శిరసు వంచి పాదాభివందనం చేయాలి. మేము గత పదేళ్ళలో రెండు సార్లు కోటప్పకొండ వెళ్లాం కొండ దిగువన గబ్బిట కోటయ్య వారి సత్రం చూసి ఫోటోలు తీసుకొన్నాం కూడా. ఆ గబ్బిట వారిప్పుడు ఎక్కద ఉన్నారని అక్కడి బంత్రోటును అడిగితె చిలకలూరి పేటలో ఉంటున్నారనే శివరాత్రినాడు మహా వైభవంగా అన్న సమారాధన బ్రాహ్మణులకు జరుపుతున్నారనీ చెప్పాడు. చాలా సంతోషించాం



ప్రతి ఏడాదీ చందాలు వసూలు చేయటం కష్టంగా భావించి ఇరవై వేల రూపాయలతో భూమిని కొని దానిపై వచ్చే ఆదాయంతో సత్రం నడపాలని అనుకొన్నారు. కానీ పింగళి సంవత్సరం చైత్రశుద్ధ చతుర్దశి 6-4-1917 న గబ్బిట కోటయ్య శివసాయుజ్యం చేరటం తో ప్రయత్నం ముందుకు సాగలేదు. ఆయన తర్వాత ఆయన తమ్ముడు చీమలమఱ్ఱి వాస్తవ్యుడు గబ్బిట కృష్ణయ్య గారు,, సంతమాగులూరు వాసి రెంట చింతల గురవయ్యగారు ధర్మకర్తలుగా ఉంటూ అన్నసత్రాన్ని నడిపారు. కృష్ణయ్య గారు ఈశ్వర సంవత్సర ఫాల్గుణ బహుళ సప్తమి నాడు స్వర్గస్థులవగా, వారికుమారుడు దైవ సహాయంగారు ధర్మకర్తగా కొనసాగి సత్ర నిర్వహణ చేశారు.

గబ్బిటవారి అన్నదాన సత్ర నిర్మాణానికి ఎందరెందరో ధన సహాయం అందించారు వారిపేర్లన్నీ స్తంభాలపై చెక్కించారు. నరసరాపేట తాలూకా తూబాడు గ్రామస్తులు. శ్రీ తూబాటి శేషాద్రిగారు సత్రానికి పీపాలతో పెరుగు పంపించేవారు. ఎక్కడ అన్న సంతర్పణ జరిగినా శేషాద్రిగారు తనవంతుకర్తవ్యంగా పెరుగు పంపటం రివాజుగా ఉండేది.

అమరావతి జమీందారిణి శ్రీమతి వాసిరెడ్డి జ్ఞానప్రసూన ప్రసూనాంబా బహద్దర్ రెండు గదులు, పెట్లూరిపాలెం వాసి కటికి నేని వెంకట రమణయ్యగారు ఒకటి,,బొప్పూడి నివాసి గబ్బిట సుబ్బమ్మ గారు ఒకటి, నరసారావు పేట తాడేపల్లి ఆంజనేయులుగారు ఒకటి, చాగల్లు శివారు కంద్లగుంట వాస్తవ్యులు జంపని బుచ్చయ్యగారు ఒకటి, ఈ వెంకయ్య, గుంటుపల్లి వెంకయ్య, చెరుకూరిచంద్రయ్య, ఈ చౌదరమ్మ, పురుషోత్తమపట్నం వాసి బత్తినేని అనంతయ్య, చిలకలూరిపేట భండారం వెంకమ్మగార్లు తలొకగది నిర్మించి సత్ర నిర్మాణానికి సహకరించారు. 15 మంది వదాన్యులు రాతి స్తంభాలను ఇవ్వగా, సింహద్వారం పైకప్పు బండ ను నరసరావు పేట కు చెందిన బలిసేట్ల గోత్రుడు మండవ లక్ష్మీ పతి అందించారు.

సత్రనిర్వాహన కోసం భూములు ఇచ్చినవారిలో

గోనేపూడి వాసి పాపరాజు కోటయ్య -1య.25 సెంట్ల మెరకభూమి,

పెద చెరుకూరు వాస్తవ్యురాలు కక్కెర సుబ్బారాయుడుగారి భార్య లక్ష్మీ దేవమ్మగారు -1య.08 సెంట్లు శేరి పల్లం భూమి,

ముత్తనపల్లి వాస్తవ్యుడు శాఖమూరి వెంకట కృష్ణా నాయుడు రావిపాడు వాసి, 4 ఎకరాల అగ్రహారం భూమి,

రావిపాడు వాస్తవ్యుడు గబ్బిట కోటయ్యగారు 8ఎకరాల సొంత ఈనాం మెరకభూమి

అబ్బినగుంటపాలెం వాసి మైలవరపు వెంకటప్పయ్యగారు 2ఎకరాల స్వంత ఈనాం మెరకభూమి,

కొమిరేపూడి వాస్తవ్యుడు పున్నా వఝుల వీరభద్రయ్య భార్య పేరమ్మగారు -2ఎకరాల స్వంత ఈనాం మెరకభూమి, కొలలపూడికి చెందిన కందిమల్లరామస్వామి కుమారుడు శేషయ్యగారి కొడుకు వీరయ్య -1ఎకరం శేరీ మెరక భూమి రాసిచ్చియధా శక్తి అన్నదానానికి తోడ్పడ్డారు

గబ్బిట కోటయ్య గారు శివరాత్రి అన్న సత్ర నిర్వహంచటమే కాకుండా, కోటప్పకొండ మధ్య సోపానమార్గం లో మధ్యమధ్య విశ్రాంతి మందిరాలు కట్టించి చెట్లు నాటిం చారు. కేతముక్కలవారి అగ్రహారం లో శివాలయం ఆంజనేయ దేవాలయం కట్టించారు. ఆ అగ్రహారీకులు శివుడికి 18 ఎకరాల మెరక ఒక ఎకరం పల్లం, ఆంజనేయస్వామికి కోటయ్యగారు అక్కడే 11 ఎకరాల మమెరక, విప్పర్లలో ఒక యకరం పల్లం సమర్పించారు. కేసానుపల్లె –బయస్కాపురం మధ్యలో రోడ్డుపక్క కనపర్తి భూమిలో బావి, విశ్రమశాల, చెట్లు ఏర్పాటు చేశారు కోటయ్యగారు కృష్ణానది ఉత్తరవాహిని సత్తెనపల్లి తాలూకా మాదిపాటికిదక్షిణంగా భారద్వాజ ఆశ్రమం, ఉత్తరేశ్వర స్వామికి ప్రతిసోమవారం నివేదన ఏర్పాటు చేశారు. చేజెర్ల కపోతేశ్వరాలయం లో తుంగ దుర్తి బుచ్చయ్యగారి సమాధికి నైవేద్యానికి వసతి ఏర్పాటు చేసి గబ్బిట కోటయ్యగారు మహా వదాన్యులు దైవభక్తి పరాయణులు అనిపించారు. మాకూ వారికీ పరిచయాలు లేకపోయినా మా గబ్బిట వారైన కోటయ్యగారి ధార్మిక సేవకు మేమూ గర్వపడుతున్నాం.

## 5 రమణ భగవాన్ సన్నిధి

ఆయనా -ఈయనా



" ఈయన" వచ్చే సరికి "ఆయన" దాదాపు బట్టలు ఏమీ లేకుండా ఒక్క గోచీ గుడ్డ తో ఆసనం పై సుఖాసీను లయి ఉన్నారు. శరీరం కొంచెం రాగి రంగు లో ఉంది. వయస్సు యాభై ఉండి ఉంటాయి. జుట్టు గడ్డం మీసం తెల్ల బడ్డాయి. ఆయన విశాల ఫాల భాగం విజ్ఞాన ప్రభ లను వెద జల్లు తోంది. ఆయన మూర్తి మత్వం అపురూపం గా గోచరించింది. ఆయన చుట్టూ శిష్యులు పర్య వేష్టించి ఉన్నారు. అంతా నిశ్శబ్దం తాండ వీస్తోంది. ఆయన కళ్ళ లో అతీంద్రియ తేజస్సు గోచరం అవుతోంది. ఆ కళ్ళు విప్పారి ఏదో లోకోత్తర శక్తిని దర్శింప జేస్తున్నాయి. ఆయన కాయం అతీన్ద్రియత్వానికి ప్రతీక గా కన్పిస్తోంది. ప్రశాంత చిత్తం గా ఆయన కన్పిస్తున్నారు. ఎవరు వచ్చారో, ఎవరు వెళ్తున్నారో ఆయన గమనించే స్తితి లో ఉన్నారు. మనిషి ఉనికి గురించిన ఎరుక ఆ కళ్ళ లో గోచరించింది. ఈయన ఇంతకు ముందు ఎందరి నో చూశాడు. వారెవరి లో లేని ఏదో మహాత్తర ఆకర్షణ, తేజస్సు ఆయన లో కనీ పించింది ఈయనకు నోట మాటే రావటం లేడు. ఎన్నో సందేహాలను తీర్చు కొందామని ఈయన, ఆయన దగ్గరకు వచ్చాడు. ప్రశ్నలన్నీ ఏమై పోయాయో తెలీటం లేడు. ఆయన ఒక మహా సమాధి స్తితి లో ఉన్నట్లు గోచరించింది. అంతా శూన్యం లో విహరిస్తున్నట్లుంది. ఆయన లో ఏదో ఉంది. అదేమిటో తెలీటం లేదు.ఈయన కూడా రెప్ప వాల్చ కుండా ఆయన నె చూస్తూ కూర్చున్నాడు. అంతే -కాలం గడిచి పోతోంది. మనసు లోని సందేహాలు గంటలు గడిచిన కొద్దీ పటా పంచలయి పోతున్నాయి.ఒక పుష్పానికి సువాసన లా ఆయన సమక్షం లో మనోనైర్మల్యం అంతటా వ్యాపించి ఉంది. ఆయన నుండి రేడియో ఆక్టివ్ తరంగాలు వ్యాపించి నట్లు, తనను శక్తి మంతం, కాంతి మంతం చేస్తున్నట్లు ఈయన భావించి, ఆ ప్రభావానికి ముగ్ధుడై పోతున్నాడు. మనసంతా ప్రశ్నల మయం గా వచ్చిన ఈయనకు ఇప్పుడు మనసంతా సర్వ శూన్యం అయి పోయింది. గుండె గొంతుక లో కొట్లాడు తోంది. మాట మాత్రం పెదవి దాటి రావటం లేదు. అగాధ సముద్రాలను అవలీల గా దాటిన ఆనందాన్ని పొందిన తీరు లో ఉన్నాడీయన. చివరికి అదృష్టం తలుపు తట్టింది. మౌన ఘోష విడి పోయింది. ఆయన దృష్టి ఈయన వైపు ప్రసరించింది కొన్ని గంటల మౌనం తర్వాత.అంతకాలం తాను అనుభ వించిన ప్రశాంత త కు ఈయన ముగ్ధుడయాడు. శాంతి, అశాంతిని జయించి, విజయం సాధించింది. ఇప్పటికే ప్రక్కనున్న గైడు"ఏమైనా ప్రశ్నిస్తారా ??"అని రెండు మూడు సార్లు ఈయనను అడిగాడు. ఇప్పుడు ఈయన "లేదు. ఇప్పుడు కాదు తరువాత "అని నెమ్మదిగా చెప్పాడు. అప్పటికే చాలా మంది భక్తులు వెళ్లి పోయారు. ఈయన మౌనం గా ఆయన కు నమస్కరించి నెమ్మదిగా ఆశ్రమం లోని తన గదికి చేరాడు ఆ రాత్రి పొద్దు పోయిన చాలా సేపటికి. ఇంతకీ ఎవరు ఆ "ఆయన ?"-ఎవరు ఈ"ఈ యన ?"ఆయన అంటే అరుణాచలం లోని రమణ మహర్షి. ఈయన అంటే -భారత దేశం లో మహర్షుల, యోగుల దర్శనం చేసుకొని, వారి ఆత్మ శక్తులను తెలుసు కోవటానికి ఇంగ్లాండు దేశాన్నించి వచ్చిన జర్న లిస్టు డాక్టర్ పాల్ బ్రంటన్. "A search in secret India" పుస్తకాన్ని రాసి పాశ్చాత్యులకు భారతీయ యోగుల, మహాత్ముల ప్రభావాలను తెలియ జెప్పిన వాడు.

మర్నాడు మహర్షి శ్రీ రమణుల ను దర్శించాడు పాల్ బ్రంటన్. ఇప్పుడు తన ప్రశ్నా పరంపరను సంధించటం ప్రారంభించాడు పాల్. "మానవులకు అతీతం గా ఏదైనా ఉన్నదా ?దాన్ని నేను ఎలా కను క్కో గలనో వివరించండి "అని అడిగాడు. లోపల ఈయన చెప్పా గలదా, సరైన వాడినే ప్రశ్నించానా అనే సందేహం పట్టి పీడించింది పాల్ ను. మహర్షి కొద్ది సేపు మౌనమే పాటించారు. ఏదో ఆలోచన లో ఉన్నట్లు కనీ పించింది. మళ్ళీ పాల్ "మా

పాశ్చాత్య దేశం వారు దీనికి సరైన వివరణ ఇవ్వ లేక పోతున్నారు. నాకు మీరు పరి పూర్ణ జ్ఞానాన్ని ప్రసాదించా గలరా లేక ఇదంతా ఒత్తి శ్రమ ఏనా"?అని అడిగాడు. అప్పుడు మహర్షి నెమ్మదిగా మొదలు పెట్టారు "నువ్వు -"నేను "అన్నావు. నేను తెలుసుకోవాలి అని, నేనెవరినో చెప్పమని అడిగావు నిజమేనా ?అని ప్రశ్నించారు. తడబడ్డాడు బ్రంటన్. ప్రశ్న కు ప్రశ్న సమాధానమా?.మళ్ళీ మహర్షి "నేను అడిగింది స్పష్టం గా లేదా ? మళ్ళీ ఆలోచించు "అన్నారు. అప్పుడు బ్రంటన్ ఒక వేలు తనకు తాకించు కొని తన పేరు చెప్పాడు. రమణులు "అతను నీకు తెలుసా ?"అని ప్రశ్న వేశారు. "ఆ తెలుసు. నేనే "అన్నాడు పాల్. "అది నీ శరీరం మాత్రమె. మళ్ళీ ఆలోచించి చెప్పు నీవెవరివి ?"అన్నారు ఇదేమి వింత ప్రశ్న అని పించింది పాల్ కు. అప్పుడు మహర్షి "ముందుగా" నేను" ను తెలుసుకో. అప్పుడు సత్యం బోధ పడుతుంది ".అన్నారు ప్రశాంతం గా. పాల్ కేమీ బోధ పడ లేదు. అయోమాయం గా అయి పోయాడు. అప్పుడు ప్రక్కన ఉన్న దుబాసీ వివరించి చెప్పాడు. ""నీలోకి నువ్వు చూసుకో. అదీ సరైన మార్గం లో. అప్పుడే నీకు సమస్యలు, ప్రశ్నలు వాటికి సమాధానాలు కనీ పిస్తాయి ".యే పద్ధతి నేను అవలంబించాలి "'అని మరలా ప్రశ్న.

"లోతైన భావన తో నిన్ను నువ్వు వెతుక్కో. దానికి నిరంతర ధ్యానం అవసరం. అప్పుడే ఆ కాంతి నీకు దర్శన మిస్తుంది. "అని అరుణా చాల ముని సమాధానం. "నేను సాధించానా లేదా అని నాకు ఎలా తెలుస్తుంది? గురువు అవసరం ఉందా ?""ప్రశ్న. "అవసరం కావచ్చు "ముని జవాబు. "సరైన గురువు దారి చూపగలడా?' 'పాల్. "గురువు కు శిష్యుడికి ఏమి కావాలో తెలుస్తుంది. దాన్ని తీర్చ గల సమర్ధుడు. "అని మహర్షి. "జ్ఞాన జ్యోతి ని గురువు చూపించగలడా ? "సందేహం "సాధకుని పరిణతి మీద ఆది ఆధార పడి ఉంటుంది. గన్ పౌడర్ వెంటనే అంటుకొని మండు తుంది. కాని దాన్ని మండించే బొగ్గు నిప్పుగా మారటానికి ఎక్కువ కాలం పడుతుంది. "

"ప్రపంచ భవిష్యత్తు గురించి చెప్పండి ?"'అని పాల్ ప్రశ్న. "నీ సమీప భవిష్యత్తే నీకు తెలీదు. ముందు నీ వర్తమాన పరిస్తితి తెలుసుకో. అప్పుడు భవిష్యత్తు దాని సంగతి ఆది చూసు కొంటుంది "అన్నారు మహర్షి. "ప్రపంచం అస్తవ్యస్త పరిస్తితులకు లోను అవుతుందేమో, స్నేహానికి విలువ ఉండదేమో ఒకరికొకరు శత్రువులు అవుతారేమో "అని ప్రశ్నా వర్షం... నవ్వుతూ చిదానందం గా శ్రీ రమణులు "ఈ విశ్వాన్ని పాలించేది ఒక్కడే. ప్రపంచాన్ని సరిదిద్దాల్సినదీ ఆయనే. ప్రపంచానికి జీవాన్ని ప్రసాదించిన వాడు, దాని పరి రక్షణ, నిర్మూలనా బాధ్యత లన్నీ ఆయనవే. ఈ ప్రపంచ భారాన్ని మోసేది ఆ పరమాత్మ. నువ్వు కాదు".అని సమాధానం. "ఈ విశ్వాసం తో జనం ఉండగలరా "? బ్రంటన్ సమాధానం పొందక, వేసిన ప్రశ్న. "నువ్వు ఎలా ఉంటె, ప్రపంచం అలా కనీ పిస్తుంది. నిన్ను నువ్వు అర్ధం చేసుకో కుండా, ప్రపంచాన్ని యెట్లా అర్ధం చేసుకో గలవు ?సత్యాన్ని తెలుసు కొన్న వారు ఈ విషయాలేమీ గమనించరు. ప్రజలు ప్రశ్నల బరువు తో కుదించుకు పోతున్నారు. ముందు నీ వెనుక ఉన్నదేదో తెలుసుకో. అప్పుడు నీ వెనుక ఉన్న ప్రపంచం బాగా అర్ధం చేసుకో గలవు.. అందులో నువ్వూ ఉన్నావు అన్న సంగతి మర్చి పోవద్దు "అని మహర్షి శ్రీ రమణుల స్పష్ట మైన సమాధానం. ఇదీ -కావ్యకంఠగణ పతి మునిని "నాయన గారూ "అని ఆప్యాయం గా పిలుచుకొని, ఆయన చేత "శ్రీ రమణ మహర్షి "అని సార్ధక నామాన్ని పొందిన అరుణాచల మహా యోగి భగవాన్ శ్రీ రమణ మహర్షుల ప్రధమ దర్శనం లో, ద్వితీయ దర్శనం తో పాల్ బ్రంటన్ పొందిన అనుభూతి.

### శ్రీ రమణ భగవాన్ సన్నిధి

శ్రీ రమణ భగవాన్ సన్నిధి ఒక అరుదైన విచిత్ర అనుభూతి. ఇలాంటి అనుభూతి వేరే చోట ఎక్కడా లభించదు.. ఆయన మౌన సందేశానికి హృదయకమలాలు వికశించి జ్ఞాన బాండాగారం తెరుచుకొంటుంది. ఆయన ఆత్మ ఆశ్రమ మంతా కిరణ ప్రసారం వెదజల్లుతుంది.. ఆయన ముందు కూర్చుంటే చాలు మనసులో ఉన్న అన్ని ప్రశ్నలకు సమాధానాలు ఇట్టే లభిస్తాయి.. దక్షిణామూర్తి లాగా ఆయన మౌన వ్యాఖ్యాన పరబ్రహ్మ. ఆయన సందర్శనం లో మనం "సవికల్ప సమాధ్ది "పొందుతాం.. "రమణ మహర్షి భౌతిక గురు మూర్తికారు.. మహా గొప్ప పవిత్రమైన మూర్తి ఇంతటి అరుదైన వ్యక్తి ఒక శతాబ్దకాలం లో భారత దేశం లో జన్మించలేదు "అన్నారు మన రాష్ట్రపతి డా రాధాకృష్ణన్.. ఆయన్ను ఒక్కసారి చూస్తే చాలు మన హృదయాలు ప్రక్షాళనమై పవిత్రవంతాలవుతాయి.

శ్రీ రమణ మహర్షిది ఒకటే ప్రశ్న -"నేను ఎవరిని ?"అది వేసుకొంటే సాధకునికి ఆత్మ జ్ఞానం కలుగుతుంది ఈ విధానం ప్రాచ్య పాశ్చాత్య విధానం లో ఉన్నా, దీనిని మళ్ళీ తెరపైకి తెచ్చినవారు ఆయనే.. వేదాంత తత్త్వం లోని దంతా ఆయన ఆచరణ సాధ్యం చేసుకొన్నారు. ఒకరకంగా చెప్పాలంటే "ఇలియడ్ ను ఒక్క మాటలో చెప్పారు అంటాడు స్వామిరామా. తనను తాను తెలుసుకున్నవాడికి విశ్వమంతా తెలుస్తుంది. ఇదే అద్భుత చిన్న సూక్ష్మ విధానం ఆత్మ జ్ఞానానికి. దీనినే అన్ని తత్వ శాస్త్రాలు చెప్పాయి..

నాలుగు రోజులు తన బృందం తో రమణా శ్రమం లో ఆధ్యాత్మిక అనుభూతిలో గడిపాక నాసిక్ కు తిరిగొచ్చి, తాను ఉన్న శంకరా చార్య పదవిని విసర్జించేయాలనే గట్టి ఆలోచన మనసులో స్థిరపడింది. ఆచార్య పదవిలో క్షణం తీరిక లేకుండా వచ్చిమీద పడే జనాల బాధ తో భారంగా బోరింగ్ గా భావించాడు. అరుణాచలం లో రమణ మహర్షి దర్శనం తో ఆ లోపలి అగ్నికి ఆజ్యం పోసినట్లయింది "త్యజించు అనుకొన్నది సాధించు "అనేది మనసు హృదయాలలో మారు మోగిపోతోంది.. నాశిక్ లో ఉన్నకాలం మరీ ఇబ్బంది కలిగించింది.. పీఠం త్యజించి బాధ్యతలన్నీ వదిలేసి పారి పోవటం అంత తేలికైన విషయం కాదు.. కానీ ఒక రోజు వచ్చి ఆ పనే చేయించింది. నాశిక్ వదిలి ఒక్కసారిగా మళ్ళీ హిమాలయాలకు వెళ్లి పోయాడు..

ఎవరూ వేరొకరికి జ్ఞాన ప్రకాశం కలిగించలేరు అనిపించింది. యోగులు మాత్రం ప్రేరణ కలిగించి అంతర్బలాన్ని కలిగించగలరు. అది లేక పోతే ఆత్మ జ్ఞానం సాధించటం అసాధ్యం.. ఇవాల్టి కాలం లో మార్గ దర్శనం చేసే వారు కనిపించటం లేదు. మనకు ప్రేరణ కలిగించి దారి చూపేవారు లేరు. అందుకే ఆత్మజ్ఞానం అందుకోవటం కష్టమౌతోంది. కనుక మహర్షులు, యోగులు ప్రేరణకు మూలాలై ఆత్మజ్ఞానఉద్దీపకులౌతారు అని పించింది స్వామిరామాకు

### మహర్షి శ్రీ రమణుల అనుగ్రహ భాషణం

"ప్రాపంచిక కార్యాలను వదిలి పెట్ట రాదు. రోజుకు ఒకటి రెండు గంటలు ధ్యానం చేసి నీ విధ్యుక్త ధర్మా లన్ని యదా ప్రకారం నిర్వర్తిన్చాల్సిందే. సరైన విధానం లో నీ ధ్యానం ఉంటె, నువ్వు చేస్తున్న ప్రతి క్రియ లోను దాని ప్రభావం ఉంటుంది. నువ్వు యే విధానాన్ని ధ్యానం కోసం ఎంచు కొంతావో, అదే విధానం నీ సకల చర్యల్లోను ప్రతి ఫలిస్తుంది. అలా చేస్తూ పోతూంటే, మనుష్యుల పై నీ కున్న భావాలన్నీ మారి పోతూ ఉంటాయి. నీవు చేసే పను లన్ని, నీ ధ్యానాన్నే పూర్తిగా అనుసరించి నడుస్తాయి. మనిషి తనను ఈ ఐహిక ప్రపంచం తో బంధించే వాటిని అన్నిటిని త్యాగం చేయాలి. మాయ గా ఉన్న "నాది "ను పూర్తిగా వదులు కోవాలి. ప్రపంచం లో జీవిస్తూ, నిస్వార్ధం గా ఉండటం కుదురు తుందా అని చాలా మంది సందేహిస్తారు. పనికి, జ్ఞానానికి తగాదా కాని భేదం కాని లేదు. వ్యక్తీ అంతఃకరణ క్రమంగా "ఆ దివ్యత్వం "పైకి ఆకర్షింప బడుతుంది ".ఆది" గా మారి పోతుంది. ముందుగా స్తిరత్వం కోసమే ఆసనం, నిష్టా, సమయం అవసరం. క్రమేపీ ఇవన్నీ నువ్వు చేసే పనుల్లోనే ఒదిగి పోతాయి. పని చేస్తున్నా, చెయ్యక పోయినా ఆది ఒక నిరంతర చైతన్యమే అవుతుంది. మనమేమో విడి గా చేస్తున్నా మనే భావన ఉండదు. మనిషి సంఘం లో ఉండిదాని పని చేస్తున్నా, అతని మనస్సు బుద్ధి దీనికి అతీతం గా ప్రవర్తిస్తాయి. ప్రశాంతం గా నర్తిస్తాయి.,

యోగాను చేయాలి అంటే యోగి మనసును దాని లక్ష్యం వైపు లగ్నం చేయాలి. "నేనెవరు "?అని ప్రశ్నించు కోవాలి. ఇలా అన్వేషణ సాగితే చివరికి నీలోనిది ఏమిటో నీకు ఆవిష్కారం అవుతుంది. ఆది బుద్ధికి అతీతం గా ఉండి,నీకు వింత అనుభూతినిస్తుంది. ఆ సమస్య ను నువ్వు పరిష్కరించు కొంటె, మిగిలిన సమస్యలన్నీ వాటంతటికి అవే పరిష్కారం అవుతాయి. ప్రాణులన్నీ సుఖాన్ని, ఆనందాన్ని కోరుతాయి. అప్పటి దాకా తాము అనుభవిస్తున్న అనంత దుఖాన్ని మర్చి పోవటానికే ఇవి. అయితే ఆనందం అనంతం గా పొందాలని వీరందరి కోరిక. ఆది సహజమే. ఒక దాని నుంచి ఇంకో దాని కోసమే ఆరాటం. వాళ్ళందరికీ తమ స్వార్ధమే కదా బాధిస్తోంది ?మనిషి నిజ వర్తనమే ఆనందం. ఆది పుట్టుక తోనే వస్తుంది అతని సుఖానికి చేసే అన్వేషణ, కూడా నిరంతరం సాగేదే. కానిదాన్ని పొంద గలుగు తున్నాడా? లేదే. కనుక అతను అనుకొనే ఆనందంశాశ్వతం కాదు. సుఖా లకు అంతు అనేది లేదు. మరి ప్రపంచం దుఃఖ భాజనం గా కన్పిస్తోంది కదా? దీనికి కారణం మన ఆత్మ ను సరిగ్గా గుర్తించని అజ్ఞానమే.

మనిషి పాపం చేయ టానికి కారణం దాని వల్ల సుఖాన్నో ఆనందాన్నో పొందుదామనే ఆశ. ఇది సహజాత మైంది. అయితే వారికి నిజం గా సుఖం పొందటం లేదనే విషయం తెలియదు. అతని పాపపు పనులే అతన్ని దెబ్బ తీస్తాయి. కనుక ఆత్మానందాన్ని మించిన ఆనందం అనేది లేదు. తన గురించి సరి అయిన జ్ఞానం కలగాలి. ఆ తత్త్వం లో నుంచే "నేను "అనేది ఏర్పడు తోంది. మళ్ళీ ఇది అందులోకే చేరాలి. అదేజ్ఞానం. నేను అనే ఆలోచన ప్రారంభం అవుతుంది పుట్టుక తోనే. తర్వాత "నువ్వు " అనే దానితో ఆది కన్పిస్తుంది. నువ్వు మనస్సు లో "నేను "అనే ఆలోచనా దారాన్ని అనుసరిస్తూ పోతుంటే, ఆది మళ్ళీ నిన్ను అక్కడికే చేరుస్తుంది. అప్పుడు "నేను "కనీ పించదు.. ఇది మాటల్లో వివరించి చెప్పలేనిది. ఎవరికి వారు స్వీయ అనుభవం తో పొందాల్సిందే.

ఇలాంటి అన్వేషణ సాధ్యమా ?అని పిస్తుంది. సాధ్యమే. సాధన కావాలి. అప్పుడు "నేను "అదృశ్యమై పోతుంది. అదే జ్ఞానం, ఆనందం, సత్యం, శివం, సుందరం. మనసు, బుద్ధి లకు అతీతం గా ఒకటి ఉంది అని తెలిస్తే -అదే తెలుసుకోవటంఅంటారు.. దానినే స్వర్గం, అంటారు అదే ఆత్మ అంటారు. నిర్వాణం అని కొందరంటారు. మనం దాన్ని ముక్తి అంటాం. యే పేరు పెట్టినా, మనిషి తనను తాను కోల్పోతే, అంటే తనను తాను తెలుసు కొంటె అదే ఆనందం, శాశ్వత మైన సుఖం. "ఎవరు తన జీవితాన్ని రక్షించాలి అనుకొంటారో వారు దాన్ని కోల్పోతారు. ఎవరు జీవితాన్ని కోల్పోతారో వారు దాన్ని భద్రం గా దాచుకోన్నట్లే" అని పాశ్చాత్య వేదాంత భావన. తానెవరో తెలుసుకో వాలనే తపన ఉన్న వాడికి అనుమానం అని శ్చ యత ఉండవు. మహా రాజులు, చక్ర వర్తులు గొప్ప గా పరి పాలించి నట్లు కనీ పిస్తుంది, కాని వారి హృదయాలలో ఇంతటి పని తాము చేయటం లేదని, ఒక మహత్తర శక్తి తమను నడి పిస్తోందని నమ్ముతారు. మహా మేధావు లను కొన్న వారిని" మనిషి మిస్టరీ ని ఛేదిన్చారా"? అని అడిగితే సమాధానం లేక, తల వంచుకొంటారు. ఆది అసాధారణ మానవాతీత శక్తి అని అనుకో వచ్చు. కాని అదీ, ఎవరికి వారు అనుభవించి తెలుసు కోవలసిన సత్యమే.

సత్యాన్ని గురించి ఎరుక భారతీయుల కైనా, పాశ్చాత్యు ల కైనా ఒక్కటే. ధ్యానం లో ఉత్పన్న మయ్యే శక్తి అన్ని కార్య క్రమాలకు సహాయం చేస్తూనే ఉంటుంది. కనుక ధ్యానానికి, బయట చేసే ఇతర కర్తవ్యాలకు తేడా అంటూ ఏమీ లేదు. సత్యాన్వేషణ ఎవరు చేసినా. నిజ మైన ఆత్మ ను తెలుసుకో. అప్పుడు సత్యం సూర్యోదయ కాంతి లాగా ప్రకాశిస్తుంది ప్రభావం చూపు తుంది. నీ మనస్సు కు యే బాధా, బందీ ఉండవు. అసలు ఆనందం వెల్లువై ప్రవహిస్తుంది. ఆనందం, ఆత్మ,వేరు కావు. రెండు ఒక్కటే నని తెలుస్తుంది. ఈ ఆత్మ జ్ఞానాన్ని పొంది తే ఇక సందేహాలకు తావే ఉండదు. సందేహం లేక పోతే, అంతా సచ్చిదా నందమే.

ఇదీ మహర్షి శ్రీ రమణులు నిత్యాన్వేషి అయిన బ్రిటన్ రచయిత పాల్ బ్రంటన్ కు ఇచ్చిన ఇంటర్వ్యు లో దయ చేసిన "అనుగ్రహ భాషణం ".అందరికీ విజ్ఞాన సుధా మరందం.

శ్రీ రమణ వాణి

రామన్ అని పిలువ బడే శ్రీ రమణ మహర్షికి ఆ పేరు పెట్టింది ఆంధ్ర ప్రదేశ్ లో ఉత్తరాంధ్ర లో శ్రీకాకుళం దగ్గరలో జన్మించిన శ్రీ అయల సోమయాజుల గణపతి శాస్త్రి గారు. వారినే వాశిష్ట గణపతి అని గణపతి ముని అని అంటారు. రమణ మహర్షి లోని అనంత జ్ఞానాన్ని అర్ధం చేసుకొని శ్రీ రమణులు

అని పిలవటం ప్రారంభించారు గణపతి ముని. రమణులు వీరిని గౌరవం గా "నాయన గారూ"అని పిలిచే వారు. గణపతి ముని గొప్ప తపస్సంపన్నులు. వెద వేదాంగాలన్నీ క్షుణ్ణం గా చదివారు



.వేదం లోని విషయాలు భారతం లో పాత్రల రూపం లో ఎలా చోటు చేసు కొన్నాయో వివరం గా పుస్తకం రాశారు. రమణ మహర్షి గొప్ప తనాన్ని లోకానికి అనేక ఉపన్యాసాల ద్వారా, పుస్తకాల ద్వారా తెలియ జేశారు. ఎన్నో స్తోత్రాలు రాశారు. అమ్మ ఆయన నోట పలుకు తుందని ప్రతీతి. అలాగే ఆంధ్ర దేశం లోని సూరి నాగమ్మ గారు రమణాశ్రమం లో వుండి, శ్రీ రమణుల సేవలో పునీతురాలైనారు. ఆమె వ్రాసిన" రమణాశ్రమం ఉత్తరాలు "చాలా ప్రాచుర్యం పొందాయని అందరికి తెలుసు. గుడిపాటి వెంకట చలం గారు అన్నీ వదిలి చివరికి రమణ మహర్షి చెంత చేరి జీవితం ధన్యం చేసుకోన్నారన్నది లోక విదితమే. చింతా దీక్షితులు శ్వాశ అంతా రమణ భగ వానే. ఇలా ఎందరెందరినో తన అమృత వాక్కుల చేత ప్రభావితం చేశారు భగవాన్ రమణ మహర్షి. వారి ఉపదేశ సారాన్ని ఇప్పుడు తెలుసు కొందాం.

**పురుషార్ధం అంటే పరమ పురుషున్ని అర్ధం చేసుకోవటమే. పురుష ప్రయత్నానికీ ఇదే అర్ధం.**

భాగవతం లో జడ భరతుడిని గురించి చెబుతూ పోతన్న గారు "చంపగ. వచ్చిన వారి యందు, కరవాలము నందు, కాళి యందు, ను అచ్యుత భావము వహించే "అంటారు. అంటే దేని మీద ఆయనకు ద్వేషం, ప్రేమ అనేవి లేవు. అంతా సమ భావనమే. ఇదే స్థితి ని శ్రీ రామ కృష్ణ పరమ హమ పొందారని విజ్ఞులు తెలియ జేశారు.

వలలో చిక్కిన పక్షి ప్రాణ వాయువును నిరోధించి నట్లు మనం కూడా చేస్తే మనసు లోని చాంచల్యం పోతుంది. దీనినే "జాల పక్షి వద్రోధ సాధనం "అన్నారు రమణ మహర్షి

ప్రాణా యామం అంటే ప్రాణ శక్తిని, మనస్సును, సమన్వయము చేయటమే. "మనసా ప్రాణస్య ఈక్షణం --ఇతి ప్రాణా యామః "అంటే మనసును, ప్రాణం పైన పెట్టటమే.

**మనసు, ప్రాణం రెండు ఒకే వృక్షం యొక్క రెండు శాఖలే.**

"హృదయ మేవ ప్రాణ, మననోరుత్పత్తి స్థానం భవతి --హృద్యేవ ఆత్మ జ్యోథిహ్ ప్రకాశతే "ప్రాణం, మనసు ఉత్పత్తి స్థానం ఆత్మజ్యోతి ప్రకాశించే హృదయమే.

లయం అనే మాట తరుచు గా వాడుతాం. లయం అంటే తాత్కాలికం గా శాన్తిన్చాటమే. నిద్ర పోవటం లాంటిది. ప్రాణా యామం ద్వారా మనసు శాంతిన్చినా, తాత్కాలికమే. ఆ స్థితి అయి పోగానే మనసు మళ్ళీ చంచలమవుతుంది.. అయితే జ్ఞానం ద్వారా పొందిన మనసు వాసనలను పొందదు.. స్థిరం గా వుంటుంది. అందుకే "మనో నాశాయ మోక్షం "అన్నారు. జాగృతి స్థితి లో మేలు కోని వున్నా, మనసు బ్రహ్మ భావన పొందితే ఇంక గ్రహణ శక్తి వుండదు.

"ఆజ్యం పునః క్షీరో న భవతి "నెయ్యి మళ్ళీ పాలు కాలేవు.. కావు కూడా. పండు మళ్ళీ కాయ కాలేదు. అట్లాగే మరణిస్తే మళ్ళీ పుట్టదు.

ప్రాణాన్ని నిరోధిస్తే మనసు లయం అవుతుంది. మనో వృత్తిని నిరోధిస్తే మనసు వినాశం అవుతుంది. ప్రాణ నిరోధం తో లయమైన మనసు, మళ్ళీ పని చేస్తూ వుంటుంది.. మనసు లోని వాసనల నాశనమే నిజమైన నాశనం. "లయ వినాశనే ఉభయ రోధనే --లయా గతం పునర్భవతి'నో మృతం "'అన్నాడు గీతా చార్యుడు. మనో నాశ మోక్షం అమనస్క యోగం కావాలి. అలాంటి స్వ -ఆత్మ స్థితి లో ఉత్కృష్టమైన యోగికి ఇంక ఏ పనీ చేయాల్సిన అవసరం వుండదు.

"దృశ్య వారితం --చిత్త మాత్మనః --చిత్త దర్శనం -తత్వ దర్శనం "మనసు అంతర్ముఖం చేసి, ఆత్మ స్వరూపం లో ఉంచటమే చిత్ లేక తత్వ దర్శనం.

మనసు అంటే అంతఃకరణం. --కరణం అంటే పని ముట్టు.. అంటే మనసు మన లో వుండే లోపలి పని ముట్టు. కాళ్ళు, చేతులు బయటి పని ముట్లు. "

"తెలియ బడు చున్న విశ్వంబు దృశ్య మగును --తెలివినై సర్వమును కాంచు --దృక్కు నేను --మిగుల నా కంటే అన్యమేమియును లేదు --సత్యమిది --సర్వ వేదాంత సంగ్రహంబు "అని సీతా రామాంజనేయ సంవాదం చెబుతున్నది ఇదే.

మనసు, మనసు అని విచారణ చేస్తే, చివరికి చేరేది మూల స్థాన మైన పరమేశ్వర స్థానమే. అంటే మనస్సు అనేదే లేని స్తానం.

పతంజలి మహర్షి ;యోగః ; చిత్త వృత్తి నిరోధః "అన్నారు. చూచే వాడు, చూసేది చూడ బడేది కలిస్తే త్రిపుటి అంటారు. జ్ఞాని అంటే కళ్ళున్న గుడ్డి వాడు. అంటే కళ్ళు వున్నా బయటి ప్రపంచ జ్ఞానం లేని వాడు. అంటే త్రిపుటి రాహిత్యం పొందిన వాడు.

ఇంగ్లీష్ లో నెవెర్ మైండ్ అంటారు అంటే పట్టించుకోక పోవటమే. దీన్నే మన వాళ్ళు "నైవ మానసం "అన్నారు. పట్టించుకోవటాన్ని విషయం అంటారు. పట్టించుకోక పోతే ఏమీ వుండదు. ఆలోచనా ప్రవృత్తి నుండి, మనసునుతన వైపుకు మరల్చు కోవటమే. "ద్రుశ్యాను విద్ధ సంకల్ప సమాధి "అన్నారు. అదే నెవెర్ మైండ్. సహజం గా మనసు ప్రశాంతం గా నే వుంటుంది. దానిపై ఆలోచనలను కేంద్రీకరిస్తే సంసారం అవుతుంది. లేక పోతే ఏదీ లేదు. మనసు వాటి వెంట పరిగెత్తితే అశాంతి పరిగెత్తకుండా వుంటే పరమ శాంతి. అదే నిశ్చింత. ఇదే నైవ మానసం. నైవ మానసమే అమనస్క యోగం.

వృత్తులు రెండు రకాలు ఇదం వృత్తి., అహం వృత్తి. ఇదం వృత్తి అంటే ప్రాణాయామం ద్యానం వల్ల నియమించ బడటం.. అహం వృత్తి అంటే మనసు పై లగ్నం చేస్తేనే నశించేది.

"సత్తాయా చిత్ --చిత్త యామ్యహం "అంటారు రమణ మహర్షి. సత్ నే చిత్ అంటారు. ఆ చిత్ అంటే "నేను "

దేహ ఉపాధి ధ్యాస వదిలేస్తే ఈశ్వర దర్శన మైన స్వ ఆత్మ స్వరూప దర్శనం లభిస్తుంది. అప్పుడే తాను ఈశ్వర స్వరూపుడు అవుతాడు.

జీవస్తు దైవికః ""ఇక్కడ దైవిక అనే పదం శ్రీ రమణుల సృష్టి. దైవ గుణం తో వున్న జ్ఞానినే దైవికుడు అంటారు. దైవికః జీవః అంటే సత్వ గుణ ప్రదానుడే దేవుడు.

"అహామపేతకం --మహాదిదంత పో రమణ వాణి దం" అహంకారాలు నాశన మైతే, ఆత్మ స్వరూపం తెలిసిన జ్ఞానమే నిజమైన తపస్సు. "అని భగవాన్ శ్రీ రమణ మహర్షి అభి భాషణం

ముప్పై శ్లోకాలలో చక్కగా ఆత్మ దర్శనాన్ని, పాడుకోవటానికి వీలుగా వున్న ఛందస్సులో సంస్కృతం లో "ఉపదేశ సారం "అనే పేరిట అద్భుతం గా చెప్పారు భగవాన్ శ్రీ రమణ మహర్షి

అందు లోని సారాన్ని శ్రీ ఏకాత్మ గారు మనోహరం గా, సుబోధకం గా ఆవిష్కరించారు అందులో కొంత సార సంగ్రహం చేసి మీకు అందించాను..

# 6 అవధూత శ్రీ శేషాద్రి స్వామి చరిత్ర

నేపధ్యం :అనంత పద్మనాభుడి నుండి అరుణా చలేశ్వరుని దాకా యాత్ర లో రాసినట్లు గా

ఆటోలో బయలుదేరి అరుణాచలేశ్వరుడిని దర్శించాం. తీరికగా దర్శనం లభించింది. ఇరవై రూపాయల స్పెషల్ దర్శనం. తనివి తీర అగ్ని జ్యోతిర్లిన్గాన్ని దర్శించి తరించాం. నిన్న రాత్రి దర్శనం ఇప్పుడు ప్రభాత దర్శనం. మనసు నిండుగా ఉంది తర్వాత అమ్మ వారి దర్శనం చేశాం. అక్కడా హాయిగా దర్శనమయింది. లోపల ఉన్న కుమారస్వామి గణేష్ మందిరాలను కూడా చూసి బయటికి సంతృప్తి తో వచ్చాం. అక్కడే ఉన్న హోటల్ లో ఇడ్లీ తిని కాఫీ తాగాం. గిరి ప్రదక్షిణం అరుణా చలేశ్వరుడిని చూడటం మల్లికా గారికి ఇదే మొదటి సారి. మేము చాలా సార్లు చూశాం. ఆమె కు ఎంతో అనుభూతి కలిగింది. ఇన్ని సార్లు వచ్చినా నేనెప్పుడూ గిరి ప్రదక్షిణం చేయలేదు. పద్నాలుగు కిలో మీటర్లు చుట్టి రావాలి. మధ్యలో ఎనిమిది శివలింగాలను చూడాలి. ఇవి అష్ట దిక్పాలకులు స్థాపించిన లింగాలుగా ప్రసిద్ధి. వీటితో బాటు ఆది అరుణాచలేశ్వర దేవాలయాన్ని కూడా దర్శించాలి. ఇవన్నీ తిరిగి రావటానికి మూడు వందల రూపాయలకు ఆటో మాట్లాడుకొన్నాం గుడి దగ్గరే. మమ్మల్ని చివరికి రమణాశ్రమం దగ్గర దించాలని చెప్పాం

.ఇదివరకు కొండ దగ్గర నుండి ప్రదక్షణం చేసేవాళ్ళు. ఇప్పుడు ఊరు పెరిగింది. కనుక గిరి ప్రదక్షిణం కాదు "పురి "ప్రదక్షిణం అన్నాను. గిరి చుట్టూ ఉన్న ఓషధుల గాలి మనకు సోకి ఆరోగ్యాన్నిస్తుందని భావన. శేషాద్రి స్వామి ఆశ్రమం చ దగ్గర దిగాం. లోపలి వెళ్లి చూశాం. ఆయన పేర ఉన్న లింగానికి అభిషేకం జరుగు తోంది. శేషాద్రి స్వామి మహాభక్తుడుగా ప్రసిద్ధి. ఆయన జీవిత చరిత్ర పుస్తకం అక్కడే ఉన్న షాప్ లో లేదని ప్రింట్ అవుతోందని చెప్పారు. దీనికి దగ్గరే ఉంది శ్రీ రమణాశ్రమం. శ్రీ రమణాశ్రమం నడిచి శ్రీ రమణాశ్రమం కు వెళ్లాం నేనిది వరకు ఎన్నో సార్లు సందర్శించాను. నాకు మహా ప్రశాంతం గా ఉంటుంది. ఇక్కడ. అందుకే ఎన్ని సార్లు వెళ్ళినా మళ్ళీ వెళ్లాలని పిస్తుంది. మల్లిక గారికి కూడా కొత్త. ఒకటి రెండు సార్లు ఇక్కడ ఆశ్రమం లో రాత్రి ఉన్నాం. ఇప్పుడు మళ్ళీ. అన్నీ తిరిగి చూశాం.

" స్వామి చరిత్ర అప్పుడు దొరకలేదు. ఇప్పుడు మీకు...



శ్రీ వెంకటాద్రి స్వామి చరిత్ర ను తమిళం లో శ్రీ కులుమణి నారాయణ శాస్త్రి గారు రచించగా, శ్రీ కంచి పరమాచార్యుల వారి అంతరంగికులు "శ్రీ విశాఖ "గారు భావాను వాదం తెలుగులో చేస్తే, తెనాలిలోని శ్రీ బులుసు సూర్యప్ర కాశశాస్త్రి గారి సాధన గ్రంధ మండలి తెనాలి శ్రీ వెంకట రమణ ప్రెస్ లో శ్రీ నల సంవత్సరం జ్యేష్టమాసం లో 1976 జూన్ లో ముద్రించారు. వెల అయిదు రూపాయలు.

ఎవరీ వెంకటాద్రి స్వామి ? తిరువన్నామలై లోని అరుణా చల క్షేత్రం లో ని జనులకు భగవాన్ రమణ మహర్షి సూర్యుడు అయితే, శ్రీ వెంకటాద్రి స్వామి చంద్రుడు. స్వామి ఉపదేశాలను కావ్యకంఠ గణపతి ముని చందోబద్ధం చేశారు. అనేక సిద్దులు పొందిన మహనీయులు స్వామి. తెలుగులో రమణ లీలలు, గణపతి ముని చరిత్ర ఉన్నాయి కాని స్వామి చరిత్ర తెలుగులో లేకపోవటం లోటుగా భావించి తాను నారాయణ శాస్త్రి గారు తమిళం లో రాసిన స్వామి చరిత్రను అనువాదం చేయాలనుకొని కంచి శ్రీ పరమాచార్య ల వారికి విన్నవించగా "రామకృష్ణ పరమ హంస, వివేకానందులు రాగ భక్తిలో భగవారాధన చేశారు. శ్రీ రమణులు చిన్నతనం లోనే అద్వైతానుభూతి పొంది ఒక విశిష్టమార్గం త్రొక్కారు. అరవిందుల విధానం వేరు. సదా శివ బ్రహ్మేన్ద్రులు వేంకటాద్రి స్వామి మొదట వైదికం గా ఉంటూ, తర్వాత దాన్ని అధిగమించి అవదూతలైనారు. వైదిక నిష్టలో ఉండేవారికి ఆదారి వదలటం మహా కష్టమే. ఒక్కొక్కరిది ఒక్కో త్రోవ. అనువాద రూపంగా శేషాద్రి స్వామి వారి కైంకర్యం చేయతగినదే "అని ప్రోత్సహించి దీవించారు. తమిళం లో ఉన్న స్వామి చరిత్రను "శ్రీ శేషాద్రి స్వామి అధిష్టాన సభ –ఉన్దలూరు ప్రచురించారు. శ్రీ కులుంద్రై ఆనందస్వామి ఆ చరితలోని కొన్ని విశేషాలను వ్యాసాలుగా తమిళ పత్రికలలో రాశారు. స్వామి చరిత్రను ఆమూలాగ్రం తెలుగులో అనువాదం చేసి ప్రచురించటానికి ఆ ఆదిష్టాన సభ వారు అంగీకరించారు. అలా తెలుగులోకి వెలుగు చూసింది స్వామి చరిత్ర.

పరమ భాగవతోత్తములు, అద్వైతామృత ప్రసారకులు మచిలీపట్నం కాలేజి ప్రిన్సిపాల్ ఎందరికో మార్గదర్శి బహు గ్రంధకర్త లలితా పరాభట్టారిక అమ్మావరి ఉపాసకులు శ్రీ భాగవుల కుటుంబ రావు గారు ఆంగ్లం లో సవివరమైన ఉపోద్ఘాతం రాశారు. దాని సారాంశం క్లుప్తంగా తెలుగులో తెలుసు కొందాం. "స్వామి కల్పిత వ్యక్తికాదు 1870 లో పుట్టి 20 వ శతాబ్దం లో సిద్ధిపొందారు. వారి అనుగ్రహ పాత్రులు కూడా ఆకాలన వారే. ఆధ్యాత్మిక చింతన కల ముముక్షువులకు ఈ గ్రంథం అమూల్యమైనది. స్వామివారు బాల్యం లోనే వేదం శాస్త్రాలు సాధించారు. జ్ఞాన సిద్ది కలిగే దాకా జపం అనుష్టానం కొన సాగించారు. చనిపోయిన తన తల్లికి కర్మకాడ చేశారు. శంకర భగవత్పాదులు లాగానే. తర్వాత జ్ఞానియై "రమతే బాలోన్మత్తవ దేవ"అన్నసూక్తి స్వామివారికి సరిగ్గా సరిపోయింది. వ్యాసకుమారుడు శ్రీ శుకమహర్షిని చూసి స్త్రీలు సిగ్గుపడకపోవటం భాగవతం లోని కథా విశేషం..శ్రీ శేషాద్రి స్వామి స్పృశించినా స్త్రీలు మనో వికారం పొందక పోవటం 19-20 శతాబ్దులలో అపూర్వ విషయం యదార్ధం. ఈ రోజుల్లో సామాన్య సిద్దులున్నవారే దూర దర్శన దూర శ్రవణాలు కలిగిఉంటే అపూర్వ సిద్దులు పొందిన మన స్వామి వారికి అవి పుష్కలంగా ఉన్నాయి అనటానికి సందేహమే లేదు.

స్వామి అనేక శక్తులు కలిగి ఉండచ్చు అనేకులకు మార్గ దర్శనం చేసి ఉండచ్చు మహా తపస్సంపన్నులు అయి ఉండవచ్చు. అంతమాత్రాన ఆయన చరిత్ర చదవాలా అని పిస్తుంది. ఒక భక్తుడు ప్రార్ధిస్తే, స్వామి అనుగ్రహిస్తే వర్షం కురిసింది.. క్షణ కాలం లో ఒక్క పైసా కూడా ఖర్చు చేయకుండా నేటి సైన్స్ కు అలా కురిపించే సత్తా ఉందా ?.అది దేశ క్షేమానికేగా జరిగింది. ఇంతకుముందున్న శ్రీ శృంగేరి శంకరాచార్యుల చరిత్రలో ఇలాంటి మహిమలున్నాయి. వారు శృంగేరిలో వరదలు నివారించారు. ప్రధమ రాష్ట్ర పతి శ్రీ బాబూ రాజేంద్ర ప్రసాద్ గారు శృంగేరిని సందర్శించినపుడు విపరీతం గా కురిసే వర్షాలను ఆపివేశారు. అందుకే దేశ క్షేమానికి భౌతికశక్తి చాలదు ఆధ్యాత్మిక శక్తికూడా కావాలని మన శాస్త్రాలు ఘోషించాయి. పరాతి సంధానం,అభ్యాసం చేసే రాజకీయ నాయకులు ఒకరే చాలరు. శ్రీ శేషాద్రి స్వామి శ్రీ రమణులు, శ్రీ శృంగేరి విద్యా శంకర భారతి, శ్రీ కంచి చంద్ర శేఖరేంద్ర సరస్వతి వంటి మహనీయులు కూడాదేశానికి అవసరం. రాజేంద్ర ప్రసాద్ గారిలాంటి రాజర్షులు కావాలి. ఈ విషయాలను స్వామి చరిత్ర మనకు బోధిస్తుంది.

జీవన్ముక్తి ఉందా లేదా స్థిత ప్రజ్ఞులు ఎలా ఉంటారు అన్న ప్రశ్నలకు స్వామి చరిత్ర సజీవ సమాధానం చెబుతుంది. అటు రమణ మహర్షి ఇటు వెంకటాద్రి స్వామి ఇద్దరూ జీవన్ముక్తులే. కాని విభిన్న రీతులలో కనిపించారు అంతే..స్వామివారి బోధలు ఉపవాసం నిరాహారం అంటే ఏమిటి వివరాలున్నాయి. మనకు జీవితం లో వచ్చే సమస్యలు వాటికి పరిష్కారాలు మార్గ దర్శక సూత్రాలు అన్నీ ఉన్నాయి. స్వామి భగవదంశగా జన్మించారు. అంటే వారి చరిత్ర భగవంతుని చరిత్ర. భక్తులకు సర్వ దేవతా రూపంగా కనిపించారు. ఆయన కీర్తనం భగవద్గుణ కీర్తనమే. దయా సింధువు అయిన స్వామి ఇప్పటికీ భక్తులను ఆవేశించి హితబోధ చేస్తున్నారు. శ్రీ విశాఖ గారి అనువాదం వలన ఆంధ్రులకు శ్రీ వెంకటాద్రి స్వామి మరింత సన్నిహితులౌతారు –"శాంతా మహాంతోనివసంతి సంతః –వసంత వల్లోక హితం చరంతి" "అన్నారు శ్రీ త్రిపురారహస్యం వంటి ఉత్తమోత్తమ గ్రంథాలు రాసిన డా భాగవతుల కుటుంబ రావు గారు.

తిరు వన్నామలై లో శ్రీ శేషాద్రి స్వామి –జీవుడు –ఉపాధి అను సందానకర్తలు 25పేజీల భాగవతుల వారి ఇంగ్లీష్ రచనకు శ్రీ విశాఖ గారు చేసిన తెలుగు అనువాదం లో మరి కొన్ని విశేషాలు. "ప్రముఖ ఆంగ్లకవి లాంగ్ ఫెలో తన కవితలో "మనం మనజీవితాలను మహోన్నతంగా చేసుకో గలం.మరణకాలం లో కాలం అనే ఇసుకమీద మన పాదముద్రలను మనవెనక వదలగలం. "అని మహాపురుషుల ఈవితాలు మనకు జ్ఞాపకం చేస్తున్నాయి అన్నాడు. సిద్ధపురుషులు శ్రీ శేషాద్రి స్వామి స్థిత ప్రజ్ఞులు. జీవితమంతా తిరువన్నామలై లోనే గడిపి అక్కడే తుది శ్వాస వదిలిన మహాత్ములు. చిన్నతనం లో ఆయనను తల్లి ఒక దేవాలయానికి తీసుకు వెడితే. అక్కడ కంచు కృష్ణుని విగ్రహాలు 12 పైసలకు అమ్ముతుంటే ఒక విగ్రహం కొన్నారు. ఆరోజు అవర్తకుని దగ్గరున్న విగ్రహాలన్నీ అమ్ముడు పోయాయి. అతడు ఆశ్చర్యంతో బాల వెంకటాద్రి దగ్గరకొచ్చి అతనిని అభినదించాడు 14వ ఏట తండ్రి చనిపోతే తల్లి మరకతాంబ ఆయన్ను తమ్ముడు నరసింహా ను పెంచింది. శేషాద్రికి గొప్ప భవిష్యత్తు ఉందని తాతగారు చెప్పారు. పుట్టుజ్ఞాని అయిన శేషాద్రి అన్నీ అతి త్వరలోనే నేర్చుకొని సర్వ శాస్త్ర పారంగతుడైనాడు. దేవాలయానికి లేక స్మశానానికి వెళ్లి జపం చేసేవాడు. తల్లి వివాహ విషయం తెస్తే వద్దనే వాడు. ప్రపంచ విషయాలన్నీ అవగతం చేసుకొన్నాడు. గదిలో ఉంచి తాళం వేస్తే గదిలో లేడు.అన్నంమీద శ్రద్ధ లేదు.నేలమీదా రాళ్ళపైనా పడుకొనే వాడు. పిలిచిన వారింటికి కాకుండా పిలవని వారింటికి వెళ్ళేవాడు ఇదే అదును అనుకొని తల్లి ఒకరోజు "సత్సంగత్వే నిస్సంగత్వం "అనే శంకరాచార్య భజగోవింద శ్లోకం చదివి,అరుణా చల అని మూడు సార్లు పలికి,కళ్ళు మూసింది. అదే ఆమె చివరి ఉపదేశం అనిపిస్తుంది.



తర్వాత అరుణాచలం వెళ్లి 40 ఏళ్ళ శేష జీవితాన్ని అక్కడే గడిపారు వెంకటాద్రిస్వామి 1929 లో అక్కడే సిద్ధిపొందారు. అక్కడ ఏ దేవాలయానికీ వెళ్ళేవారు కాదు వీధుల్లో తిరిగేవారు. సిద్ధిపొందాకకూడా ప్రజలతో సంబంధం కలిగి ఉన్నారు. ఈరోడ్ రైలు స్టేషన్ కు రెండుమైళ్ళ దూరం లో ఉన్న వీరప్పన్ సత్రం లో ఉంటున్న శ్రీ శివరామ కృష్ణయ్యర్ లో ఆవేశించారు. ఈయన తల్లికావేరి అమ్మాళ్. పవిత్ర చరిత్రురాలు. భర్త రెవెన్యు ఉద్యోగి. వీరికి నలుగురు కుమార్తెలు ఇద్దరుకుమారులు. చివరివాడే శివరామ కృష్ణ. కావేరి అమ్మాళ్ 40 ఏళ్ళు అన్నం తినసే లేదు. సుబ్రహ్మణ్య స్వామి భక్తురాలు. పళ్ళు పాలు మంచిగంధం కలిపిన నీళ్ళు ఆమె ఆహారం. తిరువాస నల్లూరు లోని శ్రీ అయ్యవల్ లాగా దివ్య శక్తుల్ని సాధించింది. ఆమె ఇంటికి కావేరినది ఒక మైలు దూరం. వెళ్ళలేక పోతే కావేరి ఆమె పూజాగృహం పైనుంచి ప్రవహింప జేసి స్నానం చేసేది. ఆమె బ్రతికి ఉండగా ఆశక్తులు ఎవరికీ తెలియదు.

ఒకసారి తిరువన్నామలై వెళ్లి ఒక సత్రం లో ఉదయం పూజలో ఉండగా శ్రీ శేషాద్రి స్వామి అకస్మాత్తుగా వచ్చి ఆకలిగా ఉంది ఆహారం కావాలి అంటే నైవేద్యపు అరటిపండు ఇస్తే సగం తినగా ఏడేళ్ళ శివరామ కృష్ణయ్యర్ అక్కడికి రాగా స్వామి మిగిలిన సగం పండు ఆతని నోట్లో కుక్కారు. అది ఆబాలుడికి ఇచ్చిన దీక్ష ఏమో అప్పటినుంచి అయ్యర్ గారే వెంకటాద్రిస్వామి స్పిరిట్ గా ఆవేశించారు. ఇదే స్పిరిట్ మీడియం.. 20 ఏళ్ళు గడిచాయి. కావేరి అమ్మాళ్ కోరగానే స్వామి కలలో కనిపించి, తాను భూతమై అంటే స్పిరిట్ గా అయ్యర్ దేహం లో ఉన్నానని చెప్పారు. ఆస్పిరిట్ స్వామి మాట్లాడినట్లే మాట్లాడేది. అవే హావభావాలు కూడా. ఒక గేము లాఆడేవారు. ఒక పల్చని కొయ్యపలక, దాని వెనక అడుగున ఉన్న రెండు లంకెలపై ఉంటుంది దానిముందు ఒకభాగం పై ఒక రంధ్రం అందులో పెట్టటానికి ఒక పెన్సిల్ ఉంటాయి. పలక కింద తెల్ల కాగితం పెడతారు. మొదట అయ్యర్ ఆ పలక తాకే వాడు. ఆయనలో ఆవేశించిన స్వామి పలకను నడిపేది

అప్పుడు కాగితం పై పెన్సిల్ రాసిన అక్షరాలూ కనిపించేవి. అందులోస్వామి సందేశం ఉండేది. కొంతకాలం తర్వాత కాగితం తీసేశారు. అయ్యార కే ఏమి రాయాలలో స్పురిం చేది.దాన్ని చెప్పేవాడు.అయ్యర్ ముఖతా శ్రోతలు స్వామి వారి రెండుమూడు గంటల ఉపన్యాసం వినగలిగేవారు. అవి ప్రామాణిక ఉపదేశాలు. సామాన్యంగా అయ్యర్ మామూలుగా నే ఉండేవారు సమాదిలోనే స్వామి ఆవేశించేవారు. ఆ కొయ్య పలక సహాయంతోనే స్వామి వారి ఉప దేశాను ఒక పెద్ద పుస్తకం లో ఒక చిన్న పుస్తకం లో అయ్యర్ రాశారు. వీటిని" జీవ్య ప్రదర్శిని",అనేపేరుతో మొదట ఆతర్వాత "మోక్ష ప్రదర్శిని "అనే పేరుతొ తమిళ మాసపత్రియాలో ప్రచురించారు. ఆతర్వాత స్వామి వారి శిష్యులు శ్రీ శేషాద్రి స్వామిగళ్ అధిష్టానం అసోసియేషన్-ఉంజులూరు " గా ఏర్పడి వీటిని ప్రచురించి, స్వామివారి సమాధి కూడా నిర్మించారు. ఇక్కడ శాస్త్రోక్తంగా పూజాదికాలు జరుగుతాయి. మధురలో ఉంటున్న సిద్ధపురుషులు శ్రీ కులం కుడై ఆనంద స్వామి 1932 లో శరీరం చాలించి, ఆయనకూడా అయ్యర్ర్ శరీరం లో ఆవేశిచేవారు. మధురలోని అరసవాది లో వీరి సమాధి నిర్మించారు.

శివరామ క్రిష్ణయర్ గారు 61 వ ఏట 3-3-1974 న మరణించారు. తనకు మారునిలో ఆయన శేషాద్రి స్వామి స్పిరిట్ గా ఉన్నారు.ఇప్పుడుకూడా ఆస్పిరిట్ రూపం లో వారి బోధలు వినగలం. శ్రీ కుజుమణి నారాయణ శాస్త్రిగారు శేషాద్రి స్వామివారితో సన్నిహితంగా మెలగినవారు. వీరు తమిళం లో స్వామి వారి జీవిత చరిత్ర రాయకపోతే ఎవరికీ తెలిసేదికాదు.. దీన్ని తెలుగులోకి సరళభాషలో అనువదించిన శ్రీ విశాఖ మహోపకారం చేశారు "అని భాగవతుల కుటుంబరావు గారు గొప్ప సందేశాన్ని ముందు మాటలుగా రాసి మహోపకారం చేశారు.

కాంచీపురం లో అందరూ భవ్య జీవులే. అందులో కామకోటిశాస్త్రిగారు ముఖ్యులు. ఈయన సచ్చరిత్ర గమనించి వేలియూరివారు అప్పుడప్పుడు శాస్త్రిగారిని ఆహ్వానించేవారు. వళూరు గ్రామస్తులు ఆయనకు సకల వసతి సౌకర్యాలు కల్పించి తమ గ్రామం లోనే శాస్త్రిగారిని ఉండేట్లు చేశారు. వీరిది కౌండిన్యస గోత్రం. పుత్రసంతానం లేదు. అన్నగారిపిల్లల్నే తమ సంతానంగా గారాబంగా చూసుకొనేవారు. అన్నగారు చిదంబర శాస్త్రిగారికి వెంకట రమణ శాస్త్రి, నరసింహా శాస్త్రి కుమారులు, సుందరాంబ, మరకతం పుత్రికలు. పెద్దాయన వేదం వేదాంగాలలో నిష్ణాతుడు. పెళ్లి అయి పెద్ద వారి బలవంతం మీద దాంపత్యం చేసి, కాశీకి వెళ్లి సన్యసించి, 1904 లో సిద్ధిపొందారు. మిగతాముగ్గురు కన్నవారి ఆధీనంలోనే ఉన్నారు.

అందం కుశాగ్రబుద్ధి ఉన్న మరకతం అంటే తండ్రికి మహా ప్రేమ.. కావ్యనాటకాలు ఆమెకు చెప్పించారు. యుక్తవయసురాగానే పురుకుత్స గోత్రీకుడు శ్రీ విద్యోపాసకుడు వరదరాజుకిచ్చి పెళ్లి చేశారు. వీరిద్దరూ అన్యోన్యంగా కాపురం చేశారు. సౌందర్యలహరి మూక పంచశతి ఆమెకువాచో విదేయం. వివిధగ్రామాలనుండి వేదం శాస్త్రాలు నేర్వనికి విద్యార్ధులు వీరింటికి వచ్చి గురుకులవాసంగా ఉండేవారు. కామకోటి వంశీకులు సత్యభాషణులు వారేమి చెప్పినా తప్పక జరిగేది. ఆ వంశం వారిని జోశ్యులు అనేవారు. వరదరాజు తమ్ముడు రామస్వామి అన్నకు సరి సాటైన వాడు. సోదరులకు అన్యోన్యత ఎక్కువ.

వరద రాజు దంపతులకు సంతానం కలగలేదు. దానాలు హోమాలు తీర్ధయాత్రలు అన్నీ చేశారు. కామకోటి శాస్త్రి తమ ఆరాధ్య దేవత కామాక్షీ దేవిని కుమారునికి సంతాన భాగ్యం కలుగ జేయమని ఆర్తిగా ప్రార్ధించేవారు. ఒక రాత్రికలలో "నాకు వెన్న నైవేద్యం పెట్టు. నా జ్ఞానకళతో పుత్రుని అనుగ్రహిస్తా " "అని చెప్పగా అలాగే చేయగా కొద్దికాలానికి మరకతం గర్భవతి అయింది. 22-1-1870 శనివారం హస్తా నక్షత్రం కన్యా రాశిలో శిశువు జన్మించగా "శేషాద్రి "అని పేరుపెట్టారు..

రెండేళ్ళ వయసులోనే శేషాద్రి మిట్ట,పల్లాలు చూసుకోకుండా పరిగేత్తేవాడు. తండ్రి వరదరాజుప్రక్క ధ్యానముద్రలో కూర్చునేవాడు. మూడవ ఏడు గురుస్తుతి మూక పంచశతిలో కొన్ని శ్లోకాలు నేర్పారు. తదేక ధ్యానం తో చదివేవాడు. అల్లరీ లేదు ఆగమూ ఎరుగడు. నాలుగవ ఏట తల్లి వైశాఖ ఉత్సవాలకు వరద రాస్వామి గుడికి తీసుకు వెడితే, అక్కడ ఒక అంగడిలో రెండు అంగుళాల బాలకృష్ణుని కంచు విగ్రహాలు చూసి ముచ్చటపడి అడిగితె అమ్మ దాన్ని 12పైసలకు కొన్నది. అదే ఆవర్తకుడికి బోణీఆరోజు. ఆలయం లోదర్శనం చేసుకొని ఇంటికి వెళ్ళారు. మర్నాడు ఉదయం తల్లీ కొడుకు ఆ వీధిలో వెడుతుంటే నిన్నటి వర్తకుడు బాల శేషాద్రిని అమాంతం ఎత్తుకొని ముద్దాడి "నీది బంగారు చెయ్యిరాబాబూ. బొమ్మల్ని ఇలా ముట్టుకోన్నావో లేదో, నిన్న బొమ్మలన్నీ అమ్ముడు పోయాయి నీ బోణీ మంచిది "అని మెచ్చాడు. అ రోజునుంచి శేషాద్రిని "హిరణ్య బాహువు "అని పిలిచేవారు అందరూ. ఆ బాలకృష్ణ విగ్రహం ఆయన దేవతార్చనలో చాలా ఏళ్ళు ఉండి పోయింది. ఇప్పటికీ ఆ వంశీయుల చేత పూజలు అందు కొంటోంది.

అయిదవ ఏట మంచి ముహూర్తం లో అక్షరాభ్యాసం చేశాక, ఆయుష్యహోమం జిరిపి శ్రీ విద్యా గురువులైన తాతగారు కామకోటి శాస్త్రిగారిచేత కుశాగ్రం తో శేషాద్రి నాలుకపై సారస్వత మహాబీజం, సారస్వత దశ శ్లోక మంత్రం ఉల్లేఖింప జేశారు. ఆ మంత్రం తో అభిమంత్రించిన ఆవుపాలను అన్నప్రాసనగా చేయించారు. కాగితం పై పంచాక్షరి అష్టాక్షరి వ్రాసి బాలునితో మూడు సార్లు అనుశ్రావిక పద్ధతిలో ఉపదేశించారు. విద్వాంసులకు బహుమానాలిచ్చి పిల్లవానిని ఆశీర్వ దించ మని కోరారు. తర్వాత బడికి పంపారు. అమరకోశం మూడుకాండలను ఒక్క నెలలోనే నేర్చేశాడు. మూడేళ్ళు అయ్యేసరికి కావ్యాలు చంపువు, నాటక అలంకా రాదులలో రాటు దేరి అసామాన్య పాండిత్యం సాధించాడు. తమిళ గ్రంథాలు,కంబ రామాయణం, తిరుకురళ్,నాలడియార్ లలో విశేష పాండిత్యం పొంది కరతలామలకం చెసుఒన్న అసమాన ప్రజ్ఞా దురీండు బాలమేధావి శేషాద్రి.

విద్వత్ సభలలో శేషాద్రి పేరు మారు మోగింది. ఏ విషయం మీదైనా ధారాళంగా శ్రావ్యంగా ప్రసంగించేవాడు. కండగల కవిత్వమూ చెప్పేవాడు. ఉపనయనం తర్వాత తర్క వ్యాకరణాల అంతు చూశాడు.తాతగారి వద్ద. కొన్ని మంత్రం రహస్యాలు నేర్చాడు. ప్రస్థానత్రయం అభ్యసించాడు. వేద పాఠశాలలో క్రమాంత వేదాధ్యయనం పూర్తీ చేశాడు. న్యాయ శాస్త్రం నేర్చాడు.

రోజు విద్యాలయానికి వెళ్ళే ముందు తండ్రికి నమస్కరించి వెళ్ళేవాడు. ఒకరోజు అలా చేస్తుంటే తండ్రి వరద రాజుకు భావోద్రేకం తీవ్రమై "నాయనా !రోజు ఎందుకురా నమస్కారం నాకు. మీ అమ్మకు నమస్కరించు అది చాలు "అన్నాడు "నాకు మీరిద్దరూ సమానమే నాన్నగారూ. భక్తీ, ప్రీతి లలో తేడా చూపలేను ""అని వెళ్ళాడు. కొడుకు వెళ్ళగానే భార్య మరకతం తో "పండంటి బిడ్డను కన్నావు దాంపత్యం లో నాకు సహధర్మ చారిణివి గా పేరుపొందావు తమ్ముడికి సంతానం లేదు మన నరసింహ ను దత్తత చేసుకోవాలని అనుకొంటున్నాడు. వాడి కోర్కె తీర్చటం మన విధి. కొద్దికాలం లో శేషాద్రి ప్రఖ్యతుడౌతాడు. నాకు ఇహలోక యాత్ర చాలించటానికి సమయమైంది అని అమ్మవారు చెప్పారు. ఇవాళో రేపో నేను వెళ్ళిపోతాను. శేషాద్రి బాగా లబ్ధ పరతిష్టుడు అయ్యాక ఆ ఆనందం చూసి నువ్వు కైవల్యం పొందుతావు "అన్నాడు వరదరాజు భార్య మరకతం తో. ఆమాటలు విని ఆమె మూర్చపోయింది. తేరుకున్నాక "ధైర్యం కోల్పోకు. అన్నిటికీ ఈశ్వరుడిసే నమ్ము. ఆయన ఇచ్చప్రకారమే అంతా జరుగుతుంది "అని చెప్పి ఊరడించాడు.

మర్నాడు యధా ప్రకారం నియమప్రకారం కార్యక్రమాలు పూర్తీ చేసి భోజనం చేసి ఉపనిషత్తులు చదువుకొని, ప్రదోష కాలం లో ఏకామ్రనాధుని దర్శించి, ఇంటికి వచ్చి ఏమీ తీసుకోలేదు. కాసేపటికి అతిసార విరేచనం అయి అందరూ ఆయన అనుకోన్నట్లే అవుతుందేమో నని భయపడుతూ గుడ్ల నీరు కుక్కుకొని బొమ్మల్లా నిలబడ్డారు. దుఃఖిస్తున్న శేషాద్రిని దగ్గరకు పిల్చి"నాయనా ! అతి సారం లో కొన ఊపిరి ఉన్నంతవరకు జ్ఞాపక శక్తి పోదు.. "అతి సారేతు మరణం యోగినా మపి దుర్లభం " అన్నారు పెద్దలు. నా అదృష్టం కొద్దీ ఆ వ్యాధి నాకు వచ్చింది. ఇక మనసు తత్వం పై లగ్నం చేస్తాను. ఎన్ని శాస్త్రాలు చదివినా అనుభవ జ్ఞానానికి మించింది లేదు అని గుర్తుంచుకో. అన్నిజ్ఞానాలలో అదే గొప్ప "అని బోధించి ధ్యానమగ్నుడై వరదరాజు దేహ త్యాగం చేశాడు. తండ్రి మరణం తో శేషాద్రికి దుఖం తోపాటు, వైరాగ్యమూ కలిగింది '

తండ్రి చనిపోగానే 14 ఏళ్ళ మనవడు శేషాద్రిని కోడలు మరకతం ను తాతగారు కామకోటి శాస్త్రిగారు వాళూరుకు కు తీసుకు వెళ్ళారు. తాతగారి వద్ద ప్రస్థాన త్రయం పూర్తిచేశాడు. కామకోటి శాస్త్రి గారిపైఅపార కరుణ ఉండేది కామాక్షీ దేవి కి. వీరివద్ద ఎందరో మంత్రోప దేశం పొందారు. సర్ పిటి త్యాగరాజ చెట్టి గారి తండ్రి పొట్టి మహాదేవ చెట్టి శాస్త్రిగారి వద్ద మంత్రోప దేశం పొంది, విశేష ధనం ఆర్జించారు.గురు దక్షిణగా నాలుగు వేల రూపాయలు ఇవ్వబోతే, చిరునవ్వుతో వద్దని తీసుకోలేదు. అప్పటికి శాస్త్రిగారి వయసు 80.సర్ సిపి రామస్వామి అయ్యర్ మాతామహుడు శాస్త్రి గారిని భాగవత ప్రవచనం చేయమని కోరగా, తన ఆరోగ్యం సరిగా లేదని మనవడు శేషాద్రిని పంపారు. తల్లితోపాటు వెళ్ళి ఒక్క ఏడాది కాలం శేషాద్రి అక్కడ భాగవత ప్రవచనం చేసి అందరినీ ఆశ్చర్యం లో ముంచెత్తాడు.

శాస్త్రిగారి ఆరోగ్యం బాగా క్షీణించింది. మూడు నెలలు మంచం లోనే ఉన్నారు. తాతగారి ఆరోగ్యం కుదుటబడగానే, కంచికి వెళ్లి అక్కడ ఉపనిషద్ బ్రహ్మం అని పేరుపొందిన శ్రీ కృష్ణానంద స్వామిని ఆశ్రయించి శేషాద్రి తనకు సన్యాస దీక్ష ఇవ్వమని కోరాడు. దీక్ష ఇవ్వగా ఆయన వద్ద వేదాంత శ్రవణం చేశారు శేషాద్రి స్వామి మాధుకర వృత్తి చేబట్ట లేదు తల్లే కొడుకులిద్దరికీ వండి పెట్టేది. మూడు నెలల తర్వాత దామల్ అనే గ్రామం లో అక్కడ బ్రహ్మానంద మహర్షి పేరు తో కామకోటిశాస్త్రి గారు విదేహ ముక్తి చెందారు.

మరకతం గారు చాలా ఉదాసీనంగా ఉండేవారు. ఎప్పుడూ మౌనమే.. మూడుపూటలాస్నానం ఎక్కువ కాలం ధ్యానం. ఏక భుక్తం. కొడుకు గుణాతిశయంపై అమిత ప్రేమ ఆమెకు..శేషాద్రికి 15వ ఈటా పెళ్లి చేయాలని అనుకొన్నది. రామల్ గ్రామం లో అతని మేనత్తకూతురు గుణవతి కాకిని ఉంది. ఆమెను కొడుక్కు చేసుకోవాలని తల్లి ఆరాటం వాళ్ళకూ ఇష్టమే. ఎవరినీ సంప్రదించకుండా ముహూర్తం పెట్టించమని అన్న రామ స్వామి జోష్యులతో సోదరి వెంకట లక్ష్మి చెప్పింది. ఆయన "శేషాద్రి జీవితం లో పరివ్రాజక యోగం ఉంది సన్యాసి అవటం ఖాయం. ఆపై నీఇష్టం "అన్నాడు. అన్నమాటలకు తెల్లబోయింది. విఫలమై ఇంటికి వచ్చింది. జపం చేస్తున్న మరకతం చెవిలో ఈమాటలు పడ్డాయి. రామస్వామి చెప్పింది తప్పకుండా జరుగుతుంది అని ఆమె విశ్వాసం.. పది రోజుల్లో కాకిని పెళ్లి జరిగిన వార్త తెలిసింది. విచారం పెరిగి ఏకభుక్తాన్ని వదిలి ఉపవాసం ఉండేది. చిక్కి శల్యమైంది. తమ్ముడు నరసింహ శాస్త్రి చనిపోయినట్లు కబురొచ్చింది. ఇవన్నీ కలిసి మరింతకుంగి పోయి మంచమెక్కింది.నెలరోజులు సన్నిపాత జ్వరం తో బాధపడింది. మందులూ మాకులు లేవు. కార్తీక శుక్ల దశమి నాడు కొడుకు శేషాద్రిని దగ్గరకు పిల్చి "నాయనా ! నా పని అయిపొయింది. నన్ను వదిలి వెళ్ళకు "అని హెచ్చరించి, మర్నాడు ఏకా దశి నాడు కొడుకును పిలిచి "సత్సంగత్వే నిస్సంగత్వం "శ్లోకం మూడు సార్లు చదివి "కాశ్యాంతు మరణాన్ముక్తిహ్ స్మరణాదరుణాచలే"అని మూడు సార్లు అని శేషాద్రి చాతీని మూడు సార్లు చరచి చెప్పి, అత డిని "అంబ శివే "కీర్తనపాడమని, పాడగా వింటూ తానూ పాడుతూ "అరుణా చల అరుణా చలా అనుకొంటూ కొడుకుపై ఒరిగి ప్రాణాలు వదిలేసింది..

తల్లిమరణాన్ని తట్టుకొని ధీరోదాత్తత తో తమ్ముడు నరసింహం తోకలిసి మాతృ యజ్ఞం పూర్తీ చేశాడు. రామస్వామి జోశ్యులు భార్య కల్యాణి ఈ సోదరులను జాగ్రత్తగా కనీ పెట్టుకొని ఉన్నారు. తనకున్న పిత్రార్జితం తో రామస్వామి, స్వీయ ఆర్జనతో కుటుంబాన్ని ఏ లోటు రాకుండా పోషిస్తున్నాడు. శేషాద్రికి ఇంట్లో ఉండాలని పించలేదు. తన పూజా గృహం లో తానూ చిత్రించుకొన్న అరుణా చలేశ్వరుని చిత్రం, కామాక్షీ దేవి శ్రీరామ పరివారం చిత్రాలు ఉంచి నిత్య పూజ చేసేవాడు. స్నానం చేసి పొద్దున్న 5గంటలకు కూర్చుంటే మధ్యాహ్నం పన్నెండుకు కానీ లేచేవాడు కాదు. వేళకు భోజనం చేసేవాడుకాడు. కొన్నిరోజులు పూర్తి ఉపవాసమే. తాతగారు ఉపదేశించిన షోడశాక్షరిని తీవ్రంగా జపించేవాడు. గట్టిగా అరుణాచలేశ్వరా, శోణాద్రి నాధా అని పిలిచేవాడు. రాత్రిళ్ళు దుర్గాసూక్తం చదివే వాడు బ్రహ్మముహూర్తం లో నాలుగింటికే లేచి స్నానం చేసేవాడు. పినతండ్రి పినతల్లి ఆరోగ్యం కోసం సాధన తగ్గించుకోమని చెప్పినా వినే వాడు కాదు. ఇంట్లో కాక దేవాలయాలలో ఉంటూ ఉపవాసం చేసేవాడు.

పూర్వం బాగా ఇష్టంగా శాస్త్ర చర్చలు చేసే శేషాద్రి ఇప్పుడు వాటికి దూరం గా ఉన్నాడు. ఎప్పుడూ స్నానం. జపం ధ్యానం. చక్రత్తాల్వార్ సన్నిధిలోఎదురుగానో ఉత్తరముఖంగానో కూర్చుని జపం చేసేవాడు. మధ్యాహ్నం పన్నెండు దాటాక కామాక్షీ దేవి దర్శనం చేసేవాడు. అనేక సార్లు మూకపంచశతి పారాయణ

చేసేవాడు.వూరి వారు అందరూ నిద్రపోయాక ఇంటికి బయల్దేరేవాడు. రాత్రి ఉపవాసమే.. కుంకుమ విభూతి నుదుట పులుముకొనేవాడు. సూర్యుని చూసి సాగిలపడే వాడు. తనలో తానూ మాట్లాడుకొనేవాడు. వీధిలో కన్యలు కనిపిస్తే సాగిలపడి నమస్కరించేవాడు. పెద్దల పాదాలకు వంగి నమస్కారం చేసేవాడు. "ఇదేమిటి శేషాద్రీ"?అని అడిగితె "బ్రాహ్మణ పాదాలూ భగవంతుని పాదాలు ఒకటే "అనేవాడు.

స్వామి ఊరేగింపుకు బయల్దేరి వస్తేదారిలో రాళ్ళు కాగితాలు ఏరి పారేసేవాడు గమ్యం లేకుండా పగలూ రాత్రీ ఒకటే తిరుగుడు. క్షురకర్మ లేదు. రాత్రి నిద్ర తక్కువ. ఎవరైనా ఏంచేస్తున్నావు శేషాద్రీ?"అని అడిగితె "కర్మ నాశనం కోసం జపం చేస్తున్నాను. ఏం జపం అని అడిగితె "అంభస్య పారే " అనే నారాయణ ఉపనిషత్ లోని దాన్ని జపం చేస్తున్నాను "కామో కార్షీత్ మన్యు రకార షీత్-కామః కరోతి నాహం కరోమి "ని లక్ష ఆవృతులు చేశాను ఇంకా యాభై వేలున్నాయి. కర్మ క్షయం కాకపొతే మోక్షం రాదు "అనేవాడు. పిచ్చిముదిరిందని అందరూ తీర్మానించారు.

ఇంటిపోరు బయటిపోరు తీవ్రంకాగా ఏకాంత ప్రదేశాన్ని ఎన్నుకొని, లేకపోతే శ్మశానాని కి వెళ్లి ఉపవాసం చేసేవాడు. ఉదయం సాయంత్రం ఇంట్లో జపం పూర్తిచేసి పేగవతి నదీ తీరం లోని స్మశానం చేరి, మర్నాడు ఉదయం వరకు జపించి ఇంటికి వచ్చేవాడు. ఇలా చేస్తున్నట్లు పది రోజులదాకా ఎవరికీ తెలీదు. తెలిశాక "అశుద్ధ ప్రదేశం లో జపం ఏమిటి "అని ఆక్షేపిస్తే "స్మశానం రుద్రభూమి. అక్కడ చేసే సాధనకు రుద్రుడు అనుకూలిస్తాడు. ఇతర చోట్ల వెయ్యి సార్లు చేస్తే ఎంతఫలితమో అక్కడ ఒక్క సారి చేస్తే అంతటి ఫలితం కలుగుతుంది "అనేవాడు.

ఒకసారి శేషాద్రి బంధువులు అతడు ఇంట్లో ఒక గదిలో ఉండగా బయట తాళం పెట్టారు. ఇది బాగుందని తానూ లోపల గడియపెట్టి నాలుగు రోజులు ఏకాంతంగా హాయిగా ధ్యానం లో మునిగిపోయాడు. అయిదవ రోజు తలుపు తెరిచి చూస్తె అతనిలో అలౌకిక శక్తి ఏదో అందరికీ గోచరించింది. ఒక శనివారం ఇంటి వారంతా తలంటి పోసుకోగా, శేషాద్రి ఉదయం 10గంటలకు శ్మశానం నుంచి తిరిగి వచ్చి బాబాయి తలంటి పోసుకోమంటే వద్దనగా. బాబాయి తలంటి బట్టలు ఉదకటం శేషాద్రి పని. ఆయనతో బాగా చనువుగా ఉండేవాడు. "ఇవాళ మీ బాబాయి తలంటు కొరట"అంది పిన్ని. కారణం ఏమిటి అని అడిగితె "నువ్వు ఇలాతిరగటం ఇష్టం లేక "అనగా "నా మీద అలగటం ఎందుకు ?ఎవరి దారి వారిదిగా ఉం టేకలహాలు ఉండవుకదా "అన్నాడు. పినతండ్రిని పిలిచి తలంటి పోస్తూ తలపై నూనె పెట్టి బయటికి వెళ్లి ఆకాశం వైపు చూసి లోపలి రాగా ఆకాశం లో ఏముంది చూడటానికి అని అడిగితె దేవతలను అనగా. దేవతలేనా గంధర్వులు కూడా ఉన్నారా అనగా, ఉన్నారు. వాళ్ళు ఏరాగం ఆలపిస్తున్నారని అంటే బిలహరి అన్నాడు "నీకు పిచ్చి బాగా ముదిరింది రా. వాళ్ళు నాకు కనబడరేం "అంటే "కర్మిష్టులకు కనిపించరు. స్వస్థలంగా ఉన్నవారికే దర్శనమిస్తారు "అనగా "నీ వెర్రి వేయి విధాలుగా ఉంద"ని బాబాయి స్నానానికి లేచాడు. అతడిపిచ్చికి పెళ్లి తగినమందు అనుకొన్నారు ఇంటివారంతా.

పెళ్లిచేద్దాం సరే పిచ్చివాడికి పిల్ల నెవరిస్తారని మధనపడ్డాడు బాబాయ్. తనకు పెళ్లి చేసుకోవాలని ఉంటె చెప్పనా నిర్బంధం చేస్తే ఇంటి నుంచి వెళ్ళిపోతాను "అన్నాడు బాబాయ్ తో. ఇక మాట్లాడ లేదు బాబాయ్.. కామకోటి శాస్త్రిగారి తర్వాత వేదం లో అంతటి ఘనుడు పరశురామ శాస్త్రి ఒకరోజు అనుకోకుండా ఇంటికి వస్తే శేషాద్రి పెళ్లి విషయం లో నచ్చచెప్పమని కోరగా, దానికోసమే వచ్చానన్నాడాయన. జపతపాలు ముగించిన శేషాద్రిని శాస్త్రి "స్మశానం లో శాస్త్ర విరుద్ధంగా జపం చేస్తున్నావట"అని గద్దిస్తే చేస్తేతప్పులేదన్నాడు శేషాద్రి. "నేను నైష్టిక బ్రహ్మ చారిణి ఉపాసకులకు దేశకాలాలతోనిమిత్తం లేదు "అనగా మాట్లాడ లేకపోయాడు ఆఘనాపాఠీ. శ్మశానం నుంచి సరాసరి గృహస్తుల ఇంటికి రాకూడదు "అనిఆయన అంటే "మంచిది "అని వెళ్ళిపోయాడు మళ్లీతిరిగి రాలేదు. ఏ గుడిలోనో ఉంటాడులే అని బాబాయ్ గుండె దిటవు చేసుకొన్నాడు.

ఒక రోజు శేషాద్రి గుడికి వెళ్లి ప్రదక్షిణం చేస్తుంటే నలుగురు శిష్యులతో అపర దక్షిణా మూర్తిగా అనిపించే గౌడ సన్యాసిని శేషాద్రి చూసి, భావోద్రేకం కలుగగా ఆయన "మా శుచః ఉపవిశ "అనగా అరుగుపై కూర్చోగా ఆయన చూపులేఈయనకు దీక్ష అయ్యాయి. ఆయన విశేషాలను పట్టన్న అనే అతని ద్వారా తెలుసుకొని, ఆయన బాలాజీస్వామి అని, హరిద్వారం నుంచి రామేశ్వరం వెడుతూ కంచికి వచ్చారని చెప్పగా స్వామికూడా శేషాద్రి వివరాలను అతని ద్వారాతెలుసుకొన్నారు. ఇద్దరూ శాస్త్ర చర్చ చేశారు. ఆయనకు సపర్యలు వీరిద్దరూ చేశారు. స్వామి వెళ్ళిపోతూ పట్టన్నకు దేవీ మంత్రం, శేషాద్రికి సన్యాస దీక్ష ఇచ్చి వెళ్ళిపోయాడు. దీక్షగా సాధన చేశాడు శేషాద్రి.

తండ్రి తద్దినం వచ్చింది. శేషాద్రిని ఎలాగైనా ఇంటికి తీసుకొని వచ్చి ఆయన తండ్రి తద్దినం పెట్టించాలనిరామస్వామి వెదకటం మొదలు పెట్టి పట్టుకొనివిషయం చెప్పి ఇంటికి రమ్మంటే "నేను సన్యాసిని. కర్మలు ఎప్పుడో పోయాయి. నేనురాను "అని చెప్పినా వినకుండా బలవంతంగా ఇంటికి తీసుకువచ్చి గదిలో పెట్టి తాళం వేశాడు. తద్దినం పూర్తీ చేసి పితృ శేషం తిని వెళ్ళచ్చు అని తాళం చెవి రొంటిలో దోపుకున్నాడు. శేషాద్రి తమ్ముడు నరసింహ శ్రార్ధకర్మ నిర్వహించాడు. పిండాలకు నమస్కారం చేసే సమయం వచ్చింది. రామస్వామి గది తాళం తీశాడు. శేషాద్రి గదిలో లేడు. అవాక్కయ్యాడు. ఊరంతా గాలించినా కనపడ లేదు. యోగశక్తితో గదినుంచి మాయంయ్యాడని గ్రహించారు అందరూ.అతడిని సామాన్యుడిగా భావించటం తమ తెలివి తక్కువ తనం అని గ్రహించారు.

కొంతకాలానికి శేషాద్రి కంచికి ఇరవైమైళ్ళ దూరం లో ఉన్న కావేరీ పాకం లో ఉన్నట్లు వార్త వచ్చింది. అకక్కడ అతడి పెద్దమ్మ సుందరంబాళ్ ఉంటుంది ఆమె పదేళ్ళకొడుకు శేషు ఇతడిని చూసి తల్లితో చెప్పగా వెళ్లి ఇంటికి రమ్మనగా, రాను అంటే ఆమె రోజూ నుంచీ ఆహారం తెచ్చిచ్చేది.ఒక రోజు శేషాద్రీ, శేషు గుడి ప్రదక్షిణం చేస్తుంటే, ఉత్తర ప్రాకారం గోడ దగ్గర పొన్న చెట్టుకింద ఒక పెద్ద పాము కనిపిస్తే, పిల్లాడు భయపడి అరిస్తే పాము దగ్గరకుశేషాద్రి వెళ్లగా ఆపాము అతనిపై ప్రాకి మెడ చుట్టూ మూడు సార్లు చుట్టుకొని, శిరస్సును పడగతో కప్పేసింది. శేషాద్రికి పాముకరిచిందని ఏడుస్తూ వీధిలోకి శేషు పరిగెత్తాడు. జనం పోగయ్యారు నిశ్చలంగా భుజంగ భూషణుడుగా శేషాద్రి కూర్చుని ఉండటం చూసి ఆశ్చర్యపోయారు. శేషాద్రి ఇక్కడ ఉన్నాడని తెలిసి బాబాయి పిన్నీ చూడటానికి వచ్చారు.

సమాధిలో ఏడు భూమికలు ఉంటాయి అవి శుభేచ్ఛ, విచారణ, తను మానసీ, సత్వాపత్తి,సమసక్తి, పదార్ధ భావన, తుర్యగ.నాల్గవ భూమికలో ఉన్నవారిని బ్రహ్మ విదులనీ, అయిదు ఆరు ఏడు భూమికలలో ఉన్నవారిని బ్రహ్మ విద్వర, బ్రహ్మ విద్వరీయ, బ్రహ్మ విద్వరిష్టు లు అంటారు. సంకల్పం తో సమాధిలోకి వెళ్లి మళ్ళీ బయటికి రావటం అయిదవ భూమిక. ఇతరుల సాయం తో వస్తేఆరవ భూమిక. స్వేచ్ఛగాకానీ ఇతరులసాయం తోకానీ జాగృతి లోకి రాకపోవటం ఏడవ భూమిక. ఇప్పుడు శేషాద్రి ఆరవ భూమిక లో సమాధిలో ఉన్నాడు.

చుట్టూ చేరినవారు "నమః పార్వతీ పతయే హరహర మహా దేవ"అని ఉచ్చైస్వరం తో పలుకగా శేషాద్రి కళ్ళు తెరిచాడు. పిన్నీ బాబాయి "నాయనా !నీమహిమ తెలుసుకోలేక అపచారం చేశాం. నువ్వు ఇంటిపట్టున ఉంటేచాలు "అని దుఖించగా వాళ్ళనే ఓదార్చి ఇంటికి పంపించేశాడు శేషాద్రి స్వామి. అప్పటి నుంచి ఆయనది అత్యుత్తమ ఆధ్యాత్మిక స్థితి. అదే జీవన్ముక్త స్థితి. ఆయన అందరి వాడే పశుపక్షాదులకు కూడా.

ఆయన పాద ధూళి భవ బంధక విమోచనం అయింది. కావేరీ పాకం లో నెలరోజులు ఉండి,జనం పెరిగిపోగా, ఎవరికీ చెప్పకుండా అక్కడి నుంచి వెళ్ళిపోయి మూడు నెలలు ఎవరికీ ఆయన ఆచూకీ తెలియలేదు. వందల వానిలో, చెంగల్పట్టు లో ఉన్నాడని వదంతులొచ్చాయి. తర్వాత దిండీ వనం లో కనిపించాడు.మౌన దీక్షలో ఉన్నాడు. శివాలయం లోని యాగ శాలలో ఒక గది ఆయనకిచ్చారు. తాను నెలరోజులు ఆగదిలో ఉంటానని తలుపు తాళం వేసుకోవచ్చనీ రాతపూర్వకంగా చెప్పారుస్వామి. అలాగే చేశారు అర్చకులు అయిదు రోజులు గడిచాక, ఆయన ఆగదిలో చనిపోతే సంప్రోక్షణ చేయాల్సి వస్తుందని భయపడి తాళం తీస్తే స్వామి నిశ్చల సమాధిలో కనిపించారు. ఇక ఇక్కడ లాభం లేదని శేషాద్రి స్వామి తిరువన్నామలైకు బయల్దేరి వాలాజీపేట, వేలూరు అంబూరు, తిరువత్తూరు, జవ్వాజిమలై, కన్నియం బాడి,పోరూరు మొదలైన ఊర్ల మీదుగా 1888 లో పంచలింగ క్షేత్రం తిరు వన్నామలై చేరారు శేషాద్రిస్వామి తిరిగి తిరిగి అరుణాచలం లో స్థిరపడ్డారు.

వ్యాస మహర్షి అరుణా చలం గురించి –"లలాటే త్రై పుండ్రీ నిటల ధృత కస్తూరి తిలకః –స్ఫురన్మాలాధారఃస్ఫురిత కటి కౌపీన వసనః –

దధానో దుస్తారాం శిరసి ఫణి రాజం శశి కలాం-ప్రదీపు స్సర్వేషాం అరుణ గిరి యోగీ విజయతే "అనే ప్రసిద్ధ శ్లోకం రాశాడు. ఈ శ్లోఆన్ని రోజూ పారాయణ చేస్తే ముక్తిఖాయం అన్నారు శేషాద్రి స్వామి.

అన్ని చోట్లూ వదిలేసి అరుణా చలం లో ఎందుకు స్థిరపడ్డారని శేషాద్రి స్వామిని అడిగితే "ఇక్కడే కదా శివ, శక్తులు మోక్షం మేము ఇస్తామంటే మేమిస్తాం అని పందాలు వేసుకొంటారు "అన్నారు. అరుణా చలేశ్వరుని ఆలయం వెనక వేణుగోపాలస్వామి ఆలయం ఉంది. ఆయన వేణుగాన లహరిలో పరవశించి అరుణాచలుడు అచలుడు అయ్యాడని ఊహిస్తారు. ఈ క్షేత్రం లో ఒక చోటునే ఉండకుండా అంతటా తిరిగారు శేషాద్రి. ఆయనది నడక కాదు పరుగే. పగలూ రాత్రీ సంచారమే. సన్నిధి వీధిలో మొదటి ఇల్లు సూర్య నారాయణ శాస్త్రి గారిది. ఆయనకు స్వామి వివరాలు తెలుసు. స్వామి ఇక్కడికి వచ్చారని తెలిసి వెదకటం మొదలుపెట్టారాయన. ఒక రోజు మండపం వద్ద కలుసుకొన్నారు. దగ్గరలో ఏడు గాడిదలు మేస్తున్నాయి. వాటిని తాకి కళ్ళకు అద్దుకున్నారు స్వామి. ఎందుకు అలా చేశావ్ శేషాద్రీ అని శాస్త్రిగారు ప్రశ్నిస్తే "ఇవి గాడిదలు కావు సప్తర్షులు ఇది వసిష్టుడు ఇది అస్యుడు "అని చూపిస్తూ నేలపై సాష్టాంగ నమస్కారం చేశారు శేషాద్రి. స్వామిని ఇంటికి రమ్మంటే "పోపో "అని అదిలించారు. అది బాలోన్మత్తపిశాచవత్ స్థితి. ఆయన్ను పిచ్చివాడుఅని ఎవరూ అనుకోలేదిక్కడ.

ఒక గుడ్డ మొలకు చుట్టి మరోదాన్ని ఉత్తరీయంగా వేసుకొనేవారు శేషాద్రిస్వామి. అవి మట్టికొట్టుకొని పోయి ఉండేవి. శుచి శుభ్రతలు లేవు. ఏదిదొరికితే అదే తిని చేతుల్ని బట్టలకు తుడుచుకోనేవారు. బిచ్చగాళ్ళకు తనబట్టలు ఇచ్చి వారివి తీసుకొని ధరించేవారు. దేహాభిమానమే లేని స్వామికి వస్త్రాభిమానం ఉంటుందా ?నడక జన్తాలునిలా అంటే అమితవేగా గామిగా ఉండేది.తెలిపోయినట్లు నడిచేవారు. నడుస్తుంటే శబ్దం రాదు. "అనికేత శుచి ర్దక్ష"ఆయన జీవితం. పది నిముషాలలో పది చోట్లు మారేవారు కనుక వెదికి పట్టుకోవటం చాలాకష్టం. పిర్రలు నేలపై ఆనకుండా, మోకాళ్ళు ముడిచి, మడమలపై ఆన్చి కూర్చునేవారు. దీన్ని స్వస్తికాసనం అంటారు.

మంద్ర మధుర భాషి స్వామి. పూర్వాపర సంబంధం ఉండదు.ఒక్కోసారి ఎన్ని అడిగినా జవాబు ఇవ్వరు ఒక్కోసారి రెండుమూడుమాటలే జవాబు.ఎవరినా పాడమంటే "అంబ శివే "అని మాత్రమే శ్రావ్యంగా పాడి ఆపేసేవారు ఇది తాత కామకోటి శాస్త్రి గారి పాట అని చెప్పేవారు. కూర్చున్న చోటనే మంచం మీద స్తంభం మీద తాళం వేసేవారు. ఎవరైనా వస్తే ఆపేసేవారు. అరక్షణం ఖాళీగా ఉం డేవారుకాదు.తనకెదురుగా ఉన్న వస్తువు చేత్తో తీసుకొని మళ్ళీ అక్కడే పెట్టేవారు. మళ్ళీ తీసుకోవటం, మళ్ళీ పెట్టటం. తూర్పుకు కూర్చుని ఒక్కసారిగా పడమటకు తిరిగేవారు. వెంటనే ఉత్తరానికి తిరిగి చేతులపై ముందుకు జరిగి, అకస్మాతుగా లేచి ఆకాశం వైపు చూసేవారు. లేకపోతే స్తంభాన్నిపట్టుకొని లేచేవారు. చేతులు వెనక్కు కట్టుకొని, ఇంకో స్తంభం దగ్గరకు వెళ్లి కిందా పైనాచూసేవారు. ఆకాశం చూస్తూ యాభై సార్లు తిరిగేవారు. అరచేతుల్ని కళ్ళకు అద్దుకోనేవారు. లేకపోతే హఠాత్తుగా పెద్ద గా అర గంట సేపు నవ్వేవారు. కారణం అడిగితె చెప్పేవారుకాదు. ఉడత వెంటా,పిల్లి వెంటా పరిగెత్తేవారు. బండీ కనిపిస్తే ఎక్కి కూర్చునేవారు. మున్సిపాలిటి చెత్తబండి వస్తే, జట్కాబండి లోంచి దాన్లోకి మారి "చూశారా కోచిబండీ "అనేవారు.

హోటల్లు, అంగళ్ళు,పచారీ కొట్లలోకిదూరి సామాన్లు కిందపడేసేవారు.గల్లాపెట్టె తెరచి డబ్బు వెద జల్లేవారు. నాణాలు పేర్చి పిల్లల్లాగా ఆడేవారు. ఏమి చేసినా ఎవరూ స్వామిని ఒక్కమాట కూడా అనేవారుకాదు..స్వామికనపడితే చాలు అందరూ పాదాభి వందనం చేసేవారు. వచ్చినవారి బుద్ధులు మంచివికాకపోతే అక్కడినుంచి పారిపోయేవారు. వాళ్ళు బలవంతంగా వస్తే దుర్మార్గా పోపో అని చీదరించుకొనే వారు. మంచి వారితో మాట్లాడి ఆప్యాయంగా కౌగి లించుకోనేవారు.

స్త్రీ పురుష భేదం లేదు స్వామికి. స్త్రీలమీద చేతులు వేసి తోసుకొంటూ నడిచేవారు. వారి ఒడిలో తలపెట్టుకొని పడుకొనేవారు. గబుక్కున లేచి నమస్కారం చేసి "అమ్మా !నువ్వు మా అమ్మ కల్యాణిలా ఉన్నావు "అనేవారు. ఆడవారందరికి స్వామి శిశువే.

మధ్యాహ్న సూర్యుని తదేకంగా రాత్రి చంద్రుని చూస్తూ మంత్రాలు చదివేవారు. వర్షం ఆయనకు బహు హర్షం. ఆగితే కానీ అరుగుమీదకు చేరేవారుకాదు.రోడ్లమీద నీళ్ళల్లో ఎగురుతూ గంతులేసేవారు. గుడ్డల్ని పిండుకోనేవారుకాదు. అలానే తడిబట్టలతో ఉండేవారు. అన్నిటికీ పరమ నిర్లిప్తులు. జరిగే ప్రతి పెళ్ళికీ హాజరై వధూవరులను తాకుతూ కూర్చుని నవ్వుతూ తెచ్చిన గంధమంతా పూసుకొనేవారు. దంపతులు పాదాలకు మొక్కితే "నూరేళ్ళు నూరేళ్ళు "అంటూ వెళ్ళిపోయేవారు. ఎవరింట్లో పీనుగ లేచినా అక్కడా స్వామి హాజరు. శవానికి ముందు వెళ్లి నమస్కరించేవారు.అశౌచం ఎంగిలి మైల ఏ కోశానా ఆయనకు లేనేలేవు. అదే అవధూత లక్షణం దత్తాత్రేయునిలా.

ఒక్కోసారి స్వామికి తలంటి పోసేవారు టన్నులకొద్దీ నూనె తెచ్చి రాసేవారు. మధ్యలో లేచిపోయేవారు. తైలమర్దనే తప్ప అభ్యంగనం ఉండేదికాదు. అ వేషం తో పది రోజులు తిరిగేవారు. ఊరిలోని దుమ్ము అంతా ఆయన శరీరానికి పూసిన నూనెకు అంటుకోనేదిదట్టంగా. రామయ్య అనే ఆయనకు స్వామిపై అమితభక్తి. పదేళ్లుగా పరిచయం. కానీ స్వామికి ఆయన నిత్యనూతనుడే. కనిపించిన ప్రతిసారీ "మీరెవరు ఏవూరు "అని అడిగేవారు స్వతంత్రించి పరిచయం చేసుకొంటే "చీచీ ఫో ఫో" అని చీదరించుకోనేవారు. స్వామిని చూడకుండా క్షణం ఉండగలిగే వాడు కాదు. ఎవరిముఖమైనా ఒక సారి చూస్తె వాళ్ళ పుట్టుపూర్వోత్తరాలన్నీ స్వామికి తెలిసిపోయేవి. ఒక్కో సారి పట్టించుకొనే వారు కాదు. కనుక ఆయన ముందుకు రావటానికి జనం భయపడేవారు. ఒక రోజు స్వామి వీధి అరుగుమీద కూర్చుంటే, పోరుగూరిభక్తులు తిరువన్నా మలై వచ్చి స్వామిని చూడటానికి వస్తే, అందులో ఒకడిని "మహాపాపీ సొంతకోడలే నీకు భార్యా చీఫో "అని ఉమ్మేశారు. వాడు గిర్రున తిరిగి వెళ్ళిపోయాడు. వాళ్లకు తర్వాత స్వామి చెప్పింది నిజమే అని తెలిసింది.

"యర్వత్రానభి స్నేహః "అనే గీతా వాక్యం ప్రకారం అందర్నీ సమానం గా స్నేహంగా చూసేవారు. ఆకలిదప్పులకు అతీతులు స్వామి ఒక్కోసారి నెలరోజులు ఉపవాసం. మరొక్కప్పుడు నలుగురు తినే భోజనం తినేసేవారు. సదా ముఖం పై ఎ భావం లేకుండా తిరిగేవారు. ఎవరరైనా విస్తరేసి వడ్డిస్తే అంతాకలిపి ఒక ముద్దచేసి,కొన్ని పిడికిళ్ళు విస్తరికి అటూ ఇటూ చల్లి, రెండుమూడు ముద్దలు నోట్లో వేసుకొనేవారు. లేకపోతె వడ్డన పూర్తీ అవగానే లేచిపోఎవారు. "అన్నం అలా ఎందుకు చల్లుతారు అని అడిగితె "యో భూతాఃప్రచర్తనిదివానక్తం బలిమిచ్చంతో"అంటె బలి వేయకపోతే రుద్రుడికి కోపం వస్తుంది అనే వారు. ఇది దేవతలకు బలి అనేవారు. ఒకసారి అరుణాచలయ్యరు "దేవతలా నాకు కనిపించటం లేదే "అనగా "సరిగ్గా చూడు స్తంభం ప్రక్కనే నిలబడి ఉన్నారు "అన్నారు. అన్నాన్ని రోగగ్రస్తుడు పధ్యం తిన్నట్లు అయిష్టంగా తినేవారు. కంబత్తి లయనారు గుడికి రోజు రాత్రిళ్ళు వెళ్ళేవారు. అక్కడ పాలగ్లాసులతో చెంబులతో జనం సిద్ధంగా ఉండేవారు. బ్రతిమాలో బామాలో గ్లాసులు అందిస్తే కింద పోసేవారు, లేదా పుక్కిలించి ఉమ్మేవారు పాలతోనే పళ్ళు తోముకోవటం,ముఖం కడుక్కొనే వారు. ఆయన చుట్టూ కుక్కలు మూగేవి. ఆపాలు "శ్వాన" సంతర్పణ చేసేవారు స్వామి. పాలైనా పంచ భక్ష పరవాన్నాలైనా స్వామికి చాపల్యం లేదు.

రామనాధ పురం మాణిక్యస్వామి కి శేషాద్రి స్వామి అంటే అమితప్రేమ.రోజు ఊర్లో భిక్షం యెత్తి స్వామికి భోజనం పెట్టేవాడు. స్వామి తిన్నాకే తినేవాడు స్వామికనపడకపోతే భిక్షాన్నాన్ని జాగ్రత్త చేసేవాడు. ఒకరోజు రాత్రి స్వామి గుడిలో కనిపిస్తే నాలుగునాల్లకిందటి భిక్షాన్నం పాత్రతో తెచ్చి ముందు పెట్టి మూత తీయగా భరించరానికంపు కొట్టింది. క్రిములు పో ర్లాడుతున్నాయి. ఎవ్వరూ దాన్ని తినరు తినలేరుకూడా. కనీస్వామి విస్తరిలో వడ్డించుకొని, అక్కడివారు తినవద్దని ఎంత బ్రతిమాలినా వినక మాణిక్యాన్ని కూడా తినమన్నారు. మృష్టాన్నం తిన్నంత అనుభూతి చెందారు స్వాములిద్దరూ.

స్వామి నిద్ర జయించారు. అర్ధరాత్రి ఆసనం వేసి సమాధి స్థితి పొందుతారు. ఎవరైనా కునికిపాట్లు పడుతుంటే "నిద్రపోకు యముడు పట్టుకు పోతాడు "అనేవారు. స్వామి అనుగ్రహం తో లాభపడిన ఒకాయన కృతజ్ఞతగా పది వేలరూపాయలు సమర్పించాలని కంబట్టి లయనారు గుడిలో స్వామి ఉంటె వెళ్లి దూదిపరుపుకొని తెచ్చి ఇవ్వగా దాన్ని పడకకు కూర్చోటానికి భోజనానికీ వాడే వారు. అదీమురికి పట్టింది భక్తులు దానికీ నమస్కరించేవారు. ఈ శయ్యాగాధ 1921 నుంచి నాలుగేళ్ళు కొనసాగింది.

మధ్యాహ్నం సాదు సత్రం పెరటిలో స్వామి విశ్రాంతి. తట్టాబుట్టా చీపురు వగైరాలమధ్యే సేద తీరేవారు. చీమలుకుట్టినా శేషశయనస్వామిలాగా పడుకొనేవారు. ఎప్పుడూ కిటకిటలాడుతూ జనమే ఆయన చుట్టూ. విచిత్ర సంభాషణ చేస్తూ అడ్డ దిడ్డంగా పొంతన లేకుండా మాట్లాడి తప్పించుకొని వెళ్లి, వెళ్లిపోయేవారు స్వామి.

భగవాన్ రమణ మహర్షి, శేషాద్రిస్వామి సమకాలికులు. స్వామియే వీరిద్దరిలో పెద్ద. అపరోక్షానుభూతిలో ఇద్దరూ సమానులే. పరస్పర గౌరవభావాలున్నవారు. రమణులకు భక్తులు కొత్త సోఫా తెచ్చి సమర్పించి కూర్చోమనికోరితే "ఎదురుగా ఉన్నది సోఫా అనీ, అందులో కూచోవాలని నాకు తెలియదా దేహాన్ని మర్చిపోవటానికి నేను శేషాద్రి స్వామిని కాను" అన్నారట. రమణ భక్తురాలు లక్ష్మీ అమ్మాళ్, ఏపని చేసినా భగవాన్ పైనే ధ్యానం గా ఉండేది. శేషాద్రిస్వామిని చూడనే లేదు. ఒకరోజు స్వామి దర్శనానికి బయల్దేరితే ఆయన కనిపించలేదు. ఏడు రోజులకు కనిపించారు. ఆయనముందు నిలబడి రమణులనే ధ్యానించేది. అప్పుడుస్వామి "అక్కడైనా, ఇక్కడైనా రెండూ ఒక్కటేగా ""అన్నారట. ఆస్తికులైన సుబ్రహ్మణ్య శాస్త్రి గారు ధ్యానం చేయాలనిపించి రమణులతో"పూర్ణాది లేహ్యం సేవిస్తే ధ్యానసిద్ధి కలుగుతుందంటారు నిజమేనా ?"అని అడిగితె "అలాంటి ఆలోచన వద్దు "అన్నారు. కానీ శాస్త్రి ఆ లేహ్యం తిన్నారు. విపరీత ఆలోచనలు బయల్దేరి తలతిరిగి తట్టుకోలేక రాత్రి తొమ్మిదింటికి గుడిలో ఉన్న శేషాద్రి స్వామి దగ్గరకు వెళ్లగా "ఆ లేహ్యం తినవద్దని చెప్పానుగా. ఎందుకు తిన్నావ్ "అనగా బొల్లుఆశ్చర్య పోయి స్వామి రమణులు అభేద్యులు అని గ్రహించారు.

"నాయనగారు" అంటూ రమణ మహర్షి గౌరవించే సుబ్రహ్మణ్య స్వామి అంశ అయిన కావ్య కంఠ గణపతి మహా కవి భగవాన్ శిష్యులు. బాల్యం లోనే పంచాక్షరి తారా మంత్రం ఉపదేశం పొందినవారు. నవ ద్వీప పండిత సభలో "కావ్య కంఠ "బిరుదు పొందిన విద్వత్ వరేణ్యు లాయన. ఆయన ఆసభలో "గణపతిరితి కవికులపతి రతి దక్షో దాక్షిణాత్యోహం " అని సగర్వంగా తన్ను ప్రకటించుకొన్నారు. లక్షలకొద్దీ జపం చేసినవారు. 1903 లో తిరువన్నామలై వచ్చి రమణుల శిష్యులై,ఆయన ఉపదేశాలను ఛందో బద్ధం చేసి "రమణ గీత "అనే 18అధ్యాయాల పుస్తకంగా వ్రాశారు. గణపతిమునికి భగవాన్ కులదైవం,శేషాద్రి స్వామి ఇష్టదైవం. తరచుగాస్వామిని గూర్చి మాట్లాడేవారు. పోరుగూరివారొచ్చి స్వామిని చూడాలంటే "ఆపిచ్చి వాడిని చూడాలా "అనేవారు. వాళ్ళు స్వామిని సమర్ధిస్తూ మాట్లాడితే వారి భక్తికి మెచ్చి సమాధానమిచ్చేవారు. "కుండలినీప్రసాద లబ్ధ దివ్య శక్తి "స్వామికి ఉంది అని చెప్పేవారాయన.

ఒకసారి శాస్త్రిగారు శక్తి తత్త్వం పై పది రోజులు ప్రసంగిస్తే, విన్నవారు చివరి రోజున ఆయన కుమారుడు మహాదేవుని పెళ్ళికి యాభై రూపాయలు వసూలుచేశారు. అకస్మాత్తుగా స్వామి అక్కడికి రాగా దాన్ని స్వామి చేతిలో పెట్టిమీకు నచ్చిన వారికిమ్మన్నారు. వెంటనే గణపతి ముని చేతిలోఆపైకం పెట్టి కాళిదాస శ్లోకం "వాగర్ధా విప సంపృక్తౌ "చదివి స్వామి మహాదేవుని కల్యాణం సూచ్యార్ధ సూచకంగా తెలియజేశారు.

గణపతి ముని, రామ శాస్త్రులు కలిసి "రమణ సమితి "స్థాపించి భగవాన్ కు చెప్పాలని వెళ్ళారు. దారిలో స్వామి కనిపించి "సంఘం స్థాపిస్తున్నారా ?మంచిపనే "అన్నారట, అవాక్కయ్యారు ఈ ఇద్దరూ.. కొట్లన్నీ స్వామి రాకకోసం తెరిచే ఉంచుతారు. కాలు పెడితే ఆ రోజు వారికి కనక వర్షమే. ప్రతి దుకాణం లోనూ స్వామి ఫోటో ఉంటుంది. దానికి హారతి ఇవ్వనిది వ్యాపారం మొదలు పెట్టేవారుకాదు దుకాణ దారులు. పిలవక పోయినా ముత్యాల చెట్టి అంగడికి స్వామి వెళ్ళేవారు. కాలణా(అణాలో నాలుగో వంతు ) కర్పూరం అడిగితె కాలురూపాయి(పావు రూపాయ ) కర్పూరం పెట్టేవాడు చెట్టి. అదతా అరుణాచల సన్నిధికే చేరేది. అంత ఉదారుడు. చెట్టికొట్టుకొచ్చి స్వామి గల్లాపెట్టె తీసి నాణాలు కింద కుమ్మరించినా అతడు కిమిన్నాస్తిగా ఉండేవాడు. స్వామి అనుగ్రహం తో కొన్ని లక్షలకు అధిపతి అయ్యాడు. ఒకసారిస్వామి ఈ కొట్లోకి వచ్చినిండు నేతిడబ్బాను బయటికి తీసుకొని వెళ్లి కుమ్మరించేశారు. అనుకోకుండా ఆశలు వదులుకొన్న బండబాకీ డబ్బు 7 వందలు వచ్చాయి ఆనాడు. మరోసారి చెట్టి బట్టల దుకాణం నుంచి ఖరీదైన పట్టుబట్ట తీసుకొని వెళ్లి, ముక్కలుముక్కలుగా చించి ఎచ్చమ్మగారి గేదె కొమ్ములకూ, కాళ్ళకూ కట్టారు. ఆరోజు చెట్టిగారికి రెండువేలరూపాయలు లాభం వచ్చింది.

ఒక మామిడి పళ్ళవ్యాపారి అమ్మకానికి మామిడిపళ్ళు నాలుగు పెడితే స్వామి అటుగా వచ్చి ఒకదాన్ని తీసుకోగా యజమానిలేడు.నౌకరు స్వామిచేతిలోపండులాగేసి బుట్టలో పడేశాడు. చుట్టుపక్కలవారు వద్దని చెప్పినా వాడు వినలేదు. మర్నాటి నుంచి ఆ పళ్ళకోట్లో లో ఒక్కపండు కూడా అమ్మకం జరిగేదికాదు. బండి తోలే మురుగన్ తల్లి ఉన్నామలై.అతడు వీధి అరుగుపై నిద్రిస్తుండగా స్వామి వారిట్లోకి వెళ్ళగా అతని తల్లి ఆహ్వానించింది. గంజి ఉందా అని అడిగితె వెంటనే ఒక లోటా గంజి తెచ్చి స్వామి ముందుంచి కొడుకును నిద్రలేపింది. వాడు నిద్రపోయాను క్షమించు స్వామీ అన్నాడు. వాడిని "బండడీ తోలుతున్నావా "అని అడిగితె "గిరాకీ లేదుస్వామీ "అంటే "బండీ ఎద్దూ అమ్మేసెయ్యి "అని వెళ్ళిపోయారు. మర్నాడు అతని ధనవంతుడైన చెన్నై బంధువు తనకూతుర్నిచ్చి పెళ్లి చేస్తాను అనే కబురుపంపాడు. పెళ్లి చేసుకొని బండీ ఎద్దూ అమ్మేసి చింతాద్రి పేటలో మామగారింట తల్లితోబాటుఇల్లరికపు టల్లుడుగా స్థిరపడ్డాడు.

మంగలి చొక్క లింగానికి స్వామిని చూసిన రోజు కాసుల పంట. అతడే స్వామికి క్షవరం చేస్తాడు. ఒకపక్క మీసం తీసేయ్యగానే చటాలున స్వామి లేచి వెళ్ళిపోయి అలాగే తిరిగేవారు. స్వామి క్షవరానికి డబ్బులు కుప్పుస్వామిలేక చిన్న గురుకులు ఇచ్చేవారు. ఒకరోజు స్వామి క్షవరం చేయమని చొక్క లింగాన్ని పిలిస్తే కుదురుగా కూచుని క్షవరం అయ్యేదాకా కూర్చుంటేనే చేస్తాననగా అలాగే వపనం చేయిన్చుకొన్నారు. కానీ చొక్క లింగానికి ఆ రోజు ఎవరూ డబ్బు ఇవ్వలేదు. సాయంత్రం ఉసూరుమని ఇంటికి వెడుతుంటే అతడికి అయిదు రూపాయల నోటు దొరికింది. దేవ దాసీ అలిమేలు స్వామి ఇప్పచేట్టుకింద కూర్చునిఉండగా నమస్కరిస్తే,తనముందు పడిఉన్న ఎండిన చేమంతి పువ్వు ను ఆమెతలపై వాసన చూసి వేశారు. ఆవారం లో ఆమెకు ఒక షావుకారు వలన అధిక ధనం వచ్చిపడింది.

ఇలయనార్ దేవాలయం ను శేషాద్రి స్వామి రాత్రి వేళ దర్శించేవారని చెప్పుకొన్నాం ఈ ఆలయ విశేషాలేమిటో తెలుసుకొందాం. ఇలియనార్ అంటే చిన్నవాడు అని అర్ధం. కంబత్తిల్ ఇలయనార్ అంటే స్తంభం లో కనిపించిన చిన్నవాడు. ప్రౌఢ దేవరాయలకాలం లో అరుణ గిరి నాధుడు అని ప్రసిద్ధి చెందిన శ్రీ సుబ్రహ్మణ్య స్వామికి భక్తుడు అరుణగిరి వాసి సుబ్రహ్మణ్యం. తమిళం లో వేలాది కీర్తనలు రాశాడు వాటిని "తిరుప్పు గల్"అంటారు. వీటికే అరుణగిరికీర్తనలు అంటారు. మనత్యాగయ్యగారికీర్తనల్లాగా అవి ద్రావిడ భాష లో ప్రఖ్యాతి పొందాయి. రాయలకు అరుణగిరి నాధునిపై అమిత భక్తి. సంబంధ అండా అనే జైనుడికి ఇది ఇష్టం గా లేదు. ప్రౌఢ దేవరాయలు ఒకసారికొలువులో అరుణగిరీశ్వరుని పొగడగా సంబంధ అండా"మీ దేవుడికి అంతమహిమ ఉంటె చూపించండి "అనగా రాయలు స్వామిని ప్రార్ధించి దర్శనమిమ్మన్నాడు. "స్వామి దర్శనాన్ని నువ్వు భరించలేవు "అన్నాడు స్వామి. "నాకళ్ళకు ఏమైనా ఫర్వాలేదు. చూడాల్సిందే "అన్నాడు రాయలు. స్వామి ఆయన కోరికమన్నించి ఒక స్తంభం లో చిన్నపిల్లాడుగా దర్శనమిచ్చాడు. అందుకే ఆక్షేత్ర స్వామిని కంబత్తిలయనార్ అంటారు.

దివాన్ బహదూర్ సుందర శెట్టి 1909-10లో తిరువన్నామలై న్యాదికారికి శేషాద్రి స్వామిని దర్శించాల్నే కోరిక ఉండేది. ఒకరోజు స్వామి ఆయన ఇంటికి వెళ్ళారు. మర్యాద చేసి ఆతిధ్యం తీసుకోమనికోరగా సరే అని విస్తరిముందు కూర్చుని భోజనం చేస్తూ మెతుకులు అటూఇటూ చల్లారు. తర్వాత కొత్త పంచను స్వామికి చెట్టి సమర్పించాడు. దాన్నికట్టుకొని శెట్టికి అంగ వస్త్రంగా వేసి, తీసేసి మళ్ళీ వేశారు. ఆతర్వాత శెట్టి ఇంటినుంచి బయల్దేరాడు. 1927 లో శెట్టి దక్షిణ ఆర్కాటు జిల్లా జడ్జీ అయ్యాడు. కొన్ని రోజులు విశ్రాంతికోసం సెలవుపెట్టి తిరువన్నామలై వచ్చి స్వామికి నమస్కరిస్తే స్వామి అటూ ఇటూ పరిగెత్తారు. ఒకరిని

వదిలి ఒకరు ఉండలేక పోయారు. శెట్టి చేతులు జాచమని చెప్పి తన చేతులతోపట్టుకొని పైకీ కిందికీ దింపారు. ఏదేదో మాట్లాడి స్వామి వెళ్ళిపోయారు. నౌకరుకు డబ్బు ఇచ్చి కొత్త వస్త్రాన్ని తెమ్మనిపంపగా అతడు రావటం ఆలస్యమవగా స్వామి వెళ్ళిపోగా, దారిలో స్వామి అతడి దగ్గరున్న వస్త్రాన్ని తీసుకొని మెడపై వేసుకోగా చూసి శెట్టి మహదానందపడ్డాడు. సెలవుపూర్తి అయి, జాయిన్ ఆయె లోపు ఆయన కు హైకోర్ట్ జడ్జి పదవి వచ్చినట్లు వార్త వచ్చింది. ఇదంతా స్వామి అనుగ్రహమే అనుకొన్నాడు.

సబ్ ఇన్స్పెక్టర్ శివ ప్రకాశం జీతం నెలకు 75రూపాయలు. ఒక రోజుపనిమీద సర్కిల్ ఇన్స్పెక్టర్ ఇంటికి వెడుతుంటే దారిలో స్వామికనిపించి "నీకు పదిరూపాయలిస్తాను తీసుకొంటావా ?"అని అడిగితె "మా సి. ఐ, ఉన్న ఉద్యోగం పీకకుండా ఉంటె చాలు. జీతం పెంచటం కూడానా స్వామీ "అన్నాడు. "అయన ఇచ్చినా ఇవ్వకపోయినా నేనిస్తా "అంటూ ఆయన టోపీ తలమీద పెట్టుకొని తన ఉత్తరీయం అతనిమెడలో వేసి, ఇద్దరూకలిసి సి ఐ ఇంటికి వెళ్ళారు. అతనిభార్య "మీకు మంచికాలం వచ్చింది ప్రమోషన్ వస్తుంది "అన్నది స్వామి నవ్వుతూ తలూపారు. కాసేపు మాటలతర్వాత ఆయన తోపీ నెత్తిమీద పెట్టుకొని తన ఉత్తరీయం తీసి "అందుకే పోలీసువారితో సావాసం చేయకూడదు ప్రతిదీ గుచ్చి గుచ్చి అడుగుతారు "అని వెళ్ళిపోయారు. ఆరోజే అతని జీతం పదిరూపాయలు పెరిగింది. డి ఎస్పిపి కి ఇష్టం లేకపోయినా ఎ ఎస్పి రికమెండ్ చేసి జీతం పెంచేట్లు ఆర్డర్ ఇప్పించాడు.

డేనిష్ మిషన్ స్కూల్ టీచర్ వెంకటరామయ్య ను అధికారులు ఏదో సాకుతో తాత్కాలికంగాపీకేసి మూడు నెలలు జీతాలుఇవ్వలేదు కొంపగడవటం కష్టంగా ఉంది. ఒక రోజు ఆయనకు స్వామి భూతనారాయన గుడి దగ్గర కనిపించగా చెప్పులు వదిలేసి నమస్కరించగా ఒక చెప్పు తీసి ఆయన నెత్తి మీద బలంగా కొట్టారు. మాస్టారి ప్రాణాలు విలవిలలాడినాయ్. అంతా మనమంచికోసమే అనుకొని బడికి వెళ్ళగా టేబుల్ పై ఒక కవరు ఉంటె తీసుకొని చదవటానికి గడగడ లాడి ధైర్యం తెచ్చుకొని ఎలాగో అలా తెరిచి చదివితే తనను అదే స్కూల్ హెడ్ మాస్టర్ గా ప్రమోట్ చేసి ఇచ్చిన ఆర్డర్ అది. స్వామి తనకు చేసిన పాద రక్షా పూజ ఫలితమే ఈప్రమోషన్ అనుకొన్నాడు.

ఐరావతంయ్యర్ వేలూరి స్కూల్ మాస్టర్. శ్రీ విద్యా దీక్ష పొందాలనే కోరిక ఉండేది. ఒకసారి రమణ మహర్షిని, గణపతి మునినీ దర్శించి కోరిక చెప్పుకొందామని తిరువన్నామలై వచ్చి అయ్యర్ హోటల్ లో కాఫీ తాగుతుంటే అకస్మాత్తుగా శేషాద్రి స్వామి వచ్చి, అక్కడి అలమరులోని రెండుమూడు మిఠాయిలు ముక్కలు చేసి, ఒకముక్క నోట్లో వేసుకొని మిగిలినవి ఐరావతంయ్యర్ చేతిలో పెట్టారు. అక్కడే సాగిలపడి నమస్కరించాడు అయ్యర్. తర్వాత గణపతి ముని ఇంటికి వెళ్లి, ఆయనకు పాదాభి వందనం చేసి లేవగా "నీకు దశ పంచాక్షరి ఉపదేశిస్తా. చాలా మేలు కలుగుతుంది "అని ఉపదేశించగా, అదంతా స్వామి మహిమ అని గ్రహించి ఇంటికి చేరేసరికి జీతం పెరిగిన వార్త కూడా తెలిసింది.

ఒక వైష్ణవ పోలీస్ ఇన్స్పెక్టర్ కు స్వామిపై అమితభక్తి. అతడు ఒకరోజు ఎవర్నో బెత్తం తో కొడుతుంటే స్వామి వెళ్లి బెత్తం లాగి ఆయన్నే నాలుగు పీకారు. తప్పు చేశానేమో అని భయపడి దూరంగా వెళ్లి నిలబడ్డాడు. కొద్దిరోజుల్లో ఆ ఇన్స్పెక్టర్ కు మైసూర్ సంస్థానం లో ఉన్నత పదవి లభించింది.

ఉద్యోగం పోయిన సబ్ మేజిస్ట్రేట్, పై అదికారుఅలకు అప్పీల్ చేసి స్వామి దర్సనానికి రాగా, ఏడు రోజులదాకా స్వామి కనిపిచలేదు. ఎనిమిదవ రోజున స్వామి శివగంగ తీర్ధం లో ఉండగా దర్శించగా తన ఉత్తరీయం నీటిలో ముంచి ఆయన తలపై పిండారు. ఆయనే స్వామి అని పక్కనున్నవారు చెప్పేదాకా ఆయను తెలియలేదు. రెడురోజుల్లో ఆయన అప్పీల్ ను విచారించిన అధికారులు ఆయనకు మళ్ళీ ఉద్యోగం లో చేరే ఆర్డర్లు పంపారు.

సేలం లో పెద్ద న్యాయవాది బివి నరసింహస్వామి మద్రాస్ శాసన సభ మాజీ సభ్యుడు దేశ సేవ చేసినవాడు. ఆయనకొడుకులిద్దరూ ఆడుకొంటూ ఇంటివెనుక నూతిలోపడి చనిపోయారు. అప్పటినుంచి ఆయనకుజీవితం ఐ విరక్తికలిగి, రమణ మహర్షిని చూడాలని వెళ్లి అనుకోకుండా శేషాద్రి స్వామిని చూసి, మహర్షి జీవిత విశేషాలు సేకరించి జీవిత చరిత్ర రాశాడు. ఉత్తరదేశ తీర్ధ యాత్ర చేశాడు. సాయిబాబా భక్తినీ బోధనలనూ ప్రచారం చేశాడు. ఒక సారి స్వామిని దర్శించి చాలాసేపు ఇష్టాగోష్టి జరపాలనే కోరికను నారాయణ శాస్త్రి గారితో చెప్పగా "మీరు రామభక్తులు కదా రామనామ జపంచేస్తే మీ సంకల్పం నెర వేరుతుంది "అని సలహా ఇవ్వగా, ఒకసారి స్వామి దర్శనం కలిగగా స్వామి మాట్లాడకుండా "పూర్ణ భక్తి ఉంటె, అన్నీ సమకూర్తాయి "అని సౌజ్ఞలతో చెప్పారు.

తిరువన్నామలై తాలూకా బోర్డ్ ఆఫీస్ గుమాస్తా టివి సుబ్రహ్మణ్య అయ్యర్ దైవభక్తి పరాయణుడు నిత్యం గాయత్రి జపం చేస్తాడు. శేషాద్రి స్వామిపై పరమ భక్తీ స్వామికీ ఆయనపై అమిత వాత్సల్యం. తాలూకా బోర్డ్ ప్రెసిడెంట్ ఇంటి వాకిలి అరుగుపై కూర్చుని అయ్యరు లెక్కలు చూస్తుంతాడు. ఆయనకు కాశీ వెళ్లాలని ఉండేది. ప్రెసిడెంట్ సెలవు ఇచ్చేవాడు కాదు. బోర్డు డబ్బు నొక్కేసి సెలవు అడుగుతున్నాడనే అనుమానం కూడా. ఒకరోజు స్వామి అటుగా వస్తూ ప్రెసిడెంట్ కు వినబడేట్లు "ఒరేయ్ అరుగు మీద కూర్చున్నవాడు సాధు బ్రాహ్మణుడు

వాడికి అపకారం తలబెడితే నీ ఇంట్లో పీనుగు లేస్తుంది "అని వెళ్ళిపోయారు. ఆమాటలు విన్న ప్రెసిడెంట్ వణికి పోయి ఏడు రోజులు జ్వరం తో మంచం పట్టాడు. ఒకరోజు స్వామి అయ్యరు తో "వీడు నీకు ఏ ఉపకారం చెయ్యడు. కొత్త ఉద్యోగం వెతుక్కో. నీకు అపకారం చేస్తే వాడింట్లో శవం లేస్తుంది "అని వెళ్ళిపోయారు. కొన్ని రోజులకు అయ్యరు తిరుచినాపల్లి లో ఉద్యోగం లో స్థిరపడ్డాడు.

తిరువన్నామలై విద్వాంసుడు భానుకవి "యోగం- యోగి "అనే విషయం పై మాట్లాడాలనుకొన్నారు ఆయనకు ముందు ఇద్దరు మాట్లాడాలి. ఆ సభకు అధ్యక్షుడు చిదంబరం లోని మహామహోపాధ్యాయ దండ పాణి దీక్షితులు. ఆయన భానుకవి గురించి ప్రక్కవారితో 'ఈయనెవరో యోగం యోగి పై మాట్లాడతాట్ట ఒక్కటి చాలదా "అని గుసగుస లాడాడు. ఈ మాటలు విన్న భానుకవి ధైర్యం కోల్పోయి లేచి నిలిచి మాట్లాడే ప్రయత్నం చేశాడే కానీ మాట రావటం లేదు.

ఆయన పస అలాంటిది అనుకొన్నారు శ్రోతలు ఇంతలో స్వామి అక్కడికి వచ్చారు. హమ్మయ్య అనుకోని మనసులోనే స్వామి పాదాలకు నమస్కరించి ప్రసంగం ప్రారంభించి అమోఘం గా న భూతో గా మాట్లాడి అందర్నీ ఆశ్చర్య పరచాడు. ఆ విజయాన్ని స్వామికి అర్పిస్తున్నట్లు పాదాభి వందనం చేశాడు కవి.

పరశురామయ్యర్ కూతురు ప్రసవ వేదన పడుతోందని, దక్కేట్లు లేదనీ చివరి చూపులు చూడటానికి రమ్మని టెలిగ్రాం వస్తే ఆందోళన తో దాన్ని పట్టుకొని ఇలయనార్ కోవెలలో ఉన్న స్వామి సన్నిధికి చేరగా "పోపో భయం లేదు మీ ఆవిడను ఏడవవద్దని చెప్పు"అనగా మనసు కుదుటబడింది అయ్యరుకు. రెండు రోజులత ర్వాత అమ్మాయి కులాసా కబురు తెలిసింది..

కాంట్రాక్టర్ కృష్ణస్వామికి తిరుక్కోవిలూరులో కాంట్రాక్ట్ పని. మధురాంతకం వెళ్లి ఏదైనా పనిలో చేరాలని ఉండి,స్వామిని అడిగితే, "అంత దూరం అక్కర్లేదు ఇక్కడే పని చూసుకో "అన్నారు. కానీ ఆ మాటలు వినక రెండుమూడు చోట్లకు తిరిగి కుదరక మళ్ళీ వచ్చేశాడు "స్వానుభవం అయితే కాని తృప్తి ఉండదు "అన్నారట స్వామి. ఒకసారి కాంట్రాక్ట్ విషయం లో యేవో తప్పులు చూపి అతడిని దెబ్బతీయాలని ఉద్యోగులు భావిస్తే, అతడు వీధిలోనుంచి పోతుంటే "పోరా పో. ఆగకుండా పో "అన్నారు. సరైన సమయం లో వెళ్లి అధికారుల ప్రశ్నలకు సంతృప్తిగా సమాధానాలు చెప్పి కాంట్రాక్ట్ కాపాడుకొన్నాడు.

స్వామికి దగ్గర బంధువు కృష్ణస్వామి శాస్త్రులు మురుగన్ భక్తుడు ఒకసారి స్వామి దర్శనానికి వెడితే ఒళ్ళంతా విభూతిపూసి ముఖాన కుంకం పెట్టి "కాశీ రామేశ్వర యాత్రలు చేసిరా "అన్నారు. చేతిలో డబ్బు లేదని అంటే "అన్నీ సమకూర్తాయిలే వెళ్ళు "అన్నారు. ఇంటికి వెడుతూ దారిలో తెలిసినవాడికి చెబితే యాత్ర ఖర్చు అంతా తానే భరిస్తానని వందరూపాయలు చేతిలో పెట్టాడు. భార్యతో కలిసి యాత్ర పూర్తీ చేసి వచ్చిస్వామిని దర్శించగా "నీకు ఇక అంతా మంచే జరుగుతుంది సంతానం, ధన ప్రాప్తి కలుగుతుంది "అన్నారు. పిల్లలూ పుట్టారు, కొన్న లాటరీ టికెట్ కు డబ్బూ బాగా వచ్చింది.

ఒకరోజు స్వామి వీధిలో నడుస్తూ దారిలో ఉన్న రెండు రాళ్ళను తీసి రోడ్డు ప్రక్కపడేస్తే, ఒక కుర్రాడు ఒక రాయి తీయగా స్వామి వాడి చెంప చెళ్ళు మనిపిస్తేవాడు "స్వామీ ఈ ఏడు నేను పాసవుతానా ?"అని అడిగితె నవ్వి తప్పకుండా అన్నారట. వాడు చదువులో మొండి అన్నిట్లో సున్నామార్కులే. కానీ వాడి ఆర్ధిక స్థితి చూసి పరీక్షాదికారులు ప్రమోట్ చేశారు.

ఒక సారి స్వామి వేప చెట్టు కింద ఉండగా సూర్యనారాయణ అయ్యరు "మిమ్మల్ని మహనీయులు అంటారు. మీ మహిమ నాకు చూపించండిస్వామీ "అని అడిగితె కిందరాలిన వేపాకు రేమ్మను తీసి తినమన్నారు. దాన్ని నమిల్తే మహా తియ్యగా ఉందట. ఇలా స్వామి మహిమలు కోకొల్లలు.

### స్వామి వైద్యమహిమలు

తాండ్ర గ్రామం లో కృష్ణస్వామి భార్యకు పాండురోగం. ఒళ్ళంతా వాచీ, వాంతులలో పురుగులు పడేవి. ఎంతమంది డాక్టర్లకు చూపించినా ఫలితం లేక గుర్రబ్బండీ లో స్వామి దగ్గరకు తీసుకు వెళ్ళగా "చూద్దాం "అని బండీ ఎక్కి ఆమె కాళ్ళు పొట్ట గొంతు నొక్కుతూ. ముందుకు జరిగి, సత్రం వరకు తానె బండీ తోలి, గబుక్కున దూకి రెండు దోసిళ్ళ మన్ను బండిలోకి విసిరి, పిడికెడు మన్ను ఆమె నోట్లో పోశారు. మరో రెండు పిడికిళ్ల మన్ను ఇచ్చి మూడురోజులు వరుసగా ఒంటికి పూసుకొమ్మన్నారు. నాల్గవరోజు ఆమె మామూలు మనిషి అయింది.

తిరువన్నామలై క్రిమినల్ ప్లీడర్ చంగల్వరాయుడు కొంతకాలానికి సన్యాసం తీసుకొన్నాడు ఆయన స్నేహితుడు శివ చిదంబరం పిళ్ళై కూతురికి టైఫాయిడ్. వైద్యులు పెదవి విరిస్తే రాయుడికి చెప్పుకోగా, ఇద్దరూకలిసి గుడిలో ఉన్న స్వామి దగ్గరకు వెళ్ళగా "నాకు చెబితే లాభం లేదు ఆ విగ్రహానికి విన్నవించుకో "అనగా రాయుడు ద్రావిడ భాషలోని వెంబా వృత్తం లో పద్యాలు మూడుసార్లు పఠించి,హారతి ఇచ్చి స్వామి దగ్గరకు రాగా "పోపో సాయంత్రం లోపు నయమౌతుంది "అనగా, ఆసాయంత్రమే ఆమెకు సన్నిపాతం తగ్గిపోయింది.

పిళ్ళై రెండవ కూతురికి వాంతులు విపరీతంగా అవుతుంటే స్వామి దగ్గరకు వస్తే ఉసిరికాయ మిరపకాయ కలిపి వాడితే తగ్గుతుందనగా మూడేళ్ళ పసిపాపకు ఇదెలా సాధ్యం అని అడిగితె భస్మం చేసి ఇమ్మంటే, ఇస్తే వెంటనే తగ్గిపోయింది.

చంగల్వ రాయుడు వాతంనొప్పుల తో బాధ పడుతు,నడవ లేకపోతుంటే, స్వామి కాళ్ళను తడిమి తగ్గి పోతుంది అని అభయమివ్వగా తగ్గి పోయాయి. గ్రామ మునసబు కృష్ణ మూర్తి పదేళ్లుగా గజ్జితో బాధపడుతూ,స్వామిని దర్శించాలని వచ్చి హోటల్ లో కాఫీ ఆర్డర్ ఇస్తే తెచ్చిటేబుల్ మీద పెడితే శేషాద్రిస్వామి అమాంతం వచ్చి నోట్లో పోసుకోగా కృష్ణమూర్తికి కోపం వచ్చినా తమాయించుకొన్నాడు."వీడికి గజ్జి కదా కుంకుమపువ్వు పూస్తే పోతుంది"అని వెళ్ళిపోయారు. ఆయనే స్వామి అని సర్వర్ చెప్పాడు. ఆయన గజ్జి దెబ్బతో తగ్గింది.

సుబ్రహ్మణ్య అయ్యర్ మరదలుకు పిశాచం పట్టి పదేళ్ళుగా బాధ పడుతుంటే, అన్ని రకాలమందులు వాడి,తీర్ధ యాత్రలు చేసినా తగ్గలేదు పిల్లలూ పుట్టలేదు. స్వామి దగ్గరకు తీసుకు వెడితే, అయిదారు పసుపు కొమ్ములు తెమ్మని, వాటిని తన ఛాతీకి రాసుకొని, వాటిగంధం తీసి ఆమె ఒంటికి పూయమన్నారు. ఆపిల్ల ఆకలి ఆకలి అని పెద్ద గావు కేకపెట్టింది. అన్నం పెట్టాక ఆమెస్మృతి లోకి వచ్చి, ఆతర్వాత ఆరోగ్యవంతురాలై సంతాన వతి కూడా అయింది.. రమణ భక్తురాలు ఎచ్చమ్మ రోజూ ఆయనకు ఆహారం పంపేది. ఒకసారి నెలరోజులు జ్వరం వచ్చి పంపలేకపోయింది. స్వామి తరచూ ఆమె ఇంటికి వెళ్ళేవారు ఒక నెలరోజులు స్వామి రాకపోతే ఆమె పెంపుడుకూతురు చెల్లమ్మ స్వామి దగ్గరకువెళ్ళివిషయం చెప్పి అమ్మ మిమ్మల్ని ఒకసారి రమ్మనమని చెప్పింది అంటే"రేపు వస్తాను" అని, మర్నాడు ఉదయమే ఆరింటికే ఆమె ఇంటికి వెళ్లి పడకగదిలో ఉన్న ఎచ్చమ్మతో "పెరుగన్నం తింటావా "అని చెల్లమ్మను పెరుగన్నం కలిపి తెమ్మని చెప్పి

ఆమె తీసుకురాగా, ఒక ముద్ద తాను తిని మిగిలింది ప్రసాదంగా ఎచ్చమ్మకిచ్చారు. ఆక్షణం నుంచే ఆమె జబ్బు నయమవటం మొదలైంది. ఒకసారి ఆమె మనవడికి కాలు బెణికి, ఆస్పత్రికి ఎత్తుకొని తీసుకు వెడుతుంటే, స్వామి దార్లో కనిపించి రెండు చేతుల్తోమన్ను తీసి వాడి కాలిపై పోసి, దానితో నుదుట బొట్టుపెట్టి "ఆస్పత్రికి పోతున్నావా ఫోఫో "అనగా ఆస్పత్రికి వెళ్ళగా డాక్టర్ వాడిని నడవమంటే ఏనొప్పీ లేకుండా హాయిగా నడిచి డాక్టర్ తో సహా అందరికీ ఆశ్చర్యం కలిగించాడు.

తాలూకా బోర్డ్ ప్రెసిడెంట్ వెంకట సుబ్బయ్య బామ్మర్దికి దేనిమీదా నమ్మకం లేదు. స్వామిపై భక్తీ గౌరవాలు అసలే లేవు. ఒక రోజు మధ్యాహ్నం అతనికి చేతిలో తెలుకుట్టింది. కుయ్యోమొర్రో అంటుంటే అటుగా వెడుతున్నస్వామి రాగా "అందరూ మిమ్మల్ని స్వామి అంటారు నాబాధ పోగొట్టండి చూదాం "అని చేతులు పట్టుకోగా, ఎడమ చేత్తో మట్టి తీసి కుట్టిన చోట పొయ్యమనగా పోస్తూ మంత్రం చెప్పండి అనగా "శేషాద్రి "అని నాపేరు చెప్పు చాలు అనగా, బాధ తగ్గి ఆతర్వాత స్వామిపై నమ్మకం కుదిరింది.

### స్వామి జ్ఞాన దృష్టి

నారాయణ శాస్త్రి గీతాపారాయణ చేస్తుంటే స్వామి వచ్చి "గీతా పారాయణకు ఏకాగ్రత అవసరం "అని చెప్పి వెళ్ళిపోయారు. తాను గీత చదువుతున్నట్లు ఆయనకేలా తెలిసిందో అని ఆశ్చర్యపడ్డాడు శాస్త్రి. ఒకసారి శాస్త్రి నాలుగుకానుల మల్లె పూలుకొని అరుణాచలేశ్వరునికి అమ్మవారికి రమణభగవాన్ కు అర్పించి మిగిలింది స్వామి కి ఇవ్వాలనుకొని వెతికితే స్వామికనిపించలేదు. ఆ ముగ్గురికే ఇచ్చేశాడు. సాయంత్రం స్వామి కనబడి "కాలణా పూలు అయితే ఏం భక్తీ ముఖ్యం "అన్నారు.

విద్యాగంధంలేనితిరుప్పుగల్ స్వామి సుబ్రహ్మణ్య భక్తుడు. తిరుప్పుగల్ పాడేవారు. ఆయన తిరువన్నామలై రాగా స్వామి "తిరుప్పుగలే మీకు మంత్రం "అన్నారు. "మీ పూర్వులలో కొందరు సన్యాసం తీసుకోన్నారటకదా "అని అడిగితే "శ్రాద్ధం పెట్టేటప్పుడు బ్రాహ్మీ మూర్తులైన అనే పదం వాడుతాము "అని ఆయన చెప్పగా "నువ్వూ వారిలాగా సన్యాసివి అయిపో "అన్నారు. ఆయన వల్లిమలైలో స్థిరపడి బాగా ప్రసిద్ధి చెందారు.

చిదంబరం లో సన్యాసం తీసుకొని చెంగల్వరాయుడు గురువుకోసం అన్వేషిస్తూ తిరువన్నామలై వచ్చి, ఉపవాసం తో సుబ్రహ్మణ్యేశ్వరాలయానికి వచ్చి ప్రార్థిస్తుంటే "నాయనా !మూడురోజులుగా నువ్వు భోజనం చేయలేదాఅని స్వామి సుబ్రహ్మణ్యేశ్వరుడి వద్దే ఉండిపో"అన్నారు. స్వమిలోనే మురుగన్ ను చూసుకొంటూ ఉండిపోయాడు.

సన్యాసం తీసుకొన్న న్యాయవాది చెంగల్వ రాయుడు. సుబ్బరామయ్య అనే పురోహితుని భార్య ఆత్మ హత్యా ప్రయత్నం లో ఉరిపోసుకొని చూరుకు వేలాడుతుంటే, చుట్టుప్రక్కల వారికి తెలిసి కాపాడారు పోలీసులు ఆమెపై అభియోగం తేగా ఆమె పక్షాన వాదించాడు. ఈ విషయాలన్నీ జ్ఞాపకం రాగా స్వామిదగ్గరకు వెళ్ళాడు "ఒకమ్మాయి ఉరేసుకొందికాని ఫలించలేదు ఉరిలో తగుల్కొన్నాక ఉరి అంటె ఏమిటో తెలిసి కేకలువేస్తే జనమూ పోలీసులూ రారా? ఈవిషయం రాయుడిని అడగండి చెబుతాడు "అన్నారు స్వామి తాను మనసులో అనుకొన్నది స్వామి గ్రహించారు అని తెలుసుకోగలిగాడు రాయుడు. చెంగల్వ చిన్నతనం లో పేరు అబ్బాయి రాయుడిని చూడగానే "నీది వాలాజపేట. నీ పేరు అబ్బాయి కదూ "అనగానే మరింత ఆశ్చర్యపోయాడు.

రాజు శాస్త్రి శిష్యులకు మాఘుని శిశుపాలవధ కావ్యం బోధిస్తుంటే "కాయమానము "అనే పదం వచ్చి దాని అర్థం చటుక్కున స్పురించలేదు దాని అర్థం గుడారం డేరా, శిబిరం. స్వామి అటుగా వెడుతుంటే శాస్త్రిగారు "గుడారానికి పర్యాయపదం ఉంటె చెప్పండి "అని అడిగితె రక్కున "కాయమానము "అని చెప్పి వెళ్ళిపోయారు తాను అనుకోన్నపదమే స్వామి చెప్పటం ఆశ్చర్యమేసింది.

పెరుమాళ్ళు స్వామి ఒక రోజుముల్లైపాల్ తీర్ధ గట్టు లో స్నానం చేసి విభూతి సంచీ డబ్బు అక్కడే పెట్టి మర్చిపోయి వచ్చాడు.దారిలో స్వామికనిపిస్తే "అంగడిలో భక్ష్యాలు కొనిస్తా రండి స్వామీ "అనగా "నీ దగ్గర డబ్బు ఎక్కడిది. మలై తీర్ధం పో "అనగా తాను అక్కడ సంచీ మరిచిపోయిన సంగతి గుర్తుకు వచ్చింది.

సేలం వాస్తవ్యుడు,వకీలు సుబ్రహ్మణ్య మొదలియార్ బంధువులతో స్వామి దర్శనానికి రాగా ఆయన కనపడకపోతే, నిరాశతో కంచికి వెళ్లి, మళ్ళీ వచ్చేటప్పుడు స్వామిని చూద్దాములే అనుకోని కారెక్కి కంచి వెళ్ళే సంబరం లో ఉంటె, స్వామి వచ్చి "ఈకారు కంచికి పోతుందా "అని అడుగగా, మొదలియారు బృందం కారుదిగి అమాంతం స్వామిపాదాలపై పడి నమస్కరించారు

టికె సుందరేశమయ్యరు చిన్నతనం లో ఏడోక్లాసుచదువుతూ అరుగుమీద కూర్చుని లెక్కలు చేసుకొంటుంటే స్వామి ఏమి చేస్తున్నావని అడిగితెఅవి లెక్కలు మీకు తెలీదులెండి అన్నాడు. స్వామి "అలాగా జవాబులు చెబుతా రాసుకో "అని అన్ని లెక్కలకు సరైన జవాబులు చెబితే, వాడు పుస్తకం చివర ఉన్న జవాబులతో సరి చూసుకొని కరెక్టే అని చెప్పాడు ఇలాస్వామికి లెక్కల పరీక్ష పెట్టాడాబాలుడు.ఈ సుందరశమే పెరిగిపెద్దవాడై "వర్ణాశ్రమ వ్యవస్థ భ్రష్టమౌతోంది ఎవరైనా అవతార పురుషుడు వచ్చి ఉద్ధరించాలి "అని తపన పడ్డాడు. స్వామి గుడికి వెడుతుంటే దారిలో కనిపించగా "నీ సందేహాలు నన్నడిగితే నేను చెబుతా. నువ్వు అనుకొనే సమిష్టికర్మ అంటే యజ్ఞం. అవతార పురుషుడు పుట్టటానికి ఇంకా చాలాకాలం ఉంది "అన్నారు.

ఒక పశువులకాపరి కొండ చరియలలో పశువులు మేపుతుంటే చిరుతపులిని చూసి పారిపోతుంటే రాతిపైనుంచి దూకగా మోకాలికి దెబ్బతగిలితే దారిలో శేషాద్రి స్వామి కనిపించి "పశువులను మేపేటప్పుడు జాగ్రత్త ఉండాలి. పులులు వస్తాయి. అయినా నిన్నేమీ చేయ్యవులే "అన్నారు. తనకుమార్తెకు వివాహం చేసిజి. నరసింహయ్యరు దంపతులకు శేషాద్రి స్వామి ఆశీస్సులకోసం బండీ లో తీసుకు వెడుతూ స్వామి తనకెదైనాఉపదేశం చేస్తే బాగుంటుంది అనుకొన్నాడు. స్వామి వెంటనే అరుణాచలస్వామి సేవ చేస్తూ ఉండు, ప్రతి మంగళవారం గిరి ప్రదక్షిణ చేయి "అనగా ఆశ్చర్యపోయాడు. అర్ధనారి అనే ఆయన తన అరుగుపై స్వామి కూర్చుని ఉంటె ఫోటో తీసి పూజలో పెట్టుకొంటె బాగుంటుంది అనుకోగా "నా ఫోటో వెంకటసుబ్బయ్య ఇంట్లో ఉంది. అడిగితె ఒక కాపీ ఇస్తాడు తెచ్చి పెట్టుకో"అన్నారు

రామభద్ర శర్మ సోదరికి పొరుగూరులో ప్రసవసమయం అయింది వెళ్ళాలా వద్దా అని మధన పడుతుంటే స్వామి "దిగులుపడకు ఈపాటికి ప్రసవం అయ్యే ఉంటుంది "అన్నారు. ఆశ్చర్య సంతోషాలుకలిగాయి శర్మకి. తిరు వేంకటేశ మొదలియార్ మానసికంగా పంచాక్షరి చేస్తుంటే స్వామి "ఇవాల్టి నుంచి పంచాక్షరి మానేసి రామనామ జపం చెయ్యి "అని ఆదేశించారు. పోస్ట్ మాస్టర్ జనరల్ ఎఫ్.టి.పీటర్స్ బావ రైల్వే స్టేషన్ మాస్టర్. ఒక పెద్ద స్టేషన్ లో ఒక గుజరాతీ వర్తకుడు రవాణా చేసిన సామాను పోయింది. స్టేషన్ మాస్టర్ అజాగ్రతే కారణమని కోర్టులో కేసుపేశాడు. దానికి పది వేలరూపాయలు కట్టాలి. తన కాండక్ట్ సర్టిఫికెట్లు ఆయన దాఖలు చేశాడు. అవి మధ్యలో తప్పిపోయి కోర్టుకు చేరలేదు. దీనితో స్టేషన్ మాస్టర్ పై అనుమానం బలమైపోయింది. విషయం పీటర్స్ కు తెలిసి దిక్కు తోచక తననౌకర్నిపంపి కేసు ఏమైందో కనుక్కోమని పంపించి, స్వామి దగ్గరకు వెళ్లి "కేసు ఏమౌతుందిస్వామీ "అని అడిగితె నవ్వుతూ స్వామి "బస్ బస్ బస్ గప్ గప్ గప్ కూకూ "అని "ఎలాపోయిందో అలాగే దొరికింది "అని వెళ్ళిపోయారు. ఈవిషయం పీటర్స్ కు టెలిగ్రాం ఇస్తే, తప్పి పోయిన రికార్డులు అన్నీ దొరికి నట్లు పీటర్స్ కు టెలిగ్రాం వచ్చింది. కేసు కొట్టేశారు.

జిల్లాజడ్జి సుందరేశ అయ్యర్ యుక్తవయసు వచ్చిన కూతురికి వరాన్వేషణ చేస్తున్నాడు. తిరుపత్తూరులో సీతారామయ్య అనే ధనవంతుడికి ఒక కొడుకున్నాడు. అతనికివ్వాలని అయ్యరు భావించి పెళ్ళిచూపులకు ఆహ్వానించగా వచ్చి చూసి పిల్ల పెద్దగా ఉందేమో అని అనుమానించి కొంత వాదులాడుకొన్నారు. ఇంతలో స్వామి అక్కడకు రాగా అందరూ నమస్కరించగా అయ్యరుతో "మీ అమ్మాయిని వీరింటికి నిరభ్యంతరంగా పంపచ్చు "అన్నారు. ఆమాటలుశిరో ధార్యంగా భావించాడు సీతారామయ్య..

ముత్తుసామి మొదలియార్ భార్య తాయమ్మ షష్టి వ్రతాలు చేసేది. ఒకరోజు ఇలిమనాక గుడికి పాలు పళ్ళు తీసుకు వెడుతుంటే స్వామి కనబడి "నేనే సుబ్రహ్మణ్య స్వామిని నాకే ఇవ్వు" అని తీసుకొని పూలను నెత్తికి చుట్టుకొని పళ్ళను పిల్లలకు పంచారు. పాలుసగం తాగి మిగిలినవి ప్రసాదంగా ఇచ్చారు. కలియుగం లో సుబ్రహ్మణ్యస్వామి ప్రత్యక్ష దైవంగా ప్రతీతి. ఆమె అదృష్టమే అదృష్టం. కాని అవి ఎంగిలిపాలు అని ఆమె తీసుకోటానికి ఇష్టపడలేదు. ఆపాత్రను వాడకుండా ఒక మూల ఉంచిందికూడా. మర్నాడు గుడికి వెడితే స్వామి "పో గాడిదా నీకు మడి ఎక్కువకదా.పాలుపారబోసి పాత్రకూడా అవతల పెట్టేశావు ఛీఛీ ఫో ఫో "అన్నారు. ఆరునెలలదాకా ఆమెతో మాట్లాడలేదు. ఆతర్వాత ప్రసన్నులయ్యారు.

స్వామి అతీంద్రియ శక్తులు

సుబ్రహ్మణ్య అయ్యరు బంధువు కొడుకు ఇల్లు వదిలి వెళ్ళగా వాడు తిరువన్నామలై వెళ్ళాడని కనిపిస్తే తనదగ్గరకు పంపమని అయ్యరుకు ఉత్తరం రాశాడు. వెతికి వాడినిపట్టుకుని అయ్యరు స్వామి దగ్గరకు తీసుకు వెళ్ళగా "వీడి తండ్రి వీడిని వెంటనే పంపమని నీకు రాస్తే, ఇంకా నీదగ్గరే వాణ్ని ఎందుకు ఉంచావు""అని అడిగితే అయ్యరు అవాక్కయ్యాడు. శ్రీమంతుడు శ్రీరంగం సుందరం పిళ్ళై, పెళ్లికాగానే భార్యతో తిరువన్నామలై వచ్చి కొన్ని రోజులున్నాడు ఆమె నగలపై ఆశపడ్డ నౌకరు దొంగిలించి ఇంటి వెనుక మురికి కాలువ కింద రహస్యంగా దాచాడు. ఏం చేయాలో తోచక నౌకరుతో సహా పిళ్ళై స్వామిని దర్శించగా " "దొంగవెధవా. సిగ్గులేదా మురుగుకాల్వ కిందపెట్టిన నగలన్నీ ఒక్కటికూడా వదిలి పెట్టకుండా తెచ్చివ్వు "అన్నారు ఆదొంగ నౌకరుతో. పోలీసులు అవన్నీ స్వాధీనం చేసుకొని ఇచ్చేశారు. ఈ సంఘటన జరగటానికి ముందు వాడు ఎప్పుడుకనిపించినా "చేతికి బంగారుమురుగులు వేళ్ళకు ఉంగరాలు పెట్టుకొంటావా ""అని అడిగేవారు వాడికి అర్ధంయ్యేదికాదు.

తిరువన్నామలైదగ్గర గ్రామం శీలై పందిల్ లో ఉన్న జగదీశయ్యర్ ఇంటిపూజారి దీక్షితులు అంటే గురుభావం. కానీ దీక్షితులు అయ్యరు ఇంట్లోని ఎనిమిది సవరుల నగ దొంగిలించి, గ్రామ దేవత ఆవరణలో దాచాడు. ఇంట్లో అంతా నగకోసం వెదికికి నిరాశపడ్డారు. అయ్యరుఒకసారి గుర్రబ్బండీ లో తిరువన్నామలై వచ్చి,తిరిగి వెడుతుంటే స్వామికనిపించి "నేనుకూడా రావచ్చా ""అని అడిగితె మహద్భాగ్యం అని ఎక్కించు కాగా దారిలో అయ్యరు తనింట జరిగిన నగ దొంగతనం చెప్పగా"అందుకే నేను వస్తున్నా "అన్నారు. శీలై పందిల్ చేరగానే "మీ ఇంట్లోనే దొంగ ఉన్నాడు. నీకు కుక్క ఉందిగా. నేను వెడతా "అనగా ఆరుమైళ్ళదూరం నడవలేరు అని ఎంత చెప్పినా వినక విసవిసా నడిచిస్వామి వెళ్ళిపోయారు. ఊరివారువచ్చి దీక్షితులవాలకం అనుమానంగా ఉంది అని అయ్యరుకు చెప్పగా, దీక్షితుల్ని పిలిపించి తీవ్రంగా మందలించగా తప్పు ఒప్పుకొని నగ తెచ్చిచ్చి కాళ్ళమీద పడ్డాడు.

అలమేలు ప్రసవించి ఖాయిలాగా ఉంటె స్వామి వచ్చి ఆమె మంచం ప్రక్క కూర్చుని ఆమె చెయ్యి తాకారు భయపడి కేకేసిందామె. ఆమె అన్న నరసింహారావు వచ్చి స్వామిని దూషించాడు. స్వామి మారుమాట్లాడకుండా వెళ్ళిపోయారు. మర్నాడు ఎచ్చమ్మవచ్చి స్వామిని అలమేలుకు నయమౌతుందా అని అడిగితె "ఆమె చనిపోయిందని అందరూ చెప్పుకొంటున్నారే "అన్నారట ఆరోజు రాత్రే ఆమె చనిపోయింది.

స్వామి శిష్యుడు ముత్తుస్వామి మొదలియారు దాయాది ఆయనపైదావా వేశాడు. స్వామికి నివేదిస్తే "భయం లేదు వాడికి అనుకూలం కాదు "అన్నారు. అన్నట్లే కేసు గెలిచాడు ముత్తుస్వామి. దాయాది హైకోర్ట్ కు వెళ్లగా స్వామికి చెబితే "ఆ కేసు ఎప్పుడో తోసేశారయ్యా నీకేమీ భయం లేదు "అన్నారు అక్కడా ఈయనదే జయం. శివ ప్రకాశమొదలియార్ ను చూసి ఇకరోజు స్వామి "పెద్ద మంట అంటుకొన్నది "అనగా ఆయనకు అర్ధం కాలేదు. మర్నాడు ఆయన కూతురు చనిపోయినట్లు వార్త వచ్చింది. పదిరోజులతర్వాత వచ్చిన ఆయన్ను స్వామి "ఏ వస్తువూ మన సొంతంఅనుకోటానికి వీల్లేదు "అన్నారు.

శ్యామా రావు తల్లి వృద్ధు. అనారోగ్యం కూడా. ఒకసారి శేషాద్రి స్వామిని 'అమ్మ వెళ్ళి పోతుందా ?అని ఆదుర్దాగా అడిగితే "తిరువన్నామలై కి టికెట్ తీశావు ఇదే తిరువన్నామలై "అంటే అర్ధం కాలేదనగా స్వామి మౌనం వహించారు ఆసాయంత్రమే ఆమె చనిపోయింది. ఇప్పుడు అర్ధమైందా అన్నారట స్వామి. సుందరేశయ్యారు వెలగల రుద్రాక్షమాల ధరించి స్వామిని దర్శించి నమస్కరిస్తే, "ఈమాలను అమ్మితే నలుగురికి అన్నం పెట్టచ్చే"అన్నారు "ఇది అంత విలువైంది కాదు రెండుమూడు రూపాయలకంటే ఉండదు 'అన్నాడు. ఆతర్వాతాయన తిరుచునాపల్లి వెళ్లి నదిలో స్నానం చేస్తుంటే మాల జారిపోయింది నీటిలో. దాసీ కన్నమ్మాల్ ను ఒకసారి స్వామి "దొంగరాబోతున్నాడు దొంగతనం జరుగుతుంది జాగ్రత్త "అని హెచ్చరించ గా ఎన్ని జాగ్రత్తలు తీసుకొన్నా రెండువందల రూపాయల నగలు పోయాయి. మంగుళూరు రఘునాధరావు రామభక్తుడు. ఒకసారి స్వామిని దర్శించటానికి వస్తే, ఒకపెద్ద రాయి తీసుకొని వెంటపడగా "ఇదేమిటి సేతు బంధనమా, సముద్ర లంఘనమా ??"అన్నాడు. రాయి దూరంగా పారేసి 'పోరాపో కోతీ"అన్నారు స్వామి. ఆ రోజునుంచి ఆయన్ను హనుమంతరావు మారుతి అనే పేర్లతో పిలిచేవారు. ఆయనకు హనుమపై భక్తిపెరిగింది.

పోస్టాఫీసు గుమాస్తా రామారావు తమ్ముడు తిరుపతిలో సంస్కృతం చదువుతున్నాడు. ఒకసారి అతడిని స్వామి దగ్గరకు తీసుకు వెడితే, "వీడు ఆరు నెలలలో పోతాడు "అన్నారు. అలాగే చనిపోయాడుపాపం. నటేశయ్యరు ను చూసి స్వామి "నీకు నామాలున్నవాడు పుడతాడు "అన్నారు. కొన్ని నెలలకు నల్లటి రక్తం ప్రవహించే నాళంతో కొడుకుపుట్టాడు. వైదిక నిష్టాపరుడు రామశాస్త్రి రామభక్తుడు.స్వామి అతనికి ఒక కొడుకు పుడతాడని, లలితను వదలక పారాయణ చేయి "అని చెప్పారు. అలాగే స్వామి జన్మ నక్షత్రం హస్తానక్షత్రం లో కొడుకుపుట్టగా శాస్త్రి శేషాద్రి పేరుపెట్టాడు. అప్పాచెట్టి అరుణాచలేశ్వరుని రధం చేయించి, స్వామిని ఊరేగింపులో కలుసుకోమని కోరగా "స్వామి దీని ఆయుర్దాయం తక్కువే లక్ష్మీ శాపం ఉంది స్వాహా అవుతుంది "అన్నారు. మూడేళ్ళ తర్వాత పిడుగుపడి ఆ రధం కాలి పోయింది. కాలే రధాన్ని చూపించి "చూడు రధం ఎలాకాలిపోతోందో లక్ష్మీ శాపం "అన్నారట, మెయ్యప్ప చెట్టి అరుణాచలేశ్వర ఆలయం లో ఎలెక్ట్రిక్ దీపాలు ఏర్పాటు చేయించి ప్రారంభించటానికి స్వామిని కోరితే "పోపో చక్రం తిరగదు "అన్నారు. దిగులుతో గుడికి వెడితే చక్రం తిప్పలేక పనివాళ్ళు కష్టపడుతున్నారు స్వామి దయ లేకపోతే కుదరదని గ్రహించి వెళ్లి బతిమాలి రమ్మనగా వెళ్లి చక్రాన్ని తడిమి సాష్టాంగ పడగా వెంటనే పని చేయటం ప్రారంభించింది. నారాయణ శాస్త్రిగారితో స్వామి ఒకసారి "ఏకేదాస్మిన్ కులే జాతా "అనే శ్లోకం చదివి "నువ్వు సంతకు వెళ్ళావా ?నూరు తమ్ముళ్ళు అక్కడా నూరు ఇక్కడా నూరు.ఈ దేశం లో వంద మందిజనం అంతా కలిపితే ఎంత ? "అన్నారు ఆయనకు అర్ధం కాలేదు. నాలుగు నెలలతర్వాత శాస్త్రిసోదరుడు చని పోయాడు. నూరు తమ్ముళ్ళు అంటే ఆచనిపోయివాడు నీకు ఇష్టమైన తమ్ముడు అని భావం. సంతకు పోతావా అంటే చావుకు జనం బాగా వస్తారని. నూరు మాట చాలా సార్లు వాడటానికి అర్ధం "లోకం లోని వారంతా సహోదరులే "అని.

ఒకసారి నారయణ శాస్త్రి భార్యతో శేషాద్రి స్వామిని దర్శించగా "మీ ఇద్దర్నీ కలిసి చూడాలని నేను అనుకొంటే, నన్ను తోసేస్తున్నారే "? అనగా అర్ధం కాకపోతే "నువ్వు మళ్ళీ పెళ్లి చేసుకో బోతున్నావా?" అని శాస్త్రిని అడిగారు. ఇది జరిగిన మూడు నెలలకే శాస్త్రి భార్య చనిపోయింది. కుమారపిల్లై కి పెళ్లి అయి పదేళ్ళయినా సంతులేదు. భార్యగతిస్తే రెండోపెళ్ళి చేసుకొన్నాడు. ఈమె కూడా ఏడాదికే చనిపోయింది. మూడోపెళ్ళి ప్రయత్నం లో ఉండి,పోలూరు తిరుక్కోవిలై లలో ఉన్న పిల్లల్ని చూసొచ్చాడు. పోలూరు అమ్మాయి అందం డబ్బున్నమ్మాయి. రెండో అమ్మాయి బీద అంతఅందం లేదు. ఎవర్ని చేసుకోవాలో తెలీకస్వామినే అడిగాడు "తిరుక్కోవిల్ కాకినే చేసుకో అదే నిన్ను కాపాడుతుంది పోలూరు పిల్లను చేసుకొంటే ఎవరో దాన్ని ఎత్తుకుపోతారు "అన్నారు. అలానే చేసి సుఖంగా కాపురం చేశాడు. వెంకట సుబ్బయ్య ఇంటిలో స్వామి ఉన్నప్పుడు పుదుచ్చేరి నుంచి ఒక కుష్టు రోగిని తెచ్చి స్వామిని మందు చెప్పమని కోరితే "శ్వాన గంధి"సేవిస్తే తగ్గుతుందన్నారు. సుబ్బయ్యర్ వనమూలికల పుస్తకం తిర గేస్తే కాశీ దగ్గర దొరుకు తుందిఅని తెలియగా స్వామి "అది తెప్పించి వేసుకొన్నా సగమే నయమౌతుంది. మిగిలినసగం అనుభవించాల్సిందే అతడు కర్మి "అన్నారు. "కంచి వదిలి తిరువన్నామలై లో స్థిరపడిన మీకు ఆ వనమూలిక కాశీలో దొరుకుతుందని ఎలా తెలుసు "? అని అడిగితె జవాబివ్వలేదు స్వామి.

సేలం పోలీస్ డిపార్ట్మెంట్ ఉద్యోగి శేషాద్రి అయ్యర్ స్వామిని మొదటిసారిగా దర్శించగా "నువ్వూ శేషాద్రివే నేనూ శేషాద్రినే.నువ్వు రామ నామ జపం ఎందుకు చేయరాదు ?"అనగా ఆరోజు నుంచి చేశాడు. శంకరానందస్వామి శేషాద్రి స్వామి దగ్గరకు వచ్చి "ఈవూర్లో చెట్టియారు కాశీ యాత్రికులకు అన్న సదుపాయం చేస్తారట. నాకు పదిరోజులకు చీటీలు ఇప్పించండి "అని అడిగితె "ఇప్పుడే చెట్టి రైలు దిగి ఇంటికి వెడుతున్నాడు వెళ్లి అడిగితె ఇస్తాడు "అనగా, దోవలోనే చెట్టి బండీలో కనపడగా ఏకంగా ఒక సంవత్సర కాలానికి ఆస్వామికి అన్నివసతులతో భోజన సౌకర్యం కలిగించాడు. తిరు వెంకట మొదలియార్ బంధువులింట్లో పెళ్లి కెళ్ళి అక్కడి వారు ఇవ్వగా మూడు లడ్డూలు తెచ్చి అలమర లో పెట్టాడు. ఇంతలో స్వామివచ్చి లడ్డు ఇమ్మనగా, ఏదిచ్చినా తుంచి పారేస్యటమేగా అని ఒక్క లడ్డూ ఇవ్వగా "మిగిలిన రెండూ ??""అనగా తెచ్చివ్వగా వాటిని యధాప్రకారం ముక్కలు చేసి వెదజల్లారు స్వామి.

కొండమీద ఉన్న సాధువుకు భక్తులు మైసూరుపాక్ చేయించి ఇస్తే దాన్ని ఒకమూల దాచిఉంచితే, ఒకరోజు పెద్దవానలోస్వామి ఆగుహకు వెళ్లి సాధువుతో "మీకూ మైసూర్ పాక్ ఇష్టమా నాకు చాలా ఇష్టం "అనగా ఆశ్చర్యంతో కొన్నిపాకులు తెచ్చి స్వామికిచ్చాడు సాధువు. జయరామ మొదలికి స్వామి అంటే మహా

భక్తీ. ఆతిధ్యమివ్వాలని అనుకొనేవాడు. ఒక చంద్ర గ్రహణం నాడు గ్రహణం వదిచిన తర్వాత భక్తులు స్వామికి అనేకరకాల పదార్ధాలు తెచ్చి తిమని బలవంతం చేశారు. మొదలి అక్కడకురాగానే "కొంచెం అన్నం, చారు, కందిపచ్చడి "తీసుకొని రమ్మని చెప్పగా ఇంటికి వెళ్లి భార్యతో చేయిద్దామనుకోగా ఆమె అవే చేసి సిద్ధంగా ఉంచితే పరమాశ్చర్యపడి, తీసుకు వెళ్లి స్వామికి నైవేద్యం పెట్టాడు అతని భార్య ఒకరోజు ఒకలోటాపాలు తెచ్చి స్వామికి నైవేద్యం పెట్టగా "ఇంటికి వెళ్ళద్దు ఇంట్లో పాము ఉంది కరుస్తుంది "అన్నారు. భయం తో అక్కడే చతికిలబడింది. కాసేపయ్యాక"పామును చంపేశారు హాయిగా వెళ్ళు "అని పంపించారుస్వామి. ఇంటికి వెడితే, చచ్చి పడి ఉన్న పాముకనిపించింది.

ఒకరోజు స్వామి జయరామమొదలితో "ఒక మామిడి పండు ఉంటె బాగుండునే "అనగా "ఇది సీజన్ కాదు దొరకదు. పాలు తెస్తాను తాగండి "అనగా "పండు తిన్నాక పాలుతాగితే బహు పసందు గా ఉంటుంది. వెళ్లి వెతుకు దొరక్కపోదు "అనగా. పండ్ల దుకాణాలన్నీ తిరిగాడు. ఒకే ఒకచోట ఒక్కటే మామిడిపండు దొరికింది. దాన్నికొని, పాలతో సహా తెచ్చి స్వామికిచ్చాడు. ఒకసారి స్వామి నడివీధిలొ పదేపదే సాష్టాంగ నమస్కారాలు చేస్తుంటే, అర్ధం కాక అడిగితె "కంచిలో ఏకామ్రనాథుడు రధం ఎక్కుతున్నాడు. మీరూ దారాళంగాస్వామిని సేవించవచ్చు "అన్నారు.

మాణిక్యస్వామిని చూసినప్పుడల్లాస్వామి "నిద్రపోకు యముడు పట్టుకు పోతాడు "అనేవారు. ఒకరోజు రాత్రి తొమ్మిదికే తిన్నె మీద కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు మాణిక్యం.కాసేపట్లో కలలో యమదూతలు దున్న పోతుపై ఎక్కిన యముడిని అనుసరిస్తూ రావటం, వాడినిపట్టుకో వీడినిపట్టుకో అని ఆజ్ఞలివ్వటం, తనదగ్గరకువచ్చి "ఈసోమరినీ బంధించండి" అనటం జరిగింది. అదేసమయంలో స్వామికనిపించగా "రక్షించండి "అని వేడుకోగా భయపడవద్దని వెన్ను తట్టారట. వెంటనే మెలకువ వచ్చింది. మాణిక్యం ఇంటికి వచ్చి అరుగుమీద కూర్చుని ఉంటె స్వామి అటుగా వెడుతూ "యమదూతలు భయంకరంగా ఉన్నారా పట్టుకు పోతామన్నారా ?నిద్రపోవద్దుంటే విన్నావుకాదు "అనగా "బుద్ధి వచ్చింది స్వామీ "అని లెంపలేసుకొన్నాడు. ఆరోజు రాత్రి 12 వరకు భయంతో నిద్రపోలేదు.. అర్ధరాత్రయింది నిద్రపో "అనిస్వామి అంటే "నిద్రపోను "అంటే "స్వామి నవ్వుతూ" రోజు నిద్రపోయేముందు నన్ను తలచుకొని విభూతిపెట్టుకో.యముడు నీ జోలికి రాడు "అనిచెప్పారు స్వామి.

చెంగల్వరాయుడికి గణపతిపై మహా భక్తీ. స్వామివద్ద రోజు చాలాసేపు గడిపేవాడు. ఒకరోజు ఇలయనార్ గుడికి వెళ్ళిపడుకోగా కలలో పెద్ద ఏనుగు, దానికి తాటిచెట్టంత తొండం, ప్రక్కన ఒక స్త్రీ. "కనిపిస్తే గణపతి స్వయంగా దర్శనమిచ్చాడని సంతోషించి, కలలో నుంచి మేల్కొన్నాక ఆనందం పట్టలేక, నిద్రపోవటానికి మనస్కరించక కాలం గడిపి పొద్దున్నేలేచి కాలకృత్యాలు తీర్చుకొని స్వామి వద్దకు వెళ్ళగా "నువ్వు చూసిన ఏనుగు బ్రహ్మాండంగా ఉందికదూ. తొండం తాటి చెట్టంత. దాని ప్రభావం తెలుసా?"అణో రణీయాన్ మహతో మహాన్తాన్ "అనగా స్వామికి తనకల విషయం ఎలా తెలిసిందో ఎంత ఆలోచించినా అర్ధం కాలేదు.

సబ్ రిజిస్ట్రార్ సుందరేశం చెట్టియార్ కున్న ఇద్దరమ్మాయిలు జానకి, పార్వతి లకు పెళ్ళికాలేదు స్వామిని దర్శిస్తూ ఉండేవారు. ఒకరోజు జానకికి కలలో తానూ పార్వతీ శివగంగలో స్నానం చేస్తుంటె స్వామి వచ్చి పార్వతిని గట్టుపైకి లాగారట. ఇద్దరూ కలిసి ఇంటికి వస్తుంటే దారిలో ఒకపెద్ద తొండ జానకిని తరిమింది. స్వామివచ్చి దాన్ని తోలేసి జానకి భయం పోగొట్టారట. తెల్లారాక జానకి తనకల ను పార్వతికి చెబితే, ఇద్దరూ కలిసి స్వామిని చూడటానికి వెడితే "శివగంగ తీర్ధం చాలాలోతుఅని జాగ్రత్త అని పార్వతిని మందలించలేదా?దాన్ని పట్టుకొన్న యముడు తొండరూపం లో నిన్నుపట్టుకు పోవాలనుకొన్నాడు. ఫరవాలేదు ఇకమీదట భయం ఉండదు "అన్నారు స్వామి.

చిన్న గురుకులు తల్లీ, కళ్ళులేని అత్తగారు వృద్ధులే. తల్లికి జబ్బు రేపోమాపో అన్నట్లుగా ఉంది. తల్లిమీనమ్మ అత్తగారు సవర్ణాంబ బుజం పై వాలి ఉంటె మీనమ్మ హాయిగా చనిపోయింది. కళ్ళులేని సవర్ణ రెండుమూడుగంటలు ఆశవాన్ని అట్లాగే మోసింది. మీనమ్మ చనిపోయే సమయం లో స్వామి "అదిగో మీనమ్మ స్వర్గానికి పోతోంది "అన్నారు. ఈవార్త చిన్నగురుకులు విని ఇంటికి వెళ్ళగా అత్తగారిబుజం పై వాలి చనిపోయిన తల్లిని చూశాడు.

తిరువన్నామలై దగ్గర ఊరిలో విరోబాస్వామి సిద్ధిపొందారు. స్వామి బజార్లోపోతూ "అదో విరోబాస్వామి పోతున్నాడే జోరుగా పోతున్నాడే "అన్నారు. అప్పుడుకానీ ఆస్వామి చనిపోయినట్లు ఎవరికీ తెలీదు. తిరువన్నామలై లో ఎండలు ఎక్కువ వానలు తక్కువ నీటికి కరువు. ఒకసారి వర్షాభావం ఎక్కువైతే జనం స్వామికి బాధలు వివరించగా "ఆకాశం నిర్మలంగా ఉంది. వర్షం వస్తుందిలే "అన్నారు. పదినిముషాలలో కుంభవృష్టి మూడు గంటలు దంచేసి బాధలన్నీ పోగొట్టింది.

నారాయణస్వామి 1921 లో తిరుచ్చి నుంచి తిరువన్నామలై వచ్చి శేషాద్రిస్వామిని దర్శించి కొంతకాలం అక్కడే ఉన్నాడు. ఒకరోజు భాగవతం చదువుతుంటే తటాలున స్వామి వచ్చి భాగవతం తెరిచి చూడకుండా ఫలానా శ్లోకం చదువు అన్నారు. అది దశమ స్కంధం పంచమాధ్యాయం లో "నందస్యాత్మజ ఉత్పన్నే "అనే సంప్రదాయంగా ఉపదేశించే మొదటి శ్లోకం. స్వామి తనకు ఉపదేశమిచ్చారని నారాయణస్వామి సంతోషించాడు. తెచ్చుకొన్న డబ్బు అయిపోగా ట్రిచి కి టికెట్ కు కూడాడబ్బులేదు. ఏం చెయ్యాలో తోచక స్టేషన్ కు వెళ్ళాడు. అక్కడ పరిచయం లేని ఒకపెద్దమనిషి విల్లిపురానికి టికెట్ కొనిచ్చాడు. అక్కడినుంచి టికెట్ లేకుండా ప్రయాణం చేస్తున్నాడు. అంతాదిగిపోయారు స్వామీ ఇచ్చిన కొబ్బరికాయ, తనభాగవతం ఉంచిన సంచీనిఎవరొ దొంగిలించారు. బాధపడుతూ ఉర్చున్నాడు. ఇంతలో రుద్రాక్షలు విభూతి ధరించిన గొప్ప వర్చస్సుతో ఉన్న సాధువు, పెట్టెలో చాలా సీట్లు ఉన్నా శాస్త్రిపక్కనే వచ్చి కూర్చుని "ఎందుకు దుఖిస్తావ్. చిదంబర నటరాజును దర్శిస్తే ఎంతటి విచారమైనా పోతుంది "అన్నాడు. తన సంగతిసాదువుతో చెప్పుకొన్నాడు "అనుగ్రహం భాగవతం లో ఉందా కొబ్బరికాయలో ఉందా. అది కంటికి తెలీదు స్వామి అనుగ్రహం మీకు ఉంటె అది ఉండనే ఉంటుంది. ఎక్కడికీ పోదు "అని తరవాత స్టేషన్ లో దిగిపోయాడు సాధువు. స్వామే వచ్చి ఓదార్చారు అనుకొన్నాడు. చిదంబరం లో దిగి నటరాజస్వామిని దర్శించి ఆతాండవ శివుని చూస్తూ మధురానుభూతి పొందాడు శాస్త్రి.

వెంకటాచలమొదలి, సుబ్బలక్ష్మి దంపతులైన వారింటికి శేషాద్రి స్వామి ఒక రోజు వెళ్లి, ఇంటివెనక ఉన్న నాలుగైదు చెట్లను చూపించి సుబ్బలక్ష్మి తో "ఒక వేడుక చూపిస్తా చూడు "అన్నారు. క్షణం లో వందలాదిచిలకలుగోరువంకలు కాకులు నానా జాతిపక్షులు చెట్లపై వాలాయి "ఇవి తమపిల్లల్ని చూసుకోవటానికి పోవా ??"అని అమాయకంగా ప్రశ్నిస్తే "అలానా సరే "అని పై ఉత్తరీయం నుంచి ఒక నూలుపోగుతీసి విసిరి ఫోఫో అన్నారు. క్షణం లో వెళ్ళిపోయాయి. సుందరేశం భార్య కనబడినప్పుడల్లాస్వామి "యమపురి చూశావా ??"అని అడిగేవారు. ఆమెకు చనిపోతాననిదిగులుపెరిగింది. మరోసారి వెళ్ళినా, స్వామి అదే ప్రశ్నవేస్తే, "చూడలేదు స్వామీ "అంటే "చూపిస్తా చూస్తావా ?"అని ఆమె ఎడమ చేయిపయ్యికొని, తన నోరు తెరచి చూడమన్నారు. స్వామి నోట్లో ఆమెకు ఘోరనరకం, వికృతాకారులు రోదనలు వొడలు జలదరించే దృశ్యాలు కనిపించాయి. మూర్ఛపోయింది అయిదునిమిషాలకు కానీ స్మృతిరాలేదు. స్వామి తన ఉత్తరీయం తో ఆమె ముఖం పై విసురుతున్నారు.నెమ్మదిగాతెరుకొని ఇంటికి వెళ్లి అందరికీ చెబితే ఆశ్చర్యపోయారు. కొన్నాళ్ళకు మద్రాస్ లో జరిగే పెళ్లి శుభలేఖ వస్తే స్వామి పర్మిషన్ కోసం రాగా "వెళ్ళవద్దు "అన్నారు కానీ, ఆమె బంధువులతోమాటవస్తుందని మద్రాస్ వెళ్ళింది. వెళ్ళిన మర్నాడే అక్కడ కలరా తగిలి చనిపోయింది, రాబోయేమరణాన్ని స్వామి ఆనాడు సూచించారన్నమాట.

వేంకటాచల మొదలిఒక సారి మద్రాస్ వెళ్లాల్సివచ్చి అసలే దొంగలభయంగా ఉందని స్వామినికలిసి చెప్పి ఒంటరిగా ఇంట్లో ఉన్న తనభార్య క్షేమసమాచారాలు చూడమని కోరగా సరేనన్నారు. ఒకరోజు రాత్రి సుబ్బలక్ష్మితో "రేపురాత్రి మీ పక్కింట్లో దొంగతనం జరుగుతుంది నీకు భయం లేదు నేను మీ అరుగుమీద పడుకొని ఉంటాను "అన్నారు. పక్కింటాయన ఇంట్లో ఉన్న బంగారం కరిగించి కడ్డీలామార్చి తలకింద పెట్టుకొన్నాడు. ఇది తెలిసిన మరోఆయన దాన్ని తస్కరించాడు. ఆయన లబోదిబో మంటుంటే స్వామి సుబ్బలక్ష్మిని పిల్చి దొంగ వచ్చిపోయాడు నీకు భయం లేదన్నారు. మర్నాడు రాత్రి పదకొండు గంటలకు స్వామి సుబ్బ లక్ష్మి ఇంటికి వచ్చి ఇంట్లో వారంతా భక్తితో స్వామిని ప్రశ్నిస్తుంటే సమాధానాలు చెబుతూ ఆమెను "నీకు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను అమ్మవార్ని ఇంద్రాది దేవతల్నీ చూపిస్తా పడుకో "అనగా ఆమె పడుకుంటే ఆమె గుండెపై కుడి చేయి వేసి "ఇప్పుడు చూడు "అనగా, ఆమెకుమగత వచ్చి శంఖధ్వానాలు మంగళారవాలు అమృతతప్రవాహం విద్యుత్ కాంతులు రసమయ గోళాలు, వాటిమధ్య తెల్ల ఏనుగు దానిపై సుందరాకారుడు, రుద్రుడు పార్వతి, విష్ణువు "చూడు అనగా ఇక చూడలేక మూర్ఛ పోయింది "నీకు చూసే భాగ్యం లేదు కర్మ క్షయం కాలేదు గురకపెట్టి నిద్రపో "అన్నారు. ఆమెకు నిద్రపట్టలేదు ఆదివ్య దర్శనం తో ఆమె చూపు పోయింది, తడుముకొని నడవాల్సి వచ్చింది.మర్నాడు ఉదయం 11గంటలకు స్వామివచ్చి "భయం లేదు నీ చూపు మళ్ళీ వస్తుంది "అని తన ఉత్తరీయం తో ఆమె కళ్ళు తుడవగా ఆమెకు చూపువచ్చింది.

శ్రీ విద్యోపాసకులలో ప్రసిద్ధులైన ఎన్. సుబ్రహ్మణ్యయ్యర్ ఉపాసనా రహస్యాలపై శ్రీనగర విమర్శ, గురుతత్వ విమర్శ వంటి చాలా పుస్తకాలు రాశారు.మంత్ర శాస్త్ర విశారదుడుకూడా. గొప్పకర్మిష్టి. స్వామిపై అమితభక్తి. ఒకసారి స్వామిని దర్శించగా "రేపు ఇలయనార్ కోవెలకు రా "అన్నారు. బ్రాహ్మీ ముహూర్తం లోస్వామి ఆ ఆలయానికి వెళ్లగా అయ్యరూ రాగా స్వామి ఆయనకు పరాశక్తి రూపం లో దర్శనమిచ్చారు. అయ్యరు పరమానంద భరితుడవగా స్వామి ఆయనకు ఏదో ఉపదేశం కూడా చేశారు.

స్వామి బంధువు నటేశ అయ్యర్ కొడుక్కి విషజ్వరం మసూచీ తో బాధ పడుతు.కళ్ళు కూడా పోతే,ఎన్నివైద్యాలు చేసినా నయంకాకపోతే స్వామికి చెబితే "వాడిని తెచ్చి ఇక్కడే వదిలి వెళ్ళు"అనగా అలాగే చేస్తానంటే "నా దగ్గరకు అంటే అమ్మవారి సన్నిధిలో "అనగా, అలాగే చేయగా స్వామి పూజార్లకు చెప్పగా వారు రాత్రిపూజాదికాలుకాగానే వాడిని అమ్మవారి గర్భగుడిలో ఉంచి గుడికి తాళం వేసి వెళ్ళారు. మర్నాడువచ్చి తలుపులు తీస్తే,కుర్రాడి కళ్ళు జ్యోతుల్లా కాంతులీనుతూ చక్కగా ఉన్నాయి. ఈ అద్భుతాన్ని అందరూ చాలారోజులు చెప్పుకొన్నారు.

పదహారేళ్ళ వెంకటరామన్ కు రోజు సంధ్యావార్చగానే అమ్మవారి గుడికి వెళ్లి దర్శనం చేసే అలవాటు. ఒకరోజు గర్భాలయం వద్ద స్వామి కనిపించి "ఎక్కడికి "'అంటే "అమ్మవారి దర్శనం కోసం "అంటే "ఇక్కడే దర్శనం చేస్తావా ??"అని అడిగితె "మీరు చూపగలిగితే"అనగా, స్వామి వాడికి అడ్డంగా నుల్చోని "ఇప్పుడు చూడు "అనగా వాడి మనో నేత్రాల ముందు అమ్మవారు "ఆపీత కుచాంబ "దివ్య దర్శనమిచ్చింది. "అమ్మవారి చీర రంగేమిటి అనిఅడిగితే "పసుపు "అనగా. కరమాల?"అంటే "మల్లెమాల "అనగా "ఆభరణాలో "అని అడిగితె " శిరసుపై కిరీటం, ఒడిలో వడ్డాణం, కాళ్ళకు గొలుసులు "అన్నాడు. "ఇక లోపలి వెళ్లి చూడు "అనగా లోపలి వెళ్లి అమ్మవారిని చూస్తె తాను బయట ఎలా ఉన్నఅమ్మవారిని చూశాడో సరిగ్గా లోపల అమ్మవారు అలాగే ఉంది. ఈ అనుభవాని గర్వంగా అందరికీ చెప్పుకొన్నాడు.

మధురలో ఒక సౌరాష్ట్ర కుటుంబానికి పిల్లల్లేరు. అమ్మవారు మీనాక్షీ దేవిపై వారికి అమితభక్తి. ఆమెతో మొరపెట్టుకొంటే తిరువన్నామలై వెళ్లి శేషాద్రి స్వామిని దర్శించమని చెప్పింది. మర్నాడు అక్కడికి చేరి స్వామికి నమస్కరిస్తే "మిమ్మల్ని మీనాక్షీ దేవి పంపిందా?"అంటే వాళ్ళు ఆశ్చర్యపోగా, దగ్గరకు పిల్చి ఇద్దరి కొంగులనుకలిపి ముడి వేసి " వెళ్లి రండి "అనగా నాలుగు అడుగులు వేయగానే స్వామి కొంగుముళ్ళు విప్పి "మీ కోరిక నెరవేరి పుత్రప్రాప్తి కలుగుతుంది "అని దీవించి పంపగా, సంవత్సరం తిరిగేనాటికి వారికి పండం టిమగపిల్లాడుపుట్టగా "శేషాద్రి "పేరు పెట్టుకొన్నారు. స్వామికీ, పరదేవతకు అభేదమే అని మనం అర్ధం చేసుకోవాలి. కవికులగురువు కాళిదాస మహాకవి అందుకే "దయమాన దీర్ఘ నయనాం -దేశిక రూపేణ దర్శితాభ్యుదయాం "అన్నాడు. అమ్మ గుణ నిధిమాత్రమే కాదు, గురుమూర్తికూడా.




## మహా సమాధి

శేషాద్రిస్వామి 40ఏ ళ్ళు తిరువన్నామలై లో గడిపారు. మనసు కైవల్యం మీదకు మళ్ళింది ఈ విషయం చూచాయగా సుబ్బలక్ష్మమ్మకు చెప్పాలనుకొన్నారు. "నిన్ను ఒకటి అడుగుతా ఖచ్చితంగా చెప్పు. నువ్వు చెప్పినట్లే చేస్తా. జనం తొందరపడుతున్నారు. ఇప్పుడున్నట్లే ఉండనా లేక కొత్త కుటీరం నిర్మించుకొని వెళ్లి పోనా ?".ఆమెకు స్వామిప్ర ప్రశ్నలోని మర్మం తెలియక "మీకు పైన ఉన్న అగ్నేస్త్రం జారిపోతేనే తెలీదు. దీనికి తోడూ ఇంకో కుటీరమా ?ఉన్నచోటే యోగాభ్యాసం చేయండి ""అంది. ఆయన వదలలేదు కనపడినప్పుడల్లా ఇదే ప్రశ్న వేసేవారు. ఒకసారి విసిగిపోయి "'కొత్తకుటీరం పై అంతమోజు ఉంటె అలాగే కట్టుకొని యోగం చెయ్యండి "అన్నది. "నా మనసులో కూడా ఇదే ఉంది నువ్వు కూడా చెప్పావుకనుక అలానే చేస్తా "అని నవ్వుకుంటూ వెళ్ళిపోయారు. ఆమె ఆజ్ఞ ఆయనకు పరమేశ్వరి ఆజ్ఞ..

కొన్నాళ్ళకు పోరుగూరివారు వచ్చి స్వామికి అభిషేకం చేయాలనుకొని కేశసంస్కారం చేయించి అభి షేకానికి సిద్ధపడగా "నాకు స్నానం వద్దు జ్వరం రావచ్చు "అన్నారు. వాళ్ళు మూఢం గా వందలాది పన్నీరు బుడ్లు ఆయన శిరస్సుపై కుమ్మరించి అనేక బిందెలతో బావి నీరు తెచ్చి శివలింగానికి చేసినట్లు అభిషేకం చేశారు. ఊళ్ళో వాళ్ళూ రెచ్చిపోయారు. అభిషేకం పూర్తయ్యేసరికి బావిలో చుక్క నీరు లేదు. స్వామి వొళ్ళు తుడిచి విభూతిరాసి ఫోటో కూడా తీశారు.

ఆరోజు సాయంత్రమే స్వామికి జ్వరం తగిలింది. నలభై రోజులు జ్వరం తోబాధపడ్డారు. ఎంత జ్వరమైనా దిన చర్యలో మార్పు లేదు. చిక్కి శల్యమయ్యారు. జ్వరం తట్టుకోలేక, చిన్న గురుక్కులు అరుగుమీద పడిపోయారు. అతడు సేవ చేయటం ప్రారంభించాడు. ఊరిజనాలకు తెలిసి తండోపతండాలు గా చేరారు. తిరువన్నామలైలో జరిగే "కృత్తి కొత్సవానికి" మించిన జనం వచ్చారు స్వామిని చూడటానికి. వైద్యం చేయిస్తామంటే వద్దన్నారు. ఆహారమూ తీసుకోలేదు. నరసింహస్వామి నారాయణ శాస్త్రి ఉత్తరం రాసి స్వామి విషయం తెలియబర్చాడు. శాస్త్రి వెంటనే వచ్చివాలాడు. ఆయన్ను చూడగానే స్వామి కళ్ళు తెరవగా ఒక నారింజపండు స్వామికి సమర్పించగా, దాన్ని వలిచి, అందులో ఒక్కతొన మాత్రం చిదిపి వాసన చూశారు. వానచినుకులు, తడిగాలి. గురుకులు శాలువా తెచ్చి స్వామికి కప్పాడు. లేచి ఆశాలువతోనే స్వామి ఆలయానికి తూలుతూ వెళ్ళగా వెంట శాస్త్రి, మాణిక్యం వెంటనడిచారు పడిపోకుండా పట్టుకొంటూ. దారిలో ఒకగుంటలో వాననీరు నిలిచిఉంటె ఆమోకాలిలోతు నీటిలో కూర్చున్నారు. జనం పెరిగారు. భరించలేక గుంటలోనే పడుకొన్నారు. రాత్రి ఎనిమిదికి అందరూ స్వామి వారికి దూరం గా జరిగి నిలిచారు. మాణిక్యం వెళ్ళిపోయాడు. స్వామివద్ద శాస్త్రి ఒక్కడే ఉన్నాడు. తెల్లవారుజామున మూడుకు గుంటనుంచి బయటకు వచ్చి ఆ తడి గుడ్డలతో గురుకులు ఇంటికి నడిచి వెళ్లి, అలాగే పడుకొన్నారు. నరసింహస్వామిని సుందరకాండ పారాయణ చేయసాగాడు. స్వామి స్థితిలో మార్పు లేదు. సుబ్బలక్ష్మి రాగా "చూశావా ?"అనగా అప్పటికి ఆమె కు లైట్ వెలిగి "నేను చెప్పిన కుటీరం, యోగాభ్యాసం ఇది కాదు స్వామీ "అని వలవల ఏడ్చింది.

అది విభవ సంవత్సర మార్గశీర్ష మాసం. స్వామి జనన కాలం లో గురు శని శుక్రులు మేష వృశ్చిక కుంభరాసుల్లో ఉన్న సమయాన్ని తనకైవల్య ముహూర్తంగా స్వామి నిర్ణయించుకొని, శుక్రవారం అదే రాశులలో పద్మాసనం లో కూర్చున్నారు. అరుణాచల ఆది దంపతులను మనస్సులో నింపుకొని, ఆనంద స్ఫురణతో, రోమాంచితులై, భ్రువ మధ్యమం లో ప్రాణాన్ని ఆవేశింపజేసి, సనాతన, విశ్వ నియంత, జ్యోతిర్మయుడు, సర్వ పోషకుడైన పరమేశ్వరుని విభూతిలో తన ప్రాణవాయువులను కలిపేశారు. స్వామిలేని అరుణాచలం రాముడులేని అయోధ్య అయింది.

### శేషాద్రి స్వామి ఉపదేశామృతం

స్వామి ఉత్తమాధికారులకు ఉపదేశ దీక్ష నిచ్చేవారు. విఘ్నోప శాంతికి "శుక్లాంబరధరం "శ్లోకం మూడు సార్లు చదవాలి. ఈశ్వరుడు ఎవరో తెలుసుకొంటే శరీరం తానుగా మారుతుంది. ప్రమాదమే మృత్యువని సనత్సుజాతీయం చెప్పింది. దేహాత్మ బుద్ధిని వదలటమే మృత్యుంజయం.మన నవద్వారపురి లంక జ్ఞానాగ్ని తోనే దగ్ధమౌతుంది. రామాయణం చదవటం అంటే రాముని గుణాలు ఆచరించ టమే. గురువే శివస్వరూపం, శివుడే గురువు. జాతిభేదం మాతృభోగం వదిలితే సమాధి సిద్ధి. అగస్త్యమహర్షి సంబోధించిన "రామరామ మహా భాగో "అంటే చాలు మోక్షమే. సుందరకాండ జ్ఞానప్రదాత. రాముడు సర్వవ్యాపి కనుక ఆయన నామ స్మరణ చేయాలి. పాపాలు తొలగటానికి భారతం చదవాలి.

శ్రీరంగని సేవించినా, హరికథ చెప్పినా మోక్షమే. శివ, శక్తులు ఒకరికొకరు విడిచి ఉండనట్లు, విభూతికి, కుంకుమకు భేదం లేదు.. శ్రీకృష్ణ కర్ణామృతం, లలితా సహస్రనామం, శివ సహస్రనామం తప్పితే వేరే లోకం లేదు. చిత్తవృత్తి నిరోధమే రాక్షస సంహారం. కామ నాశనానికి, ఇంద్రియ విజయానికీ అద్వైత దృష్టి అవసరం. సత్యం శాంతం సహనం మన పరిజనం, మన పరివారం ఆత్మ బంధువులు. ఈగలాగా శుద్ధం, చీమలాగా బలం,కుక్కలాగా విశ్వాసం, రతీ దేవిలాగా ప్రేమా ఉన్నవాడికి గురుభక్తి సులభం. వేగిన గింజ మొలకెత్తనట్లు ఈశ్వర ప్రీతిగా చేసే కర్మలు బంధకాలుకావు.

పనసపండు తొనలాగా ఏశ్వరుడినిఆరాధించాలి. దానితొన బీజాన్ని ఆవరించి ఉంటుంది. ఈశ్వరుడు జగత్తుకు బీజం. ఆ బీజం లోంచి వచ్చిన జగత్తు ఈశ్వరుణ్ణి ఆవరించి ఉంటుంది. పనస తొనలోని గింజను తీసేసి దాన్ని తిన్నట్లుగానే, పంచకోశ నిరాకరణం చేసి ఆత్మాను సంధానం చేయాలి. ఆత్మ బోధ ఉపనిషత్ ఓంకార ప్రశస్తిని, అష్టాక్షరిమహిమను చెప్పింది. దీన్ని అనుష్టిస్తే హృదయేశు డైనవాసుదేవ దర్శనం లభిస్తుంది. మహాభక్తుడైన గుహుడు గంగలోపడి మునిగిపోవటం అంటే దేహధ్యాసను వదిలేయటమే.

"అపసర్ప సర్ప భద్రం తే దూరం గచ్ఛమహాయశాః-జనమేజయస్య యజ్ఞాంతే ఆస్తీక వచనం స్మర"ఇదే పాముమంత్రం. భోజనం చేసే టప్పుడు ఎవడు నాలుకద్వారా రసాన్ని ఆస్వాదిస్తాడో వాడిని తెలుసుకొంటే చాలు. సాధ్యమైనతవరకు ప్రవృత్తి నుంచి తప్పుకొని నివృత్తి ని అనుసరించాలి. త్రిభువనజనని జ్ఞానగంగే ప్రవాహం. శరీరమే కాశి. భక్తి శ్రద్ధలే గయ.గురు చరణ ధ్యానయోగమే ప్రయాగ. తురీయుడైన విశ్వేశ్వరుడే ఆత్మా, సాక్షి. అన్నీ శరీరం లోనే ఉంటె వేరే తీర్ధాలు ఎందుకు ?

"కాశీ క్షేత్రం శరీరం, త్రిభువనజననీ వ్యాపినీ జ్ఞాన గంగా- భక్తి శ్రద్ధా గయేయం-నిజగురు చరణధ్యానయోగః ప్రయాగః-విశ్వేశోయం తురీయః సకలజన మనః – సాక్షీ భూతోంతరాత్మా దేహం స్వయం మదీయే యదివసతి –పునస్తీర్ధ మన్యత్కిమస్తి?"(శంకర భగవత్పాదులు ).

సమాప్తం

ఆధారం -మొదటి ఎపిసోడ్ లో రాసినట్లే –బ్రహ్మశ్రీ కులుమణి నారాయణ శాస్త్రి గారు తమిళం లో రాసిన" శ్రీ శేషాద్రి స్వామి వారి జీవిత చరిత్ర "కు శ్రీ విశాఖ గారు తెలుగు అనువాదం చేసి, తెనాలి సాధన గ్రంధ మండలి వారు ప్రచురించిన "శ్రీ శేషాద్రి స్వామి జీవితము."

## 7 నామ సంకీర్తనావతారపురుషుడు కుందుర్తి వేంకట నరసదాసుగారు

ఈ వ్యాసానికి శ్రీ పద్యాల సోదరులు రాసిన"శ్రీ కుందుర్తి వెంకట నరసయ్యగారి జీవితము " పుస్తకమే ఆధారం.

కలియుగం లో 5 వేల సంవత్సరాలు దాటాక భగవన్నామ సంకీర్తనకు, రూప భక్తి ప్రచారానికి ఎక్కువ అవసర మేర్పడింది. ఉత్తర భారతదేశం లో శ్రీ ప్రభుదత్త బ్రహ్మ చారి, శ్రీ హరేరాం బాబాజీ, శ్రీ సియా రఘునాధ శరణ గార్లను భగవంతుడు తన అంశతో జన్మింప జేసి, వారిద్వారా నామ సంకీర్తనా రూప భక్తి ప్రచారం చేయించాడు. ఆంధ్ర దేశం లో అలాంటి ప్రచారానికి శ్రీ కుందుర్తి నరస దాసు గారినీ, శ్రీ రఘువర దాసు గారినీ సృష్టించి ప్రచారం చేయించాడు విశ్వాత్మ. శ్రీ రఘువర దాసు పూర్వాశ్రమం లోనూ, సన్యాసాశ్రమం తీసుకొని శ్రీ అవదూతేంద్ర సరస్వతి పేరుతో ప్రసిద్ధి చెందారు.



శ్రీ కుందుర్తి నరసదాసుగారు భగవదంశ సంభూతులు, కారణ జన్ములు. పుట్టిన దగ్గర్నుంచి భగవన్నామ సంకీర్తన చేస్తూ, సంకీర్తనా మాధుర్యాన్ని రుచి చూసి, క్రమంగా నామ సంకీర్తనావతార పురుషులుగా మారారు. వీరికి ఆంధ్ర వాల్మీకి వాసుదాసు గారు అనే శ్రీ వావికొలను సుబ్బారావు గారు గురువులై రామమంత్ర ఉపదేశాన్ని పొంది, శ్రీరామ కోటి రాస్తూ, రామనామ సంకీర్తనలో పవిత్ర జీవితం గడుపుతూ ఉండేవారు. వాసుదాసుగారు వీరిని చూసి "లోక కల్యాణం కోసమే నీ మూర్తి అవతరించింది. కనుక రామనామ ప్రభావాన్ని ప్రచారం చేస్తూ తరించు "అని ఆశీర్వదించారు.

నరస దాసు గారు త్రివేణీ సంగమ జపమహాత్మ్యం విని, అక్కడికి వెళ్లి, మాఘమాసమంతా అక్కడే తపస్సు చేస్తూ రోజుకు 80వేల రామనామాన్నిజపిస్తూఉండగా ఫలితంగా ఒక మహా పురుషుడు ప్రత్యక్షమై, దాసుగారికి హస్తమస్తక సంయోగం తో "శ్రీరామ త్రయోదశాక్షర మంత్రం "ఉపదేశించి, నామ ప్రచారం తో ప్రజలను తరింప జేయమని ఆశీర్వదించి, అంతర్ధానమయ్యారు. తర్వాత దాసుగారు శ్రీరామ జన్మ క్షేత్రం అయోధ్యకు వెళ్లి, అక్కడ ఆమంత్రాన్ని అక్షర లక్షలుగా పునశ్చరణ చేయగా కనులు మూసుకొని ఉన్న సమయం లో శ్రీ రామ సాక్షాత్కారం లభించింది. కళ్ళు తెరువగానే అదృశ్యమై ఎదుట శ్రీ శియా రఘు నాద శరణ్ గారు దాసుగారియోగ్యతను గుర్తించి, శ్రీరామ పంచాయతన మంత్రాన్ని కూడా ఉపదేశించి "శ్రీరామ శరణ్"అనే దీక్షానామం ఇచ్చి ఆశీర్వదించారు. కాశీ వెళ్లి శివపంచాక్షరి, బృందావనం లో శ్రీ కృష్ణ మంత్రాలను పునశ్చరణ చేసి, ఆ దేవతలా అనుగ్రహం పొంది, శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి గారి ఆశీస్సులు పొంది ఆంధ్ర దేశానికి తిరిగి వచ్చారు నరస దాసుగారు.



ఆంధ్ర దేశం లో రామ నామ సంకీర్తనలు చేస్తూ చేయిస్తూ, రామనామం స్మరిస్తూ బియ్యాన్ని ఏరి, దానినే అన్నంగా తినేవారు. ఒక కోటి రామకోటి రాసి,కోటిన్నర రామ కోటితో రామజననం మొదలు పట్టాభి షేకం దాకా చిత్రాలను చిత్రించి, గుంటూరులోని శ్రీరామనామ క్షేత్రం లో ఆవిష్కరింప జేశారు. మొత్తం మీద 8కోట్ల రామనామం రాశారాయన. ఆయన నివసించిన బుద్దాం అనే గ్రామం లో రామమందిరాన్ని నిర్మించి, ప్రజలను రామభక్తులుగా మార్చి ఆగ్రామానికి "నామ ప్రయాగ "అనే కొత్త పేరు పెట్టారు. రామమందిర నిర్మాణానికి తనకున్న యావదాస్తి చేతిలో ఉన్న డబ్బు అంతా ఖర్చు చేశారు నరస దాసుగారు. ఇదికాకా చాల గ్రామాలలో రామమందిర నిర్మాణం చేశారు. చాలా గ్రంధాలు రాశారు. సకాల సంధ్యావందనం సహస్ర గాయత్రీ జపం,వైశ్వ దేవం మొదలైనవి వారికి నిత్య కృత్యం. శ్రీ శంకరుల అద్వైతాన్ని అధ్యయనం చేసి అందరికీ సుబోధకంగా బోధించారు. నిరాడంబర పవిత్ర జీవనం గడిపారు. ఎందరో నాస్తికులు వారి ప్రభావం తో ఆస్తికులయ్యారు. దాసుగారి జీవిత చరిత్రను వారి శిష్యులు శ్రీ పద్యాల సోదరులు వ్రాయగా శ్రీ గాయత్రీ పీఠాధిపులు శ్రీ శ్రీ విద్యాశంకర భారతీస్వామి వారు ఆశీర్వచనం పలుకగా, సర్వతంత్ర విశారద శ్రీ కుప్పా ఆంజనేయ శాస్త్రిగారు అభినందన వచనాలు రాశారు. ఇది 1986 డిసెంబర్ 26 న ముద్రణ పొందింది. ఇప్పుడు పూర్తి జీవిత విశేషాలు తెలుసుకొందాం.

### నరస దాసు గారి బాల్యం విద్యాభ్యాసం

గుంటూరు జిల్లా నరసరావు పేట, వినుకొండ లకు మధ్యలో కుందుర్తి అనే గ్రామం లో నరసదాసుగారు జన్మించారు. వీరి పూర్వీకులు లక్ష్మీ నరసయ్యగారు పాత గుంటూరు జమీందారు మానూరి వారి దగ్గర సముద్దారుగా చేశారు. ఉప్పుటూరు దగ్గర పెద్ద చెరుకూరులో నివాసం. ఆవంశం లో ఏడవ తరం వారు లక్ష్మీ నరసయ్యగారు. కొంతకాలాని కి పదవులు పోయాయి. కానీ చక్కని హాస్యప్రియులు అని శ్రీ కాశీనాధుని నాగేశ్వరావు, శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్య గారు చెప్పేవారు. వారే వీరికి "హాస్య కళాప్రపూర్ణ "బిరుదు నిచ్చారు. తిరుపతి కవులు వీరిపై శతకం చెప్పారు. వేంకటగిరి, పిఠాపురం, చల్లపల్లి బొబ్బిలి మొదలైన సంస్థానాలలోనూ, పుష్పగిరి పీఠాధిపతి శ్రీ నృసింహ భారతీ స్వామి సన్నిధానం లోనూ ఆయన హాస్యప్రసంగాలు చేసి ఘన సన్మానాలు పొందారు. వీరిసతీమణి సీతమ్మగారు. ఈ దంపతులకు 2-5-1905 విశ్వావసు చైత్ర బహుళ త్రయోదశి, రేవతీ నక్షత్రయుక్త మకర లగ్నం లో రాత్రి 10గంటలకు నరసదాసుగారు జన్మించారు.



ఒక రోజున తల్లి నీళ్ళు తేవటానికి బావి దగ్గరకు వెడితే చిన్నారి దాసు ఏడుపు లంకించు కొంటే ఒక భిక్షువు "రామా దయ చూడవే "అనే కీర్తన పాడగా ఏడుపు ఆపేశాడు. ఇంతలో తల్లి వస్తే, పాడటం ఆపేస్తే మళ్ళీ ఏడ్చాడు. పాటపాడితే మానేశాడు ఇలా చాలా సార్లు జరిగింది అప్పుడా భిక్షువు "అమ్మా నీ కొడుకు సంకీర్తన మిత్రుడు. నామగానం లో లీనమౌతున్నాడు. కొద్దికాలానికి రామభక్త రత్నం గా భాసిస్తాడు "అని చెప్పి దీవించి వెళ్లి పోయాడు. 5వ ఏడు నిండగానే తుర్లపాటి నరసింహం గారి తో అక్షరాభ్యాసం చేయించారు.

1910 లో చెరుకూరుకు నిమ్మగడ్డ రమణమ్మ గారింటికి నియమ నిష్టలున్న స్వాములవారొకరు వచ్చి ఒక జీర్ణ దేవాలయం లో వేదాంత ప్రవచనాలు చెప్పారు. ఆ గుడిని పునరుద్ధరించాలని స్వామి ఊరివారందర్నీ పిలిచి చెప్పారు.. ముందువరుసలో కూర్చున్న బాలనరసయ్యను "దేవుడు ఎక్కడ ఉన్నాడు ??"అని అడిగారు "ఆయన తడుముకోకుండా "దేవుడు గుడిలోనే కాదు. అన్ని చోట్లా ఉన్నాడు "అని చెప్పగా ఆశ్చర్యపోయారుస్వామి. ఆయన పులకించి అతడినిపిల్చి తన ఒడిలో కూర్చోపెట్టుకొని అందరితో "వీడు ప్రహ్లాదుడి లాగా లోకానికి ఆహ్లాదం కలిగిస్తాడు "అని మనస్పూర్తిగా ఆశీర్వదించారు. జనం అవాక్కై తమ ఊర్లో మరో భక్త రామదాసు జన్మించినందుకు గర్వపడ్డారు..

నరసదాసుగారు మూడవ తరగతి పూర్తి చేసి, ప్రైవేట్ గా ఇంగ్లీష్ చదివి, పొన్నూరు హైస్కూల్ లో 7వ తరగతిలో చేరి, రోజూ ఇంటినుంచి పొన్నూరు వెళ్ళిరావటం కొడుకు కు కష్టం అవుతుందని తండ్రి గారు కాపురం పొన్నూరులోనే పెట్టారు. ఆడుతూ పాడుతో తోటిపిల్లలతో బడికి వెళ్ళేవారు. తెలుగులో తప్ప అన్ని విషయాలలో మెరిక లాగా ఉండేవారు.అందుకని మిగిలిన విద్యార్ధులు ఆయనతో స్నేహం బాగా చేసేవారు. వారిలో బీడీ సిగరెట్ త్రాగే వారు కూడా ఉండేవారు.

ఆ చెడు సావాసం వలన ఒక రోజు సాయంత్రం బీడీ తాగుతూ గుప్పు గుప్పున పొగ బయటికి వదుల్తుంటే దీక్షితులు పంతులు గారు చూశారు. ఈయనకు ఆ సంగతి తెలియదు. మర్నాడు ఆయన నరసయ్యను తనగదిలోకి పిల్చి బీడీలు తాగుతున్నావా అని అడిగితె లేదని బొంక గా, నిన్న సాయంత్రం నువ్వు తాగుతుంటే చూశాను పైగా అబద్ధమూ ఆడావు అని రెండు పేముబెట్టాలతో ఒళ్ళంతా వాతలు తేలేట్లు,రక్తం కారేట్లు బెత్తాలు విరిగేట్లు కొట్టారు.. ఇంటికి వచ్చి ఎవరికీ చెప్పలేదు. నిద్రరాలేదు. ఆ రాత్రి దీక్షితులగారికీ నిద్రపట్టక మంచి కుర్రాడిని విచక్షణా రహితంగా కొట్టానే అని బాధ, మధన పడ్డారు. మర్నాడు స్కూలుకు వెళ్ళగానే నరసయ్యను పిలివగానే వెళ్లి తాను తప్పు చేశానని ఇక పొగ తాగనని, అబద్ధం ఆడనని ఒట్టు పెట్టారు. "మంచిది బాగా వృద్ది లోకి వస్తావు "అని దీవించారు. పంతులుగారు దీక్షితులుగారు.

అప్పుడప్పుడు కాఫీ హోటలుకు వెళ్ళే అలవాటు కూడా ఉండేది. ఆయన బంధువే ఒక హోటల్ ను మడీ, ఆచారాలతో నడిపేవాడు. బ్రాహ్మణులే అన్నీ తయారు చేసేవారు, సర్వర్లు కూడా బ్రాహ్మణులే. బ్రాహ్మణులే మడితో వచ్చి తినేవారు. నరసయ్యగారూ అప్పుడప్పుడు వెళ్లి తినేవారు. ఒకరోజు మధ్యాహ్నం నరసయ్యగారు ఆ హోటల్ వంటగదిలోకి వెళ్లి చూడగా, ఒక బ్రాహ్మణేతర స్త్రీ ఇడ్లీ పిండిరుబ్బటం కనబడి అవాక్కయ్యారు. ఆమె ఎవరని అక్కడి కుర్రాడిని అడిగితే "మా మేనేజరు గారి ఇలాకా. ఆమె రుబ్బిస్తే మేము మడితో ఇడ్లీ వేస్తాం "అని నిజం చెప్పాడు. పైన ఆచారం లోన దురాచారం ఉన్న ఆ హోటల్ ను చూసి అసహ్యమేసి, ఆ రోజునుంచి కాఫీ హోటల్ కు వెళ్ళటం కానీ అక్కడి పదార్ధాలు తినటం కానీ చేయనని భీష్మ ప్రతిజ్ఞ చేశారు. పశ్చాత్తాపానికి మించిన ప్రాయశ్చిత్తం లేదుకదా.

పొన్నూరులో లక్ష్మీ నరసయ్య గారు చావలి సుబ్బారాయుడు గారింట్లో అద్దెకు ఉండేవారు. రాయుడుగారింట్లో రాత్రి నిత్యభజన జరిగేది. భజనతర్వాత ప్రసాదం పంచేవారు. నరసయ్యగారుప్రసాదం సమయానికి వెళ్ళేవారు. ప్రసాదం మీద భక్తీ కాని అసలు భక్తి ఉండేదికాదు. క్రమంగా భజన పై ఆసక్తికలిగి సంకీర్తనలలో తాళం వేస్తూ పాల్గొనేవారు. ఆతర్వాత భక్తీ పెరిగింది. ఆ భజనల్లో పాతూరి రామయ్య శాస్త్రిగారు ప్రవచనం చేసేవారు సత్కాలక్షేపం మోక్షానికి దారి అని రోజు చెప్పేవారు అది నరసయ్యగారి మనసుపై గాఢ ముద్ర వేసింది. అప్పుడు కొల్లూరులో శ్రీ కృష్ణ జయంతి ప్రతిఏడాది జరిపేవారు. ఒకసారి తండ్రితో తానూ వెళ్ళారు. అక్కడ ములుకుట్ల లక్ష్మీ నారాయణ శాస్త్రి గారు శ్రీ కృష్ణ చరిత్ర అద్భుతంగా వివరించేవారు. బాలకృష్ణుని చిలిపి చేష్టలు నరసయ్యగారి మనసంతా ఆక్రమించాయి. ఆ తన్మయ స్థితో నరసయ్యగారు "లాలకు రారా గోపాల కృష్ణా –నీ వేలా చిక్కవునాకు "అనే కీర్తన శ్రీరాగం ఆదితాళం లో రాశారు. బాలకృష్ణునిపై తల్లి యశోదకున్న వాత్సల్యమంతా కళ్ళకు కట్టించారు. ఆ కీర్తనను ఇప్పటికీ అక్కడ గానం చేస్తూనే ఉన్నారు. ఆయన బంధువు గుంటూరు వెంకటప్పయ్య గారు "ఆంధ్రుడై పుట్టి ఆంధ్రాన్ని అర్ధం చేసుకోకపోతే అంధుడౌతాడు "అని నిత్యం చెప్పేమాటలు మనసుకు పట్టి, పొన్నూరు లైబ్రరీ లో వెంకట పార్వతీశ కవుల నవలలు చదివి, ఒక్క ఏడాదిలో తెలుగులో నిష్ణాతులై, అనేక వృత్తాలలో పద్యాలు రాశారు. అందులో వారు రాసిన "గోపాల కృష్ణ శతకం "ప్రసిద్ధి చెందింది. అందులోని రెండుపద్యాలు-

1-తే.గీ."శ్రీ రమామణి చిత్త చోర –భక్తజన మానసోద్యాన పారిజాత –రాధికాకుచ సరసిజ రాజహంస –వందనమిదే వేణు గోపాలకృష్ణ ""

2-ముక్తపద గ్రస్తం-"సరసతర వేష రత్న భూషా విశేష –శేష భూషణ హృత్సరసిజ నివాస –వాసవాది సురవినుత పాద పద్మ –పద్మ దళ నేత్ర వేణు గోపాల కృష్ణ

ఈ శతకమే కాక "నరసదాస కీర్తనలు "అనే మూడు భాగాలు కూడా రాశారు. భక్తీ మధురభావ విలసితాలు దాసుగారి రచనలు.

### సహాయ నిరాకరణ ఉద్యమం లోపాల్గొనటం

23-8-1920 లో మహాత్మా గాంధీ విజయవాడకు షౌకతాలీహో కలిసి వచ్చాడు. గాంధీని చూడాలని నరసయ్యగారు బెజవాడ వచ్చారు. గాంధీ ఉపన్యాసం ఆయన చెవులలో తేనే ఊటలు అనిపించాయి. గాంధీ పిలుపు అందుకొని సహాయ నిరాకరణ ఉద్యమం లో పాల్గొనగా నరసయ్యగారిని బడినుంచి వెళ్ళగొట్టారు. తర్వాత బందరులో ఆంధ్రజాతీయ కళాశాలలో చేరి, అక్కడ చిల్లరిగి శ్రీనివాసరావు, కోపల్లె హనుమంతరావు గార్లవద్ద సంస్కృతం, హిందీ కొద్దిగా నేర్చారు. దీనివలననే వారికి నామ ప్రచార దక్షత బాగా అలవడింది. అక్కడే పురాణ శాస్త్రాల ఉపన్యాసాలు,తులసీ దాసు రామ చరిత మానసం విని భక్తీ పులకాంకి తులయ్యారు. శ్రీ వెంకట శాస్త్రి గారి వద్ద కొద్దికాలం లో చిత్రలేఖనం కూడా నేర్చారు. రామనామంతో రామాయణం అంతాచిత్రాలుగా చిత్రించి కొత్త వరవడికి నాంది పలికారు. గుంటూరు రామనామ క్షేత్రం లో వీటిని ఇప్పుడూ చూడచ్చు. బందరులో ఉండగానే సంగీతం, వడ్రంగం, తివాచీ నేత, రాట్నం వడకటం అబ్బాయి. గాంధీ పద్ధతులు మహా ఇష్టంగా అలవాటు చేసుకొన్నారు.

దేశమంతా స్వాతంత్ర్య ఉద్యమం చాలా వేగంగా పాకిపోయింది. బందరులో పట్టాభి పద్యాలు గద్యాలతో దేశభక్తిని ప్రబోధించేవాడు. ఆప్రభావంతో నరసయ్యగారు ప్రతిపేట లో ఊరిలో స్వాతంత్రోద్యమ స్ఫూర్తి రగిలించేవారు. వారి ఉపన్యాసాలు వీనుల విందుగా మనసులకు హత్తుకొనేవి. పద్యాలతో పాటలతో జన్నాన్ని ఉర్రూత లూగించేవారు దాసు గారు. ఆ సమయంలో బాపట్ల తాలూకా పెదనందిపాడు లోపర్వత నేని వీరయ్య చౌదరి గారి నాయకత్వం లో సహాయ నిరాకరణ ఉద్యమం జరిగింది. ప్రజలు పన్నులు కట్టలేదు. రాత్రిళ్ళు నరసయ్యగారు పొన్నూరు నుంచి 10మైళ్ళ దూరం లో ఉన్న పెదనందిపాడుకు నడిచి వచ్చి, ప్రజలకు ప్రభుత్వ దమననీతి వివరించి మళ్ళీ తెల్లవారు జామున బయల్దేరి పొన్నూరు చేరేవారు. వాలంటీర్ పని చేసేవారు. ఉద్యమాన్ని అణచటానికి తెల్ల వారు మరఫిరంగులతో పొన్నూరుకు రాగా, కొందరు కాంగ్రెస్ వాలంటీర్లు భయపడి తమల్ని నాయకులు తప్పుదోవ తొక్కించారని, తమకు ఉద్యమంతో సంబంధం లేదని చెప్పి తప్పుకొన్నారు నరసయ్యగారు, ఆయన అనుచరుడు తూములూరి శివరామయ్య గార్లు చిన్నవారైనా ధైర్యంగా, ప్రాణత్యాగానికైనా సిద్ధపడి, ఖద్దరు టోపీలు పెట్టుకొని, చొక్కాలు విప్పేసి, ఆతెల్లదొరలకు ఆశ్చర్యం కలిగించారు, తెల్ల సైనికులతో నరసయ్యగారు "పవిత్ర భారత మాతను మీ లాంటి కుటిల దుర్మార్గ

పాలకులనుండి కాపాడటానికి ధర్మాన్ని కాపాడటానికి మేము వచ్చాం. మీ ఫిరంగులతో మా చాతీలపై కాల్చండి. మా తలలు తీసి మమ్మల్ని చంపండి. మా నియమానికి మీకు భయం దేనికి "?అని గట్టిగా చెప్పారు. తెల్లవారు తెల్లమొహాలు వేసి ఏమీ చేయలేక "మీ నిబ్బరానికి ముచ్చటపడి మిమ్మల్ని వదిలేస్తున్నాం. మీరు వెళ్లి పోవచ్చు "అన్నారు. అక్కడ చేరిన వారంతా "స్వతంత్ర భారత మాతకూ జై " అనే నినాదాలు మిన్ను ముత్తెట్టు పలికి వెళ్ళిపోయారు. అదీ నరసయ్యగారి దేశ భక్తీ, తెగువ, సాహసం, పట్టుదల, దీక్ష..

ఆతర్వాత టంగుటూరి ప్రకాశం పంతులు గారి ఆధ్వర్యం లో గుంటూరులో శాసనోల్లంఘన జరిగింది. నరసయ్యగారు కూడా పాల్గొని సత్యాగ్రహం చేశారు. అరెస్ట్ అయి జైలుకు కూడా వెళ్ళారు నరసయ్యగారు జైలు జీవితం ఆనందాన్ని కలిగించలేదు. మనసు భౌతికం నుంచి పారమార్ధికానికి చేరి ఆధ్యాత్మిక ప్రయాణం ప్రారంభించారు.



## ఆధ్యాత్మిక సాధన వైరాగ్య ప్రాప్తి

నరసయ్యగారి మనసు బుద్ధి ఆధ్యాత్మిక లగ్నంయ్యాయి. ఆయనకు సరైన సమయం లో ఉపనయన సంస్కారం చేశారు తలిదండ్రులు. నిత్య సంధ్యావందన గాయత్రీ జపానికి అవకాశ ఎక్కువ కల్పించారు. ఒక రోజు రాత్రి ఆయనకు ముక్తావిద్రుమ హేమ నీల ధవళ దేహం తో శ్రీసరస్వతీమాత సాక్షాత్కారం జరిగి "నీ నిష్టాగరిష్టాలు నాకు నచ్చాయి. నీజపదీక్ష నన్ను ఆకర్షించింది. "మంత్రాధీనం తు దైవం "అని మర్చిపోకు "అని చెప్పి అంతర్ధానమయింది. మేలుకొని తన జన్మం, మంత్రజపం సఫలమైందని ఆమెకు కృతజ్ఞతలు చెప్పి ఆమెతో మాట్లాడే అవకాశం కలిగించనందుకు బాధపడ్డారు. భక్తీ పెరిగింది కానీ ఆదాయం లేదు. భుక్తి గడవటం కష్టమైంది. స్థిర చరాస్తులు హారతి కర్పూరమయ్యాయి. ఇల్లులేదు తినటానికి తిండికూడా లేదు. ఊరిలో మర్యాదా మన్ననా తగ్గి పోయాయి. చిత్తం శ్రీకాంతు స్వాంతమైంది. భవబంధాలు తెంచుకొని వైరాగ్యం ద్వారా ఆనంద సామ్రాజ్యం అందుకోవాలని కోరిక గట్టి పడింది.

## వివాహం, ఉదర పోషణ

తండ్రిగారు తన కొడుకును ఆదర్శ కుటుంబిగా తీర్చి దిద్దాలనుకొని, నరసయ్య గారి మేనమామ కూతురుశేషాంబతో తన కొడుకుకు వివాహం జరిపించారు. ఆమె సద్గుణ గరిష్ట.. ఆదాంపత్యాన్ని లోకం బాగా మెచ్చింది. ముసలి తలిదండ్రులు పైగా కొత్త సంసారం. భారమంతా ఈ దంపతులపై పడగా, నరసయ్యగారు మద్రాస్ దగ్గర కమీషన్ వ్యాపారం చేసే షావుకారు దగ్గర గుమస్తాగా చేరారు. ఒకరోజు మరో కమీషన్ వ్యాపారి దాసుగారి దగ్గరకు వచ్చి అయిదువందల రూపాయలు ఇమ్మన్నాడు. డబ్బు ఉందికాని ఇచ్చే అధికారం తనకు లేదనీ యజమానినే అడిగి తీసుకోమని చెప్పారు. ఆయన యజమాని దగ్గరకు వెళ్లిజరిగింది చెప్పారు. అలా చెప్పటం తప్పు అన్నాడు యజమాని. లౌక్యం తెలీని దాసుగారు బాధ పడి,అక్కడ పని చేయలేక గుంటూరు తిరిగి వచ్చేశారు.

గుంటూరులో ప్లీడరు గుమాస్తాగా చేరి, ఇక్కడా అంతా అబద్ధం మీదే నడుస్తోందని గ్రహించారు ఇంతలో తెనాలిలో చతుర్భుజ దాసు అనే ఆయన జ్యోతిషాలయం స్థాపించి ముఖం చూసి జ్యోతిషం చెప్పి డబ్బు బాగా గడించాడు. ఆయనదగ్గర గుమాస్తాగా చేరారు. కావలి నెల్లూరులలో కూడా బ్రాంచులు పెట్టాడు. డబ్బు వ్యవహారం దాసుగారికే అప్పగించాడు. క్రమంగా అతడి శీలం మంచిదికాదనీ "పంచమకారాలపై "ఆయనకు వ్యామోహం ఎక్కువని గ్రహించి, శీలవంతుడు కాని వాడి వద్ద ఉద్యోగం చేయరాదని మానేశారు నరసయ్యగారు.

జమ్ములపాలెం లో పిల్లలకు ట్యూషన్ చెప్పారు. ట్రెయినింగ్ లేదుకనుక ప్రభుత్వ ఉద్యోగానికి అర్హత లేదు. వచ్చిన డబ్బు తోనే కుటుంబ పోషణ చేసేవారు. ఈ పాలెం లో మంచి భక్తులను చేరదీసి భజన సంఘం స్థాపించి, నామ సంకీర్తన బోధించి ఆస్తికత వ్యాప్తికి బాగా తోడ్పడ్డారు ప్రతిరాత్రీ 10గంటలనుంచి 12 వరకు సామూహిక భజన చేయించేవారు. అందరి సహకారం తో గ్రంధాలయం స్థాపించి, అక్కడా నిత్య సంకీర్తన జరిగేట్లు చేశారు. పెదకొత్తపల్లి వాసి చదలవాడ వెంకట సుబ్బయ్య గారి దగ్గర తరంగాలు నేర్చారు.

## ఆచార్యానుగ్రహం

1926 లో భగవదతారమూర్తి అయిన ఆంధ్ర వాల్మీకి వాసు దాసు గారు అనేక ప్రాంతాలలో పర్యటించి భక్తిజ్ఞాన వైరాగ్యాలు బోధిస్తూ జమ్ములపాలెం వచ్చారు. రామాలయం లో రామతత్వాన్ని బోధిస్తూ రామతత్వానికి మించింది, రామనామానికి,రామ మంత్రానికీ మించిందీ, రాముడికి మించిన పరదైవం లేదని నాలుగు గంటలు ప్రసంగం చేశారు. ఆ ఉపన్యాసానికి దాసుగారిలో ఆర్తి ఆవేశం ఆనందం ఆకర్షణ కలిగి ఆయన మార్గం లో జీవితం గడపాలనుకొన్నారు. రామకోటి రాముని చేరే సూటి మార్గం అని వారు చెప్పింది మనసులో నాటింది. తాము చెప్పిన నియమాలను పాటిస్తాం అనే వారు చేతులుఎత్తమని కోరితే నరసయ్యగారు ఆయన స్నేహితుడు బాపట్ల హనుమంతరాయ కవి మాత్రమె ఎత్తారు. వాల్మీకి వారి దృష్టి నరసయ్య గారిపై పడింది. ఆయనవచ్చి పాద నమస్కారం చేయగా, లేపి కౌగిలించుకొని "కుమారా !నీ చిరునవ్వు ముఖం చూసి నాకు ఆనందం కలిగింది. నీ మనసు తెలుసుకోవాలనే కోరిక కలిగింది. నీ భవిష్యత్తు చాలా ఉజ్వలంగా ఉంటుంది. నీకీర్తి ప్రతిష్టలు దిగంతాలకు వ్యాపిస్తాయి. లోకాన్ని ఉద్ధరించటానికే నువ్వు పుట్టావ్. రామ తారక మంత్రం ఉపదేశానికి సర్వ విధాలా అర్హుడవు "అని చెప్పి తారకమంత్రం ఉపదేశించి నిశ్చలభక్తితో జపించమని ఆజ్ఞాపించారు. తన జన్మ ధన్యమైనదని దాసుగారు భావించి వినయంతో వాసుదాసుగారితో "స్వామీ !మీరు చెప్పినట్లు త్రికరణ శుద్ధిగా రామమంత్రాన్ని జపిస్తాను "అనగా ఆశీర్వదించి వాసుదాసుగారు వెళ్ళిపోయారు.

మంత్రం సిద్ధి పొందాలనే కాంక్ష తీవ్రమై నరసదాసుగారు రోజుకు 21,600నామ జపం చేశారు. రోజుకు పదివేల రామకోటి రాశారు. రాత్రీ పగలూ రామధ్యానంతోనే గడిపారు. ఒకరోజు చిన్ని కృష్ణుడు కలలో కన్పించి కన్నీరు కారుస్తూ "ఎన్నో రోజులనుంచి నీ సున్నిత హృదయం లో నన్ను ప్రతిష్ట చేసుకొని, ఇప్పుడు మరొకరిపై మనసుపడ్డావు. ఇది అన్యాయం "అనగా నరసదాసుగారు "స్వామీ !మీరేగా ఆచార్యరూపం లో వచ్చి నాకు దీక్షనిచ్చి రామతారక మంత్రోపదేశం చేసింది. ఇప్పుడు తప్పు నాది అయినట్లు నెపం వేస్తున్నారు ఇదేమైనా బాగుందా ?"అని అడిగారు. బాలకృష్ణమూర్తి చిరునవ్వు చిందిస్తూ "నీ సాధన గొప్పది నీజపం సఫలమైంది. నువ్వు సిద్ధిపొందుతావు "అని అభయమిచ్చి ఆ వేణుగానలోలుడు కోదండ రామ మూర్తిగా బహువిదాలంకారాలతో పట్టు పీతాంబరాలతో దర్శనమిచ్చి దాసుగారికి పరమానందం, పరవశం కలిగించారు. ఇలా నిరంతర రామ ధ్యానం తో ఒకకోటి పది లక్షల రామకోటి రాసి తాను నేర్చిన చిత్రలేఖనం తో రామాయణమంతా రామనామాలతో చిత్రించారు నరసదాసుగారు. ఇదొకకోటి అయింది. ఈ మొత్తాన్ని న శ్రీరామ చంద్రునికి అంకితమిచ్చారు. ఆంధ్ర వాల్మీకి ఆశీస్సులతో దాసుగారు సంస్కృతం లో "గురు పూజా విధానం "రాశారు. ఇలా నిత్యనిరంతర రామనామ కాలక్షేపం తో నరసదాసుగారుకొంతకాలం జమ్ము పాలెం లోనే ఉన్నారు.

## ఉపాధ్యాయ వృత్తి

ఇంటివద్ద ప్రైవేట్ చెపుతున్నా సరైన ట్రయినింగ్ లేకపోవటం వలన విద్యార్థులు పల్చబడగా, ఒంగోలులో ట్రయినింగ్ స్కూల్ లో విద్యార్ధిగా చేరారు నరసదాసు గారు. దాసుగారున్నది బ్రాహ్మణ హాస్టల్. మడీ ఆచారం పాటించటానికి తప్పక పాటించేవారు. మిగిలిన వారు అవన్నీ పాటిస్తూ నీతి బాహ్యంగా వ్యవహరించేవారు. ఇది దాసు గారికి నచ్చక, తన ప్రవర్తన చేత వారిని అంతర్బహిశుద్ధులుగా తీర్చి దిద్దారు. అన్నిటా ఫస్ట్ గా ఉండటం వలన విద్యార్ధి లీడర్ గా ఉపాధ్యాయ విద్యార్థుల అధికారుల మన్నన పొందారు. రాత్రి 9నుండి 12వరకు భజనలో పాల్గొన్నారు. శ్రీరామనవమి శ్రీ కృష్ణాష్టమి శ్రీ శంకర జయంతు లను ఘనంగా నిర్వహించారు. ఉపన్యాసాలు హరికధలు చెప్పించారు. ఇలా బ్రాహ్మణ హాస్టలు ను సదాచార కోష్టంగా మార్చారు.

విద్యాధికారి, క్రైస్తవుడు అయిన వర్గీస్ ఒక సారి తనిఖీకి వచ్చాడు. స్కు హాస్టలు తనిఖీచేశాడు చాలామంది విద్యార్థులు గైర్ హాజరయ్యారు. హెడ్ మాస్టర్ లీడర్ దాసుగారిని పిలిపించి కారణం అడిగారు.తాము భోజనం చేయలేదనీ, భోజనహాస్టలు అపవిత్రం అయిందని, పుణ్యాహవాచనం చేయించాలని, అప్పటిదాకా తాము భోజనం చేయమని చెప్పారు. చేసేదిలేకరెండురోజులు సెలవిచ్చాడు హెడ్ మాస్టర్. అందరి తరఫున పుణ్యాహవాచనం కార్యక్రమం దాసు గారే నిర్వహించి, మళ్ళీ విద్యాలయాన్ని సక్రమంగా నడి చెట్లు చేశారు. దాసుగారి నిష్టాగరిష్టాలు అందరికీ ఆశ్చర్యం కలిగించాయి. ట్రయినింగ్ లో ఉండగా దాసు గారు ఎందరో మహాత్ముల ఆశీస్సులు పొందారు. మహాభక్తులు బొమ్మరాజు సీతారామయ్యగారిని దర్శించి నమస్కరించగా పరమ వాత్సల్యంతో ఆయన దాసుగారిని ఆప్యాయంగా కౌగలించుకొని, శరీరమంతా నిమురుతూ "నువ్వు శుద్ధ సాత్విక మూర్తివి. ఆధునికులకు సంసార బాధలు నివారించే మాధవుడిని చేరే సాధనం బోధించే మేదావి అవుతావు "అని దీవించారు. బొమ్మరాజు జానకి రామయ్య, మల్లవరపు సుబ్బారావు, నీలంరాజు ఆది మూర్తి, వికాల రామ చంద్రా చార్యులు వంటి పెద్దలు హాస్టలుకు వచ్చి ఆశీర్వదించేవారు. వారి సేవాభాగ్యం దాసుగారికి దక్కింది.

మెట్టప్రాంతమైన ఒంగోలులో వేసవిలో వడగాడ్పులెక్కువ. వీరి స్కూలుకు ఒక మైలు దూరం లో ఒక పంచమ జాతివాడు వడదెబ్బ తగిలి రోడ్డుమీదనే పడిపోయాడని తెలిసి, ఒక స్నేహితుడితో అక్కడికి వెళ్ళగా అతడు స్పృహతప్పి ఉండటం గ్రహించి. అతడికి గోచీ తప్ప ఏమీలేదు. అదికూడా మలం తో నిండి ఉంది. దాసుగారు దాన్ని తీసేసి శుభ్రంగా కడిగి, తన అంగోస్త్రాన్ని కప్పి, అతడిని స్నేహితులిద్దరూ భుజాలపై మోసుకొని సత్రానికి తీసుకు వెళ్ళారు. అక్కడే ఉంచి, మంచి భోజనం పెట్టించి రెండు రోజులతర్వాత అతన్ని వాళ్ళ ఇంటికి పంపించిన దయామూర్తి నరసదాసుగారు. ఎంతటి నిష్టాగరిష్టులో అంతరి ఉదారహృదయులు దాసుగారు. ఇలా గాంధీ గారి సిద్ధాంతాన్ని ఆచరించి చూపిన మానవతా మూర్తి దాసుగారు.

ట్రయినింగ్ పూర్తి అవజొచ్చింది. టీచర్స్ అసోసియేషన్ జరిపారు. దానికి విద్యాశాఖాధికారి వర్గీస్ అధ్యక్షత వహించాడు. ఆయన ప్రతి ట్రయినీని క్షుణ్ణంగా పరిశీలించి నరసదాసుగారిని ఉత్తమ ఉపాధ్యాయునిగా నిర్ణయించాడు. దాసుగారు ఇంగ్లీష్ లో లో వర్గీస్ గారికి స్వాగత సన్మాన పత్రం రాసి చదివి అందరికీ ఆశ్చర్యం కలిగించారు. అప్పటి ఒంగోలు కలెక్టర్ ఆల్ రౌండర్ అయిన ఏం సి పాయ్ "సర్వతో సమర్ధత పతకం "దాసుగారికి ప్రదానం చేశారు. ఆ ఏడాది 1931

లో మద్రాస్ ప్రెసిడెన్సిలో నరసయ్యగారు ప్రధమ శ్రేణిలో ప్రధమ స్థానం లో ఉత్తీర్ణులయ్యారు. అప్పటివరకు ఏ ఆంధ్రుడూ సాధించని ఘనవిజయం నరసయ్యగారు సాధించి, జమ్ములపాలెం లోనే ప్రభుత్వ ఉపాధ్యాయులుగా నియమింపబడి పని చేశారు.

## యోగా భ్యాస మహిమలు

యోగ సాధనంతో శారీరక మానసిక ఆరోగ్యం సాధించాలని నరసయ్యగారు భావించి హఠయోగ ప్రక్రియ చదివి, స్వయంగా యోగాభ్యాసం చేశారు. పాడి ఆవును కొని ఆవుపాలు,, ఉప్పు కారం లేని చప్పిడి కూరలతో, ఆవుపెరుగన్నం మాత్రమె భుజిస్తూ జిహ్వా చాపల్యానికి కళ్ళెం వేశారు. రెండేళ్ళు ఇలా గడపటం తో ఓజస్సు తేజస్సు ఏర్పడి పరమ ఆకర్షణీయులుగా కనిపించారు.జపధ్యానాలతో మరింత శక్తి సాధించారు. పద్మాసనం లో ఉదయం సాయంత్రం 21వేల 600 జపం చేస్తూ, రాత్రి 11గంటలకు భజన చేస్తూ, తెల్లవారుజామున 4గంటలకే లేస్తూ యోగ జీవితాన్ని అత్యంత నిష్టా గరిష్టంగా గడిపారు.

ఒకరోజు రాత్రి స్వప్నం లో సీతామాతః సర్వాలంకార భూషిత గా మెరుపు తీగలాగా దర్శనమివ్వగా తదేక దృష్టితో ఆమెను చూస్తూ ఉండగా ఆమె పసిపాపలాగా మారి ఆయన ఒడిలో కూర్చున్నది. ముద్దులొలికె ఆ చిన్నారిపాపను ఎత్తుకొని ముద్దాడ బోగా కల మాయమయింది మెలకువ వచ్చి భార్యకు అంతా చెప్పారు. ఆ పిల్లముచ్చట్లు ఆదంపతులు ముచ్చటగా చెప్పుకొన్నారు. ఇంతలో భార్య శేషమ్మగారికి ప్రసవ వేదన కలిగింది. అప్పటిదాకా ఆమెకు ప్రసవ చిహ్నాలేవీ లేనేలేవు. ఆశ్చర్యంగా ఆడపిల్ల పుట్టింది. సీతా దేవి అనుగ్రహం తో పుట్టిన ఆపాప కు సీతా కల్యాణి అని పేరు పెట్టుకొన్నారు.

నవవిధ భక్తి రసాలను నరసయ్యగారు ఆస్వాదించారు. సఖ్యభక్తిలోశ్రీరాముడు ఆయనతో ఆటలాడే వాడు. ఒకరోజు రాత్రి రాముడు స్నేహితుడుగా వచ్చి ఆయన ప్రక్క పడుకొన్నారు. భార్య అనుకోని కాలు వేస్తె, రాముడు లేచి "నీమీదున్న స్నేహంతో వచ్చి నీ పక్కన పడుకొంటే, నామీదనే కాలు వేస్తావా "ఇది నీకు న్యాయమా "అని అలుకతో పలుకగా నరసయ్యగారు తెల్లబోగా, రాముడు "మిత్రమా ! నీపాదం నాకు మోదం చేకూర్చింది. నన్నే నమ్మి భజిం చేవారంటే నాకు పరమ ప్రీతి. సుజనుల చరణ ధూళి నాకు పరమ పవిత్రం. దాన్ని ధరించటానికే నీ దగ్గరకు వచ్చాను "అని రామ చంద్రమూర్తి అదృశ్యమయ్యాడు. అమితాశ్చర్యపడ్డారు నరసయగారు.

రామ భజనకు హనుమ ఉపాసన ముఖ్యం. ఆయన రామునికి నామానికి వారధి. అందుకే నరసయ్యగారు హనుమను అత్యంత భక్తితో అర్చించేవారు. ఒకరోజు రాత్రి 11గంటలకు చేసే భజన పూర్తికాగానే భార్య శేషమ్మగారు "మనం బాగా బీద వాళ్ళం. ఇల్లు గడవటం కష్టంగా ఉంది. సంపాదన యావ లేకుండా మీరు రామభజన చేస్తుంటే సంసారం గతేమిటి వయసులో కాక ముసలితనం లో డబ్బు సంపాదించలేరు కదా "అని భజన గురించి కొంచెం అవహేళనగా మాట్లాడితే ఆయన "అన్నిటికీ రాముడే దిక్కు అని నమ్మి ఉన్నాము మనం. ఆయనే చూసుకొంటాడు. ఆందోళన పడకు "అని ఊరడించారు. ఆమెకు తలకెక్కలేదు "రొక్కం లేక పొతే డొక్క నిండుతుండా శుష్కవేదాంతం తో కడుపు నిం డుతుండా అని వాకిలి తలుపు గడియ పెట్టటానికి గుమ్మం దగ్గరకు వెడితే, ఒక కోటి అమాంతం వచ్చి బలంగా ఆమె వెంట్రుకలు పీకింది. భయంతో అరిచి కిందపడిపోయింది. నరసయ్యగారు దీపం తో వచ్చి లేపి, ఆమె తలమధ్యభాగంలో వెంట్రుకలుకత్తి రించి ఉండటం చూసి "భాగవతాపచారం చేశావు. క్షమాపణ వేడుకో "అనగా ఆమె "నా తలపోటు తగ్గితే నా బంగారు గొలుసు ఇస్తాను. అప్పాలు పానకం చేసి నైవేద్యం పెడతాను అని మొక్కుకోన్నది. వెంటనే ఆమె బాధ అంతా తగ్గింది. మర్నాడు ఉదయం పూజా సామాగ్రి ఉన్న చిన్న పెట్టెలో 72రూపాయాలు కనిపించాయి. ఇదంతా ఆంజనేయ మహిమ అని గ్రహించారు ఇద్దరూ. ఆడబ్బును భగవంతుని పటాలు కొనటానికి ఖర్చు చేశారు. ఆరోజు నుంచి వారి బియ్యపు డబ్బాలో ఎప్పుడూ ఒక శేరు బియ్యం నిలవ ఉండేవి. రోజూ చేసే భోజనానికి భగవంతుడు లోటు రానీయడు అని గ్రహించారు దంపతులు.

నరసయ్యగారికి రోజూ దేవుడికి మృదు మధుర పదార్ధాలు నైవేద్యం పెట్టాలని ఉండేది. కాని ఆర్ధిక పరిస్థితికి అది గొంతెమ్మ కోరికే. ఒకరోజు ఇదే ధ్యాసతో ఆలోచిస్తూ నిద్రపోయారు. మర్నాడు ఉదయం పూజా సామాగ్రి పెట్టెలో నాలుగు పంచదార లడ్డూలు ఒక కాగితం పోట్లంలో కనిపించాయి.కాగితం మీద "శ్రీరామ నిలయం –అయోధ్య "అని హిందీలో రాయబడి ఉండటం చూసి అమితాశ్చర్యపడ్డారు. వాటిని అందరికి ప్రసాదంగా పంచిపెట్టారు. ఇలా రోజూ ఏదో ఒక మహిమ కనిపించేది. శేషమ్మగారి డబ్బు పోతూ, మళ్ళీ కనిపిస్తూ ఆమెకు నమ్మకం కలిగేది. ఒకసారి నరసయ్యగారు గురువు వాసుదాసు గారి కి అలాంటి మహిమలు ఇక తనకు వద్దు అని కోరారు. తన శిష్యుని యోగ సిద్ధి ఎంతవరకు వచ్చిందో తెలుసుకోటానికి ఆయన జమ్ముల పాలెం వచ్చారు. గురువుగారికి అత్యంత భక్తితో శిష్యుడు స్వాగతం పలికారు ఆయన అమిత శిష్య వాత్సల్యం తో దగ్గరకు తీసుకొని కౌగలించుకొని ""నాయనా ! నీ యోగసిద్ధి వినయ విధేయతలు ఆధ్యాత్మిక వివేకం మృదుమధుర భాషణం, నిర్మల మనసు, నీ మనసులోని ధర్మమూ నాకు తెలిశాయి. మహిమలు అధోగతికి సోపానాలు. జాగ్రత్తగా మసలు కో "అని హితవు చెప్పి వెళ్ళారు. ఇక తనకు ఏరకమైన మహిమలు చూపవద్దని ఆర్తిగా దేవుని నరసయ్యగారు ప్రార్ధించారు.

యోగం చేశాక తన శరీరం శవాకారంగా కనపడేది. ఒకరోజు రాత్రి అన్ని శరీర భాగాలనుంచి ప్రాణం పైకి వెడుతూ శిరసు దగ్గరకు వచ్చాయి. వెంటనే ఎవరో నెత్తిన చెయ్యి వేయటం అవి మళ్ళీ యధాస్థానలకు వెళ్ళిపోవటం కనిపించి ఆశ్చర్యపోయారు లేచి చూస్తె ఎవ్వరూ కనపడలేదు.

## గుంటూరుశ్రీ రామ నామ క్షేత్ర సందర్శనం

వంగిపురం లో వాసుదాసుగారు శ్రీ కోదండరామ సేవక సమాజం వార్షికోత్సవాలలో నరసయ్యగారు కూడా పాల్గొన్నారు. జనం తండోప తండాలుగా వచ్చారు. రాగం ఆంజనేయులు,పెండ్యాల రామ సుబ్బయ్య, పన్నాల లక్ష్మీ నరసింహం, పన్నాల రామ కృష్ణయ్య గార్లుకూడాగుంటూరు నుంచి వచ్చి పాల్గొన్నారు. సాయంత్రం 4నుంచి నరసయ్య గారు భక్తీ ఉపన్యాసాలు చేశారు. ముందు సంకీర్తన చేసి తర్వాత ప్రసంగం చేసేవారు. పరమాద్భుతమైన తేజస్సుతో విరాజిల్లుతూ

ప్రతిపలుకు కలకండ మాధుర్యంగా ఉండేది.. శ్రీరాముని లీల విలాసాలను శ్రోతల మనస్సులోచొచ్చుకుపోయేట్లు మాట్లాడేవారు. ఉపన్యాసం పూర్తీ అవగానే శ్రోతలు అందరూ వచ్చి ఆయనకు పాదాభి వందనం చేసేవారు అందరినీ ఆత్మీయంగా పలకరిస్తూ ఆలింగం చేసేవారు. గుంటూరు వారు "స్వామీ !మీ దర్శనం మాకు శ్రేయోదాయకం. గుంటూరులో శ్రీ సీతారామ నామ సంకీర్తన సంఘం ఉన్నది మేము దాని సభ్యులం. అది చిన్న సంఘమే కాని మీరు విచ్చేసి అక్కడ నామ సంకీర్తన ఉపన్యాసాలు చేయవలయునని మాకోరిక. మీరు సందర్శిస్తే దాని అభివృద్ధి దిగ్విజయంగా జరుగుతుందని మా విశ్వాసం "అని రాగం ఆంజనేయులు బృందం వారు విన్నవించారు.

నరసయ్యగారు చాలా సంతోషంగా వారి వెంట గుంటూరు వెళ్ళారు. అప్పటినుంచి నరసయ్యగారిని ఆ సంఘ సభ్యులుగా చేర్చుకొని, ప్రచారం చేసే ప్రతి చోటుకూ తమ వెంట తీసుకు వెళ్ళేవారు. దీనితో ఆ సంఘం విలువ నాలుగు మూలాలకు ప్రాకింది. నరసయ్యగారు జమ్ముపాలెం నుంచి బుద్ధాం వచ్చి ఎలిమెంటరి స్కూల్ టీచర్ గా పని చేశారు. బుద్ధాం నుంచి 8మైళ్ళ దూరం లో ఉన్న బాపట్లకు వారం లో నాలుగైదు రోజులు భజనకు వెళ్ళేవారు సాయంత్రం 5గంటలకు బయల్దేరి నడిచి వెళ్ళటం, రాత్రి 11,12వరకు భజన చేసి తిరిగి నడిచి ఇంటికి రావటం చేసేవారు. తెల్లవారుజామున నాలుగుకే లేచి పనులన్నీ చూసుకొని బుద్ధాం స్కూల్ లో బోధనా చేసేవారు.

గురువు లేకుండాయోగాభ్యాసం చేయటం అధిక శ్రమ యోగం లో పనికి రాని భోజనాలు తినటం నిద్ర చాలక పోవటం వలన అనారోగ్యం పాలయ్యారు. ఉప్పు కారం ఉన్న తిండి తినటం తో కలిగిన బాధ ఇది. కీళ్ళ వాతం వచ్చి కదలలేక మెదల లేక ఒక" మూట గా' ఉండిపోయారు. పల్లెటూరుకనుక వైద్య సదుపాయం లేదు. యాచన గిట్టని మనస్తత్వం వారిది. క్రమంగా మనసును స్వాధీనం చేసుకొని చివరికి దాన్నికూడా త్యాజ్యం చేసి శ్వాసకార్యాన్ని బంధించటం చేత ఆయన చనిపోయారని అందరూ గుసగుసలాడు తుంటుంటే కొంతసేపటికి బాహ్య స్మృతి కలిగి. ఆపదలో ఆదుకొనే వారే కనిపించలేదు. వాతం హరించ టానికి పూసిన పూతలవల్ల కొంత గుణం కనిపించింది. ఈ అనుభవంతో గురువు లేకుండా యోగాభ్యాసం చెయవద్దుఅని అందరికీ బోధించేవారు. వాసు దాసు గారు రాసిన "మందరం "ను నరసయ్య గారి చేతితోఅందంగా రాయించాలని ఆయనకు అప్పగించారు గురువుగారు. ఆరోగ్యం కొంచెం కుదుట బడింది కనుక ఇక వృధా కాలక్షేపం పనికి రాదనుకొని వాలుకుర్చీలో కూర్చుని నెమ్మదిగా మందరం ను ముత్యాల వంటి అక్షరాలో రాసి గురువుగారికి అందించారు నరసయ్యగారు.

నరసయ్యగారు చాలా కాలం గా బాపట్లకు రాకపోవటం తో స్నేహితుడు పుల్లె శేషగిరిరావు బుద్ధాం వచ్చారు. ఈ బాల్య స్నేహితుడు, సహాధ్యాయి దుర్వ్యసనాలకు బానిసై పతనం చెందుతు ఉంటే సరైన మార్గం లో పెట్టారు నరసయ్యగారు. నరసయ్యగారి దీన స్థితి చూసి ఆయన హృదయం ద్రవించి,వెంటనే సరైన వైద్యం కోసం బాపట్లకు తీసుకు వెళ్ళారు. స్వంతడబ్బు చాలా ఖర్చు చేసి నరసయ్యగారిని మళ్ళీ ఆరోగ్యవంతుల్ని చేసి స్నేహఋణం తీర్చుకున్నారు శేషగిరి రావు.

ఆతర్వాత గుంటూరు రామనామ క్షేత్రం వారు వచ్చి నరసయ్యగారిని గుంటూరు తీసుకువెళ్ళి తమ సంఘానికి మేనేజర్ ను చేశారు. గుంటూరులో కాపురం పెట్టి ఆసమాజనికి సేవ చేశారు. కంతేరులో జరిగిన వార్షికోత్సవానికి గుంటూరు సంఘాన్ని ఆహ్వానించగా, నరసయ్యగారు వెళ్లి భక్తీ ఉపన్యాసంతో వారి మనసులను జ్ఞానం నుంచి భక్తికి మరల్చారు. మూడురోజులు నవవిధ భక్తిగురించి ప్రసంగించారు. ఆ ఉపన్యాసాల సారాంశం "నవవిధ భక్తులు "పుస్తకంగా ముద్రణ పొందింది.

రాగం ఆంజనేయులుగారి తండ్రి పిచ్చయ్యగారు గొప్ప భక్తులు. రామకోటి రాసేవారు అప్పటికి ఆ సంఘ సభ్యులలో నరసయ్యగారు ఒక్కరే రామ కోటి రాసిన వారు. అందుకని ఇద్దరికీ స్నేహం బాగా కుదిరింది. పిచ్చయ్యగారు రామకోటి పేరుతొ ఉత్సవాలు నిర్వహించాలనుకొన్నారు. పిచ్చయ్యగారు తమ రామకోటికి భద్రాచలం తీసుకువెళ్ళి సీతారామ స్వామికి సమర్పించి అక్కడే పరమపదించారు.

నరసదసుగారు నిర్ణయించిన ముహూర్తానికి రామకోటి పూజలు చేసి, రామకోటి ఉత్సవాలను ప్రారంభించారు గుంటూరులో. ఆతర్వాత "భానువార సంకీర్తనం" పేరుతొ ప్రతి ఆదివారం భజన,ఉపన్యాసాలు జరిపించారు. నరసదాసుగారు "భక్త రామ దాసు "కథా సంకీర్తనం చేశారు ఇదే కథా సంకీర్తనకు పునాది అయింది. కథా సంకీర్తనలో భక్తి ప్రవహించి ఉర్రూత లూగిస్తుంది.

ఒకసారి ఈసభవారు సేకూరు సభలకు వెళ్ళారు. అక్కడ క్రమ శిక్షణ లేకపోవటం చూసి ఏవగించుకొని భక్తీ సమాజం అందరికీ ఆదర్శంగా ఉండాలిఅని నిశ్చయించారు. పెండ్యాల రామ సుబ్బయ్య గారితో చర్చించి నియమాలు ఏర్పాటు చేశారు. అప్పటికే నరసదాసుగారు వాసు దాసుగారి వద్ద దిన చర్య రాసి మూడు సోపానాలలో అగ్రస్థానం పొందారు. ఒక రోజు గురువుగారు దిన చార్య రాయాల్సిన అవసరం లేదని చెప్పారు. నరసయ్య గారు సభ్యులను సమావేశ పరచి దిన చర్యరాయటం లో ఉన్న నియమాలు అందరూ పాటించాలని "నియమమే ఊర్ధ్వ అయనం.దాన్ని పాటించే వాడే సాటిలేనిమేటి. దానిలోనే మనుష్యత్వం ఇమిడి ఉంది. మనం చేసేపనులన్నీ దిన చర్యరాసేటప్పుడుగుర్తుకు వస్తాయి. మన తప్పు ఇతరులకు చెప్పాలి. నిర్బంధం లోనే బంధ విముక్తి ఉంది "అనిసాకల్యంగా వివరించారు. అందరూ నియమాలను పాటిస్తామని వాగ్దానం చేసి అమలు పరచారు. నెలకోసారి సమావేశం జరిగి సమీక్ష చేసుకొనేవారు. సాధన శాఖకు నరసయ్యగారిని అధ్యక్షులను చేశారు. మొదటి సమావేశం సంగం జాగర్ల మూడి దేవాలయం లో 25 మంది సభ్యులతోజరిగింది. క్రమంగా సంఖ్య 200 దాటింది. తర్వాత గుంటూరి క్షేత్రం లోనే సమావేశాలు నిర్వహించారు. 1938 నుండి శ్రీ ప్రభుదత్త బ్రహ్మ చారి గారి ప్రోత్సాహంతో "అవిరామంగా హరేరామ నామ సంకీర్తన" జరుగుతోంది. నరసయ్య, ఆంజనేయులు గారి నేతృత్వం తో సమాజం ఆదర్శప్రాయంగా వర్ధిల్లుతోంది. నామారాధన,, అధః పతనాను రోదధిని,

విషయ వాంఛా నిరోధినీ, సన్మార్గ సులభోపాయ బోధినీ, సంశయ విచ్చేదినీ, వైరాగ్యబోధినీ అయిన "మోక్ష సాధన "అనే మాసపత్రికనరసదాసు గారి సంపాదకత్వం లో వెలువడి ఆస్తికాభ్యుదయానికి విశేషంగా తోడ్పడింది.

## బుద్దాం లో శ్రీరమా చ్యుత మందిర నిర్మాణం

ఒకప్పటి బౌద్ధుల ఆవాస భూమికనుక బుద్దాం అనే పేరు వచ్చి ఉంటుంది ఇప్పటికి అక్కడ బౌద్ధ నిర్మాణ అవశేషాలు కనిపిస్తాయి. గుంటూరు సీతారామ నామ సంకీర్తన సంఘానికి ఒక ఏడాది మేనేజర్ గా పని చేసి నరసయ్యగారు బుద్దాం వచ్చి అక్కడ మేనేజి మెంట్ స్కూల్ లో టీచర్ గా పని చేస్తూ కాపురం పెట్టారు. అక్కడకు వచ్చిన కొద్ది రోజుల్లోనే అక్కడ కలరా తీవ్రంగా వ్యాపించి, ఒకే వారం లో సుమారు 80మంది చనిపోయారు. జనం భయభ్రాంతులయ్యారు అక్కడ కనీసం ఒక్క దేవాలయం కూడా లేదు. కలరా వ్యాధి బారి పడకుండా జనాలకుదైర్యం చెప్పటానికి నరసయ్యగారు మాధవ కీర్తన సప్తాహం నిర్వహించారు. మొదలుపెట్టిన కొద్ది రోజుల్లోనే వ్యాధి తగ్గటం మొదలైంది. ఇది సంకీర్తన ప్రభావం అని జనం విశ్వ సించారు. శ్రద్ధగా అందరూ పాల్గొనేవారు. నరసయ్య గారిని "నరసదాసు "గారని గౌరవంగా సంబోధిం చేవారు. అరిష్టాలను అరికట్టటానికి ఆంజనేయ విగ్రహం స్థాపించి పూజ కూడా జరిపించారు. మంగళ శనివారాలలో తమలపాకు పూజలు అప్పాల నైవేద్యం చేయించేవారు. దేవాలయం, అర్చన లేని గ్రామం లో ఒక్కపూట కూడా ఉండరాదనే ఆర్యోక్తి ని అక్కడిజనాలకు నిత్యం చెప్పేవారు.

మందిర నిర్మాణానికి ఆయనకు తగిన ఆర్థిక స్తోమత లేదు. తల్లి చనిపోయింది. కొడుకు, కూతురు భార్యాభర్తల పోషణ జరగాలి. శేషమ్మగారు ఎక్కడెక్కడో అప్పు చెసి కొంపగాడుపుతూ, జీతం రాగానే తీర్చేవారు. ఒక సారి ఆమె పిల్లలతో పుట్టింటికి వెళ్ళారు. దాసు గారొక్కరే ఇంట్లో ఉన్నారు. రోజు నియమమ తప్పకుండా గాయత్రీజపం, ఏమీ తినకుండా బడికి వెళ్లి, సాయంత్రం తిరిగి ఇంటికి వచ్చాక అన్నం వండి తినేవారు. ఒకరోజు భోజన సామగ్రి లేక అసంపూర్తిగా భోజనం కానిచ్చేవారు. తన బాధ ఎవరికీ చెప్పేవారు కాదు. అలాగే ఒక సారి రాత్రి సంకీర్తన చేసి నిద్రకు ఉపక్రమించారు. ఆకలి గా ఉండటం తో నిద్ర పట్ట లేదు. చిన్న కునుకు తీశారు. అందులోనే ఒక కల వచ్చింది. శ్రీరాముడు కనిపించాడు ఆయన అలసిపోయినట్లు ఒళ్ళంతా చెమట కారుతున్నట్లు దాసుగారు చూశారు. పైన ఒక ఉత్తరీయం మాత్రమె ఉంది. బరువైన ధావళి కొంత ఊడింది. పాదాలు దుమ్ము ధూళితో ఉన్నాయి. శ్వాస మహా వేగం గా ఉండటం తో పరిగెత్తుకొని వచ్చినట్లు అనిపించారు. మొహం తెల్లబడి కళ్ళ వెంట నీరు కారుతోంది. ఏదో చెప్పాలన్న తపన తో "వత్సా !ఆకలితో ఎంత బాధ పడుతున్నావోకదా.వెంటనే రాలేకపోయాను.. నా భక్తుల ఆర్తి పోగొట్టటం నా ధర్మం. నీకోసం ఆహారం తెచ్చాను త్వరగా లేచి తిని కడుపు నింపుకో "అని కుడి చేయిని దాసు గారి ఛాతీపై ఉంచాడు రామయ్య. ఆస్పర్శకు దాసుగారికి మెలకువ వచ్చి లేచారు. ఇంటిగుమ్మం తెరిచి ఉంది. దీపం వెలుగుతూనే ఉంది. ఆశ్చర్యం తో లోపలి వెళ్ళారు. అక్కడ ఒక పళ్ళెం లో నాలుగు గోధుమ రొట్టెలు, వాటిపై పెద్ద వెన్నముద్ద కనిపించాయి. దాసుగారి హృదయం ఉప్పొంగి పోయింది. మనసులో దైవ ధ్యానం చేసి వాటిని తినటానికి కూర్చున్నారు. అవి అప్పటికప్పుడే తయారు చేసినట్లు వేడిగా వెన్నతో ఉండటం తో రాముడే తాను తినే ఆహారాన్ని తెచ్చి పెట్టాడని నిశ్చయించారు. రామమంత్ర పునశ్చరణ చేయాలనే తలంపు వచ్చి, మంత్రానికి ఎన్ని అక్షరాలు ఉంటె అన్ని లక్షల సార్లు నియమం తో జపించాలని నిర్ణయించుకొన్నారు. దీక్షగా ఒక్క నెలరోజుల్లో అనుకున్నది పూర్తీ చేశారు. అహర్నిశలు రామనామ జపమే, మనసంతా రామమందిరమే చేసుకొన్నారు. దీనితో అంతా రామమయం గా కనిపించింది. వారి భక్తి పరాకాష్టకు చేరింది. రాముడిని చూడటానికి తహతహ లాడారు.

మళ్ళీ ఒకరోజు రాముడు స్వప్న సాక్షాత్కార భాగ్యం కలిగించి "భక్తావతంసా !నీ సాధన తీవ్ర సిద్ధి పొందింది. నీ ప్రేమ హృదయం పరమ మధురం. నీ భావాలు నన్ను ఆకర్షించాయి. నీతో చాలా సన్నిహితంగా ఉండాలనే తీవ్ర మైన కోరిక నాకు కలిగింది. నువ్వు సిద్ధి సాధించిన ఈ స్థలం లోనే నీతో ఉండి పోవాలని పిస్తోంది. నీ నామ ప్రచారానికి నువ్వు నిర్మించాలనుకొన్న మందిరం గొప్ప ప్రచార సాధనమౌతుంది "అని చెప్పి అదృశ్యమయ్యాడు.

ఐడియా బాగానే ఉంది.చేతిలో దమ్మిడీ కూడా లేదు. శేషమ్మగారి నగలు అమ్మితే వచ్చిన రెండు వేల రూపాయలోతో మందిర స్థాపనమొదలు పెట్టాలనుకొని ప్రారంభించి చిన్న మందిరం కట్టారు. దానిలో సీతారామ ఆంజనేయ మట్టి విగ్రహాలు పెట్టి పూజించేవారు. శ్రీ 108ప్రభుదత్త బ్రహ్మ చారి గారు, శ్రీ శియా రఘువర దాసు గార్లు మనదాసు గారి మందిరం చూడాలనే ఉత్సాహం తో వచ్చారు. పవిత్రమైన ఆమందిరం లో పాలరాతి విగ్రహాలు పెడితే దివ్య తెజోమయంగా ఉంటుంది అని అన్నారు దాసు గారితో. వారిద్దరితో తమ స్థితి గతులు పూస గుచ్చినట్లు దాసు గారు విన్నవించారు. వెంటనే వారు చంద్రకాంత శిలా నిర్మిత శ్రీ రమాచ్యుత" విగ్రహాలు అందజేస్తామని హామీ ఇచ్చారు. అది రాజస్థాన్ లో మాత్రమె దొరికే జైపూర్ శిల్పం. నరసదాసుగారు అక్కడికి వెళ్లి శ్రీ సీతారామ, శ్రీ రాధా కృష్ణుల విగ్రహాలను ఎంపిక చేసి తీసుకొని వచ్చి మందిరం లో ప్రతిష్టించారు. సగుణ నిర్గుణ నామాలు అయిన ఓంకారం, హరేరాం ఫలకాలను కూడా ప్రతిష్టించారు. ఈ మందిరానికి "నామ ప్రయాగ "అని పవిత్ర నామం పెట్టారు. భగవదవతార జ్యోతకమైన సంపూర్ణ ప్రభావమే ఆ మందిరం యొక్క ప్రత్యేకత. దీనితో బుద్దాం లో దేవాలయం లేని కొరత తీరింది. రోజు రాత్రి భజన చేసేవారు. ప్రతి ఏకాదశినాడు అఖండ నామ సంకీర్తన నిర్వహించారు. స్త్రీ భక్తులు కమ్మగా గానం భజన లతో అలరించేవారు. త్యాగరాజకీర్తనామృతం జాలు వారిం చేవారు. శ్రీ ప్రభు దత్త బ్రహ్మ చారి శ్రీ సీతారామ దాసుగారు, శ్రీ ఓంకార దాసుగారు, శ్రీ అవదూతేంద్ర సరస్వతి గారు గొప్ప ప్రేరణ కలిగించేవారు.

నాలుగేళ్ళు వరుసగా గ్రామస్తుల సహకారం తో ఇక్కడ మూడు రోజులు ఉత్సవాలు జరిపారు. దాతలు ముందుకు వచ్చి మందిర విస్తరణకు ఆర్ధికసాయం చేశారు. మందిరం విద్యుత్ కాంతులతో మిలమిల మెరిసిపోయేది నరసయ్యగారి ఆర్ధిక బాధలు తగ్గాయి. కుమారునికి, కూతురికి మంచి సంబంధాలు తెచ్చి వివాహాలు చేశారు.భార్య శేషమ్మగారు భర్త నరస దాసుగారికి అన్ని రకాల తోడ్పాటు అందిస్తూ అతిధి, అభ్యాగ్తులను ఆదరిస్తూ తలలో నాలుకగా వ్యవహరించి అందరి మన్ననలు ఆదంపతులు పొందారు.

### ఆచార్య పీఠం

దాసుగారిని అందరూ అయ్యవారు అని పిలిచేవారు. శిష్యులుగా చేర్చుకొని మార్గదర్శనం చేయమని చాలా గ్రామాల వారు కోరారు. ఒక రోజు ఒక మహా తెజస్వంతుడు వచ్చి సమాజం లోని అందర్నీ పలకరిస్తూ, ఆలింగనం చేసుకొంటూ దాసు గారిని "నువ్వు ఎవరు "అని అడిగితె శ్రీరామ చంద్ర మూర్తి పటంవైపు చెయ్యి చూపారు. ఆయన సంతోషించి మళ్ళీ కనపడ లేదు. కమ్మనమోలు భజన సమాజం వారు దాసుగారిని ఆహ్వానించ గా దాని నాయకుడు సభ్యులకు దాసుగారిని సాక్షాత్తు శ్రీ రామ చంద్ర మూర్తి అని పరిచయం చేశారు. వారంతా దాసుగారి నవవిధ భక్తులు పుస్తకం చదివి ప్రేరణ పొందినవారే. వారూ తమల్ని శిష్యులుగా స్వీకరించమని బలంగా కోరారు. శిష్యులు పెరిగితే సాధనకు ఇబ్బంది కలిగి వాళ్ళు గుది బండలు అవుతారని ఒప్పుకోలేదు.

బుద్ధాం లో ఉండగా దాసుకి ఒక రోజు రాత్రి కలలో వాసుదాసు గారు కనిపించి "నాయనా !ఎందరో నీ మార్గదర్శనం కోసం పలవరిస్తున్నారు శిష్యులుగా చేర్చుకొని వారికి ఊరడింపు కల్గించు. ఆచార్య పీఠం ఎక్కి వారి కోర్కె తీర్చి మార్గ దర్శనం చేయి. నీ సాధనకు భజనలకు పుస్తక రచనలకు వీరు తోడ్పడతారు. ఇది నా ఆజ్ఞ"అని దిశా నిర్దేశం చేశారు దాసుగారి మనసు కుదుట బడింది.

### పునశ్చరణ, మంత్రం సిద్ధి

వాసుదాసు గారి ఆజ్ఞను శిరసా వహించి నరసదాసు గారు నెలరోజులు స్కూలుకు సెలవు పెట్టి ప్రయాగ వెళ్ళారు. అదిమాఘ మాసం. చలి విపరీతం. అందరిలాగానే ఒక పందిరికింద పునశ్చరణ ప్రారంభించారు. పల్లి ఆంజనేయులుగారు కూడా ఆయన వెంట ఉన్నారు. దాసుగారు అప్పుడు కనిపించి అంతర్ధానమైన మహర్షితో మాట్లాడాలని కోరికగా ఉన్నారు. పగటిపూట పూజా జపం చేస్తూ, రాత్రి పదిగంటలకు ఇంతచప్పిడి కూడు తింటూ, తెల్లవారుజామున నాలుగు గంటలకే లేచి స్నానాదులు చేసి గడగడ వనకుతూ జపం చేసేవారు. ఆంజనేయులుగారు రాత్రి వినోదాలు చూస్తూ ఉదయం 7కు లేచి 10 గంటలకు స్నానం చేసేవారు.

దాసుగారు దీక్షగా రోజుకు కనీసం 90 వేల సార్లు మంత్ర జపం క్రమం తప్పకుండా చేసేవారు. సాయంకాలం ఆ మహర్షికోసం ఎదురు చూసేవారు. ఒక వారం తర్వాత ఒకసాయంత్ర అంతర్ధానమైన మహర్షి రావటం ఆంజనేయులు గారు చూసి చెప్పగానే పద్మాసనం వేసి పద్మనాభుని మనసునిండా నింపుకొని ధ్యానిస్తున్న దాసు గారి దగ్గరకు వచ్చి "స్నేహితుడా !నువ్వు చెప్పిన చిహ్నలున్నాయన వస్తున్నాడు "అని చెప్పగా, కళ్ళు తెరిచి చూడగా మందగమనం గా వస్తున్న ఆయన్ను చూడగా ఆయన చేయిపట్టుకొని దాసుగారిని లెవ నెత్తి "నాయనా !నీ సాధన అమోఘం. నీకు అలవాటుకాని వాతావరణం లో ఇంతచలిలో నువ్వు దీక్షగా అనుకొన్నది చేస్తున్నావు. నీ హృదయం ధర్మ మార్గాన్ని కోరుతోంది. నువ్వు ధన్యుడవు "అని పలికి తన చేతులతో దాసుగారి శరీరాన్ని నిమిరారు. నరసయ్య గారు ఆనంద పరవశమయ్యారు. సాక్షాత్తు భగవంతుడే ఆ రూపం లో వచ్చి తనకు మార్గ దర్శనం చేశాడని దాసుగారు భావించారు

ఆ మహాత్ముని తమ కుటీరానికి తీసుకువెళ్ళి త్రివేణీ జలం తో కాళ్ళు కడిగి పవిత్రజలం శిరసున చల్లుకొన్నారు. తాను తయారు చేసిన మధురపదార్థాలు పెట్టగా కమ్మగా భుజించాడాయన. ఆయన నోటికి అందించినవే తిన్నాడు. చేతితో తీసుకొని తినలేదు. ఎప్పుడూ మౌనంగా ఉండే ఆయన దాసుగారి వినయ విదేయతలకు మెచ్చి, సరస సల్లాపాలు చేసి దాసుగారి సందేహాలన్నీ తీర్చి, తమ పవిత్ర హస్తాన్ని నరసదాసుగారి మస్తకం పై ప్రేమగా ఉంచగా దాసుగారు వెంటనే నిర్వికల్పసమాధిలోకి వెళ్ళిపోయారు. ఆ అనుభూతి వర్ణనా తీతం. కొంత సేపటికి సమాధినుంచి బయటకు వచ్చి దాసుగారు పరమానందం పొందారు. దాసుగారికి ఆమహర్షి" శ్రీరామ త్రయోదశాక్షర మంత్రం "ఉపదేశించి "నీ ఉగ్ర సాధన ఫలించింది. సంపూర్ణ సిద్ధిపొందావు. సందేహాలు తీర్చే సామర్ధ్యం అలిగింది. ఆచార్య పీఠం అది రోహించి ఆశ్రితులకు ఆశ్రయం ఇవ్వు. నిన్ను ఆశ్రయించిన వారు కష్టాల పాలుకాకుండా, ఆముష్మిక సుఖాలు పొందుతారు. హరిని కీర్తించే సులభోపాయం బోధించటమే నీ ఆధునిక సాధన. నామ ప్రచారం లో నువ్వు ధన్యుడవు అవుతావు "అని చెబుతూ ఒక్కసారిగా అంతర్ధానమయ్యారు.

దాసుగారు ప్రయాగలో పునశ్చరణ దీక్ష ఫలప్రదంగా పూర్తీ చేసుకొని మనసంతా రామమయం చేసుకొని, జపం చేస్తుంటే సరయూనది నుంచి శ్రీరాముడు బయటికి వచ్చి చేతిని దాసుగారి శిరసుపై ఉంచిన భావన కలిగి కళ్ళు తెరిచి చూస్తె ఎవరూ కనిపించలేదు. రామ సాక్షాత్కారం కలగ లేదని బాధ పడగా ఒక మహాత్ముడు దర్శనమిచ్చారు లేచి పాద పద్మాలకు సాష్టాంగ దండ ప్రమాణాలు చేశారు. ఆయనే రామతత్వాన్ని పోపోసనపట్టిన శియారఘునాధ శరణ మహారాజ్. వారినోటి నుండి నిరంతరం సీతారాం సీతారం నామం వెలువడుతుంది. వారు "భక్త శిరోమణీ !నీ జపం ఫలించింది. నీ నిష్టా నియమాలు నన్ను ముగ్ధుడిని చేశాయి నీతోమాట్లాదాలని చాలాకాలంగా నాకు కోరిక. "అని చెప్పి తన ఆశ్రమానికి తీసుకు వెళ్లి, రామ పంచాయత మంత్రోప దేశం చేసి, అనుష్టానక్రమం బోధించి "శ్రీరామ శరణ్" అనే దీక్షానామం ఇచ్చారు. ఆమంత్ర జపమూ చేసి నరసదాసుగారు కాశీ వెళ్ళారు.

కాశీలో మంత్రం సిద్ధిపొందాలనుకొని గంగ ఒడ్డున శృంగేరిమఠం మెడ ఏడవ అంతస్తులో గది తీసుకొని, శివ పంచాక్షరి మహామంత్ర జపం చేశారు. తెల్లవారుజామున గంగాస్నానం, విశ్వేశ్వరాభిషేకం చేసి, జపానికి కూర్చునేవారు. మూడు రోజులతర్వాత ఒకరాత్రి విశ్వేశ్వరుడు కలలో కనిపించి "రామ భక్త రత్నమా !నీ సాధన సంతోషం కలిగించింది. రామనామం నిండిన నా హృదయమే నీకు దగ్గరైంది. నువ్వు రామునికి ప్రేమపాత్రుడవు నాకు మిక్కిలి సన్నిహితుడవు. నీ రామ నామ ప్రచారం లో నా శక్తి కూడా నిన్ను ఆవహించి ఫలితమిస్తుంది. రామనామ ప్రచార రత్నంగా కీర్తి పొందుతావు "అని ఆశీర్వ దించాడు. అక్కడ పని పూర్తీ చేసుకొని శ్రీరామ శరణ గారు బృందావనం చేరారు.

బృందావనం లో అడుగడుగునా రాధేశ్యాం భజన అపూర్వమని పించింది దాసుగారికి. అక్కడ శ్రీ ఉడియా బాబా ఆశ్రమం గుహ లో ఉంటూ పునశ్చరణ ప్రారంభించి పూర్తీ చేసేలోపు వారికి శ్రీరాధా కృష్ణుల దివ్య దర్శనమైంది. ఎందరో మహాత్ములతో పరిచయభాగ్యం కలిగింది. అక్కడినుంచి గోవర్ధన క్షేత్రం వెళ్లి, రాధాకృష్ణుల విహార స్థలాలను చూసి పులకించారు. కుసుమ సరోవరం వద్ద ఉంటూ పునశ్చరణ పూర్తీ చేశారు. ఇక్కడా రాధాకృష్ణ సాక్షాత్కారం పొంది,హరిద్వారం చేరారు. భగీరధుని తపస్సు ఫలించి ఆకాశ గంగ భూమిపై కాలుపెట్టిన పవిత్ర క్షేత్రం అది. ఇది నిజంగా వైకుంఠ ద్వారమే. చలి ఎక్కువ. అక్కడ గంగాస్నానం చేస్తూ పునశ్చరణ పూర్తీ చేశారు. అక్కడ శ్రీ కరపత్ర స్వామి దర్శనం లభించి అయన భాషణలు భూషణాలు అనిపించాయి. కొద్దిగా అనారోగ్యమేర్పడగా బుద్దాం వచ్చేశారు.

శ్రీ రామ శరణ్ గారి దర్శనం తో ప్రజల ఆనందానికి అవధిలేదు. అందరూ ఆయన పదపద్మాలను ఆశ్రయించాలని భావించారు. శ్రద్ధ ఉన్నవారికి మంత్ర దీక్ష ఇచ్చారు. గుంటూరు, కృష్ణా జిల్లాలో ఆయన శిష్యబృందం విశేషంగా ఉన్నారు. ఉభయ గోదావరి, కర్నూలు జిల్లాలో బెంగుళూరులో కూడా శిష్య బృందం ఏర్పడింది

కుం దుర్తి వేంకట నరసదాసుగారు తల్లి కూడా చనిపోయాక వైరాగ్యం పెరిగి, బ్రహ్మ చర్యం పాటిస్తూ ప్రయాగ వెళ్లి, బ్రహ్మ చారి ఆశ్రమం లో సాధన చేసి అయోధ్య చేరి, మంత్రం దీక్ష పొంది "షియా రఘువర దాస్"అనే దీక్షానామ ధారియై హిందుస్తానీ సంగీతం నేర్చి, ఆగానంలో నామాన్ని లీనం చేశారు. ఆ నామ గానా మృతం తో జనాలను పరవశ పరచారు. ఆంధ్ర దేశం చేరి చాందస భావాలను పారద్రోలటానికి నామాన్ని ప్రయోగించి మనసులను గెలుచుకొన్నారు.

శ్రీ రఘువర దాసుగారు మన నరసదాసు అంటే శ్రీరామ శరణ గారికి బాగా సన్నిహితులయ్యారు. శరీరాలు వేరే కాని ఆత్మ ఒక్కటే. ఇద్దరివీ రామాయత్త చిత్తాలే.ఆయన గానం యెంత మాధుర్యమో ఈయన ప్రవచనం అంతటి మాధుర్యాన్ని కలిగి ఉండేది. ఆధునికకాలం లో రామనామ ప్రచారం లో వీరిద్దరూ అద్వితీయులై నిలిచారు

## తులసీ రామాయణ ప్రవచనం

శ్రీ రామ శరణ గారు ఉత్తర దేశం లో ఉండి అక్కడ అందర్నీ ప్రభావితం చేసి తులసీ దాసు రాసిన రామ చరిత మానసం ను పూర్తిగా తెలుసుకొన్నారు.. అందులోని విశేషాలు అనేకార్ధాలను చక్కగా విశదీకరించి చెప్పేవారు. ఉన్నత భావ వ్యాప్తియే వారి ముఖ్యోద్దేశం.. బాపట్ల ఆంజనేయ దేవాలయం లో భానువార సంకీర్తనలో పాల్గొనటానికి రాగా సభ్యులు రామనామ ప్రాశస్త్యాన్ని గురించి చెప్పమని కోరారు. వెంటనే తులసీ రామాయణం లోని "వందవు నామ రామ రఘువరకో, హేతు కృశాను భాను హిమకరకో –విధి హరే హరమయ వేద ప్రాణసో,అగుణ అమాపమ గుణ నిదానసా "అనే చౌపాయి ని ఒక గంట సేపు ఉపన్యాసంగా చెప్పారు. ఆ సంఘ సభ్యురాలు శ్రీమతి వల్లూరి రాజమ్మగారు "స్వామీ !మీద్వారా మాకు తులసీ రామాయణం ఆసాంతం తెలుసుకోవాలని కోరిక గా ఉంది "అనగా సరే అన్నారు దాసుగారు.

ఆమె ఒక వారం లోపే ముహూర్తం పెట్టి ఆహ్వానించారు. అప్పటికి దాసు గారు తులసీ రామాయణం లో రెండు మూడు ఘట్టాలు తప్ప చదివి ఉండలేదు. ఎలా చెప్పాలో అంతుపట్టక రెండు రోజులు సంస్కృత శ్లోకాలతో కాలక్షేపం చేశారు. మూడవ రోజు మందిరం లో కూర్చుని శ్రీరామునితో "రామా !ఏదో మొహమాటానికి తులసీ రామాయణ ప్రవచనానికి ఒప్పుకొన్నాను. నాకు ఆభాష కొత్త.నువ్వు తులసీ దాసు హృదయాన్నుంచి పలికించావు. ఇప్పుడు మీరిద్దరూ నా హృదయం లో ఉండి పలికించాలి "అనగా రాముడు నవ్వి నట్లు కనిపించగా, ఆ ధైర్యం తో అవధి భాషలోని తులసీ రామాయణ ప్రవచనం మొదలు పెట్టారు. కొన్ని ఘట్టాలు తాను ఎలా పలికారో ఆయనకే తెలీదు. ఆ ఉపాధి ద్వారా ఎన్నెన్నో విషయాలు జనరంజకం గా ప్రవచనం చేశారు. శ్రీరమ చంద్ర మూర్తి స్వయంగా తనద్వారా పలికించాడని దాసుగారి పూర్తీ విశ్వాసం.

## కథా సంకీర్తనం

పట్టు వస్త్రాలుకట్టి చేతిలో చిడతలు ధరించి ఆర్తిగా రామా రామా అంటూ చిందులేస్తూ, నామనామ గానం మధురాతిమధురం చేస్తూ చూపరులకు పరవశం కలిగించేవారు శ్రీ రామ శరణ. తానూ తన్మయులై భక్తులను తన్మయత్వం లో ముంచి తేల్చేవారు. ఎవ్వరికీ ఇహ లోక స్పృహ ఉండేదికాదు. భక్తి మహా సముద్రంలో మునిగి తేలేవారు అందరూ.

## ఉపన్యాసం

శ్రీ రామ శరణ గారు ఉపన్యసిస్తుంటే మాటలు తేనెల ఊటలు గా జాలు వారేవి వేదం శాస్త్ర పురాణ ఉపనిషత్తులనుండి ఎన్నో ఉదాహాహరణలు దొర్లి, ప్రేక్షకహృదయాలు ఆనందరస ప్లావితమయ్యేవి. భగవన్నామముతో ప్రారంభించి అందరి చేతా చేయిస్తూ ఆపైన ఉపన్యాసం ప్రారంభించి గొప్ప నేపధ్యాన్ని కలిగించేవారు. కంతేరు గ్రామం లో వారు చెప్పిన ఉపన్యాసం చిర స్మరణీయం. సంకీర్తన విగ్రహారాధన ఇష్టం లేని ఆగ్రామ ప్రజలు అత్యంత ఆశ్చర్యం తో విని, ముగ్ధులై అనుమానాలన్నీ పటాపంచలు చేసుకొని భక్తివాహినిలో కలిసిపోయారు. దురా చారులు వీరి ఉపన్యాసంతో సదా చారులయ్యారు. చాలామంది నాస్తికులు ఆస్తికులయ్యారు ఇదంతా దాసుగారి ప్రభావమే.

కృష్ణా జిల్లా దివి తాలూకా పేక నూరు గ్రామం లో నామ సప్తాహం జరుపుతుంటే కొందరు పాషండులు రామనామం తో ముక్తి రాదనీ వాదిస్తే "రామేతి వర్ణద్వాయ మాదరే ణ సదా స్మరన్ ముక్తి సముపైతి, జంతుః","రామయను రెండక్షరములు నాదరముతో సదాస్మరించిన ముక్తి పొందును "అనీ, "రామనామ

సముత్పన్నః ప్రణవో మోక్షదాయకః "7కోట్ల మహా మంత్రాలలో రామనామమే గొప్పదని, అనేక ఉదాహరణలతో ప్రసంగం చేసి సంకీర్తన ప్రారంభించగా భక్తులు పరవశంతో ఉర్రూత లూగి పోయారు. గ్రామప్రజలు పశ్చాత్తాపం ప్రకటించి మన్నించమని కోరారు. రామ శరణ గారి ఉపన్యాస మహిమ గానగరిమ అంత గొప్పవి. ఆంధ్ర దేశం లోని వార్షికోత్సవాలలో తప్పక వారి ప్రసంగం ఉండి తీరాల్సిందే. లాక్షణిక, తార్కిక, వైయాకరణ సభలలో కూడా వారి ప్రసంగం హై లైట్ గా ఉండేది.

పగోజి ఆకుల ఇల్లిందపల్లి లో సప్త సప్తాహాలు దాసుగారి ఆధ్వర్యం లో జరిగాయి. తులసీ రామాయణ ఉపన్యాసం నామ సంకీర్తన ధార్మిక ప్రసంగాలతో ఆ సప్తాహాలు గొప్ప విజయం సాధించాయి అక్కడ నారాయణ స్వామి అనే భక్తునికి దాసుగారు "హరేరాం "దీక్షనిచ్చారు. ఆయన హరేరాం బాబా గా ప్రసిద్ధి చెందారు. ఈబాబా గారి ఆధ్వర్యం లో కవిటం అనే ఊర్లో 100 రోజులు అఖండ హరేరామ సంకీర్తన జరిగింది. కాకుల ఇల్లిందపల్లి లో ద్వాదశ వార్షిక హరి రామ నామ సంకీర్తన జరిగింది.

రామకోటి మన శ్రీ రామ శరణ గారికి చాలా ఇష్టం.. 2కోట్ల రామ నామం రాసిన పుణ్యాత్ములాయన. రామకోటి ప్రభావాన్ని చెప్పి ఎందరితోనో రాయించారు. 1946 నుంచి రామనామంతో ఏరిన బియ్యాన్నే వండుకొని తింటున్నారు. గ్రామస్తులతో కూడా అలాగే చేయిస్తూ మరోరకమైన రామనామ ప్రచారం సాగించారు. రామనామ బియ్యపు అన్నమే తాను తినటానికి కారణాన్ని వివరిస్తూ "నేను కంటితో రాముని, రామభక్తులి రామనామాన్నీ,ప్రపంచాన్నీ సీతారామ మయంగా చూస్తున్నాను. చెవులతో రామ చరిత వింటాను. నోటితో రామనామమే పలుకుతాను, దాన్ని గురించే మాట్లాడతాను. ముక్కు శ్వాస మీద రామనామ జపం చేస్తాను. చేతులతో రామనామం రామకథలు రాస్తూ ఉంటాను.కాళ్ళతో రామభక్తుల దగ్గరకు, రామాలయాలకు వెడతాను. మనసులో రామ రూప ధ్యానమే చేస్తాను. ఇక మిగిలిన ఈ పంచ భౌతిక శరీరాన్ని అంటే అన్నమయ కోశాన్ని రామ నామం తో ఏరిన బియ్యాన్నే అన్నంగా వండి రాముడికి నైవేద్యం పెట్టి తింటాను. అప్పుడు నేను ఈ పాంచ భౌతిక శరీరం తో సహా శ్రీరముడినే అవుతాను. నేను రామ సాగరం లో, రామనామం తో పుడతాను. రామనామం తో పెరుగుతాను రామనామం తో చనిపోతాను "అదీ నరసదాస శ్రీరామ శరణ గారి అనన్య భక్తి. ఇలాంటి వారిని మనం చూసి ఉండం.

## మహాత్ముల సాంగత్యం, పరిచయాలు

అపర వ్యాసులుగా ప్రసిద్ధులైన శ్రీ ప్రభుదత్త బ్రహ్మ చారి ప్రయాగ వాసి. బ్రహ్మ చర్యం లో శుక మహర్షి. పరమ తపో నిష్టా గరిష్టులు "శ్రీ కృష్ణ గోవింద హరే మురారే, హే నాథ నారాయణ వాసుదేవ "మాత్రమె ఉచ్చరిస్తారే కానీ ఇతర మాటలేవీ మాట్లాడారు. ఉదయం త్రివేణీ స్నానం ఆతర్వాత ఉదయం 8గంటలనుంచి సాయంత్రం 4 వరకు జపధ్యాన పూజ,పురాణ ప్రవచానాదులు, రాత్రి భజన వారి దిన చర్య. గంగ ఒడ్డున ప్రతిష్టానపురం అనే ఝూసీ లో ఆశ్రమం లో ఉంటారు. అనుష్టానం భజన ఒక చోట, ప్రవచనం వేరొక చోట జరుగుతుంది. ఆశ్రమవాసులు యాభై మంది దాక ఉంటారు. భోజన శాల వేరు. ఇవికాక సంకీర్తన మందిరం వేరుగా ఉంది. ఇందులో పగలు అఖండ నామం జరుగుతుంది. సంస్కృతం నేర్చుకొనే విద్యార్ధులు పాళీలు గా నామం చేస్తారు. గొప్ప పండితులు ఉంటారు. వీరు బ్రహ్మ చారిగారు రాసిన.. భగవత్ చరిత "ను నిత్యం పురాణంగా ప్రవచనం చేస్తారు.

బ్రహ్మ చారి గారు గొప్ప హిందీ కవి. భాగవతాన్ని హిందీలోవ్రజభాషలో రాశారు. అవి" చప్పలు "(చౌపాయి)అంటే హిందీ పద్యాలుగా ఉండి,గానానికి అనుకూలంగా మహా రసోపేతంగా ఉంటాయి. ఇదికాక బదరీనాద్ దర్శన్, మహాకర్ణ, భక్త మీరాబాయి వంటి గద్య రచనలు కూడా రాశారు. వీరు రాసిన చైతన్య చారితావళి5సంపుటాల బృహద్గ్రంధం. 1941 లో నిరాటంక సంకీర్తన మహాయజ్ఞం జరిగినపుడు మన శ్రీ రామ శరణ గారికి బ్రహ్మ చారి గారితో పరిచయమేర్పడింది. వారి సమక్షం లో హిందీలో చక్కని ప్రసంగం చేశారు మన దాసుగారు. అది తెలిసి మహదానందం తో దగ్గరకు పిలిచి, దాసు గారి గురించి పూర్తి వివరాలు అడిగి తెలుసుకొన్నారు. తమ చైతన్య చరితావళి ని తెలుగులోకి అనువదించమని దాసుగారిని కోరారు. సుందర మధుర తెలుగులో దాసుగారు అనువాదం చేశారు. అది స్వయంగా ఆయనే తెలుగులో రాసిన గ్రంథం గా ఉంది. చైతన్యప్రభు బాల్య యవ్వన కౌమారాది దశలు అందులో వారు చిందించిన హాస్యలహరి రమణీయంగా రాశారు.

మొదటి సారిగా శ్రీ ప్రభు దత్త బ్రహ్మ చారిగారిని గుంటూరుకు ఆహ్వానించి ఆంధ్రులకు పరిచయం చేశారు దాసుగారు. బుద్దాం లో దాసు గారింటికి ఆయన వెళ్ళారు. అక్కడి రమచ్యుత మందిరానికి పాలరాతి విగ్రహాలు ఆయనే అందించారు. ఆతర్వాత చాలా సార్లు వచ్చారు. బ్రహ్మ చారిగారు భాగవత చరితలోని చౌపాయీలను " భాగవతీ కథా" అంటే భాగవత దర్శనం అనే పేరుతొ108 గ్రంథాలు రాయటం ప్రారంభించి, 60పూర్తి చేశారు. ఇదేకాక భారత భాగవత పురాణ ఉననిషత్తు లు సంహితలలోని విశేషాలను క్రోడీకరించి సందర్భాన్ని బట్టి భాగవత దర్శనం లో నిక్షిప్తం చేశారు. 18పురాణాలను స్వయంగా చదివి, పండితులద్వారాకూడా విని దానిలోని సారాన్ని అందించారు. ఏ ఆధ్యాత్మిక సంస్థ కూడా అంతటి గొప్ప రచనను వెలు వ రించి ఉండలేదు. ఒంటిచేతితో బ్రహ్మ చారి గారొక్కరే అంతటి బృహత్ కార్యక్రమాన్ని నిర్విఘ్నంగా పూర్తి చేశారు. ఈ ఉత్తమ గ్రంథ ప్రచారానికి సమర్ధులు నరస దాసుగారే అని విశ్వసించి దాన్ని తెలుగులో అనువదించమని ఆదేశించగా 48భాగాలు అత్యంత సుందరమైన ఆంధ్రం లో అనువాదం చేశారు. అన్నిటినీ ఒకే సారి ముద్రించే శక్తి లేక ఒక్కొక్కటిగా ముద్రించారు. "భాగవత గ్రంధమాల "అనే సంస్థ స్థాపించి మహారాజపోషకులు, రాజపోషకులు, సభ్యులు అని వేర్వేరుగా విభజించి 14భాగాలు ముద్రించారు. ఒక వందరూపాయలు చందా కట్టిన సభ్యులకు ప్రతి పుస్తకం ఉచితంగా అందించారు. నెలకు రెండు రూపాయలు పంపిస్తే చాలు పుస్తకం పంపేవారు. ఇంటింటికీ ఆపుస్తక మహాప్రసాదం అందేట్లు చేశారు దాసుగారు.

మర్రిపూడిలో హరేర్నామ సప్త సప్తాహం మహా వైభవంగా జరిగింది. దాని కి వీరయ్యగారు ప్రధాన కార్యకర్త. ఎన్నో భక్త బృందాలు వివిధ ప్రాంతాలనుంచి వచ్చి పాల్గొని వీనుల విందు చేశాయి. శ్రీ అవదూతేంద్ర సరస్వతి శ్రీ రామ శరణ గారు యాజమాన్యం వహించి తమ తమ అనుయాయులతో మహావైభవంగా దిగ్విజయం

చేశారు. ప్రభుదత్త బ్రహ్మ చారిగారిని ఆహ్వానించ గా విచ్చేసి పాల్గొని ఆతర్వాత చాలా గ్రామాలలో పర్యటించారు. ప్రతి చోటా నరసదాసుగారి కథాసంకీర్తన ఉండాల్సిందే. ఆమహోత్సవ సందర్భంగా మన దాసుగారికి "మహా మండలేశ్వర "బిరుదునిచ్చి సత్కరించారు.

బ్రహ్మ చారిగారు బృందావనం లో ఉన్నారు. యమున ఒడ్డున సుందరభవనాన్ని ఆశ్రమంగా నిర్మించుకొని నిత్యకార్యక్రమాలు చేస్తున్నారు. యమున అవతలి ఒడ్డున యాభై ఎకరాలలో గోవులను మేపుతూ గోసేవ చేస్తూ ఆరునెలలు ఉన్నారు. దీనికి "గోలోకం "అనిపేరు. అది పూర్తికాగానే 50రోజులు అఖిలభారత ఆధ్యాత్మిక సమ్మేళనాన్ని నిర్వహించారు. దేశం నలుమూలలనుండి మహా పండితులు, కవులు గాయకులూ పాల్గొని విజయవంతం చేశారు. విజేతలకు బహుమతులు అందజేశారు. అఖండ నామ సంకీర్తనలు కూడా జరిగాయి. శ్రీ రామ శరణ దాసుగారిని ప్రత్యేకంగా ఆహ్వానించి "భాగవత చరిత వ్యాస్ "బిరుదు ప్రదానం చేసి ఆత్మీయంగా సన్మానించి గౌరవించారు. దాసుగారి నామ ప్రచారాన్ని సభలో గొప్పగా కీర్తించారు.

నిరంతర బ్రహ్మ నిష్ఠ లో ఉండే శ్రీ ఉడీరాం బాబాజీ దాసుగారిని ప్రేమ ఆప్యాయతలలతో వీక్షించారు. శ్రీ శివానంద బ్రహ్మ చారిద్వారా శ్రీ కృష్ణ దర్శన భాగ్యం పొందిన హరిబాబా గారు పరిచయమయ్యారు. జగన్మాతగా ప్రసిద్ధి చెందిన మాతా ఆనంద మయీ గారు కూడా పరిచయాయ్యారు. బృందావన్ లో సరోజినీ మాతా, బిదుబ్రహ్మచారి, ఆచార్య రాఘవా చారి, చక్రపాణి జీ మహారాజ్, మాతా మీరాబాయి జీ, బంకే బిహార్ లాల్ జీ మొదలైన మహానుభావులతో దాసుగారికి పరిచయభాగ్యం లభించింది. నైమిశారణ్య నరనారాయణ సోదరులు ప్రయాగలో దాసుగారికి దర్శనమిచ్చారు. ఆజానుబాహులు అద్వితీయ బలసంపన్నులు అయిన ఆసోదరులలో తేడా ఏమీ కనిపించకపోవటం ఆశ్చర్యమేసింది. ఇద్దరూ పద్మాసనం లో కూర్చుంటే ఆ సోదరులకు రోజులు కొన్ని క్షణాలుగా గడిచిపోతాయి.బీహార్ లో బరైలీ రాజు శ్యామానంద జీ ప్రయాగలో విరాట్ సంకీర్తన సభలో మన దాసుగారి ఉపన్యాసం విని పరవశించారు.. ఆయన బరైలీ ప్రాంతమంతతా వాయిద్యాలు సప్లై చేసి సంకీర్తన సంఘాలు స్థాపించాడు. శ్రీ పండిత సుదర్శన్ శ్రీ శరణానంద జీ, శ్రీ హరేరాం బాబా, మున్షీ కన్హయలాల్ జీ మొదలైన సాదుపుంగవులతో పరిచయమేర్పడింది. కాశీలో 150 ఏళ్ల శ్రీ హరిహరబాబా దర్శనం లభించింది. అక్కడే రామరాజ్య పరిషత్ అధ్యక్షులు శ్రీ కరపత్ర స్వామి తో మాట్లాడే అవకాశం కలిలిగింది. రుషీ కేశ్ లో స్వర్గాశ్రమం లో గీతాభవన్ ప్రతిష్టాపకులు, మహాదాత శ్రీ జయదయాల్ గోయంకా గారితో ఘునిష్ట పరిచయం కలిగింది. స్వామి శివానంద అనుగ్రహమూ లభించింది.

పుట్టపర్తి శ్రీ సత్యసాయి బాబాతో దాసుగారి పరిచయం కలిగి ఆయన నిర్వహించిన సనాతన భాగవత సప్తాహం లోతామూ సభ్యులుకనుక 104 డిగ్రీలజ్వరం తో తుగలపాలెం నుంచి వెల్లి పాల్గొనగా, అక్కడికి చేరగానే జ్వరం మాయమైంది. బాబాగారికి నమస్కరించగానే బాగా పరిచయం ఉన్నట్లు మాట్లాడారు. మంత్ర శాస్త్ర ప్రవీణులు హనుమదుపాసకులు శ్రీ శిష్ట్లా చంద్ర మౌళిగారు అధ్యక్షత వహించిన సభలో బాబా గారు మన దాస్సుగారి దగ్గరకు వచ్చి చెవిలో సంకీర్తన ప్రాధాన్యతపై ఉపన్యాసం చేయమని చెప్పారు. నరసయ్య గారి ఉపన్యాసం మహా రసవత్తరంగా శ్రోతలమనసులను రంజిల్ల జేసింది.. బాబా బాగా సంతోషించి సంఘు సభ్యులందరికీ తలొక వంద రూపాయలు అందజేసి సన్మానించారు. వారి అనుచరులకు కూడా చార్జీలు ఇచ్చారు. నరస దాసుగారిని ప్రత్యేకంగా వేదికపైకి పిలిచి ఆప్యాయంగా భుజాలపై చేయి వేసి, ఆప్యాయంగా మాట్లాడి ఒక బంగారు రూపాయను మెడలో ధరించటానికి ఇచ్చారు. పట్టు వస్త్రాలతో పాటు రెండువందల రోపాయలు కూడా అందించి సత్కరించారు. శివరాత్రి నాడు 500 మంది బ్రాహ్మణ బాలకులకు ఉపనయనం చేసి వారికి అయిదువందల పళ్ళాలులు ఉద్ధరిణలు అయిదు వందల రూపాయలు అందించారు. అప్పుడు శ్రీ రామ శరణ గారు గాయత్రీ మంత్రాన్ని గురించి రామనామాన్ని గురించి రెండిటిని సమన్వయము చేస్తూ అద్భితమైన ప్రసంగం చేశారు. "బాగు బాగు "అని బాబా బహు మెచ్చారు.

తర్వాత మహా వైభవంగా జరిగిన బాబా గారి జన్మ దినోత్సవానికి కూడా దాసుగారు వెల్లి పాల్గొన్నారు. వేలకొలది యాత్రికులకు బాబా ప్రసాదం లభించింది, హడావిడి తగ్గాక బాబా దాసుగారి వద్దకు వచ్చి మహా ఆప్యాయంగా సంభాషించారు. ఇంటి విషయాలన్నీ పూస గుచ్చినట్లు చెప్పారు. "మీ ముఖ్యమైన కోరిక చెప్పండి "అని అడిగితె దాసుగారు "స్వామీ !మీ స్మరణ చాలునాకు. నన్ను నమ్ముకొన్న నాశిష్యులకు మోక్షం ఇవ్వటానికి అనుగ్రహించండి. ఇదే నాకోరిక ఇంకే కోరికా నాకు లేదు "అనగా బాబా సంతోషించి "ఇలాంటి కోరిక ఉన్నవారినినేనేక్కడా చూడలేదు. మీది చాలా దయార్ద్ర హృదయం. శిష్యవాత్సల్యం నిజంగా మీదగ్గరే ఉంది "అని మృదుహస్తం తో దాసుగారి శరీరాన్ని నిమిరారు. దాసుగారికి బాబా గారి పరిచయం వల్లనే గుంటూరు భక్త సమాజం వారికి బాబా గారి దర్శన భాగ్యం కలిగింది.అప్పుడు ఆధ్యాత్మిక సాధన గురించి బాబా అమృతోపమానమైన ప్రసంగం చేసి సభ్యులను ఆనంద డోలికలలో ఉర్రూత లూగించారు.

### శ్రీ రామ శరణ్ గారి రచనలు

శ్రీ రామ శరణ్ గారు "రామ మంత్రానుష్టాన క్రమం"రాశారు అందులో సర్వమత సమ్మతం కనిపిస్తుంది. రామ తత్వాన్ని బహు సుందరంగా దానిలో నిక్షిప్తం చేశారు. శ్రీరాముడు సకల శక్తి స్వరూపుడు. ఆయనే శివుడు, సూర్యుడు విష్ణువు, వినాయకుడు అని చెప్పారు. శివ, నారాయణ, గాయత్రి మంత్రాలలోని బీజాక్షరాలు రామ మంత్రం లోనివే అనీ, మంత్రానునుష్టానికి మడిగా కట్టుకోవాల్సిన దవళీ వగైరా విశేషాలనూ వివరించారు. వేద సంహిత, ఉపనిషత్, పురాణాలనుంచి ఎన్నో ఉదాహరించారు.

వీరి "నవవిధ భక్తులు "లో వాటిని పూర్తిగా అనుభవించి రాసినదే. భగవంతుని అవ్యాజ కరుణా విశేషాలు, భగవంతుడు భక్తుల యెడ ప్రవర్తించే విధానం సంపూర్ణంగా వివరించారు. "కలిసంతనోప నిషత్ " లో కలియుగం లో అందరూ సులభ సాధ్యంగా ఆచరించాల్సిన విధానాలు, శ్రీరామనామ ప్రభావం, సంకీర్తన పద్ధతి మొదలైనవి రాశారు.

శ్రీ ప్రభు దత్త బ్రహ్మ చారి గారి అయిదు భాగాల "చరితా వళి" ని చక్కని తెలుగులో అనువదించారు. శ్రీ బల దేవ ఉపాధ్యాయ్ గారి "భారతీయం "అనే ఉత్తమ వేదాంత గ్రంథాన్ని సరళ తెలుగులో అనువదించారు. శ్రీ హనుమాన్ పొద్దార్ గారు హిందీ లో రాసిన "బ్రహ్మ "అనే గ్రంథాన్ని తెలుగు చేశారు.

### మందిర స్థాపనలు

శ్రీరాం శరణ్ గారు బుద్ధాం లో శ్రీ రమాచ్యుత మందిరాన్ని నిర్మించటమేకాక వారి శిష్య బృందం ఉన్న చోట్లకూడా మందిరాలు స్థాపించారు. నెల్లూరుజిల్లా రామ గోవిందాపురం అనేచిన్నగ్రామం లో సూర్పరాజు సూర్యనారాయణ అనే ఉపాధ్యాయుడు దాసుగారిశిష్యుడు. తనడబ్బును ఊరిజనులు సంతోషంగా ఇచ్చిన విరాళాలతో సీతారామ లక్ష్మణుల చలువరాతి విగ్రహాలను గురువుగారి ద్వారా తెప్పించి, తన ఇంటి ప్రక్కనే అందమైన మందిరం లో ప్రతిష్టింప జేశారు. కొన్నేళ్ళు గురువుగారి ఆధ్వర్యం లో వార్షికోత్సవాలు జరిపారు. ఆర్ధికభారం పెరిగిపోవటం తో ఆ తర్వాత మానేశారు.

కృష్ణా జిల్లా దివి తాలూకాలోరాం శరణ్ గారి ఆధ్వర్యం లో చాలామందిరాలు వెలిశాయి. కమ్మనా మోలులో స్త్రీ పురుషులు అందరూ కమ్మగా సంకీర్తన చేస్తారు. శిష్యుడు మద్ది ఆంజనేయులు గురువు ఆశీర్వాద బలం తో చందాలు వసూలు చేసి చాలా గ్రామాలలో చలువరాతి సీతారామంజేయ విగ్రహాలు స్థాపించారు. చిన్న గ్రామాలైనా ప్రతిష్టలు మహా గొప్పగా జరిగేవి. గుంటూరు క్షేత్ర సభ్యులు ప్రతి ఏడాదీ వచ్చి సంకీర్తన చేసేవారు. శ్రీ రఘువర దాసుగారు ఒక నెలరోజులు అక్కడే ఉండి వైభవోపేతంగా సంకీర్తన నిర్వహించారు. వీటన్నిటికి ముఖ్యకారకులు మన దాసు గారే.

తమ తర్వాత అర్చకులుగా ఒక సద్బ్రాహ్మణుడు శ్రీ శాస్త్రిగారిని దాసుగారు నియమించారు. మందిర నిర్మాణం దగ్గర్నుంచి పదేళ్ళు ఉత్సవాలు ఘనంగా జరిగేవి. నిత్యం ఉదయం సాయంత్రం సహస్రనామ పూజ, రాత్రి భజన, పవళింపు సేవ ఉదయం సుప్రభాతం జరిపేవారు. దీనికి దగ్గరే ఉన్న తుంగలవారి పాలెం లో గురువుగారి శిష్యులు సంకీర్తన చేశారు. ఇక్కడ గురువుగారు "అష్టోత్తర శత ఏకాహ అఖండ హరేర్నామ సంఘం "స్థాపించారు. ఈ సంఘం పరిసరగ్రామాలలో ప్రతి ఏకాదశికి ఏకాహం చేసేవారు. ఆహ్వానం రాకున్నా వెళ్లి పాల్గొనేవారు. ఎనిమిది ఏకాహ దశు లలో 108 ఏకాహాలు చేశారు. వీరి నామ ప్రచారం పెద్ద ఎత్తున జరిగేది. గురువుగారుపాల్గొని మందిర నిర్మాణం నామ ప్రాశస్త్యం లపై ఉపన్యాసాలిచ్చేవారు పాలరాతి విగ్రహ స్థాపన చేయించేవారు. తుంగల నాగభూషణం సంకీర్తన ప్రియులు. వీరి ఆధ్వర్యం లో ఆనందంగా ఆకర్షణ గా భజనలు జరిగేవి. దీనికొక మైలు దూరం లో కృష్ణానది ఒడ్డునే(నాగాయలంక ) శ్రీ రామపాద క్షేత్ర దేవాలయం ఉంది. ముందు రామపటం పెట్టి మందిరం కట్టి తర్వాత విగ్రహాలు పెట్టారు. ఇక్కడి రేవు నుంచి పెనుమూడికి లాంచీలు నడుస్తాయి. శ్రీరామ శరణ్ గారు ఈమందిరం దర్శించి ప్రసంగం చేశారు. దీనికి దగ్గరున్న మర్రిపాలెం లోనూ మందిర నిర్మాణం చేశారు. ఇక్కడ గొప్ప సంకీర్తన సంఘం ఉన్నది. ఇక్కడి వారంతా దాసుగారి శిష్యులే. అత్యంత ఉత్సాహం తో ఏకాదశినాడు అఖండనామం చేస్తారు. కార్యదర్శి సనకా వెంకటేశ్వరరావు చాలా శ్రద్ధగా అన్నీ జరిపిస్తారు. దీనికి 5మైళ్ళ దూరం లో అవనిగడ్డ పోలీసు స్టేషన్ లో ఒక మందిరం కట్టి శ్రీమా శరణ్ గారి ద్వారా శ్రీ వేణుగోపాల స్వామి విగ్రహం ప్రతిష్టించారు. దీని ముఖ్యకార్య కర్త జి వెంక టప్పయ్య నాయుడు గారు.

అవని గద్దకు దగ్గరలో ఉన్న బందలాయ చెరువు గ్రామ వాసులు భౌతిక వాదులే అయినా నైతికానికి ప్రాధాన్యమిస్తారు. ఈగ్రామం లో దాసుగారి శిష్యులు 20 మంది ఉన్నారు అందులో పర్చూరు పోతురాజుగారు అద్వితీయ భక్తులు. ఆయన ప్రోద్బలం లో అక్కడ రామమందిర నిర్మాణం జరిగింది. దాసుగారి ద్వారా శ్రీ సీతా రామ ఆంజనేయ పాలరాతి విగ్రహాలు తెప్పించి శ్రీరామజయరామ జయజయరామ అనే అఖండ నామం మారుమోగుతుండగా ప్రతిష్టించారు. అఖండ నామ సంకీర్తనలు వార్షికోత్సవాలు గొప్పగా జరిపేవారు.

బాపట్లలోని శంకర విద్యాలయం లో వేదం సంస్కృతం స్మార్తం బోధిస్తున్నారు. శ్రీరమ శరణ్ గారు దీనికి నాలుగు వందల రూపాయలు అందించి ఒక శ్రీరామ శరణ మం డపాన్ని కట్టించారు. దీన్నిశ్రీ శృంగేరీ పీఠాదిపతులు ఉద్ఘాటనం చేశారు. దాసుగారు అనేక చోట్ల దేవాలయాల అవసరం, అవి భక్తీ శ్రద్ధలకు ఎలా తోడ్పడుతాయో, దేవాలయ ఉత్సవాల ప్రాశస్త్యం మొదలైన ఆధ్యాత్మిక విషయాలపై ప్రసంగాలు చేసేవారు. సంకీర్తన ఉపన్యాసం భజన, పురాణ ప్రవచనాల అవసరాలను వివరించేవారు.

### రామ నామ మయ రూపం

వాసుదాసు గారు రామమంత్ర మహిమ బోధించిన నాటి నుంచి నరస దాసుగారి మనసంతా రామనామం తో నిండిపోయింది. రోజుకు 21 వేలకు పైగా జపం చేస్తూ, 10 వేలకు పైగా రామకోటి రాస్తూ, రాత్రిళ్ళు రామభజన చేస్తూ, అర్ధరాత్రి ధ్యాననిమగ్నమౌతూ మంత్ర సిద్ధిపొందారు. మనో నిశ్చయానికి జపం ముఖ్య సాధన. పద్మాసనం లో నిటారుగాకూర్చుని, మనసులో రామ చంద్రుని మూర్తి ని నిలిపి, పాదాలలో ఒక వంద, మోకాళ్ళపై ఒక వంద ప్రక్కల ఒక వంద, ముఖం లో ఒక వంద ముఖం నుంచి పాదాలవరకూ అక్షరమాలతో జపం చేస్తూ ఉండటం తో దాసుగారి మనసులో రాముడు పూర్తిగా కొలువై ఉన్నాడు. ఆయనలో దాసుగారు లీనమయ్యారు. వారి వాక్కులు రోజుకు ఎన్ని నామ స్మరణాలు చేశాయో లెక్క లేదు. భజనలో నామ సంకీర్తనం లో ఉపన్యాసాలలో హార్మోనియం పైనా, వార్షికోత్సవాలలో, ఎన్ని గంటలు రామనామం స్మరించారో చెప్పలేము.

తులసీ రామాయణం శ్రీ రామ శరణ్ గారి వాలకు మరింత మాధుర్యం కలిగించింది. రామ చరితమానస ను ఎన్నిచోట్ల ఎన్ని సార్లు ప్రవచనం చేశారో లెక్క లేదు. అన్ని వేళలో రామనామమే. ఉపవాసం నాడు మరీను. 2కోట్ల రామనామం రాసి అరుదైన రికార్డ్ నెలకొల్పారు, రాసేటప్పుడుకూడా శ్రీరామ శ్రీరామ అనాల్సిందే. రామాయణాన్ని అంతటినీ బొమ్మలుగా చిత్రించారు వాటిని గుంటూరు రామకోటి మందిరం లో చూడవచ్చు. రామనామం తో బియ్యపు గింజలు ఏరి వాటితో

అన్నం వండుకొని రాముడికి నైవేద్యం పెట్టి భోజనం చేసేవారు. ఆనంద రామాయణం లో రామ భక్తులు రామనామ వస్త్రాలు ధరించాలి అని ఉన్నదాన్ని ఆచరణలో పెట్టి నిత్యం ధరించేవారు.

## స్వభావం

మనిషి స్వభావమే సుందరమైన ఆభరణం.. స్వార్ధ రహితమై నిష్కల్మషమై, ప్రజాహితమైనది శ్రీ రాం శరణ్ గారి స్వభావం. కోమల హృదయులు. ఉన్నత విశాల భావాలు వారిలో ఉన్నాయి. ఆదరాభిమానాలు చూపటం లో ఎవరూ ఆయనకు సాటిరారు. చిరునవ్వుతో ఆహ్వానించి ఆప్యాయంగా ఆత్మీయంగా ఆతిధ్యమిస్తారు. బాధా సర్ప దష్టులకు వారి ఉపదేశాలు అమృతపు ఊటలుగా ఉంటాయి, అందరూ వారికి సమానులే. అందరూ శ్రీరామ సంతానమే వారికి. వారి ఆదరణ ఆనంద మయం చేస్తుంది.

నిరాడంబర సద్గురు శిరోమణి మన దాసుగారు. కామినీ కాంచనాలకు దూరం కీర్తి కాంక్ష లేదు. వినయ విధేయతలు,సదా చారం వారి సహజ ఆభరణాలు. ప్రేమ పూర్వకంగా ఎవరైనా వస్త్రాలు ఇస్తే ధరిస్తారు కానీ విలాసవంతమైన దుస్తులు ధరించరు. శుద్ధ సాత్విక భోజనమే ఆహారం. ప్రతి దానినీ సద్వినియోగం చేస్తారు. ఆయనలో భక్తిజ్ఞాన కర్మలు త్రివేణీ సంగమం లాఉంతాయి. అంతులేని శిష్యవాత్సలయం ఉన్నవారాయన. పుట్టపర్తి సాయి బాబాగారితో తమ శిష్యులకు మోక్షాన్ని ప్రదానం చేయమని కోరారంటే వారు మెచ్చారంటే వారికి ఎంతటి శిష్యవాత్సల్యమున్నదో అర్ధమౌతుంది. ఎందరెందరో సాదు పురుషులతో దివ్యపురుషులతో మహాత్ములతో వారికి అత్యంత సాన్నిహిత్యమేర్పడింది.

## షష్టిపూర్తి ఉత్సవం

నరసదాసు గారికి అరవై ఏళ్ళు నిండగానే శిష్యులు అభిమానులు మిత్రులు పెద్దలు 27-4-65 నుండి మూడు రోజులు త్రయాహ్నికంగా ప్రయాగ లోషష్టి పూర్తీ మహోత్సవం నిర్వహించారు. శ్రీ మహా మండలేశ్వర, శ్రీ భాగవత చరిత వ్యాస,శ్రీరామ శరణ్ శ్రీ కుందుర్తి వెంకట నరసయ్య దాసు పాకయాజి గారి షష్టి పూర్తీ మహోత్సవం లో వారి అభిమానులు శిష్యులు అందరితోపాటు శ్రీగాయత్రీ పీతులు శ్రీవిద్యా శంకర భారతీ స్వామి పాల్గొని ఆధ్వర్యాన్ని వహించారు. సంకీర్తన హరికధ, ఉపన్యాసాదులు నిర్విరామంగా మూడురోజులు మహా వైభవంగా జరిగాయి.

26-4-65 న బుద్దాం దగ్గర తుంగభద్ర వద్ద దాసుగారికి క్షుర కర్మాదులు,ప్రాయశ్చిత్త మృత్తికా స్నానాలు జరిగి, అర్నాడు హరేర్నామ ఏకాహం నిర్వహించారు చైత్ర బహుళ ద్వాదశి 28-4-65 శ్రీఆమ శరణ్ దంపతులు శ్రీ విద్యా శంకర భారతీ స్వామి వారికి పాద పూజ,చేశారు తర్వాత దాసుగారి దంపతులకు శిష్యబృందం గురుపూజ చేశారు. శ్రీ నేటి వెంకట నారాయణ మూర్తి దంపతులు, విస్సం శెట్టి నాగభూషణం దంపతులు గంగాజలం తో దాసుగారికి అభిషేకం, పాద పూజ జరిపారు. సాయంత్రం వంగీత సుబ్బరాయ శాస్త్రులవారి ఉపన్యాసం, శ్రీ పద్యాల వేంకటేశ్వర భాగవతార్, అమ్ముల రంగనాధ దాసు భాగవతార్ లు హరికదాగానం చేశారు. శ్రీ రాగం ఆంజనేయులు, శ్రీ కంభం మెట్టు మధుసూదన రావు లు కదా సంకీర్తనం చేశారు.

29-4-65 చైత్రబహుల త్రయోదశినాడు ఉదయం విఘ్నేశ్వరపూజ, పున్యాహవాచనం, మంటపారాధన చేసి, శ్రీ అర్వపల్లి వెంకటేశ్వర్లుగారు, శ్రీ పీసపాటి మృత్యుంజయావదానులుగారు హోమాలు, పూర్ణాహుతి నిర్వహించారు సాయంత్రం షష్టి పూర్తీ అభినందన సభ జరిగింది. శ్రీ గాయత్రీ పీఠాదిపతులు అధ్యక్షత వహించి దాసుగారి ప్రతిభావిశేశాలు సేవా విశేషాలు సవివరంగా తెలిపారు పెద్దాలందరూ దాసుగారి విశిష్ట వ్యక్తిత్వాన్ని గూర్చి ప్రసంగించారు. ఈ సందర్భహంగా శిష్యులు గురువుగారికి ఒక యకరం పోలంకొని అండ జేస్తే వారికిక ఏ లోటు రాదనీ భావించారు శ్రీ పోలిశెట్టి ఆంజనేయ గుప్త పట్టువస్త్రాలతో పాటు అయిదు వందలరూపాయలు శ్రీ బోలిశెట్టి సీతారామయ్యగారు కూడా అలానే సమర్పించారు. అభిమానులు భక్తులు శక్తికొలది విరాళాలు ప్రకటించారు. అవేమీ తమకు అవసరం లేదనీ అదంతా శ్రీ నామప్రయాగ స్వామికే సమర్పిస్తున్నా ననీ ప్రకటించారు. దేశం నలుమూలలనుండీ ఎందరో పెద్దలు కవులు భక్త శిఖామణులు అభిమానులు సందేశాలు ఆశీర్వచనాలు పంపగా అన్నీ వేదికపై చదివి అందరికి తెలియ జేశారు.

శ్రీ కాశీ కృష్ణా చార్య వారు సంస్కృతం లో అభినందన సందేశం పంపారు. శ్రీ విద్యారణ్య స్వామి, శ్రీ సన్నిధానం లక్ష్మీ నారాయణ మూర్తి అవధానిగారు సంస్కృతం లో అభినందన ఆశీస్సులు అందించారు శ్రీ చిరంతనానందస్వామి, శ్రీ జటావల్లభుల పురుషోత్తం, శ్రీ రామ కృష్ణా నంద స్వామి సందేశాలు వచనం లో శ్రీ దావాలి వామన మూర్తి పద్యాలలోరాసిపంపారు. శ్రీ భాగవతుల కుటుంబరావు, శ్రీ కప్పగంతుల సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీ వారణాసి సుబ్రహ్మణ్య శాస్త్రి, ప్రశంస పేరుతో పద్యాలను శ్రీ తుమ్మల సీతారామ మూర్తి గారు, శ్రీ మాధవపెద్ది నాగేశ్వరరావు వచనం లో, పంచరత్నాలలో శ్రీజాస్తి వెంకట నరసయ్య, శ్రీ రామ శరణ ప్రశంసగా పద్యాలలో శ్రీ శి స రాజశేఖరం, పండిత శ్రీ పెమ్మరాజు రాజారావు గారు పుష్పాంజలి పేరిట పద్యాలు, శ్రీ చిర్రావూరి అనంత పద్మ నాభ శాస్త్రిగారు సంస్కృత ఆశీర్వచనం, శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తిగారు "వీరు భుజించు ఓదనము రామనామ సందీపితమై, వీరి జీవన లహరి గంగా శైవలినికి సహపాఠి"అని మెచ్చుకొన్నారు. వీరుగాక శ్రీ చిలుకూరి వీరభద్ర శాస్త్రి, శ్రీ బాపట్ల హనుమంతరావు, శ్రీ వెంపటి సూర్యనారాయణ శ్రీ ధనకుధరం వరదాచార్యులు శ్రీ కల్లూరి చంద్రమౌళి, శ్రీ ధూళిపాళ వెంకట సుబ్రహ్మణ్యంగారు పద్య నీరాజనం, శ్రీ మల్లాప్రగడ శ్రీరంగారావు పద్య నమోవాక భక్తీ కుసుమాలు సమర్పించారు. శ్రీ ఆర్ వెంకటేశ్వర్లు, శ్రీ పద్యాల సోదరులు పద్యాలలో దాసుగారి నిరాడంబరత ఆదరణ శిష్యవాత్సల్యం సర్వ సమానత్వం, సభా పాండిత్యం, సుబోధకత్వం కదా సంకీర్తన,సద్గురు ప్రాప్తి అదృష్టం, రామనామ ప్రచారం మొదలైన విషయాలపై తమ గురువుగారు శ్రీ శ్రీరామ శరణ్ గారిపై భక్తిభావబందుర సుమధుర పద్య హారతి సమర్పించారు. వారి పద్యం తోనే సమాప్తి పలుకుతున్నాను –

"హరినామ బోధకు, నాశ్రిత వత్సలు –మందస్మితాననుు, మధుర భాషు

కమనీయ కళ్యాణ ఘన గుణ శోభితు –వైరాగ్యయుటు వేణు పత్రపాలు

నామ సంభాషు,శ్రీరామ లేఖన లోలు –నిన్దునిభాస్యు నానంద దాయు

సంచిత రామనారాయణహృదయస్థు-శ్రీరామనామ సుచేల ధారు

నఖిల తీర్ధ సంచరణు,శేషంట రమణు –షమ దమాభరణు,పవిత్ర చారు శరణు

లోక మంగళ కరణు భక్తైక శరణు-గురు శిరోమణి శ్రీరమ శరణుదలతు ".

# 8 చీటీల స్వామి-అవధూత -శ్రీ వెంకయ్య స్వామి

దీనికి ఆధారం –ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ రచించిన "నేను దర్శించిన మహాత్ములు -4."

ఆయన చీటీ రాస్తే దానిప్రకారం పని అవ్వాల్సిందే. ఆయన నోట మాట రాలితే యదా ప్రకారం జరిగి తీర వలసిందే. ఆయన సమాధి చెందినా భక్తుల కోరికలు తీరుస్తూనే ఉంటానన్న మాట నిలబెట్టుకొన్న అతి సాధారణ జీవితం గడిపి, షిర్డీ సాయి బాబాకు ఆప్తులైన అవధూత శ్రీ వెంకయ్య స్వామి. ఆ మహాత్ముడు చూపిన అద్భుతాలు లెక్కలేనన్ని. ఆయన జీవితాన్ని పరిచయం చేసి తరించటమే నేను చేస్తున్న పని.



వెంకయ్య స్వామి నెల్లూరు జిల్లా ఆత్మకూరు తాలూకాలోని నాగుల వెల్లటూరు లో జన్మించారు. తండ్రి నోంపల్లి పెంచలయ్య. తల్లి పిచ్చమ్మ. ధాత నామ సంవత్సరం వచ్చిన కరువు నాటికి ఆయనకు పదమూడు ఏళ్ళు. అంతకంటే పకడ్బందీ పుట్టిన తేదీ ఎవరికీ తెలియదు. చిన్నప్పుడు అందరిలాగే రాత్రిపూట బడిలో చదివారు. అన్నిపనులూ చేసేవాడు. కట్టెలు కొట్టి ఎడ్ల బండీమీద వేసుకొని నెల్లూరు వెళ్లి అమ్ముకొని వచ్చేవాడు. ఆకులతో దొన్నెలు చేసి అమ్మేవాడు. ఏపని అయినా కష్టపడి చేసి అందరినీ మెప్పించేవాడు. దుక్కి దున్నితే మాహా మహా మొనగాడు రైతులే ముక్కున వేలేసుకోసేవారట ఆశ్చర్యం తో. నాగటి చాలులో ఒక వైపు కోడి గుడ్డు పెట్టి, రెండో వైపు నుంచి చూస్తె కనిపించేంత నైపుణ్యం తో చాళ్ళు వేసేవాడట. ఒక్కడే ఇద్దరు మనుషుల పనులు చేసేవాడు. కష్టాల్లో ఉన్నవారిని చూసి జాలిపడి చేతనయినంత సాయం చేసేవాడు, చేయించేవాడు. చెల్లెలు పేరు పెట్టి పిలుస్తుంటే "అన్నయ్యా "అని పిలువు అని సౌమ్యంగా చెప్పిన సంస్కారి. అబద్ధం ఆడటం నచ్చేదికాదు.

ఇరవై వ ఏడు రాగానే స్వామి కి అనుకోకుండా వారం రోజులు జ్వరం వచ్చి మంచం మీదనుంచి లేవ లేకపోయాడు. ఒకరోజు తమ ఇల్లు వేలం వెయ బోతున్నారు అనే మాట ఆయన నోటి నుండి వచ్చింది. తగ్గిన తర్వాత "చాకలి యోగం "మంగలి యోగం ",జక్కల యోగం "అని అరుస్తూ ఊరంతా తిరిగేవాడు. పిచ్చిపట్టిందని ఇంట్లో కట్టి పడేశారు. అన్నం నీళ్ళు ముట్టుకోలేదు. చేసేది లేక వదిలేశారు. "పిచ్చి వెంకయ్య "అని ఊళ్ళో జనం పిలిచేవారు. ఒక రోజు పాము కాలిపై కాటేసింది. పడగా విప్పి ఆడింది. కానీ విషం ఎక్కలేదు. మామూలుగా నే తిరిగాడు. దీన్ని వింతగా చెప్పుకొన్నారు. మూడు నెలలు పెంచల కోన లో గడిపి నాగుల వెల్లటూరు చేరుకొన్నాడు. ఇంటికి మళ్ళీ వెళ్ళకుండా దొడ్లలో, చేలల్లో తిరుగుతూ ఎవరు ఏది పెడితే అది తింటూ పిచ్చా ఫకీర్ లా గడిపాడు. చెల్లెలు మంగమ్మ ఇంట అన్నం తింటూ ఆ ప్రాంతం లో చాలాకాలం తిరిగాడు. ఎవరి జోలికీ వెళ్లేవాడుకాదు. చెయ్యి చాపి, ఏదైనా పడేస్తే తినేవాడు.




స్నేహితులు అతనిలో మహత్తులు గమనించారు. చెల్లెలు మంగమ్మ కొడుకు జ్వరం తో బాధ పడుతుంటే ఏడుస్తుంటే వాడిని చేతితో తాకగానే నాల్గవ రోజు జ్వరం తగ్గి పోయింది. పిచ్చి వెంకయ్య క్రమం గా " వెంకయ్య స్వామి "అయ్యాడు. పెంచల కొనలో ఉన్నప్పుడు ఒక సాధువు నాలుక పై ఏదో మంత్రం రాశాడని, ఆయన షిర్డీ సాయి నాధుడే నని అందరి నమ్మకం. దీనితో వెంకయ్య హృదయం లో జ్ఞాన జ్యోతి వెలిగింది. ఇంకో కధనం ప్రకారం పెంచల కోన లో తిరుతున్నప్పుడు ఒక జంగం దేవర వచ్చి మనో వేగం తో ఒక దేవాలయం దగ్గర బిలం లోకి తీసుకు వెళ్ళాడని అక్కడ తపస్సు చేసుకొంటున్న నూట ఒక్క మంది మహాను భావు లను దర్శించాడని,వారిని మూడు రోజులు సేవిన్చాడని, నాల్గవ రోజు స్పృహ వచ్చేసరికి మద్రాస్ హై కోర్ట్ మెట్ల మీద ఉన్నాడని తెలుస్తోంది. దేశ సంచారం చేస్తూ దుత్తలూరు, నర్రవాడ గ్రామాలు తిరిగాడు. ఆయన సమాధి చెందేముందు "సంపన్నత్వం ",సాధారణత్వం ",సద్గురు సేవ "అని కేకలేశారట. అంటే ఇది వీరి సంప్రదాయం అన్న మాట. మానవాళికి స్వామి ఇచ్చిన చివరి సందేశం ఇదే. ఇందులోని అంతరార్ధాన్ని శ్రీ ఎక్కిరాల భరద్వాజ గారు వెంకాస్వామి జీవితం పై రాసిన చరిత్రలో చక్కగా వివరించారు. మొదట దైవీ సంపద సాధించాలి. ఇదే సంపన్నత్వం. దైవీ సంపద అంటే నిర్భయం, సాత్విక చిత్త శుద్ధి, జ్ఞాన యోగం లో స్తిరత్వం, దానం, ఇంద్రియ నిగ్రహం, నిష్కామ యజ్ఞం, ఆత్మ విచారం, గురువు వద్ద నేర్చిన ఆధ్యాత్మిక సూత్రాల మననం, తపస్సు, రుజుత్వం, అహింస, సత్యం, క్రోధం లేక పోవటం, త్యాగం, శాంతి, సర్వ భూత దయ, ఇంద్రియ వ్యామోహం లేక పోవటం ధర్మ విరుద్ధమైన పనుల పై ఏవగింపు, చాంచల్యం లేక పోవటం, బ్రహ్మ తేజస్సు, ద్వంద్వాలను సమానం గా చూడటం, ధైర్యం, శుచి, ద్రోహ, గర్వాలు లేకపోవటం, వలన రజో తమోగుణాలు నశించి సత్వ గుణం వృద్ధి చెందుతుంది. ఈ విషయాలన్నీ భగవద్ గీత లో పరమాత్మ చెప్పాడు.

స్వామి చెప్పిన రెండవది "సాధారణత్వం ".దైవీ సంపద పొందిన తర్వాత సంపన్నత్వం పొంది అది నిజ జీవితం లో సాధారణం అవ్వాలి. గురూప దేశాన్ని నిరంతరం మననం చేయాలి. ఈ రెండు సద్గురు సేవ వలననే సాధ్యం. షిర్డీ బాబా కూడా "మహా రాజై కూడా పేద వాడిగా జీవించిన వాడే గొప్ప వాడు "అన్నాడు.అదే వెంకయ్య స్వామి చెప్పింది కూడా అలానే ఇద్దరూ జీవించారు. ఏదైనా బోధించమని శిష్యులు కోరితే "బోధించటానికి ఏముందయ్యా అంతా చూసి నేర్చుకోవటమే "అనేవాడు. వెంకయ్య స్వామికి గురువు ఒకసాధన మార్గాన్ని ఉపదేశించినట్లు దానిని ఆయన ఏకాంతం లో సాధన చేసినట్లు తెలుస్తోంది. "మీ గురువు ఎవరు "?అనిఅడిగితే "గురువు ఎందుకయ్యా నా నెత్తిన ?"అన్నాడు.

అవధూత చర్యలు

ఎందరో మహాత్ములుంటారు వారిలో అవధూతలు ఉన్నత స్తితికి చెందిన వారు. నాశనం లేకపోవటం (అక్షరత్వం ) మహోన్నత స్తితి (వరేన్యత్వం), కొంచెమైనా పాపం లేకపోవటం (ధూత కల్మషత్వం ) బ్రహ్మ జ్ఞానం కలిగి ఉండటం అవధూత లక్షణాలు. వీరు పసిపిల్లల్లా, పిచ్చి వారుగా, పిశాచ గ్రస్తుల్లా ఉంటారు అని ఆది శంకరులు చెప్పారు. అవధూత సంప్రదాయానికి ఆదిపురుషుడు దత్తాత్రేయుడు. ఆత్మ జ్ఞానమే ఆయన. అలాంటి అవధూత లక్షణాలున్న వారు వెంకయ్య స్వామి అవధూత. తల్లి స్వామి కోసం ఏదైనా ఆప్యాయం గా చేసి తీసుకొని వస్తే అక్కడ ఉన్న వారికందరికీ పెట్టించి తానూ తీసుకొని అందులో కొంత చీమలకు వేసి కొద్దిగా మాత్రమె తీసుకో నే వారు. ఒక రోజు ఉన్మాద స్తితిలో తిరుగుతుంటే పోలీసులు అరెస్ట్ చేసి రెండు రోజులు జైల్లో పెట్టారు. విడుదలైన తర్వాత రాజ పద్మాపురం లో ఉన్న చెల్లెలి దగ్గరకు వెళ్లి, విషయం చెప్పి ఎడ్చేశారట. ఆమె అన్నను బంధించిన వారిని తీసుకొచ్చి కొట్టిస్తాలే అనగానే పసిపిల్లాడిలాగా హాయిగా నవ్వాడట.తల్లి చనిపోతే "అమ్మ ఉండ్లా?చావలేదు "అన్నారు. అన్న చనిపోయినా చావలేదని మళ్ళీ వస్తాడని నర్మ గర్భం గా చెప్పారు.

బద్వేలు వద్ద పెన్నా నదికి ఇసుక బస్తాలు మోసి కట్ట కట్టేవారు. ఒకరోజు ముదిగేడు లో ఒకఇల్లాలిని తానూ పచ్చోడినని ఇంతముద్దపెట్టమని అడిగాడు. నంచుకోటానికి, పచ్చడి పైన నెయ్యి (ధార)వేయమని అడిగాడు. ఆమె కోపగించి లేదని అబద్దమాడితే దుత్త లో ఉంది వెయ్యమన్నాడు. ఆమె కసురుకోగానే అది తెగి కిందపడి నెయ్యి అంతాఒలికి పోయింది. కచేరి దేవరాయపల్లిలో వేణు గోపాల స్వామి ఆలయ సంకు స్థాపనకు చల్లా సుబ్బమ్మ అనే ఆవిడ జ్వరం తో వెళ్ళింది. దారిలో పుట్ట గోచీ పెట్టుకొని ఒళ్ళంతా మసి పూసుకొని పిచ్చివాడిలా ఉన్న వెంకయ్య స్వామి విభూతి చేతిలో పెట్టి నోట్లోవేసుకొని మెడకు బొడ్డుకు పూసుకోమని చెప్పాడు. అలా చేయగానే ఆమె జ్వరం మాయమైంది. ఆయన్ను ఎవరు నువ్వు అని అడిగితె తానూ అడవుల్లో ఉంటానని ఒళ్లోకి రానని వేణుగోపాల స్వామి జాబు రాస్తే వచ్చానని చెప్పాడు.కావాలంటే కోటి తీర్ధం దేవాలయం లో శుక్రవారం వస్తే కనిపిస్తానని చెప్పాడు. ఆమె అలానే వెళ్ళింది. ఆ నాటి రాత్రి పార్వతీ దేవి కలలో కనిపించి అభయమిచ్చింది. అదిమొదలు మూడు నెలలు స్వామిని సేవించి ఆయన తో పాటు పెన్నానదికి ఇసుక కట్టలు వేసే కూలీలకు భోజనాలు

పెట్టేది. భక్తులిచ్చేకానుకలన్నీ స్వామి కూలి వారికిచ్చేసే వాడు. ఒక రోజు సుబ్బమ్మ తన దగ్గర బంగారం చాలా ఉంది. దానికి భద్రత లేదని చెప్పింది. దానికి స్వామి "అమ్మా !దొంగలు రారు. వస్తే పోరు 'అని ధైర్యం చెప్పారు ఆమె అక్కడే ధైర్యం గా పడుకొన్నది. అర్ధ రాత్రి మెలకువ వచ్చి చూస్తె వెంకయ్య స్వామి నిలు వెత్తు మంటల్లో ఉన్నారు. దొంగలు కొట్టి మంటల్లో పడేశారని గ్రహించింది. భయ పడి దేవాలయం లో దాక్కొన్నది. స్వామి దగ్గరకు వచ్చి కాస్త పొగాకు పెట్టమని అడిగాడు. ఆమె ఆశ్చర్య పోయింది. ఇందాక చూసిన మంటలూ స్వామి విషయం ఏమిటో అర్ధం కాలేదు. తనకేమీ కానట్లు స్వామి కనిపించారు.



తరచుగా స్వామి సోమశిల దగ్గర కొండ మీద చిన్న గుడిసె లో నూనె దీపం వెలుగులో రాత్రి అంతా తంబూరా మీటుకుంటూ ఉండేవారు. ఒక రోజు సాయంకాలం సేవకుడు చలమయ్యను మరొఇద్దరికి భోజనం తీసుకొని రమ్మని చెప్పారు. ఆ రాత్రి ఇద్దరు భక్తులు దారితప్పి స్వామి దర్శనానికి వచ్చారు. వారికోసమే అ భోజనాలు తెప్పించారు. ముందే వారు వస్తారని గ్రహించారన్నమాట. నూతన వస్త్రాలు ఎవరైనా ఇస్తే తీసుకొనే వారు కాదు. పాతబతట్ట లిస్తేనే గ్రహించేవారు. ఒక ఆసామి కొత్త ఖరీదైన దుప్పటి ఇస్తే దాన్ని పీలికలుగా చింపి అవి ఎవరికైనా ఇస్తే జబ్బులు నయమవుతాయని చెప్పేవారు. తెలియ కుండా ఒకాయన డబ్బు బాగ్ పెట్టి వెళ్ళిపోతే దాన్ని ధునిలో వేసి కాల్చిపారేశారు. భక్తీ శ్రద్ధలతో ఎవరైనా అడిగితె జవాబు చెప్పేవారు డబ్బు ఇస్తానంటె చెప్పేవాడు కాదు.. పండుగ రోజు కూడా భిక్షాన్నమే తినేవారు. అలా ఎందుకు చేస్తున్నారు అని అడిగితె ఇవాళ ఎవరో పెట్టారని వెళ్ళక పొతే మర్నాడు భిక్షకు వెళ్ళినా ఎవరూ పెట్టరు అని చెప్పేవారు.

## చీటీలు – సిరా బిళ్ళలు

చలమా నాయుడు, పోలి రెడ్డి మొదలైన సేవకులతో వెంకయ్య స్వామి నెల్లూరు ప్రాంతం అంతా సంచరించేవాడు. భక్తులకు సిరాతో కాగితాలపై వేలి ముద్రలేసి ప్రసాదం గా ఇచ్చేవాడు. రోజుకు ఎన్నికాగితాలైనా చాలేవికావు. ఎన్ని సిరా బుడ్లు అయినా సరిపోయేవికావు. భక్తుల కోరికలు తీరేవికనుక వారే బస్తాల కొద్దీ కాగితాలు సిరా బిళ్ళలు పంపేవారు. స్వామి భోజన పద్ధతి తమాషాగా ఉండేది. విస్తరి నిండా అన్నం పెట్టించుకొని అంచు కట్టి మధ్యలో మజ్జిగ పోయించుకొని తినేవాడు. చివరికి కట్టలా ఉన్న అన్నం అవి ఉన్నమూలలకు కింది తోసేసేవాడు. ఒక్కసారిగా మూడు విస్తలళ్ళకు సరిపడా అన్నం విస్తట్లో బోర్లించాలి. ముందుగా సిరా చేత్తోనే వడ్డించిన వారికి పెద్ద పెద్ద ముద్దలు వేసి విస్తరి చుట్టూ పెట్టి వాటి చుట్టూ చిన్న ముద్దలు పెట్టి, మారు వడ్డించు కోకుండా మిగిలిన కొద్ది అన్నమే తినేవారు. ఒక్కోసారి పండు మిరపకాయలు, ఉప్పు, ఎరర ఉల్లి పాయ అన్నం లో నంజుకొని తినేవారు. బెల్లం కరేపాకు చింతాకు ధనియాలు వేసి తయారు చేసిన కారప్పొడి అడిగి వేయించుకొనేవారు. నడి నెత్తిని చేతితో తాకి మూడు సార్లు అన్నానికి అద్ది ఒక భక్తుడికిచ్చి అందరికి పెట్టమనే వారు. అది తిన్న వారిజబ్బులు నయమయేవి. వెంకయ్య స్వామికి సేవలన్నీ ఒకరే చేయాలి జావపోసే రోసిరెడ్డి పెడితేనే తినేవారు. ఇంకేవరుపెట్టినా తినేవారుకాదు. రెడ్డి అన్నం పెట్టకపోతే తాను వెళ్లిపోతాననేవారు.

## మహిమా వెంకయ్య స్వామి

రోజు కట్టెలు తెచ్చే రామణయ్యను ఒకసారి ఎక్కడికీ వెళ్ళకుండా ఆశ్రమం లోనే ఉండమన్నారు స్వామి. అర్ధం కాక అడవికి వెడితే చెట్టుమీద నుంచి కింద పడి బుజం ఎముక విరిగింది. దగ్గరలో ఉన్న బండల మీద పడిఉండిఉంటె చనిపోయే వాడని అందరూ భావించారు. స్వామికి ఈ విషయం చెబితే "ఆయన మాట వింటె ఆయనే దిక్కు లేకుంటే ఆసుపత్రే దిక్కు "అన్నారు. వరిగడ్డిపై తాటాకు చాప, దానిపై గొనె పట్టా కప్పిన దానిపైనే స్వామి కూర్చునే వారు దొడపోట్టుతో పరుపు తయారు చేస్తే దానిపై నిద్రపోయేవారు. 1979 లో ఒక రోజు మధ్యాహ్నం మూడు గంటలకు హఠాత్తుగా లేచి అప్పుడే వచ్చిన పెసల సుబ్బరామయ్యకు చీటీ రాసిచ్చి ఆశీర్వదించి మళ్ళీ నిద్రపోయారు. కాసేపట్లో సుబ్బరామయ్య తల్లి చావు బతుకుల్లో ఉందని తెలిసి స్వామి పాదతీర్ధం విభూతి నోటిలో పోస్తే తాగి ప్రాణం విడిచింది.. ఆమె మరణం ఆయనకు ముందే తెలిసి కొడుకును పంపారు స్వామి. చెప్పులు లేకుండానే తిరిగేవారు. ముళ్ళు గుచ్చుకొంటె ఆయన వెంట ఉండే సూదీ దబ్బనం తో తీసుకొనేవారు. మల మూత్ర విసర్జన తర్వాత తప్పకుండా ముసలి తనం లో కూడా స్నానం చేసేవారు.

శీతాకాలం లో మంచుపడుతుందని పందిరి వేస్తె ఆరు బయటే పాడుకొనేవారు. దోమతెర ఉండనిచ్చేవారుకాదు. రోసి రెడ్డిఅనే భక్తుడికి అతిదాహం ఉండేది. స్వామి కుడి చేత్తో రెండు పుడిసెళ్ళు నీళ్ళు తాగమని సలహా ఇస్తే తాగితే దాహమే నశించింది. నెల్లూరు పోట్టిపాలెం వద్ద ఇసుక తిన్నె పై గుండం వేసుకొని ఉన్నారు. అకస్మాత్తుగా ఏటికి విపరీతం గా వరద వచ్చి వేప చెట్లు కూడా మునిగిపోయాయి. స్వామి కదలకుండా అక్కడే ఉన్నారు. మూడు రోజుల తర్వాత రైతులు వచ్చి చూస్తె స్వామి చుట్టూ పది గజాల వరకు ఇసుక పొడిగా ఉండటం చూసి ఆశ్చర్యపోయారు. క్షవరం చేసే మంగలికి అందరూ ఆరోజుల్లో పావలా ఇస్తే స్వామి రెండు రూపాయలిచ్చేవారు. బరిగేల నాగయ్యే ఆ పని చేసి స్వామి అనుగ్రహానికి పాత్రుడయ్యాడు. గిరజాలు మీసాలు బాగా పెరిగినప్పుడు "మంగలి యోగం చాకలి యోగం, డుబ్బుక్ డుబ్బుక్ డుబ్బుక్ "అని అరుస్తూండేవారు. తన పాదాలను ఎవర్నీ తాక నిచ్చేవారు కాదు.

ఒక రోజు తలుపూరు శివాలయం లో స్వామి ఉండగా మబ్బు బాగా కమ్మింది. ఉరుములు మెరుపులు చినుకులు వచ్చాయి. ఆరుబయట చాప వేయించుకొని లోపలి వెళ్ళకుండా కూర్చుని "మబ్బు కట్టాలి "అంటూ పైకి చూస్తె వర్షం ఆగిపోయింది. సేవకుడు నాగయ్య దీనం గా వర్షం రాక పొతే జనం అల్లల్లాడిపోతారని అన్నాడు. స్వామి "ఈ ఏడు నెలన్నరకు ఒక సారి, రెండునెలల ఇరవై రోజులకోసారి, మూడు నెలల అయిదు రోజులకొసారి వాన పడుతుందన్నారు. అది చాలదని గొడ్డూ గోదా ఇబ్బంది పడతాడని అంటె "పై వాడు కురిపించేది అంతేనయ్యా. మనమే కష్టపడి కురిపించుకోవాలి "అన్నారు. స్వామిని గంజి తాగమంటే "అనుకున్న

పని అయితేకదా నీరైన తాగేది "అన్నారు. ఆరు రోజులు నిద్రాహారాలు మానేసి అక్కడ అట్లానే కూర్చున్నారు. ఆరవ రోజు స్వామికి స్నానం చేయించి కూర్చోబెతట్టగానే కుంభ వృష్టి కురిసి కరువు పారిపోయింది. ఇది ఫిబ్రవరి 1984 లో జరిగిన సంగతి. నెల్లూరు జిల్లా అంతా అతి వృష్టి తో అతలాకుతలమైతే స్వామి ఉన్న గొలగలమూడిలో పెద్దగా వర్షం పడలేదు. దీనికి కారణం గ్రామం లో జరిగిన నిరతాన్న దానం ప్రజల భక్తి శ్రద్ధలూ.

రోసి రెడ్డికి పాము కరిస్తే స్వామి అతని వేలునుతన తొడపై అయిదు నిమిషాలు అదిమి పెట్టి ఉంచి "ఇంక ఇనీఒళ్ళు సంజీవమై పోయింది పో "అన్నారు. అప్పటినుంచి ఏ విష జంతువూ రెడ్డిని కరచినా విషం ఎక్కలేదు. 1976 లో స్వామి చెల్లోపల్లి శేషమ నాయుడికి "నీకు నాలుగు నెలల ఆరు రోజులకు గండం ఉంది. తిరువళ్లూర్ వీర రాఘవ స్వామి తప్పిస్తారు "అని ఒక చీటీ రాయించి ఇచ్చారు. ఒక రోజు నాయుడు పొలానికి నీళ్ళు పెట్టి దుక్కి దున్నుతుంటే ఒక ఎద్దు కిందపడి తన్నుకొన్నది. దాన్ని పక్కకు తప్పిస్తుంటే కరెంట్ ఎర్త్ అయి నట్లు గుర్తించి మెయిన్ ఆపేశాడు. తర్వాత స్వామి రాసిచ్చిన చీటీ చూసుకొంటే స్వామి మరణం తప్పించారని గ్రాహించాడు. గోపారం లో ఒక రైతు గొర్రెల్ని ఒక కుక్క తినేస్తుంటే కోపం తో దాన్ని చంపేశాడు. దానిఫలితం గా వాళ్లకు పుట్టిన బిడ్డలు కుక్కలా అరిచి చనిపోయే వారు స్వామికి విన్నవిన్నుకొంటే "పుడతాడు "అని మూడు సార్లు అన్నారు. అలానే మంచి పిల్లలు ముగ్గురు పుట్టారు. ఈశ్వరమ్మ ను శిష్యులు స్వామి ని తాక నిచ్చేవారుకాదు. ఆమె బాధ పడేది. గ్రహించిన స్వామి తనకాలిలో ముల్లు దిగిందని ఆమెకు చెప్పి తీయమన్నారు. ఆవిధం గా పాదస్పర్శ ఆమెకు అనుగ్రహించారు.అసలు ముల్లే గుచ్చుకోలేదు. అంత భక్త సులభుడు స్వామి. ఆమె ఇంటి గృహ ప్రవేశానికి వ్యవధి లేకుండా ముహూర్తం పెట్టి తానూ హాజరై దగ్గిరుండిచేయించి పదికిలోల బియ్యం రెండు వందల మందితినేట్లు అనుగ్రహించారు.

ఒకసారి తలుపూరు నుండి నెల్లూరు వస్తూ వెంటనే ఆస్పత్రికి వెళ్లి అక్కడ జబ్బుతో ఉన్న బుజ్జయ్యను చూసి "ఇక్కడ లెక్క సరిపోయింది. మనం వెళ్దాం "అని వెళ్ళిపోయారు బుజ్జయ్య ఆరోగ్యం బాగుపడి ఇంటికి చేరాడు. బుజ్జయ్య చెల్లెలు స్వామిని స్మరించినది. అందుకే స్వామి ఆసుపత్రికి వెళ్ళారు అని గ్రహించాలి. 1980 లో ఆశ్రమం లో సమాధి మందిరం కట్టటానికి ఇటుకల లారీ వచ్చింది ఆ రోజు అందర్నీ ఆశ్రమం లోనే పడుకోమని చెప్పారు వారితో "పెంచల కోనంత మసీదు పడుతున్దయ్యా "అన్నారు. ఆయన మాటల్లోంతరార్ధం ఉంది. షిర్డీ సాయి మందిరాన్ని"మసీదు "అంటారు. అంతప్రశస్తి వస్తుందని అర్ధం. షిర్డీ సాయి నివాసం గా కూడా ఉండాలని భావం.

### వెంకయ్య స్వామి అవధూత -మహా సమాధి

స్వామి రెండు నెలలకు సమాధి అవుతారనగా ఆయాసం తో చాలా బాధ పడేవారు. శరీరం బలహీనమైనది "నేను వెళ్ళిపోతున్నాను "అని చీటీ రాయించారు స్వామి. అందరూ బాధ తో ఉన్నారు. ఒక రోజు అయిపోయిందని అనుకొన్నారు స్వామి తల వాల్చారు.. కాసేపట్లో లేచి "పై వాళ్ళు ఒప్పుకో లేదు. కొంత కాలం ఉంది రమ్మన్నారయ్యా "అన్నారు నవ్వుతూ. ఈ విషయం లో తన అన్నగారి అడుగుజాడల్లో నడిచారు స్వామి. 1886లో ఒక రోజు స్వామి 72 గంటల సేపు పార్ధివ దేహాన్ని త్యజించారు. 20-8-1982 న ఒక దివ్య రధం వచ్చి స్వామిని ఎక్కించుకు వెళ్ళినట్లు సేవకుడు గురవయ్యకు దర్శనమైనట్లు తెలియ జేశాడు. ఆగస్ట్ ఇరవై నాలుగున మధ్యాహ్నం స్వామి ఒక ప్రక్కకు తిరిగి పడుకొన్నారు. బుజ్జయ్య హారతి ఇస్తుంటే కుడి చేత్తో హారతి అందుకొని మళ్ళీ పక్కకు తిరిగి పడుకొన్నారు. ఇదే వారు జీవించి ఉండగా భక్తులిచ్చిన చివరి హారతి. అంటే 1982 ఆగస్ట్ 24నసాయంత్రం నాలుగు గంటలకు అవధూత వెంకయ్య స్వామి మహా సమాధి చెందారు. ఇరవై ఎనిమిదిన వేలాది భక్త జన సమక్షం లో హరే కృష్ణ హరే రామ సంకీర్తనలతో స్వామి ని సమాధి ప్రవేశం చేయించారు. గ్రామస్తులు ఆ రోజు నుండి నలభై రోజుల వరకు వచ్చేవారందరికి అన్నదానం చేశారు. అఖండ నామ సంకీర్తన భగవద్ గీతా పఠనం తో ఆ ప్రాంతమంతా భక్తి వరదలై పారింది. స్వామి వెలిగించిన ధుని నిరంతరం మండుతూనే ఉన్నది. స్వామి ఇహలోకం లో లేక పోయినా పై లోకం నుంచి భక్తుల మనోభీస్టాలను నెరవేరుస్తూ, తాను ఉన్నాననే నమ్మకాన్ని కలిగిస్తున్నారు అవధూత వెంకయ్య స్వామి '.

## 9 షాజన్ పూర్ - శ్రీ రామ చంద్ర మహా రాజ్

పూజ్య శ్రీ రామ చంద్ర మహారాజ్ విక్రమ నామ సంవత్సర వైశాఖ శుద్ధ పంచమి నాడు 1899 ఏప్రిల్ 30 న ఉత్తర ప్రదేశ్ లోని శాహజాన్ పూర్ గ్రామం లో జన్మించారు. లోకం లో అధర్మం పెచ్చు పెరిగి ధర్మ నిర్వీర్య మై పోతున్నప్పుడు అవతార పురుషులు ఉద్భవించి ధర్మ సంరక్షణ చేస్తారని మనకు తెలిసిన విషయమే. ఇరవయ్యవ శతాబ్దపు ప్రారంభం లో ఇవే పరిస్తితులున్నాయి భారత దేశం లో. అప్పుడొక అవతార పురుషుని ప్రాదుర్భావం అవసర మైంది. ఆ మహా పురుషుడే శ్రీ రామచంద్ర గురు. శాహజాన్ పూర్ శ్రీ రామ చంద్రఅంటే అందరికి తప్పకుండా జ్ఞాపకం వచ్చేది వారు బోధించిన" జపం కాని జపం అంటే అజపా జపం "...ఉయ్యూరు లో దాదాపు నలభై ఏళ్ళ క్రితం మా వంగల కృష్ణ దత్త శర్మ గారు శాహజాన్ పూర్ వెళ్ళి అజపా జపం నేర్చుకొని వస్తూండే వారు. వేసవిలో ఒకటి రెండు నెలలు అక్కడే ఉండి వారి ఆశ్రమం లో సాధన చేసి వస్తూండే వారు. ఆ విషయాలు మాకు చెబుతూ ఉండే వారు. వారి గురించిన పుస్తకాలు అజపా జప విధానం గురించి మాకు తెలియ జేశేవారు. అప్పుడు మాకంతా వింతగా ఉండేది. ఆ తర్వాత నా శిష్యుడు డాక్టర్ వెంపటి కృష్ణ యాజి హైదరాబాద్ లోని విజయ నగర కాలనీ ఉన్న "శ్రీ రామ చంద్ర సెంటినరి హాస్పిటల్" లో సేవా దృక్పధం తో డాక్టర్ వృత్తిలో తన జీవితాన్ని ఆదర్శ వంతం గా గడుపుతున్నాడు. అతని దగ్గరకు వైద్యం కోసం మా కుటుంబం అందరం వెళ్తున్నాం. ఇప్పుడు రెండవ సారి శ్రీ రామ చంద్ర గారి గురించి కొంత తెలుసుకోవటం జరిగింది. ఈ సేవా సంస్థ శ్రీ రామ చంద్ర గారి బోధనలపుస్తకాలను ఉచితం గా నాకు అందజేశారు. అందులో వారి జీవిత చరిత్ర లేదు. కొంత సమాచారాన్ని సేకరించి వారి జీవితానికి సంబంధించిన ముఖ్య విషయాలను అంద జేస్తున్నాను.



### తగిన శిష్యుని కోసం గురువు నిరీక్షణ

అప్పటికే 1873 ఫిబ్రవరి రెండు న ఫతేగడ్ లో జన్మించిన ఆధ్యాత్మిక గురు వరేణ్యులుశ్రీలాలాజీ మహా రాజ ధర్మ సంస్థాపనకు తగిన వ్యక్తీ కోసం నిరీక్షిస్తున్నారు. శాహజాన్ పూర్ లోశ్రీ బదరీ ప్రసాద్ గారింట శ్రీ రామ చంద్ర జన్మించాదారని తెలియ గానే ఆయన ఆనందానికి అంతులేదు.. అప్పటి నుంచి శ్రీ రామ చంద్ర శ్రీ లాలాజీ శిష్యుడైనారు. రామచంద్రను బాబాజీ మహా రాజ అనీ పిలుస్తారు. శ్రీ రామ చంద్ర చిన్నప్పటి నుంచి చాలా అసహనం గా ఏదో తెలుసుకోవాలనే కోరిక తో కన్పించే వారు.. చివరికి 1922 జూన్ మూడున శ్రీ లాలాజీ దర్శనం చేసుకొన్నారు లాలాజీ గురు శిక్షణ లో 1944 కు సంపూర్ణ వికాసం పొందిన ఆధ్యాత్మిక తేజో మూర్తి గా భాసించారు శ్రీ రామ చంద్ర. ప్రకృతి ధర్మాలను నిర్వహిస్తూ లక్షలాది దీన జనోద్ధరణ కోసం ప్రయత్నాలు ప్రారంభించారు.

### శ్రీ రామ చంద్రుల బాల్యం –విద్యాభ్యాసం

శ్రీ రామ చంద్ర మహారాజ్ బాల్యం గురించి ఇప్పుడు తెలుసు కొందాం. చిన్నప్పుడే టైఫాయిడ్ తో బాధ పడ్డాడు దానితో చదివింది అంతా మరిచి పోయేవాడు ఇంటి దగ్గర ప్రైవేట్ మాస్టర్ ను ఏర్పాటు చేశాడు తండ్రి. లెక్కలు వచ్చేవి కావు. తప్పే వాడు తల్లి నీతి కధలు బోధించేది. ఆరవ ఏట తండ్రి గుర్రం కొనిస్తే దాన్ని లాఘవం గ స్వారి చేసే వాడు స్కూల్ లో చేర్పించారు హాకీ టీం కి కెప్టెన్ అయాడు. టీచర్లు శిక్షించే వారు. అది భరింప రానిది గా ఉండేది. అవతలి వ్యక్తీ ఉచ్చ్వాస నిస్స్వాసాలను బట్టి వారి ప్రవర్తనను అంచనా వేసే శక్తి రామ చంద్ర కు ఏర్పడింది.. ఏదో తీరని తపన తో అనుక్షణం గడిపే వాడు. 14 వ ఏడు వచ్చేసరికి గురువు కోసం అన్వేషణ సాగించాడు.. తగిన గురువు లభిస్తే సర్వ సమర్పణ చేయటానికి సిద్ధ పడ్డాడు. ధ్యాస అంతా వేదాంతం మీదే ఉంది చదివి కొంతా, స్వయం గా ఆలోచించి మిగిలినదీ నేర్చాడు. గృహస్తుని గా ఉంటూ ఆధాత్మిక జీవనం సాగించటం కష్టం అని భావించి సన్యాసి అవాలనే నిశ్చయానికి వచ్చాడు. మంత్రగాల్లను తాంత్రికులను నమ్మలేదు.



ఆ సమయం లో స్కూల్ హెడ్ మాస్టర్ ఇద్రిస్ అహమ్మద్ శూల నొప్పి తోతీవ్రం గా బాధ పడుతూ,ని ద్రలేకుండాగడుపు తున్నాడు. రామచంద్ర సాయం కోరాడు. రామ చంద్ర ఆయన బొటన వ్రేలిని తన చేతులతో పట్టుకొని నెత్తి మీద పెట్టి ఒక నిమిషం అయిన తర్వాత "నెప్పి తగ్గిందా ?"అని అడిగాడు. ఇద్రిస్ గారు తగ్గి పోయిందని చెప్పి హాయిగా నిద్ర పోయాడు. అప్పటి నుండి బడిలో యే విద్యార్ధికి జబ్బు వచ్చినా రామ చంద్ర దగ్గరకు పంపిస్తుండే వాడు. ఈయన హస్త వాసి వల్ల అవి నయం అయేవి ఆయన మనో బలం అంత గొప్పది. ఇంగ్లిష్ మేష్టారు రామచంద్ర లోని ఆసక్తిని గమనించి వేదాంత పుస్తకాలు చదవటానికి ప్రోత్స హించాడు ఈయనకు "డైనమిక్స్ ఆఫ్ మైండ్ "అనేది చాలా అభిమాన విషయం. దాని పై ఎంతో కృషి చేశాడు రామ చంద్ర. మెదడు ఆలోచిస్తుందని హృదయం దానిని సరైన మార్గం లో పెడుతుందని తెలుసుకొన్నాడు. 1918 లో 19 వ ఏట శ్రీ కృష్ణుని జన్మ స్థల మైన మధుర లో వివాహం జరిగింది. భార్య భగవతి కి కోపం ఎక్కువ. దాన్నీ భరించి మహా సహనం అలవరచుకొన్నాడు రామ చంద్ర.

1922 లో ఫతేగడ్ లోని గురు మహాత్ములైన శ్రీ రామ చంద్ర జీ తనకు మార్గ దర్శనం చేయగలరని భావించాడు. 1922 జూన్ మూడు న ఆయన్ను దర్శించాడు. ఆయన దగ్గర కూర్చో బెట్టుకొని ధ్యానం చేయించాడు. అంతే అప్పటి నుండి చుట్టూ ఉన్న ప్రకృతిలో ఒక కొత్తదనం గమనించాడు. గురువు అనుగ్రహం తో రాజ యోగాన్ని అభ్యసించాడు. దీనితో ప్రేమ, ఆరాధనా, అంకిత భావం ఏర్పడి జీవితాంతం నిలిచి పోయాయి. ఇంటికి తిరిగి వచ్చాడు. మెట్రికులేషన్ పరీక్ష పాస్ అయ్యాడు. శాహజాన్ పూర్ కోర్టు లో ఉద్యోగం లో చేరాడు తన ధ్యానాన్ని క్రమం తప్పకుండా కొన సాగిస్తున్నాడు తోటి ఉద్యోగులతో మర్యాదగా ప్రవర్తించే వాడు. కానీ సిగెరెట్ అలవాటైంది తండ్రి కోప్పడినా మానలేదు తండ్రికీ ఈ అలవాటు ఉండేది. తండ్రి సిగరేట్ తాగటం మానేసి కొడుక్కి హుక్కా కొనిచ్చాడు ఇది సిగరెట్ అంతహానికాదని హుక్కాలో నికోటిన్ అనే విషం లేదని తండ్రి అభిప్రాయం. తాను పొగ పీల్చటం మనేయ్యాలా అని గురువును అడిగితే అక్కర్లేదు నీ ఇష్టం అన్నాడట

పద హారేళ్ళ వయసులోనే జాన్ స్టువార్ట్ మిల్ల రాసిన "యుటిలిటేరినిజం "పుస్తకం చదివి అర్ధం చేసుకొన్నాడు. అందులోని విషయాలు నచ్చి తన స్వంత ఫిలాసఫీ ని తయారు చేసుకొన్నాడు రామ చంద్ర. నమ్మకం అనేది సాధనకు ముఖ్యం అని ప్రవచించాడు. పనిలో నిజాయితీ తపనా ఉండాలన్నాడు. గురువు శిష్యుడికి తన వద్ద ఉన్న జనాన్ని అంతటిని దాచుకోకుండా సోదరునికి అందించి నట్లు అందజేయాలని తెలియ జేశాడు. ఒక సారి తోటి ఉద్యోగస్తుడు అదే కులానికి చెందిన వాడే అయినా రామ చంద్ర కు పనిలో మెలకువలు నేర్పకుండా చాలా హింసించి సాధించే వాడు. ఈ విషయాన్ని మున్సిఫ్ కు చెప్పి రాజీనామా చేస్తానన్నాడు. వద్దని వారించి, ఆయనే మెళకువలు నేర్చాడు. రామ చంద్ర కుటుంబ సభ్యులు ఒకరి తర్వాత ఒకరు మరణించటం ప్రారంభించారు రామచంద్ర తనకుమారుడికి అక్కడే ఉద్యోగం ఇప్పించుకొన్నాడు. అతనూ మరణించి తీవ్ర దుఖాన్ని కలిగించాడు.

ఈ ఆందోళనలతో, కోర్టు ఉద్యోగం లో బిజీ గా ఉన్నా ధ్యానాన్ని, యోగాన్ని మాత్రం వదలలేదు. సాధనలో ఉన్నప్పుడు అంతటా కాంతిని దర్శించే వాడు. మరో ఆరు నెలలకు హృదయం లో ఓంకారం విని పించింది. ఇదే "అజపా ".ఇదంతా తన గురువు అనుగ్రహం అని భావించాడు. గురువు పట్ల పూర్తీ విశ్వాసం ఉంటె ఆయన ఎక్కడ ఉన్నా ఇష్టసిద్ధి కల్గిస్తాడనితెలుసుకొన్నాడు.రామ చంద్ర పేకాట ఆడే వాడు. ఇది తన ధ్యానానికి ఇబ్బంది కలిగిస్తుందని గురువు చెప్పగానే మానేశాడు. అజపా జపాన్ని నిర్విఘ్నం గా కోన సాగించాడు. 1924 లో ఒక గొప్ప వింత అనుభవం కలిగింది. సకల చరా చర సృష్టిలో అనిర్వచనీయమైన సర్వ వ్యాపక శక్తి ఉందని తెలి సింది.. పిపీలికాది బ్రహ్మ పర్యంతం ఆ దివ్య తేజస్సు ను దర్శించాడు. పగలు కూడా దృగ్గోచర మయ్యేది. ఇది ఇలా ఉండగా భార్య తెంపరితనం ఇంకా బాధిస్తూనే ఉంది. తట్టుకోలేక గురువుకు చెప్పుకొన్నాడు. క్రోధాన్ని నియంత్రిన్చుకోమని గురువు సలహా ఇచ్చాడు.



ధ్యానానికి ప్రశాంతత కావాలి. గురువు పర్య వేక్షణ లో ధ్యానం కొనసాగించాడు. కంఠచక్రం వద్దకు ఆలోచన రాగానే కల వస్తున్నట్లు గమనించాడు. ఈకలు పగలు కూడా వస్తున్నాయి. అవదూతలకు ఇది సహజమే.. ఆయన 1928 ఏప్రిల్ లో పిండాడం లో బ్రహ్మాండ దర్సనం చేశారు. 1931 ఆగస్ట్ పది హీనున ఆయనకు లోపలా బయట గురువు అనుగ్రహం వల్ల అద్భుత కాంతి గోచరించింది ఆగస్ట్ 14 న గురు బ్రహ్మ మహాసమాధి చెందారు. అంటే గురువు శిష్యునిలో ఐక్యమై పోయి నట్లు. 1932 అక్టోబర్ పన్నెండు న గురువు కలో కన్పించి మార్గ దర్శనం చేశారు. రెండు సార్లు పెద్ద శక్తి పాతాన్ని పొందారు రామ చంద్ర. తండ్రి మరణం తర్వాతా బాబాయి ఎస్టేట్ ను కుటిలోపాయాలతో ఆక్రమించుకోవాలని ప్రయత్నించాడు. ఈయనా తమ్ముడు వ్యతి రేకించారు. వీలైనప్పుడల్లా రామచంద్రకు ఆయన ద్రోహం చేస్తూనే ఉన్నాడు చని పోయేదాకా. ఎన్ని ఆటంకాలు ఎదురైనా కోర్టుకు ఈడ్చే ప్రయత్నం బాబాయి చేసినా, అన్నిటినీ తట్టుకొని, ఆత్మ స్థైర్యం తో, ధ్యానానికి, సహనానికి భంగం కలుగ కుండా తన శాంత మార్గం లో సాగిపోయారు రామచంద్ర గురు.

1944 ఏప్రిల్ లో గురువును తనకు దివ్య మార్గాన్ని దర్శింప జేయ మని వేడుకొన్నారు శ్రీ రామ చంద్ర మహా రాజ్. గురువు అనుగ్రహించారు. రామ చంద్ర శ్రీ కృష్ణుని తనకు అర్జునికి చూపించి నట్లే విశ్వ రూప దర్సనాన్ని అనుగ్రహించ మని కోరారు. 1914 లో తనలో ఒక శూన్యం ఏర్పడిందని సకల విశ్వం తనలో ఇమిడి పోతున్న ఒక దివ్య అను భూతి కలిగింది. తనది అవతారం కాని అవతారం అని భావించాడు. ఆయనను అందరు ఋషి గా భావించారు భారత సేవక సమాజ్ వారు ఆయన్ను గొప్ప మహాత్ముడిగా అభి వర్ణించారు. గృహస్త జీవితం సవ్యం గానే సాగి పోతోంది భార్య భగవతి మరణిం చతమే మే కాక మగపిల్లలిద్దరు చనిపోయారు అన్నిటిని దిగ మింగి తన ధ్యానాన్ని కోన సాగిస్తూనే ఉన్నారు.

1945 మార్చి 31 న "శ్రీ రామ చంద్ర మిషన్ "ను గురువు గారి గౌరవార్ధం ఏర్పాటు చేశారు రామ చంద్ర. రాజయోగాన్ని అనేక మార్పులు చేసి కొత్త విధా నాన్ని లోకం లో ప్రచారం చేశారు. "దశాదేశములు "(టెన్ కమాండ్ మెంట్స్ )ను ప్రవచించి వ్యాప్తిలోకి తెచ్చారు. రామ చంద్ర గారి దేవుడికి ఆకారం, పేరు,మెదడు,మనసు ఉండవు. దేశం లోని మారు మూల ప్రాంతాలతో సహా దేశమంతా పర్య టించారు. ఇది భగవాన్ శ్రీ కృష్ణ పరమాత్మ ఆదేశం అన్నారు. 1974 లో శి ష్యుల కోరిక పై ఆత్మకధ రాశారు. అనేక గ్రంధాలను రచించి తన భావాలను నిక్షిప్తం చేశారు. దేశం లోని అనేక మంది విద్యా వేత్తలు మేధావులు శ్రీ రామ చంద్ర ను కలిసి అనుభూతి ని పొంది శిష్యులై వారి భావ వ్యాప్తికి తోడ్పడ్డారు. 1965 లో సహజ మార్గ రిసెర్చ్ సెంటర్ ఏర్పడింది. దీనికి శ్రీ కే.సి.వి.వరదా చారి డైరెక్టర్ గా వ్యవహరించారు. తాను భౌతికం గా లేక పోయినా అందరికి మార్గ దర్శనం చేస్తానని ఆయన శిష్యులకు చెప్పారు. 1983 ఏప్రిల్ 19 న ఎనభై నాలుగవ ఏట శ్రీ రామ చంద్ర జీ మహా రాజ్ మహా సమాధి చెందారు. ఆయన స్తాపించిన శ్రీ రామ చంద్ర మిషన్ దేశ వ్యాప్తం గా అనేక హాస్పిటల్స్ ను విద్యాలయాలయాలను, సేవా సంస్థలను నిర్వహిస్తూ ప్రజలకు అతి చేరువ అయింది. ఎక్కడ సంకల్ప బలం ఉంటుందో అక్కడ విజయం ఉంటుందని వీరి చరిత్ర తెలియ జేస్తోంది.

# 10 కంచి స్వామి శ్రీ శ్రీ జయేంద్ర సరస్వతి మహా ప్రస్థానం

మహావ్యక్తుల మహా ప్రస్థానం వారం రోజులుగా సాగుతూ ఉండటం, మరీ బాధాకరంగా, జీర్ణించుకోవటానికి వీలులేనిదిగా ఉంది. కాలప్రవాహం ఎవరికోసమూ ఆగదు అన్న నిజం ఎప్పుడూ నిజమౌతూనే ఉన్నది.. ఇప్పుడు కూడా అంతే.హాస్య నటుడు గుండు హనుమతరావు, మహానటి అందాల తార అతిలోక సుందరి శ్రీదేవి హఠాన్మరణం మహా కధకులు మునిపల్లె రాజు గారి నిర్యాణం నుంచి తేరుకోకముందే ఇవాళ కంచి మహాస్వామి శ్రీశ్రీ జయేంద్ర సరస్వతుల మహానిర్యాణ వార్త ఆస్తిక జన హృదయాలను కల్లోల పరచింది. 82 ఏళ్ళ వృద్ధాప్యం లో వారు సిద్ధిపొందారు. అందులో 64సంవత్సరాలు పీఠాది పత్యం వహించి ఆస్తిక జన జాగృతం చేశారు. శ్రీ పరమాచార్యులకు వారసులై 69వ పీఠాధిపతి గా తమ సమర్ధతను లోకానికి చాటిన ఆదర్శ మూర్తి.

తమిళనాడు తంజావూర్ జిల్లా ఇరుల్ నీకి లో బాల సుబ్రహ్మణ్య అయ్యర్ గా 1935 జనవరి 18 జన్మించారు. సుబ్రహ్మణ్య మహాదేవ గా పిలువబడ్డారు. పదమూడవ ఏటనే ఋగ్వేద సంహిత పూర్తి చేసి కంచి జగద్గురు విద్యాస్థాన్ లో చేరారు. కంచి పీఠ ఆస్థాన విద్వాంసుడు కృష్ణ శాస్త్రి గారి దృష్టిలో పడి పీఠానికి ఉత్తరాదికారానికి యోగ్యుడని గుర్తింపు పొందారు. సమైక్య వాదిగా పేరుపొందిన జయేంద్ర సరస్వతీ స్వామి పరమాచార్య, నడిచే దైవం అయిన శ్రీశ్రీ చంద్ర శేఖర యతీంద్రులవారితో పాటు మూడు సార్లు భారత దేశమంతా కాలినడకన పర్యటించారు. 1954 మార్చి 22 నపీఠాదిపత్యం వహించారు. మరొకమారు సపరివారంగా భారత దేశం నాలుగు మూలలా పాదచారియై పర్యటించి ఆధ్యాత్మిక భావ దీప్తి కలిగించారు. మృదు స్వభావి మధురవాక్కు ఉన్న స్వామి భక్తుల హృదయాలను చిరునవ్వు తో ఆకర్షించారు. వారి జ్ఞానబోధ పరమ ప్రసన్నంగా ఉండేది.



మానససరోవరం చేరి అక్కడ ఆది శంకరా చార్యుల శిలకు పూజాదికాలు నిర్వహించి ప్రతిష్టిం చటం అపూర్వ విషయం. ఇతర దేశాలైన బంగ్లాదేశ్ వంటి వాటిలో కూడా పర్యటించి కొత్త వరవడి సృష్టించారు. పశ్చిమ బెంగాల్ లోని శ్రీ రామకృష్ణ పరమహంస ఆవాసమైన కాళికా దేవాలయం లో "శంకరాచార్య గేటు "నెలకొల్పారు. చాతుర్మాస్య దీక్షలు క్రమబద్ధంగా నిర్వహించి ఆయా ప్రాంతలలో వైదిక ధర్మ వ్యాప్తి కలిగించిన మనీషి. చంద్ర శేఖరస్వామి వేదపాఠ శాలలు స్థాపించి శాస్త్రాధ్యయనానికి కృషి చేస్తే జయేంద్రులు ప్రజోపకార కార్యక్రమాలకు కూడా ప్రాధాన్యత నిచ్చారు. మానవ సేవే మాధవ సేవగా భావించి శంకర నేత్రాలయ సూపర్ స్పెషాలిటి ఆస్పత్రులను నెలకొల్పి సేవలందించారు. మత మార్పిడులను నిరోధించటానికి పీఠాధిపతుల,ధార్మిక సంస్థ ల సహకారం తీసుకున్నారు. దళిత వాడలలో హిందూ ధర్మ ప్రచారం చేశారు. వారినీ జనజీవన స్రవంతి లో కలిసేట్లు చేశారు. వారిలో సనాతన హైందవ ధర్మం పట్ల అభిరుచిని కలిగించి చైతన్యం తెచ్చారు.

సనాతన భారతీయ హిందూ ధర్మ పై అపార జ్ఞాన సంపన్ను లైన జయేంద్ర స్వామి అందరిచేతా ఆరాధింప బడిన మహోన్నత వ్యక్తి. కంచి పీఠం బలమైన సంస్థగా ఎదగటానికి వారు చేసిన కృషి అనితర సాధ్యం. అనేక పాఠశాలలు నేత్రాలయాలు నిర్మించి ప్రజలకు మఠాన్ని చాలా దగ్గరకు చేర్చారు. అస్సాం లో గౌహతి వద్ద శంకర నేత్రాలయం స్థాపించి ఈశాన్య రాష్ట్రాలలోనూ సేవా కార్యక్రమాలు చేబట్టారు. ప్రజా సంక్షేమమే ధ్యేయంగా బాలల ఆస్పత్రులు, హిందూ మిషన్ హాస్పిటల్, తమిళనాడు హాస్పిటల్ వంటివి నిర్మించి ప్రజా సంక్షేమమే భగవత్సేవ గా నిర్వహించారు.

1987 ఆగస్ట్ 22 అకస్మాత్తుగా అదృశ్యమై చివరికి తలకావేరి లో ప్రత్యక్షమై మొదటి సారిగా వివాదం లో పడ్డారు పెద్దస్వామి వాత్సల్యం సంపూర్ణం గా ఉండటం చేత ఆహ్వానింపబడి మళ్ళీ పీఠం ఎక్కారు. తర్వాత తమిళనాడు ముఖ్య మంత్రి జయలలిత అనేక ఆరోపణలతో జైలు పాలు చేసింది. ఏ ఒక్కటీ కోర్టులో రుజువు కాలేదు. ధర్మం కోసం వేద విజ్ఞాన వ్యాప్తికోసం, మానవ సేవ కోసం పరితపించి కృషి చేసిన శ్రీ జయేంద్ర సరస్వతి స్వామి మా ఉయ్యూరుకు దగ్గరలో ఉన్న గురజాడ గ్రామానికి మూడు నాలుగు సార్లు వచ్చారు. పరమాచార్యులవారితో ఉయ్యూరుకూడా వచ్చారు. వచ్చిన ప్రతిసారీ వారిని దర్శించుకున్న ప్రసంగాలు విన్న అదృష్టవంతులం అయ్యాం వీరిద్దరి గురు శిష్య బంధం దృఢమై ఆదర్శప్రాయమై నిలిచింది.

శ్రీ జయేంద్ర సరస్వతి ఇవాళ 28- ఫిబ్రవరి 2018 న శివైక్యం చెందారు. వారి ప్రేరణ స్ఫూర్తి మనలను కలకాలం తీర్చి దిద్దాలని ఆశిద్దాం.

## 11 శ్రీ కైవారం తాతగారు

మనకు తెలియని" మరో బ్రహ్మంగారి లాంటి" శ్రీ అంజనప్ప స్వాములు

హోసూరు ప్రాంతం వరకవి శ్రీ కైవారం తాతగారు జగత్ ప్రసిద్ధులు వారి సమగ్ర చరిత్రను త్రవ్వి తీసి డా అగరం వసంత్ఒక పుస్తకాన్ని వెలువరించాడు. దాదాపు అంతటి ప్రసిద్ధే ఉన్న శ్రీ అంజనప్ప స్వాములు గురించి ఆ ప్రాంతం వారికెవరికీ పెద్దగా తెలీదు. కాని ఆయన చరిత్ర కర్ణా కర్ణి గా విన్న వసంత్ లోని పరిశోధకుడు మేల్కొని ఆయన చరిత్ర అంతా సేకరించి పుస్తకం రాసి ఈ మార్చిలోనే "హోసూరు వరకవి యోగి –శ్రీ అంజనప్ప స్వాములు" గా ప్రచురించి నాకు నెలక్రితమే పంపితే ఇవాళే చదివే తీరిక దొరికి చదివి అందులోని విశేషాలను మీకు తెలియజేస్తున్నాను. "హోసూరు ఆంధ్ర పరిశోధక పరమేశ్వరుడు" డా.వసంత్ ను మనసారా అభినందిస్తున్నాను.



కర్నాటక కోలారుజిల్లా శ్రీనివాస తాలూకాలో గట్టుపల్లి గ్రామం లో అంజనప్ప స్వామి సమాధి, ఆశ్రమం ఉన్నాయి. ప్రతి ఏడాది మార్చి –ఏప్రిల్ నెలలో ఆయన ఆరాధనోత్సవాలు జరుగుతాయి. అది అంజనప్ప క్షేత్రంగా ప్రసిద్ధి పొందింది. గట్టళ్ళి అంజనప్ప అసలుపేరు. ఆయన పుట్టుకమాత్రం ప్రస్తుత తమిళనాడు లోని హోసూరు తాలూకా బేరికే ప్రక్కన ఉన్న సీకనపల్లి. ఇక్కడే 1869లో అంజనప్పకాళమాంబ,గవియప్ప దంపతులకు పుట్టారు. చిన్నతనం లోనే తండ్రి చనిపోగా, 1876-77కాలం లో హోసూరులో విషరోగాలు వ్యాపించిచాలామంది చనిపోగా, ఈయన తల్లి హోసూరు వదిలి కొడుకుతో కోలారుజిల్లా శ్రీనివాసపురం తాలూకా అరికేరి పల్లెకు చేరింది. అంకేరి జమీందారు వెంకటప్ప వీరికి బంధువు అవటం తో ఆయన ఆదుకొన్నాడు. తల్లి ఇంటిపనులు చేస్తూ, కొడుకు గొడ్లను కాస్తూ బతుకు బండీ ఈడ్చారు. వెంకటప్ప తనకూతురు పాపమ్మ అన్జనప్పకిచ్చి పెళ్లి చేశాడు. వీరి దాంపత్యం రామకృష్ణ పరమహంస శారదా మాతల దాంపత్యం లాగా సాగింది.

గొర్లను కాస్తూ రోజా అంజనప్ప చెట్ల నీడల్లో బండలమీద కూర్చుని ధ్యానం లో పడిపోయేవాడు.అప్పుడు ఆయన నోటినుంచి వేదాంత వాక్యాలు భక్తిపాటలు పద్యాలు అలవోకగా వచ్చేవి. మెలమెల్లగా వాటిని రాయటం మొదలు పెట్టారు. అదే తర్వాత "వేదాంత రత్నావళి "అనే 494పేజీల పుస్తకం గా వెలువడి కర్నాటక ప్రాంతమంతా విస్తృత ప్రచారం పొందింది. ఇందులోని 450పేజీలు తెలుగు మిగిలిన 50పేజీలు కన్నడం లో ఉండి,లిపి అంతాకన్నడ లిపిలో ఉంది. ఇప్పటికి ఆపుస్తకం 7సార్లు పునర్ముద్రణ పొందింది అంటే ఎంతటి ప్రభావం కలిగించిందో అర్ధమౌతుంది. ఇందులో 474తెలుగు కీర్తనలు, 52మాత్రమె కన్నడ కీర్తనలున్నాయి. దురదృష్ట వశాత్తు ఈ పుస్తకం ఇప్పటిదాకా తెలుగు లిపి లో అచ్చు కాలేదు. మనవాళ్ళ అలసత్వానికి నిలువెత్తు నిదర్శన గా నిలిచింది.

స్వాముల ఆధ్యాత్మిక సాహిత్యం శతకాలుగా, కందపద్యాలుగా ద్విపదలుగా తత్వాలుగా, కీర్తనలుగా ఉన్నాయి. అంజనప్ప స్వామికి ఆంజనేయస్వామి "మరుగుజ్జు "రూపం లో దర్శనమిచ్చి జ్ఞానబోధ చేశాడట.అందుకే ఆయనపై ఎక్కువ కీర్తనలు రాసి, ఆయనకే అంకితమిచ్చాడు అంజనప్ప స్వామి. అందరు దేవతలు దేవుళ్ళమీద కూడా కీర్తనలురాశాడు. వీటిని పండితపామరులు బాగా మెచ్చారు. వేదాన్తసారాన్ని భాక్తితో రంగరించి మహా మాధుర్యంగా రాశాడు. అలాగే అంజనప్ప స్వామి "కాలజ్ఞానం, "శ్రీ పరమాత్మ రామ లింగ శతకం. శ్రీ కృష్ణ శతకం,శ్రీ గగనాద్రిపురి శతకం, పిండోత్పత్తి వివరం, శ్రీపరమాత్మకవి శతకం, మస్తకాచల మహాత్యం, ముక్తికాంతా పరిణయం శ్రీ రాజయోగానంద ద్విపద కావ్యం, సుజ్ఞాన ద్విపద కావ్యం, గురుశిష్య సంవాదం వంటి రచనలెన్నో రాశారు.

తత్వాలను తెలుగులోఎక్కువగా రాసినా తనుఉన్న కన్నడ సీమను మర్చిపోకుండా ఆభాషలోనూ కొన్ని రాశారు. తనవ్యక్తిత్వాన్ని ఇలా చెప్పుకొన్నారు –"ఒకరి సొమ్ముకు నేను ఆశపడలేదు ఆంజనేయ –చెయ్యెత్తి ఇస్తేను చేతులొడ్డినాను ఆంజనేయ –కడుపుకు కూడు లేక కట్టు గుడ్డ లేక ఆంజనేయ –జోలి కట్టలేదు, ఇండ్లు తిరగలేదు ఆంజనేయ –కడుపు సాకుట కొరకు కష్టమెంతో పడితి ఆంజనేయ "

తత్వ బోధ చేస్తూ –"జగములోన జాతిభేదం లలెంచబోకండి –స్త్రీపురుష జాతులు రెండు సృష్టిలో నిర్మించే బ్రహ్మ "

గురువుగురించి –గురువు బోధా మరువ లేదమ్మా –సద్గురుని బోధ ఆత్మలో నా సెరనమ్మి నానమ్మా

"రామ నామ గురు తారక మంత్రము –కోరి పఠించర ఓరన్నా "

మానవ జన్మ గురించి –స్థిరముకాదు ఈమానవ జన్మము –పరమాత్ముని భజియించు.

"వావి వరుసలు పోయే వసుధ లోన –మాయ తెలియక పోయె,మమకార మెచ్చాయె-చెడిపోయే రాజ్యంబు చేటు వచ్చె-రాజ్యంబు రంకాయ రమ్యంబు లేదాయె"

"సతిపతు లిరువురుల్ సమగుణమైవుంటే –సత్యంబు సమమౌను నిత్యముగాను'

కృష్ణుడి పై –"గోపాల శ్రీ కృష్ణా గోపీ నందనా –పతితపావనలోల పంకజాక్షా –శ్రీపతి నిన్ను నే చింత చేసితి ఆత్మలో –తప్పాక నిన్నునే ఒప్పుగా పూజింతు "

"మూల బ్రహ్మంబెవరు ముమ్మూల గృహములో వెదకి చూసినవాడు యోగశాలి"అంటే ఆత్మలో వెదికితే మూలబ్రహ్మతత్వం తెలుస్తుంది.

పిండోత్పత్తి విధం –సతిపతులిద్దరూ సంతసంబున రతి చేయగా రమణి గర్భము నందు

ఒక్క మాసములోపల పంచభూతములు –రెండవ మాసమందు చర్మము కలుగును –మూడు మాసము ల లోపల నరములు కలుగును-ఏడోమాసములుఆడమగ శిశు రూపము --- ఎనిమిది మాసములందు సకల వాయువులు కలుగును "

మానవ శరీరం లో తెలుగు అక్షరాలు-స్థూల శరీరం లో గుద స్థానం లో ఆధార కమలం లో శష సహ,దానికి రెండు అంగుళాల పైన –సప్తతి అనే స్వాదిస్టానకమలం లో బ భ మా యరల ఉంటూ సృష్టికర్త బ్రహ్మ ఉంటాడు. దీనికి ఎనిమిది అంగుళాలపైన –డఢణతథదధనపఫలనే పది రేకులతో ఉంటుంది అక్కడ విష్ణువు ఉంటాడు. దీనికి పది అంగుళాలపైన హృదయస్థానం లో క ఖ గఘ ఙచఛజఝఞటఠఅనే పన్నెండు రేకులతో ఉంటుంది ఇక్కడ లయకర్త రుద్రుడు ఉంటాడు. దీనికి 12అంగులాళాపైనకంఠంలో అ,ఆ ఇఈఉఊ ఋౠఌౡ,ఎఏఐఒఓఔఅంఅఃఅనే 16దళాలతో విశుద్ధ చక్రం ఉంటుంది.

కైవారం తాతగారు 1726లో కర్నాటక చిక్క బళ్ళాపురం జిల్లా చింతామణి తాలూకాలో పుట్టారు. పోతులూరి వీరబ్రహ్మంగారిలా గా మఠం లో పూజలు అందుకొన్నారు తాతగారు 90శాతం తెలుగులో 10శాతమే కన్నడంలో రాశారు. వీరి రచనలన్నీ కన్నడీకరించ బడి బాగా ప్రచారం పొందాయి. అంజనప్ప ఆశ్రమం కైవారం వారి ఆశ్రమానికి 30కిలో మీటర్ల దూరం లో ఉన్నది. అంజనప్ప పై నారాయణ తాతగారి ప్రభావం కనిపిస్తుంది

"తొమ్మిది వాకిండ్లు కొంప దుఖముల కిది మూలదుంప "అని తాతగారు అంటే అంజనప్ప "తొమ్మిది వాకిండ్ల తనువిది నేమ్మదేమియు లేకున్నది "అన్నారు. "ఎందుండి వస్తివి తుమ్మెదా "అని ఆయన అంటే "నీ ఊరిపేరేమి జీవయ్యా నీవు ఎందుకు వస్తివి జీవయ్యా "అని ఈయన అన్నారు.

శ్రీ అంజనప్ప స్వామి గుట్టుపల్లి లో 1971 ఏప్రిల్ 30న 102వ ఏట సమాధిపొందారు.

బహు శ్రమపడి డా వసంత్ ఈ పుస్తకం రాసి అంజనప్ప స్వామిని మనకు అందుబాటులో తెచ్చినదుకు అభినందనలు. ఈ పుస్తకం లో స్వాముల 50 రచనలు చేర్చి నిండుదనం తెచ్చాడు వసంత్.అంజనప్ప స్వాముల ముఖ చిత్రం తో పుస్తకం మేలు భళా గా ఉంది.

వరకవి యోగి కైవారం నారాయణ తాతగారికి ఘన "వసంత "కైవారం

తమిళనాడు హోసూరు లో "కృష్ణరసం "అంటే కృష్ణగిరి రచయితల సంఘం, బస్తీ మే సవాల్ అన్నట్లుగా "బస్తీ యువజన సంఘం తెలుగు భాషకు సంస్కృతికి, మాండలికానికి ఇస్తున్న ప్రాచుర్యం అనన్య సామాన్య మైనది. ప్రతి ఉగాదికి కవితా సంకలనం, కతల సంకలనం వంటివి గత ఎనిమిదేళ్లుగా కొనసాగిస్తూ తెలుగు వారికి ఆదర్శప్రాయం అవుతున్నారు. అందులో చురుకైన పాత్ర పోషించే డా అగరం వసంత్ మార్గ దర్శకత్వం లో ఏటి కేడాది వారి సాహిత్య సేవ ఇనుమడిస్తూనే ఉంది. ఈ విలంబి ఉగాదికీ కొత్త పొత్తాలు వెలువరించారు. వాటిని నాకు పంపారు. అందులో శ్రీ వసంత్ రాసిన "కైవారం నారాయణ తాత గారి రచనలు –చిరు పరిశీలన "గొప్పగా ఉన్నది. రచయిత" చిరు "అని అన్నా "మేరు "నగ గంభీరం గా ఉన్నది. అందరు తప్పక చదవాల్సిన పుస్తకం. తాత మామూలోడు కాదు క్రాంత దర్శి. ఆంధ్ర దేశం లో పుట్టినా, తెలుగు వాళ్ళు ఎవరూ పట్టించుకోక పోయినా కస్తూరి వాసన దశ దిశలా వెదజల్లబడినట్లు కర్నాటక, తమిళనాడు మొదలైన రాష్ట్రాలలో తాతగారి రచనలను తత్వాలను అనువదించుకుని పాడుకుంటూ భావ వ్యాప్తి చేస్తున్నారు. పెరటి చెట్టు వైద్యానికి పనికి రాదన్న సామెత ఆంధ్రులకు బాగా వర్తిస్తుందని రుజువైంది ఈ విషయం లో. వసంత్ కు తాత గారంటే ఆరాధ్య దేవతే. ఆయన ప్రభావం లో పెరిగిన జీవితం తనదిగా భావిస్తాడు. కనుక తాతగారి జీవితం, రచనలను తలస్పర్శగా సమీక్షించాడు. అందులో ముఖ్యంగా తాతగారి జీవితం, రచనలలో నేను ఒడిసిపట్టిన విషయాలను మీ ముందు ఉంచుతున్నాను. ఇది చదివే దాకా నాకూ తాత గారిపై పూర్తీ అవగాహన రాలేదు మనలో చాలామందికి తెలియక పోవనూ వచ్చు. అందుకని ఈ ప్రయత్నం చేస్తున్నాను. ఇది ఉభయులకు శ్రేయోదాయకం లోక కళ్యాణ కారకం కూడా.



కైవారం నారాయణ తాత గారు

మహా భారతం లో ఉన్న "ఏక చక్ర పుర"మే కైవార క్షేత్రం. భీముడు బకాసురుని చంపి శవాన్ని ఒక గుహలో పడేసి గుహ ద్వారాన్ని పెద్ద బండరాయి తో మూసేశాడు. ఆ గుండును ఇప్పటికీ ఇక్కడ "బకుని గుండు "గా జనం చెప్పు కుంటారు. తాతగారి రచనలో కూడా దీని ప్రస్తావన ఉన్నది. ఇప్పటి కర్నాటక రాష్ట్రము చిక్క బళ్ళాపురం జిల్లా చింతామణి తాలూకా కైవార క్షేత్రం "కొత్తపల్లి "అనే పల్లె టూరిలో క్రీ.శ.1726లో కొండప్ప, ముద్దమ్మ దంపతులకు కైవారం నారాయణప్ప పేరుతో తాత జన్మించాడు. చిన్నతనం లోనే తల్లీ తండ్రీ చనిపోవటం తో ఊరి వారి సంరక్షణలో పెరిగాడు తాత. కైవారం లోని "అమర నారేయణస్వామి "ని సేవిస్తూ, భక్తి భావంతో పారవశ్యంగా పాటలు పాడుతూ, భజనలు చేస్తూ ఊరి జనం చేత బాల ప్రహ్లాదునిగా గుర్తింపు పొందాడు. మేనత్త కూతురు "మునెమ్మ"ను పెళ్ళాడి పెద్దకొండప్ప, చిన్న కొండప్ప కొడుకులకు, ముద్దమ్మ కూతురికి తండ్రి అయ్యాడు. గాజుల వ్యాపారం చేసే నారాయణప్ప యాభై వ ఏట చిత్తూరు జిల్లా మొగిలి వెంకట గిరి కనుమల్లో వానప్రస్థాశ్రమం లో ఉన్న "పర దేశి స్వామి "దర్శన ప్రభావం తో సంసారం త్యజించి సన్యాసిగా మారి" నారాయణ తాత "గా ప్రసిద్ధి చెందాడు.

చదువు పెద్దగా లేని తాత పామరులకు కూడా తేలికగా అర్ధమయ్యే రీతిలో వేదాంత సారాన్ని భక్తీ, రక్తి విరక్తి తో రంగరించి త్రివేణీ సంగమం చేసి పవిత్రత కల్గించి ప్రచారం చేశాడు. తత్వాలు, కీర్తనలు, కాలజ్ఞానం, అమర నారేయణ శతకం,, బ్రహ్మాండపురి శతకం, నాద బ్రహ్మానంద నారేయణ కవి శతకం, శ్రీ కృష్ణ చరిత తత్వామృత యోగసారం, తారక బ్రహ్మానంద ద్వయ కంద శతకం రచించి మహా కవులు, మహాయోగులు చేసినంత సాహిత్య సేవ చేసి, దార్శనికత ప్రదర్శించాడు. సమాజం లోని జాతి,మత కుల విభేదాలను రూపుమాపటానికి సంఘ సంస్కరణకు కృషి చేశాడు. అయన తత్వాలు గీతాలు కోలారు జిల్లా జానపదులే కాక చిక్కబళ్ళాపురం, బెంగుళూరు మైసూరు జిల్లాలలో తమిళనాడు హోసూరు, డెంకణి,వేపనపల్లి, ఆంధ్రాలో చిత్తూరు జిల్లాలో ప్రజల నోళ్ళలో నిత్యం నానుతూ రసాలూరిస్తాయి. లక్షలాది అభిమాన భక్త బృందమేర్పడింది తాతకు.

1836-37 సంవత్సరం జ్యేష్ట శుద్ధ తదియ రాత్రి 12 గంటలకు అంటే 110 ఏళ్ళ వయసులో తాను సమాధి చెందుతానని శిష్యులకు తాత ముందే తెలియ జేశాడు. అన్నట్లే అదే రోజు సమాధి గతుడై నాడు. ముఖ్య శిష్యుడు ముత్తప్ప స్వాములు తాతగారి సమాధి నిర్మించి, నిత్య పూజాదికాలు నిర్వహిస్తూ తాత భావ వ్యాప్తికి కృషి చేశాడు.. తర్వాత లింగాచార్యులు, ముని అవధూత ఆ బాధ్యతలు చేబట్టారు. తాళపత్రాలలో లిఖించబడిన తాత సాహిత్యాన్ని 1912 లో సీతారామాచార్యులు మఠ నిర్వహణలో భాగంగా మొదటి సారిగా ముద్రించి లోకానికి అందుబాటు లోకి తెచ్చాడు. ఆ తర్వాత నారాయణ సింగ్, మేలూరు ముని శ్యామప్ప,చిక్కబళ్ళాపురం చిన్న నారాయణ స్వామి, కట్టకింది జయరామి రెడ్డి మొదలైనవారు తాత సేవలో పునీతులయ్యారు. మాలూరు శ్రీ టి. సొణ్ణప్ప దాసు తాత జీవిత చరిత్రను హరికధా రూపంగా మార్చి గానం చేస్తూ తత్వ ప్రచారం చేశాడు. 1978-79 లో బెంగుళూరుకు చెందిన మత్తికరయ సంపంగప్పకుమారుడు ఏం ఎస్ రామయ్య తాతగారి ఆశ్రమాన్ని సందర్శించి అనుభూతికి లోనై,స్వంత ఖర్చుతో ఆశ్రమ రూపు రేఖలే మార్చి కొత్త భవనాలు నిర్మించి కైవారం తాతకు కైమోడ్పు క్రియా రూపంగా అందశాడు. ఈయన పెద్దకొడుకు డా.ఏం ఆర్ జయరాం 1998 నుండి ఆశ్రమ ధర్మాదికారిగా వ్యవహరిస్తున్నాడు. ప్రతి ఆదివారం వచ్చి భక్త బృందం తో ఒక్కో గ్రామం లో కీర్తనలు పాడుతూ తాత తత్వాలను సజీవం చేస్తున్నాడు. హోసూరు లో తాతగారి ఆశ్రమ నిర్వాహకులు బ్రహ్మశ్రీ వెంకటేశ్వర స్వాములు తనజీవితాన్ని తాత గారి సేవకు అంకితమిచ్చి నిత్యభజన, తత్వ ప్రచారం ఊరూరా నిర్వహిస్తున్నారు.

ఇలా కైవారంనారాయణ తాత గారు వెలిగించిన ఆధ్యాత్మిక జ్యోతి అమరదీపం లా విజ్ఞాన జ్యోతులను వెలయిస్తూ ఆస్తిక జనాలకు మార్గ దర్శకం గా ఉన్నది. ఈ ప్రభావం తోనే డా వసంత్ తాతగారి జీవితం రచనలు ఒక చోట చేర్చాలన్న సత్ సంకల్పం తో ఈ పొత్తం రాసి అందజేశాడు. తాతగారి జీవితం పై ఎన్నో వెలుగు

రేకలు ప్రసారితమైనాయి. తాత జీవితం మనవళ్ళ, ముని మనవళ్ళ,ఇని మనవళ్ళతరం దాకా ప్రసరించి శాశ్వతత్వాన్ని పొందింది. ఒక రకం గా ఈ పొత్తం కైవారం తాత గారికి డా. వసంత్ సమర్పించిన ఘన కైవారం అని పిస్తుంది.

**తాతగారి రచన తత్వబోధామృతం**

"తాతే లిల్లియలో –శివతాతే లిల్లియలో" అన్న కైవారం నారాయణ తాత గారి తత్త్వం నోటికి రాని వాళ్ళు, భజనలో పాడని వారూ అరుదు. అయన రాసిన తత్వాలు కీర్తనలు 162 లో తెలుగులో రాసినవి 144 అయితే కన్నడం లో 18 ఉన్నాయి. వీటిని "శ్రీ అమర నారేయణ యతీంద్ర వేదాంత సారావళి "గా పేర్కొంటారు. కొన్ని తెలుగు,కన్నడమిశ్రితాలుగా ఉన్నాయి. అంటే తెలుగులో మొదలై, కన్నడం తో ముగుస్తుంది -మణి ప్రవాళ శైలి లాగా. వినాయకునికి అగ్ర తాంబూలం ఇచ్చి –"ఏకదంతా మూషికవాహన వేదముని గణ వందితా –సకల విద్యల కాదికర్తవు సన్మునీ విఘ్నేశ్వరా "అని మొదలుపెట్టి "సంశయింపక వాక్కు నొసగుము సరసుడవు విఘ్నేశ్వరా –ధరను కైవర పుర విహారుడవై వెలసి యున్న హరునకు –ప్రియ సుతుడవై నట్టి గజముఖ దేవుడవు విఘ్నేశ్వరా "అని కీర్తించాడు భక్తిగా. కైవార క్షేత్ర దైవం అమర నారేయణ స్వామి తాతగారి ఆరాధ్య దైవం. స్థానిక మాండలికం లో "అంట "ను "అంటను చూడరమ్మా జగదంట ను చూడరమ్మా –అఖిలాండేశ్వరి శంభుని సతి తాకొలువై యున్నది –పంజులు,, కమ్మలు, పాపట బొట్టును తళుకు బుడగలు, తాళీపదకము –చక్కని తల్లికి ముత్యపు ముక్కర –పరమేశ్వరి తా కొలువై యున్నది ".కైవారం తాత గారి సమాధి వద్ద రోజూఆయన రాసిన రామనామామృతగానం వినబడటం ఒక ప్రత్యేకత. -"రామరామ ముకుంద మాధవ రామ సద్గురు కేశవా –రామ దశరథ తనయ దేవా –రామశ్రీ నారేయణా-చూడ చూడగ వెన్నెలాయెను-చూపు నిన్నే చూచెనూ –అన్నింటాను నీదే కళలు అమర శ్రీ నారేయణా"కీర్తన అక్కడ ప్రతిధ్వనిస్తుంటుంది. అన్నిటా హరి ఉన్నాడనే తత్త్వం బోధిస్తూ, ఆత్మ సాక్షాత్కారం పొంది తమలోనే హరిని దర్శించమని హితవు చెప్పాడు –"ఏమందురా శంభో,ఏమందు-ఏమందు ప్రజలకు నీ మందు దొరకాదు"అంటూ మందు అంటే పరమాత్మ తత్త్వం అని ఎరుక పరచాడు. అన్ని చోట్లా జరిగే జాతర అక్కడ ఇచ్చే జీవబలి తాతకు ఇష్టం లేదు. దీనికి విరుగుడుగా చక్కని తత్త్వం బోధిస్తూ –

"జాతర చేతామా శక్తికి జాతర చేతామా –ఎప్పుడు గృహమున వప్పుగ ఉన్నది –ముద్దులాడి ముక్తికాంతా సతికి –జాతర చేదామా "అని –"మీదగు మానస దీపము చేసి ముద్దుగ శక్తికి ముందర ఉంచి –క్రూర దున్నలను మూటిని దెచ్చి నారాయణాస్త్రమున నరికి యాలుచును –గూడమైన గుండు మల్లెలు దెచ్చి ప్రీతిగా శక్తికి అలంకరించి –పంచ భూతముల బలిగా నిచ్చి –తారక జ్యోతిని ధ్యానము చేసి, రామామృతమనే పొంగలి బెట్టి జాతర "చేదామని మానసిక పూజా విధాన ఉత్కృష్టత వివరించాడు. ఇలా చేస్తే జీవకోటికి ప్రమాదం ఉండదుకదా. అజ్ఞానమనే చీకటి తొలగించి బ్రహ్మ రాతను సైతం మార్చే శక్తి గురువుకు ఉన్నదని గురు బోధ చేశాడు. దైవ భక్తితో పాటు తాతకు దీనజన రక్షణా ముఖ్యమే. ఆ నాటి అనా వృష్టి ని పద్యాలలో వర్ణించి వారి బాధను కళ్ళకు కట్టించాడు.

"తోలు తిత్తి ఇది తూటులు తొమ్మిది తుస్సుమనుట ఖాయం "అని పాండురంగ మహాత్మ్యం సినిమాలో కస్తూరి శివరావు బృందం పాడిన పాట మాదిరే తాత –"తొమ్మిది వాకిండ్లు కొంప –దుఖమునకిది మూల దుంప –ఎంచితే కలగూర గంప –తెలుసుకో నీ తాడు తెంపా –డెబ్బది రెండు వేల నాళ్ళు అరువది తొమ్మిది కీళ్ళు –తోకపురుగులు మూడు సార్లు –నిండి ఉన్నది నీచు నీళ్ళు –మలమూత్రముల కుంట,మాంసము నెత్తార పెంట –మురికి పేగుల ముద్దు జంట కూడినది మలకోవి తుంటా "అని శరీర మర్మాన్ని వివరించి దేహం పై మొహం వదిలేయమన్నాడు. కైవారం కొండ ఎక్కమని "బకు డుండు గుండు చూడండా –భీమేశ్వరును మీద నిండా –భక్తీ భాగ్యము వేదు కొండా –పశ్చిమ ద్వారమున పొండా –అమర నారేయణుని నమ్ముకొండా"అని తన క్షేత్రానికి జి.పి.ఎస్. సిస్టం లో మార్గం చూపించాడు.

మతాలన్నీ చిక్కు పురాణాలు అని చెప్పి, అందరిలో ఉన్న దేవుడు ఒక్కడే అని తెలియ జేశాడు. దొంగ సన్యాసులను, కపట వేష దారులనుఎండగడుతూ -"ఏనుగు నెక్కిన యోగీశ్వరునకు –ఏపి మొరిగితే భయమౌనా ?"అని ఎద్దేవా చేశాడు.

మణి ప్రవాళ శైలిలో రాసిన అరుదైన కీర్తన వైభవం చూద్దాం –"బిత్తరి గురువు బెత్తాలు బట్టుక కట్ట్యేలమీదను నడిచేరురా –కళ్ళు కడవ రీతి కడుపులు పెంచుక మైనిండ గంధము పూసేరురా "అని తెలుగులో మొదలుపెట్టి –"జంగకెక్కుల విల్లా లింగెక్క హోలెయ్యల్ల శివ భక్త కరిగెఈగ సారిదినో –టేడరమనెపూటమాడిద నంజుండ ఇద్దస్టు హోళిదేఇదు కేళిరి-నారాయణ స్వామి హేళిదశిందు నుడి సుల్లెంద బాయిగె ముళ్ళాకిరో"అని రాసి జంగా నికి కులం, లింగానికి అంటూ లేవు అని సత్యం చెప్పాడు. బహిస్టైన స్త్రీలలో కూడా శివుడు ఆ సమయం లోనూ ఉంటాడు అనే కఠోర సత్యాన్ని, బోయవాడు పెట్టిన మాంసం శివుడు తినలేదా అని తత్వ బోధ చేసి చివరికి "నా మాటలను ఎవరైనా తప్పు అంటే వాళ్ళ నోళ్లల్లో ముళ్ళు కొట్టండి "అని ఖచ్చితంగా చెప్పాడు కైవారం తాత.

**తాతగారి కాల జ్ఞానామృతం**

కాలజ్ఞానం అంటే విదేశీయులలో నోస్ట్రా డామస్, స్వదేశీయులలో వీర బ్రహ్మేంద్రస్వామి ముందు గుర్తుకొస్తారు. కైవారం తాతగారు కూడా కాలజ్ఞానం 1813-14 కాలం లో రచించాడు. సూక్ష్మ భీమ ఖండ శతకం లో 28పద్యాలు, ప్రచండ నారేయణ కవి పద్యాలుగా 16 పద్యాలలో కాలజ్ఞానం గురించి ఉన్నట్లు వసంత్ తెలిపాడు. తాతగారి కాలజ్ఞానం లో విశ్వం లోని వింతలూ, ప్రకృతి వైపరీత్యాలు, అతి వృష్టి అనావృష్టి, ఆంగ్లేయుల పాలన అంతరించటం, వెట్టి చాకిరి నశించటం, వడ్డీ వ్యాపారం గుత్తాధిపత్యం హెచ్చటం, వెండి బంగారు నాణాలు డబ్బు రూపం లో ప్రభుత్వం ద్వారా ప్రజలకు చేరటం, ప్రపంచమంతా ఒకే ఒకడి అధీనం లోకి రావటం వగైరాలున్నాయని వసంత్ విశ్లేషించి చెప్పాడు. ముందుగా తెల్లవారి పాలన అంత మౌతుందని వారిని వానరులతో పోల్చి చెప్పాడు తాత.-"వానరుల వసుధ పాలన తీరెను –పలాయనమై పోదురు "అనీ "పడి చత్తురు –పరంగి వారి పట్టణము పాడౌను "అన్నాడు. పరంగిపండు అంటే బొప్పాయి పండు. తెలుపు, ఎరుపు రంగులో ఉంటారుకనుక వాళ్లకు ఆ పేరొచ్చిందట. సమస్త ప్రకృతిని "అరణ్య పురం "అన్నాడు తాత. ప్రకృతికి విఘాతం కలిగించవద్దని ఆనాడే హెచ్చరించాడు –"అరణ్య పురము నిండా శక్తి పుట్టినది "అన్నాడు అందుకనే, తన హృదయ సత్యమే కాలజ్ఞానం అన్నాడు. వేశ్యావృత్తి, దళారి ప్రవృత్తి పెరుగుతాయని, ఆడ మగ వస్త్రధారణ మానాన్ని కప్పుకునే విధంగా కాకుండా అమ్ముకునే విధంగా ఉంటాయని. పశువులు వాటిమేత స్త్రీలు వృక్షాలు భిక్షగాండ్లు

వగైరాలపై గుత్తాధిపత్యం హెచ్చుతుందన్నాడు –"పశులమేత భూమి పచ్చి పచ్చిక గుత్త-చెడ్డ స్త్రీలకు గుత్తచెట్ల గుత్త-ఫలవృక్షములు గుత్తపండ్లు కాయలు గుత్త-భిక్షగాండ్ల కు గుత్త,బీడు గుత్త –చాకి వాండ్లకు గుత్త సారాయి గుత్త –హరిదాసు గుత్త అడవి గుత్త "అని అన్నిటినీ నిలువునా దోచుకొనే వారు పెరిగిపోతారని ముందే చెప్పాడు. ఇప్పుడు జరుగుతున్న తంతు అదేకదా.

### నాద బ్రహ్మానంద నారేయణ కవి శతకం

"నాద బ్రహ్మానంద నారేయణకవి "మకుటం గా సాగే ఈ శతకం లో పెద్దలను మెచ్చుకొని మాల,కవుల, నోముల, మతాల జాతుల పై తన అభిప్రాయాన్ని నిష్కర్షగా తాత వెలి బుచ్చాడు. ఇంటి ప్రణయం వంటికి మేలు అని నీతి చెబుతూ –"పంట చేను విధము పడతి ఇంటను ఉండ –వారకాంతల మీద వలపు యాల ?చేతికాసు పొవ్వు, చెడు వ్యాధులు వచ్చురా "అని బయటి సుఖం మరిగితే ఇల్లూ ఒళ్ళూ గుల్ల అవుతాయని,సుఖం ఏమోకాని సుఖ వ్యాధులు పెరుగుతాయని హెచ్చరిక. "ప్రాణ లింగము తనలో ప్రత్యక్షమై వుండ-చరలింగ పూజలు చేయనేల ?"అనీ "ఓంకార ప్రణవంబు వైభవం బెరుగక – వాదించు వాడు వైరాగ్యుడౌనే" ?అని ప్రశ్నించి, "బ్రహ్మ ఎరుగని బ్రాహ్మడే శూద్రుడు?"అని ఉపనిషద్రహస్యాన్ని వివరించి,"రేచక, పూరక, కుంబక –సాహస పరుడైన వాని సహవాసమున-కనవలె కాయము మర్మము "అంటూ యోగ రహస్య వివరణ చేశాడు. మొత్తం 100పద్యాలను ఈ పుస్తకం లో చేర్చి వసంత్ మంచిపని చేశాడు. తాతగారి జ్ఞాన మూలధనం అందుకోవటానికి అనువైన తీరిది.

### అమర నారేయణ శతకం

లో 110 సీసపద్యాలున్నాయి.సీసాలో సెంటు వాసన గుప్పు మాననట్లు ప్రతి సీసం లోనూ విజ్ఞాన పరిమళం వెదజల్లేట్లుగా ఉన్నాయి. మచ్చుకి –"మతములన్ని యు వేరే –మార్గంబు ఒక్కటే –వర్ణ భేదములు వేరే –వస్త్ర మొకటే-శృంగారములు వేరే –బంగారమొక్కటే, పసుల వన్నెలు వేరే పాలు ఒకటే –జీవ బొందులు వేరే –జీవుండు ఒక్కడే –జాతి రీతులు వేరే –జన్మమొకటే –దర్శనంబులు వేరే –దైవంబు ఒకడే-పుష్పజాతులు వేరే –పూజ వఘటే-"ఈవిషయాలు తెలియక మనుషులు భ్రాంతి విడువకుండ భవ రోగబద్ధులైనారు అని బాధ పడ్డాడు తాత.

శివ భక్తులు శివుని పూజిస్తారేకాని శివుడున్న చోటు తెలుసుకోరు, అల్లాను ఆత్మలో చూడని ముస్లిం లకు ముక్తి ఎలాకలుగుతుంది ?నిష్టలు పాటించే వైష్ణవులు తత్త్వం తెలుసుకోకపోతే ప్రయోజనం ఏమిటి ?అని ప్రశ్నించాడు. ఆవులకు పచ్చిగడ్డి మీద, పిల్లికి మాంసం మీద, పక్షులకు పండ్లమీద, అడవి జంతువులకు చీకటి మీద, జలజీవులకు నీటిపైనా, తుమ్మెదకు పుష్పపరిమళంపైనా, గ్రామ దేవతలకు జంతు బలిమీద, ఆశ ఉంటె అల్పులైన నరులకు అన్నిటి పైనా ఆశ ఎక్కువ అని చురకలేశాడు.



### శ్రీ కృష్ణ తత్వామృత యోగ సారం

లో బాలకృష్ణుని చిలిపి చేష్టలు తోపాటు శ్రీ కృష్ణ తత్వాన్ని సుబోధకంగా బోధించాడు నారాయణ తాత. చిలిపి కన్నయ్య లీలల్ని తప్పుగా అర్ధం చేసుకున్న భర్త భార్యను శంకిస్తూ తమ జాతి వారిని పేరు పెట్టి పిలిచే విధానం లో హాస్యం తొణికిసలాడుతుంది.

### తలకాయ కొండ ద్విపద

లో కృష్ణ దేవరాయల ప్రస్తావన ఉన్నది. రాయల ఆస్థానం లో వీర రాఘవ భట్టు అనే పురోహితుడు శ్రీరంగ నాధుని సేవించాలని యాత్ర చేస్తూ, కోలారు దగ్గరున్న తలకాయ కొండకు వచ్చి అక్కడ ఒక ఆవు పొదుగు పాలను దాని దూడతోపాటు పులి పిల్ల కూడా తాగుతూ ఉండటం చూసి ఆశ్చర్యపోయి, తిరిగి వెళ్లి అప్పాజీకి తిమ్మరాజుకు తెలియ జేశాడు. అప్పాజీ ఇది విష్ణు మహిమ అని చెప్పి, రాయలకు నివేదించాడు. రాయలు భార్యలతో ససైన్యంగా ఆ ప్రదేశానికి వచ్చి అడవి మధ్యలో వెలసిన శ్రీ వెంకటేశ్వర స్వామిని సేవించి గుడి చుట్టూఉన్న పొదలను తొలగించి తన సేనాధిపతి చంద్ర శేఖర శెట్టి ద్వారా అక్కడి రాళ్ళపై చక్ర ముద్ర వేయించి, సాతాని వైష్ణవుడైన తిరు వెంగళప్పయ్యను అర్చకునిగా నియమించాడట. ఈ వృత్తాంతాన్ని తాత ద్విపదలో చక్కగా వివరించాడు –"ఆ వేళ రాయలు అతి భక్తి తోను –అర్చకుడు తిరుగ వెంగళప్పయ్య చేత –హరిపూజ గావించె ఆనందముగను".ఈ విధంగా చారిత్రిక ఇతి వృత్తాన్ని ద్విపదలలో భద్రపరచి గాన యోగ్యం చేశాడు నారాయణ తాత.

### బ్రహ్మాండ పురి శతకం

లో మొగుడిని అర్ధం చేసుకోలేని స్త్రీ ఎలాఉంటుందో చెప్పి, యోగి సుజ్ఞాని, జ్ఞానం, ప్రేమ, ఆత్మ జ్యోతి మొదలైన విషయాలపై పద్యాలు చెప్పాడు కైవారం తాత. ఇదంతా సమాజ సంస్కరణాభి లాషతో చెప్పినదే

మచ్చుకి ఒకటి –"అక్షరము లన్నీ నాల్గేసిగా భాగించి అందులోన నిలువు తీసి –తీసిన నిలువులో ఐదేసిగా భాగించి లబ్దభాగ మేర్పరచి -లబ్దమున ఉన్నట్టి నాల్గక్షరములకు నామ మొక్కటి దాని లగువు తెలిసి –ఏకాక్షరంబని ఎరిగిన నెర యోద ఎరుక మానసుడతడు యోగ శాలి.

మర్మ మిడవక పరులను మాటలాడు ముగ్ధు డని పించుకొని తాను మురియు చుండు.

భక్త మందార బ్రహ్మాండ పుర విహార జయతు జగదీశ అమర నారేయణేశ "

ఈ చివరి పద్యం బ్రహ్మ భేద్యంగా ఉందని వసంత్ భావించి ఎవరైనా విడమర్చి అర్ధం చెబితే చాలా సంతోషిస్తానని చెప్పాడు. నాదీ అదే కోరిక. కనుక "బాలు మీ కోర్టులో" ఉందని మనవి. అయినా వసంత్ "చూచాయగా దీనికి" ఓం" అని అర్ధం వస్తుంది "అని క్లూ కూడా ఇచ్చాడు.

తారక బ్రహ్మానంద ద్వయ కంద శతకం

230పద్యాలున్న ఈ శతకం సమాజం లోని దూర్తజనాలపై పద్యాలతో ఎక్కు పెట్టి విడిచిన బాణాలే.

"కొట్టకుమీ పసిబాలల –కొట్టకుమీ స్త్రీల అశ్వ పులి వర్గంబుల్ –కొట్టకుమీ దీనాత్ముల-కొట్టకు మీ సన్యాసి, కవుల నారేయణ కవీ "అని సకల జీవులపైనా తనకున్న ప్రేమభావాన్ని,జాలినీ అనుకంప నూ తెలియ జేశాడు. వంకాయ తోటలో టెంకాయలు వెదకటం వేస్టని –"తలకిందైతపసు చేసిన –తలనిండా జలడు పెంచి గడ్డము మీసం-దీక్షాక్రమమున వుండిన –మోక్షము తనకెట్ల వచ్చు మనసు చపలునకు "అని ముగించాడు తాత.

ఆత్మ బోదామృత వచనములు

కైవారం తాత తన ప్రియ శిష్యుడు ముత్తప్ప స్వామికి బోధించిన సత్యాలే ఇవి. ఇందులో ఒకటి రెండు –1-"అష్టాంగ యోగ ముద్రలను సమాధిలో వెలసి, ప్రకాశ స్వరూపముగా ఉండే ఆత్మను, ఓంకార శబ్ద మూలకముగా తెలిస్తే తక్షణం మోక్షం పొందటానికి అనుమానం లేదు. 2-జాగ్రత్, స్వప్న, సుషుప్తులలో నిశ్చల ధ్యానం చేస్తే, అజ్ఞానం అనే మలాన్ని కడిగి, ముక్తుడు అవటానికి ఏ సందేహమూ లేదు. గురు ధ్యానం చేసే వారి కర్మలు నాశనమై ఆనందం పొందుతారు. వంటి సుబోధక వాక్యాలతో తత్వాన్ని కరతలామలకం చేశాడు తాత.

తాత తాను ఎంతటి జ్ఞాని సుజ్ఞాని కాలజ్ఞాని క్రాంత దర్శీ అయినా పూర్వపు కవులను యోగులను స్మరించి కృతజ్ఞత చూపటం సంస్కారానికి గొప్ప నిదర్శనం, మనకు ఆదర్శం. -మచ్చుకి –"వాల్మీకి నారద శుక వ్యాస భట్టరు –వేమ యోగుల వారు ఎరుక పరులు ".''కనకదాస, పురందర దాసులను కన్నడం లో ప్రస్తుతించాడు. "శ్రీ గణేశ శ్రీశారద కాళిదాసాది కవులనెల్లా –భావమున బ్రస్తుతింతునురా "అని "రామానుజా చార్యుల ను కీర్తిస్తూ "తిరుమంత్రము జీవనము పావనము –రామానుజ గురుడిచ్చు మోక్షము "అన్నాడు. శ్రీనాధ మహాకవిని ప్రస్తుతిస్తూ "శ్రీనాధ సకల శాస్త్రములందు ప్రఖ్యాతా –తెలిసి తెలియక మూల మర్మము –తెరవు మరుపుల చేత ఉంటివి "అనీ భక్త పోతన్న ను "కవినాయకుల కెల్ల కల్ప వృక్షంబైన –బమ్మెర పోతయ్య భక్త వరుని "అని మెచ్చాడు నాకు తెలిసినంతవరకూ పోతనను 'కవి కల్ప వృక్షం "అని కీర్తించినవాడు కైవారం తాతయ్య ఒక్కడే అని పించింది.

కైవారం తాతగారి సాహిత్యాన్ని కన్నడీకరించి 10 భాగాలుగా తెచ్చి ప్రాచుర్యం తెచ్చారు. తాత గారి కీర్తనలను బాలమురళి, నేదునూరి, స్వరపరచి పాడి సిడిలుగా, కేసెట్టులుగా కైవారం మఠం లో అందుబాటులో ఉంచారు కావలసిన వారు మఠం వారిని సంప్రదించి పొందవచ్చు. బెంగుళూర్ నుండి వెలువడే కన్నడ మాసపత్రిక "మల్లార " తాతయ్య కీర్తనలను ధారావాహికంగా ప్రచురిస్తోంది. కైవారం తాత జీవిత చరిత్రను బ్లాక్ అండ్ వైట్ లోను కలర్ లోనూ కన్నడం లో సినిమాలుగా తీశారు. అచ్చ తెలుగువారైన ఆంధ్రా, తెలంగాణా వారికి ఇంతవరకు అ ఆలోచన రాక పోవటం సిగ్గు చేటు తల వంచు కోవాల్సిన పరిస్థితి అని సవివరంగా డా అగరం వసంత్ తెలియ జేశాడు. ఒక గొప్ప పురుషుని కాలాతీత వ్యక్తినీ మనకు "కైవారం నారాయణ తాత గారి రచనలు –చిరు పరిశీలన "ద్వారా పరిచయం చేసిన వసంత్ ధన్యుడై, మనల్నీ ధన్యులను చేసినందుకు, అతనికి ఏమిచ్చినా ఋణం తీరదు. అందుకని కృతజ్ఞత చెప్పి తప్పించుకొంటున్నాను. అతని చిరు పరిచయం నాతో ఇంత పెద్ద వ్యాసం రాయించింది. తెలియని విషయాలెన్నో నాకు తెలిసి, ఆ ఆనందంతో మీకూ తెలియ జేశాను.శ్రమ వసంత్ ది.ఫలితం మనందరిది.

## 12 యోగి నివృత్తి నాధుడు

నాధ సంప్రదాయానికి చెందిన నివృత్తి నాధుడు 13 వ శతాబ్దపు మహారాష్ట్ర కు చెందిన మహా భక్తుడు,కవి, తత్వవేత్త మహాయోగి. మొదటి వర్కారి సంత్ అయిన సంత్ జ్ఞానేశ్వర్ కు పెద్దన్నయ్య, గురువుకూడా. మహారాష్ట్ర గోదావరీ తీరం లోని పైఠాన్ దగ్గరున్న ఆపెగావ్ లో దేశస్థ బ్రాహ్మణ కుటుంబం లో జన్మించాడు. అప్పుడు ఆ ప్రాంతాన్ని మహారాష్ట్ర యాదవ రాజు రామదేవ వర్మ పాలిస్తున్నాడు.

గ్రామ కరణం అయిన తండ్రి విఠల్ పంత్ కు జన్మించిన నలుగురు సంతానం లో నివృత్తి నాధుడు పెద్దవాడు. తల్లి రుక్మిణి బాయ్.. నివృత్తి నాధుని తర్వాత జ్ఞానేశ్వరుడు, సోపాన్ దేవుడు, అనే కుమారులు, ముక్తాబాయ్ అనే కుమార్తె ఆ దంపతులకు జన్మించారు..



నివృత్తి నాథుడు పదేళ్ళ వయసులో ముక్తాబాయ్ నాలుగేళ్ల వయసు లో ఉండగా తండ్రి కుటుంబాన్ని నాసిక్ కు మార్చాడు. ఒక సారి కుటుంబం తో జ్యోతిర్లింగ మైన త్ర్యంబకేశ్వరుని దర్శించటానికి తీర్థ యాత్ర చేస్తూ దట్టమైన అరణ్యం లో ప్రయాణిస్తుండగా అకస్మాత్తుగా ఒక పెద్ద పులి బారిన కుటుంబమంతా పడింది. భయపడి ప్రాణాలు దక్కించుకోవటానికి పారి పోయారు. అదృష్ట వశాత్తు ఎవ్వరికీ ఏ ప్రమాదమూ జరగలేదుకాని నివృత్తి నాథుడు మాత్రం కుటుంబానికి దూరమయ్యాడు. తండ్రి అతనికోసం చాలా కాలం వెతికించాడు కాని జాడ తెలియలేదు. అతడు అంజని పర్వతం పైకి చేరి అక్కడ గుహలో తలదాచుకున్నాడు. అక్కడే గహని నాథ్ అనే యోగి తపస్సమాధిలో ఉండటం గమనించాడు. ఆయన సమాధి నుంచి బయటకు రాగానే ఆయన పాదాలపై వాలి శరణు కోరాడు. ఆయన "సంతోషం, చివరికి నువ్వు ఇక్కడికి వచ్చావన్నమాట "అన్నాడు. ఆయన అన్నమాటలు అర్థం కాలేదు. ఆశ్చర్యం తో చూస్తున్నాడు. "అడవి లోకి పులిని పంపింది నేనే. నువ్వు ఇక్కడికి వస్తావని ఈ గుహలో ఎదురు చూస్తున్నాను "అంటూ ఆప్యాయంగా హత్తుకొని శిరసుపై హస్తం ఉంచి ఆశీర్వ దించాడు. అలనాడు శంకర భాగవత్పాదులకోసం గోవింద భగవత్పాదులు,, వివేకానందుని కోసం రామ కృష్ణ పరమహంస ఎదురు చూసిన సంగతి మనకు తెలుసు. నివృత్తి నాదుని అజ్ఞానం తొలగిపోయి జ్ఞానం కలిగి ఆయన మహాగురువు గహనీనాథు లని గ్రహించాడు. గురువు అతనిని శిష్యునిగా స్వీకరించి నాథ సంప్రదాయం లో చేర్చుకున్నాడు. గహనీ నాథమహాయోగి శిష్యుడు నివృత్తి నాదుని పై సంపూర్ణ అనుగ్రహామృతాన్ని వర్షించి, ఆత్మజ్ఞానం పొందిన మహాత్మునిగా యోగి మహారాజ్ గా మలచాడు. అతని జీవిత ధ్యేయం కర్తవ్యం బోధించాడు. గురువును వదిలి పెట్టటానికి శిష్యుడు అంగీకరించలేక తపించి పోయాడు. ఉన్నట్టుండి ఒక రోజు గురుమహారాజ్ అక్కడి నుండి అదృశ్యమయ్యాడు.. ఇప్పుడు నివృత్తి నాథుడు సంపూర్ణ ఆత్మజ్ఞానం పొందిన నాథ గురువై పూర్ణ యోగి యై జ్ఞాన బోధ చేస్తూ లోకానికి మార్గ దర్శనం చేశాడు.,



గుర్వాజ్ఞ నెరవేర్చటానికి అక్కడనుండి బయల్దేరి నివృత్తి నాథుడు దేశ సంచారం చేస్తూ నాద సంప్రదాయాన్ని వ్యాప్తి చేస్తూ కుటుంబాన్ని కలిసి జ్ఞానేశ్వర్ ను కూడా నాథ సంప్రదాయం లో చేర్చి గురువయ్యాడు. నాథసంప్రదాయం అంతా గురు శిష్య సంబంధం పై నడుస్తుంది. జ్ఞానేశ్వర్ కున్న అపూర్వ జ్ఞానం, భక్తి, మేధస్సు, అతీంద్రియ శక్తి, అనుభవాలను గుర్తించి అన్నగారు అతనిని వేదాంత విషయాలపై మంచి గ్రంథం రాయమని కోరాడు. అన్న కోరికపై సంత్ జ్ఞానేశ్వర్ "అమృతానుభవం "గ్రంథం అతని చిన్నవయసులోనే రచించాడు. దీనికి విశేషమైన కీర్తి, ఆదరణ లభించాయి. భగవద్గీతపై వ్యాఖ్యానంగా "జ్ఞానేశ్వరి "రాశాడు. ఇదీ అద్భుతమైన గ్రంథమే. అమృతానుభవం రాశాక, యోగి మహారాజ్ జ్ఞానేశ్వర్ పండరి పురం వెళ్లి పాండురంగని దర్శించి అక్కడే ఉన్న భక్త శిఖామణి నామ దేవుని పరిచయభాగ్యం పొందాడు. అనేక ప్రాంతాలు తిరుగుతూ వర్కారి సంప్రదాయ వ్యాప్తి చేశాడు. జ్ఞానేశ్వర్ నామదేవ్ ల మహాత్మ్యాలను జనం కథలు గాథలుగా చెప్పుకొంటారు. అలందిలో ఉన్నాడు.

తమ్ముడు సంత్ జ్ఞానేశ్వర్ " అలంది" లో సమాధి చెందిన తర్వాత, సంత్ నివృత్తి నాథుడు చెల్లెలు ముక్తాబాయ్ తో కలిసి అలంది ని విడిచి తీర్థ యాత్రకు వెళ్ళాడు. ముక్తాబాయ్ చిన్నన్న సోపాన దేవ్ కు గురువై ఆత్మజ్ఞానం బోధించి అనేక అభంగాలు రాసి కీర్తి గడించింది. సోపాన్ దేవ్ మరాఠీ.భగవద్గీత ఆధారం గా "సోపాన్ దేవి "తో పాటు సుమారు 50 అభంగాలు రాశాడు. పూనా వద్ద సస్వద్ లో సమాధి పొందాడు. ఒకనాటి తుఫాను ఉరుములు మెరుపులు జడి వాన లో ముక్తాబాయ్ దారి తప్పి పోయింది. అలంది లో నిర్యాణం చెందింది. నివృత్తి నాథుడు త్రయంబకేశ్వరం వద్ద మహా సమాధి చెందాడు. సమాధిపై గొప్ప ఆలయాన్ని తర్వాత నిర్మించారు. వేలాది భక్తులు నాథ సంప్రదాయం వారు సందర్శించి స్ఫూర్తి పొందుతూ ఉంటారు. మొత్తం మీద నివృత్తి నాథుని కుటుంబం వారంతా మహా జ్ఞానసంపన్నులై, భక్తిజ్ఞాన వైరాగ్య మార్గ దర్శులై నారు.

## 13 భక్త కనకదాసు

"మీలో మోక్షానికి ఎవరు అర్హులు ?""అని శిష్యులను గురువు వ్యాసరాయలవారు ప్రశ్నిస్తే "నేనే అర్హుడిని " "అని ధైర్యంగా చెప్పిన కురుబ గౌడ దాస కుటుంబం లో పుట్టిన మహా భక్తుడు కనకదాసు. కర్ణాటకలో హావేరీ జిల్లా బాద గ్రామంలో యుద్ధ సైనికాధ్యక్ష కుటుంబం లో బీర్ గౌడ, బీచమ్మ దంపతులకు కనకదాసు 1509 లో జన్మించాడు. తనకీర్తనలు, ఉపభోగాల వలనకర్ణాటక సాహిత్యాన్ని సుసంపన్నం చేసి బాగాప్రసిద్ధమయ్యాడు.



### తిమ్మప్ప కనకదాసైన విధం

అసలు పేరు తిమ్మప్ప నాయకుడు బాగా చదువుకొని సమాజాన్ని అన్ని కోణాలలో సూక్ష్మ పరిశీలన చేశాడు కనకదాసు. అతని కీర్తనలో ఒకదాని ప్రకారం కనకదాసు" కనక నాయకుడు"అనేసైన్యాధ్యక్షుడు. ఒక యుద్ధంలో తీవ్రం గా గాయపడ్డాడు కానీ అదృష్టవశాత్తు ప్రాణాపాయం తప్పింది. దీనితో సైన్యానికి గుడ్ బై చెప్పివ్యాసరాయల శిష్యుడై "కనకదాసు "అని గురువు పెట్టిన పేరుకు సార్ధకత తెచ్చి సామాన్యులకు అర్ధమయ్యే కన్నడ భాషలో కీర్తనలు రాస్తూ రచనలు చేస్తూ వేదాంతాన్ని అభ్యసించి మహా కృష్ణ భక్తుడయ్యాడు

### నేనే మోక్షానికి అర్హుడిని

యవ్వనం లోనే కనకదాసు నృసింహ స్తోత్రం, రామధ్యాన మంత్రం, మోహన తరంగిణి రచించాడు ఆయన ముఖ్య బోధన"నేను అనేది పోతే అంతా పోతుంది "ఒక రోజు గురువు వ్యాసరాయలు కనకదాసుతో సహా తన శిష్యులను "మీలో మోక్షానికి ఎవరు అర్హులు ?"అని ప్రశ్నించగా క్షణం ఆలోచించకుండా "నేనే కాదు వీళ్ళెవ్వరూ అర్హులు కాదు "అన్నాడు. గురువు రెట్టించి అడిగినా అదే సమాధానం చెప్పటమేకాదు "నేను మోక్షానికి వెడతానా ?"అనిగురువు అడిగితే "మీరూ వెళ్ళలేరు "అని ఖచ్చితంగా చెప్పాడు. దీనికి శిష్యులతో సహా గురువుకు కూడా విపరీతమైన కోపం వచ్చింది దాసుమీద. చివరికి గురువు దాసును "నీకు మోక్షానికి వెళ్లాలని లేదా "అని అడగగా "నేను అనేది పోతే అంతాపోతుంది-మోక్షం వస్తుంది "అన్నాడు. శిష్యుడి పరమ వేదాంత భావనకు గురువు పరమానందం పొందాడు. ఆతర్వాత రమణ మహర్షి కూడా "నే నెవరు అని తెలుసుకొంటే అంతా తెలుస్తుంది "అని చెప్పిన సంగతి మనకు తెలుసు.

### కనకదాసుకోసం తూర్పు నుంచి పడమరకు తిరిగినఉడిపి శ్రీకృష్ణ విగ్రహం

వ్యాసరాయలు శ్రీ కృష్ణ దేవరాయల గురువు. ఉడిపి లో ఉండేవాడు కనకదాస్సుకూడా గురువుతో అక్కడే ఉన్నాడు. ఉడిపి శ్రీ కృష్ణ దర్శనానికి కనకదాసును బ్రాహ్మణ పూజారులు వ్యాసరాయలు చెప్పినా అనుమతి నిరాకరించారు. కనకదాసు గుడిబయటపడమర వైపు కూర్చుని శ్రీకృష్ణ కీర్తనలుకొన్ని రోజులపాటు భక్తితో పారవశ్యంతో గానం చేశాడు. కానీ కర్కశ హృదయులైన పూజారులకు కనికరం కలగలేదు లోనికి అనుమతించలేదు. ఒక రోజు తూర్పున ఉన్న కృష్ణ విగ్రహం తన భక్తుడికి దర్శనం ఇవ్వాలని ఒక్కసారిగా పడమర వైపుకు తిరగటం, ఆలయం గోడ కూలిపోయి కనకదాసుకు కనకమహాలక్ష్మీ విభుడైన శ్రీ కృష్ణస్వామిదివ్య దర్శనం లభించింది. పూజారులు అప్రతిభులయ్యారు కనకదాసు మహా భక్తికి నీరాజనాలు పలికి సగౌరవంగా ఆలయ ప్రవేశం చేయించారు.. ఉడిపి కృష్ణాలయం ముఖద్వారం తూర్పు వైపున ఉంటుంది. మొదట్లో కృష్ణ విగ్రహమూ తూర్పుకె ఉండేది. కనక దాసుకు దర్శనం ఇవ్వటానికి కృష్ణుడే దిశను మార్చుకున్నాడు. అప్పటి నుంచి ముఖద్వారం తూర్పుకు ఉన్నా, కృష్ణ విగ్రహం పడమటి వైపే ఉంటోంది. భక్తవరదుడు అంటే ఇదే. ఇప్పుడు ఇక్కడ ఉన్న కిటికీ ని "కనకదాస కిటికీ "అంటారు. ఈ కిటికీ లోంచే ఉడిపి కృష్ణుని దర్శిస్తారు. అంతటి చరిత్ర సృష్టించాడు

### కనక మందిరం

మహాభక్తుడైన కనక దాసు. ఆలయ గోపురం ముందు చిన్న గుడిసెలో ఉండేవాడు. తర్వాత దాన్ని ఒకమందిరం లాగా కట్టి "కనక మందిరం "అని పిలుస్తున్నారు మహా భక్తుడైన పురందర దాసు వ్యాసరాయలూ కృష్ణ భక్తులే అయినా కనక దాసుకూ కృష్ణ స్వామికి ఉన్న అనుబంధం అన్నిటికన్నా మించినది.

### సామాన్యుల మాన్యకవి, సంస్కర్త

కనకదాసు ఏది రాసినా సామాన్యులకు అర్ధమయేటట్లు వారికి అందుబాటులో ఉండేటట్లే రాశాడు. ఆయన రాసిన "రామ ధ్యాన చరిత "లో రాగి ధాన్యానికి బియ్యానికి ఉన్న స్పర్ధను చక్కగా అభి వర్ణించాడు. రాగి పేద వాళ్ళ ఆహారం. బియ్యం ధనవంతుల ఆహారం. బియ్యం గొప్పదే అయినా రాగిలో పోషకాహార విలువ ఎక్కువ. దీన్నే ఆయన అందులో నిరూపించాడు బీద, ధనిక భేదాన్ని పేదయైనా వ్యక్తిత్వం లో మిన్న గా ఉండే విధానాన్ని ఇందులో సింబాలిక్ గా చెప్పాడు.. ఆ నాటి సమాజం లో హరిదాసు ఉద్యమం బాగా ఉండేది. దాస సంప్రదాయానికి చెందిన కనకదాసు విస్తృతంగా పర్యటించి ఆ సంప్రదాయ వ్యాప్తి చేస్తూ ప్రజలలో భక్తి, సామాజిక బాధ్యతా, సమత్వం పెంపొందించాడు. సామాజిక అంశాలను నీతిని భక్తితో జోడించి చెప్పాడు. తనకీర్తనలలో వర్ణ వ్యవస్థను ఏకిపారేశారు. అందరూ సమానమే అన్నాడు. "కులకుల వేందు హోడె దాదరి "అన్న కీర్తనలో కులం కులం అని ఎందుకు మొత్తుకొంటారురా అని చివాట్లు పెట్టాడు

### కినేగెలే ఆదికేశవ కృతి ముద్ర

ఇవాళ కర్ణాటక హవేరి జిల్లా లోని కాగినేలి లో కొలువై ఉన్న ఆదికేశవ స్వామి కి అత్యంత భక్తుడు కనకదాసు. కనకదాస విరచిత 240 కృతులు సజీవంగా ఉండి కర్ణాటక సంగీత గాయకుల నోటప్రచారమవుతున్నాయి. ఈ కీర్తనలో ముద్ర "కిగినెలే ఆదికేశవ "అని ఉంటుంది. కీర్తనలు రచించటమే కాదు అదో జగత్ సహోదరుల ను ఉన్నతస్థితికి తీసుకు రావటానికి సంఘ సంస్కరణ ఉద్యమాలు చేశాడు.

**నిర్యాణం**

కనకదాసు జీవిత చరమాంకం లో తిరుపతి లో బాలాజీ సన్నిధి లో గడిపి, నూరేళ్లు నిండు జీవితాన్ని అనుభవించి 1609 లో శ్రీ కృష్ణ సన్నిధానం చేరుకొన్నాడు.

కనకదాసు 1-నలచరిత్ర 2-నృసింహ స్తోత్రం 3-హరిభక్తిసార 4-రామధ్యాన చరిత్ర 5-మోహన తరంగి కన్నడం లో రచించాడు

**విజయనగరమే ద్వారకా నగరం**

.కనకదాసు కవిత్వం చక్కని ఉపమానాలతో సహజ సుందరం గా సరళంగా ఉంటుంది. శ్రీ కృష్ణుని ద్వారకా నగరాన్ని విజయనగరం గా పోల్చి విదేశీ రాయబారులు విజయనగరాన్ని వర్ణించిన తీరును దృష్టిలో పెట్టుకొని గొప్పగా వర్ణించాడు.

**కనకదాస జయంతి నిర్వహిస్తున్న కర్ణాటక ప్రభుత్వం**

కనక దాస జయంతిని కర్ణాటక ప్రభుత్వం సెలవు దినంగా ప్రకటించి ప్రభుత్వ కార్యక్రమంగా ప్రతి ఏడాదీ నిర్వహించి ఆమహా భక్త కవిని చిరస్మరణీయుని చేస్తోంది. తీర్ధ యాత్రలు చేసేవారువెయ్యేళ్లనాటి ఉడిపిశ్రీ కృష్ణ దేవాలయానికి వెళ్లి "కనక దాస కిండే(కిటికీ ) ద్వారా ఉడిపి కృష్ణుని సందర్శించి ధన్యులవమని కోరిక.




--

# 14 శ్రీ వాసు దేవానంద సరస్వతి

అశ్వత్థామ వంటి దివ్య పురుషులను దర్శించిన శ్రీ వాసు దేవానంద సరస్వతి

పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ వాసు దేవానంద సరస్వతి 1854శ్రావణ కృష్ణ పంచమినాడు మహారాష్ట్ర,సామంతవాడి దగ్గర మాన్గోన్ గ్రామం లో జన్మించారు. వీరిని తెమ్బేస్వామి అని అంటారు. దత్తాత్రేయస్వామి అవతారంగా భావిస్తారు. చిన్నతనం లో వాసుదేవ అని పిలువబడేవారు విధివిధానంగా అన్నీ చేసేవారు. రెండుపూటలా సంధ్యావందనం, వెయ్యి సార్లు గాయత్రీ జపం,గురు చరిత్ర పఠనం నిత్యకృత్యం. రెండులక్షల నలభై సార్లు గాయత్రి జపం చేశారు. తర్వాత వేదాధ్యయనం టాటా భట్టాజీ ఉక్తి దేవ వద్ద చేశారు. సాత్వికాహారం తినేవారు. ముందుగా వైశ్వదేవ ఆహుతి ఇచ్చి తర్వాత తినేవారు. ప్రతి ఏకాదశినాడు ఉపవాసం చేసేవారు. మంచి నీరుకూడా త్రాగకుండా పగలు,రాత్రీ నిద్రపోకుండా ప్రణవం జపిస్తూ గడిపేవారు. మంత్రసిద్ధికి అర్హత సాధించారు. వందేళ్ళనాటి దత్త్రేయ యంత్రాన్ని స్వహస్తాలతో రాసిన దత్త స్తవం ఆయన ఆస్తి.. సరస్వతీ దేవిపై రాసిన శ్లోకాలను 1913 లో నీలకంఠశాస్త్రి తండ్రికి అందజేశారు. ఒకశ్లోకం – నమస్తేశారదాదేవీ –సరస్వతి మతిప్రదే –వాసత్వ మమ జిహ్వాగ్రే –సర్వ విద్యా ప్రదా భవ "




వాసుదేవ స్వామి తానుపొందిన సిద్ధులు, శక్తులు ఎన్నడూ డబ్బు కోసం ప్రదర్శించలేదు దీనులకు, అవసరమున్నవారికి సాయం చేసేవారు.

కుర్గుడ్డా, పిఠాపురం వంటి చోట్ల ఆశ్రమాలను అభి వృద్ధి చేశారు. "దిగంబర దిగంబర శ్రీ పాద వల్లభ దిగంబర"మంత్రం తో దత్త విగ్రహాలు స్థాపించారు. ఈ మహామంత్రాన్ని కోట్లాది సార్లు జపించి అద్భుత సాహిత్యం సృష్టించి జ్ఞానబోధ చేశారు. 1914 లో గుజరాత్ లోనిగరుడేశ్వర్ లో పద్మాసనం లో దత్త విగ్రహం ఎదుట కూర్చుని ఓంకారం జపిస్తూ60వ ఏట ప్రాణాలు వదిలి సిద్ధిపొందారు. భక్తులు ఎప్పుడు భక్తిగా తలచితే అప్పుడు వచ్చి కోరికలు తీరుస్తానని చెప్పి దేహం చాలించారు '

వీరికి 8వ ఏట ఉపనయం అయింది. బాబాజీ పంత్ కూతురు రమాబాయి తో 21వ ఏట వివాహమైంది. నిత్యస్మార్తాగ్ని చేసేవారు. గాయత్రీ మంత్రం పునశ్చరణ చేసేవారు. వైశాఖ శుక్ల పంచమినాడు తనస్వగ్రామం మంగోం లో శ్రీ దత్తాత్రేయ విగ్రహం ప్రతిష్టించారు. జ్యేష్ట శుద్ధ ద్వాదశినాడు సన్యాసాశ్రమ స్వీకారం విధి విధానంగా స్వీకరించారు. ఉజ్జైన్ లో శ్రీ నారాణా నంద సరస్వతి నుంచి దండం స్వీకరించారు. 1891క్షిప్రా నది ఒడ్డున ఉజ్జైన్ లో మొదటి చాతుర్మాస్య దీక్ష చేశారు. 1892లో ఉత్తరప్రదేశ్ బ్రహ్మావర్తం లో రెండవ చాతుర్మాస్యం గడిపారు.ఈ సమయం లో శ్రీ దత్తపురాణం సంస్కృతంలో రచించారు. మూడవ చాతుర్మాస్యం హరిద్వారం లో గంగానదీ తీరం లో 1893 లో పూర్తి చేశారు. మూడు నాలుగు చాతుర్మాస్యాలు బద్రీ, కేదార్ నాద లలో 1894,95లలో చేశారు. 1896ఆరవ చాతుర్మాస్యం హరిద్వార గంగాతీరం లో పూర్తి చేశారు. 1896 "నర్మదా లహరి "అద్భుత రచన చేశారు. ఏడవ చాతుర్మాస్యం మహానదీ తీరాన 1897లోమధ్యప్రదేశ్ పెట్లాడ్ లో చేశారు, ఇక్కడే "దత్త లీలామృత సింధు " వెయ్యి పదబంధాలతో రాశారు. 1898లో గుజరాత్ లోని తిలక్ వాడా లో ఎనిమదవ చాతుర్మాస్యం చేసి, తెలుగులోని "కుమార పురాణం "ను మరాఠీ లోకి అనువదించారు.

గుజరాత్ లోని ద్వారకలో తొమ్మిదవ చాతుర్మాస్యం 1899 లోనూ, పదవదాన్ని 1900లో మధ్యప్రదేశ్ చికలాడ లో నర్మదా నదీ తీరం లో చేస్తూ "కృష్ణ వేణి – పంచగంగ యుధిస్టం"అనే నర్సోబా వాడి గొప్పతనాన్ని ఇంగ్లీష్ లో రాశారు. మధ్యప్రదేశ్ మహాత్ పూర్ లో క్షిప్రా తీరం లో 1901లో పదకొండవ చాతుర్మాస్యం గడిపి, దత్తపురాణం లోని కథలను సంకలనం చేసి, "త్రిశతి గురు చరిత్ర "ను 300శ్లోకాలలో రచించారు. గురు చరిత్ర ఇక్కడే మొదటి సారి ముద్రించి అందరికీ అందజేశారు. ఉత్తర ప్రదేశ్ బ్రహ్మావర్తం లో 1902 లో12 చాతుర్మాస్యం గడుపుతూ సంశ్లోకి గురు చరితను లఘుమనన సార వేదాంతంగా కూర్చారు ఇక్కడే 1903 లో చాతుర్మాస్యం గడిపి "సప్తశతి గురు చరిత్ర "ను 700 శ్లోకాలో మహిళలు పఠించ టానికి వీలుగారాశారు. ఇక్కడే 1904 లో 14వ చాతుర్మాస్యం చేసి, గంగాపూర్ వెడుతూ కృష్ణానదిపై కృష్ణ లహరి రాశారు. మహారాష్ట్ర నర్సిలో కాయధు నదీతీరాన 15వ చాతుర్మాస్యం 1905 లో పూర్తి చేసి, ఇక్కడే "దత్త చంపు "సంతరించారు. కరుణా త్రిపది కూడా ఇక్కడే రాశారు. ఇది దత్తఉపాసకులకు నిత్య పారాయణ గ్రంథం అయింది

1906 లో మధ్యప్రదేశ్ బర్వా లో 16వ చాతుర్మాస్య దీక్ష చేశారు. 1907లో తమిళనాడు తంజావూర్ లో కావేరి నదీ తీరాన 17వది చేస్తూ సమశ్లోకి గురు చరిత్ర రాశారు 1908 లో 18వ చాతుర్మాస్యం కృష్ణా జిల్లా ముక్త్యాలలో కృష్ణా తీరాన నిర్వహిస్తూ యువ శిక్ష, వృద్ధ శిక్ష, స్త్రీ శిక్షా రచించారు. మహారాష్ట్ర వైన్ గంగా తీరం పావని లో 19 వ చాతుర్మాస్యం1909 లో చేస్తూ "వైన గంగా "స్తవం రాశారు. కర్నాటక హానూర్ లో తుంగభద్రా తీరాన 20వ దీక్ష 1910 లో చేసి, జైన్ పూర్ లో "దత్తాత్రేయం మహామనం వరదం భక్తవత్సలం "రాశారు. 21వ దీక్ష1911లో కర్నాటక కురవ్ పూర్ లో చేసి వెంకటరమణ, అఘోర కష్టోద్ధరణ స్తోత్రం రాశారు. 1912లో చికల్వాదాలో 22వ చాతుర్మాస్యంగడిపి, చివరిది అయిన 23 వ చాతుర్మాస్య దీక్షను 1913 లో గుజరాత్ నర్మదా తీరం లో చేస్తూ సమాధి చెందారు.

శ్రీ విమలానంద భారతీ స్వామీజీ భక్తవత్సల దత్తాత్రేయ స్వామిని, పాదుకలను రాజమండ్రి గోదావరీ తీరం లో నెలకొల్పారు. ఆశాఢ శుద్ధపాడ్యామి గరుడేశ్వార్ లో స్థాపించారు

స్వామి చరిత్రను తెలుగులో గుంటూరు వాసి సాధకులు శ్రీ జివిఎల్ విద్యాసాగరరచించారు. మూడు ముద్రణలు పొందింది.

### స్వామి సూచించి పరిష్కరించిన సమస్యలు

శ్రీ వాసు దేవానంద స్వామి చిఖలాడ దీక్షలో ఉండగా, ఒకాయనవచ్చి తాను ఏది తిన్నా జీర్ణించుకోలేకపోతున్నానని, దానితో నీరసం ఎక్కువైందని విన్నవించాడు. స్వామీజీ ఆయన ఇంటి కులదేవత పట్ల శ్రద్ధ చూపక, పూజ మానేయటమే దీనికి కారణం అని చెప్పి, కులదేవతను పూజ చేస్తూ తానూ ఉపదేశించే దత్తమంత్రం,దేవీ మంత్రం చదువుతూ మందులు కూడా ఇచ్చి పంపారు. అతని ఆరోగ్యం కుదుటబడింది.



1910 లో నర్సోబా వాడి లో ఉండగా ఆప్రాంతం లో కలరా విపరీతంగా బాధిస్తుంటే, పూజారులను దత్త పాదుకలకు అభి షేకం చేయమని చెప్పారు. అభి షేకం చేస్తే ఈ అంటు వ్యాధి ఎలా తగ్గుతుంది అని వాళ్ళు అడిగారు. దానికి "చావుకూడా దేవుని అభి వ్యక్తీయే అని,ఈ వ్యాధులు కూడా ఆయన శక్తులే అని, ఆశక్తుల్ని అభిషేకం లాంటి వాటితో వేదాలలో చెప్పినట్లు శాంత పరిస్తే అవి ప్రసన్నమై, వ్యాధులను ఉపసంహరిస్తాయి "అని చెప్పారు. ఆప్రకారం పూజార్లు చేయటం కలరా తగ్గటం జరిగింది. వాసుదేవ రాకూర్ అనే ఆయన ఇండోర్ నుంచి వచ్చి, తన భార్య ఆరోగ్యం బాగాలేదని చెప్పాడు. స్వామీ జీ దానికి కారణం ఆయన వంశం లోని పవిత్ర మూర్తి సమాధికి జరిగిన ఉపేక్ష కారణం అని,కుజ వ్రతం చేయమని చెప్పారు. వెంటనే వాళ్ళ ఊరికి వెళ్లి ఆ సమాధిని శుభ్రం చేయించి బాగా అలంకరించి పూజ చేసి కుజవ్రతం శ్రద్ధగా చేయగా, అతడి భార్య ఆరోగ్యం వెంటనే కుదుట బడింది. ఇప్పుడు చెప్పిన అవన్నీ దేవతా సంబంధ విషయాలు.

ఆది భౌతిక వ్యాదులు –భూకంపాలు వరదలు అగ్నిప్రమాదాలు తుఫాన్లు మెరుపులు ఉరుములు పంచ భూతాల వలన కలుగుతాయి. స్వామీజీ భక్తురాలు ఒకామెను భర్త వదిలేశాడు. చిన్న గుడి సెవేసుకొని కొద్దిపాటి పొలాన్ని చూసుకొంటూ బతుకు తోంది. ఒక సారి ఆమె పొలంలో పంటబాగా పండి, కోతలు నూర్పిళ్ళు కూడా జరిగి, ధాన్యం రాసి పోశారు. అనుకోకుండా తుపాను పట్టుకొన్నది. ఆమెకు ఆధారం ఆ తిండి గింజలే. అవి తడిసిపోతే బతుకు గడవదు. ఆమె అ ధైర్యకుండా స్వామి జీ పాద ధూళి తీసుకొని రాశి చుట్టూ చల్లి స్వామి మహారాజ్ ను కాపాడమని నిండుమనసుతో ప్రార్ధించింది. తుఫాను వచ్చింది కాని ఒక్క చినుకు కూడా ఆమె ధాన్యపు రాసిపై పడలేదు అందరూ ఆశ్చర్యపోయారు.

స్వామీజీ నర్మదా తీరం గరుడేశ్వార్ లో చివరి చాతుర్మాస్య దీక్ష గడుపుతూ గోకులాష్టమి జరుపుతున్నారు వేలాది మంది భక్తులతో. అకస్మాత్తుగా ఆకాశం మేఘావృతమై విపరీతంగా వర్షం కురవసాగింది నది అవతలి ఒడ్డున. తుఫానుకు భయపడకుండా కీర్తనలు భజనలు కొనసాగించమని స్వామీజీ ఉద్బోధించారు. అర్ధరాత్రిదాకా వారు అలానే కొనసాగించారు. కార్యక్రమం పూర్తి అయి, అందరూ లోపలి వెళ్ళగానే తుఫాను పగతీర్చుకోన్నదా అన్నట్లు విజృమ్భించింది.

స్వామిస్వగ్రామం మాన్ గోన్ లో గృహస్తాశ్రమంలో ఉండగా, ఒక గరుడ ద్వాదశి నాడు, వందలాది భక్తులు వచ్చి కూర్చున్నారు. ప్రసాదం పంచి పెట్టె సమయానికి పెద్ద వర్షం భయపెట్టింది. ఏర్పాట్లన్నీ దెబ్బతింటా యేమో అనిపించింది. కంగారు పడవద్దనీ వరుణ దేవుడు కూడా ప్రసాదం తీసుకోవటానికి వచ్చాడని చెప్పి, పెద్దపాత్రలో ఆయనకు ప్రసాదం నైవేద్యం పెట్టించారు. పెద్ద వర్షం కురిసి చుట్టుప్రక్కల ప్రాంతాన్ని భీభత్సం చేసింది కాని ఇక్కడ ఒక్క చినుకు కూడా పడలేదు. ఇలాంటి అనుభవాలు స్వామి జీవితం లో చాలా జరిగాయి.

ఒక సారి గరుడేశ్వర్ లో ఒకపెద్ద అన్నం పాత్రను నర్మదా నదిలో పని చేసే స్త్రీలు కడిగి శుభ్రం చేస్తుంటే, నదిలోకి పట్టు తప్పి జారిపోయి,ప్రవాహానికి కొట్టుకు పోయింది. పని వాళ్ళు స్వామీజీ దగ్గరకు వచ్చి చెప్పుకోగా వెంటనే నది దగ్గరకు వెళ్లి, నదీజలాన్ని తన దండం తో స్పృశించి "తల్లీ నర్మదా ! ఈ పాత్రతో నీకేమిటి పని ?నీ పిల్లలకు అన్నం పెట్టకుండా అడ్డు తగులుతావా ?"అన్నారు. వెంటనే అద్భుతంగా నది లో వాలుకు కొట్టుకుపోతున్న ఆపాత్ర, ప్రవాహానికి ఎదురుగా వస్తూ ఒడ్డుకు చేరి అందరి కంగారు తీర్చేసింది.

ఈ విషయాల వలన మనకు తెలిసిదేమిటి ?ఆత్మజ్ఞాని కి ప్రకృతి సహకరిస్తుంది, ఆయనతో సహజీవనం చేస్తుంది అన్న వేద సూక్తి రుజువైనట్లేకదా.

**దుష్ట శక్తులు**

పిశాచ దెయ్యాలవంటి దుష్ట శక్తులు మానవ బాధలకు కారణాలౌతాయి. ఇవి తమబందువులను బాగా ఇబ్బంది పెడుతూ ఉంటాయి. వాటికున్న అతీంద్రియ శక్తులతో బాధలు కలిగిస్తాయి. వాటిని గుర్తించటం కష్టం. మహిమాన్విత మహిళలు పురుషులుమాత్రమే వాటిని గుర్తించి బాధపడే వారికి ఉపశమనం కలిగించగలరు. మొదట శారీరక ఇబ్బంది, ఆతర్వాత మానసిక క్షోభ కలిగించి బాధ పెడతాయి. హవానూర్ లో ఒక యువతి కీళ్ళ బాధలు చూపు కనపడక పోవటం తో ఇబ్బందిపడుతుంటే ఆమె సోదరుడు ఆమెను శ్రీ వాసుదేవానంద స్వామి దగ్గరకు స్ట్రెచర్ లో తీసుకొచ్చాడు. కమండలం లోని పవిత్రజలాన్ని ఆమె పై చల్లి స్వామి ఆమె సోదరుడిని ఆజలాన్ని ఆమె తలకు పాదాలకు రాయమని చెప్పారు. రాయటం మొదలవ్వగానే ఆమెను ఆవహించిన దుష్ట శక్తి తానూ వదిలి వెళ్ళిపోతానని గగ్గోలు పెట్టి స్వామి సరేఅనగా వదిలి పారిపోయింది. అది వదలగానే ఆ యువతి లేచి నిలబడి తన ఇంటికి హాయిగా నడిచే వెళ్ళింది. మరోసారి ఒక ధనికుడి భార్య ఇలాగే ఇబ్బంది పడుతుంటే అతడిని తానూ సంపాదించిన దాన్లో కొంత బ్రాహ్మణుల అన్నవస్త్రాలకు ఖర్చు చేయమని సలహా ఇస్తే ఆయన అలాచేయగానే భార్య ఆరోగ్యం కుదుట పడింది,.

కర్నాటక బనవాసి నివాసి ఒకాయన స్వామి తో తానూ కొత్త ఇల్లు కడుతుంటే అకారణంగా కూలి పోతోందని మొరపెట్టుకొన్నాడు. దైవ సంబంధ కార్యాలు చేయమని చెప్పగా అలా చేయటం తో ఇల్లు ఇబ్బంది లేకుండా పూర్తయింది. శ్రీపాద శాస్త్రి అనే ఆయన తన సోదరి తరచూ మూర్చలతో బాధ పడుతోందని చెబితే అది పిశాచ బాధ అని గ్రహించి చెప్పగా తానూ నమ్మలేనన్నాడు శాస్త్రి. స్వామి ఒక ఇటుక మీద మంత్రం రాసి ఆయనకిచ్చి రోజూ 21సార్లు జపించమని ధూపం వేయమని, చెప్పారు. 21రోజులు తర్వాత ఆపిశాచం ఆమెతో మాట్లాడింది. తానూ ఎందుకు బాధించానో వివరించి ఇక స్వామి శక్తిముందు తాను నిలబడ లేనని చెప్పి ఆమెను వదిలి వెళ్ళిపోయింది.

దుష్టశక్తులు గర్భ విచ్చిత్తికి, శిశువు పుట్టకుండా చేయటానికి కారణం అవుతాయి. మండలమహాపూర్ కు చెందిన బైరవ ప్రసాద్ కు పుట్టిన అయిదుగురకొడుకులు వరుసగా చనిపోతే, స్వామిని శరణు వేడాడు. నారాయణ బలి ఇస్తూ రోజూ విష్ణు సహస్రనామ పారాయణ చేయని సలహా ఇచ్చారు.

### హేతుబద్ధత

మనిషి కిఉన్న విపరీత కోరికలే అనర్ధాలకు కారణమని స్వామీ బోధన.తాను చేసేపనులవలన భక్తజనం లో విశ్వాసం కలిగిస్తాయని. భౌతిక సుఖాలు మరిగినవారు అన్ని రకాల పతనం చెందుతారని వాళ్ళు అందుకే తనవద్దకు వచ్చి మార్గదర్శనం పొందుతారని వారిబాధలు నివారిస్తాయని చెప్పేవారు. వారి ఆత్మలను పరిశుద్ధి చేయటమే తను చేసేపని దానివల్లనే వారి ఇబ్బందులు తొలగి ధర్మమార్గాన నడుస్తున్నారని చెప్పారు.

### సత్య దర్శనులు

నిజాయితీకల సత్యదర్శనులు ఆత్మజ్ఞానులు లోకం లో చాలా తక్కువమంది ఉన్నారు. కొందరికి ఒకజన్మలోనే సాధ్యమైతే మరికొందరికి ఎన్నో జన్మలు అవసరం రావచ్చు.

స్వామీజీ శినోర్ లో ఉండగా ఒకసారి జాబాల అనే ఒక జాలరి స్వామిని ఆపేశాడు. అతడు పెళ్లి అయిన కొద్దికాలానికే ఇల్లు వదిలి వచ్చేశాడు. ఇక్కడ భౌతిక సుఖాలకు దూరంగా జీవిస్తున్నాడు. అతడిని చూసి స్వామి "మీరు ఇక్కడున్నారన్నమాట "అన్నారు. రాత్రి మార్కండేయ దేవాలయనికి రమ్మని చెప్పి వెళ్ళిపోయారు. ఆ రోజునుంచి తానూ గీతా ప్రవచనం చేస్తానని ప్రకటించి మార్కండేయ దేవాలయం రాత్రిపూట ప్రవచనం ప్రారంభించారు స్వామి రోజూ జాబాలకూడా వచ్చి ఒక మూల కూర్చుని వినేవాడు. 17వ అధ్యాయం ప్రవచనం అవగానే జాబాల స్వామితో "ఇకనేను వినాల్సిన అవసరం లేదు "అని చెప్పి వెళ్ళిపోయాడు. తర్వాత రెండు నెలలకు చనిపోయాడు జాబాల.

సరస్వతి బాయి అనే వేశ్య కొంతకాలానికి పశ్చాత్తాపం చెంది నర్సోబ వాడి ఆశ్రమం కి వచ్చిదత్త పాదుకలముందు దీక్షిత్ స్వామి ఎదుట కరుణా త్రిపాది పాడేది. ఒకసారి స్వామీజీ ఎదుట పాడుతుంటే ఆమె అనన్యభక్తికి మెచ్చి ఆమెకోసం గురు స్తోత్రం రాసిరోజూ పారాయణ చేయమన్నారు. ధ్యానం కూడా నేర్పారు. కొద్దికాలానికే ఆమె వాటిని పాటించి పరమ పవిత్రురాలైంది '.

మహా జ్ఞానులతో శ్రీ వాసుదేవానంద సరస్వతి

శ్రీ రాజరాజేశ్వర, శ్రీ అక్కల్ కోట్ మహా రాజ్ వంటి మహాజ్ఞానులతో మనస్వామికి గొప్ప పరిచయమే ఉండేది.

శ్రీ రాజరాజేశ్వర శంకర స్వామి

అప్పుడు శ్రీ శృంగేరి పీఠాదరాపతులైన శ్రీ రాజరాజేశ్వర శంకరాచార్య స్వామి తో కలిసి హరిద్వారంలోచాతుర్మాస దీక్ష చేశారు. పీఠాధిపతి కోరికపై స్వామి శ్రీ ఆది శంకరులు ఉపనిషత్ భాష్యం పై ప్రవచనం చేశారు. తర్వాత 17వ చాతుర్మాస్య దీక్షను తంజావూర్ లో పూర్తి చేసి,, కావేరి మీదుగా వెడుతుంటే శృంగేరి స్వామి శ్రీ రంగం లో ఉన్నారని తనకు స్వాగతం చెప్పే ప్రయత్నం లో ఉన్నారని తెలిసి అక్కడికి వెడితే పీఠాధిపతి గారు గౌరవంగా ఆహ్వానించారు. స్వామి శారదాంబ శ్రీ శంకరాచార్య లపై స్తోత్రం రాశారు. ఆచార్య కూడా స్వామిని ప్రస్తుతిస్తూస్తోత్రం రాశారు. స్వామికి తమ ఆశ్రమలో భిక్ష ఏర్పాటు చేసి, ఘన సన్మానం జరిపారు. స్వామి గురించి ఆచార్య "ఇవాళ మన ఆశ్రమానికి విచ్చేసిన స్వామి మహారాజ్ ను మీరు గుర్తించి ఉండరు. వారు సాక్షాత్తు దత్తప్రభువులే. తలిదండ్రుల పుణ్యం చేత జన్మించి ధ్యాన తపస్సులతో వెలిగిపోతున్నారు. వైదిక మతాన్ని కొనసాగించటానికి ఆది శంకరాచార్యుల వారితో సమానంగా కృషి చేస్తున్న ధన్యజీవులు.

వర్ణాశ్రమ ధర్మాలను వైదిక విధానం లో తూచా తప్పక పాటిస్తున్న శ్రేస్టులు.వేలాది ప్రజలను తమ ప్రవర్తన ప్రవచనాలతో ఉద్ధరిస్తున్నారు. ఆ సేతు హిమాచలం కాలినడకన సందర్శిస్తున్న తపోధనులు. సాధకులకు కర్మజ్ఞాన భక్తి మార్గాలను బోధిస్తూ పరిణామ కలిగిస్తున్నారు. వైదిక ధర్మ పునరుద్ధరణ కోసం శ్రీ వాసు దేవానంద సరస్వతి మహారాజ్ కు భగవంతుడు సంపూర్ణ ఆయురారోగ్యాలు ప్రసాదించమని కోరుతున్నాను "అని భక్తులకు పరిచయం చేశారు. స్వామి దానికి సమాధానం గా "అంతటి పొగడ్తలకు నేను అర్హుడనుకాను. శృంగేరి పీఠాన్ని శ్రీ రాజరాజేశ్వర స్వామి ఉన్నత స్థితి కి తెచ్చారు "అని వినయంగా చెప్పారు.తర్వాత శంకరాచార్య కోరికపై తాము రాసినగ్రంథాలు శృంగేరి మఠానికి పంపారు.

## శ్రీ శాంతారాం స్వామి

ఆ కాలం లో బెనారస్ లో మహారాష్ట్ర కరడ్ కు చెందిన శ్రీ శాంతారాం స్వామి అనే మహాజ్ఞాని ఉండేవారు. 40ఏళ్ళు కాశీలో వరుసగా భాగవత సప్తాహం నిర్వహించిన దీక్షా పరులాయన. భాగవత పరిపక్వతతో భగవంతునితో అనుసంధానం ఆయనకు ఏర్పడింది ఉదయం 4కు లేచే ఆయన ఒక్కోసారి ఆలస్యంగా లేచేవారు.. కాశీ విశ్వనాథుడే ఆయన తలుపు తట్టి నిద్ర లేపే వాడు అని జనం నమ్మేవారు. సంస్కృతం వేదం వేదాంగాలు పెద్దగా చదవనప్పటికీ ఆయన్ను కాశీలోని మహా విద్యావేత్తలు భాగవత పురాణం లో తమకు కలిగిన సందేహాలను ఆయనవద్దకు వచ్చి తీర్చుకొనేవారు. 1913 బ్రహ్మావర్తనం లో వాసు దేవానంద స్వామిమూడేళ్ళుగా ఉన్నారని తెలిసి ఆయనను కాశీకి ఆహ్వానించాలని అనుకొన్నారు. కానీ స్వామి రాలేదు చివరికి శాంతారాం స్వామి బ్రహ్మావర్తం వెళ్లి కలుసుకోగా ఇద్దరి కళ్ళల్లో ఆనంద బాష్పాలు ధారాపాతం గా వర్షించాయి. ఇక్కడి ప్రశాంత వాతావరం పవిత్రత, జరిగే ప్రవచనాలుఆధ్యాత్మిక కార్యక్రమాలు శాంతారాం చూసి పరమానంద భరితులయ్యారు

## శ్రీ వైద్యనాథ అవధూత

అత్యున్నత జ్ఞానం సాధించినా కొందరు మహామహులువింత ప్రవర్తనలతో జనాలకు దూరంగా ఉండేవారు. పసిబాలుడులాగాఉన్మత్తునిలా,పిశాచం లా ప్రవర్తించి జనాలను దూరం చేసి తన దీక్షకు భంగం కాకుండా కాపాడుకొనేవారు. అలాంటివారిలో నరసోబా స్వామి వైద్యనాథ ఒకరు. సూటిగా బాలునిలా మాట్లాడేవారు. ఎప్పుడు మతవిదాన చర్యలేవీ చేసేవారుకాదు. ఉదయం చేతిలో ఒక లోటా పట్టుకొని తిరిగేవారు. నదికి స్నానానికి వెళ్లి ఒళ్లంతా మట్టి పట్టించి గంటలకొద్దీ గజస్నానం చేసేవారు. ఆలయాలకు వెళ్ళటం కాని పాదుకలను పూజించటం కాని ఉండేదికాదు. ఎవరైనా ఇదేమిటిఅని అడిగితే తనను దయ్యం పట్టి ఆపనులు చేయనివ్వటం లేదనే వారు. ఎవరైనా ఇంటికి భోజనానికిఆహ్వానిస్తే దక్షిణగా రెండే రెండు పైసలు తీసుకొనేవారు. ఇలా వచ్చిన డబ్బును ఒకనమ్మకస్తునికి అప్పగించి, తానే లెక్కలు రాసేవారు. ఒకసారి వాసుదేవ స్వామి వాడిలో మకాం గా ఉంటె ముఖ్య శిష్యుడు గండా మహారాజ్ వైద్యనాథ తో ఆయన దగ్గరున్న డబ్బుతో విశేష పూజ చేయమని సలహా ఇచ్చాడు. అందరికీ ఎప్పుడూ చెప్పేసమాదానమే "ఆ డబ్బు మా తమ్ముడిని చూడటానికి వెళ్ళట కోసం జాగ్రత్త చేసుకొన్నాను ఖర్చుపెట్టను "అన్నాడు. అక్కడి వారు గండా తో "ఆయన వేళాకోళానికి చెప్పేమాట అది. ఇక్కడినుంచి ఆయన ఎప్పుడూ కదిలి వెళ్ళటం చూడలేదు "అన్నారు. చివరికి వాసు దేవ స్వామి చెవిన ఈవిషయం వేశారు అందరూ కలిసిసి. ఆయన. "ఆయన్ను మీరెవరూ సరిగా అర్ధం చేసుకోలేదు. దెయ్యం పట్టింది అని ఆయన అన్నదానికి అర్ధం భగవంతుడు తన్ను బంధించి ఉంచుతున్నాడు అని అర్ధం. సోదరుడి దగ్గరకు వెడతాను అంటే తన భౌతిక శరీరం రద్దు అవటం అని భావం. ఆయన మహాజ్ఞాని ఆయనమాటలు సామాన్యులకు అర్ధం కావు. ఆడబ్బు తన ఉత్తరక్రియలకోసం అని అర్ధం "అని వివరించారు. వైద్యనాథని పిలిచి "నీ దగ్గరున్న డబ్బులో 7రూపాయలు ఖర్చుపెట్టి, మిగిలిన ఒక్కరూపాయి నీ సోదరుడిని చూడటానికి వెళ్ళేదానికి ఖర్చు పెట్టు "అన్నారు వైద్యనాథ ఒప్పుకున్నాడుకానీ మహాపూజ చేయటానికి "ఆ దెయ్యం అంగీకరించలేదు "అన్నాడు. స్వామి "ఐతే ఆ దెయ్యాన్నే ఒక్క రోజుమాత్రం నిన్ను వదిలిపెట్టమని అడుగు "అన్నారు. సరే అన్నాడు ఆయన. పూజ బ్రహ్మాండంగా జరిగింది ఊరివారందరినీ వైద్యనాథ పూజా ప్రసాదం తీసుకోవటానికి రమ్మని స్వామి కబురు చేయించారు. ఆయన దగ్గరున్న ఏడురూపాయలు అంతమందికి ప్రసాదం పెట్టటానికి ఎలా సరిపోతాయని అందరికీ సందేహం ఆశ్చర్యం కలిగాయి. ఎవరికి తోచినట్లు వారు ఆహారపదార్ధాలు వగైరా పంపించి,వేలాది భక్తజనం పాల్గొని మహాపూజ చూసి తరించి వైద్యనాథ ప్రసాదం కడుపారా ఆరగించారు. ఏర్పాట్లను స్వామితో కలిసి వైద్యనాథ పర్యవేక్షిస్తూ అందరినీ పలకరించారు. జనం కళ్ళల్లో ఆనందం తాండవ మాడింది.

## శ్రీ అక్కల్ కోట్ మహారాజ్

1905 లో పండరిపురం నుండి వాడీ వెడుతుండగా కమలాపురందగ్గర చేతులు మోకాళ్ళవరకు ఉన్న బలిస్టు దైనఒకస్వామి మహారాజ్ వాసుదేవ స్వామి కలలో కనిపించి "దేశమంతా తిరుగుతున్నావు కవిత్వం రాస్తున్నావు. నా మీద నీకు దృష్టిపడలేదా ?"అని ప్రశ్నించాడు. నిద్రలేచి తనకు కలలో కనిపించిన ఆస్వామి ఎవరు అని దత్తప్రభువును అడిగాడు "ఆయనే అక్కల్ కోట్ మహారాజ స్వామి. ఆయన్ను నువ్వు దర్శించి ఆయన జీవిత చరిత్ర నువ్వు రాయాలని ఆయన కోరిక "అని తెలిపాడు. వాసుదేవ స్వామి "నా చేతి కలం దత్తస్వామిపాదాలకే కే అంకితం.మీరుఆజ్ఞాపించి ఆయన గురించి సమగ్రసమాచారం అందిస్తే వారి చరిత్ర రాస్తాను "అన్నారు. "అయితే అక్కల్ కోట్ వెళ్లి ఆయన్ను దర్శించు "అని హితవు చెప్పగా అక్కల్ కోట్ వెళ్లి స్వామి సమర్ధ ను దర్శించారు స్వామి సమర్ధ అక్కల్ కోట్ సమర్ధస్వామిమహారాజ్ అంటారు. ఈయనకూడా దత్తాత్రేయ అవతారమే. వీరికి కర్నాటక మహారాష్ట్రలలో వేలాదిమంది అనుచరులున్నారు. అలాగే అక్కల్కోట్ మహారాజ్ చరిత్ర రాశారు

వాసుదేవానందస్వామి ఇలా ప్రముఖ జ్ఞానులతో సత్సంబంధాలు కలిగిఉన్నారు షిర్డీ సాయిబాబా వాసుదేవ స్వామిని తన సోదరులు అని చెప్పేవారు. ఈయనా దత్తాత్రేయ అవతారమే కదా. శ్రీ బ్రహ్మ చైతన్య గోడ్వా లేకర్ మహారాజ్, శ్రీ గులాబ్ రావు మహారాజ్ లకుకూడా వాసుదేవ స్వామి అంటే పరమ గౌరవం.

శ్రీ వాసుదేవానంద సరస్వతి మహారాజ్ కొందరు దివ్య పురుషుల, నదీమతల్లుల దివ్యాత్మల దర్శనం.

నిర్మల –ఒకసారి స్వామి గృహస్తాశ్రమం లో ఉండగా వాడీ నుండి ఇంటికి తిరిగి వస్తుంటే ఒక దివ్యలోక మహిళ కనిపించి,"స్వామీ నాకు పేరు పెట్టకుండా, ముందుకు వెళ్ళకండి "అని కోరింది. ఆమె తనగ్రామం మంగోన్ ద్వారా ప్రవహించే నదీమతల్లి అని గ్రహించి, ఆ నదికి 'నిర్మల "అని నామకరణం చేశారు. ఆ దివ్య స్త్రీ సంతోషించి అదృశ్యమైంది. అప్పటినుంచి ఆనది "నిర్మలానది "గా ప్రసిద్ధి చెందింది.

కృష్ణ –కలియుగం లో శ్రీ దత్తాత్రేయస్వామి రెండు అవతారాలలో కృష్ణానది తో సంబంధం ఉన్నది. శ్రీ పాద వల్లభ అవతారం లో కృష్ణానది రెండుపాయలమధ్య ఉన్న ద్వీపం లో చాలాకాలం గడిపారు. రెండవది అయిన శ్రీ నరసింహా సరస్వతి అవతారం లో నరసోబా వాడిలో కృష్ణా, పంచనదీ సంగమ క్షేత్రం లో 12 ఏళ్ళు, కృష్ణ ఉపనది భీష్మ నది,అమరరాజ నదితో కలిసే తీరం గాణగాపురం లో 36సంవత్సరాలు గడిపారు. ఇలా దత్తాత్రేయ అవతారాలతో కృష్ణా నదికి ప్రత్యేక అనుబంధం ఉన్నది. చాలాకాలం గా భక్తులు వాసు దేవ స్వామిని కృష్ణానదిపై శిఖరిణీ వృత్తంలో ఒక స్తోత్రాని శంకరాచార్య, జగన్నాథ పండితుడు గంగానదిపై రాసిన " గంగా లహరి "లాగా రాయమని కోరుతున్నారు. అంతకు ముందే నర్మదాలహరి రాసి ఉన్నారు స్వామి. గాణగాపురం వెడుతూండగా స్వామి కి కృష్ణానదీ మాత కనిపించి తనపై కృష్ణాలహరి రాయమని సూచించింది. అప్పటికప్పుడు అప్రయత్నంగా ఆశువుగా 51 శ్లోకాలు చెప్పారు స్వామి. విని పరవశించి కృష్ణామాత"ఇక చాలు "అని చెప్పి అదృశ్యమైంది.



తంజావూరు లో చాతుర్మాస్యదీక్ష చేసి, కృష్ణా నది మీదనుంచి వస్తుండగా ఫాల్గుణ శుద్ధ చతుర్దశి వచ్చింది. మర్నాడు పౌర్ణమి నాడు యతీంద్రుల నియమము ప్రకారం క్షవరం చేయించుకోవాలి. ఆకలి బాగా వేసి సమీప గ్రామం లో తగిన ప్రదేశం కోసం వెదికితే, గ్రామస్తులు సహకరించకపోగా యెగతాళి చేశారు. కృష్ణ వేణి తో "అమ్మా !నీపై నేను చూపించిన గౌరవానికి ఇది ఫలితమా. నాకు కించిత్తు అయినా ప్రత్యుపకారం చేయలేవా ?రేపు నాకు ముండనం కుదరకపోతే, ఇక ఎన్నడూ చాతుర్మాస్య దీక్ష చేయను. సన్యాసాన్ని విసర్జిస్తాను. ఇక భవిష్యత్తులో నీ మాట వినను. ".అన్నారు.నదీమాత ఆ రోజు రాత్రి స్వామి కలలో కనిపించి " రేపు నీ దీక్షా విరమణకు తగిన ఏర్పాట్లుచేసి నేను ప్రత్యుపకారం చేస్తున్నాను"అని అభయ మిచ్చింది.. అదే రాత్రి ఊరి పెద్దల కు కలలో భయంకర రూపం లో నదీ మాత కనిపించి "స్వామిని అవమాన పరచటం గొప్పనేరం ఆయనకు మీరు క్షమాపణ చెప్పండి. ఆయన దీక్షా విరమణకు పూర్తిగా సహకరించండి. లేకపోతే నాకు ఆగ్రహం వచ్చి మిమ్మలని అందర్నీ సర్వ నాశనం చేస్తాను జాగ్రత్త "అని తీవ్రంగా మందలించి మార్గ దర్శనం చేసింది. మర్నాడు వారంతా నిద్రలేచి తమకలను గురించి ఒకరికొకరు చెప్పుకొని, అమాంతం స్వామీజీ ని చేరి కాళ్ళపై పడి క్షమించమని ప్రార్ధించి, చెంపలేసుకొన్నారు. వెంటనే శిరో ముండనానికి తగిన ఏర్పాట్లు చకచకా చేసి దీక్షా విరమణకు పూర్తిగా సహకరించారు. ఆ రోజే వెళ్లి పోవాల్సిన స్వామి వారి అభ్యర్ధనపై పది హేను రోజులు అక్కడే ఉండిపోయారు.

నర్మద-రెండేళ్ళు హిమాలయాలలో గడిపి స్వామి గంగానదీ తీరం బ్రహ్మావర్తం లో ఉన్నారు. ఒకరోజు స్వప్నం లో నర్మదానది దర్శనమిచ్చి మరికొంతకాలం తన సన్నిధిలో ఉండమని కోరింది.ఆయన పెద్దగాపట్టించుకో లేదు. ఒక బ్రాహ్మణుడు చర్మ వ్యాధితో బాధపడుతుంటే స్వామీజీ పాదతీర్ధాన్ని తీసుకొంటే తగ్గిపోతుందని సలహా ఇచ్చాడుఒకాయన. స్వామి ఎప్పుడూఎవరికీ పాదతీర్ధం ఇవ్వటానికి అంగీకరించలేదు. ఒకసారి స్వామి ఏమరుపాటుగా ఉంటూ రాసుకొంటుం టే ఆ బాపడు అమాంతం పాదాలపై నీరుపోసి కడిగి పాద తీర్ధం తాగి ఒళ్ళంతా పూసుకొన్నాడు. ఎందుకు అలా చేశావని స్వామి ప్రశ్నిస్తే జరిగింది చెప్పి క్షమాపణ కోరాడు. ఆ వ్యాధి స్వామీజీకి అంటుకొన్నది. రోజు గంగాస్నానం చేస్తున్నా దురదలు, పుళ్ళు బాధ తగ్గటం లేదు. దత్తాత్రేయస్వామి కలలో దర్శనమిచ్చి మూడురోజులునర్మదా నదిలో స్నానిస్తే నివారణ అవుతుందని సూచించాడు. వెంటనే స్వామి నర్మదానది నాభి అయిన నామవార్ వెళ్లి నర్మదా నదీ మాతను ప్రార్ధించి స్తోత్రం రాశారు. చాలా చాతుర్మాస్యాలు నర్మదా తీరం లోనే చేసి, తన అంతిమ యాత్ర కూడా నర్మదా తీరం లోనే చేయాలని సంకల్పించారు. అంతటి అనుబంధం,సాన్నిహిత్యం పవిత్ర నర్మదా నదీ మాతతో యేర్పడింది. నర్మద స్వామీజీ ని కన్నకొడుకుగా చూసింది. ఆయన భిక్ష చేస్తున్నప్పుడు బెణుకు మంత్రాన్నిచెబితే ఆయన దాన్ని వృద్ధి చేశారు. దక్షిణాది భోజనం దొరికే ఇళ్ళు చూపించింది. నదిలో పొరబాటున జారిపోయిన వంట పాత్రను మళ్ళీ అందించింది. నదీమతల్లులను ఆయన ప్రాణం ఉన్న వారిగా భావించి పూజించారు. ఆ నదులపై స్తోత్రాలు రాసి భక్తి చాటుకొన్నారు.

పినాకిని -1907 నడి వేసవిలో తమిళనాడులోని పినాకిని నది తీరం పై వెడుతుంటే అధిక చైత్ర పౌర్ణమి వచ్చింది. ముండనం చేయించుకొని స్నానం చేదామని అనుకొంటే నదిలో చుక్క నీరు కూడా లేదు. అక్కడి బ్రాహ్మణుడు నదీ గర్భం లోతుగా త్రవ్వుతామని, ఆ చలమ నీటిలో లో స్నానించమని కోరారు. అలాసే అని స్వామి చెలమను చేరగానే అందులోని నీరు ఉత్తుంగం గా పెరిగింది. క్రమంగా పెరిగి గుండె లోతు జల ఏర్పడింది. అందులో దిగి హాయిగా అఘమర్షణ స్నానం చేశారు సంతృప్తిగా. పినాకిని పై కృతజ్ఞతతో ఆయన నోటినుండి అకస్మాత్తుగా ఆశువుగా కవిత వెలువడింది –దాని భావం

"అధిక చైత్రమాసం పౌర్ణమి నాడు కుంగి కృశించిన పినాకిని మాత, క్షణం లో క్రమంగా వృద్ధి చెంది, నా పవిత్ర ముండన స్నానానికి తోడ్పడింది. అందరూ ఆమెను అర్చించి తరించాలి.

నర నారాయణ మునుల దర్శనం –నాల్గవ చాతుర్మాస్య దీక్ష లో స్వామి బదరీ నారాయణ క్షేత్రానికి నడిచి వెడుతున్నారు. దారిలో ఒక పెద్ద అగాధాన్ని కప్పివేస్తూ పర్వత శిఖరం పెరిగి దారికి అడ్డు నిలిచింది. ముందుకు వెళ్ళాలా వద్దా అసే సందేహం లో స్వామి ఉండగా, ఇద్దరు మనుషులు శిఖరం దిగుతూ కనిపించారు. వారు "స్వామీ !ఈ దారి చాలా ప్రమాదకరం. వెడితే చావు కొని తెచ్చుకొన్నట్లే. "అని హెచ్చరించారు ఆ జంట. "స్వాములూ !సేను నర నారాయణమునులను దర్శించి, పూజించటానికి వచ్చాను. నా ప్రాణం పోయినా ఫరవాలేదు వారిద్దర్నీ చూసి పూజ చేయకుండా మాత్రం వెనక్కి వెళ్ళసే వెళ్ళను "అన్నారు స్వామి. అనగానే వారిద్దరూ అదృశ్యమయ్యారు. అలా స్వామి నరనారాయణ మునుల దర్శనం తో తరించారు బదరీ క్షేత్రం లో.



అశ్వత్థామ-చివరి చాతుర్మాస్య దీక్షకోసం స్వామి చికలాడ నుంచి గరుడేశ్వర్ వెడుతూ, ఒకదట్టమైన భయంకరం ప్రమాద భరితమైన అరణ్యం గుండా నడిచి వెడుతున్నారు. శూల పాసేశ్వరం(త్రిశూల పాణి ఈశ్వరుడు ) దాటాక, గుర్తించదగిన అడుగులున్న బాట ఎక్కడా కనిపించలేదు. అంటే ఇది వరకెవ్వరూ ఈదారిలో నడిచిన గుర్తులు లేవు దాన్ని పట్టుకొని ముందుకు వెళ్ళటానికి. ఏ అడవి మనిషీ కనిపించలేదు వెంట ఉండి ఆ కీకారణ్యం దాటించ టానికి. ఇంతలో ఒక ఆటవికుడు అకస్మాత్తుగా కనిపించి "స్వామీ !ఈ అడవి దాటించ టానికి నన్ను సాయం చేయమంటారా ?"అని అడిగాడు. సరే అన్నారు స్వామి "అయితే స్వామీ ! నా వెనకాలే నడవండి. లేకపోతే దారి తప్పి ప్రమాదం ఉంది "అని జాగ్రత్తలు చెప్పి దారి చూపిస్తూ మార్గదర్శనం చేస్తూ, గరుడేశ్వర దేవాలయం కనిపించగానే దాన్ని చూపించి, క్రమంగావెళ్లి పోయే ప్రయత్నం చేశాడు ఆ ఆగంతకుడు. అతడి ప్రవర్తన అనుమానం కలిగి స్వామి వెంటనే"బాబూ! నువ్వెవరు ?నీ కథాకమామీషు చెప్పు "అని అడిగారు "సేను అశ్వత్థామను "అని ఒకే ఒక్కమాట చెప్పి అత్యంతవేగం గా కదిలి అదృశ్యమయ్యాడు అశ్వత్థామ".సప్త చిరంజీవులలో అశ్వత్థామ ఒకడు. మిగతా ఆరుగురు- బలిచక్రవర్తి, హనుమంతుడు, విభీషణుడు, కృపుడు,పరశురాముడు, వ్యాసుడు.

కొన్ని ఆలయాలలో స్వామీజీ లనుకూడా మూల విరాట్ లను ముట్టుకొని అర్చించ టానికి అంగీకరించరు. అలాంటివాటిలో బదరీనారాయన, తిరుమల బాలాజీ దేవాలయాలున్నాయి. తిరుపతి వెంకటేశ్వర దేవాలయంలో ఒకసారి అర్చకులు స్వయంగా స్వామీజీని గర్భాలయం లోకి ఆహ్వానించి ఆయన బాలాజీ విగ్రహాన్ని తాకి అర్చించే దాకా గౌరవం గా నిలబడే ఉన్నారు. అనునిత్యంస్వామి వాసు దేవానంద మహారాజ్ తన ఇష్టదైవం శ్రీ దత్తాత్రేయ స్వామితో సంభాషిస్తూసే ఉంటారు. అనుమతులు సలహాలు పొందుతూసే ఉంటారు.

## 15 బ్రహ్మశ్రీ మల్లాది చంద్రశేఖర శాస్త్రి

పౌరాణిక ప్రవచన సార్వభౌమ



న్నే విశేషార్థాలను బహు గ్రంథాలనాధారంగా వివరిస్తూ వేద, వేదాంత, ఉపనిషత్,పురాణాల ఆంతర్యాన్ని జోడిస్తూ, ప్రతిదానికీ ఉపపత్తి చూపుతూ వ్యాస వాల్మీకి హృదయాలను ఆవిష్కరిస్తూ, అందుకు భిన్నంగా ఎవరైనా రాసినా,పలికినా,తీవ్ర నిరసన తెలుపుతూ సంస్కృత మూలం లో ఉన్న భావానికి సరితూగే తెలుగు కవుల పద్యాలను హాయిగా చదివి కైమోడ్పుతూ, మహాకవి తిక్కనకూడా, వ్యాస హృదయాన్ని అర్థం చేసుకోనిని సందర్భాన్ని నిర్భయంగా బయటపెడుతూ, వ్యాస హృదయన్ని గొప్పగా చాటిన పద్యాలను ఉచ్చైశ్వరం తో గానం చేస్తూ, కరుణశ్రీ పద్యాల రామనీయకత్వాన్ని వివరిస్తూ, ధూర్జటి భక్తీ గరిమను శ్లాఘిస్తూ, కాళిదాస అతిలోక కవిత్వాన్ని ఉదాహరిస్తూ, చమత్కారం జోడిస్తూ భక్తిభావ రసోల్లాసంగా గాంగ ఝరీ వేగంతోఅమృత తుల్యం గా ప్రవచనం చేసే నేర్పు బ్రహ్మశ్రీ మల్లాది చంద్ర శేఖర శాస్త్రి గారిది. ఇదంతా తమతాతగారు బ్రహ్మశ్రీ మల్లాది

రామకృష్ణ చయనులుగారి శ్రీ దత్తాత్రేయ స్వామి అనుగ్రహంగా భావిస్తారు. వారి ప్రార్ధనా శ్లోకాలతోనే ఒక గోప్పఆధ్యాత్మిక భూమికను సృష్టిస్తారు. అందులో ప్రవేశిస్తే వారు మల్లాది వారు కానేకారు అపరా శుకులు, పరాశరులు, సూతులు, అనిపిస్తారు. అలాంటి మహా మహుని జీవిత విశేషాలను తెలియ జేయటమే నేను చేసే ప్రయత్నం.



శ్రీ చంద్ర శేఖర శాస్త్రి గారి తలిదండ్రులు శ్రీమాన్ దక్షిణా మూర్తి దంపతులు. తాతగారు రామకృష్ణ విద్వత్ చయనులుగారు. శాస్త్రిగారు 22-8-1925 క్రోధన నామ సంవత్సర భాద్రపద తదియ నాడు గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా కోసూరు మండలం హస్సనాబాద్ లో జన్మించారు. గుంటూరుజిల్లా అమరావతిలో నివాసం. పురాణ ప్రవచన, ప్రబోధాధ్యాపనాలే వారి వృత్తి. యవ్వనం లో వేదం, తర్కం, మీమాంస శ్రౌత, స్మార్త, వ్యాకరణ, వేదాంత సాహిత్య శాస్త్రాలను మహామహులైన పేత్తల వద్ద అధ్యయనం చేశారు. వీటిలో నిష్ణాతులయ్యాక తాతగారి మార్గం లో భాగవత భారత రామాయణ పురాణ ప్రవచనం ప్రారంభించి వేలాది ప్రవచనాలు చేశారు. 19వ ఏటనే స్వగ్రామం లో రామాయణం పై ప్రవచనాన్ని మహా పండితుల ఎదుట చేసి తన సత్తా చాటుకొన్నారు. తర్వాత కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారి అధ్యక్షతన విజయవాడలో అద్భుత ప్రవచనం చేసి అందర్నీ ఆకట్టుకొన్నారు. ప్రవచనం లో శాస్త్రి గారి ధోరణి విలక్షణమైనదని, సర్వోత్కృష్టమైనదని అందరూ ప్రశంసించారు. రామాయణ భారత భాగవతాదులేకాక శ్రీ దత్తాత్రేయ స్వామిపై కూడా ప్రవచనాలు చేశారు. క్రమంగా ఇంతింతై వటు డింతయై అన్నట్లు ప్రవచనం లో విశ్వరూపం ప్రదర్శించి, తమ విరాట్ సత్తాను రుజువు చేసుకొన్నారు '

సంస్కృత తెలుగు లోని అష్టాదశ పురాణాలపై గొప్ప ఆధిపత్యం సాధించారు శాస్త్రిగారు. అన్నీ కరతలామలకాలే వారికి. హ్యూమన్ కంప్యూటర్ లాగా ఏదైనా వెంటనే స్ఫురించి వివరించటం శాస్త్రిగారి విశిష్ట లక్షణం. అందుకే వారికి "పురాణ వాచస్పతి "అనే అరుదైన బిరుదు లభించింది. భద్రాచల సీతారామ కల్యాణం, తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవాల సమయం లో శాస్త్రి ప్రత్యక్ష ప్రసార వ్యాఖ్యానం, లక్షలాది మందిని ఉర్రూత లూగించింది. ఎందరికో ఒజ్జబంతి గా నిలిచింది. తిరుమల దేవస్థానం తరఫున ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వ ఆహ్వానం పైనా మల్లాది వారు చేసిన పంచాంగ శ్రవణంవిలక్షణం, అద్వితీయం. దూర దర్శనిలో హిందూమతం మొదలైన ఆధ్యాత్మిక అంశాలపై వేసిన ప్రశ్నలకు వారు చెప్పిన సమాధానాలు సమాదరణీయాలు,, సముచితాలు, విశేషాలు కూడా. ఇలాంటి కార్యక్రమం "ధర్మ సందేహాలు "గా" ధర్మ సూక్షాలు"గా శ్రీ వెంకటేశ్వర భక్తి చానల్ లో కూడా ప్రసారమై వారి దార్మిక వివేచనా దృష్టి, తీర్పు లకు ప్రేక్షక జనులు నీరాజనం పట్టారు.

తిరుమల తిరుపతి దేవస్థానం వారి పురాణప్రవచన కళాశాలకు ప్రిన్సిపాల్ గా పనిచేసి, ఎందరికో మార్గదర్శనం చేశారు. శాస్త్రి గారి ప్రవచనాలు రచనల కు "అభినవ వ్యాస " అనే సార్ధక బిరుదు లభించింది. ప్రవచన, పంచాంగ శ్రవణాలను నిత్యజీవితం తో అనుసంధించి, చమత్కారం, హాస్య రసం రంగరించి చెప్పటం రమ్యంగా ఉంటుంది. వింటున్న కొద్దీ వినాలనే అనిపిస్తుంది. హనుమాన్ లాగా ఒక వేదాంత విషయాన్నుంచి మరో దానికి దానినుంచి మరో ధర్మసూక్షానికి దూకి మనల్నీ తమతో పాటు దూకిస్తారు. గొప్ప చలన శీలత,తాదాత్మ్యత వారి ప్రవచనం లో ఉంటుంది. ఖంగుమనే ఆ కంఠం దేవాలయ ప్రణవ ఘంటానాదమే. అదే వారి ప్రత్యేకత.

మల్లాది వారి శక్తి సామర్ధ్యాలకు తగిన గౌరవ పురస్కారాలు లభించాయి. శ్రీ రాజ్యలక్ష్మీ ఫౌండేషన్ పురస్కారం 2005లో అందుకున్నారు. ఒక లక్ష రూపాయల నగదు, సన్మానం తోపాటు శాస్త్రిగారికి కానుకగా అందించారు. అమెరికా న్యు జెర్సీ లోని తెలుగు ఫైన్ ఆర్ట్స్ సొసైటీ వారి తరఫున డాక్టర్ వి కే రావు, డాక్టర్ జ్యోతి రావు దంపతులు మల్లాది శాస్త్రిగారిని సన్మానించి 2 వేల డాలర్ల నగదును కానుకగా అందజేశారు.కానీ శాస్త్రిగారు ఆ భారీ మొత్తాన్ని సద్గురు శివానంద మూర్తి గారు విశాఖలోని భీముని పట్నం లో నిర్వహిస్తున్న "సనాతన ధర్మ చారిటబుల్ ట్రస్ట్ "కు అందించి ఆసంస్థ ధార్మిక కార్యక్రమాలకు తోడ్పడిన దొడ్డ హృదయంచాటారు.

శృంగేరి శంకర మఠం వారు "సవ్యసాచి "బిరుదు ప్రదానం చేసి గౌరవించి సత్కరించారు. సద్గురు శివానంద ట్రస్ట్ వారు "ఎమి నెంట్ సిటిజెన్స్ అవార్డ్ " అందించి ఘనంగా సత్కరించారు. ప్రతి ముఖ్య నగరం సాహిత్య సంస్థ వారిని సన్మానించి గౌరవించింది. శృంగేరి పీఠం శాస్త్రిగారి విద్వత్తును గుర్తించి ఆత్మీయులను చేసుకొన్నది. కేంద్ర ప్రభుత్వం అత్యుత్తమ పద్మ పురస్కారం త్వరలో అందించాలని, శతాధిక ఆయుస్సుతో ఆరోగ్యంగా శాస్త్రి గారు ఉండాలని కోరుకుందాం..

శాస్త్రి గారు 1-భారతము ధర్మ సూక్ష్మ దర్శనం 2-కృష్ణ లహరి –స్వేచ్చానువాదం, రామాయణ రహస్య దర్శిని గ్రంథాలు రచించారు. ఇవికాక రామాయణ రహస్యము, భాగవత తత్వము కూడా రాశారు.



# 16 అవధూత నిట్టల ప్రకాశం గారు

అవధూత నిట్టల ప్రకాశం గారు యానాం కు ఆయన 50 వ ఏట వచ్చినప్పుడు తన చిన్నతనం లో చూశానని శతావధాని శ్రీ చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారు రాశారు. అప్పటికి ప్రకాశం గారికి కవిగా గుర్తింపులేదు. ఆయనను ఎవరూ ఎరగరు కూడా. అలా ఒకరోజున ఆయన తనకు కొద్దిరోజుల్లో కవన శక్తి కలగబోతోందని, దానిని పరిశీలించమని యానాం లోని ప్రముఖులతో చెప్పుకొన్నారు. శాస్త్రిగారి పుట్టినూరు కూడా యానాం. యానాం దేవాలయం దగ్గరు ఆసక్తికల వారందరూ రావచ్చునని ప్రకాశం గారు ప్రకటించారు. ఊరి పెద్దలు ఎవ్వరూ ఆయనమాటలు లక్ష్య పెట్టలేదనీ, లైట్ తీసుకోన్నారనీ ఎవరూ రాలేదనీ, ఎవరో పది మంది "లాకాయ్ లూకాయ్ గాళ్ళు "మాత్రమె వచ్చారని శాస్త్రిగారు చెప్పారు. నిట్టలవారు ఆశువుగా, ధారాళంగా చెప్పిన పద్యాలను వినటం మాత్రమె కాక అప్పటికప్పుడు తాను పుస్తకం లో రాసుకొన్నాననీ చెళ్ళ పిళ్ళ వారు చెప్పారు.అందులోని కవిత్వంకూడా చాలా గొప్పగా ఉందనీ వారికీర్తనలు చాలామందికి కంఠోపాఠం గ వచ్చుననీ శాస్త్రిగారు ఉవాచ. తమకు గుర్తున్న కీర్తనలు ఆయన తెలియజేశారు.

ఆదితాళం లో కీర్తన –"హరా నిన్నే నమ్మినానుగదరా -

అనుపల్లవి –కరుణాకర పురహర నీపాద మును నమ్మినానురా

మ్రొక్కు చుంటినిరా "అని సాగుతుందని ప్రాసయతి తో కీర్తన మనోజ్ఞంగా ఉందనీ శాస్త్రిగారన్నారు. ఆయన కీర్తనలు భద్రాచల రామ దాసు గారి కీర్తనలాగా మనోహరంగా ఉంటాయన్నారు. నిట్టల వారి స్వగ్రామం పెద్దాపురం కావచ్చుననీ తనకు తెలిసినప్పటి నుండీ ఆయనకు స్వగ్రామం లేదనీ భార్యను కూడా వదిలేసి రోజుకో గ్రామం లో తిరిగేవారనీ చెప్పారు. సంతానం అసలే లేదు. కుల నియమం పాటించకుండా అన్ని వర్ణాల వారిళ్ళలో భోజనాలు చేస్తూసారాకు అలవాటు పడ్డారని చెప్పారు. భోజనమున్నా లేకున్నా మందు ఉంటె చాలు.

యానాం వచ్చినప్పుడు నిట్టలవారి మకాం సారా కొట్టే అని చెళ్ళపిళ్ళ వారు జ్ఞాపకం చేసుకొన్నారు. పల్లెకారులు భోజనం తెచ్చి పెట్టేవారు. చేపలు మాంసం పెట్టేవారుకాదు. భయం తో మాలలు ఆయనకు భోజనం పెట్టలేదన్నారు. కొద్దికాలం బ్రాహ్మణులు పిలిస్తే వెళ్లి తినేవారు,కానీ చివరికి ఆయన ఆతిధ్యం అంతా పల్లె కారులదే.అన్నం కంటే మద్యమే ప్రియం ఆయనకు. అవదూతలకు మద్యం నిషేధం కాదని తన చిన్న తనం నుంచీ తెలిసిన విషయమే అన్నారు శాస్త్రీజీ.

నిషా దారుడే అయినా నిట్టల అవదూతగారికి సంబంధించిన కొన్ని విచిత్ర గాధలు ప్రచారం లో ఉన్నాయన్నారు శాస్త్రి గారు. ఇందులో కొన్నైనా యదార్ధాలే అని తాము నమ్మినట్లు చెప్పారు. ఆయన్ను తరచుగా సేవించేవారు పల్లెకారులు అనే అగ్నికులక్షత్రియులు. అధికభక్తితో సారా సమర్పణ చేయటం వలన ఆయనకు అదొక కుతిగా మారింది. దానితో కిక్కేక్కి తన్మయత్వం ఏర్పడేది.సారా కొట్టు దగ్గరకు వెళ్లి "కాస్త పొయ్యి "అనిఅదిగితే "లేదు పో "అని చిరాకు చూపిస్తే "సరే లేకుండా నే పోతుందిలే "అని వెళ్లి పోయేవారట. ఈమాట అని కొంచెం దూరం వెళ్ళగానే కొట్టువాడు జాడీల్లో సారా చూసుకొంటె చాలాభాగం ఖాళీ గా కనిపించేదట. అప్పుడు ఆయనమాట మహిమ అర్ధమై, వెళ్లి కాళ్ళమీద పడి వేడుకొంటే, కనికరంచూపితే జాడీలు మళ్ళీ ఫుల్ గా నిండా ఉండేవట. ఆ కాలం లో ఆయన తృప్తిగా తాగే సారా ఖరీదు కేవలం అణన్నర అంటే ఒకటిన్నర అణా మాత్రమె. యాచకుడు అనుకోని ఆయనకు ఎవరైనా డబ్బు ఇస్తే ప్రకాశంగారు తీసుకొనే వారుకాదు. మరీ బలవంత పెడితే అణన్నర మాత్రమె పుచ్చుకొని మిగిలింది అక్కడే వదిలేసి వెళ్ళిపోవటం చాలామంది చెప్పగా తాము విన్నామని శాస్త్రిగారన్నారు. మాంచి నిషాలో ఉన్నప్పుడు నిట్టల వారి నడక "గోమూత్రం "ఆకారంగా అంటే ఈమూల నుంచి ఆమూలకు ఆమూలనుంచి ఈ మూలకు అన్నట్లుగా ఉండేది.

ఈ విధమైన అపమార్గం లో తిరుగుతున్న భర్తకు పిచ్చి ఎక్కిందని భార్య పోలీసు స్టేషన్ లోరిపోర్ట్ చేస్తే ఆయన్ను తీసుకువెళ్ళి మూడు రోజులు ఉంచారు. నాలుగో రోజుఉదయం స్నానం చేయాలని చెప్పి స్టేషన్ నుంచి సంకెళ్ళతో, ఇద్దరు పోలీసుల పహారాతో గోదావరికి వెళ్లి "జై పరమేశ్వరా "అని ఒక్క మునుగు మునిగి, అర్ధ ఫర్లాంగు దూరం లో తేలి, నీటిపై బాసిన పట్టు వేసుకొని కూర్చుని –"గౌతమి నే కనుగొంటిని –కనుల పండువుగానూ –రాతి నాతిగ చేసిన సీత

రాముని కరుణ రసమున "అని ఆదితాళం లో కీర్తన మొదలుపెట్టి –"అంగజారి శిరమున ఆడుచు నుండేటి గంగ-పొంగి తరంగముల చేత భూమి నిండును – అంగ లింగభంగ ధరుల సంగమున జెలంగు-కోటి లింగముల ----"అని పాడారట. ఇంకాకొన్ని చరణాలున్నాయి కాని అరవై ఏళ్ల క్రితం విన్నవికనుక పూర్తిగా జ్ఞాపకం లేవని వెంకటశాస్త్రి గారన్నారు. భజనపరులకు చాలామందికి ఈకీర్తన వచ్చు అన్నారు.

ఒకసారి ఎవరో "అయ్యా తమరు శృంగార కవిత్వం బాగా చెబుతారట. మాకు సెలవియ్యండి"అని అడిగితె ఆశువుగా సావేరిరాగం ఆది తాళం లో –"జాలిమాలీ వనమాలీ రాడాయె, నయమో "అని జావళి పాడి ఆశ్చర్య పరచారట -"అంచయాన స్త్రీ హంతకుడగు –శ్రీ పంచ బాణు డిప్డు నన్ను డీ కొని –కించ మాని కొంచ పంచ దలచు –అంచ నెక్కి వెడలె నడుగో చూడుడు "అని శృంగారం రసాభి నివేశంతో రక్తికట్టించారని వెంకటశాస్త్రియం.

నిట్టల ప్రకాశం అవధూత గారికాలం లోనే నిత్యమౌని రాం భోట్లు అని మరొక అవధూత ఉండేవారట. ఈయన నడుస్తూ దారిలో ఉన్న చెత్తా చెదారం ఎడమవైపుది ఎడమవైపు కుడివైపుది కుడివైపు ఏరి పారేసేవారట. ఎలుగుబంటిలాగా మహా బలిష్టులు.ఈయన పుట్టగోచీ మాత్రమె పెట్టుకొనేవారు. భిక్షాటన చేసేవారు కాదు. నీరు గాలిమాత్రమే వారి ఆహారం అన్నారు శాస్త్రిజీ. తమ 12ఏట రాం భోట్లు అవదూతగారిని చూసినట్లు వెంకట శాస్త్రి గారు చెప్పారు. ఈయనకు ఖేచర గమనం ఉందనీ దానిని పైడా వెంకన్నగారు కనిపెట్టారనీ జనం చెప్పుకొనే మాటలు తానూ విన్నాను అన్నారు. ద్రాక్షారామ భీమేశ్వరుని దేవాలయం దగ్గర ఉన్న అన్నసత్రం పైడా వారిదే. తరచుగా దాక్షారం వెళ్ళేవారు. ఒకరోజు వెంకన్నగారు ప్రయాణం చేస్తూ వీధి అరుగుమీద పడుకొన్న రాం భోట్లుగారిని "స్వామీ !దయ చేస్తారా "?అని అడిగితె "మీరు పదండి నేను మీ వెనక నెమ్మదిగా వస్తాను చివరికి అవ్వా, గుర్రం ఒక్కటే అవుతాయి "అన్నారట. తానేమో బోయీల సవారీలో వెడుతున్నాడు ఈయన ఎకసక్కెం ఆడటం లేదు కదా అనిపించింది. రెండు ఆమడల దూరం లో ఉన్న దాక్షారం చేరేసరికి, రాంభొట్లు గారు గోపురం అరుగుమీద కనిపించారట. ఆశ్చర్యపోయి ఆయనకు ఖేచరగమనం అంటే గాలిలో ప్రయాణం చేసే లక్షణం ఉందని అనుకొని ఉండచ్చు అంటారు శాస్త్రిగారు. సిద్ధ పురుషులకు ఎలాంటి గమనం ఉన్నా ఆశ్చర్యపడాల్సింది లేదన్నారుకూడా. అలాగే నిట్టల ప్రకాశం గారు గోదాట్లో సంకెళ్ళ తోనే నీటిపై "బోసనపట్టు'(ఇది శాస్త్రిగారి ప్రయోగం ) వేసి కూర్చోటం యోగాభ్యాస ఫలితం కావచ్చు అనీ చెప్పారు.

"నిట్టల ప్రకాశంగారు భజన కర్తుగా పాడుకోదగిన వారే కానీ అంతకు మించిన పాటకులు కారు "అన్నారు వెంకట శాస్త్రి గారు. ఆయన భామ వేషం కట్టేవారనీ, దానిలోనుంచి వచ్చిన పదకవితలే ఇవి అని చెప్పగా విన్నారట. ఆ వేషానికీ ఆకవిత్వానికి సంబంధం ఉండదు. పూర్వ జన్మ లో ఏదో పుణ్యం చేసి, దానివలన ఏదో కళ అబ్బి, ఆ కల్మషాన్ని అల్లరి చిల్లర నడకలద్వారా, ఈవిధంగా, వరప్రసాదిగా జన్మించారని ఊహించుకోవచ్చు అన్నారు చెళ్ళపిళ్ళ.నూట నాట గాయకులలో ఆయన పేరులేకపోవటం న్యాయమే అంటారు. కొద్దిగా ఛందస్సు తెలిస్తే తేల్గ్గా కట్టెయ్యవచ్చు. జన్మతః కవులే అయినా ప్రకాశం గారు వాఙ్మదుర్యం ఉన్నవారుకనుక భజన లలోఆయన కీర్తనలు ప్రసిద్ధి చెందాయి. శబ్ద, అన్వయ కాఠిన్యం వీరిలో లేదు, రేగుప్తిరాగం లో ఆట తాళం లో వారి మరోకీర్తన –

"సీతా మనోహర రారా –సేవకుడ నను బ్రోవ వేరా "

అనుపల్లవి –రాతి నాతిని జేసే నీ పద రాజమటంచును

ఖ్యాతిగా విని, ప్రీతితో నిను నమ్మితిని

నాపాతకము లెడబాపుమిక –దేవా దేవా దివ్యప్రభావ దిక్కు నీవే గావ

అని చెప్పి మిగిలిన చరణాలు గుర్తులో లేవన్నారు శాస్త్రిజీ. పదకవిత్వం లో ఒక చరణం తెలిస్తే, మిగిలిన చరణాలన్నీ తాడు దబ్బనం తో గుచ్చినట్లు అదే రీతిలో నడుస్తాయన్నారు. తానూ చామర్లకోటలో చదువుకొనే సమయానికి ప్రకాశం గారు జీవించే ఉన్నారట. కాకినాడ జగన్నాధపురం దేవాలయం గోపురం వద్ద మకాం గా ఉండేవారట. వార్ధక్యం పెరిగినా తానూ ఫలానా రోజున, ఫలానా ఘడియలో చనిపోతానని చెప్పారట. అదే ప్రకారం సిద్ధిపొందారట. చామర్ల కోటనుంచి అప్పటి తమనివాసమైన యానాం వెడుతూ,ప్రకాశం గారి సద్గతికి సంబంధించిన సంగతులన్నీ చూసినట్లేజ్ఞాపకం ఉందన్నారు వెంకట శాస్త్రిజీ. జగన్నాధపురం పడమటిదిక్కులో నిట్టల వారి సమాధి ఉందట. అక్కడా భజనాదికాలు జరుగుతూ ఉండచ్చు అన్నారు.

నిట్టల వారి చివరి రోజులలో వచ్చిన భక్తుడే యడ్ల రామదాసు. సత్ శూద్ర కులస్తుడు ఆజానుబాహువు. గొప్ప తేజశ్శాలి డబ్బపండు వంటి శరీర ఛాయ. కవిత్వం ప్రకాశం గారి కవిత్వం లాగానే ఉంటుంది.

ప్రకాశం గారి తత్వాలు కొన్ని -1-గూటి చిలకేదిరా అన్నా 2-గాలిపటమురా జీవా గాలి నిలిచినంతనే కూలిపోవురా జీవా

ఈయన తత్వాలు కొన్ని సంకీర్తనాత్మకంగా, కొన్ని భక్తకవి మనో ధర్మాన్ని ప్రకటించేవిగా ఉంటాయి

3-శంకరాభరణం ఆది తాళం లో –

"నారాయణ నీ నామము నిరతమునమ్మి స్మరియించుట నా వంతు – ఘోరదురితములు పారద్రోలి నను గారవించుటది నీ వంతు "

4-ఎరుకల కాంభోజి లో –

రాములవారిమాట నవ –రత్నములుంచిన మూట –జయ రాములవారిమాట మాకు –దోసెడు వరహాల మూట

ఇవి రామదాసు కీర్తనల ధోరణిలో సాగాయి

4-ఆనంద భైరవి లో తన మనో భావాన్ని ప్రకటిస్తూ –

"దైవ సహాయ్యమెన్నటికో నా –చిత్తము హరిపై చేర్చే దెన్నటికో

ఉత్తములతో పొత్తెన్నటికో వర –విత్తముపై భ్రమ విడిచే దెన్నటికో

ఆశను రోసే దెన్నటికో భవ –పాశములను కోసి వేసే దెన్నటికో

దాసుల గూడే దెన్నటికో,నిష్ఫల ప్ర –కాశుడానని గంతు వేసే దెన్నటికో "

ప్రకాశం గారు కాకినాడచుట్టుప్రక్కల గ్రామాల్లో ఉన్నట్లు తెలుస్తోందనీ, ఆయన చివరి తత్త్వం పిఠాపురం వాస్తవ్యురాలుఅప్పటికే 90ఏళ్లనట్టువరాలు పెండ్యాల సత్యభామ ద్వారా, ఆమె అమ్మమ్మగారు స్వయంగా ప్రకాశంగారి దగ్గర నేర్చుకొన్న ది తమకు అందింది అని వెంకట శాస్త్రి గారువాచ.

ఆధారం 29-12-1948 ఆంధ్రపత్రిక వారపత్రికలో చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారు రాసిన వ్యాసం.నిట్టల వారినీ యడ్ల రామదాసుగారినీ శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు గారు తమ "ఆంధ్ర వాగ్గేయకారుల చరిత్ర "లో చేర్చారు.

## 17 యోగి ఖాదర్వాబాబా

విజయనగరం జిల్లాలో వికారి సంవత్సర కార్తీక శుద్ధ చవితి బుధవారం హజరత్ ఖాజా ఖాదర్వావలీ బాబా పాదాలలో శుభాలక్షణాలైన శంఖు చక్రాలతో జన్మించారు. వీరి పూర్వీకులు తిరుచినాపల్లి రాజవంశానికి చెందినవారు. అక్కడినుంచి విజయనగరం వచ్చి స్థిరపడ్డారు. కైలాసపతి శివుడే జన్మించాడని అందరూ భావించారు. బాల్యం లోనే సాదు సత్పురుషుల బోధలు విని జ్ఞానం పొందేవారు. స్థానిక హైస్కూల్ లో చదివారు. ఒక రోజు తండ్రి నాగపూరులో లోఉన్న అయిదుగురు సాధువులకు తలా ఒక రాగికానీ ఇస్తానని మొక్కుకొన్నానని, ఇప్పటిదాకా ఇవ్వ లేకపోయానానని, వెళ్లి వారిని గుర్తించి అందజేయమని పంపించారు. నాగపూరు చేరినరోజే ఇక్కడ తండ్రి చనిపోయాడు. నాగపూర్లో వేలాది శిష్యులున్న తాజుద్దీన్ బాబాను దర్శించారు. ఈ బాబా ఖదర్వా బాబా ను లోకొద్ధరణకోసం ప్రేరేపించి ఉపదేశించారు. మూడు రోజులు జ్ఞానబోధ చేశారు. "ఖాదర్ అంటే నేనే "అని ఆయన్ను ముఖ్య శిష్యుడిగా స్వీకరించాడు. తిరిగి విజయనగరం వచ్చి స్థానిక నల్ల చెరువు గుట్ట మీద 15ఏళ్ళు నిద్రాహారాలు మాని మౌనంగా దీక్షగా తపస్సు చేశారు. తర్వాత స్థానికుల కోరికపై మైదానప్రాంతానికి వచ్చారు. అక్కడ విశాలమైన ప్రాంతం లో ఒక ప్రార్థనామందిరం దర్గా ఏర్పడింది. వసుదైక కుటుంబం ధ్యేయంగా బోధనలు చేశారు. చేతి స్పర్శతో ఎంతటి రోగామైనా తగ్గించే వారు. ఇక్కడ రాజు సామాన్యుడు ఒకటే. కులమతజాతి భేదం లేదు గులాబిరేకులు చిటికెడు విభూతి మాత్రమే బాబా ఇచ్చే మందు. రమణమహర్షి సత్యసాయిబాబా వంటి మహానుభావులు బాబా దర్శనం చేసి ఆశీస్సులు పొందారు. విజయనగరం జైపూర్ మహా రాజాలుకూడా బాబా ఆశీస్సులు అందుకొంటూ తరచూ దర్శనం చేసుకొనేవారు. బాబాపాదాలలో ఉన్న శంఖు చక్రాలే సర్వ జన రక్ష. కనుక బాబా పాదరక్షలకు భక్తిగా జనం మొక్కుతారు. అప్పటి నుంచి అక్కడ ఉన్న ఎనిమిది వృక్షాలను అ ష్టదిక్పాలకులుగా భావిస్తారు. ఇక్కడి దాక తెలిపిన వృత్తాంతం అంతా యు ట్యూబ్ వీడియో కథనం. శాంతి సర్వమత సమానత్వం, సకలజీవులపట్లమమకారం ప్రేమ ఆలంబనగా, మానవాళి జాగృతికోసం జ్ఞానయోగ మార్గంగా సూచిన్చిందే సూఫీ మతం. ఈ సూఫీ మతాన్ని ఆదర్శంగా ఖాదర్వాబాబా ప్రచారం చేశారు




ఇక పై రాసింది అంతా శ్రీ భోగరాజు వెంకటరామయ్య కవి గారు రాసిన "ఖాదర్వా బాబా శతకం " ఆధారం గా రాసింది.

బాబా చిన్నతనం లో పాలిచ్చే దాది ఇంట్లో నిద్రిస్తుంటే, ఆ వీధిలోని ఇళ్ళన్నీ అగ్నికి ఆహుతికాగా ఈ ఒక్క ఇల్లు మాత్రమె కాలకుండా ఉండటం అందరికీ ఆశ్చర్యం కలిగించింది. ఎప్పుడైనా ఈ పిల్లాడిపై తల్లికి కోపం వచ్చి కొడితే, వెంటనే ఆమెకు జ్వరం వచ్చేది. ఒకసారి గుర్రపు స్వారీ చేస్తూ వెడుతుంటే ఐదు తలల నాగుబాము కన్పించి, ఆ రోజు రాత్రి కలలోకూడా కన్పించి "నువ్వు గంధర్వుడివి. అందుకే కనిపించాను "అని చెప్పింది. చుట్టుప్రక్కలవారు ఇవన్నీ విని ఆయనను భక్త ధృవ, భక్త ప్రహ్లాదునితో పోల్చేవారు.అంతటి భక్తీ తాదాత్మ్యం అలవడ్డాయి.

గురువు ఆజ్ఞ పొంది ఒక కొండపై తీవ్ర తపస్సు చేశారు బాబా. అప్పటినుంచి ఆకొండ ప్రపంచంలో గొప్ప క్షేత్రమైంది. సింహాచలం, రామతీర్థం మొదలైన వాటికి ఎంతటి ఖ్యాతి వచ్చిందో ఖాదర్వా బాబా తపస్సు చేసిన కొండకు అంతటి పేరు వచ్చింది. జనాలకు తత్వజ్ఞాన బోధ చేసే సంకల్పం, ఐహిక సుఖాలన్నీ త్యాగం చేసి " ఖాదిరీ పదివి "స్వీకరించారు బాబా. భద్రుడు తపస్సు చేసిన కొండ భద్రాద్రి అయినట్లు, బాబా తపస్సు చేసిన "నల్ల చెరువు గుట్ట " "ఖాద్రీ నగరం "అనే మహా క్షేత్రం గా వర్ధిల్లింది. గురూప దేశ మంత్రాన్ని దీక్షగా నిశ్చలమనసుతో జపించి తపస్సు చేసినందుననే మహాత్ముడయ్యారు. ఎండా వానా లెక్కచేయక, క్రూరసర్పాలు మృగాలకు ఆలవాలమైన ఆ కొండపై దీక్షగా తపస్సు చేశారు బాబా. చుట్టూంతా గుట్టలు రాళ్ళు ముళ్ళపొదలు తో ఉండే ఆప్రదేశం బాబా వలన మంచి దారులు ఏర్పడి, కార్లతో హాయిగా రోజుకు పది వేలమంది భక్తులు దర్శించే మహా క్షేత్రంగా అభి వృద్ధి చెందింది. జతిమతాలు లేకుండగా అన్ని జాతులవారేకాక అక్కడి జంతువులూ పక్షులు కూడా పరస్పర వైరాలు మాని సఖ్యంగా ఉండటం ఆశ్చర్యం కలిగిస్తుంది. బాబా ఒకసారి తీవ్ర తపస్సు చేస్తుంటే పెద్ద తుఫాను విరుచుకు పడినా చలించక కదలక తదేకంగా తపస్సు కొనసాగించారు. అప్పుడు ఒక త్రాచు

పాము వచ్చి ఆయన రెండు పాదాలను పట్టుకొన్నది శరణు వేడినట్లుగా. వడగళ్ళ వాన వచ్చినా చలించని దీక్షతో తపస్సు చేశారు. వంటవారు వంటలు భోజనాలకు చాలా ఇబ్బందికలిగిస్తోంది వాన దయచూడుబాబా అని ప్రార్ధిస్తే వర్షపు హోరు లేకుండా చేశారుబాబా.

ఒకనాడుఒక వేశ్య బాబా సేవకై వస్తుంటే, ఆతన తపస్సు మహాత్మ్యం వలన ఒక పాము ఆమె రెండు కాళ్ళను చుట్టేసింది. భయపడ్డ ఆమెకు సద్బుద్ధి ప్రసాదించి కాపాడారు. అర్ధరాత్రులలో రెండుప్రక్కలా రెండు పులులతో బాబా "షైరు" చేసేవారు. డాక్టర్లు కూడా తగ్గించలేని జబ్బులతో బాధపడే వారు బాబా ను దర్శిస్తే రోగాలు యిట్టె మాయమయేవి.. హస్తవాసి మంచిదని వాసుదేవుని వంటి చల్లని స్వామి అని ప్రజల నమ్మకం.

బాబా పై ఈ శతకం రాసిన కవి శ్రీ భోగరాజు వెంకటరామయ్య గారు 24ఏళ్ళనుంచి కడుపు శూల తో బాధపడుతూ ఎందరు డాక్టర్లకు చూపించినా తగ్గకపోతే బాబా దగ్గరకు వచ్చారు. ఇష్టం వచ్చినవన్నీ హాయిగా తినమని, పద్యం గిత్యం జాన్తా నై అని చెప్పి చిటికలో నయం చేశారు బాబా. కవిగారు తనకు ఏ పదార్ధాలు కూరలు పడవని చెప్పారో వాటినే తినమని చెప్పి తినిపించి శూల బాధ నివారించారు.

బాబా దర్బారులో గానా బజానా జరుగుతున్నా వినీ విననట్లు చూసీ చూడనట్లు ఉంటూ విజ్ఞాన మౌనంతో తదేక దృష్టి తో దీక్ష కొనసాగించటం బాబా ప్రత్యేకత. బాబా అనుగ్రహం తో ఇచ్చే ఫలమైనా విభూతి అయినా గడ్డిపరకైనా రోగాలు, హాహాకారాలు మానిపోయేట్లు చేస్తాయి. అన్నిరకాల రోగులు మానసిక రోగులు మూర్చరోగులు కూడా వచ్చి బాబా అనుగ్రహంతో వ్యాధులనుపోగోట్టుకొని హాయిగానవ్వుకొంటూ వెళ్లారు..మహా వేదాంతులు, బహు శాస్త్ర పారంగతులు, శాస్త్రవేత్తలు దైవజ్ఞులు ఐశ్వర్య సంపన్నులు బాబా పాదాలకు మ్రొక్కి భక్తితో సేవించటం మహాదాశ్చర్య విషయం. కలియుగ ప్రత్యక్ష దైవం గా ఖాదర్వా బాబాను విశ్వసిస్తారు. అని కవిగారు చాలా భక్తిగా ఆర్తిగా బాబా చరిత్ర రాశారు. వీరు ఆంధ్ర దేశ అక్షరాస్యులకు చిరపరిచితులైన కవి శేఖరులు, విజయనగర ఆస్థాన కవీశ్వరులు శ్రీ భోగరాజు నారాయణ మూర్తిగారి తమ్ములు.దీనికి ముందుమాట ను విజయనగరం మహారాజాకాలేజి రిటైర్డ్ సీనియర్ తెలుగుపండితులు శ్రీ అడిదం రామారావు గారు రాశారు. ప్రముఖకవి శ్రీ విశ్వనాథ కవిరాజు ఆశీస్సులందించారు. పుస్తకముద్రణకు ధనసాయం చేసినవారు శ్రీ రామ చంద్రుని రామారావు పంతులుగారు. వీరంతా ఖాదర్వా బాబా భక్తులే.. ఈ శతకం 1946 లో ముద్రింపబడింది. కవిగారి కొన్నిపద్యాలురుచి చూద్దాం

"మద క్రోధద్వయ నాశాకారి వగుటన్, మత్తేభ శార్దూలముల్ –ముదమారంగాను సూటినిం గలిపి సే ముత్తెంబులున్ వజ్రముల్ -గదియం గల్పుచు మాల గూర్చి ఇడితోఖాదర్వ బాబా, భవ-త్పద భక్తిన్నిది కంఠమందు ధరియింపం గోరి మన్నింపుమా "

"బ్రహ్మయో విష్ణువో శివుడో తాజుద్దీన్ రూపంబు తో –గరుణంబెట్టిననంగజాలు ఘనుడౌఖాదర్వబాబాగురూ"

"బుధు లొందుంగలశంఖ చక్రములు నీ పూజ్యంబు పాదంబులన్"

"నిన్నుం బోల్చగావచ్చు నాధ్య వునితోనిక్కంబు ప్రహ్లాదుతో "

"సకలైశ్వర్య సమున్నతిం గలిగి, తత్సౌఖ్యంబు లాసించ కే -సకలో త్కృష్టఖాడిరీపదవికి సంకల్ప మున్ బూని "

"ఈ రీతిన్ పరమాత్మ్మ తోసముడవైయీ పర్వతారణ్యముల్ ఘోరంబయ్యెడి క్రూర జంతుభయముల్ ఖూనీలు చోరీలంగల హత్యలున్ గలస్థాలిన్,సుక్షేత్రమున్ జేయు నీ –కౌరాసాటియేలోకమందు కనగా ఖాదర్వ బాబా గురూ "

"అహాహా నీ ఇరు ప్రక్కలం బులులు రెండౌ యర్ధరాత్రంబు నన్-బహు భక్తిం నడువ"

"ఏ రూపంబును సెట్టి రోగి యయినన్ నీక్షించాగా నంతనే యా రోగంపు బలంబు తగ్గి మనమానంద ధైర్యంబు లవ్వారినింబొందునోయట్టి రూపయుతుడౌ స్వామిసదానంద వే మారుల్ మ్రొక్కెద"

"ప్రత్యక్షంబగు దైవమీవ యనుచున్ భక్తాళి సేవ్వాళలన్ –సత్యాసత్యవివేక జ్ఞాన మిడుచున్ సన్మార్గులుం జేయుచున్ "

"జాలంబింతకు జేయకయ్య సతతమున్ సద్భక్తితో గొల్చెదన్ –కాలంబింతయు వ్యర్ధ పుచ్చకయనే ఖాదర్వ బాబా గురున్ –బోలెం జాలెడు వారు లేరనుచు నిబ్బూమిం దగన్ జాటెదన్ –పాలించంగను జాగు సేయకుము యో బాబా నమస్కారముల్ "

అంటూ శతకం ముగించారు కవి ధారాశుద్ధి భక్తీ అంకితభావం అవగాహన, బాబా మహిమా నిరూపణం తో కవిత్వం చిందులు త్రొక్కింది. ఆదర్శ పురుషుడు ఖాదర్వా బాబా చరిత్రను లోకానికి తెలియ జేసిన కవి శ్రీ భోగరాజు వెంకటరామయ్య ధన్యులు.





## 18 అమ్మ కు నిర్వచనం జిల్లెళ్ళమూడి అమ్మ

"నీ పిల్లలో ఏమి చూస్తున్నావో అందరిలో దానినే చూడటం బ్రహ్మస్థితి పొందటమే. తిధులు విధిని మార్చలేవు. పెట్టింది కాదు, జరిగేదే ముహూర్తం. మానవుడి నడక నవగ్రహాల మీద ఆధారపడి లేదు, రాగ ద్వేషాలు అనే రెండే రెండు గ్రహాలమీదే. జీవితం సమస్యల తోరణం, సమస్యలతో రణం. వైకల్యం లేనిదే కైవల్యం. తృప్తే ముక్తి, దిగులే జిజ్ఞాస, తపనే తపస్సు. వర్గం లేనిదే స్వర్గం. విశ్వాసం కర్తవ్యమే భగవంతుడు. విధి వర్షం లాంటిది కొందరికి అనుకూలం కొందరికి ప్రతికూలం. ప్రేరణే దైవం. సర్వత్రా అనురాగమే విరాగం. నేను అమ్మను, మీరు నా బిడ్డలు "ఇవీ అందరికి అమ్మ అమ్మకి నిర్వచనం అయిన జిల్లెల్ల మూడి అమ్మ అభిభాషణం. చిన్న చిన్న మాటలలో ఎంత జీవిత పరమార్ధాన్ని కర్తవ్యాన్ని, బోధించిందో. ?సకల వేదోపనిషత్తుల సారం అంతా వీటిలో నే ఉంది. ఆప్యాయతకూ ఆత్మీయతకు, ఆదరణకు అమ్మ మారు పేరి నిలిచింది. జిల్లెల్ల మూడి అమ్మగానే అందరికి తెలుసు. అమ్మ జీవిత విశేషాలను తెలుసుకొందాం.



### బాల్యం –వివాహం

అమ్మ గుంటూరు జిల్లా పొన్నూరుకు దగ్గరలోని మన్నవ గ్రామం లో 28-3-1923 న ఆఊరి కరణం మన్నవ సీతాపతి శర్మ, రంగమ్మ లకు జన్మించింది. అనసూయమ్మ గా నామకరణం చేశారు. పసితనం గొల్ల నాగమ్మ పెంపకం లో గడిచింది. చిన్నప్పటి నుంచే అమ్మ అనేక మహిమలు చూపి అందరికి ఆశ్చర్యం కలిగించింది. తల్లి రంగమ్మ చనిపోతే అందరూ ఏడుస్తుంటే ఏడవ వద్దని అమ్మ దేవుడి దగ్గరకే వెళ్లిందని ఓదార్చింది. ఒక సారి బాపట్ల భావనారాయణ స్వామి గుడికి వెడితే పూజారి గమనించకుండా గుడి తలుపులు మూసేసి వెళ్ళిపోగా అక్కడే విచికిత్స చేసి అన్నిటికీ ఆధారం భూమి కనుక భూమి పూజ చేయాలని చెప్పింది. మర్నాడు ఉదయం పూజారి వచ్చి గుడి తలుపులు తెరవగానే అమ్మ రాజ్యలక్ష్మీ అమ్మ వారుగా దర్శన మిచ్చింది. మరో సారి ఒక పోలీసు ఉద్యోగి అమ్మ మెడలోని పులిగోరు తీసుకోవటానికి ప్రయత్నిస్తే అమ్మే తీసి ఇచ్చింది. అతను ఆశ్చర్య పడి మళ్ళీ భక్తితో అమ్మ మెడకు అలంక రించి నమస్కరించి వెళ్ళి పోయాడు. అమ్మ పై అందరికీ అనంత విశ్వాసం కలిగింది ఆమెను సర్వ దేవత స్వరూపిణి గా భావించారు. పదమూడవ ఏట అమ్మకు మేనత్త కనకమ్మ గారి



పెద్ద కొడుకు బ్రహ్మాండం నాగేశ్వర రావు తో 5-5-1936న బాపట్ల లో వివాహం చేశారు కాపురం బాపట్ల లో పెట్టారు. నాలుగేళ్ల తర్వాత 1940లో జిల్లెల్ల మూడి కి ఆ దంపతులు చేరి అక్కడ కాపురమున్నారు. ఆగ్రామానికి ప్రయాణ సౌకర్యమే లేదు వారి పెద్దకొడుకు సుబ్బారావు గ్రామ సర్పంచ్ అయిన తర్వాతే 1966 లో రోడ్డు వేశారు.

### ధార్మిక కార్యక్రమాలు

1950 నది వేసవి లో ఒక సన్యాసి ఆకలితో అలమటిస్తూ నడిచి సోలిపోతుంటే అమ్మ చూసి ఇంటికిపిలిచి ఆతిధ్యంస్వీకరించమని కోరింది. ఆ ఊళ్ళో దేవాలయం లేదు కనుక తాను భిక్ష స్వీకరించనని చెప్పగా అమ్మ మనసు తల్లడిల్లి ఒక దేవాలయం, స్వంత సత్రం ఏర్పాటు చేయాలని భావించింది. ఊరి వారందరి సహకారం కోరుతూ ఎవరికీ ఇబ్బంది కలుగ కుండా రోజుకు "పిడికెడు కెడు బియ్యం పధకం "ఏర్పాటు చేసింది. ప్రతి ఇంటి వారు దాన్ని సేకరించి అండ జేసేవారు వాటిని భద్రం చేసి అందులో కొంత భాగం దేవాలయ నిర్మాణానికి ఉపయోగించటం ఆమె ఆలోచన. కొద్ది కాలం లోనే ఇది అద్భుతా విజయం సాధించింది. "పిడికెడు బియ్యం "అనేది మంత్రం లా పని చేసింది. 1958 ఆగస్ట్ పదిహేను న"అన్న పూర్ణాలయం "కు ప్రారంభోత్సవం చేసింది. ఆ సత్రం లో భోజనం చేయటానికి ఆకలే అర్హత. అర్హత వేషధారణ బట్టి కాకుండా ఆకలిని బట్టే అన్నం పెట్టింది. అన్ని బాధల కంటే ఆకలి బాదే ఎక్కువ అనేది అమ్మ. సమాజం లోని అన్ని వర్గాల వారు అన్ని రకాల వారు అమ్మ చేతి అన్న పూర్ణ ప్రసాదాన్ని అమ్రుతోప మానం గా ఆర గించారు. అమ్మ తన ఇంటిని "అందరి ఇల్లు "అని పేరు పెట్టింది.

బాపట్ల కుష్టు ఆస్పత్రిరోగులకు అరటిపళ్ళు, పరవాన్నం, పులిహోరా పంపేది అమ్మ. అందరినీ సమానం గా చూడటమే అమ్మ మనసు. ఒక జ్యోతిష్యుడు వచ్చి ఏదైనా ప్రశ్న అడగమంటే "సృష్టిలో ఏ ప్రాణి ఆకలితో బాధ పడకుండా ఉండే రోజు ఎప్పుడొస్తుందో చెప్పండి ?"అని అడిగి ఆయన్ను అప్రతిభుడిని చేసింది. అదే అతిలోక మాతృత్వం అది అమ్మకే సాధ్యం. అన్నం తో బాటు బట్టలనూ అందరికీ అందించేది. జిల్లెల్ల మూడి వచ్చిన ప్రతి వారు అమ్మ ప్రసాదం తిన కుండా, అమ్మ ఇచ్చిన వస్త్రాలను పొందకుండా వెళ్ళిన వాళ్ళు లేనే లేరు. మరో సారి వాసుదాస స్వామి అనే వైష్ణవ స్వామి వద్దకు అమ్మ వెళ్ళగా తల్లి లేని పిల్ల అని తెలిసి అందరూ తనను ప్రేమించేట్లు చేయనా అని అడిగాడు. అమ్మ "అందరూ నన్ను ప్రేమించినా ద్వేషించినా నేను అందర్నీ ప్రేమించేట్లు ఆశీర్వ దించండి "అని కోరి తన నడవడికి ఒక దివ్య మార్గాన్ని ఎన్ను కొన్నది అమ్మ.

### సంస్కృత పాఠ శాల –విద్యాలయం –హైమాలయం –ఆదరణాలయం

ప్రేమ మయ వాతావరణం లో ఉండేట్లు అందరినీ చేసింది అమ్మ. అందరూ అక్కా చెల్లి అన్నా తమ్ముడు గానే అక్కడ మెలగటం విశేషం. అమ్మ సన్నిధిదైవసంనిదే వారికి.. 1971 లో సంస్కృత పాఠశాల, కళా శాలను అమ్మ నెలకొల్పి మన సంస్కృతీ సంప్రదాయ వ్యాప్తికి ముందడుగు వేసింది. అక్కడ చదివే ప్రతి వారికి ఉచిత వసతి, భోజన సౌకర్యాలు కలిగించి ఆదర్శ ప్రాయమైనది.. 1978 రోగార్తులకోసం ఒక ఉచిత విద్యాలయాన్ని స్థాపించి సేవలందించింది. అప్పటికే ఉన్న ఆయుర్వేద విద్యాలయానికి తోడుగా హోమియో వైద్య శాల, అల్లోపతి వైద్య శాల ఏర్పరచింది. తన కుమార్తె హైమ లో అందరిలో మానవత్వాన్ని, అనుబంధాన్ని అనురాగాన్నీపెంపొందించే తలం పు తో పెంచింది. ప్రసిద్ధ జర్న లిస్టు శ్రీ పొత్తూరి వెంకటేశ్వర రావు హైమా ను చూసి హైమ లో దేవత స్వరూపం కనీ పిస్తోంది అని కొనియాడారు. అమ్మ తన దగ్గరకు వచ్చే రోగుల్ని హైమ వద్దకు పంపేది.ఆమె వారి పాలిటి కల్ప వృక్షం కామ ధ్వేనువు గా బాధలు నివారించేది. పదవీ విరమణ చేసిన వారికి, జబ్బుతో బాధ పడుతూఎవరూ పట్టించుకోని వారికి అండగా "ఆదరణాలయం "ఏర్పరచి వారి పాలిటి దీన బంధువే అయింది అమ్మ.

### ప్రచురణలు –సినిమాలు

మాతృశ్రీ పబ్లికేషన్ ట్రస్ట్ ను 1966 లో ప్రారంభించి సంస్కృతాంధ్ర హిందీ ఒరియా భాషలలో వందకు పైగా ప్రచురించి అమ్మ సాహిత్యాన్ని ప్రపంచమంతా పంచి బెడుతున్నారు. 1971 లో "విశ్వ జననీ పరిషత్ "ను ఏర్పరచారు. అమ్మ పై అడపా రామ కృష్ణా రావు గారు మొదటిగా కొన్ని స్లైడులు తయారు చేశారు. తర్వాత అరగంట డాక్యుమెంటరి చిత్రం అమ్మ పై వచ్చింది. పది హేను రీళ్ల లో జిల్లెల్ల మూడి లో జరిగే అన్ని కార్యక్రమాలను, అమ్మ పర్యటనలు స్వర్ణోత్సవ వేడుకలు అన్నీ చిత్రీకరించి శ్రీ కొండముది రామ క్రిష్ణ స్క్రిప్ట్ రాయగా ప్రముఖ నటుడు పి.జే.శర్మ కామెంటరి చెప్పాడు సూక్తులతో మరో కామెంటరి ఫిలిం తయారైంది. అమ్మ జీవితంపై "మాతృశ్రీ జీవితం –సాహిత్యం –సౌందర్య సర్వస్వం "పేరు తో డాక్టర్ బి.ఎల్ సుగుణ తెలుగు విశ్వ విద్యాలయం లో పరి శోధన చేసి "మాతృశ్రీ తత్వ సౌరభం "పేర ముద్రించారు.

### అమ్మ మహా ప్రస్తానం

విశాల మైన నుదురు భ్రుకుటి పై పెద్ద యెర్ర కుంకుమ బొట్టు, ముక్కుకు ముక్కెర, చేతుల నిండా గాజులు, ఒంటి నిండా చీర కొంగు కప్పుకొని,చిరునవ్వు తో ఆప్యాయం గా రారా నా కన్నా రా అమ్మా అని ఆప్యాయం గా పిలుస్తున్నట్లు చేతులు చాపి అపర అన్న పూర్ణా దేవిలాగా సాక్షాత్కరించేది అమ్మ అనసూయమ్మ చూడగానే భాతి ప్రపత్తులతో ప్రనమిల్లాలనే ఆలోచన మనసులో వచ్చి నిండు హృదయం తో నమస్కరిస్తారు. ఆ సంస్కారం ప్రేమ, ఆదరణ అమ్మ దానం లో ఉన్న

కమ్మదనం అమ్మ లోనే అందరూ దర్శంచే వారు. అమ్మ పై ఆరాధన ఉన్న వారికోసం హైమాలయం అనసూయేశ్వరాలయాలు ఏర్పడ్డాయి పరిస్తితులకు మించిన గురువులేదు అన్న అమ్మకు గురువులే లేరు. 1958 మాఘ పౌర్ణమి నాడు నల్ల మడ వాగు అనే ఓంకార నదిలో అసంఖ్యాక భక్తులకు అమ్మ దేశి రాజు రాజమ్మ గారి అభ్యర్ధన మేరకు మంత్రోపదేశం చేసి చిరస్మరణీయురాలైంది. 16-2-1981. అమ్మ భర్త, అందరికి "నాన్న గారు" అయిన నాగేశ్వర రావు గారు మరణించారు..5-4-1968 అమ్మ కూతురు హైమ చనిపోగా విగ్రహం చెక్కించి ప్రాణ ప్రతిష్ట చేసి దేవాలయం కట్టించింది. 1973లో అమ్మ యాభై ఏళ్ళ స్వర్ణోత్సవ సమయం లో ఒకే పంక్తిలో లక్ష మందికి భోజనం పెట్టింది అమ్మ. మిగిలిన పదార్ధాలను పశు పక్ష్యాదులకు జల చరాలకు పెట్టించింది. వజ్రోత్సవం నాడు పశువులకు పూజ చేయించింది. అమ్మ ఆరోగ్యం క్రమంగా క్షీణించింది. ఎందరో వైద్యులు అమ్మ ఆరోగ్యాన్ని కాపాడే ప్రయత్నం చేసినా ఫలించలేదు. అమ్మకు భ్రుకుటీ భేదం, సహస్రార భేదం జరిగింది తలనుండి, భ్రుకుటి నుండి రక్తం చిమ్మి త్రుటిలో భస్మం గా మారిపోవటం జరిగి అందరికి ఆశ్చర్యం కలిగించింది. అమ్మ ను "యోగ పరాకాష్ట స్తితి పొందిన జగన్మాత "గా కొమర్రాజు లక్ష్మీ కాంత యోగి, కాంతయ్య యోగి వర్ణించారు. 12-7--1985లో అరవై మూడవ ఏట అమ్మ జగదమ్మలో కలిసి పోయింది. 5-5-1987 అమ్మ కళ్యాణ దినోత్సవం రోజున అమ్మ విగ్రహ ప్రతిష్టాపన జరిగింది

అమ్మను జీవితకాలం లో సందర్శించిన ప్రముఖులలో రఘువర దాసు, ఆత్మానంద స్వామి లక్ష్మణ యతీంద్రులు, నరసింహ యోగి, ప్రభాకర ఉమా మహేశ్వర పండిట్, కుర్తాలం పీఠాధిపతి శివ సదానంద భారతీస్వామి ప్రసాద రాయ కులపతి, కరుణశ్రీ, జటావల్లభుల పురుషోత్తం జమ్మలమడక మాధవ రామ శర్మ, ఎక్కిరాల కృష్ణమాచార్య, పుట్టపర్తి నారాయణాచార్యులు, పళ్ళే పూర్ణ ప్రజ్ఞాచార్యులు, దువ్వూరి వెంకట రమణ శాస్త్రిగారు వంటి వారెందరెందరో ఉన్నారు. ముప్పై కి పైగా తెలుగులోనూ అయిదు ఆంగ్లం లోను అమ్మపై పుస్తకాలను మాతృశ్రీ పబికేషన్స్ ప్రచురించి అమ్మ భావ వ్యాప్తికి దీప్తి కల్గిస్తోంది.

## 19 శ్రీ పరమాచార్య పరమ పద పీయూషం



ఆధునిక జగద్గురువులు, నడయాడే పర బ్రహ్మ స్వరూపం, పరమాచార్యులు, కంచి కామ కోటి పీఠాదిపతులు శ్రీ శ్రీ శ్రీ చంద్ర శేఖర యతీంద్ర స్వామి. కాలి నడకన ఆ సేతు హిమాచల పర్యంతం పర్యటించి దర్శించిన ప్రతి చోటా అనుగ్రహ భాషణం చేసి భక్తులకు సన్మార్గ దర్శనం చేశారు. వారు తమిళ నాడు లో పర్యటించినప్పుడు తమిళం లో చేసిన ప్రసంగాల సారాన్ని "శ్రీ విశాఖ "గారు సరళం గా తెలుగు లోకి అనువదించారు వీటిని సంపుటాలుగా తెనాలి లోని సాధన గ్రంధ మండలి సంస్థాపకులు శ్రీ బులుసు సూర్య ప్రకాశ శాస్త్రి గారుముద్రించి ఆస్తిక జన మనోభిరామం చేశారు. వీటికి శతావధాని వేలూరి శివరామ శాస్త్రి గారు పర్యవేక్షించి నిగ్గు తేల్చారు. ఇందులో పరమాచార్యుల వారి వచో వైభవం, పరమ ప్రామాణికత, వేద వేదాంగాల పై వారికున్న అపార వైదుష్యం, సంగీత సాహిత్య శాస్త్రాది విషయాలపై వారికున్న అనంత పాండిత్యం మనకు దృగ్గోచర మవుతుంది ఇదంతా ఒక అద్భుత జ్ఞాన భాండాగారం. మనం తెలుసుకోదగ్గవీ ఆచరించి తరించేవి. అందులోని కొన్ని ముఖ్య విషయాలను "శ్రీ పరమాచార్య పరమ పద పీయూషం "గా అందజేస్తున్నాను..

పరమాచార్యుల వారి జన్మనక్షత్రం "అనూరాధ ".దాని ఆది దైవతం మిత్రుడు. వృశ్చిక రాశి. అనువాదం చేసిన విశాఖ గారి జన్మ నక్షత్రం విశాఖ. అదీ వృశ్చిక రాశియే వీరికి స్వామి సంపత్తార. స్వామికి వీరు పరమ మిత్ర తార. కనుక వారి అనుగ్రహం పుష్కలం గా వీరికి లభించింది. స్వామి వారికి జ్ఞాపక శక్తి ని కంప్యూటర్ తో పోల్చారు సుమారు ఇరవై ఏడేళ్ళ క్రితం తాము" చిన్న తిప్ప సముద్రం అనే గ్రామం "లో విడిది చేసిన విషయాన్ని రచయిత కు గుర్తు చేశారట. స్వామి తమిళ నాడులోని "తిండీ వనం "గ్రామం లో జన్మించి పదమూడవ ఏటనే సన్యాసం స్వీకరించి కామ కోటి పీఠాన్ని అధిష్టించారు.

శివరామ శాస్త్రి గారికి స్వామి వారి పాండిత్య ప్రకర్ష పై గొప్ప గౌరవముండేది. స్వామి వారి ఉపన్యాసాలపై "పెద్ద కారికలు "రాయవచ్చు అని అనేవారట కాటూరి వెంకటేశ్వర రావు గారు పరమాచార్యుల కు శిష్యులు. స్వామి పై "నమోవాక షష్ట్యన్తాలు "రాసి నివేదించారట. అందులో ఒక పద్యం లో యతి భంగమైనట్లు వేలూరి వారు గమనించి "యతుల పై రాసిన పద్యం లోనే యతి పోతే యెట్లా ?"అని బాధ పడ్డారట. ఒకసారి విశాఖ గారు స్వామి దర్శనానికి తల్లిగారు భార్యతో వెళ్లారు స్వామికి వీరు నమస్కరిస్తుంటే వద్దని వారిన్చారట. "మీ రిద్దరు ముందు మీ తల్లి గారికి నమస్కరించి తర్వాత నాకు నమస్కారం చేయండి "అని హితవు చెప్పారట మాతృదేవో భవ కు ఇది నిరూపణ. స్వామి పరమ శాక్తులు అంబికా తత్వాన్నే ఎక్కువ గా బోధించేవారట.. శ్రీ ఆదిశంకర మార్గం లో నడిచే స్వామి అద్వైతానికి పెద్దపీట వేస్తారు. వారికి సర్వమతాలు సమ్మతాలే. అద్వైతానికి దేనిలోనూ విరోధం కనీ పించని వారి భావన.

ఒక సారి భక్త మీరా బాయి బృందావనం వెళ్ళింది అక్కడ వల్లభాచార్యులున్నారు వారిని దర్శిద్దామని కబురు చేస్తే "నాకు స్త్రీ ని చూసే అలవాటు లేదు "అని బదులు పంపారట. అప్పుడు మీరా "ఈ బృందావనం లో శ్రీ క్రిష్ణుడొక్కడే పురుషుడు. మిగతా వారంతా స్త్రీలే అని అనుకొన్నాను మీకు "నేను పురుషుడిని "అనే భావం ఉంటె బృందావనం నుంచి నిరభ్యంతరం గా వెళ్ళి పొండి"అని ఖరా ఖండి గా చెప్పి పంపింది. అప్పుడు వల్లభులకు జ్ఞానోదయం అయిందట ఈ విషయాన్ని స్వామి "ఆనంద తాండవం "వ్యాసం లో చెప్పారట.

స్వామి వారికి భక్తుడొకడు స్పటికమాలను ఇచ్చారు. అందులో ఒక పగడం "మేరుగు" గా కట్టి ఉంది. అది అక్షమాల అని స్వామి గ్రహించారు. వెంటనే వారి దృష్టి మాఘ కవి రాసిన "మేఘ సందేశ కావ్యం 'మీదకు పోయింది. నారదుడు ఆకాశ మార్గం లో వీణ ను వాయిస్తూ వస్తున్నాడు అయాన్ను మాఘుడు ఇలా వర్ని న్చడట "మాలను తిప్పుతూ ఎప్పుడూ వీణ ను వాయించటం వల్ల యెర్ర బారిన నారదుని బొటన వ్రేలి ఎర్రదనం స్పటిక మాలలోని స్పటికాలను ఎర్రగా ప్రవాళములు గా మార్చేసింది "అన్నాడు అందుకే స్పటిక మాలలో నిజంగా ప్రవాళాన్ని మేరువుగా ఎన్నుకొన్నాడు భక్తుడు అని తెలియ జేశారట అదీ వారి పాండిత్య గరిమ

స్వామి "మనకు కావలసింది అల్లా హృదయం ద్రవించే భక్తి. ఏదో మూట కట్టుకొని ఈలోకానికి వచ్చాం. పాపమూ వద్దు, పుణ్యమూ వద్దు ఈ మూటను ఇక్కడే దులుపుకొని వెళ్లి పోవాలి అందుకే ఆ పరమేశ్వరి లోక మాత దారి చూపే త్రిపుర సుందరి "అని తరచు చెప్పేవారట.

సుమారు తొంభై ఏళ్ళ క్రితం చెట్టినాడు లో వీరప్ప స్వామి అనే ఆయన ఉండేవాడు. మహా భక్తుడే చిత్తశుద్ధి ఉంది కాని కోపిష్టి. ఎప్పుడూ ముక్కు మీదే కోపం. ఆయనకు సుబ్బరామయ్యర్ అనే బ్రాహ్మణ స్నేహితుడు ఉండేవాడు. ఆయన్ను తన కోపం పోవటానికి మార్గం సూచించమని వేడుకొన్నాడు అయ్యర్ "తిరుక్కోయిలూర్ వెళ్ళు. దారి కనపడుతుంది "అని సలహా చెప్పాడు వెంటనే అక్కడికి చేరాడు. అక్కడ మూల విగ్రహానికి ఎదురుగా పరమ కోపిష్టి అయిన దుర్వాస మహర్షి విగ్రహం ఉంది. మహర్షి సేవ చేసి కోపం పోగొట్టుకొన్నారట.వీరప్పస్వామి. ఆలయాన్ని బాగుచేయించాడు దేవాలయం చుట్టూ గ్రుహారామాలు ఏర్పరచి తానొక కుటీరం ఏర్పాటు చేసుకొని ఉన్నాడట. రధం నిర్మించి ఇచ్చాడు. రాధ యాత్రలో బలి ఇవ్వటం సంప్రదాయం వద్దు అని వారించి రధం కదలక పోతే తానే రధచక్రాల క్రింద పడుకొంటాను అన్నాడట ఆంతే నిరాటంకం గా రధ యాత్ర ఏ జంతు బలీ లేకుండా అప్పటి నుంచి సాగిందట.

సమస్త వస్తువులు తమ కాంతిని, శక్తిని, ఆకారాన్ని ఆ సర్వేశ్వరుని మూలం గానే పొందుతున్నామని ఈ జగత్తును చిన్మయం గాభావించి భగవన్మయం గా చూడ గలిగితే దుఖం అనేది ఉండదు దుఃఖ తీరాన భగవత్ప్రేమ వృద్ధి చెందాలి అని పరమాచార్య భాషణం అందరికి శిరో దార్యం.

అప్పయ్య దీక్షితుల వారు గొప్ప శివ భక్తులు ఒక సారి వారికే అనుమానం వచ్చి తనకున్నది భాక్తియా లేక భక్తి అభాసమా అని వితర్కిన్చుకోన్నారట. పరీక్షించుకోవటానికి ఉన్మత్త అవస్థను పొందారు. కావాలనే. ఆ స్తితిలో మన ఆలోచనలు ఎలా ఉంటాయో అదే మన నైసర్గిక గుణం అవుతుంది అని తీర్మానించుకొని మందు తిని పిచ్చి వాడై పోయాడు. తాను పిచ్చితనం లో చెప్పినదంతా రాసి ఉంచమని శిష్యులకు చెప్పారు అప్పుడు దీక్షితుల వారు ఏక ధాటిగా యాభై శ్లోకాలు చెప్పారట. అవి గ్రంధాసస్థమైనాయి వీటికి "ఉన్మత్త పంచశతి "అని పేరు. అందులో ఒక శ్లోక భావం తెలుసు కొందాం "శివా !నీ అనుగ్రహం అంతం లేనిది. సులభం గా లభించే జిల్లేడు పూలు తుమ్మిపూలు భక్తులనుంచి గ్రహించి వారికి మోక్ష సామ్రాజ్య లక్ష్మి నే అనుగ్రహిస్తున్నావు ఇది తెలియక మేము మా కాలాన్ని వృధా చేసుకొంటున్నాం "అని ఈకదను పరమాచార్య ఒక చోట వర్ణించి చెప్పారు.

కామ కోటి పీఠం ఉంది కంచిలో. "కద కంచికి వెళ్ళింది "అనే సామెత మనకు తెలిసిందే అంటె అర్ధం మాత్రం మనకు చాలా మందికి తెలీదు. కంచికి వెళ్లి కామాక్షి అమ్మవారిని కనులారా దర్శించి తే మళ్ళీ ఆ జీవికి జన్మ ఉండదు అంటె మనకద కంచికి చేరింది అన్నమాట. అ మ్మ వారి ప్రభావం అంత గొప్పది అని అర్ధం ఇక్కడి స్వామిఏకామ్రనాధుడు. ఆయనే ఆదిమ పురుషుడు. అమ్మవారు "నయన పీయూషం" గా కన్పించి జన్మ రాహిత్యాన్నిస్తుంది. శ్రీ శంకర భగవత్పాదులు దక్షిణా మూర్తి స్తోత్రం లో "భూమి నీరు నిప్పు, గాలి, ఆకాశం సూర్యుడు, చంద్రుడు, పురుషుడు అనే రూపం లో భవుడు ఉన్నాడని చెప్పారు. ఆ భవుని పత్ని భూమి, సూర్యుడు, వాయువు, ఆకాశము, అగ్ని సోమయాజి, ఉదకం చంద్రుడు అనే అష్టమూర్తుల రూపం ఉన్న ఆదిమ జనని అనితాను ఆ జగజ్జననిని కంపా తీరం లో చూస్తున్నాననిమూక కవి వర్ణించారు వీరిద్దరిని చూస్తె "సౌందర్యం ఆనందాన్ని వివాహం చేసుకొన్నది "అనిపిస్తుంది అంటారు పరమాచార్యుల వారు (.beauty has married bliss )

స్వామివారొక సారి "ఆర్యా వృత్త ములో ఉన్న కావ్యాలను గురించి అడిగారు తమకు తెలిసిన ఆర్యా శతకం ఒక్కదానినే శిష్యులు పేర్కొన్నారు అప్పుడు స్వామి సదాశివ బ్రహ్మేన్ద్రుల వారు రాసిన "ఆత్మవిద్యా విలాసం "అనే వేదాంత గ్రంధం ఆర్యా వృత్తం లోనే రాయబడిందని చెప్పారు ఇంకా ఏమి ఉన్నాయని అడిగితే అందరు నోళ్ళు వెళ్ళ బెట్టారట అప్పుడుపరమా చార్యుల వారు భక్త్యావేశం లో చేతులు పైకెత్తి "అమల కమలధి వాసిని –మనసో వైమల్య దాయిని మనోజ్ఞే –సుందర గాత్రి సుశీలే –తవ చరణంణాంభోరుహం నమామి సదా "అనే శ్లోకం తో ప్రారంభించి 14 శ్లోకాలను ఆర్యా వృత్తం లో ఉన్నవాటిని వినిపించి శ్రోతలను రసోన్ముఖులను చేశారట ఇవి శ్రీ శంకర భగవత్పాదుల "ప్రపంచసారం "లో ఉన్నాయని చెప్పి అందర్నీ సంభ్రమాశ్చర్యం లో ముంచెత్తేశారట.. అదీ వారి దిషాణా, ధారణా జ్ఞాపకశక్తీ. ఇదే వారి పరమ పద పీయూష లహరి.

"పాశ్చాత్త్యులకు మీరిచ్చే సందేశం ఏమిటి""? అని ఒక సారి శ్రీ పరమాచార్యను అడిగితే వారు "మీరు చేసే ఏ పని అయినా సరే దానికి ప్రేమ ముఖ్య కారణం గా ఉండాలి. కార్యం అంటే కర్త, కర్తకు భిన్నమైన ఇతరులూ ఉంటారు. కనుక కార్యం ప్రేమతో నిండి ఉండాలి ఒక్కోసారి ఇతరులను హిమ్సించాల్సి వస్తుంది. యుద్ధాలు చేయాల్సి వస్తుంది. అప్పుడు కూడా మన హృదయం లో ద్వేషం ఉండ రాదు "ఈ కర్మ సంస్కార కారణం గా చేయ బడుతోంది. దీనిలో ద్వేషానికి తావులేదు "అన్న భావం ఉండాలి ప్రేమఓతప్రోతమైతే ఎలాంటి గడ్డు సమస్య అయనా మనం పరిష్కరించగలం. "అని చెప్పారు.

స్వామికి ఉపవాసం ఉండటం చాలా ఇష్టం. చాలా రోజులు నిరాహారం గానే ఉండేవారు లేకపోతే గుప్పెడు పేలాలు పాలు లేక పెరుగు లో నాన బెట్టి స్వీకరించేవారట. ఉపవాసం శరీరానికి మనస్సుకు మంచిదని వారి భావం. పౌర్ణమి అమావాస్య, శుక్ల అష్టమి చతుర్దశి పంచమి షష్టి తిదులు ఉపవాసంకు శ్రేష్టం అని భారతం లో ఉన్నట్లు తరచుగా స్వామి చెప్పేవారు మనం చేసే ప్రతి పనీ ఈశ్వరార్పణ బుద్ధి తో చేయాలని వారి అభిమతం.

స్వామి "కామ కోటి రామ కోటి "అయిందని చమత్కరించేవారట. రామ కోటి రాసిన వారు వచ్చి ఇక్కడ స్వామికి సమర్పించేవారు. అయోధ్యలో పుట్టిన రాముడికి కంచిలోని కామాక్షి అమ్మవారికి ఏమిటి సంబంధం ?అని విచారించి వారు లలితా పరా భట్టారిక శ్రీ త్రిపుర సుందరి అయిన కామాక్షి అని, శ్రీ రామ చంద్ర మూర్తి, కామాక్షీ అమ్మవారూ ఒక్కరేనని అన్నారు. అందుకే రామాయణం లో సీతాదేవి భర్తను "నువ్వు పురుషుడివి కావు స్త్రీవి "అనటం లో ఇంత అంతరార్ధం ఉందని చెప్పారు. అది దెప్పి పొడుపు మాట అయినా యదార్ధమే ఆమె నోటి లో నుంచి బయటకు వచ్చిందని సెలవిచ్చారు.

ఒకసారి "ఆర్ధర్ ఐషన్ బర్గ్ "అనే విదేశీయుడు స్వామి వారిని దర్శించాడు. అతను "నేను జ్ఞానిని అయితే మిమ్మల్ని అడగాల్సిన సరైన ప్రశ్న ఏది ?"అని గడుసుగా అడిగాడు. పరమాచార్య ఎవరైనా ప్రశ్నిస్తే రెండు నిమిషాలు మౌనం లో ఉండి సమాధానం చెప్పటం అలవాటు. స్వామి "మీరు జ్ఞాని అయితే ఏ ప్రశ్నలూ వేయరు "అని బదులు చెప్పారు. అతనితో సుదీర్ఘ సంభాషణ జరిపి చివరికి "మనం చేసే అన్వేషణే ఆనందం, సుఖం. ఒక సుఖం పొందాము అంటే అది సుఖం కాదు. సుఖ స్వరూపం గా ఉండే సుఖం అని అర్ధం చేసుకోవాలి "అన్నారు

అద్వైతాన్ని వివరిస్తూ స్వామి "అద్వైతం అంటే రెండవది లేనిది.. ఈ ప్రపంచం లో ఎన్నో చూస్తుంటాము ఇవన్నీ లేవు అంటే అసంగతం అవుతుంది అప్పుడు మన ప్రయత్నాకి ఫలం ఏమిటి మరి ?ఆకలి దరిద్రం దప్పిక రోగం పోగొట్టుకోవటానికి ఎంతో శ్రమ పడుతున్నాం ఇవి లేని చోటు ఉందా ?ఇవన్నీ దేహ ధర్మాలు. మనం చేసుకొన్నా కర్మ ఫలాన్ని అనుభవించటానికి దేహదారణ చేస్తున్నాం ఆత్మకు ఇవేవీ అంటవుకదా. ఈదేహమే మనం అనే భావన కల్గించి దేవుడు మనల్ని శిక్షిస్తున్నాడు ఈ ద్వంద్వాల పరిధి లో నుంచి బయట పడాలి "దేహనా నాస్తి కించన "అనే భావం ఏర్పడితే కోరికా భయం మొదలైన వేవీ ఉండవు "ఆత్మావా ఇదమేక ఎవాగ్ర ఆసీ నాన్యత్కిమ్చన ""ఏకో దాదారభువనాని విశ్వా"ఏకమేవాద్వితీయం "అని అద్వైతంబోధిస్తోంది మనసును ఆత్మలో ఉంచాలి అద్వైత జ్ఞానం చేతనే వాసనలు నశిస్తాయి ప్రశాంతత ఏర్పడుతుంది పంచ భూతాలు సముత్తితాలైనప్పుడు యోగి శరీరం యోగాగ్ని మయమే అవుతుంది అప్పుడు ముసలితనం,భయం, రోగం, చావు ఉండవు అని శృతి చెప్పింది "అని స్పష్టం చేశారు

ఒక సరి దుర్గా దేవి ప్రతిష్ట సమయం లో స్వామి "దుర్గా పంచరత్న స్తోత్రం "అనే మంత్రాలను రాశారు

పరబ్రహ్మ అని మనం తెలిసో తెలీకో చాలా సార్లు అంటాం ఇంతకూ ఆయన ఎవరు ?అంటతో కూడిన పరమేశ్వరుడే ఆ పరబ్రహ్మ వేరే ఏదీ కాదు అన్నారు స్వామి. ఈశ్వర తత్త్వం సామ్బుడే నంటారు వారు అందుకే శంకర భగవత్పాదులు "దశ శ్లోకి "లో "తస్మిన్ మే హృదయం సుఖేన రమతాం సాంబేపర బ్రహ్మణే "అన్నారు ఈ సాంబ మూర్తి మీద హృదయాన్ని లగ్నం చేస్తే సుఖం గా వర్ధిల్లుతామంటారు స్వామి

"ఆకాశ స్చికురాయతే దశ దిశాభోగో దుకూలాయతే

శీతాం శుహ్ ప్రసవాయతే స్తిర తరానందః స్వరూపయతే

వేదాంతో నిలయాయతే సువినయో యస్య స్వభావాయతే

తస్మిన్ మే హృదయం సుఖేన రమతం సాంబేపరబ్రహ్మణే "

ఒక సారి పరమాచార్యుల వారికి కనకాభి షేకం చేయాలనే తలంపు భక్తులకు కలిగింది ఆ సందర్భం గా వారు "మీరు నాకు పళ్ళూ పుష్పాలు సమర్పిస్తూఉంటారు పద్యాలు రాసి పఠిస్తారు ఇవన్నీ నాకు కనకాభిషేకమే. ఇవన్నీ స్వీకరించటానికి నాకేమి అర్హత ఉంది అని నేను ఎప్పుడూ ఆలోచిస్తాను. ఒకే ఒక కారణం కని పిస్తోంది శ్రీ శంకర భగవత్పాదుల వారి దివ్య నామం ఏదో భాగ్య వశం చేత నాకు లభించి నందు వల్ల అని అనుకొంటాను వారిపేర ఈ సేవలన్నీ నాకు చేస్తున్నారని నా భావన ఇన్ని గౌరవ మర్యాదలు మీ నుండి పొందటానికి ఆ స్వాముల వారి గుణ గణాలను స్మరిస్తాను "

శృతి స్మృతి పురాణానాం ఆలయం కరుణాలయం –నమామి భాగ త్పాదం శంకరం లోక శంకరం "

సర్వ దేవ నమస్కారం కేశవం ప్రతి గచ్చతి అన్నారు కదా మీరు చేసేవన్నీ ఆది శంకరులకే చెందుతాయని నేను బావిస్తున్నాను. వారికే వీటిని నేను మీ తరఫున సమర్పిస్తున్నాను. వీటిని పొందే అర్హత వారికి మాత్రమె ఉంది క.ర్మలన్నీ చేసి "జనార్దనః ప్రీయతాం "అంటాం కదా ఈ కర్మలన్నీ నా సంత్రుప్తికి కాదు ఆ జనార్దనుని సంత్రుప్తికి అని అందులో ఉన్న పరమార్ధం. మాకు కర్మానుష్టానమే విధి. ఈ కర్మలు "పర బ్రహ్మాత్మనా స్తీయతాం "అనే చివరి మెట్టుకు తీసుకొని పోతాయి అందుకే నిత్యం పరమేశ్వరుడినిప్రార్ధించాలి. ఆయన అనుగ్రహం కోరుకోవాలి ఆ శ్రద్ధ మనకు కలిగింది అంటే "బ్రహ్మైవాహం "అనే అనుభవ సిద్ధి కలుగుతుంది. అలాంటి బ్రాహ్మీ స్తితియే కనకాభిషేకం. అంతే కాదు రాత్నాభిషేకమే అవుతుంది "అని గొప్ప సమన్వయము తో ఎరుక పరచారు శ్రీ పరమాచార్యుల వారు అదీ వారి మహోత్రుస్టస్తితి. అదీ వారి పరమ పద పీయూష లహరి

శ్రీ పరమా చార్య ద్రావిడ దేశం లో నే మహాద్భుతశైవ భక్తురాలైన అవ్వయ్యార్ ను మహా గణపతి ని ఉద్దేశించి పరమానంద భరిత కధను "విపరీత మైన అవ్వ –విచిత్ర శిశువు "పేరచెప్పారు. వారిద్దరి మధ్య ఉన్న భక్తీ, ఆరాధనను కళ్ళకుకట్టించారు.. ఆమెను ఊరూరా తిరిగే మనిషిగా ఆయన్ను ఒక చోటి నుండి కదలని బొద్దు ఏనుగు గున్న గా వర్ణించారు.

ద్రావిడ భాషలో "పిళ్ళై "అంటే బిడ్డ. దీనికి శ్రేష్ట వాచకం "యార్ "చేరిస్తే "పిల్లైయార్ అవుతుంది. అంటే "శిశువు గారు "అని అర్ధం. '. ద్రావిడ దేశం లో వినాయకుడిని అదేపేరుతో ముద్దుగా పిలుచుకొంటారు.. ఎప్పుడూ కదలకు కూర్చుని తినే వాణ్ని తమిళులు "నువ్వేమైనా పిల్లైయార్ వా ?"అని ఎద్దేవా చేస్తారట. అంటే రాతి విగ్రహం లా కదలవెం ?"అని భావం. పార్వతీ పరమేశ్వరుల జ్యేష్ట పుత్రుడు కనుక ఆపేరు వచ్చింది అను ను కోవటం తప్పు. "జ్యేష్ట రాజం బ్రహ్మనంబ్రహ్మణస్పతిహ్ "అన్న గణపతిని గూర్చి చెప్పిన వైదిక మంత్రమే దీనికి ఆధారంఅన్నారు స్వామి. భూతాది పతి గణపతి ఆయనకు మించిన నాయకుడు లేడు. అందుకే వి అనే విశేషం చేర్చి వినాయకుడు అన్నారు. "మొక్కు వారి పనుల చక్కజేసేది సామి –గరిక పూల మెచ్చు గబ్బి వేల్పు ".పనులు చేసినా, చెడగొట్టినా ఆయనే. ఈయనే "యం నత్వా కృత కృత్యాస్యుహ్ తం నమామి గజాననం "అని మంచి పనులు ప్రారంభించేటప్పుడు మొక్కు కుంటాం.

ఇంతకీ వినాయకుడి దేహ విభవం చూస్తె నవ్వు పుట్టిస్తుంది కాని అందులో పరమార్ధం ఉంది. ఆయనది ఎనుగుముఖం. ఏనుగుకు దేహ బలం ఎక్కువ. ఎంత బలం ఉన్నా జంతు హింస చేయని సాధు జంతువు. అలానే మన "పిళ్ళారి "అధిక శక్తి వంతుడైనా కావాలని ఎవరికీ అపకారం చేయడు. ఉపకారం అయన నైజం.గణపతి జ్ఞాన స్వరూపుడు. నిర్మల నిర్వికల్ప గునాతీత సాన్ద్రానంద పరబ్రహ్మ స్వరూపమే గణపతి.. ఏనుగు నడకలో రాజసం ఠీవీ ఉన్నాయి. ఆ హొయలు ఇతర జంతువులకు దేనికీ లేదు అందుకే ఏనుగు నడక తో ఆడవారి నడకను పోలుస్తూ గజ గమన అంటారు. తొండం విసరటం చెవుల్ని హఠాత్తుగా రెపరెప లాడించటం, తినటానికేదైనా అందిస్తే అమాంతం లాక్కొని గుటకాయస్వాహా చేయటం దానికే తగింది. ఏనుగును ఎంత సేపు చూసినా తనివి తీరదు. ఏనుగు ముఖం శాంతికి చిహ్నం. దర్శనీయ మృగం ఏనుగు కంటే వేరేదీ లేదని పరమాచార్య నిశ్చితాభిప్రాయం.

మన" పిళ్ళారి" ఏనుగుకు ఏనుగు, బిడ్డకు బిడ్డా అంటారు తమాషాగా స్వామి. శిశువు లాగా సౌరళ్యంఏనుగుకున్న బలం, చురుకుదనం పరమ సుందర మంగళ స్వరూపం జ్ఞానం, ఆనందం, అందం, శాంతి ఒక్క చోట మూర్తీభవించి నట్లు ఉన్న రూపమే వినాయక స్వామి. ఎన్నో విరుద్ధమైన విషయాలు ఒక చోట ఉన్న విచిత్ర మైన స్వామి గణపతి. ఆయన ముఖం మృగ వర్గానికి చెందింది. దేహం మానవ వర్గానికి చెందింది. రూపమేమో శిశువు. నిజానికి ఆయన మ్రుగమూ కాదు మనిషీ కాదు దేవ వర్గానికి చెందినా వాడు. ఒక చేతిలో విరిగిన దంతం, మరో చేతిలో మధుర మైన మోదకం అంటే ఉండ్రాయి. పూర్ణ మైన వస్తువూ అసంపూర్ణ దంతం. "పూర్ణమదః పూర్ణ మిదం –పూర్ణాత్ పూర్ణం "అని ప్రకటించిన పరబ్రహ్మమే వినాయకుడు. ఈ మాట వింటే మనకు ఎంతో "మొదకరం "గా లేదా అంటారు పరమాచార్య.. పిళ్ళారి బ్రహ్మ చారి అయినా అందరికి పెళ్ళిళ్ళు చేస్తాడు ఏనుగు రూపము లో వచ్చి వల్లి అనే ఆటవిక కన్యను తమ్ముడు సుబ్రహ్మణ్య స్వామికి జతచేసి పెళ్లి చేయించిన వాడు అన్న గణపతియే. పెళ్ళికాని పిల్లలు మంచి వరుడిని చూసి పెట్టమై గణపతినే ప్రార్ధిస్తారు. వీరి ఆశలను తీర్చి మోక్షకాముల్ని చేద్దామనే సంకల్పమేమో నంటారు స్వామి.

### కంచి పరమాచార్య దర్శనం తో పులకింత

భారత దేశమంతా పర్య టించి, ఎందరో సాదు సంతులను దర్శించి, తనకు మార్గ దర్శనం చేసే వారెవరో తెలుసుకొనే ప్రయత్నం లో అరుణాచలం లోని రమణ మహర్షిని సందర్శించి శిష్యుడై, ఆ అనుభవాన్ని మనసులో పదిల పరచుకోవటమే కాక తన భారత యాత్ర ను పుస్తక రూపం గా ప్రచురించి పాశ్చాత్యులకు భారత దేశ యోగుల వైశిష్ట్యాన్ని తెలియ జెప్పిన వాడు డాక్టర్ paul brunton.. ఆయన రాసిన పుస్తకం a search in secret India -1934 లో ప్రచురిత మైంది. ఆయన కంచి పరమాచార్య శ్రీ శ్రీ చంద్ర శేఖర స్వాములను కూడా దర్శించి పులకించాడు. అలాగే మౌనమే దీక్ష గా జీవించిన మెహర్ బాబాను, బౌద్ధ మత గురువు దలై లామా ను సందర్శించి వారి ఆధ్యాత్మిక ఉన్నతి ని వర్ణించాడు ఆయన రాసిన పుస్తకం అనేక ముద్రణ లను పొంది దేశ, విదేశాల్లో భారత దేశ ఆధ్యాత్మిక వైభవాన్ని దర్శించే వీలు కలిగింది. ఆ పుస్తకానికి ఇప్పుడు 78 ఏళ్ళు. ఈ పుస్తకాన్ని ముప్పై మూడేళ్ళ వయసు లో రాశాడు. మారు పేరు తో రాసిన పుస్తకం అది.

paul brunton కుమారుడు kenneth thurston hurst తండ్రి అడుగు జాడలో భారత దేశ పర్యటన చేశాడు. తండ్రి జ్ఞాపక గౌరవ ఉపన్యాసాలిచ్చాడు. ఆయన తన తండ్రికి ఇంకా ఇండియా లో ఎంత గౌరవం ఉందొ గ్రహించాడు. తన తండ్రి పాశ్చాత్యులకు యోగా, ధ్యానం లను పరిచయం చేశాడని గుర్తుకు తెచ్చుకొన్నాడు. అరుణాచలం వెళ్ళాడు. మహర్షి అప్పటికే పర లోకం చేరారు. ఆ ఆశ్రమం లో విశాల మైన హాల్ లో కూర్చుని ధ్యానం చేస్తూ మహర్షిని మనసు లో నిలుపు కొన్నాడు. తన తండ్రి నివశించిన చిన్న బంగాళా చూసి ఆనందం పొందాడు. ఎదురు గా ఉన్న అరుణాచలం పర్వతాన్ని దాని గాంభీర్యాన్ని దానికి శ్రీ రమణులకు ఉన్న అవినాభావ సంబంధాన్ని తెలిసి పరవశించాడు. ఆ పరిసరాల పవిత్రత ఆయన మనసు పై గాఢ ముద్ర వేసింది. తన జీవితం ధన్యమైంది అనుకొన్నాడు. జీవితానికి ఈ అనుభవం చాలు అనుకొన్నాడు. మనసంతా ఆ భావనలను నింపుకొన్నాడు.

అరుణాచలం నుండి కంచి చేరాడు. తన తండ్రి సందర్శించి వర్ణించిన కంచి పరమాచార్య శ్రీ శ్రీ చంద్ర శేఖర యతీంద్రుల వారిని సందర్శించాలని మనసు లో భావించి చీటీని పంపించాడు.. అప్పటికి పరమాచార్యుల వారికి 92 ఏళ్ళు. ఒంటరి గా నిత్య తపస్సు తో గడుపుతున్నారు. వీరిని గురించి తన తండ్రి అత్యద్భుత వర్ణన చేశాడు. అదంతా జ్ఞాపకం వచ్చింది. జనం తీర్ధ ప్రజా లాగా వారి సందర్శనం కోసం నిలబడి ఉన్నారు. తనకు దర్శనం లభించే అవకాశాల్లు లేవు అని నిర్ణయించుకొన్నాడు. ఆయన ఆశ్రమం వెనుక భాగాన చిన్న గది లో ఉన్నారు. "నడయాడే దైవం "గా పరమాచార్యుల వారిని భావిస్తారు. కొద్ది నిరీక్షణ తరువాత స్వామి వారు పిలుస్తున్నారు ఒంటరిగా దర్శనం ఇస్తారు అనే కబురు అందింది. వారి సాన్నిధ్యానికి చేరాడు. "బక్క పలుచని శరీరం -కాషాయ వస్త్ర ధారణ, విభూతి తో ఫాలభాగం పరమశివుడు గా కని పించారు. తనను తాను పరిచయం చేసుకొని తాను paul Brunton కుమారుడి ని అని తెలియ జేసుకొన్నాడు. స్వామి వారు "మా కు తెలుసు " అని మాత్రమే అన్నారు. ఇంకో మాట లేదు. మళ్ళీ ఏదో మాట్లాడారు స్వామి. అక్కడ ఉన్న అనువాదకుడు "మీ కోసమే స్వామీజీ ఎదురు చూస్తున్నారు "అన్నాడు. కెన్నెత్ కు అమిత ఆశ్చర్యం వేసింది. తానెవరో ఆయనకు ఎలా తెలిసిందో అర్ధం కాలేదు. తాను వస్తానని ఎలా

తెలిసిందో తన గురించి ఎలా తెలిసిందో మరీ ఆశ్చర్య పరచింది. అప్పుడు ఆయన త్రికాల జ్ఞాని అని అర్ధమైంది. తాను భారత దేశం లో ఉన్నట్లు పరమాచార్యులకు ఎలా తెలిసిందో, ఇంకా అంతు బట్ట లేదు. తాను తనతండ్రి పుస్తకాన్ని పునర్ముద్రించిన కాపీ ని అందజేసి అందులో ఉన్న ముప్ఫై ఎనిమిదేళ్ళ తండ్రి ఫోటో ను చూపించి అది తన తండ్రిది అని తెలియ జేశాడు. మళ్ళీ స్వామి వారి సమాధానం "మాకు తెలుసు "అనే.. తన తండ్రి సందర్శించి నపుడు ఉన్న ప్రపంచ పరిస్తితుల పై ఎన్నో ప్రశ్నలు వేసి స్వామి నుండి సమాధానాలు రాబట్టాలి అనుకొన్నాడు. కాని ఆశ్చర్యం --ఆ ప్రశ్నలన్నీఅకస్మాత్తు గా నోటిలోనే కరిగి. పోయాయి. మనసంతా ప్రశాంతత, ప్రేమ నిండి పోయింది. ఇంక ప్రశ్నలూ లేవు. సమాధానాలు లేవు. గుండె గొంతుక లో కొట్టుకు పోయింది అంతే తనువు, మనసు పులకించి పోయింది. అంతే అమాంతం స్వామి పాదాలకు దగ్గరగా సాష్టాంగ ప్రమాణం చేసి నిలబడ్డాడు. ఆచార్య స్వామి మనస్పూర్తిగా అతన్ని ఆశీర్వ దించారు.. స్వామి వారు నిండు మనసు తో గంధపు దండ ను కెన్నెత్ మెడలో వేసి గౌర వించారు. ఆ సువాసన ఇంకా తనకు తాజా గా నే ఉందని, దాన్ని అప్పటి నుంచి భక్తి తో మెడ లో ధరిస్తున్నానని కెన్నెత్ చెప్పాడు. అలా యాభైయేళ్ళ జీవిత చక్రం ఒక చుట్టు తిరిగింది అని పులకరింత తో ఈ అనుభవాన్ని వర్ణించాడు కెన్నెత్.

# 20 శ్రీ ప్రభాకర ఉమా మహేశ్వర పండితులు

ఆంధ్ర వివేకానందులు, ప్రతి వాద భయంకరులు శ్రీ ప్రభాకర ఉమా మహేశ్వర పండితులు

నాచిన్నతనం నుండే పండితుల వారి గురించి మా నాన్న గారు మామయ్యా ఎప్పుడూ మాట్లాడుకొనే వారు నాకు కొంచెం వయసు వచ్చిన తర్వాత బెజవాడ లో రామకోటి ఉత్సవాలు ఇప్పుడున్న క్షేత్రయ్య కళా క్షేత్రం ఉన్న చోట శివరామకృష్ణ క్షేత్రం లో జరిగేవి. ఒక్కోసారి నెల రోజులు ఉండేవి. రోజు సభలూ సమా వేశాలు ధార్మిక ఉపన్యాసాలు, హరి కధలు భజనలు, అఖండ రామ నామ కీర్తనలు సంగీత కచ్చేరీలు నిర్వహించే వారు. నేను మా మామయ్య గంగయ్య గారు, మా నాన్న గారు మృత్యుంజయ శాస్త్రి గారలతో మా కుటుంబం తో సహా వెళ్ళే వాళ్ళం. అందరికి భోజన సదుపాయాలు ఉండేవి అని జ్ఞాపకం.. మా నాన్న, మామయ్య ల ఉపన్యాసాలు కూడా ఉండేవి. అదుగో అప్పుడు చూశాను పండితుల వారిని. "గంభీర సాగర ఘోష లాంటి వాగ్ధాటి, అందులో వేదం విజ్ఞాన గంగ, ఉపనిషద్ విజ్ఞాన యమునా, పురాణ విజ్ఞాన సరస్వతి,, భగవద్గీతా విజ్ఞాన గోదావరి, పురాణ విజ్ఞాన కృష్ణ వేణీ,కావ్య విజ్ఞాన కావేరీ, సనాతన ధర్మ విజ్ఞాన పినాకినీ మొదలైన నదులన్నీ ఉత్తుంగ తరంగాలై ఎగసి పడేవి. ఆ శైలి శైలూషీ ప్రవాహమే.. ప్రశ్నించే వారి ని సంతృప్తి పరచే విజ్ఞాన సర్వసం. అడ్డం గా మాట్లాడే వారి పాలిట వజ్రాయుధం. ఉపన్యాస చక్రవర్తిగా సనాతన హిందూ ధర్మ పరి రక్షకుడైన, ఆంధ్ర వివేకా నందులుగా స్వర్గీయ ప్రభాకర ఉమా మహేశ్వర పండితులు ఆదర్శ మూర్తి. అనిపించారు మొదటి సారి చూడంగానే. అలాంటి మహోన్నత వ్యక్తి భువిని వదిలి దివిజ కవి వరుల గుండెలు దిగ్గురనగా దివిని చేరారు. అయన రాసిన పుస్తకాలు హాట్ కేకుల్లా అమ్ముడయ్యేవి. చెప్పింది చేసి ఆచరించే సాధనా పరులు. అలాంటి వారిని జాతి మరచి పోతోందేమో నని ఈ మధ్యనే నాకు అని పించింది. ఆయన గురించి ఏదైనా సమాచారం పుస్తక రూపం గా దొరుకుతుందేమో నని ఎదురు చూస్తున్నాను. కొద్ది నెలల క్రితం బెజ వాడ "లెనిన్ సెంటర్ "లో ఉన్న పాత పుస్తకాల షాపుల్లో ఒకటి సాహితీ మిత్రుడైనజనార్దన రావు గారి షాపు వుంది. అక్కడ లభించని పాత గ్రంధమే లేదు. అక్కడే దొరికింది శ్రీ పండితులపైవారి శత జయంతి ఉత్సవ సంరంభం నాడు ఉత్సవకమిటీ గుంటూరు జిల్లా పొన్నూరు నుండి ముద్రించిన పుస్తకం కొని మహా దానంద పడ్డాను. కాని దాన్ని ఈ వారం లోనే చదవ గలిగాను. వారి జీవిత విశేషాలు స్ఫూర్తి దాయకాలు. అందుకనే అందరికి తెలియ జేయాలనే ఉత్సాహం తో దీన్ని రాస్తున్నాను. పండితుల వారికి నా వంతు ఋణం తీర్చుకొంటున్నాను.



## పండితుల వారి జీవిత విశేషాలు

26-11-1890 లో వికృతి నామ సంవత్సర కార్తీక శుద్ధ పూర్ణిమ బుధ వారం వృశ్చిక లగ్నం లో గుంటూరు జిల్లా సత్తెన పల్లి తాలూకా గుడి పూడి గ్రామం లోప్రభాకర ఉమా మహేశ్వరుల వారు జన్మించారు. తండ్రి వెంకట కృష్ణ శాస్త్రి

గారు శ్రౌత, స్మార్తాలలో నిష్ణాతులు., తాత గారు నాగేశ్వర పాకయాజి. ప్రభాకరులకు రామ చంద్ర శర్మ, సూర్య నారాయణ శర్మ తమ్ములు. వీరిది భారద్వాజస గోత్రం

ప్రభాకరులు చిన్నప్పటి నుంచి ఏకాంతం గా శివ ధ్యానం లో గడిపే వారు. గుంటూరు హిందూ హైస్కూల్ లో (ఆ నాటి పేరు టౌన్ హైస్కూల్ )ఫస్ట్ ఫారం లో చేరారు. పుంభావ సరస్వతి, ఆంధ్ర ఆస్థాన తొలి కవి శ్రీ కాశీ కృష్ణా చార్యుల సంస్కృత గురువులు. ఒక రోజు స్కూల్ మైదానం లో ఉన్నావ లక్ష్మీ నారాయణ పంతులుగారి ఉపన్యాసం విన్నారు స్వరాజ్యం కోసం అందరూ కలిసి రావాలనే వారి బోధ పండితుల వారి గుండెల్ని సూటిగా తాకింది. స్వదేశీ భావన మనసంతా నిండింది. కాలేజి లో చదవటానికి ఇష్ట పడక ఇంగ్లీష్ నేర్వ రాదనీ చదువే మానేశారు.

స్వగ్రామం గుడిపూడిలో విదేశీయులు డేరాలు వేసి క్రైస్తవ ప్రచారం చేయటం చూసి "హిందూ ధర్మ ప్రచారం "చేయాలని నిశ్చయించుకొన్నారు. అప్పుడే వివేకానందుల చికాగో ఉపన్యాసాలు చదివి స్ఫూర్తి పొందారు. హిందూ ధర్మ ప్రచారమే తన జీవిత ఆదర్శం గా భావించి కృత నిశ్చయం తో జీవితాంతం కొన సాగించిన ధర్మ పరిరక్షకులు. దీనికి వేదం వేదాంగాలను చదివి అర్ధం చేసుకోవాలి. వెంటనే కనుపర్తి కోటేశ్వర శాస్త్రి గారి వద్ద శిష్యరికం చేసి, హయగ్రీవ ఉపాసకులై ప్రియ శిష్యులై అన్నీ నేర్చి "అపర శంకరులు "అని గురువు గారిచేత అనిపించుకొన్న మేధావి. బెల్లం కొండ రామ రాయ కవి వద్ద సంస్కృత, సాహిత్యం, తర్కం,

వ్యాకరణం, వేదాంతం, అనేక శాస్త్రాలను చదివి ఔపోసన పట్టారు. వివిధ శాస్త్ర పరిచయం తో ధర్మ రహస్యాలన్నీ ఆకళింపు చేసుకో గలిగారు. గురువులకు తగిన శిష్యులయ్యారు. "ప్రతిభా ప్రభాకరు"లయ్యారు. అకుంఠిత దీక్ష, సాధన, నిస్స్వార్ధత, త్యాగం, దేశ భక్తీ కి వీరు నిలువెత్తు దర్పణం.

"స్వ ధర్మ ప్రతి పాదిక పై స్వరాజ్య పాలన "అనే ప్రత్యేక నినాదం తో మేఘ గంభీర స్వనం తో, ఉపన్యాసాలతో దేశాన్ని ఉర్రూత లూగించారు. ఆయన ధోరణి అనితర సాధ్యం. అన్యమత ఖండనం లో అరివీర భయంకరులు. నిరంకుశం గానే ఈవిషయం లో వ్యవహరించేవారు. "సనాతన ధర్మ మంత్రం "ను పండితుల వారు జపించి నన్ని సార్లు మన రాష్ట్రం లో వేరెవ్వరూ జపించాలేదంటే పండితుల వారి ప్రత్యేకత ఏమిటో తెలుస్తుంది.. శాస్త్ర విజ్ఞానాని, తత్వ విజ్ఞానానికి, మతానికి హేతు వాదానికి, ప్రాక్ పశ్చిమ సంస్కృతీ సభ్యతల మధ్య, గతానికి, వార్త మానానికి మధ్య సమన్వయాన్ని సాధించిన మహా వ్యక్తీ. సనాతన ధర్మం లోని మానవతా వాదాన్ని, శాస్త్రీయ దృక్పధాన్ని, విశ్వ జనీనతను సింహ గర్జనం తో ధ్వనింప జేశారు. క్షాత్ర వీర్యం తో బ్రహ్మ తేజాన్ని మేళ వించి భారతీయులు పురోగమించాలని ఉద్బోధించారు.

భారత భూమి వేదభూమి, తపో భూమి, జ్ఞాన భూమి, త్యాగ భూమి, పుణ్య భూమి,.యోగ భూమి అని పదే పదే గుర్తు చేసే వారు. రోమన్, గ్రీక్ ఈజిప్ట్, జోరాస్ట్రియన్ మొదలైన నాగరకత లన్నీ కొద్ది పాటి ఉపద్రవాలకే తట్టుకోలేక కాల

గర్భం లో కలిసి పోయాయని చెప్పేవారు. కాని ఇరానియన్లు, గ్రీకులు శిదియన్లు, కుషానులు ఆంగ్లేయాది ఇతర దేశీయులెందరోభారత దేశం పై దురాక్రమణ చేసి వశ పరచుకొని వెయ్యి ఏళ్ళు ఇబ్బందులు పెట్టినా మన సంస్కృతీ గంగ అవిచ్చిన్నం గా పురోగమిస్తూనే ఉంది. వీటి నన్నిటిని తన లో లయింప జేసుకోంది కూడా అంటారు. ఇలాంటి విలక్షణ విశిష్ట సంస్కృతికి మనం వారసులం అని గుర్తు చేస్తారు."నేను హిందువును. నా ధర్మం సనాతన ధర్మం. నా దేశం భారత దేశం "అని ప్రతి హిందువు ఎలుగెత్తి చాటాలని పండితుల వారు ఉద్బోధించేవారు. ఆధ్యాత్మిక చింతన, ధార్మిక జీవనం వల్లనే పర పీడన నుంచి విముక్తి లభిస్తుందని అనే వారు. హిందువు మనసా వాచా, కర్మణా హిందువుగా జీవించాలిఅని వారి ప్రబోధం. హిందూ మతం లో ఉన్న విభిన్నత, శ్రుతి స్మృతి, పురాణాల లోని పరస్పర విరుద్ధ విషయాలు మన వాళ్లకు అర్ధం కాక పోవటం వల్ల ఇతరులు వేసే ప్రశ్నలకు దీటైన సమాధానాలు చెప్పలేక పోవటం వల్ల ఇబ్బంది ఏర్పడిందని భావించారు. సహేతుకం గా, అనుభవ పూర్వకం గా సమన్వయించి చెప్పగల శక్తి ఉన్న పండితులు లేక పోవటమే ఈ దుస్తితికి కారణం గా భావించి ఈ పవిత్ర జ్ఞాన యజ్ఞం కోసం జీవితాన్ని అర్పించిన త్యాగమూర్తి ప్రభాకర పండితులు. ఆ నాడు మన రాష్ట్రం లో వీరు తప్ప వేరెవ్వరూ లేరనటం నూటికి వెయ్యి శాతం యదార్ధం

### ప్రభాకర వాక్ మహేంద్ర జాలం

ఇరవై ఏళ్ళ వయస్సులో ఆర్ష విజ్ఞాన ప్రచారోద్యమానికి శ్రీ కారం చుట్టారు ప్రభాకర ఉమా మహేశ్వర పండితులు. ఆయనది దైవ వాణి గా భావించారు. ప్రజల మనసులో అమృత ధారల్ని వర్షించింది.

ఆజాను బాహువులు, వైదిక వర్చస్సీ, గంభీర ముఖ కవలిక లతో భాసించేవారు. కనులలో కార్య దీక్ష కనిపించేది. జాతీయ వేష దారణ తో ధీరోదాత్తం గా చూపరులను ఆకర్షించే వారు. దివ్యర్షి సమానం గా ఆరాధించే వారు. మారు మూల ప్రాంతాలలో ఉపన్యాసాలను ప్రారంభించి పట్నాలకు తమ వాగమృతాన్ని వ్యాపింప జేశారు.. ప్రజలను దేశ భక్తి ప్రపూరితులుగా, ధర్మావలంబకులుగా తీర్చి దిద్దే ఉపన్యాస ధారల తో పరవశింప జేసే వారు. గంగా యమునా సరస్వతీ సంగమ స్థానం నం గా వారి వాక్కు ధ్వనించేది. గుంటూరు మండలం లో ఉపన్యాసాలను మొదట ప్రారంభించి, కృష్ణ దాటి, గోదావరి ప్రాంతం చేరి, రాజ మండ్రి లో నెలకు పైగా ఉపన్యసించి నాస్తికులనే కాక ఇతర మతస్తులనూ ఆకర్షించిన నేర్పు పండితుల వారిది.

జనా కర్షణ, తెలీని మత్తు వారి ప్రసంగాలలో ద్యోతక మయ్యేది. వేదం ప్రాశస్త్యాన్ని గురించి చెప్పినా, పురాణ వివరణ చేసినా, దేవతల కధల్లో ఉన్న దేవ రహస్యాలు వివరించినా, కుల భేదాలను పరిష్కరించే మార్గాలనేలా చెబుతారో, అస్పృశ్యత ను గురించి, శాస్త్రీయ దృక్పధాన్ని ఎలా ఆవిష్కరిస్తారో అని కళా శాల విద్యార్ధులు, డాక్టర్లు, న్యాయ వాదులు, న్యాయాధిపతులు, ఉద్యోగులు, సామాన్యులు ముఖ్యం గా మహిళలు విశేషం గా హాజరై అతి ఆసక్తి గా వినే వారు. సమయ పాలన పాటించటం లో వారికే సాటి. సమయానికి ముందే సభకు వచ్చే వారు ప్రజలు మైమరచి తన్మయత్వం తో వినే వారు వారి ప్రసంగం కనీసం రెండున్నర గంటల వరకు ఉండేది. ఇందులో వేదోపనిషత్తులు, భగవద్గీత, పురాణ గాధలు శ్లోకాలు కావ్య పద్యాలు ఉదాహరణలు, గంభీర గర్జనలు, విదేశీ మతాలపై వాక్ శస్త్రాలు నాస్తికులకు సవాళ్లు, ఛలోక్తులు తో ఒక శబ్ద మహేంద్ర జాలం గా భాసించేది.

ధార్మిక ఉపన్యాసాలకు వేలాది ప్రజలు ఆకర్షణ గా రావటం పండితుల వారితోనే ప్రారంభ మైంది. పల్లెలు, పట్టణాల నుండి బండ్లు కట్టుకొని వచ్చి వినే వారు. రైల్ పెట్టెల మీద, బస్ టాపులపైనా కూర్చుని చేరుకొనే వారు.ఎందరో వాలంటీర్ల అవసరం అయ్యేది. విజయ వాడ లో శ్రీ శివ రామ కృష్ణ క్షేత్రం లో నిర్వ హింప బడ్డ కార్య క్రమాలు న భూతో న భవిష్యతి గా జరిగేవి. పండితుల ప్రసంగం లేకుండా ఏ సభా జరగ లేదు. వారి ఉపన్యాసం లేక పోతే జనం క్షేత్రానికి చందాలుఇచ్చే వారు కాదు విరాళాలు ఇచ్చే వారూ కాదు. అంత క్రేజ్ ఉన్న ఉపన్యాసకిశోరం ప్రభాకరులు. ఇంతటి స్తాయిని ధార్మిక ప్రసంగాలకు తెచ్చిన ఘనత వారిదే.

దేశ హితం కోసం, సనాతన ధర్మ ప్రచారం కోసం వారి కృషి అమూల్యమైనది. పర మతం స్వీకరించిన హిందువులు వీరి ప్రభావం తో మళ్ళీ స్వమతం లోకి ప్రవేశించారు. దీనికి ఇబ్బంది పడ్డ గుంటూరు క్రైస్తవ బిషప్పులు పండితుల వారి పై గుంటూరు కోర్టు లో కేసు వేశారు. దేశ భక్త కొండా వెంకటప్పయ్య, ఉన్నావ లక్ష్మీ నారాయణ, నడింపల్లి నరసింహా రావు, గోవింద రాజుల శ్రీని వాస రావు, ఏకా లక్ష్మీ నరసింహం, మొదలైన ఉద్దండులైన న్యాయ వాదులు పండితుల వారి

పక్షాన ప్రతి వాదనలు చేసి జడ్జి గారిని మెప్పించారు. న్యాయ మూర్తి బిషప్పులదేదోషం అని తీర్పు నిచ్చారు ఇలా పండితుల వారు న్యాయ పోరాటం లోను విజయం సాధించారు.

## ప్రభాకర సనాతన ధర్మ ప్రసంగ జైత్ర యాత్ర

కృష్ణా, గుంటూరు, గోదావరి జిల్లాలో సనాతన ధర్మ ప్రసంగ జైత్రయాత్రను పూర్తిగావించు కొన్న ప్రభాకరులు సామర్ల కోట కాకినాడ, పిఠాపురం, తుని, అనకాపల్లి, విశాఖ పట్నం, విజయ నగరం, శ్రీ కాకుళం, బరంపురం మొదలైన పట్నాలలో ప్రజల్లో ధార్మిక మహా చైతన్యాన్ని కల్గించారు. ఆ తర్వాత చిత్తూర్, జిల్లాలో పర్యటన చేశారు. ఆ రోజుల్లో అమా వాస్య రోజు సెలవు ఉండేది ఆ రోజు అందరు సోదర మైత్రీ భావం తో మెలగాలని పండితుల వారు "అమా వాస్య భజన" అనే ప్రత్యేక కార్యక్రమం చే బట్టారు. ఇది ప్రజల్లో గొప్ప చైతన్యం కల్గించింది..

కంచి పరమాచార్య శ్రీ చంద్ర శేఖర యతీంద్రుల వారు పండితులను ఆశీర్వదించారు. ప్రజలు మేళ తాళాలతో ఊరేగించారు తిరుపతి లో లక్షలాది ప్రజలు వీరి ఉపన్యాసాల విన్నారు. ఇదిప్రభుత్వం గమనించి అరెస్ట్ చేసి మద్రాస్ కు పంపింది. అక్కడ కాశీ నాధుని నాగేశ్వర రావు పంతులుగారు పండితుల వారికి స్వాగతం పలికి ఉద్యమాన్ని బల పరిచారు. చిత్తూరు జిల్లాలో ప్రసంగించాకుండా బ్రిటిష్ ప్రభుత్వం నిషేధించింది. హిందూపురం, మద్రాస్ బెంగుళూరు పట్నాలలో తమ ప్రసంగాలను కోన సాగించారు.

నిజాం రాష్ట్రం లో సికిందరాబాద్ లో "సదాచార నిబందనీ పరిషత్ "ను పండితుల వారు స్థాపించారు "హిందూ గ్రంధ మాల "పేరిట ఎన్నో గ్రంధాలు ప్రచురించారు నలభై ఏళ్ళ పాటు నిజాం రాష్ట్రంలో ధర్మ ప్రచార సభా జైత్య యాత్ర చేశారు. తరువాత విజయ వాడకు వచ్చి అక్కడే స్థిర నివాసం ఉన్నారు. తన యావత్ శక్తి యుక్తుల్ని హైందవ వ్యతిరేక ప్రచారాన్ని వమ్ము చేయటానికి ఉపయోగించిన మహా మనీషి ప్రభాకరులు. క్రైస్తవులు సంధించే అనేక ప్రశ్నలకు దీటైన సమాధానం చెప్పి నిరుత్తరుల్ని చేసే వారు

సాధారణం గా మిత భాషి అయిన పండితుల వారు వేదిక ఎక్కగానే మహోధృత రూపం లో ప్రసంగం చేసే వారు. సహజ సాత్వికులు ఆయన ఆహారమూ సాత్వికాహారమే. పాలు గోధుమ రొట్టెలు మాత్రమె తీసుకొనే వారు ఇంతకు మించి పేటినీ తినే వరుకారు. ప్రతి రోజు తలంటి పోసుకొనే వారు. ప్రాణాయామం చేసే వారు గాయత్రీ మహా మంత్రం జపం దీక్షగా చేసే వారు. చాలా తక్కువా సమయమే నిద్రపోయేవారు. ఇంత క్రంశిక్షంతో ఉండబట్టే 92సంవత్సరాలు పూర్ణాయుస్సుతో జీవించారు. రోజుకు కనీసం 18గంటలు పని చేసే వారు. సర్వ స్వతంత్ర జీవులు. రామాయణ మహాభారత భాగవత సారాన్ని జన సామాన్యానికి అందించటానికి "హిందూ మతం "అనే పేర రెండు వేల పేజీల మహా గ్రంధాన్ని రచించారు. అయన శతాధిక గ్రంధ కర్త కూడా.

దక్షిణ భారత జైత్ర యాత్ర సంతృప్తిగా ముగించుకొని ఉత్తర దేశ యాత్ర చేశారు. 1964 మే నెలలో పండితుల వారు తన బృందం తో ఉత్తర భారతం చేరారు. స్వర్గంగా ప్రవాహ సదృశమైన పండితుల వారి వాణి ఉత్తర దేశీయులనూ విశేషం గా ఆకర్షించింది. కాశీ పండితులను కూడా సంభ్రమాశ్చర్యాలతో వారి ఉపన్యాసాలనువిని కీర్తించారు కలకత్తా, గయా, కాశీ, అలహా బాద్, హరిద్వార్, రుషీ కేష్, బదరి, ఆగ్రా, అయోధ్య, మధుర, డిల్లీ, బొంబే, పూనా, అహమదా బాద్, కాన్పూర్ మొదలైన పట్నాలలో ప్రసంగ జైత్రయాత్ర దిగ్విజయం గా నిర్వహించారు. వారి ధర్మ పత్ని, కుమారుడు ప్రభాకర శ్రీ కృష్ణ భగవాన్, ఉప్పులూరి మల్లికార్జున శర్మ, వెంప్ర ప్రగడ రాధాకృష్ణ శర్మ మున్నగు వారు పండితుల వారి బృందం లో ఉన్నారు

భగవాన్ సత్య సాయి బాబా పండితుల వారిని రప్పించి సన్మానించి ఆశీర్వదించారు. తమతో బాటు బాబా పండితుల వారిని ఆంధ్ర దేశ పర్యటన లో వెంట తీసుకు వెళ్ళే వారు. అంతటి అభిమానం ప్రభాకరులంటే బాబాకు.

## ప్రభాకర సన్మాన సంరంభం

1953 లో మద్రాస్ లో విక్టోరియా హాల్ లో టులుసు సాంబ మూర్తి గారి అధ్యక్షతన పది హేను రోజులు పండితుల వారి ధార్మిక ప్రసంగ ధారా సాగింది. చివరిరోజు ఘనం గా సత్కరించారు "దేవా రహస్యం "అనే వారి పుస్తకం అక్కడే ఆవిష్కరించారు "సువర్ణ ఘంటా కంకణ "సత్కారం జరిపి ఆ పుంభావ సరస్వతికి ఘన నీరాజనాలు పలికారు.

1953 లో బెంగుళూర్ లో "విశ్వేశ్వర పురం "లో పండితుల వారి ప్రసంగాలను మూడు నెలల పాటు నిర్వహించారు. "హిందూ మతం "అనే పండితుల వారి ఉద్గ్రంధం ఇక్కడే ఆవిష్కృత మైంది.

1956 లో జరిపిన ఉత్తరాంధ్ర పట్నాలపర్యటనలో "ఆర్యులు విదేశాల నుండి ఈ దేశానికి రాలేదు ","వేదములు మనవ రచితములుకావు ","హిందూ దేవతలు వ్యభిచారులు కారు ",స్వర్గ నరకములున్నవి ","దశావతారముల లోని పరిణామ రహస్యం ","కర్మ కాన్డలకాం డలలోని వైశిష్ట్యం ","వివాహ రహస్యం ","కృష్ణావతార రహస్యం ","గీతా సారం "మొదలైన విషయాలపై అద్భుత ప్రసంగాలు చేసి ఆస్తిక జన హృదయాల్లో భక్తీ బీజాలు నాటి, మన వారసత్వసంపద పై గొప్ప అవగాహన కలిగించారు. అందరికి ఉన్న సహజ సందేహాలకుజవాబులుగా ఈ ప్రసంగాలు ఏంతో దోహదం చేశాయి.ఈ సందర్భం లో పండితుల వారిని అపూర్వం గా సత్సత్కరించి గౌరవాదరాభిమలు చూపి కృతజ్ఞతలు ప్రకటించుకొన్నారు.

ఉత్తర దక్షిణ దేశాల్లో అపూర్వ జైత్రయాత్ర దిగ్విజయం గా ముగించుకొన్న ప్రభాకరులు 1965 లో నెల రోజులువిజయ వాడ లో ఆంధ్ర ప్రభ సంపాదకులు నీలం రాజు వెంకట శేషయ్య గారి సమక్షం లో ప్రారంభించి సంపూర్తి చేశారు. డాక్టర్ టి.వి.ఎస్.చల పతిరావు, అధ్యక్షతన కార్య నిర్వాహక సంఘం ఏర్పడి శ్రోతలకు మహా గొప్ప ఏర్పాట్లు చేశింది. గుంటూరు కలెక్టర్ అధ్యక్షతన శతావధాని పళ్ళే పూర్ణ ప్రజ్ఞా చార్యులు, అనేక కవి, పండితులసమక్షం లో మధ్య అశేష జన వాహిని కర తాల ధ్వనుల మధ్యశాస్త్రోక్తం గా "కనకాభి షేకం "అమోఘం గా చేసి భక్తి ప్రపత్తులు చాటుకొన్నారు

.1966 లో చీరాలలో పండితుల వారి ధర్మోపన్యాసాలు నెల రోజులు చేటట్టారు ఆబాల గోపాలాన్ని పండితుల వారు ఆనందాబ్ధి లో ముంచి తేల్చారు మున్సిపల్ చైర్మన్ గారి ఆధ్వర్యం లో "పుష్ప కిరీటం "సమర్పించి సహృదయ సుగంధాన్ని వెలయించారు పుర ప్రముఖులు. పట్టు వస్త్రాలతో జ్ఞాపిక లతో ఘన సన్మానం చేశారు వారి గ్రంధ ముద్రణకు నిధిని విరాళం గా సమర్పించారు..

బాపట్లలో శ్రీ భావనారయణ స్వామి వారి దేవాలయం లో వీరు ధర్మ శంఖారావం 1966 జూన్ లోపూరించారు. ప్రభాకర దంపతులను జిల్లెల్ల మూడి అమ్మ అనసూయా దేవి గారి సమక్షము లో ఎంతో చారిత్రాత్మకం గా "గండ పెండేరం "తొడిగి పట్టువస్త్రాలు సమర్పించి సన్మానించారు గ్రంధ ముద్రణకు నిధిని సమకూర్చారు,

1957 మే లో హైదరాబాద్, సికందరా బాద్ నగరాలలో పండితుల వారి నెల రోజుల పాటు ధార్మిక ప్రసంగాలు చేశారు. జంట నగరాల లోని అన్ని ముఖ్య దేవాలయాలలో, ఆధ్యాత్మిక సంస్థలలో వారు ఉపన్యసించారు ముఖ్య మంత్రి కాసు బ్రహ్మా నంద రెడ్డి గారు పండితుల వారికి "కిరీటం "తొడిగి ఘన సత్కారం చేశారు.

1968 జూన్ లో విజయ వాడ కొత్త గుళ్ళలో నెల రోజులు సనాతన దార్మాన్ని గురించి ఉపన్యసించారు. దేవాదాయ శాఖ మంత్రి రుద్ర రాజు రామ లింగ రాజు అధ్యక్షతన 'సామ్రాజ్యాపట్టాభి షేకమహోపంన్యాస సన్మానం "ను వైభవో పేతం గా ని ర్వ హించారు. శాసన సభ్యులు చలపతి రావు గారు, మంత్రి గారు ప్రభాకరుల ఆస్తిక సేవలనుబహుదా ప్రస్తుతించారు.

1981 లో తిరుమల తిరుపతి దేవస్తానం వారు" ఆస్తాన పండితుని" గా పండితుల వారిని నియమించి అపూర్వ గౌరవం కలిగించారు పెజావర్ స్వామి ప్రభాకరులకు 'స్వర్ణ తకం ",అందజేస్తే చిన జీయర్ స్వామి పట్టువస్త్రాలతో ఆశీర్వ దించారు. కార్య నిర్వహణ అధికారి పి.వి.ఆర్.కే. ప్రసాద్ "పండితుల వారి జీవితం ఒక మాహోద్యమం, వారే ఒక మహా సంస్థ "అని కీర్తించారు. ప్రభాకరుల 75వ ఏట వారి ధార్మిక సేవకు ఏడుకొండల వాడైన "శ్రీ వారి ఆస్తాన పండిత "హోదా అరుదైన గుర్తింపుగా లభించి చిర స్తాయిగా నిలిచి పోయింది

## ప్రభాకర ప్రతిభా భారతి

ప్రభాకరులు రాసిన "భారతీయ సంస్కృతీ "లో భారతి అనే మాటకున్న అర్ధాన్ని విపులం గా వివరించారు. ఆత్మ ను ఉద్ధరించేదే భారతీయ సంస్కృతీ అని, భావం. రసం శరీరం చేత పవిత్రమై వేలుస్తోందని అన్నారు భావం అనేది మానసిక సంబంధం, రసం కావ్య సంబంధం, శరీరం దేహ సంబంధం, అంటే మనో, వాక్ కాయములు సామ్య స్తితిని పొంది భారత అనే అక్షరాత్మ గా ఏర్పడిందని వివరణ ఇచ్చారు.

ఆది కాలం లో మన దేశాన్ని "అజనాభం "అనే పేరు తో పిలిచే వారని, అజుడు అంటే బ్రహ్మ కనుక ఆయన సృష్టికి ఈ దేశం నాభి స్తానం గా ఉంది కనుక అజ నాభం అనే పేరు మన దేశానికి ప్రసిద్ధమయిందని చెప్పారు.

మన దేశాన్ని మొదట పాలించింది స్వాయం భువ మను చక్ర వర్తి.అతనికి ప్రియ వ్రతుడు, ప్రియ వ్రతుడు, అగ్నీధ్రుడు,పుత్రులు అగ్నీధ్రు నికి నాభి నాభికి, ఋషభుడు, అతనికి భరతుడు జన్మించారు. భరతుడు పాలించిన కాలం లో అజనాభం పేరు భారత దేశం గా మారి పేరొందింది.

భారతీయులు ఆర్యులని, హిందువులు అనీ వ్యవహరింప బడుతారు. ఆర్ష ధర్మాన్ని అనుసరించే వారు ఆర్యులు. వారి ధర్మం ఆర్ష ధర్మమ ని ఆర్య ధర్మమని పిలువ బడుతోంది. "ఆరాత్ యాంతీతి ఆర్యః "అంటే దగ్గర మార్గాన కానీ, దూర మార్గాన కాని భగవంతుని చేర గల వారే ఆర్యులు అని అర్ధం చెప్పారు పండితుల వారు.

భారతీయ వాజ్మయం లో "హిందూ "పదానికి ఉన్న పవిత్రతను రెండు వందల పేజీలలో "హిందూ మతం "అనే పుస్తకం లో వివరించారు.

"హీనంచ దూష యత్యేవ హిందూ రిచ్యతే ప్రియే "హీన మైన తుచ్చమైన విషయాలను ప్రేమించకుండా సర్వోత్కృస్త తత్వాన్ని, అభి లషించే వాడు హిందువు "అని "మేరు తంత్రం "అనే గ్రంధం లో పరమేశ్వరుడు పార్వతీ దేవికి వివరించి నట్లు తెలుస్తోంది. "శబ్ద కల్పద్రుమం "అనే నిఘంటువులో "హీనం దూష యతీతి హిన్దుహ "అంటే హీనమైన దాన్ని దూషించే వాడు హిందువు అని చక్కగా వివరింప బడింది అని ప్రభాకరులు చెప్పారు.

"అధ గచ్చేత్ రాజేంద్ర దేవికాం లోక విశ్రుతాం –ప్రసూధిహ యత్ర విప్రాణాం శ్రూయతే భరతర్షభ "అని భారతం లోని తీర్ధ యాత్రా పర్వం లో హిందువుల మూల పురుషులు హిమాలయ పర్వత ప్రాంతం లోని "పవిత్ర దేవికా నదీ "తీరం లో జన్మించారని "ధర్మ రాజ్యం "అనే గ్రంధం లో పండితుల వారి వాక్కు.

"రుణాని త్రీణ్య.పకృత్య మనో మో క్షే నివేశ యేత్"-రుషి ఋణం పితృ ఋణం దేవతా ఋణం అనే మూడు రుణాలను తీరిస్తే కాని ముక్తికి ప్రయత్నించ రాదు అని భారతీయ సిద్ధాంతం. బ్రహ్మ చర్య, చేస్తూ వేదం శాస్త్ర పురాణాల రహస్యం తెలుసుకొంటే రుషి ఋణం నుంచి, మంచి సంతానాన్ని పొంది పితృ రుణాన్ని, యజ్న యాగాది క్రతువులు చేస్తే దేవతా రుణాన్ని తీర్చుకో వచ్చు. ఈ మూడు రుణాలు తీర్చుకుంటే ముక్తికి అర్హత లభిస్తుంది. అని "ధర్మ రాజ్యం "లో వివరించారు.

దేవతలు వారి తత్వాల గురించి ఎన్నో అఆసక్తి కరమైన విశేషాలు వివ రించారు. "అస్వప్న య స్తరనయః ఆశ్రమిష "అని వేదం చెప్పింది. దేవతలు నిదుర లేని వారు సదా యువకులు. శ్రమ తెలియని వారు.

"విద్వాం నో హ వై దేవః "అంటే దేవతలందరూ విద్వాంసులు. "పరోక్ష ప్రియా ఇవహి దేవః "దేవతలు పరోక్ష ప్రియులు. నిరాకార, సాకార రూపాలలో దేవతలుంటారు. దేవతలా తత్త్వం అంతరార్ధ బాహ్యార్ధాలతో ఉంటాయి. ఒకే నటుడు అనేక వేషాలు వేసి నట్లు పరమాత్మ కూడా గుణ కర్మలను స్వీకరించిలీలా విలాసం ప్రదర్శిస్తాడు. అధర్వ వేదం లో దేవతలు ఎముకలు లేని వారని, అందువల్లే చర్మం, మాంసం నెత్తురు ఉండవని పాప రహితులని వాయు బలం తో పరిశుద్ధ చరిత్ర కల వారని, శుచి మంతులని చెప్పబడిందని వివరిస్తారు "

"అవస్థాహప్వాతాప్వవనేన శుద్ధాఃశుచయః –శుచి మపి యంతి లోకం నైషాం శిశ్నం ప్రదహతి

జాత వేదాఃస్వర్గే లోకే ఋహు స్త్రైణమేషాం"ఇదీ పై దానికి శ్లోకం.

"ఆప్య తైజస వాయవ్యాని లోకాంతరేశరీరాణి "అంటే దేవతా శరీరాలు కంటి మయాలు, తెజోమయాలు, జల స్వరూపాలు మానవులకున్న ఆకలి దాహం కామాగ్ని దేవతలకు లేవు వారి శరీరం అన్నమయ, శుక్ల, షోణిత సంబంధం లేనివి కనుక కామ లోలురు కారు. దేవా చరిత్రలలో అంతరార్ధం ఉంటుంది అది విడ మార్చ గలగాలి. పంతుల గారి గ్రంధాలన్నీ సరస్వతీ శుక్తి ముక్తా ఫలాలే.

### ప్రభాకరాస్తమయం

హిందూ గ్రంధ మాల, భారతీయ ధర్మ ప్రచారక మిషన్, శ్రీ ప్రభాకర ఉమా మహేశ్వర పండిట్ ట్రస్ట్"ధర్మ సంస్తాన్, మొదలైన వాటిని నిర్వహించి ఆధ్యాత్మిక పత్రికా వ్యవస్థాపకులుగా వ్యవహరించి, "విశ్వ హిందూ పరిషత్ "ప్రారంభ దశలో ఆంధ్ర ప్రదేశ్ కు ఉపాధ్యక్షులుగా పని చేసి, "సదా చార నిబంధినీ పరిషత్ "అధ్యక్షులై,శ్రీ ప్రభాకరులు చేసిన సేవ చిరస్మరణీయం. గజారోహణాది మహా సత్కారాలు పొంది ఏడు శతాబ్దాలు అవిశ్రాంత ధర్మ ప్రచారం చేసిన ప్రతిభా భాస్కరులు పండితులు. 11-12-81 విజయవాడ సత్య నారాయణ పురం లోని వారి స్వగృహం "హిందూ భవనం "లో సునాయాస మరణం పొందారు. పండితుల వారి హంస బ్రహ్మ లోకం చేరింది. "మరణం ఒక అవస్తా భేదం " అని హిందూ సమాజ భావన. సూర్యాస్తమయం లాగే ప్రభాకర నిర్యాణం ఒక సహజమైన విషయమే. జ్ఞాన సాగరం లో ఉవ్వెత్తుగా లేచి, మళ్ళీ సముద్ర గర్భం లో కలిసి పోయిన ఒక విజ్ఞాన తరంగం ప్రభాకర ఉమా మహేశ్వర పండితులు.

"సమస్త ధర్మ సంశాయాన్ధకార ప్రుత్ప్రభాకరః –ప్రభాకరాన్వాయ దుగ్ధ వారి దే స్సుదాకరః

సుదాకరోప మాన సద్యశో ల సద్దిగగంతః –విపస్చితాం వారో జయత్యసా ఉమా మహేశ్వరః ".

### అవ్వైయ్యార్

దక్షిణ దేశం లో పరమ భక్తురాలు "అవ్వైయ్యార్ "ఈమెను కైలాసం చేర్చిన వాడూ గణపతియే నని తమిళ దేశం లో ఒక కద బాగా ప్రచారం లో ఉంది. తమిళ దేశం లో ఎక్కడ చూసినా గణపతి విగ్రహాలే కనీ పిస్తాయి. ఆయన అనుగ్రహించిన అవ్వ అవ్వయ్యార్ దేశమంతా క్షణం తీరిక లేకుండా తిరిగి తత్వ బోధ చేసి జనాలను చైతన్యం చేసింది. ఆయన ఉన్న చోటు నుండి ఒక్క అడుగైనా కదలడు. ఈమె ఒక్క చోట కూడా నిలవకుండా ఊరూరా తిరిగేది. ఆ అవ్వ ఆవైయ్యార్ ఈ బిడ్డ పిల్లైయ్యార్ అంటూ ముగిస్తారు కంచి పెద్ద స్వామి

## 21 మెహర్వాణీ -మెహెర్ బాబా గారి వాణి

అవతార పురుషుడు మెహర్ బాబా



మెహర్బాణీ''భౌతికత తో ఊగిపోతున్న మానవ జాతి ని ఆధ్యాత్మిక త వైపు కు జీసెస్ మరల్చినట్లు, నేను మానవాళి ని ఉద్ధరించ టానికి వచ్చాను. అలాంటి పనికి కాలము సమయము కలిసి వచ్చి నప్పుడే మహా పురుషులు మాన వాలిని ఉద్ధరించ టా నికి సంభవిస్తారు. వారే అవతార పురుషులు.

బుద్ధుడు, మహమ్మద్ జొరాస్టర్ అందరు అలాంటి వారే. వీరందరూ ఒకే భగ వంతుని నుండి వచ్చిన వారే. అది ఒక బంగారుదారం. శారీరక ఆనందం ముఖ్య మైన సమయం లో మతానికి మనుగడ తగ్గి నప్పుడు, ధనం పై వ్యామోహం పెరిగి నప్పుడు భగ వంతుడు స్వయం గా వీరి ఆవిర్భావానికి దారి చూపిస్తాడు. ఈ పరంపర లో నేనూ ఒక అవతార పురుషుడినే '' మత సంస్థలు పాత బాణీ లో నె నడిచి ప్రజల ఆలోచనలను పట్టించు కోవటం లేదు ప్రవక్తల ఉపదేశ సారం ఒకటే. మాన వాలిని సంక్షోభం నుంచి బయట పడేయ్య టమే. నేనేమీ కొత్త మతాన్ని స్థాపించటం లేదు. ప్రజలందరి మత భావాలను పునరుద్దరించి వాటికి కొత్త రూపు నివ్వటమేనాధ్యేయం. జీవితాన్ని గురించి వారికి అవగాహన కల్గిస్తాను. ప్రవక్తల మరణం తర్వాతా వారి భావనలు పక్క దారి పడుతున్నాయి. అసలు చెప్పినదానికి, ఆచరించే దానికి సంబంధం లేకుండా పోయింది ప్రవక్త లందరూ భగ వంతుని నుండి వచ్చిన వారె. కనుక వారు చెప్పే దంతా ఒకటి గానే ఉంటుంది. సంకుచిత భావాలను దూరం చేస్తాను. అసలు సత్యాలను ఆవిష్కరిస్తాను. నా మౌనాన్ని త్వరలోనే వదిలి జనం ముందుకు వచ్చి నా మనోభావాలను నా నోటి తో తెలియ జేస్తాను. దానికి తగిన సమయం ఇంకా రాలేదు

వచ్చి నప్పుడు నేనే తెలియ జేస్తాను. ''''త్వరలో నే విశ్వ వ్యాప్త ఆధ్యాత్మికత ను నేను ప్రచారం చేస్తాను. ఇది అన్ని దేశాల వారికి, అన్ని మతాల వారికి అన్ని జాతుల వారికి సంబంధించిందిగా ఉంటుంది. భవిష్యత్తు పై నాకు అపార నమ్మకం ఉంది. పాశ్చాత్య దేశాలలోయుద్ధ భయం ఉంది. అది తగ్గాలి. నేను ఎప్పుడు మౌనాన్ని వీడు తానో నేనుముందుగా చెప్ప లేను. త్వరలో జరిగే ప్రపంచ యుద్ధం జరగ బోతోంది. అది చాలాప్రమాదం. నా భావ వ్యాప్తి ని ఒక ఉద్యమం గా చేస్తాను. ఈ భూమి లో శాంతి నిస్తాపించాటానికి నేను చే బట్టే ఉద్యమం దోహదం చేస్తుంది. నేను ఒక అవతారపురుషుడి ని గా అవతరించబోతున్నాను. యుద్ధం తర్వాతా అపూర్వ శాంతిఏర్పడుతుంది. నిరాయుధీ కరణ ఒక సమస్య గా ఉండదు. జాతి భేదాలు సమసి పోతాయి. మత సంస్థల మధ్య విభేదాలు ఉండవు. నేను ప్రపంచం అంతటా పర్య టిస్తాను. ప్రతి గ్రామం, పట్టణం, నగరం సందర్శిస్తాను. అంతర్జాతీయ సోదర భావాన్ని, మనుష్యుల మధ్య శాంతిని, బీదల యెడ, నిర్లక్షానికి గురి అయిన వారి పట్ల ప్రేమ ను కురిపిస్తాను. భగవంతుని ప్రేమ ను అందరికి అంద జేయట మే నా ముఖ్యధ్యేయం'' ''భారత దేశం ప్రపంచ దేశాలలో ముఖ్య పాత్ర వహిస్తుంది. అనేకలోపాలున్నా భారత దేశం ఆధ్యాత్మిక భావ లహరి ని వ్యాప్తి చేయటం లో ఎప్పుడూముందు ఉంది. నైతిక నాయకత్వం భారత వల్లనే సాధ్యం. ప్రపంచానికి ఆధ్యాత్మికజ్యోతిని ఇవ్వగలిగేది మనమే. నాకు అతీత శక్తులు చాలా ఉన్నా వాటిని అనవసరంగా వృధా చేయను. అవి మానవులకు ఉపయోగ పడు తాయి అన్నప్పుడే వాటిని వాడతాను.నన్ను నేను ఆవిష్కరించు కొన్న రోజున నన్ను అడ్డ గించే శక్తి ఏదీ ఉండదు.గుడ్డి వారికి చూపు ను కుంటి వారికి నడకను, ఇవ్వగలను ముసలితనాన్ని దూరంచేయ గలను. మరణించిన వారిని పునర్జీవులను చేస్తాను. ఇవన్నీ నిజం గాజిమ్మిక్కులే. వీటి తో నమ్మకం రావచ్చు కాని మనసు కుదుట బడదు''. ''నా



కు పన్నెండు మంది శిష్య పరంపర ఉంది. ఇది ఒక వలయం. నాతర్వాత వీరిలో ఒకర్ని నా స్తానం లో ప్రతిష్టిస్తాను. వారి కోసమే నేనునిరాహార దీక్ష, మౌనం పాటిస్తున్నాను. వారంతా నా పూర్వ జన్మ లో సహచరులే.వారిని నేను ఆదుకోవాలి. వీరికి బయటి వలయం లో44 మంది ఉన్నారు. అందులో ఆడవారు మగ వారూ కూడా ఉన్నారు. అయితే పైవారి కంటే వీరి స్థాయి తక్కువ. వీరందరి ద్వారా కావలసిన పనులన్నీ జరిపిస్తాను. నా గరువు ''ఉపాసని మహా రాజ్''.నాకు ఆధ్యాత్మిక భావన కలిగించిన వారు'' హజరత్ బాబా జన్''అనే సుమారు వందేల్లున్న ముస్లిం మహిళా ఫకీర్.' ఇదీ అవతార్ మెహెర్ బాబా గారి వాణి,బాణీ. ఇదంతా ఆయన్ను ఇంగ్లండ్కు చెందిన పత్రికా విలేఖరి భారతీయ ఆధ్యాత్మిక రహస్యాలను తెలుసు కోవాటానికి భారత దేశం అంతటా పర్య టించిన paul brunton ఇంటర్వ్యూ చేసినప్పుడుమౌనం గా ఉన్న బాబా తన వద్ద ఉన్న అక్షర మాల సహాయం తో రాసి చెప్పినవిషయాలు.

# 22 భక్త పురందర దాసు

"దాసరేంద్ర పురందర దాసరాయ "-దాస భక్తులలో పురందరదాసు శ్రేష్ఠుడు"అని గురువు వ్యాసతీర్థులవారి ప్రశంస అందుకున్న భక్త శిఖామణి పురందర దాసు. సంగీత కర్త, కవి అయిన వాగ్గేయకారుడు. కర్ణాటక సంగీతానికి ఆద్యుడు అందుకే "కర్ణాటక సంగీత పితామహ "అని పురందరదాసు ను గౌరవంగా సంబోధిస్తారు. నారద మహర్షి అపర అవతారమనీ అంటారు దాసు ను.

" నవకోటి నారాయణ

క్రీశ. 1484 లో కర్ణాటకలోశివమొగ్గ జిల్లా తీర్థ హళ్లి లో సంపన్న వర్తక కుటుంబం లోవరదప్ప నాయక, లీలావతుల ఏకైక కుమారుడుగా పురందరదాసు జన్మించాడు. తిరుమల శ్రీనివాసుని దయ వలన జన్మించినందున శ్రీనివాస నాయక్ అని పేరుపెట్టారు ఆయన స్వగ్రామం "పురందర ఘట్ట ".అంటారు. సంప్రదాయ విధానం లో కన్నడ, సంస్కృతాలతోపాటు సంగీతమూ అభ్యసించాడు 16 ఏళ్లకే సరస్వతీ బాయి తో వివాహమైంది 20 వ ఏట తలిదండ్రులు చనిపోయారు ఆస్తి సంపదకు ఏకైక వారసుడయ్యాడు పురందరదాసు. సంప్రదాయంగా వచ్చిన రత్న మాణిక్య వడ్డీ వ్యాపారం లో ఇబ్బడి ముబ్బడిగా సంపాదించి కోట్లకుపడగలెత్తి "నవకోటి నారాయణ "అని ప్రసిద్ధి చెందాడు




సర్వస్వము త్యాగం చేసిన దాసు.

క్రమంగా సంపాదన ఆస్తి డబ్బు లపై వ్యామోహం తగ్గింది. భౌతిక సుఖాలు శాశ్వతం కాదు అని తోచింది. ఈ భావాన్ని మరింత బలపరచాడు శ్రీనివాసుడు పేద బ్రాహ్మణ రూపం లో రూపం లో కనిపించితన కుమారుని ఉపనయనానికి ధన సహాయం చేయమని కోరాడు. ఎవరికీ చిల్లి గవ్వ కూడా ఇవ్వటానికి ఒప్పుకొని ఆ పిసినారి నవకోటి నాయకుడు ఎంతబ్రతిమిలాడినా కనికరించలేదు. గత్యంతరం లేక బాపడు అతని భార్యకు తన డబ్బు అవసరాన్ని చెప్పాడు. దయామయి అయిన భార్య సరస్వతి తన ముక్కు కున్న ముక్కు పుడకను తీసి భర్తకు తెలియకుండా బ్రాహ్మణుడికి ఇచ్చిపంపింది. తాను ఇచ్చింది సాక్షాత్తు శ్రీనివాసుడి కే అని ఆమెకు తెలియదు ఆ ముక్కుపుడకను పురందరదాసు నగల దుకాణం లో నే అమ్మాడు బ్రాహ్మణుడు. అది తన భార్య నగ అని గ్రహించిన దాసు. హడావిడిగా ఇంటికి వచ్చి భార్యను గద్దించాడు. తనకు భర్త చేతిలో అవమానం తప్పదని పాలలో విషం కలిపి తాగ టానికి నోటిదగ్గర పెట్టుకోగానే అందులో తన ముక్కుపుడక కనిపించింది. భర్తకూడా ఆశ్చర్యపోయాడు ఆ పేద బ్రాహ్మణుడికోసం వెతి కారుకాని జాడ లేదు ఇదంతా భగవల్లీల అం తన భార్యను కాపాడినవాడు సాక్షాత్తు తిరుమల శ్రీనివాసుడే నని గ్రహించి తప్పు తెలుసుకొని సంపదమీద ఎక్కువ దృష్టిపెట్టటం వలన జరిగిన అనర్థం అని గ్రహించి 30 వ ఏటనే తన సంపదనంతా త్యాగం చేసి పరమ భక్తుడై హరిదాసుడై భాగవతోత్తముడైనాడుపుణ్యపురుషుడు పురందరదాసు

వ్యాస తీర్థుల శిష్యరికం

కృష్ణదేవరాయల రాజగురువు వ్యాస తీర్థులవారి దర్శనం వలన మార్గం సుగమం అయి శిష్యుడై పురందరదాసు నామం తో40 వ ఏట ప్రసిద్ధుడయ్యాడు విజయనగర ఆస్థానం లో తన భక్తికీర్తనలు గానం చేసి రాజుతో సహా అందరి మెప్పూ పొందాడు.

4 లక్షల 75 వేల కీర్తనలు

హంపీ చేరి ఒక మండపం లో ఉంటూ చివరి జీవితాన్ని గడిపాడు దాదాపు 4, లక్షల 75వేల కీర్తనలు రాసిన పరమభక్తుడుపురంధరదాసు మిగిలిన 25 వేల కీర్తనలూ రాసి తాను అనుకొన్న 5 లక్షల కీర్తనలు పూర్తి చేయమని చిన్న కొడుకు"మధ్వ పతి" ని కోరాడు. తాను ఈ జన్మలో అంతటి పని చేయలేనని మరోజన్మలో రాసి తండ్రి కోరిక తీరుస్తామని అన్నాడు. అతడే తర్వాత కర్ణాటకలో రాయపూర్ జిల్లా చీకలపర్వి లో "విజయదాసు "గా జన్మించి తండ్రికి వాగ్దానం చేసినదానిప్రకారం 25 వేల కీర్తనలు శ్రీ లక్ష్మీ నారాయణస్వామిపై రచించి తండ్రికిచ్చిన మాట నిలబెట్టుకున్నాడు. అందుకే ఆయనను నారదావతారం అన్నారు. త్యాగరాజ స్వామి త" ప్రహ్లాద భక్త విజయం" గేయ నాటకం లో పురందర దాసును ప్రస్తుతించారు ఆయన నివసించిన మండపాన్ని పురందర మండపం అంటారు

మాయామాళవ రాగ సృష్టికర్త

.ఆధ్యాత్మిక వేత్తలైన వారికి మాత్రమే బోధపడే శ్రీ మద్ భాగవతాన్ని సుందర సరళతరమైన శ్రావ్యమైన పాటలు గా రాసి సామాన్యులకు కూడా భాగవత పరమార్థాన్ని తెలియ జేశాడు. కర్ణాటక సంగీతం లో వ్రేళ్లమీద లెక్కింపదగిన వాగ్గేయకారుడిగా గుర్తింపుపొందాడు. స్వరావళి, అలంకారాలతో సంగీతానికి శోభ సమకూర్చాడు. "మాయా మాళవ" రాగాన్ని సృష్టించి సంగీతం నేర్చుకొనే వారికిమొట్టమొదట పాడుకోవటానికి సులభంగా ఉత్సాహ జనకంగా వరప్రసాదంగా అందుబాటులోకి తెచ్చాడు. ఇప్పటికీ ప్రారంభదశ లో సంగీతం నేర్చుకొనేవారికి వారికి ఈ రాగ0 లోనే సంగీతం బోధించే సంప్రదాయం కొనసాగుతోంది

స్వరావాళి, జంటస్వరాలు, అలంకారాలు, లక్షణ గీత, ప్రబంధాలు యుగభోగాలు, దాటువరస గీతాలు, సూలాది మొదలైనవి రాశాడు. ఏదిరాసినా భావ రాగ లయ సమ్మేళనం తో విరిసిన పుష్పంగా కీర్తన శోభిల్లుతోంది. లక్షలాది కీర్తనలు రాసినా లభించి ప్రాచుర్యం లో ఉన్నవి 700 మాత్రమే.

కర్ణాటక సంగీత పితామహ

పురందర దాసు భక్తి ఉద్యమం లో దాస సాహిత్యాన్ని పారిపోషించి వ్యాప్తి చెందించాడు. తనకన్నా చిన్న వాడైనభక్త కనక దాసుకుపురందర దాసు సమకాలికుడు.. కన్నడం లో చాలా క్రనలు రాసినా సంస్కృతం లోనూ పురందరదాసు కృతులు రాసి కీర్తి గడించాడు. ఆయన కృతులలో "పురందర విఠల "అనేది అంకిత ముద్ర గా ఉండటం విశేషం హిందూస్తానీ సంగీతం పై తీవ్రప్రభావం కలిగించాడు పురందరదాసు ఉత్తరాది మహా సంగీత విద్వాంసుడు తాన్సేన్ గురువు స్వామి హరిదాసు పురందరదాసు శిష్యుడే. ఈ భక్త కవి శేఖరుడు 2-1-1564న 80 ఏళ్ళవయసులో పురందర విఠలుని చేరుకొన్నాడు

ఆధునికకాలం లో బిడారం కృష్ణప్ప పురన్దరదాసు కీ ర్తనలను గానం చేస్తూ బహుళ వ్యాప్తిలోకి తెచ్చాడు. ఏం ఎల్ వసంతకుమారి భీం సేన్ జోషీ లు కూడా పురందరదాసు కీర్తనలను పాడి పట్టాభిషేకం చేశారు. తిరుమలలో పురందరదాస విగ్రహం ప్రతిష్టించి గౌరవించారు. బెంగళూర్ లో పురందర దాస ట్రస్ట్ ఏర్పడి ఎన్నో కార్యక్రమాలు నిర్వహిస్తోంది. పుష్య బహుళ అమావాస్య నాడు పురందరదాసు ఆరాధనోత్సవం ఘనం గా నిర్వహిస్తున్నారు. కర్ణాటక సంగీత పితామహుడు పురందరదాసు అందరికి ఆరాధనీయుడే.

## 23 శ్రీ దాసు లింగమూర్తి

శ్రీ దాసు లింగమూర్తి జీవితము అనే పుస్తకాన్ని శ్రీ పాలపర్తి సూర్యనారాయణ రాశారు ఈయన అంతకుమునుపే ప్రియదర్శిని ,మేవాడపతనం లక్ష్మీ నరసింహ ,ముకుందమాల స్తోత్రాలు ,అహోబిల చరిత్రాదులు రాశారు .దీన్ని చాగలమర్రి వాసి డాక్టర్ గంగరాజు వెంకట రామయ్య గారు బెజవాడ ఆంధ్ర గ్రంధాలయం లో 1931లో ప్రచురించారు .ఖరీదు 12అణాలు .ముందుమాట ఆళ్ళగడ్డకు చెందిన డిప్యూటీ ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్ శ్రీ ఎస్.లక్ష్మీ నరసయ్య ఎం .ఎ .లిట్ ఇంగ్లీష్ లో విపులంగా రాశారు .

గ్రంథ కర్త తనమాటలలో శ్రీ పొణంగి లింగమూర్తి దాసు గారిపై ఉన్న భక్తితో తాను ఈ రచన చేశానని ఆయన జీవించి ఉన్నకాలం లోనే గొప్ప పేరు ప్రఖ్యాతులు పొందిన మహనీయులని ,పూజ్యులు ఆరాధ్యులు ,ఆదర్శ ప్రాయులు అని చెప్పారు .ఈ పుస్తకం అమ్మకాలవల్ల వచ్చే ఆదాయాన్ని చాగలమర్రి శ్రీ చెన్న కేశవ స్వామి శాశ్వత నిధికి జమ చేస్తున్నట్లు తెలిపారు .ఈ పుస్తకాన్ని అహోబిల క్షేత్ర స్థాపన ,పోషణ ,భవిష్యత్ ఉద్ధరణ కు కారకులైన భక్త బృందానికి అంకితమిచ్చినట్లు విన్నవించారు.తర్వాత ప్రవేశికలో శ్రీ లింగమూర్తి దాసు గారు వంటి జీవిత చరిత్రలు ఎలాస్ఫూర్తి నిస్తాయో వివరించారు .



శ్రీ దాసు లింగమూర్తి గారు.

### బాల్యం విద్యాభ్యాసం

తిరుపతి క్షేత్రానికి నకలుగా ఉన్నవిశాఖ పట్టణం లోని ఉప్మాక వెంకటేశ్వర ఆలయం గోడే జమీందార్ల జమి లోనిది .జమీందారు గణపతి రాయణి ఆస్థానం లో పొణంగి వెంకటరామయ్యగారనే భక్తుడు సముద్దారుగా కొద్ది జీతానికే పని చేస్తున్నాడు .ఈయన చంద్రవరానికి చెందినా ఆర్వేల నియోగి .భార్య కృష్ణ వేణమ్మ. వీరి అయిదుగురు సంతానం లో చివరి వాడు శ్రీలింగమూర్తి దాసు గారు 4-11-1895 జయనామ సంవత్సర ఆశ్వయుజ బహుళ దశమి నాడు జన్మించారు .వీరి జాతక చక్రం కూడా ఇవ్వబడింది .35వ ఏడు నుంచి 52వరకు అంగారక మహర్దశ ,అందులో భార్య మృతి ,పుత్ర వృద్ధి ఉంటాయి .ఆంగీరస సంవత్సరం లో ద్వితీయ కళత్రయోగం ,52 వయసు వచ్చేసరికి అనుకొన్న పనుల్నీ జరుగుతాయని ,ఉద్యోగ రాజ్య ధన భూ గృహ లాభాలు ,ఇంట్లో శుభకార్యాలు సూచింప బడింది .52నుంచి 69వరకు బుధమహర్దశ లో గృహ భూ జల శిదిలాలయపునరుద్ధరణ ,65లో గండం ,69-70లో మరణం .

నిరాడంబరుడైన తండ్రి వెంకటరామయ్య గారికి భార్యావియోగం ,దాసుగారు పుట్టిన నాలుగు నెలలకే జరిగి అష్టకష్టాలుపడ్డారు .అయిదుగురు పసిపిల్లలని ప్రేమతో పెంచుతున్నారు .పసి దాసుకు తల్లిపాలు లోటు తీర్చలేక పోయారు తండ్రి .పెంకె పిల్లాడుగా పెరిగాడు .ఉన్న చోటే ప్రాధమిక విద్య నేర్చి ,పదేళ్ళ వయసులో కాకినాడలోని దగ్గర బంధువు కానుకొల్లు వెంకట అప్పారావు గారివద్ద ఇంగ్లీష్ నేర్చుకోటాని పంపారు .అక్కడ పిఠాపురం రాజా కాలేజిలో మాధ్యమిక విద్యనేర్చారు రెండవ ఫారం లో ఉండగా ఒక ఒరిస్సా జ్యోతిష్యుడు అప్పారావు గారింటికి వచ్చి మధ్యాహ్న భోజనానికి ఇంటికి వచ్చిన బాల దాసుగారిని చూసి మహాయోగ పురుషుడు అవుతాడని చెప్పాడు .ఎలా చెప్పగలిగారని అప్పారావు గారు అడిగితె కాలి బొటన వ్రేళ్ళ లో చేతి బొటన వ్రేళ్ళలో తప్పక చక్రాలు ఉండి ఉంటాయని ,అలాంటివాడు రాజుకాని మఠాధిపతికాని తప్పక అవుతాడని చెప్పాడు .దాసుగార్ని పిలిచి నాలుగు వ్రేళ్ళల్లో ఉన్న చక్రాలు ఆజ్యోతిష్యుడు అప్పారావు

గారికి చూపించాడు .ఆతర్వాత మూడేళ్ళకు దాసుగారు ఒకరాత్రి ఒక హరిదాసు చెప్పిన మానసిక పూజా విధానం విని ఆకర్షితులయ్యారు .ప్రహ్లాద చరిత్ర బాగా ఆకర్షించి ,నిత్య మానసిక పూజ చేశారు .

### కలకత్తా ప్రయాణం –బలినుంచి తప్పించుకోవటం

దాసుగారు స్కూల్ ఫైనల్ చదువుతున్నప్పుడు ఉప్మాక వెంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవాలు చూసి ,అక్కడున్న వికలాంగ రోగపీడిత కుష్టు వారిని చూసి మహా జాలిపడి ,వారి దుఃఖ నివృత్తికోసం హిమాలయాలకు వెళ్లి తపస్సు చేయాలనుకొన్నారు .కాకినాడ చదువుకోసమని తండ్రి దగ్గర డబ్బు తీసుకొని సరాసరి సింహాచలం వెళ్లి ,అక్కడి నుంచి కాశీ వెళ్లాలని కలకత్తా కు రాత్రి8 గంటలకు చేరారు .ఆకలి దంచేస్తోంది దగ్గరున్న మూడు అణాల మూడు కానులతో మార్వాడీ దుకాణం లో మిఠాయికొని తిని మంచినీళ్ళు తాగి స్టేషన్ లోనే పడుకొన్నారు .


[illegible]

అనుబంధము.

భగవన్నామ భజన కీర్తనలు.

[illegible]

1 [illegible]

2 [illegible]

3 [illegible]

4 [illegible]

5 [illegible]

6 [illegible]

7 [illegible]

8 [illegible]

9 [illegible]

10 [illegible]

మర్నాడు ఉదయం లేచి ఆమార్వాడీని కాళికా దేవి గుడికి ఎలా వెళ్లాలని వచ్చిరాని బాషలో అడిగితె పాపం పసివాడు అని జాలిపడి తనదగ్గరే మూడు రోజులు ఉంచుకొన్నాడు .ప్లాట్ ఫారం పై పచారు చేస్తున్న దాసుగారిని చూసి ఒక మార్వాడీశ్రీమతుడు తన ఇంట ఆతిధ్యమిచ్చాడు .ఆమహల్ లో ఇతనికి సేవ చేయటానికి ఒకబాలికను ఏర్పాటు చేశాడు .ఆమె ఎప్పుడూ విచారంగా ఉండటం చూసి కారణం అడిగారు .ఆమె ''నీకు ఆతిధ్యమిచ్చినవాడు మా తండ్రే .శక్తి పూజ అబ్బింది ఆయనకు .నిన్ను కాళికామాతకు బలి ఇవ్వాలని అనుకొంటూ మేపుతున్నాడు .మానాన్న బారి నుంచి నిన్ను తప్పించటం ఎట్లా అన్నదే నా బాధ ''అని చెప్పింది .కాళిమాత యే తన్ను రక్షిస్తుంది అను కొని ఆమె చెప్పినట్లు చేశాడు .ఒకరోజు దాసుగారు తెలివిగా మార్వాడీ తో తన సోదరుడుకూడా కలకత్తా వచ్చాడని స్టేషన్ లో ఉన్నాడని అతన్ని కూడా తీసుకొస్తానని అంటే ఇద్దరు ''ఒకరాల్ని బలివ్వచ్చు'' అనుకొని సరే అనగా ఇద్దరూకలిసి కారులో బయల్దేరి స్టేషన్ కు బయల్దేరగా .దారిలో కొందరు తెల్లవాళ్ళు మరో కారులో రావటం చూసి దాసుగారు బిగ్గరగా కేకలు వేశారు .వాళ్ళు విని వీళ్ళ కారు ఆపించి ,దాసుగారిని కారణం అడితితే జరిగింది అంతా చెప్పగా ,అందులో ఉన్న తెల్లదొర డిటెక్టివ్ అవటం లో మార్వాడీని మందలించి ,దాసుగారి చెర వదిలిలించి కాకినాడకు రైల్ టికెట్ కొనిచ్చి రైలు ఎక్కించారు .చావుతప్పి కన్ను లొట్టబోయినట్లయింది .కాకినాడ చేరి బుద్ధిగా చదివి పాసయ్యారు

### వివాహ ఉద్యోగాలు –దాసు గా అవతరించటం

గోదావరీ నదీ పాయ వశిష్ట గోదావరి ఒడ్డున విజ్జేశ్వరం అనే గ్రామం లో నదికి ఆనకట్ట ,లాకులు ,నరసాపురం కాలువ ఉండి,పరమ మనోహరం గా కనిపిస్తుంది .ఈ గ్రామ కరణం అల్లుడు ఒంటిమిల్లి వాసి ఎర్రమిల్లి వెంకట చలమయ్య కరణీకం చేస్తాడు ఈయన పెద్దకూతురు సంగమేశ్వరమ్మ ను లింగమూర్తి గారికిచ్చి 1914లో పెళ్లి చేశారు .మూర్తి గారు చదువు ముగించి ఉద్యోగప్రయత్నాలు చేసినా ఫలించ లేదు.ఒక నాడు కాకినాడ స్టేషన్ లో షికారు చేస్తుంటే బాల్యమిత్రుడు కనిపించగా అయన తండ్రి డిప్యూటీ కలెక్టర్ నిట్టల రామమూర్తి నాయుడు కాకినాడ నుంచి కర్నూలుకు మారి .తనకొడుకుద్వారా మూర్తి గారి గురించి అడిగి తెల్సుకొని కర్నూలుకు వస్తే ఉద్యోగం ఇప్పిస్తానని చెప్పారు.ఆయన సిఫారసులో మూర్తి గారు ద్రోణాచలం తాలూకాఆఫీసు లో 1915లో చేరారు .అప్పటినుంచి నాలుగేళ్ళు మార్కాపురం వగైరా చోట్లలో పని చేసి ,1919లో రెవెన్యు ఇన్స్పెక్టర్ అయ్యారు .రెండేళ్ళ తర్వాత అనంతపురం సెటిల్ మెంట్ రెవిన్యు ఇన్స్పెక్టర్ అయి రెండు చేతులా పుష్కలంగా డబ్బు సంపాదించారు .వీరికి రాముడు త్రిపురసుందరి ,కృష్ణుడు సంతానం .బీద బిక్కి కి సాయపడటం ,లోక సేవలో తరించటం వలన లింగమూర్తి గారిని'' దాసు గారుగా పిలిచి జానం గౌరవించారు .

### దిగంబర స్వామి

అనంతపురం బెల్లుప్ప గ్రామం లో ఒక దిగంబర పిచ్చోడు తిరుగుతూ ఒక కమ్మరివాడు పొయ్యిలో కొర్రు కాలుస్తూ ఆ దిగంబరుడి ఒంటికి వేళాకోళంగా కర్రుకాల్చగా ఆయన్ను ఏమిచేయ లేకపోవటం లో ఆయన్ను ''దిగంబర స్వామి ''అని ఆరాధించటం మొదలు పెట్టారు అక్కడి ప్రజలు .ఒకరోజు ఈ స్వామిఊ వూరి దేవాలయం లో ఉండగా దాసుగారు ఉద్యోగ బాధ్యత పై ఆ దేవాలయం లోనే విడిది చేశారు .ఆలయం దగ్గర పెద్ద గుంపు స్వామి చుట్టూ మూగి కోలాహలం చేస్తుండగా దాసుగారు రాగా,స్వామి చిరునవ్వులో దాసుగారిని ఆప్యాయంగా కౌగలించుకొని ,ఆతర్వాత ఒక అరుగుపై పడుకొని స్వామి వెళ్ళిపోయారు .దాసుగారికి ఏమి జరిగిందో చాలా సేపటిదాకా తెలిక స్మృతి రాగానే కళ్ళు

తెరిచి చూస్తె స్వామీ ,ఆ జనమూ కనిపించలేదు .స్వామి కౌగిలింతలో తనకు ఒక స్వప్నం వచ్చిందని ,అందులో తన పూర్వ జన్మ వృత్తాంతం తెలియ జేయబడిందని దాసుగారు తన ఆంతరంగికులకు తెలియజేశారు .

ఆ కల వివరాలు –ఒక భయంకరారణ్యం లో పెద్ద పర్వతం దానిపై ఒకకుటీరం దాని ప్రక్క కోనేరు ,గొర్రెలు మేపెకుర్రాడు ఒక ముసలాయన ఉన్నారు .ముసలి బాలుడి దగ్గరకొచ్చి అన్నం కావాలని అడిగితె ,పైన కుటీరం లో తన తలిదండ్రులు పెడతారని చెప్పాడు .వాళ్ళను అడిగాననీ ఏమీ లేదని చెప్పారని తెలిపాడు .మూడు రోజులనుంచి అన్నం లేదని చెప్పి కూలబడ్డాడు .తాను మధ్యాహ్నం తినటానికి ఉంచుకొన్న రొట్టెముక్క, వెన్న తెచ్చి ముసలికి పెట్టాడు .అందులో సగమే తిని మిగతా సగం ఆబాలుడిని తినమని చెప్పి ''అబ్బాయీ !ఆకలిగా ఉన్నవాడికి అన్నం పెట్టావు. ని పుణ్యం ఊరికే పోదు .వచ్చే జన్మలో వేలకొద్ది జనాలకు ఉపకారం చేస్తావు ''అని దీవించి వెళ్ళాడని ఆకల సారాంశం .

దాసుగారికి నాలుగవ సంతానం కమల పుట్టి14రోజులైంది భర్త ప్రేలాపన అవతారం చూసి భయపడిందిభార్య సంగమేశ్వరమ్మ .తండ్రికి టెలిగ్రాం ఇప్పిస్తే ఆయనవచ్చి ,ఉద్యోగానికి రెండు నెలలు సెలవుపెట్టించి ,తమతో పాటు తీసుకువెళ్ళాడు .ఆరోగ్యం బాగై మళ్ళీ ఉద్యోగం లో చేరారు .కానీ దిగంబరస్వామి ప్రభావంతో దీన జన సముద్ధరణపైనే మనసు లగ్నమై పోయింది.స్వామి అనుగ్రహం లో దాసుగారిలో దివ్య తేజస్సు ఆవిర్భవించ గా ప్రజలు ఆయనవైపుకు ఆకర్షింప బడ్డారు .

## అన్న సత్రాల స్థాపన

అనంత పురమండలం లో 1923-24లో తీవ్ర క్షామం ఏర్పడింది .ప్రజలకు అన్నం నీరు లేక విలవిల లాడారు .ఇందులోనుంచి ప్రజలను బయట పడేయాలని సంకల్పించుకొని దాసుగారు ,తాను వెళ్ళిన ప్రతి ఊరులోనూ అన్న దానమహిమ చెబుతూ రోజా ఒక్కమనిశషికైనా అన్నం పెట్టమని ఉద్బోధించేవారు .కులీన యాచకుడిని ఒకరిని నియమించి గ్రామంలో ఆహారం అడిగి తెప్పించి ,అందులో అతని సంసారానికి తగిన ఆహారం ఉంచుకొని ,మిగిలింది ఆగంతులైన బాట సారులకు పెట్టె ఏర్పాటు చేశారు దాసుగారు .ఎలాంటి ఆర్భాటం హడావిడి ప్రచారం లేకుండా ఈ అన్న సత్రాలు నిర్వహింపబడుతూ అన్నార్తులకు తృప్తి కలిగిస్తూ ,ఇప్పటికే నిర్వహింప బడుతూనే ఉన్నాయి .పినాకిని పత్రిక ఈ అన్న సత్రస్థాపన గురించి 1924 ఏప్రిల్ 12 న ''లింగరాజు అనేవారు సుమారు రెండు నెలలక్రితం సెటిల్ మెంట్ ఇన్స్పెక్టర్ గా ఈ ప్రాంతానికి వచ్చి ,తాము వెళ్ళిన ప్రతిచోటా మంచి విషయాలు బోధిస్తూ చెడును వదిలిపెట్టమని హితవు పలుకుతూ ,సన్మార్గ ప్రవర్తకులు కావాలని చెబుతూ ,ప్రతిపల్లెలో నిరతాన్న దానం జరగాలని ,అన్న సత్రాలు స్థాపించారు .నేను కాంగ్రెస్ ప్రచారానికి ముదిగల్లు గ్రామం వచ్చాను నేనుచేయాల్సిన పనేమీ కనిపించలేదు .ఎందుకంటే అక్కడ ప్రజల ఐకమత్యం ,మిత్రత్వం వాత్సల్యం పాపభీతి ధర్మమార్గం నన్ను ముగ్ధుడిని చేశాయి .ఇలాంటి గ్రామం ఇంతకూ ముందు నేనెప్పుడూచూడనే లేదు .దీనికి కారణం ఎవరై ఉండచ్చునా అని విచారించగా దాసు లింగమూర్తి గారు అనే మహనీయుడు అని తెలిసింది .వారి తత్వోపదేశం లో పరధనాపేక్ష ,,పరస్త్రీ సంగమం ,పరస్పర శత్రుభావాలను త్యజించమని ఉద్బోధిస్తున్నారు. వారిమాట త్రికరణ శుద్ధిగా ప్రజలు ఆచరిస్తున్నారు .ఈ కరువుకాలం లో ఈ ప్రాంతంలో నిన్నటివరకు 10అన్న సత్రాలు స్థాపించి ఆకలి గొన్న వారికి అన్నం అందిస్తూ మహామానవ సేవ చేస్తున్నారు దాసుగారు తన విధ్యుక్తధర్మ నిర్వహణ సంతృప్తిగా చేస్తూనే .ఇవాళ 11అన్న సత్రాన్ని కళ్యాణ దుర్గంలో స్థాపిస్తున్నట్లు తెలిసింది .ఇలా ప్రతిగ్రామం లోనూ జరగాలని దాసుగారి ఆలోచన త్వరలోనే కార్యరూపం దాలుస్తుందనటానికి ఎలాంటి అనుమానమూ లేనేలేదు –సోంపల్లి వెంకటరమణయ్య చౌదరి -24-3-24-ముదిగల్లు .ఇలా దాసుగారు తన సంకల్ప బలం తో ,ప్రజల సహకారంతో 100 అన్న సత్రాలు స్థాపించి అన్న దానం చేసి పెద్దల పిన్నల బీద ప్రజల చేత కృతజ్ఞత పొందారు .

## తారకనామ ఉపదేశం

పదేళ్ళ వయసుగల ఒక బాలయోగి తన చుట్టూ వందలాది జనం మూగిఉండగా ఊరూరు తిరిగాడు .ఊరివారు వాళ్లకు భోజనవసతులు కల్పించేవారు .ఒకరోజ దాసుగారు ఉండే చెట్టూరు గ్రామానికి వచ్చి ఒక చెట్టుకు ఉయ్యాల కట్టించు కొని ఊగు తుండగా దాసుగారు సైకిల్ పై వస్తుండగా ఎంత పెద్దవాదినైనాఒరేయ్ అని పిలిచే బాలయోగి ''ఒరేయ్ .ఇక్కడికి రా ''అని పిలువగా ,ఆశ్చర్యపడి అతడు తనలోషికారు రమ్మంటే ఆయన గుర్రం మీదా ఈయన సైకిల్ పైనా రెండు మైళ్ళు వెళ్లి ఒక దిగుడు బావి దగ్గర దిగారు .దాసుగారిని ఏదైనా మంత్రం వచ్చా అని అడిగి ,రాదని చెప్పగా బాలయోగి తారకమంత్రం దాసుగారికి ఉపదేశించి అనుగ్రహించారు .అప్పటి నుంచి దాసుగారు అన్న సత్రాలతో తృప్తిపడకుండా శ్రీరామ సప్తాహాలు ,దేవాలయ నిర్మాణాలు జీర్ణాలయ ఉద్దరణలు మొదలైన మహత్కార్యాలు కూడా చేబట్టారు .నిత్యం మానసిక పూజలో చిత్తాన్ని పరిపక్వం చేసుకొన్నారు .

దాసుగారు ముదిగల్లు ,కళ్యాణ దుర్గం ,గంగవరం ,సిర్పి ,అనంతపురం మొదలలైన చోట్ల నామభజన సప్తాహాలు చేశారు .పినాకిని పత్రిక కవరేజ్ ప్రకారం అనంతపురం లో శ్రీరామ నామ సప్తాహం చేశారు .ముదిగల్లులో

శివాలయ ఉద్ధరణ చేసి రామనామ సప్తాహం ,ఈశ్వరుడికి లక్ష బిల్వార్చన చేశారు .ఒకయువకుడు ''అయ్యా రాత్రి ఏమి కలవచ్చింది ఇన్ని చేస్తున్నారు ''అని వ్యంగ్యంగా అంటే దాసుగారు ''దేవుడికి తన ఆలయ పునరుద్ధరణ ప్రీతికరం .సర్వాత్మ తేజమే లింగం అనేది సత్యం అయితే శివుదిపైకి వేసిన ఈపువ్వు గాలిలో నిలిచి ఉండుగాక ''అని ఒక పువ్వు విసిరేశారు .అది వాడకుండా ఆకార్యక్రమాలు అయ్యేవరకు అలాగే నిల్చి ఉంది .ఈవిషయం పెద్దాపురం లో దాసుగారిపై రచించబడిన ''భక్త విజయ ధ్వజం ''లో –

''ముదముగలు లోన మూఢ జనముల్ మిము గ్రితవ దాసు డంచుస –మ్మదమున దూలనాడ జనమాన్యము వాపగ ,జూడు మంచు స-

మ్మదమున లింగ మూర్ధమున బుష్పము వేయగనద్ది గాలిలో –బదిలముగాగనిల్చె నొకవారము మిదగు శక్తి జాటదే''

కళ్యాణ దుర్గం లో సప్తాహం 21రోజులు చేశారు .ఒక రోజు ఆపోశన పోస్తూ ''ఈ పవిత్రోదకం ఎవ్వరి చేతి నుంచి ఎన్ని బిందువులు కింద రాలితే ,అన్ని పది సంవత్సరాలు బీదయై వస్త్రాలు లేకుండా ఉంటాడు అని నాకు తోస్తోంది కనుక జాగ్రత్తగా గ్రహించండి ''అన్నారు .ఒక శ్రీమంతుడు ధనగర్వంతో ఆపోశన ఉదకాన్ని కిందపోశాడు .దాసుగారికి కోపం వచ్చి ''సృష్టికర్త అందరి హృదయాలలో ఉంటె ,దేవాలయాలలో తన కళలు నిలపటం సత్యమైతే ఈ బ్రాహ్మణుడు ఇరవై నాలుగు గంటలలో పాప ఫలం అనుభవిస్తాడు ''అన్నారు .భోజనాలైపోయి అందరూ తాంబూలాలు వేసుకొంటుంటే ,ఆ బ్రాహ్మడు హఠాత్తుగా దాసుగారి దగ్గరకు వచ్చి చేతులు జోడించి ''నాకు పుత్రభిక్ష పెట్టండి ''అని దీనంగా ప్రార్ధించాడు .ఆయన దుఃఖానికి కారణం అడిగి తెలుసుకొని ,కలరాతో బాధ పడుతున్నాడని తెలిసి ''భయం లేదు కలరాతగ్గిపోతుంది ''అని అభయమిచ్చి స్వామి ప్రసాదమిచ్చి పంపారు. కుర్రాడు తేరుకొన్నాడు ..ఆరాత్రి ఆకొడుకును తెచ్చి దాసుగారి పాదాలవద్ద ఉంచాడు .కానిఅతనికే కలరావచ్చి చచ్చిపోయాడు .నూతి మడుగు గ్రామం లో ఒక గొప్ప ఆంజనేయ విగ్రహం నాగ జెముడు పొదల్లో పడి ఉందని తెలిసిన దాసుగారు ,ఆ విగ్రహం తేజస్సుకు అబ్బురపడి ఊరి జనాన్ని పిలిపించి ఆలయం కట్టమని అడిగితే వాళ్ళు విముఖత చూపారు .అప్పుడు దాసుగారు ఒక గోనె సంచి తీసుకొని మొదటి రోజు ఒకబస్తా జొన్నలు సంపాదించి పని ప్రారంభించారు .ఉత్సాహంగా ఇచ్చినవారి దగ్గర డబ్బు తీసుకొని తన డబ్బు కొంత ఖర్చు చేసి కొంత పని చేయగా జనాలకు అప్పుడు బల్బు వెలిగి వారే ముందుకు వచ్చి హనుమ దేవాలయ నిర్మాణానికి దాసుగారికి పూర్తి సహకారం అందించారు .అప్పటికి ఆరు సంవత్సరాలుగా అక్కడ వర్షాభావం .కాని స్వామి ప్రతిష్టతర్వాత వర్షాలే ,వర్షాలు కురిసి ప్రజలంతా సుఖ జీవనం సాగించారు .ఆలయానికి యాభై వేల నికర ద్రవ్యం సమకూరి రంగరంగా వైభవం గా కార్యక్రమాలు జరుగుతున్నాయి .శ్రీరాం ఎర్రప్పనాయుడు తన భార్యచని పోయిన దగ్గర్నుంచి యావదాస్తి దేవాలయానికి రాసిచ్చి నిత్యం స్వామి సేవలో ధన్యతచెందుతూ పుష్పోద్యానం వగైరా ఏర్పాటు చేశాడు .ఇలాంటి ఘనకార్యాలు ఎన్నిటినో లింగమూర్తి దాసుగారు అనంతపురం ప్రాంతం లో చేసి ఘనకీర్తి పొందారు .

## గోదావరి జిల్లాలో సత్కార్యాలు

అనేక సేవాకార్యక్రమాలలో మునిగి తేలుతున్న దాసుగారి ఆరోగ్యం దెబ్బతినటం వలన విశ్రాంతికోసం సెలవుపెట్టి అత్తగారింటికి వెళ్ళారు .దారిలో వారికొడుకు కృష్ణారావు చనిపోయాడు .మరదలి అత్తగారి ఊరు రాజానగరం వెళ్ళారు. అక్కడ తోడల్లుడు సుబ్బారావు గారు హెడ్ మాస్టర్ .ఒకరోజు ఒకకుమ్మరి జాతక రహస్యాలు దాసుగారు చెప్పగా ,ఆయన ప్రతిభ లోకానికి బాగా చాటింపు అయింది .జనాలు వచ్చి తమ జాతకాలు చెప్పించుకొనేవారు ఒకరోజు తోడల్లుడు అడిగితె ఏడాది లోపల మరణం ఉందని చెప్పారు .ఇంట్లో వాళ్ళు ఏడుస్తుంటే భార్యకూడా నాలుగేళ్ళలో చనిపోతుందని చెప్పారు.ఈ వూళ్ళో రామ సప్తాహం వైభవంగా జరిపించారు .

అక్కడినుంచి జగ్గం పేటవచ్చి సప్తాహం మొదలుపెట్టారు .రెండురోజులతర్వాత పూజలో ఉన్న రామపట్టాభిషేకం చిత్రాన్ని చూసి జనం భయపడిమూర్ఛ పోగా ,ఒక జమీందారు వచ్చి ''మీ రాముడిని చూసి జనం వణుకుతున్నారు ఏదైనా ప్రయోగం చేయండి ''అంటే తనకు మంత్రాలు ప్రయోగాలు రావని ,రాముడే సప్తాహాన్ని పూర్తీ చేయిస్తాడని చెప్పారు .మర్నాడు ఒకగుమాస్తాను పంపగా ఆతడుకూడా పటం చూసి మూర్చపోయాడు .రాత్రి 9గంటలకు రామ పటం ఫెళఫెళ మంటూ విరిగిపోయింది .మడపం అంటుకొన్నది .ఓం శాంతి అంటూ జపించగా మంటలు చల్లారాయి .మంటపం లో దాసు గారి పట్టు పంచ ,ఒక బ్రాహ్మణుడి రామాయణపారాయణ గ్రంథం, పట్టు బట్ట కొన్ని కాగితాలు తగలబడ్డాయి .ఆతగులబడిన ఒకకాగితం లో ''ఆ రోజ ప్రాలుమాలి చదువవమాని తదనంతర కథ ముగించాను ''అని ఆబాపడు రాసుకొన్న విషయం తెలిసింది .అంటే పారాయణం లో ఒకరోజు చేయాల్సింది చేయకుండా మర్నాటి పారాయణం చేయటం వలన జరిగిన అనర్థం అన్న మాట .

పెద్దాపురం లో అంతకు ముందు ఎప్పుడూ మంచి కార్యాలు జరగకపోవటం చేత దానికి ''పంచ మహా పాతక పట్టణం ''అనే పేరొచ్చిందట .ఇక్కడ దాసుగారు బ్రహ్మాండమైన సప్తాహం చేసి ఆపేరు పోగొట్టే ప్రయత్నం చేశారు .ప్రతి ఇంటి గోడపై సీతారామ అని రాసుకొన్నారు .తినేది అంతా సీతారామ ప్రసాదంగా భావించారు .తర్వాత రామపట్టాభిషేకమూ జరిపించారు .''ఇలు వెడలని కులకాంతలు –చెలరేగి ''నమో నమో హృషీ కేశ ''యటం-చెలుగెత్తిపల్కుచును వీ –థుల నడచిరి భక్తితమ మతుల నుప్పొంగన్ ''అని మహాభక్త విజయం లో రికార్డ్ అయిన సప్తాహం ఇది . అప్పుడే శివుడికి లక్ష బిల్వార్చన అమ్మవారికి లక్ష కుంకుమ పూజ కూడా జరిపించారు ,రాముడికి లక్ష తులసిపూజ కన్యకాపరమేశ్వరికి కొత్త యంత్రస్థాపన ,లక్ష కుంకుమార్చన అపూర్వమైన అన్నదానం బీదలకు వస్త్ర సమర్పణ నభూతో గా జరిపించారు దాసుగారు .మొదట్లో నిరుత్సాహపరచిన ధనికులు క్రమగా దాసుగారి సద్భావనకు ముగ్ధులై దాసోహమన్నారు .

పెద్దాపుర సప్తాహ అవబృధ స్నానం అయ్యాక దాసుగారు కాకినాడ వచ్చి మహావైభవంగా సప్తాహం చేశారు .పెట్టిన సెలవు అయిపోగానే దాసుగారు గిద్దలూరు సబ్ మేజిస్ట్రేట్ కోర్ట్ లో హెడ్ గుమాస్తాగా చేరారు .అనుకోకుండా అక్కడ సప్తాహం మొదలుపెట్టి రంగరంగా వైభవంగా పూర్తీ చేశారు

తూగోజి రామ చంద్రాపురం దగ్గర బిక్కవోలు లో కామధేనువు చే ప్రతిష్టింప బడిన గోలింగేశ్వర దేవాలయం శిథిలం లో ఉంది .అక్కడి సుబ్బారాయుడుస్వామికి మార్గశిర శుద్ధ షష్ఠినుంచి బ్రహ్మోత్సవాలు వైభవంగా చేస్తున్నాడు హరికథలు నాటకాలు,పాటకచేరీలు ఏర్పాటు చేసేవాడు .1928బ్రహ్మోత్సవాలలో కూచిమంచి మూర్తిరాజు గారు రామదాసుచరిత్ర హరికథ చెప్పి భక్తులను ఓలలాడించారు .ప్రజలంతా ఆపందిళ్ళలోనే మరో సప్తాహం చేయాలని భావించి ,5వేల రూపాయలు పోగు చేసి ఇచ్చారు .ఊరిజనం లో బ్రాహ్మణ అబ్రాహ్మణ తగాదాలు వచ్చి ముందుకు సాగకపోతే గిద్దలూరులో ఉన్న దాసుగారిని వచ్చి బాధ్యత తీసుకోమని ఆకెళ్ళ వ్యాఘ్రప్ప గారు మరికొందరు విన్నవిస్తూ

టెలిగ్రాం ఇవ్వగా ,వెంటనే బయల్దేరి రాగా కొందరు ఆయనకు ఇక్కడి కలహ కారణాలు చెప్పగా దాసుగారు ''రామాజ్ఞ పొంది వచ్చాను .రేపటి నుంచి సప్తాహం ప్రారంభమవుతుంది ''అని చెప్పి ,మర్నాడు ఉదయం వేలాది జనం తో గోదావరి కాలువలో స్నానం చేసి విదులవెంట భజన చేస్తూ గోలింగేశ్వరాలయం చేరి పూజారినడిగి రామ పట్టాభి షేకపటాన్ని తీసుకొని సప్తాహం ప్రారంభించారు .రెడ్లుఅడ్డంకులు కల్పించారు మొదటి రెండు రోజుల్లో. కరణంగారు దాసు గారిని ''ఇక మీరు గిద్దలూరు వేవెళ్లిపోతేనే మంచి దేమో ?" అనగా ,మూడో రోజునుంచి ముఠా నాయకుడు ఒకరికి రాత్రి వేళ పెద్ద పెద్ద కోతులు కనిపించి పళ్ళు కాయలు తింటూ భయభ్రాంతుల్ని చేయగా మర్నాడు ఉదయమే తోటలోంచి కాయగూరలు కోసి సప్తాహానికి పంపాడు .అసలు మొదట్లో జనమే లేని ఆలయం జనం తో కిటకిటలాడింది .కోలాటాలు భజనలు పరవశంగా జరిగాయి .ఊరివారి ఉత్సాహానికిఅవధులు లేకుండా పోయి సప్తాహం దిగ్విజయమై బీదల అన్నదానం ఘనం గా జరిగి ముగిసి అందరికి సంతృప్తి కలిగించింది .రెడ్డి నాయకులు దాసుగారికి దాసులై రాత్రీ పగలు కంటికి రెప్పలాగా చూసుకొన్నారు .ప్రజలంతా దాసుగారి వెంట రైల్వే స్టేషన్ కు నడిచి వెళ్లి అపూర్వంగా వీడ్కోలు పలికారు .దాసు గారిని భుజాలపై ఎక్కించుకొని స్టేషన్ లో అరగంట సేపు ఆడారు .అందుకని బండి అరగంట లేటుగా అక్కడి నుంచి బయల్దేరింది

1928లో దాసుగారు బిక్కవోలులో వందరోజుల గోలింగేశ్వరస్వామికి కోటి బిల్వార్చన మహా వైభవంగా జరిపించారు .చేతిలో కాని లేకుండా కార్యక్రమం ప్రారంభించేవారు .పార్వతీ పరమేశ్వరులే తన యజమానులని తాను దండోరా వేసే బంటు ను మాత్రమె అని నూరురోజుల పూజ ఆయనే జరిపించుకొంటారని చెప్పేవారు ,అనుకొన్నట్లుగానే ప్రతిరోజూ కోటిబిల్వార్చన అమ్మవారికి కోటి కుంకుమార్చన 100రోజులు నిర్విఘ్నంగా అత్యంత వైభవంగా అందరి సాయంతో దాసు గారు నిర్వహించి సరికొత్త రికార్డ్ నెలకొల్పారు .

## భార్య మరణం

దాసుగారు భార్య ప్రసవం కోసం అత్తారింటికి తీసుకు వెళ్ళారు .కొద్దిరోజుల్లోనే ఉబ్బు వ్యాధి వచ్చింది .రాజమండ్రిలోని ఘోషా ఆస్పత్రికి తీసుకు వెళ్ళే ప్రయత్నం చేశారు దాసుగారు సెలవు పెట్టి వచ్చేసరికి మామగారు ఆమెను సవారీ బండిలో రాజమండ్రి తీసుకు వెడుతుండగా భార్య కాస్త కాఫీ ఇమ్మని చెప్పగా తయారు చేయించి ఇస్తే దాసుగారు ఆమె పెదవులకు అందించగా ఆమె సంతృప్తిలో కన్ను మూసింది .బండిలో నుంచి ఆమె శవాన్ని దింపించి ,ఆమె తలను తన లొడపై ఉంచుకొని దీర్ఘాలోచనలో మునగగా అందరూ గొల్లుమన్నారు .దాసుగారు తన ఇష్ట దైవం లో బాధ చెప్పుకోగా ఆయన వేదాంత వచనాలతో ఊరడించి ,అందరికిధైర్యం చెప్పి ఉత్తర క్రియలు యధావిధిగా నిర్వర్తించారు .

## ద్రాక్షారామ కోటి పత్రిపూజ

భార్య మరణానికి సెలవుపై వచ్చిన దాసుగారికి అకస్మాత్తుగా ద్రాక్షారామం లో కోటిపత్రి పూజ చేయాలని ఆలోచనవచ్చి ,ఆషాఢ అమావాస్యకు అక్కడికి చేరి ,మర్నాటి నుంచి కోటిపత్రి పూజ ప్రారంభమౌతుందని తెలియ జేశారు .చేతిలో చిల్లిగవ్వ లేదు .అప్పటికే నాలుగు బస్తాల మారేడు దళాలు వచ్చాయి. మర్నాడు సప్తగోదావరి లో స్నానం చేసి ,భీమేశ్వరాలయం చేరి తాము తెచ్చిన జలాలతో విఘ్నేశ్వరునికి అభిషేకం చేసి ,బ్రాహ్మణులతో పూజా సంకల్పం చేయించి అందర్నీ ఆశ్చర్యపరచారు .పూజారులతో సహా ''ఈ వవెర్రోడికి ఎంత లోస్తే అంత ''అని సణుగుడు మొదలుపెట్టగా దాసుగారు ''ఇది అమ్మ మాణిక్యాంబ సంకల్పం నాదికాదు .బిక్క వోలు పూజలో ఉన్నప్పుడే నన్ను ఆహ్వానించింది అనటానికి ఈ జోగావదానులే సాక్షి .ఈయనే ఆమెతరపున నాదగ్గరకు దూతగా వచ్చారు .దీనికికర్త లోకాధినాధుడు ఫాలాక్షుడు భీమేశ్వరుడే .నేను తప్పెట వాయించే వాడినే .అమ్మవారే దీనికి పూనుకొన్నది .ఈశ్వర సంకల్పం నిరాటంకంగా జరుగుతుంది అనుమానం వద్దు ''అన్నారు .

ఇంతలో బిక్కవోలు నుంచి ఒక బ్రాహ్మణ దంపతులు రాగా ,వారిగోత్రనామాలతో పూజ మొదలు పెట్టించారు .ఆక్షణం నుంచి జనం అడగకుండానే ముందుకు వచ్చి తోచిన ద్రవ్యం అందించారు .దీనికి విఘ్నం కలిగించటానికి ధర్మకర్తను లోబరచుకొని కొందరు తప్పతాగి వచ్చి దాసుగారిని కొట్ట బోగా,ఆయన ఉపన్యాసం వినగానే మంత్రముగ్ధమైన పాముల్లాగా అయిపోయి పూర్తి సహకారం ఇచ్చారు .అంతగొప్పకార్యక్రమం ఎప్పుడూ జరగలేదని అందరూ వేనోళ్ళ దాసుగారిని స్తుతించారు .పూర్ణాహుతిలో పది వేల రూపాయల విలువగల హోమ ద్రవ్యాలు సమర్పింప జేసి , నభూతో అనిపించారు .పిఠాపురం లో అత్యంత వైభవం గా కోటి పత్రి పూజ నిర్వహించిన గరిమెళ్ళ విశ్వనాధ శాస్త్రిగారు చివరి రోజున ఇక్కడికి వచ్చి పూర్ణాహుతి సమయంలో ''మహత్కార్యం చేసి విజయం సాధించావు నాయనా '' అని ఆశీర్వ దించి దాసుగారిని ఆప్యాయంగా కౌగిలించుకొని ఆనందా శ్రువులు రాల్చారు .ఈపూజా దినాలలో దాసుగారు చిన్న పంచ మొలకు చుట్టుకొని ఉపన్యసించేవారు .జనం రాత్రీ పగలు లేకుండా తండోప తండాలుగా వచ్చి చూసి విని ధన్యత చెందారు .ఒక రోజు వారి ప్రవచనం –''ముసలమ్మను(మాణిక్యాంబ ) చూడటానికి వచ్చారా నాయనలారా!శంకర భగవత్పాదులు ప్రతిష్టించిన శక్తిపీఠంఇది .2వేల ఏళ్ళు యోగ నిద్రలో ఉన్న భీమేశ్వరుని మేల్కొల్పి ఈ దేశవాసులు ధర్మహీనులై ప్రవర్తిస్తున్నారు .వీరిని ఆదుకో నాధా"అనగా భీమేశ్వరస్వామి నన్ను చూసి ''ఒరేయ్ !టముకు వేయటంలొ నేర్పరివి .మా ఆలయానికి వచ్చి సింహద్వారం ముందు ''భీమేశ్వరునికి కోటి బిల్వార్చన ,మాణిక్యాంబ కు కోటి కుంకుమ పూజ ''అని ఎలుగెత్తి చాటిస్తూ డప్పు మోగించు ''అని ఆనతివ్వగా ఇక్కడికి వచ్చిమీకు తెలియజేశాను .నేను సన్యాసినికాను దిగంబరుడనికాను .నిర్బల,కురూపిని .గోచిపాత రాయుడిని .నాదగ్గర పైసా లేదు కాని ఈకార్యానికి రోజుకు వేలకొద్దీ రూపాయలఖర్చు .ఇది దక్షుని యాగం భగ్నమైన చోటు .మీకంటేనివిధాలా అతి తక్కువవాడిని నేను .నేనే ఈ కార్యం సంకల్పిస్తే, మీరు ఇలాంటివి ఎన్నైనా చేయగల సమర్ధులు అని గుర్తించండి ''అని చెప్పారు నూరు రోజుల మహా క్రతువు అత్యంత వైభవంగా ముగిసింది .దాసుగారికి చివరి రోజున ఘనసన్మానం చేసి సన్మానపత్రం రాయించి చదివించి గౌరవించారు .

ఈకార్యక్రమం ముగిశాక జీర్ణమైన భీమేశ్వర ఆలయ గోడలు బాగు చేయించారు పురజనులందరూ కలిసి .

## ముక్తీశ్వరం ,చంద్రవరం

గోదావరి మండలం లో కమలాపురం రాజోలు తాలూకాలు రెండు ఉద్యానవనాలు .విద్యలకు ఆటపట్టు ,ప్రకృతి సంపదకు నిలయం .ద్రాక్షారామ తర్వాత క్షణ ముక్తీశ్వరం లో దాసుగారు ఒక సప్తాహం వైభవంగా జరిపారు .కవిపండితులంతా దాసుగారికి బ్రహ్మ రధం పట్టారు .ఒకసారి రాజమండ్రి పడవ మీద వెళ్లాలను కొంటె అది వెళ్ళిపోతే .కనపడిన

దారిగుండా నడుస్తూ చంద్రవరం చేరారు .ప్రజలు ఆదరంగా ఆహ్వానించి ''ఇది మీ పూర్వుల గ్రామం .అన్ని చోట్లా మహాకార్యాలు చేశారు ,ఇక్కడ కూడా ఏదైనా ఒక సత్కార్యం చేయండి ''అని కోరగా ,ఒక కాపు నూట యాభై ఏళ్లుగా రామాలయం ఇక్కడ కట్టించాలని అనుకొన్నా జరగలేదు మీరు ప్రయత్నించండి అని కోరగా ''నువ్వు ఎంత చందా ఇస్తావు ?"అని అడిగితె ఒక అణా చేతిలో పెట్టాడు .దానితో ఒక టెంకాయ తెప్పించి దగ్గరలో ఉన్న రామమందిరానికి వెళ్లి ,రాముడిపటానికి నమస్కరించి కొబ్బరికాయకొట్టి నైవేద్యం పెట్టి ,లోపలి గరుడ స్తంభం ఫోటో తెచ్చి ,ఒక ఇంట్లో ఉంచి ,పూరిపాకలో ఉన్న మందిరాన్ని ఊడ దీయించారు .కాసేపటికే అది నేల మట్టమైంది .ఆరాత్రి పునాదులు తీశారు .

మర్నాడు ఉదయం ఆరువందల రూపాయలు ,చందాల వివరాలు దాసు గారి చేతిలో పెట్టగా దాన్ని తీసుకోకుండా ,ఒకసంఘాన్ని ఏర్పాటు చేసి వారికిచ్చారు .రామమందిరం ఆఘమేఘాలమీద పనులు జరుగుతున్నాయి .అప్పుడే పాలపర్తి సూర్యనారాయణగారు దాసుగారిని చాగలమర్రి కి తీసుకు వెళ్ళటానికి వచ్చారు .అందరితో పాటు భజన చేసి శ్రీమంతులు పునాదులు త్రవ్వుతుంటే ,అగ్రవర్ణ స్త్రీలు భజన చేస్తుంటే ,చూసి ఆశ్చర్యపోయారు .అక్కడి నుంచి రాత్రి 12 గంటలకు ప్రయాణానికి రైల్వే స్టేషన్ కు వెడితే ,అక్కడ దాదాపు మూడువందలమంది జనం చేరగా ,అయిదారుగంటలలో దాసుగారు ఆరు ఉపన్యాసాలు ఇచ్చారు .ఒక్క కాసు కూడా కూలి తీసుకోకుండా అగ్రజాతి స్త్రీలు సంపన్నుల గృహిణులు భజన చేస్తూ సున్నపు గానుగ త్రిప్పి సున్నం తయారు చేసి రామలయ నిర్మాణం పూర్తీ చేశారు .ప్రతిష్టకోసం దాసు గారి రాకకై నిరీక్షిస్తున్నారు

## చాగలమర్రి

చాగలమర్రికి దాసుగారు శుక్ల సంవత్సర మాఘ బహుళ చతుర్దశి నాడు వచ్చారు అంతకు ముందు ఆగ్రామం లో రెండు నెలల నుంచి ఒక సాదువున్నాడు .ఆయనకు బావిలో సాలగ్రామం దొరికితే శ్రద్ధగా పూజిస్తున్నాడు .ఆ సాలగ్రామం తనకు ఇవ్వమని సూర్య నారాయణ గారు కోరితే దాసు గారు వారించి"ఇది ఉత్కృష్ట లింగం సామాన్య గృహస్తు భరించలేడు.దేవాలయం లో ప్రతిష్టించాలి అని చెప్పారు .దగ్గరలో ఉన్న చెన్న కేశవ దేవాలయం లో ఉన్న ఖాళీ మందిరానని అప్పటికప్పుడే బాగు చేయించి ఆరాత్రి 12 గంటలకు అమావాస్య మంగళవారం నాడు ప్రతిష్టించి మూడవరోజు ఈ భవాని శంకర లింగానికి బిల్వార్చన చేశారు .

చెన్న కేశవాలయం1350లో చోళ రాజ ప్రతిష్టిత పురాతనాలయం అని శాసనం ఉంది .భూవసతిలేక పూజా పుంస్కారాలు కనీసం దీపారాధన కూడా జరగటం లేదు .దాసుగారి లింగ ప్రతిష్టతర్వాత జనం లో కదలిక వచ్చి 5వేల రూపాయలు చందా వసూలు చేసి శాశ్వతం గా గాపూజ జరిగే ఏర్పాటు చేశారు .దాసుగారి లింగ ప్రతిష్ట ప్రభావమే ఇదంతా అందరి భావన .

## సురభేశ్వరి కోన సప్తాహం

సెలవు పూర్తయ్యాక దాసుగారిని కంభం తాలూకా రాచర్ల ఫిర్కా రెవిన్యు ఇన్స్పెక్టర్ గా బదిలీ చేశారు .రాగానే జమదగ్ని మహాముని ఆశ్రమం ,కోటి లింగాలకు ఉనికిపట్టు ,గండకీ నదీ తీర ప్రదేశం అయిన సురభేశ్వరి కోన లో వైభవంగాసప్తాహం చేశారు .అహోబిల క్షేత్రం యొక్క దీన స్థితి దాసుగారికి వివరించి ,పెద్దలు ఏదైనా ఉపాయం ఆలోచించమని కోరగా ,మాఘ శుద్ధ సప్తమి మంచి ముహూర్తంగా భాగవత ప్రశ్న ద్వారా భావించి 26-3-1931అహోబిల క్షేత్రం లో సప్తాహం చేయటానికి నిశ్చయించారు .జయ్యరుగారి సలహా సంప్రదింపులతో అది నిర్విఘ్నంగా పూర్తయింది .

శ్రీ దాసు లింగమూర్తి దాసు గారి భగవన్నామ సంకీర్తనలు చాగలమర్రి భక్తసమాజం వారు నేటికీ పాడుతూనే ఉన్నారు -

మనకు తెలియని మహాయోగులు

ఆధారం –శ్రీ కొత్తపల్లి హనుమంతరావు గారి "మహాయోగులు "పుస్తకం.


ortrait of Mahayogi Lakshmamma Avva as found in the temple

## 1 ఖండయోగి మహామౌని ఆదోని తిక్క లక్ష్మమ్మ -1815-1933

ఆంధ్రప్రదేశ్ కర్నూలు జిల్లా ఆదోని లో తిక్కలక్ష్మమ్మ మహా సమాధి తెలుగు కర్నాటక ప్రజలకు తీర్ధ యాత్రాస్థలం. ఆదోని దగ్గర మూసానపల్లె లో మాదిగ మంగమ్మ, బండెప్పా దంపతులకు 1815లో జన్మించింది. బాల్యం నుంచే అన్నపానాదులు ఆటలు పై ఆసక్తిలేకుండా మౌనంగా ఉండేది. పెళ్లి చేస్తే దారిలోకి వస్తుందనే ఆశతో పెళ్లి చేసినా మార్పు రాలేదు. ఇరవై ఏళ్ళకే ఆదోనిపట్టణం వీధుల లో అన్నం నిద్ర లేకుండా ఎండా వానా లేక చేయకుండా ఏదో వెతుకు తున్నట్లు మౌనంగా కూనిరాగాలు తీస్తూ తిరిగేది. ఒక సత్పురుషుడు ఆమెను గుర్తించి మంత్రోప దేశం చేశాడు.


The Mahayogi Lakshmamma Temple, Adoni

అప్పటి నుంచి గంటలతరబడి సమాధి స్థితిలోనే ఉండి పోయేది. సమాధి నుంచి లేచి వీధుల్లో తిరుగుతూ చెత్త వేసే తొట్టెలదగ్గర కూర్చోటం, పడుకోవటం చేసేది. అందరూ తొట్టి లక్ష్మమ్మ, తిక్క లక్ష్మమ అనేవారు. ఆమె త్రికాలజ్ఞాని అనీ, నిగ్రహానుగ్రహ సమర్ధురాలని తెలిసినవారు మాత్రం ప్రేమతో భక్తితో ఆదరించేవారు. ఖండయోగం తో సహా చాలా మహిమలు చూపేది. దూర దృష్టి,దూర శ్రవణం, పరచిత్తజ్ఞానం తో భక్తుల ఆర్తుల దీనుల సమస్యలను పరిష్కరించి మేలు చేకూర్చేది. ఆరుబయట పడుకున్నప్పుడు వర్షం పడితే, ఆమె మీద చినుకుకూడా పడేదే కాదు. రెండుమూడు రోజులు నిర్వికల్ప సమాధిలో బ్రహ్మానందాన్ని అనుభవించేది. శ్రీముఖ నామ సంవత్సర వైశాఖ బహుళ సప్తమి మంగళవారం 16-5-1933 ఉదయం 118వ ఏట దేహాన్ని చాలించింది. తర్వాత ఆమె పేరిట మఠం నిర్మించి, ప్రతిశుక్రవారం విశేషపూజలు, అభిషేకాలు చేస్తున్నారు. ప్రతియేటా ఆదోనిలో కర్ణాటకలోని రాయచూరుజిల్లా ఎలుబు గిరి లోనూ ఆరాధనోత్సవాలు వైభవం గా నిర్వ హిస్తారు.

## 2 ప్రవక్త నాయబ్ రసూల్

**నాయబ్ రసూల్ -1720-1780**

సయ్యద్ హాజీ రహ్మ తుల్లా నాయబ్ రసూల్ 1720లో కర్ణాటక బీజాపూర్ జిల్లా బెల్గాం లో జుమ్మా మసీదు పాలన పోషణ, పరిశుభ్రతల బాధ్యతలు చూసే ఇరాన్ దేశీయుడు హజ్రత్ ఖాజా ఆలం దంపతులకు జన్మించాడు. ఖాజా రహ్మతుల్లా అని పేరు పెట్టారు. ఏడేళ్ళకే ఖురాన్ కంఠస్థం గా వచ్చేసింది. 8వ ఏట అరబ్బీ, ఉర్దూ, పార్శీ సాహిత్యాధ్యయనం చేసిన బాలమేధావి. తల్లి చనిపోతే సవతి తల్లి బాధ భరించలేక 15వ ఏట ఇల్లు వదిలి పవిత్ర ముస్లిం క్షేత్ర సందర్శనం చేస్తూ, కర్నూలు జిల్లా నంద్యాల చేరాడు. అక్కడ హబీబా అనే పేదింటి పిల్లను పెళ్ళాడి, ఆమె హఠాత్తుగా చనిపోవటం తో విరక్తితో కర్నూలు నవాబు సైన్యం లో సిపాయిగా చేరాడు. అప్పుడే మారిఫత్, తసవ్వుఫ్ అనే ఇస్లాం మత విషయాలు తెలుసుకోవాలనే కాంక్ష పెరిగింది.



అరేబియాకు చెందిన" హజ్రత్ అలవిబ్రుం రహమతుల్లా అల్లె"కర్నూలు రాగా ఆయన్ను 12ఏళ్ళు దీక్షతో సేవించి ఆధ్యాత్మ విజ్ఞానం ఆకళింపు చేసుకొన్నాడు. తర్వాత మక్కా చేరి, "అబ్బే కుంబిన్"కొండపై ఉన్నమక్కీ రహ్మతుల్లాను సందర్శించి, దీవెనలుపొంది, 41రోజులు దీక్ష చేసి మహ్మద్ రసూలిల్లా సమాధి నుండి దివ్య సందేశం అందుకొనగా ప్రజలు ఆయనను "నాయబ్ రసూల్ "అంటే ప్రవక్త ప్రతినిధిగా పిల్చారు. ఎన్నో అద్భుతాలు మహిమలు చూపాడు. శిష్యులు చాలామంది చేరారు.

రహ్మతాబాద్ లో 1763లో ఒక మసీదు నిర్మించి, దాని దగ్గర ఒక యోగాశ్రమం నిర్మించుకొన్నాడు. 1780లో మెడమీద కంతి పెరగాగా మందుకై, ఉదయగిరి కొండపైకి వనమూలికలకోసం వెళ్లి, అక్కడే దేహం చాలించాడు. నెల్లూరు జిల్లా అనా సముద్రంపేట ప్రజలు ఆయన దేహాన్ని 1-4-1780 న వికారి నామ సంవత్సర ఫాల్గుణ బహుళ ద్వాదశి నాడు అనాసముద్రంపేటలో సమాధి చేశారు. అప్పటినుంచి ప్రతియేటా అనాసముద్రం పేటలో నాయబ్ రసూల్ ఉత్సవాలు ఘనంగా చేస్తున్నారు.

## 3 మహా విష్ణు సాక్షాత్కారం పొందిన జ్ఞానయోగి

**రామయోగి -1895-1962**

నెల్లూరుజిల్లా వేదాద్రి దగ్గర మోపూరులో చేవూరి రావమ్మ, పిచ్చి రెడ్డి దంపతులకు 29-7-1895 మన్మథ నామసంవత్సర శ్రావణ శుద్ధ అష్టమి సోమవారం రామి రెడ్డి జన్మించాడు. పసితనం లోనే తండ్రి చనిపోతే మేనమామ దగ్గర అన్నారెడ్డి పాలెం లో పెరిగి చదువు నేర్చాడు. భాగవత రామాయణాలలోని సత్య ధర్మ దృష్టి వంట బట్టించ చుకున్నాడు. వాల్మీకి కబీరు లాగా తపోధనుడు కావాలని గంటలతరబడి ధ్యాన నిమగ్నమయ్యేవాడు. భగవత్ సాక్షాత్కారం కోసం పరితపించేవాడు. దీనికోసం రామనామ జపం తీవ్రంగా చేస్తూమనసును ఏకాగ్ర చిత్తం చేశాడు.



బాపట్ల బ్రహ్మానంద తీర్ధులు ఆధ్యాత్మిక ఉపన్యాసాలతో ప్రేరణ కలిగించటం విని, రామి రెడ్డి ఆయన్ను ఆశ్రయించి రామ తారక మంత్రోప దేశం పొందాడు. గురువు ఆదేశం తో రోజుకు అయిదు వేలసార్లు రామతారక మంత్రం జపిస్తూ జ్ఞానపిపాస ఆత్మ జిజ్ఞాసా బలీయమై మనసు వైరాగ్య పూర్ణమైంది. సర్వం త్యజించి హిమాలయాలలో ఒంటరిగా తపస్సుకు బయల్దేరితే దారిలో గుర్వాజ్ఞమేరకు వెళ్ళకుండా స్వగ్రామం వెళ్లి పచ్చని తోటలో చిన్న కుటీరం నిర్మించుకొని ఏకాంతజప ధ్యానాలను తీవ్రతరం చేశాడు. రోజు రాత్రి ఆరుమైళ్ల దూరం లో ఉన్న నరసింహులు కొండకు వెళ్లి తపస్సు చేసి, తెల్లారే సరికి ఆశ్రమమం చేరేవాడు

ప్రాణాయామం, మౌనం, యోగాసనాలు, దుఖానుభవాలు తప్పించుకోటానికి ప్రతీకార వాంఛ లేకుండా శాంతంగా, సహనంగా అనుభవించే తితిక్ష, నిష్కామం సమభావం మొదలైన అష్టాంగా లతో కూడిన అష్టాంగ యోగం(అహింస, సత్యం, అస్తేయం –అంటే ఇతరుల ద్రవ్యం పై కోరిక లేకపోవటం, దొంగతనం లేకపోవటం, బ్రహ్మ చర్యం, దయ, ఆర్జవం –అంటే అన్ని జీవరాసులపై సమభావం, క్షమ) సాధించాడు. నిర్వికల్ప సమాధిలో ఏకం, నిత్యం అయిన స్వస్వరూపమే మనసులో ప్రకాశించింది. కొంతకాలం రమణ మహర్షి ని గురువుగా భావించాడు. మామిడి గుహలో తపస్సు చేసి, అన్నారెడ్డిపాలెం లో ఆశ్రమం నిర్మించుకొని,12ఏళ్ళు మౌనవ్రతం పాటించాడు. 1936 ఫిబ్రవరిలో రామయోగికి పల్లెపాడు ఆశ్రమం లో "చతుర్భుజ శ్రీ మహా విష్ణువు సాక్షాత్కారం "అనుగ్రహించి దర్శనమిచ్చాడు. రమణమహర్షి భావవ్యాప్తిని రామయోగి పల్లెపల్లెకూ తిరిగి ప్రచారం చేశాడు 12-2-1962 ప్లవ సంవత్సర మాఘ శుద్ధ అష్టమి సోమవారం 67వ ఏట రామయోగి విష్ణు సాయుజ్యం పొందాడు. ఒక భక్తురాలు కట్టించిన మందిరం లో సమాధి చేశారు రామయోగి జీవిత చరిత్రను తెలుగు, ఇంగ్లీష్ లలో ఆయన భక్తురాలు తెలుగులో మొదటికవయిత్రి అయిన శ్రీమతి పొనకా కనకమ్మగారు రాశారు

## 4 బాల్యం లోనే పార్వతీ పరమేశ్వరుల చే రామ తారక మంత్రోప దేశం పొందిన

**బ్రహ్మర్షి అబ్బూరు నారాయణ స్వామి -1907-1989**

గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా ఆదర్శ గ్రామం అబ్బూరులో కొమ్మూరు గుణకయ్య,మాణిక్యమ్మ దంపతులకు నారాయణ స్వామి 18-11-1907 ప్లవంగ సంవత్సర కార్తీక శుద్ధ చతుర్దశి గురువారం జన్మించాడు. చిన్నతనం నుంచే భాగవత రామాయణ సారాన్ని గ్రహించే నేర్పు అలవడింది. ఎనిమిదవ ఏట నిశ్చలధ్యాన మగ్నుడై ఉండగా పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమై రామ తారకమంత్రం ఉపదేశించి, జీవితాంతం జపించమని, అవసానకాలం లో మాత్రమే అర్హుడైన భక్తుడికి ఉపదేశించమని చెప్పి, మళ్ళీ తాను 15వ ఏట యోగి రూపం లో వచ్చి అష్టాక్షరీ మహా మంత్రోప దేశం చేస్తానని పరమ శివుడు అనుగ్రహించాడు. బడిలో చదువు గుడిలో తారకనామ జపం ఇంట్లో భగవద్యానం నారాయణకు నిత్య కృత్యాలయ్యాయి.



తల్లి చనిపోయాక ఆధ్యాత్మిక సాధన చేస్తూనే కుల వృత్తి అయిన సన్నాయివాద్యం నేర్చి నాదోపాసనతో పరమేశ్వర సాక్షాత్కారం పొందే సాధనగా చేసుకొన్నాడు. గురువు జొన్నలగడ్డ వెంకటరామయ్య వద్ద భాగవతాది పురాణప్రవచనం చేస్తూ,పతంజలి యోగసూత్రాలనూ ఆకళింపు చేసుకొని యోగాసాధనగా ప్రయోగించుకొన్నాడు. మాదిగల ఇళ్ళకు వెళ్లి చెప్పులు కుట్టటం, వడ్రంగుల ఇళ్ళలో కర్రపనులు నేరుస్తూ కులమతాలకు అతీతంగా మసలాడు. ఒక బ్రాహ్మణ యువకుడితో ఏర్పడిన స్నేహంతో అతని తలిదండ్రులనే గురు దంపతులుగా భావించి సేవించి వేదవేదాంగ రహస్యాలు మంత్రాలు నేర్చాడు. 15వ ఏట శివుడు యోగానంద మహర్షి రూపం లో వచ్చి అష్టాక్షరీ మహామంత్రం, యోగాసనాలు, పంచముద్రాది సాధనాలు నేర్పి ఇచ్చినమాట నిలబెట్టుకొన్నాడు పరమేశ్వరుడు.

సకలయోగ రహస్యాల ఆకళింపు తో వైకుంఠ పర్వతం పై కఠిన తపస్సు చేయగా మొదట మార్కండేయ, తర్వాత ఆదిశేష దర్శనం లభించింది. "గురుదత్త బ్రహ్మర్షి" గా అబ్బూరుకు తిరిగి వచ్చాడు నారాయణ స్వామి యోగీంద్రుడు. కపిల గిరిలో గురువుగారు బ్రహ్మర్షి నారాయణ స్వామికి సుదర్శన మంత్రోపదేశం చేశారు. నిర్జన అరణ్యాలలో ఈ మంత్రాన్ని మూడు నెలలపాటు అహోరాత్రాలు జపించి, అబ్బూరు తిరిగి వచ్చాడు. అప్పటినుంచి అబ్బూరు ఒక తీర్థ క్షేత్రమే అయింది. 1936 లో 36వ ఏట తండ్రి నిర్మించిన లక్ష్మీ నారాయణ మందిరాన్ని చక్కగా అభివృద్ధి చేశారు. గురువు సిద్ధిపొందినతర్వాత గుర్వాజ్ఞ మేరకు కపిల గిరి పీఠాధిపతి గా అభిషిక్తులయ్యారు. తర్వాత వైకుంఠ పురం శేషాద్రిపై వెలసిన శ్రీ, భూ సహిత వెంకటేశ్వరస్వామి సన్నిధిలో కొంతకాలం తపస్సు చేసి మహిమలెన్నో చూపారు. దీనులను హీనులను ఉద్ధరించారు. నాస్తికులను ఆస్తికులుగా మార్చారు. ఆదర్శప్రాయ ఆదర్శ జీవితం గడుపుతూ ఆధ్యాత్మిక భావ జ్యోతి ప్రకాశాన్ని అందిస్తూ విభవనామ సంవత్సర పుష్య భీష్మ ఏకాదశి నాడు 18-1-1989 న 82వ ఏటఇహలోక యాత్ర చాలించి నారాయణ సాన్నిధ్యం పొందారు బ్రహ్మర్షి నారాయణ స్వామి. అబ్బూరులో ఆయన సమాధి స్థలం లో ఏటా ఆరాధనోత్సవాలు ఘనంగా నిర్వహిస్తారు.

## 5 గోదావరి నదిపై నడచిన

**గొంగడి స్వామి అనే గోవింద స్వామి -1855-1927**



కేరళలోని మలబారు ప్రాంతంలో ఆలపాడ గ్రామం లో 13-1-1885 రాక్షస నామ సంవత్సర పుష్యబహుళ దశమి శనివారం నారాయణస్వామి బ్రాహ్మణ వంశం లో జన్మించాడు. పసితనం నుంచే "గోవింద రాం రాం గోపాలహరి హరి"అంటూ నిరంతరం పాడుకొంటూ ఉండటం వలన "గోవింద స్వామి " అని అందరూ పిలిచేవారు. ఎప్పుడూ గొంగడి( ళి)మీద కప్పుకోటం చేత గొంగడి స్వామి అనీ, వరిగడ్డిలో కూర్చుని ధ్యానం చేయటంతో వరి గడ్డి స్వామి అనీ, పెద్దపెద్ద గోళ్ళు ఉండటం వలన గోళ్ళ స్వామి అనికూడా పిలిచేవారు. బ్రహ్మచారికనుక బ్రహ్మచారి స్వామి, సంగీతం నేర్చి వేణువుతో అద్భుతంగా గానం చేసే నేర్పున్నందున "గోపాలస్వామీ "అని కూడా పిలిచేవారు.

చిన్నతనం లోనే తలిదండ్రులు చనిపోవటం చేత దేశదిమ్మరిగా తిరుగుతూ యోగులను జ్ఞానులను ఆశ్రయించి సన్యాసం పొంది గురువు ఆదేశం తో భక్తిజ్ఞానాలు బోధిస్తూ వేణుగానం తో శారీరక మానసిక వ్యాధులు నివారిస్తూ, దేశమంతా తిరిగాడు. ఉత్తరభారతం లో శిష్యగణం బాగా ఎక్కువ. 1887లో మహారాష్ట్రలోని పాండురంగని పండరి క్షేత్రం లో ఉండగా ఆయనకు ఒక తెల్లవారు ఝామున భద్రాచల సీతారాముల దర్శనమైంది.



18మంది శిష్యులతో భద్రాచలం బయల్దేరాడు. 1892లో కర్ణాటకలో బీదరు, బళ్ళారి, శృంగేరి,ఉడిపి క్షేత్రాలలో ఆశ్రమాలు స్థాపించాడు. నాలుగేళ్ళు కన్నడ దేశమంతా తిరిగి, 17మంది శిష్యులనుస్వస్థలాలకు పంపించి ఒకే ఒక్క శిష్యునితో 1896లో ఆంధ్ర దేశం లో ప్రవేశించి, ముందుగా తిరుమలలో శ్రీవారిని దర్శించి, పేదనారాయణ పురం లో కొన్నాళ్ళు గడిపి, ఉన్న ఒక్క శిష్యుడిని తనను 1927 ప్రభవ సంవత్సర శ్రీ రామ నవమి నాడు భద్రాచలం లో కలుసుకోమని ఆదేశించాడు. అక్కడి నుంచి కాలినడకన ఒంటరిగా నడుస్తూ పల్లెలు పట్టణాలు,అడవులూ దాటుతూ సత్రాలలో ఉంటూ తింటూ మౌనంగా గడిపాడు. కడప దాటాక" చిన్నమాచు పల్లె" లో శ్రీ ఆంజనేయ ప్రతిష్ట చేసి, ఆర్తుల బాధ తొలగించాడు.ఎన్నో మహిమలు లీలలు చూపాడు.

1904లో వల్లూరులో కొన్ని నెలలు ఉండి,గోపూజ చేస్తూ, దాని పాలు పితికి అక్కడే ఉన్న బావిలో పోస్తూ ఆ నీటినే ఔషధంగా ఇచ్చేవాడు. సకల రోగాలు నయమయ్యేవి.1916 లో భద్రాచలం చేరి, ప్రతిరోజు గోదావరి నీటిపై నడుస్తూ,నది మధ్యకు చేరి, శ్రీరామాలయ శిఖరం దర్శించి స్నానం చేసి, గట్టుకు వచ్చి, తపస్సు ధ్యానం చేసి ఆలయం లో సీతారాములను దర్శించేవాడు. భద్రాచల మఠం లో లింగ ప్రతిష్ట చేసి, తపస్సుకోసం భూగృహం ఏర్పాటు చేసుకొని, అందులో పదేళ్ళు ఏకాంతంగా తపస్సు చేశాడు భద్రాచలం గోవింద స్వామిగా ఇక్కడ ప్రసిద్ధుడు.. 6-5-1927 ప్రభవ సంవత్సర వైశాఖ శుద్ధ చవితి గురువారం 72వ ఏట బ్రహ్మ రంధ్రం చేదించుకొని పరమాత్మలో లీనమయ్యాడు గోవిందస్వామి. పంచమి నాడు సమాధి చేశారు. ఏటా ఆరాధనోత్సవాలు ఘనంగా నిర్వహిస్తారు సమాదినుంచే మహిమలు చూపుటాడని విశ్వాసం.

## 6 సంఘ సంస్కర్త

### హంసానంద స్వామి -1859-1980

బహుభాషా కోవిదుడు, పండితుడు, స్వాతంత్ర్య సమరయోధుడు, రాజకీయ వేత్త, ఆయుర్వేద వైద్యుడు, ప్రకృతి చికిత్సా నిపుణుడు, సంఘసంస్కర్త, 120 ఏళ్ళు సార్ధకంగా జీవించిన వాడు హంసానంద స్వామి. ఉత్తర ప్రదేశ్ లో 1859 సిద్ధార్ధి నామ సంవత్సర శ్రావణ బహుళ పాడ్యమి ఆదివారం జన్మించాడు. తలిదండ్రులు పెట్టిన పేరు నిత్యగోపాల్. బాల్యం లోనే శ్రీ రామ కృష్ణ పరమహంసను దర్శించి, కొంతకాలానికి సన్యసించి, "జ్ఞానానంద అవధూత" అయ్యాడు.

తర్వాత శ్రీ బ్రహ్మానంద" సరస్వతీ స్వామి వద్ద సన్యాసం స్వీకరించి "హంసానంద సరస్వతి "అనే దీక్షానామం పొందారు. ఆశ్రమ ధర్మాలను పాటిస్తూ జ్ఞానబోధ చేస్తూ, ఆరోగ్యబోధకూడా చేసేవారు. శ్రీరామకృష్ణ పరమహంస శిష్యులతో కలిసి సామాజిక, ఆధ్యాత్మిక ప్రచారాల్లో పాల్గొనే వారు. జాతీయోద్యమం లో స్వామి శ్రద్ధానంద, మహాత్మాగాంధీ,వీర సావర్కార్, టంగుటూరి ప్రకాశం, అరవింద యోగి, మదనమోహన మాలవ్యా, రాజగోపాలా చారి వంటి ది గ్గంతులతో కలిసి హంసానంద స్వామి పని చేశారు. సంస్కృత తెలుగు ఇంగ్లీష్ బెంగాలీ, హిందీ రష్యన్ జర్మనీ భాషలలో నిష్ణాతులయ్యారు.

కర్నూలు జిల్లా బనగానపల్లి దగ్గర యాగంటి గుహలో "వేపాకు మాత్రమే తింటూ", కఠోర తపస్సు చేసి, అనేక యోగసిద్ధులు సాధించారు.ఎనిమిదేళ్ళు ఇలా తపస్సు చేసి, 1930 లో బనగానపల్లి చేరి, శిధిల దేవాలయానికి పడమరగా ఉన్న స్థలం లో "స్వస్తి ఆశ్రమం "నిర్మించుకొని, క్రమంగా అభి వృద్ధి చేసి ప్రజల శారీరక మానసిక ఆధ్యాత్మిక ఆనందం కలిగించారు. మానసిక రోగులను ఉపదేశాలతో, వ్యాధి గ్రస్తులకు మందులతో వైద్యం చేసేవారు. ఆయుర్వేద వైద్య వ్యాప్తికి "దయానంద ఫార్మసి "ఏర్పరచి వనమూలికలతో ఆయుర్వేద ఔషధాలు తయారు చేశారు. మందులతో నయంకాకపోతే మట్టిస్నానం తొట్టి స్నానం తైలమర్దనం వంటి ప్రకృతి చికిత్స లతో నయం చేసేవారు. బనగానపల్లి స్వామి అని అందరూ పిలుచుకొనేవారు. 1932 లో "హంసానంద ప్రకృతి ఆశ్రమం "రూపు దాల్చింది. దీనికి ట్రస్ట్ ఏర్పాటు చేశారు. హైదరాబాద్ నాగార్జున ఆయుర్వేద పీఠానికి,విజయవాడ రామమోహన ఆయుర్వేద కళాశాలకు,విజయవాడ ప్రకృతి ఆరోగ్య కేంద్రానికి హంసానంద సరస్వతి అధ్యక్షులుగా కేంద్ర,రాష్ట్ర ఆయుర్వేద నిపుణుల సంఘం సభ్యులుగా ఉంటూ గొప్ప సేవ చేశారు. ఎందరికో వైద్య విద్య నేర్పారు. అనేక సిద్ధులు సాధించినా, కేవలం వశీకరణ శక్తిని మాత్రమే ప్రదర్శించేవారు.

13-1-1980 సిద్ధార్ధి నామ సంవత్సర పుష్య శుద్ధ చతుర్దశి మంగళవారం 120 ఏళ్ళ సార్ధక జీవితాన్ని చాలించారు హంసానంద స్వామి. ఆయన హంస పరమహంసలో లీనమైంది. ఆయనముందే సూచించిన స్థలం లో భక్తులు శిష్యులు సమాధి చేశారు.. ప్రతియేటా పుష్యబహుళ ఏకాదశినాడు హంసానందుల ఆరాధనోత్సవాలు బనగానపల్లి లో నిర్వహిస్తూ పేదలకు అన్నదానం వస్త్ర దానం చేస్తూ సార్ధకత కల్పిస్తున్నారు.

## 7 రాజయోగి

**బ్రహ్మానంద తీర్థులు-1879-1918**

మహారాష్ట్ర కొల్హాపూర్ దగ్గర బ్రాహ్మణాగ్రహారం లో దత్త ఉపాసకుడు విష్ణుభట్టు అనే ఋక్ శాఖ పురోహితుడికి బ్రహ్మానంద తీర్థులు 1879 లో జన్మించాడు చిన్నప్పటి పేరు గణపతి. అయిదవ ఏట అక్షరాభ్యాసం చేసినది మొదలు ఆధ్యాత్మిక భావనతో తల్లితో పాటు దత్తస్మరణ చేస్తూ, సద్గుణాలు అలవరచుకొన్నాడు. ఉపనయనం తర్వాత దగ్గరున్న నదీతీరం లో ఏకాంతం గా భగవద్ధ్యానం చేసేవాడు.





12వ ఏట ప్లేగు వ్యాపించి సోదరులిద్దరూ చనిపోగా, వైరాగ్యం తో ఇల్లువిడిచి దత్తక్షేత్రం నరసోబావాడి చేరాడు. అక్కడి హరికథలు విని తన్మయుడయ్యాడు. తండ్రివచ్చి ఇంటికి తీసుకు వెళ్ళాడు.

1833 లో తపస్సుకోసం హిమాలయాలకు బయల్దేరాడు. 1897 లో బదరి క్షేత్రం చేరి, యోగులవద్ద లంబికాయోగం నేర్చాడు.తర్వాత నర్మదాతీరం గరుడేశ్వార్ చేరి,అక్కడ అపర దత్తాత్రేయుడైన శ్రీ వాసుదేవానంద సరస్వతిని దర్శించి, సేవ చేయగా గణపతి కి దత్తమహామంత్రం, యోగం, అనుష్టానం బోధించారు. రేయింబవళ్ళు వీటిని సాధన చేసి, స్వామి అనుమతితో శృంగేరి శ్రీ నృసింహ భారతీస్వామి ని ఆశ్రయించగా భాష్య ప్రవచనం చేయించి సంస్కృతం నేర్పారు. అక్కడి మహారాష్ట్ర సన్యాసి ఆనందానంద తీర్థ స్వామిచే సన్యాసం బ్రహ్మానందదీక్షనామం ఇప్పించి ఆశీర్వదించారు.

బ్రహ్మానందులు యాత్రలు చేస్తూ తిరుపతి దర్శించి నెల్లూరు చేరి, అక్కడ జీవన్ముక్తులైన నిత్యానందస్వామి తో పరిచయమేర్పడింది. అక్కడే "శ్రీ నిత్యానంద వేద సంస్కృత పాఠశాల "ను బ్రహ్మానందులు స్థాపించి,ఇద్దరూ కలిసి పర్యటన చేస్తూ భక్తులకు యోగరహస్యాలు బోధిస్తూ మంత్రోపదేశం చేశారు. బాపట్ల చేరి సనాతన ధర్మప్రచారానికి పూనుకొన్నారు. లీలలు అద్భుతాలు మహిమలు ప్రదర్శించారు. ఎన్నో జీర్ణ దేవాలయాలను పునరుద్ధరించారు.బాపట్లలో దత్తాత్రేయ మందిరం, లైబ్రరీలను నిర్మించి సమృద్ధిగా మూలధం చేకూర్చి పాలకమండలి నియమించారు.బాపట్ల బ్రహ్మానంద తీర్థులు గా ప్రసిద్ధిపొందారు.

కాశీ వెళ్లి "మాండూక్యోపనిషత్ తారకమంత్ర మఠం"లో భాష్య ప్రవచనం చేశారు, కాళయుక్తిసంవత్సర శ్రావణ శుద్ధ అష్టమి గురువారం 15-8-1918 న 39వ ఏట సమాధి నిష్టలో ఉదయం 9-30గంటలకు బ్రహ్మానంద తీర్థులు బ్రహ్మ రంధ్రం చేదించుకొని బ్రహ్మైక్యం పొందారు. భక్తులలో మహాభక్తుడు,జ్ఞానులలో శ్రేష్ఠుడు,కర్మయోగుల్లో వీరుడు, యోగులలో రాజయోగి సనాతన ధర్మానికి సారధి, ఆధ్యాత్మిక వికాసానికి ఎత్తిన జయపతాక శ్రీ బ్రహ్మానంద తీర్థులు.

## 8 ఆటవిక కుటుంబాలకు ఆరాధ్యదైవం

**బ్రహ్మ సాక్షాత్కారం పొందిన చిద్గగనానంద స్వామి-1885-1969**

రాయలసీమ కడపజిల్లా ప్రొద్దుటూరు తాలూకా చినరాజుపల్లెలో రుక్కు గురవారెడ్డి నాగమ్మదంపతులకు శ్రీ వెంకటేశ్వర వరప్రసాది గా వెంకటరెడ్డి 30-3-1885 పార్థివ సంవత్సర చైత్ర పౌర్ణమి సోమవారం రాత్రి 12గంటలకు హస్తా నక్షత్ర ధనుర్లగ్నం లో పుట్టాడు. ఏడవఏట ప్రాణాయామం నేర్చాడు. పూనాలో హఠ యోగాశ్రమం లో చేరి ఒక ఏడాది యోగాభ్యాసం నేర్చి,తర్వాత పండరి, రాయచూర్, అనంతపురం,యాదికి లు చూసి చీమలకుర్తివాగుపల్లెకు చేరాడు. అక్కడ ఒక వేదాంతివద్ద సీతారామాంజనేయం ఒంటబట్టించుకొని, 11వ ఏట బొమ్మెపల్లి సుబ్బదాసు అనే సిద్ధ పురుషుని ఆశ్రయించాడు. ఆయన తారక సంఖ్య,అమనస్క యోగాలు నేర్చుకొని వస్తే, అచల పూర్ణ యోగం బోధిస్తానని చెప్పాడు.

12వ ఏటనే "లంకమల పర్వతం "పై ధ్యాన సాధన చేసి స్వరశాస్త్రం నేర్చి, 15వ ఏట కమలాపురం తాలూకా నాగేశ్వర పర్వతాగ్రం పై ఏడాది తపస్సు చేసి, 18వ ఏట తిరుమల బావాజీ మఠంలో రెండేళ్ళు మతత్రయ సారం గ్రహించాడు. తర్వాత వీరాంజనేయ క్షేత్రాలు సందర్శించి,28వ ఏట చిన్నరావిపల్లెకు చేరి, బ్రహ్మానంద మహర్షిని సందర్శించి శిష్యుడయ్యాడు. అనేక విధాలుగా పరీక్షించి దీక్షను, "చిద్గగనానంద" దీక్షానామం అనుగ్రహించారు బ్రహ్మానందులు. 12ఏళ్ళు అనంతపురం జిల్లా పోతులకుంట లో గురువుగారి ప్రస్థానత్రయ ఆశ్రమ భూములను స్వయంగా దున్నుతూ, పంటలు పండిస్తూ గురుసేవచేశాడు.

మళ్ళీ దేశ సంచారం చేసి, హిందూపురం తాలూకా గోరంట్లలో గురువు స్థాపించిన అద్వైతాశ్రమానికి తిరిగి వచ్చి, ఆయుర్వేదం నేర్చి, ఔషధాలు తయారు చేసి, రోగులకు ఉచితంగా వైద్యం అందించి ఆరోగ్యవంతుల్నిచేశారు. నాలుగేళ్ళతర్వాత కదిరి తాలూకా తుమ్మలాపుర దుర్గం వెళ్లి, ఆరునెలలు నిహారంగా తపస్సు ఘోరంగా చేశారు. అక్కడ భవనాశి ఆశ్రమం స్థాపించి, రాయలసీమ తీవ్ర కరువు కాలం లో ఆరునెలలు విరివిరిగా అన్నదానాలు చేయించారు. కొత్త చెరువు దగ్గర నాగులకనుమలో ఆనందశ్రమం స్థాపించి, 52వ ఏట బలిఘట్టం చేరి, త్రిశూలపర్వతం పై 12రోజులు లోక శాంతికోసం దీక్ష పూనారు. మన్యం లోని జనులకుఆధ్యాత్మిక చైతన్యం కలిగించటానికి బ్రహ్మానందాశ్రమం స్థాపించారు. ఇలా 10 ఆశ్రమాలు స్థాపించి, మళ్ళీ బలిఘట్టం చేరి బలిఘట్టం చిద్గగనానంద స్వామి గా ప్రసిద్ధి చెందారు. సౌమ్య సంవత్సర ఆషాఢ శుద్ధ ఏకాదశి నుంచి చాతుర్మాస్యదీక్ష వహించి భక్తులకు ప్రస్థాన త్రయం బోధించారు. 27-7-1969 భాద్రపద శుద్ధ పౌర్ణమి ఉదయం 8గంటలకు శ్రీ చిద్గగనానంద స్వామి 84వ ఏట జీవ సమాధి చెందారు. దాదాపు అయిదు వేల ఆటవిక కుటుంబాలకు చిద్గగనానందులు ఆరాధ్య గురువు, దైవం.

## 9 దాస సాహిత్య మార్గదర్శి మహాయోగి

**చిరుమామిళ్ళ సుబ్బదాసు -1802-1882**

చిరుమామిళ్ళ సుబ్బదాసు అనంతపురం జిల్లా ధర్మవరం లో చిరు మామిళ్ళనరసయ్య, తిరుమలమ్మ అనే సదాచార కమ్మదంపతులకు 1802లో పుట్టాడు. అసలు పేరు సుబ్రహ్మణ్యం. వాడుకనామం సుబ్బయ్య. వీధిబడిలో చదువుతూ 8వ ఏట నే కృష్ణ, దాశరథి, నరసింహ శతక పద్యాలు భాగవత పద్యాలు నేర్చేసుకొని అర్ధరాత్రి దీపం ముందుకూర్చుని నిశ్చల ధ్యాన సమాధి మగ్నుడై, భక్తిజ్ఞాన వైరాగ్యపద్యాలు కీర్తనలు రాస్తూ పాడేవాడు. 10వ ఏట రెండు మూడురోజులు సమాధి లో ఉండిపోయేవాడు. అప్పుడే 108 కందపద్యాల "కేశవ మకుట శతకం "రాసి అందర్నీ ఆశ్చర్యపరిచి వేణుగోపాలస్వామి భక్తుడుగా ప్రసిద్ధి చెందాడు.



ఒక సాధువుకనిపించి నాలుకపై బీజాక్షరాలురాయాగా ఆయన సూచనమేరకు ఒకరోజు రాత్రి సద్గురువు అన్వేషణకు బయల్దేరాడు. ఆకాశం లో ఒక కాంతి పుంజం కనిపించగా, దాన్ని చూస్తూ నడిచి దుర్గి గ్రామం చేరాడు.ఆ గ్రామం లోనే కాంతి పుంజం వేణుగోపాలస్వామి గుడిపై ఆకాశం లో నక్షత్రంగా మారిపోయింది. గర్భాలయం చేరగా స్వామి కన్నులనుండి కారుణ్య తరంగాలు బయల్దేరి వచ్చి సుబ్బదాసు లో ప్రవేశించగా, ఆశువుగా తనకే ఆశ్చర్యం కలిగేట్లు పద్యాలు వచ్చాయి. దుర్గిలోని పండిత కవి, త్రికాలజ్ఞుడు జ్ఞానపూర్ణుడు, దైవ సాక్షాత్కారం పొందిన తాతాచార్యుల వారు సుబ్బయ్యను వివాహం చేసుకోమని నచ్చ చెప్పగా 20వ ఏట 10ఏళ్ళ మేనమామ కూతురు వేణమ్మ ను పెళ్ళాడి, 16రోజులపండుగాతర్వాత తాతాచార్యుల ఆశ్రమం లో చేరి, పంచకావ్యాలు, భారత భాగవతాలు, ప్రస్థాన త్రయం, వేదాంత యోగశాస్త్రాలు వాటిలోని మర్మాలు సాకల్యంగా గ్రహించాడు. ఆచార్యులు అనుగ్రహించి సుబ్బదాసు దీక్షానామం తో దీక్ష ఇచ్చారు.




తర్వాత అయిదేళ్ళు దీక్షగా తీవ్ర సాధన చేసిన సుబ్బదాసు కు గొప్ప ఆధ్యాత్మిక శక్తులు అలవడినాయి. తాను రచించిన రచన రచనా సర్వస్వాన్ని శిష్యులకు అప్పగించి జాగ్రత్తగా ఆతాటాకు గ్రంధాలను కాపాడమని చెప్పారు. 12-1-1882 వృషనామ సంవత్సర పుష్యబహుళ అష్టమి గురువారం ఉదయం యోగసమాధి లో కపాల చేదనం చేసుకొని 80వయేట సుబ్బదాసు వేణుగోపాలస్వామిలో ఐక్యమయ్యారు. చిన్నతనంలో ఆయన నాలుకపై బీజాక్షరాలు రాసిన చోటనే సుబ్బదాసు సమాధి స్థితుడయ్యారు.ధర్మవరం లోని ఆయన సమాధి పవిత్ర యాత్రాస్థలమైంది. ప్రతియేటా పుష్యబహుళ అష్టమినాడు ఆరాధనోత్సవం, నవమినాడు ప్రభలతో స్వామి ఊరేగింపు చేసి గురుపూజోత్సవం నిర్వహిస్తారు. దాస సాహిత్యం లో సుబ్బదాసు రాసిన శతకాలు, అష్టకాలు, యక్షగానాలు నక్షత్రమాలికలు తత్వాలు కీర్తనలు పాటలు కృతులు ఆణిముత్యాలుగా వెలిగిపోతున్నాయి.

## 10 సిద్ధ సంకల్ప శివయోగి,అవధూత

**చేళ్ళ గురికి ఎర్రి స్వాములు -1822-1922**

తెలంగాణా లోపుట్టి, మైసూరులో విద్యనేర్చి, ఉన్నతోద్యోగం చేస్తూ, తీవ్రవైరాగ్యం పొంది, భార్యాపిల్లల్ని వదిలేసి, అవదూతగా మారిన ఆరాధ్య బ్రాహ్మణుడు నంజుండయ్య ఎర్రితాత,ఎర్రిస్వామిగా పిలువబడ్డాడు. ఆయనను సేవించినవారు చెప్పినవిషయాలే తప్ప చరిత్ర తెలియదు. ఏది దొరికితే అది తిని వాడు. ఆయన తింటుంటే కాకులు, కుక్కలు మూగేవి వాటికి తినిపిస్తూ, తానూ తినేవాడు.

ఉద్యోగం వదిలి నిద్రాహారాలుమాని, కొబ్బరి చెట్టుపై శివయోగిగా ఉన్న ఈయనను ప్రజలు గుర్తించారు.లింగనహాళ్లి లో లింగాయతుల నాగప్ప శుశ్రూష చేసి యోగ రహస్యాలు తెలుసుకొన్న నంజుండప్ప దొడ్డ బళ్లాపురం గగనాచారి దగ్గరకు చేరి, దేహాభిమాన శూన్యత, నిర్గంధిముని తత్త్వం నిరూపించి ఉపదేశం పొందాడు. నిరంజన దీక్షానామంఇచ్చి నంజుండ ప్పకు సన్యాసం ఇచ్చాడు గగనాచారి.

అనుకుంటే చాలు వందల మైళ్ళు వెళ్ళగలిగే సంకల్ప సిద్ధుడు అయ్యాడు నిరంజనస్వామి. చెన్నరాయకొండ చేరి గుహలో కొంతకాలం, కల్యాణదుర్గం, ముష్టూరు,ఉరవకొండ లలో కొంతకాలం గడిపి చేళ్ళగురి చేరాడు. అక్కడ గోచీమాత్రమే ధరించి ఎండా వానలలో అంతర్ముఖుడై నిశ్చల సమాధిలో గడుపుతూ ఉన్న ఎర్రి స్వామికి భక్తులు ఆశ్రయమిచ్చారు. కొత్త ఇల్లు కట్టించి అందులో ఉంచారు. అప్పటినుంచి చేళ్ళ గురి ఎర్రి స్వాములుగా సుప్రసిద్ధుడయ్యాడు. 1907 లో మఠనిర్మాణం మొదలుపెట్టి ఏడాదిలో పూర్తి చేశారు. 1922 వరకు అక్కడే ఉంటూ, మహిమలెన్నో ప్రదర్శించారు. సమకాలీన యోగులు, సిద్ధులు ఆయన్ను సందర్శించి పునీతులయ్యారు. శిష్యుడు తిక్కయ్యకట్టించిన ఆ మఠంలోనే ఎర్రి స్వామి 14ఏళ్ళు భక్తులకు జ్ఞానవైరాగ్యభక్తిమార్గాలు ఉపదేశిస్తూ గడిపారు. నూరేళ్ళు సార్ధకం గా జీవించి 30-5-1922 దుందుభి సంవత్సర జ్యేష్ట శుద్ధ చవితి మంగళవారం ఉదయం శివయోగి ఎర్రిస్వాములు శివైక్యం చెందారు. శిష్యుడు తిక్కయ్య కట్టించిన సమాధిలోనే ఆయన పార్ధివ శరీరాన్ని ఉంచి సమాధి చేశారు. ప్రతియేడు జ్యేష్ట శుద్ధ షష్టి, అమావాస్య, శివరాత్రి రోజులలో ఆయన ఆరాధనోత్సవాలు జాతరలతో వైభవంగా జరుపుతారు. ఆయనను ఆరాధించే భక్తుల పూజా ప్రతిమలలో, పటాలలో దర్శనమిస్తూ, సమాధి నుంచి మాట్లాడుతూ, స్వప్న సాక్షాత్కారం కలిగిస్తూ అనుగ్రహిస్తూనే ఉన్నారు ఎర్రి స్వాములు.

## 11 చిప్పగిరి భంభం స్వామి -1833-1911



హిందూ సన్యాసి వేషం లో కనిపించే ముస్లిం యోగి "సయ్యద్ సుల్తాన్ మొహియుద్దీన్ ఖాదిరీ "నే "భంభం" స్వామి అంటారు. ఆయన వంశీకులు చాలాకాలంగా కర్నూలుజిల్లా ఆలూరు తాలూకా చిప్పగిరి లో ఉంటున్నారు. ఈయన చాలాప్రదేశాలు తిరిగి ఎన్నో మహిమలు ప్రదర్శించాడు. దేవుడు ఒక్కడే అన్నాడు. "శరీరం అనే మసీదులో ఆవాజ్ అంటే ధ్వని లేకుండా నమాజు అంటే ప్రార్ధన చేయటం శ్రేష్టం "అని బోధించాడు.

తన అవతార సమాప్తి గ్రహించి ఆలూరులో ఉన్న శిష్యుడు భం షేక్అబ్దుల్ దాసు దగ్గరకు వెళ్లి సందేశం ఇచ్చి,అక్కడే యోగనిద్రలో తన వంశ మూలపురుషుడు సత్తార్ షాని మహాత్ముడు,దర్శనమిచ్చి ఆదేశించగా, మళ్ళీ చిప్పగిరి చేరి 11-10-1911 న 78 వ ఏట బుధవారం సజీవ సమాధి అయ్యాడు.

## 12 కుంభక యోగి

**సచ్చిదానంద పరమహంస -1865-1957**

తమిళనాడుకంచి దగ్గర తిరుప్పనం కాడ గ్రామంలో సోమసుందరం, విశాలాక్షి అనే శివభక్త దంపతులకు 16-2-1865 రక్తాక్షి సంవత్సర మాఘబహుళ పంచమి ఉత్తరానక్షత్ర సింహలగ్నం లో ఏకాంబరేశ్వరస్వామి వరప్రసాదంగా కుప్పుస్వామి జన్మించాడు. లోయర్ ఫోర్త్ ఫారం చదువుమానేసి 12వ ఏట కంచిలోని వివిధదేవాలయాల్ను సందర్శించి అర్చామూర్తులను పూజించాడు. ఇంటివద్ద శుచిగా పీటపై జింక చర్మం వేసి దానిపై తెల్లని బట్ట పరచి దానిపై కూర్చుని, చిన్ముద్రతో, భ్రుకుటి మధ్య చూపు నిల్పి,, షోడషోప చారాలతో మానసిక పూజ త్రికరణ శుద్ధిగా చేసి ఏకాంబరేశ్వరునికి అంకితమిచ్చాడు



13వ ఏట 46వ రోజున ఏకాంబరేశ్వరుడు నిత్యానందుడు అనే ముసలి బ్రాహ్మణ వేషం లో వచ్చిరేచక పూరక కుంభకాలు నేర్పి, సాధన చేయమని మానసిక పూజ చాలించమని చెప్పి కుప్పుస్వామికి "పరమహంస సచ్చిదానంద యోగి "జ్ఞాననామం ప్రసాదించాడు. 17వ ఏట పెరుందేవితో వివాహమైంది. సంసారంచేస్తూ రాజయోగిగా ఉన్నాడు సచ్చిదానంద. ఇంట్లోనే ఒక చిన్న గుహ నిర్మించుకొని నెలల కొలదీ ధ్యాన నిష్టలో గడిపాడు. సంతానం లేదన్న దిగులుతో బార్య చనిపోయింది.

సత్యానంద సర్వం త్యజించి మద్రాస్ దగ్గర విద్యానర్సరి తోటలో కొన్ని నెలలు గడిపి ఆంధ్రప్రదేశ్ కడపకు చేరాడు. అక్కడే "జీవబ్రహ్మైక్యవేదాంత రహస్యం "ముందు తమిళం, తర్వాత తెలుగు లో రాసి ప్రచురించాడు. తపస్సుకు ధ్యానానికి గడికోట ను ఎంచుకొని, మద్రాస్ దగ్గర పన్ చెట్టులో మఠం నిర్మించారు. ఆంధ్ర తమిళ రాష్ట్రాలలోనేకాక ఆఫ్రికా శ్రీలంక సింగపూర్ బర్మా, మలేషియాలలో కూడా తన యోగశక్తులు ప్రదర్శించి, యోగ కేంద్రాలు ఏర్పరచి వేలాది శిష్యులను తయారు చేశారు. చివరకు బెంగుళూరు కెంపాపురం అగ్రహారం లో 9-1-1957 సాయంత్రం 92వయేటపరమహంస జీవ సమాధి చెందారు. హంస పరమహంసలో ఐక్యమైంది. ప్రతియేటా జనవరి 9ఆరాధనోత్సవం, ఫిబ్రవరి 16జయంతి ఉత్సవం ఘనం గా నిర్వహిస్తారు. మఠంలో మూడుపూటలాపూజ జరుగుతుంది.

## 13 కడప అవదూతేంద్రులు -1890-1978

కర్నూలు జిల్లా త్యాగి గ్రామం లో ఎంకి, ఈరిగాడు అనే పేద హరిజన దంపతులకు ఎనిమిదవ సంతానంగా 1890లో పుట్టిన ఈరన్న అవదూతగా ఎదిగాడు.త్యాగి స్వామివద్ద ఉపదేశం పొంది, యాగంటి గుహలో తపస్సు చేసి పరిణామం చెందాడు. ఎన్నో మహిమలు చూపాడు. రాబోయే అరిష్టాలనువింత విపరీత చేష్టలతో చూపించేవాడు.



1978 ఏప్రిల్ 10న 87వ ఏట కాళయుక్తి చైత్ర శుద్ధ తదియ సోమవారం ఉదయం 11.23గంటలకు కడప ఆస్పత్రిలో అవతారం చాలించారు అవధూత. దీన్ సాహెబ్ హోటల్ వంటగది యే ఆయన సమాధి స్థలంగా ఉండేది. దానిపై మందిరం నిర్మించారు.

## 14 చివటం అచ్చమ్మ అవధూత -1911-1981

పశ్చిమ గోదావరి జిల్లా రేలంగి గ్రామంలో కాపుకులానికి చెందిన మా యిష్టి భద్రయ్య కుమార్తె గా అచ్చమ్మ 1910 లో జన్మించింది. బాల్యం నుంచే దైవభక్తి తో ఉండేది. భర్త గరగఅంజయ్య జూదం ఆడుతూ భార్యను హింసించేవాడు. భరించలేక అత్తగారికి చెప్పి బంధాలన్నీ తెంచుకొని చిన్నాయగూడెం లో ఒక భక్తుని ఇంట్లో భజనలు చేస్తూ గడిపి మళ్ళీ రేలంగి వెళ్లి, చివరికి చివటం వచ్చినా ఆమె తోటలు స్మశానాలలోనే ఉండేది. కొద్దికాలం రాజమండ్రి స్త్రీల మఠంలో ఉండి సాధన చేసి, మళ్ళీ చవటం వెళ్లి ఏకాంత ప్రదేశం లో ధ్యానం లో గడిపేది. సాదూరాం బావాజీ ని గురువుగాఎంచుకొని, దిగంబరియై అవధూతగా మారింది.




రేలంగి ప్రజలు ఆమెను సిద్ధురాలుగా భావించి గౌరవించారు. అవధూత పిచ్చమ్మ 12ఏళ్ళు మౌనవ్రతం పాటించింది. జ్ఞానులలో జ్ఞానిగా భక్తులలో పరమ భక్తురాలిగా ఉంటూ మహిమలు చూపేది. ఆమెను ఆశ్రయిచినవారికి అష్టైశ్వర్యాలు ఆయురారోగ్యాలు కలిగేవి. 1981 జూన్ 8 న 70వ ఏట రాత్రి 12.52 గంటలకు కపాలం చేదించుకొని అవధూత పిచ్చమ్మ శరీరంచాలించారు. మర్నాడు జ్యేష్ట శుద్ధ నవమినాడు మహాసమాధి జరిగింది. సమాధిపై మందిరం నిర్మించారు సమాధినుంచే భక్తులను అనుగ్రహిస్తారనే నమ్మకం బాగా ఉన్నది.

## 15 చీరాల అవధూత -1912-1972

కడప జిల్లాలో వైశ్య కుటుంబంలో పుట్టిన చీరాల అవధూత, 1943లో చీరాల ఆస్పత్రి దగ్గర గుంపెన చెట్ల నీడలో కాషాయబట్ట లతో గురువు వెంట మొదట కనిపించాడు 1912 లో పుట్టినట్లు నిర్ధారించారు.. అగరు వత్తులు వెలిగించి ఇసుకలో పెట్టి బియ్యం చల్లేవాడు. ఎడమకాలు బోదకాలు అవటం తో బోదకాలు స్వామిగా ప్రసిద్ధుడు.








ఆహారం లేకపోయినా బలంగానే ఉండేవాడు. 1959 లో చిలకలూరి పేటకు వెళ్లి 1963 వరకు ఉన్నాడు. పగలే కనిపించేవాడు రాత్రిళ్ళు కనిపించే వాడు కాదు. ఒకేసారి నెల్లూరు హైదరాబాద్ గుంటూరు,శ్రీశైలం లలో కనిపించేవాడు.రోగులరోగాలు నయం చేస్తూ శక్తులు ప్రదర్శించేవాడు. దేహం నిలవటానికి కొద్దిగా తినేవాడు. నిరీహి. అఖండయోగం చూపేవాడు అంటే కాళ్ళు చేతులు మొండెం వేర్వేరు గా ఉండేట్లు చేసి మళ్ళీ కలిపేవాడు. 3-9-1972 60 వ ఏట పరీధావి సంవత్సర శ్రావణ బహుళ ఏకాదశి ఆదివారం తెల్ల వారు ఝామున అవధూత హంస పరమహంసలో లీనమైంది.

## 16 పరమహంస -ధాభా కొండ యార్య -1834-1939

మహారాష్ట్ర చాందా జిల్లా ధాభా గ్రామంలో అంబేద మల్లయ్య, సుగంధమ్మ అనే జంగం దంపతులకు 10-2-1934 విజయ సంవత్సర మాఘ శుద్ధ తదియ సోమవారం కొండయ్య పుట్టాడు. పుట్టగానే "నమో బసవ లింగాయనమః "అని ఉచ్చరించి అందర్నీ ఆశ్చర్య పరచాడు. జ్యోతిష్యులు ఆబాలుడు నూరేళ్ళకు పైగా బతికి. జీవ జనోద్ధరణ చేస్తాడని చెప్పారు. పుట్టిన 12వ రోజు నుంచే మహిమలు ప్రదర్శించాడు. ఏడాదికే విద్యలన్నీ గడించాడు






పెళ్లి అయినా ఇల్లు వాకిలీ వదిలేసి కొండా కోనలు తిరుగుతూ, శ్రీశైలం అడవులకు చేరి క్రూర జంతువులను మచ్చిక చేసుకొని వేటగాళ్ళ నుండి వాటిని రక్షిస్తూ, నిత్యం పాతాళగంగాస్నానం మల్లికార్జున భ్రమరాంబా దర్శనం తో పులకించేవాడు. ఒక రోజుఆలయ సింహద్వారం వద్ద సహస్ర సూర్య కాంతులతో" సర్వేశ్వర తేజం "దర్శనమిచ్చింది. సర్వసంగ పరిత్యాగి కొండయ్యకు సద్గురు కటాక్షం లభించింది అష్టాంగ యోగం, రాజయోగం సిద్ధిస్తాయని ఆశరీరవాణి తెలిపింది. అన్నట్లుగానే చెల్పూరులో పరమారాధ్యుల రాజయ్య ఆశీర్వాద లభించి ఇద్దరూకలిసి శ్రీశైల గుహలలో తీవ్ర తపస్సు చేశారు. కొండయ్యకు మంత్రోపదేశం చేసి సకల శక్తులు ధారపోసి" పరమహంస "బిరుదునిచ్చి లోక కాల్యాణం కోసం దేశాటన చేయమని గురువు ఆశీర్వదించి పంపాడు

12 ఏళ్ళు తపస్సు చేసి ఈశ్వరతత్వాన్ని సాధించి అక్కడి నుండి నంది మేడారం చేరి మహిమలు చూపి, దేశ సంచారం చేస్తూ అద్భుతాలు ప్రదర్శిస్తూ బాధితుల రోగ నివృత్తి చేస్తూ జ్ఞానబోధ చేస్తూ 14-11-1939 కార్తీక శుద్ధ చవితి మంగళవారం 105 వయేట ముందుగానే కట్టించుకొన్న సమాధిలో జీవ సమాధి అయ్యాడు పరమహంస కొండయార్యులు. మాదినుండి సూక్ష్మరూపంలో భక్తులకు కొంగుబంగారంగా వెలుగుతున్నారు.

## 17 సూక్ష్మ మూర్తెమ్మ యోగిని -1807-1928

పాతికేళ్ళ కే భవబంధాలన్నీ తెంచుకొని నూరేళ్ళు తపస్సులో తరించిన మూర్తెమ్మ 1807 కడపజిల్లా జమ్మలమడుగు తాలూకా కుందూ నదీతీరంలో పెద్దముడియం గ్రామంలో యనమదల గురవాచారి, అచ్చమ్మ అనే విశ్వబ్రాహ్మణ దంపతులకు పుట్టింది. బాల్యం లోనేతల్లిని కోల్పోయి ఒంటరిగా నదీ తీరంలో గుంటలు తవ్వుతుంటే శివలింగం దొరికితే ఇంటికి తెచ్చి నిత్యపూజా చేసేది. పెళ్ళైనా తీరు మారలేదు. మహిమలు చూపేది. '. యోగిని అన్నారు.

ఇరవై ఏళ్ళ వయసులో ఆమెను మేనత్త దంపతులు 1827లో గంగాయపల్లె కు తీసుకు వెళ్ళారు. అక్కడ అంతర్ముఖత్వం ఏర్పడింది. పిచ్చయ్య అనే గురువు మంత్రోపదేశం చేసి, ఆమెతో ఉన్న శివలింగాన్నే పూజించమని చెప్పాడు. ఆమె సూక్ష్మ దృష్టి మంత్రాను స్థానం నుంచి యోగం వైపు మళ్ళింది. అప్పటినుంచిగంగాయపల్లె "సూక్ష్మ మూర్తెమ్మ "గా ప్రసిద్ధి చెందింది, కమలాపురం మండలం అప్పాయ పల్లెకు చెందిన సుబ్బయ్య గురువు వద్ద బ్రహ్మోపదేశం పొంది, యోగసాధన తీవ్రం చేసింది. సంయమయోగం సాధించి కీర్తనలు కందా ర్థాలు, సహస్రార ప్రదర్శన, యక్షగానాలు,ద్విపదలు రాసింది. ఒక శిష్యుడు బెంగుళూరు దగ్గర యలహంక లో ఒక ఆశ్రమం ఏర్పాటు చేస్తే, ఉంటూ యోగశక్తులు, చమత్కారాలు ప్రదర్శించింది. జానపదులు దేవతలా కొలిచారు. కడప – మద్రాస్ రైలు మార్గం లో ఉన్న ఇక్కడ అన్ని రైళ్ళు ఆగే ఏర్పాటు చేశారు. 31-10-1928విభవ సంవత్సర ఆశ్వయుజ బహుళ తదియ బుధవారం మధ్యాహ్నం 12గంటలకు121 ఏట కుండలినీ యోగం తో కపాలం చేదించుకొని సూక్ష్మ మూర్తెమ్మ యోగిని సూక్ష్మ పరబ్రహ్మం లో ఐక్యమైంది. ఆమె పేర ఆరు ఆశ్రమాలలో సాధకులున్నారు. ఆశ్వయుజ శుద్ధ తదియ, చవితి నాడు ఆరాధనోత్సవాలు ఘనంగా జరుపుతారు

## 18 ఆంజనేయ పరమహంస -1892-1941

కృష్ణాజిల్లా గుడివాడలో భైరవభట్ల సీతమ్మ, జోగేశ్వర శర్మ రామభక్త బ్రాహ్మణ దంపతులకు ఆంజనేయ శర్మ 13-11-1892 న నందన వత్సర కార్తీక బహుళ ఆదివారం పుట్టాడు. రామనామం పాడితేనే నిద్రపోయేవాడు.ఆ నామం వినిపిస్తే ఏడుపు ఆపేవాడు. అయిదవ ఏట అక్షరాభ్యాసం, 8వ ఏట ఉపనయనం చేశారు. సీతారామాంజ నేయ గ్రంథాన్ని ఒంటపట్టించుకొని పరమాత్మ తత్వ రహస్యం అవగాహన చేసుకొన్నాడు. 13వ ఏట తండ్రి చనిపోయాడు. 16వ ఏట లక్ష్మీకాంతమ్మ తో పెళ్లి జరిగింది.

నూజివీడులో ఉద్యోగం లో చేరాడు. మనసు మాత్రం రామ నామాంకితం గానే ఉండేది. ఒక రోజు భద్రాచల ఓంకార ఆశ్రమ మండలికి చెందిన సచ్చిదానంద జోగేశ్వరావదూత వచ్చి మంత్రోప దేశం చేశారు. దీనితో రెండేళ్లలో బ్రహ్మవిద్యారహస్యాలు తెలిశాయి. కష్టాలలో ఉన్నవారికి రామకథలు చెప్పి బాధా నివారణ చేసేవాడు. బ్రహ్మ భావన లేకపోతె వేదోపనిషత్తుల జ్ఞానానికి పూర్ణత్వం సిద్ధించదు అని ప్రవచించేవాడు. 25వ ఏట నే వాన ప్రస్థాశ్రమం తీసుకొని,గుడివాడ తాలూకా పామర్రు దగ్గరున్న కొండిపర్రులో ఒక మామిడి తోటలో శ్రీ ఆంజనేయ విగ్రహం ప్రతిష్టించి, పూజిస్తూ సద్బోధ చేసేవాడు. భార్య కూడా బాగా సహకరించేది. ఏకాగ్ర చిత్తమే సమాధి అనీ, సమాధిలో ధ్యేయ వస్తువు తప్ప ఏదీ కనిపించదని అనుభవ పూర్వకంగా చెప్పేవాడు. క్రమంగా భక్త గణం పెరిగింది. గుడివాడ ఆంజనేయ పరమహంస గా ప్రసిద్ధి పొందాడు.

గుంటూరు జిల్లా బాపట్లలో శ్రీ మారుతి ప్రణవాశ్రమం నిర్మించి జ్ఞాన బోధ చేసేవారు. 11-10-1941 వృష నామ సంవత్సర ఆశ్వయుజ బహుళ షష్టి శనివారంరాత్రి 9 గంటలకు ఆంజనేయ పరమహంస 49 వ ఏట ఆంజనేయ సన్నిధి చేరారు.

## 19 దివ్యమాత కోన అంజనాదేవి -1917-1977

అనంతపురం జిల్లా పెనుగొండ తాలూకా పైదేటి గ్రామంలో నిరుపేద కుమ్మరి కుటుంబం లో అంజనాదేవి 1917 లో పుట్టింది. ఆమె బాల్యంలో పెనుగొండ బాబయ్య అనే ముస్లిం యోగి సమాధి వెనుక శివాలయం దగ్గర చక్కర చెట్టునుంచి రాలే పంచదారను ప్రసాదంగా పంచేది. 15వ ఏట నారాయణప్పతో వివాహం జరిగి, 30 ఏళ్ళుసంసారజీవితం అనుభవించి దైవ బలంతో ఎందరికో మేలు చేసేది, కోన క్షేత్ర పాండురంగ స్వామి కలలో ఒక రోజు కనిపించగా, తనజీవితాన్ని గుట్టూరు కోన కణ్వాశ్రమం లో గడపాలని నిర్ణయించింది.



భక్తులెందరో వచ్చేవారు ఆపదలలో ఉన్నవారిని ఆర్తులనుదీనులను రోగులను ఆదుకోన్నది. జ్ఞానబోధ చేసేది. కోన అంజనా దేవిగా కోన మాతగా దివ్యమాతగా ప్రసిద్ధి చెందింది. వాక్శుద్ధి భవిష్యవాణి లతో అందరినీ దగ్గరకు చేర్చింది. 4-6-1977 పింగల సంవత్సర జ్యేష్ట బహుళ చవితి శనివారం సాయంత్రం దివ్యమాత అంజనాదేవి 60 వ ఏట దివ్యలోకాలకు చేరింది.

## 20 కళా ప్రపూర్ణ ఓరుగంటి నృసింహ యోగీంద్రులు -1914-1978

తూర్పు గోదావరిజిల్లా రాజోలు తాలూకా గంటి గ్రామం లో ఓరుగంటి సీతమ్మ లక్ష్మీనారాయణ అనే సంపన్న బ్రాహ్మణ దంపతులకు లక్ష్మీ నరసింహ మూర్తి 17-10-1914 ఆనందసంవత్సర ఆశ్వయుజ బహుళ త్రయోదశి శనివారం ముంగండ లో జన్మించాడు. 8వ ఏట ఉపనయనం చేసి వేదం నేర్పించారు. పదేళ్ళ వయసులో షహీద్ భగత్సింగ్, అల్లూరి సీతారామ రాజుల వీర గాధలకు ప్రేరణ చెంది, దేశస్వాతంత్ర్యం కోసం ఇల్లు వదిలి వెళ్ళాడు. అన్నవరం దగ్గర కనిపిస్తే తండ్రి ఇంటికి తెచ్చాడు.



మళ్ళీ పారిపోయి గుంటూరులో కాశీ కృష్ణాచార్యుల వారివద్ద సంస్కృతం నేర్చి తెలుగు హిందీ సంస్కృతాలలో అనర్గళం గా మాట్లాడే నేర్పు సంపాదించాడు. తాతగారు నరసింహం గారికితెలిసి ఇంటికి తీసుకు వెళ్లి, గట్టికాపలా పెట్టి కావ్య పాఠాలు చెప్పించారు. సిద్ధ పురుషులను సేవించి మహిమలు సాధించాలనే బలీయమైన కోరికతో, మళ్ళీ 1926 లో ఒక అర్ధరాత్రి ఇల్లువదిలి తణుకు లో రైలు ఎక్కగా, హరిద్వార్ కు చెందిన ఒక మార్వాడీ దంపతులు తమతో ఇంటికి తీసుకు వెళ్లారు. ఆరు నెలలలో అనేక శాస్త్రాలు నేర్చాడు. 1927 లో మార్వాడీ దంపతుల అనుమతి తో బదరీ యాత్రకు బయల్దేరి, ఎనిమిది రోజులు నడిచి పాండవులు స్వర్గారోహణ చేసిన "శీతో పథం"దగ్గర పర్వత గుహలో సమాధి నిష్టుడైన 350ఏళ్ళ సిద్ధ పురుషుడు సర్వానందావ దూతను దర్శించి శిష్యుడై హఠయోగం లో కొన్ని క్రియలు నేర్చాడు. గురువు ఈయనకు 7రోజులు తర్వాత మంచు వాతావరణం లో తట్టుకొనే శక్తిని ప్రసాదించాడు.

గుర్వాజ్ఞపై హరిద్వారం చేరి మార్వాడీ దంపతులింట్లో ఉండి,మరికొంతశాస్త్రాధ్యయనం చేసి గురువును చేరాడు. పూర్తి హఠయోగం,ఇతర యోగాసాధనలు నేర్చాడు. సచ్చిదానంద అవధూత గురువు మూర్తిని ఆయనగురువు రామాలాల ప్రభువును ఆశ్రయించమనీ,, ఆయనే మోక్ష ప్రదాత అని చెప్పి సిద్ధి పొందాడు.

లక్ష్మీ నరసింహమూర్తి 2-10-1930 న రామాలాల ప్రభువును రుషీకేశ్ లో దర్శించగా, "నర్సింగ్ "అని పేరు పెట్ట గా, మహా కృష్ణ భక్తుడై మధురకు వెళ్లి కృష్ణనామ స్మరణతో కొంతకాలం గడిపి, ఏక సంతాగ్రాహి కనుక అక్కడ బృహద్భాగవతం కంఠస్తమైంది. మళ్ళీ రామలాలా గురువును చేరి పతంజలి యోగసూత్రాలు కొన్ని సాధన చేసి, 1936 లో స్వగ్రామం గంటి వెళ్లి శాస్త్రాధ్యయనం చేసి రామలాలా దేహం చాలించేముందు ఋషీకేశ్ చేరాడు.. గుర్వాజ్ఞపై ఆంధ్రదేశానికి తిరిగివచ్చి లక్ష్మీదేవిని పెళ్ళాడి, చాలామందికి ధ్యాన దీక్షనిచ్చి, దేశమంతా పర్యటించి భాగవత ఉపన్యాసాలు చేశాడు. నెహ్రు, రాజేంద్ర ప్రసాద్ వంటి వారివద్ద "వజ్రోళి"వంటి యోగశక్తులను ప్రదర్శించి ఆశ్చర్యపరచాడు. వజ్రోళి అంటే హఠ యోగం లో ఒక ముద్ర. వీర్యాన్ని నిలువ చేసి, వదిలేసి మళ్ళీ సేకరించటం. 1975 లో ఆంధ్ర విశ్వ విద్యాలయం "కళా ప్రపూర్ణ "బిరుదప్రదానం చేసి సత్కరించింది. నృసింహ యోగి 16-6-1978న 64వ ఏట చనిపోయాడు.

## 21 శాస్త్ర వేత్త యోగి –స్వామి జ్ఞానానంద -1896-1969

పశ్చిమ గోదావరిజిల్లా భీమవరం తాలూకా గొరగనపూడి లో భూపతి రాజు రామ రాజు, సీతయ్యమ్మ అనే సంపన్న క్షత్రియ దంపతులకు 5-12-1896దుర్ముఖి సంవత్సర మార్గ శిర శుద్ధ పాడ్యమి శనివారం లక్ష్మీ నరసింహ రాజు జన్మించాడు. స్వగ్రామం, వీరవాసరం, నరసాపురం టైలర్ హైస్కూల్ లో ప్రాధమిక మాధ్యమిక ఉన్నత విద్య నేర్చి, తణుకు లో చదివే రోజుల్లో 1908లో శ్రీ వాసు దేవానంద సరస్వతి "వాసు దేవ మంత్రం" ఉపదేశించారు. అప్పటినుంచి రాజు కు శ్రీకృష్ణుడు ఆరాధ్యదైవమయ్యాడు. వివాహం జరిగినా శ్రీ రామకృష్ణ పరమహంస శ్రీ శారదా మాత ల దివ్య దాంపత్యం లాగానే జీవితం సాగింది. తండ్రి లైబ్రరీలో ఉన్న అరుదైన వేదాంత గ్రంథాలన్నీ చదివి, మద్రాస్ లో ఆనిబిసెంట్ ను దర్శించి దివ్యజ్ఞాన గ్రంథాలు రామకృష్ణ వివేకానంద గ్రంథాలు పఠించి బాలగంగాధర్ ఉపన్యాసాలతో ప్రేరితుడై అజ్ఞాతం గా ఉన్న త్యాగవైరాగ్యాలు బయట పడి, 1917 స్కూల్ ఫైనల్ పరీక్షా ఫలితాలలో నంబర్ కనపడ నందున, విరక్తితో ఇల్లు వదిలి అజ్ఞాతం లోకి వెళ్ళిపోయాడు.



ఢిల్లీ, హరిద్వార్ మీదుగా ఋషీకేశ్ చేరి స్వర్గాశ్రమము లో చేరి సాధన చేశాడు. ఫలితంగా శ్రీ కృష్ణ పరమాత్మ సాక్షాత్కారం పొందేవాడు. ఆయన తీవ్ర యోగ సాధన చూసి యోగి రాజ్ అని సంబోధించేవారు. తర్వాత ఆబూ పర్వతం చేరి, గురు శిఖరం పై ఉన్న దత్తాత్రేయ గుహలో ఆరు నెలలు పశ్చిమోత్తాన ఆసనం లో సాధన చేసి, నీల కంఠ మహా దేవ్ లో హఠయోగ ప్రక్రియలు సాధించి, సవికల్ప సమాధి పొంది శ్రీ కృష్ణ దర్శన భాగ్యం పొందేవారు. రుషీ కేశ్ లో శరశ్చంద్ర అనే సిద్ధ పురుషుడు ఈయన 25వ ఏట ఉపదేశం చేసి "స్వామి జ్ఞానానంద "అనే దీక్షానామ మిచ్చారు. గురువుల అనుమతితో బారాముల్లా వెళ్లి సంత్ సింగ్ గుహలో నాలుగు నెలలు, ప్రాణాయామ ఆసన ధ్యానాలు చేశారు. శ్రీనగర్ కాళీ పర్వత గుహలో, పర్వతం పై గుహలలో కొంతకాలం తపస్సు చేశారు. జాడీ పురా యాపిల్ తోట కుటీరం లో ధ్యాననిమగ్నుడై నిర్వికల్ప సమాధిలోకి వెళ్ళేవారు.

స్వగ్రామం గొరగన పూడి చేరి తోటలో కుటీరం ఏర్పరచుకొని "మాన్ టు బుద్ధ " అనే ఇంగ్లీష్ కవిత రాశారు. తర్వాత కైలాస మానస సరోవర యాత్రలు చేసి అక్కడకూడా మూడు రోజులు తపస్సు ఆచరించి, తన యోగ సాధన అనుభూతులను స్వామి జ్ఞానానంద 30పూర్ణ సూత్రాలుగా రాశారు. పరబ్రహ్మ సాక్షాత్కారం పొంది తర్వాతజర్మని ఇంగ్లాండ్ అమెరికాలలో అకుంఠిత దీక్షతో చదివి న్యూక్లియర్ ఫిజిక్స్ లో అత్యున్నత శిఖరాలు అందుకున్నారు. భారత ప్రధాని నెహ్రూ ఆహ్వానం పై నేషనల్ ఫిజిక్స్ లేబరేటరి పరమాణు విజ్ఞాన పరిశోధనా విభాగం అధిపతిగా 17ఏళ్ళు సేవలందించారు. 1965 నుండి 69 వరకు ఎందరికో మంత్రం దీక్ష అనుగ్రహించారు. 1954 లో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో పరమాణు భౌతిక విజ్ఞాన విభాగం మొట్టమొదటి సారిగా ఏర్పాటు చేసి లో10ఏళ్ళు ఆచార్యులుగా, శాఖాధ్యక్షులుగా వెలుగొంది వాటికి అంతర్జాతీయ ఖ్యాతిని సంపాదించారు. వీరి జ్ఞాపకార్ధం పరమాణు భౌతిక శాస్త్రంలోని ప్రయోగశాలకు "స్వామి జ్ఞానానంద పరమాణు పరిశోధన ప్రయోగశాల" (Swami Jnanananda Laboratories for Nuclear Research) గా నామకరణం చేశారు. సన్యాసి వస్త్ర ధారణతోనే ఉండేవారు 117వ మూలకం కనిపెట్టిన డా ఆకునూరి వెంకరామయ్యగారు జ్ఞానానంద శిష్యులే. ఆయన ప్రోద్బలం తోనే అమెరికా వెళ్లి అనేక పరిశోధనలు చేసి 117 వ మూలకం టెన్నెస్సీకనిపెట్టి ఆంధ్ర దేశానికి భారతదేశానికీ అత్యంత గౌరవం తెచ్చారు.

జ్ఞానానంద రచించిన పూర్ణ సూత్రాలు తెలుగులోకి అనువదించబడ్డాయి. పరమాణు భౌతిక విజ్ఞాన ప్రాథమిక పాఠాలు, ఫిలాసఫీ ఆఫ్ యోగ, రాజయోగ గ్లిమ్సెస్, హై వాక్యుయా మొదలైనవి ఆంగ్లంలో ముద్రించబడ్డాయి.

ఆచార్యోత్తములు, పరమహంస, దర్శనవేత్త, కర్మయోగి అయిన స్వామి జ్ఞానానంద 1969 సెప్టెంబరు 21 తేదీన సౌమ్య సంవత్సర భాద్రపద శుద్ధ దశమి ఆదివారం ఉదయం 7-45 గంటలకు 73వ ఏట పరమపదించారు. గొరగనమూడిలోరామజ్ఞాన మందిరం లో వీరి సమాధిని పలువురు దర్శించుకొంటారు.

వీరి స్వీయచరిత్ర "శ్రీ స్వామి జ్ఞానానంద చరితామృతము" వీరు మరణించిన తరువాత వెలువడిన గ్రంథం.

స్వామి జ్ఞానానంద ఆశ్రమం విశాఖపట్నంలో వెంకోజీపాలెంలో ఉంది.

## 22-అనునిత్య భగవదను భూతి పొందినపరిపూర్ణ యోగి

**బూర్లె రంగన్న బాబు -1895-1979**

ఒంగోలు జిల్లా దర్శి తాలూకా శ్రీరమ భద్రపురం నుండి వీరి పూర్వీకులు పగోజి ఏలూరుకు తరలి వచ్చారు. వీర బ్రహ్మేంద్రస్వామి భక్త దంపతులు బూర్లె పుల్లయ్య, జాలమ్మలకు 1895లో రంగన్న బాబు పుట్టాడు.ఒక అపరిచయ బాలుడు ఆతన్ని చిన్నతనం లో ఆరు నెలలు దేశ మంతా తిప్పి భద్రంగా ఇంటికి చేర్చాడు.




సత్సంగాలు ధ్యానాలకు వెళ్లి రంగన్న ధ్యానం తో ఇష్టదైవాన్ని పొందవచ్చు అని తెలుసుకొన్నాడు. హృదయం రామకృష్ణ ఆంజ నేయులని ప్రతిష్టించు కొన్నాడు. లక్ష్మీ దేవమ్మను పెళ్ళాడి ఆరుగురు సంతానం పొందాడు. నీళ్ళ కావిళ్ళు మోసి వారిని పెంచాడు. ఆయన భక్తులు ఈపని తప్పించి గుంటూరులో పెట్టుకొని "బాబు గారు "అని గౌరవంగా పిలిచేవారు. తాత్విక విషయాలు జన్మ కర్మ విషయాలు బోధించేవాడు. నామం చేస్తే కర్మకరిగిపోతుందని చెప్పేవాడు. మహిమలు ప్రదర్శిస్తూ అవన్నీ శ్రీరామకరుణా కటాక్షమే అనే వాడు. 22-7-1979 సిద్ధార్థి సంవత్సర కార్తీక శుద్ధ విదియ సోమవారం పూర్ణయోగి రంగన్నబాబు 84 వ ఏట శ్రీరామ సన్నిధి చేరాడు. ఆయనకు సమాధి మందిరం లేవు.

## 23 ముద్దయ్యస్వామి -1850-1940

కర్నూలు జిల్లా ద్రోణాచలం తాలూకా గోవర్ధనగిరి లో యాదవకులం లో బద్దుల రంగయ్య చౌడమ్మ దంపతులకు చివరి సంతానంగా 1850 లో ముద్దయ్య పుట్టాడు. బాల్యం నుంచి దైవభక్తితో గడిపాడు. అడువులకు ఆవులను తోలుకు వెళ్లి మేపుతూ చెట్టు నీడన ఏకాంత ధ్యానం లో మునిగి పోయేవాడు. ఒక రోజు పెద్ద నాగుపాము ఆయనకు ఎండ తగలకుండా పడగా విప్పి గొడుగులాగా కాపాడింది. ఊళ్ళో ఉన్న మాలదాసరి కౌలుట్లయ్యను తమకొడుకును ప్రయోజకుడిని

చేయమని తలిదండ్రులు కోరారు. యాగంటి క్షేత్రానికి తీసుకువెళ్ళి మంత్రోపదేశం చేయగా నిరంతరం మంత్రజపం దీక్షగా చేశాడు. ఒక రోజు కోటి పెట్టి బావి దగ్గర జ్యోతి వెలిగించి శివలింగం చెక్కటం మొదలు పెట్టాడు. విషయం తెలిసిన అన్నలు వచ్చిజ్యోతి ముందు ధ్యానమగ్నమై ఉన్న ముద్దయ్యకు తెలీకుండా శివలింగాన్ని "భోజనం బావి "లో పారేసిపశువులను ఇంటికి తోలుకుపోయారు.



ధ్యానముద్ర నుంచి లేచిన ముద్దయ్య విషయం తెలిసి నూతిలోకి దూకి ఒక చేతిలో శివలింగం మరో చేతిలో జింక చర్మం తో నీటిపై తేలాడు. నడి బావిలో జింక చర్మం పరచి పద్మాసనం లో కూర్చుని చేతిలో శివలింగంతో ధ్యానమగ్నుడయ్యాడు. ఈ విషయం అంతటావ్యాపించి అతని మహిమలకుందరూ ఆశ్చర్యపోయారు. తలిదండ్రులు అతడికి బలవంతం తో పెళ్లి చేయగా రజస్వలకూడా కాని భార్య ఆకస్మాత్తుగాచనిపోవటం తో వైరాగ్యం పెరిగి జ్ఞానం కోసం దేశాటన చేశాడు. తల్లి మరణవార్త తెలిసి తిరిగివచ్చి ఆమెకు సమాధి కట్టి అక్కడ ఒక చెట్టునాటి, చిన్న కుటీరం కట్టుకొని ఆశ్రమజీవితం మొదలుపెట్టాడు. ఆ పర్ణశాలను "ముసలమ్మ కట్ట" అంటారు. శిష్యులు పెరిగారు రోగులకు వ్యాధి నయం చేసేవాడు.

పత్తికొండ తాలూకా గొనె గండ లో ఉన్న చింతలస్వామి నీ సే యాగంటీశ్వరుడిని అప్పుడప్పుడు వెళ్లి దర్శించి వచ్చేవాడు. బాల్యంలో చెక్కిన శివలింగాన్ని ఆశ్రమం లో ప్రతిష్టించాడు. తాను సమాధి అయ్యేరోజును అయిదేళ్లకు ముందే ప్రకటించి, సమాధి నిర్మింప జేసుకొని బ్రహ్మరంధ్రం ద్వారా ప్రాణవాయువును వదిలేసి 1940లో 90వ ఏట గోవర్ధనగిరి ముద్దయ్య స్వామి సమాధి చెందారు. శ్రావణ శుద్ధ సప్తమి నాడు ఆరాధనోత్సవం చేస్తారు.

## 24 మౌనస్వామి -1868-1943

బాపట్ల తాలూకా నూనె వారి పాలెం అచ్యుతుని బాపనయ్య, సీతమ్మలకు 20-4-1968 న పిచ్చయ్య మూడవ కొడుకుగా పుట్టాడు. పందిళ్ళ పల్లి వాసి అచ్యుతుని లక్ష్మీ నరసయ్య సుందరమ్మలు దత్తత తీసుకొని శివయ్యగా పేరు మార్చి చదువు చెప్పించారు. కామేశ్వరమ్మతో పెళ్లి జరిగి ఆబ్కారీ శాఖలో ఉద్యోగం లో కొంతకాలం ఉద్యోగం చేశాడు.



1943 లో రాజమండ్రి వెళ్లి ధాన్యం వ్యాపారిదగ్గర గుమాస్తాగిరీ చేస్తూ, దేవీ ఉపాసన మొదలుపెట్టాడు. రాత్రిళ్ళు పురాణప్రవచనాలు. హరికథా కాలక్షేపాలు చేసేవాడు. క్రమంగా దృష్టి అంతర్ముఖమై, 1906 లో ఇల్లువదిలేసి గురువు అన్వేషణ కోసం దివ్య క్షేత్రాలు యోగభూములు దర్శిస్తూ దేశాటనం చేశాడు. తిరువన్నామలై లో శ్రీ రమణమహర్షి ఆశ్రమం లో ఒకఏడాది గడిపాడు.

ఉత్తర దేశ యాత్రలో అచ్యుతానంద సరస్వతీ స్వాముల దర్శనం కలుగగా ఆయన ""శివ చిదా నంద సరస్వతి "దీక్షానామం తో సన్యాసం ఇచ్చారు. గురువు అనుమతితో యోగ సాధన చేస్తూ మళ్ళీ దేశయాత్ర చేశారు. 1908 లో నైమిశారణ్యం చేరి, అక్కడ వంద సంవత్సరాలుగా తపస్సుచేస్తున్న" వెంకటాచలం పంతులు"గారిని సేవించి, అనేక యోగ శక్తులు సాధించారు దత్తాత్రేయుని అపరావతారమైన శ్రీ వాసు దేవానంద సరస్వతి శుశ్రూష చేసి, సమస్త శాస్త్రాలు యోగం లలో నైపుణ్యం సాధించారు. సిద్ధ పురుషులైన చిదానంద అప్పటినుంచి మౌనంగా ఉంటూ "మౌనస్వామి "గా పేరు పొందారు. పంచవటి వద్ద

గుహలో యోగ సాధన చేశారు. తర్వాత కర్నాటక మూకాంబికా క్షేత్రం చేరి, అక్కడనుండి మంగులూరుకు బయల్దేరి మధ్యలో చిత్రకూట పర్వత ప్రాంతం లోసమాధి లో ఉంటూ అనేక అద్భుతాలు ప్రదర్శించారు. చివరకు తమిళనాడు చేరి కుర్తాళం వద్ద స్థిరపడి "కుర్తాళం మౌనస్వామి "అని పిలువబడ్డారు

తమ మఠాలకు,మందిరాలకు ట్రస్ట్ ఏర్పాటు చేసి 28-12-1943న 75వ ఏట మౌనస్వామి అనంత మౌనం లో కలిసిపోయారు. దండాయుధ పాణి మందిరం లో సమాధి చేశారు. 13-7-1951న సమాధిపై శివ లింగ ప్రతిష్ట జరిగింది. ఆనాడు ఆయన దత్తాశ్రమం లో స్థాపించిన "సిద్దేశ్వరీ పీఠం",ఈ నాటి పీఠాధిపతి –శ్రీ సిద్దేశ్వర చిదానంద భారతీ స్వామి (పూర్వాశ్రమంనామం ప్రసాదరాయ కులపతి )ఆధ్వర్యంలో ప్రశస్తిపొంది, దేశం లో గొప్ప అద్వైత పీఠంగా భాసిల్లుతోంది.

## 25 మునీంద్ర స్వామి -1876-1961

ఆంధ్ర ప్రదేశ చిత్తూరుజిల్లా తిరుమల దగ్గర స్వర్ణముఖీ నదీ తీరం లో యలమండ్య గ్రామం లో గాలిమాసి లక్ష్మణ రెడ్డి, అస్వేరమ్మ అనే పాకనాటి రెడ్డి దంపతులకు మునిస్వామి రెడ్డి 1876లో పుట్టాడు. చీరాల సుబ్బయ్య అనే భాగవతోత్తముడు అక్షరాభ్యాసం చేసి తారకమంత్రం ఉపదేశించగా, వ్యవసాయపనులతో సహా అన్ని పనులూ చేస్తూ కూడా దీక్షగా జపించాడు. ఒక రోజు సృష్టి రహస్యం భేధించాలన్న ఆలోచన కలిగి, ఏకాంతం లో ఉండటం మొదలుపెట్టాడు. 18వ ఏట చెంగమ్మతో పెళ్ళిచేశారు కాని దాంపత్యం పరమాత్మజీవాత్మ బంధంగా ఉన్నది


దిరిమంగళం మునీంద్రస్వామి (1876-1961)

5-1-1925 రక్తాక్షి సంవత్సర పుష్యశుద్ధ ఏకాదశి నాడు మునిస్వామి వ్రత దీక్షతో తదేక రామతారకనామాన్ని జపిస్తుంటే శుద్ధ నిర్వికల్ప సమాధి లభించింది. ఆత్మదర్శనమై ప్రపంచమంతా పరమాత్మ స్వరూపంగా కనిపించింది. నిద్రాహారాలు మాని 8 నెలలు బ్రహ్మానంద మగ్నుడయ్యాడు.ఒక శ్రావణ పౌర్ణమి నాడు వేదవేదాంత జ్ఞాని నారాయణాచార్యులు, అష్టాక్షరీ మంత్రముపదేశించి భ్రూమధ్యం లోకి చూడగా బాహ్య దృష్టి నశించి ఆత్మ దృగ్గోచరమైంది. మునీంద్ర స్వామి దీక్షానామమిచ్చి వేదాంత రహస్యాలు బోధించాడు. అప్పటినుచి ఏకాంత తపస్సు చేస్తూ, ఆత్మశక్తితో సమస్తవిషయాలూ తెలుసుకొంటూ మహిమలెన్నో చూపాడు.నాస్తికులను ఆస్తికులుగా మార్చాడు శిష్యకోటి పెరిగింది.

అనుష్టాన వేదాంతి మునీంద్ర స్వామి జిజ్ఞాసువులకు కల్ప వృక్షమైన "బ్రహ్మజ్ఞానామృత సంగ్రహం "గ్రంథం రాశారు. పుత్తూరుతాలూకా కదిరి మంగళం లో ఆశ్రమము స్థాపించి కదిరి మంగళం మునీంద్ర స్వామిగా ప్రసిద్ధి చెందారు. తన నిర్యాణ సమయాన్ని వారం రోజులు ముందే ప్రకటించి 18-5-1961 ప్లవనామ సంవత్సర జ్యేష్ట శుద్ధ పంచమినాడు 85వ ఏట కళ్ళు తెరచి భక్తులను శిష్యులను ఆశీర్వదించి మునీంద్రస్వామి జీవ సమాధి చెందారు. ప్రతి పూర్ణిమ నాడు గురుపూజ, వార్షికోత్సవాలు ఘనంగా చేస్తారు. ప్రస్తుత పీఠాధిపతి బ్రహ్మానంద భారతీ స్వామి.

## 26 యోగానంద నరసింహ మహర్షి-1886-1960

ఒంగోలు జిల్లా మార్కాపురం తాలూకా తోకపల్లి లో 1886లో సుబ్బారాయుడు పుట్టాడు. వీధి బడి లో చదివి, నాట్యనాటకాలపై అభిరుచి పెరిగి, ఒకనాటక సమాజ నటుడయ్యాడు. ఒక వైష్ణవ పండితుడు చేరదీసి, పురాణ వేదాంత సారం వంట బట్టించి మంత్రాలు ఉపదేశించాడు దీక్షతో మంత్రం రాత్రి పగలు చేస్తూ అడవిలోకి వెళ్ళిపోయాడు.ఒక పాశ్చాత్య సర్వేయర్ అతడికి ఉద్యోగమిచ్చి, తీరిక వేళల్లో అతడి భక్తి గేయాలువింటూ భక్తుడైపోయాడు. అతడు ఏది చెబితే అది జరిగేది.



ఉద్యోగ రీత్యా వీరరాఘవ క్షేత్రం ఐన తిరువళ్ళూరు వెళ్లి అక్కడ నిద్రాహారాలు మాని రామనామ జపంచేశాడు. దొర ఇతడిని మద్రాస్ కు మార్చాడు.ఒక రోజు ఒక అవధూత కనిపించగా ఆయనపాదాలపై మూడు రోజులు పడిఉండగా, నాల్గవ రోజు దీవించగా సుబ్బారాయుడి ముఖం దివ్య తేజస్సుతో వెలిగిపోయింది. మంత్రాలు సిద్ధులు యోగామర్మాలు వచ్చేశాయి. ఆ దిగంబర అవధూత తన శక్తులన్నీ సుబ్బారాయుడికిదారపోసి,అదృశ్యమయ్యాడు.

ఎన్నెన్నో అద్భుతాలు లీలలు ప్రదర్శిస్తూ కపిలగిరిపై చేరి తపస్సు చేయగా శ్రీ లక్ష్మీ నరసింహ స్వామి ప్రత్యక్షమై ఆలయం కట్టమని కోరగా కట్టించి స్వామిని ప్రతిష్టించి, నిత్యపూజా నరసింహ జయంతి ఉత్సవాలు జరిపించారు కపిలగిరి యోగానంద మహర్షి. తనను జీవ సమాధి చేయమని శిష్యులకు ఆదేశించి తనవారసునిగా నారాయణ దాసును పీఠాదిపతిని చేసి 30-12-1960 శార్వరి పుష్యశుద్ధ త్రయోదశి శుక్రవారం 75 వ ఏట సమాధి స్థితులై బ్రహ్మ రంధ్రాన్ని చేదించుకొని యోగా నంద మహర్షి లక్ష్మీ నరసింహస్వామిలో ఐక్యమయ్యారు. కపిలగిరి మెట్ల ప్రక్క ఈశాన్యం లో సమాధి చేశారు. ఏటాగురుసమారాధనలు వైభవంగా జరుగుతాయి.



## 27 లక్ష్మీకాంతానంద యోగి -1888-1970

నటుడు గాయకుడు వైద్యుడు, త్రిభాషా పండితుడు, యోగి లక్ష్మీకాంతానందయోగి గుంటూరు జిల్లా కొత్తరెడ్డి పాలెం గ్రామకరణం చెన్నం రాజు, కామేశ్వరమ్మలకు 11-1-1888సర్వజిత్ పుష్యబహుళ త్రయోదశి బుధవారం మూలా నక్షత్రం లో జన్మించాడు గుంటూరు ఎసి కాలేజిలో మెట్రికులేషన్ పాసై, 18వ ఏట మద్రాస్ ఇంజనీరింగ్ కాలేజీలో డ్రాఫ్ట్స్ మన్ ప రీక్ష పాసై కృష్ణా –గుంటూరు రిజర్వాయర్ ప్రాజెక్ట్ ప్రభుత్వ ఉద్యోగం లో చేరాడు. తండ్రి చనిపోయాడు. ప్రతియేటా ఇంట్లో జరిగే సీతారామ కళ్యాణ బాధ్యత మీద పడింది. అధికారులు సెలవు ఇవ్వనందున రాజీనామా చేసి, అనసూయమ్మను పెళ్ళాడి, గ్రామకరణీకం వ్యవసాయం సీతారాముల సేవలో గడిపాడు. నాటకాలలో హరిశ్చంద్ర, నల బాహుక సారంగధర నరకాసుర భీష్మ పాత్రలు ధరిస్తూ మంచి పేరు పొందాడు. హిందీ, సంస్కృతాంధ్రాలలో అనేక రచనలు చేశాడు. సుశ్రావ్యంగా గానం చేసేవాడు. వీణావాదనలో దిట్ట అనిపించాడు. హరికథలు, పురాణ ప్రవచనాలలో రాణించాడు, ఆయుర్వేద గ్రంథాలు చదివి జీర్ణం చేసుకొని ఆయుర్వేద మందులు తయారు చేసి పేదలకు ఉచితం గా అందించేవాడు.




లక్ష్మీ కాంతుని గుణ శీలాలు,ఆధ్యాత్మిక చింతన గుర్తించి చంద్ర శేఖరానంద సరస్వతీ స్వామి తమ ఆశ్రమ స్థలం తోట ఆయనకు వదిలేసి కాశీ వెళ్ళిపోయారు. తమ్ముడు సుబ్బారావు తో కలిసి అక్కడ ఆధ్యాత్మిక సాధన చేశాడు. హఠాత్తుగా తమ్ముడు చనిపోవటం తో విరక్తికలిగి, మనసు వికలమై, ఆ ప్రదేశం లో ఆనందాశ్రమం అనే పేరుతో మూడు కుటీరాలు నిర్మించి ఉత్తర భారతయాత్రకు బయల్దేరాడు. కాశీలో బ్రహ్మానంద సరస్వతీ స్వామి ఋషీకేశ్ లో ఆనంద యోగి లను దర్శించి, యోగ రహస్యాలు గ్రహించి, కాశ్మీర మాధవానందులతో కలిసి, హిమాలయాల్లో తిరిగి మళ్ళీ ఇంటికి వచ్చి ఆనందాశ్రమం లో శివ లింగం ప్రతిష్టించి ఋషి వాటికగా మార్చారు. ఆనందశ్రమం లోనిఒక కుటీరం లో భూ గృహం ఏర్పాటు చేసుకొని అక్కడ రోజుకు కనీసం అయిదు గంటలు యోగ సాధన చేసేవారు. అద్భుతాలు మహిమలు ప్రదర్శించారు. సేవాకార్యాలు సాంఘిక సంస్కరణకర్యక్రమాలు చేబట్టారు.సుమారు 25 గ్రంథాలు రాశారు. 21-11-1970 సాధారణ సంవత్సర కార్తీక బహుళ అష్టమి శనివారం 82 వ ఏట లక్ష్మీకాంతానంద స్వామి తమ ఆరాధ్యదేవత గాయత్రీ మాత ను హృదయం లో నిలుపుకొని బ్రహ్మైక్యం చెందారు.

## 28 ప్రణవానంద స్వామి -1888-1969

కేరళలో పుట్టి కృష్ణాజిల్లా గుడివాడలో స్థిరపడి గుడివాడ ప్రణవానంద స్వామిగా ఖ్యాతి పొంది.భారత దేశానికి జ్ఞాన భిక్ష ప్రసాదించిన ఆయన కేరళ పాల్ఘాట్ లో ఆల్తూరు గ్రామంలో 15-5-1888 సర్వధారి వైశాఖ శుద్ధ చవితి మంగళవారంజన్మించారు పసితనం లోనే తలి దండ్రులు గతించారు. గురుకులం లో చదివి ఆధ్యాత్మిక భావ సంపద పొందారు. మళయాళ సంస్కృత తమిళ కన్నడ భాషలు నేర్చి శ్రీ కృష్ణానంద అవధూత శిష్యులై బ్రహ్మ విద్య గ్రహించారు. విద్యార్థిగా ఉండగానే బ్రహ్మచర్యం పాటించి తత్వాన్వేషణ చేసి సన్యసించాలి అనే కోరిక బలీయంగా ఉండేది. పాద చారియై దేశ సంచారం చేస్తూ, 1917 లో గుడివాడ చేరారు.



గుడివాడలో తాతిరెడ్డి తోట ను తపోభూమిగా చేసుకొని నిష్కళంక నిరాడంబర జీవితం గడుపుతూ దీక్షగా తపోసాధన చేశారు. సులభంగా అందరికీ అర్థమయేట్లు గహనమైన వేదాంతాన్ని బోధిస్తూ అందరి మనసులను ఆక్రమించారు. మీర్జాపురం రాజా దంపతులు భక్తులై, 1936లో ప్రణవాశ్రమం నిర్మించి శంకర ప్రతిష్ట చేసి, నిత్యా రాదనకు తోడ్పడ్డారు. గుడివాడ, పరిసర ప్రాంత ప్రజలు "సనాతన హిందూ ధర్మ ప్రబోధ సంఘం "స్థాపించి, స్వామివారితో చాలా చోట్ల ఆధ్యాత్మిక ప్రవచనాలు చేయించారు. స్వామి ఎవరినీ శిష్యులుగాచేర్చుకోకపోవటం ప్రత్యేకత. ఎన్నో జీర్ణ దేవాలయాలను ఉద్ధరించారు. విశ్వహిందూపరిషత్ కార్యక్రమాలలో చురుకుగా పాల్గొనే వారు. గాంధీస్మారక నిధికి విరాళాలు సేకరించి అందించారు. హృషీకేష్ లోని స్వామి శివానంద దివ్య జీవన సంఘానికి గుడివాడలో 1930 లో ఒక శాఖను ఏర్పాటు చేశారు. కవిపండిత నటగాయక నర్తక హరిదాస భాగవతులను ఆహ్వానించి, ఆదరించి సన్మానించేవారు.

ప్రణవాశ్రమం లో ప్రతి ఏడాది సప్తాహ దీక్ష తోపాటు గణపతి, దేవీ, నవరాత్రులు కృష్ణాష్టమి గీతాజయంతి, త్యాగరాజ, విద్యారణ్య జయంతి, రామానుజ, మధ్వాచార్య, జయంతి రమణమహర్షి జయంతి మొదలైనవాటిని వైభవోపేతంగా నిర్వహించేవారు. దేశమంతా అయన పేరిట అనేక ఆశ్రమాలు ఏర్పడ్డాయి. 80వ ఏట కూడా నిరంతర పరిశ్రమ చేసేవారు. 1967 లో అనారోగ్యానికి గురయ్యారు. 1969 మే15 సాయంత్రం 3గంటలకు 81వ ఏట ప్రణవానందస్వామి బ్రహ్మైక్యం చెందారు. ఆశ్రమం ప్రక్కనే సమాధి నిర్మించారు.

## 29 వెంకయ్య స్వామి -1887-1982

1887లో నెల్లూరు జిల్లా చేజెర్ల మండలం ఆత్మకూరుతాలూకా, నాగురి పెల్లటూరు లో నోంపల్లి పిచ్చమ్మ, పెంచ లయ్యనాయుడు కమ్మ దంపతులకు వెంకయ్య స్వామి పుట్టాడు. బాల్యం నుంచే అడవుల్లో ఏకాంతంగా తిరిగేవాడు.


శ్రీ వెంకయ్య స్వామి, గొలగమూడి

షిర్డీ సాయిబాబా ఒక సాధువు రూపం లో వచ్చి అతడి నాలుకపై బీజాక్షరాలు రాసి వెళ్ళగా అవధూత వెంకయ్యస్వామి గా ఆరాధనలు అందుకొన్నాడు. గ్రామాలు తిరగటం, ప్రతి చోటా ధుని వెలిగించటం చేసేవాడు. బొటన వ్రేలుపై సిరా తో అద్ది తెల్లకాగితం పై ముద్రవేసి ప్రసాదంగా అందించేవాడు. చెడు లక్షణాలున్నవారిని కులహీనులుగా, సద్గుణాలున్న వారిని బ్రాహ్మణులుగా భావించేవాడు.


శ్రీ వెంకయ్య స్వామి దేవాలయం, గొలగమూడి

చేతి స్పర్శతో అన్నం ఔషధంగా మారి రోగాలు మాన్పించేది. అతి పేదగా జీవిస్తూ ఆశ్రితులకు సిరులు ఇచ్చేవాడు. తాను ఎక్కడికీ పోననని, వారిమధ్యనే ఉంటానని, పిలిస్తే పలుకుతాననీ చెప్పేవాడు. 24-8-1982 న 95ఏళ్ళ వయసులో అవధూత గొలగమూడి వెంకయ్య దేహం చాలించారు. అంతకు ముందురోజు "సంపన్నత్వం, సాధారణత్వం, సద్గురు సేవ"అని చాలాసార్లు స్వామి అనటం అందరూ విన్నారు. అదే ఉపదేశంగా భావించి అనుసరిస్తున్నారు.

## 30 నిత్యానంద స్వామి -1905-1959

రామానుజ మతావలంబులైన కమ్మ దంపతులు అప్పాస్వామి నాయుడు, రుక్మిణీ అమ్మాళ్ లకు తిరునల్వేలి జిల్లా కోయిల్ పట్టి లో 2-11-1905 విశ్వావసు కార్తీక శుద్ధపంచమి ద్వితీయ సంతానం గా రంగనాథ స్వామి పుట్టి తర్వాత నిత్యానందస్వామిగా కీర్తి పొందాడు.ఊరిలోనే 8వ క్లాసు వరకు చదివి, తల్లి పూజలో చేసే ప్రాణాయామం అభ్యాసం చేస్తూ ఉంటె, ఒక రోజు కలలో ఒక సిద్ధ పురుషుడు కనిపించి తలపై చేయిపెట్టి ప్రాణాయామం నేర్పి అదృశ్యమయ్యాడు. దీక్షగా కొనసాగించాడు.



విమలానందుని పరీక్షలలో నెగ్గి శిష్యుడై, 15వ ఏట తల్లి అనుమతితో సన్యసించాడు. రమణమహర్షి ఆశ్రమం లో కొంతకాలం గడిపి, మద్దికెర లో విమలానందుని ఆశ్రమం లో స్వామికి శుశ్రూష చేస్తూ గీతారహస్యాలు యోగరహస్యాలు గ్రహించాడు. 16 ఏళ్ళు అక్కడే ఉండి అనేక పరీక్షలకు తట్టుకొని చిన్నస్వామిగా గుర్తింపుపొంది విరాగి అయ్యాడు.

గురువు వదిలేసిన ధనుశ్కాల ఆశ్రమాన్ని ఏకాంత వాసంగా చేసుకొని తపస్సు చేశాడు. తర్వాత వనముల పొద లో నిర్మించి ఇచ్చిన ఆశ్రమం చేరాడు. శిష్యులనేకులేర్పడ్డారు. 1946 లో బొల్లవరం లో విమలానందుని నుంచి సన్యాస దీక్ష పొంది నిత్యానంద దీక్షానామం పొందాడు. అద్భుతాలెన్నో చూపేవాడు. 2-11-1959 వికారి కార్తిక శుద్ధ తదియ సోమవారం శవాసనం వేసి, ప్రాణాన్ని సహస్రారం చేర్చి, తనను త్వరగా సమాధి చేయమని శిష్యుడు శివయ్యకు చెప్పారు. వైద్యులనుపిలిపించి వైద్యం అందించారు కాని ఫలితం శూన్యం. 30-1-1959 అమావాస్యనాడు శిష్యులు,సోదరులు ప్రముఖులు లింగనవాయి కి బండీలో తీసుకు వెళ్లి జీవ సమాధి చేశారు. చాలాచోట్ల ఆరాధనోత్సవాలు కార్తీక అమావాస్యనాడు ఘనం గా నిర్వహిస్తున్నారు.

## 31 లింగాల దిన్నె బ్రహ్మస్వామి -1820-1889

తమిళనాడు సేలం జిల్లా సదాపేట లో కౌండిన్యస గోత్ర వెలనాటి వైదిక బ్రాహ్మణులునుదురుపాటి లక్ష్మీ నరసయ్య, గున్నమ్మ దంపతులకు 1920 లో నరసయ్య పుట్టాడు. బాల్యం లో సేలం కొండపై జరిగే లక్ష్మీ నరసింహస్వామి జయంతి ఉత్సవాలు సమారాధనలకు స్నేహితులతో కలిసివెళ్లి, ఒకగుహాలో ఉన్నయోగి దయకు పాత్రుడై శ్రీ లక్ష్మీ నరసింహ మహా మంత్రాన్ని ఉపదేశంగా పొందాడు. ఆయన ఉపదేశించినట్లు కళ్ళు మూసి తెరిచేలోపు కాశీకి చేరి, అక్కడే ఆ మంత్రాన్ని దీక్షగా జపించాడు. మహిమలెన్నో చూపి,25 ఏళ్ళకే బ్రహ్మస్వామిగా గుర్తింపు పొందాడు.



బ్రహ్మస్వామి కీర్తి దేశమంతటా మారుమోగింది. పుష్పగిరి పీఠాధిపతి శ్రీశంకర భారతీ స్వామి సగౌరవంగా బ్రహ్మస్వామిని ఆహ్వానించి, తూగుటుయ్యాలపై ఊగించి ఇష్టాగోష్టి జరిపారు. తొడుగుపల్లె అగ్రహారం లో బ్రహ్మస్వామి ఒక బావి త్రవ్వించి ఆ బావి నీటిని కాశీ గంగ గా చెప్పారు. ఇప్పటికీ జనం గంగాజలంగా పవిత్రంగా భావిస్తారు. ఒక భక్తుడు స్వామిని పరమేశ్వరూపంగా భావించి నిర్మల భక్తితో పూజిస్తే లింగాకారం లో సాక్షాత్కరించారు.

బ్రహ్మ స్వామి 32లక్ష్మీ నరసింహ సాలగ్రామాలను బంగారు మూతతో సహా ధరించేవారు అవిచ్చిన్నంగా అన్నదానాలు జరిపేవారు. కవులు,పండితులు కృతులు రాసి స్వామికి అంకితమిచ్చారు. 75ఏళ్ళు నిండగానే దేహం చాలిస్తున్నట్లు ప్రకటించి 13-10-89 వికృతి భాద్రపద అమావాస్య సోమవారం బ్రహ్మ రంధ్ర ఛేదనం చేసుకొని బ్రహ్మనందస్వామి బ్రహ్మైక్యం చెందారు. లింగాల దిన్నె శివాలయం లో ఆయన సమాధి నిర్మించి, దానిపై శివ లింగం ప్రతిష్టించి ఆలయ నిర్మాణం చేసి పూజిస్తున్నారు. ఆయన గతించి నూరేళ్ళు దాటినా నేటికీ ఆరాధనోత్సవాలు వైభవంగా నిర్వహిస్తున్నారు. స్వామి వారి వెండి పాదుకలు,, మేనా దర్భాసనం, చిత్రాసనం రుద్రాక్షమాల, చిత్రపటం దేవాలయం లో పూజలందు కొంటున్నాయి.

## 32 లద్దగిరి రామదాసు -1833-1893

కర్నూలు జిల్లా కోడుమూరు మండలం హంద్రీనది ఒడ్డున ఉన్న లద్దగిరి కి 30ఏళ్ళ వయసులోఉత్తర భారతం నుంచి 1833లో రామదాసు చేరి లద్దగిరి రామ దాసుగా ప్రసిద్ధి చెందాడు. జింకచర్మం పై కూర్చుని తపస్సు చేస్తూ అవసరమైతే దాన్నే కప్పుకొనేవాడు. అందరినీ సమానంగా ఆదరించేవాడు. బాధితుల కష్టాలు తీర్చేవాడు.



ఒక వర్షాకాలం లో కుంభ వృష్టి కురిసి, కొండ చరియలు విరిగి రామదాసు హంద్రీ నదిలో పడి కొట్టుకు పోయి నీటిలో మునగకుండా నీటిపై తేలుతూ సమాధి నిష్టలో కనిపించి ఆశ్చర్యం కలిగించాడు. లయ, హఠ యోగాలు రామ దాససామికి స్వాదీనమయ్యాయి. నిరంతర రామనామ జపం చేసేవారు. జలస్తంభన విద్యలో ఆరితేరారు. వింత చర్యలతో సూచనలతో రాబోయే ప్రమాదాలు తెలియ జేసేవారు. ప్రజలలో శాంతి సుహృద్భావం కలిగించి జ్ఞానమార్గం లో నడిపించారు.



తన శరీర త్యాగాన్ని 5 నెలల 10రోజులు ముందుగానే తెలియజేసి. 60ఏళ్ళు నిండాక ఆరుమాసాలతర్వాత తన సమాధిని తెరచి చూడమని ఆదేశించి 5-12-1893 విజయనామ సంవత్సర కార్తీక బహుళ ఏకాదశి గురువారం దేహం చాలించారు రామదాసస్వామి. స్వామి చెప్పిన చోటనే ఊరి బయట సమాధి చేశారు. ఆరు నెలల తర్వాత సమాధి తెరచి చూడగా, స్వామి నిద్రలో ఉన్నట్లే కనిపించి, చిరు నవ్వుతో కళ్ళు తెరచి మూడు సార్లు ఓంకారం పలికి కళ్ళు మూసుకొని శాశ్వత సమాధి చెందారు. స్వామి సమాధి నేటికీ భక్తులకు కల్పవృక్షంగా ఉంటూ మనోభీష్టాలను నెరవేరుస్తోంది. మూడేళ్ళ తర్వాత భక్తులకు కనిపించి, తన సమాధిపై మందిరం నిర్మించమని ఆదేశించగా, ఆలయ నిర్మాణం చేశారు. ప్రతియేటా కార్తీక బహుళ ఏకాదశి ద్వాదశి నాడు ఆరాధనోత్సవాలు ఘనం గా చేస్తారు. మాజీ ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయ భాస్కర రెడ్డి స్వామివారికి వెండి రథం చేయించి 1953 లో సమర్పించారు. అప్పటినుంచీ రథోత్సవంకూడా వైభవంగా చేస్తున్నారు. ఆప్రాంత ప్రజలు స్వామిపేరునే తమపిల్లలకు పెట్టుకొంటారు.

## 33 యోగి రాజు -మాదిరాజు వెంకట అప్పారావు -1859-1935

కవి రాజు, రాజయోగి మాది రాజు వెంకట అప్పారావు గుంటూరు జిల్లా మునుమాక లో కాశ్యపస గోత్రీకులైన నియోగి బ్రాహ్మణ భక్తులు, నిష్టా గరిష్టులు వెంకమాంబ, లక్ష్మీ నారాయణ దంపతులకు 23-7-1859 సిద్ధార్థి నామ సంవత్సర ఆషాఢ బహుళ అష్టమి శనివారం జన్మించాడు. ఉపనయనం జరిగి తొమ్మిదవ ఏటనే వేదాధ్యయనం మొదలు పెట్టాడు. 18వయేత తండ్రి చనిపోవటం తో, ఖమ్మం కోర్టులో వాది, ప్రతి వాదులకు తెలుగు,ఉర్దూ భాషలలో కాగితాలు రాసిస్తూ, వచ్చే కొద్ది ఆదాయంతో జీవితం గడిపాడు. తర్వాత చింతిరేల పోస్ట్ మాస్టర్ గా ఉద్యోగం వస్తే చేరాడు. అక్కడ వేదాంత విద్యా విశారదుడు రాళ్ళబండి నరసింహ శాస్త్రి గారి తో పరిచయమై, వేదాంత గ్రంథాలు అధ్యయనం చేస్తూ, చర్చలు చేసేవాడు. ఉద్యోగం లో అకారణం గా నిందకు గురై, విచారణలో తాను నిర్దోషి అని రుజువు అయినా కూడా,విరక్తి చెంది, తల్లిని మేనమామ ఇంటికి పంపేశాడు.

నరసింహ శాస్త్రి గారితో కలిసి అప్పారావు హైదరాబాద్ వెళ్లి, అక్కడ "పీల్ఖానా శంకర ప్రభు "ను దర్శించగా, ఆయన పంచ ముద్రలు, అష్టాంగ యోగం బోధించి, శ్రీశైలం లో నిర్జన ప్రదేశం లో సాధన చేయమని ఆదేశించాడు. శ్రీ శైలం చేసి శ్రీ భ్రమరాంబా, మల్లికార్జునులను దర్శించి, నిర్జన ప్రదేశం లో తపస్సు చేశాడు. కొంతకాలం గడిచాక పీల్ఖానా ప్రభువు అప్పారావు ను పిలిపించి, ఆహారం తినమని చెప్పి "అచల జ్ఞానం "బోధించారు. త్రివిధ దీక్షలు, త్రివిధ ప్రసాదాలు అనుగ్రహించి, జీవ బ్రహ్మైక్య సంధానం చేశారు. ద్వాదశీ, షోడశీ మంత్రోప దేశం చేసి, పునర్జన్మ లేని మార్గం చూపించారు. సన్యాసం వద్దనీ, రాజయోగమే మార్గమని బోధించి, పెళ్లి చేసుకొని, సంసారం చేస్తూ తల్లికి సంతోషం కలిగించమని హితవు చెప్పారు. అలాగే ఇంటికి వెళ్లి వివాహం చేసుకొని, మళ్ళీ శంకర ప్రభు గారిని కలిశాడు. ఇంటి పేరును మాధవ రాజుగా, పేరును వెంకటేశ్వర దాసుగా మార్చుకోమన్నారు. అప్పటినుంచి మాదిరాజు వెంకట అప్పారావు మాధవరాజు వెంకటేశ్వర దాసుగా పిలువబడ్డాడు.

శంకర ప్రభు సిఫార్సు చేసి రెవిన్యు ఇన్స్పెక్టర్ ఉద్యోగం ఇప్పించారు వెంకట దాసుకు. ఖమ్మం లోనే ఉంటూ ఉద్యోగం చేశాడు. తన ఆధ్యాత్మిక ప్రగతికి ఉద్యోగం అడ్డంకిగా ఉందని భావించి వదిలేసి, చెక్ పోస్ట్ లో" కరోడ్గిరీ మాస్టర్" గా చేరి, క్రమంగా పదోన్నతులు పొందుతూ, తిరిగి చింతిరేల చేరాడు. కొన్నాళ్ళకు ఈ ఉద్యోగమూ వదిలేసి గురు సన్నిధి చేరాడు.

శంకర ప్రభు కటాక్షించి "పరిపూర్ణ జ్ఞానానంద దేశిక "అనే సార్ధక బిరుదు ప్రదానం చేసి మంత్రం దీక్ష ఇచ్చే అధికారం కలిగించారు అప్పారావు కు. 1900 లో కూతురు పెళ్లి చేసి "భాక్తానంద సాగరం "అనే గ్రంథం రచించాడు. శిష్య బృందం పెరిగారు. పేమవరం లో స్థిరపడి సహజకవి అప్పారావు, "జ్ఞానామృతం ","సీతా కల్యాణం "పుస్తకాలు అనేక భక్తి వేదాంత గ్రంథాలు రాశాడు. అద్భుతాలు, మహిమలు ప్రదర్శించేవాడు.కొంతకాలం తర్వాత పక్షవాతం వచ్చి తగ్గింది. 27-8-1935 యువ నామ సంవత్సర శ్రావణ బహుళ అమావాస్య మంగళవారం సాయంత్రం 4గంటలకు76వ ఏట కవి రాజు యోగిరాజు మాదిరాజు వెంకట అప్పారావు సహస్రారం చేదించుకొని బ్రహ్మైక్యం చెందారు. అప్పటినుండీ నవరాత్రి ఉత్సవాలు భవానీ చంద్ర శేఖర కల్యాణం, శ్రీవారి ఆరాధనోత్సవాలు నిరంతరం వైభవంగా జరుగుతున్నాయి.

## 34 పేరంటపల్లి బాలానంద స్వామి -1900-1976

కేరళ రాజకుటుంబం లో బాలానంద స్వామి 1900 లో జన్మిచి ఉండవచ్చు నని భావిస్తారు. ఎప్పుడూ ఏకాగ్రతా సాధనలో ఉండటం వలన విశ్వ మాతసాక్షాత్కారం పొందారు. వివేకానందస్వామి రచించిన "మై మాస్టర్స్ "పుస్తకం చదివి,దివ్యానుభూతి సాధించాలనే లక్ష్యం తో ఏకాగ్రతతో భగవత్ దర్శనం కోసం పరితపించి, పరి వ్రాజకులై దేశ సంచారం చేశారు. 1925 లో పోచవరం ప్రాంతంలో ఒక రోజు రాత్రినిద్రిస్తున్న ఆయనను ఆజానుబాహుపైన ఒక శ్యామలాంగి తనతో, పెద్ద పెద్ద

చెట్లు, పొదలు డొంకలు ఉన్న చోటుకు తీసుకు వెళ్లి వదిలేసి అంతర్ధాన మైంది. తెల్లారి లేచి చూసేసరికిస్వామికి పానవట్టం తో ఉన్న శివలింగం కనిపించింది. ప్రక్కనే ఉన్న సెలయేటిలో స్నానం చేసి, లింగానికి అభి షేకం చేసి, అక్కడే ఆశ్రమం నిర్మించి కొంతకాలం తపస్సు చేశారు.



తర్వాత భద్రాచలం వెళ్లి అక్కడి శివాలయం లో నాలుగు నెలలు మౌనంగా తపస్సు చేశారు అనేక సార్లు దివ్యానుభూతి, శబ్ద బ్రహ్మాను భూతి కలిగాయి.కూనవరం దగ్గర మందారం లో శ్రీ రామకృష్ణ పరమహంస సశరీరంగా ప్రత్యక్షమై, అనేక వేదాంత రాజకీయ,వేదకాలం నాటి సమసామాజిక ఆదర్శాలు, ధర్మాలు బోధించారు. అదే ఆదేశంగా భావించి పేరంటపల్లి చేరి అక్కడ ఆశ్రమం నిర్మించుకొని, స్వామి ఆ ఆదర్శాలను ప్రచారం చేస్తూ సమాజ అభ్యున్నతికి కృషి చేయటం ప్రారంభించారు. ఆశ్రమం లో శ్రీ రామకృష్ణ పరమహంస శ్రీ రామతీర్థుల చిత్ర పటాలను పెట్టి నిత్య పూజ చేసేవారు.

పేరంటపల్లి ఆశ్రమానికి "శ్రీ రామ కృష్ణ ముని వాటం "అంటారు. 12సూత్రాలతో ఆశ్రమ నియమావళి రూపొందించారు బాలాస్వామి. కొంతకాలం ఆశ్రమం వదిలేసి, పైన ఉన్న కొండపై చిన్న కుటీరం ఏర్పాటు చేసుకొని ధుని వెలిగించి తపస్సు చేశారు. శ్రీ కృష్ణుని దివ్య దర్శనం లభించింది. ఇంగ్లీష్ భాషలో అరడజను ఆధ్యాత్మిక గ్రంథాలు రాశారు. స్వాతంత్ర్య ఉద్యమానికి తోడ్పడ్డారు. దీన జనులకు చేయూత కలిగించారు. సమాజాభి వృద్ధికి తోడ్పడ్డారు. 15-1-1976రాక్షస నామ సంవత్సర పుష్య శుద్ధ త్రయోదశి గురువారం ఉదయం 4గంటలకు 76 వ ఏట బాలస్వామి చైతన్యం విశ్వ చైతన్యం లో లీనమైంది. మర్నాడు పేరంటపల్లిలో సమాధి చేశారు. భక్తియోగి కర్మయోగియై, ప్రకృతిని సేవించే ప్రకృతి యోగియై, జ్ఞానయోగియై, బాలయోగి విశ్వచైతన్యం లో లీనమయ్యారు. ఏటా అక్కడ ఆరాధనోత్సవాలు జరుగుతాయి.

## 35 అనుభవ యోగి -నిత్యానందస్వామి -1893-1965

కడపజిల్లా ప్రొద్దుటూరు తాలూకా పర్లపాడు లో బీరెడ్డి చిన్న చెన్నారెడ్డి అనే పేద కర్షక దంపతులకు ఐదవ సంతానంగా బాల వెంకట సుబ్బారెడ్డి 1893 డిసెంబర్ లో విజయ మార్గశిరమాసం లో పుట్టాడు. బాల్యం లోనే తలి దండ్రులు చనిపోతే పెద్ద జొన్నవరం వెళ్లి సంస్కృతాంధ్ర సాహిత్యాలు బాగా నేర్చాడు. 16వయేట ఈ రెండుభాషల్లో కవిత్వమూ రాశాడు. పరాపర విద్యలు గణిత సూత్రాలు శుద్ధి సూత్రాలు భూమి కొలతలు, కరణీకం నేర్చాడు 1914 లో రాయచోటిలో ఉపాధ్యాయ శిక్షణ పూర్తి చేసి పెద్ద జొన్నవరం లో ఉపాధ్యాయుడుగా చేరాడు. సత్యాన్వేషణపై దృష్టి మరలి, ఆళ్లగడ్డ తాలూకా రాంపల్లిలో రంగారెడ్డి అనే సత్పురుషుని చేరి, శిష్యుడై, సన్యాస దీక్ష, నిత్యానంద స్వామి అనే ఆశ్రమ నామం పొందాడు.అష్టాంగ యోగం మొదలైనవి గురువు వద్ద నేర్చాడు. 1925 నుండి తీవ్ర తపోదీక్షలో ఉంటూ "విశ్వం భరీయ " శ్రీమన్నారాయణ శాస్త్ర శరణాగతి, రామనామం, జానకీ రామ శతకం, నారాయణ స్తవం, శతపత్రం పుత్ర హితబోధిని వంటి గ్రంథా లెన్నో రాశాడు.

ప్రొద్దుటూరులో ఒక భక్తుని ఇంట్లో 17-2-1965 తెల్లవారు ఝామున 4గంటలకు 72వ ఏట చనిపోయాడు నిత్యానందస్వామి.ఆయనకోరిక పై శవాన్ని దహనం చేసి, కుందూ నదిలో చితాభస్మం కలిపారు. మహిమలు వగైరా చూపేవాడు కాదు. అనుష్టాన వేదాంతం బోధిస్తూ అనుభవ యోగిగా గడిపాడు.

## 36 రేపల్లె చిన్నమ్మ -1887-1963

గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా గొరిగ పూడిలో రేపల్లె లక్ష్మయ్య, శాయమ్మ కాపు దంపతులకు చివరి సంతానం మాచమ్మ.14వ ఏట గరిగపాటి గోవిందయ్య తో పెళ్లి జరిగింది. అత్తవారి ఊరిలో బొబ్బర్లంక లక్ష్మీ దేవమ్మ యోగినితో పరిచయమైంది. ఏడుగురు సంతానాన్ని కని, పరమేశ్వర సాక్షాత్కారం పొందిన మాచమ్మకు ఎనిమిదవ బిడ్డ పుట్టాక భర్తపై పితృభావం భర్తకు ఆమె పై మాతృ భావం ఏర్పడ్డాయి. మాచమ్మమహాత్మురాలని లోకం గ్రహించింది.

మంగళ సూత్రం వదిలేసి మాచమ్మ 12ఏళ్ళు మౌన దీక్ష పూని 7ఏళ్ళు మాట్లాడి మళ్ళీ 5ఏళ్ళు మౌనంగా ఉన్నది. నల్లూరుపాలెం బొబ్బర్లంక, గొరిగపూడి గ్రామాల్లో ఎందరికో వ్యాధులు నయం చేస్తూ 7ఏళ్ళు అన్నం తినకుండా ఒక నిమ్మతొన, కొద్దిగా సోడా నీరు తాగుతూ గడిపింది. గాంధీజీ ఆమెను దర్శించి ప్రభావితుడై ఆమె బోధలు అందరూపాటించాలని "యంగ్ ఇండియా "పత్రికలో రాశాడు. రేపల్లెలో స్థిరపడి రేపల్లె చిన్నమ్మగా ప్రసిద్ధి చెందింది. రేపల్లె బావాజీ పేటలో భక్తుడు కట్టించిన కుటీరం లో ఉంటూ, టైఫాయిడ్ జ్వరం వచ్చి దుర్ముఖి మార్గశిరశుద్ధ పంచమి 12-5-1956 సాయంత్రం 4గంటలకు, 76వ ఏట చిన్నమ్మ

పరమపదించింది. మర్నాడు రాత్రి సమాధి చేశారు. భక్తులకు, ముముక్షువులకు అది గొప్ప యాత్రాస్థలమైంది. ఒక్క మెతుకు కూడా వృధా చేయవద్దనీ, నీరు కూడా అనవసరంగా వాడవద్దనీ, అన్ని వృత్తుల రాహిత్యమే జన్మరాహిత్యమనీ చిన్నమ్మ ఉద్బోధ.



మంచి బది?

స పరమాత్మ భావంబు కలవారి పజ్జను
పడియుండుటే నీకు పాడియగును
పరమాత్మ భావంబు కలవారికింజేయు
సేవయే సరియగు సేవయగును
పరమాత్మ భావంబు కలవారికింబెట్టు
ఫలములే సరియగు ఫలమునిచ్చు
పరమాత్మ భావంబు కలవారికింజేయు
దానమే సత్పాత్రదానమగును

తే। _ చేతయే గీతయగు మాట సత్యమనుచు
చెప్పగలిగిన యట్టి యా గొప్పవారి
పల్కులాలకించియు నీవు పరమ ఆత్మ
దర్శనంబైన జ్ఞానుల దరినిజేరు.

## 37 స్థిత ప్రజ్ఞురాలు పిరాట్ల రామలక్ష్మమ్మ యోగిని -1882-1969

పల్నాటి సీమలో పల్లికుంత గ్రామానికి చెందినశ్రీరామభక్తులైన కంభంపాటి వెంకటప్పయ్య బుచ్చమ్మ బ్రాహ్మణ దంపతులకు 12-4-1882చిత్రభాను చైత్రబహుళనవమి బుధవారం కృష్ణాజిల్లా జుజ్జూరులో మేనమామ ఇంట్లో రామలక్ష్మమ్మ పుట్టింది.చిన్నప్పుడే పెద్దబాలశిక్ష రామాయణ భాగవతాలు చదివింది. ఆధ్యాత్మ రామ కీర్తనలు రామదాసుకీర్తనలు తండ్రి వద్ద నేర్చిపాడేది. 8వ ఏట ముక్త్యాలకు చెందినపిరాట్ల మృత్యుంజయ శాస్త్రి తో పెళ్లి జరిగింది. నలుగురుకొడుకులు అయిదుగురు కుమార్తెలు పుట్టారు. ఇంత పెద్ద సంసారం ఈదుతూ కూడా ఆమె యోగిని అయింది

అనాధలకుసేవ, సంసారం లో మునిగితేలే స్త్రీలకు మార్గదర్శనం చేయాలనిపించి, జన్మ సాఫల్యంకలిగించాలని తలంపు కలిగి రాత్రిళ్ళు అత్తామామా నిద్రపోయాక ధ్యానం, యోగ సాధనా చేసేది. ఒకరోజు ధ్యానం లో మనసు అంతర్ముఖమై సమాధి స్థితి పొందింది. తోటి స్త్రీలకూ భక్తివైరాగ్యాలు,యోగ రహస్యాలు బోధించేది. 1932 లో భర్తతో కలిసి హనుమకొండ వెళ్ళింది. అక్కడి వారు ఆమె ప్రతిభగుర్తించి ఆదంపతులకు ఒక ఇల్లు సమకూర్చి అక్కడే ఉండమని కోరారు. ఆ ఇంటికి "సచ్చిదానంద ఆశ్రమం " అని పేరుపెట్టి సత్సంగం దేవతార్చన తపోధ్యానాలకు ఉపయోగించారు దంపతులు.

కొడుకు చదువుకోసం కాకినాడలో ఆమె ఉంటే, ఎందరో బాధితులకు మనశ్శాంతి కలిగించింది. 7-1-1933 న భర్త మరణించాడు. 1938లోకాకినాడ లో పెద్ద ఆశ్రమం స్థాపించి పేద విద్యార్థులకు ఉచిత భోజనాలు ఏర్పాటు చేయించింది. అనాధలకు ఆవాసం సత్సంగానికి మందిరం కట్టించింది. హైదరాబాద్ లో భక్తులు ఆశ్రమం నిర్మించారు. ఈమూడు ఆశ్రమాలలో జీవిత శేషాన్ని సేవలో గడిపింది. 87వ ఏట 4-1-1969 కీలక పుష్యబహుళ పాడ్యమి శనివారం నాడు శ్రీరామ చంద్రుని చరణార విందాలను ను చేరింది నిరాడంబరయోగిని రామలక్ష్మమ్మ. మూడు ఆశ్రమాలలో ఆరాధనలు ఘనంగా జరుగుతాయి. ఆశ్రమ వార్షికోత్సవాలు శరన్నవ రాత్రులు సీతారామకల్యాణం వైభవంగా చేస్తారు. కాకినాడ ఆశ్రమం ప్రభుత్వ ఆధీనంలో ఉంది.

## 38 పాకల పాటి గురువులు -1911-1970

పగోజి ముండూరు అగ్రహారం లో దామరాజు గంగరాజు వెంకమ్మ ఆరువేల నియోగి దంపతులకు మూడవ సంతానంగా వెంకట్రామయ్య 1911 లో పుట్టాడు.ఆరు నెలల వయసులో తల్లి, 9వ ఏట తండ్రీ చనిపోయారు.8వ తరగతి చదువుతూ డాంబికాకాచారులను సంస్కరించే ప్రయత్నం చేశాడు. అసాధారణ గ్రహణ ధారణలతో అందర్నీ మెప్పించాడు.గారపాటి పుల్లయ్య అనే కమ్మ భూస్వామి చేరదీసి గౌరవంగా "బాబుగారూ "అని సంబోధించేవాడు. అదే సార్థకమై అందరూ అలానే పిలిచేవారు. ఏలూరులోటికెట్ లేకుండా కలకత్తా రైలు ఎక్కితే నర్సీపట్నంలో టికెట్ కలెక్టర్ దించేశాడు.అక్కడదిగి బీళ్ళూ కొండలు కోనలు తిరుగుతూ, బొబ్బిలి దగ్గర కలువరాయి చేరి, అక్కడ బ్రహ్మర్షి కావ్యకంఠ గణపతి ముని ని సేవించి ఎన్నో విద్యలు నేర్చాడు. నిష్ఠగా గాయత్రీ జపం చేసి మంత్రం సిద్ధుడయ్యాడు. ఆయనది కంప్యూటర్ మేధస్సు. ఒకరోజు అకస్మాత్తుగా కలువరాయి వదిలేసి, అరణ్యాలు క్షేత్రాలు నదీ తీరాలు యోగభూములు, టిబెట్ బర్మా, రంగూన్ సిలోన్ అడవుల్లో సుందర దృశ్యాలు చూస్తూ పులకిస్తూ గడిపాడు. ఇతిహాస, పురాణ జ్యోతిష, మంత్రం మూలికా వైద్య పాక శాస్త్రాలలో నిష్ణాతుడయ్యాడు. ఎందరెందరో మహా యోగులను దర్శించాడు.



1930-31 లో మళ్ళీ నర్సీపట్నం చేరి లంబసింగి ఆశ్రమం లో స్థిరపడ్డాడు. కసర్లపూడిలో ఒక భజన సమాజం ఏర్పాటు చేసి, ఏజెన్సీ అడవులలో ఆటవికులకు లౌకిక పారమార్ధిక విషయాలు బోధిస్తూ చాలా ఆశ్రమాలు స్థాపించాడు. భక్తులు పాకలపాడులో ఒక ఆశ్రమం నిర్మించి ఇచ్చారు. ఇందులో నిరాహారం గా చాలానెలలు కఠోర తపస్సు చేశాడు. జయపురం మహారాజు బాబుగారిని ఆస్థాన కవీశ్వరుని చేశారు. ఆటవికులకు భక్తిప్రపత్తులు నేర్పి వారి ఆరాధ్యదైవంగా ఉన్న బాబుగారు 6-3-1970 సౌమ్య మాఘ బహుళ చతుర్దశి శుక్రవారం మహాశివరాత్రి పర్వదినాన 59 ఏళ్ళకే లింగోద్భవ సమయం లో సిద్ధాసనం లో కూర్చుని రామనామ జపం మూడు సార్లు చేసి రామునిలో ఐక్యమయ్యారు.

## 39 అవధూత -రామ చంద్ర మాలిక్ బాబా -1910-1990

కర్నూలు జిల్లా ద్రోణాచలం లో 1960 లో చేరి, నిత్యాన్నదానం తో అందరి ఆకలి తీర్చి, విభూతితో ఆదివ్యాధులను నయం చేసి అందరినీ సమానంగా ఆదరించి ద్రోణాచల పరిసరాల్లో ఆరాధ్యుడయ్యాడు అవధూత రామ చంద్రమాలిక్. తనపేరు రాం చందర్ అనీ తనుపుట్టింది బదరీ నాథ్ అనీ మాత్రమె చెప్పారు. ద్రోణాచలం చేరేటప్పటికి ఆయనవయసు 50కనుక 1910 లో పుట్టినట్లు భావించారు. చాకిరేవు వెనక మర్రి చెట్టుకింద ధ్యానం చేస్తూ కనిపించారు. రేయింబవళ్ళు ధుని వెలుగుతూనే ఉంచేవారు. ఆబూడిదనే ప్రసాదంగా ఇచ్చేవారు. వింత లీలలు ప్రదర్శించేవారు. చిన్న చిట్కాలతో వ్యాధులు నయం చేసేవారు. డబ్బు ఖర్చు చేసి షిర్డీ వెళ్ళేవారిని మందలించేవారు. ద్రోణాచలం మాణిక్ బాబాగా ప్రసిద్ధిపొందారు.



20రోజులముందే శరీరత్యాగం విషయం చెప్పి, 27-2-1990 శుక్ల ఫాల్గుణ శుద్ధ విదియ మంగళవారం ఉదయం అవధూత రామ చంద్రమాలిక్ బాబా 80వ ఏట శరీరం చాలించారు. ఆయన తపస్సు చేసిన మర్రి చెట్టుకింద సమాధి చేసి, 20-4-1992 న మందిరం నిర్మించి విగ్రహ ప్రతిష్ట చేసి నిత్యపూజలు చేస్తున్నారు. మాఘబహుళ విదియనుంచి అయిదురోజులు ఆరాధనోత్సవాలు జరుపుతారు వైభవంగా. సమాదినుంచే భక్తుల కోరికలు తీరుస్తారుబాబా అని నమ్ముతారు.

## 40 పశివేదల ప్రజ్ఞానంద స్వామి -1903-1983

పగోజి పాలకొల్లు దగ్గర చింతపల్లిలో వారణాసి రామకృష్ణయ్య మహాలక్ష్మమ్మ దంపతుల రెండవ కుమారుడుగా 7-10-1903 శోభకృత్ ఆశ్వయుజ బహుళ పాడ్యమి బుధవారం వెంకటప్పయ్య పుట్టాడు. రామభక్తిఅలవాటై చదువుతో పాటు స్తోత్రాలు కీర్తనలు నేర్చి పాడేవాడు. స్వాతంత్రోద్యమమం లో దేశభక్తి

బోధించేవాడు. బ్రహ్మచర్యం అపక్వాహారం గాయత్రీ జపం, ప్రణవోపాసన, ప్రాణాయామం యోగాసనాలు కుండలినీ యోగ సాధన చేశాడు. భగవద్గీత, పంచదశి సీతారామాంజనేయం చదివి జీర్ణం చేసుకొన్నాడు. 1922 లో తణుకు జాతీయ పాఠశాలలో హిందీ పండిట్ చేరి,హరిజనబాలల హాస్టల్ నిర్వహణ కూడా చేసేవాడు. స్వరాజ్యం కోసం పని చేశాడు.



1924లో గొరగనమూడి వచ్చి స్వామి జ్ఞానానంద వద్ద సన్యాస దీక్ష, ప్రజ్ఞానంద నామం పొందాడు. ఉత్తర దేశ యాత్ర చేసి ఉత్తరకాశి చేరాడు. 1932 నుంచి పదేళ్ళు చాలా చోట్ల తీవ్ర తపస్సు చేసి, 1934 లో నండూరు చేరి మౌనధ్యానంలో ఉంటూనండూరి స్వామిగా ప్రసిద్ధి చెందారు ప్రజ్ఞానంద. 1936 లో నాసికా త్రయంబకం దర్శించి, హరిద్వారం వెళ్లి అనేకచోట్ల తపస్సు చేసి లక్ష్మీ వనం సహస్రధార చక్రతీర్థం దర్శించి, తీర్థ విధులు నిర్వహించి, చంద్ర, సూర్య విష్ణు కుండాలమీదుగా స్వర్గారోహణ పర్వతం చేరారు. అక్కడ తపస్సు ఫలించి దివ్యానుగ్రహం లభించింది. బదరి వెళ్లి, 1937 నుంచి రెండేళ్ళు అనేక చోట్ల తత్వోపదేశం చేశారు. 1939 లో కొవ్వూరు దగ్గర పశివేదల లో చిదానంద ఆశ్రమం నిర్మించుకొని తపస్సు చేశారు.

1940 నుండి 42 వరకు తిరుమల వైకుంఠ తీర్థ గుహలో ఏకాంతంగా తపస్సు చేసి, మళ్ళీ పశి వేదుల ఆశ్రమం చేరి,గోదారి వరదబాధితులకు అన్నసంతర్పణ వైద్యం, నివాస ఏర్పాట్లు చేసి పశివేదల ప్రజ్ఞానందస్వామిగా ప్రసిద్ధి కెక్కారు. బాల వితంతువులకు మళ్ళీ వివాహం చేసిన సంస్కర్త. పటిష్టమైన గ్రామ సంఘాలు ఏర్పాటు చేసి గ్రామ రక్షణకు తోడ్పడ్డారు. వేలాది శిష్యులేర్పడ్డారు. 14-9-1983 రుధిరోద్గారి భాద్రపద శుద్ధ అష్టమి బుధవారం ఉదయం 11.45గంటలకు ప్రజ్ఞానందస్వామి 80వ ఏట బ్రహ్మైక్యం చెందారు. చిదానందాశ్రమ గోశాలలో సమాధి చేశారు. ఆరాధన, జయంతి ఉత్సవాలు ఘనంగా చేస్తున్నారు.

## 41 పద్మశ్రీ ప్రణవా నంద స్వామి – 1896-1989

తూగోజి కొత్తపేట మండలం మండపల్లి దగ్గర ఏనుగుల మహల్ లో భారద్వాజస గోత్రీక తెలగాణ్య వైదిక బ్రాహ్మణ కుటుంబం లో కనకదండి విశ్వపతి శాస్త్రి, సీతమ్మ దంపతుల మొదటి కుమారుడుగా 14-1-1896 దుర్ముఖి మాఘ శుద్ధ పాడ్యమి నాడు



వెంకట సోమయాజులు పుట్టాడు. ఎంఏపాసై స్వాతంత్ర్యోద్యమం లో చేరదలచి, పంజాబ్ లోని లాహోర్ లోఉన్న లాలాలజపతిరాయ్ స్థాపించిన డిఎవి కాలేజీలో చేరి 1919 లో డిగ్రీ పొంది,వాయవ్య రైల్వేలో అకౌంట్స్ ఆఫీసర్ గా పనిచేసి, 1920-26 మధ్య పగోజి కాంగ్రెస్ హరిజన సంక్షేమం ఖద్దరు శాఖలో సేవలందించి, సహాయ నిరాకరణ ఉద్యమం లో కారాగార శిక్ష అనుభవించాడు. 1927 లో హిమాలయాల్లో తిరుగుతూ స్వామి జ్ఞానానంద వద్ద దీక్ష, ప్రణవానంద నామం పొందాడు. హిమాలయాల్లో కఠిన తపస్సు చేసి హఠయోగ రాజయోగ ఖేచర ముద్రలు సాధించి యోగం లో ఉన్నతస్థాయి పొందారు. భగవద్గీత కు "జ్ఞాన దీపిక "వ్యాఖ్యానం రాసి గురువు స్వామి జ్ఞానానందకు 29-5-1928 న అంకితమిచ్చారు. అమరనాద్ గుహలో 15 రోజులు ఏకాంతవాసం చేసి, మానససరోవర కైలాసపర్వత, పశ్చిమ టిబెట్ బౌద్ధారామమాలలో తపస్సు చేశారు. హిమాలయాలలో 25 చాతుర్మాస్యదీక్ష నిర్వహించి ఘన ప్రతిష్ట పొందారు. కైలాస పర్వతాన్ని 36 సార్లు, మానస సరోవరాన్ని 33సార్లు ప్రదక్షిణ చేసి రికార్డ్ నెలకొల్పారు. భూ ఉపరితలానికీ భూగర్భసంబంధిత పరిశోధనలు చేశారు. దేశ సంస్కృతీ చరిత్ర రాజకీయాలకు అసమాననిష్కామ సేవ చేశారు. 1929 లో అమరనాథ్ గుహలో 15 రోజులుండి, శివ పార్వతి గణేశ లింగాలు ఏర్పడేతీరును పరిశోధించి వ్యాసాలూ రాశారు. 1937,42,46 లలో అనేక సాహస యాత్రలు చేసి కైలాస శిఖరానికి అనేక కొత్తమార్గాలు కనిపెట్టిచారిత్రిక విశేషాలు రాశారు. 1947లో భారత ప్రభుత్వం స్వామి ప్రణవానందకు "పద్మశ్రీ "పురస్కారం అందించి గౌరవించింది

ప్రనవోపాసకులైన ప్రనవానందులు శ్రీ చక్రం పై గోప్పసిద్ధాంత గ్రంధం రాశారు. ఏనుగుల మహల్ చేరి ఏనుగుల మహల్ ప్రణవానంద స్వామి గా ప్రసిద్ధులై అక్కడ 28-3-1983 న రెండుటన్నుల శ్రీ మహాత్రిపుర సుందరీ అమ్మవారి శ్రీ చక్ర మేరు యంత్రాన్ని ప్రతిష్టించారు. మానస సరోవరం దగ్గర "తుగోల్వో"లో ఒక యజ్ఞ వాటిక నిర్మించారు. అక్కడ అప్పటినుంచి ఇప్పటిదాకా శ్రీ కృష్ణ జన్మదినోత్సవాలు అద్భుతంగా జరుపుపుతూనే ఉన్నారు. గాయత్రీ మంత్రార్ధం తో సహా చాలా గ్రంథాలు రచించారు. 1978లో ఎండ దెబ్బ బాగా తగిలి జ్ఞాపక శక్తి తగ్గింది. 17-5-1989శుక్లనామ సంవత్సర వైశాఖ శుద్ధ ద్వాదశి బుధవారం ప్రణవానంద స్వామి 93 ఏట హైదరాబాద్ లో విశ్వ చైతన్యం లో కలిసిపోయారు. తన అవశేషాలేవీ మిగల్చవద్దని స్వామి వారి ఆదేశం ప్రకారం విద్యుత్ స్మశాన వాటికలో దహనం చేశారు. మాఘ శుద్ధ పాడ్యమినాడు ఆరాధనోత్సవాలు జరుపుతారు.

## 42 రాయదుర్గం భంభం స్వామి -1886-1969

చిప్పగిరి భంభం స్వామిశిష్యుడే రాయదుర్గం భంభం స్వామి అనే షేక్ అబ్దుల్ సాహెబ్ 1886 లోఆదోనిలో ఆలీసాహెబ్ రాజాజీ దంపతులకు అబ్దుల్ వహాబ్ పుట్టాడు. అతడి ఆగడాలకు తట్టుకోలేక 12వ ఏటనే చిప్పగిరి భంభం స్వామి దగ్గర చేర్చారు. ఆయన ఈయన చెవిలో ద్వాదశాక్షరి మంత్రం ఉపదేశించిలింగం, జందెం గాజులుధరింప జేసి "భం షేక్ అబ్దుల్ "దీక్షానామమిచ్చి పంపించేశాడు. 14వ ఏట ఆలూరుకు తిరిగివచ్చి వివాహమాడి గృహస్థాధర్మం నిర్వర్తిస్తూ రాజయోగం సాధించాడు.




తర్వాత హఠయోగం నేర్చి,పోలీసు శాఖలో ఉద్యోగం లో చేరి, గురుబోదను మతసామరస్యాన్నీ బోధించేవాడు. అనుచరులు శిష్యులు పెరిగారు. రోగగ్రస్తులకు గ్రహపీడితులకు మానసిక వైకల్యమున్నవారికి పూర్తిగా నయం చేసి మంచి పేరు పొందాడు. ఆయన్ను "జిమేదారు స్వామి "గా పూజించేవారు. లీలలు అద్భుతాలు చూపేవాడు. 201 కీర్తనలు, 11తత్వాలు రాశాడు. తన సమాధి స్థలాన్ని నెలరోజులు ముందే ఎంచుకొని 21-2-1969కీలక ఫాల్గుణ శుద్ధ దశమి శుక్రవారం ఉదయం 9-25 గంటలకు గురుమంత్రం జపిస్తూ 83వ ఏట పరమాత్మలో లీనమయ్యారు. ఏటా ఆరాధనోత్సవాలు బాగా చేస్తారు.

## 43 నీలకంఠ సచ్చిదానంద ఘనేంద్రులు -1788-1907

కర్ణాటకలో చిక్కమగుళూరు తాలూకా దాసమాస గ్రామం లో వైదికాచార పరులైన భాగీరధీ, గోపాల పండితులకు 1788 కీలక నామ సంవత్సర ఆషాఢ బహుళషష్టి శనివారం నంజుండయ్య పుట్టాడు.ఐదవ ఏట అక్షరాభ్యాసం జరిగి 12 ఏళ్ళకే అసమాన ప్రజ్ఞావంతుడైనమేధావి గా పేరు పొందాడు.

శ్రీ రామానంద ఘనేన్ద్రులనే యోగి నంజుండయ్య ప్రతిభ గుర్తించి, ఇంటికి వచ్చి తల్లికి ఒక కాగితమిచ్చి అదృశ్యమయ్యాడు. ఆకాగితం చదవగానే వైరాగ్యభావన కలిగి, రామానందుని అన్వేషణ కోసం బయల్దేరి చముండేశ్వరి కొండ గుహలో సమాధి నిష్టలో ఉన్న ఆయన్ను చేరాడు. గురు శుశ్రూష కొన్నేళ్ళు చేసి, యోగాలన్నీ నేర్చి సచ్చిదానందుడు అయ్యాడు. గురుదీవనతో దాస మాస కు చేరి, తలిదండ్రులను కొంతకాలం సేవించి వారి అనుమతితో శ్రీశైలం చేరి భ్రమరాంబా మల్లికార్జునులను దర్శించి పాతాళగంగ దగ్గర ఒకగుహలో 24ఏళ్ళు దీక్షగా తపస్సు చేసి పూర్ణ హఠయోగ సిద్ధిపొందారు. అష్టసిద్ధులు, ఘటికా పాదుకా గమనాదులు, పరకాయ ప్రవేశం మొదలైన విద్యలన్నీ కరతలామలకం చేసుకొన్నారు.

తర్వాత ఆసేతు హిమాచలపర్యంత పుణ్య క్షేత్ర సందర్శనం యోగ భూములు దర్శించి, వివిధ యోగాలు నేరుస్తూ, అడిగినవారికి నేర్పిస్తూ, 60ఏళ్ళు దివ్యయోగ జీవితం గడిపారు. 1890లో బళ్ళారి జిల్లా విరూపాక్ష క్షేత్ర సమీపం లోని గౌరీపురం చింతామణి పీఠానికి భక్తులకోరికపై పట్టాభి షిక్తులయ్యారు. అప్పటినుంచి" శ్రీ సచ్చిదానంద నీలకంఠ సదానంద చింతామణి " సార్ధక నామధేయులయ్యారు. తమ శక్తులను తనకోసం ఎన్నడూ వాడుకొని యోగి పురుషులాయన. 30-11-1907 ప్లవంగ కార్తీక బహుళ దశమి శనివారం మధ్యాహ్నం 12 గంటలకు 119 వ ఏట నీలకంఠ సచ్చిదానంద ఘనేం ద్రులు ఆ నీలకంఠుని సన్నిధానం చేరారు. చైత్రమాసం లో శ్రీరామ కల్యాణోత్సవం, ఆశ్వయుజంలో శరన్నవరాత్రి ఉత్సవాలు దశమినాడు స్వామి వారి ఆరాధనోత్సవం జరుగుతాయి.

## 44 తుంగతుర్తి బుచ్చయ్యయోగి -1760-1854

గుంటూరు జిల్లా నరసరావు పేట తాలూకా చేజెర్ల శ్రీ కపోతేశ్వరస్వామి దేవాలయం లోనే జీవితం గడిపి, 94వ ఏట 7-9-1954 ఆనంద భాద్రపద బహుళ పాడ్యమి గురువారం తుంగతుర్తి బుచ్చయ్యయోగి బ్రహ్మైక్యం చెందారు. ఆలయ చరిత్రలో ఆయన గురించి కొంత సమాచారం లభిస్తుంది. కరణకమ్మ వైదిక బ్రాహ్మణ కుటుంబం లో పుట్టిన బుచ్చయ్య వ్యవసాయం చేస్తూ గడిపేవాడు.ఒకసారి మేఘాల మల్లికార్జున కొండ దగ్గరపొలం దున్నుతుంటే దాహమేసి నీటికోసం కొండగుహలోకి వెడితే అక్కడి రుషి ఆయన నాలుకపై బీజాక్షరాలు రాసి "మధుమతి "విద్య ఉపదేశించాడు. అప్పటినుంచి కవి జ్ఞాని మహిమాన్విత యోగి అయ్యాడు బుచ్చయ్య.

శ్రీగిరికి వెళ్లి ఆరేళ్ళు తపస్సు చేసి, వారానికో పదిహేను రోజులకో సమాదినుంచి బయటికి వచ్చేవాడు. కాయ కసరులు తినేవాడు. ఆరేళ్ళ తర్వాత తనపుట్టిన ఊరు కురిచేడు చేరి దేవాలయం లో ఉండేవాడు. తర్వాత చేజెర్ల కపోతేశ్వరస్వామిని దర్శించి,శ్రీశైలం వెళ్లగా అమ్మవారు భ్రమరాంబ సాక్షాత్కరించింది. ఆసమయం లో అమ్మవారి బింబం కదిలిపోతే, తన తపోమహిమతో యధాస్థానం లో పునః ప్రతిష్ట చేశాడు. ఇప్పుడు శ్రీశైలం లో పూజలందుకొంటున్న అమ్మవారి బింబం బుచ్చయ్యయోగి ప్రతిష్టించిందే ఈ అమ్మవారి ఆదేశం తోనే చేజర్లకపోతేశ్వరాలయం లోదేవీ ప్రతిష్ట చేశారు. ఆకాశగమన విద్యతో దేశంలోని క్షేత్రాలన్నీ సందర్శించాడు బుచ్చయ్యయోగి. సహజ పండితుడైన బుచ్చయ్య ఆధ్యాత్మిక గీతాలు రచించి తన్మయత్వం తో గానం చేసేవాడు. ఆయన రచించిన "కపోతేశ్వర అష్టకాన్ని "బ్రాహ్మణ సమారాధనలలో పాడుతూ ఉంటారు.

## 45 త్రికాలజ్ఞాని అవధూత ప్రకాశానంద స్వామి -1871-1963

విజయనగరం దగ్గర ఒక వెలనాటి బ్రాహ్మణ కుటుంబం లో 1871లోవెంకట్రామయ్య, గౌరమ్మ దంపతులకు అనంతయ్య పుట్టాడు. తండ్రి 8వ ఏట, 15వ ఏట తల్లీ చనిపోయారు. తాత లక్ష్మీ నరసింహం, నాయనమ్మ మీనాక్షమ్మ ల వద్ద ధర్డ్ ఫారం చదివి, 15వ ఏట చదువు మానేసి సంస్కృతం, జ్యోతిష్యం నేర్చాడు. పెళ్ళికి తాంబూలాలు తీసుకోనగానే వధువు అకస్మాత్తుగా చనిపోగా వైరాగ్యం కలిగింది. ఇంగ్లీష్ మేస్టార్ వేదాంతి దత్తయ్య పంతులు గొప్ప గురువు దొరుకుతాడని హామీ ఇచ్చాడు



జ్ఞానన్వేషణకోసం 16వ ఏట ఇల్లువదిలి దేశాటనం చేస్తూ 1887జనవరి 14 బెల్గాం చేరి, అక్కడ వేదాంతి డిప్యూటీ కలెక్టర్ లల్లూభాయ్ గోవర్ధనదాసు తో పరిచయం కలిగి, యోగ వాశిస్టం మొదలైన ఆధ్యాత్మిక గ్రంధాలు చదివి, సన్యసించా లన్న కోరిక చెప్పగా అందులో ఉన్న కష్ట నిష్టూరాలు తెలియజేయగా ఆకోరిక బలీయం కావటం తో ఆయన అనుమతితో ఇల్లు వదిలి మళ్ళీ దేశాలమీద పడి,తిరుమల చేరి పుష్కరిణిలో ప్రేమ మంత్రం చెప్పుకొంటూ స్నానంచేసి శిఖా యజ్ఞోపవీతాలు తీసేశాడు. మద్రాసు వెళ్లి బుచ్చయ్య పంతులు వద్ద భాష్యం తో సహా ఉపనిషత్తులు నేర్చి, అక్కడి నుండి నాశిక్, హరిద్వారం సందర్శించి, దారిలో మహా వైయాకరణి అమరేశానందులవద్ద సిద్ధాంత కౌముది, వ్యాకరణ మహాభాష్యం అభ్యసించాడు అనంతయ్య. అమరేశానంద అనంతయ్యకు "ప్రకాశానంద స్వామి "అని పేరు పెట్టారు.

హృషీకేశం లో శ్రీ సుఖానంద స్వామి వద్ద హఠయోగ ప్రక్రియలు నేర్చి, గుజరాత్ లోని నడియార్ చేరి, అక్కడి సంత్ రాం గుడిలో ప్రమేయ గ్రంధాలు చదివారు. ఆశ్రమ స్వీకారం తర్వాత 15ఏళ్ళు లల్లూరాం గురువును సేవించి, ఆయన సిద్ధిపొందాక సర్వ సంగ పరిత్యాగి యై, జిజ్ఞాసువులకు జ్ఞాన బోధ చేస్తూ, 40వ ఏట ఆత్మ సాక్షాత్కారం పొందారు. త్రికాలజ్ఞానిగా గుర్తింపు పొందారు.ముముక్షువులకోసం చాలా గ్రంధాలు రాశారు. వార్తాలాప గ్రంథం, సంతగురు పరిచయం, ఆపరణోదర్మ,సప్తశ్లోక గత ధర్మ జ్యోతి రచనలలో ఆయన

అపార పాం డిత్యం వెలువడింది. వాటినీ గుజరాతీ భాషలో ముద్రించారు. ద్వారకలో దేహం చాలించాలని సంకల్పించి 15-1-1962 న చేరి 23-2-1962 నప్లవనామ సంవత్సర మాఘ బహుళ చవితి శుక్రవారం స్వామి ఆత్మ చిదాత్మలో 91 ఏట కలిసిపోయింది. వారి సమాధి గొప్ప యాత్రాస్థలమైంది.

## 46 వాడరేవు లలితానంద స్వామి -1886-1950

స్కందుని అంశతో 17-11-1886 వ్యయ వృశ్చికమాస బహుళ షష్టి మంగళవారం శ్రవణా నక్షత్రం లో జన్మించిన లలితానంద తమిళనాడు స్వామి మేలు వలక్కూరు గ్రామాధికారి కాకర్ల వెంకట నరసు సోమయాజులు అనే ముర్కినాటి బ్రాహ్మణుడికి జన్మించారు. ఆయనకు ఆంధ్ర దేశం లో చాలామంది బంధువులున్నట్లు తెలుస్తోంది. పశుమల కొండ గుహలు తనియాల గ్రామం లోని కైలాసనదేశ్వర అఖిలాండేశ్వర ఆలయం చీరాలదగ్గర వాడరేవు ఆయన తపోవన క్షేత్రాలు. దేశాటన చేసి 1940విక్రమనామ సంవత్సరం లో పశుమల చేరి గుహలో ఏకాంతంగా దిగంబరంగా తపోదీక్ష కొనసాగించారు. 1941 లో అక్కడ స్వామికి డాక్టర్ తంగిరాల సీతారామయ్య, కొసరాజు నాగయ్య లు మఠం కట్టించారు.



సనాతన వైదిక ధర్మ ప్రచారం కోసం యజ్ఞయాగాలు మంత్రం అనుష్టాన బోధా కార్యక్రమాలు చేశారు. పసుమల తనియల వాడ రేవులలో ఏడాది పొడవునా ఏదో ఒక యజ్ఞం నిర్వహించేవారు, సాక్షీమాత్రులుగా ఉంటూ పరబ్రహ్మను భవం సాధించిన జీవన్ముక్తులు స్వామి. సన్మార్గ ప్రవర్తన ధర్మానుష్టానం వైరాగ్యాలే సత్యాన్వేషణకు మార్గాలని బోధించేవారు 24-11-1951 ఖర కార్తీక బహుళ దశమి శనివారం వారి పసుమల మఠం ఆయన ఉన్నగదిలోనుంచి ఒక దివ్యజ్యోతి ఆకాశం వైపుకు వెళ్ళింది. తలుపులు తెరచి చూస్తే స్వామి దేహం చాలించారని తెలిసింది. ఆయనను విధివిధానంగా సమాధి చేసి దానిపై నర్మదా లింగం ప్రతిష్టించారు. ఆయన పేర లలితానంద భక్త సమాజం ఏర్పడింది. ఆత్మజ్యోతి మాసపత్రిక వాడరేవు ఆశ్రమం ద్వారా వెలువడేది.

## 47 సద్గురు జగన్నాధ స్వామి -1885-1974

ఒంగోలులో కోటి సుబ్బయ్య కామమ్మ వైశ్య దంపతులకు 11-8-1885 పార్థివ శ్రావణ శుద్ధ విదియ మంగళవారం జగన్నాధస్వామి జన్మించాడు. ఉయ్యాలలో ఉండగానే యోగాసనాలు వేసి ఆశ్చర్యపరచేవాడు. ఆరేళ్ళ వయసులో తలిదండ్రులు చనిపోతే, చేబ్రోలు రెడ్డిపాలెం లో మేనమామ ఇంట పెరిగాడు. కేశవరాజ యోగీంద్రుడు ఒక సారి కనిపించి ఆయన్ను సూక్ష్మ రూపం లో ఆకాశమార్గం లో తీసుకువెళ్ళి శ్రీశైలం గుహలలో దింపాడు. అక్కడి మహర్షులు పరకాయ ప్రవేశం మొదలైన విద్యలు నేర్పారు. త్రిమూర్తులు ప్రత్యక్షమై దేవాలయాలు నిర్మిస్తూ జన్మ సార్ధకం చేసుకోమని బోధించారు.

భక్తిప్రచారం చేస్తూ మంత్రోపదేశాలు చేస్తూ ఉత్తర దక్షిణ దేశయాత్ర చేశారు. పొన్నూరులో సహస్రమ లింగేశ్వర, దశావతార దేవాలయాలు కట్టించారు. చెంచమ్మను పెళ్ళాడి ఆమె కొద్దికాలానికే చనిపోతే, కోటి రత్నమ్మను ద్వితీయం చేసుకొన్నారు, ఆడబిడ్డ పుట్టాక ఆనందాశ్రమం చేరి, భార్య చనిపోగా గురువు ఆజ్ఞతో సీతమ్మను మూడవ పెళ్లి చేసుకొని, కూతురు సీతమ్మతో బాపట్ల చేరారు. శ్రీశైల యాత్రకు వెళ్లి కొండఎక్కుతూ కాలుజారి లోయలో ఒకమహర్షి ఒడిలో పడగా ఆయన నాలుకపై బీజాక్షరాలు రాయగా, ఇలా ఎన్నో గండాలు గడుస్తూ దేవాలయ నిర్మాణాలు చేయిస్తూ, అద్భుత మహిమలు ప్రదర్శిస్తూ జగన్నాధ స్వామి 10-9-1974 ఆనంద భాద్రపద బహుళ నవమీ మంగళవారం 89వ ఏట దేహం చాలించారు. భాద్రపద బహుళ నవమినాడు బాపట్లలో ఆరాధనోత్సవాలు దివ్యంగా చేస్తారు.

## 48 సహజకవి నార్పల తిక్కయ్యస్వామి -1870-1924

నార్పల తిక్కయ్యస్వామి 1904 లో చెళ్ళ గురికి లో హజాము భీమన్నపోలం లో ఎర్రి తాతను దర్శించి, నాలుగేళ్ళు సేవించి, మఠంకట్టించి గురువును అందులో ప్రవేశపెట్టి, 1909 లో గురువు ఆదేశం పై అజ్ఞాతం లోకి వెళ్ళిపోయాడు. 1920లో అనంతపురం మండలం నార్పల గ్రామం చేరి, దక్షిణంగా నడిచి, దుగమరి ఊరికిఉత్తరాన ఉన్న దత్తాత్రేయ ఆశ్రమం చేరి, అక్కడినుండి సుల్తాన్ పేట వెళ్లి ఒక వరిపొలం లో రైతు నంద్యాం తిమ్మారెడ్డి ని పేరుపెట్టి పిలిస్తే ఆశ్చర్యపోయి,ఇంటికి తీసుకు వెళ్లి భోజనవసతి సౌకర్యాలు కల్పించాడు. అక్కడి ధనిక పేదజనం అందరూ ఆయన్ను బాగా ఆదరించారు. అష్టసిద్ధులు మహిమలు ప్రదర్శించి రోగాలు నివారిస్తూ వారికి సాయం చేశాడు.




ఒక రోజు స్వామి ఒక వెండి రూపాయిని బలం గా విసిరితే అది దూరంగా ఉన్న బ్రహ్మజెముడు డొంక పడింది. అక్కడే తనను సమాధి చేయమని ఆదేశించాడు. 10-4-1924 రక్తాక్షి చైత్ర శుద్ధ షష్టి గురువారం 54వ ఏట తిక్కయ్యస్వామి కుండలిని భేదించుకొని బ్రహ్మైక్యం చెందారు. 1925 లో సమాధిపై మందిరం నిర్మించారు. సమాధిపై స్వామి ఇత్తడి శిరస్సు, నాగపడగ స్థాపించి పూజలు చేస్తున్నారు. చైత్ర శుద్ధ పంచమి నుండి మూడు రోజులు ఉత్సవాలు చేస్తారు.

## 49 రెండవ సదాశివ బ్రహ్మేంద్ర సరస్వతి –పుదుక్కోట జడ్జి స్వామి -1850-1915

విశాఖ లో వేదమూర్తి శాస్త్రి అనే వేదపండితుని కుమారుడిగా 1850 లో పుట్టిన ఆయన జాతకం చూసి పరివ్రాజక శిరోమణి అవుతాడని చెప్పారు. తండ్రి వద్ద తెలుగు సంస్కృతాలు నేర్చి, వేదం తోపాటు ఇంగ్లీష్ కూడా నేర్చుకోవటానికి మద్రాస్ వెళ్లి న్యాయ శాస్త్ర డిగ్రీ సాధించి, జూనియర్ వకీలుగా కొంతకాలం పని చేసి, తర్వాత స్వతంత్రం గా ప్లీడర్ గాఉంటూ మంచిపేరు పొందాడు.తల్లీతండ్రీ కాశీ వెళ్ళిపోయారు.

జడ్జిస్వామి న్యాయ సమ్మతమైన కేసులే వాదించేవాడు. న్యాయం కోసమే తప్ప డబ్బుకోసం ప్రయత్నించేలేదు. 20ఏళ్ళు ప్లీడర్ గా ఉంటూ లోకాచారం శిష్టాస్మృతి స్థానికాచారం కటుంబ ఆచారం చారం అనే నాలుగు కోణాలలో కేసులపై తీర్పులిస్తూ తిరువాన్కూరు హైకోర్ట్ జడ్జిగా పనిచేశారు. ఒకసారి చట్టప్రకారం ఒక అమాయకుడికి మరణ శిక్ష విధించాల్సి వచ్చి, సత్యాన్వేషణలో సంసారం ఉద్యోగం వదిలేసి అడవులలో తిరుగుతూ కరాచీలోని ఉపనిషణ్మఠం చేరి, అక్కడ ఐదేళ్ళు 1899 వరకు ఉపనిషత్ సత్యాన్వేషణలో గడిపి, శ్రీ రామకృష్ణావదూత ఆదేశం మేరకు దిగంబరంగా ఉంటూ నేరూరు వెళ్లి సదాశివ యతీంద్రుల సమాధి వద్ద కొంతకాలం తపస్సు చేసి హిమాలయాలకు వెళ్లి ఋషీకేశ్ లో తపస్సు చేశారు.



శరీరత్యాగానికి సమయం దగ్గర పడిందని తెలిసుకొని, పుదుక్కోట దగ్గర నర్తమలై చేరి చోళరాజుల ప్రాచీన శివాలయం లో తీవ్ర తపస్సు చేశారు. బ్రహ్మ తేజస్సుతో వెలుగుతున్న స్వామిని ప్రజలు పల్లకీలో ఊరేగింపుగా పుదుక్కోటకు తీసుకు వెడుతుంటే. పల్లవ సరసు వద్ద స్వామి ప్రాణాలు అనంత ప్రాణం లో కలిసి పోయాయి. మార్తాండ భైరవ తొండమాన్ చక్రవర్తి స్వామి వారి సమాధికోసం పుదుక్కోటకు తూర్పున విశాల స్థలం ఇచ్చి సమాధి చేయించారు.



కొంతకాలం నిత్యపూజలు జరిగేవి. తర్వాత సమాధి నిర్లక్ష్యానికి గురైతే, శిష్యులు భువనేశ్వరీ విగ్రహ ప్రతిష్ట చేసి మందిరం అభి వృద్ధికి తోడ్పడగా ఆప్రాంతం భువనేశ్వరీ నగరంగా వర్ధిల్లింది. జడ్డి స్వామి అసలుపేరు ఎవరికీ తెలియదు. కానీ శ్రీ కాళహస్తిలో గురువు రామ కృష్ణ అవధూత మాత్రం "రెండవ సదాశివేంద్రుడు "అన్నారు. ప్రస్తుతం జడ్డిస్వామి సమాధి గొప్ప క్షేత్రంగా మారింది.

## 50 ఎల్లారెడ్డి పేట హజ్రత్ ఇమామలీ బాబా -1825-1934

కరీమ్ నగర్ జిల్లా ఎల్లారెడ్డి పేట కు చెందిన హజ్రత్ ఇమామలీ బాబా గంభీరావు పేట లో 1825 లో జన్మించినట్లు తెలుస్తోంది. 110 ఏళ్ళు జీవించి 1934 లో మరణించారు. కొంతకాలం బడి పంతులు గా చేశారు. 1908 లో మూసీ నదికి వరదలు వచ్చి దానిదగ్గరున్న మానేరు నది ఒడ్డునున్న నామాపురం గట్టు చరియపై గుహ లో తపస్సు చేస్తుంటే, తపోనిష్టలో ఉండి చరియ లో కూరుకు పోయారు. వరద తగ్గాక, ఇసుక తీయగా బయటపడి ఆశ్చర్యం కలిగించారు. గ్రామ పటేలు పాపా రెడ్డి భక్తుడై రెండు అంతస్తుల మేడ కట్టించి అందులో బాబాను ఉంచాడు. ఆశ్రితులు, భక్తులు వస్తే వారు రాగానే వారి వివరాలన్నీ తానె చెప్పి సాయం చేసేవారు. 4-7-1934 భావ జ్యేష్ట బహుళ పంచమి గురువారం110ఏళ్ళ వయసులో బాబా తనుఉ చాలించారు. ఆయన సమాధి నేటికీ యాత్రాస్థలం గా వర్ధిల్లుతోంది.

## 51 యల్లం పల్లె పుల్లయ్య అవధూత -1920-1983

కడపజిల్లా దిగువ సేలటూరు భట్రాజదంపతులు వెంకటరాజు లక్ష్మమ్మ దంపతులకు 1920 లో వెంకట రాజరాజు పుట్టాడు. రాజయ్య అని పిలిచేవారు. ఊరిలోనే చదువు ప్రారంభించి తండ్రి దగ్గర భారత రామాయణాలు ప్రబంధాలు నేర్చాడు. సుస్వరంగా త్యాగరాజకృతులు పోతనభాగవత పద్యాలు పాడేవాడు.



బడిపంతులుగా కూడా పని చేశాడు. 1932 లో మర్రి పుల్లయ్య యోగి గురించి విని వెళ్లి శిష్యుడై, ఉపదేశం పొంది "పుల్లయ్య స్వామి "అయ్యాడు. పెళ్లి వద్దని కొండల్లో గుహల్లో అడవుల్లో తిరుగుతూ సమాధి పొందేవాడు. అందరూ ఆతిధ్యమిచ్చి ఆదరించేవారు యల్లం పల్లె, మిట్టమాని పల్లె ప్రజలకు ఆరాధ్యదైవమయ్యాడు. మహిమలులీలలు చూపేవాడు. 11-7-1983 రుధిరోద్గారి ఆషాఢ శుద్ధ పాడ్యమి సోమవారం 63 వ ఏట పుల్లయ్యస్వామి దేహం చాలించాడు. ఆయన సమాదినిర్మించి ఏటా ఆరాధనోత్సవాలు చేస్తున్నారు

## 52 నెల్లూరు నిత్యానంద స్వామి -1864-1936

డెహ్రాడూన్ సీస్మానదీ తీరం లో శాలికోటలో దయాంబా, గాలూరాం దంపతులకు 7-8-1864రక్తాక్షి శ్రావణ శుద్ధ పంచమి ఆదివారం పూర్ణ రాముడు పుట్టాడు.రెండేళ్లకే తండ్రి చనిపోతే ఆధ్యాత్మిక ప్రసంగాలు వింటూ, 12వ ఏట 1876లో వైరాగ్యం తో ఇల్లువదిలి తీర్ధ క్షేత్ర దర్శనం చేస్తూ వశిష్టాశ్రమం చేరాడు. హిమాలయ గుహలలో ఏడేళ్ళు తుంగ ముస్తెలు మాత్రమె తింటూ కఠోర తపస్సు చేశాడు. ఒకరోజు గంగాతీరం లో కృష్ణానంద సరస్వతి యతీంద్రుల దర్శనం లభించింది. ఆయన ప్రణవ మంత్రోపాసన చేసి "నిత్యానంద స్వామి "దీక్షానామం, సన్యాసం ఇచ్చారు.

గురువు అనుమతితో హిమాలయ గుహలలో తపస్సు చేస్తూ ఆత్మ సాక్షాత్కారం పొంది దేశ సంచారం చేస్తూ, రోజుకు 30మైళ్ళు నడిచి 1894లో నెల్లూరు చేరి స్థిరపడ్డారు. నవాబు పేటలో పెన్నా తీరం లోని వేమూరి వారి మామిడితోటలో ఆశ్రమం ఏర్పాటు చేసుకొని ఉన్నారు అందులో ఒక పెద్ద చెక్కపెట్టే, కలప తో ఉన్న కుటీరం. శిష్యబృందం ఏర్పడింది అన్ని సిద్ధులూ సాధించినా ప్రదర్శించలేదు. లీలలు మహిమలు చూపారు. యువనామ సంవత్సర పుష్య బహుళ అమావాస్య శుక్రవారం 24-1-1936 న 72వ ఏట శిష్యుడు హరిహరానంద స్వామి ఈశావాస్యోపనిషత్ పఠించటం పూర్తికాగానే పద్మాసనం వేసుకొని మూడుసార్లు ఓంకారం బిగ్గరగా ఉచ్చరించి దేహత్యాగం చేశారు. వెంకటగిరిలో కైవల్య నదీ తూర్పు తీరాన సమాధి చేశారు. ఆరాధనోత్సవాలు ఘనంగా జరుపుతారు.

## 53 రాజయోగి పగిడ్యాల కృష్ణ బ్రహ్మేంద్రస్వామి -1850-1947

రంగారెడ్డి జిల్లా పరిగి తాలూకా గండ్వీడు మండలం పగిడ్యాల లో భాగమ్మ రామప్ప దంపతులకు 1850లో కృష్ణయ్య పుట్టాడు. నాలువతరగతి లోనే చదువు ఆపేసి,తండ్రి కుల వృత్తి కమ్మరం లో సాయం చేసేవాడు. 12వ ఏట తల్లీ తండ్రీ చనిపోయారు. అన్నగారు చిన్నయ్య అతడిపెళ్లి నరసమ్మతో జరిపించాడు.

జన్మ రాహిత్యం పై కోరిక కలిగి యాలాలలో దొడ్డప్రభువును ఆశ్రయించి,మంత్రోపదేశం యోగ సాధన నేర్చి, సన్యాసం స్వీకరించి కృష్ణ బ్రహ్మేంద్ర స్వామి దీక్షానామం పొందాడు. గురువు ఆజ్ఞతో మునుల గుట్ట, చన్నరాయని గుట్ట, దేనగుట్ట, యానగొంది గుట్ట, కోసగి కాళికాలయాలలో తపస్సు చేశాడు. 12ఏళ్ళు దేశ సంచారం చేసి యోగులవద్ద యోగ రహస్యాలు గ్రహిస్తూ అష్ట సిద్ధులు వశం చేసుకొన్నాడు. హిందూ ముస్లిములు ఆయన్ను సేవించేవారు. దౌలతాబాద్ వేంకటేశ్వరాలయం లో ప్రతి ఏడూ, మాల,మాదిగ కులాలకు చెందిన పేద లకు వివాహాలు ఉచితంగా జరిపించేవారు కృష్ణ బ్రహ్మేంద్రస్వామి. 97సంవత్సరాల సార్ధక జీవితం గడిపి 31=8-1947 సర్వజిత్ నిజ శ్రావణ పౌర్ణమి ఆదివారం బ్రహ్మ రంధ్రం భేదించు కొని దేహత్యాగం చేశారు.మాఘ శుద్ధపంచమినాడు ఆరాధనోత్సవాలు జరుగుతాయి

## 54 పలుగు రాళ్ళపల్లి గోవిందస్వామి -1650-1750

కడపజిల్లా బద్వేలు –పోరుమామిళ్ళపల్లి దారిలో పలుగు రాళ్ళపల్లి లో 17-18శతాబ్దిలో వైదిక బ్రాహ్మణ కుటుంబం లో గోవిందస్వామి పుట్టాడు. యాదాటి రామచంద్రభట్టు పార్వతమ్మ తలిదండ్రులు. శిశువుగా ఉంటూనే మహత్తులు చూపేవాడు. ఉయ్యాలలో పడుకొని ఉంటె ఘటసర్పం పడగ గొడుగులాగా పట్టింది. ఊరి చెరువు దగ్గర బంకమట్టితో పళ్ళెం చేసి, పంచరంగుల గులకరాళ్ళు శివ పంచాయతనం గా అమర్చి, సుద్ద పొడి విభూతిగా, కావిరాళ్ళ పొడి కుంకుమగా, గడ్డి వెన్నులు అక్షతలుగా, అల్లిపూలు పుష్పాలుగా చెరువు నీరు అభిషేక జలంగా, పిచ్చుక గూడు కొబ్బరికాయగా, తుంగ గడ్డలు నైవేద్యంగా అర్పించి తీర్ధ ప్రసాదాలు భక్తులకు పంచి బాధలు పోగొట్టేవాడు.





పెద్దవాడై తండ్రి వద్ద స్మార్తం, గరుడాద్రి యాదయ్య వద్ద మంత్రోపదేశం పొంది ముచుకుందా గుహలో సాధన చేశాడు. లక్ష్మమ్మను పెళ్ళాడి సంసారం చేస్తూ, తపస్సు చేస్తూ రుతంభరం మొదలైన విద్యలు నేర్చాడు. కాశీ రామేశ్వర యాత్రకు వెళ్ళే వారికి ఇంట్లోఆతిధ్య మిస్తూ,పది మందికివండినపదార్ధాలు వదమందికి సరిపోయేలా చేస్తూ మహిమలు చూపేవాడు. 1750లో సుమారు శతమానం జీవించి మాఘశుద్ధ పౌర్ణమి నాడు గోవిందస్వామి జీవసమాధి చెందారు. ముందే కాశీ నుంచి ఒక లింగాన్ని తెచ్చుకొని ఉంచగా, మునిమనవాడు యాదాటి నరసయ్య గోవిందస్వామిమఠం ఆవరణలో ముత్తాత తెచ్చిన శివలింగాన్ని ప్రతిష్టించి, ఆలయం నిర్మించాడు. శివలింగం పేరు నర్మదేశ్వరుడు. అమ్మవారు మీనాక్షీ దేవి. మాఘ శుద్ధ త్రయోదశించి అమ్మవారికి అయ్యవారికి వైభవంగా కల్యాణోత్సవం, మాఘ పూర్ణిమ నుండి పాడ్యమివరకు గోవిందస్వామి ఆరాధనోత్సవం ఘనంగా చేస్తారు.

## 55 ఆచలయోగి రామడుగు శివరామ దీక్షితులు -1690-1791

నల్గొండ జిల్లా నారాయణ పేట సంస్థానం లో రామడుగు విశ్వనాధ శాస్త్రి నిర్మలాంబ, వైదిక బ్రాహ్మణ దంపతులకు 1690లో శివరామ దీక్షితులు పుట్టాడు. వేదాలు యజ్ఞ,యాగాలు బోధలు మోక్షాన్ని ఇవ్వవు అని గ్రహించి, ఆత్మజ్ఞానం కోసం దేశ సంచారం చేస్తూ, ఒక దొమ్మరి గడసాని లక్ష్య శుద్ధికి అబ్బురపడి, ఆమె గురువైన శ్రీధరులను దబ్బాకుపల్లిలో వటవృక్షం క్రింద తపస్సులో ఉండగా దర్శించాడు. ఇతనికోసమే అయన దేహత్యాగం చేయకుండా ఉన్నాడు. మూడురకాల తీర్ధాలు ప్రసాదాలు ఇచ్చి తారకం అమనస్కత బోధించాడు. మూడు దీక్షలిచ్చాడు.



నాలుగు మహావాక్యాలు, వాటి శబ్దార్థాలు బోధించి ద్వాదశి పంచదశి షోడశి మంత్రాలు అర్థాలు బోధించి వాటిని ప్రచారం చేయమని ఆదేశించి పాదుకలు అనుగ్రహించారు. 21వ రోజు గురువు దేహం చాలించాక ఉత్తరక్రియలు జరిపి స్వగ్రామం చేరి అమనస్కత ప్రచారం చేశాడు దీక్షితులు. "శివరామ దీక్షితీయం "అనే బృహత్ గ్రంథం అచల సిద్ధాంతం వివరిస్తూ రాశారు 101ఏ ఏళ్ళు జీవించి 23-11-1791విరోధి కార్తీక శుద్ధ శనివారం దేహం చాలించారు.

## 56 ఉరుకుంద ఈరణ్ణస్వామి 1625 - 1685

ఉరుకుంద ఈరణ్ణస్వామి ఆంధ్రప్రదేశ్ కు చెందిన ప్రసిద్ధ యోగులు. వీరు 1625 - 1685 మధ్య కాలంలో యోగ, భక్తి, వేదాంత, వైద్య, జ్యోతిష, వాస్తు శాస్త్రాల ద్వారా సామాన్య జనానికి సేవలు చేస్తూ సమసమాజ నిర్మాణానికి నడుం బిగించిన ఆధ్యాత్మిక గురువు. ఈరణ్ణ స్వామి శిష్యులు, అనుయాయులు అధికంగా శాంత స్వభావులు. ఈరణ్ణ వేష భాషలు శాంతికి విరక్తికి సంకేతాలు. ఐతే మిమతీయుల దౌర్జన్యాలు మితిమీరినపుడు ఈరణ్ణ తన తన శిష్యులను అనుయాయులను ఆ దుర్జనుల తలపండ్లు తరగడానికి పురికొల్పినాడు. ఆయన ముందుగా యోగి, కుండలినీ సాధనలో అణమాద్యష్టసిద్ధులు గడించాడు. తరువాత విరాగియైనాడు.

### స్వామి వారి చరిత్ర

క్రీశ.1610లో కౌతాళం గ్రామంలో హిరణ్యులు అనే స్వామి జన్మించారు. తన 12వ ఏటా ఆవులు మేపడానికి స్వామి ఉరుకుంద ప్రాంతానికి వచ్చాడు. ఆవులు గడ్డి మేస్తున్న సమయంలో హిరణ్యులు రావిచెట్టు కింద మౌనంగా కూర్చుని ఉంటాడు. ఆ సమయంలో ఆ దారిని వెళుతున్న ఒక సిద్ధుడు హిరణ్యుల వద్దకు వచ్చి గురుబోధన చేశారు. దైవధ్యానం చేస్తూ లక్ష్మీనరసింహస్వామి సన్నిధిలో గడపమని సిద్ధుడు హిరణ్యులను ఆశీర్వాదించారు. అప్పటినుంచి బాలబ్రహ్మచారిగా స్వామివారు అశ్వద్ధ వృక్షం కింద కూర్చుని ధ్యానం చేస్తూ సమాధి ముద్రలో లక్ష్మీనరసింహస్వామిని కీర్తిస్తూ గడిపేవారు. కాలక్రమంలో హిరణ్యులు తపస్సు చేసిన అశ్వద్ధ వృక్షం కిందనే ఉరుకుంద ఈరన్నస్వామి సన్నిధి ఏర్పాటు చేసి భక్తులు పూజలు చేస్తూ వచ్చారు. 1660లో ఉరుకుంద ఈరన్నస్వామి క్షేత్రం వ్యాప్తి చెందింది. 1768లో భక్తులు స్వామివారికి దేవాలయాన్ని నిర్మించారు. 1995 లో ఆలయాన్ని పునర్నిర్మించారు. పునర్నిర్మాణ కార్యక్రమం 10 సంవత్సరాలపాటు సాగింది. నేడు ఉరుకుంద మహామాన్విత క్షేత్రంగా విరాజిల్లుతోంది.

### స్వామివారి మహిమలు

ఉరుకుంద ఈరన్నస్వామిని కొలవనివారు స్వామికి భక్తులు కొట్టిన కొబ్బరి తినాలంటేనే భయపడుతారు. కొబ్బరి తింటే ఈరన్నస్వామి వదలడని, కొలిచి తీరాల్సిందేనని, అందువల్ల ఆ స్వామిని నిప్పులాంటి దేవుడు అని భక్తులు విశ్వసిస్తారు. ఉరుకుంద ఈరన్నస్వామిని ఒక్క హిందూవులే కాకుండా ముస్లింలు సైతం కొలుస్తారు. ఇక్కడ ముస్లింలు సైతం స్వామివారికి పూజలు చేయడం మనం చూడవచ్చు. శ్రావణమాస ఉత్సవాల్లో ఇతర మతస్థులు కూడా కొబ్బరికాయలు ఇచ్చి పంపుతుంటారు. అందువల్ల స్వామిని మతసామరస్యానికి ప్రతీకగా చెప్పవచ్చు. గతంలో స్వామివారి క్షేత్రంలో భక్తులు నిద్రించడానికి వీలులేకుండా రాళ్లు వచ్చి పడేవని వృద్ధులు నేటికి చెబుతుంటారు. అందువలన అప్పట్లో ఉదయం పూట స్వామిని దర్శించుకుని చీకటి పడుతుండగానే ఇంటిదారి పట్టేవారు.

ఉరుకుంద ఈరన్నస్వామిగా పిలువబడుతున్న హిరణ్యులు అశ్వద్ధవృక్షం కింద కూర్చొని ధ్యానం చేసి లక్ష్మీనరసింహస్వామి అనుగ్రహం పొందినట్లు చారిత్రక ఆధారాలు చెబుతున్నారు. అందుకే భక్తులు నేటికీ స్వామికి ప్రతీకగా నిలిచిన అశ్వద్ధవృక్షానికి పూజలు చేస్తుంటారు. ఈ క్షేత్రంలోని అశ్వద్ధ వృక్షం ఏళ్లనాటిదని చెబుతుంటారు. వందల సంవత్సరాలైన అశ్వద్ధ వృక్షం చెక్కుచెదరకుండా ఉంది. స్వామికి నిర్వహించే శ్రావణమాస ఉత్సవాలకు ఒక ప్రత్యేకం ఉంది. స్వామివారిని కొలిచే లక్షలాది మంది భక్తులు శ్రావణమాసాల్లో ఇండ్లు శుభ్రం చేసుకుని శ్రావణమాస ఉత్సవాలు ముగిసేంత వరకు మాంసాహారాన్ని ముట్టరు. మద్యం సేవించరు. స్వామి పట్ల అచంచల భక్తి విశ్వాసాలతోనే భక్తులు మాంసం, మద్యానికి ఈ మాసం దూరంగా ఉంటుంటారు. శ్రావణమాస ఉత్సవాల్లోనే గాకుండా ప్రతి సోమ, గురువారాల్లో భక్తులు పెద్దసంఖ్యలో స్వామిని దర్శించుకుంటుంటారు.

ఉరుకుంద క్షేత్రంలో భక్తుల కోసం అన్నదాన కార్యక్రమాన్ని ప్రతిరోజు నిర్వహిస్తున్నారు. స్వామి దర్శనానికి కర్నూలు జిల్లా నుంచే గాకుండా పొరుగున ఉన్న అనంతపురం, మహబూబ్‌నగర్ జిల్లాలతో పాటు కర్నాటక, మహారాష్ట్ర, తమిళనాడు రాష్ట్రాల నుంచి సైతం భక్తులు స్వామి దర్శనానికి వస్తుంటారు.



### ఈరణ్ణ క్షేత్రం

శ్రీ లక్ష్మీ నరసింహ స్వామి వీరన్నగా ప్రసిద్ధి చెందిన పుణ్య క్షేత్రం ఉరుకుంద ఆదోనికి ౩౦ కిలోమీటర్ల దూరంలో ఉంది.. ఇక్కడికి రావాలంటే ఆదోని నుండి ప్రతి అరగంటకు బస్సు సౌకర్యము ఉంది. అలాగే ఎమ్మిగనూరు నుండి ప్రతి గంటకు బస్సు సౌకర్యము ఉంది.ప్రతి ఏటా శ్రావణ మాసం స్వామి వారికి ఉత్సవాలు జరుగును.[1] స్వామి వారిని స్మరించి దర్శించిన కోరిన కోర్కెలు తీరును. పలికే దేవుడిగా

స్వామి వారు ప్రసిద్ధిచెందారు. వారంలో సోమవారం, గురువారం స్వామి వారికి అంత్యంత ఇష్టమైనవి, అమావాస్య కూడా స్వామి వారికి చాల ఇష్టం.



ఉరుకుంద ఈరన్న స్వామి కొలిచిన వారికి కొంగు బంగారం. కోరిన వెంటనే భక్తుల కోర్కెలు తీర్చే దేవదేవుడిగా స్వామికి పేరు. వందల సంవత్సరాలుగా ఆధ్యాత్మిక కేంద్రంగా విరాజిల్లుతోంది ఉరుకుంద ఈరన్న క్షేత్రం. కర్నూలు జిల్లా కౌతాళం మండలం ఉరుకుంద గ్రామం సమీపంలో ఉరుకుంద ఈరన్న క్షేత్రం నెలకొంది. ఉరుకుంద ఈరన్న స్వామిని ఈ ప్రాంతం ప్రజలే కాకుండా ఇతర రాష్ట్రాల ప్రజలు తమ ఇంటి దేవుడిగా పూజిస్తున్నారు. కోర్కెలు తీరిన అనంతరం భక్తులు తమ పిల్లలకు ఉరుకుందు, ఉరుకుందప్ప, ఈరన్న, అశ్వర్థప్ప అన్న స్వామి పేర్లు పెట్టుకుని తమ భక్తిని చాటుకుంటున్నారు. ప్రతి ఏటా శ్రావణమాసంలో స్వామికి ప్రత్యేక పూజలు నిర్వహిస్తుంటారు. దాదాపు నెల రోజుల పాటు స్వామి వారికి ఇక్కడ ఉత్సవాలు నిర్వహిస్తారు. స్వామివారికి ఎంతో ప్రీతిపాత్రమైన సోమ, గురువారాల్లో భక్తులు వేల సంఖ్యలో వస్తారు. శ్రావణ మాసం 3వ సోమవారం 30 లక్షల మంది భక్తులు స్వామి వారిని దర్శించుకుంటారు.

## 57-తాండూరు సూఫీయోగి అబ్దుల్ కరీం షా వలీ -1870-1947

ఆఫ్ఘనిస్తాన్ లో షాజీ గ్రామం లో 19 వశతాబ్ది మధ్యలో పుట్టిన అబ్దుల్ కరీం షావలీ, బాల్యం నుంచే చదువు ఆటపాటలపై విముఖత చూపిస్తూ గ్రామం బయట ధ్యానం తో, రాత్రిళ్ళు అడవుల్లో తపస్సు చేసేవాడు. 12వ ఏట పినతండ్రి సయ్యద్ వలీ మహమ్మద్ దత్తత తీసుకొని, నిజాం లోని తాండూరుకు తీసుకు వెళ్లి 14వ ఏట పెళ్లి చేశాడు.



కొంతకాలానికి సయ్యద్ సుల్తాన్ ఆలీషా అనే మహాత్ముడు దేశ సంచారం చేస్తూ ఎఖేలీ గ్రామం వచ్చాడు. ఈయన వద్ద ఉపదేశం పొందాలని షా వలీ భావించాడు. ఆయన ఆడంబరాలు చూసి అనుమానించి ఆయన సర్వజ్ఞత్వం అర్థం చేసుకొని భక్తుడు గా మారాడు. ఆయన ఏకాంతం లోకి తీసుకు వెళ్లి శిరసుపై చేతులుంచి.ఆలింగనం చేసుకొని నిండుగా ఆశీర్వదించాడు. ప్రాపంచిక విషయాలపై ఆసక్తి తగ్గి పరమాత్మ నిష్ఠ పెరిగింది. ఒకసారి గురువు ఆయన గురువు ఆరాధనోత్సవాలకు హైదరాబాద్ వెడితే శిష్యుడూ అక్కడికి వెళ్లి, ఆయన ఆదేశం మేరకు గుల్బర్గా షరీఫ్ కు వెళ్లి అక్కడ సుప్రసిద్ధ ముస్లిం యోగి ఖాజాబండ నమాజు దర్గా లో రెండేళ్ళు సేవ చేయాగా ఒకరోజు ఆయన ప్రత్యక్షమై ఆశీర్వదించి గురువు దగ్గరకు వెళ్ళమని చెప్పాడు. అలాగే చేసి ఆయన ఆజ్ఞ తో లాలె చారు, పాకూ పఠాన్ వెళ్లి అక్కడ షేక్ ఫరీద్ షక్కర్ గంజ్ అనే మహాత్ముడిసమాధి దర్శించిఅక్కడ రోగుల ఆర్తులకు సేవ చేయగా షక్కర్ గంజ్ ప్రత్యక్షమై దీవించి ఇంటికి పంపాడు. మళ్ళీ హైదరాబాద్ లో గురువు ను దర్శించి, ఎఖేలీ చేరాడు. గురువు సిద్ధిపొందాడు. శిష్యులకోరికపై వలీ షా పీఠాధిపతిఅయ్యాడు. తాండూరు బయట స్థలం కొని విశాలమైన ఇళ్ళు వసతులు కల్పించిగురువు ఆరాధన వైభవంగా జరిపించాడు. నలుగురు భార్యలతో సంసారం చేస్తూ రాజయోగిగా ఉంటూ పదిమందికొడుకులు ఇద్దరు కూతుళ్ళకు జన్మ ఇచ్చాడు.

1946 లో తీవ్రంగా జబ్బుపడి అయిదు నెలలు బాధపడి 26-12-1947 సర్వజిత్ మార్గశిర శుద్ధ పాడ్యమి శుక్రవారం 77వ ఏట ఆ రోజునే చనిపోతున్నట్లు ముందే ప్రకటించి దేహం చాలించారు. తాండూరు సమాధి హిందూ ముస్లిం లందరికీ యాత్రాస్థలమే.

## 58 చాయాపురుష యోగి దీపాల దిన్నె పాలెం పాటిబండ్ల వీరయ్య -1867-1922

గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా దీపాల దిన్నె పాలెం లో వ్యవసాయం చేసే పాటి బండ్ల బాపయ్య బాపమ్మదాంపతులకు 1867 ప్రభవ నామ సంవత్సరం లో మూడవ సంతానంగా వీరయ్య పుట్టాడు. బాల్యం లోనే వేదాంతం జ్ఞాన తృష్ణ అలవాటయ్యాయి. వీధిబడిలో చదివి స్వయం కృషి తో తెలుగు సంస్కృతం లలో పాండిత్యం సాధించాడు. రెండుభాషల్లోనూ గ్రంథాలు రాశాడు.

సత్తెనపల్లిలో ఫీరోజి మహర్షి ఆధ్యాత్మిక ఉపన్యాసాలు విని శిష్యుడై, మంత్రోపదేశం పొంది సాధన చేసి సిద్ధుడయ్యాడు. సాత్విక లక్షణాలు అలవడి, ఆత్మ శక్తి పెరిగింది. మళ్ళీ గురువును చేరి ఆధ్యాత్మిక రహస్యాలు గ్రహిస్తూ కవితా సాధన చేశాడు. గురువు గొప్పతనాన్ని వర్ణిస్తూ కీర్తనలు రాసి పాడుతూ ఆయన భావాలను వ్యాప్తి చేస్తూ విరాళాలు స్వీకరించి గురువుగారి మఠానికిఅంతరాలయం ముఖమండపం విమాన గోపురాలు కట్టించాడు. నిత్యపూజకోసం భక్తులనుంచి అయిదు ఎకరాలు సంపాదించాడు. ఒకసత్రం బావి ఏర్పాటు చేశాడు. ఆయుర్వేదమూ నేర్చి వైద్య సేవ చేశాడు. చాయాపురుష లక్షణం లో నిష్ణాతుడయ్యాడు 9-

11-1922 సాయంత్రం దుందుభి కార్తీక బహుళ పంచమి గురువారం 55వ ఏట భగవన్నామం చేస్తూ, సంపూర్ణ వివేకం తో బ్రహ్మైక్యం చెందారు. ఫిరోజీ మహర్షి సమాధికి ఎదురుగా స్వామి సమాధి నిర్మించారు

## 59 మిట్టపాలెం నారాయణ స్వామి -1750

నెల్లూరు జిల్లా కనిగిరి తాలూకా కోవలం పాటి మిట్టపాలెం లో కొమ్మినేని వెంకటరామయ్య మహాలక్ష్మమ దంపతులకు కొండయ్య పుట్టాడు. చిన్ననాటి భక్తి క్రమంగా పెరిగి, తండ్రి చనిపోయాక తల్లితో తీర్థయాత్రలు చేస్తూ, పురాణకాలక్షేపాలు చేస్తూజీవనం సాగించాడు. తల్లి చనిపోగా తమ్ముడి బాధ్యత పెద్దక్కకు వదిలేసి, నారుకొండలో ఉంటూ పిచ్చివాడు అనుకొన్నవారికి బుద్ధులు బోధిస్తూ తిరుగుతూ, మహిమలు అద్భుతాలు చూపిస్తూ ఉండగా ఒక మహనీయుడు వచ్చి నాలుకపై విభూతి చల్లి మంత్రోపదేశం చేయగా, నారాయణ మంత్రం జపిస్తూ నారాయణ స్వామిగా ప్రసిద్ధి చెంది బ్రహ్మంగారి మాటలు ఫలిస్తాయని ప్రకటించి తానూ త్వరలో జీవసమాధి చెందుతాననని చెప్పాడు.



10వ రోజున నాగ ప్రతిష్ట, పోలేరమ్మ ప్రతిష్ట జరుగుతుందని చెప్పి, శిష్యులను పిలిచి భజనలు కీర్తనలు పాడమని చెప్పి పాదుకలు బెత్తం ధరించి సమాధి ప్రవేశం చేసి, బండరాయితో మూసేయించారు. సమాదినుంచే భక్తులకోర్కెలు తీరుస్తారనే నమ్మకం సమాధి వద్ద దీపాఆధనలు జరుగుతాయి. అక్కడ అయిదువారాలు నిద్రిస్తే దీర్ఘ రోగాలు పోతాయని నమ్మకం. భద్రాయపాలెం లోని ఈ సమాధి గొప్ప యాత్రాస్థలమైంది.

## 60 నాగండ్ల ప్రతాప కోటయ్య శాస్త్రి -1854-1896

బాపట్లతాలూకా నాగండ్లలో ప్రతాప జోగయ్యశాస్త్రి దంపతులకు కోటయ్యశాస్త్రి 1854లో పుట్టాడు. బాల్యం నుంచే సర్వభూతాలయడ దయ సానుభూతి ఉండేది. దాన ధర్మాలు చేసేవాడు. 20ఏట మహాలక్ష్మమ్మతో పెళ్లి జరిగింది. ధనసంపాదనకోసం నిజాం రాష్ట్రం వెళ్ళాడు. ఒక వ్యాధి గ్రస్తుడు నారాయణ కు స్వస్తత కూర్చటం తో పేరు మారు మోగింది. అతడు కోటయ్య తలిదండ్రులకు అపార ధనంపంపి, కోటయ్య కోరిక మేరకు కాశీ పంపాడు. కాశీలో బాలసరస్వతి స్వామి త్రిపురసుందరి మంత్రోపదేశం చేయగా దీక్షగా జపించి మంత్ర, యోగ సిద్ధులు పొందాడు. గురువు అనుమతితో స్వగ్రామం వచ్చి అన్నదానం నిరంత భగవధ్యానం చేస్తూ, జపతపాలాచరించాడు..మళ్ళీ కాశీ వెళ్లి 42ఏట 1896లో కోటయ్యశాస్త్రి బ్రహ్మ రంధ్రం చేదించుకొని దేహత్యాగం చేశాడు.

## 61 కర్తవ్య కరి బసవ స్వామి -1762-1832

రాయ చూరు జిల్లా నారద క్షేత్రం లో యాదవ గిరి శైవ పీఠాధిపతి చన్న బసవస్వామి, కొండిన్య నగరం లో ఒక బాలుడిని చూసి, అతడి తేజస్సు గుర్తించి యాదగిరి పీఠానికి తీసుకువెళ్ళి హస్త మస్తక సంయోగం చేయటం తో అతడికి జ్ఞానోదయమై సమస్త విద్యలలో శివా నుభవ శాస్త్రం లో, సాంఖ్యం లో నిష్ణాతుడయ్యాడు. అతడికి కరిబసవ స్వామి పేరుపెట్టి, కొంతకాలం తర్వాత మఠం బాధ్యతలు అప్పగించి చన్నబసవస్వామి నారద క్షేత్రానికి వెళ్ళిపోయాడు.



గురవాజ్ఞ మేరకు దేశ సంచారం చేస్తూ, తపోబలం తో రోగులకు ఆర్తులకు సౌఖ్యం కలిగిస్తూ జ్ఞానార్ధులకు జ్ఞాన బోధ చేస్తూ కరిబసవస్వామి శిష్య ప్రశిష్యులను పొందారు. ఆతని కర్తవ్య దీక్షకు మెచ్చినగురువు "కర్తవ్య కరి బసవ స్వామి "బిరుదు ప్రదానం చేశారు. ఆంధ్ర, కర్నాటక నిజాం రాష్ట్రాలలో 800మఠాలు స్థాపించి వాటి పోషణకు 20 వేల ఎకరాల భూమి సేకరించి పటిష్ట పరచారు.

అనంతపురం జిల్లా ఉరవకొండలో భక్తులకోరికపై ఒక మఠం ఏర్పాటు చేసి, దానికి" గవి మఠం"పేరు పెట్టి దానికి అనుబంధంగా మైసూరులో "కరంబి మఠం"స్థాపించారు స్వామి. పల్లకీ లో ఉరవ కొండ వెడుతూ మేనా తలుపులు మూసుకొని కరి బసవ స్వామి శివైక్యం చెందారు ఫాల్గుణ శుద్ధ పంచమి నుంచి 8రోజులు ఘనంగా ఆరాధనోత్సవాలు చేస్తారు. చుట్టుప్రక్కల రాష్ట్రాలనుంచి కూడా భక్తులు అశేషంగా వస్తారు. స్వామి 1762లో పుట్టి 1832లో 70వ ఏట శివైక్యం చెందినట్లు భావిస్తారు.,

## 62 మహాయోగిని మాణిక్య నగరం వెంకమ్మ -1808-1862

చిన్నతనం లోనే పెళ్లి అయి భర్త చనిపోగా వెంకమ్మ మనసు ఆధ్యాత్మిక భావం వైపుమరలి ధ్యానం ధారణా అలవాటయ్యాయి. ఒకసారి కర్ణాటకలోని మాణిక్ ప్రభు సామ్రాజ్యం లో దత్తావతారం అయిన మాణిక్ ప్రభు దర్శనం కోసం ఆమె తలిదండ్రులతో బండీలో వెడుతుంటే, దారిలో రాళ్ళవాన కురిసి వాగులూ వంకలు పొంగి ఎద్దులబండి మునిగి పోయే పరిస్థితి వస్తే వెంకమ్మ భక్తిగా ఆర్తిగా మాణిక్ ప్రభువును మూడు సార్లు గొంతెత్తి పిలువగా, ఒక 16ఏళ్ళ బాలుడి రూపం లో వచ్చి కాపాడటం తో ఆమె మాణిక్ ప్రభుకు మహా భక్తురాలై,ఆయన చరణాలే నమ్ముకున్నది. ఆమెను అనేక రకాలుగా పరీక్షించి ప్రభు,ఆత్మ సాక్షాత్కారం కలిగించి యమ నియమ ఆసన ప్రాణాయామ నిధి ధ్యాన మానస సమాధులు పొందేట్లు అనుగ్రహించారు. జప ధ్యానలలో ఉన్నతోన్నత్సి స్థితి సాధించి,మాణిక్యనగరంవెంకమ్మగా పేరుపొందింది.



భక్తులకు సాధకులకు హితోప దేశం చేసేది. ఆహంకారం నశిస్తే సద్గురుకటాక్షం లభిస్తుందనీ, సాధకుడు సద్గురువుతో ఏకరూపం పొందాలని ఉపదేశించేది. 23-8-1862దుందుభి శ్రావణ బహుళ త్రయోదశి శనివారం 54వ ఏట మహా యోగిని వెంకమ్మ దేహత్యాగం చేశారు.మాణిక్య ప్రభువు వెంకమ్మను దేవతలాగా పూజించి, స్వయంగా సమాధిలో కూర్చోబెట్టి సమాధి చేశారు. సమాధి నుంచి కూడా చాలా అద్బుతాలు చేసేది. 1982 లో భక్తుల కరసేవతో ఆమె మందిర నిర్మాణం జరిగింది. ఆశ్వయుజ పంచమి నుంచి, నవమి వరకు పంచ రాత్ర ఉత్సవాలు చేస్తారు. వెంకమ్మ మందిరం లో దేవీ నవరాత్రులు వైభవంగా నిర్వహిస్తారు. దత్తాత్రేయ శక్తి వెంకమ్మ రూపం లో ఇక్కడ ఉన్నదని అందరి విశ్వాసం

## 63 నారాయణ రెడ్డి అవధూత -1834-1915

కడప జిల్లా కమలాపురంతాలూకా గంగిరెడ్డిపల్లె లో నర్రెడ్డి సింగిరెడ్డి రామాంబ దంపతులకుశ్రీ నారాయణ అంశతో నారాయణ రెడ్డి 1834లో పుట్టాడు. పూర్వ జన్మలోబెస్తవాడుగా పుట్టి బ్రహ్మం గారిని సేవించినట్లు కథనం. చిన్నతనం నుంచే ఏకాంతం లో ఉండటం ఇష్టం. పసువులను మేపుతూ ఏకాంతం లో ధ్యానం చేసుకొనేవాడు. ఒకసారి కుంభ వృష్టికురిసినా అందరు గోపబాలురూ తడిసిపోయినా యితడు తడవక ఆశ్చర్యం కలిగించాడు. లీలలూ అద్బుతాలు చూపేవాడు. ఉన్న ఊరు నచ్చక 16వ ఏట ఊరు వదిలేసి 60ఏళ్ళ వరకు తిరిగి రాలేదు.



20 వయసులో కర్నూలు వెళ్లి అడవుల్లో తిరుగుతూ తీవ్రంగా తపస్సు చేశాడు.అవధూత అయి అమనస్క యోగం లో ఆరి తేరాడు. అష్ట సిద్ధులు వశమైనా ఎప్పుడూ ప్రదర్శించ లేదు. రాత్రీ పగలూ తిరుగుతూనే ఉండేవాడు. వస్త్రాలు అడిగి తీసుకొని పేదలకు పంచేవాడు. అడిగినవారికి మంచీ చెడ్డా చెప్పేవాడు. కంది మల్లయ్యపల్లి వెళ్లి బ్రహ్మం గారి సమాధిని సేవించాడు. చివరికి ఓబుళరాజుపల్లె చేరి, ఓబుళరాజు నారాయణ రెడ్డి అవధూత అనిపించుకొన్నాడు.గ్రామాధికారి వీరారెడ్డికి తాను దేహం చాలిస్తున్నట్లు చెప్పి 12-3-1915 ఆనంద ఫాల్గుణ బహుళద్వాదశి శుక్రవారం 81వ ఏట శ్వాస బంధించి ప్రాణం వదిలారు. వీరారెడ్డి అంత్యక్రియలు ఘనం గా నిర్వహించి, గ్రామానికి పడమరవైపు తన స్వంతపోలం లో సమాధి మందిరం నిర్మించాడు. సమాధి నుంచి ఘంటారావం,వీణా,తాళ మృదంగ ధ్వనులు వినిపిస్తాయి. ఫాల్గుణ బహుళ ద్వాదశినాడు ఆరాధన జరుగుతుంది.

నమ ఓం దివ్య మునీంద్ర సేవ్య భవతే

నారాయణోఖ్య ప్రభో సుమనః ప్రార్థితయించు

సర్వజగదీశున్ నిన్ను గాంకించి

శ్రీ రమణా ఓబుళ రాజుపల్లి విశృతపలి

ప్రాంతోరు నారాయణ స్వామి

భూమిమ్ దమి మీర గాంచితిమి శశ్వత్తేజ నారాయణ

## 64 రెడ్డి సుబ్రహ్మణ్య మహర్షి -1860-1949

రెడ్డి సుబ్రహ్మణ్య మహర్షి రౌద్రనామ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ చవితి గురువారం పుష్యమీ నక్షత్రం లో 1860లోగోదావరి జిల్లా ఈతకోటలో బ్రహ్మన్న శేషమ్మ దంపతులకు సపుట్టాడు. చిన్నప్పటినుంచి భూతదయ, పాపభీతి భక్తీ అలవాటయ్యాయి. తులసి కోటవద్ద శ్రీ రామ ధ్యానం చేస్తుంటే శ్రీరాముడు, రాత్రి ఆకాశంలో చూస్తుంటే సీతారాములు దర్శనమిచ్చేవారు. 12వ ఏట ఉపనయనం జరిగి, పోణంగిలోని రామభక్తుడు సోమయాజుల పాపయ్యశాస్త్రి రామతారక మంత్రం దీక్ష ఇచ్చి, మానసిక పూజా విధానం నేర్పాడు. ఆయనవద్ద ఆరేళ్ళు సాధన చేశాడు. జప సమయంలో సీతారాములు కనిపిస్తే ఆశువుగా పద్యాలు చెప్పి స్తుతించే వాడు. బలవంతంగా పెళ్లి చేస్తే, సంసారం వదిలేసి తీర్ధయాత్రలు చేస్తూ వివిధ మతాలకు చెందిన 72 మంది యోగులను దర్శించి, రాజమండ్రి లో శ్రీ విశ్వ నాథ అవధూత సన్నిధికి చేరాడు.


శ్రీ గురు దంపతులు

ఆయనవద్ద హఠ యోగాదులు రాజయోగం సాధన చతుష్టయం అభ్యసించగా గురువు "స్వేచ్చానం "అనే దీక్షానామమిచ్చి గృహస్థ ధర్మం పాటించమని ఆదేశించాడు. ఒకసారి మహారాష్ట్ర బ్రహ్మ చారి బాబ్ కోకిల్ 60ఏట సన్య సించి, పామర్రులో ఉంటున్న సుబ్రహ్మణ్య యోగి ఇంటికి వచ్చి భిక్ష చేసి అనేక యోగరహస్యాలు బోధించగా అష్ట సిద్ధులు వశమై అనేక అద్భుతాలు చూపేవాడు. అద్వైత రహస్యం మానసబోధ గాయత్రీ నాటకం, అచల బ్రహ్మానంద ప్రబోధం, పరవాసుదేవ శతకం, దండకాలు మొదలైన 17రచనలు చేశారు. 22-3-1949 సర్వధారి ఫాల్గుణ బహుళ అష్టమి మంగళవారం 89వ ఏట మహేంద్రవాడ లో పీఠస్థులై,మూలాధారం బిగించి హంసను షట్చక్రాలు దాటించి భ్రూమధ్యలో చేర్చి నాసాగ్రం పై దృష్టి నిల్పి షట్చక్ర సీతారామ తారక బ్రహ్మం లో ఐక్యమయ్యారు సుబ్రహ్మణ్య యోగి.

## 65 పూదోట లింగావదూత -17వ శతాబ్దం

కర్నూలు జిల్లా పాలేరు నదీ తీరాన అవుకు గ్రామం లో సోమమ్మ సోమిరెడ్డి దంపతులకు లింగమూర్తి పుట్టాడు. ఐదవ ఏటనే చెట్టు కింద శివనామం జపిస్తూ గడిపేవాడు. తలిదండ్రులు చనిపోగా ఏగంటి శివరామ యోగి మంత్రోపదేశం చేసి,శివ లింగగుహకు తీసుకు వెళ్లి,సమస్త విద్యలు నేర్పాడు. దృశ్య భేదన యోగం, చైతన్య జడ సంధాన చిన్మయయోగం వంటి అనేక యోగాలు నేర్పి తీర్చి దిద్దాడు.



శివరామ గురుడు "పూదోట గురు పీఠం"స్థాపించి, లింగమూర్తిని మొదటి పీఠాధిపతి ని చేసి, "పూదోట లింగావదూత " నామకరణం చేసి, విశ్వమతాన్ని స్థాపించి వేద వేదాంగాలు అందరికీ అందుబాటులోకి తీసుకు రమ్మని ఆదేశించాడు. రవ్వలకొండ గుహలో గోచీ మాత్రమే ధరించి మహిమలు చూపుతూ ఆశువుగా వేదాంతతత్వాలు రాసి పాడుతూ పండిత పామరులను ఆకర్షించాడు. ఈ గీతాలను ఆశ్రమ వారసుడు 13దళాలుగా, 715పాటలను తాటాకులపై రాస్తే, 10వ పీఠాధిపతి"పూదోట తత్వ గీతామృతం "పేరిట శ్రీ ఆనందన స్వామి 1962 లో ప్రచురించారు. తాను తనువు చాలించే విషయం ముందేచెప్పిన జ్యేష్ట పూర్ణిమనాడు దాసావదూతను పీఠాదిపతిని, చేసి, జ్యేష్ట బహుళ ఏకాదశి నాడు సంగమేశ్వర తీరాన చిన్న వనం చేరి భక్తుల జయజయ ధ్వానాల మధ్య లింగమూర్తి అవధూత స్వామి కృష్ణా నదిలో మోకాలి లోతు నీటిలో, చివరగా ఒక తత్వాన్ని ఆశువుగా పాడి, కృష్ణాజినంపై పద్మాసనం లో కూర్చుని, ప్రవాహం మధ్యలోకి వెళ్ళగా, ఆయన దేహం చుట్టూ మంటలు లేచి అవి ప్రకాశంగా మారి సూర్యమండలం వైపు సాగి పోయాయి. ఏటా జ్యేష్ట బహుళ ద్వాదశినాడు ఆరాధనోత్సవాలు పరమవైభవంగా చేస్తారు. శివ కేశవ భేదం లేదని చాటిన శివాంశ సంభూతుడుస్వామి. '

## 66-త్రికాలజ్ఞాని ధరణి సీతారామ యోగీంద్ర స్వామి -1714-1796

కాశీ నుంచి ఆంధ్రదేశానికి వచ్చి స్థిరపడిన తర్కశాస్త్ర మాధవభట్టు వంశం లోని వశిష్ట గోత్రీకుడు ధరణిసుబ్బయ్య, తిమ్మాంబ దంపతులకు కడపజిల్లా ప్రొద్దుటూరు తాలూకా కోర్రపారు లో 4-1-1714 జయ పుష్యబహుళచవితి సోమవారం సీతారామ స్వామి మూడవ సంతానం గా పుట్టాడు. నాలుగేళ్ళకే తండ్రి చనిపోగా, ఆవులను కాస్తూ వాగు గడ్డ పై ఉన్న గుడి దగ్గర ఆడుకొంటుంటే, ఒక యోగి వచ్చి అతనిలోని వర్చస్సు గుర్తించి నాలుకపై బీజాక్షరాలు రాసి దత్తాత్రేయ మంత్రోపదేశం చేశాడు. అప్పటినుంచీ ఆమంత్రాన్ని జపిస్తూ, మహిమలు చూపుతూ తల్లి అనుమతితో బ్రహ్మ చర్యం పాటించి సన్యాసం తీసుకొన్నాడు. పుణ్యక్షేత్ర దర్శనం చేసి శ్రీశైలం, అహోబిలం లలో తపస్సు చేసి భగవత్ సాక్షాత్కారం పొంది, అష్ట సిద్ధులు వశం చేసుకొని దేశ సంచారం చేస్తూ, ధర్మ ప్రబోధం చేస్తూ అరిష్టాలు వ్యాధులు తొలగిస్తూ, కర్నూలు జిల్లా ఆళ్లగడ్డ దగ్గర లింగాలదిన్నె చేరి, ఆశ్రమము శివాలయం తటాకం ఏర్పరచుకొని తపస్సు చేస్తూ లింగాలదిన్నె సీతారామ యోగీంద్రస్వామిగా ప్రసిద్ధి చెందారు.

చాలా చోట్ల నందీశ్వర ఆలయాలు దత్తాత్రేయ మఠాలుతోటలు ఆలయాలు నిర్మిస్తూ జీర్ణ దేవాలయాలను పునరుద్ధరించారు. శిష్యులను గ్రంధ రచనకు ప్రోత్సహించి సాహిత్య సేవచేశారు 17-12-1796 నల మార్గశిర బహుళ తదియ శనివారం 82వ ఏట సమాధిలో ప్రవేశించి, 700 ఏళ్ళు సజీవ చైతన్యంలో ఉంటాయని శిష్యులకు అభయమిచ్చి సమాధి గతులయ్యారు మైసూరు దత్తగురువు శ్రీ గణపతి సచ్చిదానందస్వామి తమకు సీతారామ యతీంద్రుల సాక్షాత్కారం కలిగిందని చెప్పారట. మార్గశిర పౌర్ణమి నుంచి మూడు రోజులు వైభవంగా ఆరాధనోత్సవాలు చేస్తారు.

## 67 సొరకాయల స్వామి -1700-1902

తిరుపతి దగ్గర నిరుపేద గొల్ల కుటుంబం లో 1700 లో రామ స్వామి పుట్టి, కొండ కోనలలో మేకలు గొర్రేలుకాస్తుండగా ఒకయోగి మంత్రోపదేశం చేయగా ఇహలోక బంధాలన్నీ తెంచుకొని, నాలు గిళ్ల భిక్షం ఎత్తి ఆకలి తీర్చుకొంటూ ఉండేవాడు. బుజాన గుడ్డలమూట, నెత్తిన ముతక గుడ్డ తలపాగా, మోకాళ్ళవరకు చిరుగుల పంచె, ఒక చేతిలో పేలికలతో అల్లిన తాడు కు కట్టిన రెండుకుక్కలు, బుజం పై కావడి, దానికి ఒకవైపు మలమూత్రాలకుండ, మరో వైపు తినటానికీ తాగటానికీ పనికి వచ్చే సొరకాయ బుర్రలు ఆయన అవతారం. అందుకే సొరకాయల స్వామి అనే పేరు వచ్చింది.




రోగగ్రస్తులకు తాను తినే ఆకులు భోజనం నీళ్ళు ఇచ్చి నయం చేసేవాడు. వచ్చే ప్రమాదాలను ముందే హెచ్చరించేవాడు. పశుపక్షాదులనన్నిటినీ ప్రేమిస్తూ పిచ్చివాడుగా కనిపించేవాడు. ఆయన అగ్ని హోత్రం వెలిగిస్తే దత్తాత్రేయ స్వామిగా కనిపించేవాడు. ఎక్కడికైనా ఎంతదూరమైనా కాలినడకే. ప్రకృతి శక్తులైన పంచభూతాలు ఆయన అధీనం లో ఉండేవి. 1902 ఆగస్ట్ లో మద్రాస్ చేరి, నారాయణవనం ఆరణి నది ఒడ్డున, ఒక గులకరాయి విసిరి అది పడిన చోటే తనసమాది అని ముందే చెప్పి,తన వయసు యెంత అని ఎవరో అడిగితె 500 ఏళ్ళు అని తెలిపి, 2-8-1902 శుభకృత్ శ్రావణ శుద్ధ పంచమి శనివారం మధ్యాహ్నం 12 గంటలకు 202 ఏళ్ళ వయసులో శరీరం వదిలారు. ఆయన కోరిన చోటనే సమాధి చేశారు.మొదటి ఆరాధన "కైంకర్య సమాజం "అధ్యక్షుడు రత్న సభాపతి పిళ్లై అనే భక్తుడి ఆధ్వర్యంలో జరిగాయి.ఈ సమాజం వసతి గృహాలు కళ్యాణ మండపాలు భోజన శాలలు కట్టిస్తూ ఘనంగా ఆరాధనోత్సవాలు చేస్తున్నారు

## 68 ఆర్తత్రాణ పారాయణ మహాకవిజ్ఞాని భక్త శిరోమణి -శ్రీధర వేంకటేశ అయ్యావళ్-1635-1720

సదాశివ బ్రహ్మేంద్ర స్వామి సహాధ్యాయి, గురువు, పండితుడు, కవి శ్రీధర వేంకటేశ అయ్యావళ్,వైదిక బ్రాహ్మణ కుటుంబం లో, కౌశిక గోత్రీకుడు శ్రీధర లింగార్యుని కుమారుడుగా 1635 లోపుట్టాడు. గొప్ప శివ భక్తుడు. గృహస్థ రాజయోగి. తంజావూరు మహారాజు షహాజీ కావేరీ తీరం లో తిరువశ నల్లూరు గ్రామాన్ని శాహరాజపు అనే పేరుగా మార్చి,1693లో 46 గురు వేద పండితులకు దానమిచ్చాడు. అందులో మన శ్రీధర వెంకటేశ కూడాఉన్నాడు.



మధ్యార్జునం అనే పేరున్న తిరువిడ మరుదూరు లోని మహాలింగస్వామి శ్రీధరుని ఇలవేలుపు. ఆ భజన సంప్రదాయానికి ఆద్యుడుకూడా. సంస్కృత గ్రంథాలు చాలారాశాడు. శాలేంద్ర విలాసం అనే ఎనిమిది సర్గల మహాకావ్యాన్ని, భక్తీ వేదాంత పరంగా ఆఖ్యా షష్టి,దయాశతకం, ఆర్తిహర స్తోత్రం,కులీరాష్టకం, అచ్యుత శతకం, శివ భక్త లక్షణం, శివభక్తి కల్ప లతికా మాతృ భూతాష్టకం, తారావళీ స్తుతి,స్తుతిపద్ధతి, డోలా నవరత్నమాల, దోష పరిహారాష్టకం, భగవన్నామ భూషణం మొదలైనవి ముఖ్యమైనవి. షాజీ మహారాజు కోరికపై నల్లాధ్వరి, వేంకటేశ శాస్త్రి అనే ఇద్దరు పండితులతో కలిసి "పదమణి మంజరి "అనే నిఘంటు నిర్మాణం చేశాడు. శ్రీధరునికి ఉన్న శివకేశవ భేదాతీతమైన భక్తీ, శమదమాదుల షట్క సంపత్తి,సర్వభూత దయాగుణం చూసి సమకాలీనులు "అయ్యావాళ్"అని గౌరవంగా సంబోధించేవారు.



ఆర్తత్రాణ పరాయణుడు, నిరంతరదైవ సాక్షాత్కారం పొందినవాడు శ్రీధరపండితుడు. తిరువిశనల్లూరులో అనావృష్టి సంభవిస్తే "కుళీరాష్టకం "స్తోత్రం రాసి గానం చేసి వానలు కురిపించాడు. మృత్యువుతో పోరాడుతున్న శిశువుని తారావళి స్తోత్రం తో కాపాడాడు. భగవన్నామ సంకీర్తనకు ఉచ్చనీచాలు ఉండరాదని బోధించేవాడు. ఒకసారి కావేరీ నది దాటి తిరువిడ మరుదూర్ లోని తన ఇష్ట దైవమైన దేవాలయానికి వెళ్లి గర్భాలయం ప్రవేశించి అదృశ్యమై పరమ శివునిలో ఐక్యంచెందారు శ్రీధరులు., మానవీయ విలువలను పాటించిన మహా సంస్కర్త శ్రీధరులు 85ఏళ్ళు సార్ధక జీవితం గడిపారు.

## 69-సనారీ విశ్వనాథ అవధూత -1856-1914



కాశీ విశ్వనాథుని అవతారంగా భావింపబడే సనారీ విశ్వనాథ అవధూత 3-11-1856 నల కార్తీక శుద్ధపంచమి సోమవారం శ్రీకాకుళం జిల్లా నాగావళీ నదీ తీరాన పాలకొండకు చెందిన సింహాద్రి వీరాచారి, గౌరీ దేవి భక్త దంపతులకు విశ్వనాథాచార్యులుగా జన్మించాడు. ఏక సంథాగ్రాహి., అయిదేళ్ళకే వేదం, శాస్త్రాలు కావ్యాలు ఇతిహాసాలలో నిష్ణాతుడయ్యాడు. రసవాద విద్యలో ఉద్దండుడు. తలిదండ్రులు చనిపోతే పెదతండ్రికొడుకు నీలయ్యాచార్యుని దగ్గర పెరిగి, ఏటి ఒడ్డున శివాలయం లో రోజూ ఏదో ఒకటి రాస్తూ ఉండేవాడు. అతని వైరాగ్యభావన గ్రహించి అన్నగారు పంచబాణ విద్యలు నేర్పాడు. రాగి బంగారం పనుల్లో శిల్పాలు చెక్కటం లో కుస్తాగిరి మాలామా పనుల్లో గొప్ప నేర్పు సాధించాడు. పెళ్లి ప్రయత్నాలు చేస్తుంటే తనకోసం పుట్టిన అమ్మాయి పాలకొండలో ఉందని చెప్పి వెళ్ళగా, అక్కడ అన్నపూర్ణ అనే కన్య అతడే తన భర్త అని నిశ్చయించింది. 1873వైశాఖ శుద్ధ ఏకాదశి శుక్రవారం ఇద్దరికీ వివాహం చేశారు.



భార్యకు అజపాగాయత్రి బోధించి తాను రాజయోగిగా గృహస్తాశ్రమ ధర్మం పాటించాడు. శిష్యులకు ఎన్నో విషయాలు శాస్త్రాలు బోధించాడు. సనాతన ధర్మ ప్రచారం కోసం దేశ సంచారం ప్రారంభించి, రాజమండ్రి కోటి లింగాల రేవు దగ్గర పర్ణశాల నిర్మించుకొని చాలాకాలం తపస్సు చేశాడు.

"సనారీ విశ్వేశ్వర సంవాదం "అనే గ్రంథంరాశాడు. 12 ఏళ్ళ తర్వాత ముద్రణ కోసం మద్రాస్ బయల్దేరుతూ, శ్రీశైలం చేరి 23-10-1914 ఆనంద కార్తీకశుద్ధ పంచమి శుక్రవారం 58 వ ఏట బదరికావన గుహలో అంతర్ధాన మయ్యారు. ఇప్పటికీ సజీవంగా ఉంటూ శుక్రవారం దర్శనమిస్తూ భక్తులకోరిక తీరుస్తున్నారు. పాలకొండ దుర్గామందిరం లో ఇప్పటికీ అలా జరుగుతూనే ఉందని భక్తుల నమ్మకం, విశ్వాసం.

## 70 నెమళ్ళ దిన్నె హుస్సేన్ గురు -1850-1929

కర్నూల్ జిల్లా ఆళ్లగడ్డ తాలూకా చాగలమర్రి వ్యవసాయ ముస్లిం కుటుంబం లో వనల చిన్న హుంసూర్, హుసేన్ బీ దంపతులకు 1850లో హుసేన్ పుట్టాడు. అయిదవ ఏటనే ఏకాంతంగా ధ్యానం చేసేవాడు. వయసుతో పాటు ధ్యానం గ్రంథ పఠనం సాధు సంతతిసేవ పెరిగాయి. పెళ్లిఅయినా మార్పు రాలేదు. అక్కడి శివనాగమయ్య బోధనలతో భక్తి వైరాగ్యాలు పెరిగాయి. విరాగిలా పిచ్చి వాడిగా తిరిగేవాడు. ఒక రోజు కలలో ఒక పురుషుడు కనిపించి మర్నాడే మార్గదర్శనం జరుగుతుందని చెప్పాడు. అనుకొన్నట్లే మర్నాడు చంద్రోదయకాలం లో ఒక దిగంబర అవధూత వచ్చి హుసేన్ కు సాంఖ్య సూత్రం, నాదానందం, పంచ ముద్రలు సాకార నిరాకారాలు పరిపూర్ణం అమనస్కత వగైరా బోధించి, శిరసుపై చేయి ఉంచి ఆశీర్వదించి అదృశ్యమయ్యాడు.

వెంటనే అడవిలో ఒక చెట్టెక్కి కొమ్మపై వెల్లకిలా పడుకొని ధ్యానమగ్నుడయ్యాడు.తర్వాత సంసార బంధాలన్నీ తెంచుకొని, అడవులలో తిరుగుతూ, ఒక దేవాలయం లో బస చేయగా ఎందరో శిష్యులేర్పడ్డారు. అద్భుతాలు చూపేవాడు 27-10-1929 శుక్ల ఆశ్వయుజ బహుళదశమీ ఆదివారం 79వ ఏట హుసేన్ గురుడు దేహం చాలించాడు. మర్నాటి ఉదయం సమాధి చేశారు. తర్వాత మందిరం కట్టి ఉరుసు ఉత్సవం చేశారు. ప్రతి చైత్ర పౌర్ణమి, ఆశ్వయుజ బహుళ ఏకాదశి నాడు ఆరాధనోత్సవాలు జరుపుతారు.

## 71 తత్వవేత్త యడ్ల రామదాసు

19 వ శతాబ్దం చివరలో కాకినాడలో ఉన్న తత్వ వేత్తలలో యడ్ల రామదాసు ఒకరు. క్రీ.శ 1860లో జన్మించి 70ఏళ్ళు జీవించి 1910లో సిద్ధిపొందిన తత్వ వేత్త. బ్రహ్మం గారి తత్వాల తర్వాత ఈయన తత్వాలకే వ్యాప్తి ఎక్కువ. 119 కీర్తనలతో "సాంఖ్య తారకామనస్క యోగంబనెడు సుజ్ఞాన చంద్రిక ' అనే గ్రంథాన్ని పీఠిక తో సహా తాను బ్రతికుండగానే ముద్రింపించుకొన్నాడు.




విజయనగరం సంస్థానం దగ్గరలో కలవ చర్ల గ్రామం లో యడ్ల అచ్చయ్య, మహాలక్ష్మమ్మ దంపతులకు యడ్ల రామ దాసు జన్మించాడు. అక్షరాభ్యాసం అయిన తర్వాత 12వ ఏట కాకినాడ చేరాడు. అక్కడ మంతెన వేంకటాచార్య అనే వేదాంత గురువు వద్ద ఉపదేశం పొంది సాంఖ్య తారక అమనస్క,రాజయోగాదులలో ప్రావీణ్యం సంపాదించాడు

12 యేళ్ల వయసులో విజయనగరం నుంచి కాకినాడ వెళిపోయారు. అక్కడ మంతెన వెంకటాచార్యులు అనే ఆయన దగ్గర శిష్యరికం చేసి పాండిత్యం సంపాదించారు. 'సుజ్ఞాన చంద్రిక ' ఎడ్ల రామదాసు రచించిన పుస్తకం. అందులో పీఠికలో ఆయన ఇలా రాసుకున్నారు..."తాను విద్యావిహీనుడనైనా సద్గురు కృపతో వచో రచనమందు, కవిత్వమందును ఒక ధోరణి కలిగి కొన్ని కీర్తనలను, మరికొన్ని తత్వాలను గద్య పద్యాలతో, సకల జనుల కాహ్లాదకరంబగునటుల సులభ శైలిని...". ఈయన రచనలన్నీ భక్తిరస ప్రధానమైనవే! రాముడిని, కృష్ణుడిని కొలుస్తూ రాసినవే! ఈయన మొత్తం 119 కీర్తనలు రాసారు. ఈ రచనలన్నిటికీ 'సాంఖ్యయుగ తార్కిక మనస్కయోగం' అని పేరు. ఇతని శిష్యులు కొందరు ఎడ్ల రామదాసు గారి తత్వాలను, కీర్తనలను కలిపి "ఎడ్ల రామదాసు చరిత్ర ' అనే పుస్తకాన్ని ప్రచురించారు. బాలంత్రపు రజనీకాంతరావు గారు రాసిన 'ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము' అనే పుస్తకంలో ఎడ్ల రామదాసుగారి ప్రస్తావన ఉంది.

పీఠిక లో రాసుకొన్నట్లు తాను విద్య విహీనుడైనా,సద్గురు కటాక్షం చేత కవిత్వ, వచన రచనలో ఒకధోరణికలిగి కొన్ని కీర్తనలు మరికొన్నితత్వాలు గద్య పద్యాలో సకల జనాహ్లాదకరంగా సులభ శైలిలో రాశాడు. సుజ్ఞాన చంద్రిక తోపాటు ఆయన శిష్యులు తాము రచించినవికూడా చేర్చి ;;యడ్ల రామ దాసు చరిత్ర "పేర పుస్తకం ప్రచురించారు. ఇది బాగా ప్రచారం లో ఉంది ఇందులో రాసిన శిష్యులు –బూచి అప్పలదాసు, చిట్టూరి నారాయణ దాసు, విత్తనాల కొండయ్య దాసు, వెంకటదాసు, బోని అప్పలదాసు బోని గవరయ్య దాసు మామిడి అప్పలదాసు కంచుమర్తి యల్లయదాసు, నాగన్న లు.

సుజ్ఞాన చంద్రికను యడ్ల రామ దాసు తన జీవిత చరిత్రగానే రాశాడు. హరికథా కథన శైలిలో, తోహరాలతో ఉత్తమ పురుష లో ఆత్మకథాకథన పద్ధతిలో రాశాడు

"అండపిండ బ్రహ్మాండ పురంబున నా గురు రూపము జూపెన్ –కుండలాగ్రమున మంతెన వెంకట గురుపై తానటియించెన్ –శ్రీకరమగు శ్రీకాకినాడ పురి దాపున జేరిన వాడన్ –ప్రాకటముగ యడ్ల రామదాసు తలవాకిటపై ప్రకటించెన్"

చంద్రికలో ఉన్నవి తత్వాలు మాత్రమేకాక, చాలాపాటలు కీర్తనల రూపం లో ఉన్నాయి. భజనపాటలు మేలుకొలుపులు, జోలపాటలు మంగళహారతులు, ఆంజనేయ దండకం, గోపీ కృష్ణ సంవాదం, గురుశిష్య సంవాద గేయాలు ఉన్నాయి. రంగనాథ వెంకటేశ్వర, రామ, కృష్ణ, వినాయక, త్రిపురసుందరి ఈశ్వర, నారాయణ రూప పరబ్రహ్మలపైకీర్తనలున్నాయి. కొన్ని పల్లవులు బాగా ప్రచారం లో ఉన్నాయి -1-ఈశ్వరా పరమేశ్వరాజగదీశ్వరా కరుణించరా, 2- జీవమా మేలుకొనవే –మేలుకొనవే వెర్రిజీవమ చాలు, 3-అనుమాన మేలకే మనకు ఈతనువు నిత్యముగాదు హంస,, 4-దీనిభావము తెలియవలేనన్నా నీలోను బ్రహ్మముపూని కనుగొనవలెను వినుమన్నా.

కృష్ణ లీలా సంకీర్తన –శ్రీరాగం –ఆదితాళం

"ఎన్ని మాయలు నేర్చినాడమ్మా నీ కొడుకన్నిటికి నెరజాణు డో యమ్మా "తేటతేటమాటలతో జీవాత్మ, పరమాత్మ సంబంధం ఎరుకపరచాడు. పరమాత్మ క్రీడా విలాసాలే బాలకృష్ణలీలలు -

"వ్యవసాయము జేసేవారము –ఈ అడవిలోపల కాపువారము –నవద్వార పురము వీధి వారము-నవనీత చోరుని భక్తపరులము -అండ పిండ బ్రహ్మాండము మేము మెండుగ పండించినారము – పుండరీకాక్షుని నామము ఈ పుడమి అంతట జల్లినారము "

అంటూ తత్త్వం లో భక్తిసాధన వ్యవసాయం తో పోల్చి నిగూఢమైన వేదాంత రహస్యాన్ని బోధించాడు.

నాదనామ క్రియ –ఆటతాలం

"ఈ ఊరికిదే దారికదా గురురాయలు తెలిపినదదే కదా –దారికి ఎదురై మూడు శునకములు దాటుచు మిక్కిలి మొరిగే కదా –ఎక్కువైన ఏకాక్షరి కుక్కల కెదురుకొనీ మదమణచె గదా "

గురు శిష్య సంవాదం –హిందూస్థానీ ఆటతాలం

శిష్యుడు –ఇలను సద్గురు సేవ చేసితే ఏమి ఫలితము గురువరా

గురువు-ఈ ధరను సద్గురు కృపను పరముకు దారిదొరకును శిష్యుడా

శి-పంచభూతములు ఏ స్థలమున సంచరించును గురువరా

గు-పంచభూతము లైదుగూడి ప్రపంచమాయను శిష్యుడా.

బాగా ప్రసిద్ధి చెందిన యడ్లవారి తత్త్వం –

సావేరి రాగం –ఆట తాళం

"ఏమి జన్మంటేమి జీవనమూ –ఈ మాయకాయము

ఏమి జన్మము మేమి శాశ్వత మేమి సౌఖ్య –మిదేమి నా ప్రారబ్ధకర్మము స్వామి నన్నిటు చేసి మరచెను. "

మూడు భాగాలుగా ఉన్న యడ్ల రామదాసుగారి "సుజ్ఞాన చంద్రిక "లో నుంచి కొన్ని కీర్తనలు –

గీ-చతుర్వేదముల ఫలశృతి –మతి నిను దలంచి, హితము మీరగ మోక్ష సతిని గూడి వ్రతము సలుపువాడు –అతడే పో ఆచలుండు –ధరను యడ్ల రామ దాస పోష.

"ముఖ్యమైనటు వంటి మోక్షమేదో దెలిపి మోక్షమొసగుమి వెంకటార్యా-"చక్కగా గురు సేవ సలుపు చుండు నీకు –సంప్రాప్తమవు రామ దాసా '

"సోహమెద్దియు వెంకటార్యా –అహం బ్రహ్మాస్మి యనునుచు –యజుర్వేదంబు దనరుచున్నది రామ దాసా "

"ఆచలపరిపూర్ణ బ్రహ్మము –క్రమము నొందుట దెల్పుము వెంకటార్యా –పంచ దశాక్షరిని పరికించు –ద్వాదశాక్షర భావమది రామ దాసా "

"వందనము నీకు గురువరా –చార్యమూర్తి –వందనము నీకు అక్షరాకార సూత్రి-వందనము సాంఖ్యతారక మనస్క జైత్రి –వందనము నీకు సదానంద మూర్తీ "

"అనాదియగు విఘ్నపతిని –చోద్యమలర హృదయైక వేద్యు నచట పూజింతు విమలమతిని –రాజ్యమున రాజ యోగ –రాజ్యంబు నందు "

"మ్రొక్కెద పద్మజు రాణికి –మ్రొక్కెద వాగీశ్వరికిని –మ్రొక్కెద మక్కువ తోడుత-గ్రక్కున మత్కావ్య సిద్ధి కలుగుటకై "

కీర్తన -మోహన రాగం –ఆటతాలం

" ఎందుబోయెద విందురావయ్యా –శ్రీ లక్ష్మీ రమణా-పొందుగా నన్నేలు కోవయ్యా "

యదుకుల కాంభోజి-ఆటతాలం

" గరుడా వాహన పరంధామా –నన్ను కరుణించ రావే శ్రీరామా –నరుల బ్రోచే దొరవు నీవని స్మరణ జేసెద –పరమ పురుష. "

మూడు భాగాల ఈ చంద్రిక కాకినాడ సుజన రంజని ముద్రాక్షర శాలలో 1898లో ముద్రింపబడింది. వెల –పావలా మాత్రమె. తత్వ వేత్త

"ఏమి జన్మము ఏమి జీవనము

ఈ మాయ కాయము ఏమి జన్మంటేమి జీవనము

ఏమి జన్మంటేమి జీవన ఏది సాధ్యతమేది సౌఖ్యము

ఏమి నా ప్రారబ్ధఖర్మము స్వామి నన్నిటు చేసి మరచెను

ఏమి జన్మంటేమి జీవనమూ...

దండిగా భూమండలంబున ఉండరుడకూడంగ శుక్లము

మెండుగాశోణితముపైవడ అండమై గర్భంబునుండయు

పిండ రూపము దాల్చెయుండుకదా

ఆ పిండ కోసము నిండు దినముల గండమేముగదా

అందున్నసమ తల్లిదండ్రులైనను తెలియబడదుగదా

పిండిగృహాలో నుండి తకధిమి గుండెలదరుచు దండమిడుగుని

నిండు తొమ్మిది నెలలు చూచిక ఉండలేనని జన్మమైతిని

ఏమి జన్మంటేమి జీవనము ఈ మాయ కాయము

ఏమి జన్మంటేమి జీవనము...

గర్భనరకము దాటి భువిలో

నిబ్బరంబుగా నిలుదమంటే

దుర్భరంబైనట్టు యాదులు గ్రొబ్బులను గ్రోళంగ ద్రోలుచు

నిబ్బరము నిముషంబు లేదు గదా

ఆ బాల ప్రాయము లాభలోభములెరుగదాయెగదా

వైరాగ్యతనమిది అబ్బురంబుగ రుచులకోరు గదా

ఏ భయాము లేకుండ తనకు అభయమొసిగే ప్రభువలెవ్వరు

శుభము జగము చూడబోము..

శుభము జగము చూడబోము శభాషరణభూశరణు చేసి

ఏమి జన్మంటేమి జీవనము

ఈ మాయ కాయము ఏమి జన్మంటేమి జీవనము

ఏమి చెప్పను యవ్వనంబున కోమలాంగుల మోము చూచిన

తామరసదర్భారులకుసః ప్రేమపుట్టికమానదయయు

తామరముకనుగొప్పచుండు కదా

ఆ సమయమున పరభామలెడ మమకారమిడునుగదా

మనమునను యిట ఒక భ్రమలచెందక కమలనేత్రిని పెండ్లియాడి

విమలమగు శుద్రాణవిడచి కుమారులనుగని భ్రమలుచెక్కెడి

ఏమి జన్మంటేమి జీవనమూ

పుత్ర మిత్ర కళాత్ర సందడి నేత్రమీసూత్రములతోగని

ధాత్రిలో భవబంధములకకి సూత్రముగ శుద్రాణవిడచి

పాత్రుడై పడయుండవలయుగదా

మొట్టమొదలోగిండ్లలో ఎత్తుగను మేడలను కట్టి

ఆ శక్తి నుండి...

ఆసక్తినుండిన వారు కొందరు వృద్ధులై వుత్తచేతులపోవుచుందురు...

యారివటవటదడావనికి కోరెకలు యెడబాయకుండెను

రారుతనవారెవ్వరెంటను రారువృద్ధాప్యారులైనను

ఏమి జన్మంటేమి జీవనము ఈ మాయ కాయము

ఏమి జన్మంటేమి జీవనము

జై శ్రీమద్రమారమణ గోవిందో హరి!"

చాలా అబ్బురపరచిన రచన. వేసిన ప్రాసలు గానీ, పదాల ఎంపికగానీ అద్వితీయం!

మనిషి కడుపులో పడిన దగ్గరనుంచి చివరి శ్వాస దాకా పడే తపనలన్నిటి గురించి చెప్పిన తత్వం ఇది.

## 72 రామ యోగి కవి -1825-1895

మార్కాపురం తాలూకా సుంకేసుల లో కాశ్యప గోత్రీకులైన విశ్వబ్రాహ్మణ దంపతులు పున్నోజు శేషయ్య వీరమ్మ లకు రామయ్య పుట్టాడు. అక్కడే చదివి, పండితుల వద్ద సాహిత్య ఛందో వ్యాకరణాలు జ్యోతిష గృహవాస్తు జలవాస్తు, శల్యవాస్తు విద్యలు నేర్చాడు. స్వర్ణ దారు శిల్ప కళలలో ఆరితేరాడు,. మంచి కవిత్వం రాసేవాడు. సజ్జన సాంగత్యం లో వేదాంత వాసనా అలవాటైంది. సుబ్రహ్మణ్య బ్రాహ్మణ గురువు వద్ద బ్రహ్మోపదేశం పొంది,మహానందిలో మూడు నెలలు కఠోర సాధన చేశాడు.

తడకనపల్లి స్థిరపడి, నిస్సంగం గా సంసారం ఈదుతూ అష్టాంగ యోగం లో నిష్ణాతుడై, బ్రహ్మ సాక్షాత్కారం పొంది, రాజయోగి అయి, వాక్శుద్ధి దూరదృష్టి,దూర శ్రవణం అలవడిసాహిత్య వేదాంత రాజయోగాలు శిష్యులకు బోధించాడు. మహా నందీశ్వరుడికి అంకితమిస్తూ చాలా గ్రంథాలు రాశాడు. వాటిలో శంకర శతకం, మహానంది లింగ శతకం, వేదాంత సూత్రాలు, షట్ స్థల దర్పణం,పంచరత్నాలు, నవరత్న మాలిక, శంభు శతకం, లింగ మూర్తి పాట,భ్రమరాంబా దండకం, రామతారక బ్రహ్మ శతకం, మహావాక్య ప్రకరణం, శుద్ధ రాజయోగం ఉన్నాయి. ముందుగానే శిష్యులకు చెప్పి 5-12-1895 మన్మథ మార్గశిర బహుళ తదియ గురువారం 70వ ఏట రామయోగి శివైక్యం చెందారు. తడకన పల్లి లో సమాధి చేసి లింగప్రతిష్ట మందిర నిర్మాణం చేశారు. మార్గశిర బహుళ తదియనాడు ఆరాధన రథోత్సవం వైభవం గా చేస్తారు.

## 73 సయ్యద్ అహ్మదలీ ఖాదర్ వలీ -1868-1948

నల్గొండ జిల్లా గొల్లపల్లి జాగీర్దార్ వంశం లో సయ్యద్ అహ్మదలీ ఖాదర్ వలీ 1868 లో జన్మించి తూగోజి అమలాపురం తాలూకా ముమ్మడి వరం మండలం కొత్తలంకలో 1948 సిద్ధి పొంది కొత్తలంక యోగి గా ప్రసిద్ధుడయ్యాడు. 1921 జనాభా లెక్కలప్రకారం ఆయన వయసు 125ఏళ్ళు. కనుక పుట్టింది 1796 గా భావిస్తారు. 1850 కుండలేశ్వర గ్రామం గౌతమీ నది ఒడ్డున మిఠాయి దుకాణం వద్ద మొదటిసారి గోచీతో కనిపించాడు. శరీరం తడవ కుండా గౌతమీ నదిని రెండు సార్లు దాటటం చూసి సిద్ధ పురుషుడుగా భావించారు.

రాజమండ్రి కోటి లింగాలవద్ద ఉండే కృష్ణావదూత వలీ గారి అనుగ్రహం కోసం పరితపించి సేవించి తరించారు. తన పరీక్షలో నెగ్గిన వారినే శిష్యులుగా తీసుకొనేవారు. శుభాశుభ ప్రశ్నలకు తేలికగా సమాధానాలు చెప్పేవారు. బ్రాహ్మణులతో సహా అన్ని వర్ణాలవారూ శిష్యులయ్యారు. ఖండయోగం ప్రదర్శించేవారు. రంగూన్ సైనికాధికారి ఆదేశం తో బ్రిటిష్ వారు దాడిచేస్తారని కాలజ్ఞానం చెప్పారు. కొబ్బరికాయలకు కొమ్ములు మొలిపించి ఆశ్చర్యపరచారు. 22-1-1948 మిలాది నబి మహమ్మద్ ప్రవక్త జన్మ దినం రోజున సర్వజిత్ పుష్య శుద్ధ ఏకాదశి గురువారం జీవ సమాధి చెందారు. ఆయన సమాధి వద్ద వరుసగా మూడు రోజులు నిద్ర చేస్తే సాక్షాత్కరించిన సంఘటనలు చాలా ఉన్నాయి. 1947 రాష్ట్రనాయకులు కళావెంకటరావు, బులుసు సాంబమూర్తి గార్లు వలీ గారిని దర్శించే నాటికి ఆయనవయసు 175ఏళ్ళు అని అంచనా. 1953లో సమాధిపై దర్గానిర్మించారు. దేశం నాలుగు మూలలనుం చేకాక కువైట్, పాకిస్తాన్ దుబాయ్ వంటి దేశాలనుంచి కూడా భక్తులు వచ్చి దర్గా సందర్శిస్తారు.

## 74 కవి యోగి ధేనువ కొండ వెంకయ్య -1851-1936

ప్రకాశం జిల్లా అద్దంకి  మండలం గార్లపాడులో ధేనువకొండ పిచ్చయ్య కనకమ్మలకు వెంకయ్య 1851లోపుట్టాడు. ధేనువకొండ వేణుగోపాలస్వామి భక్తుడు. వారసత్వంగా సంగీత సాహిత్యాలు అలవడినాయి.  తండ్రి అసంపూర్ణంగా రాసివదలిన “వామన పురాణం “యక్షగానం సమర్ధంగా పూర్తి చేసి తండ్రి మెప్పు పొందాడు. మేనత్తకూతురు కనకమ్మ ను పెళ్ళాడాడు.సంతానం కలగలేదు. నిరతాన్నదానం వలన ఆర్ధిక ఇబ్బందులేర్పడ్డాయి. సిరి సంపదలు సాధించాలని కాశీవెళ్లి మంత్రసిద్ధులను సాధించి పదేళ్ళ తర్వాత తిరిగి వచ్చాడు.



మంత్రోపాసన ధ్యానధారణ తోపాటు హరికథలు యక్షగానాలు రాశాడు. మొదటి రచన “విరాట పర్వం “జంగం కథ ను తన ఇష్టదైవం ధేనువకొండ వేణుగోపాలస్వామికి అంకితమిచ్చాడు. ఎరి నైనా సద్గురువు ను దీక్షితుడై యోగాధ్యయనం చేసి సేవించి, సన్యాసం స్వీకరించాలనే సంకల్పం తో కుర్తాళo వెళ్లి సిద్దేశ్వర పీఠం స్థాపించిన పీఠాధిపతి మౌనస్వామిని దర్శించి, శివ చిదానంద భారతీ స్వామిశిష్యుడై సన్యాస దీక్షను “శ్రీరామతారక బ్రహ్మనంద అవధూతేంద్ర సరస్వతి “దీక్షానామం పొందారు. తర్వాత తీర్ధయాత్రలు చేస్తూ అనంతపురం తాడిపత్రి చేరి, కరణం గారి తోటలో విడిది చేసి,లీలలు అద్భుతాలు ప్రదర్శిస్తూ, ఆదివ్యాధులను నయం చేస్తూ, జ్ఞానబోధ చేస్తూ జనాలను  సన్మార్గం లో పెట్టారు. 12-3-1936 యువనామ సంవత్సర ఫాల్గుణ బహుళ చవితి గురువారం 85వ ఏట కపాల చేదనం చేసుకొని కవియోగి,అవదూతేంద్ర సరస్వతి విశ్వ చైతన్యం లో కలిసిపోయారు. ఘనంగా ఆరాధనోత్సవాలు చేస్తారు.

మనకు తెలియని మహాయోగులు సమాప్తం

ఆధారం –మొదటి ఎపిసోడ్ లోనే తెలియజేసినట్లు “మనకు తెలియని మహాయోగులు “ధారావాహికకు ఆధారం –శ్రీకొత్తపల్లి హనుమంతరావు గారి రచన “మహా యోగులు”.

## 75 అఘోరీ బాబా

బదరీనాథ్ కు దగ్గరలో ఉన్న శ్రీనగర్ కు దగ్గర గంగానది ఒడ్డున ఒక శక్తి దేవాలయం దానికి దగ్గర్లో అఘోరీ బాబా గుహ ఉన్నాయి. అఘోర విధానం తాంత్రికమైనది అర్ధం చేసుకోవటం చాలాకష్టం. కొద్దిమంది యోగులకు స్వాములకు ఆమార్గంబాగా తెలుసు.అది గూడార్ధమైన  ఖగోళ శాస్త్ర సంబంధ రహస్య శాస్త్రం. దీన్ని

జబ్బులు నయం చేయటానికి వాళ్ళు ఉపయోగిస్తారు. జీవితంలోని అత్యున్నత స్థాయి శక్తులపై ఆధిపత్యం పొందటానికి చేసే సాధన. ఇది ప్రాణాయామం కంటే శ్రేష్ఠమైన మార్గం. ఈ జీవితానికి, తర్వాత దానికి మధ్య అది ఒక వంతెన లాటిది. అఘోరి శాస్త్రాన్ని చాలా కొద్దిమంది యోగులు మాత్రమే సాధన చేయగలరు. కానీ వారి విధానాలు విని తెలుసుకొని చూసి సామాన్యులు భయానికి గురౌతారు.



శ్రీనగర్ చుట్టు ప్రక్కగ్రామాల ప్రజలు అక్కడ గుహలో ఉన్న అఘోరి బాబా అంటే భయంతో హడలెత్తి పోతారు. ఆయన పేరు చెబితేనే "కార్చేస్తారు. ". అటువంటప్పుడు ఆయన దగ్గరకు వెళ్ళే సాహసమే చేయరు. ఒక వేళ ఆయన దగ్గరకు వెడితే బండ బూతులు తిట్టి, గులకరాళ్ళతో కొట్టి పంపిస్తాడు. ఇలాంటి అఘోరి బాబా ను చూడటానికి స్వామి రామా కాలినడకన వెళ్ళాడు. బాబా 6 న్నర అడుగుల పొడవు తో బలిష్టమైన శరీరం తో దాదాపు 75 ఏళ్ళ వయసుతో పెద్దగడ్డం గో నె తో నేసిన అంగోస్త్రం తో కనిపించాడు. గుహలో గోనె పదార్ధం తప్ప మరేమీ లేవు.స్వామిరామా తనతోపాటు స్థానిక పురోహితుడిని వెంట తీసుకు వెళ్ళాడు. ఆయన భయపడుతూ వణుకుతూ నే వచ్చాడు. బయలుదేరేముందు రామా తో "వీడు దొంగ సన్యాసి మురికి మనిషి. నువ్వు చూడదగిన మనిషి కాదు "అని హెచ్చరించాడు

ఇద్దరూకలిసి చీకటి పడే ముందు సాయంకాలానికి బాబా దగ్గర కు చేరారు. తనగుహకు గంగానదికి మధ్యనున్న ఎత్తైన రాయి మీద అఘోరి కూర్చుని కన్పించాడు. వీళ్ళిద్దర్నీ తనప్రక్కనే కూర్చోమన్నాడు. వెంటనే "నా వెనకాల నువ్వు నన్ను నానా బూతులు తిడతావు, ఇప్పుడు కపట వినయంగా చేతులు ముడిచి దండాలు పెడుతున్నావే ?"అన్నాడు పండిట్ ను తీవ్రంగా. కంగారుపడ్డ పండిట్ నెమ్మదిగా జారుకునే ప్రయత్నం చేస్తుంటే -"వెళ్ళద్దు. నదికి వెళ్లి నాకు మంచినీళ్లు కుండతో తీసుకురా "అని చెప్పగా వెళ్లి తెచ్చాడు. పండిట్ చేతికి మాంసం నరికే పెద్దకత్తి ఇచ్చి "నదిలోఒక శవం తేలుతోంది. వెళ్లి దాన్ని ఒడ్డుకు లాగి దాని తొడ, కాలి పిక్క మాంసాన్నికొన్ని కిలోలు నరికి నాకు తీసుకురా "అని ఆజ్ఞాపించాడు బ్రాహ్మణ పండితుడైన ఆయన జీవితం లో ఎప్పుడూ కలలో కూడా ఊహించనిపని. ఆయనతోపాటు స్వామి రామాకూడా వణికి పోయారు.. అడుగు ముందుకు వేయలేకపోయారు పండిట్.. అఘోరికి "ఎక్కడో"కాలిపోయింది. తీవ్ర స్వరం తో "నువ్వు వెళ్లి ఆ మాంసం తేకపోతే నేనే నిన్ను చంపి తినేస్తా. నీ ఇష్టం ఏం చేస్తావో చెయ్యి "అన్నాడు.

గత్యంతరం లేక పండిట్ వెళ్లి ఆ శవం లో కోరిన మాంసాన్ని ఖండించి, ఈ నరుకుడు అలవాటు లేనందున తన రెండు చేతి వ్రేళ్ళు తెగి రక్తం కారుతూ తీసుకొచ్చాడు. పండిట్ కానీ రామా కానీ సహజ స్థితి లో లేరు. పండిట్ దగ్గరకు రాగానే అఘోరీబాబా అతని తెగిన వ్రేళ్ళను తన చేతితో తడిమాడు. వెంటనే రక్తం కారటం ఆగిపోయి వ్రేళ్ళు బాగు పడ్డాయి. చిన్న మచ్చ కూడా కనిపించలేదు.

ఒక మట్టి కుండలో తెచ్చిన మాంసం ముక్కలు వేసి, పొయ్యి మీద పెట్టి ఒక చిన్న రాయిని మూతగా పెట్టమన్నాడు. అలానే చేస్తుండగా "ఒరే పంతులూ ! ఈ కుర్ర స్వామికి ఆకలిగా ఉందని తెలీదా నీకు నీకు ఆకలి వెయ్యటం లేదా ?"అని విరుచుకుపడ్డాడు. ఈ ఇద్దరూ 'బాబా మేము పూర్తి శాకాహారులం "అని గొణిగారు. దీనికి మళ్ళీ మండి పోయిన బాబా "నేను మాంసం తింటాననుకొన్నార్రా బడుద్దాయిలూ ?ఇక్కడి ప్రజలు అనుకొంటున్నట్లు నేను మురికి ముండా వాడిగా కనిపిస్తున్నానా?నేనూ శాకాహారినేరా భడవల్లారా "అన్నాడు. మరి ఈ వింత ప్రవర్తన ఏమిటో ఈ ద్వయానికి అర్ధం కాలేదు.. పదినిమిషాలు మాంసం ఉడికాక పండిట్ ను ఆకుండను తన దగ్గరకు తెమ్మన్నాడు. దగ్గరలో ఉన్న చెట్టు పెద్దఆకులు మూడు కోసుకురమ్మని భూమి మీద పరవమని వాటిలో కుండలోని మాంసం వడ్డించమని చెబితే బెంబేలెత్తుతూ పండిట్ యెంత కర్మ కాలిందిరా బాబూ అనుకొంటూ.. తర్వాత అఘోరి గుహలోకి వెళ్లగా పండిట్, రామా చెవుల్లో "ఇంత ఘోరం నా జన్మలో చూడలేదు స్వామీ. ఎలాంటి కులం లో పుట్టాను ఎలాంటి నీచమైన పని చేశాను ఇక నేను బతకటం వ్యర్ధం ""అంటే రామా "ఇక ముయ్యి. ఇక్కడినుంచి మనం తప్పించుకొనే వీలే లేదు. ఏం జరుగుతుందో చూద్దాం అన్నాడు. ఇంతలో బాబామూడు చిన్న మట్టి ముంతలు బయటికి తెచ్చాడు పండిట్ ను కుండలోని మాంసాన్ని ఆకుల్లో వడ్డించమన్నాడు.

పండిట్ కుండపై ఉన్న మూత తీసి చేతులు లోపల పెట్టి రామా ఆకులో వడ్డించగా ఆశ్చర్యం అది రసగుల్లా లు గా కనిపించింది. అది రామా కు అమిత ఇష్టమైన పదార్ధం బాబా గుహకు వస్తుండగా రసగుల్లా గురించి ఎందుకో ఆలోచన వచ్చింది స్వామిరామాకు. ఆయనకు కావాల్సిందే తయారైందన్నమాట. తెల్లమొహాలు వేసిన రామాతో అఘోరి "ఇది స్వీటే. మాంసంకాదు అనుమానించకుండా తినండి "అన్నాడు. ఇద్దరూ అతి రుచికరంగా ఉన్న రసగుల్లా లను చాలా ఇష్టంగా తిన్నారు మిగిలిన దాన్ని పండిట్ కు ఇచ్చి గ్రామం లో అందరికి పంచిపెట్టమని పంపాడు ఇదంతా హిప్నాటిక్ టెక్నిక్ అనిపించింది స్వామిరామా కు. రామా బాబా దగ్గరే ఉండి యోగ సాధన చేశాడు. మిగిలిన కధ తర్వాత.

రెండు గంటలు అఘోరీ బాబా వద్ద ధ్యానం చేశాక స్వామిరామా ఆయనతో మాట్లాడటం ప్రారంభించాడు. బాబా అత్యున్నత మేధావి అని అర్ధమయింది. ఆయన సంస్కృత భాష సంక్షిప్తంగా కఠినంగా ఉండేది అందుకని ఆగి ఆగి వివరించేవాడు. మహాజ్ఞాని అని తెలిసింది. తాను చూసిన సాధువులలో విచక్షణ సాధువని పించాడు.. అధర్వ వేదం లో అఘోర మార్గం ఉన్నది కానీ ఏ శాస్త్రం లోను మనిషి మాంసం తినమని లేదు. మీరు ఎందుకు ఇలాంటి జీవితం గడుపుతున్నారు "అని రామా ప్రశ్నిస్తే "అది మృత శరీరం అని ఎందుకు అనుకొంటున్నావు ?అది పనికి రాదని పార వేయబడిన పదార్ధం మాత్రమే. మీరు దాన్ని మనుషులకు ఆపాదిస్తున్నారు. ఎవరూ దాని జోలికి పోరుకానుక నేను ఉపయోగిస్తున్నాను. నేను ప్రయోగాలు చేసే శాస్త్ర వేత్తను.. పదార్ధం దాని శక్తికి మధ్య ఉన్న సంబంధాన్ని గురించి తెలుసుకొనే ప్రయోగం చేస్తున్నాను ఒక రూపం లో ఉన్న పదార్ధాన్ని మరొక రూపం లోకి మారుస్తున్నాను, నాకు ప్రకృతే మాత. ఆమె అనేక రూపాలు

సృష్టిస్తుంది. నేను రూపాలను మార్చే ప్రయోగాలు చేస్తూ ఆమె బాటలోనే నడుస్తున్నాను. దీన్ని ఇందాక ఎందుకు చేశానంటే పండిట్ పెళ్లి ఊళ్ళో వాళ్ళని ఇక్కడికి రాకుండా హెచ్చరిస్తాడని మాత్రమే. ఈ గుహలో 21 ఏళ్ళనుంచి ఉంటున్నాను. ఇంతవరకు ఎవ్వరూ వచ్చి నన్ను చూడలేదు. నా రూపం చూసి ప్రజలు భయపడతారు. నేను మురికి పంది నని మృత కళేబరాలను పీక్కు తింటానని అనుకొంటారు. నేనెవరికీ అపకారం చేయలేదు గులకరాళ్ళతో బెదిరించానే కానీ ఎవ్వర్నీ గాయ పరచలేదు". అన్నాడు




బాబా బాహ్య రూపం భయంకరం అంతర రూపం సౌందర్యమయం అని పించింది. తనదగ్గరికి వచ్చి ప్రశాంతతకు భంగం కలిగించకుండా అలా ప్రవర్తిస్తాడు. ఆయన స్వాస్థ్యము తప్పినవాడు కాదు. ఎవరిపైనా ఆధారపడకుండా జీవించే స్వతంత్రేచ్ఛ ఉన్నవాడు. ఆ రోజు రాత్రంతా బాబా అఘోర మార్గాన్ని స్వామి రామాకు వివరించి చెప్పాడు. పదార్థాన్ని అనేక రూపాలలోకి మార్చే సమర్ధుడు ఆయన. రాయిని పంచదార స్పటికం చేయగలడు. మర్నాటి ఉదయం ఇలాంటి అద్భుతాలెన్నో చేసి చూపించాడు. అక్కడ ఉన్న ఇసుకను తాకమన్నాడు తాకితే జీడిపప్పు బాదం పప్పుగా మారింది. ఇందులో శాస్త్రీయ సిద్ధాంతాలున్నాయన్నది కాదనలేని సత్యం.

మధ్యాహ్నం మళ్ళీ నిన్నటి పదార్థం కాకుండా కుండ లో నుంచి మరొక తీపిపదార్థం బయటికి తీసి తినిపించాడు. ఈ తంత్ర విద్య గురించి అడిగితే "ఈ శాస్త్రం నశించిపోతోంది. పండితులు దీన్ని అభ్యాసం చేయటం లేదు. కొద్దికాలానికి ఇదికాలగతి లో కలిసి పోతుంది "అని నిర్వేదం ప్రకటించాడు అఘోరీబాబా..

"ఇలాంటి ప్రయోగాలవలన ఉపయోగం ఏమిటి ?"అని అడిగితే "ఉపయోగం అంటే ?అని ప్రశ్నించి "ఇది సైన్స్. ఈ సైన్స్ తెలిసిన సైన్టిస్ట్ ఈ విజ్ఞానాన్ని రోగ నివారణకు ఉపయోగిస్తాడు. ఇతర సైన్టిస్ట్ లకు పదార్థాన్ని శక్తిగా శక్తిని పదార్థంగా మార్చవచ్చునని తెలియ జేయాలి.. ఈ రెండిటికి ఉన్నది ఒకే సూత్రం. అన్ని పేర్లు రూపాలకు అంతర్గతం గా ఏకీకృత సిద్ధాంతం ఉన్నది, దీన్ని ఆధునిక శాస్త్ర వేత్తలు ఇంకా కనిపెట్టలేక పోయారు.. ఈ అంతర్గత జీవిత సిద్ధాంతాన్ని ప్రాచీన సైన్స్ అయిన వేదాంతం స్పష్టంగా చెప్పింది. ఉన్నది ఒకే ఒక ప్రాణ శక్తి అన్ని నామాలు రూపాలు దాని విభిన్న శక్తులే. రెండుపదార్థాలమధ్య సంబంధం తెలుసుకోవటం కష్టమేమీ కాదు కారణం వాటిలోమూల ద్రవ్య రాసి ఒక్కటి కనుక.. నీరు గడ్డకట్టి మంచు అవటం వేడిచేస్తే ఆవిరి అవటం లాంటిదే.. చిన్నపిల్లలకు ఇవి వేర్వేరు పదార్థాలనిపిస్తాయి. కానీ వాటిలోని కూర్పు -కంపొజిషన్ ఒకటే.. రూప భేదమే.ఇవాళ్టి సైన్టిస్ట్ లు అలాంటి పిల్లలే. వాళ్లకు పదార్థం వెనుక ఉన్న ఐక్యత అర్ధం కాదు. వాటిని ఒకదానిలోనుంచి మరొక దానిలోకి మార్చే సూత్రాలూ తెలియవు. " స్వామి రామాకు తెలుసుకోదగిన పదార్థమంతా తెలిసింది. ఆయన దగ్గర సెలవు తీసుకొని దగ్గర గ్రామానికి చేరి పండిట్ భయం పోగొట్టాలని అనుకోని ఆయన్ను కలిస్తే పండిట్ తానూ అఘోరీ బాబా మార్గదర్శనం నచ్చి, ఆయన శిష్యుడనవుతున్నానని చెప్పగా స్వామి రామా అవాక్కయ్యాడు.



అఘోరీల కుల దేవత "హింగ్లా జీ మాత "వీరి ముఖ్యకేంద్రం వారణాసి లోని కీనా రామ్ ఆశ్రమం. దీనిపూర్తిపేరు బాబా కీనారం స్థలం. వీరి విశ్వాసం ప్రకారం బాబా సిద్దార్ధ నాధ గౌతమ్ మళ్ళీ కీనారామ్ గా జన్మించాడని. వీరు సాధారణంగా స్మశానం లో సంచరిస్తారు. శవాల చితాభస్మాన్ని ఒంటినిండా పూసుకొంటారు చనిపోయిన మానవ శరీరం లోని ఎముకలను కాపాలాలనుసేకరిస్తారు. కపాల మాల ధరిస్తారు. వీరి సంఖ్య 70 అని గణాంక శాస్త్ర వేత్తలు లెక్కించి చెప్పారు

## 76 మచిలీ బందరు యోగి శ్రీ రంగావదూత

మచిలీ పట్నం అనే బందరులో శ్రీ వామ గోత్రం లో సుబ్బయ్య గారు మహాపుణ్యుడు బుద్ధిమంతుడు. ఆయనకు 1870లో జూన్ నెల ఏకాదశి జయవారం నాడు రంగ అనే శిశువు జన్మించాడు. పుట్టుకతోనే భక్తి అలవడింది. సత్యాహింసలు శాంతి అహింసలు మహామతిత్వం వంటి సుగుణాలు అబ్బాయి. క్రమంగా జ్ఞానవికాసమూ కలిగింది. ఎనిమిదవ ఏట బడికి పంపారు. శ్రద్ధగా విద్య నేర్చాడు. సాయంకాలం బడి వదిలి ఇంటికి వచ్చి స్నేహితులతో కలిసి భక్తితో ఇంట్లోభజనాలు చేసేవాడు. ఇంటిలోని దేవతా విగ్రహాలను అత్యంత అందంగా అలంక రించే వాడు. చుట్టుప్రక్కలవారు ఆతని భక్తి భజలకు ముచ్చటపడేవారు. తోటిపిల్లలతో ఆటలు ఆడే వాడు కాదు ఇదే అతడిలోకం. జీతం కట్టమని డబ్బు ఇచ్చి పంపిస్తే దారిలో బీద సాదలను చూసి జాలితో ఆడబ్బు వారికిచ్చేవాడు. బడికి వెళ్ళకుండా తిరిగి వచ్చేవాడు. షావుకారు కొట్లో సరుకులు తెమ్మనమని డబ్బు ఇచ్చి పంపినా ఇలాగే దాన ధర్మాలు చేసేవాడు.స్నేహితులను "ఒరే "అని

పిలవకుండా "అయ్యా "అని మర్యాదగా పిలిచే సంస్కారం అతడిది. ఒకపూట మాత్రమె బడికి వెడుతూ మధ్యాహ్నమంతా మనసంతా పరమాత్మపై లగ్నం చేస్తూ గడిపేవాడు. కొంతకాలానికే బడిలో చెప్పే విద్యలు అస్థిరాలు అనే భావం మనసు నిండా పెరిగిపోయి ఆసక్తి పూర్తిగా తగ్గింది.



బందరులోని పెద్దవారిళ్ళ వెళ్లి అక్కడ జరిగే సద్గోష్టి లో పాలుపంచుకొంటూ, తనకు తోచిన ఆముష్మిక విషయాలు వారికి చెబుతూ, పు ణ్యాత్ముడు గా కీర్తి గడించాడు. క్షమ శాంతం మొదలైన సద్గుణాలతో శోభిల్లాడు రంగడు. దైవపూజ చేస్తూ స్త్రీలను తల్లులుగా భావిస్తూ, సర్వభూత దయతో, ప్రాపంచిక భావన లేక కామక్రోధాదులకు దూరమై, ఘన భవ్యమూర్తి అయ్యాడు. వీరింటికి కొంచెం దూరం లో చందమ్మ అనే ఒక పుణ్య స్త్రీ ఉండేది. ఊరివారందరికీ సోదరిలా ఉంటూ శాంతమూర్తిగా, సద్గుణ రాశిగా,భక్తి ప్రపత్తులతో గడిపేది. ఆమెసుచరిత్ర అందర్నీ ఆకర్షించేది. ఐదో ఏడునుంచేదైవ భక్తి అబ్బింది. దేవతాబొమ్మలను చేసి చుట్టుప్రక్కల పిల్లలను పిలిచి పూజలు చేస్తూ, సత్యాహింసలు శమ దమాలతో ఈర్ష్య అసూయలు లేకుండా సాధ్వీ మణిగా ప్రసిద్ధి చెందింది. ఆమె భక్తికి రంగడు ఆకర్షిప బడి చందమ్మగారే తన గురువు అని మనసులో నిశ్చయంగా భావించాడు. వారింట్లోనే భజలలు పూజలు చేస్తూ ప్రసంగాలు వింటూ చేస్తూ చందమ్మ, రంగ తల్లీకొడుకుల్లాగా ప్రవర్తిం చారు. రంగని జ్ఞానభక్తి వైరాగ్యాలకు చందమ్మఅతడే తన గురువుగా భావించింది. ఇలా వైరాగ్యభావం తో ప్రవర్తిస్తున్న రంగనికి పెళ్లి చేయాలని తలిదండ్రులు భావిచారు.

నిర్మలమనసు తో ఉంటున్న తనకు వివాహ బంధం వద్దని గట్టిగా చెప్పాడు రంగ. చాలా మందిపెద్దలతో చెప్పించారు కానీ అతడి మనసు మారలేదు.రంగడు పరమ పావనుడు అని అందరూ తలిదండ్రులకే చెప్పారు. ప్రయత్నాలు విరమించి మనసుకు సమాధాన పడి,ప్రశాంతంగా ఉన్నారు వాళ్ళు. క్రమక్రమగా రంగని వైరాగ్య దృష్టిపెరిగి ఇహలోకసంబం దాలు దూరమై జ్ఞానిగా మారి. మౌనం పాటిస్తూ, తన సత్ప్రవర్తనతో తలిదండ్రుల మనసుమార్చి మౌనం తోనే జ్ఞానబోధ చేస్తూ మహావిరాగియై భాసిల్లాడు. ఇంట్లో వారికి బయటివారికి తేలిక మాటలతో జ్ఞానం బోధించి వివేకం కలిగించే జీవితానికి అర్ధం, పరమార్ధం బోధించాడు. తలిదండ్రులు తీర్ధయాత్రలు చేసి పుణ్యం మూటకట్టుకోవాలని భావిస్తే వారితో "తీర్ధయాత్రల వలన లాభం లేదు. ధనం శ్రమఖర్చే. దానిబదులు దాన ధర్మాలు చేయండి "అని మాన్పించి,బీద సాదలను ఆడదుకోనేట్లు చేశాడు. గురువు చందమ్మ దేహం చాలించింది. ఆమెకు చాలాభక్తిశ్రద్ధలతో ఉత్సవాలు జరిపించాడు రంగ. ఆమె భక్తి జ్ఞాన వైరాగ్యబోధలను లోకంలో ప్రచారం చేశాడు. నిస్సంగంగా జీవిస్తూ, ఐహికాలకు దూరమై మనసంతా దైవమె గా జీవిస్తూ నియమనిష్టలతో గడుపు పరమ విరాగియై, అవదూతత్వం పొంది రంగ" శ్రీ రంగావదూత" గా పరిపర్తనం చెంది బందరు పురజలనకు జ్ఞాన మార్గదర్శి అయ్యారు.

ఇంతవరకే ఉంది ఆయన ఎప్పుడు సమాధి చెందారో వివరాలు రాయలేదు. ఎవరికైనా తెలిస్తే తెలియ జేయండి.

శ్రీ రంగావదూత జ్ఞానబోధ –కన్నులు లేనివారికి సూర్యుడు కనిపించనట్లే అజ్ఞానికి భగవంతుడు కనిపించడు.ముత్యాలకోసం సముద్రం లోదిగే వాడు చాలా కష్టపడి వాటిని సాధించినట్లే దేవుడిగురించి అంతకష్టపడి సాధన చేస్తేనే ఆతత్వం తెలుస్తుంది.బంగారాన్ని యెంత జాగ్రత్తగా కాపాడుతారో దేవుడినీ అంటే జాగ్రత్తగా కొలవాలి. పరిపూర్ణ శుద్ధమనసే శాంతి కలిగిస్తుంది. మనసే దైవం అనే భావం రావాలి. సాటిమనుషుల కష్టసుఖాలలో పాలు పంచుకోనేనే దైవం మెచ్చుకొంటాడు. ధ్యానసమయం లో మనసు అత్యంత పరిశుద్ధంగా ఉండాలి. ప్రపంచ సుఖాలు శాశ్వతం కాదు. శరీరం అశాశ్వతం ఆత్మమాత్రమే శాశ్వతం బంధాలను తొలగించుకోవాలి సాధనద్వారా.

ఆధారం –బెజవాడ పురవాసిని జ్ఞాని,యోగిని శ్రీమతి జ్ఞానమాంబ గారు పద్యాలలో రచించిన "శ్రీ రంగావదూత ల వారి దివ్య జీవితము, జ్ఞానబోధ". ఈ పుస్తకం 1909 లో బందరుకు చెందిన భైరవ ముద్రాక్షర శాల ప్రచురించింది. జ్ఞానమాబ గారి వివిధ ఛందస్సులలో పద్యాలు ద్రాక్షాపాకం తో లలితలలిత పదాలతో


శ్రీ జ్ఞానమాంబ.

సకలజనులకు కూడా వేదాంత విషయాలు సుబోధకమయ్యే ట్లు రాశారు. అవధూత గారిదివ్య చరిత్రను లోకానికిఅందించారు. ఈపుస్తకం లేకపోతే రంగావదూత గురించి ఎవరికీ తెలిసి ఉండేదికాదేమో. జ్ఞానమాంబ గారి రసగుళికలవంటి కొన్ని పద్యాలు చూద్దాం –

అవధూత జీవిత చరిత్ర -78 పద్యాలు

"ధరలో సాగర తీరమందు శుచియై ధారాళమై యొప్పుచున్ –చిర రూఢిన్ మచిలీ పురంబనగా

"గోత్రంబొండు వీకాసమై "శ్రీ వామమ్మన వెల్గు "

"ఆ వంశంబున నుద్భవించె ఘనుడౌ సుబ్బయార్యుండు "

"అవతరించే విమల సచ్చరితుడు తమమనియెడు అంధకార మడప నర్కుండు ధరలోని దివ్యమూర్తి జగదతీతుడరయ

"రంగ యను నామంబున"

"చందమ్మను నభిదానము-నం ధాత్రిని విదితమైన నవ గుణములతో "

"రుతమున హింసయున్ దయాయు రోషము లేనటు వంటి మానసం బతులిత భక్తిశ్రద్ధలును "

"ఘనమై సద్గుణ ఖనియై మెలగ నా కాంతా లలామప్రావ-రత్నముల్ గాంచి మహాత్మా యంచు దనలో దా "రంగ యార్యుండు"ఎం-చి నయంబౌ గణవార్ధి నా విమలియే శ్రీ మద్గురు శ్రేష్టమం-చును నీ ధీమతియందు భక్తి గలుగన్ స్తుత్యుండు బాగొప్పగా "

"జననీ పుత్రుల మాడ్కి నీ మహితునిన్ చందమ్మ యత్యంత ప్రేమను జూచున్ "

"నాకు వివాహమే వలదు నైర్మల మానసు తోడ నుందు"

పరోపకార బుద్ధితోడ బాగు మీర నీతడున్ -సరళలమొప్పగాను తాను చక్కగాను"

"అనఘు డీ మహనీయుడజ్ఞానమును బాపు జ్ఞాన బోధనంబులు పెక్కు లీ ధరిత్రి "

అవధూత జ్ఞానబోధామృతం-135పద్యాలు

"కన్నులు లేనివారు దివి గాంచగ లేక దివాకరుండు లేడన్న విధంబుగా "

"అగణిత భక్తి చే భగవదర్చన జేయుచునిర్మలాత్ములై "

"అంగా రమ్ముల నేగతి- బంగారము నే విధముగా భావింతురోయా -భంగిని లోకము పైనను –మంగళ కరుడగు దేవు నెదను మది నుంచ వలెన్ "

"తనమనసే దేవు నెడంగ భక్తిం గలిగి యుండు గాంచగా నా దే దేవుని నేల్లవేళ నారాధానము జేయుచు నుండవలయు "

"అర్ధము పర సౌఖ్యంబును –వ్యర్ధము గావించి "

"సంసారంబే శత్రువు –సంసారంబదికమైన సంతాపంబు "

"ధర నెలతల మాతల వలె-విరివిగా పురుషుల జనకుల విధి దలచి మదిన్ "

"స్వాంతము మాయయే మాయయే స్వాంతము "

"శంక రహిత సుఖ మొదవున్ "

"వేదాన్తులరము మాకే బాధలును లభించ వెటులవర్తించిన గా –నీ ధాత్రి ననెడు దుష్టులు-వేధనలే పొందగలరు వేగిరమే మదిన్ "

"దర్పణంబున దేహ మమెల్లయు ధాత్రి గన్పడు రీతి "

"ఎన్నటికిని ఆకాశము –పన్నుగ బ్రహ్మంబు గాదు-చిన్నెలు లేనిదే బ్రహ్మము "

"పరము కరతామలకమే "

"దేవుం డగు తానె మది-జీవుడుగా దోచు చుండు శీత కరుడు –మట్టే విడిపోయిన ఎదలన్ –భావింపగా చంద్రు డనగ బయలు పడునుగా "

## 77 శ్రీ మాణిక్య ప్రభు మహారాజ్

శ్రీ మాణిక్య ప్రభు మహారాజ్

నిజాంపాలనలో హైదరాబాద్-కర్నాటక ప్రాంతం లో ప్రస్తుతం కర్నాటక రాష్ట్రం లో బసవ కళ్యాణ్ తాలూకా లాడవంతి గ్రామం లో దైవ భక్తి పరాయణులైన మనోహర నాయిక్ –బయమ్మ దంపతులకు 1817 మార్గ శిర శుక్ల చతుర్దశి అంటే దత్తాత్రేయ జయంతి నాడు శ్రీ మాణిక్య ప్రభువు జన్మించారు, వీరి తలిదండ్రులకు శ్రీరామనవమి నాడు దత్తత్రేయులు స్వప్నంలో దర్శనమిచ్చి తాము వారి కుమారులుగా జన్మిస్తామని ముందే తెలియ జేశారు,




మాణిక్ గారి బాల్యం కళ్యాణ్ లో మేనమామ గారింట గడచింది, పరిసర అరణ్యాలలో మిత్రులతో ఆడుకోవటం గోవిందుడు అనే స్నేహితుడు మరణిస్తే బ్రతికించటం, సంతానం లేని భీమాబాయికి 8 గవ్వలు ఇచ్చి సంతాన ప్రాప్తి కలిగించటం బాల్య క్రీడలుగా మాణిక్ ప్రభు చేసి ఆశ్చర్య పరచారు, వీటివలన దైవాంశ సంభూతులుఅనే నమ్మకం ప్రజలలో కలిగింది, ఏ పనీ చేయకుండా తిరుగుతున్న మేనల్లుడిని మేనమామ 16 వ ఏట మందలిస్తే, గోచీ గుడ్డతో ఇల్లు వదిలి తీర్ధ, క్షేత్ర సందర్శనం చేస్తూ అనేకమంది శిష్యులకు ప్రేరణ కలిగించి ప్రసిద్ధ గురువులుగా పేరుపొందారు,

### హుమ్నా బాద్ లో సంస్థాన స్థాపన

ఒక సారి పల్లకి లో మాణిక్ ప్రభును శిష్యులు మోసుకొని వస్తూండగా హుమ్నా బాద్ దగ్గర రెండు చెట్ల మధ్య పల్లకి ఇరుక్కు పోయి ఆగి పోయింది, ఆ ప్రదేశమే తమ శాశ్వత ఆవాస క్షేత్రం గా దైవం నిర్ణయించాడని భావించి అక్కడే పర్ణశాల తయారు చేయించి ఉండిపోయారు, ఈ ప్రదేశం విరజా –గురుగంగా నదులపవిత్ర సంగమ క్షేత్రం, అప్పుడు ఘోర అరణ్యం, కారడవి, నిర్జన ప్రదేశం, ప్రభు రాకతో జనసమ్మర్దం పెరిగింది, క్రమంగా "మాణిక్ నగర్ "గా సుప్రసిద్ధ పుణ్య క్షేత్రం గా రూపు దాల్చింది.ఇక్కడే స్థిరం గా ఉన్న శ్రీ మాణిక్య ప్రభు మహారాజ్ భక్తుల మనోభీష్టాలు నెరవేరుస్తూ, అందరి అభిమానంసాధించారు, 1865 మార్గ శిర శుద్ధ ఏకాదశి –ముక్కోటి ఏకాదశి –గీతాజయంతి నాడు 48 వ ఏటనే సంజీవినీ మహా సమాధిలో లీనమయ్యారు,

ఆజన్మ బ్రహ్మ చారి అయిన మాణిక్ ప్రభు మధుకరి అంటే భిక్షాటనం చేస్తూ దానినే మహా ప్రసాదం గా భుజించేవారు, "రాజయోగి" గా కీర్తి గడించారు, వారిసంస్థాన వైభవం కనుల పండువుగా ఉండటం చేత "రాజాధిరాజ "అని కీర్తించబడే వారు, ఎందరెందరో పండితులుకవులు కళా కారులు మాణిక్ ప్రభు దార్బార్ లో తమ విద్యను ప్రదర్శించి విశేష గౌరవ సత్కారాలు పొందేవారు, బీద ప్రజలకు, అనాధలకు లెక్కలేనంత ధనాన్ని మాణిక్ ప్రభు దానం చేశారు.

### షిర్డీ బాబా అక్కల్ కోట్ ప్రభు ల దర్శనం

మాణిక్ ప్రభు సమకాలికులే శ్రీ షిర్డీ సాయిబాబా, స్వామి సమర్ధఅనే అక్కల్ కోట మహారాజ్ మొదలైన ప్రముఖులు, వీరందరితో మాణిక్ ప్రభుకు గాఢమైన మైత్రీ బంధం ఉండేది, షిర్డీ సాయి షిర్డీ కి చేరకముందు 13 ఏళ్ళ వయసులోఫకీరు వేషం లో మాణిక్ ప్రభు దర్శనానికి వచ్చారు, ప్రభు సోదరుడు తాత్యా మహారాజ్ ద్రవ్యం ఎంత వేసినా కూడా బాబా చేతిలోని "లోటా" (డబ్బా ) నిండలేదు, సోదరుడిని మందలించి ప్రభు ఆ డబ్బాలో 5 ఖర్జూర కాయలు వేయగానే అది నిండిపోయింది, అప్పుడు బాబా తనకు ప్రభు ప్రసాదమైన అయిదు ఖర్జూర పండ్లు చాలునని వాటిని తీసుకొని లోటాను బోర్లించగా దాంట్లో ఉన్నదానికంటే ఎన్నో రెట్ల ద్రవ్యం కుప్పగా పడింది.

అక్కల్ కోట్ ప్రభు సమర్ధ కూడా మాణిక్ ప్రభు దర్శనానికి వచ్చి ఆధ్యాత్మిక చర్చలను రహస్యంగా జరిపేవారు, అక్కల్ మహారాజు తాముకూడా ఇక్కడే ఉంటామని అంటే "ఒక వృక్షం నీడన మరో వృక్షం పెరుగదు "అని చెప్పి అక్కల్ కోట్ లో స్థావరం ఏర్పాటు చేసుకోమని హితవు చెప్పారు,

**సర్వ మత సమాదరణం**

"ఏకం సత్ విప్రా బహుధా వదంతి "అనే ఉపనిషత్ వాక్యం ఆధారంగా మాణిక్ ప్రభు హిందూ ముస్లిం సిఖ్ మొదలైన మతాలవారినీ సమాదరించి అందరిహృదయాలలోస్థిర స్థానం పొందారు, అన్నిమతాలవారు మాణిక్ ప్రభులో తమ ఇష్ట దైవాన్నిదర్శిన్చిఅనుభూతికి లోనయ్యేవారు,

**మహా సంస్థాన వారసులు**

మాణిక్ ప్రభుఅనంతరం ఆయన సోదరుని కుమారుడు శ్రీ మనోహర మాణిక్ ప్రభు, తరువాత శ్రీ మార్తాండ మాణిక్ ప్రభుపీఠాధి పతులయ్యారు, ప్రభు సంప్రదాయాన్ని ఆ సేతు హిమాచల పర్యంతం వ్యాపింప జేశారు, పిమ్మట మార్తాండ మాణిక్ సోదరి కుమారుడు శ్రీ శంకర్ మాణిక్య ప్రభు, తర్వాత ఆయన పుత్రుడు శ్రీ సిద్ధ రాజ మాణిక్ ప్రభు పీఠాధిపతులయ్యారు, వీరంతా సంస్థానంద్వారా విద్య, ఆధ్యాత్మిక, సామాజిక సేవలు విస్తృతంగా చేశారు, సిద్ధరాజ్ 2009లో సిద్ధిపొందగా షష్టమ పీఠాధిపతిగాశ్రీ జ్ఞానరాజ్ మాణిక్ ప్రభు కొనసాగుతున్నారు, సంస్థానం సర్వతోముఖాభి వృద్ధి చెందుతోంది, జ్ఞానభాస్కరులైన వీరి తత్వ జ్ఞానానికి గుల్బర్గా యూని వర్సిటి డాక్టరేట్ బిరుదునిచ్చి సత్కరించింది,

**విశేష కార్యక్రమాలు**

మాణిక్య ప్రభు ప్రారంభించిన దాన విద్యాది దానాలు నిరంతరం అవిచ్చిన్నంగా కొనసాగుతున్నాయి, మార్తాండ మాణిక్, శంకర మాణిక్ ప్రభుల పుణ్య తిధుల రోజుఫాల్గుణ మాసం లో "వేదాంత సప్తాహం "అనే వేదాంత, సంగీత ఉత్సవం ప్రతి ఏడాది నిర్వహిస్తారు, మార్గ శిరమాసం లో వచ్చే మాణిక్ ప్రభు-దత్త జయంతిని పెద్ద ఎత్తున చేస్తారు, 5 రోజులు విశేష పూజ ఉంటుంది,, చివరి రెండు రోజులైన పౌర్ణమి పాడ్యమి, నాడు వేలాది మందిభక్తులు మాణిక్ ప్రభు సిద్ధి పొందిన సమాధిని దర్శించి పునీతులై, "భండారు ఖానా "లో అన్నప్రసాదం స్వీకరిస్తారు, దర్బార్ హాల్ లో కళాకారులుతమ విద్యను సేవా దృక్పధం తో ప్రదర్శిస్తారు,

**మాణిక్ ప్రభుసమాధి**

మాణిక్ ప్రభు దివ్య సమాధి రధాకార మందిరం లో పాలరాతితో నిర్మించబడింది, ఆధ్యాత్మిక ప్రశాంతతకు చాలా తోడ్పడుతుంది,

**వసతి సౌకర్యాలు**

భక్తుల, యాత్రికుల సౌకర్యం కోసం మార్తాండ విలాస్, మాణిక్ విహార్, శంకర కృప మొదలైన అతిధి గృహాలను సంస్థాన్ నిర్వహిస్తోంది, ప్రతి రోజు మధ్యాహ్నం ఒంటి గంటకు మహా ప్రసాదం అందజేస్తారు.

**మాణిక్ ప్రభు ద్విశత జయంతి**

2017 మార్గ శిర శుద్ధ చతుర్దశి –దత్త జయంతికి శ్రీ మాణిక్య ప్రభు జన్మించి 200 సంవత్సరాలు అవుతున్నందున"ద్విశత జయంతి "ని భారీగా ఉత్సవాలు, వేదాంత, సంగీత సభలు నిర్వహిస్తున్నారు, అందరు తప్పక దర్శించి స్ఫూర్తి పొందాల్సిన క్షేత్రం శ్రీ మాణిక్య ప్రభు క్షేత్రం, "సంతత ధార-శివ లింగం "ను ఇక్కడ నెలకొల్పే ప్రయత్నాలు వేగవంతంగా జరుగుతున్నాయి,

**ప్రభు సంస్థాన్ కు దారేదీ ?**

హైదరాబాద్ నుంచి బొంబాయి జాతీయ రహదారిపై 160 కిలో మీటర్ల దూరం లో ఉన్న హుమ్నాబాద్ కు ఒక కిలో మీటరు దూరం లో మాణిక్ ప్రభు సంస్థాన్ ఉన్నది, బీదర్, గుల్బర్గా, సోలాపూర్ లనుంచి బస్ సౌకర్యం ఉంది. హైదరాబాద్ –ముంబాయ్ రైల్ మార్గం లో గుల్బర్గా స్టేషన్ లో దిగి, బస్ పై 65 కిలోమీటర్ల దూరం లో ఉన్న సంస్థాన్ కు చేరుకో వచ్చు,

**మాణిక్య ప్రభు సంస్థానం –సేవలు**

స్థానికులు మాణిక్ ప్రభు అని గౌరవంగా సంభావించే మాణిక్య ప్రభువు విద్యాదానం లో, అన్నదానం లో సాటిలేని వారనిపించారు, ప్రతి రోజూ వందలాది భక్తులకు అన్నప్రసాదంఅందజేస్తోంది సంస్థానం, వేద రక్షణ కోసం వేద పాఠ శాల నిర్వహిస్తోంది, 100 మంది విద్యార్ధులు ఉచితంగా వేద విద్య ఇక్కడ అభ్యసిస్తున్నారు, ఇది 8 సంవత్సర కాల పరిమిత విద్య, ఇక్కడ వేద విద్యలోసుశిక్షితులైన వారు దేశ విదేశాలలో కీర్తి పొందుతున్నారు, వెనుకబడిన తరగతుల విద్యార్ధులకోసం వసతి గృహం నడుపుతున్నారు, అనాధల కోసం మాణిక్యప్రభు అనాధ శరణాలయం, అందులకోసం మాణిక్య ప్రభు అంధ విద్యాలయం బ్రెయిలీ ట్యూటర్ వంటి ఆధునిక పరికరాలతో నిర్వహిస్తున్నారు, మాణిక్య ప్రభు సంగీత విద్యాలయం లో వందలాది విద్యార్ధులు సంగీతం నేర్చి రాణిస్తున్నారు, వీటి నన్నిటిని మాణిక్య ప్రభు శిక్షణ సమితి సమర్ధ వంతంగా నిర్వహిస్తోంది,

గ్రామ స్థాయిలో కూడా విద్యార్ధులకు ఆధునిక విద్య అందజేసే ఉద్దేశ్యం తో మాణిక్ పబ్లిక్ స్కూల్ అనే రెసి డేన్షియల్ విద్యాలయాన్ని శ్రీ సిద్ధ రాజ్ మాణిక్య ప్రభు మహారాజ్ 1972 లో స్థాపించారు, ఈ విద్యాలయం లో విద్య తో పాటు, సంగీతం క్రీడలు, చిత్ర లేఖనం కు కూడా ప్రాధాన్య మిస్తారు, కనుక విద్యార్ధి సర్వ

తోముఖ మైన ప్రతిభ సాధనకు ఉజ్వల భవితవ్యానికి ఎంతగానో ఈ విద్యాలయం తోడ్పడుతుంది, క్రీడాంశాలలో భాగం గా "మాణిక్య ప్రభుసరోవర్"అనే స్విమ్మింగ్ పూల్ కూడా ఏర్పాటు చేశారు, ఇన్ని సత్కార్యాలకు స్ఫూర్తి దాత శ్రీ మాణిక్య ప్రభు జీవిత విశేషాలను తెలుసుకొందాం,

## 78 శ్రీ అరవిందులు

మానవ పరిణామ ప్రక్రియను పురోగమన దిశలో నడిపించే క్రమంలో శ్రీ అరవిందులు మానవ జాతికి చేసిన సేవ అపూర్వమైనది. శ్రీ అరవిందుల జీవితాన్ని రెండు అంకాలుగా విభజిస్తే.. మొదటిది భారతమాతను దాస్యశృంఖలాల నుంచి విడిపించడానికి విప్లవాత్మక భావాలతో, అనర్గళ ఉపన్యాసాలతో, 'ఆర్య' పత్రిక స్థాపనతో జాతిని ఉత్తేజితం చేసిన స్వాతంత్య్ర సమరయోధులు అరబింద్‌ఘోష్‌గా కనిపిస్తారు. రెండో అంకంలో భౌతికాధ్యాత్మికతల సమన్వయంతో మానవజాతిని భవబంధ శృంఖలాల నుంచి విముక్తం చేసి, అతిమానస సాధన వైపు తీసుకుపోయే మహాయోగిగా అనిపిస్తారు.



1872 ఆగస్టు 15న తేదీన జన్మించిన అరబిందో చిన్న వయసు నుంచే ఇంగ్లండ్‌లో విద్యనభ్యసించారు.

ఆ సమయంలో మన దేశంలో ఐసీఎస్ పరీక్ష అతి కష్టమైనది. అతి కొద్ది మందికి మాత్రమే సాధ్యమైనది. అలాంటి పరీక్షలో 21 ఏళ్లకే ఉత్తీర్ణుడైన అరబిందోకు ఉద్యోగం నచ్చలేదు. ఇంగ్లాండ్ నుంచి భారత్‌కు రాగానే ఒక విస్తృతమైన ప్రశాంతత, నిశ్శబ్దాలు ఆయనను ఆవరించాయి. జనచైతన్యం కోసం ఉద్యమాన్ని విస్తృతం చేయాలనే భావన బలపడింది. అదే సమయంలో ఆయన మహారాష్ట్రకు చెందిన విష్ణుభాస్కర్ లేలే అనే యోగిని కలిశారు. మూడు రోజుల ధ్యానం ఆయన జీవితాన్ని మార్చేసింది. బ్రహ్మచైతన్య అనుభవాన్ని పొందగలిగారు. ఒక వైపు ఆధ్యాత్మిక మార్గం, మరోవైపు దాస్యశృంఖలాలను తెంపటానికి చేసే స్వాతంత్య్ర ఉద్యమం. ఈ రెండింటిలోను అరబిందో తనదైన ముద్రను వేయగలిగారు. స్వాతంత్య్ర పోరాటంలో భాగంగా ఒక ఏడాదిపాటు ఆయన జైలు జీవితం గడపాల్సి వచ్చింది. అతివాద రాజకీయవాదిగా దేశవ్యాప్తంగా సంచలనం సృష్టించిన అరబిందో ఆ తర్వాతి కాలంలో మహాయోగి అరవిందులుగా మార్పు చెందారు. యోగకార్య నిమిత్తం పాండిచ్చేరిలో ఆశ్రమాన్ని స్థాపించారు. శక్తిస్వరూపుణి శ్రీమాత మిర్ర ఆగమనంతో పాండిచ్చేరి ఆచరణాత్మక పూర్ణయోగ సాధనకు నిలయమైంది.

**జ్ఞాన సారంశమిది..**

ప్రస్తుతం మానవజాతి ఒక సంక్షోభాన్ని ఎదుర్కొంటుంది. దీనిని ఆధ్యాత్మికత కానీ, హేతువాద భావనలు కానీ, విజ్ఞాన శాస్త్ర ప్రగతి కాని వేర్వేరుగా అడ్డుకోలేవు. ఈ మూడు సమన్వయంతో పనిచేసినప్పుడే- ఈ సంక్షోభం తొలగిపోతుంది. జీవితాన్ని శత్రువుగా భావించే ఏ ఆదర్శమూ మానవునికి వెలుగుబాట చూపలేదు. అదేవిధంగా అంతరాత్మను కాదనే ఆధునిక దృక్పథం కూడా పరిష్కారం కాదు. జీవితానికి, ఆధ్యాత్మికతకు జరుగుతున్న సంఘర్షణ పూర్తి అవగాహనతో తొలిగిపోవాలి. అప్పుడు జీవితమంతా యోగమే (all life is yoga) అవుతుంది. పదార్థం నుంచి జరిగిన పరిణామంలో మానవుడు ఇంకా మధ్యంతరస్థిలోనే ఉన్నాడు. దివ్యచైతన్య ఆవిర్భావంతో ఈ స్థితి నుంచి దైవం వైపుగా పయనించగలడు. అసమగ్రంగా ఉన్న భౌతిక, ప్రాణిక, మానసిక స్వభావాలలో పరివర్తన జరగాలి. అప్పుడే దివ్యచైతన్యం భూమి మీద అవతరించి భూమి మానవ జీవితాన్ని స్వర్గతుల్యం చేస్తుంది. అరవిందుల పూర్ణయోగ, హఠయోగ, రాజయోగ, కర్మ, జ్ఞాన, భక్తి యోగాలన్నీ మనుషులను ఈ మార్గంలో ప్రయాణించేలా చేస్తాయి. తన జీవితాన్ని మానవహితానికి త్యాగం చేసిన మహర్షి అరవిందులు 1950 డిసెంబర్ 5న దేహపరిత్యాగం చేశారు. 'సింథసిస్ ఆఫ్ యోగ', 'లైఫ్ డివైన్', 'గీతావ్యాసాలు', 'వేదోపనిషత్తుల వివరణలు', 'యోగలేఖలు', 'భారతీయ సంస్కృతి పునాదులు' వంటి ఎన్నో అద్భుత రచనలు దివ్య చైతన్య ప్రవాహంలా ఆయన కలం నుంచి జాలువారాయి.ఆయన రచించిన 'సావిత్రి' మహాకావ్యంలో ప్రతి పద్రమూ మంత్రాక్షరంగా పనిచే

**శ్రీ అరవిందుల శిష్యుడు. వైద్యో నారాయనో హరి ---డాక్టర్ వి.**

తమిళ నాడు లో మదురై లో అరవింద్ కంటి ఆస్పత్రి నిర్వహిస్తున్న డాక్టర్ గోవిందప్ప వెంకట స్వామి.Dr V గా జగత్ ప్రసిద్ధుడు. లక్షలాది కంటి శస్త్ర చికిత్సాలు చేశాడు. 84..ఏళ్ళ వయసు. యువకుడు గా ఉన్నప్పుడే rhumatic arthitis వచ్చి వళ్ళు స్వాధీనం తప్పాయి. పెన్ను కూడా పట్టుకోలేని స్థితి.

determination,conventionalwisdom తో జయించాడు. అతి సున్నిత మైన కంటి శస్త్ర చికిత్సా నిపుణిగా.. స్థిర పడ్డాడు. అదే అద్భుతం. రోజుకు వంద cateraact ఆపరేషన్ లు చేస్తాడు. కొన్నేళ్ల కిందటనే లక్ష పూర్తి చేశాడు.



భారత దేశం లో పద్నాలుగు మిలియన్ల గుడ్డి వారు వున్నారని అంచనా. ప్రపంచం లోని వారిలో ఇది సగం శాతం. ఇందులో 80 శాతం cataract తో బాధ పడుతున్నారు. ఇది నయం చేయ గల వ్యాదియే. "No one should be blind if it can be helped -just as we have eradicated other global health problems like polio, that were once common. We can eliminate blindness. We can do it now. " అని ఆయన పూర్తి నమ్మకం.

ఆయన శ్రీ అరవిందుల శిష్యుడు. అరవిన్దాశ్రమాన్ని చాలసార్లు సందర్శించాడు. గాంధీ గారి ప్రభావం అరవిందుల ప్రభావం ఆయనపై చాలా వుంది. అరవిన్దులను అనేక సార్లు దర్శించి దివ్య. అనుభూతి పొందాడు . అరవిన్దులలో special radiation వుందని భావించాడు. .ఆయన లో దివ్య శక్తి ప్రవేశించిందని భావించాడు. అది లసేర్ లో వ్యాప్తి చెంది గుడ్డితనాన్ని పోగొట్టింది. " I found that the more I worked for this goal, the more help I got " అంటాడాయన 1976 లో రిటైర్ అయాడు మదురై మెడికల్ కాలేజీ నుంచి యాభై ఎనిమిదేళ్ళు నిండిన తర్వాత. .అప్పుడే అరవింద్ ఇన్స్టిట్యూట్ స్థాపించాడు. చేతిలో పెద్దగా ధనం లేదు. కాని పదకొండు పడకలు,ముగ్గురు డాక్టర్స్ వున్నారు. ఇప్పుడే పని ప్రారంభం అయింది అంటారు ఆయన.

యాభై ఏళ్ళు గా వైద్య వృత్తి లో వున్నాడు. ఇప్పటికి ఆ ఆస్పత్రి "ది వరల్డ్ ' BUSIEST EYE హాస్పిటల్. ఏడాదికి రెండు లక్షల ఆపరేషన్లు ఇక్కడ జరుగు తాయి. 1500 మొబైల్ EYE కాంపస్ నిర్వ హించారు పల్లె టూళ్లల్లో.నేపాల్, బంగ్లాదేశ్ కంబోడియా దేశాల్లో ను పేటిని నిర్వహించారు. "మధు మేహాన్ని తరిమి గొట్టటం తన ధ్యేయం గా చెప్పారు. అది తన SPIRITUAL PRACTICE " అని ప్రకటించాడు. అత్యన్నత మైన వైద్యం ఇక్కడ అందుతుంది. చాల తక్కువ ఖర్చుతో వైద్య సేవలు ఇక్కడ దొరుకు తాయి అమెరికా లోని కంటి ఆస్పత్రుల కంటే ఇక్కడికే చాలా ఎక్కువ మంది వస్తారు.

డాక్టర్ వి. గారిది రాబిన్హుడ్ తరహా. అరవై శాతం మంది పేదలకు ఉచితం గా వైద్యం చేస్తారు. PAYING PATIENTS ఇచ్చే దాంట్లో SUBSIDISED గా పేదలకు ఉచితం గా చేస్తాడు. ఏ.సి. రూముల్లోనే ఆపరేషన్ జరుగు తుంది. ఉచితం గా కళ్ళ జోడు లు ఇస్తారు కూడా. మక్ డోనాల్డ్ ఆయనకు ఇంకో ఆదర్శం. GOOD, CHEAP, REPRODUCTIVE SERVICE ఇవ్వటం ఆయనకు ఇష్టం. డాక్టర్ వి. పది డాలర్స్ కే ఆపరేషన్ చేస్తారు. అదే అమెరికా, ఆస్పత్రుల్లో కనీసం 1500 డాలర్లు అవుతుంది కంటి ఆపరేషన్ కు. అందుకే ఆయన్ను దేవుడి గా భావిస్తారు.. ఆయనకు INTERNATIONAL LIONS CLUB. సహకారం పూర్తిగా లభిస్తుంది.

ఆయన నిర్వహించే ఆరో లాబ్ లో అతి తక్కువ ఖర్చుతో శాస్త్ర చికిత్స చేసే పరికరాలు అతి నాన్యమైనవి తయారు చేస్తారు. మందులు కూడా చాలా చవక ధరలకే అందేట్లు తయారు చేస్తారు. ఇదీ ఇక్కడి ప్రత్యేకత. ఇతర దేశాల్లో ఇవి కొనాలంటే కళ్ళు తిరిగి పోయే రెట్లుంటాయి. "WITHOUT ADMINISTRATORS, DOCTORS HAVE TO MANAGE, A BUSINESS WHEN THEY COULD BE ELIMINATING BLINDNESS "అనే భావన ఆయనది. ఇక్కడ అందరు అంకిత భావం తో, సేవా దృక్పధం తో పని చేస్తారు. ఇదే అరబిందో సంస్కృతి. ఆయనలో spiritual, and material goals మిళితమై వున్నాయి. ఆయన దృష్టిలో కంటి శాస్త్ర చికిత్స చాలా తేలిక అయితే పేషెంట్ ను ఆస్పత్రికి రప్పించటమే కష్టం అంటారు. indian spirituality and western know how ను మిళితం చేసి గది వుంటుంది. విజయం సాధించిన వీరుడు ఆయన. ప్రతి గదిలో అరవిందుల ఫోటో వుంటుంది. meditation కు ప్రత్యేక గది వుంటుంది. meditation అంటే భగవంతునితో మౌన సంభాషణ అని ఆయన భావం. తాను ఎప్పుడు a etter tool, a receptacle for the divine force "గా వుండాలని అనుకుంటాడు మనమంతా అంకిత భావం తో పూర్తి దృష్టిని కేంద్రీకరించి పని చేయాలని సలహా నిస్తారు "you work on your work, then, supernatural consciousness works through you ".అనే నమ్మిక.ఆయనది

ఆయన వివాహం చేసుకో లేదు. ఆయన కుటుంబం లోనే డజనుకు పైగా డాక్టర్స్ వున్నారు. మానవ సేవలో నే మాధవ సేవ వుంది. విడిగా దేవుని సేవ చేయాల్సిన పని లేదు.అయితే చాలా ఉదారంగా, స్వార్ధ రహితం గా ప్రవర్తించి పని చేయాలి. అదే భగవంతునికి ఇష్టం అంటారు కూడా. .ఎవరైనా ఆయన ఎదుట సేవలను పొగుడుతూ వుంటే తేలిగ్గా నవ్వేసి "I just want to eliminate the world 's blindness " అని ఊరుకుంటారు. .that is డాక్టర్ వి.అంటే గోవిందప్ప వెంకట స్వామి. ఆ ద్రుష్టి ప్రదాతకు వందనం, అభి వందనం. .ఇలాంటి వారు ఉండ బట్టే ధర్మం ఇంకా భూమి మెడ నిలిచి వుంది

ఆంధ్ర దేశం లో తెనాలికి చెందిన వెంపటి సూర్య నారాయణ గారికి కూడా ఇంతటి పేరు ప్రశాస్తులున్నాయని మనకు తెలుసు. ఆయనా ఎందరికో ఉచిత కంటి ఆపరేషన్ లు నిర్వహించారని విన్నాం.eye camps నిర్వహించి పేదల పాలిటి పెన్నిధి గా కీర్తి పొందారు. డాక్టర్ శివా రెడ్డి గారికీ ఇంతటి     పేరుందనివిన్నాను. ఎందరో మహానుభావులు.

హిమాలయ యోగుల దివ్య భావనలు

## 1 స్వామిరామా ఆంగ్లం లో రాసిన "లివింగ్ విత్ ది హిమాలయన్ మాస్టర్స్ "



- మన ముఖం చూసి ఎవరైనా గుర్తిస్తారు. కాని ఋషుల ముఖం ఇక్కడ కనిపించదు. అది భగవంతుని లో వుంటుంది. ఇక్కడ వుండేది భగవానుని పాదాలు మాత్రమే. అందుకే మహర్షులకు పాద నమస్కారం చేస్తారు.
- సన్యాసికి లోకం వెలుపల ఆత్మ జ్ఞానం కలిగితే, సంసారికి లోకం లోనే కలుగు తుంది మోక్షం పొందిన ఆత్మకు జీవిత చక్రం తిరుగుతూ వున్నా, కర్మ బంధం అంటాడు.
- ఆధ్యాత్మిక శక్తి ప్రతి గుండె లోను నిరంతరం ప్రవహిస్తూనే వుంటుంది. సరైన విధం గా ఉపయోగిస్తే, నిస్వార్ధత, ప్రేమ సంకల్పం, దైవ భక్తీ ద్వారా ఆ శక్తి పెరుగు తుంది
- గడచినా వంద ఏళ్ళలో ఈ నేలపై జన్మించిన వారిలో శ్రీ రమణ మహర్షి అత్యున్నతులు అన్నారు. సర్వేపల్లి రాదా కృష్ణ పండితులు.
- హిమాలయ లో యేసు క్రీస్తు తపస్సు చేశాడట. వొకా రష్యన్ రచయిత "the unknown life of Jesus Christ "అనే పుస్తకం లో రాశాడు. ఆయన తపస్సు చేసిన చోటును కాష్మీరీలు గుర్తించి చూపిస్తారు. ఆయన ధరించిన దుస్తులు కాశ్మీరి దుస్తులే. ఆయన తలకట్టు శైలి కాష్మీరీయులది ఆయన చేసిన అద్భుతాలు హిమాలయ యోగులు చేసినవే. ఆయన వున్న ప్రాంతాన్ని "తఖ్త్ ఏ తావూస్ "అంటారు. అంటే మహనీయులున్న చోటు అని అర్ధం. పదమూడవ ఏట నుంచి ముప్పయ వఏడు వరకు క్రీస్తు కాశ్మీరు లోనే ఉన్నాడట.
- హిమాలయాల లోని "గంగోత్రి "ని హంసల దీవి అంటారు
- క్రిష్ణాశ్రం అనే హిమాలయ యోగి హిమాలయాల్లో ఒంటికి బట్టలు లేకుండా, చెప్పులు లేకుండా ఒట్టి కాళ్ళతో హిమాలయాలన్నీ తిరిగాడు. స్వామి రామ తీర్ధ ఇరవై వేల అడుగుల ఎత్తు వరకు ఎక్కాడు. రుషీ కేష్ లో ఒక సారి పైనుంచి అయిదు వందల అడుగుల కిందకి జారి పడి నిల దొక్కుకొని నిలిచాడు.
- బుద్ధిని బాహ్యం గా కేంద్రీక రిస్తే "త్రాటకం "అంటారు. అంతర్ముఖం చేస్తే ఏకాగ్రత అంటారు.
- అఘోరీ బాబా బద్రి నాద్ దగ్గరుండే వారు. చనిపోయిన శవాన్ని ఆయన వండారు తినటానికి. అది అద్భుతమైన తియ్యని పదార్ధం గా మారి పోయిందట. ఒక బండా రాతిని పంచదార గా మార్చిన మహా్ను భావులాయన.
- మరణ సమయం లో ఒక యోగిని చేసిన మంత్రోచ్చాటన ఆమె చనిపోయిన తర్వాత కూడా ఆ గుహలో మారు మోగటం స్వామి రామ తీర్ధ చూశారట.
- భారతి అంటే అర్ధం --భా అంటే విజ్ఞానం --రతి అంటే ప్రేమికుడు. అంటే విజ్ఞాన ప్రేమికుడని. భావం
- తెనాలి రామ లింగడు "నేను పోతే మొఖానికే పోతాను "అన్నాడట. అందరు నోరు వెళ్ళ బెట్టారటఅర్ధం కాక. అప్పుడు ఆయనే దాని అర్ధం చెప్పాడు. నేను అనే భావం పోతే అంటే వదిలించు కుంటే వచ్చేది మోక్షమే కదా అదీ వికట కవి గడుగ్గాయి తనం..
- మాయ అంటే అర్ధం --యః --అది, మా --లేనిది అంటే లేనిది ఉన్నట్లుగా కనిపిమ్పజేసేది మాయ. "ఘటిత ఘటనా పటీయసీ మాయా "
- సీతా దేవి లంకలో అశోక వనం లో నే వుంది అంటే శోకం లేని చోట వుంది అని అర్ధం. దానినే బ్రహ్మీస్థితి అంటారు "బ్రహ్మవేద బ్రహ్మ భవతి "బ్రహ్మం ను తెలుసుకున్న వాడు బ్రహ్మమే అవుతాడు అని భావం.
- వరాహం కూడా దేవుడు తన లాగే ఉంటాడు అనుకొంతుందిట. "ద్రుష్టి జ్ఞాన మయం కృత్వా పశ్యేత్ బ్రహ్మ మయం జగత్ ".

## 2 దేవతల దివ్యధామం

హిమాలయాలలో 8 నెలలు నరసంచారం ఉండని, కాని అన్ని సమయాలలో కొద్దిమంది యోగులు మాత్రమే ధ్యాన సమాధిలో ఉండే ప్రదేశమే "జ్ఞానగంజ్ " తినటానికి బంగాళాదుంపలు మాత్రమే లభిస్తాయి చిన్న చిన్న కర్ర ఇళ్ళు మాత్రమే నివాసానికి ఉపయోగపడేవి గా ఉంటాయి. ఈ ప్రదేశం లో ఇండియన్, టిబెటన్, నేపాలీ సాధువులు మాత్రమే ఉంటారు ఈ యోగులు హిమాలయ సరిహద్దులో టిబెట్, పితోరా ఘర్ లమధ్య ఉంటారు. ఈ ప్రదేశానికి తప్ప ప్రపంచం

లో మరే ప్రదేశానికి జ్ఞానగంజ్ అనే పేరు లేదు. ఒక్కొక్కసారి అత్యధిక హిమపాతం మంచు చరియలు విరిగి పడటం జరిగి భయానకంగా ఉంటుంది. దేవతల సాయం తో నే వెళ్ళగలం.

దారిలో ''రాక్షస స్థలం ''ఉంది ఇక్కడ ఉన్న సరస్సుకు రాక్షస సరస్సు అని పేరు. అకస్మాత్తుగా మంచు కొండలు విరిగి హిమానీ నదాలు విజృంభించి నీటి మట్టం ఉవ్వెత్తున పైకి ఎగసిపడుతుంది. ఒక రోజు బాగుందికదా అనుకొంటే మర్నాడు బీభత్సం సృష్టిస్తుంది. బ్రతుకు దైవా దీనం అని నమ్మి ధైర్యంగా ముందు అడుగు వేయాలి.. మన మంత్రాలకు అక్కడ చింతకాయలు రాలవు మన ప్రార్ధనలు అక్కడ పని చేయవు.. ఒక్కోసారి కొన్ని రోజులపాటు తినటానికి ఏమీ దొరకదు. దివ్య జీవులు మాత్రమే చక్కగా మనల్ని అక్కడికి తీసుకు వెళ్ళగలరు.. ఒకసారి స్వామి రామాకు దారి చూపించిన ఆతను దగ్గరలోనే ఆగ్రామం ఉందని చెప్పి అకస్మాత్తుగా అదృశ్యమయ్యాడు. ఇలాంటి సంఘటనలు ఈ దేవ భూమిలో సహజమే.. రామాతో వచ్చిన బృందం ఇక సాహసం చేయలేక వెనక్కి వెళ్ళిపోతే రామా ఒక్కడే జ్ఞాన గంజ్ వైపుకు నడిచి వెళ్ళాడు అక్కడున్న ఒక సాధువు ఆశ్రయమిస్తే నెలన్నర అక్కడ గడిపాడు. ఈ ప్రదేశం ఛుట్టో ఎత్తైన హిమ శిఖరాలున్నాయి. అవి మబ్బులతో దోబూచులాడుతూ పరమ రమణీయంగా కనిపిందాయి. ఇంతటి అందమైన ప్రదేశం పృథ్వి లో ఎక్కడా చూడలేము.

జ్ఞానగంజ్ నుంచి తిరిగి వస్తూ కైలాస పర్వతానికి కిందభాగం లో ఉన్న మానస సరోవరం దగ్గరకు నడుచుకుంటూ చేరాడు. అక్కడ కొందరు భారతీయ టిబెట్ యోగులు కలిశారు. లామాలతో కొన్ని వారాలు ఉన్నాడు. అక్కడ గొర్రెలు మేపే వారితో కలిసి నడిచాడు. వాళ్ళు ఈ దేవ భూమి ని గురించి అనేక కధలు గాధలు చెప్పారు. వీళ్ళే దేవతలు. ఈ దేవతలు జ్ఞాన అజ్ఞాన జీవితం అంచున సంచరిస్తూ ఉంటారు.వీరు తీవ్ర సాధకులకు భౌతికంగా దృశ్యమానమై మార్గ దర్శనం చేస్తారు. కానీ వాళ్ళు అభౌతిక తలం (నాన్ ఫిజికల్ ప్లేన్ ) లోనే ఉంటారు. వారి ఉనికికి తగిన తలం ఉంటుంది. రహస్య (ఈసోటెరిక్ )సైన్స్, తాంత్రిక శాస్త్రాలు ఈ రహస్య జీవుల గురించి విస్తృతంగా వివరించాయి. కానీ ఆధునిక శాస్త్ర వేత్తలు వీటిని కాకమ్మ కబుర్లుగా తోసి పారేస్తున్నారు. కానీ శాస్త్ర వేత్తలు జీవితం లో అన్ని పార్శ్వాలపైనా పరిశోధనలు ఇంత వరకు చేయలేదు. మెదడు దాని లోపలి ప్రదేశాలపైనమాత్రమే చేసారు. కానీ మానసిక శాస్త్రం లోపారమార్ధిక లేక ఇంద్రియాతీత సైకాలజీ పై దృష్టిపెట్టలేదు.. ఇది నేటి ఆధునిక శాస్త్రవేత్తలకు అందని విషయం. శాశ్వత సైకాలజీ (పెరెన్నియల్ సైకాలజీ ) శతాబ్దాల నుండి మన ప్రాచీనులు, మహర్షులు చెబుతూనే ఉన్నారు. ఇదే సరైన అసలైన విజ్ఞానం. అది జ్ఞానం లో అత్యున్నత శ్రేణికి చెందిన అంటారు దృష్టి లేక అంతశ్చేతన.. భౌతిక విజ్ఞాన శాస్త్రాలకు పరిమితి ఉంది. వాటి పరిశోధనాఫలితాలు పదార్ధ బాహ్య విషయం పైనా, శరీరం, మెదడు పైన మాత్రమే ఉన్నాయి అంతకు మించి లోతు వాళ్లకు తెలియదు

## 3 (పరమ ) హంస ధామం

హిమాలయాలలో గంగోత్రిని మించిన మనోహరమైన ప్రదేశం కనిపించదు. అక్కడే హంసలు దర్శనమిస్తాయి అందుకే దానికి హంసధామం అనిపేరు. అక్కడే జితేంద్రియులైన మహా యోగులు దర్శనమిస్తారు. కనుక అది పరమహంస ధామం కూడా. మంచుతో కప్పబడిన హిమ శృంగాలు కను విందు చేస్తాయి. సుమారు 50 కి పైగా యోగులు చిన్న చిన్న గుహలలో అక్కడ ఉంటారు. ప్రక్కనే గంగమ్మ తల్లి. అంతకంటే వారికి కావలసినదేముంది ఈ యోగులు శీతాకాలం కూడా బట్టలు ధరించరు కొందరైతే చలికాచుకోవటానికి అగ్ని కూడా రాజేయరు. స్వామిరామ ఇక్కడే మూడు శీతాకాలాలు ఒక చిన్నగుహలో గడిపాడు.. ఈగుహకు సుమారు అయిదువందల గజాల దూరం లో మరొక యోగి పుంగవుడు ఒక గుహలో ఉండేవాడు.. వీరిద్దరూ ఒకరికొకరు కనిపించినప్పుడు చూసుకోవటమే కానీ ఒకరికొకరు ఇబ్బందిపెట్టుకొనే వారు కాదు ఎవరి సాధన ధ్యాన యోగాలు వారివే. ఇక్కడ ఉన్నకాలం తనజీవితం లో గొప్ప ఫలవంతమైన కాలంగా రామా భావించాడు. యోగాభ్యాసాలు చేస్తూ ఇంత గోధుమ, పప్పు మాత్రమే ఆహారంగా జీవించాడు. ఈ రెంటినికలిపి తడిపి ఉంచి రెండురోజులతర్వాత మొలకెత్తగానే కొద్దిగా ఉప్పుకలిపి వాటిని ఆహారంగా తినేవాడు..ఇంతకూ మించి వేరే ఏదీ తినేవాడుకాదు.

రామా గుహకు దగ్గరలోనే "కృష్ణాశ్రమం "అనే యోగి ఉండేవాడు. ఆయన పేరు భారత దేశమంతటా బాగా తెలుసు.. ఒక రోజు అర్ధరాత్రి 12 గంటలకు ఒక భయంకరమైన శబ్దం వినిపించింది. వందలాది బాంబులు పేలితే వచ్చే భయ0కర శబ్దం అది.. అది ఆకస్మికంగా జారిపడిన హిమ గండ శిలాపాతం (అవలాంచి).స్వామి రామా తనగుహలోంచి బయటికి వచ్చి ఏం జరిగిందోనని ఆత్రుతగా చూశాడు.. అది పౌర్ణమి రాత్రికావటం వలన అవతలి ఒడ్డు న క్రష్ణా శ్రమ యోగి ఉండే గుహదగ్గరున్న గంగానది మంచుతో కప్పబడి కనిపించింది. ఈ భారీ అవలాంచీ ని చూసి రామా మనసులో కృష్ణాశ్రమయోగి అందులో కప్పబడి ఉంటాడని అనుమానించాడు. పొడవైన టిబెటన్ కోటు ధరించి చేతి లో టార్చి లైట్ వెలుగుతో ఆయన గుహ వైపుకు వేగంగా అడుగులు వేశాడు. అక్కడ గంగ చిన్న ఇరుకు వాగులా ఉంటుంది.. దాన్ని దాటి ఆయన గుహవైపుకు వెడితే అది సురక్షితంగా ఉందని గ్రహించి లోపల చిరునవ్వుతో కూర్చుని ఉన్న శ్రీ కృష్ణాశ్రమ యోగి కనిపించాడు. హమ్మయ్య అనుకొన్నాడు స్వామిరామా.

ఆ గుహలోకి వెళ్లి ఆయనను పలకరించాడు. ఆయన మాట్లాడకండా చేతులు పైకెత్తి "హం హం హం "అన్నాడు. దగ్గరలో ఉన్న పలకపై "ఏమీ కాలేదు.. నాకు ఏ అపకారము జరగదు. ఇక్కడ చాలా ఏళ్ళనుంచి ఉంటున్నాను. ఈ శబ్దాలు హిమ గండశిలలు నన్ను భయ పెట్టలేవు.. నా గుహ సురక్షితం "అని రాశాడు. ఆయనకే ప్రమాదం లేకుండా సురక్షితంగా ఉన్న సంగతి తెలుసుకొని భగవంతుని కృపకు అంజలి ఘటించి మళ్ళీ ఆ రాత్రివేళ తన గుహకు చేరుకొన్నాడు రామా. ఒక అతిపెద్ద దేవదారు వృక్షం పూర్తిగా కూలి మంచులో కప్పబడిపోయింది కాని అది ఆయనగు హనూ ఏమాత్రం తాకలేదని గ్రహించాడు.

మధ్యాహ్న సమయాలలో తరచుగా కృష్ణాశ్రమ యోగి గుహకు వెళ్లి తనకున్న అనుమానాలను అడిగి ఆయననుండి సంతృప్తికరమైన సమాధానాలు పొందేవాడు రామా.. ఆయన మౌనంగా ఉండేవాడుకనుక సమాధానాలు పలకపై రాసేవాడు. ఆయన నేత్రాలు అగ్నిగోళాలుగా కాంతి నిచ్చేవి. ఆయన చర్మం ఏనుగు చర్మ మంత దళసరిగా ఉండేది. 80 ఏళ్ళ వయసులోకూడా చాలా ఆరోగ్యంగా ఉన్నాడు. గడ్డ కట్టే చలిలో ఊలు బట్టలు, నిప్పు లేకుండా ఎలా ఆయన జీవిస్తున్నాడో ఆశ్చర్యమేసింది.. గుహలో వస్తు సామగ్రికూడా ఏమీ లేదు. గోముఖి దగ్గరుండే ఒక స్వామి రోజా కొంత ఆహారం తెచ్చి ఇచ్చేవాడు. రోజుకు ఒకసారి మాత్రమే బంగాళాదుంపలు వేయించి తినేవాడు. కొద్దిగా రొట్టెముక్క తినేవాడు. ఈ ప్రాంత వాసులు "గంగా తులసి "అనే ఓషధి మొక్క ఆకులతో తయారు చేసే గ్రీన్ టీ నే

తాగుతారు. స్వామిరామా కు ఇక్కడి యోగులు స్వాములు ఓషధుల గురించి ప్రయోజనకర మొక్కల గురించి వివరంగా తెలియజేశారు. వనౌషధ శాస్త్రంగురించీ రామా తో చర్చించారు. ఈ జితేంద్రియ యోగులు ఈ హంస ధామం వదిలి మైదానప్రాంతాలకు వెళ్ళటానికి అసలు ఇష్టపడరు. వీరిని దర్శించాలంటే ఆసక్తి భక్తి ఉన్నవారు అత్యున్నత ప్రాంతమైన ఈ ప్రదేశానికి రావాళిందే. బుద్ధి పై మనసు సాధించిన యోగులైన పరమహంసల దర్శనానికి ఈ హంస ధామమే శరణ్యం.

## 4 చచ్చి బతికి బోధించి దేహత్యాగం చేసిన యోగి

మహిమాన్విత యోగులు హిమాలయాలలోనే ఉంటారనే భ్రమలో ఉండేవాడు స్వామిరామా. కానీ ఒకనది ఒడ్డున పట్టణానికి దగ్గరలో ఒక యోగిఅనుభవం ఆయన్ను అప్రతిభుడిని చేసింది. ఆయన్ను చూడాలని బయల్దేరాడు.. ఇంకా అయన ఆశ్రయానికి నాలుగు మైళ్ళ దూరం లో ఉండగానే ఆయన రామాకు శిష్యులతో ఆహారం పంపాడు.. ఎవరైనా వస్తుంటే తానూ ఇలాగే చేస్తానుకదా ఇందులో వింతయేమున్నది అని పించింది. ఆశ్రమానికి వెళ్ళగానే ఆయన "నాయనా !నువ్వు ఆలస్యంగా వచ్చావు. రేపు ఉదయం నేను శరీర త్యాగం చేయబోతున్నాను". అన్నాడు రామా ఆదుర్దాగా "స్వామీ తమరు మరొక పూట ఉండి నాకు జ్ఞాన బోధ చేయలేరా ?" అన్నాడు వినయంగా. "లేదు కుదరదు. సమయం లేదు" అన్నాడు నిర్మొహమాటంగా.

అక్కడ ఆయనవద్ద అనేక మార్గాలపై విశ్వాసం వున్న శిష్యులున్నారు. హిందువులకు ఆయన స్వామి. ముస్లిం లకు ఇస్లాం ముల్లా క్రిస్టియన్లకు యేసు అనుయాయి.. ఆయన చనిపోగానే ఆయన శరీరాన్ని క్రిస్టియన్ సెమిటేరికి తీసుకు వెళ్ళాలని క్రైస్తవులు, ముస్లిం లు మసీదుకు, హిందువులు ఆయన్ను అక్కడే సమాధిచేసి ఒక స్మారక చిహ్నం కట్టాలని తీవ్రంగా భావిస్తున్నారు. మర్నాడు ఉదయం ఆయన ముందే చెప్పినట్లు దేహ త్యాగం చేసేశాడు. డాక్టర్ వచ్చి ఆయన చనిపోయాడని నిర్ధారించాడు. తర్వాత కొన్ని గంటలు శిష్యులమధ్య తర్జన భర్జనలు గందర గోళం.. అన్నిమతాలవారు ఆ పార్థివ శరీరం తమకే దక్కాలని పోట్లాడుకొంటున్నారు సమస్య జటిలమై పోయింది. పరిష్కారం లభించటం లేదు. జిల్లా మాజిస్ట్రేట్ వచ్చాడు. స్వామి రామాతో "మీరు ఇక్కడ ఉంటున్నారు కదా ఈ యోగి ఏ మతానికి చెందిన వాడో చెప్పండి "అని అడిగాడు.. రామా ఆయనతో "నాకేమీ తెలియదు "అన్నాడు. మనసులో" ఇదేమిటి ఈ యోగి చనిపోతూ భలే ఫిట్టింగ్ పెట్టాడే. నాకు ఈయనేం బోధ చేస్తాడు. నిజంగా మహా యోగి అయివుంటే ఇలాంటి సమస్యను సృష్టించేవాడు కాదుకదా "అని మనసులో రామా వితర్కించుకొన్నాడు..

ఆ యోగి ప్రాణం విడిచి అప్పటికి నాలుగు గంటలయింది.. అప్పుడు అకస్మాత్తుగా ఆయన లేచి "ఒరే మూర్ఖుల్లారా! మీరు నా దేహం కోసం కొట్టుకు చస్తున్నారు కనుక నేను చావ దలచుకోలేదు "అన్నాడు అక్కడున్న మేజిస్ట్రేట్, జనమూ ముక్కు మీద వేలేసుకొని ఆశ్చర్యపోయారు.. ఆయోగి అక్కడి మూడుమతాల శిష్యులతో "తెలివితక్కువ సన్నాసుల్లారా! నా కళ్ళ ముందు నుంచి మీరు తక్షణం వెళ్లిపొండి. నాకు కనిపిస్తే సహించను. నేను దేవునికి తప్ప ఎవరికీ చెందిన వాడిని కాను. పొండి వెళ్లి పొండి "అని గద్దించాడు. స్వామి రామాను దగ్గరకు పిలిచి "నాయనా ! కంగారు పడకు. నేను ఇక్కడే మూడు రోజులు ఉండి నీకు కావలసింది అంతా బోధిస్తాను. నాల్గవ రోజు శరీర త్యాగం చేస్తాను " అని చెప్పాడు.

స్వామిరామా ఆయోగివద్ద మూడు రోజులు ఉండి ఆత్మజ్ఞానం బోధనవలన సంతుష్టుడయ్యాడు. రామా జీవితం లో ఈ మూడు రోజులు చిరస్మరణీయమైనవని భావించాడు. ప్రతిరోజు ఏదో ఒక కొత్త విషయం బోధించాడు. ప్రతి రోజు ఆయన నోటి నుంచి "నువ్వు యదార్ధంగా ఎవరివో అది అవ్వాలి నువ్వు. నువ్వు కానిదానికోసం నటించవద్దు "ఈ మహా వాక్యాన్ని రోజు అనేక సార్లు ఉచ్చరించేవాడు ఆ యోగి పుంగవుడు.. మూడు రోజులు అయ్యాక ఆయన రామా తో "నేను జల సమాధి అవాలను కొంటున్నాను "అని చెప్పి నదికి నడిచి వెళ్లి అందులో అదృశ్యమయ్యాడు. జనం తర్వాత వచ్చి అడిగితె ఆయన నదిలో మునిగిపోయాడు మళ్ళీ కనిపించలేదు అని చెప్పాడు. వాళ్లంతా ఆ నదిని అంగుళం అంగుళం గాలించి వెతికారు. కానీ ఆయన దేహం వాళ్లకు దొరకలేదు. మహర్షులు మహాయోగులు ఏదో ఒక మతానికి చెందినవారు కాదు. ఈ అడ్డుగోడలకు అతీతంగా ఉండేవారు. వారు సర్వమానవాళికి చెందినవారు.

## 5 ఇచ్ఛా మరణం ఇచ్ఛా గమనం పొందిన యోగి

స్వామి రామా 17 ఏళ్ళ ప్రాయం లో గురువు బెంగాలీ బాబా "నువ్వు నిజమైన విద్య నేర్వాలని ఉంటె గంగోత్రి వద్ద ఉన్న మహాయోగి వద్దకు వెళ్లి నేర్చుకో "అని పంపాడు.. అక్కడికి వెళ్లి చూస్తే ఆయన మహా అందగాడుగా చక్కని దృఢమైన శరీర సౌష్టవం తో మిసమిసలాడుతూ కనిపించాడు.. ఉక్కు కండలు తిరిగిన శరీరం విశాలమైన ఛాతీ తో 85 ఏళ్ళ వృధుడు ఆయన.. రామా వెళ్ళగానే ఆకలిగా ఉందా ఏమి తింటావని అడిగి ఆయన ఉన్న గుహలోకి వెళ్లి అక్కడున్న దుంపలు తీసుకుని తినమన్నాడు. ఆయన చెప్పినట్లే రామా చేశాడు. అది పాలతో వండిన ఆహారపు రుచి గా ఉంది.. తినటం అవగానే తానేమీ మాటలతో బోధించను అని చెప్పాడు. ఆయన ప్రక్కనే స్వామిరామా మూడు రోజులు కూర్చున్నాడు. ఇద్దరిమధ్య మౌనమే.. మూడవ రోజు మనసులో తాను ఇక్కడికి రావటం శుద్ధ దండగ అని ఈయన నేర్పేది ఏమీలేదని అనుకొన్నాడు వెంటనే ఆ యోగి "నిన్ను ఇక్కడికి మీ గురువు పంపింది జ్ఞానాత్మక విద్య నేర్చుకోవటానికి కాదు అదికావాలంటే బోలెడు గ్రంధాలున్నాయి చదివి గ్రహించవచ్చు నిన్ను పంపింది ఇక్కడ కొంత అనుభవం పొందమని. నేను నా శరీరాన్ని ఎల్లుండి విసర్జింప బోతున్నాను, "అన్నాడు.. ఎందుకు శరీరాన్ని త్యాగం చేసుకోవాలో రామాకు అర్ధంకాక అది ఆత్మహత్యగా భావించాడు. ఇది గ్రహించి ఆయన "నేను ఆత్మహత్య చేసుకోవటం లేదు. సన్యాసులు ఆత్మహత్యకు పాల్పడరు. పుస్తకం అట్ట నలిగిపోతే, పాడుకాకుండా కొత్తఅట్ట వేసినట్లు, దిండుగలేబు మాసిపోతేదాన్ని నాశనం చేయకుండా కొత్తది తొడిగినట్లు స్వచ్చంద శరీర త్యాగం అలాంటిదే. రామా కుర్రాడుకనుక " స్వామీ !ఇంత అందమైన, దృఢమైన శరీరాన్ని ఎందుకు విసర్జించాలని అనుకొంటున్నారో నాకేమీ అర్ధం కావటం లేదు. వద్దు అది పాపం" అన్నాడు వేడికోలుగా. ఆయన ప్రశాంతంగా విని ఊరుకోగా, ఒక శిష్యుడు "నువ్వు ఇక్కడికి ఎలా వచ్చావు ?ఇక్కడికి రాకముందు నువ్వు ఎక్కడో నేనెక్కడో "అని ప్రక్కకు తీసుకు వెళ్లి" ఆయన ప్రశాంతతకు భంగం కలిగించవద్దు. పిచ్చిప్రశ్నలు అడుగుతున్నావు ఆయనను. యోగులు అంటే ఏమిటో నీకు తెలియదు. ఆయనను ప్రశాంతంగా దేహ త్యాగం చేయనివ్వు "అన్నాడు.. రామ ఆ శిష్యుడితో "అందమైన ఆదేహాన్ని వదిలెయ్యటం ఎందుకు ?దగ్గరే పోలీస్ స్టేషన్ ఉంటె రిపోర్ట్ ఇచ్చేవాడిని. ఇది చట్ట వ్యతిరేక చర్య "అన్నాడు.. శిష్యుడు యెంత చెప్పినా రామ సంతృప్తి చెందలేదు. అందమైన శరీరం వదలటమేమిటనే ఆయన ఆలోచన.. చివరికి శిష్యుడు "ప్రశాంతంగా ఉండి అన్నీ గమనించు. అంతా నీకే

అర్ధమవుతుంది "అన్నాడు. ఆ స్వామి మరొక 24 గంటలు స్వామిరామాతో మాట్లాడనే లేదు. రామా మాత్రం "ఈయన ఇప్పటిదాకా నాకు చెప్పిందేమీలేదు. నేనిక్కడ ఉండటం దండగ నేను వెళ్ళిపోతాను "అని శిష్యుడితో అన్నాడు.

"ఆయన ప్రాణ త్యాగం చేసే విధానాన్ని ఎందుకు చూడవు ?" అన్నాడు శిష్యుడు రామా "ఇది చాలా బుద్ధితక్కువపని నేనైతే హాస్పిటల్ లో చస్తా. ఈ వెర్రి ఏమిటి ?" అని తన ఆధునిక భావాలు ఆవిష్కరించాడు.. శిష్యుడు "నీకు అర్ధం కాదు. నిన్ను ఇక్కడికి పంపించింది చూస్తూ తెలుసుకోమని. నీ మనసులో వితర్కించుకోవాలంటే నీ ఇష్టం. కానీ ఇక్కడి ప్రశాంతతకు భంగం కలిగించవద్దు "అన్నాడు. చివరికి ఆ స్వామి "నిజంగా నేనేమీ చేయటం లేదు. మనకు శరీర త్యాగం చేసే సమయం వచ్చిందని తెలిసిపోతుంది. ప్రకృతికి అడ్డుపడలేము. అది సహజ ధర్మం. మరణం ప్రకృతికి సాయం చేస్తుంది. చావుకు భయపడరాదు దానివలన ప్రయోజనం ఉండదు. అర్ధమైందా ?"అన్నాడు మౌనాన్ని ఛేదించి. "నాకు చావాలని లేదు. కనుక అర్ధం చేకుకోవాల్సిన పని లేదు "అన్నాడు మొండిగా. ".నీ వైఖరి సరైనదికాదు మరణం అంటే ఏమిటో తెలుసుకో. మనం అనేక భయాలమధ్య బతుకుతున్నాం. చావు అంటే నాశనం చేసేదికాదు అది శరీరాన్నుంచి వేరు చేసేది "అనగా "శరీరం లేకుండా నేనుండలేను "అన్నాడు రామా అప్పుడు ఆయన ప్రశాంతంగా "చావు శరీర ధర్మం. ఎవరూ అంతకాలం ఈ శరీరంతో బతికి ఉండలేరు. అది మార్పు చెందాలి శిధిలమవ్వాల్సిందే. ఇది నీకు తెలియాలి. జీవితానికి పట్టుకొని వ్రేలాడకుండా విముక్తిపొందేవారు అతి కొద్దిమందే ఉంటారు. ఆ టెక్నిక్ నే యోగా అంటారు. ఇది ఇప్పుడు అందరూ చేస్తున్న మామూలు యోగా కాదు ఉన్నతమైన యోగా అదిధ్యానం లో సరైన పద్ధతి. నీకు తెలిస్తే శరీరం మనసు బుద్ధి మొదలైన అన్ని విషయాలపై నీకు నియంత్రణ వస్తుంది. అది ప్రాణ, అనే ఉద్వాస నిశ్వాసా ల వలన సాధ్యం.దానివలన మనసుకు శరీరానికి మంచి సంబంధం కలుగుతుంది. ఊపిరిపీల్చటం ఆగిపోతే లంకె తెగిపోతుంది. అదే మృత్యువు. అయినా నువ్వు ఇంకా జీవించే ఉంటావు "అని చెప్పాడు

"శరీరం లేకుండా ఎలా ఉంటాం ?"అడిగాడు రామా. "చొక్కా లేకపోతే ఎలా ఉంటావో అలా "అంతే. అంతకన్నా ఏమీ లేదు "అన్నాడు స్వామిజీ. అయినా అసంతృప్తిగానే ఉన్నాడు రామా. శరీర త్యాగం చేయటానికి ముందురోజు స్వామీజీ కొన్ని సూచనలు చేశాడు ఇద్దరికీ.. తెల్లవారుజామున 5 గంటలకు ప్రాణ త్యాగం చేస్తాను. మీరు నా శరీరాన్ని గంగానదిలో ముంచేయండి. మీ ఇద్దరూ ఆపని చేయగలరా "'అని అడుగగా "నేనొక్కడినే చేయగలను "అన్నాడు రామా ప్రగల్భం గా. ఆ గుహకు గంగ కొన్ని వందల గజాల దూరం లో ఉంది. తెల్లవార్లూ చావు గురించే ఆలోచించాడు మూడుగంటలకే లేద్దామనుకొన్నారు ఇ ద్దరూ.. కానీ నిద్రపట్టక ముందే లేచారు. స్వామీజీ "మీకేమికావాలో కోరుకోండి ఇస్తాను "అన్నాడు. రామా "చచ్చిపోయేవారు మీరేమిస్తారు ?'అన్నాడు వ్యంగ్యంగా సిరివెన్నెల సీమలో లో సర్వదమన బెనర్జీ "ఆది భికువు వాని నేమి కోరేదీ "అన్నటైపులో. అప్పుడు స్వామీజీ ;;యదార్ధ గురువు ను చావు ఏమీ చేయలేదు. మరణం తర్వాత కూడా గురువు శిష్యులకు మార్గ దర్శనం చేస్తాడు "అని చెప్పి శిష్యుడివైపు తిరిగి "ఈ" కొత్త పయ్యా " నీకు తలనెప్పిగా ఉన్నాడా ?"అని అడిగాడు. అతడు నిర్మోహమాటంగా "నిజమేస్వామీ కానీ నేనేం చేయగలను "అన్నాడు.

తెల్లవారుజామున అయిదు అయిదున్నర మధ్య ఈ ఇద్దర్నీ స్వామీజీ దగ్గరకు పిలిచి "ధ్యానం లో ఉండండి. అయిదు నిమిషాలలో దేహత్యాగం చేస్తాను. ఈ కట్టె పని అయిపోయింది ఇక భరించలేదు కనుక విసర్జించాల్సిందే "అన్నాడు. అయిదు నిమిషాలతర్వాత స్వామీజీ ఓం "అన్నాడు. ఆతరువాత అంతా నిశ్శబ్దమే.. రామా ఆయన నాడి చూసి స్వామీజీ తన నాడిని హృదయ స్పందనను శ్వాసను తాత్కాలికంగా నిలిపేశాడేమో అనుకొన్నాడు. తర్వాత శరీర ఉష్ణోగ్రత కళ్ళు, వగైరాలు పరీక్షించాడు. శిష్యుడు ఇక చాలు అని గురువు సిద్ధి చెందారని ఆలస్యం చేయకుండా సూర్యోదయానికి ముందే దేహాన్ని గంగలో నిమజ్జనం చేయాలని అన్నాడు. భయపడవద్దని తానే మోసుకొని వెళ్లగలనని అనగా తానూ సహాయపడతానన్నాడుశిష్యుడు. ఇద్దరూ ప్రయత్నించినా ఆ దేహాన్ని కదల్చలేక పోయారు. ఒక పైన్ చెట్టు గట్టి కొమ్మ తెచ్చి తొడలమధ్య పెట్టి కదిల్చే ప్రయత్నం చేశారు ఫలితం కనిపించలేదు. ఒక గంట సేపుఅన్ని ప్రయత్నాలూ చేశారు. కానీ అంగుళం కూడా కదల్చలేక పోయారు.

సూర్యోదయానికి కొన్ని నిమిషాలముందు "ఇప్పుడు మనం శరీరాన్ని మోసుకు పోదాం "అనే మాట వినిపించింది. అక్కడ వాళ్లిద్దరే తప్ప మూడోపురుగు లేదు. బహుశా తాను మనసులో అనుకొంటున్నానేమో అని రామా భావించాడు. శిష్యుడిని అడిగితె తనకూ ఆమాట వినిపించింది అన్నాడు. ఇంతలో స్వామీజీ భారీ అందమైన శరీరం ఒక్కసారిగా దానంతటికి లేచి గాలిలోకి ఎగిరిప్రయాణించి గంగానదిని చేరి అందులో మునిగి అదృశ్యమైంది. ఈ ఇద్దరూ షాకయ్యారు జరిగిన సంఘటన చూసి. సిద్ధ పురుషులకు అసాధ్యమైనది లేదు అని మనం తెలుసుకోవాలి.

## 6 యోగి భోగి రోగి

హిమాలయ యోగులలో కొందరు నిత్యమౌన వ్రతం ఉంటారు. వారిదగ్గరకు ఎవరు వచ్చినా కన్నెత్తి అయినా చూడరు. అలాంటివారిలో హరి ఓం యోగి ఒకరు. ఒకసారి స్వామిరామా గురువు బెంగాలీ బాబా బద్రికి దగ్గరున్న శ్రీనగర్ వద్ద గుహలో హరి ఓం యోగి దగ్గరచెప్పింది నే ర్చుకోమని పంపాడు. సరే నని వెళ్లి రెండేళ్లు ఆయన సన్నిధిలో ఉన్నాడు. ఆయన కన్నెత్తి కూడా చూడలేదు. ఒకసారి తనగురువుకు ఈ విషయం తెలియజేశాడు.. ఆయన నిన్ను ఆయన గమనించలేదనుకోకు నీ వివరాలన్నీ ఆయనకు తెలుసు''అని చెబితే ''. అదెలా సాధ్యం ఆయనెప్పుడూ కళ్ళు మూసుకొని ఉంటాడు. ఆయన ఒక జీవం లేని కర్రముక్కో రాయిలాగానో ఉంటాడు చలనం లేదు ''అని ఫిర్యాదు చేశాడు. ''కాదులే అక్కడే ఉండు ''అని భరోసా ఇచ్చాడు గురువు. ఒక రోజు హరి ఓం స్వామి కళ్ళు తెరిచి నవ్వుతూ ''నేను కర్రముక్క నా, రాయినా ?''అన్నాడు. కంగుతిన్నాడు స్వామిరామా. తనగురువుతో చెప్పిన సంగతి ఈయన కెట్లా తెలిసిందని బోల్డు ఆశ్చర్యపడ్డాడు. మళ్ళీ హరి ఓం స్వామి ''కళ్ళు మూసుకొని నేను మీరు కళ్ళు తెరిచి చూసినదానికంటే అద్భుతానందాన్ని చూస్తున్నాను ఆ ఆనందం లో మునిగిపోయే వాడికి ఈ భౌతిక లోకం ఏమానన్దం కలిగిస్తుంది ఆ విశ్వ చైతన్యం లో నేను విహరిస్తూ బ్రహ్మానందం అనుభవిస్తాను అందుకే నిరంతరం కళ్ళు మూసుకొని ఉంటాను ''అన్నాడు. ఈ మాటలు రామా మీద గొప్ప ప్రభావం కలిగించాయి. హరి ఓం కనులు అరమోడ్పుగా చూస్తే చాలు అందులోనుంచి అమృతం పొంగి పొరలుతున్నట్లు ఉందని రామా భావించి అనుభవించాడు.

ఓం హరి స్వామి ఒక సారి కళ్ళు తెరిచినప్పుడు కొన్ని మంత్రాలు చదివి అర్ధం చెప్పాడు. దానిభావం, లోకం అంతా రాత్రి వేళ నిద్ర పోతుంటే యోగులు, ఆత్మజ్ఞాన సంపన్నులు మేలుకొని ఉంటారు. ఇది ఉపనిషత్ వాక్యం.. తర్వాత దానిపై వివరణ ఇస్తూ ''రోజు మొత్తం మీద మంచి కాలం నిశ్శబ్ద రాత్రి వేళ మాత్రమే. అయితే దాని లోని అందాన్ని ఆ నిశ్శబ్ద భావాన్ని కొద్దీ మంది మాత్రమే అనుభవించగలరు. రాత్రి వేళల లో ముగ్గురు మాత్రమే మెలకువ గా ఉంటారు. వారే

యోగి భోగి రోగి. యోగి నిశీది లో సమాదిగతుడై పరమానందాన్ని పొందుతాడు. భోగి ప్రాపంచిక సుఖాలలో రాత్రిళ్ళు నిద్రపోకుండా ఆనందం అనుభవిస్తాడు. రోగి జబ్బుతో ముక్కుతూ మూలుగుతూ నిద్ర లేకుండా గడుపుతాడు. యోగిది శాశ్వతా నందం భోగిది క్షణికానందం రోగి ది బాదానందం. "

మరి యోగికి నిద్ర క్కరలేదా అని అడిగాడు రామా. దానికి "మనసులో ఏమీ లేకుండా కళ్ళు మూసుకొంటే అది నిద్ర. కావాలని కళ్ళు మూసుకొని దేనిపైన నైనా దృష్టి పెడితే అదిధ్యానం. యోగి కళ్ళుమూసుకొని ఇంద్రియ భావాలను దూరం చేసుకొంటాడు అప్పుడు ద్వంద్వాలకు అతీతమైన స్థితి కలుగుతుంది కళ్ళు మూసుకోవటం అంటే యోగికి అంతరేంద్రియమైన కన్ను ను తెరవటమే. అందరు రెండుకళ్ళతో ప్రపంచ వస్తువులు చూస్తే యోగి సర్వ దేహమూ కన్ను గా మారుతుంది సర్వ ప్రపంచం దర్శనీయమౌతుంది". అని స్వామిరామా సందేహ నివృత్తి చేశాడు.

## 7 ఆపన్న హస్తాలు

హిమాలయాలలో ఘర్వాల్ జిల్లాలో ల్యాండ్స్ డౌన్ గ్రామానికి 12 మైళ్ళ దూరం లో 6500 అడుగుల ఎత్తులో దట్టమైన అరణ్య ప్రాంతం మధ్య తారకేశ్వర అనే చోట సుమారు 650 ఏళ్ళ నాటి చిన్న శివాలయం ఉంది. ఈ ప్రాంత ప్రజలు తమకు పండిన పంటను ఈ శివుడికి నైవేద్యం పెట్ట కుండా తినరు. ఒక వేళ పొరబాటున అలాచేయకపోతే వాళ్ళ ఇల్లు కదులుతుంది, ఊళ్ళో వాళ్ళు వాళ్ళను చూసి నవ్వుకుంటారు.. తన 14 వ ఏట ఈ ప్రదేశాన్ని గురించి విని స్వయంగా సంగతులు తెలుసుకోవాలనుకొన్నాడు స్వామి రామా.

నడిచి అక్కడికి చేరుకున్నాడు అప్పటికే రాత్రి 7 అయింది. చీకట్లు అలముకున్నాయి. ఒక కొండ గుట్ట అంచున ఉన్నాడు. చేతిలో బాటరీ లైట్ కూడా లేదు. కాళ్లకు కర్ర చెప్పులు -పాంకోళ్ళు మాత్రమే ఉన్నాయి మంచు మీద అవి జారిపోతూ నడక చాలా ఇబ్బంది అయింది.. నిలువైన కొండ అంచు నుంచి జారిపోయాడు. ఇంతలో పొడవుగా తెల్లని వస్త్రాలతో పొడవైన తెల్లని గడ్డం తో ఉన్న ఒక ముసలాయనఆపన్న హస్తాలు అందించి పైకి లాగి బయటకు చేర్చికాలిబాట పట్టించి రామా తో "ఇది దివ్య ధామం. రక్షిత ప్రదేశం. నేను నిన్ను నీ గమ్యానికి చేరుస్తానని "చెప్పి పది నిమిషాలలో బయట దీపం వెలుగుతున్న ఒక చిన్న కుటీరం దగ్గరకు తీసుకు వెళ్ళాడు ఇద్దరూకలిసి గుడిసె చుట్టూ ఉన్న రాతి గోడ దగ్గరకు వచ్చారు. స్వామి రామా ఒక్క సారి వెనక్కి తిరిగి చూస్తే తనను తీసుకొచ్చిన ముసలాయన కనపడ లేదు.. ఆయనకోసం వెతుకుతూ పిలిచాడు. ఇంతలో గుడిసె లో ఉన్న ఒక సాధువు ఈ కేకలు విని బయటి కొచ్చి, తానుంటున్న గుడిసెలో తనతోపాటు ఉండమని ఆహ్వానించాడు. వెచ్చదనం కోసం లోపల మంట మండుతోంది. రామా గుడిసెలో చేరి జరిగిన విషయం సాధువుకు తెలియ జేశాడు. సాధువు కన్నీరు కారుస్తూ "నువ్వు చాలా అదృష్టవంతుడివి నాయనా !గొప్ప మహానుభావుని దర్శించగలిగావు. నేనెందుకు ఇక్కడ ఉంటున్నానో తెలుసా ?ఏడేళ్ల క్రితం నేను కూడా నువ్వు జారిపోయిన ప్రదేశం లోనే రాత్రి 11 గంటలకు అంచునుండి జారిపోయాను. నీకు కనిపించిన మహానుభావుడే నన్నూ ఆపన్నహస్తాలు అందించి రక్షించి ఈ గుడిసెకు చేర్చాడు. మళ్ళీ ఆయన దర్శనం నాకు కాలేదు. ఆయనను నేను "సిద్ధ బాబా "అని పిలుస్తాను. నిన్ను రక్షించిన చేతులే నన్నూ అప్పుడు రక్షించాయి "అన్నాడు గద్గద స్వరం తో.

మర్నాడు స్వామిరామా ఆ చుట్టు ప్రక్క ప్రదేశాలన్నీ గాలించి చూశాడు. తాను జారిన ప్రదేశం దగ్గర వెతికాడు. తాను జారిన పాదపు గుర్తులు మాత్రమే కనిపించి గుర్తించాడు.ముసలాయన పద చిహ్నాలు లేవు.. ఇది చాలా ప్రమాదకరమైన అంచు అని గ్రహించాడు అందుకే ఆ అదృశ్య మహాత్ముడు ఆపన్న హస్తాలు అందించి కాపాడుతున్నాడు అని అర్ధం చేసుకొన్నాడు స్వామిరామా. తాను బ్రతికి బయట పడటానికి ఆ సిద్ధబాబాయే కారణమని గ్రహించాడు.. దగ్గరే ఉన్న ఊళ్లోకి వెళ్లి అక్కడున్న వారిని కలిసి తన అనుభవం చెప్పాడు. అక్కడి వారందరికీ తమకుటుంబాలలో పిల్లా పెద్ద అందరినీ ప్రమాదాలనుంచి కాపాడే వాడు ఆ సిద్ధ బాబాయే అనే నమ్మకం లో ఉన్నారని తెలుసుకొన్నాడు.



ఇక్కడ సాధువుతో తానున్న గుడిసె ప్రసిద్ధ శివాలయానికి 100 గజాల దూరం లో మాత్రమే ఉంది. శివాలయాన్ని దట్టమైన ఫర్ వృక్షాలమధ్య కొంత ప్రదేశం ఖాళీ చేసి కట్టారు. అందుకే ఇక్కడ అద్భుత ఆధ్యాత్మిక తరంగ ప్రసారం జరుగుతుందని ఊహించాడు. గ్రామస్తులను అడిగితె సిద్ధబాబా సుమారు 650 సంవత్సరాలక్రితం ఇక్కడ ఉండేవాడని నిరంతర మౌనంలో ఉన్నా ఇక్కడి ప్రజలను సన్మార్గం లో నడిపించేవాడని తెలిసింది. ఆయన సిద్ధిపొందాక ఆ ప్రదేశం లో ఆరు అడుగుల చతురం లో గుడికట్టారని, లోపల శివ లింగాన్ని ప్రతిష్టించారని, అప్పటినుంచి ప్రతి మూడు నెలలకోసారి ప్రజలు వచ్చి కృతజ్ఞత పూర్వకంగా దర్శించిసిద్ధబాబా ను స్మరించి వెడతారని, ఆసిద్ధ బాబాయే తన ప్రాణ రక్షకుడని రామా గ్రహించాడు. ఈ ఆలయం దగ్గరే ఒక గదిలో స్వామిరామా చాలా నెలలు ఉండి యోగ,ధ్యానాలు చేశాడు. స్వామి రామా అక్కడ నుండి వెళ్లి పోయాక కొన్నేళ్ళకు అక్కడి బ్రాహ్మణులు ఆలయం శిధిలమై పోతోంది కనుక శివాలయాన్ని ఇంకొంచెం పెద్దదిగా కడదామని ప్రయత్నం చేశారు.. కూలీలు వచ్చి గుడి ని పడ గొట్టటానికి పలుగు పారలతో ప్రయత్నించారు. అడుగు లోతు నుంచి చిన్న చిన్న పాములు అనేక రంగుల్లో కనిపించాయి. తవ్విన మట్టి తీసి పాముల్ని ఏరేసి మళ్ళీ లోపలి తవ్వారు. లోతుకు వెళ్లిన కొద్దీ పాముల సంఖ్య పెరిగి0దేకాని తగ్గలేదట.దగ్గర గ్రామంలోని ఒక ముసలామె రోజూ సాయంకాలం వచ్చి ఆలయం లో దీపం వెలిగించి,మళ్ళీ మర్నాడు ఉదయం వచ్చి ఆర్పేస్తుందిట ఆమె ఇలా ఎన్నో ఏళ్లుగా భక్తితో చేస్తోందట. ఆమె రోజు త్రవ్వేవారితో గుడిని కూల్చవద్దు, దాన్ని మార్చే ప్రయత్నం

చేయద్దు అని గోల చేసేది. కొత్త గుడి కట్టటానికి ఏర్పాటు చేయబడిన ఇంజనీర్ ఆమె మాటలను పట్టించుకొనే వాడు కాదు.. ఆరు రోజులు త్రవ్వాక పాములు అనంతం గా ఉన్నాయని గ్రహించి త్రవ్వకం ఆపేశారు.

పోనీ శివలింగాన్ని త్రవ్వి పీకి పారేద్దామని ప్రయత్నం చేశారట. 8 అడుగులు తవ్వారు. "అంట" పలక లేదు యెంత లోతుకు తవ్వినా దాని మూలం ఎక్కడుందో తెలియ లేదట. కనుక పీకలేక తోక ఝాడించేశారు. ఒక రోజు రాత్రి ఇంజనీర్ కు కలలో ఒక పొడవైన తెల్లగడ్డం ముసలి యోగి కనిపించి "ఈ శివ లింగం అత్యంత మహిమాన్వితమైనది. దీన్ని కదిలించే ప్రయత్నం చేయద్దు. ఆలయాన్ని పెంచి కట్టే ప్రయత్నమూ చేయద్దు "అని చెప్పాడట. అంతే ఆ ప్రయత్నాలన్నీ ఆపేసి ఉన్న చిన్న గుడినే ఏ మాత్రమూ మార్చకుండా రిపేర్ చేసి లెంపలు వాయించుకొన్నారట. అందమైన ప్రకృతి మధ్య విలసిల్లిన వెలసిల్లిన ఆరు శతాబ్దాల మహిత,మహిమాన్విత శివాలయం అది దానికే తారకేశ్వరాలయమనీ పేరుంది

ఇక్కడే శివుడు తారకాసురుని సంహరించాడని ఐతిహ్యం. దీన్ని శివ సిద్ధ క్షేత్రమనీ పేరుకూడా ఉంది. తరువాతకాలం లో తాండ శివ విగ్రహ ప్రతిష్ట చేసి వసతులేర్పాటు చేసి ధర్మశాల కట్టించారు

## 8 ఏసు క్రీస్తు కాశ్మీర్ లో కొంతకాలం ఉండి వెళ్లాడా ?

అవును. ఉండే వెళ్ళాడు అని తపస్సు చేశాడని "ది అన్ నోన్ లైఫ్ ఆఫ్ జీసెస్ క్రైస్ట్ "అనే గ్రంధం లో రాయబడి ఉంది.. అక్కడే 14 వేల అడుగుల ఎత్తులో ఉన్న ఒక ప్రార్ధనా మందిరం లో టిబెట్ భాషలో రాయబడి భద్రపరచబడిన వ్రాతప్రతి లో ఈ విషయం ఉందని కాశ్మీర్ లో ప్రచారం లో ఉంది.. తర్వాత దీన్ని ఒక రష్యన్ రచయిత రష్యన్ భాషలోకి అనువదిస్తే తర్వాత ఇంగ్లీష్ లోకి పైన చెప్పిన పేరుతో అనువదించారు. ఇక్కడి హిమాలయ ప్రాంతవాసులందరూ యేసు ఇక్కడికి వచ్చి మెడిటేషన్ చేశాడనే నమ్ముతారు. కాదని ఎవరూ అనలేరు. దీనికి కారణాలు 3 ఉన్నాయని అక్కడి గైడ్ లు తెలియజేస్తారు. -జీసెస్ ధరించిన దుస్తులు అచ్చంగా కాశ్మీరీలు ధరించిన దుస్తువులవంటివే. -2-ఆయన జుట్టు శైలి కూడా కాశ్మీరీ శై లే. -3-ఆయన ప్రదర్శించిన మహిమలు అచ్చంగా కాశ్మీర్ లోని తంత్ర విద్యా మహిమలే.

జీసెస్ తన 13 వ ఏటా ఆసియా మైనర్ ను వదిలి ఎక్కడికో వెళ్లిపోయాడని, ఎక్కడికి వెళ్లిందీ ఎవరికీ తెలియదని, కానీ ఆయన కాశ్మీర్ లోయకు వచ్చి 30 వ ఏడు దాకా అంటే 17 ఏళ్ళు ఉండిపోయాడనన్నది యదార్ధమని భావిస్తారు.. జీసెస్ తపస్సు చేసినట్లు చెప్పబడే ఒక చిన్న ప్రార్ధనామందిరం ఎత్తైన పర్వతం మీద కనిపిస్తుంది. దీనినే యేసు ప్రార్ధనామందిరం అంటారు. ఇది కాదనలేని యదార్ధం అని స్వామి రామా కూడా అన్నాడు. కాశ్మీర్ లోఒక చోటు నుంచే జీసస్ స్వర్గానికి వెళ్లాడని, అక్కడ సమాధి నిర్మించబడి ఉన్న ప్రదేశాన్ని "రోజా బాల్ "అంటారని అంటే గౌరవ సమాధి (అనర్ఘ టుంబు )అని అర్ధమని, దీన్ని క్రైస్తవు లు మహమ్మదీయులు కూడా నమ్ముతారని అంటారు.




కాశ్మీర్ శైవానికి జీవగడ్డ. ఎన్నో శైవాగమ గ్రంధాలు ఇక్కడివే. కానీ ఇంకా చాలా గ్రంధాలు వెలుగు లోకి రాలేదని రామా అంటాడు వీటిని అర్ధం చేసుకోవటానికి అందులో బహు నిష్ణాతులైన పండితుల సహాయం కావాల్సిందే వీటిలోని తాత్వికభావం ఏమిటి ?.ఆత్మ, మనసు శరీరం, విశ్వం లోని సత్యం యొక్క అన్ని స్థాయిలు ప్రాధమిక స్పందన లేక యాదృచ్చిక కంపనం యొక్క అవతారాలే.. ఈ గ్రంధాలలో మూల విషయం "శక్తిపాతం "దీనివలన నిద్రాణమై ఉన్న శక్తి జాగృతమవుతుంది. అమరనాధ్ ఆలయం కాశ్మీర్ లో ప్రసిద్ధ మైనది. ఇక్కడ విశేషం ఒక గుహలో ఏర్పడే మంచు శివ లింగం. ఆలయం వేసవిలో దర్శిస్తారు అప్పుడు ఆలయం లో రెండు తెల్లని పావురాల జంట దర్శనమిచ్చి ఆశ్చర్య పరుస్తాయి. అమరనాధ గుహలో శివుడు పార్వతికి సృష్టి రహస్యాన్ని అమరత్వాన్ని గురించి బోధించాడని అక్కడే ఉన్న జంట తెల్లపావురాల జంట దాన్నివిని మోక్షం పొందాయని, అందుకే అవి ఎప్పుడూ ఆ గుహలోనే ఉంటాయని ఐతిహ్యం. ఈ జంటను దర్శించిన భక్తులు కూడా మోక్షం పొందుతారని అంటారు. కొందరి కధనం ప్రకారం అమరనాధ గుహ తెరవబడినపుడే ఈ తెల్లపావురాలజంట స్వామి దర్శనం కోసం వచ్చి ఇక్కడే ఉండిపోతాయని.

అమరనాధ స్వామి దర్శనానికి 25 ఏళ్ళ వయసులో ఉన్న ఒక యువ యోగి ప్రతి సంవత్సరం వస్తాడాని స్వామి రామ తెలిపాడు ఆయనతో మాట్లాడాడు కూడా ఆయన పూర్ణ ప్రజ్ఞుడని రామా అన్నాడు. శరీరం పై ఒక్క అంగోస్త్రం తప్ప ఆయనవద్ద ఏమీ ఉండవట. ఆయన చెంపలు కెమ్ముల్లా ప్ర కాశించేవన్నాడు.. యోగ శాస్త్రం లో మహా నిష్ణాతుడు. నడిచే ఎంతదూరమైనా కాలికి ఏ ఆచ్చాదనా లేకుండా హిమాలయాలలో తిరుగుతాడు. 12 వేల అడుగుల ఎత్తువరకూ నడిచే వెడతాడు. చలి ఆయన్ను ఏమీ బాధించదు. ఈ యువ సన్యాసిని అక్కడివారు "బాల భగవాన్ "అంటారు. ఆయనకు ఇవేమీ పట్టవు నిత్య సంచారి. రామాగురువు బెంగాలీ బాబా ఈయనకు తెలుసు. కొంతకాలం ఆయన వద్ద ఉన్నాడుకూడా. కళ్ళు చికిలించకుండా కనీసం 10 గంటలు కూర్చోగలడు. యోగ సాధనలో ఆయన సుమారు మూడు అడుగుల ఎత్తుకు గాలిలో లేవగలడు. స్వామిరామా ఆయన్ను దీన్ని గురించి ప్రశ్నిస్తే "ఇది ఆధ్యాత్మిక సాధన కాదు. ప్రాణాయామం లో ఉన్నతస్థాయి సాధన బంధనాలు ఛేదన మాత్రమే. బరువుకు ద్రవ్యరాశికి మధ్య భేదం తెలిసిన వారెవరైనా దీన్ని సాధించవచ్చు. కానీ చాలాకాలం సాధన చేయాల్సి ఉంటుంది "అని చెప్పాడు.

ఉన్నత స్థాయి ఆధ్యాత్మిక జ్ఞానం అంటే ఏమిటని స్వామి రామా ప్రశ్నిస్తే బాల భగవాన్ "ఇంద్రియాలు పూర్తిగా వశం చేసుకొని, ప్రపంచ దృష్టినుంచి వాటిని దూరం చేసుకొ౦టే ఇంద్రియ అవగాహన మనసులో యే రకమైన ప్రతిబింబాలను కలిపించలేదు. అంటే అప్పుడు మనసు ఏకాగ్ర చిత్తమవుతుంది. ఎప్పుడైతే ఆలోచన ప్రభావం అణగారిపోతుందో మనసు సమతా స్థితి పొంది ఉన్నత స్థాయి ఆధ్యాత్మిక జ్ఞానం లభిస్తుంది. సత్వ గుణం తోనే దీన్ని సాధించగలం ధ్యానం,విషయవాసనా రాహిత్యం రెండు ముఖ్య సాధనాలు. జీవితాన్ని ఒక క్రమ విధానం లో నడపాలి. మధ్యలో బుద్ధి, గుడ్డి నమ్మకాలు పెడదారులు పట్టిస్తాయి జాగ్రత్తపడాలి. ఈ రెండూ కూడా గొప్ప శక్తులే కానీ ముందు వాటి గురించి సంపూర్ణ జ్ఞానం సంపాదించాలి. తర్వాత విశ్లేషించి సరైన మార్గాన సాధన చేయాలి. అన్నిటికీ మార్గ దర్శి అంతశ్చే తన మాత్రమే అంటారు అంటే అంటారు దృష్టి మాత్రమే. కనిపించేదంతా యదార్ధం కాదు సత్యం వీటి వెనక దాగి ఉంది దాన్ని తెలుసుకోవాలి.

## 9 గణిత వేదాంతం

గణితానికి వేదాంతానికి సంబంధం ఏమిటి ?బోడిగుండుకు మోకాళ్ళకు ముడి పెట్టటం లాగా ఉందనుకొంటున్నారా. దిగితేకాని లోతు తెలియదు. లెక్కలలో 1 సంఖ్య ఉంది. మిగిలిన అన్ని సంఖ్యలు దీని గుణకాలే. అలాగే ఉన్నది ఒకే ఒక్క శుద్ధ సత్యం. ఆ శుద్ధ సత్యం యొక్క గుణకాలే విశ్వం లో విభిన్న నామాలు, రూపాలు.. జీవితం సమ భుజ త్రిభుజం. శరీర కోణం, శరీరాంతర్గత స్థితి కోణాలు, బాహ్యప్రపంచ కోణం కలిస్తే సమాన కోణ సమానభుజాలున్న జీవితం యొక్క సమబాహు త్రిభుజం.. సంఖ్య లన్నీ ఒక స్థిర బిందువునుంచి వచ్చినట్లే, ఆ బిందువును కొలవలేనట్లే, ఈ విశ్వమంతా గణింప శక్యం కాని శూన్యం నంచి ఏర్పడింది. జీవితం ఒక చక్రం. దీన్ని సున్నా లేక వృత్తం తో పోల్చవచ్చు. వృత్తం అంటే బిందువు యొక్క పరి వ్యాప్తి అన్నమాట. అయితే జీవితం లో రెండు బిందువులున్నాయి ఇవే పుట్టుక, మరణం. ఈ రెండు బిందువులను కలిపే సరళ రేఖయే జీవితం.జీవితం యొక్క తెలియని భాగమంతా అనంతం రేఖ.

ముందు ఒక సున్నా పెట్టి దానితరువాత 1 అంకె వేస్తే 01 అవుతుంది. ఒకటి వేసి దానితర్వాత సున్నా పెడితే 10 అవుతుంది. సున్నాలు పెంచిన కొద్దీ విలువ పెరుగుతుంది 100 1000 వగైరా.. ముందు ఒకటి లేకుండా ఎన్ని సున్నాలు పెట్టినా ఆ సున్నాకు విలువే లేదు. సృష్టిలో అన్ని వస్తువులు సున్నాలే. ఏక పరబ్రహ్మ సత్య భావన లేకపోతే ఈ వస్తువులకు దేనికీ విలువ లేదు. ఆ ఏక సత్య పరబ్రహ్మ ఎరుక కలిగితే జీవితం విలువైనది అవుతుంది. లేకపోతే భారమవుతోంది.

కనుక గణితం ధనాత్మక సైన్స్. అన్ని సైన్స్ లకు మూలాధారం. ఇది సాంఖ్య వేదాంతం పై ఆధార పడిందే.. వేదాంతాలలో అతి ప్రాచీనమైనది సాంఖ్య 0. ఇది శరీరాన్ని అందలి లోపలి విషయాలను మనసు చేసే క్రియలను తెలుసుకోవటానికి ఉపయోగ పడుతుంది యోగ అనేది ఆచరణాత్మక విజ్ఞానం (ప్రాక్టికల్ సైన్స్). ఇది అతీంద్రియ చేతన(సూపర్ కాన్షస్ ) కలిగిస్తుంది. సందేహ నివృత్తికి సాంఖ్య యోగం తప్పని సరి.

ఈ విషయాలన్నీ స్వామి రామాకు "చక్ర వర్తి "అనే గణిత శాస్త్ర వేత్త అయిన స్వామి బోధించాడు. ఆయన గణిత శాస్త్రంలో ప్రొఫెసర్. చక్రవర్తీస్ మాధెమాటిక్స్ "గ్రంథ రచయిత..తర్వాత జీవితం లో సారం లేదని గ్రహించి సన్యసించి హిమాలయ గుహలలో తపస్సులో గడిపాడు. ఆయనకు మరొక గొప్ప శక్తి ఉంది అదే "తదేక దృష్టి ". దేనిమీద అయినా ఆయన దృష్టిపెడితే దానిప్రభావం గొప్పగా ఉంటుంది. దీనిని "త్రాటకం "అంటారు.. ఇంగ్లీష్ లో గేజింగ్ అంటారు. ఈ దృష్టి బయట వాటిపై కేంద్రీకరిస్తే దాన్ని త్రాటకం అంటారు అదే దృష్టిని అంతర్ముఖ చేస్తే దాన్ని ఏకాగ్రత అంటారు.. కేంద్రీక రింపబడిన మనసుకు అత్యంత శక్తి లభిస్తుంది. కొందరు దృష్టిని భృమధ్యమం లో కేంద్రీకరిస్తారు. శివుడు మూడవ కంటి దృష్టిని కేంద్రీకరిస్తేనే మన్మధుడు కాలి బూడిదయ్యాడు. భూతద్ద౦ తో సూర్యకాంతిని కేంద్రీకరిస్తే కాగితం ఫిలిం దూది మొదలైనవి తగలబడటం మనకు అనుభవమే.

స్వామిరామా దీన్ని ప్రత్యక్షం గా చూపించమనికోరాడు. సరేనని దగ్గరలో ఉన్న కోర్టులో ఏ ఖైదీ అయినా అనవసరంగా అరెస్ట్ అయి విచారణ ఎదుర్కుంటున్నాడేమో చూసి వచ్చి చెప్పమన్నాడు. సరే అని వెళ్లి అక్కడి లాయర్లద్వారా పాపం ఒకతను ఏ నేర మూ చేయకుండా కోర్టులో విచారణకు గురౌతున్నాడని తెలుసుకొని స్వామి చక్రవర్తి కి చెప్పాడు. అప్పుడు చక్రవర్తి "ఆ ఖైదీ విడుదలవుతాడు. జడ్జి చెప్పే జడ్జిమెంట్ ఎలా ఉంటుందో నీకు ప్రత్యక్షరం తెలియ జేస్తాను కాగితం మీద రాసి టైప్ చేసి ఎవరికీ తెలియ కుండా జాగ్రత్త చేయి. జడ్జిమెంట్ రాగానే నేను చెప్పింది జడ్జి చెప్పింది పోల్చి చూడు "అని చెప్పటం రామా రాయటం టైప్ చేయటం అందులో మూడు టైప్ తప్పులు దొర్లటం జరిగాయి. రెండుమూడు రోజులతర్వాత జడ్జి తీర్పు చెప్పాడు దాని కాపీ తెప్పించి రామా తానూ టైప్ చేసిన దానితో పోల్చి చూశాడు అక్షరం పొల్లు పోకుండా తానూ చేసిన మూడు తప్పులతో సహా జడ్జి మెంట్ కాపీ ఉంది. ఆశ్చర్యపోయి చక్రవరి త్రాటక విద్య అమోఘమైనది గ్రహించాడు. అంటే ఎక్కడో సుదూరం లో ఉండికూడా మనసును కేంద్రీకరించి అవతలి వారిపై ప్రభావం చూపించవచ్చు అని అర్ధమయింది. అప్పుడు రామా "స్వామీ !మీరు ఈ ప్రపంచ గతిని మార్చగలరా ?"అని అడిగాడు. దానికాయన "అది నా పనికాదు అతడు అన్యాయంగా కేసులో ఇరుక్కున్నాడనే జాలితో నా దృష్టిని జడ్జి మనసుపై కేంద్రీకరించి ప్రభావం చూపి జడ్జి మెంట్ అలా వచ్చేట్లు చేయగలిగాను.. మనిషి నిగ్రహం తో ఉంటె ఎక్కడున్నా, యెంత దూరం లో ఉన్నా అవతలివారి మనసుపై ప్రభావం కలిగించవచ్చు అని నీకు తెలియ జేయటానికే ఇలా చేశాను "అన్నాడు.

చక్రవర్తి యోగి సంఖ్యామానం లోని సున్నా నుంచి 100 వరకు ప్రతి అంకెను ఉపనిషత్ లోని ఒక్కొక్క శ్లోకం తో జత చేసి వ్యాఖ్యానించి చెప్పేవాడు. వాటిలోని వేదాంత భావనలను విశదీకరించేవాడు

## 9 భయాందోళనలు ఎలా పోతాయి ?

స్వామి రామా కు పాములంటే విపరీతమైన భయం. హిమాలయాలలో గంగా తీర అరణ్యాలలో నిర్భయం గా పులులు సింహాలమధ్య తిరిగినా పాములంటే భయం ఉండేది. 1939 సెప్టెంబర్ లో రుషీ కేష్ నుంచి వీరభద్ర కు గురువు బెంగాలీ బాబా తో వెడుతూ తెల్లవారుజామునే గంగలో స్నానించి ఒడ్డున ధ్యానమగ్నమయ్యాడు దాదాపు మూడుగంటలు సమాధిలో ఉండిపోయాడు.

ఉదయం ఏడున్నర అయ్యేసరికి కళ్ళు తెరిచి చూడగా పెద్ద నాగుబాము పడగా విప్పి రెండు అడుగుల దూరం లో స్వామిరామాపై తీవ్ర దృష్టి పెట్టి కనిపించింది. భయపడ్డాడు ఏం చేయాలో తోచక మళ్ళీ ధ్యానం లో పడ్డాడు. మళ్ళీ కళ్ళు తెరిచేసరికి పాము అక్కడే అదే పొజిషన్ లో ఉంది. ఇక లాభం లేదనుకొని భయపడి

పరిగెత్తాడు అదీ వెంటబడి పొదల్లో దూరింది.. గుహకు వెళ్లి గురువుకు చెప్పాడు. ఆయన నవ్వుతూ "బ్రతికి ఉన్న ఏ జంతువుకైనా ధ్యాన మగ్నమైన వాని ముందు ధ్యానం స్థితిలో ఉండి పోతుంది "అని సత్యం చెప్పాడు. మరో వింత అనుభవం ఆయనకు ఎదురైంది. గురువు దక్షిణభారత దేశం లో కొంతకాలం గడిపి రమ్మని ఆదేశిస్తే వెళ్లి ఒకరోజు ఒక దేవాలయం కు లో రాత్రి పడుకోవటానికి ఆశ్రయం ఇవ్వమని కోరాడు. అప్పుడు పూజారి "నువ్వు స్వామీజీవి అయితే ఆశ్రయం ఎందుకు "?అని అడిగాడు. ఇంతలో ఒక స్త్రీ తన వెంట వస్తే ఉండటానికి చోటు చూపిస్తానన్నది.. ఆమె రామా ను ఆరడుగుల గుడిసె చూపించి ఉండమన్నది. అప్పుడు ఆయనవద్ద ఉన్నవి కూర్చోటానికి జింక చర్మం, ఒక శాలువా ఒక అంగోస్త్రం మాత్రమే.. ఆ గుడిసెలో తలుపులాంటి ఖాళీ నుంచి వెలుగే తప్ప ఏదీ లేదు. కాసేపటికి ఒక నాగుబాము ముందు పాకుతూ కన్పించింది. తర్వాత ప్రక్కన ఒకటి, మరికాసేపటికి గుడిసె నిండా పాములే పాములు. ఒళ్ళు జలద రించింది స్వామికి. అది సర్ప దేవాలయమేమో నను కున్నాడు.. చాలా భయమేసింది బహుశా ఆ అమ్మాయి తాను నిజమైన స్వామో కాదో పరీక్షకోసం ఈ గుడిసెకు పంపించి ఉంటుంది అనుకున్నాడు..

అప్పటికి రామా పూర్తిగా స్వామి కాలేదు. అప్పుడప్పుడే అభ్యాసం లో ఉన్నాడు. భయపడి పారిపోతే ఎక్కడికి వెళ్లి తలదాచుకోవాలి ?పారిపోతే ఇక ఆఊళ్లో ఏ సాధకుడికి ఎవరూ భిక్ష పెట్టరు. కనుక చావో రేవో పాములమధ్య గుడిసెలోనే ఉండి పోవాలను కొన్నాడు.. తనను ఇక్కడకు తీసుకొచ్చిన ఆవిడ జ్ఞాని కాదు కానీ ధైర్యంగా పాముల గుడిసెలోకి రా గలిగింది. కనుక తానూ అక్కడే పాముల మధ్యనే రాత్రి గడపాలని కొని ఉండి పోయాడు.. అలానే ఉన్నాడు. కానీ తన ధ్యానం మర్చి పోయి పాముల ధ్యానం లో ఉన్నాడు పాములు ఆయన జోలికే రాలేదు. తెల్లవారాక బయటికి వెళ్ళాడు ఆయనను పాములు ఏమీ చేయలేదు కానీ భయం మాత్రం పోలేదు. తర్వాత మనసులో వితర్కించుకొన్నాడు. తాను బ్రహ్మ సూత్ర భాష్యం తేలికగా బోధిస్తున్నాడు కానీ మనసులో పిరికి తనం పోలేదు. ఈ భయం ఎలా ఉందంటే ధ్యానం పూర్తి చేసి కళ్ళు తెరిచి చుట్టూ పాములున్నాయేమో నని వెదికేవాడు. భయాన్ని పోగొట్టుకోవాల్సిందే అనుకున్నాడు.. గురువును చేరి దీనికి మార్గమేమిటో తెలుసుకొందామన్నాడు. ఆయన రామాను చూడగానే "నీకేమి కావాలో నాకు తెలుసు. నీకు పాములంటే భయం కదా "అన్నాడు మనసులో మాటకనిపెట్టి. "నీకు భయమని నా కెప్పుడూ చెప్పలేదే అన్నీ నాకు చెప్పేవాడివి దీన్ని ఎందుకు దాచావు ?" అన్నాడు. ఎందుకో కానీ గురువుకు తనకున్న పాము భయం గురించి చెప్పలేదు.

అడవిలోకి తీసుకు వెళ్లి "రేపు ఉదయం నుంచి మనం మౌనం పాటిస్తున్నాం. తెల్లవారు జామున మూడున్నరకే లేచి నువ్వు అడవి ఆకులు పూలు ఏరి తేవాలి. వాటితో మనం ప్రత్యేక పూజ చేద్దాం "అని చెప్పాడు. అలాగే లేచి చీకటిలోనే అక్కడ పోగుపడిన ఆకులు చూసి వాటిని చేతిలో పట్టుకున్నాడు ఆకులతోపాటు ఒక నాగు పాము చేతికి చుట్టుకు పోయింది. చెమటలుపట్టాయి భయం తో తప్పించుకొనే అవకాశం లేదు. ఇంతలో గురువు చూసి దాన్ని తనదగ్గరకు తీసుకురమ్మన్నాడు.. అసలే వణికి పోతున్నాడు భయం తో. గుర్వాజ్ఞ తో మరీ భయం పెరిగింది "అది నిన్ను కరవదు తీసుకురా "అన్నాడు. రామాకు చేతిలో మృత్యువే ఉందనిపించింది నమ్మకం కంటే భయం బలీయమైంది. గురువును చేరగా "నువ్వు పాములను ఎందుకు ప్రేమించలేవు ?"అని అడిగాడు. "భయం తో చస్తుంటే ప్రేమ ఏమిటి నా బొంద "అన్నాడు. భయపెట్టే వారిని మనం ప్రేమించలేము ఆది లోక సహజం. అప్పుడు గురువు "ఇది అందమైన జంతువు. అన్ని చోట్ల తిరుగుతుంది. అయినా చూడు అది ఎంత పరిశుభ్రంగా స్వచ్చంగా ఉందో. ప్రపంచ జీవులలో పాము ఒక్కటే అత్యున్నత స్వచ్ఛమైన జీవి. "అన్నాడు. అందం సరే ప్రమాదం సంగతి ?" అన్నాడు స్వామిరామా. మనిషి పాముకంటె అతి మురికి, విష జంతువూ కూడా. ప్రతిక్షణం కోపం పగలతో రగిలి అవతలివారికి హాని చేస్తూ ఉంటాడు. పాము ఆత్మ రక్షణకు మాత్రమే కాటేస్తుంది.. నువ్వు నిద్రలో ఉంటె నీ వ్రేళ్ళు కళ్ళను పొడుస్తాయా, నీ నాలుకను పళ్ళు కొరుకుతాయా ?లేదే. శరీర భాగాలన్నిటికి ఒక చక్కని అవగాహన ఉంటుంది. అలాగే సకల చరాచరం ఒకటే అన్న భావన కలిగితే ఏ జంతువూ వలనా భయమనేది ఉండదు. "అన్నాడు గురువు చెప్పినంతసేపు నాగుపాము స్వామి చేతిలోనే ఉంది క్రమంగా భయం తగ్గింది. మనసు లో "నేను పామును ఏమీ చేయక పోతే పాము నన్నేం చేస్తుంది ?అనే ఎరుక కలిగింది. అంతే పాము నెమ్మదిగా జారీ ఎటో వెళ్ళిపోయింది. అప్పటి నుంచి పాము అంటే భయం పోయింది. ఏ జంతువుపైనా తనకు అపకారం జరిగితే తప్ప మీద పడవు. వాల్మీకి, సెయింట్ ఫ్రాన్సిస్ బుద్ధుడు మొదలైన వారందరూ జీవ ప్రేమికులే.. యోగ సూత్రాలలో మొదటిది అహింస. అహింస అంటే చంపక పోవటం, హాని చేయకపోవటం, గాయం చేయకపోవటం.ఆత్మ శక్తికి మించిన బలం లేదు.

"నేను హిమాలయాలలో, అరణ్యాలలో ఎన్నో చోట్ల తిరిగాను..నాకు తెలిసినంతవరకూ నేను వున్నంతవరకు ఏ సాధువు, యోగి, స్వామిలపై ఏ క్రూర జంతువూ దాడి చేసినట్లు చూడలేదు వినలేదు ఈ మహానుభావులు తమను తాము రక్షించుకోవటానికి ఏ సాధనాలు లేనివారు.. వీరిని హిమపాతాలు,ప్రకృతి ప్రళయాలు కూడా ఏమీ చేయలేదు. వారి బలీయమైన ఆత్మ శక్తికి అన్నీ తలవంచుతాయి. ఈ నిర్భయత్వమే వ్యక్తిగత చేతన ను అధిగమించి విశ్వ చేతనలో చేరటానికి దారి చూపిస్తుంది. ఎవరు ఎవరిని చంపుతారు ?ఆత్మ అనంతమైనది. శరీరం ఎప్పుడోఅప్పుడు మట్టిలో కలిసిపోయేదే. హిమాలయ యోగులు ఏ శాఖ వారైనా ఈ గొప్ప భావం తోనే జీవించి తరించారు "అంటాడు స్వామిరామ.

స్వామి రామ తార్రై భవాల్ నుండి నేపాల్ లోని ఖాట్మాండుకు ఒక్కడే నడుచుకుంటూ బయలుదేరాడు.. రోజుకు సుమారు ముప్ఫయి మైళ్ళు నడిచేవాడు. సాయంత్రం సూర్యాస్తమయం కాగానే చితులు పేర్చి మంట వేసుకొని, ధ్యానం చేసి విశ్రాంతి తీసుకొని, మళ్ళీ తెల్లవారుజామున నాలుగింటికి లేచి నడక సాగించిపది గంటల వరకు నడిచి ఏదో చెట్టుకింద ఆగి మధ్యాహ్నం మళ్ళీ బయల్దేరి సాయంత్రం ఏడు దాకా నడిచేవాడు. చెప్పులు లేకుండా ఒక దుప్పటి, పులిచర్మం, చిన్న కుండలో నీళ్లు ఇవే ఆయన సామాగ్రి.. ఒక రోజు సాయంత్రం ఆరింటికి అలసి పోయి చిన్న గుహలో విశ్రాంతి కి వెళ్ళాడు. అది చీకటి గుయ్యారం. లోపల మూడు పులిపిల్లలు కనిపించాయి అవి పుట్టి 15 రోజులు మాత్రమే అయి ఉంటుంది. అవి స్వామి దగ్గరకు వాళ్ళ అమ్మ ఏమో ననుకొని వచ్చి నాకుతున్నాయి. భయపడకుండా వాటిని మచ్చిక చేసుకున్నాడు. కూర్చోగానే గుహ ద్వారం దగ్గర వాటి తల్లి వచ్చి నుంచుని ఉండటం చూశాడు. మొదట్లో అది లోపలికొచ్చి తనమీద పడి చంపేస్తుందేమో ననుకొన్నాడు. తర్వాత మనసులో "నేను ఈ పులి కూనలకు ఏఅపకారం చేయలేదు. పులి దారిఇస్తే నేను బయటికి వెళ్ళిపోతాను "అని అనుకోని దుప్పటి నీళ్లకుండా తీసుకొని లేచి నిలబడ్డాడు. ఈయన్ను చూసిన పులి దారి ఇస్తున్నట్లుగా గుహ ద్వారం నుండి పక్కకు తప్పుకున్నది.. స్వామి రామ గుహ లోంచి బయటికి వచ్చి పదడుగులు వేసి వెనక్కి తిరిగి చూస్తే పులి నెమ్మదిగా గుహలోకి ప్రవేశించి పిల్లలను చేరినట్లు గమనించాడు. దీన్ని బట్టి జంతువులూ అతి తేలికగా హింసను భయాన్ని వాసన చూడగలవు. అప్పుడే అవి అతి తీవ్రంగా ఆత్మ రక్షణకు ఎదురు దాడి చేస్తాయి. సాధారణంగా జంతువులు చాలా రక్షణ నిచ్చి సహాయం చేస్తాయి మనుషులు ప్రమాద సమయాలలో ఒకరిని ఒకరు వదిలేసి పారిపోతారు. కానీ జంతువులూ

అలా ప్రవర్తించవు. ఆత్మా రక్షణ సకల జీవులకు ఉంటుంది. కానీ మనుషులకంటే జంతువులు ప్రేమకు అంకితమై ఉంటాయి వాటి మిత్రత్వం నమ్మదగినదే., షరతులు లేనిదే. మానవుడు అలాకాదు

.

## 10 గుగ్గురు దర్శనం



ఒకరోజు స్వామీ రామా ను గురువు బెంగాలీ బాబా టిబెట్ లో ఉన్న తన గురువు వద్ద కొంతకాలం ఉండి రమ్మని పంపాడు. గుగ్గురువు ను చూసి అనుభూతి పొందాలనే ఆత్రత తో రామా 1931 లో బయల్దేరాడు. మానస పాస్ దగ్గర ఆపేశారు మళ్ళీ 1946 లో టిబెట్ రాజధాని లాసా కు డార్జిలింగ్ కాళీపాంగ్ సిక్కిం ల ద్వారా వెళ్ళాడు. ముఖ్యోద్దేశం గుగ్గురు దర్శనమే. అక్కడ కొంత అడ్వాన్స్డ్ ప్రాక్టీస్ పొందటమే.. డార్జిలింగ్ లో కొన్నిరోజులుండి ఉపన్యాసాలిచ్చాడు. బ్రిటిష్ ఆఫీసర్లు రామాను విప్లవావాది గా ఇండియాలోని బ్రిటిష్ ప్రభుత్వానికి శాంతి భద్రతలకు విఘాతం కలిగిస్తాడనిభావించారు కాలిపాన్గ్ కు వెళ్లి పదిరోజులుండి "కుంగ్ ఫు "నేర్చాడు. అక్కడి నుంచి సిక్కిం కు వెళ్ళాడు. అంతాకాలినడకనే అని మర్చిపోకండి. సిక్కిం లో దలైలామా దగ్గర బంధువు ఇంట్లో అతిధిగా ఉన్నాడు. సిక్కిం పొలిటికల్ ఆఫీసర్ రామా టిబెట్ లో శాంతికి విఘాతం కలిగిస్తాడేమోనని భయపడి ముందుకు పోవటానికి అనుమతించలేదు చాలా రోజులు ఆ ఆఫీసర్ తో తన గోడు చెప్పుకొన్నాడు.. కానీ రామా కాంగ్రెస్ పార్టీ గూఢచారి అని అనుకోని, అప్పుడాపార్టీ బ్రిటిష్ ప్రభుత్వం తో స్వాతంత్ర్యం కోసం తీవ్రం గా పోరాడుతున్నందున అనుమతి నిరాకరించాడు. అప్పుడు కాంగ్రెస్ పార్టీలో అతివాద మితవాదులుండేవారు. గాంధీ ఆయన అనుచరులు మితవాదులు. మిగిలినవారు అతివాదులు.. రామా ఈ రెండు గ్రూపుల వారితో సంబంధం ఏదీ లేదు. రామదగ్గర నెహ్రు రాసిన, గాంధీరాసిన ఉత్తరాలను చూశాడు ఆఫీసర్. అనుమానం మరింతబలీయమై రామానుప్రభుత్వ ఇన్స్పెక్షన్ బంగళా లో హౌస్ అరెస్ట్ లో ఉంచాడు..అన్ని సౌకర్యాలు కలిగించారు కానీ రెండు నెలలు అక్కడే ఉండి పోవాల్సి వచ్చింది. ఎవరితోమాట్లాడటానికి ఎవరికీ ఉత్తరం రాయటానికి వీ లు లేదు.. ఒకరోజు ఆఫీసర్ "నువ్వేమీ చేయలేదని నాకు తెలుసు, కానీ నిన్ను రాజకీయ గూఢచారిగా అనుమానిస్తున్నాను. నాకు నీపై మంచి రిపోర్ట్ వచ్చేదాకా ఇక్కడినుంచి కదలటానికి వీల్లేదు "అన్నాడు. ఒకగార్డ్ ఇరవైనాలుగు గంటల కాపలాఉన్నాడు. ఈ కాలం లోనే రామ టిబెటన్ భాష అధ్యయనం చేసి నేర్చుకొని వాళ్ళతో మాట్లాడే వీలు కలిపించుకొన్నాడు..

రెండు నెలలు హౌస్ అరెస్ట్ లో ఉన్నా ఎంతమందికి మొరపెట్టుకున్నా లాభం లేకపోయే సరికి రహస్యంగా పారిపోవాలని నిర్ణయించుకున్నాడు స్వామిరామా.. ఒక గార్డ్ ను మచ్చిక చేసుకొని పొడవైన తలా ముఖం పైకూడా కప్పుకొనే టిబెటన్ కోటు సంపాదించాడు. ఒక చలిరాత్రి గార్డ్ ఫుల్ గా మందుకొట్టి నిద్రపోతున్నసమయం లో రాత్రి 11 గంటలకు జులై 15 ఆకోటు తొడుక్కునితాను డిల్లీ వె డుతున్నట్లు ఒక ఉత్తరం రాసి టేబుల్ మీద ఉంచి చీకట్లో ఉడాయించాడు.. ఇదేమీ తప్పనిపించలేదు అంటాడురామ కారణం తనను అనవసరంగా ఏ కారణం లేకుండా నిర్బంధించటం న్యాయం కాదుకాబట్టి. మూడు రోజులు నడిచి చివరి చెక్ పోస్ట్ కు చేరాడు. అక్కడ సిక్కిం గూర్ఖా సైనికులు పహారా కాస్తున్నారు. రామాను ప్రశ్నించి ఆయన గురించి అడిగి తెలుసుకొన్నారు. తనకు నేపాలీ భాష వచ్చుకనుక ధారాళంగా ఆభాషలో మాట్లాడి, వాళ్లకు తాను నేపాలీ అనే అభిప్రాయం కలిగించటం తో వాళ్ళు సరిహద్దు దాటి టిబెట్ లోకి వెళ్ళటానికి అనుమతించారు. గండం గడిచి పిండం బయట పడింది.

టిబెట్ లో మరిన్ని ఇక్కట్లు పడ్డాడు.. తానూ శాకాహారి. అక్కడ మాంసం తప్ప తినటానికి ఏమీ దొరకదు. టిబెట్ లో ఒక్క శాకాహారికూడా ఆయనకు కనిపించలేదు. టిబెట్ చాలా ఎత్తైన ప్రదేశంలో ఉండటం ఎప్పుడూ మంచు కురవటం తో అక్కడ జనం మాంసం చేపలు తింటేనే బతకగల పరిస్థితి. ఎక్కడో ఒకటీఆరా కాయగూరలు దొరికితే తినేవాడురామా. గుడ్లు కూడా తినాల్సి వచ్చేది. ఆహార మార్పువలన డయేరియాతో బాధపడ్డాడు. ఆరోగ్యం క్షీణించింది. కానీ ఇక్కడ కొన్ని సన్యాసా శ్రమాలు గుహలు దర్శించి తాను వచ్చినపని నెరవేర్చుకొందామనుకొన్నాడు.

రాత్రి వేళపడుకునేసమయం లో ప్రజలు రామా దగ్గరున్న వస్తువులను దొంగిలించటానికి తనిఖీ చేసేవారు. కానీ ఆయనదగ్గర కొన్ని పౌండ్ల బిస్కట్లు కొద్దిగా పప్పు, నీళ్ల సీసా 2 వేల రూపాయలు మాత్రమే ఉండేవి. డబ్బును లోపలి దుస్తులలో జాగ్రత్తగా దాచేవాడు. కాళ్లబూట్లు ఎప్పుడూ ఎవరి ముందూ విప్పేవాడుకాదు. రోజుకు 15 మైళ్ళు నడిచి లేకపోతే కంచరగాడిదపై ప్రయాణించేవాడు. తటస్థ పడిన మనుషులతోమనసుకు నచ్చక పోయినా జ్యోతిషం, జోస్యం చెబుతూ గడిపేవాడు. టిబెటన్లకు వీటిపై మహా గురి.. కనుక ఈయనపై నమ్మక గౌరవాలేర్పడి ఒక చోటునుంచి మరో చోటుకు వెళ్ళటానికి మ్యూల్స్ ను ఏర్పాటు చేసేవారు. దారిలో చాలాసార్లు అడవి ఎలుగు బంట్లు తారస పడేవి. టిబెటన్ గ్రామాలను కాపలాకాసే పెద్ద పెద్ద భూతియా కుక్కలు కనిపించేవి. ఈ సమస్యలు బాధిస్తున్నా రామాకు ప్రయాణం ఉత్సాహాన్ని ఇచ్చింది. హిమాలయ యోగుల మహత్యాలు తెలుసుకోవాలనే ఆరాటం పెరిగిందేకాని తగ్గలేదు.. వెనక్కి తిరిగి ఇండియాకు వెడితే బ్రిటిష్ ప్రభుత్వం తనను తప్పక అరెస్ట్ చేసి జైలు లో పెడుతుంది. కనుక పీచే మూడ్ కుదరదు ఆగే మూడ్ మాత్రమే తప్పనిసరి అనుకున్నాడు.

ఎవరి సాయం గైడ్లు లేకుండా ఏ ప్రణాళికా లేకుండా హిమ పర్వత వాహినులు, హిమానీ నదాలు కనుమలు దాటుకొంటూ ముందుకు వెళ్ళాడు దైవమే తనకు రక్షా ఏడుగడ.. దారితప్పేవాడు దైవమె మళ్ళీ మార్గం చూపేవాడు. పగటి వేళా భయం అసలు ఉండేదే కాదు చావుభయం అసలే లేదు. తన గుగ్గురువు ఆరోగ్యంగా ఉండాలనే కోరుకున్నాడు. ఆయన వద్ద కొంతకాలం తన గురువు చెప్పినట్లు ఉండాలన్నదే తపన. ఆయన ఇక్కడ ఒంటరి ప్రదేశం కనుక ఉన్నాడు. యోగా లో ఆధునిక పురోగమన పద్ధతులు నేర్చుకొనే ఆసక్తి ఉన్న వారికి నేర్పుతున్నాడు. హిమాలయ కుమయూన్ హిల్ యోగులైన హరికృష్ణ బాబా మొదలైన వారు ఆయనంటే విపరీతమైన ఆరాధన కలిగిఉన్నారని ఈయనను హిమాలయ శాశ్వత (ఎటర్నల్ )యోగి అని అందరూ భావిస్తారని తన గుగ్గురువు దగ్గరే యోగ శిక్షణ పొందాడని తన గురువు బెంగాలీ బాబా ద్వారా రామా తెలుసుకొన్నాడు. ఈ కోరికే రామాను ఇంతదూరం తెప్పించింది.

విపరీతంమైన ప్రయాణం రెండునెలలు చేసి రామా లాసా చేరాడు అక్కడ ఒక కేథలిక్ ప్రీస్ట్ కలిశాడు. ఆయన తన చిన్న నివాసం లో రామాను ఉంచాడు. ఈఇద్దరుకాక మరో ఇద్దరు మిషనరీలు అందులో ఉన్నారు. ఈ ముగ్గురే లాసా లో ఉన్న కేథలిక్కులు. వీరికదలికలను టిబెటన్ ప్రభుత్వం జాగ్రత్తగా గమనిస్తుంది. అలసట తీరే దాకా వారితో పది రోజులున్నాడు. ఈలోగా సిక్కిం పొలిటికల్ ఆఫీసర్ కు రామా టిబెట్ లో ఉన్నట్లు తెలిసింది. రామా కేసును సి ఐ డి కి అప్పగించాడు..

లాసా లో ఒక లామాను కలిసి తాను ఆధ్యాత్మిక మార్గదర్శనానికి టిబెట్ వచ్చానని, తనకు రాజకీయ ఉద్దేశ్యాలేవీ లేవని, చెప్పి నమ్మకం కలిగించి ఆయనవద్ద 15 రోజులు గడిపాడురామా. ప్రభుత్వ ఉద్యోగులకు స్వామిరామాను పరిచయం చేస్తే, వ చ్చీరానీ టిబెటన్ భాషలో వారికి నచ్చ చెప్పగలిగాడు. ఈ లామా స్నేహితుడైన మరోలామా ఆశ్రమం గుగ్గురువు ఆశ్రమానికి సమీపం లోనే ఉన్నదని చెప్పిలాసాకు ఈశాన్యం లో 75 మైళ్ళ దూరం నాగరికతకు చాలా దూరం లో ఉన్న అక్కడికి కొందరు గైడ్ లను తోడు ఇచ్చి పంపాడు. అక్కడినుంచి గుగ్గురువును తేలికగా చేరుకోవచ్చు.

ఆ ఆశ్రమంలో 300 కు పైగా లామాలున్నారు. టిబెట్ లో చాలా మొనాస్టరీస్ ఉన్నాయి.. వీటిలో వేలాది లామాలు వివిధ సంప్రదాయాలకు చెందినవారున్నారు. లామాయిజం అంటే బౌద్ధం లో వ్యక్తిగతమైనమతం అనిపించిందిరామా కు. ప్రతిలామా తనదైన ప్రత్యేక తరహాలో ఉత్సవాలు పూజా ధ్యానాదులు మంత్రోచ్చారణ, ప్రార్ధనా చక్రాన్ని త్రిప్పటం నిర్వహిస్తాడు. నలందాలోని ప్రాచీన బౌద్ధ విశ్వ విద్యాలయంలో స్వామి రామా ఈ తంతు అంతా చూశాడు. బౌద్ధాన్ని క్షుణ్ణంగా ఇదివరకే చదివి ఉన్నాడు.. వెయ్యేళ్ళక్రితం టిబెటన్ విద్యావేత్త ఇండియా వచ్చి బౌద్ధాన్ని అధ్యయనం చేసి ఇక్కడి బౌద్ధ మత గ్రంధాలను టిబెట్ కు తీసుకు వెళ్లాడు అప్పటి నుంచి ఇండియానుంచి బౌద్ధపండితులు టిబెట్ వెళ్ళటం ప్రారంభించి అక్కడివారికి బౌద్ధ సాహిత్యాన్ని నేర్పారు. టిబెట్ లో బౌద్ధం లో ఉన్న అనేక శాఖలు స్వామి రామాకు తెలుసు.. వారిలో దేవుళ్ళు దేవతలను నమ్మేవారు బుద్ధుడు దేవుడని భావించేవారు ఉన్నారని గ్రహించాడు.

టిబెట్ బౌద్ధం తంత్రం తో ముడిపెట్టబడి ఉంటుంది. గుగ్గురువును కలవటానికి ముందు ఒక చిన్న లామా ఆశ్రమం చూశాడు. అక్కడిలామా టిబెట్ లోనే ప్రసిద్ధి చెందినలామా అని పేరు టిబెట్లోని యోగ విధానం కొంతమారిన తంత్రశాస్త్రం.దీనినే "వామాచారం "అంటారు.. ఈ మార్గం లోవారు మధిర మాంసం,చేప, మగువ మంత్రా లను నమ్ముతారు. రామా వెళ్లిన ఆశ్రమ లామా ఒక చెక్క గదిలో అనేకమందిమంత్రాలు చదివే స్త్రీల మధ్య కూర్చుని కనిపించాడు. కొన్ని మంత్రాలు చదివాక వారంతా అక్కడ ఉన్న పచ్చి మాంసపు ముక్కలను కొన్ని సుగంధద్రవ్యాలు పచ్చిమిర్చి కలిపి తిని మళ్ళీ మంత్రాలు చదివారు. 15 నిమిషాల తర్వాత ఆ లామా రామాను చూసి పలకరించి వచ్చినపని అడిగాడు. ఈ లామాను చూడటానికే వచ్చానన్నాడు. " అది అబద్ధం నీపేరు స్వామిరామా నువ్వు నీ గురువుగారి గురువును చూడటానికి మారు వేషం లో వచ్చావు. సిక్కిం పోలీసులు నీ కోసం వెతుకుతున్నారు "అని చాలాకోపంగా తీవ్రం గా అన్నాడు బహుశా మగువలమధ్య మాంసం తింటుండగా చూశాడని "ఎక్కడో "కాలి అలా అని ఉంటాడని గ్రహించాడు రామా.. ఈయన ఆలోచనలన్నీ ఆయన పసిగట్టేశాడు. రామా వణికిపోయాడు. తమాయించుకొని టిబెట్లో కొంత తంత్ర విద్య నేర్వాలని వచ్చానని వినయంగా చెప్పాడు. చల్లబడిన లామా తనవద్ద ఉన్న ఒక తంత్ర పుస్తకాన్నిచ్చాడు దాన్ని తిరగేసినరామా అది ఇదివరకే తాను చదివేసిందే నని చెప్పగా మరొక తాంత్రిక లామా వద్దకు పంపాడు. ఈలామాకు బుద్ధగయ లో ఉండిచదవటం వలన హిందీ బాగా వచ్చు.

టిబెట్ సారస్వతం అంతా హిందూపురాణ అనువాదాలు కొన్నిటిలో టావోయిజం బౌద్ధం కన్ఫ్యూషియన్ మతం కలిసికనిపిస్తాయి. వ్యవస్తీకృతంగా సృజనాత్మకంగా ఏదీ లేదు. రామాకున్న టిబెటన్ భాషా పాండిత్యం తక్కువేకాని ఈలామా హిందీలో మాట్లాడటం వలన ఇబ్బందికలుగలేదు. జనసామాన్యం తోమాట్లాడే టిబెటన్ మాటలు బాగానే వచ్చినాఅనేక మొనాస్టరీలలో భద్రపరచబడిన వ్రాత ప్రతులలోని సారస్వతాన్ని చదివేంతగా రాదు.

స్వామి రామా విడిది చేసిన ఆశ్రమం లో సంస్కృత వ్రాత ప్రతి లామాలచేత పూజింపబడుతోంది. గట్టి గుడ్డ కవర్ తో ఉన్న ఆ ప్రతి గంధం తో దుమ్ముకొట్టుకు పోయింది. ఆ ప్రతిని చదివినవాడికి వెంటనే కుష్ఠురోగం వచ్చి చస్తాడని వాళ్ళ నమ్మకం లామాలు చాలామంది వచ్చి దాన్ని పూజిస్తారుకాని ఎవరూ తెరిచి చదివిన దాఖలా కనిపించలేదు. రామాకు దాన్ని చదవాలనే కోరిక బలీయమైంది. దాన్ని కనీసం చూపించటానికి కూడా ఎంతబ్రతిమిలాడినా అల్లామా ససేమిరా అన్నాడు. అప్పుడు రామాకు "గ్రంధాలు వాటిని చదివే వారికే కానీ అందులో ఏముందో తెలుసుకోకుండా పూజించేవారికి కాదు "అన్న పెద్దలమాట జ్ఞాపకమొచ్చింది. తెల్లవారుజామున 3 గంటలకు ఆశ్రమాన్నికి వెళ్లి, ఆసిల్కు గుడ్డ లో చుట్టబడి ఉన్న ఆ గ్రంధం ఉన్న గదిలో చేరి దాన్ని తెరచి అక్కడిదీపపు వెలుగు లో దాన్ని చదువుతుంటే అది "లింగ పురాణం "అని అర్ధమై, అందులో వేలాది శ్లోకాలలో ఆధ్యాత్మిక కథలు విధానాలు, పద్ధతులు పురాతన భారతీయ వేద సాహిత్యాధారంగా రచింపబడిందని గ్రహించాడు. కంగారులో లోపలి కి చేరటం దీపాలు చెదరటం మళ్ళీ మూట సరిగ్గా కట్టలేక పోవటం వలన దాన్ని ఎవరో తప్పక తెరచి చదివి ఉంటారని అనుకొంటారు. స్వామి రామా పై అనుమానమొచ్చింది. లామా పిలిపించి గద్దించాడు. అప్పుడు రామా తెలివిగా "హిమాలయ యోగులు నన్ను దీన్ని చదివి రమ్మని పంపారు. మీరు నన్నేమైనా అంటే నాకేమీ కాదు మీరే ఇబ్బందిపడతారు "అన్నాడు హిందీలో.. ఇక ఏమీ మాట్లాడ లేక ఈ లామా, లామాల పెద్దా విషయాన్ని అక్కడితో వదిలేశారు లేకపోతే స్వామి రామాను పిచ్చ కొట్టుడు కొట్టి ఉండేవాళ్ళు. దీనితో వాళ్లందరికీ బుద్ధ గయ నుండి ఒక గొప్ప పండితుడైన లామా వచ్చాడని మహా తెలివిగలవాడని మహా మంత్ర తంత్ర వేత్త అని రామా గురించి ప్రచారం చేశారు రామాతో వెంటవచ్చిన టిబెటన్ గైడ్ లు రామాను ఇక ఇక్కడినుంచి వెళ్ళిపోవటం మంచిదని చెప్పారు. ఇక్కడిలామాల గుడ్డినమ్మకానికి నవ్వుకున్నాడు రామా

### ఫలించిన గుగ్గురు దర్శనం

ఎట్టకేలకు గుగ్గురు దర్శనం చేశాడు స్వామిరామా. రామాను చూడగానే ఆనందం తో ఆప్యాయంగా కౌగిలించుకొని "నాయనా !చాలా దూరం నుంచి వచ్చావు. ఎన్నో ఇబ్బందులెదుర్కొన్నావు అలసినట్లున్నావు. విజ్ఞాన రహదారి చాలా కష్టమైనది విజ్ఞానం గ్ర హించటమూ కష్టతర మైనదే "అంటూ రామా ప్రయాణం లో సర్వ విషయాలు తన కళ్ళతో చూసినట్లు రామాకే వర్ణించి చెబుతుంటే స్వామి రామా అవాక్కయ్యా డు.. దూరం కష్టప్రయాణం లో తపం ధ్యానం అన్నీ ఉట్టికెక్కాయనిపించింది. స్నానం చేసి విశ్రాంతి తీసుకోమని సలహా ఇస్తే అలానే చేశాడు. మార్గాయాసం శ్రమ ఇబ్బందులు గురువుగురువు గారి ఆత్మీయ ఆలింగనం తో మాయమైపోయాయి తన గురువు బెంగాలీ బాబా ఎలాతనపై కారుణ్యం చూపించేవాడో ఈయనా అలానే అపార కారుణ్య వర్షం కురిపించాడు. గొప్ప యోగులు తమ శిష్యులను చూస్తే వారిపై అనంత అనుకంప వాత్సల్యం ప్రేమ కలుగుతాయి.

రామాగురువు ఈ టిబెట్ గురించి కొన్ని విషయాలు చెప్పాడు ఈయన ఒక బ్రాహ్మణ కుటుంబానికి చెందినవాడు. బాల్యం లోనే ఇల్లువదిలి హిమాలయాల్లో పాద చారిగా సంచరించి, అనేక గురువులవద్ద అన్నీ నేర్చాడు. ఇప్పుడు చాలా ముసలివాడుగా ఉన్నాడు. కానీ ఆరోగ్యంనే ఉన్నాడు. కూర్చున్న చోటు నుంచి ఉదయం ఒకసారి,, సాయంత్రం ఒకసారిమాత్రమే లేస్తాడు. ఐదడుగుల పది అంగుళా ల ఎత్తు, సన్నగా శలాకలాగా మాంచి శక్తి సంపన్నం గా ఉన్నాడు. దట్టమైన కనుబొమలు, ముఖం లో చెరగని ప్రశాంతత, వెలుగు, కళ్ళల్లో కాంతి చెదరిని చిరునవ్వు తో ఆకర్షణీయంగా ఉన్నాడు... ఆయన ఆహారం "యాక్ పాలు "..ఒక్కోసారి సూప్. అప్పుడప్పుడు కొందరులామాలు వచ్చి ఈయనవద్ద చదువుకొంటారు.. 7 వేల అడుగుల ఎత్తున ఉన్న స్వాభావికమైన చిన్నగుహలో ఉంటాడు. నిప్పు రాజేసి లోపలి చీకటిని పోగొడతాడు. దానితోపాలు నీళ్లు కాస్తాడు. గుహముందు కర్రలతో పోర్టికో ను శిష్యులు నిర్మించారు. ఈ గుహ నుంచి చూస్తే అద్భుతమైన ఎత్తైన పర్వత శ్రేణి, శిఖరాలు అందమైన దిక్చక్రమ్ కనుల విందు చేస్తాయి.

సౌర శాస్త్రం (సోలార్ సైన్స్ )యోగ శాస్త్రాలలో అత్యాధునికమైనది. మానవ బాధానివారణకు ఉపయోగపడేది.. పరమగురువు చెప్పినప్రకారం అదొక ప్రత్యేక ధ్యాన విధానం.మానవుని లోని సౌరవలయం (సోలార్ ప్లెక్సెస్ ) పై ఆధార పడి ఉంటుంది. భౌతిక మానసిక వ్యాధుల నివారణకు అత్యుత్తమ విధానం. మానవ శరీరం లో సౌర వలయం అతిపెద్ద జాలం దాని కేంద్రాన్ని మణిపూరకచక్రం అంటారు. ఈ చక్రం పై ధ్యానం చేయటానికి అనేక పద్ధతులున్నాయి, కానీ ఆధునిక ప్రాణాయామం సౌర శాస్త్రాన్ని ఉపయోగించి చేస్తే ప్రాణశక్తికంటే ఉన్నతమైన ఒక గొప్ప శక్తి స్థాయికి చేరుస్తుంది. ఈ స్థాయిలో శక్తి లయలను ఉదయ సూర్యుని పైగాని, ఉదరాగ్ని పై కానీ ధ్యాస ఉంచి అధ్యయనం చేయాలి.. ఈ నివారక విధానం ఉపనిషత్తులలో వివరించబడినది,. అతికొద్ది మంది పండితులకు వేత్తలకు మాత్రమే ఇది తెలుసు. ఈ శాస్త్రాన్ని తెలుసుకొంటే భౌతిక, ప్రాణిక, మానసిక స్థాయిలపై ఆధిపత్యం, నియంత్రణ లభిస్తుంది. దీనిపై ప్రవీణుడైనవాడు ఆశక్తిని ప్రసారం చేసి ఎవరి రోగాలనైనా,యెంత దూరం లో ఉన్నా నివారించి ఆరోగ్యం చేకూర్చగలడు.

తనగురువు బెంగాలీ బాబా నుండి స్వామిరామా అన్నిశాస్త్రీయ విద్యలలో గొప్పదైన "శ్రీ విద్య "ను పొందాడు. ఇది టిబెట్ లోని అన్ని మండలాల లోను, భారతీయ సాహిత్యం లోను తల్లి విద్య లాంటిది. ఆధునిక సాధనలో సాధకుడు శ్రీ యంత్రం లోని వివిధ భాగాలపై దృష్టి కేంద్రీకరించే విధానాలు తెలుసుకొని అప్పుడు కేంద్రం పై దృష్టినిలిపే ప్రయత్నం చేస్తాడు. ఇది ఆధ్యాత్మిక శక్తికేంద్రమైన బిందువు ఇక్కడే శివుడు, శక్తి(శివా శివులు ) కలిసి ఐక్యమై ఉంటారు. మలబారు కొండలపై ఈ విద్యను తనకు గురువు నేర్పినా "బిందు భేదనం "సాధన మాత్రం బోధించలేదు. ఈ పర దేవత ఆరాధనా విధానం లో మహర్షులు చెప్పిన విజ్ఞానం అంతా ఉంటుంది. దీనికోసం గ్రంధాలు చదవాల్సిందే. కానీప్రజ్ఞానిధియైన గురువే మార్గ దర్శకత్వం చేయాలి. అప్పుడే సార్ధకమవుతుంది. ఈ ఉన్నత విద్య తెలిసినవారు వేళ్ళమీద లెక్కింపతగినంత మందిమాత్రమే ఉన్నారు. మన సంప్రదాయం శ్రీ విద్యను బాగానే బోధిస్తుంది. పరమగురుదర్శనం ఆయన బోధించిన ఆధునిక యోగం వలన తాను టిబెట్ కు వచ్చిన పని సార్ధకమైందని సంతృప్తి చెందాడు స్వామి రామా..

పరమగురువు వద్ద టిబెట్ లో సెలన్నర ఉండి అధ్యయనం చేసిన తర్వాత ఒక రోజు గుహ బయట కూర్చుని తన యాత్రానుభవాలను రాస్తున్న డైరీ జ్ఞాపకం వచ్చి అది ఇక్కడ తనదగ్గర ఉంటె ఎంతబాగుండును ఈ విషయాలన్నీ అందులో రాసుకొనే వాడినికాదా అని మనసులో అనుకొన్నాడు.. లోపలున్న పరమగురువు చిరునవ్వుతో లోపలి రమ్మని పిలిచి "నీ డైరీ నీకోసం తెప్పించగలను. దాని అవసరం లేదా ?"అని అడిగితె ఆశ్చర్యపోయినా ఇలాంటి అద్భుతాలు మహాత్ములకు చాలా సునాయాసం అని గ్రహించి, ఇలాంటివి తానూ చాలాచూశాడుకానుక అద్భుతం అనిపించలేదురామాకు ..."అవును స్వామీ కొన్ని పెన్సిళ్లు కూడా కావాలి "అన్నాడు.. స్వామిరామా తాను రాస్తున్న డైరీని ఉత్తరభారతం లోని నైనిటాల్ కొండలలో ఉన్న భవాలీ శానిటోరియం లో వదిలేసి వచ్చాడు. అకస్మాత్తుగా 475 పేజీలతో ఉన్న పెద్ద డైరీ మూడు పెన్సిళ్ళతో అక్కడ ప్రత్యక్షమయ్యాయి. రామా సంతోషించాడుకాని ఆశ్చర్యపడలేదు. తనకు ఆధ్యాత్మికంగా ఏదైనా కొత్త విషయం బోధించమని అడిగాడు.

నవ్విన పరమగురువు "నీకు అది అంతా బోధించాను. దాన్ని పునశ్చరణ చేస్తూ మనసులో నిలుపుకోవాలి. నా ఆశీస్సులు నీకు ఎప్పుడూ ఉంటాయి. నువ్వు ఇప్పుడు లాసాకు వెళ్లి అక్కడనుండి ఇండియా వెళ్ళు. అనగా "నేను ఇండియా వెళ్ళటం కుదరదు వెడితే నన్ను అరెస్ట్ చేస్తారు "అన్నాడు. వెంటనే గుగ్గురువు "త్వరలో ఇండియాకు స్వతంత్రం రాబోతోంది. నువ్వు ఇంకా ఆలస్యం చేస్తే విపరీతమైన మంచు హిమానీ నదాలు నిన్ను అడుగుకూడా ముందుకు వేయనియ్యవు "అని హెచ్చరించి పంపాడు. మళ్ళీ ఆయన దర్శనం కాలేదు. కానీ కొద్దికాలం తర్వాత ఆయన శిష్యులకు వీడ్కోలు పలికి అదృశ్యమై పోయాడని విన్నాడు. కొందరు ఆయన తా నక్ పురా వద్ద ప్రవహించే కాళీ గంగానదిపై పుష్పహారాలతో తేలుతూ ఉండటం చూశామని చెప్పారు. తన గురువు బెంగాలీ బాబాను పరమగురువు బ్రతికి ఉన్నారా అని అడిగితె చిరునవ్వు నవ్వి "అది నీ అంతట నువ్వే తెలుసుకోవాలి "అని మాత్రమే అన్నాడు.

ఏమి జరుగుతుందో అనే భయంతో లాసా చేరి పూర్వపు లామా కు అతిధిగా ఉండి జూన్ 1947 న ఇండియా కు బయల్దేరాడు.. రెండు కంచరగాడిదలు ఇద్దరుగైడ్ ల సాయం తో ఒక నెల ప్రయాణించి దట్టంగా మంచు తో నిండిన కనుమలకు దాటి సిక్కిం రాజధాని గాంగ్ కాక్ చేరాడు అక్కడికి చేరటానికి మూడురోజుల ముందే భారత దేశానికి స్వతంత్రం వచ్చింది. గాంగ్ కాక్ లో ఈశాన్యాన ఇప్పటికీ ఉన్న ఒక మొనాస్టరీ లో ఉన్నాడు. అక్కడ బౌద్ధ యోగి బుద్ధగయ లో చాలాకాలం ఉండి సంస్కృతం అభ్యసించిన ఒక ప్రసిద్ధ లామాను దర్శించి. ఆయనతో ఉన్నాడు. సాధారణంగా బౌద్ధం శంకరాచార్యులవారిని విమర్శిస్తుంది. కానీ ఈ మహా పండితుడుమాత్రం భారతీయ గ్రంధాలనుండి అనేక ఉదాహరణలిస్తూ సంభాషిస్తాడు బౌద్ధం శంకరాద్వైతం లను సమన్వయ పరచి చక్కగా మాట్లాడతాడు. ఈ లామా "పరమోన్నత సత్యం విషయం లో ఈ రెండు సిద్ధాంతాలలో భేదం ఏమీలేదు. ఉన్నభేదం శబ్దాలకు మాటలకు సంబంధించిమాత్రమే.. ఈయన ఇండియా టిబెట్ జపాన్ చైనా దక్షిణాసియా లోని బౌద్ధ అనుయాయుల గురించి బాధపడుతూ "వీళ్ళు బౌద్ధ ధ్యాన పద్ధతి, ఆత్మజ్ఞాన సమ్పత్తిని పూర్తిగా వదిలేసి కర్మకాండలలో కూరుకు పోయారు. ఇదిగౌతమబుద్ధుడు బోధించిన అసలైన బౌద్ధ విధానం కాదు. ఈ ఆధునిక పోకడల ను నివారించటానికి కర్తీ లేని అసలైన బౌద్ధం అదృశ్యమై పోయింది. వేలాది బౌద్ధ దేవాలయాలు బౌద్ధాలయమాలు పూజారులు సన్యాసులు కర్మ కాండలకే పరిమితమై పోవటం బాధ కలిగిస్తోంది. బుద్ధుడు చెప్పిన "మీ దీపం మీరే వెలిగించుకోండి. ఎవరూ మీకు విముక్తిని ఇవ్వలేరు. మిమ్మల్ని మీరు తెలుసుకోండి. నిర్వాణం పొందండి అప్పుడు మీరే బుద్ధులౌతారు "అని బోధించినదానికి పరమ విరుద్ధంగా ఉంది "అని ఆ లామా ఆవేదన చెందాడు.

ఈ లామా ఆత్మజ్ఞానం మరచి కర్మకాండలలో కూరుకు పోయిన సరైన అద్వైతాన్ని బోధించని శంకర అనుచరులైన అద్వైతులనుకూడా విమర్శించాడు. "ఇలాంటి బోధనలు మనుషులను గందర గోళ పరుస్తాయి.. శంకరుల వేదాంతం వేద బౌద్ధ వేదాంత సమన్వయము. "అసగ్రా ఇదం అగ్ర అసిత్ "అంటే దృశ్య ప్రపంచం శూన్యం లో నుంచి ఉద్భవించింది "మొదలైన సంస్కృత శ్లోకాను మాండూక్య ఉపనిషత్, బౌద్ధ విద్వాన్సుడు ఈశ్వర కృష్ణుని సాంఖ్య కారిక ల నుండి ఉదహరిస్తూ తన భావాలను వ్యక్తం చేసి చెప్పాడు స్వామి రామాకు.అనేక రోజులు రామాకు వేదాంత బోధ చేసి స్వామిరామాను హిమాలయాలలో ఉన్న తన బెంగాలీ గురువు ను త్వరగా కలుసుకోమని చెప్పి వీడ్కోలు పలికి పంపించాడు.

## 11 నేతి--నేతి-"ఏతి"

పరబ్రాహ్మం ను తెలుసుకోవటానికి ఇదికాదు అదికాదు అంటే నేతి నేతి -అంటే నా ఇతి ఇదికాదు అంటూ పోయి చివరికి ఆత్మయే పరమాత్మ అని తెలుసుకోమని వేదం ఉపనిషత్తులు బోధించాయి. ఇదే ఎలిమినేషన్ పద్ధతి. అలాగే సుమారు 25 ఏళ్ళక్రితం హిమాలయాలలో మంచు మనిషి ఉన్నాడని అక్కడ కనిపించాడు ఇక్కడ కనిపించాడని పరిశోధకులకు ప్రోత్సాహం కలిగించి వాళ్ళందరూ వెళ్లి చూసి మంచుమనిషి ఉన్నదని కొందరు లేరని కొందరూ ఎటూ తేల్చలేక పత్రికలకు కావలసినంత మేత పడేశారు. పత్రికలూ పతాక శీర్షికలతో హల చల్ చేసినసంగతి మనకు తెలుసు. యదార్ధం ఏమిటో ఇప్పటికీ బ్రహ్మ పదార్ధమే. ఏతి అంటే మంచుమనిషి. దానికే 'షాంగ్రిల "అనే పేరు. హిమాలయ సానువులలో జన్మించి సుమారు 5 0 ఏళ్ళు హిమాలయ పర్వతాలను ఆ చివర నుంచి ఈ చివర దాకా శోధించి అన్ని ఎత్తులలోను కాలినడకన సంచరించి గుహలలో తపస్సు చేసి హిమాలయాలే తనకు పాఠాలలు అని తన అనుభవాలను "లివింగ్ విత్ ది హిమాలయన్ మాస్టర్స్ "గా రచించిన స్వామి రామ మంచుమనిషి అనేది లేదని అదొక భ్రమ అని తేల్చి చెప్పారు. ఆ విషయాలే మీకు తెలియ జేస్తున్నాను.

పాశ్చాత్యులకు హిమాలయాలలో ఏతి -శాంగ్రిల అనే మంచుమనుషులున్నారని భ్రమపడి ఎన్నో పరిశీలనలు చేశారు. వీరికి స్థానిక షెర్పాలు సామాను మోయటానికి దారి చూపటానికి సాయపడే వారు ఏ షేర్పా కూడా తానూ యేతి ని చూసినట్లు ఇంతవరకు చెప్పలేదు వాళ్ళు ఎక్కలేని ఎత్తు లేనేలేదు.

అయితే ఈ నమ్మకానికి కారణం హిమాలయాలలో చాలా ఎత్తున ఉన్న రెండు పురాతన మొనాస్ట రీస్ అంటే"గుహ మఠాలు." ఇవి అనుశ్రుతంగా తపస్సుకు అత్యంత అనుకూలమైన ప్రదేశాలుగా చెప్పబడ్డాయి. ప్రశాంతమైన వాతావరణం, తపస్సుకు ఎలాంటి భంగమూ కలిగించని పరిస్తితులు ఇక్కడ ఉండటం వలన యోగులు ఇక్కడిదాకా కస్టపడి వచ్చి ధ్యానం తపస్సులతో ఆత్మ జ్ఞానం పొందేవారు. ఇందులో ఒక మఠం లేక ఆరామం కాంచనగంగ శిఖరం పై సుమారు 14 వేల అడుగుల ఎత్తున ఉన్నది, రెండవది హిమాలయ అంతర్భాగం లో టిబెట్ -గార్వాల్ సరిహద్దులో ఉంది. ఈ గుహాకార ధ్యాన మందిరం లేక మఠం చాలా మంది ఉండటానికి అనువుగా ఉంది. ఇది సుమారు 12 వేల అడుగుల ఎత్తులో ఉంది. చాలా కొద్దిమంది మాత్రమే ఇక్కడికి చేరుకోగలరు. ఇది ఇప్పటికీ ఉంది. ఈ గుహ మఠం లో సంస్కృత, టిబెట్, సంధ్యాభాష వ్రాత ప్రతులు లభిస్తాయి.

సాధారణంగా విదేశీయులు డార్జిలింగ్ వచ్చిషెర్పాల సహాయం తో హిమాలయాలు చూస్తారు. వాళ్ళ పరిశోధనలో షాంగ్రిల లేక ఏతిఅనే మంచుమనిషి ప్రస్తావన వస్తుంది. అందర్నీ అడుగుతుంటారు మీరు చూశారా మీరు చూశారా అని అదొక ఉత్కంఠ వాళ్లకు. అయితే వీళ్ళకెవ్వరికీ గోచరించని హిమాలయ ప్రాంతాలున్నాయి. వీళ్ళు ఎవరూ అక్కడికి వెళ్లి శోధన చేయలేదు చేయలేరుకూడా.. ఒకసారి ఒక అమెరికా ధనవంతుడు మంచుమనిషి ని అన్వేషించ టానికి వచ్చి స్వామి రామా ను అడిగాడు. స్వామి తనకు అలాంటి మనిషి ఎక్కడా ఇన్నేళ్ళలో కనిపించలేదని రామా చెప్పారు.. నాలుగునెలలు ఉండి 33 వేల డాలర్లు ఖర్చు చేసి ఎలాంటి ఫలితమూకనిపించక తిరిగి వెళ్ళిపోయాడు. ఢిల్లీ వెడుతూ దారిలో ఒక నేపాలీ సాధువును ఫోటో తీసి ఆయనే మంచుమనిషి అని చెప్పి పేపర్లలో ప్రచురించాడుకూడా. మరో పాశ్చాత్య మహిళా సిక్కిం నుంచి హిమాలయాలకు షేర్పా లసాయం తో వచ్చింది. డార్జిలింగ్ లో ఉంటూ మూడు సార్లు ప్రయత్నించి స్నోమాన్ ను కనుక్కోలేక పోయింది

తానూ చిన్నతనం నుంచి హిమాలయాలలో సంచరిస్తున్నా తనకు ఎప్పుడూ మంచుమనిషి షంగ్రిలా అనే ఏతి కనిపించలేదని స్వామి రామా చెప్పారు.. కాని హిమాలయ వాసులు వాళ్ళ అమ్మమ్మ నాయనమ్మల వలన మంచుమనిషి కధలు గాధలూ తరతరాలుగా వింటున్నారని అన్నారు. మానవుడికి ఫాంటసీ అతి ప్రాచీనకాలం నుండే అలవడింది. అప్పటినుంచీ మంచుమనిషి కధ ప్రచారం లో ఉంది.. హిమాలయాలలో మంచు దట్టంగా ఉన్నప్పుడు మన చూపు కు ఆటంకమేర్పడి వస్తువులు అస్పష్టంగా కనిపిస్తాయి. అప్పుడు అతి అరుదుగా కనిపించే ఎలుగు బంట్లు దూరం నుంచి చూస్తే మంచు మనుషులు అనిపిస్తాయి. కంటి దోషమేకాని యదార్ధంగా మంచు మనిషి కాదు. ఈ ఎలుగులు చాలా ఎత్తైన ప్రదేశాలలో మాత్రమే ఉంటాయి. పరిశోధకుల ఆహార పదార్ధాలను ఎత్తుకు పోయి తినేస్తాయి. అప్పుడు వాటి పాదాల గుర్తులు మానవ పాదం గుర్తులులాగా మంచులో దిగి చాలా పెద్దగా కనిపిస్తాయి. కనుక పరిశోధకులు ఈ పెద్దపాదాలను మంచుమనిషి పాదాలుగా భ్రమ పడుతారు. భ్రమ వలన కలిగే పొరబాటు ఇది. అంతేకాదు ఎలుగుబంటి మంచుపై వేగంగా పరుగెత్తినా,ఎత్తుకు ఎక్కుతున్నా కిందికి దిగుతున్నా దాని పాద ముద్రలు మామూలుకంటే చాలా పెద్దవిగా కనిపించటం సహజం. తాను పెంచుకున్న ఎలుగు బంటి పాదముద్రలు కూడా ఇలాంటి సందర్భాలలో పెద్దవిగా చూడటం ఆశ్చర్య పోవటం జరిగింది అని స్వామి తెలియ జేశారు. దీనినే స్వామిరామా "హిమాలయ మాయ "అన్నారు.

అంతా బాగానే ఉందికాని అసలు ఈ ఏతిఅనే మాట ఎక్కడిది, ఎందుకు వచ్చింది ?ఏతి కాదు అసలు పేరు "యతి "అంటే సన్యాసి, యోగి అని అర్ధం. అది అపభ్రంశమై ఏతి గా మారింది. శంకరాచార్యస్వామి శిష్యులను యతులు అంటారు. వీరు ఈ అత్యంత ఎత్తైన హిమాలయాల గుహలలో తపస్సు చేసుకుంటారు. ఈ యతులు సాధారణం గా గుహలలో ఉంటారు బయటికి రారు ఎప్పుడైనా వీరు బయటికి వచ్చి కనిపిస్తే ఈ యతులను ఏతులు గా అంటే మంచు మనుషులుగా షంగ్రిలాలుగా భ్రమ పడుతారు అదీ అసలు రహస్యం

19 వ శతాబ్దికి పూర్వం నుంచే యేతిపదం ప్రచారం లో ఉంది. 19,20 21 శతాబ్దాలలోకూడా చాలామంది చాలా దేశాలనుంచి వచ్చి మంచుమనిషిపై హిమాలయాలలో పరిశోదిన్చారుకాని అని ఫలితం శూన్యం. 20 04, 7, 8 11. లలో కూడా కష్టపడ్డారు. రష్యాలో 20 11 లో ఒక కాన్ఫరెన్స్ జరిగి సైంటిస్ట్ లు తాము సేకరించిన సాక్ష్యాదారాలలో తొంబై ఐదుశాతం యేతి ఉన్నట్లు రుజువైందని చెప్పారు. కాని అందులో పాల్గొన్న అమెరికన్ ఆన్త్రో పాలజిస్ట్, అనాటమిస్ట్ జెఫ్రీ మెల్ డ్రంమాత్రం వారితో ఏకీభవించక అదంతా స్థానికులు ప్రచారం కోసం చేసిన స్టంట్ అని తెల్చిపారేసి వాళ్ళ ఆశలపై నీళ్ళు కుమ్మరించాడు. కనుక ఇప్పటికి" ఏతి" నేతి నేతి గా నే ఉంది. "యతి "అనుకొంటే మళ్ళీ సందేహాలు రావు. బ్రహ్మ పదార్ధం సిద్ధించినట్లే

## 12 మౌన యోగి మరియు బ్రామ

### మౌన యోగి(the sage who never speaks )

ఒక చిన్నతాళాలు వేసిన గది లో ఆయన ఒక్కరే పద్మాసనం లో కూర్చుని ఉన్నారు. గోచీ గుడ్డ తప్ప యే వస్త్ర ధారణా లేదు. అప్పటికే సమాధి స్తితి లో ఉన్నారు. భౌతిక విషయాలేమీ ఆయన కు తెలీవు. ఆయన చిరు నవ్వు, లో ప్రపంచాన్ని జయిన్చానన్న భావం గోచరిస్తోంది. కళ్ళు తీక్షణం గా దేనినో వెతుకు తున్నాయన్నట్లుంది. అది ఐర్వచనీయ సమాధి. ఆయనకే అనుభావై క వేద్యం. కళ్ళు ఆర్పటం లేదు. కను రెప్ప కూడా కదలటం లేదు. అలా రెండు గంటల నుండి ఉండి పోయారు. ఆయన మనసు ఇతే, ఇహ లోక జ్ఞానం ఉండదు. శరీర భాగా లన్ని నిద్ర పోతాయి. వాటికి చలం ఉండనే ఉండదు. అప్పుడప్పుడు కను కోణాల నుండి, ఒక నీటి బిందువు రాలు తోంది. దృష్టి ని కేంద్రీకరించటం వాళ్ళ కన్నీటి గ్రంధుల పని ఆగి పోయింది. ఒక కాంశ్య విగ్రాహం లా గా అని పిస్తున్నారు మౌన యోగి.

ఆయన శ్వాస జరుగు తూనే ఉంది. అదీ చాలా నిదానం గా. అది ఎవ్వరికీ వినపడ నంత గా ఉంది కాని చాలా క్రమ బద్ధం గా, లయ గా శ్వాశిస్తున్నట్లు కన బడు తోంది. ఆయన ఈ శరీరాన్ని వదల లేదు అని చెప్పటానికి శ్వాస ఒక్కటే ఆధారం అని పిస్తుంది. ఆయన గురించి బర్టన్ చాలా విన్నాడు, తెలుసు కొన్నాడు అయినా అన్నీ సందేహాలే. మౌన యోగి వివరాలు ఆయన దగ్గర నిరంతరం ఉన్న అతన్ని అడిగాడు. అతను చెప్పటం ప్రారంభించాడు. స్వామి ఎప్పుడు వచ్చాడో, ఎక్కడి నుండి వచ్చాడో తెలీదు. ఇంతవరకు ఎవ్వరి తోను మాట్లాడి నట్లు గమనించలేదు. ఎవరి గురించీ ఆయనకు తెలీదు. ఎవరి గురించీ అడ గరు. ఇక్కడికి వచ్చి ఎనిమిదేళ్ళు అయింది. అప్పుడప్పుడు కొబ్బరి చిప్పలో అన్నాన్ని అడిగి వేసింది తినే వాడు. రోడ్డు మీద ఒక చెట్టు కింద ఎత్తైన రాతి మీదే ఆయన జీవితం. ఎండా, వాన, చలి అంతా అక్కడే. ఆయన కూర్చునే విధానం ఎప్పుడూ మారలేదు. యువకులు ఆయన్ని హేళన చేస్తున్నా, వారిసేమీ అనే వాడు కాదు. ఒక సారి మద్రాస్ వెళ్తున్న ఒక పెద్ద మనిషి ఈ దృశ్యం చూశాడు. వెంటనే మద్రాస్ నుండి ఇక్కడి పోలీసులతో చెప్పి ఆ మౌన యోగికి రక్షణ కల్పించే ఏర్పాటు చేశాడు. పోలీసు వచ్చి ఆయన్ను ఎంతో అడిగితే కాని తన గురించి చెప్పలేదు.

''నేను మారకాయర్ అనే గురువు శిష్యుడిని. ఆయన నన్ను దక్షిణ మద్రాస్ కు వెళ్ళ మని ఆదేశించారు. ఇక్కడ ఉండటానికి అనువు గా ఉందని చేరాను. నాకు ఇహ భోగాల మీద ఆసక్తేమీ లేదు. సత్య దర్శనం కోసమే జీవిస్తున్నాను'' అని యోగి చెప్పాడు.. మరకార్ అంటే ఆ మధ్యనే చని పోయిన మహమ్మదీయ గురువు అని పోలీసాఫీసరు గ్రహించాడు. మద్రాస్ లో ఆయన చాలా మంది కి తెలుసు. ఒక బంగ్లా లో బస ఏర్పాటు చేస్తానంటే వద్దన్నాడు. అప్పుడు ఇప్పుడున్న గది లో ఉంచి తనను సేవకుని గా నియ మించారని మౌన యోగి దగ్గరుండే సేవకుడు చెప్పాడు. యోగి కి ఒక్క డంటేటే ఒక్క శిష్యుడు కూడా లేడు. ఏకాంతం గా ఆత్మ ముక్తి కోసమే ఆయన ఉంటున్నారని చెప్పాడు '

సంచార యోగి మరిన్ని వివరాలు చెప్పాడు. ఇక్కడికి రవా టానికి ముందు మౌన యోగి సైన్యం లో సిపాయి గా పని చేశాడు. తర్వాత మారకాయర్ శిష్యుడైనాడు. మౌన యోగి నుండి తనకు ఏదో ''టెలి పతిక్ ''కరెంటు తనను ఆవేశించి నట్లు గా పాల్ బ్రంటన్ అభి ప్రాయ పడ్డాడు. ఆయన తన దృష్టిని. ఆలోచన ల కన్నాలోతుగా కేంద్రీక రించటం వల్ల ఆయన చేతన అంతా విశ్రాంతి స్తితి లోకి వెళ్ళింది. ఇదే ప్రపంచం కంటే ప్రేమ గా మారి పోయింది. ఆ ఆత్మా నందం లో రమిస్తూ జీవితాన్ని ధన్యం చేసుకొంటున్నారు మౌన యోగి ''అని పాల్ అభి ప్రాయ పడ్డాడు. అంతటి తాదాత్మ్య స్తితిని పొందిన ఒక మహా యోగి ని దర్శించి నందుకు తన జన్మ ధన్యం అయిందను కొన్నాడు బ్రంటన్.

బ్రామా -(the yoga which conquers death )

బ్రామా నిరంతర సాధకుడు. అడయార్ దగ్గర ఉండే వాడు. బ్రంటన్ ఈయనను సందర్శించి, ఆయన అనుభూతులను తెలుసు కొన్నాడు. ఈయన చక్క గా మాట్లాడి వివరించాడు. యోగా విద్య లన్ని పూర్తిగా గురు ముఖం గా బ్రామా నేర్చుకొన్నాడు. ఆయన చూపే అద్భుతాలు మనల్ని వివశుల్ని చేస్తాయి. ఒక సారి పాల్ వెళ్లి నప్పుడు బ్రామా శిలా విగ్రహం లా గా కూర్చుండి పోయాడు. కదలిక లేనే లేదు. ఆయన గుండె చప్పుడు క్రమంగా క్షీణిస్తోంది. చివరికి గుండె కొట్టు కోవటం మానేసింది. అలా యేడు సెకన్లు గడిచింది. చని పోయాడను కొన్నాడు. రక్షించాలి అనే ప్రయత్నం లో పాల్ ఉన్నాడు. క్రమం గా శరీర అవయవాలు కదలటం ప్రారంభించాయి. హమ్మయ్య అనుకొన్నాడు. మళ్ళీ గుండె కొట్టు కోవటం ప్రారంభించింది. మామూలు మనిషి అయాడు బ్రామా. ''గుండె ఆగి పోవటం గమనించావా ? అని బ్రామా అడిగాడు. ''స్పష్టం గా. అది విభ్రాంతి కాదు ''అని స్పష్టం చేశాడు బ్రంటన్. ఇదేమీ గొప్ప విషయం కాదని తన గురువు రక్త ప్రసరణ ను కూడా ఆపి వెయ గల సమర్దులని తెలిపాడు. బ్రామా ను ఆ విధానం చూపించ మని అర్ధించాడు పాల్.

బ్రామ బ్రంటన్ ను తన మణి కట్టు వద్ద నాడిని పట్టు కో మన్నాడు. అప్పుడు రక్త ప్రసరణ స్పష్టం గా కనీ పించింది పాల్ కు. రెండు లేక మూడు నిమిషాల తర్వాతా క్రమంగా రక్త ప్రసరణ తగ్గు తున్నట్లు గమనించాడు. నాడి స్పందన తగ్గుతోంది. మరి కొద్ది సేపటికి నాడి కొట్టు కోవటం ఆగి పోవటం స్పష్టం గా గమనించాడు బ్రంటన్. పల్సు ను ఆపేశాడు బ్రామా. తర్వాత మూడో నిమిషం వరకు అలాగే నాడీ స్పందన ఆగి పోయింది. నాలుగో నిమిషానికి నెమ్మది గా స్పందన ప్రారభం అయి నట్లు గమ నించాడు. చివరకు మామూలు గానే నాడి కొట్టు కుంది.. పాల్ ఆశ్చర్య పోయాడు. ''ఇదేమీ ఆశ్చర్య పడాల్సిన విషయం కాదు ''అన్నాడు బ్రామా తాపీగా. ''కావాలంటే శ్వాస కూడా ఆపేస్తాను చూస్తావా ''అన్నాడు. సరే నన్నాడు పాల్.

బ్రామా కళ్ళు మూసుకొన్నాడు. తన ఉచ్వాస, నిస్సృశాలను గమనించమని ముందే చెప్పాడు. అలాగే చూస్తున్నాడు పాల్. బ్రామా ఒక రాయి లాగా మారి పోయాడు కాసేపటిలో. ఒక రక మైన సమాధి స్తితి లోకి వెళ్లి పోయాడు. ఆయన ముక్కు దగ్గర వేళ్ళు పెట్టి చూశాడు పాల్. ఎక్కడా ప్రాణ స్పందన కనీ పించలేదు. శ్వాస పూర్తిగా స్తంభించి పోయింది. ఆయన నాసా పుటాలను,, భుజాలను,, పెదిమలను, చాతీ ని అన్నీ తట్టి చూశాడు. కాని, ఎక్కడా ప్రాణం

కనీ పించలేదు. ఒక పాలిష్ చేసిన అద్దం తెచ్చి ముక్కు పుటాల దగ్గర పెట్టాడు. శ్వాస జరిగితే దాని పై నీటి బిందువులు ఏర్పడాలి. అదీ లేదు. పెదిమల దగ్గర పాలిష్ చేసిన ఇత్తడి పళ్ళెం పెట్టాడు. ఎక్కడా నీటి బిందువుల జాడే లేదు. అంటే ఖచ్చితం గా శ్వాస ఆగి పోయిందని నిర్ణయానికి వచ్చాడు బ్రంటన్. తాను ఊహించని విషయాలు బ్రామా చేసి చూపించటం తో "మైండు బ్లాక్ " యిపోయింది పాల్ కు. యోగా అంటే పనికి మాలింది అని ఇప్పటి దాకా అనుకొన్నందుకు సిగ్గు పడ్డాడు. బ్రామా క్రమం గా స్పృహ లోకి వచ్చాడు. "ఎంతో గొప్ప గా ఉంది "అని పొగిడాడు దాని విధానం వివరించమని బ్రామా ను కోరాడు. అలా చెప్పలేమని ఇదంతా" అడ్వాన్సుడు యోగా" కు చెందినక్రియలు అని తెలిపాడు.

" వీటి లో ఇమిడి ఉన్న సూత్రం ఏమిటి "అని అడిగాడు పాల్. "కొన్ని జంతువులను గమనిస్తే మనకు చాలా విషయాలు తెలుస్తాయి. ఏనుగు చాలా నెమ్మది గా శ్వాసిస్తుంది. అందుకే ఎక్కువ కాలం బతుకు తుంది. పెద్ద సర్పాలు ఇంకా నెమ్మదిగా శ్వాసిస్తాయి. కనుక ఎక్కువ కాలం జీవిస్తాయి. హిమాలయాల్లో శీతా కాలం లో చాలా జంతువులూ "వింటర్ స్లీప్ "లోహిమాలయ గుహల్లో ఉంటాయి. అక్కడ ఒక్క సారి కూడా శ్వాస పీల్చుకోవు కొన్ని వారాల తరబడి. హిమాలయ ఎలుగు బంట్లు ధృవపు ఎలుగు బంట్లు ఇలానే చలికాలం గడుపు తాయి. కొన్ని నెలలు ఇలా ఉండగలవు. శ్వాస ను నిలిపి వేసుకొంటా యి. ప్రాణం నిరంతర కొనసాగుతుంది. చావు శరీరానికి ఒక అలవాటు మాత్రమె. "

రాజా రంజిత్ సింగ్ హరిదాస్ అనే ఒక ఫకీరు నులాహోరు లో ఒక సమాధిలో బంధించాడు.. ఆ తర్వాత బ్రిటీష సైన్యం,రంజిత సింగు సమక్షం లో ఆ సమాధి ని తవ్వి చూశారు. ఆరు వారాల తర్వాత కూడా ఆ ఫకీరు జీవించే ఉండి హాయిగా నవ్వు కొంటూ బయటికి వచ్చాడు. ఇది ప్రభుత్వ రికార్డు లలో నమోదై ఉంది. ఆత్మ బలం తో శ్వాస ను నిరోధించుకొని ఆ యోగి చావు నుండి తప్పించుకొన్నాడు. ఇవన్నీ యోగ రహస్యాలే. వీటిని గురువు సమక్షం లో అభ్యాసం చేయాలి. వీటిని ప్రదర్శన గా చేయ రాదు. అయితే వాటి పై నమ్మకం కలిగించటానికి అప్పుడప్పుడు తప్పదు.

మరి కొన్ని విషయాలు

బదరీనాద్ దగ్గర వాలీ ఆఫ్ ఫ్లవర్స్ ఉంది. అవి వికసించే కాలం లో అందరూ వెళ్లి చూసి మహదానందం పొందుతారు అనేక రంగులు రకాలు వాసనలతో కనులకు వైభోగం ఉంటుంది. అయితే ఆ పూల వాసన ఎక్కువ సేపు పీలిస్తే మత్తు మైకం వచ్చి జ్ఞాపక శక్తి తాత్కాలికంగా కనుమరుగౌతుంది కొన్ని గంటల ఆతర్వాత కాని మళ్ళీ విషయాలు గుర్తుకు రావు.. ఇక్కడే సిక్కుల గురుద్వారాకూడా ఉంది










వారణాసి లో ఒక వేశ్య ఉండేది. ఆమె పేరు బాగా ప్రచారం లో ఉండేది. ఒక చిన్న బోటు లో గంగానదిలో ఉండేది బోటు బయట "నేను వేశ్యను నన్ను సాధువుగా అపార్థం చేసుకోవద్దు నన్ను ప్రశాంతంగా ఉండనివ్వండి భంగం కలిగించవద్దు "అని బోర్డ్ ఉండేది. సాయం సమయం లో నీటినుంచి బయటికి వచ్చి ఇసుక తిన్నెలపై కూర్చుని ఏకాంతంగా మంత్రాలు చదువుకొనేది వేలాది మంది ఆమెతోపాటు చదివే వారు.. ఎవరితోనూ మాట్లాడేదికాదు సౌజ్ఞలు చేసి తనతోపాటు దైవ స్మరణ చేయమని చెప్పేది. ఒక రోజు సాయంత్రం దాదాపు ఆరు వేలమంది ఆమె దగ్గర ప్రార్ధనలు చేస్తుంటే "నేను ఉదయానికల్లా వెళ్లి పోతాను నా శరీరం గంగలో పడెయ్యండి '.అది చేపలకన్నా ఆహారంగా ఉపయోగ పడుతుంది "అని చెప్పింది. చెప్పినట్లే మర్నాడు ఉదయం ఆమె దేహం చాలించింది ఆమె కోరిక తీర్చారు భక్తులు.





మహాత్మా గాంధి నడుస్తుంటే చాల తమాషా గా ప్రత్యేకంగా ఉంటుంది మునుల మహర్షుల నడకకంటే అతి భిన్నంగా ఉంటుంది. ఆయన నడుస్తుంటే ఆయన -శరీరం నుంచి విడిపోయినట్లు కనిపిస్తుంది. గుర్రం బండిని లాగినట్లు ఆయన శరీరాన్ని లాగుతూ నడుస్తున్నట్లు అనిపించటం విశేషం. దీన్ని ఆటెన్ బరో తీసిన గాంధి సినిమాలో గాంధీగా నటించిన బెంక్లిన్ చక్కగా చూపించాడు దీనికి కారణం అయన ఎప్పుడూ కులమతాలకు అతీతంగా అందరినీ ప్రేమించటం అందరి క్షేమం కోసం ప్రార్ధించ టమేఅంటారు.. ఆయన కు ముగ్గురు గురువులు క్రీస్తు కృష్ణుడు బుద్ధుడు.

స్వామి బ్రహ్మానంద అరుదైన సిద్ధుడు. శ్రీ విద్యపై నిష్ణాతుడు. ఆయనకున్న అద్భుత శక్తులను గుర్తించి స్వామి కరపత్రి అనే మహా విద్వాంసుడు ఆయనను మూడు వందల ఏళ్ళుగా ఖాళీ గా ఉన్న ఉత్తర శంకరాచార్య మఠానికికి పీఠాధిపతి గా ఉండమని కోరగా అయ్యాడు. వేలాదిమంది అనుచరులతో యాత్రలు చేసేవాడు భక్తిని అద్వైతం తో జోడించి ప్రసంగించటం ఆయన ప్రత్యేకత. స్వామి బ్రహ్మానంద వద్ద అరుదైన కెంపు లతో చేయబడిన శ్రీ యంత్రం ఉండేది







## 13 భూమి లోపల ఉన్న మనకు తెలియని అనంత లోకాలు

### 12 వేలాది సంవత్సరాల వయసున్న యోగులు

ఆధారం –మా అమ్మాయి శ్రీమతి విజయలక్ష్మి అమెరికా నుంచిపంపిన కుర్తాళం పీఠాదిపతి శ్రీ ప్రసాద రాయకులపతి వారి వీడియో –యుట్యూబ్ aa

"భూమిలో ఇప్పటికీ లోకాలున్నాయని, పట్టణాలున్నాయని అనేకమంది నమ్ముతున్నారు ఇప్పటికీ. హిమాలయ సిద్ధయోగులు భూమిగుండా వెళ్లి ఆలోకాలను దర్శిస్తారని నమ్మకం. 1947 ప్రాంతం లో అమెరికా యుద్ధ విమాన అధికారి అడ్మిరల్ బర్డ్ ఆర్కిటిక్ పర్వతప్రాంతం దగ్గరకు ఒక రౌండ్ తిరిగి మళ్ళీతిరిగి వచ్చేద్దామని చిన్న విమానం లో బయల్దేరి వెళ్ళాడు. ఒక చోట కాసేపు ఆగాడు. ఇంజన్ చెడిపోయింది. బాగు చేయటానికి చలాప్రయత్నించాడుకాని బాగు కాలేదు. ఆహారం లేదు అలసిపోయాడు. ఏం చేయటానికి తోచలేదు. ఇంతలో ఒకపెద్ద మంచు పెళ్ల ను పైకి లేపుకొని ఒకమనిషి బయటికి వచ్చి "బర్డ్ !రా నాతో రా "అని పిలిచాడు ఆశ్చర్యపోయి చూశాడు అడ్మిరల్ బర్డ్. సరే అని దగ్గరకు వెళ్ళాడు. ఆ మనిషి "నీ విమానం చెడిపోయింది. బాగు కాలేదు చాలా ఆకలి, దాహంతో బాధ పడుతున్నావని నాకు తెలుసు నాతో రా. ఆహారం తీసుకొని కాసేపు విశ్రాంతిపొందుదువుగాని రా "అని తనతో పాటు పెద్ద భూ గృహం లోకి

తీసుకు వెళ్ళాడు. అక్కడినుంచి మరికొంచెం లోపలి వెడితే, అక్కడ చాలామంది మనుషులులు కనిపించారు. అక్కడ ఆగి "నువ్వు ముందు గా ఆహారం తీసుకో "అన్నాడు ఆ కొత్తాయన "'అసలు మీ రెవరు బాబూ "?అని బ్రహ్మానందం లాగా ప్రశ్నించాడు. "అవన్నీ తర్వాత చెబుతాను"అని చెప్పి ఒక ఆకుపచ్చటి ద్రవం తాగటానికి ఇచ్చాడు. దాన్ని తాగాడు ఆకలి పూర్తిగా తీరిపోయింది. "అసలు మీ రెవరు స్వామీ !భూమిలో ఇలాంటి ప్రదేశాలున్నాయని నేను వినలేదు కనలేదు ఆశ్చర్యంగా ఉంది ఎవరు మీరు ఇదేమిటి అంతా"?అని మళ్ళీ అడిగాడు.

అప్పుడు ఆ ఆగంతకుడు బర్డ్ తో "ఇది భూలోకలోకం. ఇక్కడ అనేక వందల, వేల సంవత్సరాల వయసున్న మనుషులున్నారు. భారత దేశం లో హిమాలయ ప్రాంతం లో "శంబల "అనే గ్రామంలో పరమేశ్వరుడైన నారాయణ దేవుడు ఉంటాడు. ఆయన అధీనం లో మేమందరం ఉంటాం. భూమిలో అనేక ప్రదేశాలలో ఇలాంటి పట్టణాలున్నాయి. లోపల కొన్ని వేలనుంచి లక్షలమందిదాకా జనం ఉంటారు. మేమందరం భూ ప్రపంచం లో ఉన్న సకల మానవాళి సుఖ సంతోష శాంతం తో ఉండాలని ఎప్పుడూ కోరుకొంటాం. కానీ మీరేమో హైడ్రోజన్ ఆటం బాంబులు వేసి మానవుల్ని చంపేస్తున్నారు. అలాంటి మానవ హననం చేయవద్దని నీకు చెప్పటానికే ఇక్కడికి మేము నిన్ను పిలిపించాం. నువ్వు వెళ్లి మీ వాళ్లకు నచ్చ చెప్పు "అన్నాడు. "నేను చెబితే ఎవరు వింటారు ?నేనొక చిన్న అధికారిని. నా మాటకు విలువ యిస్తారనుకోను "అన్నాడు బర్డ్ సౌమ్యంగా. "కాదు. నువ్వు ఇక్కడ చూసింది,విన్నదీ పూర్తిగా వివరించి మీ వాళ్లకు మా మాటగా చెప్పు.నీ విమానం బాగైంది. నువ్వు నిక్షేపంలా నీ ప్రయాణం సాగించవచ్చు వెళ్లిరా "అని చెప్పి పంపించారు.

విమానం ఎక్కి ఆర్మీ అధికారులను చూడటానికి వెడితే వాళ్ళు "ఏమిటి ఎక్కడున్నావ్ ఇంతాలస్యం చేశావేమిటి "అని ప్రశ్నల వర్షం కురిపించారు. అప్పుడు బర్డ్ వారికి తాను చూసిన, విన్న విశేషాలన్నీ వివరించాడు. వాళ్ళు విపరీతంగా నవ్వి "లైట్ తీసుకొని "ట్రాష్. ఈమాటలు ఎక్కడైనా చెబితే నువ్వు పెర్రి బాగులవాడివని తాటాకులు కడతారు. నిన్నెవ్వరూ నమ్మరు "అన్నారు ఆర్మీ ఆఫీసర్. అతడు "నమ్మినా నమ్మకపోయినా ప్రెస్ కాన్ఫరెన్స్ పెట్టి ఆ విశేషాలన్నీలోకానికి వెల్లడిస్తాను "అన్నాడు బర్డ్. "ఇది ఆర్మీ డిసిప్లిన్ కు చెందిన విషయం. నీకు అనుమతినివ్వం "అన్నారు ఆఫీసర్లు. తనమనసులోనే ఇవన్నీ భద్రంగా దాచుకొని బర్డ్ తాను రిటైర్ అయ్యాక ఈ కథనం అంతా లోకానికి ఎలు గెత్తి చాటాడు. ఇంగ్లీష్ లో గొప్పరచయిత అయినయునేస్కోల్ తో కలిసి తన అనుభావాలన్నిటినీ రాసి ఒకపుస్తకం గా ప్రచురించాడు బర్డ్. అది ఇంటర్నెట్ లో "అగర్తా "అనే పేరుతో అందరికీ లభ్యంగా ఉంది. అందులో ఫోటోలు విశేషాలు అన్నీ చాలా వివరంగా ఉన్నాయి.

పాతాళంలోకి వెళ్ళే మార్గాలున్నాయి ప్రపంచం లో చాలా చోట్ల. పాతాళం లో చాలామంది మహానుభావులున్నారు. వారు భూమిపైకి వచ్చి లోకోద్ధారణ చేస్తుంటారు. ఇలాంటి వారితో సన్నిహిత సంబంధమున్న మనుషులున్నారు భూమిపైన. రష్యాలో కూడా ఇలాంటి కాంటాక్ట్ లున్న వ్యక్తులున్నారు. ఇతర చోట్లకూడా ఉన్నారు. అమెరికాలోని కొలరాడో లో డెన్వర్ దగ్గర ఉన్న గుహలలో నుంచి ఆలోకాలకు వెళ్ళటానికి మార్గాలున్నాయి. అక్కడ జ్వాలా కూల్ అనే సిద్ధపురుషుడు న్నాడు. ఆయనకు సుమారు అయిదు వేలసంవత్సరాలవయసు ఉంటుంది. హిమాలయప్రాంతాలలో చాలాచోట్ల పాతాళం లోకి వెళ్ళే మార్గాలున్నాయి. కాశీలో,శ్రీశైలం లో కూడా ఉన్నాయి.

కొద్దికాలం క్రితం ఫ్రాన్స్ లో సోఫియా అనే అమ్మాయి కి ఒక హిందూ యోగి ఒక మంత్రాన్ని ఉపదేశించాడు. ఆమంత్రాన్ని దీక్షగా జపం చేసింది. ఒక రోజు ఆమె మనో భూమిక అంటే మెంటల్ ప్లేన్ లో ఆమెకు ఒక మెసేజ్ వినిపించింది.. అందులో "కం టు హిమాలయాస్ –హిమాలయాలకు రా, సిద్ధాశ్రమానికి రా "అని వినిపిచింది.వెంటనే ఇండియాకు బయల్దేరి వచ్చి గంగోత్రి యమునోత్రి వగైరాలను ఒక గైడ్ సాయంతో సందర్శించింది. పదిరోజుల తర్వాత మళ్ళీ ఆమెకు "నీతోఎవరూ రాకూడదు వచ్చినవారిని వెనక్కి పంపించు "అనే మెసేజ్ వచ్చింది.తనతో ఉన్నవారిని వెనక్కి పంపేసి ఒక్కతే ముందుకు సాగింది. మంచు విపరీతంగా కురుస్తోంది. దారి కనపడటం లేదు. వచ్చినదోవకూడా కనిపించలేదు. బాగా అలసిపోయి "నేను చాలాలసిపోయాను. నన్ను ఇక్కడికి పిలిపించిన సిద్ధయోగులు, మహానుభావులు నాకు సహాయం చేయకపోతే ఇక్కడే కుప్పకూలిపోతాను "అన్నది సోఫియా.

ఇంతలో ఆవులమందలు దూడలతో మెడలో చిరుగంటల నాదం తో అక్కడికి వచ్చాయి. వాటితో సుమారు పన్నెండేళ్ళ బాలుడు మురళి చేతిలో పట్టుకొని వస్తున్నట్లు చూసింది. అతడితో "నాయనా !నేను సిద్ధాశ్రమానికి వెళ్ళాలి. దారి తెలియటం లేదు. నాకు సహాయంచేసి దారి చూపిచేర్పిస్తావా ?"అని అడిగింది. ఆ గోపకుమారుడు "నేను అందుకే వచ్చాను నా చెయ్యి పట్టుకొని భయం లేకుండా రా "అన్నాడు. అతడి చెయ్యిపట్టుకొని నడిచింది. ఆమె కళ్ళు మూసుకుపోతున్నాయి. గాలిలో తేలిపోతున్నట్లని పించింది. ఎంతదూరం వెళ్లిందో తేలీదు. ఆకుర్రాడు "ఇంక కళ్ళు తెరువు. "అన్నాడు.కళ్ళు తెరిచి చూస్తే చిన్న దేవాలయ గోపురం కనిపించింది "అది నీ ఇష్ట దేవత లలితా దేవి ఆలయం. వెళ్ళు "అని చెప్పి వెళ్ళిపోయాడు.

సోఫియా నెమ్మదిగా ఆ దేవాలయంలోకి వెళ్ళింది. అక్కడ ఆరు అడుగుల ఎత్తున స్ఫటిక మేరువు అంటే అమ్మవారి విగ్రహాలు పెట్టే పీఠం నుంచి శక్తి తరంగాలు రావటం గమనించింది. కళ్ళుమూసుకొని ధ్యానం చేసింది. ఇంతలో ఎవరో వచ్చి "అమ్మా !ఒక సమావేశం జరుగుతోంది "అని చెప్పి తీసుకు వెళ్ళాడు. అక్కడ ఒక వేదికపై ఒక యోగి కూర్చుని యోగ శాస్త్ర రహస్యాలు బోధిస్తున్నాడు. కాసేపటికి సమావేశం పూర్తయింది. ఆమెను తన కుటీరానికి తీసుకు వెళ్ళాడు. అతడిని ఆమె "యోగ శాస్త్ర రహస్యాలు చెప్పిన ఆయోగి ఎవరు. పాతిక ఏళ్ళు దాటి వయసు ఉన్నట్లు కనిపించదు "అని అడిగింది. అప్పుడతడు "అమ్మా ఆయనవయసు 112సంవత్సరాలు. ఆయనకు ముసలితనం రాదు. ఎప్పుడూ ఇలాగే కనిపిస్తాడు. ఎక్కడివాడో ఎవరికీ తెలియదు. ఆయన్ను జనకమహారాజు అని పిలుస్తాం.. ఆయన కుర్తాలం నుంచి వచ్చాడు. అదెక్కడో మాకు తేలీదు. "అన్నాడు. మూడు రోజుల ఆతర్వాత ఆమెను పంపిస్తూ "అమ్మా ఇక్కడ వందల వేల సంవత్సరాలవయసున్నయోగులు ఎందరో సిద్ధాశ్రమం లో ఉన్నారు. మళ్ళీ నీకు సమాచారం-మెసేజ్ వచ్చినప్పుడు ఇక్కడికి రా "అని వీడ్కోలు పలికాడు.

నోఫియా తనదేశం వెళ్లి ఈ అనుభవాలన్నీ ఒక గ్రంథంగా రాసిప్రచురించింది. నేను (కులపతిగారు )అమెరికాలోని బోస్టన్ లో ఉన్నప్పుడు ఒకతను నాదగ్గరకొచ్చి "కుర్తాలం ఎక్కడుంది ?" అని అడిగితే నేను "నీకెందుకు ?"అన్నాను. దానికతడు "నేనొక పుస్తకం లో కుర్తాలం స్వామి హిమాలయాలలో ఉండగా తానూ చూసినట్లు రచయిత్రి రాసింది. దాన్ని నేను ఇంగ్లీష్ లోకి అనువాదం చేశాను. కనుక కుర్తాలం విషయాలు పూర్తిగా తెలుసుకోవటానికి మీ దగ్గరకొచ్చాను "అన్నాడు. అప్పుడునేను '1879 లో ఆయన కుర్తాలం అనే చిన్న గ్రామం లో ఒక జమీందారుకు పుట్టాడు. అతడిజాతకం వేసిన పురోహితుడు అకుర్రాడు సన్యాసి అవుతాడు అని చెప్పాడు.ఆజమీందారు "మాకు సన్యాసి ఎందుకు?. మాకు వేలఎకరాల భూమి. అంతులేని సంపద, ధనం ఉన్నాయి వాటిని చూసుకోనేవాడు కావాలికానీ" అన్నాడు. "నేను జాతకం లో ఉన్నది చెప్పా అంతకంటే నాకు తెలీదు "అన్నాడు పురోహితుడు. ఆబాలుడు క్రమంగా పెరిగి స్కూలు కాలేజీ చదువులు పూర్తి చేసి ఒకసారి అరవిందాశ్రమం వెళ్ళాడు. అక్కడి మదర్ బాగా ఆదరించి",చదువుమానేసి హిమాలయాలకు వెళ్ళిపో " అని హితవు చెప్పింది. అలాగే వెళ్లి తపోధ్యానాలు చేసి సిద్ధుడై హిమాలయాల్లో గుహలో ఉన్నాడు. ఆయననే ఆ ఫ్రెంచ్ రచయిత్రి నోఫియా హిమాలయాల్లో చూసింది "అని చెప్పారు కుర్తాలం స్వామి ప్రసాదరాయ కులపతి.

## 14 నమ్మాల్సిన నిజాలు

అనేక పేర్లతో పిలువబడుతూ, అనేక వేల సంవత్సరాలుగా జీవిస్తున్నానని చెబుతూ, కాలా తీత సిద్ధ యోగిపుంగవునిగా ఉంటూ, తనను తానూ బ్రహ్మ స్వరూపునిగా ప్రకటిన్చుకొంటు, కబీర్ నానక్ లతో కలిసి తిరిగానని చెబుతూ నేపాల్ రాజ వంశీకులు తనకు 18 తరాలుగా శిష్యులని తెలియ జేస్తూ, కదలాడే మహేశ్వరునిగా భక్త జనం చేత భావింప బడుతు, బృందావన్ బాబా గా ప్రసిద్ధులై, అత్యంత శీతాకాలం లో కూడా గంగా, యమునా నదీ తీరాలలో మంచే మీద నే నగ్నం గా పద్మాసనం లో కూర్చుంటూ, ఆర్తత్రాణ పరాయణుడిగా పూజ లందుకొంటు, కేవలంరోజుకు వంద గ్రాముల అవుపాలను మాత్రమె ఆహారం గా స్వీకరిస్తూ, అహింసా మూర్తిగా, కరుణా మయుడుగా సార్ధక నాముడై, గోసేవా సంరక్షకుడై, త్రికాల దర్శి, మహాజ్ఞాని, అభయ ప్రదాత, సర్వాంతర్యామిగా, సాక్షాతూ భగ వంతుని సాకార రూపం గా అశేష జన సందోహం చేత కీర్తింప బడిన వారు బ్రహ్మర్షి "దేవ రాహో బాబా".(దేవారియా బాబా )





ఋషుల జన్మ ఏరుల జన్మ తెలియదు అన్నట్లే ఈ బాబా ఎక్కడివారో ఎప్పటి వారో తెలియదు. కాని వారి మహిమలు మాత్రం వర్ణనా తీతాలు. అందుకు కొందరుభారత రాష్ట్ర పతులు, ప్రధాన మంత్రులు సాక్షులు. వీరిని అనుగ్రహించటం, అవసరమైన వారికి ముందు హెచ్చరికలు చేయటంతో బాబా పై వారికి అపార నమ్మకం కలిగింది. ఇవి మనకు నమ్మలేని నిజాలు అని పించ వచ్చు. కాని ప్రత్యక్ష సాక్షులు చెప్పటం వల్ల అవి "నమ్మాల్సిన నిజాలు "అనినేను అనుకోని మీకు తెలియ జేస్తున్నాను.

ఒక సారి మన ప్రధమ రాష్ట్ర పతి డాక్టర్ రాజేంద్ర ప్రసాద్ గారి చిన్నతనం లో వారి తాత గారు ఈ కుర్రాడిని దేవరాహో బాబా దగ్గరకు తీసుకొని వెళ్ళారు. దారిలో తాతగారిని రాజేంద్ర ఆ బాబా ఎన్నాళ్ళనుంచి తెలుసు అని అడిగితె, నీఅంత వయసున్న దగ్గర్నుంచి అని సమాధానం చెప్పారు తాత. ఆ బాబా దగ్గరికి ఎందుకు వెళ్ళాలి అని ఈ చిన్నారి మరో ప్రశ్న. ఆయన్ను చూస్తె తన మనసు ఆనంద పరవశమవుతుందని తాత జవాబు. ఈ చిన్న వాడు ఆటతలాడుతు, బాబా ఆశ్రమంలో లో తిరిగాడు తాత కోప్పడ్డాడు. అప్పుడు దేవరాహో బాబా "వీడిని కోప్పడకండి. గొప్ప సంస్కారి వీడు. వీడికి నాఆశీర్వాదం ఎప్పుడూ

ఉంటుంది "అని చెప్పారు. ఈ బాలుడితో "నాయనా !నువ్వు రాజువు అవుతావురా "అని దీవించారు. నిజంగానే ఆయన రాష్ట్ర పతి అయ్యాడని మనకు తెలుసు. ఆ పదవిలో ఉండగా బాబాను దర్శించారుకూడా "నువ్వు రాజువురా "అన్నారు బాబా. దానికి సంస్కారంతో రాజెన్ బాబు "బాబా !దుమ్ముకణం ఆకాశం లో

ఎగురుతుంది అది దాని గొప్ప కాదు. వాయుదేవుని దయతో దానికి ఆ అదృష్టం పట్టింది. మీ ఆశీర్వాద ఫలితం గానే నేను ఇంతవాడినయ్యాను ఇది నా గొప్ప తనం కాదు "అని ఏంతో వినయం గా తెలియ జేశారు. ఈ విషయాన్ని రాజేంద్ర ప్రసాద్ తన ఆత్మ కద లో ఆయన రాసుకొన్నారు కూడా.

పాలకోట రాజు శ్రీ కృష్ణ సాహ దేవ్. ఆ రాజ్యం లో ఒకప్పుడు విపరీతం గా ఎలుగు బంట్లు అడవుల నుండి వచ్చి జనాన్ని చీకాకు పరచేవి. ఎన్ని రకాల ప్రయత్నించినా పార ద్రోల లేక పోయారు. అప్పుడు దేవరియా బాబా ను దర్శించి భారం ఆయన మీదే వేశాడు రాజు. ఆయనా చెప్పినట్లు రాజు రెండు వేల మందికి సరిపోయే పూరీ, కూరా, హల్వా చేయించాడు. బాబా ఎవరికి అర్థం కాని భాషలో ఏదో పెద్దగా అన్నారు. అప్పుడు వేలాది భల్లూకాలు వచ్చాయి. వాటిని ఒక వరుసలో

కూర్చో బెట్టి విస్తర్లలో చేయించిన పూరీ కూరా హల్వా వడ్డింప జేశారు అవి ఏమీ మాట్లాడకుండా ఏంతో వినయం గా అవన్నీ తిని అందర్నీ ఆశ్చర్య పరచాయి. బాబా వాటితో "ఇక నుంచి మీకు మానవులేవ్వరు హాని చేయరు. మీరు కూడా మీ ఆవాసాలు వదిలి రా వద్దు "అని చెప్పారు అంతే అన్నీ క్రమ శిక్షణగా అరణ్యాలలోకి వెళ్ళిపోయాయి.మళ్ళీ ప్రజల మీద దాడి చేయలేదు. దీన్ని బట్టి బాబాకు ఎలుగు బంటి భాష తెలుసు అని పించిందని రాజు తన చిన్నతనం లో జరిగిన ఈ సంఘటను గుర్తు చేసుకొన్నాడు.

ఒక సారి హరిద్వార్ కుంభ మేళాలో ఒక మఠాధిపతి గారి ఏనుగు పిచ్చి పట్టి వీర విహారం చేస్తోంది. పోలీసుల వల్ల కూడా దాన్ని అదుపు చేయటం సాధ్యం కాలేదు. అప్పుడు దేవహారా బాబా దగ్గరకు వెళ్లి మొర పెట్టుకొన్నారు. ఆయన ఒక ప్రసాదం ఇచ్చి ఏనుగుతో తిని పించమని భంవార్ సింగ్ అనేఆయనతో చెప్పారు. ఏనుగు కు దూరం గా నిలబడి "దేవరాహా బాబా ప్రసాదం ఇది అని బాబా చెప్పినట్లు చెప్పి తినమన్నాడు భంవార్ సింగ్. అంతే ఏనుగు కిక్కురు మన కుండ నెమ్మదిగా ఆయన దగ్గరకు వచ్చి పండుతీసుకొని తినేసింది. సింగ్ గారి చేతిలో రెండో పండు ఉంది. దాన్ని కూడా ఇమ్మని తొండం సాచింది. ఆయన "ఈ పండు బాబా నాకు ప్రసాదం గా ఇచ్చారు "అని చెప్పగానే అర్ధమైనట్లు ఏనుగు తొండం వెనక్కి లాక్కుని ప్రశాంతం గా వెళ్లి పోయింది. ఆ మఠాధిపతి ఏంతో సంతోషించి ఏనుగును తీసుకొని బాబా ను దర్శించాడు. బాబా తన చేతులతో ఏనుగుకు ప్రసాదం తిని పించారు. ఆ తర్వాత ఆ ఏనుగును కుంభ మేళా లో ఊరేగించారు. ఇలా సకల జీవుల భాషా బాబాకు తెలుసు అని అంతా అర్ధం చేసుకొన్నారు

**ఆధారం –బ్రహ్మర్షి దేవరాహో బాబా –రచన- డాక్టర్ ప్రేమ చంద్ భా ర్గవ**

లోక్ నాయక జయ ప్రకాష్ నారాయణ గారికి కూడాఆరోగ్య విషయం లో దేవరహా బాబా ఏంతో తోడ్పడిన విషయం ఇప్పుడు తెలుసుకొందాం. ఇందిరా గాంధి ఎమర్జన్సీ విధించి ముఖ్య రాజ కీయ నాయకులను జైల్లో పెట్టించిన విషయం అందరికి గుర్తుండే ఉంటుంది. ఆ సమయం లో లోక్ నాయక జయ ప్రకాష్ నారాయణ ను కూడా వృద్ధాప్యం అని లెక్క చేయకుండా జైల్లో పెట్టారు. ప్రజాగ్రహం, స్వంత పార్టీలో వ్యతిరేకత గమనించిన ఇందిరా తన నియంతృత్వ ధోరణికి కొంత తగ్గి నాయకుల్ని జైలు నుంచి విడుదల చేయించింది. జయప్రకాష్ విడుదల అయిన తర్వాతా తీవ్ర మైన కిడ్నీ సంబంధ మైన జబ్బు చేసి బొంబాయి జేస్లోక్ హాస్పిటల్ లో చేరారు. డాక్టర్లు ఆయన్ను కాపాడటానికి శక్తి వంచన లేకుండా ప్రయత్నిస్తున్నారు.

ఆయన సన్నిహితులందరూ కలిసి ఈ సంక్షోభం నుంచి బయట పడద వేయ గల వారు ఒక్క "దేవా రాహా బాబా "మాత్రమె అని నిశ్చయించు కొన్నారు. సమాజ్ వాది పార్టీ నాయకుడు రామా నంద సిన్హా

లోక్ నాయకు కు అత్యంత సన్నిహితుడు. అంతేకాక బాబా పై అత్యంత భక్తీ విశ్వాసాలు కల వాడు.అతను వచ్చి బాబా ను పదేపదే జయప్రకాష్ ను కాపాడమని కాళ్ళా వేళ్ళా పడి వేడుకొన్నాడు. అప్పుడు బాబా "నాయనా !ప్రమిదలో నూనె అయి పోయిన తర్వాత ఒత్తిఎలా వెలుగుతుంది ?"అని ప్రశ్నించారు.అప్పుడు రామా నంద "నూనె మళ్ళీ పోస్తే వెలుగుతుంది కదా బాబా 'అలాగే జయప్రకాశ్ గారికి జీవితాన్నివ్వండి "అని ప్రార్ధించాడు. మళ్ళీ బాబా "నాయనా ఎవరు తన ఆయుర్దాయాన్ని జయ ప్రకాశ కు ఇవ్వటానికి ఒప్పుకుంటారు ?"అని ప్రశ్నించారు. వెంటనే రామా నంద "నేను ఇవ్వటానికి సిద్ధం బాబా. ఆయన్ను ఎలాగైనా బతికించండి "అన్నాడు. బాబా మళ్ళీ "నీఆయుర్దాయం అంతా ఇవ్వక్కర్లేదు. ఒక అయిదేళ్ళ ఆయుర్దాయాన్ని ఆయనకిస్తే చాలు. ఈ అయిదేళ్ళలో జయప్రకాష్ బతికి ఉన్నంత కాలం నీకోరికలేవీ నేర వెరవు నీకిష్ట మైతె ఆయన్ను కాపాడతాను "అన్నారు. ఆనందం గా రామానంద్ అంగీకరించారు. మళ్ళీ బాబా "నీ ఆయుర్దాయం తీసుకొని తానూ బతికానని జయప్రకాశ్ కు తెలిసిన మరుక్షణం ఆయనకు విరక్తి కలిగి అదే ఆఖరి క్షణం అవుతుంది. కనుక ఈ రహస్యం మన ఇద్దరి మధ్యనే ఉండి పోవాలి జయరకాష్ కు తెలియ నివ్వద్దు సుమా "అని హెచ్చరించారు

"నేను ధర్మ దేవతను జయప్రకాశ్ కోసం ప్రార్దిస్తాను. అప్పటి దాకా నువ్వు హరి నామ స్మరణ చేస్తూ ఉండు "అని చెప్పి కుటీరం లోపలి వెళ్లి పోయారు బాబా. అక్కడ చేరిన భక్తులందరూ రామానంద్ టో కలిసిజయప్రకాష్ కోసం హరి నామ స్మరణ భక్తిగా చేశారు. కొద్ది సేపటికి బాబా బయటికి వచ్చిరామానంద్ తో "నేను నారాయణ కోసం ధర్మ రాజు ఖాతాలో నీఆయుర్దాయం నుండి అయిదు సంవత్సరాలు జమ చేశాను. ఈ విషయం మాత్రం జయప్రకాశ్ కు తెలియ కూడదు "అని చెప్పి ఒక విభూతి పొట్లం ఇచ్చి నారాయణ్ తలదిండు కింద పెట్టమని చెప్పారు బాబా. కొన్ని ఉసిరికాయలు కిస్ మిస్ పళ్ళు రామానంద్ కు ఇచ్చి "నువ్వు నారాయణ్ ను చేరగానే ఆయనతో వీటిని తిని పించు. ఇదంతా శనివారం లోపే జరిగి పోవాలి "అని ఆదేశించారు. రామా నంద ఆనందం తో అలాగే నని బయల్దేరాడు. నాలుగడుగులు వేశాడో లేదో బాబా అతన్ని పిల్చి "నువ్వు జయప్రకాష్ ను ఇప్పుడు చేరలేవు. మరేవ్వరికైనా ఇచ్చి

పంపించు. ఆ వెళ్ళే మనిషికి ఈ ప్రసాదం తిని పించు. ఏ ఆటంకం లేకుండా అప్పుడు అతను రాయణ్ ను చేరగలడు "అని చెప్పారు.

రామానంద్ కు బాబా మాటల్లో అంతరార్ధం తెలియ లేదు. కొన్ని గంటల్లోనే ఆయనకు జ్వరం వచ్చి కదలలేక పోయాడు. బాబా మాటలు జ్ఞాపకం చేసుకొన్న రామా నంద పాట్నా లో ఉన్న తన స్నేహితుడు నారాయణ అనే వ్యక్తిని పంపాడు. ఈ నారాయణ బాబా ను ఎప్పుడూ చూసిన వాడు కాదు. వెంటనే బయల్దేరి బొంబాయి చేరి జయ ప్రకాష్ ను కలిశాడు. అప్పటికే చిక్కి శల్య వస్త లో ఉన్న జయప్రకాష్ ను చూసి దిగులు పడ్డాడు. "దేవా రాహా బాబా ఈ ప్రసాదం మీకు ఇమ్మన్నారు.తినండి "అని చెప్పికిస్ మిస్ నోట్లో వేసి, ఉసిరి రసాన్ని తీసి బాబా నోటిలో పోశాడు విభూతి పొట్లం దిండు కింద పెట్టాడు. నారాయణ్ దగ్గర ఈ నారాయణ సెలవు తీసుకొని పాట్నా చేరుకొన్నాడు. సాయంత్రం బజారులో ఒక దుకాణం దగ్గర ఆగితే ఆ దుకాణ దారు "జయ ప్రకాష్ నారాయణ్ చని పోయారు "అని ఏడుస్తూ చెప్పాడు. ఆశ్చర్యం వేసింది బాబా అబద్ధం చెప్పరుకదా అని పించింది.

**ఈ వార్త తో తెల్ల వార్లు నిద్ర పట్టక నారయణ చాలా బాధ పడ్డాడు**

పొద్దున్నే దిన పత్రిక చూస్తె "నిన్న రాత్రి జయ ప్రకాష్ ఆరోగ్యం విషమించింది. ఆయన్ను "ఇన్సెంటివ్ కేర్" లో చేర్చారు. అందువల్ల ఆయన చని పోయారనే వార్త లోకం లో వ్యాపించింది కాని అర్ధ రాత్రి అయిన తర్వాత ఆయన బాగా కోలుకొన్నారు. ఆహారం కూడా తీసుకొన్నారు. "అని రాసి ఉంది. జయప్రకాష్ బాబా దయ వాళ్ళ బతికారని ఏంతో సంతోషించిన నారాయణ బాబా కు జయప్రకాష్ గారి కృతజ్ఞతలు తెలియ జేయటానికి సరయూ నది ఒడ్డున ఉన్న బాబాను చేరాడు. రాగానే బాబా "జయప్రకాష్ ను కలిశావా ?కిస్ మిస్ తిని పించావా ?విభూతి దిండుకింద పెట్టావా ?'అని ప్రశ్నల వర్షం కురిపించారు. బాబా ను చూడటం నారాయణ కు ఇదే మొదటి సారి. తర్వాత బాబా దగ్గర శిష్యుడై దీక్ష తీసుకొన్నాడు

బాబా అనుగ్రహం టో జయ ప్రకాష్ నాలుగేళ్ళు జీవించారు. అయన ఆయుర్దాయాన్ని అయిదేళ్లకు పెంచారుకదా నాలుగేళ్ళకే ఎలా చని పోయారని భక్తులు బాబా ను ప్రశ్నించారు. బాబా నిర్లిప్తంగా" తన ఆయుర్దాయం పెరగటానికి కారణం జయప్రకాష్ కు తెలిసిన మరుక్షణం మనస్తాపానికి గురౌతాడు. అది ఆయన మృత్యువుకు కారణం అవుతుంది అని ముందే సూచించాను. ఆయనకు ఈవిషయం తెలిసింది వెంటనే శరీరం వదిలేశాడు "అని జరిగింది చెప్పారు బాబా.

తాను అత్యంత లౌకిక వాదినని, మత విశ్వాసాలు తన ఒంటికి పడవని, సోషలిస్ట్ భావాల పుట్ట నని మతం గీతం జామ్తానై అని కమ్యూనిస్టులను ప్రసన్నం చేసుకోవటానికి కుహనా లౌకికవాద నినాదాన్ని పూరించిన పండిట్ జవహర్ లాల్ నెహ్రు అవసరం వచ్చినప్పుడు, గతిలేక పోయి నప్పుడు వీటికన్నిటికి గుడ్ బై చెప్పి మతాధికారులను ఆశ్రయించాడు. ఆయనే కాదు ఆయన తండ్రి మోతీలాల్, కూతురు ఇందిర, ఆమె కొడుకు రాజీవ్ కూడామొత్తం "ఫామిలీ అంతా "" భవరాహ్ బాబా" ను అనేక సార్లు సందర్శించారు. వారి సందేహాలను నివృత్తి చేసుకొని, శిష్య పరమాణువు లై ఆజ్ఞలను ఔదల దాల్చిబాబా మహాభినిష్క్రమణ వరకు దీన్ని కోన సాగించిన న అపూర్వ సంఘటనల గురించే ఇప్పుడు మనం తెలుసుకో బోతున్నాం.

మోతీలాల్ నెహ్రు "బవారీ బాబా" కు ప్రీతి పాత్రుడైన శిష్యుడు. ఆయన తన కొడుకు జవహర్ కు చిన్నతనం లోనే బాబా దగ్గర దీక్ష ఇప్పించాడు. కాంగ్రెస్ పార్టీ పూర్తిగా రూపు దాల్చిన తర్వాత ఆ పార్టీకి ఎన్నికల గుర్తు

దేన్నీ తీసుకోవాలో తెలియక తబ్బిబ్బు పడ్డారు. ఏదీ నిర్ణయించలేక ఊగిస లాడారు.. అప్పుడు జవహర్ ఒక రోజు అనుకోకుండా "భవరాహ్" బాబా దగ్గరికి వచ్చాడు. సమస్యను బాబా కు విన్న వించి ఏదైనా" క్లీక్ "అయ్యే చిహ్నం కాంగ్రెస్ కు సూచించమని కోరాడు. అప్పుడు బాబా "పద్మ పురాణం లో విష్ణు భగవానుడు "ఆవు –దూడ "ను తన స్వరూపం గా భావించి ఆరాధించమని చెప్పాడు. కనుక ఈ "ఆవుదూడ "గుర్తునే నువ్వు కాంగ్రెస్ కు ఎన్నికల చిహ్నం గా తీసుకో. నీకు శుభం కలుగుతుంది. నువ్వు పండితుడివి కనుక "ధర్మం "మీద ద్రుష్టి పెట్టి ముందుకు సాగు "అని ఆశీర్వ దించాడు. అప్పటి నుంచి ఆవు దూడ యే కాంగ్రెస్ వాళ్ళ ఎన్నికల గుర్తు అయింది ఇందిరా స్వంత కుంపటి పెట్టి హస్తం గుర్తు పొందే దాకా.

1977-78 నెహ్రు కూతురు ఇందిర దేశమంతా "ఎమర్జన్సీ "విధించింది. ఆ సమయం లో ఢిల్లీ లోని "గో రక్షా సమితి "కార్యాలయాన్ని కూడా ఆమె కొడుకు సంజయ్ దగ్గరుండి కూల్చించాడు. అరాచకం పెరిగి పోయింది. అనేక అత్యాచారాలు జరిగాయి. ఇదంతా ఆమె కొడుకు సంజయ్ నిర్వాకమే. ఆమె పై అనేక ఆరోపణలొచ్చాయి. కేసుల్లో ఇరుక్కొంది. జనతా పార్టి చేతిలో చిత్తుగా ఆమె, ఆమె కాంగ్రెస్ ఓడి

అభాసు పాలైందన్న సంగతి మనందరికీ తెలుసు. ఆమెలో నిరాశ నిస్పృహ నిండి పోయి అడుగు ముందుకు వేయలేని పరిస్తితి వచ్చింది.

అప్పుడు ఇందిర బాబా ను సందర్శించింది "బాబా ! మీ రొక్కరే నన్ను "అమ్మాయీ" అని ఆప్యాయం గా పిలిచారు. జనం అంతా నన్ను ఏవగించుకొని దూరం అయ్యారు. నాపై కృప చూపండి. "మీ అమ్మాయి" ఇప్పుడు మీ చరణాలను ఆశ్రయించింది. దేశ సేవ చేయాలి అంటే అధికారం ఉండాలి ఇప్పుడది నాకు లేదు "అని గోడు వెళ్ళ బోసుకోంది. బాబా ఆమెతో "నువ్వు గో సేవ చేస్తే అప్పుడే దేశ సేవ చేసి నట్లు. గో గౌరవమే భారత మాత గౌరవం. గోవుకు కష్టం వస్తే భారత మాతకు కష్టం వచ్చి నట్లే. ఈ దేశం లో పేదరికం,దరిద్రం ప్రజల కష్టాలు పోవాలి అంటే గో సేవ యే మార్గం. ముందు గో సేవ తో ప్రారంభించు. అప్పుడు దేశ సేవ చేసే అదృష్టం కలిసి వస్తుంది. కుంగిపోయిన ఇందిరా "ఇక నుంచి గోసేవే నా పరమావధి నన్ను ఆశీర్వదించండి బాబా "అని ప్రాదేయ పడింది. "నీకు మరో సారి దేశ సేవ చేసే అదృష్టం వస్తుంది అయినా గో సేవ మరచి పోకు సుమా "అన్నారు బాబా. అప్పుడు ఇందిరా "మా నాన్న కు ఎన్నికల గుర్తు గా ఆవుదూడ "ను సూచించారు మీరు. ఇప్పుడు నాకు కూడా ఎన్నికల గుర్తు అవసరం ఉంది. దయతో సూచించండి "అని కోరింది "గో సేవ చేసే వారికి నాఆశీర్వాదం ఎప్పుడూ ఉంటుంది "అని చేయెత్తి ఆశీర్వ దించారు. గ్రహించిన ఇందిర "బాబా !మీ "హస్తం "చిహ్నమే నా పార్టీ కి ఎన్నికల గుర్తు గా అనుగ్రహించండి. "అంది. బాబా ఆశీర్వ దించి పంపిస్తూ "అమ్మాయీ !నా శిష్యురాలు" ఆనందమాయి "హరిద్వార్ లో ఉంది. నువ్వు అక్కడికి వెళ్లి గంగలో పవిత్ర స్నానం చేసి ఆమెను సందర్శించు.

ఎమెర్జెన్సీ లో జరిగిన అరాచకాలు, దౌర్జన్యాలకు గురి అయిన దీనుల, దరిద్రుల, సాధువుల, మహాత్ముల శాపం నుంచి నీకు విముక్తి కలుగు తుంది "అని చెప్పి కిస్ మిస్ పండ్లను ప్రసాదం గా ఇచ్చి, ఒక "నల్ల రంగు శాలువా" ఆమెకిస్తూ అది ఆమె దగ్గరున్నంత వరకు ఆమెకే కష్టం రాదు అని దీవించి పంపారు బాబా.

"హస్తం "గుర్తుతో ఇందిరా కాంగ్రెస్ పేర ఎన్నికలలో నిలబడి అపూర్వ విజయం సాధించిన ఇందిర బాబా ను దర్శించింది "బాబా !మీ అమోఘ ఆశీర్వాద బలంతో మీరు ఇచ్చిన హస్తం గుర్తు తో ఎన్నికలో గెలిచాను. మీ ఆశీర్వాదం అమోఘ శక్తి కలది. మీ వంటి యోగులు సిద్ధులను కన్న భారత దేశం ధన్యమైంది "అని బాబా పట్ల తనకున్న ఆరాధనా భావాన్ని వ్యక్తం చేసింది నెహ్రు కూతురు ఇందిర. ఇప్పటికి తాత, తండ్రి కూతురు ల బాబా భక్తీ ని గురించి తెలుసుకొన్నాం. తరువాత ఆమెకొడుకు రాజీవ్ బాబా యెడల ఎలా ప్రవర్తించాడో తెలుసుకొందాం

# కొందరు హిమాలయ యోగిపుంగవులు

## 1 యువరాజ స్వామి భావల్ సన్యాసి

ఈయన జీవితం ఒక వింతకథ. బెంగాల్ లో భావల్ ప్రాంత రాజు భావల్ సన్యాసి. పెళ్లి అయ్యాక అందమైన భార్యతో డార్జిలింగ్ లో హాయిగా గడుపుతున్నాడు. భార్య ఒక డాక్టర్ కు దగ్గరైంది. ఈ ఇద్దరూ కలిసి భావల్ ను చంపే ప్రయత్నం లో రోజు రాజుకు కొద్దిమోతాదు లో నాగుపాము విషాన్ని ఇంజెక్షన్ గా ఇవ్వటం ప్రారంభించారు. రాజు ఎందుకు అని అడిగితె అది బలానికిచ్చే ఇంకేక్షన్ అని నమ్మకంగా చెప్పేవారు. క్రమంగా డాక్టర్ డోసు పెంచాడు. రెండు నెలలతర్వాత రాజు అపస్మారకం గా ఉంటె చనిపోయాడని డాక్టర్ ప్రకటించి అంత్యక్రియలకు హిమాలయ పర్వత ప్రాంత సెల యేరు దగ్గర ఏర్పాటు చేశారు. చితి అంటించారు. భూమి ఆకాశం బద్దలయ్యేట్లు విపరీతంగా ఆగకుండా వర్షం కురిసి చితి ఆరి పోయి రాజు శరీరం ప్రవాహం లో కొట్టుకు పోయింది.



మూడు మైళ్ళు కిందకు కొట్టుకు పోయి స్వామి రామా గురువు ఆశ్రమం దగ్గరకు కాంచన గంగ నుంచి కుమయూన్ హిమాలయాలదాకా కొట్టుకు వచ్చి చేరింది. ఆయన తాళ్ళతో బంధింపబడిన శవాన్ని చూసి ఆ వ్యక్తి మరణించలేదని అపస్మారకం లో ఉన్నాడని, మామూలు శ్వాస నాడి కొట్టుకోవటం లేదని గ్రహించి శిష్యులను తాళ్ళు కోసేయమని అతడు తన శిష్యుడు అని చెప్పి పంపాడు. వాళ్ళు వెళ్లి అలానే చేసి, రాజును గుహలోకి తీసుకువచ్చారు. కొద్ది రోజులకు రాజు మామూలు స్థితి లోకి వచ్చాడుకాని గతం ఏమాత్రం గుర్తులేదు. గురువుగారి శిష్యుడయ్యాడు. అయన సన్యాస దీక్ష నిచ్చాడు. గురువు వద్ద ఏడేళ్ళు గడిపాడు.. తరువాత గురువు ఆయనను పుణ్య క్షేత్రాలు దర్శించమని,, యోగులను కలుసుకోమని చెప్పి పంపాడు., బాస్వాల్ సన్యాసి తప్పక తన అక్కగారి ఊరు వెడతాడని అక్కడ గతం జ్ఞాపకం వస్తుందని ముందే ఊహించి తనకు ఇక్కడ తపోభంగం జరుగుతోందని ఇంకా కొంచెం పైకి వెళ్లి అక్కడ ఉంటానని చెప్పి పంపాడు.

బాస్వాల్ సన్యాసి అనేక ప్రదేశాలు తిరిగి తిరిగి గురువు ఊహించినట్లే ఒక రోజు అక్కగారి ఊరు చేరి అక్క ఇంటికి భిక్షకు వెళ్ళాడు. ఆమె తమ్ముడిని గుర్తించి ఆహ్వానించింది ఆరు గంటలు ఆయనతో అక్క మాట్లాడిన తర్వాత కాని ఆయనకు గత స్మృతులు జ్ఞాపకం రాలేదు. అక్కడి బంధు మిత్రుల ప్రోద్బలంతో తానే రాజ్యానికి వారసుడినని కోర్టులో కేసు వేశాడు సాక్ష్యాధారాలన్నీ రాజు పక్షం లో బలం గా ఉండటం చేత తనకు విషం ఇంజెక్షన్ ఇచ్చిన డాక్టర్ విషాన్ని బొంబాయి లాబ రేటరి లో కొన్నట్లు రుజువు అవటం వలన, తనను భార్య ఆమె ప్రేమికుడైన డాక్టర్ ఎలా నయ వంచన తో మోసగించిందీ హిమాలయ స్వామి ఏ విధంగా ఆదుకున్నదీ ఆయన శిష్యుడుగా ఉన్న విషయం పూస గుచ్చి నట్లు తెలియ జేయటం వలన కేసు గెలిచి సంస్థానం డబ్బు సంపదా అన్నీ దక్కాయి. గురువు కోర్టుకు రాలేదుకాని శిష్యులను పంపాడు సాక్ష్యాలకోసం. కేసు ఎన్నో ఏళ్ళు నడిచింది. కేసు గెలిచి రాజ్యం సంపదా దక్కిన ఏడాదికి భాస్వాల్ సన్యాసి మరణించాడు ఈ కేసుతో గురు స్వామి విషయం ప్రపంచ మంతా తెలిసిపోయింది. ఈ గురువును వెదుక్కుంటూ అనేక ప్రదేశాలనుండి సాధకులు వెళ్లి శిష్యులయ్యారు గురువు ఎందుకు జనావాసాలకు దూరం గా ఉంటున్నారో అర్ధం చేసుకున్నారు.





## 2 ఆప్త మంత్రోపదేశికుడు -వాలా బాబా



ఒక్క గోచీ తప్ప ఏ రకమైన ఆచ్చాదన లేకుండా కాళ్ళకు పాద రక్షణ లేకుండా యెంత దూరమైనా నడిచే జడలు విపరీతంగా పెరిగి భూమిని ఆనుకోనేట్లు ఉన్న వాలా బాబా వద్ద ఆప్త మంత్రాన్ని నేర్చుకోమని స్వామి రామ గురువు పంపాడు. రామా కొన్ని రోజులు ఆయన గుహాలో ఉన్నాడు ఒక రోజు వాలాబాబా ఒక చెట్టు ఎక్కి అక్కడ ఉన్న పెద్ద తేనెటీగ తుట్టె దగ్గరకు వెడుతుంటే వద్దని స్వామి రామా ఆపాడు. వినకుండా తేనే తుట్టె దగ్గరకు చేరి తెనేటీగలతో నోటితో ఏదో మాట్లాడాడు. అంతే.అవి చెదర లేదు బెదరలేదు ఆయన్ని ఏమీ చేయలేదు. రామాను కూడా తేనెతుట్ట దగ్గరకు వెళ్ళమన్నాడు మంత్రం చెబితే వెడతానన్నాడు రామా చెట్టు ఎక్కాక చెబుతానన్నాడు వాలా. అలాగే చేయగా అప్పుడు తీనేటీగలతో "నేను ఇక్కడ మీతో ఉన్నాను మీకు హాని చేయను. నాకు హాని చేయద్దు "అని చెప్పమన్నాడు అది మంత్రం కాదుగా అన్నాడు రామా. వాటికీ నీ భాష అర్ధమవుతుంది చెప్పినట్లు చేయమన్నాడువాలా. కాని ఏమి చేయలేక అలానే చేశాడు. అవి రామా జోలికి రాలేదు. చెట్టు దిగగానే "ఇది నీకు మాత్రమె పనికొస్తుంది ఇంకా ఎవరికీ చెప్పద్దు "అని హెచ్చరించాడు వాలాబాబా. చాలా సార్లు స్వామి రామా అలానే చేసి తేనే సేకరించేవాడు. ఒక సారి పంజాబ్ లో ఉండగా ఒక కంసాలి మంత్రం చెప్పమని ప్రాధేయపడితే వాలా బాబా చెప్పింది మరిచి వాడికి చెప్పాడు. వాడు తేనే తుట్టె దగ్గర ఈయన చెప్పినట్లే చెబితే  ఆ మంత్రం పారక వందలాది తేనెటీగలు కుట్టి బాధిస్తే  హాస్పిటల్ లో చేరిస్తే కోమాలో మూడు రోజులు ఉండిపోయాడు విశ్వ బ్రాహ్మణుడు

..

## 3 నిప్పు స్వామి



హిమాలయాలలో ఒక స్వామి నోటినుంచి నిప్పు అంటే మంటలను వెదజల్లెవాడు.. చిన్న అగ్గి పుల్ల ఆపని చేస్తుంది కదా యోగ శక్తులను అంతర్ముఖం చేసుకో కుండా ఈ ప్రదర్శనలేమిటని గురువు ఈసడిస్తే ఆశ్రమం వదిలి వెళ్ళిపోయాడు.

## 4 నీమ్ కరోలి బాబా



నీంకరోలి బాబా కు ఎక్కడెక్కడ ఏమి జరిగిందో జరుగుతుందో తెలుసు. ఎవరైనా ఆయన్ను దర్శించటానికి వస్తే నువ్వు ఫలానా రోజున ఫలానా సమయం లో ఫలానా చెట్టు కింద నన్ను గురించి చెడ్డగా మాట్లాడావు గుర్తుందా ఇప్పుడు నన్ను చూడటానికి వచ్చావా వెళ్ళు వెళ్ళు అని తరిమేసేవాడు ఒక సారి ఆయన శిష్యుడైన ఒక ఫార్మసిస్ట్ దర్శించటానికి వచ్చాడు బాబా తనకు ఆకలిగా ఉందని ఆతని చేతిలో ఏది ఉంటె దాన్ని ఆహారంగా పెట్టమని కోరాడు. ఆతను తనదగ్గర ఆర్సేనిక్ ఉందని అది ప్రమాదమని వెంటనే భోజనం తెస్తానని అన్నాడు. బాబా అతని దగ్గర్నుంచి ఆర్సెనిక్ పౌడర్ లాక్కుని గుప్పెడు నిండా తీసుకొని గ్లాసెడు మంచి నీళ్ళతో తినేశాడు చచ్చి పోతాడేమో నని అందరూ కంగారు పడ్డారు. కాని బాబాకు ఏమీ కాలేదు మర్నాడు యదా ప్రకారం తన కార్య క్రమాలు చేసుకొన్నాడు.

బాబా ఎప్పటికప్పుడు ఆకలిగా ఉందనే వాడు. ఎదుటివారు ఆయన అంతక్రితమే భోజనం చేశాడని చెబితే "అయితే" వాకే "ఆకలి లేదు "అనేవాడు. ఒక రోజు ఆయన 45 సార్లు భోజనం చేశాడు. తన శక్తిని ప్రదర్శించాలని ఆయన తహతహ.. అంతటి గొప్ప స్థాయి ఉన్నబాబా పసిపిల్లడిలాగా ప్రవర్తిస్తాడు.

## 5 దిగంబర అస్సాం సన్యాసిని

అస్సాం కామాఖ్య దేవాలయం ప్రక్కనే చిన్న గదిలో ఈ దిగంబర సన్యాసిని ఉండేది. 96 ఏళ్ళ వయసు. ఆమె పగటిపూట గదిలో నుంచి బయటికి వచ్చి అప్పటికి 20 ఏళ్ళయింది గదిలోనే సమాధిలో ఉండిపోయేది. అయితే అర్ధరాత్రి దాటాక తెల్లవారు జామున మూడు గంటలకు ఆమె కామాఖ్యశక్తి దేవాలయానికి వెళ్లి మంత్రాలు చదువుతూ అమ్మవారిని పూజించేది. ఒంటి మీద నూలు పోగు కూడా ఉండేదికాదు. బక్క చిక్కి శాల్యావశిష్టమై ఎముకలకు చర్మం అతికించినట్లు ఉండేది. కళ్ళు మాత్రం అగ్ని గోళాలుగా ప్రకాశం తో ఉండేవి. స్వామి రామా ఆమె గది ప్రక్కనే మరో గదిలో ఉండేవాడు ఆమె చర్యలన్నీ గమనించేవాడు. ఒక రోజు రాత్రి ఆమె దేవాలయానికి వెళ్ళినప్పుడు చప్పుడు చేయకుండా తానూ వెనక వెళ్లి ఆమె చేసేవన్నీ చూశాడు. రావద్దని హెచ్చ రించి బెత్తం పెట్టి కొట్టి తరిమేసింది ఒక రోజు. అయినా ఈయన మానలేదు అప్పుడు రామా కున్న మారు పేరుతొ పిలిచింది ఆశ్చర్య పోయాడు ఈ నిక్ నేం ఆయన గురువుకు తప్ప ఎవరికీ తెలియదు. అప్పుడు స్వామి రామాను దగ్గర తీసుకుని తొడడ పై కూర్చో బెట్టుకొని"నీసాధనలో కొన్ని ఆటంకాలు ఎదురైనా ముందుకే వెడతావు నా శీస్సులు ఇస్తున్నాను "అని ఆశీర్వదించగా రామా కు స్వర్గం లో తల్లి ఒడిలో ఉన్నట్లనిపించింది. అర్ధ రాత్రి అంకమ్మ శివాలులాగా ఈ గుడిలో ఏం చేస్తున్నావని రామా ఆమెను చనువుతో అడిగాడు. శక్తి పూజ చేస్తున్నట్లు చెప్పింది. రాత్రి 12 నుంచి మూడువరకు నా దగ్గర ఎవరున్నా సహించలేను "అన్నది అందుకనే ఆ శక్తి దేవాలయానికి అర్ధ రాత్రి 12 నుంచి 2 వరకు మళ్ళీ 3 నుంచి నాలుగున్నర వరకు ఎవరూ దర్శించరు.స్వామి రామా ఆమెను మాతృ గురువు "గా మదర్ టీచర్ గా భావించాడు. చాలా శక్తి సామర్ధ్యాలు ఉన్న చాలా ప్రశాంతం గా ఉండేది. ఆమె ఏది చెబితే అది జరిగేది. ఆమె రాత్రి ఏనాడు నిద్ర పోయి ఎరుగదు తపో భంగిమలో కూర్చునే ఉండేది రాత్రంతా. ఒక రోజు స్వామిరామా "అమ్మా మీరు పడుకుని నిద్రపోతే మీ మీకాళ్ళకు మాసేజ్ చేస్తాను "అన్నాడు ఆమె వెంటనే "నిద్రా ! అది నాకు పడదు. నేను జడత్వానికి, బద్ధకానికి అతీతం. నేను నిద్ర లేని నిద్ర పోతాను. దానికి పడుకోవాల్సిన పని లేదు యోగ నిద్రలో ఆనం దించేవారికి పంది నిద్ర ఎందుకు ?"అన్నది. దీని అర్ధం ఏమిటి అని అడిగితె "పందులు శక్తికి మించి తెగతిని అరగటానికి గురక పెడుతూ నిద్రపోతాయి అవి అంతకాలం ఎలా నిద్రపోతాయోనని ఆశ్చర్యమేస్తుంది "అంటూ ని ద్రా శాస్త్రాన్ని చక్కగా వివరించింది.. అప్పుడు మాండూక్య ఉపనిషత్ లోని మూడు నిద్రావస్తలు గుర్తుకు వచ్చాయి. స్వామి రామకు చివరిసారిగా సందేశమిస్తూ "ఈ భౌతిక తల్లి బింబానికి అతుక్కు పోకు. నేను విశ్వ మాతను. సర్వాంతర్యామిని నీ అంతరాత్మను తెలుసుకో. భయం వీడు నే

ను నీతో ఎప్పుడూ ఉంటాను "అనగానే రామా కళ్ళు నీళ్ళతో సుళ్ళు తిరిగాయి

## 6 దేవర బాబా



ఉత్తర ప్రదేశ్ లోని దేవరబాబా వయస్సు 150 ఏళ్ళు అని అంటారు అప్పటికే. హిమాలయ పర్వత గుహలలో ధ్యాన తపస్సులు చేస్తూ అప్పుడప్పుడు తూర్పు ఉత్తర ప్రదేశ్ కు వస్తాడు ప్రధమ రాష్ట్ర పతి బాబూ రాజేంద్ర ప్రసాద్ ఆయన ముఖ్య భక్తుడు. తన చిన్నతనం లో తండ్రి బాబా దగ్గరకు తెసుకు వెళ్ళాడని అప్పటికే ఆయన చాలా ముసలివాడని రాజేంద్ర ప్రసాద్ రాశాడు. రిషీ కేష్ లో తాత్కాలిక పైన్ వుడ్ గుడిసె లో ఉండేవాడు. ఒక్కోసారి చెట్టుకిందే ఉండి పోయేవాడు. చాలా నియమ నిష్టలతో పవిత్రంగా ఉండేవాడు ఎవరినీ తాక నిచ్చేవాడు కాదు. ఉత్తర భారత దేశమంతా దేవర బాబా శిష్యులే ఆయన కిందికి దిగి వచ్చాడని తెలిస్తే వేలాది మంది దర్శనానికి వచ్చేవారు. గట్టి పోలీసు బందోబస్తు ప్రభుత్వం చేసేది. కుంభ మేళాలో ఆయన్ను చూడటానికి విదేశాలనుంచి కూడా వేలాది భక్తులు వచ్చేవారు. ఆయన ఆహారం పళ్ళు కూరలు మాత్రమె. "సంతోషమే గొప్ప సంపద. నియమ నిబద్ధత జీవితానికి అవసరం నూతన శ్వాస విధానాలు పాటిస్తే ఆరోగ్యం బాగుంటుంది టెక్నిక్ ఆఫ్ ఏజ్ లెస్ నెస్ ఈజ్ టెక్నిక్ ఆఫ్ ప్రాణ యామ"అన్నది ఆయన సిద్ధాంతం ప్రేమైక మూర్తిగా దేవర బాబా ప్రసిద్ధుడు

**మనవి --- మా మిత్రులు శ్రీ మైనేని గోపాల కృష్ణ గారు (అలబామా ) నాకు పాల్ బ్రంటన్ పుస్తకం " in search of secret india " హన్ట్స్ విల్ లో ఉన్న వారింటికి వెళ్ళి నపుడు చదవ మని ఇచ్చారు. ఈ పుస్తకం గురించి ఎన్నో ఏళ్ళు గా విన్నానే కాని ఇప్పటి వరకు చదవ లేదు. చదివి ఆశ్చర్యాను భూతి కి లోనైనాను. అందులో నాకు నచ్చిన విషయాలను ఇ ప్పటికి ఆరు ఆర్తికల్స్ గా రాశాను. నేను పొందిన ఆనందం మీకూ అందించాలనే నా తపన మాత్రమె ఇది. దీనికి కారకులైన మైనేని వారికి కృతజ్ఞతలు.**

## 7 గురువులకు గురువు -దేవీ స్వరూపిణి ఆనందమయీ మా

ఆమె సన్నిధే దైవ సన్నిధి. ఆమె సమక్షం ఆనంద రసప్లావితం. ఆమె వాక్కు పరావాక్కు. ఆమె గురువులకు గురువు అని పించు కొన్న దైవీ స్వరూపిణి అయిన ఆనందమాయీ మాత. అసలు పేరు నిర్మలా సుందరి. తూర్పు బెంగాల్ లో ఖేరా లో 1896లో ఏప్రిల్ 30న సంప్రదాయ కుటుంబం లో జన్మించింది. పసి తనం లో నే ముసి ముసి నవ్వులతో ముంచేసేది. అందుకే "నవ్వుల తల్లి "అని "సంతోషీ మా" అని పిలిచేవారు. పుట్టిన తర్వాత యేడవనే లేదు, పరమ ప్రశాంతం గా ఉండేది. ఎప్పుడూ సమాధి స్తితిలో ఉన్నట్లు కనిపించేది. ప్రకృతి సౌందర్యానికి పరవశించేది. మాంసం చేపలు తినేదికాదు. ప్రతి పని అతి శ్రద్ధగా సంపూర్ణం గా చేసేది



ఆనందమయి కి పదమూడవ ఏట భోలానాద అనే యోగ్యునికిచ్చి వివాహం చేశారు. అనేక తాత్కాలిక ఉద్యోగాలు చేస్తూ అనేక ఊర్లు తిరిగేవాడాయన. ఆయన బంధువులలోనూ ఈమె అణకువ, సంతోషం ఉన్న స్త్రీ గా పేరు తెచ్చుకోంది.పద్దెనిమిదవ ఏట అష్టగ్రామానికి లో భర్త తో కాపురానికి వెళ్ళింది. ఆమె తో దాంపత్య సుఖానికి ప్రయత్నిస్తే భర్తకు కరెంట్ షాక్ కొట్టినట్లయింది. ఇంకా వ్యక్తిత్వం రాలేదని సరి పెట్టుకున్నాడు. ఆమె దైవీ స్వరూపం అని గ్రామస్తులు భావించారు. పూజలో భజనలో ఆమె యిట్టె సమాధి స్తితికి వెళ్ళేది.

1916లో ఆరోగ్యం బాగుండక తలిదండ్రుల దగ్గరకు వెళ్ళింది. ఆరోగ్యం కుదుటపడిన రెండేళ్లకు మళ్ళీ భర్తను చేరింది. అంతకు ముందెన్నడూ వినని చదవని వేదం మంత్రాలు ఆమె నోటి నుండి ఆశువుగా వచ్చేసేవి. విన్న వారందరూ ఆశ్చర్యం ఆనందం పొందే వారు. అతి తేలికగా హఠ యోగం చేసేది. అప్పుడు ఆమెకు "నువ్వే అన్నీ . నువ్వే శక్తివి "అన్న అంతర్వాణి విని పించింది. తాను ఈ అనంతశక్తిలో ఒక శకలం అన్న భావన కలిగింది. ఇదొక శక్తి ప్రవాహం గా ఆమెకు సహకరించి ఎందరో రోగగ్రస్తుల కు వరమై స్పర్శ చేతనే వ్యాధులను నయం చేసింది. నిరంతరం వేద మంత్రాలు నాలుకచివర నుండి పలికేవి.

1922 ఆగస్ట్ మూడు న ఆంతరంగిక ప్రేరణ తో గురువు శిష్యుడు తానే అయి బీజాక్షరాలను అకస్మాత్తుగా పలికింది. ఆమె భర్తకంటే తాను కొంత ఉత్కృష్ట స్తితి లో ఉన్నట్లు గ్రహించింది. అయిదు నెలల తర్వాత భర్తకే మంత్రోపదేశం చేసి ప్రత్యక్ష గురువే అయింది. అతన్ని రెండు గంటలు సమాధి స్తితిలో ఉండేట్లు చేసింది. అప్పుడు భర్త భోలా నాద కు తాను పూర్ణ బ్రహ్మ నారాయణుడినని, దైవాన్ని అని ఎరుక కలిగింది. అపుడు ఆయన లో "ఇంతకీ ఈమె ఎవరు ?"అనే జిజ్ఞాస

కలిగింది. ఆమె లో దైవీ శక్తులు కేంద్రీకరించి ఉన్నాయని గ్రహించాడు. ఆమె క్రమం గా ఆహారం నిద్రలకు దూరమవుతోంది. మా మూడేళ్ళు పూర్తీ మౌనం గా ఉండి పోయింది. కుటుంబం ఢక్కా లోని షాభాగ్ గార్డెన్స్ కు మారింది. ఒక్కోసారి పన్నెండు గంటలు సమాదిలోనే ఉండి  పోయేది మా. ఆమె లో అద్భుత మైన కాంతి పుంజం గోచరించేది. నిర్వికల్ప సమాధిలో ఉండిపోయేది.

ఢక్కా దగ్గర సిద్దేశ్వరిలో ఉన్న  పురాతన కాళికా దేవాలయానికి ఒక సారి వెళ్ళింది. అక్కడే చిన్న ఆశ్రమాన్ని ఏర్పరచుకొని రాత్రిళ్ళు గడిపేది. 1924 -28వరకు ఇక్కడే మా ఉండి పోయింది. అనుచరులేర్పడ్డారు. డజనుకు పైగా చోట్ల ఆశ్రమాలేర్పరచారు. 1925 లో మౌనాన్ని వదిలి సంభాషించటం మొదలు పెట్టింది. ఆమె ను దర్శిస్తే దివ్యానుభూతి కలుగుతుందనే అభిప్రాయం బాగా వ్యాపించింది. హిందూ ముస్లిం క్రిస్తియన్లు కూడా అదే అనుభవాన్ని పొందేవారు. కాళీ దేవికి నిత్య పూజాదికాలు చేయాబోతు పూలు తన శిరస్సునే ఉంచుకోవటం, అమ్మవారికి పూయాల్సిన చందనాన్ని తానే పూసుకోవటం పరవశ స్తితి లో  చేసేది. వేలాది మంది చేరేవారు. వారూ అదే పరవశాన్ని అనుభవించేవారు. అందరి కష్టాలు తనవిగా భావించి తనలో ఆపాదిన్చుకోనేది.అప్పుడు అందరూ ఆమెను "ఆనంద మయీ మా ".అని కీర్తించటం ప్రారంభించారు. ఆ పేరే స్తిర పడింది. భోలానాద్ ను" భాయీజీ " అని ఆప్యాయం గా పిలిచేవారు. ప్రార్ధన గీతాలను పారవశ్యం గా పాడి అందరిని భక్తీ లో ఓలలాడించటం మా ప్రత్యేకత. ఈ సమయం లో ఆమె శరీరం లో అనేక వింత మార్పులు గోచరించేవి. భూమి మీద పడుకోన్నప్పుడు శరీరం విపరీతమైన పొడవు పెరిగేది., లేక పోతే అతి చిన్నదిగా కుంచించుకునేది. ఇంకోసారి రబ్బర్ బంతిలా గుండ్రం గా అయ్యేది. ఇవన్నీ  మెరుపు వేగంతో జరిగిపోయేవి. మరోసారి మధ్యాహ్నం నుండి  సాయం సంధ్య వరకూ విపరీతం గా ఏడుస్తూ కూర్చునేది..  సిద్దేశ్వరిలో ఒకసారి ఆమె శరీరం ఉన్నట్టుండి సంకోచించి క్షణాల్లో అదృశ్యమై,చీరలో ఒక చిన్న ముక్క మాత్రమె మిగిల్చింది. అంతే వేగం తో యదార్ధ స్తితి పొందింది.






1924 లో ఆహారం తీసుకొనే శక్తినే కోల్పోయింది. ఒక భక్తురాలే తినిపించేది. అనేక గంటలు రోజులు ఉపవాసం ఉండేది ఆరు నెలలు రోజుకు ఆరుగింజలు మాత్రమె తిన్నది. చెట్టునుండి రాలిన పండ్లను ఒకటో రెండో తినేది.  ఎనిమిది నెలలు మధ్యాహ్నం రాత్రి మూడేసి ముద్దలు మాత్రమే తినేది. అయిదు నెలలు వారానికి రెండు సార్లే అన్నం ముద్దలు తినేది. డాక్టర్ శశాంక మోహన ముఖోపాధ్యాయ ఆయన కూతురు ఖుక్ని మాతకు శిష్యులై ఆన్తరంగికులైనారు. గురుప్రియ దేవిగా మారిన ఖుక్ని మా పై పదిహేడు గ్రంధాలను బెంగాలీ భాషలో, పందొమ్మిది గ్రంధాలను హిందీ లో రాసి ఆనందమాయీ మా లీలా విభూతిని ప్రపంచానికి చాటింది. 1950 లో శిష్యులు "శ్రీ శ్రీ ఆనందమయీ సంఘం "ఏర్పరచారు. మా పర్యటనలు జరుపుతూ వేదాంత విషయాలను బోధించేది. 1926 లో ఉత్తర, మధ్య భారతాన్నంతా తిరిగి జ్ఞాన బోధ చేసింది. 1927 లో కాశీ ప్రయాగ రుషీకేష్ మొదలైన పుణ్యక్షేత్ర సందర్శనం శిష్యులతో సహా చేసింది. ఉత్తర ప్రదేశ్ లో వింధ్యాచలం లో ఒక ఆశ్రమాన్ని స్తాపించింది. వారణాసి లో మహా మహోపాధ్యాయ గోపీ నాద కవిరాజ్ ను కలిసింది. ఆయన వెంటనే శిష్య పరమాణువైనాడు.  ఆమేలో భగవత్ ప్రేరణ కలిగింది. దీన్ని "ఖేయాల "అన్నారు. ఆమె 36వ పుట్టిన రోజు వేడుకలను ఇరవై ఒక్కరోజులు ఘనం గా నిర్వహించారు భార్యా భర్తలు డేహ్రా డూన్ చేరి

కొన్ని రోజులున్నారు. 1934 లో సిమ్లా కు వెళ్ళగా రాజు దుర్గా సింగ్ శిష్యుడైనాడు అక్కడ ఆనందమాయీ సంఘాన్ని స్థాపించారు. నెహ్రు భార్య కమలా నెహ్రు మా ను దర్శించి అనుభూతి చెందింది. 1936 లో పురుష సహకారం లేకుండా ఉత్తరభారత సందర్శనం చేసింది. టిబెట్ లోని శివ ధామం కైలాస శిఖరాన్ని సందర్శించింది

1938 మే నెల ఏడవతేది మా భర్త భోలా నాద కు మసూచికం సోకి చని పోయాడు. అమ్మ శక్తి ప్రభావానికి అందరూ లోనయ్యారు. పెద్ద వాళ్ళను అమ్మా నాన్నా అని పిల్లలను బిడ్డలారా స్నేహితులారా అనీ సంబోధించేది. ఆస్ట్రేలియాకు చెందిన ప్రముఖుడొకడు వచ్చి అమ్మ ప్రభావం చూసి అంతే వాసి అయ్యాడు. "అంతా ఆయనదే నీది నాదీ ఏమీలేదు "అని అందరికీ చెప్పేది మా. "విచారం వద్దు సంతోషం గా ఉండండి "అని బోధించేది. జీవితాన్ని దైవ లీల గా భావించేది. 1974 ఆగస్ట్ 27న మా మహాసమాధి చెందింది. పరమ హంస యోగా నంద మా జీవిత చరిత్ర"ఒక యోగి ఆత్మ కద "పేర రాశారు వారణాసి లో పేదలకు ఉచిత వైద్య సేవ లన్దించటా నికి ఒక హాస్పిటల్ ను నిర్మించారు విద్యా సంస్థలను ఏర్పరచి ఉచిత విద్య బోధిస్తున్నారు. మధ్య ప్రదేశ్ లో ఓంకారేశ్వర్ దగ్గర ట్రై బల్స్ కోసం ఒక ఉచిత విద్యాకెన్ద్రాన్ని ఏర్పరచి వారి సర్వతోముఖాభి వృద్ధికి కృషి చేస్తున్నారు ఇలా మాపేరఎన్నో సే వాకార్యక్రమలను అందిస్తూ ప్రజా పురోగతికి తోడ్పడుతున్నారు

"మీ బాధలూ విచారాలు నాకు తెలుసు. ఒకే ఒక ఆత్మ ఉంది నువ్వు నేను ఆ ఆత్మా లమే.మీరెవ్వరో నేనూ మీ లాంటి దానినే. ఒకే ఒక చిదానందం యొక్క రూపాలే మీరూ నేనూ. ఈ చిన్న పిల్ల ఎప్పుడూ మీతోనే ఉంటుంది. "అని మా బోధనలో సారాంశం. మా పై దాదాపు ఇరవై పుస్తకాలు వెలువడి ఆమె భావ వ్యాప్తికి తోడ్పడ్డాయి.

దేశ భక్తులు

# మహాత్మాగాంధీ

## 1 సగటు తెలివి తేటలగాంధీ మహాత్ముడయ్యాడు

ఆధారం –శ్రీ మైనేని వారుపంపిన డా. ఎస్. యెన్. దాత్యే. సంకలనం చేసిన "రీదిన్కింగ్ మహాత్మా గాంధీ "

మెట్రికులేషన్ పరీక్షలో గాంధీ గారి మార్కు లెన్నో తెలిస్తే నోరెళ్ళ బెడతాం. అయ్యగారికి వచ్చిన మార్కులు 625 కు 247 1/4. మాత్రమే. అంటే 39.6 శాతమే. అంటే గురూగారు అత్తెసరు మార్కులతోనే 18 87 బాంటే యూని వర్సిటీ పరీక్ష పాసయ్యాడు. ఆయన ఉత్తీర్ణత భావనగర్ లోని శ్యామలదాస్ కాలేజి దృష్టిలో" తప్పినట్లే "లెక్క. లా చదవటానికి లండన్ వెళ్ళటానికి ఆర్ధిక సాయం కోసం పోర్ బందర్ లోని బ్రిటిష్ అడ్మినిస్ట్రేటర్ మిస్టర్ ఫ్రెడరిక్ లేలీ తో పర్సనల్ ఇంటర్వ్యూకు వెళ్ళాడు. ఆయన అడిగిన ప్రశ్నలకు సరైన సమాధానాలు చెప్పి సంతృప్తి పరచలేక తెల్లమొహం వేశాడు. కనుక ప్రభుత్వ సాయం హుళక్కి అయింది. అయితే అన్నగారు లక్ష్మీదాస్ చాలా ఎక్కువ వడ్డీకి అప్పు తెచ్చి స్వాములోరిని లండన్ వోడ ఎక్కించి పంపాడు. బాకీ తీర్చటానికి ఆయన నడ్డి విరిగిందనుకోండి. లండన్ మెట్రికులేషన్ పరీక్ష రెండో ప్రయత్నం లో మాత్రమే పాసయ్యాడు. తన స్వీయ చరిత్రలో తాను లండన్ లింకన్స్ ఇన్ లో రెగ్యులేషన్ డిన్నర్ లకు వెళ్లేవాడినని, చాలా కష్టపడి ఇంగ్లాండ్ కామన్ లామొదలైన నిర్ణయించిన గ్రంధాలను చదివి, లాపరీక్ష రాసి 18 91 జూన్ 10 న బార్ కు ఆహ్వానింపబడ్డానని రాసుకున్నాడు. ఏదో పరీక్ష మిణికి లాయర్ అయ్యాడు అంటే వకీలు వృత్తిలో రాబడి లాకేత్వం దాకు కొమ్ము అయి నిరాశ పరచింది. ఇది కలిసొచ్చేదికాదని వదిలేసి, అసలైన లక్ష్యం భారత దేశ స్వాతంత్ర్యం గా ముందుకు కదిలాడు. కనుక విద్య, వృత్తిలలో ఆయనవి సగటు తెలివి తేటలే. ఈ విషయం ఆయనే స్వయంగా చెప్పుకొన్నాడు. "నేను సగటు తెలివి తేటలమనిషిని సగటు శక్తి సామర్ధ్యాలున్న వాడిని. మేధావిని అసలేకాను. బుద్ధి పెరగటానికి ఒక హద్దు ఉంటుంది. కాని మనసు పెరగటానికి హద్దు ఉండదుకదా " "అన్నాడు. దక్షిణాఫ్రికా జైలు లో ఇండియా జైళ్ల లో ఆయన పుస్తకాలను విపరీతంగా అధ్యయనం చేసి జైలు జీవితాన్ని సార్ధకం చేసుకొన్నాడు. ఆయన చదివిన వాటిలో భారతీయ మత ఇతిహాసాలేకాక భగవద్గీత, ఉపనిషత్ లు, మహాభారతం బైబిల్ కొరాన్, లను కూడా చదివాడు. ప్లేటో, కార్లైల్, రస్కిన్,విలియం జేమ్స్, గిబ్బన్, ఆడం స్మిత్, గోథే బకిల్, లెక్కి, జేడ్డేస్, షా, వెల్స్ కిప్లింగ్, మార్క్స్ మొదలైన ప్రపంచ ప్రసిద్ధ రచయితల గ్రంధాలన్నీ అవలోడనం చేసుకొని అర్ధం చేసుకున్నాడు. ఆయనపై గొప్ప ప్రభావం చూపినవారిలో హెన్రి డేవిడ్ థోరో, రస్కిన్, టాల్ స్టాయ్ లు. "బహుళ ప్రజల బహుళ సంతోషం "ఆయన కోరుకున్నాడు. అదేసర్వోదయం. ఆయన "సర్వోదయం "కు పూర్తిగా అంకితమై పని చేశాడు. ఆయనది అసలు సిసలైన స్వంత మనసు. కాని ఆయన రాయని విషయం, వదిలిపెట్టిన సాంఘిక సమస్య లేనే లేవు. అంత విస్తృతంగా రచనలు చేశాడు.గాంధీ రచనాసర్వస్వం 90 సంపుటాలలో ఉంది అంటే ఆయన రచనా సామర్ధ్యమేమిటో అర్ధమవుతుంది. ప్రపంచ వ్యాప్తంగా దాదాపు అన్ని భాషల్లోకి అనువాదం చెంది ప్రపంచ ప్రజలనాకర్షించాయి. మోస్ట్ పాప్యులర్ రైటర్ అయ్యాడు గాంధీజీ.



"నేను విద్యా సంబంధ రచనలపై పైకి రాలేదు. క్రియా శీలత నా క్షేత్రం "అన్నాడు మహాత్ముడు. మరోమహాత్ముడు బాపూ రావు పూలే కూడా ఇదే మాట చెప్పాడని మనకు తెలుసు. ఆయనది విస్తృతమైన కర్మ క్షేత్రం. అందుకే ప్రపంచ ప్రజల నీరాజనాలందుకొన్నాడు బాపు. అమెరికా రాయబారి చెస్టర్ బౌల్స్ "ఈభూమిమీద ప్రతిమనిషి గాంధీ ప్రభావానికి లోనైనవారే "అన్నాడు. అందుకే ఐన్ స్టీన్ "ఇలాంటి మనిషి భూమిమీద పుట్టాడంటే భవిషత్ తరాలవారు నమ్మరేమో "అన్నాడు. గాంధీని అజాత శత్రువు అని కొందరంటారు. ఆయనది విజయవంతమైన రహదారి అనీ అంటారు. ఒక్కమాట మాత్రం నిజం. ఈ భూ ప్రపంచం మీద ఏ అధికారం లేకుండా, ప్రజలచేత అత్యంతం గా ప్రేమింపబడినవాడు, విమర్శలు ఎదుర్కొన్న వాడు, తన దేశ ప్రజలలో ఒక వర్గం వారి అలక్ష్యం, ద్వేషాలకు గురైనవాడు గాంధీ మహాత్ముడు తప్ప వేరెవరూ లేనేలేరు అన్నది అక్షర సత్యం. జాత్యహంకారానికి వ్యతిరేకంగా గాంధీ శాంతియుత అహింసా పోరాటం చేసినందుకు బ్రిటిష్ ప్రభుత్వం ఆయన్ను ప్రేమించ లేకపోవచ్చు ద్వేషించింది కూడా. దక్షిణాఫ్రికాలో గాంధీ విరోధి జనరల్ స్మట్స్ "ఆసియా కాన్సర్" తన దేశ రాజకీయ శరీరం లో నిర్మూలించాలి "అన్నాడు గాంధీని అన్యాపదేశంగా, ఒక్కో సారి సూటిగాకూడా. బ్రిటిష్ ప్రధాని చర్చిల్ మహాత్ముని " దిగంబర ఫకీర్ "అని, ఆయన ఆం దోళనకరమైన,భయంకరమైన చీదరపుట్టించేమనిషి"అని





చీదరించాడు అవహేళన చేశాడు. ఇంకోఆకు ఎక్కువ చదివిన లార్డ్ వేవెల్ 1946 లో తన జర్నల్ లో "గాంధీ పైకి కనిపించినంత మంచివాడు కాదు. చాలా చురుకు న్నవాడేకాని, మొండి పట్టుదల, రెండు నాలుకల ధోరణి, సింగిల్ మైండెడ్ రాజకీయనాయకుడు " "అని రాశాడు.

విదేశాలలో ఏమిటి మనదేశం లోనూ మహాత్ముని వ్యతిరేకించినవారు చాలామందే ఉన్నారు. మహాత్ముని హింద్ స్వరాజ్ అంటే హోమ్ రూల్ ను ఆయన రాజకీయ గురువు గోఖలే తిరస్కరించాడు. అప్పుడు గాంధీకి నమ్మకంగా ఆసరాగా నిలబడింది సర్దార్ పటేల్ జవహార్ లాల్ నెహ్రు. ఆహారపు అలవాట్లు, సెక్స్, ఆధునిక మందులు, కుటుంబ నియంత్రణ, బేసిక్ విద్య, తనభార్యను క్రూరంగా చూడటం వంటి వాటిపై గాంధీపై చాలా విమర్శలున్నాయి. ఛాందసవాదులు ఆయన హరిజనోద్ధరణను, సెక్యులర్ రాజకీయాలను పూర్తిగా వ్యతిరేకించారు.జాతీయవాదులు హింస దౌర్జన్యం తోనేస్వరాజ్యం సాధించాలన్నారు. చాలాకాలం "పాకిస్తాన్ ఇస్లాం కు వ్యతిరేకి "అని గాంధీ చెప్పేవాడు. జిన్నా ద్విజాతి సిద్ధాంతాన్ని గాంధీ కాదన్నాడు. ఒక్కో సమయం లో స్వాతంత్ర్య పోరాటం లో గాంధీ పాత్రకు విమర్శలు కూడా వచ్చాయి. ఇవన్నీ ఆయన్ను కొంచెం చేయటానికి కించపరచటానికి వచ్చినవే అని చరిత్రకారులన్నారు.

ఇటీవలికాలం లో కాన్షీ రాం, మాయావతి మొదలైనవాళ్ళు గాంధీని తక్కువ చేసి మాట్లాడారు దళితులను పట్టించుకోలేదన్నారు. ఎవరేమన్నా కోట్లాది సామాన్య భారత ప్రజల తరఫున పోరాడి వారి సాంఘిక ఆర్ధిక ఉన్నతికి, స్వేచ్చకు కృషి చేసింది గాంధీ మాత్రమే అన్నది తిరుగు లేని సత్యం. ఆయన ఖచ్చితత్వానికి ప్రాధాన్యమిచ్చాడు. "నేను మానవమాత్రుడిని మహాత్ముడినికాదు.నేను సత్య శోధకుడిని. వినయమే నాకు ఆభరణం. సత్యాన్వేషికి తన హద్దులు తెలుసు. చేసిన తప్పులు తెలుస్తాయి తప్పు చేశానని చెప్పటానికి నేనేమాత్రం సంకోచించను" అన్నాడు. " గాంధీ సెల్ఫ్ మేడ్ మాన్ ". సమస్యా పరిష్కారాలకు ఒకరితో ఒకరు చర్చించుకోవటం తప్పని సరి. తనను విమర్శించేవారితో ఆయన విభే దించలేదు తనవాదన వారికి నచ్చేట్లు చేసేవాడు. ఒకవేళ తాను ఆలోచించింది సరైనదికాదని వారు నిరూపిస్తే తప్పక పద్ధతి మార్చుకోనేవాడు అడ్జస్ట్ మెంటాలిటి ఉన్నవాడు. 1942 ఆగస్ట్ 8 క్విట్ ఇండియా ఉద్యమ తీర్మానానికి వ్యతిరేకంగా ఓటు వేసిన 13 మంది కమ్యూనిస్ట్ సభ్యులను ఆయన తూలనాడలేదు. పైపెచ్చు నిశ్చయం పై వారి కున్న ధైర్యాన్ని దాన్ని ప్రకటించిన తీరును, అభినందించాడు ఇలాంటివి మహాత్ముని జీవితం లో కోకొల్లలు

చరిత్ర విశ్వ మానవ గురువు. సామాన్యుని విషయాలు, అతని జయాపజయాలు సాధనాలు అన్నీ రికార్డ్ చేస్తుంది చరిత్ర. పైన చెప్పుకున్నట్లుగా సామాన్య తెలివితేటలున్నప్పటికీ, గాంధీ మాన్యుడయ్యాడు. మహాత్ముడయ్యాడు., కారణం ఆయన రాజకీయ,నైతిక, అహింసా సిద్ధాంతాలే. బాధిత ప్రజలకాయన " మెస్సయ్యా "అయ్యాడు. కనుకనే దేశ, విదేశాలలో చరిత్ర ప్రసిద్ధుడయ్యాడు. 1948 జనవరి 30 శుక్రవారం సాయంత్రం గాంధీ హత్య చేయబడితే యావత్ ప్రపంచం కన్నీరుమున్నీరుగా విలపించింది. ఆయన విశ్వమానవుడు. శాంతి అహింస ప్రేమ ల ప్రవక్త. ఆయన దారుణ హత్యను ప్రపంచ ప్రజలు జీర్ణించుకోలేకపోయారు. ప్రసిద్ధ అమెరికా నవలా రచయిత్రి పెరల్ ఎస్ బక్ "ఇది మరొక క్రూసిఫిక్సన్"అన్నది. ఆసాయంత్రమే భారత తొలిప్రధాని నెహ్రు "మన జాతిపిత మూర్తీభవించిన సత్య స్వరూపం మాహాత్మా గాంధీ అమరులయ్యారు. అయన సత్యమార్గాన్నిచూపి మన తప్పులను మన్నించి, ఈ పురాతనభారత దేశానికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు సాధించి ఇచ్చారు "అని కన్నీటితో రుద్ధ కంఠం తో విపపిస్తూ అన్నాడు. అమెరికా సెక్రెటరి ఆఫ్ స్టేట్ జనరల్ సి.మార్షల్ "సర్వ మానవ జాతి అంతరాత్మ "ను కోల్పాయాం అన్నాడు. ఇవన్నీ సత్యాతి సత్యమైనవే. సందేహమే లేదు. దేశ దేశాల స్త్రీపురుషులందరూ తామేం కోల్పోయామో తెలుసుకొని దుఖించారు. గాంధీ చరిత్ర రాసిన లూయీ ఫిషర్ చెప్పిన దాన్నిబట్టి మహాత్ముని హత్య వార్త విన్న కొద్ది సేపటికే భారత అధికారులకు విదేశాలనుండి 3,4 41 సందేశాలు అందాయట. పంపినవారిలో పోప్ పయస్, దలైలామా, కాంటర్ బరీ ఆర్చిబిషప్, బ్రిటన్ రాజు,, ప్రెసిడెంట్ ట్రూమన్, లండన్ చీఫ్ రబీ, చాంగ్ కై షేక్, ఫ్రాన్స్ ప్రెసిడెంట్, రష్యా నుంచి తప్పఅన్ని దేశాల ముఖ్య రాజకీయనాయకులు పదవులలో ఉన్నవారు ఉన్నారు.ఫ్రెంచ్ సోషలిస్ట్ లియాన్ బ్లుం ప్రపంచ వ్యాప్తంగా కోట్లాది ప్రజలు గాంధీ హత్యపై స్పందించిన తీరును రికార్డ్ చేసి "నేనెప్పుడూ గాంధీని చూడనే లేదు. కాని నా స్వంత బంధువు చనిపోయిన దుఖం అనుభవించాను. ప్రపంచం దుఃఖ సాగరం లో మునిగి పోయింది. బాపు మహాత్ముడు. అసాధారణ వ్యక్తి. మనీషి "అని రాశాడు. ఇండియా సోషలిస్ట్ నాయకుడు మధూ లిమాయే గాంధీ దుర్మరణానికి యూరప్ సామాన్య ప్రజలు ఎలా కృంగిపోయరో ప్రత్యక్ష సాక్షిగాతన "ఎ డ్రీం పాటర్డ్"లో వివరించాడు. గాంధీతో మౌలిక భేదాలున్న అంబేద్కర్ గాంధీ హత్యకు షాకయ్యాడు."శాంతిదూత ఆహింసామూర్తి కి ఇంతటి దారుణ హింసామరణమా?"అని కాబోయే భార్య డా సబితా కబీర్ కు రాసిన లేఖలో తెలియ జేశాడు. గాంధీని "స్థిత ప్రజ్ఞ కర్మ యోగి "అని ఐక్యరాజ్య సమితిలో బ్రిటిష్ ప్రతినిధి ఫిలిప్ నోయెల్ బేకర్ అభివర్ణిస్తూ "అత్యంత బీదలకు గాంధీ గొప్ప మిత్రుడు. అయినా ఏకాకి. ఇప్పుడు కనుమరుగయ్యాడు. ఆయన ఆశించిన విషయాలు ఇంకా అమలులోకి రావాలి ""అన్నాడు. కనుక గాంధీ స్మరణ ఔచిత్యమైనదే నేడుకూడా. ఎలాగో చూద్దాం.

జీవిత మూల సూత్రాల విషయం లో మహాత్ముడు ఎన్నడూ రాజీ పడలేదు. ఈనాటి ఇండియా కే కాదు యావత్ ప్రపంచానికీ ఆయన చెప్పిన మూలసూత్రాలు శిరో దార్యాలే. ప్రపంచం లో మొట్టమొదటిసారిగా అణచి వేతకు, హక్కుల హరణకు వ్యతిరేకంగా అహింసా యుత విప్లవం ప్రయోగించాడు. ఇందులో రాజకీయ సాంఘిక ఆర్ధిక సాంస్కృతిక విషయాలలో సామాన్యులకు జరిగిన అన్యాయాలు, దౌర్జన్యాలపై తిరుగుబాటు ఉన్నది. వీటి సాధనకు సత్యాగ్ర హ ఆయుధాన్ని ప్రయోగించాడు. "అణచేవాడు అణగ ద్రొక్కబడే వాడుఒకరితో ఒకరు సహకారం తో మెలిగితే అణచి వేత ఉండదు "అని ప్రబోధించాడు. అది పూర్తి సత్యం. ఇదిపాటిస్తే స్థానిక వ్యక్తిగత, ప్రాంతీయ, దేశీయ అంతర్జాతీయ స్థాయిలలో మానవ సమూహాలకు సుఖ శాంతులు లభిస్తాయి "అన్నాడు. "సహాయ నిరాకరణ అతి సామాన్య ప్రజలలో గౌరవ, అధికారాలకోసం మేల్కొలపటమే. దీనికి వారిని సమాయత్తం చేయటానికి వారిలో రాక్షస శక్తి పై భయం పోగొట్టటం ఒక్కటే మార్గం. అది వారి అంతరాత్మను మేల్కొనేట్లు చేసి తమ కర్తవ్యాన్ని నెరవేర్చేట్లు చేస్తాయి. నేను చేసింది ఈ చిన్నపనిమాత్రమే. వారు జాగృత స్థితి పొందితే సాధించలేనిది ఏదీ ఉండదు. సహకారం ఒక విధి. సహాయ నిరాకరణ కూడా డ్యూటీ తో సమానమే. "అని వివరించాడు. తప్పు చేసే ప్రభుత్వాన్నీ, విద్యాలయాలను, వాణిజ్య వ్యాపార మత రాజకీయ సంస్థలను, ఫాక్టరీలను, చివరికి వ్యక్తులను, సంఘాన్నీ కుటుంబాలను, కూడా తప్పు తెలుసుకొనేట్లు చేసి, సరైన మార్గం లో పెట్టి ప్రజోపకారంగా పనులు చేయించటమే సత్యాగ్రహముఖ్య లక్షణం అంటాడు గాంధీజీ.

ప్రజా స్వామ్యకంటకుల, దోపిడీ దార్ల, రాజకీయ నేరగాళ్ళ హక్కులను కాలరాసే వారల కబంధ హస్తాలలో నలిగినప్పుడు భారతీయ సామాన్య ప్రజానీయం నిర్భయంగా శాంతియుతంగా గాంధీగారి విధానాలనే అమలు చేసి తమ కోరికలు సాధించుకొంటున్న చరిత్ర మనం చూస్తూనే ఉన్నాం.,

గాంధీ గారి అహింసా సిద్ధాంతం ఇండియాకే కాదు ప్రపంచ దేశాన్నిటికీ వర్తిం చేదే. మానవాళికి విపరీత శత్రువులైన అసూయ, భయాలను జయించిన శాంతి వీరుడు గాంధీ. అసూయ పిరికితనం అన్నాడు. బ్రిటిష్ దౌర్జన్యరాజ్యమంటే,కాలనీ దౌష్ట్య మంటే ఉన్న భయాన్నికూకటి వ్రేళ్ళతో సహా ప్రజల మనసులనుండి తొలగించాడు. భారత స్వాతంత్ర్యానికి ఆయన ఇచ్చిన మరో మంత్రం "అభయం "అంటే భయరాహిత్యం. ఆహిస, పిరికి తనం వ్యతిరేక పదాలు. అహింస అత్యంత గొప్ప సుగుణం, పిరికితనం అత్యంత దుర్గుణం. అహింస ప్రేమనుంచి ఉద్భవిస్తుంది. పిరికితనం ద్వేషం నుంచి జనిస్తుంది. స్వచ్ఛమైన అహింస నిరుత్సాహపరచి అవినీతి పనులను చేయించదు. కాని పిరికి తనం అదే చేయిస్తుంది. ఈ రెండిటికీ హస్తి మశాకాంతర భేదం ఉందని స్పష్టంగా చెప్పాడు గాంధీ.

గాంధీగారి అహింసా యుత సహాయ నిరాకరణ ఉద్యమం దేశం లో ఉద్ధృతంగా దూసుకొస్తున్న ఉగ్రవాదాన్ని కాండంతో సహా నరికేయటానికే. ఏరూపం లో ఉన్నా టెర్రరిజం దుర్గుణమే భయానకమే.. పరాయి పాలన వ్యతిరేక విషయం తో సహా. అంత్య ఫలం ఎంత ఉదాత్తమైన అవసరమో, దాన్ని సాధించే మార్గాలు కూడా అంతే ఉదాత్తంగా ఉండటం అవసరం. ఇవాళ సమకాలీన ప్రపంచం లో టెర్రరిజం శాపం, అశాంతి. ప్రజలు భయ బీభత్సాలమధ్య బతుకుతున్నారు. స్వాతంత్ర్య భారత దేశం లో ప్రముఖ వ్యక్తుల దగ్గరనుంచి సామాన్య రాజకీయ నాయకుడి వరకు ప్రభుత్వ పోలీసు సంరక్షణలో బందీలై బతకటం సిగ్గు చేటు గా ఉంది. ఇందుకేనా మనం స్వేచ్ఛా స్వాతంత్ర్యం సాధించింది ?గాంధీ చెప్పిన, గురుదేవ్ టాగూర్ రాసిన "వేర్ ది మైండ్ ఈజ్ వితౌట్ ఫియర్ "గీతాంజలి పాఠం ఏమైపోయింది ? భయం మధ్య గడిపే జీవితమా మనం కోరుకున్నది ?"భయరాహిత్యమున్న స్వర్గం లోకి దేవా! నా దేశాన్నిమేల్కొలుపు "అని ప్రార్ధించింది అంతా శుష్క

వేదాంతమై పోయిందా ?కనుక ఈ హింసా, బీభత్సాల మధ్య గడుపుతున్న వారికి తరుణోపాయం గాంధీ అహింస సిద్ధాంతం మాత్రమే. అదే సర్వశ్రేష్ట మార్గం అందరికీ.

నేడు ప్రపంచ రాజకీయం అంతా "ప్రయోజనకర సిద్ధాంతం ",ఆవశ్యకత లపైనే నడుస్తోంది. ఇది మరీ దిగజారి "మాకివిల్లీ విధానం "అమలై, రాజకీయం లో ఏదైనా రైటే,చెల్లు బాటు అవుతుంది అనే స్థితిలోకి వస్తే డేంజర్ గంటలు మోగినట్లే. ఇది నేర ప్రవృత్తికి రాచబాట వేస్తుంది. మనదేశం లో రాజకీయం లో చాలాభాగం మతోన్మాదశక్తుల గుప్పిటలో చిక్కుకు పోయింది. అందుకే మహాత్ముడు బహిరంగ విలువలున్న రాజకీయం కావాలని వాంఛించాడు. దానికే మద్దతు పలికాడు.. "సత్యమే దైవం "అన్నాడు. మానవ క్రియా శూన్యమైన దేదీ మతంగా ఆయన భావించలేదు. మతం అంటే పిడివాదం, అంధ విశ్వాసం కాదు. అది "జీవన విధానం "అన్నాడు. సామాన్య మానవ ప్రయోజనాలకు ప్రాధాన్యం ఇవ్వనిది మతమే కాదన్నాడు "నా మతం సత్యాహింసలపై ఆధార పడింది. సత్యమే నా దైవం. అహింస దాన్ని పొందటానికి సాధనామార్గం "అని విస్పష్టంగా వివరించాడు. 1927 లో "ప్రపంచం లోమతాలన్నీ అనేక విషయాలలో విభేదించినా, అందరు ఏకగ్రీవం గా సత్యం ఒక్కటే శాశ్వతం అన్నారు.హేతువుకు నిలబడని, నైతికత లేని మత మూఢ విశ్వాసాలను నేను నమ్మను. ప్రజల యదార్ధ జీవన విధానాన్ని పట్టించుకోని, వారికి సహాయపడనిది మతమే కాదు. అసహనం హింసకు మరో రూపం. అది అసలు ప్రజాస్వామ్య అభి వృద్ధికి, భావనకు అవరోధం "అని చెప్పాడు.

హిందువు కాకపోతే గాంధీ శూన్యమే. హిందువుల నైతిక ప్రపంచాన్ని నిర్వచిస్తూ గాంధీ దాని సౌందర్యం అంతా అన్నిటినీ ఆహ్వానించి కలుపుకోవటం తనది చేసుకోవటం లోనే ఉంది అన్నాడు. ఇతర మతాలలో ఉన్న విషయం హిందూ మతం లో తప్పక ఉంటుంది. ఇందులో లేనిదాని కోసం వెంపర లాడటం వివేకం కాదు. భిన్న భావాలు, నమ్మకాలు, మత విశ్వాసాలున్న భారత్ దేశ ప్రజలను ఏక తాటిపై నడిపించింది ఆయన విశాల భావాలే. అనాదినుంచి ఉన్న "భిన్నత్వం లో ఏకత్వం" ఇప్పుడు సాధించి చూపి, దాని శక్తి ఏమిటో బ్రిటిష్ పాలకులకు రుచి చూపించాడు. హిందూ మతంలోని ఉదారతను ఆయన చక్కగా వినియోగించి అందరికి చేరువయ్యాడు లక్ష్యసాధనకు ఇది బాగా తోడ్ప డిందిదికూడా. మత మౌఢ్యం, ఛాందసవాదం అనే సంకెళ్ళ నుండి విముక్తి కలిగించి సామరస్యంగా, పరస్పర సహకారం తో జీవించే జీవన శైలిని ఉద్బోధించాడు.

కార్య శీలి గాంధి ప్రయోజనంలేని, ఉపకరిచని శుష్కవాగ్దానాలు చేయలేదు. అమలు పరచలేని తీర్మానాలూ చేయలేదు. 1929 లో అభివృద్ధికోసం ఆయన ' "అమలు చేసే శక్తి సామర్ధ్యాలు లేని తీర్మానాలపై గంటల తరబడి మాట్లాడి, వాటిని అనాలోచితంగా ఆమోదించి ప్రజలను మభ్యపరచి మోసం చేయవద్దు. వాళ్ళనమ్మకమే మన బలం "అని చెప్పిన మాట ఏనాటికైనా, ఏ పాలకులకైనా కను విప్పు కలిగించే కఠోర సత్యమే

గాంధీ అంటే అత్యంత క్రమశిక్షణ కల వ్యక్తి. తనపై అపారనమ్మకమున్న దేశ ప్రజలకు అనుచరులకు "ఏదిసాధించాలన్నా క్రమశిక్షణ చాలా అవసరం. క్రమశిక్షణ అనేది విద్య, చర్చ వాదాలతో అలవడేదికాదు.వ్యతిరేక పరిస్థితులలో దాన్ని సాధన చేయాలి "అన్నాడు. ప్రపంచం లో చాలాదేశాలు చాలావేగవంతం గా అభి వృద్ధి సాగిస్తుంటే ఇండియా అభి వృద్ధిలో వెనకబడటానికి కారణం అన్ని రంగాలలో క్రమశిక్షణ లేకపోవటమే.ప్రపంచ దేశాల సరసన, వాటికంటే ఉన్నతంగా భారత దేశం నిలబడాలి అంటే గాంధీ బోధించిన, అనుసరించిన క్రమశిక్షణ ను అందరూ తీవ్రంగా తప్పక అనుసరించాలి, జాగృతమవాలి.

గాంధీకి పాశ్చాత్య విధానాలను గుడ్డిగా అనుసరించటం, అనుకరించటం ఇష్టం లేదు. నవీన భారతం తన మూల సిద్ధాంతాలపై, ఎక్కడ మంచి ఉంటే దాన్ని తీసుకొంటూ, కలుపుకుపోతూ అభివృద్ధి చెందాలని అభిలషించాడు. మహాత్ముడు చెప్పిన ఆర్ధిక ఫిలాసఫీ ని తప్పుగా అర్ధం చేసుకున్నారు. యాంత్రిక సాంకేతికతకు ఆయన వ్యతిరేకి కాడు. అయితే యంత్రాలు, సాంకేతికత పారిశ్రామిక సమాజాలలో పెత్తనం చేయరాదు అని ఆయన ఉద్దేశ్యం. ప్రజలు కోరికలు తగ్గించుకోవాలి. అజ్ఞాన వినిమయతత్వం (కన్స్యూమరిజం ) పెరగకుండా జాగ్రత్త పడాలని కోరాడు. ఆర్ధిక విషయాలపై ఆయనకు ఖచ్చితమైన, నిర్దుష్టమైన భావాలు ఉన్నప్పటికే, వాటిని తన అనుచరులపై బలవంతంగా రుద్ద లేదు. కేపిటలిజం, కమ్యూనిజం లపై ఆయనకు ఆసక్తి లేదు. సమానహక్కులు, బాధ్యతలు, ప్రేమ, పరస్పర సహకారం తో మనుగడ సాగించే సమాజమే ఆయన ధ్యేయం. సమాజం లో అతి బలహీనుడికి కూడా, అత్యంత బలవంతునికి ఉన్న అవకాశాలు ఉండాలన్నాడు. ఇది "ఉటోపియా "-ఆదర్శ ధామం గా అనిపిస్తుంది. అంటే ఆచరణ సాధ్యంకానిది గా అనిపించినా, ప్రపంచ దేశాలన్నిటి ధ్యేయం ఇదే. దీనినే" రామరాజ్యం" అన్నాడు రామ భక్త బాపు.

సమాన న్యాయం సమాన అవకాశాలు ఉండే సమాజం ఏర్పడాలి అంటే గాంధీ చెప్పిన 7 పాపాలు చేయకుండా అందరూ చిత్త శుద్ధితో ఉండాలి. అవి – విలువలు లేని రాజకీయాలు 2-నైతికత లేని వ్యాపారం 3-పని లేనిసంపద 4-శీలం లేని విద్య 5-మానవత్వం లేని విజ్ఞానం 6-మనస్సాక్షి లేని ఆనందం 7-త్యాగం లేని ఆరాధన.

19 వ శతాబ్దం లో భారత దేశం లో నూతనశక్తి(రినసెంట్ ) తో పునర్జన్మ నెత్తిన ముగ్గురు మహా పురుషులలో మహాత్మాగాంధీ ఒకరు. మిగిలిన ఇద్దరు రాజా రామ మోహన రాయ్,, జస్టిస్ మహాదేవ గోవింద రానడే. ముగ్గురిదీ ఋషి శీలమే, సత్యాగ్రహ తత్వమే. ముగ్గురి భావనా ఒకటే –"మానవత్వం సమానత్వం, అధ్యాత్మికోన్నతి ".ఈ సందేశాన్నిగాంధీజీ క్రియా రూపం లో వ్యాపింప జేయటానికి సత్యాగ్రహం అహింస ఆయుధాలుగా చేసుకొన్నాడు. ఈనాటి "థర్మో న్యూక్లియర్ యగం "లో సర్వమానవ వినాశనాన్ని,, తుదముట్టించటాన్ని (ఎన్నిహిలేషన్ )నివారించి, రక్షించటానికి ఉన్నఏకైక సాధనం సత్యాగ్రహం అహింసా సిద్ధాంతమే, ఇదే మహాత్ముడిని ఈ యుగం లో కూడా స్మరించటంలో ఔచిత్యాన్ని తెలియ జేస్తోంది.

# 2 గాంధీజీ మహాత్ముడైన విధం

"ప్రజలతో నా ప్రత్యక్ష సంబంధం 1893 లో దక్షిణాఫ్రికాలో కల్లోల పరిస్థితులలో ఏర్పడింది.. మానవుడిగా భారతీయునిగా నాకు హక్కులు లేవు అని మొదట గ్రహించాను. నేను భారతీయుడై నందు వలన నాకు కనీస మానవ హక్కులు కూడా లేవని బాగా అర్ధమైంది "అన్నాడు గాంధీజీ.

మహాత్ముడికి పబ్లిక్ తో సంబంధం రెండు దశలలో జరిగినట్లు మనం గ్రహించాలి. దక్షిణాఫ్రికా లో 1893మే నెలనుంచి మొదటి దశ 21ఏళ్ళు. రెండవ దశ1915 జనవరిలో భారతదేశం వచ్చినప్పటినుంచి 33 ఏళ్ళు 1948 జనవరి వరకు. అంటే ప్రజాజీవితం లో 54ఏళ్ళ సుదీర్ఘ అనుబంధం మహాత్మునిది. సౌత్ ఆఫ్రికాకు మొదట వెళ్ళినప్పుడు,, ఇండియాకు తిరిగి వచ్చినప్పుడు, బ్రిటన్ లో ఉన్నప్పుడు ఆయన వ్యక్తిత్వం లో చెప్పుకోదగిన విశేషాలేమీ లేవు. 20ఏళ్ళ అప్పటి పిరికి, సాదు వినయ విధేయతల కుర్రాడు ఇరవైల మధ్యకాలం లో ఎలా తిరుగు బాటు దారుడు అయ్యాడు ?స్వంత దేశం ఇండియాలో లో న్యాయవాద వృత్తిలో అసలు విజయాలే లేని అనామక బారిస్టర్, దక్షిణాఫ్రికాలో లాయర్ గా అద్భుత విజయాలు ఎలా సాధించాడు ?105 పౌండ్ల వార్షిక వేతనం తో సౌతాఫ్రికా వెళ్ళిన లాయర్, కొన్నేళ్లలోనే ఏడాదికి 5,000 పౌడ్ల లాయర్ ఫీజు ఎలా సంపాదించాడు ?భారత తీరాలను తమాషా ఇంగ్లీస్ దొరలాగా వదిలి పెట్టి వెళ్ళినవాడు, మళ్ళీ మాతృదేశం చేరగానే "స్వదేశీ దుస్తులు ఎలా ధరించాడు ? ఇండియాలో ఉన్నప్పుడు రచయితగా, సృజన శీలిగా గుర్తింపు పొందేది ఏదీ చేయనివాడు ఏదేదో చేస్తానని, వాగ్దానం కూడా చేయని వాడు అకస్మాత్తుగా దక్షిణాఫ్రికాలో గొప్ప జర్నలిస్ట్ అవతారం ఎలా ఎత్తగలిగాడు ? ఇంగ్లాండ్ లో ఉన్నప్పుడు నోరు మెదపని వాడు, ఇరవైల మధ్యలో ఎలా మహా వక్తగా మారాడు ?జీవిత ప్రారంభ దశలో ఏమాత్రమూ ప్రత్యేక ప్రతిభ చూపనివాడు గణనీయ అపూర్వ వ్యక్తిగా, ప్రజల భవితవ్యం తీర్చిదిద్దగలిగే అవతార పురుషుడుగా ఎలా రూపొందాడు ?ఇలా ప్రశ్నించుకొని సమాధానాలు తెలుసుకొంటేనే క గాంధీజీ వ్యక్తిత్వ వికాసం, మహాత్ముడుగా గాంధీజీ రూపొందిన తీరు మనకు అర్ధమౌతుంది.

"సత్యాహింస" అనే గాంధీ సిద్ధాంతం అందులోని విలువలు దక్షిణాఫ్రికా లో గడిపిన కాలం లో రూపుదిద్దుకొన్నాయి. బ్రహ్మ చర్యం, సత్యాగ్రహం, అహింస, ఆశ్రమ జీవితం అన్నీ అక్కడ చేసిన ప్రయోగ విధానాలే. అక్కడే ప్రజలతో మాట్లాడటం, జర్నలిజం నేర్చాడు. మొత్తం మీద ఒక సాధారణ బారిస్టర్ ను ఈ లక్షణాలన్నీ మహాత్మునిగా మార్చాయి అని తెలుసుకోవాలి. మానసిక పరిపక్వత కూడా దక్షిణాఫ్రికాలోనే సాధించాడు.

ఈ క్రమ వికసనం తెలియాలంటే దక్షిణాఫ్రికాలో ఆయన ఎదుర్కొన్న సంఘటనలను మనం తెలుసుకోవాలి. వీటిలో కొత్త విషయాలేవీ ఉండకపోయినా ఆ సంఘటనలను మనం హైలైట్ చేసి చూస్తె ఆయనలోని లోని గుణ మాణిక్య దీధితులు ప్రకాశమానమై గాంధీజీ "దేశభక్త మహాత్మ"గా ఎదిగిన తీరు అర్ధమై, ఇండియాలో ఆయన జీవన విధానం యెంత ఉన్నతంగా ఆదర్శవంతంగా, మార్గ దర్శకంగా అభివృద్ధి సాధించిందో అవగతమౌతుంది. మరపురాని ఆ మధుర ఘట్టాలు, జీవిక ఇంత ఉన్నతంగా ఎదగటానికి దక్షిణాఫ్రికా నేపధ్యమే అయింది.

### దక్షిణాఫ్రికా అనుభవాలు

దక్షిణాఫ్రికా డర్బాన్ లోని నటాల్ పోర్ట్ లో గాంధీ 1893మే లో ఒక వాణిజ్య సంస్థకు జూనియర్ కౌన్సెల్ గా వచ్చాడు. 40వేల పౌండ్ల సివిల్ కేసు కు టర్మ్ కాంటాక్ట్ పై వాదించటానికి వచ్చాడు. ఈ కేసు నటాల్ కు చెందిన అబ్దుల్లాకు, ట్రాన్స్ వాల్ కు చెందిన త్యేబ్ సేట్ల మధ్య జరిగింది. గాంధీకి రానూ పోనూ ఫస్ట్ క్లాస్ టికెట్లు, ఏడాదికి 105పౌండ్ల జీతం, ఈ కాలం లో ఆయన ఆ వ్యాపార సంస్థలో లో గెస్ట్ గా ఉండే ఏర్పాటు. అక్కడ అమలులో ఉన్న నియమ నిబంధనలు ఆయనకుతెలియనే తెలీదు. అక్కడ దిగేటప్పటికి తన వేషం, పైఖరి ఎలా ఉండేదో ఆయనే గుర్తుకు తెచ్చుకొన్నాడు. "బారిస్టర్ ను కనుక తగిన, నచ్చిన వేష ధారణతో, నా ప్రత్యేకత, ప్రాముఖ్యం చాటుతూ డర్బాన్ లో దిగాను "కానీ నటాల్ లో మొదటి రోజునే అక్కడి యూరోపియన్లు ఇండియన్ లను యెంత అమానకరంగా చూస్తున్నారో గ్రహించాడు. గాంధీని ఇక్కడికి రప్పించిన వ్యాపారవేత్త దాదా అబ్దుల్లా స్వాగతం పలకటానికి షిప్ పైకి వచ్చాడు. అక్కడివారు అబ్దుల్లాతో పరిచయమున్నాకూడా తమకంటే సామాజికంగా హీనంగా ఉన్న చులకన భావంతో చూడటం, అక్కడి ఇండియన్లు దీనికి అలవాటుపడి "లైట్ "తీసుకోవటం గమనించాడు. కానీ 23ఏళ్ళున్నితంగా, గర్వంగా ఉన్న ఈ కుర్ర బారిస్టర్ సహించలేకపోయాడు. రెండు మూడు రోజుల్లో అబ్దుల్లా గాంధీని డర్బాన్ లోని మేజిస్ట్రేట్ కోర్ట్ కు దక్షిణాఫ్రికాలో న్యాయ వ్యవస్థ ఎలా ఉందో అనుభవం లోకి తేవటానికి తీసికెళ్ళాడు. వెళ్ళగానే మేజిస్ట్రేట్ గాంధీని నెత్తిమీద ఉన్న టర్బన్ తీసేయ్యమన్నాడు. అది అవమానంగా భావించి తిరస్కరించిన గాంధీ వెంటనే కోర్ట్ నుంచి బయటికి వచ్చేశాడు. "ఆహా ఇక్కడ కూడా నేను పోరాటం చెయ్యాలన్న మాట "అని రాసుకొన్నాడు జీవిత చరిత్రలో.

ఆయన ఎదుర్కొన్న అనేక అవమానకర దారుణ సంఘటనలముందు కోర్ట్ ఉదంతం లెక్కలోకి రాదు. వ్యాజ్య విషయంలో అబ్దుల్లాకు సాయం కోసం ప్రిటోరియాకు సుదీర్ఘ సంక్లిష్ట ప్రయాణం చేయాల్సి వచ్చింది. చార్లెస్ టౌన్ కు రైలు లో, స్టాండర్ టన్ కు కోచిలో, మరోకోచిలో జోహాన్స్ బర్గ్, అక్కడనుంచి ట్రెయిన్ లో ప్రిటోరియా వెళ్ళాడు. ఈ ప్రయాణం లోనే ఆయన్ను ఫస్ట్ క్లాస్ కంపార్ట్ మెంట్ నుంచి మార్ట్జ్ బర్గ్ లో అవమానించి దెబ్బలుకొట్టి, చివరగా బయటికి తోసేశారు. చావుతప్పి, కన్ను లొట్టపోయినట్లు ఎట్లాగో ప్రిటోరియా చేరాడు. అక్కడ స్టేషన్ లో ఒక నల్లజాతి అమెరికన్, అమెరికన్ వాళ్ళ చిన్న హోటల్ కు తీసుకు వెళ్ళాడు. అక్కడే ఆరాత్రి గడిపి మర్నాడు అబ్దుల్లా ఏర్పాటుచేసిన లాడ్జికి మారాడు.

తాను, విన్న, కన్నా అనుభవించిన జాతి వ్యతిరేకత, వివక్ష, పక్షపాతాలు సున్నితమనస్కుడైన గాంధీని కలచివేసి, తక్షణమే తిరుగుటపాలో ఇండియా వెళ్లి పోవాలని పించింది. కాని వాణిజ్య కేసు కాంట్రాక్ట్ ఆయన్ను ఉండిపోవాల్సిన పరిస్థితి కల్పించి ఒక ఏడాది ఎలాగో అలా గడుపుదాం లే అని నిర్ణయించాడు. తిరిగి

వెళ్ళటం పిరితనం అవుతుందనుకొన్నాడు. కనుక దీనికి ఏదో ఒక పరిష్కారం ఆలోచించాలనిపించి, మొదటగా దక్షిణాఫ్రికా భారతీయుల ను ఉత్తేజ పరచి వారిని సంఘటిత పరచే పనిలో పడ్డాడు. అక్కడికి చేరిన కొద్ది రోజులకే దక్షిణాఫ్రికాలో మొదటి ఉపన్యాసం లో భారతీయులు మత, ప్రదేశ, పుట్టుకలకు అతీతంగా ఏకం కావాలని,సంఘటిత శక్తినిఎదిరించేదేదీ ఉండదని ఉత్తేజకరంగా ప్రబోధాత్మకంగాప్రసంగించాడు. అక్కడి వర్తక వాణిజ్య వర్గాలవారిని నీతి నిజాయితీ తో ప్రవర్తించమని, ఆరోగ్య విషయం లో అందరూ సుచి శుభ్రత పాటించమని కోరాడు.

ఒక ఏడాది గడిచాక ఇండియాకు తిరిగి వెళ్లబోయే గాంధీకి డర్బాన్ లో వీడ్కోలు విందు ఏర్పాటు చేశారు. అందులో గాంధి "నటాల్ మెర్క్యురి "పత్రికలో వచ్చిన వార్త చదివి వినిపించాడు. అందులో నటాల్ ప్రభుత్వం 43వేలమంది ఇండియన్స్ లో వోటు హక్కు ఉన్న 250మంది ఇండియన్ వోటుహక్కు రద్దు చేస్తున్నట్లు ఒక బిల్లు ప్రవేశ పెట్టబోతోందని ఉంది. వెంటనే గాంధీ అక్కడి ఇండియన్ లను దానికి వ్యతిరేకగా పోరాటం చేయమని పిలుపునిచ్చాడు. దీనికి స్పందించి వారంతా గాంధీని ఇండియా పర్యటన వాయిదా వేసుకోమని, తమను దగ్గరుండి నడిపించి మార్గ దర్శనం చేయమని అభ్యర్ధించారు. అబ్దుల్లా సేర్ కూడా ఒకడుగు ముందుకు వేసి తగినట్లు స్పందించి "మేమంతా నడకరానివాళ్ళం, అక్షరం ముక్క లేని వాళ్ళం. రోజువారీ మార్కెట్ రేట్లు తెలుసుకోవటానికే మేము రోజు పేపర్లు చూస్తాం. మాకు చట్టాల సంగతి ఏం తెల్సు. ఇక్కడ మా కళ్ళూ చెవులూ అన్నీ యూరోపియన్ అటార్నీ లే. "అని ప్రసంగించి గాంధీ మనసు మార్చుకొనేట్లు, పర్యటన వాయిదా వేసుకొనేట్లు చేశాడు.

అబ్దుల్లాతో సహా అందరు గాంధీని ఇండియా పర్యటన వాయిదావేసుకోనమని కోరటం ఆయన మనసు మార్చి ఉండటానికి, వారికి రాబోయే బిల్లును వ్యతిరేకించే పోరాటం లో నాయకత్వం వహించటానికి అంగీకరించాడు. ఆ రోజు రాత్రే ప్రభుత్వానికి టెలిగ్రాం ఇచ్చి తన పర్యటన వాయిదాకుఏర్పాట్లు చేయమని కోరి, శాసన సభ్యులకు బహిరంగ లేఖ ద్వారాకూడా తెలియ బర్చాడు. ఇండియన్ల వోటు హక్కు రద్దుబిల్లుకు వ్యతిరేకంగా పోరాటం చేయటానికి ప్రచార సంఘం హాజీ ఆడం చైర్మన్ గా,, గాంధి సెక్రేటగాఏర్పాటైంది. నెలరోజులలోపే పది వేలమంది భారతీయులు అంటే అక్కడున్న వారిలో నాలుగో వంతు వారు ఒక పిటిషన్ పై సంతకాలు చేసి,లండన్ లో కాలనీల సెక్రెటరి ఆఫ్ స్టేట్ లార్డ్ రిప్పన్ కు పంపారు.. నటాల్ శాసన సభ దీన్ని పెద్దగా సీరియస్ గా తీసుకోలేదు. గాంధీ ఆయన తరఫువారు చేసిన ప్రయత్నం పలుబడి ప్రభావాల వలన ఇంపీరియల్ ప్రభుత్వం ఆ బిల్లును అంగీకరించకుండా నిలుపుదల చేసింది, ఇది గాంధీ సాధించిన తొలివిజయం.

1894మే లో ఈ పోరాట సమితి "నటాల్ ఇండియన్ కాంగ్రెస్ "గా రూపొంది, ప్రతి భారతీయుడిని సభ్యుడిగా చేరటానికి బాగాతోడ్పడింది. ఈ లోగా గాంధీ ఇండియన్ లలో ఆంత రింగిక అభి వృద్ధి కోసం ప్రయత్నించాడు. తమ తప్పులు తాము తెలుసుకొనేట్లు చేయటానికి గాంధీ మిత్రబృందం అనేక ప్రదర్శనలు నిర్వహించి వాటిపై సంగాలు చేసి,వారితో చర్చలు జరిపి పరిశుభ్రత, ఆరోగ్యాలపై అవగాహన కలిపించారు. నివాసాలకు, షాపులకు వేర్వేరు బిల్డింగ్ లు ఉండాల్సిన అవసరాన్ని,తమ స్థాయిని బట్టి తగినట్లుగా బాగా ఉండాలని తెలియ జెప్పారు. ఈరకమైన స్వాతంత్రం ఒక ఏడాదిన్నర గడిచింది. కాని నక్కజిత్తుల ప్రభుత్వం అతి తెలివిగా కోరలు ఇండియన్ లలో బాగా లోతుకు దిగేట్లు బిల్లును మార్చి, మసిపూసి మారేడుకాయ చేసి అది వాళ్ళను ఉద్దేశించి కాదనే అభి ప్రాయం కలిగించింది. అందులో ఇలా ఉంది –"ఈ చట్టం, అత్యున్నత ప్రత్యేక హక్కు, పౌరసత్వంవోటు, హక్కు లేని అనుభవం లేనివారి వోటుహక్కును మాత్రమె తొలగిస్తుంది ". అంటే మరో విధంగా చెప్పాలంటే, అప్పటికి తమ మాతృదేశాలలో వోటుహక్కు లేని అన్ని జాతులవారికీ వర్తిస్తుంది. ఈవిధంగా భారతీయ సంతతిఇంగ్లీష్ వారితో సమానత్వం, వోటుహక్కులను ఈ బిల్లు హరించేసి, గొప్ప అన్యాయం చేసింది.

## భారత్ కు మళ్ళీ

మూడేళ్ళు దక్షిణాఫ్రికాలో గడపిన గాంధి, 1896 వేసవిలో కుటుంబంతో సహా తిరిగివచ్చి, భారత దేశ జాతీయ నాయకులకు దక్షిణాఫ్రికా భారతీయుల దీన హీన నికృష్ట జీవితాన్ని నివేదించాడు. వెంటనే "గ్రీన్ పాంప్లెట్ "పేరుతో సౌతాఫ్రికా భారతీయల గురించి రాసి ప్రచురించాడు. చాలా మంది నాయకులను కలిసి, పబ్లిక్ మీటింగ్ లలోనూ, నటాల్ ఇండియన్ల దీనగాధను వివరిస్తూ, ఏ ఒక్క అవకాశమూ వదిలిపెట్టలేదు. గాంధీ కార్యక్రమాలగురించి నటాల్ కు, ఇంగ్లాండ్ కు తప్పుడు సమాచారాలు అందాయి. ఆయన వెలువరించిన గ్రీన్ పాంప్లెట్ ను తప్పుగా వక్రీకరించి, రెచ్చ గొట్టే విధానం గా మసాలా దట్టించి లండన్ లోని ప్రెస్ ఏజెన్సీ కి, రాయిటర్ వార్తా సంస్థకు కేబుల్ చేశారు. అక్కడినుంచి దక్షిణాఫ్రికాకు పంపారు. దీనివలన గాంధీగారు సౌతాఫ్రికా తెల్లజాతి వారిని, న్యాయస్థానాలను దారుణంగా ద్వేషిస్తున్నాడని, అక్కడి తెల్లవారికి తనదైన అచ్చమైన నల్లముఖం తో కనిపిస్తున్నాడని బాగా ప్రచారం చేశారు. ఈ కేబుల్ దక్షిణాఫ్రికా వార్తా సంస్థలకు,, నటాల్ లోని కాలనీప్రభుత్వానికి విపరీతమైన ఆగ్రహం తెప్పించింది. అసలే కోతి, ఆపై తాగి నిప్పులమీద నడిచినట్లైంది.

నటాల్ ఇండియన్ కమ్యూనిటి జనవరిలో పార్లమెంట్ మొదలయ్యే లోపు దాక్షిణాఫ్రికాకు తిరిగి రమ్మని టెలిగ్రాం పంపింది. వెంటనే బాక్ టు పెవిలియన్ లాగా కుటుంబంతో బయల్దేరి డర్బాన్ చేరాడు. 1897మొదట్లో డర్బాన్ హార్బర్ లో కోర్ట్ లాండ్, నటేరి అని రెండు షిప్పులు 800మంది భారతీయులతో చేరాయి. వారందరినీ "క్వారెంటైన్ఆర్డర్ "ద్వారా అక్కడే ఉండేట్లు చేశారు. ఈ ఆర్డర్ ప్రవేశ నిషేధం తోపాటు ఆరోగ్య సమస్యలను బాగా పెంచుతుందని వాదించాడు. కాలనీ వాసులకు గాంధి రాక తెలిసి, అప్పటికప్పుడు ఒక సభ జరిపి ఇండియన్ బలగాలు ప్రభుత్వ వ్యతిరేకతతో ప్రభుత్వాన్ని కూల దోసేప్రయత్నాలు చేస్తున్నారని, ప్రసంగాలు చేసి కాల నిస్ట్ లను రెచ్చగొట్టి, షిప్పులలోని ఇండియన్స్ ను దిగనిస్తే మహా ప్రమాదమని, కల్లోలం సృష్టిస్తారని కనుక ప్రభుత్వం వాళ్ళ రాక ను నిషేధించే చట్టం చేయాలని తీర్మానాలు చేసి, అలా కాకపొతే తెల్లవాళ్ళు తమకు తోచిన విధం గా చేయాల్సి వస్తుందని, ఘాటుగా స్పందించి ఇండియన్ లపై వ్యతిరేకతను పుండుకు కారం రాసినట్లు తీవ్రతరం చేశారు.

ప్రభుత్వాధికారులు నౌక ప్రయాణీకులను నిర్బంధించటం లో వచ్చే కష్టనష్టాలు ఆలోచించలేదు. పోర్ట్ కు చేరిన వేలాది తెల్లవారు తమ ఆందోళన సక్సెస్ అని సంబర పడ్డారు. ఇలా నౌకా నిర్బంధంలో భారతీయులను 23 రోజులుంచారు. వలస వాదులను భయపెట్టి దక్షణాఫ్రికాలో ప్రవేశించకుండా చేయవచ్చుననే వ్యూహమూ వాళ్ళ మనసులో ఉంది. తెల్లమూక తోకముడవగానే ఇండియన్ లు నౌకదిగి డడర్బాన్ లో కాలుమోపారు.

గాంధీని మరో రోజు షిప్ లోనే ఉండిపొమ్మని, లేకపోతే తెల్లవారి ఆగ్రహజ్వాలలను ఎదుర్కోవాల్సి వస్తుందని ఆదేశించారు. మిగిలిన పాసెంజర్ లతోపాటు గాంధీ కుటుంబం కూడావెళ్ళిపోయింది. గాంధీ ఒక్కడే ఓడలో ఉన్నాడు. గాంధీ లాయర్ స్నేహితుడు మిస్టర్ లాటన్ వచ్చి,రాత్రిదాకా షిప్ లో ఉండకుండా తనతో కాలినడకన రుస్తుం భాయి ఇంటికి రమ్మని కోరాడు. అలాగే అని వెడుతుండగా గాంధీ టర్బన్ గుర్తించిన తెల్లమూక ఆగ్రహం తో వొంగోపెట్టి దెబ్బలతో చంప ప్రయత్నం చేసింది. మీదకు చేపలు విసిరి అవమాన పరచి, దాడి చేశారు. స్పృహ కోల్పోయి అచేతనంగా రోడ్డుపై పడిపోయాడు గాంధీ. కసి తీరక మళ్ళీ కొట్టి చంపే వాళ్ళేకానిపోలీస్ సూపరిం టేం డెంట్ అలేక్సాండర్ భార్య అడ్డుపడి,గాంధీకి, తెల్లమూకకు మధ్య రక్షణ కవచంలా నిలబడి పోయింది. ఇంతలో పోలీసులు వచ్చి గాంధీని రుస్తుంజీ పాలెస్ కు చేర్చారు. కానీ కోపోద్రేకాలతో ఊగిపోయిన తెల్లమూక రుస్తుమ్జీ ఇంటిని చుట్టు ముట్టారు. అక్కడి నుంచి గాంధి మారువేషం లో ఒక పోలీస్ సాయంతో తప్పించుకొన్నాడు.

ఈ దౌర్జన్య కాండ వార్త ఇంపీరియల్ గవర్నమెంట్ ను రెచ్చగొట్టింది. గాంధీపై దాడి జరిపిన వారిని గుర్తించి శిక్షించి అరెస్ట్ చేయమని నటాల్ ప్రభుత్వాన్ని ఆదేశించింది. ఇలా చేస్తే నటాల్ తెల్లజాతి వారి నుంచి తీవ్ర ఇబ్బందులేర్పడి, యూరోపియన్ వోటర్లపై ప్రభావం చూపిస్తుందని భయపడ్డారు కానీ గాంధీ తనపై దాడి చేసిన వారిపై కేసు పెట్టదలచుకోలేదని నిర్ణ ఇంచు కొన్నాక అటార్నీ జనరల్ హారీ ఎస్కామ్బే, భావి నటాల్ ప్రధాని ఊపిరి పీల్చుకొన్నారు. కనీసం కాగితం పైన అయినా ఫిర్యాదు చేయమని కోరగా గాంధీ "నేను ఇక్కడ కాలుపెట్టగానే నన్ను గాయపరచినవారిపై బాధపెట్టే పని ఏదీ చేయకూడదని మనసులో నిర్ణయించుకొన్నాను. కనుక దాడి చేసిన వారిని ప్రాసిక్యూట్ చేయటం అనేది జరగనిపని "అని రాశాడు. దీనితో మొదటి సారిగా సౌతాఫ్రికా, గాంధీ గారి సంస్కృతీ, మానవత్వం, హుందాతనం అర్ధం చేసుకొన్నది..

## బోయర్ యుద్ధం

అప్పుడే ట్రాన్స్ వాల్, ఆరంజ్ ఫ్రీ రాష్ట్రాలు ఖనిజ సంపదకు నిలయాలుగా రూపొందాయి.. కనుకసహజం గా బ్రిటిష్ వారికళ్ళు వీటిపై పడ్డాయి. ఇది క్రమంగా ఆంగ్లో – డచ్ శత్రుత్వానికి దారి తీసి,చివరకు 1899-1901 మధ్య యుద్ధం ఆరంభమైంది బోయర్ ల చాలెంజి వలన యూరోపియన్ సామ్రాజ్యం ఉనికికే ప్రమాదం వాటిల్ల బోతోందని గాంధీ గ్రహించి బ్రిటిష్ పక్షాన నిలిచాడు. ఇందులోని తర్కాన్ని "నేను బ్రిటిష్ పౌరుడిగా హక్కులకోసం పోరాడు తున్నాను కనుక బ్రిటిష్ ప్రభుత్వ రక్షణకోసం సాయం చేస్తున్నాను "అని చెప్పాడు 11వేలమంది సుశిక్షితులైన వాలంటీర్ల తో"అంబులెన్స్ కార్ప్స్" తయారు చేశాడు. దీనితో దక్షిణాఫ్రికా భారతీయులకు కొద్దిగా గౌరవం, గుర్తింపు లభించాయి.

బోయర్ యుద్ధం పూర్తయ్యాక బ్రిటిష్ వారిలో ఇండియన్లపట్ల సుహృద్భావం, ఏర్పడి నిత్య సంఘర్షణ వాతావరణం ఉండదని భావించి మళ్ళీ ఇండియా వెళ్లాలని నిర్ణయించాడు. ఏడాది లోపల తన అవసరం ఉందని తెలియ జేస్తే వచ్చి వాలుతానని ఇండియన్స్ కు అభయమిచ్చి ఇండియాకు బయల్దేరాడు. ఇండియాలో స్థిరపడ్డాక ఇండియన్ కమ్యూనిటి నుంచి చాంబర్లేన్ పర్యటనకు వస్తున్నాడని, అర్జెంట్ గా దక్షిణాఫ్రికా బయల్దేరి రమ్మనే కేబుల్ అకస్మాత్తుగా అందుకొన్నాడు.. ఆగ మేఘాలమీద సౌతాఫ్రికాలో వాలిపోయాడు. కాని అతను ఇండియన్ ప్రతినిది వర్గానికి పుర్ర చెయ్యి చూపించి, కాలనీ ప్రభుత్వాలపై ఇంపీరియల్ ప్రభుత్వానికి నామమాత్రపు నియంత్రణ మాత్రమే ఉందని చేతు లేత్తేశాడు. దీని భావం గ్రహించిన గాంధీ, సహ చరులు మళ్ళీ కొత్తగా తమ పని ప్రాంభించాల్సిందే నని భావించి దీనికోసం జోహన్స్ బర్గ్ లో గాంధీ తన ఆఫీసు ప్రారంభించాడు.

## ఫోనిక్స్ పరిష్కారం

ఈ సమయం లోనే గాంధీ స్నేహితుడు హెచ్ ఎస్ ఎల్ పొలాక్ వీడ్కోలు చెప్పటానికి వచ్చి జాన్ రస్కిన్ రాసిన "అన్ టు ది లాస్ట్ "పుస్తకం ఇచ్చి డర్బాన్ కు జరపబోయే 24 గంటల రైలు ప్రయాణం లో చదవమన్నాడు. అది చదివి విపరీతంగా ప్రభావితుడైనాడు. అందులోని మూడు సిద్ధాంతాలు ఆయనమనసును పట్టేశాయి. అవి

1-మనిషిలోని మంచితనం అందరి మంచి తనంలో నే ఉంటుంది.

2-లాయర్ పని ఎంతగొప్పదో మంగలి పనికూడా అంతగొప్పదే.. ప్రతి వృత్తి జీవికకోసమే కనుక అన్నీ సమానమైనవే.

3-కూలీ జీవితం, రైతు జీవితం, చేతి వృత్తిపని వారి జీవితం జీవనాకికి అర్హమైనవే

ఈ మూడు సిద్ధాంతాల ప్రభావతో గాంధీ తన భవిష్యత్ జీవితాన్ని తీర్చి దిద్దుకున్నాడు. ఈ భావనలతోనే 1904 లో డర్బాన్ కు 12 మైళ్ళ దూరం లో ఒక సెటిల్ మెంట్ ను ఏర్పాటు చేశాడు. మొదట్లో ఇరవై, తర్వాత మరో ఎనిమిది ఎకరాలు కొని, దానిని ఒక ప్రయోగ క్షేత్రంగా మార్చాడు. ఇందులో ఉన్నప్రతి ఒక్కరు కాయకష్టం చేయాల్సిందే. ఫలితాలు లాభాలను అందరూ సమానంగా పంచుకోవాల్సిందే. దీనినే గాంధీజీ "ఫోనిక్స్ సెటిల్మెంట్ "అన్నాడు.

## మారిన యుద్ధభూమి

కొత్తపోరాటం ప్రారంభించిన గాంధి, తన యుద్ధ క్షేత్రాన్ని నటాల్ నుంచి, ట్రాన్స్ వాల్ కు మార్చాడు. కారణం ఇక్కడ నల్లవారిపై బ్రిటిష్ వాళ్ళ పాలన, దౌష్ట్యం ఎక్కువవటమే.ఈ అన్యాయాన్నిఎదిరించటానికే కార్య స్థానం మార్చాడు. ఇక్కడే మొదటిసారి సత్యాగ్రహ అస్త్ర ప్రయోగం చేశాడు. కాని సమస్య పరిష్కారానికి చాలా ఏళ్ళు పట్టింది. ఏది ఏమైనా ఇక్కడి ఇండియన్ ల గౌరవం, ఆత్మ గౌరవాలను పరి రక్షించాలని సంకల్పించాడు.

1906 లో నటాల్ లోని జులూస్ వారు నటాల్ ప్రభుత్వంపై తిరగబడ్డారు. దీనితో సత్యాగ్రహ ఉద్యమం ఆగిపోయింది. బాధితుల సేవకోసం తన ఇండియన్ అంబులెన్స్ కార్ప్స్ ను గాంధీ రంగం లోకి దించే ప్రయత్నం చేయగా ప్రభుత్వం ఆమోదించింది. క్షతగాత్రులకోసం ఒక హాస్పిటల్, 24మంది వాలంటీర్ల దళం ఏర్పాటు చేశాడు. ఇక్కడి ఇండియన్ లకు గాంధీ "సార్జంట్ మేజర్ "అనిపించాడు. ఎవరికి వారు తమవంతు సేవలందించి ఆదుకొన్నారు.

రాజకీయ ఉద్రేకాలు తగ్గిపోగానే గాంధీ మళ్ళీ ఉద్యమాన్ని మొదలెట్టాడు. సత్యాగ్రహుల సంఖ్యపెరిగింది. ప్రభుత్వం వీరిని అరెస్ట్ చేసి చట్ట వ్యతిరేకంగా ప్రవర్తిస్తున్నారని కేసుపెట్టి తీవ్ర శిక్షలు విధించింది. వీటికి సత్యాగ్రహులు భయపడలేదు. తమపోరాతానికి ఇవేమీ అడ్డంకి కాదని భావించారు. గాంధీని కూడా అరెస్ట్ చేసి కఠిన కూలీ పని చేయించారు. గాంధీ మిత్రుడు పొలాక్, దక్షిణాఫ్రికాలో ఉన్న జర్మన్ ఆర్కిటెక్ట్ కలాన్ బాష్ లను కూడా అరెస్ట్ చేసింది ప్రభుత్వం. సత్యాగ్రహమే ఒక యుద్ధంతో సమానం అనిపించింది ఇండియన్ లకు. ఈ ధోరణి నాలుగేళ్ళు సాగింది. సత్యాగ్రహ కుటుంబాలను "సత్యాగ్రహ అసోసియేషన్ "కొంతవరకు ఆదుకొన్నది..జోహాన్స్ బర్గ్ లండన్ లో ఉన్న ఆఫీస్ ల నిర్వహణకు కావాల్సిన డబ్బుకావాలి. భారతీయ అభిప్రాయం ప్రతిఫలించి సాయం అందింది.

1906 నుంచి ఫండ్ నిధులు ఖాళీ అవటం మొదలైంది. రాజకీయ పోరాటం లో నిండా మునిగిన గాంధీ లా ప్రాక్టీస్ కూడా తగ్గి డబ్బుకు కటకట అయింది. రతన్ టాటాలాంటి వారి ఆర్ధిక సాయం ఏమూలకూ చాలటం లేదు. నిత్య ప్రభుత్వ ఘర్షణ. కాలమూ కలిసి రావటం లేదు. కనుక అందరు భారీగా ఖర్చులు తగ్గించుకోవటమే తరుణోపాయం అని గాంధీ భావించాడు. అందుకోసం సత్యాగ్రహ కుటుంబాలను సహకార క్షేత్రం లోకి మార్చటం ఉత్తమమని అనిపించింది. కానే ఫొనిక్స్ సెటిల్ మెంట్ డర్బాన్ దగ్గర జోహాన్స్ బర్గ్ నుంచి 30గంటల రైలు ప్రయాణ దూరం లో మరొక ప్రాంతం లో ఉంది.

### టాల్ స్టాయ్ ఫారం

ఈ సంక్లిష్ట పరిస్థితు లలో హెల్లాన్ కల్లెం బాష్ ఆపద్బాంధవుడిగా ఆదుకొన్నాడు. జోహాన్స్ బర్గ్ కు 20మైళ్ళ దూరం లో 1100ఎకరాల భూమికొని, సత్యాగ్రహులు ఉచితంగా ఉండటానికి గాంధీకి ఇచ్చాడు. అందులో చిన్న ఇల్లు వెయ్యి ఫల వృక్షాలున్నాయి. ఈ క్షేత్రానికి గాంధీజీ "టాల్ స్టాయ్ క్షేత్రం "అని తన ఆదర్శ రష్యన్ రచయిత ఫిలాసఫర్, అలేక్జాండర్ లియో టాల్ స్టాయ్ కి గౌరవ చిహ్నంగా నామకరణం చేశాడు. క్రమక్రమంగా ఈ క్షేత్రాన్ని గాంధీ పౌర నివాస భూమిగా మార్చాడు. దీనితో సత్యాగ్రహ కుటుంబాలు ఒకే చోట పరస్పర సహకారం తో జీవించటానికి వీలుకలిగి, ఖర్చులు విపరీతంగా తగ్గిపోయాయి. ఇదే పోరాట క్షేత్రంగా మారి బ్రిటిష్ నిరంకుశత్వాన్ని ఎదిరించి పోరాడటానికి ఫలితాలు సాధించటానికి బాగా ఉపయోగపడింది. వీటిలో గాంధీలో ఉన్న ప్రయోగ శీలత అభి వ్యక్తమౌతోంది. ఆరోగ్యం విద్య, గౌరవ జీవితం సాదించటానికి ఆవాస భూమి అయింది. చివరికి ఈ క్షేత్రం ఆధ్యాత్మిక ఆత్మ పరిశుద్ధి కేంద్రంగా,తపోభూమిగా అభి వృద్ధి చెందింది.

గాంధీ పై ఇండియాలో ప్రజాభిప్రాయం బాగా అనుకూలం గానే ఉంది. 1911 ఏప్రిల్ లో బోతా ప్రభుత్వ ఇంటీరియర్ మినిస్టర్ జనరల్ జాన్ స్మట్స్ చివరికి గాంధీ సూత్రాలకు (ఫార్ములా) ఉత్తరాలద్వారా సూత్రప్రాయంగా అంగీకరించగా ఇద్దరిమధ్యా తాత్కాలిక ఒప్పందం కూడా ఉత్తరాలద్వారానే కుదిరింది. 28-4-1911 న జోహాన్స్ బర్గ్ లో గాంధీ పబ్లిక్ మీటింగ్ లో తెలియ జేసి, ప్రజామోదం పొందగా పోరాటానికి తెరపడింది. జూన్ 1న ఖైదీల నందర్నీ విడిచిపెట్టారు. ఒప్పందం కుదిరినట్లే ఉంది కాని వాతావరణం ఇంకా పూర్తి అనుకూలం గా లేదనిపించింది. ఇది అయిదవ జార్జి పట్టాభి షేకాన్ని ధృవీకరించటం లో ప్రతిబింబించింది. సామ్రాజ్యానికి విధేయత ప్రకటించినా, పట్టాభి షేక మహోత్సవం లో పాల్గొనటానికి సుముఖంగా లేరు.

ఇలాంటి అసందిగ్ధ వాతావరణం లో భారత జాతీయ నాయకుడు, గౌరవనీయుడు గోపాలకృష్ణ గోఖలే దక్షిణాఫ్రికా పర్యటనకు గాంధీజీ ఆహ్వానం పై వచ్చాడు. గాంధీతో అత్యంత చనువు గా ఉంటూ గాంధీని, దక్షిణాఫ్రికా భారతీయులను, అక్కడి పరిస్థితులను క్షుణ్ణంగా గమనించాడు. దక్షిణాఫ్రికాకు ఆయన బ్రిటిష్, ఇండియా ప్రభుత్వాల ఆశీస్సులతోనే వచ్చాడు. బ్రిటిష్ ప్రభుత్వం యూని యాన్ ప్రభుత్వానికి సామ్రాజ్యం లో గోఖలే హోదాను తెలియ జేసి అదే గౌరవమర్యాదలు కలుగ జేయమని కోరగా సౌతాఫ్రికా గవర్నమెంట్ ఏ లోపం రాకుండా అత్యంత గౌరవమర్యాదలతో చూసింది. ప్రముఖులందరితో ఆయన మాట్లాడి, భారతీయులను, యూనియన్ ప్రభుత్వాన్నీ మళ్ళీ చర్చలు జరిపెట్లు చేశాడు. ఒప్పందంలోని నటాల్ లోని ఇండియన్ లపై ఏడాదికి విధించిన 3పౌండ్ల టాక్స్ ను వెనక్కి తీసుకోవటానికి ప్రభుత్వాన్ని ఒప్పించాలని అది తాను దక్షిణాఫ్రికాలో సాధించిన విజయం కావాలని నిర్ణయించాడు. తాను వెళ్ళేటప్పుడు ప్రభుత్వం తనమాట కాదనదనే విశ్వాసం తో ఉన్నాడు. కాని యూనియన్ ప్రభుత్వం మాట నిలబెట్టుకోలేదు. అదేకాక కేప్ ప్రావిషియల్ సుప్రీం కోర్ట్" క్రిస్టియన్ సంప్రదాయంలో జరిగిన వివాహాలే చట్టబద్ధమైనవని" తీర్పు ఇవ్వటం అగ్నిలో ఆజ్యమైంది. ఆ తీర్పు ప్రకారం దక్షిణాఫ్రికాలో ని హిందూ ముస్లిం, పార్సీ భార్యలు ఉంపుడు గత్తెల లేక వ్యభిచారిణుల స్థాయికి దిగజార్చటం అన్నమాట అని గాంధీ అభిప్రాయపడ్డాడు. దీనితో భారతీయ మహిళలంతా సత్యాగ్రహినులుగా మారిపోయారు. అందులో కొందర్ని గాంధి తన దళ సభ్యులను చేశాడు.

ఏదో మసిపూసిమారేడుకాయ చేసే తాత్కాలిక ఒప్పందాలకంటే బహిరంగ పోరాటమే మంచిదని గాంధి భావించాడు. "ఇండియన్ ఒపీనియన్ "పత్రికలో "ఒప్పందం,అసలైన స్పూర్తితో జరగనప్పుడు అది ఒప్పందమే కాదు "అని రాశాడు. కనుక ప్రభుత్వం ను దక్షిణాఫ్రికాలోని యూరోపియన్ జనాభాను కదిలించే

పోరాటమే చేయాలని నిశ్చయించాడు. దీనికి ముందు సామ్రాజ్యం లో అంతటా సహాయ నిరాకరణ ఉద్యమం చేబట్టాడు. సౌతాఫ్రికాలో కొందరు తెల్లవారు నల్లవారికి మద్దతుపలికారు. భారత జాతీయ నాయకులు దీటుగా స్పందించారు. ఊహించని పరిణామం వైస్ రాయ్ లార్డ్ హార్డింజ్ దక్షిణాఫ్రికా ప్రభుత్వ విధానాలను పబ్లిక్ గా ఘాటు మాటలతో విమర్శించి నిష్పక్షపాత విచారణకు ఆదేశించాడు విచారణ సంఘాన్ని నియమించటం తప్ప జెనరల్ స్మట్స్ కు గత్యంతరం లేకపోయి,గాంధీని ఆయన అనుచరులు కలలెన్ బాష్, పొలాక్ లను విడుదల చేశాడు. ఎంక్వైరికమిషన్ ఇండియన్ లకు స్థానం లేనందుకు గాంధీ వ్యతిరేకించాడు. దీనికోసం డర్బాన్ లో పెద్ద ప్రదర్శన 1914 జనవరి 1 న నిర్వహిస్తానని ప్రకటించాడు. కాని దక్షిణాఫ్రికా రైల్వే లోని తెల్లజాతి ఉద్యోగులు అదే సమయం లో సమ్మె చేసే ప్రయత్నంలో ఉండగా, ఘర్షణ పనికి రాదనీ గాంధీ ప్రదర్శన వాయిదా వేశాడు. దీనిప్రభావం ఇండియా,ఇంగ్లాండ్, దక్షిణాఫ్రికా ల లోకూడా బాగా కనిపించింది. దక్షిణాఫ్రికాలోని నల్లవారిని వ్యతిరేకించే తెల్లవారు కూడా గాంధీ నిర్ణయాన్ని శ్లాఘించారు.

గోఖలే సి ఎఫ్ ఆండ్రూస్ ను దక్షిణాఫ్రికా కు పంపగా వచ్చి, ఇరువైపులవారితో చర్చించి కలిపే ప్రయత్నం చేశాడు. గాంధీ, స్మట్స్ మధ్య అనేక దఫాల చర్చలు జరిగాయి. చివరకు ఒక ఒప్పందం సాధించారు. దీని ప్రకారం ఇండియన్ రిలీఫ్ యాక్ట్ పాసయింది. 3పౌండ్ల టాక్స్ రద్దయింది. హిందూ, ముస్లిం పార్సీ వివాహాలు గుర్తింపబడ్డాయి. చట్టం అమలు న్యాయంగానిష్పక్షపాతంగా జరుగుతుందని, హక్కులను కాపాడుతుందని జనరల్ స్మట్స్ ప్రజలకు హామీ ఇచ్చాడు. గాంధీ కూడా 1920 నుంచి ఒప్పందం లేని కూలీలు దక్షిణాఫ్రికాలో ప్రవేశించరని ఒప్పుకున్నాడు. దక్షిణాఫ్రికాలో ఉంటున్న ఇండియన్ల, మళ్ళీ అక్కడికి చేరబోయే వలస భారతీయుల హక్కులను కాపాడటం అసాధ్యం అని గాంధీ భావించి, అలా ప్రకటించి ఉంటాడు. ఈ ఒప్పందం సత్యాగ్రహానికి వాస్తవమైనదిగా కనిపించి చట్టబద్ధమైనదని పించింది. అంతే కాదు దక్షిణాఫ్రికాలోని భారతీయులకు చట్టబద్ధత కలిగిందికూడా. ఇంకా పూర్తిగా పౌరహక్కులు రాకపోయినా, దక్షిణాఫ్రికా భారతీయులు సత్యాగ్రహం వలన ఉనికికి న్యాయ అనుమతి పొందగలిగి దక్షిణాఫ్రికా నుండి గెట్టి వెయ బడ జాలని బలమైన జాతివారుగా, భాగస్వామ్యులుగా అయ్యారు. ఇది గాంధీ సాధించిన అపూర్వ విజయం దక్షిణాఫ్రికాలో.



ఈ పోరాటాలలో గాంధి తన నిజాయితీని,వ్యక్తిత్వాన్ని, సూటి మార్గాన్ని పారదర్శకంగా ప్రదర్శించి మెప్పు పొందాడు. ఆయన పోరాటం బాధితుల, అణగద్రొక్క బడిన వారి కన్నీరు, బాధలు దూరం చేయటానికే. ఇదే ఆయన ముఖ్య సూత్రం గా మారింది. అణగ ద్రొక్కేవారు అణగ ద్రొక్క బడే వారు సహకరించుకోకపోతే అణగద్రొక్కబడంటం అంతం కాదు అని విశ్వసించాడు. ఇందులో అందరూ విజేతలే. ఆయన సిద్ధాంతం "విన్ –విన్ "సిద్ధాంతం. అంటే ఇరువైపులా విజయం ఉండాలి. అణచ బడే వారికి అణచేవారు శత్రువులుగా కనిపించకూడదు. వాళ్ళ దుర్దశ కష్టాలను ఆయన అడ్వాంటేజిగా అంటే అనుకూలంగా ఎన్నడూ తీసుకోలేదు. వాళ్ళ దయనీయ స్థితి చూసి,వారికి సాయం కోసం పోరాటం ఆపేసేవాడు. ఆంగ్లో –బోయర్ యుద్ధం,, రైల్వే సమ్మెలలో పోరాటం నిలిపేశాడు. ఆయన వ్యూహం సాంకేతికంగా "జీరో మొత్తాన్ని, నాన్ జీరో మొత్తం "గా మార్చే ఆట. గెలుపుకంటే ఇరువైపులా సామరస్య పరిష్కారానికే మొగ్గు చూపేవాడు. దీనికి చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయే గాంధీ –జనరల్ స్మట్స్ మధ్య జరిగిన విలువైన ఒప్పందమే గొప్ప ఉదాహరణ.

ఇండియాకు తిరిగి వెళ్ళే సమయం వచ్చిందని గాంధి భావించాడు. ఆయన రాజకీయ గురువు గోపాలకృష్ణ గోఖలే కూడా త్వరగా రమ్మని కబురు చేశాడు. దీనితో గాంధీ సౌతాఫ్రికాను 1914 జులై లో చివరి సారిగా వదిలేసి ఇండియా బయల్దేరాడు. ఆయన అభిమానులు అనుచరులు తండోపతండాలు గా వచ్చి దర్శనం చేసుకొని విలువైన కానుకలు బహుమతులు జ్ఞాపికలు అందించి "దేశభక్త మహాత్మా గాంధీ "నినాదాలతో వీడ్కోలు పలికారు. నిరంకుశ జనరల్ స్మట్స్ కూడా చలించిపోయి "మహర్షి మన తీరాలను దాటి వెడుతున్నాడు. బహుశా ఇక తిరిగిరారు "అని శ్లాఘించి స్పందించటం విలువైన మాటగా చరిత్ర పేర్కొన్నది.

దక్షిణాఫ్రికాలో గాంధీ పోరాటం సంక్షిప్తం గా చెప్పుకొంటే, మొదట్లో మనం వేసుకొన్న ప్రశ్నలకు సరైన సమాధానాలు లభిస్తాయి. గాంధి దక్షిణాఫ్రికా అనుభవం" అభద్రతాభావం తో పిరికిగా, విజయాలే లేని లాయర్ గా ఉన్న గాంధీని యదార్ధమైన, సృష్టిలో అద్భుతమైన వింత వ్యక్తిగా పరివర్తన చెందించింది. ఒక వేళ గాంధీ దక్షిణాఫ్రికాకు రాకుండా ఉండి ఉంటే? సమాధానం దొరకని ప్రశ్నగా మిగిలిపోతుంది.

దక్షిణాఫ్రికాకు గాంధి ఏం రుణ పడి ఉన్నాడు ?ఇది వింత ప్రశ్న. దీనికి సమాధానం చెప్పటానికి ముందు ఇండియాలో ఆయన బాల్యం, యవ్వనం, తలిదండ్రులనుంచి సంక్రమించిన నైతిక విలువలు, సాంప్రదాయం ఆయనలో గుప్తంగా ఉన్నాయి. ఇవన్నీ సౌతాఫ్రికా చేరగానే తగిన అవకాశాలు రాగానే బయటకు వ్యక్తమయ్యాయి. ఇండియాలోకాని ఇంగ్లాండ్ లోకాని జాతి వివక్ష, పక్షపాతం ఆయన ఎదుర్కోలేదు. దక్షిణాఫ్రికా అనుభవం ఆయనను దిగ్భ్రాంతి కి గురి చేసి,ఆయనను తట్టుకోనేట్లు గా, తన గౌరవం, వ్యక్తిత్వం కాపాడుకోనేట్లుగా చేసింది. నటాల్ లోని మిట్జ్ బర్గ్ స్టేషన్ లో రాత్రి ఉదంతం ఆయన జీవితంలో సృజనాత్మక మైన మార్పు తెచ్చింది. ఇక్కడే మొదటిసారి "రంగు పక్షపాతం"అంటే వర్ణ వివక్షత జబ్బును అన్ని కోణాలనుంచి ఎదుర్కొన్నాడు. అది లజ్జాకరమైన

హేయ సంఘటన. అది ఒక పాఠం గా నేర్చుకొని ఆయన మనసులో నిరసన బీజాలు మొలకెత్తి, కనిపించిన ప్రతి పక్షపాతాన్నిఎదుర్కొనే స్థితికి వచ్చాడు. ఇలాంటిపక్షపాతం ప్రిజుడిస్ మానవ గౌరవానికే భంగకరమని భావించి దాన్ని అంతమోదించటమే ధ్యేయంగా ఎంచుకొన్నాడు.

దక్షిణాఫ్రికాలో భారతీయులు అప్పటికి నాయకత్వ శూన్యం లో ఉన్నారు.ఇండియా వలసవాదులు "కుంటి, నిరక్షరాశ్యులు ".వారంతా ఎవరో వచ్చి తమను సమీకరించి నాయకత్వం వహించి మార్గదర్శకత్వం చేసి నడిపించాలని ఎదురు చూస్తున్నారు. ఆ సమయంలో యువ సున్నితమైన బారిస్టర్ రంగ ప్రవేశం చేశాడు. అక్కడి పరిస్థితులు ఆకళింపు చేసుకొని, వర్ణ పక్షపాతం వంటి సాంఘిక అసమానత లవంటి సమస్యలపై పోరాటానికి ఒక శక్తివంతమైన ఆయుధం కావాలని భావించాడు. అదే సత్యగ్రహ దివ్యాయుధం. అది విశ్వవ్యాప్త తారకమంత్రమై, అన్ని వ్యాధుల నివారణ ఔషధమై పని చేసింది. తన మాతృ భూమి ప్రవచించిన ఉపనిషత్సారం "సత్యమేవ జయతే "ను సత్యాగ్రహం అనే మహా గొప్ప ఆయుధంగా మార్చి ప్రయోగించాడు. ఇదే టెక్నిక్ ను ఇండియాలో 1913 దండి ఉప్పు సత్యాగ్రహ యాత్రలోనూ ప్రయోగించాడు. దక్షిణాఫ్రికా లో 2037మంది పురుషులు, 127 మంది స్త్రీలు, 57 మంది పిల్లల ఒక దళంతో నటాల్ నుంచి ట్రాన్స్ వాల్ లో ప్రవేశించాడు. ఈ నడక ఇండియన్ లేబర్ ల సమ్మెలో ఒకభాగమై అయిదు రోజులు నవంబర్ 6నుంచి 10 వరకు జరిగింది.






దక్షిణాఫ్రికాలోనే గాంధీ మొదటి సారిగా "స్వయం సేవ (సెల్ఫ్ హెల్ప్ )లోని సౌందర్యాన్ని ఆస్వాదించాడు. భగవద్గీతలో చెప్పబడిన " వస్తువుపై వ్యామోహం లేకపోవటం "(నాన్ పోసెషన్) ను ప్రచారం చేసి, అనుసరించాడు. ఇక్కడే స్నేహితుడు పొలాక్ ఆయనకు రస్కిన్ పుస్తకం "అన్ టు ది లాస్ట్ "1903 లో అందజేశాడు. దీన్ని చదివి అర్ధం చేసుకొని మనసుకు పట్టించుకొని అది భగవద్గీత ను ప్రతిధ్వనిస్తోందని గ్రహించి దాన్ని ఆధారంగా భవిషత్ ప్రణాళిక రచించుకొన్నాడు. అమెరికా తత్వవేత్త, వేదాంతి, రుషి తుల్యుడు" హెన్రి డేవిడ్ థోరో"రాసిన "సివిల్ డిస్ ఒబీడిఎన్స్"వ్యాసం చదివి "పాండిత్య నైపుణ్యంతో రాసిన అద్భుత గ్రంథం".నా జీవితం పై గొప్ప ప్రభావం చూపింది "అని గాంధీ మెచ్చుకొన్నాడు. దీన్ని ఆయనను దక్షిణాఫ్రికాలో వోక్ ట్రస్ట్ జైలు లో అరెస్ట్ చేసి ఉంచినపుడు చదివాడు. అందులోని "చర్యరాహిత్యాన్ని" మెచ్చుకొన్నాడు. రష్యన్ రచయిత లియో టాల్ స్టాయ్ పుస్తకం "దికింగ్డం ఆఫ్ గాడ్ ఈజ్ వితిన్ యు "చదివి అభిమానిగా మారి ఆయనతో స్నేహాన్ని ఉత్తర ప్రత్యుత్తరాలను జీవితాంతం కొనసాగించాడు. ఈ సంఘటనలన్నీ దక్షినణాఫ్రికాలోనే జరిగాయి. వాటిలోని విలువైన విషయాలను, విలువలను స్పూర్తిగా తీసుకొని తనలో నిక్షిప్తమై గుప్తంగా ఉన్న భావాలను జోడించి ప్రయోగాలు చేశాడు. దీనినుంచే గాంధీ మహా నాయకుడుగా, మహా తత్వ వేత్తగా పరిణామం చెందాడు.

ముఖ్యంగా దక్షిణాఫ్రికా అనుభవాలు భారత్ లో హింద్ స్వరాజ్ లేక హోమ్ రూల్ లు నేపధ్యమైనాయి. పాశ్చాత్య యాంత్రిక నాగరకత తెచ్చిన అనర్ధాలను గాంధి 76 పేజీల కరపత్రం గా ఇంగ్లాండ్ నుంచి సౌతాఫ్రికాకు 1909 లో తిరుగు ప్రయాణం లో రాశాడు. గాంధిజీవిత చరిత్ర రాసిన పాశ్చాత్య చరిత్రకారులలో ప్రసిద్ధుడైన లూయీ ఫిషర్ "దక్షిణాఫ్రికాలోనే గాంధీ కర్మ యోగి గా మారే ప్రయత్నం చేశాడు. గీతలో చెప్పినట్లు అనాసక్తత ను జీవితాంతం పాటించాడు "అన్నాడు. బికు ఫరేఖ్ గాంధీని క్షుణ్ణంగా పరిశీలించి రాసిన దానిలో "గాంధీ లోని తాత్విక భావనలలో ఎక్కువభాగం, అంతర్ దృష్టి ఏర్పడటానికి దాక్షిణాఫ్రికా గొప్ప భూమిక అయింది. గాంధీ మహాత్ముడుగా పరిణామం చెందటానికి, ఆ దేశం దోహదపడి గర్వకారణంగా మారింది "అంటాడు.

ఈ విధంగా గాంధీలో దేనికీ లొంగని మొండిపట్టుదల, నాశనం చేయటానికి వీలులేని మనస్తత్వం మొట్టమొదటగా దక్షిణాఫ్రికాలోనే ఏర్పడ్డాయి. గాంధీని మహాత్ముని చేయటానికి కావలసిన ఆయన భావనలు, చర్యలలో చాలాభాగం ఏర్పడటానికి ఆదేశమే ముఖ్యకారణం అనటానికి ఎలాంటి సందేహం లేదు. దక్షిణాఫ్రికాలో జరిగింది అంతా గాంధీ జీవితాన్ని గొప్ప మలుపు తిప్పి,ఆయన మహాత్ముడుగా పరిణామం చెందటానికి కీలక పాత్ర పోషించింది.

## 3 గాంధేయ వాదం

### అస్పృశ్యత పై సమరం

భారత దేశం లో అస్పృశ్యత ఒక అంటూ వ్యాధి లాగా దేశాన్ని తార తరాలు గా పట్టి పీడిస్తోంది. వారికి సంఘం లో గౌరవం లేదు. పక్కన కూర్చొనే యోగ్యత నివ్వ లేదు. దేవాలయ ప్రవేశం లేదు. అందరు దీన్ని రూపు మాపాలని అనుకుంటున్నా ముందుకు వచ్చిన వారు బహు కొద్ది మంది మాత్రమే. గాంధిజీ ఏ దీన్ని గురించి ముందు ఆలోచించారు అని అంతా అనుకుంటారు.. కాదు అని తెలుస్తోంది ఆయన వల్ల ఆ ఉద్యమం ఊపు అందుకొంది, అంతకు ముందే కవులు సంస్కర్తలు గళం విప్పారు. కొంత కృషి చేశారు ఆ వివరాలు తెలియ జేస్తాను

1906 వ సంవత్సరం లోనే దేశోద్ధారక కాశీ నాధుని నాగేశ్వర రావు పంతులు గారు కృష్ణా జిల్లా లో వారి స్వగ్రామ మైన ఎలకుర్రు లో హరిజనులకు స్వంత డబ్బులు ఖర్చు పెట్టి హరిజనులకు ప్రత్యేక మైన కాలనీ నిర్మించారు. హరిజనులకు ప్రత్యేల మైన ప్రాధమికస్కూల్ నిర్మించారు.. ఇంతే కాదు ఆ వూరి వారి స్వంత శివాలయం లోకి హరిజనులకు ప్రవేశం కల్పించి దైవ దర్శనం చేయించి గాంధి గారి కంటే ఆదర్శం లో ముందున్నారు. అప్పటికి ఇంకా గాంధి భారత రాజ కీయాలలో పూర్తి గ ప్రవేశించ లేదు. ఈ విషయాలన్నీ ఈ నెల నాల్గవ తేది న మచిలీ పట్నం లో ఆంధ్ర సారస్వత సమితి అధ్యక్షులు, కవి కదా రచయిత నవలా కారుడు అయిన శ్రీ కొట్టి రామా రావు గారికి స్వర్గీయ కాశీ నాధుని నాగేశ్వర రావు గారి "విశ్వ దాత "పురస్కారాన్ని వారి మనుమడు శ్రీ కాశీ నాధుని నాగేశ్వర రావు గారు అందజేసిన సందర్భం గా, బందరు లో వివిధ సంస్థలు ఏర్పాటు చేసిన అభినందించినా సభ లో.. కృష్ణా జిల్లా రచయితల సంఘం ప్రధాన కార్య దర్శి, విశ్లేషకుడు డాక్టర్ జి. వి. పూర్ణ చంద్ తెలియ జేశారు. అంతే కాదు పంతులు గారు ఆంధ్ర దేశం లో జన్మించటం వల్ల ఆయనకు రావాల్సినంత కీర్తి రాలేదని అదే బెంగాల్ లో జన్మించి ఉన్నట్లయితే గాంధీ గారికి బదులు పంతులు గారికే "మహాత్మా "బిరుదు లభించేది అని అన్నారు. ఇది కాదన లేని సత్యమే నని పిస్తుంది

ఇంకో విషయం మీ దృష్టికి తెస్తాను. 1909 లో నే స్వర్గీయ మంగి పూడి వెంకటేశ్వర శర్మ గాంధిజీ కంటే ముందు గా అస్పృశ్యుల పై స్పందించి కవిత రాశారు. అప్పటికి ఇంకా హరిజనులు అన్న పేరు వారికి రాలేదు.

"అందారు పుట్టిరి హిందమ్మ తల్లికి --అందారు ఒక్కటై వుండాలి సక్కంగా --కష్టమ్ములోచ్చినా-, నిష్టూర మొచ్చినా --ఇష్టమ్ము గా నుండి కట్టుగా నుద్దాము అందారూ --తమ్ముాల మణి మీరు మామ్మూల జూడండి --అమ్మోరు దీవించి --ఐశ్వర్య మిచ్చేను "అని గొప్ప సామాజిక స్పృహతో సంస్కరణాభి లాష తో శర్మ గారు ముందే స్పందించారు.

శతావధాని వేలూరి శివ రామ శాస్త్రి గారు అస్పృష్యులకు ఆలయప్రవేశం లేనందుకు బాధ పడుతూ గొప్ప కవిత రాశారు

"కుక్కలు చూడ వచ్చునట -కోతులు చేతులు సాచి --భక్తి మై మ్రొక్కగా వచ్చు, --చీమలు ముంగిట సాగిల బార వచ్చు, --నల్పక్కల నీగలున్ ముసర వచ్చును గాని --మనుష్య కోటిలో నేనొక్కడ నయ్య నేనిచట నుండగ రాదు గదా శివా "అంటూ అస్పృష్యుని ఆవేదనను తన వేదన గా వెలి బుచ్చారు.

1943 లో చదల వాడ నరశింహం గారు "మూడు కోట్లామ్రులను తోడును గల్గి --దీనుడఅరుంధతి కుమారుండు --అస్పృశ్యతా దోష మంట గట్టి అది --పక్ష పాత సమేత భారత మాత "అని ఆ తప్పు అంతా తల్లి భారత మాత దే నని ఆమెకే దోషాన్ని అంట గట్టారు.

రాష్ట్ర కవి, ప్రబోధకులు రాయ ప్రోలు సుబ్బా రావు గారు "ప్రేమ వృత్తికి జగడాల భేద మేల ---బ్రాహ్మణాగ్ర హారము నందు పవలు రేయి --విసరు పవనుద్దు --కడ జాతి వీటి యందు --తాక లేక వీచునే -పక్ష తంత్ర జడిమ ?"అని ప్రశ్నించారు. వాయుదేవుడికి పక్ష పాతం లేదు అగ్రహారం లోను, అస్పృశులున్న చోట ఒకటిగానే వీస్తాడు మనుష్యులకే ఈ మాయ దారి భేద భావం అని దెప్పి పొడిచారు.

బసవ రాజు అప్పా రావు గారు "డబ్బు గలోడు దారికి రానీరు ---ఈ గోరా మేమి, ఈ నేర మేమి --మాల మాదిగలం --మనుషులం గామా ?"అని అస్పృశ్యుల తరఫున వకాల్తా పుచ్చుకొని వాదించారు..

దేశం లోని ప్రస్తుత పరిస్థితిని చూసి ఆచార్య కొలక లూరి ఇనాక్ గొప్ప కవితలోతనభావాన్ని ఆవిష్కరిస్తూ దేశానికి ఎలాటి వాడు ప్రధాని అయి ఎలా పాలించి ఎలా దిగి పోవాలి అనేది అద్భుతం గా వర్ణించారు

"పైసా లేని వాడు --పైగా హరిజనుడు --ప్రధాన మంత్రి కా గలిగి ---అయిదేళ్ళు వుండి -ఆపైన వదిలి --పైసా లేకుండా పాత మనిషి గా --బ్రతగ్గలిగిన నాడు -భారత దేశం బాగు పడ్డట్టు. "ఇది భారతీయులందరి ఆకాంక్ష. అది తీరు తుందని ఆశిద్దాం.

## 4 మానవ భద్రతపై మహాత్ముని దృక్కోణం

'నాగరకత కు అసలు అర్ధం గుణకారం కాదు. స్వచ్చందంగా ఐచ్చికంగా కోరికలు తగ్గించుకొని అసలైన సంతృప్తి, సంతోషం పొంది, సేవాభావంతో ధన్యత చెందటమే"

మానవ భద్రత నూతన మైన భావం అన్నది ఒక నిజం. అదివ్యక్తి అనుభవించే సంక్లిష్ట, ఒకదానితో ఒకటి సంబంధమున్న విషయాలను వివరించేది. దీన్ని ప్రతిపాదించేవారు సంప్రదాయ మామూలు భద్రత ను సవాలు చేస్తారు. వీరి దృష్టిలో భద్రత అంటే వ్యక్తిగతమైనదే కాని దేశానికి మాత్రమే చెందింది కాదు. దేశభద్రత లో మానవ భద్రత ఉన్నదని అనుకోరాదు. గత వందేళ్ళలో ఆయా ప్రభుత్వాలే తమ ప్రజలను విదేశీ పాలకులకంటే ఎక్కువగా చంపారు అన్నది పచ్చి నిజం.

1994 నాటి హ్యూమన్ డెవలప్ మెంట్ రిపోర్ట్ ప్రకారం కోరికలనుండి, భయాలనుండి రక్షణ కల్పించటమే విశ్వ వ్యాప్తంగా మానవాళికి భద్రత కలిగించటం. ఈ రిపోర్ట్. 1-ఆర్ధిక 2-ఆహార 3-ఆరోగ్య 4-పర్యావరణ 5- వ్యక్తిగత 6-సామాజిక 7-రాజకీయ అంశాలను చర్చించింది.. ప్రస్తుతం వ్యక్తి ఆర్ధిక భద్రతను గాంధీ ఆలోచనా దృక్పధం లో పరిశీలిద్దాం.

యునైటెడ్ నేషన్స్ అంచనా ప్రకారం 2009 నాటికి ప్రపంచం లో అత్యంత బీదరికం లో ఉన్నవారికి, ప్రపంచ మొత్తం జనాభాకు మధ్య ఉన్న నిష్పత్తి 21శాతం. బీదరికం యెంత ఉన్నదో, ఆకలీ అంతే ఉంది. అభివృద్ధి చెందుతున్న దేశాలలో 150 మిలియన్ల పిల్లలు పోషకాహార లోపం తో అలమటిస్తున్నారు. దీనికి పరిష్కారాన్ని మానవ భద్రతను ఆ పేపర్ గాంధీ ఆలోచనలు- ఆచరణలు దృష్టి కోణం లో సమాధానాలు చెప్పింది.

గాంధీ స్పష్టంగా "మనిషి ఆకలి కోరలలో నలిగి బాధ పడటానికి ఏదో గొంతెమ్మ కోరికలు కోరటం కాదు, కేవలం తన కడుపు నింపు కోవటానికే అంటే ఆత్మారాముడిని సంతృప్తి పరచటానికే "అని చెప్పాడు. మహాత్ముడు తన జీవితమంతా ఈ సమస్యా పరిష్కారానికే, దీనికి సరైన ఆర్ధిక సాధనం కోసమే కృషి చేశాడు. ఈవిధానం పేదవాడి కడుపు నింపటమే కాక, అనుసరణీయమైనదిగా, నమ్మకమైనదిగా, సాధ్యమైనదిగా ఉండాలని తపన చెందాడు.

మహాత్ముడు "మానవారాధనతో, బలహీనులను దోచి సంపాదించిన ఆర్ధిక సంపద పనికి రానిది శాస్త్రీయ ఆర్ధిక విధానానికి వ్యతి రేకమైనది. నిజమైన ఆర్ధికత సాంఘిక న్యాయాన్ని సమర్ధిస్తుంది. గాంధీ భావనలో ఆర్ధికతకు, నైతికతకు మధ్య పెద్దగా గణనీయమైన భేదం లేదు. ఆయన భావనలో "వ్యక్తి యొక్క నైతిక భావన, వ్యక్తి సంక్షేమం,దేశ సంక్షేమాలను బాధించే ఆర్ధికతలన్నీ అనైతికమైనవే ".ఈ భావన ఒకప్పుడు ఆడం స్మిత్ చెప్పిన "ఆర్ధిక విధానం విశ్వాసం, నమ్మకం, అవ్యక్త విలువల పై కూడా ఆధార పడిఉంటుంది "అన్న భావానికి అతి దగ్గరగా ఉందికదా.

బైబిల్ కూడా దాతృత్వం, అధిక సంపద ప్రశ్నలను ఎదుర్కొన్నది. ఇందులో మొదటి భాగమైన ఓల్డ్ టెస్టమెంట్ సంపద కూడబెట్టటాన్ని సమర్ధించింది. రెండవభాగమైన న్యు టెస్టమెంట్ దాతృత్వాన్ని బాగా సమర్ధించింది. తన "దీరీ ఆఫ్ మోరల్ సెంటి మెంట్స్" లో ఆడం స్మిత్ మానవుని నైతికత, భావోద్వేగాలపై గట్టిగానే చెప్పాడు. "వెల్త్ ఆఫ్ నేషన్స్ "లో స్వయంగా విధి పూర్వకంగా బలి చేయటం (సెల్ఫ్ఇంటర్ మెంట్ )సరైన, నిర్దుష్టమైన చర్యకు దారి చూపుతుంది" అని ఉద్ఘాటించాడు.

గాంధీ దాతృత్వాన్ని సమర్ధించాడు. సంపద ఎలా కూడా బెట్టారన్న విషయం జోలికి పోలేదు. ఆయన సంపన్నులను తమ సంపాదకు ట్రస్టీ లుగా ఉండమని, అందులో కొంతభాగం అవసరమైనవారికి దానం చేసి ఆదుకోమని చెప్పాడు.. "ట్రస్టీ షిప్ విషయం లో నా సిద్ధాంతం వెంటనే అద్భుతాలు జరుగుతాయని కాదు, అది మిగిలిన సిద్ధాంతాలకంటే శ్రేష్టమైనదని నేను నమ్ముతాను. ఏ సిద్ధాంతమైనా అహింసా సిద్ధాంతం తో కలిసి పని చేయాల్సిందే "అన్నాడు.

అధిక సంపద తో, అత్యున్నత అధికారాలలో ఉన్న వర్గాలవారు తమ దురాశ ను తగ్గించుకొని కిందికి దిగి, దిన కూలీ జీతం తో బతికే వారి సమ స్థానం లో ఉండాలి అని గాంధీ భావించాడు. ఆయన ఆలోచనకు ఆచరణకు మధ్య వ్యత్యాసం ఉండదు. అందుకే ఆయన "పూర్తి ట్రస్టీ షిప్ అంటే యూక్లిడ్ నిర్వచనం లాగా నైరూప్యం కాదు. దానికోసం మనం గట్టిగా ప్రయత్నిస్తే ఈ భూమిపై సమానత్వం సాధించటానికి ఇంతకంటే సరైన శ్రేష్టమైన మార్గం లేదని నా దృఢ విశ్వాసం "అన్నాడు.

సంపద, అధికార వర్గాల ప్రభావం తగ్గించటానికి ప్రభుత్వం అతి తక్కువ హింసను ప్రయోగించటాన్ని గాంధీ సమర్ధించాడు. ఆయన దృష్టిలో ప్రైవేట్ ఓనర్షిప్ అంటే స్వంత యాజమాన్యం చేసే హింసకంటే, వారిపట్ల ప్రభుత్వం చూపే హింస అత్యల్పమైనది.కనుకనే సమర్ధించాడు. మనుషులలో మంచితనం ఉండాలని, అది ప్రతిఫలించాలని కోరాడు. శ్రమకు, పెట్టు బడికి మధ్య అనాదిగా ఉన్న ఘర్షణ తగ్గి ఆర్ధిక సమానత్వం సాధించాలనే కృషి చేశాడు. మృత సమానత్వం వ్యక్తిని తన శక్తి సామర్ధ్యాలను సమర్ధంగా పరిపూర్ణంగా వినియోగించుకోలేక పోతే అలాంటి సమాజనం నాశనమౌతుంది. కనుక ధనవంతుడు న్యాయంగా, గౌరవంగా కోట్లు ఆర్జించి, వాటిని సర్వ జనుల సేవకు వినియోగించాలని గాంధీ కోరాడు."తేన త్యక్తేన భుంజీతా "అనే ఆర్యోక్తి " అనేది సరైన సూటి మార్గమని, దీనివలన నూతన జీవిత విదానమేర్పడుతుందని, అప్పుడు ప్రతి వ్యక్తీ తన కోసమేకాక, తన చుట్టూ ఉన్నవారికోసమూ కష్టపడతాడని విశ్వసించాడు. దీనినే ఆడమ్ స్మిత్ "వ్యక్తి ఎంతటి స్వార్ధ పరుడైనా, అతనిలో తప్పకుండా కొన్ని మంచి సూత్రాలు కూడా ఉంటాయని, అవి అతనికి స్ఫూర్తి నిస్తూ ఇతరుల సంతోషం తప్పనిసరిగా తన సంతోషమని భావిస్తాడు "అని గాంధీ సిద్ధాంతాన్నే మారు పల్కాడు.

గాంధీ ఆర్ధిక భావాలపై పరిశీలన చేసిన వి.పి. పాటిల్, ఐ. ఎ. లోక్ పూర్ కొన్ని ఆసక్తికర విషయాలను తెలియ జేశారు వీటిని తప్పక పరీక్షించాల్సిందే – "ప్రపంచం గాంధీ భావాలను అమలు చేయక పోవటానికి ఎకైక కారణం పారిశ్రామీకరణ అత్యున్నత స్థాయి లో ఉండటమే. కనుక గడియారాన్ని వెనక్కి తిప్పి, ఆదిమ సమాజ భావనలను ఆహ్వానించ గలమా ?"అలాగే జి. యెన్. ధవాన్ భావన "కమ్యూనిస్ట్ భావ జాలం లో గాంధీగారి ట్రస్టీ షిప్ భావన అమలు పరచలేము ".కాని గాంధీ భావనలు అమలు చేయటానికి ఆలస్యం అనే మాటకు తావే లేదు. పారిశ్రామీకరణ అయినా, ఇంకా ఏదో గొప్ప విధాన మైనా ప్రజలకోసం, సమాజం కోసమే కాని దీనికి భిన్నం కాదు. ఇప్పుడు గాంధీ విధానాలు యెంత అవసరమో తగినవో చూద్దాం. గాంధీ చూడగలిగింది ఇతరులు చూడ లేకపోయింది ఏమిటి

అంటే "ఉక్కు విద్యుత్తూ వలన జీవితమిచ్చి, అంతకు ముందు ప్రాధాన్యంగా ఉన్న రక్త మాంసాలను దూరం చేసింది. యంత్రం చకచక కదులుతూ, మనిషి జీవితం తో ఆడుకొంటూమనిషిని రోబోట్ -మరబొమ్మను చేసింది ".

అందరూ గొప్పగా పొగిడే ఉత్కృష్ట పారిశ్రామీకరణలేక "హై స్టేట్ "మానవత్వాన్ని మంటగలుపుతోంది. అందుకే దార్శనికుడు గాంధీ"యంత్రం మానవ ప్రకృతికి,సంస్కృతికి అనుసందాన మవ్వాలి కాని ఇప్పుడున్నట్లు మానవ ప్రకృతిని యంత్రం అవసరాలకు అనుసంధానించటం కాదు. "ఆధునికత తెచ్చిన అనర్థాన్ని విశ్లేషిస్తూ రాబర్ట్ నిస్బెట్ "వ్యక్తియొక్క సాంఘిక ఆర్ధిక రాజకీయ సంస్కృతిక జీవితాన్ని తారు మారు చేసి, స్థానం భ్రంశం కలిగిస్తోంది. అందుకే గాంధీ భావాలే నేడు ఆచరణీయాలు "అన్నాడు. హై స్టేట్ అంటే గ్లోబలైజేషన్ వలన వచ్చిన అభివృద్ధి. ఇది యంత్రానికే, భౌతికత కే అధిక ప్రాదాన్యమిస్తుంది కాని మనిషికి కాదు. దీనినే మాక్ ఫెర్సన్ "కన్స్యూమర్ ఆఫ్ యుటిలిటీస్ యొక్క సృజనాత్మక శక్తులను పూర్తిగా తగ్గించటమే "అన్నాడు. ఈ హైస్టేట్ "పద్ధతికి ప్రత్యామ్నాయాన్ని –"ఉత్పత్తి రంగం లో అత్యధిక ఉత్పత్తిని సామాన్య జనాలతో చేయించాలి " అని గాంధీ చెప్పాడు. ఉత్పత్తి విధానం, పంపిణీ పద్ధతులను వికేంద్రీకరణ చేయాలి. ఈ కొత్త వికేంద్రీకరణ ఆర్ధిక విధానం చిన్న , కుటీర పరిశ్రమల ఆధారంగా ఉండాలి "అన్నాడు.

ఇప్పుడు జి. యెన్. ధావన్ పరిశీలనలను గురించి తెలుసుకొందాం –"హెగెల్, మార్క్స్ ల లాగా గాంధీ, అభి వృద్ధిని మాండలికంగా డయలెక్టిక్స్ గా వర్ణించాడు. అయితే మార్క్సియా న్ డయలెక్టిక్స్ చారిత్రాత్మకంగా నిర్ణయింప బడితే, గాంధియన్ డయలెక్టిక్స్ చలన శీలంగా అంటే డైనమిక్ గా, చర్యా విధానంగా, సృజనాత్మకత, అంతర్గత నిర్మాణ సంఘర్షణ గా నమ్మాడు. మార్క్స్ భావనలో భౌతిక శక్తి మార్పుకు పురుడుపోసే నర్సు. గాంధీకి అహింస అంటే నైతిక శక్తి. మన జీవుల అంతర్గత వారసత్వ సిద్ధాంతం. హింస అనాగరక విధానం.

సాంఘిక ఆర్ధిక విధానం పై గాంధీ సిద్ధాంతం ధావన్ భావనకు పూర్తిగా విరుద్ధం. మార్క్స్ భౌతిక పరమైన విధానం పై ఆధారపడిన ధనస్వామిక కాపిటలిస్టిక్ ఉత్పత్తి పై దాడి చేశాడు.. కానీ గాంధీ సంపాదనే ముఖ్యమన్న భౌతిక నాగరకత పై ఎదురు తిరిగాడు. మార్క్స్ కొత్త రాజకీయ విధానం అంటే డిక్టేటర్ షిప్ ను కనిపెడితే, గాంధీ మాత్రం కొత్త సాంఘిక ఆర్ధిక విధాన సృజన జరగాలని భావించాడు. '

గాంధీ దృష్టిలో నిజమైన ప్రగతి అంటే భౌతిక అభి వృద్ధికి భిన్నమైన నైతికాభి వృద్ధి. రోమ్,ఈజిప్షియన్ నాగరకతలను, భారత్ లోని ద్వాపరయుగాన్ని ఉదాహరించాడు. ఇవి పతనం చెందటానికి భౌతిక సంపద పెరిగి, నైతిక విలువలు పూర్తిగా క్షీణించటమేఅని చెప్పాడు.ఈ సందర్భంగా ఇ.ఎఫ్. షుమేకర్ ను గురించి కొంత తెలుసుకోవాలి. ఈయన గాంధీ ప్రభావానికి లోనై"ఆధునిక సాంకేతికత, ఆర్ధికం అనే ఏక శిలా విధానం పూర్తిగా మార్చి పునర్నిర్మించాలి "అన్నాడు. ఆయన రచించిన గాంధీ ఫోటో కవర్ పేజీగా ఉన్న పుస్తకం "స్మాల్ ఈజ్ బ్యూటిఫుల్ "లో గాంధీ జీ ఆర్ధిక సిద్ధాంతాలను పాశ్చాత్య ఆర్ధిక వేత్తల ఆలోచనలను పరిచయం చేసి. గాంధియన్ విధానాలపై సీరియస్ గా అధ్యయనం జరగాల్సిన అవసరం ఉందని చెప్పాడు. "షుమేకర్ మాని ఫెస్టో "గా చెప్పబడుతున్న ఆయన విధానం " భూమి శక్తిని క్షీణింప జేస్తున్నవేగవంతమైన మానవ జీవిత విధానం, అనేక పరిష్కరింప రాని సమస్యల వలయమై పోతోంది. రాబోయే ప్రతి తరం, హింసాత్మకమై, నైతికత మృగ్యమైపోతుంది. అతి తక్కువైన, వాస్తవమైన మానవ అవసరాలు తీర్చకుండా, అడ్డూ ఆపూ లేని విస్తరణ విధానం అనర్ధదాయకం ".ఈయనే తర్వాత ఆర్దికత కు యుద్ధానికి మధ్య సంబంధాన్ని గాంధియన్ ఆలోచనలతో విశ్లేషించి చివరకు "అహింసా విధాన ఆర్ధికత అత్యంత అవసరం "అని తేల్చి చెప్పాడు.

యంత్రాలన్నీ నాశనం చేసి, ఆదిమ యంత్రాను ప్రవేశపెట్టమని గాంధీ ఏనాడూ చెప్పనే లేదు. కాని యాంత్రికం పై మోజు ను నియంత్రించ మన్నాడు. 1924 నవంబర్" యంగ్ ఇండియా" పత్రికలో "లేబర్ ఖర్చు తగ్గించే యాంత్రికత క్షంతవ్యం కాదు. లేబర్ ను పొదుపు చేస్తూ పోతే వేలాది స్త్రీ పురుష కూలీలు ఆహారం లేక ఆకలితో అలమటించి మరణిస్తారు.కొద్దిమందికోసం కాలం, లేబర్ పొదుపు చేయరాదు. జనులందరి కోసమే ఏ పనైనా చేయాలి. సంపద కొద్ది మంది చేతుల్లో మూలుగుతూ ఉండటం నేను ఒప్పుకోను. సంపద అందరి చేతులలో ఉండాలన్నది నా దృఢమైన ఆలోచన. సంపద కూడబెట్టి లేబర్ పొదుపు చేయటం అత్యాశ, దురాశ అవుతుందేకాని, దాతృత్వం మాత్రం కాదు "అని స్పష్టంగా చెప్పాడు.

గాంధీ విధానం కేపిటల్ సేవింగ్ కాదు. లేబర్ సేవింగ్ టెక్నిక్. ఇది అహింసకు దారి చూపుతుంది. కనుక ఆయన భావాలకు అనుగుణంగా సరైన టెక్నాలజీ లేక మధ్యేమార్గ సాంకేతికతను షుమేకర్ చెప్పినట్లు గా ప్రవేశపెట్టాలి. ఈ భావన బీద మానవ వనరుల వినియోగంతో అతి సామాన్య సాధారణ పని ముట్లతో తక్కువ ఖరీదులో పర్యావరణకు భంగం కలిగించని రీతిలో తయారు చేయించాలి. దీనివలన మానవ సృజన శక్తి సద్వినియోగపడి అందరికి మేలు కలుగుతుంది.

"సాంప్రదాయ ఎకనామిస్ట్ తక్కువ ఖర్చుతో ఎక్కువదూరం ఎక్కువ బరువు వెళ్ళటం గొప్పవరం గా ఇదే సరైన విధానంగా భావిస్తాడు. దీనివలన అధిక ఉత్పత్తి ని తక్కువ వనరులతో సాధించవచ్చు అని చెబుతాడు. కానీ గాంధీ "స్థానిక, తక్కువ దూర రవాణా ను పూర్తిగా అందరూ ప్రోత్సహించాలి. కాని ఎక్కువ సేపు ఆగటం ను నిరుత్సాహపరచాలి. దీనివలన మానవ ప్రావీణ్యత పెరిగి,, పట్టణీకరణ తగ్గి, మానవ సమగ్రత పెంపొందుతుంది. లేకపోతే మూలాలు లేని శ్రామిక వర్గం విపరీతం గా పెరిగి, వ్యవస్థ వినాశానికి దారి తీస్తుంది "అని వాదించాడు.

వారణాసి లో 1973 లో గాంధీ స్మారక ఉపన్యాసం చేస్తూ షు మేకర్ "కొందరి చేతుల్లో మూలుగుతున్న సంపద మొత్తం ప్రపంచాన్ని 1-వనరులు 2-జీవావరణం 3-పరాయీకరణ అనే మూడు ఒకదానితో ఒకటి సంబంధమున్న సంక్షోభాలకు గురి చేస్తోంది "అని హెచ్చరించాడు. ఇందులోని దార్శనికత ఏమిటో చూద్దాం. 2008లో వచ్చిన వనరుల సంక్షోభం వలన ఆర్ధిక మాంద్యం విపరీతంగా పెరిగింది. జీవావరణ సంక్షోభం మన ఆలోచన విధానం పై ప్రభావం చూపి రియో లో, కోపెన్ హాం లో అంతర్జాతీయ సదస్సులు నిర్వహించి పరిష్కారాలను వెదుక్కోవాల్సి వచ్చింది. పరాయీకరణ సంక్షోభం పై రెండిటి యొక్క ఫలితమే.

జీవితాంతం మహాత్మాగాంధీ వ్యక్తి వలన మంచి సమాజం నిర్మింపబడుతుంది అనే సిద్ధాంతాన్నే ప్రచారం చేశాడు. ఆయన ఆర్ధికత వ్యక్తి నిష్టమే కాని, ఉత్పత్తి నిష్టం కాదు. ఇదే మానవ భద్రతకు అత్యంత శ్రేయోదాయకమైన విధానం (సమ్మన్ బోనం ).గాంధీజీ స్వదేశీ, ఆహారంకోసం శ్రమ లలోని ప్రాముఖ్యత ను నొక్కి వాక్కా ణించేవాడు. చరఖా తో గ్రామీణ భారతాన్ని నిర్మించటం గాంధీ ఆలోచన. ఇది కాలం చెల్లిన భావన అని చాలామంది అనుకొంటారు, కాని ఇందులోని లాజిక్, శక్తి, సామర్ధ్యం ఆయన మరణం తర్వాతనే అందరికీ అర్ధమైంది., ఉదాహరణకు ఖాదీ పరిశ్రమ వికేంద్రీకరణ జరిగి ఉత్పత్తి ఎక్కడ జరుగుతుంటే దానికి దగ్గరలో చేరింది. అలాగే చేతి వృత్తి తో తయారయ్యే వస్తువుల విషయం లో కూడా అంతేజరిగింది. ఇదీ గాంధీజీ ఆర్ధికత. ధనికుల కబంధ హస్తాలనుండి పేదలకు విముక్తికలగాలని ఆయన చిరకాల వాంఛ. ఆర్ధిక చర్యకు నూలువడకటం ప్రత్యామ్నాయం కాదు అది ఒక అనుబంధ పోషక విధానం మాత్రమే అని మరువరాదు.

స్వదేశీ అనేది ఎక్కడో దూరంగా ఉన్నవారికి కంటే మన చుట్టూ ప్రక్కల వారికి సేవ చేయటమే. ఆయనే ఒకసారి "స్వదేశీ ఒక బాయ్ కాట్ అంటే బహిష్కరించాల్సిన ఉద్యమం కాదు. ఇది ప్రతీకారం కాదు. అందరూ పాటించాల్సిన, అదొక మతపరమైన నియమం. దీనికి చట్ట పరమైన జోక్యాన్ని నేను ఏవగిస్తాను. విదేశీ వస్తువులు రాకుండా గట్టి భద్రత కావాలని నేను వాదించను "అని స్పష్టంగా చెప్పాడు.

ఆహారానికి శ్రమ అన్న గాంధీ సిద్ధాంతం నిర్మాణాత్మక అభి వృద్ధికి రాచమార్గం. 1937 అక్టోబర్ "హరిజన " పత్రికలో "అందరూ ఆహారం కోసం శ్రమిస్తే, ఇక అందరికీ పుష్కలం గా ఆహారం, విశ్రాంతి లభిస్తాయి. బౌద్ధిక శ్రమ సాంఘిక సేవలో ఉత్కృష్ట మైన సేవ. "అని రాశాడు. అసలు తిండికోసం శ్రమ పడాల్సిన అవసరం, నూలు వడకాల్సిన అవసరం లేని తన గురించి చెబుతూ ఆయన "ఎందుకంటె నాకు చెందనిది నేను తింటున్నాను కనుక "అన్నాడు.

గాంధీజీ జీవించిన కాలం లోఆయనను వ్యతిరేకించిన వారూ, ఆయనకు దూరమైనవారు కూడా ఆయన భావాలకూ చేతలకూ కలవర పడ్డారు. వీళ్ళనే కాదు ఆయనను పూర్తిగా సంర్దించే అనుయాయులు కూడా అంతే కలవరపాటుకు గురయ్యారు. అందులో గురుదేవ్ రవీంద్రనాధ టాగూర్కూడా ఉన్నాడు. "స్వరాజ్ అంటే గందర గోళం. పక్షి ఉదయం నిద్రలేవగానే ఆహారం కోసం మాత్రమే ఆలోచించదు.దాని రెక్కలు ఆకాశం కేకకు స్పందిస్తాయి. "అని వ్యాఖ్యానించాడు. దీనికి సరైన సమాధానంగా గాంధీజీ "కవి రేపటి కోసం జీవిస్తాడు. వివేకంగా ప్రవర్తించ మంటాడు. కాని నేను పక్షులను బాధతో గమనిస్తాను. అవి బలం కోసం పొగడ్తలకోసం రెక్కలు అల్లల్లాడించవు.భారత ఆకాశం లోని మానవ విహంగం విశ్రాంతి నటించే ముందు బలహీనపడుతుంది. బాధ పడుతున్న రోగిని కబీర్ పాట తో ఉపశమింప జేయటం నాకు సాధ్యంకాని పని " అని దిమ్మ తిరిగే సమాధానమిచ్చాడు తాను గురుదేవుడుగా భావించే టాగూర్ కు శిష్యుడైన మహాత్మా గాంధీజీ.

హృదయ నేత్రం తో గమనించాల్సిన ఈ అంతర్ దృష్టి గాంధీజీ ని మిగిలినవారందరికంటే వేరు చేసి ప్రత్యేకంగా చూపిస్తుంది. ఈ రోజు గాంధీజీ జీవించి ఉన్నట్లయితే నిజమైన ఆర్ధిక అభి వృద్ధి, మానవ భద్రతా సూచకంగా థాయ్ లాండ్ దేశం జి.డి.పి.స్థానం లో ఎన్.హెచ్.పి.అంటే "నేషనల్ హాపినెస్ ప్రొడ్యూస్డ్" సూత్రాన్ని ప్రవేశ పెట్టటాన్ని బాధాకరంగా అంగీకరించి ఉండేవాడు.

ఆధారం –ఆశుతోష్ పాండే సంకలనం చేసిన "Relevence Of Gandhi in 21st.Century"పుస్తకం లో రజనీకాంత్ పాండే, చంద్రమోహన్ ఉపాధ్యాయ సంయుక్తంగా రాసిన "Gandhian Perspective On Human Security "వ్యాసం.

## 5 ఉగ్రవాదం పై గాంధీ ధోరణి

**ఆధారం –అశుతోష్ పాండే సంకలించిన " రెలెవెన్స్ ఆఫ్ గాంధి ఇన్ 21స్ట్ సెంచరి "పుస్తకం లో అనురాగ్ గార్గ్ వ్యాసం –"గాంధీ అండ్ టెర్రరిజం "**

మహాత్మాగాంధీ ఉగ్రవాదాన్ని ఈషణ్మాత్రం కూడా సహించలేదు. హింస పై ఏనాడూ రాజీ పడలేదు. ఉగ్రవాదులు గా చిత్రింపబడిన సర్దార్ భగత్ సింగ్ వంటి వారిని కాపాడటానికి విశ్వప్రయత్నమే చేశాడు. అలా ఎందుకు చేశాడు ?అనేది పెద్ద ప్రశ్న. తాను చెప్పేదానికీ, అనుసరించేదానికి తేడా ఉందా ?ఆయన వివాదాల, వైరుధ్యాల పుట్టా ?అసలు ఉగ్రవాదాన్ని ఊహించగలమా ?ఉగ్రవాదానికి ఒక సిద్ధాంతం ఉన్నదా ?

గాంధీజీ హింస, ఉగ్రవాదాల మధ్య ఇప్పుడు మనం జీవిస్తున్నట్లే జీవించాడు. ఆయన 1915 లో దక్షిణాఫ్రికా నుంచి ఇండియా వచ్చే నాటికే దేశం లో హింస ఉద్ధృతంగా ఉన్నది. ఇండియాకు రాకముందే అక్కడ దక్షిణాఫ్రికాలో హింస కు తీవ్రంగా బాధ పడ్డాడు. కాని హింసకు హింస ప్రతీకారం అని ఆయన భావించలేదు. హింసను అహింసా సిద్ధాంత ఆయుధం తోనే ఎదుర్కొని నిలిచి విజయం సాధించాడు. హింస పై ఆయన భావాలను పరిశీలిస్తే, హింస అరుదుగానే విజయం సాధించింది. జార్గంస్ మేయర్ రాసిన "గాంధీ వర్సెస్ టెర్రరిజం "లో ఉన్న కొన్ని విషయాలను పరిశీలిద్దాం. "1915 లో గాంధీ దక్షిణాఫ్రికా నుంచి ఇండియా వచ్చేసరికి దేశం బ్రిటిష్ వ్యతిరేకతతో, ఘర్షణలతో హింస అంచున ఉంది.భారత స్వాతంత్ర ఉద్యమం తెలిసి, అక్కడ ఆయన లాయర్ గా ఉంటూ అక్కడి వలస

భారతీయుల సాంఘిక సమానత కోసం చేస్తున్న పోరాటం ఆయన్ను ఇండియాకు రప్పించింది. అప్పుడు దక్షిణాఫ్రికాలో, ఇండియాలో బ్రిటిష్ వారి మిలిటరీ బలం అత్యధిక శక్తి వంతంగా ఉండి,దాన్నిపూర్తిగా ఉపయోగించటానికి ఏమాత్రం భయపడని స్థితి లో ఉన్నది. 1919 లో పంజాబ్ లోని అమృత సర్ లో ప్రశాంతంగా నిరసన తెలియ జేయటానికి జలియన్ వాలాబాగ్ కు చేరిన 400మంది భారతీయులను విచక్షణా రహితంగా, కోపోద్రిక్తుడైన నరరూప రాక్షస బ్రిటిష్ బ్రిగేడియర్ జనరల్ డయ్యర్ ఎటు వంటి ముందు హెచ్చరికలు లేకుండానే కాల్పులు జరిపి, ఊచకోత కోసి, నరమేధం సృష్టించాడు.

దీనికి ప్రతీకారంగా జాతీయవాదులుతమకు తామే ఎవరి ప్రేరేపణా లేకుండానే దేశం లో చాలా చోట్ల హింసతో బదులు చెప్పారు. బెంగాల్ లో సుభాష్ చంద్ర బోస్ "ఇండియన్ నేషనల్ ఆర్మీ "నిర్వహించాడు. పంజాబ్ లో ఘదర్ ఉద్యమకారులు అమెరికాలోని కాలిఫోర్నియాకు లో ఉన్న పంజాబీ వలస దారుల మద్దతు తో ఒక బోటు నిండా ఆయుధాలను అమెరికా నుండి దిగుమతి చేసుకొని హింసా విప్లవానికి పథకం రచించారు.. అరాచకవాదులు అని ముద్రపడిన ఈ భారతీయులు బ్రిటిష్ దౌష్ట్యాన్ని యెదిర్చి, వారి అధికారాన్ని అంతమొందించి భారత దేశం స్వాతంత్ర్యం పొందటానికి హింస ఒక్కటే పరిష్కార మార్గం అని గాఢంగా నమ్మారు. ఒక బ్రిటిష్ అధికారిపై భారతీయ కార్యకర్తలు చేసిన హింసాత్మక దాడి వలన, గాంధీజీ హింస పై తనకున్న అభిప్రాయాలకు పదును పెట్టాడు. ఈ సంఘటన దక్షిణాఫ్రికా భారతీయుల తరఫున బ్రిటిష్ ప్రభుత్వం తో లాబీయింగ్ చేయటానికి- అంటే మధ్యవర్తిత్వం వహించటానికి 1909 లో గాంధీ లండన్ లో కాలుపెట్ట టానికి కొన్ని రోజులు ముందు జరిగింది. లండన్ లోని ఒక భారతీయుడు మదన్ లాల్ ధింగ్రే,బ్రిటిష్ ఇండియన్ ఆఫీస్ లో బ్రిటిష్ అధికారి సర్ విలియం హెచ్ కర్జన్ వైలీ పై, ఇండియాపై కాలనీ ప్రభుత్వ పాలనకు, నియంత్రణ కు తీవ్ర నిరసన గా దాడి చేశాడు. సాధారణ వేడుకలో ధింగ్రే అకస్మాత్తుగా గన్ తీసి, అతి దగ్గరగా అధికారి ముఖం పై అయిదు పొట్లు కాల్చేశాడు. అతడు అక్కడికక్కడే కిక్కురుమనకుండా చచ్చాడు. అప్రమత్తమైన పోలీసులు వెంటనే ధింగ్రే ను నిర్బంధం లోకి తీసుకొనగా బయట ప్రజలు "హంతకుడు హంతకుడు "అని అరుస్తుంటే అతడుమాత్రం "నేను భారత స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్నాను "అన్నాడు గంభీరంగా.

గాంధీ లండన్ చేరుకొన్న కొన్ని వారాల తర్వాత లండన్ లోని బహిష్కృత ఇండియన్ జాతీయ వాదులు ఆయనను, పై సంఘటనపై చర్చ జరగాలని కోరారు. అప్పుడు ఆయనకు ముఖ్య ప్రత్యర్ధి వినాయక్ సావర్కార్. సావర్కార్ పై, బ్రిటిష్ అధికారి హత్యకు ఆయుధాలు, ఆయుధ సామగ్రి అందజేశాడని బలంగా అభియోగం మోపారు. విచారణలో ధింగ్రే ధైర్యంగా "నేను చావటానికైనా సిద్ధం. నా బలిదానంతో అమరత్వం పొందుతాను "అన్నాడు.

చర్చకు ముందు గాంధీజీ లండన్ లోని తన స్నేహితుని ఉత్తరం రాస్తూ "ఇండియాకు స్వాతంత్ర్యం అహింస తో నే వస్తుంది అని నమ్మే ఒక్క భారతీయుడూ నాకు ఇక్కడ కనిపించలేదు "అని బాధ పడ్డాడు. "తీవ్రవాదుల పరి స్థితి సాధారణ విప్లవానికి ముందు ఉగ్రవాదం లాగా ఉంటుందని గాంధీ వర్ణించాడు. తీవ్రవాదులు ముందుగా కొందరు బ్రిటిష్ వారిని చంపి, ఉగ్రవాదానికి పాల్పడతారు. తర్వాత ఒక గ్రూపుగా ఏర్పడి ఆయుధాలు పట్టుకొని బహిరంగం గానే పోరాటం చేస్తారు. చివరికి కష్ట నష్టాలు తప్ప తాము సాధించేది ఏమీ లేదని, దాదాపు పావుమిలియన్ మంది ని పోగొట్టుకొంటామని గ్రహిస్తారు "అన్నాడు మహాత్ముడు. కానీ దేశీయ జాతీయవాదులు మాత్రం "గెరిల్లా యుద్ధం బ్రిటిష్ వారిని ఓడించి, దేశానికి స్వాతంత్ర్యం తెస్తుంది "అని నమ్మారు.

జరిగిన చర్చలో గాంధీ సాయుధ పోరాటాన్ని రాజకీయ వాస్తవికత ఆధారంగా ఆలోచించమని కోరాడు. అడపా దడపా చేసే ఉగ్రవాద, గెరిల్లా దాడుల తో అత్యంత సైనిక సామర్ధ్యమున్న బ్రిటిష్ రాజ్యాన్ని ఓడిస్తామనుకోవటం అవివేకం. ఈ రకమైన హింసాత్మకత భారత జాతీయ ఉద్యమానికి భంగం కలిగిస్తుంది. అలాగే బ్రిటిష్ వారితో సాయుధ పోరాటం చేస్తే, అదే భారతీయ జాతీయ స్వభావం అని భావించే ప్రమాదం ఉందని గాంధీ గట్టిగా హెచ్చరించాడు.

హింద్ స్వరాజ్

కొన్ని వారాల తర్వాత గాంధీ, మళ్ళీ దక్షిణాఫ్రికా వెళ్ళటానికి స్టీం షిప్ ఎక్కినప్పుడు మరలా ఈ విషయాలపై ఆలోచనలో పడ్డాడు. వాటిని రాసి బుక్ లెట్ గా లండన్ లోని జాతీయ వాదులకు పంపాడు. ప్రాధమికంగా ఈ వ్యాసాన్ని గాంధీ మొదటి సారిగా ఒకే చేతితో రాయటం మొదలుపెట్టి చేయి బాధ పెడితే రెండవ చేతితో వడివడిగా కంగారుగా రాసి, తన సంఘర్షణ నిర్ణయానికి చేరిక మార్గం గా, అ తర్వాత తాను జీవితాంతం అనుసరించి, సాగించే విధానంగా రాశాడు. ఈ చిన్న పుస్తకమే "హింద్ స్వరాజ్ "లేక ఇండియన్ హోమ్ రూల్. " ఇందులో రూపు దిద్దుకో బోతున్న భారత స్వాతంత్ర్య ఉద్యమం, దానికి తీసుకోవాల్సిన సరైన విధానాల లక్ష్యాలు వివరించాడు. లండన్ లోని భారతీయ తీవ్రవాదులు బ్రిటిష్ వారు భారత దేశ ఆర్ధికాన్ని దోచేస్తున్నారు అని చెబుతున్న లండన్ లోని భారతీయ తీవ్రవాదులు" బ్రిటిష్ వారికి ఇండియాలో స్థానం లేదు "అన్న అభిప్రాయాన్ని సమర్ధించాడు. అదే కాక ఇండియా భౌతిక భావనలతో పాశ్చాత్య నాగరికతను అనుకరించటం సమర్ధనీయం కాదని అది ఒక వ్యాధి అని చెప్పాడు.

ఈ పుస్తకం టెర్రరిజం పై అధికమైన వ్యతిరేక ఒత్తిడిని పెంచింది. గాంధీ తన అహింసా సిద్ధాంత మార్గానికి సంఘర్షణ స్వభావానికి పరీక్ష గా ఒక స్కెచ్ తయారు చేశాడు. ఎంచుకొన్నస్వాతంత్ర్యం అనే ఉత్తమ లక్ష్యం ముందు వ్యక్తిగత ఘర్షణలను దాటి ఆలోచించాలని కోరాడు. "ప్రతి ఘర్షణ రెండు స్థాయిలలో ఉంటుంది. అవి వ్యక్తులమధ్యా,, సిద్ధాం తాల మధ్యా ఉంటుంది. పోరాటం చేసే ప్రతి వాడికి అదొక సమస్య అవుతుంది. అలాగే అనేక భావాలమధ్య ఘర్షణ కూడా అంతే"అన్నాడు గాంధీ. పోరాటం చేసి అలసిపోయాక పరిష్కారానికి దారి వెతుకు తారు. కనుక గాంధీ విధానాలు శత్రువును ఎదుర్కోవటానికి మించిన భావన ఉంటుంది. ఘర్షణ నే ఎదుర్కొనే, తుదముట్టించే మార్గాలు సూచించాడు. దీనికి తాను ఎంచుకొన్న మార్గానికి "పాసివ్ రెసిస్టన్స్"అంటే "నిష్క్రియాత్మక నిరోధకత "అనే ముద్ర వేసినందుకు బాధపడ్డాడు. దీనినే ఆయన దక్షిణాఫ్రికాలో అమలు చేసి విజయం పొందాడు. ఇందులో నిష్క్రియత అనేది లేనే లేదు. నిజానికి ఆయన తుఫాను వంటి ఘర్షణ లను ప్రభుత్వ అధికారులతో ఎదుర్కొన్నాడు. అవి ప్రతిఘటన, నిరోధాలకు మించి ఉండేవి. అది సత్యమార్గమేది ?,దానికోసం నిలబడటం ఎలా?, అధికారం కోసం సత్య మార్గమేది? అని తెలియ జేసే నిరంతర శోధన అన్నాడు మహాత్ముడు.

ఘర్షణ లో నిమగ్నమై పని చేయటానికి 1906 లోనే గాంధీ ఒక కొత్త పేరు ఆలోచించాడు. తన "ఇండియన్ ఒపినియన్ "పేపర్ లో సరైన పదాన్ని సూచించమని పాఠకు లకు పరీక్ష పెట్టాడు. సరైన పదాన్ని సూచించి గెలుపొందినవారికి పుస్తకం బహుమానంగా ఇస్తానని ప్రకటించాడు. ఐతే ఆయన కజిన్ మదన్ లాల్ సూచించిన పదానికి గాంధీ నగిషీ చెక్కి "సత్యాగ్రహం "అని పేరు పెట్టాడు. ఇందులో రెండు సంస్కృత పదాలు సత్య, ఆగ్రహం ఉన్నాయి. సత్యం అంటే నిజం. ఆగ్రహం అంటే కోపం కాదు "గట్టిగా పట్టుకోవటం "ఈ రెండుకలిపితే సత్యాన్ని గట్టిగా పట్టుకోవటం అంటే ఆచరించటం. దీన్ని గాంధీ "సత్య శక్తి "అని సిమ్లి పై

చేశాడు. ఈ శోధనలో ఆయన దృష్టి అంతా సత్యం పైనే నిలిచింది. దీనిపై ఎవరికీ సరైన అభి ప్రాయం ఉండక పోవచ్చు అన్నాడు. ప్రతి సంఘర్షణ అస్తిత్వం లోతైన తేడాను ఏది సరైనది అన్నదానిపై రెండు భిన్న అభిప్రాయాలు చెబుతుంది. మొదటగా సంఘర్షణ చేసే పని చెప్పి, తర్వాత దాన్ని ఆసమస్యకు రెండు వైపులనుంచి చూడటం చెబుతుంది. ఇందులో ప్రత్యర్ధి మాటను, అభిప్రాయాన్ని కూడా తన అభిప్రాయం తోపాటు అర్ధం చేసుకోమని చెబుతుంది.దీనినే అమెరికా మాజీ రక్షణ సెక్రెటరి రాబర్ట్ మాక్ నమారా "ది ఫాగ్ ఆఫ్ వార్ "డాక్యుమెంటరి సినిమాలో సలహా ఇస్తూ "Emphathize with the enemy " ( అవతలి వాడి ని అర్ధం చేసుకొని, అతని మనోభావాలు పంచుకోవటం )అని నొక్కి వక్కాణించాడు.

### ఘర్షణ పై గాంధీ అభిప్రాయం

ఘర్షణపై గాంధీ జీ అభిప్రాయం"Emphathy "దృష్టి గా ఉంటుంది. ఇరుపక్షాలవారు కనీసం కొంతైనా ఒప్పుకోవాలి అప్పుడే పరిష్కారం సాధ్యం. ఎదిరిపక్షం దాన్ని" కేరే రూట్" కింద భావిస్తుందని ఆయన గుర్తించాడు. క్విట్ ఇండియా ఉద్యమం లో "బ్రిటిషర్ లకు నిజంగా ఉండాల్సిన స్థానం బ్రిటన్ మాత్రమె" అని స్పష్టం చేశాడు. అదే సమయం లో భారత ఉపఖండానికి బ్రిటిష్ సర్కార్ రోడ్ల నిర్మాణం దగ్గర్నుంచి, ఆఫీస్ పరిపాలన దాకా చేసిన మంచిపనులను మెచ్చాడు.

పరిష్కారం ఊహించాక, రెండవ దశ పోరాటం దాన్ని సాధించటం గురించి. అంటే పోరాటమే. ఐతే అది స్థిర పరిష్కారం కోసమే అవ్వాలి. "లక్ష్యం సాధన ను సమర్ధిస్తుంది "అనేదాన్ని ఆయన నిర్ద్వందంగా తిరస్కరించాడు. సాదనా, లక్ష్యమూ చివరికి ఒకటిగా నే ఉంటాయి అని వాదించాడు. హింసతో పోరాటం చేస్తే, ఉత్తమ లక్ష్య సాధనకూ హింసా విధానమే శరణ్యం అనే తప్పుడు భావన కలుగుతుంది. "టెర్రరిస్ట్ లు బ్రిటిష్ వారిని తరిమేసి విజయం సాధిస్తే వారి బదులు దేశాన్ని ఎవరు పాలిస్తారు ?""అని ప్రశ్నించాడు. ఆయనే సమాధానం చెప్పాడు "బహుశా ఇండియా విముక్తికి హంతకు లైనవారు పాలిస్తారేమో ?,అలా అయితే హంతకుల వలన ఇండియాకు ఏమీ లాభం ఉండదు 'అని ఖచ్చితంగా చెప్పాడు.

పోరాటం శక్తి మంతంగా తరచుగా ప్రదర్శనలతో మొదలవ్వాలి. అవమాన పరచే వాటికి నిరభ్యంతరంగా సహకరణకు తిరస్కరించాలి. అయినా హింసాత్మకంగా ఉండకూడదు. ఈ నాశనకర విధానాలు ఘర్షణ పరిష్కార విజయానికి ధనాత్మక ఫలితాలు ఇవ్వక పోవచ్చు.పోరాటం సత్యమార్గం లో మొదలైతే, అది క్రమంగా అది వ్యక్తీ శీలాన్ని, విధానాన్ని క్రమంగా పెంచుతుంది ఆలోచనాపరిది విస్తృతమౌతుంది. ఉదాత్త లక్ష్యసాధనకోసం మనిషి వ్యక్తిత్వాన్ని కోల్పోయి దిగజారి ప్రవర్తించకూడదు అని అభిప్రాయ పడ్డాడు. ఇదే ఉగ్రవాదానికి ఆయన సమాధానం. మొదలు పెట్టటానికి ఏదో రకమైన ప్రతిస్పందన రావాలని గట్టిగా కోరాడు. ఏమీ చేయకుం డాచేతులు కట్టుకొని కూర్చోమని ఏనాడూ ఆయన చెప్పలేదు " అగ్ని ప్రమాదం లో క్రియా శూన్యత క్షమించరానిది "అన్నాడు.

### దిక్కారం అడుగున

"ధిక్కారం అడుగున పిరికి తనం ఉంటుంది. హింసలేని పోరాటం అనైతికం ఎన్నడూ కాదు. కాని పిరికితనం అనైతికమే "అన్నాడు గాంధీ. " పిరికితనానికి హింసకు మధ్య దేన్ని ఎంచుకోవాలి అని నన్ను అడిగితె నేను హింసనే ఎంచు కోవాలి గట్టిగా చెబుతాను అన్నాడు ఒక్కోసారి హింస మాత్రమే పరిష్కారం అనిపిస్తుంది. పిచ్చి కుక్క వల్ల సమాజానికి ప్రమాదం దాన్ని అదుపులోనైనా పెట్టాలి లేదా చంపనైనా చంపాలి. వేరే దారి లేదు. దారుణ మానభంగాలు చేసిన "మృగాడు. " స్పాట్ లో దొరికితే, నిర్దాక్షిణ్యంగా వాడిని హతం చేయాలి. వీరోచిత హింస, పిరికివాడి అహింస కన్నా తక్కువే అన్నాడు మహాత్ముడు.

### గాంధి వ్యూహం

ఉగ్రవాదాన్ని ఎదుర్కోవటానికి గాంధీజీ వ్యూహం లో ఉన్న అంశాలు. ముందుగా హింసా కార్యాన్ని ఆదిలోనే తుంచేయాలి. దీనికి చేసే ప్రయత్నం శక్తివంతంగా పూర్తిగా అహింసా పద్ధతిలోనే ఉండాలి. హింసను ఆపటానికి భౌతిక నియంత్రణ బలమైన శక్తి తో చేయాలి. రెండవది భయ పెట్టటం, వినాశనం ఐతే ఇవి గాంధీ పోరాట సిద్ధాంతానికి విఘాతం కలిగించేవి, సమస్యా పరిష్కారానికి అవరోధం కలిగించేవి. టెర్రరిజం వెనుక ఉన్న సమస్యలకు ఆయన మార్గాలు కొన్ని ఉన్నాయి, ఉగ్రవాద కార్యాలపై ఊర్తిగా దృష్టి కేంద్రీకరించాలి. జాతి ద్వేషం నిలువరించటానికికి పూనుకోవాలి. ఉగ్రవాదానికి పూను కొనే వారు అలా ప్రవర్తించటానికి వెనుక ఉన్న కారణాలు అన్వేషించాలి.

ఉన్నతమైన నీతి తో ప్రవర్తించాలి. వారి విశుద్ధ ప్రవర్తన అపమార్గ గాములకు కను విప్పు కలిగిస్తుంది. అధికారులు హింసా విధానం తో ప్రవర్తిస్తే బలప్రయోగానికి దారి తీస్తుంది. అందుకే గాంధీ నెత్తీ నోరూ కొట్టుకొని నైతిక లక్ష్యం మాత్రమె సమస్యకు మార్గ దర్శనం చేస్తుంది అన్నాడు. వినటానికి ఈ నీతి సూత్రాలు బానే ఉంటాయి. అవి పని చేసి, ప్రభావం చూపుతాయా అనేది మిలియన్ డాలర్ల ప్రశ్న. బలమైన హింసాత్మకత ముందు అహింసా విధానాలు చెవిటి వాడి ముందు శంఖం ఊది నట్లుగా నిష్ఫలమౌతాయని చాలామంది అనేక సందర్భాలలో ఆయన్ను ప్రశ్నించారు. ఇజ్రాయిల్ లో పాలస్తీనా హింసకు కఠిన ప్రతిస్పందన హమాస్ కు ఉప్పెనలాగా ఉపయోగపడి, టెర్రరిస్ట్ కార్యాలను పెంచాయి. అమెరికాలో సెప్టెంబర్ 11 దాడి తర్వాత, జిహాదీ ఉద్యమంపై ప్రతీకార చర్య, ఉగ్ర దాడులు ప్రపంచ వ్యాప్తంగా తగ్గ క పోవటం మనకు అనుభవమే. టెర్రరిజం పై అమిత బలప్రయోగం మంచి ఫలితాల నిచ్చిన దాఖలాలు పెద్దగాలేవు.

హింస హింసనే సృష్టిస్తుంది. పూర్తి హింస పూర్తి వినాశనమే కలిగిస్తుంది. కానీ అహింస హింస మూలాలనే ఛేదిస్తుంది. అహింస శాంతి కి మార్గమై అంతిమ విజయం చేకూరుస్తుంది. ఇందులో కోల్పోయిన వారు గాయపడరు. బ్రిటిష్ ప్రభుత్వ టెర్రరిజం పై గాంధీ అహింసా పద్ధతులతోనే అనేకసమస్యలపై పోరాటాలు చేసి, ఘన విజయాలు మనకు సాధించి పెట్టాడు. ఒక్కోసారి గత్యంతరం లేని పరిస్థితులలో హింసను ప్రయోగించటం. తప్పదని ఆయన చెప్పిన విషయం ఇదివరకే తెలుసుకొన్నాం. ఏది ఏమైనా హింస స్వయం వినాశకం. అహింస చిరంజీవి. హింస మనుష్యులను చంపితే, అహింస మనుష్యులను చంపనే చంపదు.అందుకనే ఐక్యరాజ్య సంస్థ మొదలైనవి అహింసా విధాన పరిష్కారాలకోసం ప్రపంచ వ్యాప్తంగా కోట్లాది రూపాయలు ఖర్చు చేస్తోంది.దీనికి సహన శీలత తో కూడిన రాజకీయ విజ్ఞత, పూనిక, నిశ్చయ బుద్ధి, ఓపిక, పట్టుదల, తోపాటు అహింసపై పూర్తి విశ్వాసం కావాలి. హింస ఎప్పుడూ విజయం సాధించదు.

ఆధునిక ఉగ్రవాదం ఎవరో ఒక వ్యక్తీ లేక అలాంటి వ్యక్తుల సమూహం అడపాదడపా చేసే హింసా కృత్యాలు కాదు. అది జాతీయ సీమలను దాటి ఉన్న సుశిక్షితులైన అత్యాధునిక ఆయుధ సైనిక పటాలం.వాళ్ళ సిద్ధాంతాలు వారివి. వారి నైతికత,వారిది. వారి నెట్ వర్క్, ఆయుధ సామగ్రి నుంచే వాళ్ళ అసలైన బలం వస్తుంది. దానినే నమ్మి మిగిలినవారిని ఆకర్షించి శిక్షణ నిచ్చి ఉగ్రవాదం పెంచుతున్నారు. అదే మంచి అని నమ్ముతున్నారు. వాళ్ళ ఈగోలను తృప్తి

పరచుకొంటున్నారు. పిచ్చి వాళ్ళ స్వర్గం అనే ఊహా స్వర్గం లో విహరిస్తూంటారు.వీరిని కూడా అహింసా విధానం లోనే ఎదుర్కోవాలి. బలమైన యదార్ధ నైతికత వారి మనసులను మారుస్తుంది అప్పుడే జనజీవన స్రవంతిలో కలిసిపోతారు. లేకపోతె టెర్రరిజం ఇంకా పెరుగుతుందే తప్ప తగ్గదు.తాము నమ్మిన కుహనా సిద్ధాంతాన్నే నమ్ముకొంటూ టెర్రరిస్ట్ లు మరింత పేట్రేగి క్రూర హింసకు పాల్పడుతారు అంటాడు ఆవేదనతో అహింసామూర్తి మహాత్మా గాంధీజీ.

### ఉగ్రవాదం భయోత్పాతం

"టెర్రరిజం టెర్రరైజ్ "చేస్తుంది. అంటే భయోత్పాతాన్ని కలిగిస్తుంది. ధనిక, పేద దేశాలలో కూడా అది ఒక వృత్తిగా మారింది. నిరుద్యోగులకు, అసంతృప్త ధనిక, బీద వ్యక్తులకు, గుంపులకు, దేశాలకు కూడా అకస్మాత్తుగా అధికారం పొందాలనే ఆరాటమే దీనికి ముఖ్య కారణం. అది తక్షణమే ద్రవ ధనాన్ని, మందుగుండు సామగ్రిని, చంపటానికి లైసెన్స్ లతోపాటు ప్రపంచమంతా దమ్మిడీ ఖర్చులేకుండా పర్య టించటానికి పాస్ పోర్ట్ లు, వీసాలు అవకాశాలు పుష్కలంగా సమకూరుస్తుంది.

### ముఖ్యమైన వాటి నిర్వచనాలు

ముఖ్యంగా మూడు రకాల ఉగ్రవాదాలున్నాయి. అవి 1-తిరుగుబాటు(ఇన్సర్జెంసి ) 2-తీవ్రవాదం(మిలిటెన్సి ) 3-ఉగ్రవాదం (టెర్రరిజం). ఇందులో తిరుగుబాటు లో విప్లవం, గెరిల్లా కార్యక్రమాలు దేశ మిలిటరీ శక్తిపై జరపటం ఉంటాయి. మిలిటెన్సి అనే తీవ్రవాదం, పైదానికన్నా చాలా శక్తి వంతమైన ఒక పార్టీ విభాగం. దీని లక్ష్యం దేశ మిలిటరీ, పారామిలిటరీ, యంత్ర సామగ్రి, సాయుధ సైనికులు, పోలీస్ సిబ్బంది పై దాడులు. తమ లక్ష్య సాధనకు యెంత కైనా తెగించే తీవ్ర లక్షణం. టెర్రరిజం అనే ఉగ్రవాదం అమాయక ప్రజా సమూహాలను నిర్దాక్షిణ్యంగా నిర్హేతుకంగా సంహరించి అంతటా భయోత్పాతం కలిగించి పాలకుల దృష్టిని ఆకర్షించి, తాము అనుకొన్న కొన్నిటిని సాధించటం. ఈ మూడు విధానాలు వినాశ కారణాలైన హింసాత్మక చర్యలే. సందేహం లేదు ఈ నిర్వచనాలను ఇండియాలోని సీనియర్ ఎయిర్ ఫోర్స్, సైనిక పోలీస్ ఆఫీసర్ల తోనూ, దేశ విదేశాలలోని అనేక అకాడమీ, యూని వర్సిటీ లతో ఎన్నో ఏళ్ళు జరిపిన ఇంటర్వ్యూల ఫలితం గా ఇవ్వబడినవే.

### కార్య కలాపాలు

ఈ రోజుల్లో టెర్రరిస్ట్ లు ఫైవ్ స్టార్ హోటళ్ళలో దర్జాగా అన్నీ సుఖాలు అనుభవిస్తూ, టెర్రరిస్ట్ కార్య కలాపాలు జరుపుతున్నారు తప్ప భయంకర అడవులలోనో, లోయలలోనో ఉండి కాదు అని గ్రహించాలి. పోలీస్, సైన్యం, ఎయిర్ ఫోర్స్, ఇంటలిజెన్స్ సర్వీసులు (నిఘా విభాగాలు )రోజు రోజుకూ తీవ్రమౌతున్న తీవ్ర వాదాన్ని అదుపు చేయ లేక పోతున్నాయి అన్నది పూర్తి యదార్ధం.

### సంఘటిత వ్యూహం (ఫెడరేటేడ్ నెట్ వర్క్ )

టెర్రరిస్ట్ ల నెట్ వర్క్ ప్రపంచ వ్యాప్తంగా, సమర్ధ వంతమైన శాఖలతో, కేంద్రాలతో ప్రతి దేశం నుంచి పకడ్బందీ వ్యూహం తో జరుగు తోంది. టెర్రరిస్ట్ లు లెక్కలేనంత నకిలీ కరెన్సీ కలిగి మాంచి ఆర్ధిక పరి పుష్టితో బాగా బలిసి ఉన్నారు. అమెరికా డాలర్లు ఇండియా,రూపాయలు బ్రిటిష్ పౌండ్లు, ఒక టేమిటి అన్ని దేశాల కరెన్సీని కొన్ని వంచక(రోగ్) దేశాల సాయంతో క్షణాలమీద అచ్చుగుద్దేసి వినియోగం లోకి తెస్తున్నారు. ఇంతేకాదు మాదక ద్రవ్యాల సరఫరా అండర్ వరల్డ్ యాక్టివిటీస్, స్మగ్లింగ్, అనైతిక ఆయుధ వ్యాపారం, కిడ్నాపింగ్, దోపిడీ, డాన్ గిరీ మొదలైనవాటితో ఇబ్బడి ముబ్బడిగా డబ్బు సమకూర్చుకొంటున్నారు. వీటిని అదుపు చేసే నాధుడే లేడు.

### ఉగ్రవాద దీవులు

ఇప్పుడు టెర్రరిస్ట్ లు జాతీయ, అంతర్జాతీయ బాంక్ సేవలను ఆపేస్తున్నారు. సామూహిక హనన ఆయుధాలు (వెపన్స్ ఆఫ్ మాస్ డిస్ట్రక్షన్-W.M.Ds)కూడా సమకూర్చుకొని దేశాలను భయపెడుతూ, ఎదుర్కోవటం ఒక సమస్యగా మార్చి,. ప్రపంచమంతా ఉగ్రవాద దీవులుగా మార్చేశారు.

### సామూహిక వినాశనం

ఈరోజుల్లో టెర్రరిజం ఒక ఫాషన్, ఒక వృత్తి, ఒక సంస్థ అయింది. జోసెఫ్ కానార్డ్ దీనిపై తీవ్రంగా స్పందించి "బాంబు దౌర్జన్యం ప్రజాభిప్రాయం పై ఎలాంటి ప్రభావం కలిగించదు.దీని పరిధిని దాటి ప్రతీకారం, ఉగ్రవాదాల ఉద్దేశ్యం వైపు తిరిగి ఆలోచించాలి. ప్రభుత్వాలు కొత్త ఆయుధాలు సమకూర్చుకొంటే ఉగ్రవాదులుకూడా అదే వేగంతో వాటిని తమ స్వంతం చేసుకొంటున్నారు. ఇప్పుడు టెర్రరిస్ట్ లు బాధ్యతారాహిత్యంగా అణ్వాయుధాలను సమకూర్చుకొంటే ప్రభుత్వాల పరిస్థితి ఏమిటి ?ఇది చాలా కల్లోలం రేపే సమస్య అయిందిప్పుడు.వాస్తవం ఏమిటంటే చాలా టెర్రరిస్ట్ గ్రూపులు కెమికల్ న్యూక్లియర్ వెపన్స్ వాడాయి. 1995 జపాన్ లోని టోక్యో సబ్ వె సిస్టం లో "సినిక్లియోస్ "ను వాడారు. "క్వాడే నెట్ వర్క్ "క్వేడా ఇన్ స్పైరేడ్ గ్రూప్ "లు కొత్త తరహా యుద్ధానికి సన్నద్ధం అవుతున్న ఆనవాళ్ళు కనిపిస్తున్నాయి.

టెర్రరిస్ట్ లు ప్రపంచ వ్యాప్త నెట్ వర్క్ సమాచారాన్ని కలిగి ఉన్నారు. దేశం యెంత భద్రంగా ఉంటుందో వాళ్ళు కూడా అంతర్జాతీయంగా ఎవరికీ కనిపించకుండా తమ తీవ్రవాద చర్యలు చేస్తూ భద్రంగా ఉన్నారు. దేశం, అది స్పాన్సర్ చేసే టెర్రరిజం గ్రూపులు,, కౌంటర్ టెర్రరిజం సూటిగా, రహస్యంగా ఒక దాని ఆధారంగా ఒకటి నడుస్తున్నాయి, బతుకు తున్నాయి. ఇదొక పెద్ద విషవలయమైపోయింది. దీని నియంత్రణ ఎలా అన్నది అనూహ్యం గా మారింది. వీటన్నిటినీ క్షుణ్ణంగా పరిశీలిస్తే టెర్రరిజ అంతమొందాలి అంటే అహింసా శక్తిపై తిరుగు లేని విశ్వాసం పెరగాలి. ఈ విశ్వాసం ప్రతి వ్యక్తిలో,సమాజం లో, ప్రతి సంస్థలోనూ ఏర్పడాలి.

### అసలు ప్రమాదం

21 వ శతాబ్దం ప్రపంచీకరణ ఫ్లడ్ గేట్ లను టెర్రరిజాన్ని తెరచుకొని దూకి వచ్చింది. అమెరికాలో సెప్టెంబర్ 11 విషాదం సామూహిక హింస, సామూహిక హనన ఆయుధ ఫలితమే. ఇది ఒక దృష్టాంతమై, చర్యలకు దారి తీసింది. ఐతే ట్రెండ్ సెట్టర్ లు ఇందులోని యదార్ధం గమనించలేదు. ఈ రకమైన హింస ఒక

అంటువ్యాధి గామారి, క్రమంగా చాలావరకు ప్రొఫెషనల్ అయి పోయింది. మహాత్ముడు చెప్పినట్లు ఉగ్రవాదాన్ని, దానిపై అత్యంత సహనం తోనే ఎదుర్కోవాలే తప్ప వేరే గత్యంతరం లేనే లేదు.

## 6 గాంధీజీ ని స్మరించాల్సిన ఔచిత్యం ఉన్నదా? 21 వ శతాబ్ది లో ?

'అవును ఖచ్చితంగా ఉంది "అంటున్నారు విశ్లేషకులు వివేక శీలురు. గాంధీ బహుపార్శ్వా లున్న వ్యక్తి, మనీషి. అంతటి మహోన్నతుని ఇప్పుడే కాదు ఎప్పటికీ విస్మరించలేము. తనజీవితం లో 40 ఏళ్ళు అహింసా సిద్ధాంతానికి అంకిత మైనవాడు. మత, రాజకీయ, సాంఘిక, నైతిక ఆర్ధిక క్షేత్రాలపై తనదైన శాశ్వత ముద్ర వేసినవాడు. దేశ, కాలాతీత సమస్యలకు పరిష్కారాలు కనుగొన్నవాడు. సత్యం, అహింస, నైతికతలను తనపై ప్రయోగించుకొని నిగ్గు తేల్చిన అంతర్ దృష్టి ఉన్న మహాత్ముడు. అప్పటి ఆయన పరిష్కారాలు ఇప్పటికీ ఆచరణీయాలే. 1915 లో గాంధీ దక్షిణాఫ్రికానుంచి తిరిగి భారత్ చేరగానే ఆయన రాజకీయ గురువు గోపాలకృష్ణ గోఖలే దేశమంతా తిరిగి వాస్తవ పరిస్థితులు గమనించి ప్రజలనాడి తెలుసుకోమని ఆదేశించాడు. అలాగే చేస్తూ,దేశం లో పల్లెలలో ఉన్న దుర్భర దారిద్ర్యం, రోగాలు, అనారోగ్యం, కులవ్యవస్థతతో కునారిల్లిన, అణచి వేతకు లోనైన, స్వేచ్చ అనుభవించని ప్రజలను గమనించాడు. చివరికి దేశం లో గ్రామాలు, దారిద్ర్యంపర్యాయపదాలు అని గ్రహించాడు. ఇలాంటి కోట్లాది ప్రజలకు విముక్తికలిగితేనే అభి వృద్ధి సాధ్యం అనుకొన్నాడు. కనుక దీనికి తగిన ఉపాయం సంప్రదాయబద్ధంగా, ఆధునికతతో రాకీయ నైతిక, మతసంస్కరణలు తేవాలి అని నిశ్చయించుకున్నాడు. పాశ్చాత్య నాగరకత లో పెరిగినా, ఆయనలో తరతరాల భారతీయ సంస్కృతీ సంప్రదాయాలు, సిద్ధాంతాలు స్థిరంగా వేళ్ళూ నికొనే ఉన్నాయి. ఆనాటి పరిస్థితులు నేడూ మనముందున్నాయి. కనుక గాంధీ కి ప్రపంచీకరణతో ఉన్న సంబంధం ఇంకాబాగా ప్రాముఖ్యతవహిస్తోందని, ఆయన భావాలు నేటికీ చెల్లుబాటు అవుతాయని మనకు అర్ధమౌతోంది.

ఆయన చెప్పిన హింద్ స్వరాజ్ భారత దేశానికి అత్యంత అవసరమైన మార్గ్నకార్టా. అందులో సంశ్లేషణ, సంయోగాలున్నాయి. వీటికి అంతస్సూత్రంగా సామరస్యం ఉండటం విశేషం. మానవులు సహజ సిద్ధమైన మానవ విలువలైన సహనం, వివేకం, సానుభూతి లను విస్మరించి మేధకే ప్రాధాన్యమిస్తున్నారు. ఇవి ఉంటే శారీరక మాసిక, ఆధ్యాతిక శక్తి సంపన్నులౌతారు. ఆయన ప్రవచించిన హింద్ స్వరాజ్యం ఈ భావనల ఆధారంగా జాతి పెరిగితే కట్టుబాట్లతో ఉన్న స్వర్గం లో నివసించే వీలు కలిగి ప్రపంచ దృష్టి మనపై పడుతుందని చెప్పాడు. కనుక మనకు తప్పని సరిగా కావాల్సింది పసిపిల్లవాడి మనస్తత్వం. దీనిపై గాంధీ "నేను చేసింది అంతా ఇప్పుడు ఒక పిల్లవాడు కూడా అనువైన మనస్తత్వం తో సాధించగలడు. జ్ఞానం అన్ని వైపులనుండి ప్రవహిస్తుంది. కనుక శిష్యులమైన మనకు ప్రతిదీ గురువై బోధ చేస్తుంది "అన్నాడు. ఇది సార్వకాలీన, సార్వ దేశీయమైన సత్యం కాదా ?

గాంధీ ఆచరించి బోధించిన సత్యం, అహింస,ప్రేమ లకు కాలదోషం లేదు. శాంతి సుహృద్భావాలతోనే ఘర్షణలు వైరుధ్యాలు తొలగిపోతాయి. కత్తికంటే ప్రేమ, శాంతి సాధించిన విజయాలు చరిత్రలో కోకొల్లలు. వైరుధ్యాలను చూసి నిరుత్సాహపడరాదు. వాటిని అధిగమించే ఆత్మ స్థైర్యం సాధించాలి. కనుక ప్రజాస్వామ్యాన్ని ఆధ్యాత్మిక స్థితికి ఎదగనీయాలి. రాజకీయ కార్యకలాపాలు దైవ విధిగా భావించాలి. రాజకీయ నాయకులు ప్రజా సేవకులుగా ఉండాలేకాని వారిని పీడించే దోపిడీ దారులుగా ఉండరాదు. ఉన్నత ప్రమాణాలున్న సమాజ నిర్మాణం అందరి బాధ్యత.ఆధునిక విజ్ఞానం సాంకేతికతలలోని బలాలను, బలహీనతలను గ్రహించాలి. అవి పర్యావరణానికి చేసే హాని గుర్తించి జాగ్రత్త పడాలి. బాపు చెప్పిన సత్యం, అహింస, ప్రేమ అనే" త్రిక సిద్ధాంతమే" భూమిపై శాంతికి దోహద పడుతుంది. దీన్ని మనం సాధించాలి అంటే మన మనోభావాలలో సంపూర్ణ విప్లవం రావాలి.

తన జీవితం లో ప్రతిదశలోను సమగ్రమైన విలువలను పాటిం చి మహాత్ముడు ఆదర్శమూర్తి అయ్యాడు. విలువలు మూల చింతనకు ఆధారాలు. ప్రవర్తన తీరును మలచుకొనే ముఖ్యాంశాలు. భిన్న భావాలను, సమస్యలను అడ్డంకుల్ని అధిగమించటానికి సహకరించే సహజ సాధనాలు. విలువల వ్యవస్థ వ్యక్తి తీరుకు గీటు రాయి. సమాజం లో అతని ఉన్నతిని నిర్ణ యించేది కూడా. జీవిత లక్ష్యాలకు అవి నిర్దేశకాలు. వీటినే గుణాలు అంటాం. గుణాలు భావనలకు, భావోద్వేగాలకు స్థితులు. నిర్ణయాత్మకత లకు స్థితులు. వీటిని మనిషి తన వివేకం ద్వారా సద్వినియోగం చేసుకొని తన హేతువు, ఎంచుకున్న ప్రక్రియ లకు న్యాయం చేస్తాడు. గుణాలన్నిటికీ శీలమే ఆధారం. శీలం లేని గుణాలు శోభిల్లవు. ఇవీ సార్వకాలిక సత్యాలే కదా.కనుక గాంధీ ని విస్మరించ లేము కదా.

నేడు ప్రపంచమంతా ఉగ్రవాద భయోత్పాతాలో భీతిల్లు తోంది. ప్రతి వాడికీ హింస ఆయుధమై పోయింది. హింస ఆత్మవినాశన హేతువు అన్నాడు బాపు. అహింస సర్వ కాల క్రియా విధానం దానికి తుది లేదు. కాలాతీతమైంది కూడా. హింస చంపుతుంది. అహింస ఎప్పుడూ చంపనే చంపదు.అందుకే అంతర్జాతీయ వనరులు విశ్వ వ్యాప్తంగా అందరికి అందుబాటులో ఉంటున్నాయి.శాంతి, సౌమనస్యం, సుహృద్భావాలతో, దౌత్యనీతి తో పరస్పర చర్చలతో సమస్యలు, విభేదాలు టెన్షన్ లు పరిష్కరింప బడుతున్నాయి. ఐక్యరాజ్య సమితి ప్రపంచ దేశాలమధ్య శాంతియుత వాతావరణ కల్పనకు ఇతోధికంగా కృషి చేసి విజయం సాధిస్తోంది. వీటన్నిటికి కావలసింది సహనశీలత, ఔదార్యం ఉన్న రాజకీయ దృక్పధం, నిర్ణయం, సహనం, పట్టుదల లతో కూడిన అహింసా సిద్ధాంతంపై గట్టి నమ్మకం,విశ్వాసం. హింస, దౌర్జన్యాలు ఏనాడు అంతిమ విజయం సాధించలేదన్నది చారిత్రిక సత్యం. మరి గాంధీజీ భావాలు బూజు పట్టినవా ?కానే కాదు. నిత్య నూతనమైనవి. స్పూర్తి దాయకమైనవి..

గ్రామీణాభి వృద్ధి గాంధీజీ ముఖ్య సిద్ధాంతాలలో మరొకటి. వస్తు అమ్మక లాభాలు అన్నీ బడా పారిశ్రామికవేత్తల జేబుల్లోకి అప్పనంగా ప్రవహించకుండా వృత్తి పనివారలకు చేరేట్లు మహాత్ముడు ఆదర్శ వంతమైన ఆర్ధిక సూత్రం చెప్పి అమలు చేయించాడు. అదొక మోడల్ గా ప్రసిద్ధి చెందింది. వినియోగదారుల అవసరాలు తీర్చటమే కాక అత్యున్నత నాణ్యతతో తక్కువ ధరలకే అందేట్లు వస్తూత్పత్తి జరగాలని అభిలషించాడు. తమ పెట్టు బడులు సమాజం లో ఏ వర్గాలవారు వలన లాభ పడుతున్నారో గ్రహించాలి. నేతపని వారు తయారు చేసే స్థానిక ఖాదీ వస్త్రాలకన్నా, బ్రిటన్ నుంచి దిగుమతి అయిన మిల్లు వస్త్రాలు

చాలా చౌక అయినా, వాటిని వాడితే దేశీయ పరిశ్రమలు దెబ్బతిని వృత్తి పని వారల జీవితం దుర్భరమౌతుంది.నిరుద్యోగం పెరిగి పోతుంది. అదే విధంగా వ్యవసాయాధార ఉత్పత్తులకూ అదే గతి పడుతుంది. గాంధీజీ అలాంటి విదేశీ వస్తువులవలన భారత దేశానికి వెన్నెముకగా ఇప్పటి వరకు నిలచిన గ్రామీణ ఆర్ధిక స్థితి మొత్తం దిగజారి పోతుంది అని విశ్వసించాడు.. ఇంతటి దూర దృష్టి ఉన్న మహాత్ముని ఆర్ధిక విధానం ఎన్నటికీ శిరోధార్యం కాదా ?

అంతమాత్రాన దూసుకు వస్తున్న పెట్టు బడి దారీ విధానం లోని చిక్కులు గాంధీకి తెలియనివి కావు. మానవత్వం తో కూడిన ఆయన ఆర్ధిక విధానాలు యాంత్రిక పెట్టుబడి దారుల పురోగతిని నిలువరించటానికి సమర్ధమైనవి కావు. కనుక అందరికి పనికి వచ్చే తగిన ఒక ప్రణాళిక సూచించాడు. మానవ శక్తి తక్కువగా ఉన్న దేశం యంత్ర పరిశ్రమతో వ్యవసాయ ఉత్పత్తులను పెంచుకో వచ్చు. కాని ఇండియావంటి అధిక జనాభా ఉన్న దేశానికి యంత్ర పరిశ్రమ అనర్ధ దాయకం. దేశం తన అవసరాలకు చాలినంత మాత్రమే ఉత్పత్తి చేయాలి. అధికోత్పత్తి వలన అంతర్జాతీయ ఆర్ధిక పరుగు ప్రారంభమై చివరికి దోపిడీకి దారి తీస్తుంది గాంధీ ఆలోచన ప్రకారం ప్రస్తుత ఇండియా పరిస్థితికి అంతా, బ్రిటిష్ కాలనీ వాళ్ల దూకుడు యాంత్రీకరణమే కారణం. అని పూర్తిగా విశ్వసించాడు.

ఆర్ధిక విషయాలపై బాపు అభిప్రాయాలు అతి సాధారణంగా సూటిగా ఉండేవి. అయినా వాటిని అన్ని స్థాయిలలో అందరూ విమర్శించారు. పైగా అభి వృద్ధి నిరోధకమైన తిరోగమన పద్ధతులు అన్నారు. కాని ఆయనకు లోతైన రాజకీయ గర్భితార్ధం బాగా తెలుసు. ఆర్ధిక ఉద్దేశ్యాలు, ఇంపీరియలిజం, కాలనిజం లకు మూల సూత్రాలని ఆయనకు పూర్తిగా అవగతమైన విషయమే. కనుక కాలనీ వాసుల ఆర్ధిక లాభాలపై బతుకుతున్న బ్రిటిష్ ప్రభుత్వం పై విరుచుకుపడి వాటిని బలహీన పరచాలని నిశ్చయించాడు. దీన్ని ఆధారంగా భారతీయ ఆర్ధిక విధానం బలపడాలని అనుకున్నాడు. తన జీవితమంతా దీనిపైనే దృష్టి పెట్టాడు. ఆయనది ఆధ్యాత్మిక అలంకారం తో,ముసుగుతో ఉన్నరాజకీయ సాధనం అనుకోవటం పొరబాటు. ఆయనకు నిజంగా కోట్లాది పేద ప్రజల అభి వృద్ధి మాత్రమే ముఖ్యం. హృదయం లేని యాంత్రికత తో వృద్ధి చెందే ప్రపంచ ఆర్ధికం, అన్నిటిలోని నైతికత ను అడ్డ గిస్తుంది అని మహాత్ముని భావన. ఆయన కాలం లో గాంధీగారి ఆర్ధిక నమూనా ప్రభావం చాలా ఉధృతంగా ఉండేది. దాన్ని భారత దేశంమాత్రమేకాక, ప్రపంచం లో చాలా దేశాలు అమలు చేసి అభివృద్ధి సాధించి విజయాలు అనేక రీతులలో, స్థాయిలలో సాధించాయి. అదొక ఆదర్శ ఆర్ధిక విధానం అని పేరు పొందింది. కనుక బాపు భావనలు దేశాతీతమని పించాయన్నమాట అక్షర సత్యమే కదా

మహాత్ముని ఆధ్వర్యం లో జరిగిన స్వాతంత్ర్య పోరాట ఫలితంగా మనకు బ్రిటిష్ దాస్యం నుండి విముక్తికలిగి 1947 ఆగస్ట్ 15 స్వాతంత్ర్యం లభించింది. దీనితో భారతదేశం లోని మధ్యతరగతి వారికి పాలనా భాగ్యం కలిగింది. స్వాతంత్ర్య ఉద్యమాన్ని నడిపిన కాంగ్రెస్ కేంద్రం లో అధికార పగ్గాలు చేబట్టింది. పరిపాలనలో వచ్చిన మార్పు పై అంతస్తులోనే జరిగింది తప్ప,, క్రింది తరగతి ప్రజల ఆర్ధిక సాంఘికవ్యవస్థలో గణనీయ మైన మార్పు రాలేదు. చేతిలో ఖడ్గం పట్టిన వారు మారారు కాని, దిగువ వర్గాల సామాన్యప్రజల జీవన పరిస్థితులలో మార్పు మాత్రం, రాలేదు. కాని వారి అదృష్టాన్ని మార్చే అవకాశమున్న జాతీయ ప్రభుత్వం ఏర్పడింది ఇదొక్కటే ఊరట. సామాన్య ప్రజలు కొత్త జాతీయ నాయకత్వాన్ని గట్టిగా నమ్మారు. తమ, దేశ స్వాతంత్ర్యం కోసం శ్రమించి, సిద్ధింపజేసిన ఈ నాయకులు, ఇప్పుడు తమ ఆర్ధిక సామాజికాభివృద్ధికోసం అహరహం కృషి చేస్తారని విశ్వసించారు. దేశ విభజన తర్వాత జరిగిన హింస తప్ప, భారత దేశం స్వాతంత్ర్యాన్ని బ్రిటిష్ పాలకులనుండి చాలా ప్రశాంతంగా,సులంభంగా సరళంగా నే పొంది విదేశీ పాలన నుండి స్వదేశీ పాలన సాధించిందని ఖచ్చితంగా చెప్పవచ్చు. దురదృష్ట వశాత్తు పాలనా పరమైన ఈ మార్పు సాంఘిక విప్లవానికి ఉత్ప్రేరణ కాలేక పోయింది. కాలనీ వాసుల కబంధ హస్తాలనుండి విడివడిన స్వతంత్ర భారత దేశం, సర్వ శక్తి యుక్తులు ధారపోసి ఎంతో శ్రమిస్తేనే సంపూర్ణ సామాజిక ఆర్ధిక మార్పులు సాధించటానికి అర్ధ శతాబ్ది కి పైగా సుదీర్ఘ కాలం పట్టింది. ఇప్పుడిప్పుడే అట్టడుగున కొద్దిగా మార్పులు చిగురులు వేస్తూ కనిపిస్తున్నాయి.

ఇవాళ్టి ప్రపంచం లో పర్యావరణ పరిరక్షణ పెద్ద సవాలుగా నిలిచింది. అభి వృద్ధి చెందినా, చెందుతున్న దేశాలన్నీ ఈసమస్య పైనే దృష్టి పెట్టాయి. ఇప్పుడే కళ్ళు తెరిచిన వారందరికీ, ఒక విషయం తెలియదు. దాదాపు వందేళ్ళ క్రితమే గాంధీజీ దీనిపై ఎన్నో వ్యాసాలు రాశాడు. అయినా ఇప్పటికీ అకాడెమిక్ క్షేత్రం లో "గాంధీ ఇంకా అవసరమా, ఆయన స్మరణ ఔచిత్యమా ?" అనే ప్రశ్న వినిపిస్తోంది.మహాత్ముడు రాసిన వ్యాసాలు, ఉత్తరాలు, చేసిన ప్రసంగాలు పరిశీలిస్తే బాపు కు ఎంతటి దూర దృష్టి ఉందో అర్ధమై, ఆశ్చర్యపోతాం. అనేక సందర్భాలలో గాంధీజీ జల, వాయు కాలుష్యాలు, రోగాలు, ఆరోగ్యం, వృక్ష రక్షణ, చెత్త రీ సైక్లింగ్ విషయయాలు ప్రస్తావించాడు. నదులలోకి వ్యర్ధపదార్ధాలను విడుదల చేయటం పై ఆందోళన చెంది, వాటివలన స్వచ్ఛమైన నదీ జలం కల్మషమై, అంటు వ్యాధులు ప్రబలి ప్రజారోగ్యం దెబ్బ తింటుందని పదేపదే చెప్పాడు. ఈ "వ్యర్ధాలు అనర్ధాలకు నిధి" అని బాధపడ్డాడు. వీటినన్నిటినీ అధిగమిస్తూ జాతీయ ఆదాయం పెంచుకొంటూ, ఆర్ధిక సంక్షేమం కోసం రెండు దశాబ్దాల క్రిందటమాత్రమే ముందడుగులు పడ్డాయి, సాధించాల్సింది చాలాఉంది. కనుక గాంధీ గొప్ప 'విజనరీ' అని అర్ధమౌతోంది.

ఎన్నో శతాబ్దాల నుండి భారత దేశం ప్రపంచం లో ముఖ్య ఆకర్షణ కేంద్రంగా ఉన్నది. భారతీయ విజ్ఞానం, ఆధ్యాత్మికత, సంస్కృతి, నైతిక విలువలు, సౌభాగ్యం, ప్రజాజీవన విధానమైన నాగరకత ప్రపంచ దేశాలపై గొప్ప ప్రభావం కలిగించి చెరగని ముద్ర వేశాయి..మహాత్ముడు అహింసకు కొత్త అర్ధాన్నీ, పరమార్ధాన్నీ చెప్పాడు. అత్యున్నతమైన సాధారణ, శాశ్వత విలువలను ఆచరించి మార్గ దర్శనం చేశాడు. ఆయన జీవితకాలం లో మహాత్ముడు భారతీయ సంస్కృతికి, ఆత్మకు అసలైన ప్రతీకగా, కేంద్రంగా నిలిచాడు. పరస్పర సహకారం, అభివృద్ధి లో అందరిసహకారం, అందరి ఐక్యత, అవతలివారి విశ్వాసాలపట్ల గౌరవం అన్నీ కలిస్తే గాంధీ ఫిలాసఫీ. ఆధునిక కార్పోరేట్ వ్యవస్థ లో ఒంటరి తనానికి చోటు లేదు. సమష్టి విధానమే శ్రేష్టం. ఎవరు ఉత్పత్తి చేసే వస్తువులు వారికే కాదు, ఉత్పత్తిలో భాగస్వామ్యం లేకపోయినా ప్రపంచ ప్రజలందరివి. ఒక వ్యవస్థ, సంస్థ విజయం సమాజం ఆమోదం, అనుమతి పైనే ఆధారపడి ఉంటుంది. సమాజం

ఆమోదించని ఏ వ్యాపారమూ మనుగడ సాగించలేదు. వ్యాపారానికి, సమాజానికి ఆరోగ్య పూర్వక అనుబంధం ఉండాలి. సమాజానికి నష్టం కలిగించే, వారి మనోబావాలను దెబ్బతీసే వ్యాపారం ఏదీ నిలబడదు నిలబడ నివ్వ రాదుకూడా. విలువలు కూడా వ్యాపార, వాణిజ్యాలలో ముఖ్య పాత్ర వహిస్తాయి. బాపు ప్రవచించింది గుణాలైన ఈ విలువలనే. కనుక వీటికి కాల దోషం పట్టదుకదా.

ఎకనామిక్స్ లో నోబెల్ పురస్కార గ్రహీత, మిల్టన్ ఫ్రీడ్మన్"వ్యాపారం ముఖ్య ఉద్దేశ్యం షేర్ హోల్డర్ విలువ అత్యధికం గా పెంచటమే సాంఘిక సంస్థల, ప్రభుత్వాల ప్రధాన కార్యక్రమం సమాజం లోని వ్యక్తుల పూర్తి బాధ్యత తీసుకోవటం "అన్నాడు. ఆ రోజులు గతించాయి. ఫ్రీడ్మన్ వి గతకాలపు భావాలై పోయాయి., ఈ రోజుల్లో వ్యాపార వాణిజ్యాలు లాభాలు సాధించే సంస్థలే అయ్యాయి. ప్రజల జీవిత విధానాలు, వారి ఎదుగుదల వాళ్లకు పట్టని విషయాలయ్యాయి. ముందుగానే చెప్పినట్లు సంస్థ విజయం సమాజం అనుమతి పైనే ఉంటుంది. సంస్థ తాను చేసే కార్యక్రమాలలో ప్రజలకు సంబంధించినవి గా ఉంటె, వారి విశ్వాసం అనుమతి లభించి వ్యాపారం పుంజుకుంటుంది. వ్యాపారం అది ఉన్న సమాజ వాతావరణం పై ఆధారపడి ఉంటుంది., సమాజానికి చేరువకాని ఏ వ్యాపారసంస్థ బతికి బట్టకట్టలేదు. " మేనేజిమెంట్ గురు" అనిపించుకొన్నపీటర్ ఎఫ్ డక్కర్ 1963 లో తన పుస్తకం "ది ప్రాక్టీసెస్ ఆఫ్ మేనేజిమెంట్ "లో "బిజినెస్ కు సొసైటీ కి మధ్య సంబంధం సముద్రానికి ఓడకు ఉన్న సంబంధం లాంటిది. నౌకను సురక్షితం గా మోసుకుపోయే మంచి వాతావరణం కల్పించేదిసముద్రం.,, తుఫాన్లతో, నౌకాభంగాలతో భయపెట్టేదీ, చివరికి తీరానికి చేర్చి తనకేమీ పట్టనట్లు నిశ్చింతగా ఉండేదీ ఓడకు నివాసంగా కాక ప్రయాణానికి సానుకూల వాతావరణం మాత్రమే కలిగించేది సముద్రమే. సమాజం కూడా వ్యాపార సంస్థకు స్నేహపూరిత, సానుకూల వాతావరణం కలిపిస్తుంది. ఏ ప్రైవేట్ సంస్థ అయినా సమాజం లో ఒక అంగమే. అది సామాజిక సేవ చేయాల్సిందే. వ్యాపార సంస్థలు ఇష్టా రాజ్యంగా ప్రజల మనోభావాలకు, అవసరాలకు విరుద్ధంగా ప్రవర్తించ రాదు. ఆ సంస్థలు పారదర్శకం గా పని చేసి సమాజం మెప్పు పొందాలి.అవసరాలు తీర్చాలి. దీన్ని అన్ని కార్పోరేట్ సంస్థలు విధిగా పాటించాల్సిందే. ఈ విషయం పై గాంధి గారు రాసిన "గాంధియన్ డాక్ట్రిన్,ఆఫ్ ట్రస్టీ షిప్ "అందరికి ఆదర్శ ప్రాయం. తాతా, బిర్లాలవంటి బడా పారిశ్రామిక వేత్తలను "ప్రజలకు ట్రస్టీలు 'గా ఉండమని ఆదేశించాడు. ఈ నాడు కార్పోరేట్ బిజినెస్ వారికి అదొక గొప్ప నీతి సూక్తి ముక్తావళి (ఎథిక్స్ ).ఇదే వారి బిజినెస్ ను సక్రమ మార్గం లో మలచే ఉత్తమ సాధనమయింది. ఇప్పుడు చాలా మంది పారిశ్రామికవేత్తలు సమాజాభి వృద్ధిపనులలో భాగస్వాములై ప్రజా విశ్వాసాన్ని చూరగొంటున్నారు అన్నసంగతి మనం కళ్ళారా చూస్తున్నాం. దీన్నిబట్టి వ్యాపారం లోనూ నీతిని పాటించి, సంపన్నులు సామాన్యులకు విశ్వసనీయమైన, నమ్మకమైన సంరక్షకులుగా (ట్రస్టీ )ఉండాలన్న గాంధీ సిద్ధాంతం కాలాతీతమమైనదే అని తెలుస్తోంది. ప్రపంచీకరణం కార్పోరేట్ ఆధిపత్యం తర్వాత కూడా గాంధీ సిద్ధాంతాలకు ఔచిత్యం ఉందని నిర్ధారణ జరిగింది.

మహాత్ముని భవిషత్ సమాజ దర్శనం ఎలాంటిదో తెలుసుకొందాం. భవిష్యత్ తరాలపై ఆయనకు గొప్ప భరోసా ఉంది. వారి శక్తి సామర్ధ్యాలపై అపార నమ్మకం ఉంది. ఆయనది "ఆదర్శ సమాజం 'అనే దృష్టి (విజన్ )ఈసమాజం లో మానవులందరూ భేదభావాలు లేకుండా, సమైక్యతా సామరస్యం తో జీవిస్తారు. వెన్నెముక జీవులన్నిటిలో హింస, అహింస సహజ లక్షణం. ఈ ద్వంద్వాలు ప్రకృతినుంచి సంక్రమించిన లక్షణాలు. మానవులకన్నా మృగాలలో హింసా ప్రవృత్తి తీవ్రంగా, పరి వ్యాప్తంగా ఉంటుంది. కనుక మానవుడికి సహజంగా కొంత జంతు లక్షణం ఉంటుంది. కాని జంతువులకు లేని వివేకం, ఆలోచనా శక్తి, తీర్పు ఉండటం విశేషం. ఈ గుణాలేవీ యేజంతువులోనూ కనిపించవు. అదే ముఖ్యమైన భేదం. పరిణామ క్రమం లో మానవుడికి అహింస లక్షణాలు సహజంగా అలవడి,హింస లక్షణాలు క్రమంగా క్షీణిస్తూవచ్చాయి. సంఘ జీవి అయిన మానవుడు సమాజ జనులతో పరస్పర సహకారం, అవగాహన సహాయం తో జీవించాలి అని గుర్తించి ప్రవర్తించాడు.దీనివలన హాయైన సుఖజీవితం గడపటానికి వీలైంది. తన తెలివి తేటలు, వివేకం, బుద్ధి సూక్ష్మత తో సంస్కృతీ నాగరకత లు అభివృద్ధి చేసుకొన్నాడు. మానవ జాతులు కారణ, కార్య సంబంధం, నిర్ణయం లను అమలుపరచి ఆశ్చర్యకరమైన అభి వృద్ధి సాధించాయి. మనిషిలోని హింసా ధోరణికి కళ్ళెం వేస్తే, అతనిలోని అహింసా లక్షణాలు గణనీయంగా అభివృద్ధి చెందుతాయి. దీనివలన మానవ సమాజం అత్యున్నత స్థాయి సాధిస్తుంది. మానవులలో ని హింస అణగిపోతే, నియంత్రింప బడితే, నాగరకత పురోగమనం చెంది ప్రపంచం సుఖ శాంతులతో వర్ధిల్లుతుంది. హింస వలన కోపం, క్రోధం, ద్వేషం, పగ, ప్రతీకారం, రక్తపాతం పెరుగుతాయి. మనశ్శాంతి లేకుండా చేస్తాయి. కనుక వీటన్నిటికి విరుగుడుమంత్రం గౌతమబుద్ధుడు, మహాత్ముడు బోధించిన అహింసా సిద్ధాంతమే. మానవ జాతికి అదే తరుణోపాయం. మానవుల మస్తిష్కం లో పశు ప్రవృత్తి, అసాంఘిక ప్రవృత్తి పూర్తిగా తొలగిపోతే మానవ సమాజం ఉన్నతోన్నత స్థితికి ఎదిగి, ప్రపంచం లోని సర్వమానవాళి సుఖ శాంతులతో, సామంస్యం, సామరస్యంతో జీవిస్తుంది. అదే మహాత్ముని మహదాశయం.

### గాంధీ గారి అహింసాయుత ఉద్యమాలు

మహిళల ప్రోత్సాహం, గొప్ప ప్రేరణ కలిగించి అమెరికన్ నల్లజాతి నాయకుడు మార్టిన్ లూథర్ కింగ్, దక్షిణాఫ్రికా నల్లవజ్రం నెల్సన్ మండేలాలకు గొప్ప స్ఫూర్తి నిచ్చాయి. వారి కోర్కెల సాధనకు ఉపకరణాలయ్యాయి. మహాత్ముడి దృష్టిలో స్త్రీ "సబల "మాత్రమే "అబల "కాదు. ఆమె శక్తి సామర్ధ్యాలను సవ్యంగా వినియోగిస్తే, ప్రపంచం లో సాధించనిదేమీ లేదు అని బాపు నమ్మకం. అందుకే గాంధీజీ రాజకీయ నాయకుడే కాదు, మానవత్వం పై అపారనమ్మకమున్న మనీషి. అన్నిరకాల అన్యాయాలకు, అసమానతలకు సింహ స్వప్నం. మహిళాశక్తి ని సంపూర్ణంగా అర్ధం చేసుకొన్నవాడు. వారి శక్తి, సామర్ధ్యాలపై అపారనమ్మకమున్నవాడు. మహిళలకు

అన్ని స్థాయిలలో జరుగుతున్న అన్యాయాలు, వివక్షత బాగా తెలిసినవాడు. వారికీ పూర్తి సానుభూతి పరుడుకూడా. మహిళా సాధికారతకు పోరాటం సల్పి వారి క్షీణతకు పరిష్కారాన్ని దేశ ప్రజలముందున్న ధీరో దాత్తుడు. మహిళలను అణచి వేయటం, వారిపట్ల అమానుషంగా ప్రవర్తించటం, వారిపట్ల అమలౌతున్న బాల్య వివాహాలు, సతీ సహగమనం విధవా వివాహ వ్యతిరేకత, పరదా విధానం,, వ్యభిచార వృత్తి, దేవ దాసీ విధానం

మొదలైన సాంఘిక దురన్యాయాలు రూపు మాసిపోవాలని ప్రగాఢంగా వాంఛించాడు. ఛాందసవాదుల మనసు మార్చే ప్రయత్నం చేశాడు. మహిళలు పురుషులతో పాటు అన్నిటిలో సమాన హక్కులు హోదా పొందాలన్నదే ఆయన ధ్యేయం. వారిలో పిరికి తనం,, ఇతరులపై ఆధారపడటం, లొంగి ఉండటం, అనే బలహీనతలకు స్వస్తి చెప్పి ధైర్యం తెచ్చుకొని శక్తి, ఆత్మ విశ్వాసాలతో, స్వశక్తితో ఆ బంధనాలను ఛేదించి ముందడుగు వేయమని ప్రోత్సహించాడు. జాతీయ స్థాయిలో జాతి పునర్నిర్మాణం లో మహిళలకు ఒక విశేషమైన, క్లిష్టమైన బాధ్యత అప్పగించాడు. ఇదే ఆయన విజన్ కు సంబంధించిన సృజనాత్మక ప్రాముఖ్యమైన అతి గొప్ప అంశం. మహిళలు తమ పూర్తి హక్కుల సాధనకు తాము నిర్వహించాల్సిన ముఖ్యపాత్రకు, సమస్యల పరిష్కారానికి అహింసా విధానమే సర్వ శ్రేష్టమని, కనుక వారు సంకుచిత పరిధి వదిలి అంటే ఇంటికే, కుటుంబానికే పరిమితం కాకుండా, సర్వ మానవ కుటుంబాల శ్రేయస్సు, సంక్షేమాలకోసం కృషి చేసి తమ ధర్మం నెరవేర్చమని హితవు చెప్పాడు. మహిళలు రాజ కీయాలలో ప్రవేశిస్తే, వారికున్న బంధనాలనుండి విముక్తికలగటానికి, పురుషులతో పాటు సమాన హక్కులు స్థాయి సంపాదించటానికి గొప్ప అవకాశం కలుగుతుందన్న నమ్మకం కలిగించి ప్రేరణ కల్గించి స్ఫూర్తినిచ్చి ఉద్యమంలో పాల్గొనేట్లు చేశాడు. దటీజ్ గాంధీజీ.

మహాత్మా గాంధీ "స్త్రీవాద వ్యూహం "చెప్పాడు. అదే సత్యాగ్రహం. మహిళలకు వారి మేధకు సరిగ్గా సరిపోయే స్ట్రాటజి ఇది. పురుషులకంటే స్త్రీలే అహింసా సిద్ధాంతాన్ని అర్ధం చేసుకొని బాగా వివరించి ప్రచారం చేయగల సత్తా ఉన్నవారని నమ్మాడు..స్త్రీలు బలహీనులవటం వలన వారికి ఈ బాధ్యత అప్పగించలేదు. వారిలో సమర్ధత, ధైర్యం, త్యాగ గుణం ఎక్కువ అని బాధ్యత అప్పగించాడు. అవతలివారిని ఒప్పించే నేర్పు కూడా మగవారికంటే స్త్రీలకే ఎక్కువ అని గ్రహించాడు. తన నమ్మకాన్ని మరొకసారి ప్రకటిస్తూ "మనం అబలలు అని పిలిచే మహిళలు సబలలు ఐనప్పుడు, నిస్సహాయ స్థితి లో ఉన్న వారందరూ దుర్గా దేవిలాగా మహా శక్తి సంపన్నులౌతారు"అన్నాడు బాపూజీ.

పురుషులతో పాటు మహిళలూ సమానమే అన్న గాంధీ సిద్ధాంతాన్ని గురించి ఆలోచిద్దాం. దీనినే "సమతాదర్శనం "అన్నాడు, జైనమత ప్రవక్త వర్ధమాన మహావీరుడు. "అన్ని ఆత్మలూ శక్తి సంపన్నమైనవే. ఆత్మ దర్శనానికి, ఆత్మోన్నతికి అందరూ అర్హులే. నిర్వాణానికి పురుషులతోపాటు స్త్రీలూ అర్హులే "అని మహావీరుని మహా బోధ. సమానత్వం అనేది మనసా వాచా కర్మణా జరగాలి. మహా వీరుని ఈ భావం గాంధీ మనసుకు బాగా హత్తుకున్నది. మహావీరుని ప్రేరణే, గాంధీ మహిళా సమానత్వం. చిన్ననాటినుండి గాంధీజీ మహావీర బోధలు విని అర్ధం చేసుకున్నాడు. ఆయనభావాలకు తనదైన భావ పుష్టి కలిగించి కాలానుగుణం గా తన జీవితాన్ని తీర్చి దిద్దుకొని నడిచాడు. మహాత్ముని సమానత్వ సిద్ధాంతం- సంరక్షణ, అస్పృశ్యత నిర్మూలన, స్త్రీ పురుషుల సమానత్వం. "స్త్రీ పురుషునికి తోడు పురుషునితోపాటు సరిసమాన మానసిక, బౌద్ధిక శక్తి కలది "అని అర్ధం చెప్పాడు. పురుషుని అన్ని పనులకు ఆమె తోడూనీడగా వ్యవహరిస్తుంది. అందుకే అతనితోపాటు ఆమెకు స్వేచ్చ, స్వాతంత్ర్యం తప్పని సరి. మహా వీరుడు జైన సంఘం లో స్త్రీలకు ప్రవేశం కల్పించి, ఎలాంటి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఇచ్చాడో మహాత్ముడు కూడా అలాగే చేశాడు. మహావీరుని దృష్టిలో స్త్రీ పురుషులు ఆధ్యాత్మిక, ఆత్మ భావనలో సరిసమానులు. ఈ ప్రపంచాన్ని త్యాగం చేసి, సన్యసించి నిర్వాణం పొందటానికి స్త్రీ పురుషులిద్దరూ అర్హులే అన్నాడు. ప్రతి జీవికి ఆత్మ ఉంటుందని బోధించాడు.

పర్యావరణ పరిరక్షణలో గాంధీ గారి పరికరాలేమిటి అని ఆలోచిద్దాం. పర్యావరణ క్షీణత జీవుల ఉనికికే మహా ప్రమాదంగా ఉంది. అజ్ఞాన జ్ఞానాభివృద్ధి భూగోళాన్ని ప్రమాదం అంచుకు నెట్టేసింది. మానవ సుఖ,విలాసాలకోసం ప్రకృతిని పీల్చి పిప్పి చేస్తున్నారు. దీనివలన వినిమయతత్వం (కన్స్యూమరిజం )విపరీతంగా పెరిగి, జీవ వైవిధ్యనష్టం, భూతాపం(గ్లోబల్ వార్మింగ్ ) పెరగటం, సహజవనరుల క్షీణత, వివిధ విదాల కాలుష్యం పెరగటం మొదలైన తీవ్ర సమస్యలు చుట్టు ముట్టాయి. వీటివలన ప్రపంచ పతనం (గోబల్ కొలాప్స్ )జరిగే ప్రమాదముందని భీతి చెందుతున్నారు. మానవ మేధ పెరిగి, పాశ్చాత్య దేశాలలో పారిశ్రామిక విప్లవం రావటం తో, భౌతికత పై వ్యామోహం పెరిగి, జీవిత విధానం లో పెనుమార్పులు కలిగాయి. దీనికి గాంధీ జీ ఉపయోగించిన విలక్షణమైనవిధానాలు, పరికరాలే పరిష్కారం. "పాశ్చాత్య నాగరకత ఏడురోజుల అద్భుతం మాత్రమే. కనుక ప్రకృతి తో సహజీవనం తో,, ఆధ్యాత్మిక భావాలతో జీవిత శైలిని నిర్మించుకోవాలి "అని గాంధీ అప్పుడే చెప్పాడు. మన మైండ్ సెట్ మారాలంటే గాంధియన్ స్పిరిట్ మాత్రమే శరణ్యం. లేకపోతె మనం కూర్చున్న కొమ్మను నరుక్కునే బుద్ధిహీనులమై, కాలుష్యం కోరల్లో చిక్కుకున్న వెర్రి వాళ్ళమై భూమాతకు తీరని ద్రోహం చేసే వాళ్ళుగా చరిత్ర హీనులమైపోతాం. తస్మాత్ జాగ్రత జాగ్రత.

భారతదేశం, శాంతి అవినాభావ సంబంధమున్న విషయాలు. మహాత్ముడు ఇండియాలో బ్రిటిష్ పాలన అంతమొందటానికి చేసిన సత్యాగ్రహ,సహాయనిరాకరణ, క్విట్ ఇండియామొదలైన ఉద్యమాలన్నీ అహింసా యుతంగా జరిగి, విజయం సాధించి భారత దేశం స్వాతంత్ర్యం పొందటానికి దోహద పడినవే.దక్షిణాఫ్రికాలో ప్రారంభించి 1915 జనవరిలో భారత దేశానికి వచ్చి, జాత్యహంకార కాలనీ కోరలున్న తెల్లవారి పాలనపై పూరించిన పర్జన్య శంఖా రావాలే. గాంధీ రాకతో ఉద్యమాలకు జవ జీవాలొచ్చాయి. ఉత్సాహం కట్టలు తెంచుకొన్నది. ఐక్యత ఏర్పడింది. కలిసికట్టుగా కాలనీ ప్రభుత్వాన్ని వెళ్ళగొట్టాలనీ, స్వేచ్ఛాభారతమే అందరి లక్ష్యమని భావన బలీయమైంది. 1920 నుండి 1947 వరకు అవిశ్రాంతంగా బాపు నాయకత్వం లో కోట్లాది భారతీయ స్త్రీ, పురుషులు ఆయన వెంటనడిచారు. రాజకీయ స్వాతంత్ర్యం కోసమేకాదు. అణగ ద్రొక్కబడిన దిక్కు మొక్కూలేని అసలు తమకు హక్కులుం టాయన్న విషయంకూడా తెలియని అమాయక అస్పృశ్యుల హక్కు, విధుల కోసం ఆయన పోరాడి విజయం సాధించాడు. వారిని "హరిజనులు "అనే గౌరవనామం తో పిలిచి దేవాలయ ప్రవేశం కల్పించటం తో వారి హృదయాలలో స్థిరంగా నిలిచిపోయాడు. ఆయన సాధించిన అద్భుత విజయం నిజంగా" యైత్ వండర్".వీరందరూ స్వాతంత్ర పోరాటం లో ఆయుధాలు లేని పోరాట యోధులై గాంధీకి అండగా నిలిచారు. ఆసేతు హిమాచలపర్యంతం గాంధీ మాట వేదవాక్కు. గాంధీ వాక్కు మంత్రమే అయింది. భారత దేశ చరిత్రలో అత్యంత ప్రజా నాయకుడు –మాస్ లీడర్ అనిపించాడు మహాత్ముడు. ఆయన ఆదర్శ త్యాగమయ జీవితం కోట్లాది

మంది భారతీయులకు కదిలించి నడిపించింది. అందరి కోరిక అయిన స్వాతంత్ర్యం సిద్ధించింది. సాంఘిక అసమానతలు, లైంగిక వివక్ష లకు చరమగీతం పాడటానికి పని చేసింది.

ఇంతకీ గాంధీగారి మతం ఏమిటి ?మానవ సహజ మూల కార్యక్రమాలలో మతం విడదీయ రానిది. దీనితో ఇతర మానక సంబంధ కార్యాలు మూల స్థానంగా ముడివడి ఉంటాయి. నైతికత, కళ,సైన్స్, సాంకేతికత మొదలైన వాటితో మనిషి ప్రకృతిని నియంత్రణలోకి తెచ్చుకున్నాడు. మానవ జీవితాలలో ప్రకృతి మూలాధార భూతం. మతాన్ని నిర్వచించటం కష్టం. అది పూర్తిగా నమ్మకానికి, సాధనకు సంబంధించిన విషయం. కనుక మతం లో నమ్మకాలు సాధానాలు కలిసి ఉంటాయి. వీటిద్వారా మానవుని ఉనికికి సార్ధకత, తుది గమ్యమేమిటో తెలుసుకోమని చెబుతుంది మతం. ఇలా వ్యక్తిగతంగానేకాక సామూహికం గా ఆలోచించి అభ్యాసం చేయటం మతం నేర్పుతుంది. "పరమం" తో అనుసంధానం చేయిస్తుంది. సత్యం, సుందరం, మంచితనం అనేవే పరమమైన విషయాలు. బాపుకు ఆయన కుటుంబ సంప్రదాయాల నుంచి మతం పై గాఢ విశ్వాసం సంక్రమించింది. మతం, నైతికతలపై ఆయన విస్తృతంగా మాట్లాడాడు, రాశాడు. రాజకీయ వేషం లో ఉన్నా, మతం అనేది గాంధీకి జీవిత విధానం లో అంతర్భాగమైంది. సంఘర్షణ, వివాదాలలో గాంధీ పరిష్కారాలేమిటి ?అనేది అందరూ అడిగే సూటి ప్రశ్న. సకల మానవ సంక్షేమం, దాని సాధనలో పండి పోయిన అత్యంత ప్రపంచంప్రసిద్ధ అతి కొద్ది ముఖ్య నాయకులలో మహాత్ముడు ఒకడు. వీరితో పాటు గాంధీజీ ఒక ఉన్నత పౌరసమాజ నిర్మాణ ధ్యేయం ఆయన గొప్పకల.అదే ఆయన ప్రవచించిన "రామరాజ్యం "రామరాజ్యం సాధిస్తే అందులో అతి నిమ్న జాతివారు, అత్యంత బలహీనులు ప్రాధమిక హక్కులు పొంది, గౌరవంగా సుఖంగా జీవిస్తారని విశ్వసించాడు. దీన్ని సాధించటానికి అనుసరించాల్సిన విధానాలు, మార్గాలలో గాంధీకి, మిగిలిన ప్రపంచనాయకులకు భేదాభిప్రాయం ఉన్నది.. మహాత్ముని దృష్టి లో సాధనామార్గాలు, గమ్యం రెండూ చాలాముఖ్యమైనవే. అనైతిక మార్గాలు మంచి ఫలితాలనెప్పుడూ సాధించలేదు. అందరూ చెప్పే "గమ్యమే సాధనానికి తీర్పరి "(ఎండ్ జస్టి ఫైస్ మీన్స్ ) అనే మాట ఆయన అంగీకరించలేదు. గమ్యంచేరటానికి సత్యం, నిజాయితీ, నైతికతతో కూడిన ముఖ్య సాధనాన్ని ఎంచుకోవాలి. అడ్డ దారి చేటు. సత్యం ద్వారా శాంతి స్థాపించాలి. హింస మరింత హింసకు మూలమౌతుంది. కూకటి వ్రేళ్ళతో భారత దేశం లో పాతుకుపోయిన తెల్ల దొరల పాలన నుండి దేశమాత విముక్తి చెంది స్వేచ్ఛా వాయువులు పీలుస్తూ స్వాతంత్ర్యం పొందటానికి, కష్టతరమైన నైతిక మార్గాన్నే ఎంచుకున్నాడు. అగౌరవ, అనైతిక మార్గాలు చేటు కలిగిస్తాయన్న పరిపూర్ణ విశ్వాసం ఆ అహింసా మూర్తిది. దౌర్జన్యం, హింసావాదుల పద్ధతిని వదలి, శాంత్యహింసలతో "నిష్క్రియాత్మక నిరోధత "అంటే పాసివ్ రెసిస్టన్స్ అనగా సత్యాగ్రహ మార్గాన్నే ఉత్తమ సాధనంగా ఎంచుకున్నాడు. దీనితోనే తెల్లదొరలను దేశం వెలుపలకు తరిమి కొట్టగలిగాడు శాంతితోనే జగజ్జెట్టి అని పించుకున్నాడు. సత్యాగ్రహం లో పాల్గొన్న వారందరూ లాభపడ్డారు. క్లిష్ట పరిస్థితి లో కూడా సత్యాగ్రహి నిగ్రహాన్ని గౌరవాన్ని కోల్పోలేదు. మహాత్ముని సత్యాగ్రహ విధానం యుద్ధానికి ప్రత్యామ్నాయం. ఆయన చెప్పిన సహాయ నిరాకరణ సంఘర్షణ కు సరైన శాంతియుత పరిష్కారం. హింసతో ప్రజ్వరిల్లుతున్నప్రపంచం లో ప్రజలు శాంతి, ప్రశాంతులతో జీవిస్తూ, పరస్పర సహకారం సామరస్యం తో ఎలా జీవించాలో, కలిసిపని చేయాలో బోధించాడు. ఆచరించి ప్రజలు ఆయననమ్మకాన్ని నిలబెట్టారు. "యధాగాంధీ తధా ప్రజా "అని పించుకున్నారు. అత్యవసరంగా ఫలితాలు, తాత్కాలిక ప్రయోజనాలు రావాలని ఆయన ఆశించలేదు. మానవాళి సమస్యలకు శాశ్వత పరిష్కారం కోసమే కృషి చేశాడు. నిత్యకలహాలు, ద్వేషాలతో సంక్లిష్టంగా పెచ్చుపెరిగిన ప్రపంచాన్ని మానవాళి ఎలా ఎదుర్కోవాలో ఆయన ప్రవచించాడు. దీనికి కూడా ఆయనది అహింసా వాదమే, సత్యాగ్రహమే సాధనాలు గా చెప్పాడు. కనుక ప్రపంచ వ్యాప్తంగా ఏ సమస్యకైనా పరిష్కారం అహింసాయుత ఆందోళన సత్యాగ్రహాలే అని తిరుగు లేని తీర్పు చెప్పాడు. నెల్సన్ మండేలా, మార్టిన్ లూధర్ కింగ్, ఆన్సాంగ్ సూయీ లకు ప్రేరణగా నిలిచి వారి దేశాలలో హక్కుల సాధనకు, స్వేచ్ఛకు పరోక్షంగా దోహద పడ్డాడు.

మానవ సంరక్షణ లో మాహాత్ముని దృష్టి కోణం విశిష్టమైంది. నాగరకత అంటే నిజంగా అన్నీ అనేక రకాల పెరగటం మాత్రమే కాదు. జాగ్రత్తగా ఉద్దేశ్యపూర్వకంగా స్వచ్ఛందంగా కోరికలు తగ్గించుకోవటం. దాని వలననే అసలైన సంతోషం మనశ్శాంతి, సంతృప్తి లభించి సేవా ధర్మంలోశక్తి సామర్ధ్యాలు కలుగుతాయి. మానవ సంరక్షణ ఒక వినూత్న కీలక భావం (కాన్సెప్ట్ ).ఇప్పుడు అది విశ్వ వ్యాప్తంగా వ్యక్తికి ఉన్న సంక్లిష్ట, పరస్పర సంబంధమున్న భయం ఆందోళనలను వివరించటానికి తోడ్పడుతుంది. మానవ సంరక్షణ సిద్ధాంత కర్తలు సంప్రదాయంగా ఉన్న రక్షణ అనే భావాన్ని సవాలు చేస్తున్నారు. వీరి దృక్పధం లో సరైన సంరక్షణ రాజ్యానికి కాకుండా వ్యక్తిగతమైంది గా తప్పక కావాలి. దేశ సంరక్షణ అంటే ప్రజా సంరక్షణమే.. గత వందేళ్ళలో ఆయా దేశ ప్రభుత్వాలు వారి ప్రజలను విదేశీ సైన్యం కంటే అతిపెద్ద సంఖ్య లో హతమార్చాయి. 1994 నాటి యు. యెన్. డి. పి. అంటే అంతర్జాతీయ అభివృద్ధి ప్రోగ్రాం రిపోర్ట్ మానవ రక్షణకు గొప్ప మైలురాయిగా నిలిచింది. అందులో "కోరిక నుండి, భయం నుండి ప్రజలందరకు స్వేచ్ఛకల్పించటమే ప్రపంచ మానవ సంరక్షణ సమస్యకు మేలైన మార్గం" అని ధ్రువీకరించింది.

21 వ శతాబ్దిలో గాంధీయిజం ఔచిత్యం గురించి కూడా విశ్లేషకులు పలుకోణాలలో అధ్యయనం చేశారు. గాంధి మరణించి ఉండవచ్చు. గాంధీయిజానికి మరణం లేదు అది అమరం, శాశ్వతం అన్నారు. గాంధీయిజం మనదేశం లో మాత్రమేకాదు ప్రపంచంలో జీవించే ఉంది.. గాంధీజీ ప్రవచించిన అహింస, సత్యాగ్రహం, అంతిమ సంబంధం (ఎండ్ మీన్ రిలేషన్ షిప్ ),సర్వోదయం, విద్య, సాంఘిక సంస్కరణలు, జాతీయత,, అంతర్జాతీయత మొదలైనవన్నీ నేటి అధునాతన ప్రపంచం సమాజం లోనూ గొప్ప ఔచిత్యవంతంగానే ఉండటం ఆమహాత్మునికి, ఆమహర్షికి దక్కిన అరుదైన గౌరవం.. మహాత్ముడు ఎన్నడూ తన సిద్ధాంతాలను ఇజం పేరిట చెప్పనే లేదు. వాటిని జీవన మార్గాలుగా అనుష్టించాడు. గాంధీ ఇజమ్ఆధునిక యుగం లో చాలాగొప్ప భావజాలం(ఐడియాలజీ ). గాంధీ ఇజమ్ మన ఆధునిక రాజకీయ, సాంఘిక సమస్యలపరిష్కారాలకు సంప్రదాయ సూత్ర, సంస్కృతీ సాంఘికబద్ధ జీవిత సూత్రాలనాధారంగా మార్గ దర్శకం చేస్తుంది. అది ఆధ్యాత్మిక నైతిక మూలాలపై వర్ధిల్లింది. ఈ నాటి ప్రతి దిన సమస్యలన్నిటికీ గాంధీయిజం సరైన పరిష్కారం సమాధానం చెప్పగలదు.అసమానత, అస్పృశ్యత, సంకుచిత జాతీయత, ఆవేశ కావేషాలకు చక్కని పరిష్కారాలు సూచించి మార్గ దర్శకం చేస్తుంది. అందులో ఆధునిక పౌర

సమాజ భావన పొందు పరచబడింది. గాంధీ ఇజం సాంఘిక సంక్షేమ తత్వాన్ని విస్పష్టంగా, బే షరతుగా సమర్ధిస్తుంది. కనుక గాంధీ ఇజమ్ సార్వకాలికం సార్వ జనీనం అని అర్ధమయింది కదా..

"అహింసాయుత ప్రతిఘటన సామ్రాట్ "గా మహాత్మా గాంధీ సుప్రసిద్ధుడు. ఆధునికకాలం లోఅహింసా మూర్తులుగా ప్రపంచ గుర్తింపు పొందిన ఇద్దరిలో మహాత్మా గాంధీ మార్టిన్ లూధర్ కింగ్ మాత్రమే నిలిచారు. వీరిద్దరూ అన్యాయం, జాతి వివక్షత, పేదలపై దౌర్జన్యాలు అల్పసంఖ్యాక వర్గాల సాంఘిక బహిష్కరణ లను రూపు మాపటానికి అహింస ఆయుధంగా పెద్ద ఎత్తున ప్రజా ఉద్యమాలు నిర్వహించారు.నిజానికి గాంధీజీ దేశ స్వేచ్ఛ స్వాతంత్ర్యాలకోసం బ్రిటిష్ వారిని తరిమి కొట్టటానికి అహింసా యుతంగా ఉద్యమించాడు. అమెరికా పౌరహక్కుల నాయకుడు మార్టిన్ లూధర్ కింగ్ నల్లజాతివారి హక్కులకోసం, న్యాయ సంస్కరణలకోసం గాంధీయిజం ఆధారంగా అహింసా పద్ధతిలో నిరసన, భారీ ప్రజా సమీకరణ తో ఉద్యమాలు చేసి విజయం సాధించాడు. సాంఘిక మార్పులు రావాలంటే అహింసా మార్గమే సరైనదని ఈ ఇద్దరు నాయకులు విశ్వసించి అమలు చేశారు. మనసు చిత్తశుద్ధి ఉంటే, ఎవరైనా ఈమార్గాన అనుకొన్నది సాధించవచ్చునని రుజువు చేశారు. వీరిద్దరికీ ఆహింస ఒక సాధనమార్గం. దీనివల్లనే బాంధవ్యాలు బలపడి, శాంతియుతంగా అధికార మార్పిడి ని ఈ ఇద్దరు మహానాయకులు సాధించారు. అహింస విశ్వజనీనమైన, స్థిరమైన, నమ్మకమైన,గొప్ప సిద్ధాంతం అని నిర్ద్వంద్వంగా చెప్పవచ్చు. కనుక గాంధీయిజానికి ఎన్నటికీ మరణం లేదు. గాంధీ, గాంధీ ఇజం చిరంజీవులే.

## 7 విజయవాడ రేడియో లో నేను చేసిన 4 ప్రసంగాలు

### 1 గాంధీజీ –సత్యవాక్కు

సత్యం వద, సత్యమేవ జయతే, సత్యజ్ఞానమనంతం బ్రహ్మ అని ఋషి ప్రోక్తం. అన్నిటిలో సత్యమే శ్రేష్టమైన ధర్మం. దాన్ని అనుసరించినవారికీ ఈ లోకం లోనేకాదు పరలోకం లోనూ ఎదురులేదు. హరిశ్చంద్రుడు సత్య వాక్కు కోసం సర్వస్వాన్నీ తాత్కాలికంగా కోల్పోయినా అదే ఆయనకు అండగా నిలిచి సర్వం తిరిగి పొందటానికి తోడ్పడింది. సత్య హరిశ్చంద్ర నాటకం చిన్నతనం లో చూసిన గాంధీజీ సత్యానికి ఆకర్షితుడై, సత్యానికి అంకితమై జీవించాడు. సత్య నిష్ట ఉన్నందునే హరిశ్చంద్రుడు చరిత్ర ప్రసిద్ధుడయ్యాడని గ్రహించాడు. ఎన్ని కష్టాలెదురైనా సత్యమార్గం విడవను అని తీర్మానించుకొన్నాడు. శ్రావణుని పితృ భక్తికూడా ఆయనపై గొప్పప్రభావం చూపింది. స్కూల్ లో ఉపాధ్యాయుడు కాపీ చేయమని ప్రోత్సహించినా తన అంతరాత్మకు విరుద్ధం కనుక చేయని ఆదర్శ జీవి. తండ్రి జేబులో డబ్బు కొట్టేసి తండ్రికి నిజం చెప్పి ఆయన మనసు గెలుచుకున్నాడు. చేసినతప్పులు తెలుసుకొని, తనపై తాను ప్రయోగాలు చేసుకొని సత్యమార్గాన్ని అనుసరించాడు. ఇలా చిన్నతనం లోనే సత్య విజయం సాధించాడు. ఆయన జీవితమే సత్య శోధన –యాన్ ఎక్స్ పెరిమెంట్ విత్ ట్రూత్. సత్య వాక్కు మహత్తరమైనది. గోవు సత్యవాక్కును నిలబెట్టుకొన్నందుకు వ్యాఘ్రం మనసు మారి దాన్ని చంపకుండా వదిలేసిందన్నకథ మనకు తెలుసు. 20 వ శతాబ్దం లో కూడా ఇలాంటి సత్యవాక్ పరిపాలకుడైనందుననే గాంధీజీ ప్రపంచ దృష్టి నాకర్షించాడు. సత్యం, అహింస ఆయనకు రెండుకళ్ళు. అందుకే అతి సామాన్యుడు మాన్యుడై మహాత్ముడనిపించుకొన్నాడు. "గౌతమబుద్ధుడు, జీసస్ ల తర్వాత అంతటి మహావ్యక్తి గాంధీ" అన్నాడు డా హూమ్స్ అనే అమెరికన్ మిషనరీ. 'మహాత్మా గాంధి వంటి వ్యక్తి ఈ భూ ప్రపంచం మీద రక్తమాంసాల శరీరం తో మనుగడ సాగించాడంటే ముందుతరాలవారు నమ్మలేక పోవచ్చు "అని కీర్తించాడు ప్రఖ్యాత శాస్త్రవేత్త ఐన్ స్టీన్. సిద్ధాంతాలు అందరూ చెప్పవచ్చు కాని నిజ జీవితం లో వాటిని ఆచరించి మార్గ దర్శనం చేసినవాడు మహాత్మా గాంధీ. ఉదాత్త జీవిత లక్ష్య సాధనకు సాధనాలుకూడా పవిత్రంగా ఉండాలని బోధించాడు. వ్యక్తిత్వానికి విశ్వ ఖ్యాతి తెచ్చాడు.

లండన్ వెళ్లేముందు తల్లి కిచ్చిన వాగ్దానాలను ఎట్టి పరిస్థితి లోనూ మరచిపోకుండా అమలు చేసి సత్య సంధుడనిపించాడు. లండన్ లో తాను పేయింగ్ గెస్ట్ గా ఒక స్త్రీ ఇంట్లో ఉండగా, ఆమె కూతురు తనపై ప్రేమలో పడగా ఇంటి యజమానురాలికి తనకు పెళ్లి అయిందని తనకిచ్చిన ఆతిధ్యానికి ధన్యవాదాలని నిజం తెలియజేస్తూ ఉత్తరం రాశాడు. గాంధీ సత్యసంధతకు ఆమె ఎంతో అభినందించింది. ఆయన అసత్యం చెప్పిఉంటె జీవితమంతా బాధపడాల్సి వచ్చేదని, సత్యం తెలియజేయటం వలన అత్యంత గౌరవనీయుడు అయ్యాడని మెచ్చుకొన్నది. బారిస్టర్ పాసై వకీలుగా ఉన్నా సత్యాన్ని విడవలేదు. ఏ వృత్తిలో ఉన్నా సత్య ధర్మాలు ఆచరిస్తే సాఫల్యత అధికం అని నిరూపించిన మహానుభావుడు బాపు. " సత్య శోధన తప్ప నాకు దేనిపైనా ఆసక్తిలేదు. ప్రపంచం లో సత్యం తప్ప వేరేదీ లేదనే నమ్మకం నాకు రోజు రోజుకూ పెరుగుతోంది. సత్య సాధన పరికరాలు యెంత కఠినమైనవో,అంత సరళమైనవికూడా. సత్య శోధకుడు అందరూ తేలికగా తీసుకొనే ధూళి కణాన్నికూడా సూక్ష్మంగా చూస్తాడు "అన్నాడు గాంధి. సహజంగా అబద్ధం, అతిశయోక్తులు సత్యాన్ని మరుగు పరుస్తాయి. మితభాషణం ఈ లోపాన్ని తీరుస్తుంది. సత్యాన్ని ఆచరిస్తే న్యాయం దానంతటఅ అదే మనల్ని అనుసరిస్తుందని గాంధీ నమ్మకం.సత్యం వజ్రం కాగా కఠోరం. కుసుమం లాగా బహు కోమలం కూడా అన్నాడు. సత్యం, ఉదారత, సహిష్ణత ఉన్న చోట భేదాలు కూడా లాభాదాయకాలే అవుతాయన్నాడు, సత్యాన్ని పాటిస్తే క్రోధం, స్వార్ధం ద్వేషం సహజంగా తగ్గిపోతాయి. ఇవి తగ్గకపోతే సత్యం గోచరించదు. సత్య నిష్ట ఉన్నవాడు తన భావాలలో లోపముందేమో అని ఆత్మపరిశీలన చేసుకోవాలి, దానిఫలితాలు అనుభవించాలి. ప్రాయశ్చిత్తానికి సిద్ధపడాలి అన్నాడు. వ్యతిరేకించేవారి అభిప్రాయం తెలుసుకొని, వారిని అనుకూలంగా మార్చుకోవటం సత్య నిష్ఠ ధర్మం

సత్యం అనేమాట సత్ అనేదాతువు నుంచి వచ్చింది. అంటే ఉండటం అని అర్ధం. అంటే జగత్తులో సత్యం తప్ప ఇంకేదీ లేదు అని భావం. అందుకే భగవంతుడు సత్య స్వరూపుడు. సత్యమే దైవం అని చెప్పాడు గాంధీ. కనుక ఆయన ఫిలాసఫీ సత్యం. సత్యం ఉన్న చోట జ్ఞానం ఉంటుంది. దానినే చిత్ అంటారు జ్ఞానం ఉన్న చోట ఆనందం ఉంటుంది. సత్యం అనంతమైతే ఆనందమూ అనంతమే. కనుక భగవంతుడు సత్, చిత్, ఆనంద మూర్తి. సత్యారాధానమే మన జీవిత ధ్యేయం. కనుక సత్యమే మన ఊపిరి కావాలి. సత్యమార్గం లో నడిస్తే, ఉదాత్త జీవితం దానంతటికదే అలవడుతుంది. సత్యం లేని ఏ నియమమూ పని చేయదు. సత్యం మనసా వాచా కర్మణా ఉండాలి. ఇది తెలిసినవాడికి అన్నీ తెలుస్తాయి. సత్య శోదనే భక్తీ. అదే పరమాత్మను చేరేసాధనం. సత్యం లో పిరికితనం ఓటమి ఉండనే ఉండవు. ఇలా సత్యమార్గాన్ని అనుసరించి మార్గదర్శు లైనవారు సత్య హరిశ్చంద్రుడు, ప్రహ్లాదుడు, శ్రీరాముడు,ఇమాం హుస్సేన్, క్రిస్టియన్ మతప్రవక్తలు మొదలైనవారు అన్నాడు మహాత్ముడు. చేసే ప్రతిపనిలో సత్యనిబద్ధత ఉండాలి. అప్పుడు భగవత్ స్వరూపమైన సత్యమే మనం అవుతాం అని గాంధీ పరిపూర్ణ విశ్వాసం. సత్యం సర్వ స్వతంత్రమైనది, సనాతనమైనది అదే పరబ్రహ్మం. అందుకే కరుణశ్రీ "జగత్రితయమ్మునకు సత్య సందేశ మందించు శాంతి దూత

““సత్యకవచము వొడల సంతరించి దండు నడిపినట్టి వాడు ““ఆతడజాతశత్రుడు మహాత్ముడు, శాంత తపస్వి విశ్వ విఖ్యాతుడు “ అన్నారు.. ” సత్యానికి ఏ శక్తీ సంకెళ్ళు వేయలేవని నిరూపించిన ఘనతపస్వి”అన్నాడు మల్లెమాల. గాంధీజీ 150 వ జయంతికి మనమందరం సత్యవాక్కు పాటించటమే ఆయనకు ఇచ్చే ఘన నివాళి.

## 2 గాంధీజీ –అహింస

“అహింసా పరమో ధర్మః “అని ఆర్యోక్తి. హింస చేయకపోవటం అహింస. ఎదుటి ప్రాణికి ఏరకమైన హాని కలగజేయకపోవటమే అహింస. సాటిమనిషిని మాటలతో, ప్రవర్తనతో, భావాలతో గాయ పరచకుండా ఉండటం. సకల జీవులపైనా ప్రేమ కలిగి ఉండటం. అహింస గొప్ప గుణం. బుద్ధుడు అహింసామూర్తి. ఆధునికకాలం లో గాంధీ మహాత్ముడు కూడా అహింసా మూర్తిగా ప్రసిద్ధి చెందాడు. రాజకీయక్షేత్రం లో అహింసా సిద్ధాంతాన్ని ప్రయోగించి విజయం సాధించిన మొట్టమొదటి వ్యక్తి మహాత్ముడు. నియంతలు ఘాతకులు చరిత్రలో తాత్కాలిక విజయంసాదించినా చివరకు సత్యం,ప్రేమ మాత్రమే శాశ్వత విజయం పొందుతాయి అని గాంధీజీ అభిప్రాయం. కత్తికి కత్తి,కన్నుకు కన్ను సిద్ధాంతం ప్రపంచాన్నే అంధకారం లోకి నెట్టేస్తుంది. యుద్ధం నియంతృత్వానికి దగ్గర దారి. అహింస మాత్రమే స్వచ్ఛమైన ప్రజాస్వామ్యాన్ని అందిస్తుంది. ప్రేమ తో లభించే అధికారం, శిక్ష, భయాలతో వచ్చే అధికారం కంటే వెయ్యి రెట్లు ప్రభావితమై, శాశ్వతమౌతుందని గాంధీ విశ్వసించాడు. అహింస వ్యక్తి నిష్టమేకాని దేశ నిష్టం కాలేదు అనే అపోహతప్పు. అశోక చక్రవర్తి రాజ్యమంతా అహింసా సిద్ధాంతాన్ని పాటిం చేట్లుచేశాడు. అహింస తో నడిపే స్వచ్ఛమైన ప్రజాస్వామ్యం ప్రజలకు మేలు చేస్తుంది.

హిట్లర్ ముసోలిని లు నియంతలుగా మారి ప్రజలను హింసించారు. హిట్లర్ 5 మిలియన్ల యూదుల్ని నిర్దాక్షిణ్యంగా చంపేశాడు. అహింస పిరికితనంకాదు.అదొక మహత్తర శక్తి. అది విస్ఫోటనమై అనుకున్నది సాధిస్తుంది అంటాడు గాంధీ. అహింస కు ఆత్మ స్థైర్యం కావాలి అన్నాడుబాపు. “మానవ స్వభావం పై. మహాత్ముడికి ఉన్న అచంచల విశ్వాసమే ఆయన ఆత్మ శక్తి “అన్నాడు డా పట్టాభి. పిరికితనం, దౌర్జన్యాలలో దౌర్జన్యమే మేలు అన్నాడు. అవతలవాడు ఆపదలో ఉన్నప్పుడు పిరికితనం తో పారిపోకుండా దౌర్జన్యం తో ఎదిరించికాపాడాలి. రక్షణకోసం చేసే దౌర్జన్యం హింస కాదు పైగా గౌరవం,కర్తవ్యం కూడా అని తనకొడుకు అడిగిన ప్రశ్నకు గాంధీ సమాధానం చెప్పాడు. సౌజన్యం చాలా ఉత్కృష్టమైంది. శిక్షించటంకంటే క్షమించటం పురుష ధర్మం అన్నాడు. శూరుడికి క్షమ అలంకారం. శిక్షించే శక్తి ఉన్నా,వదిలేయటం క్షమా గుణం. శారీరక బలం మాత్రమే బలం కాదు. జయింపరాని సంకల్పమే బలం అన్నాడు మహాత్ముడు. కేవలం లక్షమంది బ్రిటిష్ వాళ్ళను చూసి 30 కోట్ల భారతీయులు భయపడాల్సిన పని లేదు. అహింస మన ఆయుధం. క్షమ మన బలం అని ఉద్బోధించాడు. అహింస వలననే మనం స్వాతంత్ర్యాన్ని సాధించి ప్రపంచానికి మార్గ దర్శనం చేయాలి అన్నది బాపూ ఉన్నతాశయం. హింస మృగ ధర్మమైతే అహింస, సౌజన్యం మానవ ధర్మం.

మనపూర్వ మహర్షులు ప్రజ్ఞావంతులు, మహా యుద్ధవీరులు, అస్త్ర,శస్త్ర విద్యా కోవిదులు. ఇవి నిరుపయోగం అని గ్రహించి దుఃఖ పీడిత ప్రపంచానికి మోక్షం సౌజన్యం వలన సిద్ధిస్తుందని బోధించారని గుర్తుచేశాడు బాపూజీ. బ్రిటిష్ దుష్ట పాలన అంతం చేయటానికి అహింసకు మించిన శక్తిలేదు అని నొక్కి చెప్పాడు. సర్వ శక్తివంతుడైన దశ కంఠ రావణుని, కేవలమానవ మాత్రుడైన శ్రీ రాముడు జయించటం లో శారీరక బలాన్ని, మనో బలం తో జయించటం అని అంతరార్ధం అని ప్రవచించాడు.

భారత స్వాతంత్ర్య పోరాటంలో గాంధీజీ ఆధ్వర్యం లో ఎన్నో నిరసనలు మరెన్నో పోరాటాలు, ఇంకెన్నో ఉద్యమాలు, సత్యాగ్రహాలు జరిగాయి. హింసకు తావు లేకుండా గాంధీ గారి అహింస మంత్ర ప్రభావంతో అన్నీ విజయమైనాయి. ఎప్పుడైనాఎక్కడైనా ఆందోళనకారులు హద్దుమీరి హింసకు దిగితే మహాత్ముని గుండె చివుక్కుమనేది. వెంటనే నిస్సంకోచంగా ఉద్యమాన్ని ఆపేయించాడు. అది వెనక్కి తగ్గటం కాదు. ఒక విధమైన యుద్ధనీతి.. తాను సత్యం, అహింస అనే పురాతన మార్గాన్నే ఎన్నుకున్నానని, తాను మహాత్ముడిని కానని, మానవమాత్రుడిని కనుక పొరపాట్లు చేయటం సహజం. ఎక్కడైనా, ఎప్పుడైనా తాను రాజీ పడితే అది దేశానికి నష్టదాయకం గా ఉండదని విశ్వ సించ మని కోరిన మహోన్నత మానవీయ అహింసామూర్తి. అందుకే “నీ అహింసా మకుట మణికాంతులు –ఈ మహా ప్రపంచ సుఖ శాంతులు. నీ సర్వమానవ సమాన దృష్టి –సత్యా హింసల సమష్టి “అని కీర్తించి “జెండా జాతికి జీవ గర్ర, సమతా చిహ్నమ్ము, సర్వస్వము “అనీ “అమ్మ పరాయి పంచ బడి, అశ్రువు లోడ్చుచు నుండ బిడ్డ చిత్తమ్మదిచూచి యోర్వగలదా”అనీ “యజ్ఞఫలము స్వరాజ్య సంప్రాప్తి పార్ధ “అని విజయశ్రీలో అన్యాపదేశంగాను కరుణశ్రీ కర్తవ్యం బోధించారు.”అహింసా లతామతల్లిని మహాత్ముడు అంచి తమ్ముగ పూలు పూయించినాడు”అన్నది యదార్ధం.

## 3 గాంధీజీ–సత్యాగ్రహం

సత్యాగ్రహం అంటే సత్యం కోసం చేసే పోరాటం. సహాయ నిరాకరణ, ఉపవాసదీక్ష ఆయుధాలు గా చేసే ధర్మ పోరాటం. మహాత్మాగాంధీ 1906 సెప్టెంబర్ 11 న మొదటిసారిగా దీన్ని దక్షిణాఫ్రికా లో ప్రారంభించాడు. భారత స్వాతంత్ర్య ఉద్యమం లో సత్యాగ్రహం ప్రముఖ పాత్ర పోషించింది. గుజరాత్ లో తాము దీనిని”పాసివ్ రెసిస్టన్స్ “అంటే నిష్క్రియాత్మక నిరోధకత “గా పిలిచేవారమని, అది పిరికి తనానికి చిహ్నంగా భావించగా దీనికి మదన్ లాల్ గాంధి “సదాగ్రహం “అని పేరు పెట్టి బహుమతి పొందాడని. గాంధీ దాన్ని కొంచెం మార్చి “సత్యాగ్రహం “అన్నాడని, ఇదే దేశం లో పోరాటానికి పేరుగా నిలిచిపోయిందని గాంధి చెప్పాడు. అమెరికాలో నల్లజాతి వారి పౌరహక్కుల పోరాటం లో మార్టిన్ లూధర్ కింగ్ గాంధీజీ సత్యాగ్రహాన్నే ఆయుధంగా ప్రయోగించి విజయం సాధించాడు. సత్య సాధన కోసం రాజీ లేని పోరాటమే సత్యాగ్రహం. తప్పు చేసిన వారిని బలవంతంగా ఆపకుండా, వారిలో గణనీయమైన మార్పు తీసుకురావటమే దీని ముఖ్య ఉద్దేశ్యం.. ఆగ్రహమంటే కోపం. కాని ఇందులో కోపతాపాలకు తావులేదు. శాంతియుతంగా నిరసన తెలియ జేయటమే జరుగుతుంది. నిరసన ద్వారా కోర్కెల సాధన ముఖ్య సిద్ధాంతం. దీనిలో నిరాహార దీక్ష, ఆమరణ నిరాహార దీక్ష ఉంటాయి. ఈరెండు పేర్లు చెప్పగానే మనకు గుర్తువచ్చేది గాంధీ మహాత్ముడే. అప్పుడు స్వతంత్రం కోసం సాగించిన మహాత్ముని సత్యాగ్రహం నేడు అన్ని రంగాలలోనూ తమహక్కులు, కోర్కెలు సాధించటానికి సాధనంగా మారింది.

హత్యాగ్రహం లో భాగమైన నిరాహార దీక్షను రాజకీయ అస్త్రం గా మొదట ప్రయోగించింది గాంధీయే. ఆమరణ నిరాహార దీక్ష సాధనంగా చేసుకొని శ్రీ పొట్టిశ్రీరాములు అమరులై, మనకు ఆంధ్ర రాష్ట్రం సాధించి పెట్టారు. ప్రపంచం లో చాలా దేశాలలో సాత్యాగ్రహం విస్తృతంగా ప్రచారం లో ఉంది. కనకనే దీన్ని గుర్తించి ఐక్యరాజ్య సమితి మహాత్ముని జన్మదినం అక్టోబర్ 2 ను “అంతర్జాతీయ సత్యాగ్రహ దినోత్సవం”గా ప్రకటించింది. గాంధీజీ 72 వ జన్మదినోత్సవం లోకానందంగా జరిగినా ప్రపంచమంతా మహా సంక్షోభం లో మునిగి భారత దేశం ఒక్కటిమాత్రం శాంతి సుప్రభాతాలను బోధిస్తూ సభ్యతా లోకానికి దూరంగా

ఉంది. "లోకాః సమస్తాః సుఖినో భవంతు "అనేది భారతీయ సిద్ధాంతం. దేశాలన్నీ స్వయం పోషకాలుగా, స్వయం సంపూర్ణంగా స్వావలంబనగా ఉండాలని భావన. గాంధీ "ప్రతి బ్రిటిష్ వానికీ "అనే శీర్షికతో లేఖ రాసి, తాను సత్యాగ్రహాన్ని అసహాయోద్యమగా నిర్వహిస్తున్నానని, రెండవ ప్రపంచయుద్ధంలో బ్రిటిష్ ప్రభుత్వానికి సహకరిస్తానని తెలిపాడు.

1916 లో అహ్మదాబాద్ దగ్గర సబర్మతీ నదీ తీరం లో సత్యాగ్రహ ఆశ్రమం నిర్మించబడింది. ఆశ్రమవాసులు బ్రహ్మచర్యం పాటిస్తూ నిదాడంబర జీవితం సాగించారు. ఎవరిపని వారే చేసుకొనేవారు. సత్యాహింసలు, అస్పృశ్యతా నివారణ పాటించారు. సామాన్య ప్రజలు వాడే ఉప్పు పై ప్రభుత్వం పన్ను విధించటానికి నిరసనగా 1930 మర్చి 12 న గాంధి ఇక్కడి నుండి దండి కి కాలినడకన అందరితో కలిసి వెళ్లి ఉప్పు సత్యాగ్రహం చేసి ఉప్పు తయారు చేశారు. ఇదే బ్రిటిష్ ప్రభుత్వానికి పూర్ణ స్వరాజ్య ఉద్యమం తర్వాత అతిపెద్ద వ్యతిరేక ఉద్యమం. ప్రపంచమంతా స్వాగతించింది. తర్వాత దేశమంతా ఉప్పుసత్యాగ్రహాలుఒక ఏడాది పాటు పెద్ద ఎత్తున జరిగాయి. సరిహద్దు గాంధి ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ పెషావర్ లో సత్యాగ్రహం చేసి అరెస్టయ్యాడు.. ఆయనఅనుచరులపై బ్రిటిష్ ప్రభుత్వం కాల్పులు జరపమని ఆదేశించినా" రాయల్ గర్వాల్ రైఫిల్స్" దళం కాల్పులు జరపటానికి తిరస్కరించింది. ఉప్పు సత్యాగ్రహం తర్వాత విదేశీ వస్త్ర బహిష్కరణ జరిగింది. అప్రజాస్వామిక అరణ్య నియమోల్లంఘున కూడా జరిగింది

అక్టోబర్ 17 బ్రిటన్ తో ఇండియా సమరం మొదలైంది గాంధీ ఆదేశంతో వినోబాభావే మొదటి సత్యాగ్రహి నెహ్రు రెండవవాడు. ఇద్దరు యుద్ధ వ్యతిరేక ఉపన్యాసం చేసి సత్యాగ్రహం ప్రారంభించి అరెస్ట్ అయ్యారు. పటేల్ ను కారణం లేకుండానే అరెస్ట్ చేశారు. దేశమంతా సత్యాగ్రహానికి సమాయత్తమైంది. ఉత్సాహం ఉరకలేసింది..శాంతిభద్రతలను కాంగ్రెస్ వాలంటీర్లు బాగా కాపాడారు. సత్యాగ్రహులను నిర్బంధించటం వాక్ స్వాతంత్రం వంటి హక్కులను కాలరాయటమే అన్నాడు గాంధి.. వ్యష్టి సత్యాగ్రహం తర్వాత సమష్టి సత్యాగ్రహం వచ్చి దౌర్జన్యానికి దారి తీస్తుందననుకుని ఉపావాస దీక్ష అన్నాడు. తర్వాత వ్యక్తి సత్యాగ్రహానికి మొగ్గు చూపాడు. సత్యాగ్రహులను జాగ్రత్త గా ఎంపిక చేయాలని హితవు చెప్పాడు. ప్రభుత్వం అణచి వేసే ప్రయత్నం చేసి దౌర్జన్యం చేసినా, లోబడకూడదని ఆయన సిద్ధాంతం. సుభాస్ చంద్ర బోస్ కూడా 1941 లో అరెస్ట్ అయ్యాడు. గాంధీ గారి సత్యాగ్రహం ఇంతమందిని ఇన్ని విధాల ప్రభావితం చేసి జాతీయోద్యమాన్ని తీవ్రతరం చేసింది. "నీ సత్యాగ్రహ సాధన –శాంతి దేవతా సమారాధన" అన్నారు కరుణశ్రీ. "గుప్పెడు ఉప్పును పోగేసి, నిప్పుల ఉప్పెనగా చేసి –దండి యాత్రనే దండ యాత్ర చేసిన అధినేత,జగజ్జేత "అన్నాడు సిరివెన్నెల. "He was un dying inspiration –being the father of our nation –let us preserve what he gave –be wise and be brave ".సత్యాగ్రహమ్మునే సాధనమ్ముగ జేసి –సామ్రాజ్యవాదుల "ను సాగనంపాడు గాంధీ మహాత్ముడు.

### 4 గాంధీజీ –సహాయ నిరాకరణ ఉద్యమం

భారతదేశం లో బ్రిటిష్ ప్రభుత్వానికి తీవ్ర వ్యతిరేకంగా జరిగిన ఉద్యమమే సహాయ నిరాకరణ ఉద్యమం. జలియన్ వాలాబాగ్ సామూహిక హత్యల తర్వాత మహాత్మా గాంధీజీ దీన్ని అహింసాత్మకంగా చేబట్టాడు. దీని ముఖ్యోద్దేశం భారత్ లో ఇక బ్రిటిష్ పాలన ఏమాత్రమూ కొనసాగరాదని. ముందుగా బ్రిటష్ వారి వస్తువులు కొనరాదని, స్థానిక చేతి వృత్తుల వారి వస్తువులుకొని ప్రోత్సహించాలని ఉద్యమం ప్రారంభమైంది.కల్లు దుకాణాల వద్ద పికెటింగ్ కూడా దీనికి తోడైంది. 1920 వేసవి లో దేశ వ్యాప్తంగా లక్షలాది పురుషులు,మొదటిసారిగా స్త్రీలు స్వచ్చందంగా అహింసాత్మకం గా మహాత్ముని నాయకత్వం లో నడిచారు. ఈ ఉద్యమం ఆయన వ్యూహ రచనకు, ప్రభావానికి, నేర్పు, క్రమశిక్షణకు మారు పేరుగా నిలిచి భారత దేశ దాస్య విముక్తికి, స్వతంత్రేచ్చ కు, మొత్తం దేశం లోని చైతన్యానికి అద్దం పట్టింది. అమెరికా మేధావి హెన్రి డేవిడ్ థోరో 1846 లో చేబట్టిన సహాయ నిరాకరణ విధానం ఆయన నిరాడంబర జీవితం గాంధీ, టాల్ స్టాయ్, లపై గొప్ప ప్రభావం, ప్రేరణ కలిగించాయి.

సహాయ నిరాకరణ ఉద్యమానికి బ్రిటిష్ ప్రభుత్వ అణచివేత విధానం, తోడైంది., గాంధీకి తెల్ల ప్రభుత్వం పై ఉన్న నమ్మకం నశించి, పరాయి శని విరగడ కావాల్సిందే నని ఇక వారికి సహాయపడటం ఘోర తప్పిదం, పాపం అవుతుందని ప్రకటించాడు. ఖిలాఫత్ ఉద్యమంలో ఉన్న భారతీయ ముస్లిం లుకూడా సహాయ నిరాకరణ ఉద్యమాన్ని సమర్ధించి పాల్గొన్నారు. అందరిదీ ఒకే ఆకాంక్ష. ఏడాది లోపు స్వరాజ్యం సాధించాలని. దీనికి తోడుబ్రిటిష్ వారి రాజ్యాంగ పౌరపాలన విధానంపై గాంధీకి నమ్మకం పోయి, బ్రిటిష్ ప్రభుత్వానికి సహాయ నిరాకరణ చేయాలని తీర్మానించాడు. భారత దేశ ఆర్ధిక పరిస్థితి మరీ క్షీణించి పోవటం, మన డబ్బు అంతా బ్రిటన్ కు ప్రవహించటం, స్వదేశీ వస్తువుల అమ్మకం తగ్గి బ్రిటన్ ఫ్యాక్టరీ వస్తువుల అమ్మకం విపరీతంగా పెరగటం, బ్రిటిష్ సైన్యంతో కలిసి యుద్ధం చేసి చనిపోయిన భారతీయ సైన్యం పై ప్రబుత్వనిర్లక్ష్యం కూడా కారణాలయ్యాయి..

గాంధీజీ గురువు గోపాలకృష్ణ గోఖలే స్వాతంత్ర్యం కోసం ఉద్యమించి, అరెస్ట్ అయి, మాండలే జైలులో ఉన్నాడు. కాలనీ ఆర్ధిక శక్తిని, బ్రిటిష్ పాలననుఎదిరించి స్వతంత్ర భారత దేశ ఆవిర్భాగానికి ఒత్తిడి ఎక్కువైంది. ఉద్యమ బాధ్యత గాంధీ తీసుకున్నాడు. రౌలట్ చట్ట వ్యతిరేక ఉద్యమం దేశ వ్యాప్తం గా చేయమని బాపూ పిలుపునిచ్చాడు. అన్ని ప్రభుత్వ ఆఫీసులు, ఫాక్టరీలు మూసెయ్యాలని, బ్రిటిష్ స్కూళ్ళు కాలేజీలు నుంచి భారతీయ విద్యార్ధులు,ఉపాధ్యాయులు పోలీస్, మిలిటరీ, సివిల్ వ్యవస్థలను బహిష్కరించి బయటికి రావాలని లాయర్లు కోర్టులను బహిష్కరించాలని బ్రిటిష్ వారిచ్చిన బిరుదులు త్యజించాలని పిలుపు నిచ్చాడు. తిలక్, బిపిన్ చంద్రపాల్ జిన్నా, అనిబిసెంట్ మొదలైన ముసలి నాయకులు దీన్ని వ్యతిరేకించారు. కాని గాంధీపై అపారనమ్మకమున్న యువత అంతా గాంధీకి వెన్ను దన్నుగా నిలిచి ఆయన చెప్పినట్లే చేశారు. కాంగ్రెస్ బాపూను పూర్తిగా సమర్ధించింది. మౌలానా ఆజాద్ షౌకతాలి సోదరులు అండగా నిలిచారు. గుజరాత్ లోని ఖేడియా లో ప్రజలు పూర్తి అవగాహన లేదని తెలుసుకోకుండా సహాయ నిరాకరణ ఉద్యమం లో పాల్గొనమని పిలుపునిచ్చినందుకు తన తప్పు తెలుసుకొని దాన్ని "హిమాలయన్ మిస్టేక్ "అని ఒప్పుకున్న గొప్పమనసు బాపూజీ ది.

ఇంతటి మహోద్యమం అపూర్వ ఐక్యత చూసి బ్రిటిష్ ప్రభుత్వం బిత్తర పోయింది.. 1922 ఫిబ్రవరి 5 న ఉత్తరప్రదేశ్ లోని" చౌరీ చౌరా"గ్రామం లో ప్రజలు కల్లు దుకాణం వద్ద పికెటింగ్ చేస్తుండగా, పోలీసులు వాలంటీర్ల పై దురుసుగా ప్రవర్తిస్తే, ప్రజలురెచ్చిపోయి పోలీస్ స్టేషన్ పై దాడి చేసి 22 మంది పోలీసులు లోపలుండగా స్టేషన్ కు నిప్పుపెట్టారు. విషయం తెలిసిన బాపు, అంతవరకు అత్యంత క్రమశిక్షణతో, అహింసాయుతంగా దేశమంతా సాగిన ఉద్యమం ఇలా హింసాత్మకంగా మారటం తో తీవ్రం గా కలత చెంది, హింస వద్దని ప్రజలకు హితవు పలికి, మూడు వారాల ఉపవాస దీక్ష చేబట్టి, సహాయ నిరాకరణ ఉద్యమాన్ని విరమించాడు. ఉద్యమాన్ని అణచటానికి 1922 మార్చి 18 న గాంధీని అరెస్ట్ చేసి ఆరేళ్ళు జైలు శిక్ష విధించారు, మిగిలిన నాయకులనూ అరెస్ట్ చేశారు.,,

మోతీలాల్ చిత్తరంజన్ దాస్ మొదలైనవారు స్వరాజ్య పార్టీ పెట్టి గాంధీనాయకత్వాన్ని పూర్తిగా వ్యతిరేకించారు. ఎక్కడో చిన్నగ్రామంలో జరిగిన సంఘటనకి గాంధీజీ సహాయనిరాకరణ ఉద్యమం ఆపెయ్యటం మంచిదికాదని జాతీయవాదులు అభిప్రాయ పడ్డారు.

అమరవీరుడు భగత్ సింగ్ ఈ ఉద్యమం లో పాల్గొన్నాడు దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు చీరాల-పేరాలఉద్యమం దీని ఫలితమే "సత్యంబు, శాంత్య హింసలకు స్వాగత మిచ్చే ఆయన బ్రతుకు మహాప్రయాగ-అతడొక ధర్మ దేవాలయంబు –విచిత్ర విశ్వ విద్యాలయంబు, హిమాలయంబు "అన్న కరుణశ్రీ మాటలు అక్షర సత్యాలు. "గాంధి యుగమున బుట్టితి, గాంధి నడుపు నుద్యమంబుల –నలగితి నోపినంత "అని పొంగిపోయారు తెనుగు లెంక తుమ్మల. Truth and non-violence is what he taught –Same were the principles he fought ".మహాత్ముని 150 జయంతికి ఆయన మార్గాన్ని అనుసరించటమే సరైన నివాళి

## 8 దండీ మార్చ్అనే ఉప్పు సత్యాగ్రహం

భారత స్వాతంత్ర్య పోరాటం లో కొన్ని సంఘటనలు నాటకీయంగా ఉత్తేజపూరితంగా చారిత్రాత్మకంగా నిలిచిపోయాయి. అందులో ఒకటి మహాత్మా గాంధీ చేబట్టిన దండి మార్చ్. బ్రిటిష్ ప్రభుత్వం ఉప్పు పై వేసిన పన్ను కు నిరసన తెలియ జేయటమే అసలు ముఖ్య కారణం. కాని ఇంతకంటే తీవ్రమైన లోతైన ప్రభావశీలమైన ప్రాముఖ్యత పొందింది. ఈమార్చ్ స్వాతంత్ర్య పోరాటాగ్నికి పవిత్ర సమిధగా మారింది. ఇదే స్వాతంత్ర్య సత్యాగ్రహానికి శాసనోల్లంఘన కీలలను రాజేసింది.



1929 డిసెంబర్ లో అఖిలభారత కాంగ్రెస్ కమిటీ "సంపూర్ణ స్వరాజ్యం " అనేదే దేశప్రజల నినాదంగాప్రకటించి 1930 జనవరి 26 న భారత దేశమంతటా స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలు ఘనంగా అశేష జన సమూహాలతో నిర్వహించింది. ఈ నేపధ్యం లో గాంధీజీ కాంగ్రెస్ నాయకుడిగా మొదటి దశ శాసనోల్లంఘనం అనే ఉప్పు సత్యాగ్రహం ప్రారంభించాడు.

సత్యాగ్రహం గురించి వైస్ రాయ్ కి 1930 మార్చి 2న నోటీస్ పంపిస్తూ అందులో బ్రిటిష్ ప్రభుత్వ అణచి వేత విధానాలవల్ల భారత దేశం శిధిలమై పోయిందని, పేదప్రజల జీవనానికి అత్యవసరమైన ఉప్పు పై కూడా పన్నులు వేసి జీవన విధానాన్ని దెబ్బ తీసినందుకు నిరసనగా ఉప్పు పన్నుకు ప్రతీకాత్మక నిరసన తెలియ జేస్తున్నానని, భారత స్వాతంత్ర్యం యెంత ముఖ్యమో తెలియ జేయటానికి ఇది నాంది అని తెలియ జేశాడు. తర్వాత వైస్ రాయ్ ఇచ్చిన పెడసరి సమాధానికి "నేను మోకాళ్లమీద నిలబడి అన్నం పెట్టమంటే రాళ్ళు వేశారు"అని దులిపేశాడు.

తన ఉద్యమానికి గుజరాత్ లోని సముద్ర తీర గ్రామం అయిన దండి సరైన స్థలం అని గాంధి నిర్ణయించాడు. అహమ్మదాబాద్ లోని ఆశ్రమం నుంచి 241 మైళ్ళదూరం అంటే సుమారు 360 కిలోమీటర్లలో ఉన్న దండి కి కొద్దిమంది ముఖ్య అనుచరులతోకలిసి 1930 మార్చి 12న బయల్దేరి దండి మార్చ్ ని నడిచి వెళ్లాలని నిశ్చయించాడు. అగ్నికి ఆజ్యం పోసినట్లు మార్చి మొదటి వారం లో చాలా ఉద్రిక్తమైన కాలం గడిచింది. సర్దార్ వల్లభ భాయ్ పటేల్ "బోర్సాద్" లో



ప్రజలను సమాయత్తం చేసి, గాంధీకి బాసటగా సత్యాగ్రహులను పంపటానికి జిల్లా అంతటా ఘన స్వాగతం పలకటానికి ఏర్పాట్లు చేయటానికి వెళ్ళాడు. కాని పటేల్ ను మార్చి 7 న బ్రిటిష్ ప్రభుత్వం" రాస్ "లో అరెస్ట్ చేసింది. దీనితో ఆగ్రహజ్వాల మరింత రాజుకొన్నది. అనుకోకుండా మార్చి 9న సబర్మతి నది ఇసుకపై లో 75 వేలమంది ప్రజలు స్వచ్చందంగా సమావేశమై గాంధీజీ సమక్షం లో తామంతా "సర్దార్ పటేల్ బాటలోనే నడిచి, భారత స్వాతంత్ర్యం సాధించేదాకా విశ్రమించమని, రాక్షస తెల్ల దొరల ప్రభుత్వానికి శాంతి లేకుండా చేస్తాం" అని శపథం లాంటి ఒక తీర్మానం ఆమోదించారు. దీని ప్రతిధ్వని దేశమంతటా మారు మ్రోగి ఊపు తెచ్చి ఉధ్రుత లూగించింది. దేశం లోనేకాదు విదేశాలనుండి కూడా గొప్ప ప్రోత్సాహం లభించింది.

ఈ స్పందన గాంధీకి మరింత ఉత్సాహం కలిగించి దేశ విదేశీ విలేఖరులకు ప్రముఖులకు ఇంటర్ వ్యూలు ఇస్తూ తన పోరాట స్ఫూర్తి వివరిస్తూ ప్రార్ధన సమావేశాలలో ప్రజలను ఉత్తేజితులను చేస్తూ స్వాతంత్ర్య దీక్షను నిలబెట్టాడు. ఆశ్రమంలో సందర్శకులకు ప్రార్ధన సమావేశాలకు ఉన్న పరిమితి తీసేసి ఎక్కువమంది కి అవకాశం కల్పించారు. ఈకాలం లో గాంధీకి మద్దతు నిస్తూ వేలాది మెసేజ్ లు వచ్చాయి. రివల్యూషనరి పార్టీ గాంధీని "కామ్రేడ్ గాంధి "అని సంబోధించి, ఆయన అహింసా ఉద్యమానికి మూడేళ్ళు గడువు ఇస్తున్నట్లు ప్రకటించింది. జర్మనీ నుంచి ఒక డాక్టర్ "మీ సేవలకు అభినందనగా ఒక వినయపూర్వక మనిషి ఉదయం సాయంత్రం మీ విజయం కాంక్షిస్తూ ప్రార్ధన చేస్తున్నాడు "అని రాశాడు. న్యూయార్క్ నుంచి రివరెండ్ హోమ్స్"గాడ్ గార్డ్ యు "అనే మెసేజ్ పంపాడు. ఇవన్నీ గాంధీకి మద్దతుగా ఉన్నప్పటికీ, గాంధీజీ ఈ పాప్యులారిటి చూసి అసూయ చెంది బ్రిటిష్ ప్రభుత్వం ఆయన్ను అరెస్ట్ చేసి ఇబ్బంది పాలు చేస్తుందేమోనని భారత ప్రజలు సందేహించారు.

దండి మార్చి కి ముందురోజు మార్చి 11సాయంత్రం 10వేలమంది హాజరైన ప్రార్ధన సమావేశం లో గాంధీజీ "బహుశా ఇదే నా చివరి ప్రసంగం కావచ్చు. ఒకవేళ రేపు ఉదయం దండి మార్చ్ కి ప్రభుత్వం నన్ను అనుంతించి నాకూడా పవిత్ర శబర్మతి నదీ తీరం లో ఇదే నా చివరి ఉపన్యాసం కావచ్చు. బహుశా నా జీవితం లోకూడా ఇవే చివరి మాటలుకూడా కావచ్చు "అని ప్రసంగం ముగించాడు.

అనుకొన్న రోజు మార్చి 12ఉదయం 6-30కి దండి మార్చ్ ప్రారంభించాడు శబర్మతి ఆశ్రమమం నుంచి మహాత్ముడు. దీనిని ఆశ్రమ జర్నలిస్ట్ "గౌతమ బుద్ధ దేవుని మహాభి నిష్క్రమణ " గా అభి వర్ణించాడు. బక్కపలచటి మనిషి చేతికర్ర ఊతంగా 61ఏళ్ళ వయసులో 78మంది సత్యాగ్రహులతో మార్చ్ ప్రారంభించాడు. ఈ సత్యాగ్రహులలో ఆంధ్రా బెంగాల్ బీహార్ బాంబే గుజరాత్ కర్నాటక కేరళ కచ్ మహారాష్ట్ర పంజాబ్ రాజపుటానా సింద్ తమిళ్ నాడు, ఉత్తరప్రదేశ్ ఉత్కల్ నేపాల్ వారున్నారు. హిందువులతోపాటు ఇద్దరుముస్లిం లు ఒక క్రిస్టియన్ ఇద్దరు హరిజనులు కూడా ఉన్నారు. అంటే మొత్తం భారత దేశమంతా రిప్రజెంట్ అయింది. సత్యాగ్రహులవెంట వేలాది ప్రజలుస్త్రీ పురుషులు నడిచారు. దారి అంతా స్వాగత తోరణాలతోశోభాయమానంగా అలంకరించారు.

బయలు దేరే ముందు మహాత్ముడు మాట్లాడుతూ "నా యాత్ర అమర నాథ్ బదరీ కేదార నాథ యత్రలా అనిపిస్తోంది. ఇది నా జీవితం లో నిజంగా పవిత్ర తీర్ధయాత్రయే"అన్నాడు. మోతీలాల్ నెహ్రు "శ్రీరాముడు లంకకు చేసిన యాత్ర లా చారిత్రాత్మకం గాంధీజీ దండి యాత్ర "అన్నాడు. డా ప్రఫుల్ల చంద్ర రే (పిసి రే )' 'మోజెస్ నాయకత్వం లో ఇస్రలైట్లు చేసిన దేశత్యాగం "లా ఉందన్నాడు. మహాత్ముడు ఇంతకూ ముందు ఎన్నో ప్రదేశాలు కాలినడకన నడిచి వెళ్ళాడు. కాని ఈ యాత్ర అంతా దుమ్ము ధూళీ సరైన నడకదారి లేనిది. రాళ్ళు రప్పలతో ఇబ్బందికరమైనది. అయినా మొక్కవోని దీక్షతో స్వాతంత్ర్యజ్వాల హృదయం లో జ్వలిస్తుండగా కోట్లాది భారతీయులా ఆకాంక్ష సంపూర్ణ స్వరాజ్యం కోసం నడిచిన చారిత్రాత్మకమైన యాత్ర దండి యాత్ర. అహ్మదాబాద్ నుండి 13మైళ్ళ దూరం లో ఉన్న "అస్లాలి"లో మొదటి రోజు యాత్ర పూర్తవగానే గాంధీజీ ప్రజలనుద్దేశించి ప్రసంగిస్తూ "ప్రభుత్వం ఉప్పు పన్ను ఎత్తి వేసేదాకా, భారత దేశానికిస్వాతంత్ర్యం వచ్చేదాకా నేను మళ్ళీ శబర్మతి ఆశ్రమం లోకి అడుగు పెట్టను "అని హర్ష ధ్వానాలమధ్య తన మనో నిశ్చయాన్ని మళ్ళీ ప్రకటించాడు.

**వరుసలో 50 శ్రీ యెర్నేని సుబ్రహ్మణ్యం, వయస్సు 25, ఆంధ్రప్రదేశ్ నుంచి ప్రాతినిధ్యం వహించారు.**

శనివారము

**1929-వ సం॥ ఏప్రిల్ నెల 13-వ తేది**

# మహాత్ముని ఆంధ్రదేశ సంచారము

---

## దేశోద్ధారకుని స్వగ్రామములో స్వగృహమందు మకాము

బెజవాడ, ఏప్రిల్ 12:—మహాత్మా గాంధిగారు బెజవాడనుండి బయలుదేరి వుయ్యూరునకు బోవుచూ పోరంకి, యీడుపుగల్లు, పునాదిపాడు, గొడవర్రు, నెప్పల్లి, ఆకునూరు గ్రామములను సందర్శించిరి. పోరంకిలో రు 40 లును, ఈడుపుగల్లులో రు 887 లును, పునాదిపాడులో రు 630 లును, గొడవర్రులో రు 440 లును, నెప్పల్లిలో రు 485 లును, ఆకునూరులో రు 243 లును సమర్పింపబడినవి. లాలాజినిధికై ఆకునూరులో ప్రత్యేకించి రు 100 లు సమర్పింపబడెను. ఈ గ్రామములన్నిటియందును విదేశ వస్త్ర బహిష్కారణమును గూర్చియు, ఖద్దరువస్త్రధారణమును గూర్చియు, అస్పృశ్యతానివారణమునుగూర్చియు, సర్వమానవసోదరత్వమునుగూర్చియు మహాత్ము డుపన్యసించెను.

వుయ్యూరునకు గతరాత్రి 3-30 గంటలకు మహాత్మాజీ చేరెను. ట్రావెలర్సుబంగళాలో మకాముచేసిరి.

ప్రాతఃకాలముననే లేచి కొమ్మమూరు వెళ్లిరి. అచట రు 400 లు వసూలయ్యెను. పెద్ద బహిరంగసభయందు మహాత్ము డుపన్యసించెను. వుయ్యూరుసభయందు రు 695 లు వసూలయ్యెను.

అంతట కురుమద్దాలి, పామర్రు, వీరంకి గ్రామములకు వెళ్లిరి. మొత్తము సుమారు 4500 వసూలయ్యెను. మహాత్ములు కపిలేశ్వరపురములో మకాముచేసి యున్నారు.

నేటిరాత్రి దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుగారి స్వగ్రామమగు ఎలకుర్రునకువెళ్లి విశ్రమించెదరు. రేపలో పసుమర్రు గ్రామమును సందర్శించెదరు. (ఫ్రీ ప్రెసు.)

## 10 గాంధీ స్మృతి శాంతి యాత్ర ఉయ్యూరు విశేషాలు

ఇవాళ గాంధీ స్మృతి శాంతి యాత్ర బాగా జరిగింది. వందలాది విద్యార్ధులు స్వచ్చంద సంస్థలు అన్ని పార్టీల వాళ్ళు అన్ని కులాల వారు, వర్గాల వారు పాల్గొన్నారు రాజేంద్ర ప్రసాద్ నాయ కత్వం లో బాగా జరిగింది. వీరమ్మ గుడినుంచి యాత్ర బయల్దేరి లక్ష్మి టాకీస్ దగ్గర గాంధీ బొమ్మను చేరి ఆయనకు పూలమాలలు వేసి, బంగాళా లో మీటింగ్ జరిపాము

నేను మాట్లాడుతూ " గాంధీ 1921 లో మహాత్ముడు కస్తుర్బా తో, పట్టాభి తో విజయవాడ నుంచి బందరు వెళ్తూ ఏప్రిల్ ఐదవ తేది న వుయ్యూరు వచ్చారు. వెయ్యి మంది పురజనులు బంగాళా దగ్గర ఆయనకు స్వాగతం పలికారు. ఆయన ఆగి పది నిముషాలు మాట్లాడారు ప్రతి ఇంట రాట్నం వుండాలని, స్వదేశీ ఉద్యమాన్ని బలపరచమని ప్రజల్ని కోరారు. అప్పటికి అప్పుడు విరాళంగా స్వచ్చందం ఒక వంద రూపాయలు వసూలు చేసారు గాంధిగారు. అప్పుడు లోకమాన్య బాల గంగాధర తిలక్ ఇచ్చిన స్వరాజ్యం నా జన్మహక్కు నినాదానికి ధన సహాయం కోసం దేశం లో తిరిగారు. ఈ వంద రూపాయల నిధిని స్వరాజ్య నిధికి జమ చేసారు. ఇక్కడి నుంచి పామర్రు మీదుగా బందరు వెళ్లారు. అక్కడ పుర సన్మానం జరిగింది.

రెండవసారి గాంధీ ఖద్దరు నిధి కోసం ఆంధ్ర వచ్చారు 1929 ఏప్రిల్ లో. హైదరాబాద్ లో బయల్దేరి జగ్గయ్య పేట, నందిగామ నూజివీడు మీదుగా విజయవాడ 11వ తేదిన వచ్చి అక్కడినుండి రాత్రి ఎనిమిది గంటలకు వుయ్యూరు రహదారి బంగాళా చేరారు. ఆ రోజు రాత్రి బంగాళా లోనే బస, నిద్ర. ఆయనతో వచ్చిన వారందరికి మా ఇంటికి ఎదురుగా వుండే సూరి శోభనాచలపతి గారు వాళ్ళ దొడ్డిలో వంట చేయించి తరతమ భేదం లేకుండా ఒకే పంక్తి లో భోజనాలు పెట్టి అందరికి ఆశ్చర్యం కలిగించారని మా అమ్మ గారు చెప్పారు. గాంధీ గారు ఆయన విశాల దృక్పధాన్ని మెచ్చారట. మర్నాడు అంటే ఏప్రిల్ 12 వ తేది ఉదయం ఆరు గంటలకే కుమ్మమూరు వెళ్లారట. అక్కడ మైనేని గోపాల కృష్ణ గారి తండ్రి గారు మిగిలిన పెద్దలు అపూర్వ స్వాగతం చెప్పి ఖద్దరు నిధికి గాంధీ గారికి 400 రూపాయలు సమర్పించారట. కొందరు నగలు కూడా సమర్పించారట అక్కడ బయల్దేరి వుయ్యురుకు ఉదయం ఏడున్నరకు వచ్చారు గాంధీ వెంట పట్టాభి సీతా రామయ్య గారు అయ్యదేవర కాళేశ్వర రావు గారు వున్నారు. వుయ్యూరు సీబీఎం స్కూల్ లో గాంధీ గారి సభ జరిగింది వుయ్యుర్ పంచాయితీ బోర్డు ఇతర మిత్రపుర ప్రముఖులు ఘనం గా సత్కరించారు. మా నాన్నగారు గబ్బిట మృత్యుంజయ శాస్త్రి గారు సన్మాన పత్రం రాసి చదివి సమర్పించారు. అప్పుడు ఆయన సిబియం స్కూల్ లో తెలుగు పండితులు గాయత్రి అనంత రామయ్య గారు మొదలయిన పుర ప్రముఖులు పాల్గొన్నారు. ఖద్దరు నిధికి 667 రూపాయలు ఒక బంగారు ఉంగరం కొన్ని నిజాం నాణాలు గాంధీజీకి సమర్పించారు. గాంధీని విశ్వశాంతి ప్రదాతగా సుహృద్భావ సంపన్నుని గా వర్ణించారు సన్మాన పత్రం లో అంతే కాదు గాంధీ అహింస సిద్ధాంతం వల్ల ప్రపంచం లో భారత దేశం అత్యున్నత స్థితికి వస్తుందని ఆశాభావం వ్యక్తం చేసారు మహాత్ముడు చాల సంతోషించి గొప్ప సందేశం ఇచ్చారు. అందరు ఖద్దరు ధరించాలి అన్నారు. బాల్యవివాహాలు చేయరాదని జాతీయ పునర్నిర్మాణానికి సంఘ సంస్కరణ అవసరం అని ఉద్బోధించారు. పంజాబు రాష్ట్రం తప్ప మిగిలిన రాష్ట్రాలలో ఆంధ్ర దేశం ఖద్దరు ఉత్పత్తిలో ముందు వుంది అని శ్లాఘించారు".

మహాత్ముడి పాదధూళితో పునీతమై ఆయన బస తో ధన్యమైన ఈ రహదారి బంగాళా ను ఇక నుంచి "మహాత్మా గాంధీ రహ దారి బంగాళా" అని పిలవాలని దానికి తగ్గట్టు పంచాయితీ, మండల పరిషత్, MLC లు స్పందించి వెంటనే తీర్మానం చేసి ప్రభుత్వానికి పంపాలని చెప్పాను వేలాది ప్రజలు నా ప్రతిపాదనకు మిన్ను ముట్టే హర్ష ధ్వానాలు చేసారు. ఆనందం తో వెంటనే వుయ్యురు సర్పంచ్ శ్రీ అంగడాల వెంకటేశ్వర రావు, మండలాధ్యక్షురాలు శ్రీమతి నోర్నల సంతోష కుమారి రేపే తీర్మానాలు రాసి ఆమోదిమ్పజేసి ప్రభుత్వానికి పంపుతమన్నారు. రాజేంద్ర ప్రసాద్ తన వంతు కృషి చేసి ప్రభుత్వం నుంచి అనుమతి తెప్పిస్తానని హర్ష ధ్వానాల మధ్య ప్రకటించారు చివరిగా నేను గాంధీ గారి సందర్శనం చూపిన ప్రభావాన్ని గురించి చెప్పాను కుమ్మమూరు లో మైనేని గోపాల కృష్ణ గారి అక్క గారు అన్న పూర్ణమ్మ గారు గాంధీ రాక తో పులకించి ఆయన సందేశానికి ఆమోదం గా ఆరోజు నుంచి ఖద్దరు వస్త్రాలు కట్టటం ప్రారంభించారని ఇప్పటికి 85 ఏళ్ళ వయసు దాటినా ఖద్దరు కట్టుతున్నారని అనగానే జనం చాప్పట్లతోన్ ఆమెను అభినందించారు. అంతే కాదు గాంధీ గారి ఇంకో ఆదర్శం కులాంతర వివాహాన్ని ఆమె ఆచరించి మార్గదర్శి గా వున్నారని చెప్పాను ఆమె కమ్మ వారికులంలో పుట్టారు ఆమెతో పాటు గుంటూరు మెడికల్ కాలేజీ లో చదువుతున్న బ్రాహ్మల కులానికి చెందిన రాచకొండ నరసింహ శర్మ గారిని ప్రేమించి, పెద్దల అంగీకారం తో వివాహం చేసుకొని చరితార్దు లయారు. ఆదర్శం మాటల్లో కాదు చేతల్లో చూపిన విదుషీమణి శ్రీమతి అన్నపూర్ణమ్మ గారు ఇప్పటికీ ఆ వృద్ధ దంపతులు విశాఖ పట్నం లో ఎంతో అన్యోన్యం గా పిల్ల పాపలతో మనుమలు, మనుమా రాళ్ళతో హాయిగా వున్నారని చెప్పాను. మళ్ళీ ఆనంద తరంగాలు వెలువడినాయి. తర్వాత రాజేంద్రుని కృషి దీక్ష ఈ కార్య క్రమన్నిన్ని విజయ వంతం చేసాయని శ్లాఘించాను అందరి సహకారం తోడ్పాటు వుంటే ఏదైనా దిగ్విజయం అవుతుందని చెప్పాను "ఆంధ్ర ప్రదేశ్ లో గాంధీజీ "అనే పుస్తకాన్ని స్వతంత్రసమర యోధుడు, విద్వాంసుడు విశ్వనాధ సత్య నారాయణ గారి తో జంట కవిత్వం చెప్పిన కృష్ణా జిల్లా కొడాలి వాస్తవ్యులు కొడాలి ఆంజనేయులు గారు రాసారని అందరు చదివి తెలుసుకో దగినవి అందులో చాల వున్నాయని తెలియ జేశాను చివరిగా కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి గారు "భారత భాగ్య విధాత "అన్న పేరుతో రాసిన రెండు పద్యాలూ చదివి మహాత్మునికి నివాళు లర్పించాను ఈ చారిత్రాత్మక ఘట్టం లో పాలు పంచుకున్నందుకు ఆనందం గా గర్వం గా వుంది.

'యుగ పురుషుద్డవంచు, పురుషోత్తమ మూర్తి వటంచు,మూర్తిమ

జ్జగాదనరాగ శాంతిమయ సాత్విక శక్తి వటంచు, పేనవేల్
మొగముల ప్రస్తుతించెను, ప్రమోదముతో, జగమెల్ల నిన్ను, ఏ
మగుదురు నీకు తొల్లి మహమ్మదు, క్రీస్తును, బుద్ధ దేవుడున్ "
"నిండు మనస్వి, విశ్రుత వినీత పునీత యశస్వి

సాత్వికాఖండ తపస్వి —-సత్య సహకారము చిటారు కొమ్మ పై పండిన పండు,

బ్రహ్మ రుషి భారత భాగ్య విధాత గాంధీజీ "

## 10 నా వార్ధా- సేవాగ్రాం సందర్శన యాత్ర 1988 లో -చంద్రభాల్ త్రిపాఠి

ఆధారం –శ్రీమైనేనిగోపాలకృష్ణ గారు ఈ ఉదయం పంపిన శ్రీ చంద్రభాల్ త్రిపాఠీ రచన "A Pigrimage to Wardha –Sewagram in 19 88".

'2018 సెప్టెంబర్ 28 వార్ధా లోని గాంధి పీస్ ఫౌండేషన్ సంస్థ అధ్యక్షుడు శ్రీ కుమార్ ప్రశాంత్ నాతో చేసిన టెలిఫోన్ సంభాషణలో నా మొదటి, చివరి 1988 లో వార్ధా సేవాగ్రామసందర్శన యాత్ర జ్ఞాపకాలు సుళ్ళు తిరిగాయి. మొదట నేను పౌనార్ ఆశ్రమ వెళ్లి శ్రీ వినోబాభావే సోదరుని చూశాను. అక్కడనుంచి వార్ధా వెళ్లి సర్క్యూట్ హౌస్ లో బస చేశాను. అప్పటికి నేను షెడ్యూల్డ్ కాస్ట్స్ అండ్ ట్రైబ్స్ డిప్యూటీ కమిషనర్ గా ఉన్నాను. జులై 1988 లో రిటైరయ్యాను. అక్కడ 1943-46 మధ్యకాలం లో బెనారస్ నుండి ప్రచురితమౌతున్న "ఆజ్ "పత్రిక లో ప్రచురితమైన వ్యాసాలను నా యవ్వనం లో చాలా ఆసక్తిగా చదివేవాడిని. వీటిని నాకు పంపించే శ్రీ ఉమాశంకర శుక్లాను ఇప్పుడు కలిసి మాట్లాడాను. ఆయన దేశం లో లబ్ధ ప్రతిష్టు డైన జర్నలిస్ట్. ఆయన రాయిటర్స్ పత్రికలోనూ పనిచేసేవారు. లూయీ ఫిషర్ సేవాగ్రాం సందర్శించి బాపు పై పుస్తకం రాసినప్పుడు ఆయన అక్కడే ఉన్నారు. 45 ఏళ్ళ క్రితం నాటి తన రచనలు నేను ఆసక్తిగా చదవటం ఆయన అభినందించారు. మా తండ్రి పండిట్ చంద్ర బాలి త్రిపాఠి ఉత్తర ప్రదేశ్ లోని బస్తీ లో ఆజ్ పత్రిక, అమృత బజార్ పత్రికలకు కరేస్పాం డెంట్ గా ఉండేవారు. అమృత బజార్ పత్రిక కలకత్తా నుండి మారి, అలహాబాద్ నుండి అచ్చు అయ్యేది. అప్పుడు ప్రసిద్ధ సంపాదకుడు తుషార్ కాంతి ఘోష్ దాని సంపాదకుడు. శుక్లాగారు నన్ను మగన్ వాడికి తీసుకు వెళ్లి, ప్రసిద్ధ ఆర్ధికవేత్త, ప్లానింగ్ కమిషన్ మెంబర్ స్వర్గీయ శ్రీ నారాయణ అగర్వాల్ గారి అర్ధాంగి శ్రీమతి మదాలసా దేవి గారిని పరిచయం చేశారు. ఈమె గాంధీజీ కి అత్యంత సన్నిహితులు, భారత జాతీయ కాంగ్రెస్ కు చాలాకాలం కోశాధికారి గా ఉన్న శ్రీ జమ్నాలాల్ బజాజ్ కుమార్తె. నేను వచ్చే ఏడాదిలో రిటైరయ్యాక తమ సంస్థలలో ఏదో ఒకదానిలో పనిచేయమని ఆమె కోరారు.

శుక్లాగారు నన్ను సేవాగ్రాం తీసుకు వెళ్ళారు. అక్కడొక రోజంతా గడిపాను. అక్కడ అత్యల్ప వేతనం తో పనిచేసే బాపు సహాయకుని చూశాను. మహాత్ముడు నివశించి, ప్రపంచప్రసిద్ధ నేతతో సంభాషించిన ఆశ్రమం,. దాని ప్రక్కనేకాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సమావేశమయే ప్రదేశం ఇప్పుడు ఖాళీ గా ఉండటం మర్చి పోలేని విషయం. ఈతరం వారు ఆ ఆశ్రమ వారసత్వాన్ని ఊహించుకోలేరు. కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యులందరినీ,నీటి ద్వారా మరుగు దొడ్లనుపాయిఖానాలను స్వయంగా కడిగి శుభ్రం చేయమని ఆదేశించేవారు. వీరిలో సర్దార్ పటేల్, రాజేంద్ర ప్రసాద్, మౌలానా ఆజాద్, పండిట్ జవహార్ లాల్ నెహ్రూ మొదలైన హేమాహేమీలైన జాతీయ నాయకులు కూడా ఆపని చేసేవారు. అక్కడ నేను ప్రముఖులైన ఇద్దరిని -స్వర్గీయ రామదాస్ గాంధీ భార్య ను, నా విద్యార్ధి జీవిత సహచరుడు రవీంద్ర వర్మలను చూశాను.

సేవాశ్రమం దగ్గరనుంచి శుక్లా నన్ను "ఆనందవనం" తీసుకు వెళ్ళారు. ఇక్కడ కూడా పూర్తిగా ఒక రోజున్నాను. దీని వ్యవస్థాపకులు శ్రీ బాబా ఆంప్టే.దీన్ని దర్శించేదాకా ఆయన అద్భుత కృషిని తెలుసుకోలేక పోయాను. సంపన్న ఉన్నత బ్రాహ్మణ కుటుంబం లో జన్మించిన బాబా ఆం ప్టే, ఇంగ్లాండ్ వెళ్లి, బార్ యెట్-లా చదువుతూ, రోజు టెన్నిస్ ఆడేవారు. స్వదేశానికి తిరిగి వచ్చి భార్యతో సహా కుష్టునివారణ, కుష్టు రోగుల సేవలో నిమగ్నమయ్యారు. అందుకని ఆనాటి బ్రాహ్మణులు ఆయనను సంఘ బహిష్కృతుని చేశారు. వెనకడుగు వేయకుండా పట్టణం వెలుపల, కుష్టు రోగులతోకలిసి జీవించారు. రాళ్ళు రప్పలు పొదలు దట్టంగా ఉన్న ఆప్రాంతాన్ని ఇతరుల, రోగుల సాయంతో ఎంతో శ్రమ చేసి, పచ్చదనంతో కనువిందు చేసే నివాసభూమిగా మార్చారు. ఆ తర్వాత ఇలాంటిదే మరొక గ్రామీణ సాంకేతిక అద్భుతాన్నిఅన్నాహజారే తన స్వగ్రామం రాలెగావ్ షిండే లో చేసి చూపారు. ఈ రెండిటిలో ఆనందవనం చాలా పెద్దది, విస్తృతమైనది. ఆ కాలం లో కుష్టు రోగుల పిల్లలకు బడులలో ప్రవేశం ఉండేదికాదు. బాబా ఆంప్టే దీనికి పరిష్కారంగా తానే వారికోసం ఒక స్కూల్ స్థాపించి, క్రమంగా పోస్ట్ గ్రాడ్యుయేట్ స్థాయికి పెంచి, కుష్టు రోగులకాలనీ వారికేకాక, ఈ విద్యా సంస్థలలో తమపిల్లలు చదువు కోవచ్చునని సాధారణ ప్రజలనుకూడా ఆహ్వానించారు. అందరి సహకారం తో సహకార జీవితం సాధించి, వర్క్ షాప్, చేతి తోతయారు చేసేకాగిత పరిశ్రమ, కోఆపరేటివ్ సొసైటీ, బహిరంగ సినిమా థియేటర్ వంటి ఎన్నో సంస్థలను నెలకొల్పి "ఆనందవనం"గా రూపొందించి తీర్చి దిద్దారు. ప్రఖ్యాత నాటకరచయిత శ్రీ పి.ఎల్.దేశ పాండే థియేటర్ ను ప్రారంభించి అందరికి అందుబాటులోకి తెచ్చారు. బాబా ఆంప్టే దంపతులు,, పూర్వపు, ఇప్పటి కుష్టు రగుల నిరంతర అవిశ్రాంత శ్రమ కృషి ఫలితంగా ఏర్పడినదే "ఆనందవనం ".హాట్స్ ఆఫ్ బాబాజీ. ఇంత గొప్ప ఆశ్రమం సందర్శించే అదృష్టం నాకు కలిగించిన శుక్లా గారికి ధన్యవాదాలు. ఆనందవనం లో బాబా గారి భార్య శ్రీమతి ఆంప్టే ను సందర్శించాను. నేను వెళ్ళిన సమయానికి బాబా దూరంగా అస్సాం లో"భారత్ జోడో యాత్ర "లో ఉన్నారు. కనుక వారిని దర్శించే భాగ్యంకలగలేదునాకు. వెన్నెముక సంబంధమైన ఎన్నో వ్యాధులతో బాధపడుతున్నా కూడా బాబా, తన వాన్ లో స్పెషల్ స్ట్రెచర్ పై పడుకొని దేశం లో ఎంతదూరమైనా ప్రయాణం చేస్తారు. అలాగే నర్మదానదీ తీరం లో జరిగిన" నర్మదా బచావో "ఆందోళనలో పాల్గొన్నారు. తన ఆరోగ్యం కంటే ప్రజా సమస్యయే ఆయనకు ముఖ్యం. మళ్ళీ ఆనందవనం కు తిరిగి రానేలేదు. ఇంతటి లెజెండరి వ్యక్తులు అరుదు. బాబా గారి కుమారులిద్దరూ డాక్టర్లు. వారినీ చూడలేక పోయాను. వీరిద్దరూ గంధ్ చిరోలీ లో పీడిత గిరిజనుల తో కలిసి పని చేస్తున్నారు. వీరిద్దరూ ప్రజలలో బాగా సుప్రసిద్ధులైనారు. ఈ గిరిజనులు రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల దృష్టిలో తీవ్రవాదులు, నేరస్తులు అవటం ఒక విచిత్ర విడ్డూరం -ఐరనీ. ఈ ప్రభుత్వాలు పారా మిలిటరీ దళాల త్యాగాలతో కోట్లాది రూపాయలు ఖర్చుపెట్టి ఈ గిరిజనులను, వీరిఉద్యమాన్ని అణచి వేయవచ్చునని భావిస్తోంది. నేనుమాత్రం గిరిజనులు చేసే,, ప్రభుత్వాలు చేబట్టే హింసకు మద్దతు తెలిపేవాడినికాను. "

# స్వర్ణ సిద్ధయోగి వాసిష్ఠ గణపతి ముని

అంకితం –నాకు అత్యంత ఆప్తులు, నేనంటే ఎంతో అభిమానం చూపించే వారు నేను రాసిన "ఆంధ్ర వేద శాస్త్ర విద్యా లంకారులు "పుస్తకానికి అడిగిన వెంటనే తమ స్పందనను ముందు మాటగా రాసి ఇచ్చిన వారు, గణపతి మునికి అత్యంత అభిమాని, గుంటూరు లక్ష్మీ కాంతం గారు రాసిన "నాయన "పుస్తకాన్ని నన్ను చదవమని నాకు ఆదరం తో పంపిన వారు. ఇటీవలే పరమ పదించినచిన అమృత హృదయులు "అమృత హస్తాలు "వంటి కదానికలెన్నో రాసిన వృద్ధ తేజో మూర్తి, నవ్వు మొగం తో పలకరించే సహృదయులు సాహితీ మూర్తి స్వర్గీయ బ్రహ్మశ్రీ గంధం వేంకా స్వామి శర్మ గారికి నాయన గారి పై నేను రాసిన ఈ వ్యాస పరంపరను స భక్తికం గా, సవినయం గా అంకిత మిస్తూ మిత్ర, గురు రుణాన్ని కొంత వరకు తీర్చు కొంటున్నాను

ఆయన చదవని శాస్త్రం లేదు, రాయని కావ్యం లేదు, దర్శించని క్షేత్రం లేదు, తపస్సు చేయని ప్రదేశం లేదు, చూపని మహిమలు లేవు,,ప్రసన్నం చేసుకొని దేవత లేదు అన్నిటికి మించి అస్పృస్యతనుయేవగించుకొన్న సదాచార సంపన్నుడు, భారత జాతీయ స్వాతంత్ర ఉద్యమం లో ముందు నిలిచినకర్మిష్టి, భగవాన్ రమణ మహర్షి చేతనే "నాయనా "అని పించుకొన్న అద్భుత మూర్తి. సాక్షాత్తు గణపతి అవతారమే శ్రీ వాసిష్ఠ గణ పతి ముని. వారి జీవితం అంతా పరోప కారమే. కారణ జన్ములాయన. ఆ పేరు స్మరిస్తే చాలు సర్వ పాప హారం.



**జననం –విద్యా భ్యాసం –వివాహం**

అసలు పేరు అయ్యల సోమయాజుల సూర్య గణపతి శాస్త్రి. తండ్రి నరసింహ శాస్త్రి-గణపతి ఉపాసకుడు. తల్లి నరసమ్మ సూర్య ఉపాసకురాలు. వీరి సంతానమే గణపతి శాస్త్రి. శ్రీ కాకుళం జిల్లా బొబ్బిలి దగ్గర "కలువ రాయి "గ్రామం లో 17-11-1878 న జన్మించారు. ఆరామద్రావిడ కుటుంబం. తండ్రికి గణపతి తన దగ్గరకు వస్తున్నట్లు కని పించింది. తల్లికి సూర్యుని శక్తి అయిన అగ్ని పూర్ణ స్వర్ణ కలశం కల లో కన్పించింది.. బిడ్డ జన్మించినప్పుడు అతన్ని ఒక దివ్య తేజస్సు ఆవరించి ఉన్నట్లు చూసింది. పదేళ్ళకే తల్లిని పోగొట్టు కొన్నదురదృష్ట వంతుడు గణ పతి. ఈయన దైవాంశ సంభూతుడు అని భావిస్తున్నారు తల్లీ, తండ్రీ. కాని మన వాడికి ఆరేళ్ళ దాకా మాటలే రాలేదు.. తండ్రి కాల్చిన లోహపు ముల్లును కొడుకు నాడిలో గుచ్చాడు. వెంటనే జలపాతం లాగా మాటలు జారి వచ్చాయి.

పిన తండ్రి ప్రకాశ శాస్త్రి దగ్గర కావ్యాలు చదివటమే కాక పంచాంగ గణనం లోను దిట్ట అని పించుకొన్నాడు. పన్నెండవ ఏట విశాలక్షమ్మ తో వివాహం జరిగింది. కాళిదాసు గారి మేఘ దూతం లాగా "భ్రున్గా దూతం "అనే రెండు సర్గల కావ్యం రాశాడు.. పద్దెనిమిదేళ్ళు వచ్చే సరికి వ్యాకరణ, అలంకార, సాహత్యా లనుకరతలా మలకం చేసుకొన్నాడు. పురాణ, ఇతి హాసాల లోతులు తరచాడు. పదమూడవ ఏటి నుండి తండ్రి వద్దే మేధా దక్షిణా మూర్తి, నారాయనాక్షరి, సౌరాస్టాక్షరి, చండి నవాక్షరి, మాతంగి, బాల, వారాహి, భువనేశ్వరి, మహాగణపతి, పంచ దశి, షోడశి అనే పన్నెండు మహా మంత్రాలను సాధన చేసి వశం చేసుకొన్నాడు. తపస్సు చేసుకోవాలనే కోరిక బల మైంది. ఆరు నెలలు ఇంటి దగ్గర, ఆరు నెలలు తపస్సు చేసుకోవటానికి భార్య అనుమతి పొందాడు. ఇద్దరు పిల్లలు కన్న తర్వాతతనకు కూడా తపస్సు చేసుకొనే అవకాశం ఇమ్మని భార్య కోరితే సరే నన్నాడు. వెంటనే భార్యకు మహాగణపతి మంత్రం, శ్రీ దీక్ష ఇచ్చాడు.

**దేశ సంచారం –శాస్త్ర చర్చలు –తపస్సు**

1896 లో అంటే పదహారేళ్లప్పుడు కౌశికీ నదీ తీరాన పేరమ్మ అగ్రహారం లో రెండు నెలలు తీవ్ర తపస్సు చేశాడు.. కాశీ కి బయల్దేరి నంది గ్రామం లో ధర్మ శాలాధి కారిచే సన్మానం పొంది ఇంటికి వచ్చాడు. కలువ రాయి లో ధ్యానం లో ఉండగా భద్రకుడు అనే అనే ఆయన కన్పించిగణపతి గణకుడు అని జ్ఞాపకం చేశాడు. తండ్రి అనుమతి తో ప్రయాగ వెల్లి హంస తీర్ధం లో కొంత కాలం తపస్సు చేసి, కాశీ చేరి తండ్రి మేన మామ భవాని శంకరం ఇంట్లో ఉండి దర్భాంగా సంస్థానం లో ఉండే "శివ కుమార పండితుడి "ని తన కవిత్వం తో మెప్పించాడు. నవద్వీపం లో జరిగే విద్వత్ పరీక్ష కు హాజరవమని పరిచయ పత్రం పొందాడు. ఒక రోజు ఆయనకు అయ్యల సోమయాజుల సూర్య నారాయణ యోగి కని పించి భద్రకుడు మొదలైన తాము పదహారు మంది లోక కళ్యాణం కోసం జన్మించామని తాను" సుకేతుడని", అతను గణపతి అని, యే పని చేయాలో" స్తూల శిరస్సు" అనే వాడు తెలుపుతా డని చెప్పాడు. నాసిక్ లో తపస్సు చేయాలని స్వప్నం లో తెలియ జేయ బడటం తో అక్కడికి చేరి నీలామ్బికా ఆలయం లో తపస్సు చేశాడు. అక్కడే మొదటి అష్టావదానమూ చేశాడు. అక్కడ తనను అవమానించిన పూజారిని శపించి, పాప పరిహారం కోసం "నవ చూతి "లో 72 రోజులు ఘోర తపస్సు చేశాడు. అప్పుడే" తెల్లని దిగంబరుడు" కల్లో కనిపించి ఇంటికి వెళ్ళమని ఆదేశించాడు.. ఒరిస్సా చేరి భువనేశ్వర్ లోతోమ్మిది రోజులు తపస్సు చేశాడు. భువనేశ్వరి దేవి సాక్షాత్కారించి బంగారు గిన్నె లోని తేనె ను అతనితో తాగించింది.. దానితో కవితా మాధుర్యం పెరిగింది. బుద్ధి సూక్ష్మత రెట్టింపైంది. ఇంటికి వస్తే భార్య కొడుకుని కన్నది. మహాదేవుడనే పేరు పెట్టాడు. కేశ న కుర్రు లో తర్క వేదాంత, వ్యాకరణ మహా భాష్యాలను, నీతి శాస్త్రాన్ని ఆపోసన పట్టాడు. 1900 లో మదసా సంస్థానం లో రాజ గురువును ఓడించి, అష్టావధానం చేసి, రాజకుమారుడికి శివ పంచాక్షరి ఉపదేశించి రాజు ప్రోత్సాహం టో నవద్వీపం చేరాడు. అక్కడ "సితి కంఠ వాచస్పతి ఆదరం పొందాడు. పరీక్షాధికారి అయిన "అంబికా దత్తుఆయన అంబికకు దత్తుడు అయితే తాను సాక్షాత్తు అంబిక కు ఔరస పుత్రుడిని గణపతిని అనే "శ్లోకం తో మెప్పించి, ఆయన మెప్పు పొంది పరీక్ష లో పాల్గొన్నాడు. నవద్వీప పండితులను మెప్పించటం మహా కష్టం. కాని మన గణపతి అక్కడి పండిత పరిషత్తు పెట్టిన అన్ని పరీక్షల్లో నెగ్గి, తన పాండిత్యం, కవిత్వాలతో అందర్నీ మెప్పించి "కావ్య కంఠ గణపతి "బిరుదును 20-6-1900 న పొందాడు. అప్పటి నుంచి ఆపేరు తో నే సార్ధక నామదేయుడైనాడు.



వైద్యనాద్ వెల్లి తపస్సు చేసి సురేష మిత్రుని వద్ద "తారా"మంత్రోపదేశం పొందాడు. గణపతి గారి వల్లే ఉత్తరాదికే పరిమిత మైన ఈ మంత్రం దక్షిణాదికి చేరింది. పదవ రోజు రాత్రి శివుడు కలలో కన్పించి నిర్విషయ ధ్యాన రూపం అయిన "స్మృతి మార్గం ;;చూపించి, విభూతి చల్లి అదృశ్యమైనాడు. గద్వాల్ చేరి మహారాజుకు ఆప్తుడై, కాన్పూర్ వెల్లి మూడు నెలలు తపస్సు చేసి, మళ్ళీ ఇంటికి వెల్లి తండ్రికి నేత్ర చికిత్స చేయించాడు. 1902 లో భార్య తో సహా మంద సా వెల్లి రాజు గారి ఆతిధ్యం పొంది, భార్యను పుట్టింటికి పంపి, తమ్ముడు శివ రామ శాస్త్రి తో కలిసి భువనేశ్వర్ లో మళ్ళీ తపస్సు చేసి కలకత్తా చేరాడు. అక్కడినుంచి దక్షిణ దేశం చేరి క్షీరవతీ, వేగావతీ నాడు మద్య శివ పంచాక్షరి జపించి,, అరుణాచలం చేరి తన తపో సాధనకు అదే సరైన ప్రదేశం గా భావించి అక్కడే ఉందామని నిర్ణ ఇంచుకొన్నాడు.

కానీ అన్నదమ్ము లిద్దరికి పిడికెడు అన్నం పెట్టె వారే కరువైనారు. గణతి కి ఆ క్షేత్ర దేవత పై కోపం వచ్చింది. ఆకలి దహిస్తోంది. వెంటనే ఒక బ్రాహ్మణుడు వచ్చి తన భార్య వ్రతం చేసి పారణ ను బ్రాహ్మణులకు ఇవ్వాలని అనుకుంటున్నది భోజ నానికి రమ్మని చెప్పి తీసుకొని వెళ్ళాడు. అక్కడ ఆమె మృష్టాన్న భోజనం పెట్టింది. సంతృప్తిగా తిన్నారు.. ఆ ఇంట్లోనే విశ్రాంతి తీసుకొన్నారు. తెల్ల వారి లేచి చూస్తె అక్కడ ఇల్లే లేదు. అరుణా చలేశ్వరుడే తమల్ని పిలుచుకొని వెళ్ళాడని అమ్మ వారు" ఆపీత కుచామ్బ" తమకు భోజనం పెట్టిందని గ్రహించాడు. కాని నోట్లో తాంబూలం అట్లాగే ఉండటం ఆశ్చర్యం వేసింది. అది కల కాదు నిజం అని తెలుసు కొన్నాడు. అప్పటికి గణపతి అయిదు కోట్ల శివ పంచాక్షరి ని జపించి నందుకు అమ్మవారే స్వయం గా కన్పించి ఆతిధ్యం ఇచ్చిందని అర్ధ మయింది. ఇక మానవ మాత్రులేవారిని దేహీ అని అర్ధించ రాదనీ నిశ్చయించు కొన్నాడు. రోజు అరుణాచల నందీశ్వరుని ముందు నిలిచి శ్లోకాలను అరుణా చలేశ్వరునికి విని పిస్తూ "హరస్తుతి "కావ్యం రచించాడు. చివరి రోజు న అరుణాచల యోగులు శేషాద్రి స్వామి, బ్రాహ్మణ స్వామి (రమణ మహర్షి )ఆ కావ్యం విని ఆనదించారు. అక్కడి విద్యాలయం లో ఈయనకు సంస్కృత అధ్యాపక పదవి లభించింది. పది రోజుల్లో తమిళం నేర్చి, ఆ భాష లో బోధించటం ప్రారంభించి మెప్పు పొందాడు. 1903 లో రమణ మహర్షిని దర్శించాడు. ఆయనేదుర్గా మందిర యోగి చెప్పిన "స్థూల శిరస్సు "అని గుర్తించి నమస్కరించాడు. అప్పుడు రమణుల వయస్సు ఇరవై రెండు. గణపతి వయస్సు ఇరవై అయిదు. అలా చారిత్రాత్మకం గా కలిసిన వారిద్దరూ జీవికా జీవులు గా ఉండి పోయారు.

గణపతి ముని ఒక సంవత్సరం వేదాధ్యయనం చేసి సాయన భాష్యం చదివారు. అప్పటికే ఆయన కీర్తి తమిళ దేశమంత వ్యాప్తి చెందింది. ఒక రోజు దొరస్వామి అనే శిష్యుడు షేక్స్పియర్ నాటకం మేక్బెత్ ను కధ గా విని పిస్తే, ఆశువు గా సంస్కృత కావ్యం గా చెప్పేశారు.. వేరొక శిష్యుడు ఇంగ్లీష పేపర్ చదివి విని పిస్తే

దాన్ని కింది నుంచి పైకి, పైనుంచి కిందికి చెప్పిన ఏక సంధా గ్రాహి.. వేదం వెంకట శాస్త్రి గారి సమక్షం లో గొప్ప సన్మానం జరిగింది భట్టశ్రీ, బాల సరస్వతి బిరుదులూ పొందిన ఒక పండితుడిని ఓడించి బంగారు తోడా బహుమానం గా పొందారు. ఇలా ఎక్కడికి వెళ్ళినా విజయ పరం పర తో సాగి పోతున్నారు.

**భారత దేశోద్ధరణ ---శ్రీ రమణుల సందర్శనం –జన్మరహస్యం**

పూర్వ జన్మ లో తనకు శిష్యులైన విద్యార్దులను గుర్తించి, వారిని పిలి పించి మద్రాస్ సముద్ర తీరం లో దేశోద్దారణ కోసం ఉపాయాలు చర్చించారు. నాలుగు ముఖ్య ఆశయాలతో పని చేయాలని నిర్ణ యించారు. ఒకటి కర్మ యోగం, రెండు –వేదకాల రుషి జీవన విధానం, మూడు –స్త్రీ పురుష వివక్ష–వర్ణ వివక్ష ను దూరం చేయటం,నాలుగు –ప్రతి ఇల్లు మంత్రాలతో నినదించటం. ఇవి చాలా గొప్ప నిర్ణయాలు. సాహసో పెతమైనవి. ఆయన "దశాం దేశ స్యైతాం ప్రతి పద మయం –ధ్యాయతి జనః"అంటే –"భారత దేశ దశను గురించే నేనెప్పుడు ధ్యానిస్తున్నాను ".ఇంత గొప్ప ఉదార ఆశయం ఆ నాడు యే మహార్షికీ లేదు. ఆ నాటి సమర్ధ సద్గురు రామ దాసుగా, విద్యా రన్య మహర్షి గా ఈ నాటి వివేకానంద, అరవిందులు గా గణపతి స్వామి కనిపిస్తారు.

రాయవేలూర్ క్రిస్టియన్ కాలేజి లో తెలుగు పండితులు గ పని చేస్తూ అక్కడే ఉండి పోయారు.. ఎందరో స్త్రీ, పురుషులకు మంత్ర దీక్ష ఇచ్చారు. సర్వేపల్లి రాదా కృష్ణన్ పిన తండ్రి నరసింహం కూడా దీక్ష పొంది, సన్య సించి "ప్రణవా నందులు 'అయారు. బహిరంగ సభల్లో వేద ప్రాశస్త్యాన్ని నొక్కి చెప్పటం తో ఇతర మతాల వారు వెనక్కు తగ్గారు. "ఇంద్ర సంఘం "స్థాపించి 'ఉమాం వందే మాతరం "అనే మంత్రాన్ని అందరికి బోధించారు. 17-2-1907 లో కలలో "భద్రకుడు "కన్పించి తన దేహ యాత్ర ముగి సిందని, గణపతి బోధనలతో సంఘం త్వరలో స్పందిస్తుందని చెప్పాడు. తన సోదరుడు చని పోయి నంత గా దుఃఖించి స్నానం చేసి తర్పణం వదిలారు. ఆ మర్నాటి పేపర్ లో ఆల్కాట్ గారే భద్రకుడు అని రాశారు. ఇంటికి వెళ్లి తండ్రి ని కాశీ యాత్ర చేయించి వేలూరు లో కొడుక్కి మశూచికం వస్తే "ఉగ్రమారీచి "ని ప్రార్ధించి దాన్ని పోగొట్టారు. దసరా ఉత్సవాలకు "పడై వీడు "కు వెళ్లి "రేణుకా దేవి "ని దర్శించి, తపస్సు మీద విపరీతమైన కోరికతో ఉద్యోగం వదిలేశారు.

అరుణా చలం చేరి "మరకత శ్యామలా దేవి (పచ్చై యమ్మన్ )దేవాలయం లో కొంత కాలం, నైరుత లింగం లో కొన్ని నాళ్ళు తపస్సు చేశారు.. అరుణా చలేశ్వరుని కృత్తి కోత్స వాలు జరుగుతున్నాయి. ఏడవ నాడు రథోత్సవం. దారిలో రథం ఆగి పోయి కదలలేదు. గణ పతి స్వామి రథం దగ్గరకు వచ్చి ప్రార్ధించగానే కది లింది. ఆ మహాత్ముని కోసం అందరు వెతుకు తుంటే అదృశ్యమై పోయాడు. విరూపాక్ష గుహ లో బ్రాహ్మణ స్వామి ని దర్శించాడు గణపతి ఆయనకు సాష్టాంగ పడి తనకు తపోసాధన కుదరటం లేదని, మార్గ నిర్దేశం చేయమని ప్రార్ధించాడు. అప్పటి దాకా ఎన్నో ఏళ్లుగా మౌన వ్రతం పాటిస్తున్న రమణ మహర్షి "నేను అనే స్పురణ ఎక్కడి నుండి వస్తోందో విచారిస్తే మనస్సు దానిలోనే లీనం అవుతుంది. అదే తపస్సు "అని చెప్పి మౌనాన్ని విడిచారు 18-11-1906 న. తన మౌనాన్ని చేదించిన వాడు మహా మహిమాన్వితుడు అని గ్రహించాడు బ్రాహ్మణ స్వామి. తనకు తపో విధానం తెలిపి గురుస్తానాన్ని పొందారు బ్రాహ్మణ మహర్షి అని గణపతి స్వామి భావించాడు. ఆయనకు భగవాన్ "రమణ మహర్షి "అనే పేరు గణపతి స్వామి పెట్టారు. రమణ మహర్షి ఈయనను "నాయనా " అని సంబోధించారు. శ్రీ రమణులకు,గణపతి కి పురజనులు సాష్టాంగ పడ్డారు.. తరువాత తాను "మరుద్గణ పతి అయిన వృషా కపి యొక్క ఏడవ అవతారం "అని నాయన ప్రకటించు కొన్నారు.

ఇక్కడి నుండి నాయనకు మరో జన్మ ప్రారంభ మైంది. అనేక గ్రంధాలు రచించారు. తపస్సు తీవ్రతరం చేశారు. తీర్ధ యాత్రలెన్నో చేశారు. ఉపన్యాసాలిచ్చారు. పండితుల్ని జయించి విజయ పత్రికలన్దుకొన్నారు. భార్య విశాలాక్షమ్మ దీపోత్స వానికి ముప్పై మంది శిష్యులతో వచ్చింది.. శ్రీ రమణులు ఆమె ను చూసి "అమ్మ వచ్చింది "అన్నారు. నాయన కూడా అప్పటి నుండి భార్యను "అమ్మా "అని పిలవటం ప్రారంభించారు. ఆమె కూడా భర్తను "నాయనా "అని పిలవటం మొదలు పెట్టింది. ఆ రోజు నుండి భార్యా భర్తలు వాన ప్రస్తాశ్రమం స్వీకరించారు. నాయన ఆమె కు "తారా మంత్రం "ఉపదేశించారు. నాయన "మాత గుహ " లో తపస్సు చేస్తూ ఇరవై రోజుల్లో "ఉమా సహస్రం "రాయటానికి పూను కొన్నారు. అయిదుగురు రాసే వాళ్లకు ఒక్కక్కరికి యాభై శ్లోకాలు చెప్తూ 250 శ్లోకాలు అవ్యవదానం గా చెప్పారు. దీని వెనక రమణ మహర్షి సూక్ష్మ రూపం లో హృదయం లో కూర్చుని రాయించారని నాయన భావం.. ఆ వాక్ ప్రవాహం రమణుల హృదయం లో ఊరి, నాయన ముఖతా వెలువడింది. రమణుల ఆదేశం తో కొండ శిఖరం "సప్త ఋరి "లో ఉండి "దూర దృష్టి, దూర శ్రవణం "అనే సిద్ధులను పొందారు. చిరుపాకం కొండయ్య అనే గణ పతి ఉపాసకునికి హోమ జ్వాలలో "నాయన దివ్యాకృతి "కన్పించింది. శ్రీ రమణులు "షణ్ముఖుని "అవతారం గా నాయన లోకానికి చాటి చెప్పారు. కాశీ లోసుకేతుడు చెప్పిన" స్థూల శిరస్సు రమణులే"అని నాయన గుర్తించారు.. అప్పటి నుంచి రమణుల అ నుచరుని గా ఉన్నారు. పడై వీడు కు వెళ్లి రేణుకా దర్శనం చేసి, దేశ భక్తు లైన యువకుల్ని సమీకరించారు. ఇక్కడే "కపాలి శాస్త్రి "అనే మహా విద్వాంసుడు నాయన శిష్యుడైనాడు. నాయన పై పోలీసులు నిఘా పెంచారు. దేశ ద్రోహం చేస్తున్నాడని ఆరోపణ.. వారి కంట పద కుండా తప్పించు కొంటున్నాడు నాయన.. శిష్యులు "ఉమా సహస్రం "ను పోలీసుల కంటికి కనపడకుండా కుండలినీ నదీ తీరం లో ఇసుకలో పూడ్చి పెట్టారు.. అను కోకుండా ఆ రాత్రి నదికి వరద వచ్చి గ్రంధం కొట్టు కు పోయింది. ఆ ప్రదేశాన్ని వదిలి వెళ్ళమని నాయనకు పోలీసులు ఆదేశించారు. వేలూరు వెళ్లి భార్య ప్రసవించిన ఆడపిల్లకు "వజ్రేశ్వారి అని పేరు పెట్టాడు. మళ్ళీ రేణుకా క్షేత్రం చేరి నలభై రోజులు తపస్సు చేశాడు. దీక్ష చివరి రోజున రేణుకా దేవి 200 మంది పరి చారికలతో ప్రత్యక్షమై నాయన శరీరం లోకి శక్తిని ప్రసరింప జేసింది. శక్తి ఆయుధం లభించిన అనుభూతి పొందారు నాయన. ఋగ్వేదం లోని "అస్త్ర మహా విద్యా మంత్రం "నాయన కు గోచరించింది.. వేలూరు వెళ్లి "ఇంద్ర సభ "పెట్టి ఆ అస్త్ర మంత్రం వారికి బోధించారు. బ్రిటీష ప్రభుత్వం దీన్ని "విప్లవ చర్య "గా భావించి అరెస్ట్ వారంట్ జారీ చేసింది. రహస్య మార్గం లో హంపీ కి బయల్దేరి హాస్పేట లో ఒక మోసగాని వల్ల ఒక రోజు జైల్లో ఉండాల్సి వచ్చింది.. మర్నాడు పోలీస్ ఇన్స్పెక్టర్ నాయన దివ్యత్వం తెలుసు కొని విడిచి పెట్టి మంత్ర దీక్ష పొంది శిష్యుడైనాడు. నాయన "మా ఉలి "అనే చోట తపస్సు చేసి ఆ గ్రామ దేవతను ప్రత్యక్షీకరించుకొన్నారు. ఆమె అస్త్ర సిద్ధి కి ఇంకా సమయం రాలేదని వేచి ఉండమని బోధించింది.

రమణుల వద్ద సెలవు పొంది దక్షిణ యాత్రలు చేస్తూ ;;జంబుకేశ్వరం "చేరి అక్కడి "అఖిలాండేశ్వరి "ని కొలుస్తూ నష్ట పోయిన ఉమా సహస్రాన్ని పూర్తీ చేశారు. దాదాపు ఏడు వందల శ్లోకాలు పది రోజుల్లో రాశారు. మళ్ళీ వేలురుకు వచ్చి కొడుకు మహాదేవుడికి ఒడుగు చేసి, అందరితో అరుణా చలం చేరారు.. ఆ తర్వాతా రెండేళ్లు మద్రాస్ లో ఉన్నారు.. ఉడిపి బలరామ క్షేత్రం, లో తపమాచరించి పీఠాది పతి టో సత్కరింప బడి, ఆ సభ లో మతత్రయ సిద్ధాంత సారాన్ని "తత్వ ఘంటా శతకం "గా ఆశువు గా చెప్పారు నాయన.. గోకర్ణం చేరి తాపం చేసి అనంత శాస్త్రి అనే పండితుణ్ణి ఓడించి, "ఇంద్ర మత ప్రాశస్త్యం "స్థాపించాడు. అక్కడి పండితులకు పరాశర సంహిత లో కల్గిన సందేహాలను తీర్చి "లఘు సంహిత "రచించాడు. గోకర్ణ ప్రాంతం లో ఉన్న వేద శాఖను పదిహేను రోజుల్లో కన్తస్తం చేశారు. ఉమా మహేశ్వర పర్వతం పై నాయనా, అమ్మా తపస్సు చేస్తుండగా వారిని సేవించిన గణేశ శర్మ తర్వాతా "దేవరాతుడు "గా ప్రసిద్ది పొందాడు. నాయన వద్ద ఆయన అనేక దివ్యానుభూతులను పొందాడు. పౌరాణిక కధలను బట్టి వేదార్ధాలను, వేదార్ధాలను బట్టి పురాణ కధలను సమన్వ యించే పనికి పూను కొన్నారు.



1912 లో స్వగ్రామం కలువ రాయి చేరి తండ్రి అవసాన కాలం లో దగ్గరుండి అంత్యక్రియలు చేసి, అరుణాచలం చేరి రమణ దర్శనం చేసి గోకర్ణ ములో "నాన్న బేలా ఆశ్రమం "లో జరిగిన "జ్యోతిష్టోమం "కు బృహస్పతి గా ఉండి యజ్ఞ కర్మలను మంత్రార్ధాలను సంస్కృతం లో సుబోధకం గా వివ రించారు. కన్నడం లో అనర్గళం గా ఉపన్య సించి అందర్నీ ఆశ్చర్య పరవశులను చేశారు నాయన.. తర్వాతా సికందరాబాద్ వచ్చిజంత నగర వాసులు చాలా మందికి మంత్ర దీక్షనిచ్చారు. అక్కడికి దగ్గర్లో ఉన్న "కర్కేలి "లో నాలుగు నెలలు తపోదీక్ష లో ఉన్నారు. అమ్మ తో ఉత్తర దేశ యాత్రలు చేసి, ఆమె భువనేశ్వరం లో పాక మహిమ, అక్షయ సిద్ధి పొందింది.. మండసా చేరి తల్లి తద్దినం పెట్టి, రాజా వారి కోర్కె పై ఇద్దరు అక్కడే చాలా కాలం ఉండి పోయారు. అక్కడి కొండపై ఉన్న శివ లింగానికి "దాహార గోకర్నేశ్వరుడు "అని నాయన పేరు పెట్టారు.. తనలో పరశు రాముని తేజం ప్రవేశించి నట్లు గుర్తించారు.

1917 లో అరుణా చలం చేరి విరూపాక్ష గుహలో రమణుల అనుమతి టో ఉండ టానికి అనుమతి పొంది గుహకు వస్తే కాపలా వాడు తాళం చెవి ఇవ్వక పోతే క్రోధాగ్ని ప్రజ్వలింప జేశారు. తర్వాతా పశ్చాత్తాపపడి "ఇంద్ర స్తుతి "చేస్తే విపరీతం గా వర్షం పది దేవాలయ రధం పై పిడుగు పది గండం తప్పింది.. రమణులు నాయన టో ఇంకా కోపం ఎవరి మీద చూప్పని శపధం చేయించి, స్వహస్తాలతో పెరుగు అన్నం టిని పించారు నాయనకు.. రమణుల తో పాటు స్కందాశ్రమం లో ఉంటూ "దశ మహా విద్యా సారం "ను 475 సూత్రాలను మూడు రోజుల్లో రాశారు. "రమణ గీత "ను రాసి, పది వీడు వెళ్లి నలభై రోజులు తపం చేశారు.. శ్రీ రమణుల తమ్ముడికి, తల్లికి సన్యాస దీక్ష నిచ్చి మళ్ళీ స్వగ్రామం కలువ రాయి వెళ్లారు. కొడుకు మహాదేవుడి వివాహం చేసి సికందరాబాద్ చేరి 1919 డిసెంబర్ దాకా ఉండి స్వరాజ్య ఉద్యమ సంనాహాని చూసి సంబర పడ్డారు. గాంధీ ని "మైత్రేయ రుషి "గా నాయన గుర్తించారు.. అమ్మ తో మద్రాస్ వెళ్లి "రాజ యోగా సారం "రాశారు.

1922 లో అరుణా చలం చేరి "ఉమా సహస్రం "సంస్కరించి, "ఇంద్రాణీ సప్తశతి "రచన మొదలెట్టారు. వెన్నెముక లో విపరీత మైన నొప్పి శిరో వేదన తో బాధ పడ్డారు. రమణ మహర్షికి చీటీ ద్వారా తెలియ జేసినా సమాధానం రాలేదు. అర్ధ రాత్రి గుహలో నాయన శిరస్సు నుంచి "తప్ "అనే ధ్వని తో పెద్ద శబ్దం గుహ బయటి వారికి కూడా విని పించింది. చంద్ర కాంతి వంటి జ్యోతి గుహ పైకప్పు ను తాకింది. నాయన శరీరం నుండి దత్త మైన పొగలు బయటికి వచ్చాయి. శీర్ష కపాల భేదనం జరిగి అమ్రుతప్రాప్తి లభించింది. బాధ అంతా మాయ మైంది. రమణులు వచ్చి తనతో తీసుకొని వెళ్లి పాలు తాగించారు. నాయన నెట్టి మీద అరచెయ్యి వెడల్పున వెంట్రుకలు ఊడి పోయాయి. రమణ మహర్షి నాయన కు సపర్యలు చేయించారు. ఇంద్రాణీ సప్త శతి పూర్తీ చేసి పది వీడు వెళ్లి అక్కడ దాన్ని పఠించారు. రేణుకా దేవి ప్రత్యక్షమై ఆశీర్వా దించింది

నాయన –స్త్రీల స్వాతంత్ర్యానికి, పంచముల దీన స్తితి తొలగించటానికి, వేదార్ధాల సందేహాలు తీర్చటానికి, వర్ణ భేదాలు తొలగి పోవటానికి ఇంద్రాణి ని ప్రార్ధించారు. దేశ వైభవం కోసం ఆయన చేసిన శ్లోకాలు చిర స్తాయి గా నిలిచి పోయాయి. 1922 లో రమణుల తల్లి అలఘుమ్మ మరణిస్తే. సమాధి కట్టించి దానిపై రమణులు స్థాపించిన శివ లింగానికి "మాత్రు భూతేశ్వర లింగం "అని నాయన పేరు పెట్టారు. 1923 లో "ఉమా సహస్రం "ను శ్రీ రమణులకు సమర్పించారు. అద 1942 లో అచ్చయింది.

**కాంగ్రెస్ కు వీడ్కోలు**

1923లో కాకినాడ కాంగ్రెస్ సభల్లో పురుషులతో పాటు స్త్రీ లకు ఉపనయన, హోమ, శ్రాద్ధ కర్మల్లో సమాన హక్కు ఉందని వేద శాస్త్ర ప్రమాణం గా నిరూపించారు గణపతి ముని. ఆలమూరు సబలో అస్పృశ్యతా నివారణ గురించి మాట్లాడి మహా మహా పండితుల నోళ్ళు మూయించారు. ద్రావిడ రాష్ట్రీయ కాంగ్రెస్ అధ్యక్షహోదాలో బెల్గాం కాంగ్రెస్ సభలో ఆ మరుసటి ఏడు పాల్గొని అస్పృశ్యత జాతికి అవమానం అని ప్రసంగించారు. గాంధీ గారు హిందీ ని రాష్ట్ర భాష గా సమర్ధిన్చగా, నాయన" సంస్కృతాన్ని జాతీయ భాషగా" చేయాలని వాదించటానికి సిద్ధ పడగా, గాంధీ నాయనకు అవకాశం ఇవ్వ లేదు. విసుగొచ్చి రాజకీయాల నుండి వైదొలగారు. అయినా దేశ భక్తీ ని ప్రబోధించే "రాష్ట్ర నిబంధన "గ్రంధం రాశారు ".సంస్కృతం ప్రపంచ భాష" కావాలని "లాలి భాషోపదేశః "పుస్తకం రాశారు. సంస్కృతం అంటే నాయనకు అంత అభిమానం. దాని పారం ముట్టిన భాషా కోవిదుడు. అతి మూత్ర వ్యాధి వచ్చినా గ్రంధ రచన మాన లేదు. అనేక సూత్ర, ప్రామాణిక గ్రంధాలు రాస్తూనే ఉన్నారు.

**ముని అని పించుకొన్న విధానం**

1925 లో బందరు "సనాతన ధర్మ సభ "లో సాంఘిక సంస్కరణల గురించి మాట్లాడారు. మంగళ గిరి నృసింహ క్షేత్రాన్ని ఇంద్ర క్షేత్రం గా గుర్తించారు నాయన. 1926 లో తిరువన్నామలై చేరి "పూర్ణ"అనే సంస్కృత నవల రాశారు. నాయన రచనలు75 పైనే ఉన్నాయి. అందులో ఇరవైఒక్క స్తోత్రాలు, ఇరవైనాల్గు సూత్ర గ్రంధాలు, మూడు తత్వ గ్రంధాలు, ఏడు వ్యాఖ్యానాలు, మూడు ఆయుర్వేద గ్రంధాలు, మూడు జ్యోతిష గ్రంధాలు, ఒక చారిత్రికం మిగిలినవి ప్రకరణాలు. 18-7-1926 నఅమ్మ మరణించింది.



మరుసటి ఏడు సికందరాబాద్ వచ్చి శ్రీ రమణుల సందేశాన్ని విని పించి వేల మందికి మంత్ర దీక్షనిచ్చారు. 4-2-1927 ణ జరిగిన శ్రీ కృష్ణ దేవ రాయాంధ్ర భాషా నిలయం రజతోత్సవాలకు అధ్యక్షత వహించారు. హైదరాబాద్ లోని "ఆది హిందూ సంఘం "నాయనను పల్లకీలో ఊరేగించి "ముని "బిరుదు ను ప్రదానం చేశారు. డిసెంబర్ లో మచిలీ పట్నం లో జరిగిన మదన మోహన మాలవ్యా అధ్యక్షస్థానం లో ఉన్న సభలో అస్పృశ్యతా నివారణ గురించి మాట్లాడి ఆయన ఆదరానికి పాత్రులయారు. కాని చాందసుల నిరసన కు గురి అయారు. చండాలురకు దేవాలయ ప్రవేశం కల్గించాలని మల్లాది వారితో వాదించారు.

**అరవిందుల దర్శనం**

అరవింద మహర్షి నుండి ఆహ్వానం అందుకొని శ్రీ రమణుల అనుమతి పొంది అరవిందాశ్రమం చేరారు. అరవిందులు తమకు పూర్వజన్మ లో తపస్సు లో సఖులని, తనకంటే అరవిందులు పెద్ద వారు, గొప్ప వారని చెప్పారు. అరవింద జయంతికి అరవిందాశ్రమం లో ఉన్నారు. రెండు నిముషాలు ఇద్దరు ఋషులు ఒకరి నొకరు తేరి పార చూసు కొన్నారు. ఒకరి మహిమను ఇంకోరు గ్రహించారు. అరవింద మాత నాయన తోధ్యానం చేశారు. నాయన "జనని "గ్రంధానికి పీఠిక, 108 సూత్రాల తత్వాను శాసనం రాశారు.. తిరువన్నామలై వచ్చి ;;ఇంద్ర స్తోత్రం "రాశారు.

**నాయన మహిమలు**

గోకర్ణం చేరి "కాలువే "ఆశ్రమం లో తపస్సు చేశారు. అహల్యా అనే స్త్రీకి గ్రహపీడను, ఆమె భర్తకు టైఫాయిడ్ జ్వరాన్ని మంత్ర శక్తి తో వదిలించారు.. ఒక సారి శిష్యులతో ఆశ్రమం లో ఉండగా ప్రక్కనున్న గడ్డి వాము లు అంటుకొని మండుతుంటే "పారాశర అగ్ని మంత్రం "ప్రయోగించి అగ్ని జ్వాలలను,గడ్డి వాముల్ని దూరం గ చిమ్మి వేసి ప్రమాదం నుండి కాపాడారు. ఇంకోసారి కొడుకు మహాదేవుడి తో కారు లో ప్రయాణిస్తుంటే కారు ప్రమాదం జరిగి కొడుకు మోచేతి ఎముక విరిగింది. నాయన కారు లోనే "ఋగ్వేదం లోని అస్థి సంధాన మంత్రం "పఠించి మోచేతిని అతి కించారు. 1929-31 మద్య శిర్షి ఆనందాశ్రమం లో ఉండి వందలాది జనానికి మంత్ర దీక్ష నిచ్చి రమణ మహర్షి సందేశాన్ని బోధ పరచారు. 'పూర్వం జరిగిన కపాల భేదన సిద్ధి తో తనలో ఏదో దివ్య శరీరం పుట్టి ఇతరులను ఆవహిస్తున్నట్లు తోచింది. రామ చంద్ర భట్టు అనే నిరక్షర కుక్షిని ఆ దివ్య శరీరం ఆవహించి అతన్ని సంస్కృత పండితుడిని చేసింది. రమణ మహర్షికి అనేక జాబులు రాశారు. అందులో తన శక్తి స్థానాలు మూడు అని పేర్కొన్నారు. మొదటిది రమణ మహర్షి, రెండు భగవాన్ ఇంద్రుడు, మూడు భారత మాత. ఇంద్రున్ని ఉపాశించి భారత మాత కు పట్టిన దుర్గతి ని తొలగించటమే తన ధ్యేయం అన్నారు నాయన. నాయన మాతృభక్తి ఎంత ఉత్కృష్టమైనదో మనకు దీని వల్ల తెలుస్తోంది. "ఉన్నది నలుబది ",ప్రచండ చండీ శతి ",ఈశ ఉపనిశాత్తుకు భాష్యం రాశారు 1933 లో ఋగ్వేదం ఆధారం గా "భారత చరిత్ర పరీక్ష "అనే ఉద్గ్రంధాన్ని నాయన రాశారు, వేద, పురాణాలను సమన్వయము చేస్తూ రాసిన, అరుదైన, అద్భుత మైన గ్రంధం ఇది. నాయన నిశిత దృష్టికి సమన్వయ

దృష్టికి నిలువెత్తు దర్పణం. దీన్ని చదివే అరుదై న  అవకాశం,పొందిన అదృష్ట వంతున్ని నేను. 1934 లో ఆంధ్ర విశ్వ విద్యాలయం లో చేసిన ఉపన్యాసాలకు వైస్ చాన్సలర్ సర్వేపల్లి రాదా కృష్ణ పండితుడు ముగ్దుడై నాయనకు ఆచార్య పదవి లో నియోగిస్తామని కోరారు. తాను తపస్సును విడిచి ఉండలేనని మర్యాదగా తిరస్కరించారు.



## చివరి రోజులు

ఖర్గ పూర్ IIT. లోని నేమాని సూర్య నారాయణ గారు నాయనను కలకత్తాకు  ఆహ్వానించారు అక్కడ గుంటూరు లక్ష్మీ కాంతం గారింట్లో ఉన్నారు. తాను పదేళ్ళ క్రితం కలలో చూసిన సిద్ధ పురుషుడే నాయన అని ఆయన గుర్తించారుఆయన..  కలకత్తా లో అవతార విశేషాలు, రమణుల సందేశం, వేదకాలం వంటి వాటి  పై విస్తృతం గా ప్రసంగించారు. అక్కడ గోపాల స్వామి అనే యోగితో పాటు కంచి చంద్ర శేఖర యతీంద్రులను దర్శించారు. స్వామి వారు నాయన గారిని గౌరవ, ఆద రాలతోసత్కరించారు.

## స్వర్ణ సిద్ధి యోగం

మనుమడి బారసాల కు కలువ రాయి వస్తుంటే నాయన  కు అనుకోకుండా దొరికిన రాగి నాణెం బంగారు గా మారింది. మళ్ళీ ఖర్గపూర్ వెళ్లి అక్కడ ఆశ్రమ స్థాపనకు శంకుస్థాపన చేశారు. ఒక రోజు రాత్రి నాయన "స్వర్ణ సిద్ధి యోగం "ప్రదర్శించారు. కలకత్తా వెళ్లారు.  అక్కడ నేమాని సూర్య నారాయణ నెత్తిన అడుగున్నర ఎత్తున ఇనుప బీగం (తాళం  ) పడ బోతుంటే దాన్ని పట్టు కొని మూడు నిముషాలున్నారు. అది అయస్కాంతం లా ఇనుప వస్తువుల్ని ఆకర్షించింది. అంటే నాయన శరీరం లో శిరస్సు నుండి అవిచ్చిన్నం గా విద్యుత్తు ప్రవహిస్తోందని అర్ధమైంది. విశ్వమీమాంశ  కు తాత్పర్యం, ఆత్మకథ, పూర్వ కధ తెలుగు లో రాయటం ప్రారంభించారు. కర్మల్లో ప్రయోగించే మంత్రాలకు ఆధ్యాత్మిక వ్యాఖ్యానం రాశారు. 25-4-1936 మళ్ళీ ఖర్గపూర్ చేరారు. వేల సంఖ్యలో భక్తులేర్పడ్డారు.. నాయన ఎన్నో అతీంద్రియ శక్తుల్ని ప్రదర్శించారు "అబిసీనియా చక్ర వర్తి రాజ్య భ్రష్టుడు అవుతాడు "అని ముందే నాయన చెప్పారు. నాయన ఆరోగ్యం బాగా క్షీణించింది.

## నాయన అనాయాస మరణం

తాన మరణించే సమయాన్ని నాలుగు రోజుల ముందే అందరికి తెలియ జేశారు. 25-7-1936 నాడు దాత్రు నామ సంవత్సరం శ్రావణ శుద్ధ సప్తమి శని వారం మధ్యాహ్నం శిష్యులతో హోమం చేయించి అనాయాసం గా మరణించారు. భారతీయ వేద, శాస్త్ర, పురాణ, ఇతి హాసాలను నాయన లాగా సమన్వయము చేసిన వారు లేరు, లేరు, లేరు. నాయనజీవిత చరిత్ర ను గుంటూరు లక్ష్మీ కాంతం గారు పుస్తకం గా రాశారు. నాయన  "అయిదున్నర అడుగుల ఎత్తు, బక్క పలుచని బంగారు రంగు శరీరం, విశాల ఫాలభాగం, బట్ట తల, పూర్ణ వికాసం స్పురించే శిరస్సు, విజ్ఞాన పూర్ణ నేత్రాలు, గంభీరమైన కను బొమ్మలు, సన్నని మీసాలు, పలుచని గడ్డం, ఘంటానాదం వంటి కన్తధ్వని, అధికారయుత మైన వాణి, చిరు నవ్వులు చిందించే పెదవులు, వాత్సల్య, అనుకంప లను పుట్టించే పిత్రుభావం, క్రుతయుగపు రుషి ఆకృతి, " తో ఉండే వారని లక్ష్మీ కాంతం గారు రాశారు. శ్రీ రామ కృష్ణ పరమ హంస కు వివేకానంద స్వామి ఎలాగో శ్రీ రమణ మహర్షికి నాయన లాంటి వారు

నాయనాను ప్రశంసిస్తూ నవద్వీప పండితులిచ్చిన ప్రశంసా శ్లోకం –

"ప్రాచేనైస్తైహ్ కవికుల వరైహ్ కాళిదాసాది భిర్యా—లబ్దా కీర్తి ర్యావదనుగాతా శైవ భూయా దిదానీం

సద్భిర్గాత్తో య ఇహ, రుచిరః కావ్య కన్టోప హారః –తెవ శ్రీమానిహ భువి భావానుజ్జ్వలస్కాపి భూయాత్ "

# భూలా భాయిదేశాయ్

స్వాతంత్రోద్యమ ఖైదీల అండ మహాన్యాయవాది -భూలా భాయిదేశాయ్


Bhulabhai Desai

భూలా భాయి జీవంజీభాయి దేశాయ్ 13-10-1877 న గుజరాత్ లోని సూరత్ జిల్లా చారిత్రాత్మక బార్డోలికి దగ్గరున్న బల్సూరులో అనవిల్ బ్రాహ్మణ న్యాయవాద కుటుంబ లో పుట్టాడు. తండ్రి ప్రభుత్వ ప్లీడర్. స్వగ్రామం లో చదువు ముగించి బొంబాయి ఎలిఫిన్ స్టన్ కాలేజిలో చేరి ప్రధమ శ్రేణిలో పట్టా పొంది, ఎం ఏ పాసై, అహ్మదాబాద్ కాలేజిలో హిస్టరీ ప్రొఫెసర్ అయ్యాడు. రెండేళ్ళు పని చేసి, ఎల్.ఎల్. బి.చేసి, బాంబే హైకోర్ట్ లో న్యాయవాదిగా చేరాడు. అక్కడ అందరూ బారిస్టర్లే.స్వదేశీ న్యాయవాదిగానే ఉంటూ భూలాభాయ్, వాదనా సామర్ధ్యం తో త్వరలోనే అద్వితీయ న్యాయవాది యై, ప్రభుత్వం దృష్టిలోపడి, 1923 లో వైస్రాయ్ కార్యవర్గ పదవి ని స్వీకరించమని కోరినా నిరాకరించి, అనేకసార్లు, హై కోర్ట్ న్యాయమూర్తి పదవికిఆహ్వానించినా తిరస్కరించి, 1926 లో తాత్కాలికంగా అడ్వొకేట్ జనరల్ పదవి మాత్రం స్వీకరించాడు.

మితవాదిగా రాజకీయం లోకి ప్రవేశించి,అనిబిసెంట్ హోం రూల్ ఉద్యమం లో భూలాభాయ్ పని చేసి విస్తృత ప్రచారం తెచ్చాడు. అప్పుడే గాంధీజీ వల్లభభాయ్ పటేల్ లతో పరిచయం కలిగింది. 1928 బార్డోలీ సత్యాగ్రహం చరిత్రాత్మకమై సైమన్ కమీషన్ బహిష్కరణ లో దేశం ఊగిపోయింది. ప్రజలు అనేక కష్టనష్టాలు ఎదుర్కొంటూ అత్యంత ధైర్య సాహసాలతో "సైమన్ గోబాక్ "నినాదాలతో దేశాన్ని అట్టుడికించారు. అప్పుడే బార్డోలీలో రీ సెటిల్ మెంట్ విషయంలో పన్నుల నిరాకరణ ఉద్యమం ఉవ్వెత్తున జరిగింది. ప్రభుత్వం అత్యంత నిరంకుశంగా వ్యవహరించింది. 1930 లో గాంధీ –ఇర్విన్ ఒడంబడిక జరిగి, లండన్ లో రెండవ రౌండ్ టేబుల్ సభకు గాంధీకి ఆహ్వానం వచ్చింది. గాంధీ నిరాకరించాడు. బార్డోలీ పన్నుల విషయం లో ఒక ప్రత్యేకకోర్టు పెట్టి విచారిస్తామని ప్రభుత్వం తెలియజేయగా గాంధీ లండన్ వెళ్ళటానికి ఒప్పుకున్నాడు. 1931 లో బార్డోలీ విచారణ సంఘం ఏర్పడింది.



1928 లో ప్రభుత్వం ఏర్పాటు చేసిన బ్రూం ఫీల్డ్ కమిటీ ముందు రైతులపక్షాన భూలాభాయ్ వాదించి, 1931 బార్డోలీ విచారణ సంఘం ఎదుట కూడా వాదించాడు 1932 సత్యాగ్రహ ఉద్యమం లో గాంధీతో పాటు పాల్గొన్నాడు. ఈ మహోద్యమానికి ముఖ్యకారణం లార్డ్ విల్లింగ్టన్ వైఖరే. గాంధీ లండన్ నుంచి రాగానే నెహ్రూను అలహాబాద్ లో ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ ను పెషావర్ లోనూ దేశవ్యాప్తంగా వేలాది సత్యాగ్రహులను అరెస్ట్ చేసింది ప్రభుత్వం. కలకత్తాలో ఆర్డినెన్స్ పెట్టారు. దేశమంతా నానా భీభత్సంగా ఉన్నది. గాంధీ వైశ్రాయికి ఒక టెలిగ్రాం పంపిస్తూ ఆయనతో మాట్లాడాలని ఉందని తెలిపాడు. రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్ విషయాలుతప్ప, ఇంకేమీ మాట్లాడటానికి వీల్లేదని జవాబు రాగా, గత్యంతరం లేక కాంగ్రెస్ స్వాతంత్ర్య పోరాటానికి దిగాల్సి వచ్చింది.

ఉద్యమం జయప్రదంగా సాగుతుంటే వైస్రాయ్ ఆరు వారాలలో అణచి వేస్తానని ప్రగల్భాలు పలుకగా,, ఉద్యమం ఉవ్వెత్తున రెండేళ్ళు నడిచింది. 1921 ఉద్యమం లో 30వేల మంది 1930ఉద్యమం లో 60వేలమంది, 1932లో లక్ష ఇరవై వేలమంది ప్రజలు స్వచ్ఛందంగా జైలుకు వెళ్ళారు, 1932 లో సత్యాగ్రహ ఉద్యమంలో భూలాభాయ్ పాల్గొని ఒక ఏడాదిజైలు శిక్ష అనుభవించి, 10వేల రూపాయల జరిమానా కూడా చెల్లించాడు. విడుదలై 1933 లో జెనీవాలో జరిగిన అంతర్జాతీయ సభలో కాంగ్రెస్ ప్రతినిధిగా హాజరయ్యాడు.

వ్యూహం మార్చి కాంగ్రెస్ శాసనసభ ఆక్రమణకు దిగింది. శాసనసభా బహిష్కరణ కు వత్తాసు పలికిన పార్టీ ఇప్పుడు ఈ నిర్ణయం తీసుకోవటానికి ముఖ్యకారకుడు భూలాభాయ్. గుజరాత్ నుంచి కేంద్ర శాసన సభ సభ్యుడుగా భాయ్ ఎన్నికయ్యాడు. కాంగ్రెస్ పక్ష నాయకుడయ్యాడు. శ్రీ ఎస్ సత్యమూర్తి ఉపనాయకుడు. పండిత మోతీలాల్ నెహ్రూ చనిపోయాక అంతటి ప్రతిభాశాలి శాసన సభలో కరువయ్యారు. ఆకొరత తీర్చటానికి భూలాభాయ్ ని పార్టీ ఎంపిక చేసింది. అప్పటికి ఈయనకు అందులో అనుభవం లేదు..స్వయం కృషితో అనుభవం సాధించి 1936 లో ప్రభుత్వ విధానాలకు అసమ్మతి తెలుపుతూ అసెంబ్లీ నుంచి పార్టీ సభ్యులతో మొదటి సారిగా వాకౌట్ చేసి భూలాభాయ్ చరిత్రసృష్టించాడు.

కేంద్ర అసెంబ్లీ లో భూలాభాయ్ మాట్లాడిన విషయాలు ఒక తీవ్రవాది మాట్లాడినంత పరుషంగా ఉండేవి. ఇండో బ్రిటిష్ వ్యాపార వొడంబడిక, జాయింట్ పార్లమెంటరి కమిటీ నివేదిక క్రిమినల్ లా సవరణ బిల్లు, ఆర్మీ రిక్రూట్ మెంట్ బిల్లు, ఆర్ధికబిల్లు మొదలైన విషయాలలో భాయ్ చేసిన ఉపన్యాసాలు చాలా విలువైనవి. బ్రిటిష్ పాలకులుయుద్ధ సమయం లో భారత దేశం లో ప్రజా ప్రభుత్వమే నిర్వహిస్తోందని ఆర్భాటంగా ప్రచారం చేసుకొంటుంటే, ఇండియాకు స్వాతంత్రం ఇవ్వటానికి

హిందూ ముస్లిం సఖ్యత లేదన్న అసత్య ప్రచార సమయం లో, భారత శాసన సభలో భూలాభాయ్ నాయకత్వం లో అసెంబ్లీ సభ్యులైన కాంగ్రెస్ వారు, ముస్లిం లీగు సభ్యులు కూడా ఏకమై, ప్రభుత్వం ప్రవేశపెట్టిన ఫైనాన్స్ బిల్లు ను అనేక సార్లు ఓడించారు. శాసన సభ్యుల ఐక్యత చూసి తెల్ల ప్రభుత్వం తెల్ల బోయింది. హిదూ ముస్లిం ఐక్యత ఏర్పడు తుందేమోనని కంగారు పడింది కూడా. ఫైనాన్స్ బిల్లును ఓడించి భారత్ లో ప్రజా స్వామిక ప్రభుత్వం లేదని ప్రపంచానికి నిర్ద్వంద్వంగా తెలియ జేశారు భూలాభాయి నాయకత్వంలోని సభ్యులు. ప్రభుత్వం చెప్పేదాంట్లో సత్యం లేదని నిరూపించారు. సభలో ఓడిన బిల్లును వైస్రాయి వీటో అధికారం ప్రయోగించి బలవంతంగా రుద్దే దురుద్దేశాన్ని లోకానికి చాటగలిగారు. 1935 నుంచి 45 వరకు ఉన్న దశకం లో దేశం రాజకీయంగా అట్టుడికి పోతున్న తరుణం లో, సెంట్రల్ అసెంబ్లీ లో ప్రతిపక్ష నాయకుడుగా భూలాభాయి ఉంటూ, యెనలేని కీర్తి నార్జించాడు దేశ విదేశాలలో.

1939సెప్టెంబర్ లో ప్రారంభమైన రెండవప్రపంచ యుద్ధం లో భాగస్వామిగా ఇండియాను చేయాలని ప్రభుత్వం కోరగా భారతీయులు అంగీకరించక అసమ్మతి తెలిపారు. బ్రిటిష్ వారి స్వంతయుద్ధాలలో ఇండియా 1927 నుంచీ పాల్గోన్నదనీ, కాంగ్రెస్ గుర్తు చేస్తూనే ఉంది. యుద్ధం ప్రారంభం కాగానే గాంధీ, కాంగ్రెస్ ప్రభుత్వాన్ని యుద్ధం ఉద్దేశ్యం ఏమిటి అని నిలదీశారు. దానికి ఫాసిస్ట్ ప్రభుత్వాన్ని రూపుమాపి, ప్రజాస్వామ్య సూత్రాలను కాపాడటమే అని ప్రభుత్వం సమాధానం చెప్పింది. "మీతో కలిసి సమానంగా యుద్ధం చేసి శత్రు సంహారం చేయటానికి మాకుకూడా మీతో పాటు సమాన ప్రతిపత్తి ఇవ్వండి "అని ప్రభుత్వాన్ని కాంగ్రెస్ కోరింది. కానీ కుటిల తెల్ల ప్రభుత్వం ప్రజలకు చెప్పకుండా, ఇండియాను యుద్ధంలోకి దించి, ఇండియా అంగీకరించే యుద్ధం చేస్తోందని ప్రభుత్వం ప్రచారం చేసింది. ఈ అసత్య ప్రచారాన్ని త్రిప్పికొట్ట టానికే కాంగ్రెస్ వ్యష్టి శాసనోల్లంఘున ఉద్యమం ప్రారంభించింది.



అప్పటికే అధికారం లో ఉన్న ఆరు రాష్ట్రాల కాంగ్రెస్ మంత్రి వర్గాలు, ఇండియా యుద్ధం లో పాల్గొనటానికి అసమ్మతిగా మంత్రిపదవులను త్యజించి వ్యష్టి సత్యాగ్రహం లో పాల్గొన్నారు. 1940 డిసెంబర్ 1 న భూలాభాయ్ ని అరెస్ట్ చేసి, ఎరవాడ సెంట్రల్ జైలులో డిటిన్యుగా తీసుకు వెళ్ళింది. జైలులో ఆయన జబ్బు పడ్డాడు. 1941 సెప్టెంబర్ 17న విడుదల చేసింది.

భూలాభాయ్ కాంగ్రెస్ కార్యవర్గ సభ్యుడుగా, బొంబాయి రాష్ట కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడుగా ఉండేవాడు. 1942 లో కార్యవర్గ సభ్యత్వానికి రాజీనామా చేశాడు. 1942 ఏప్రిల్ లో క్రిప్స్ రాయబారం విఫలమయ్యాక,ఆగస్ట్ 7న బొంబాయి కాంగ్రెస్ సమావేశం లో "బ్రిటిష్ ప్రభుత్వం భారత దేశం నుంచి పూర్తిగా వైదొలగాలి "అనే తీర్మానం చేయటానికి సమావేశమైంది. ఆగస్ట్ 8న జాతీయ నాయకులను అరెస్ట్ చేసి అహ్మద్ నగర్ కోటలో బ్రిటిష్ ప్రభుత్వం బంధించింది. దేశంలో ఉవ్వెత్తున విప్లవం చెలరేగింది. అణచటానికి ప్రభుత్వం అనేక ప్రయత్నాలు చేసి, విఫలమై మారణ యంత్రాలను కూడా ప్రయోగించింది. మహాత్ముని అర్ధాంగి కస్తూరిబాయ్ మాత, ఆయన కుడిభుజం మహా దేవ దేశాయ్ మరణించారు. ఈ మరణాలు ప్రజల్ని మరింత ఉద్రేక పరచాయి. గాంధీ ఆగాఖాన్ భవనం లో ఉపవాసం చేసి, ఆగస్ట్ ఉద్యమానికి కాంగ్రెస్ కారణం కాదనీ ప్రభుత్వానిదే బాధ్యత అని నిరూపించాడు. అనారోగ్య రీత్యా ఆతర్వాత గాంధీని విడుదల చేశారు.

దేశంలో జరుగుతన్న ఈ పరిణామాలన్నీ నిశితంగా పరిశీలిస్తున్నాడు ఎంతోవ్యధ చెందుతున్నాడు భూలాభాయ్. గాంధీ నెహ్రు అజాద్ వంటి అగ్రనాయకులు జైల్లో ఉండటం ఆయన్ను కలచి వేసింది. వారి విడుదలకు, ప్రతిష్టంభన తొలగటానికి మార్గాలు అన్వేషించాడు.శాసన సభా ప్రతిపక్ష నాయకుడుగా, ముస్లిం పక్ష ఉపనాయకుడునవాబ్ జాదా లియాఖత్ ఆలీఖాన్ తో సంప్రదించి ఇద్దరూకలిసి అన్యోన్యంగా కేంద్రం లో జాతీయ ప్రభుత్వాన్ని తాత్కాలికంగా నైనా ఏర్పాటు చేస్తే సంక్షోభాన్ని కొంత వరకు తగ్గించవచ్చు అని అలోచించి లియాఖత్ నుఒప్పించి ఒక ప్రణాళిక తయారు చేశాడు భూలాభాయ్. రెండవ ప్రపంచం మొదలైన నాటి నుంచీ జనాబ్ జిన్నా నాయకత్వం లోని ముస్లిం లీగు ఈశాన్య వాయవ్య రాష్ట్రాలతో ముస్లిం మేజారిటీరాష్ట్రాలను పాకిస్తాన్ పేరుతో నిర్మించాలని కోరింది. జిన్నా వాదం ప్రమాదమైనదని జాతీయ ముస్లిం లు వాదించారు. దేశాన్ని రెండుముక్కలు చేయాల్సిందే అని పట్టుబట్టాడు జిన్నా. భారత దేశం అవిభాజ్యం అన్నది కాంగ్రెస్. పాకిస్తాన్ వాదాన్ని ఖండిస్తూ జాతీయ ముస్లిం లు భావి భారత ప్రజలంతా సంపూర్ణ స్వాతంత్ర్యం తో తులతూగాలని ప్రచారం చేశారు. రాజ్యపద్ధతి ముఖ్యంగా మూడు అంశాలపై ఆధార పడి ఉండాలని వాంచించారు. అ వివరాలు తర్వాత తెలుసుకొందాం.

1-స్వతంత్ర రాజ్యాలతో అఖండ భారత్ ఉండాలి. 2-కేంద్ర ప్రభుత్వమే దేశ రక్షణ విదేశీ వ్యవహారాలూ, నాణాలముద్రణ వగైరాది అధికారాలు కలిగి ఉండాలి 3-హిందువులు అధికసంఖ్యాకులుగా ఉన్న రాష్ట్రాల్లో ముస్లిం లకు సంపూర్ణ మత స్వేచ్చ, అందరితో సమానావకాశాలు, గౌరవ రాజకీయ ప్రతి పత్తితో రాజ్యపద్ధతి

ఉండాలని, పాకిస్తాన్ ఏర్పాటు తమకిష్టం లేదని,ఐకమత్యమే బలమని, ఐకమత్యంలేకపోతే మరో "బాల్కని రాజ్య "అవుతుందని హెచ్చరించారు. కనుక భూలాభాయ్, ఆలీఖాన్ కలిసి కల్సి ఉండే ప్రణాళిక తయారు చేసి వైశ్రాయికి అందజేశారు. ఇందులో ముఖ్యసూత్రాలు -1-కేంద్రంలో తాత్కాలికంగా హిందూ ముస్లిం ల ప్రభుత్వం ఏర్పరచి, అల్పసంఖ్యాకులకు తిన ప్రాతినిధ్యమివ్వటం. 2.ఈప్రభుత్వం ఇండియాచట్టానికి లోబడి పని చేయటం. తర్వాత, కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యులను విడుదల చేయటం మెజార్టీ సభ్యుల నిర్ణయాన్ని బట్టి వైస్రాయి నడుచుకోవటం. 1945 జూన్ 10న పంచగనిలో విశ్రాంతిలో ఉన్న గాంధీజీ ని ఈ ఇద్దరు కలిసి ప్రణాళికకు ఆయన ఆశీస్సులు పొందారు.

వైస్రాయి వేవెల్ లండన్ వెళ్లి, అక్కడి బ్రిటిష్ మంత్రులతో సంప్రదించి, తిరిగివచ్చి, 1945 జూన్ 15 వర్కింగ్ కమిటీ సభ్యులను విడుదల చేశాడు. ప్రణాళికపై చర్చించటానికి సిమ్లాలో కాంగ్రెస్ ముస్లిం లీగ్ మొదలైనపార్టీ ల సభ జరిగింది. అన్ని పార్టీల వారూ వేవెల్ నే నాయకుడుగా అంగీకరించారు. వేవెల్ జూన్ 29నుంచి జులై 14వరకు సమావేశం సాగించి సాగించి చివరికి సంప్రదింపులు భగ్నమయ్యాయనే ఆశ్చర్యవార్త ఆశగా ఎదురు చూస్తున్న వారికి తెలియ జేసి వైఫల్యానికి కారణం తానే అంటూ వేవెల్ ప్రకటించాడు. సిమ్లా సభ విఫలమయ్యాకు భూలాభాయ్ ని జాతీయ వాదులు నిందించారు.వర్కింగ్ కమిటీ సభ్యులంతా జైల్లో ఉంటె స్వతంత్రించి ప్రతిపక్షాలతో ఒడంబడిక చేసుకోవటం ఏమిటని దూషించారు. దేశాయ్ పై చేసిన ఆరోపణలను ఖండిస్తూ కాంగ్రెస్ కార్య దర్శి శ్రీప్రకాశ"నిర్వంధంలో ఉన్న కమిటీ సభ్యులను విడుదల చేయించటానికే భూలాభాయ్ చొరవ తీసుకొన్నాడు. ఆయన చేసింది నూటికి నూరుపాళ్ళు చట్టబద్ధమే. కమిటీ సభ్యులను విడుదల చేయటానికి వైస్రాయి విముఖత చూపటం వలననే ఈ ఆలోచన చేశాడు భాయ్ లేకపోతె మనవాళ్ళ విడుదలకు ఆశలే ఉండేవికావు. విడుదలైనవారికి జరుగుతున్న స్వాగతాలు, వాక్ స్వాతంత్రం, వ్రాసే స్వాతంత్రం వచ్చాయి ఇప్పుడు ఇవన్నీ ఆజంట సాధించిన విజయాలే. సిమ్లాసభ వైఫల్యానికి వైస్రాయేకారణం. జిన్నా వైఖరి మంకుపట్టుకూడా కలిశాయి. జిన్నా ముసల్మానులకు లు ద్రోహం చేశాడు,అతనిలో ముస్లిం అంశ,సంస్కృతీ లేవు ఇన్నాళ్ళూ బూకరిస్తున్న జిన్నాను వైస్రాయి నొక్కాల్సిన చోట నొక్కాడు. "అని డాక్టర్ సయ్యద్ యార్జంగ్ ఒక ప్రకటన చేశాడు. కనుక భూలాభాయ్ తప్పేమీలేదు. అతడు ప్రశంస నీయుడే "అని ప్రకటించాడుశ్రీప్రకాశ.

స్వాతంత్రం కోసం కృషి చేసే యువకులను చూస్తే భూలాభాయ్ కి ఎంతో సరదా. కాంగ్రెస్ వాళ్ళు జైళ్లలో ఉన్నప్పుడు కమ్యూనిస్ట్ లు ఉద్యమ చేయటం చూసి వారిపై సానుభూతికలిగింది భాయ్ కి. సామ్రాజ్యవాదుల మధ్య జరిగిన యుద్ధం ప్రజాయుద్ధమన్నారని ఆగస్ట్ విప్లవాన్ని వెన్నుపోటు పొడిచారని కమ్మీలపై ప్రజలకు కోపం. గాంధీ విడుదలయ్యాక, కమ్యూనిస్ట్ కార్యదర్శి పిసి జోషి ఆయనతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు. గాంధీ వారికి అయిదు ప్రశ్నలు వేశాడు – ప్రజాయుద్ధం అన్న మాటలో ప్రజ అంటే ఎవరు 2-మీ పార్టీ ఆడిట్ కు ఎవరైనా ఒప్పుకుంటారా?3-రెండేళ్లుగా కార్మికులతో సమ్మె చేయించి వారి నాయకుల అరెస్ట్ కు మీరుతోడ్డారని అంటారు నిజమేనా ?4-కాంగ్రెస్ లో చొరబడటం ఒక విధంగా మీ కుటిల నీతి కాదా 5-మీపార్టీ పై ఇతర దేశాల పెత్తనం ఉందికదా ?

తనపై ఆరోపణలను భూలాభాయి సరోజినీ నాయుడు, రాజాజీ వంటి వారి తో కమిటీ వేసి విచారించమని జోషి గాంధీని కోరాడు. తాను చెప్పాల్సిందంతా గాంధీకి చెప్పానని రాజాజీ అన్నాడు. అనారోగ్యం వలన భాయ్ వెంటనే చెప్పలేకపోయినా తర్వాత పరిశీలించి గాంధీకి తన అభిప్రాయం తెలిపాడు. రెండుపార్టీలుభాయ్ ని మధ్యవర్తి గా ఉండ మనటం మాయన నిష్పక్షపాతానికి నిదర్శనం.

**ఆజాద్ హింద్ ఫౌజ్ విచారణ**

భూలాభాయ్ జీవితం లో మహత్తర ఘట్టం ఆజాద్ హింద్ ఫౌజ్ విచారణ. భారత్ నుండి రహస్యంగా జపాను వెళ్ళిన నేతాజీ సుభాశ్ చంద్ర బోస్ నాయకత్వం లో శత్రువులకు భారత ప్రభుత్వ సైన్యం స్వతంత్ర జాతీయ సైన్యం అంటే ఆజాద్ హింద్ ఫౌజ్ గా ఏర్పాడి భారత స్వాతంత్ర్యం కోసం బ్రిటిష్ వారితో పోరాటం మొదలుపెట్టింది. భారత్ నుంచి బ్రిటిష్ వారిని వెడల గోట్టటమే వీరి ధ్యేయం. రెండవ ప్రపంచయుద్ధం పూర్తయి జర్మనీ ఇటలి పరాజయం పొందటం, జపాన్ మిత్రమండలికి లొంగిపోవటం జరిగాయి. ఆజాద్ హింద్ ఫౌజ్ కూడా లొంగిపోవాల్సి వచ్చింది. ఈ సైనికులలో చాలామందిని బ్రిటిష్ ప్రభుత్వం బంధించింది. కొందరిని డిల్లీ లోని ఎర్రకోటలో బంధించి హింసించింది. భారత ప్రభుత్వం ప్రత్యేక కోర్టు ఏర్పాటు చేసి ఈ విషయం విచారించింది. ముందుగా విచారింప బడిన నాయకులు కెప్టెన్ షా నవాజ్, లెఫ్టినెంట్ సైగల్, లెఫ్టినెంట్ ధిల్లాన్. ఈ విచారణపై ప్రపంచం అంతా దృష్టి కేంద్రీకరించింది. ఫౌజుతరఫున వాదించటానికి భూలా భాయ్ దేశాయ్, నెహ్రు, ఆసఫాలీ లను కాంగ్రెస్ ఏర్పాటు చేసింది. ఎక్కువ శ్రమ తీసుకొని నేతాజీ విడుదలకు కారణమైనవాడు భూలాభాయ్. బోసు సర్వ సైన్యాధిపతిగా స్వతంత్ర ప్రభుత్వం ఏర్పాటు చేసి, మాతృదేశం కోసం ప్రాణాలు అర్పించిన బోసువీరులను భారత ప్రభుత్వం రాజద్రోహులుగా పరిగణించటం ప్రపంచ స్వతంత్ర దేశాలన్నీ విని ముక్కు మీద వేలేసుకొన్నాయి. స్వరాజ్యం నా జన్మ హక్కు అని చాటేరోజుల్లో, బ్రిటన్ పై యుద్ధం చేయటం నేరంగా భావించి విచారిస్తున్నదుకు సభ్య ప్రపంచం నివ్వెర పోయింది. లాల్ ఖిల్లా తీర్పుకోసం ఉత్కం తో ఎదురు చూసింది.

భూలాభాయ్ వాదిస్తూ "పరప్రభుత్వం పై యుద్ధ ప్రకటన ప్రతి పరతంత్ర జాతి జన్మ హక్కు "అని గట్టిగా గంభీరంగా ప్రకటించాడు. తన యావత్ శక్తియుక్తులన్నీ ధారపోసి వాదించాడు భాయ్. ఆయనవాదనను విని మెచ్చి సంతోషించని వాడే లేడు ఆనాడు. 112మంది సాకులతో వాఙ్మాలాలు చెప్పించాలనుకొని, కాని ప్రాసిక్యూషన్ వారి 28సాకుల మాటలూ విన్నతర్వాత, అందులో పసలేదని గ్రహించి,, కేవలం 11మంది సాక్షులతోనే సరిపుచ్చి రెండు రోజులు ఫౌజుచర్యను సమర్ధిస్తూ దీర్ఘ ఉపన్యాసాలు చేశాడు. ఆయన సందించిననమౌలిక ప్రశ్నలు –1-పరాధీన జాతికి స్వాతంత్రం కోసం యుద్ధం చేసే హక్కు ఉందా లేదా ?ఉన్నదనటానికి అనేక ప్రమాణాలున్నాయి 2-సువ్యవస్థమైన స్వతంత్ర భారత తాత్కాలిక సైన్యానికి మలయాలో 2లక్షల 50వేలమంది, తూర్పు ఆసియాలో 2లక్షలమంది ప్రజలు భక్తీ విశ్వాసాలు చాటారు. అక్షరాజ్యాల ఆమోదం కూడా పొందింది ఈసైన్యం. ఇవన్నీ యదార్ధ విషయాలే కల్పనలుకావు. 3-ఆజాద్ హింద్

ఫౌజ్ సువ్యవస్థిత సైన్యం, దానికి చట్టముందనీ నేనేమీ శ్రమపడి వాదించ క్కరలేదు. దస్తావేజులపై దస్తావేజులు ప్రాసిక్యూషన్ వారే సమర్పించి రుజువు చేసినందుకు ధన్యవాదాలు. అయితే ఆ చట్టం లో కొరడాలతో కొట్టే నిబంధనను మాత్రమే అడ్వకేట్ జనరల్ అధిక్షేపించారు 4-1911 ఇండియన్ ఆర్మీ చట్టం లో 45వ అధికరణాన్ని ఆయన మర్చి పోయినట్లున్నాడు. అందులో బ్రిటిష్ ఇండియన్ చట్టం కింద దండనార్హం అయిన ఏ సివిల్ నేరానికైనా వారంట్ ఆఫీసర్ హోదా కంటే తక్కువ హోదా ఉన్నవారి ని 30కొరడా దెబ్బలు కొట్టాలని ఉంది. యుద్ధకాలానికి మాత్రం దాన్ని తొలగించారు, కనుక స్టాట్యూ ట్ లో లేదని చెప్పటానికి వీల్లేదుకదా. కొరడా దెబ్బలను ఆమోదించిన సందర్భాలు డిఫెన్స్ ఆఫ్ ఇండియా రూల్స్ లో చాలా ఉన్నాయి. 5-ఫౌజ్ యుద్ధం ప్రకటించటానికి రెండు కారణాలున్నాయి. ఒకటి ఇండియాకు స్వాతంత్రం. రెండు తూర్పు ఆసియా ప్రజల ధనమాన ప్రాణ రక్షణ 6-నూతన ప్రభుత్వానికి జపాన్ ప్రభుత్వం అండమాన్ నికోబార్ దీవులను ధారా దత్తం చేసింది. ఈ ప్రభుత్వం స్వయంగా 50చదరపు మైళ్ళ విస్తీర్ణం ఉన్న "జయవాడే "అనే భూభాగాన్ని సంపాదించింది. సుమారు 1500 చదరపు మైళ్ళ విస్తీర్ణమున్న మణిపూరు, విష్ణు పూరు ప్రాంతాలను అయిదారు నెలలు పాలించింది కూడా. అండమాన్ దీవులను కర్నల్ లోకనాధం రెండు శాఖలు మాత్రమే నిర్వహించాడు. అందులో ఒకటి చిన్నదైన విద్యాశాఖ. స్కూళ్ళు ఎక్కువ లేవు ఖర్చు తక్కువ అని అధిక్షేపించక్కరలేదు. 15శాతం అక్షరాస్యతున్న మనదేశం లో కంటే అక్కడే ఎక్కువ స్కూళ్ళు న్నాయి. ఈ దీవులకు "షాహిద్ ","స్వరాజ్" అనే పేర్లు కూడా పెట్టారు. జయవాడిలో 15వేలమంది ప్రజలున్నారు. వారంతా భారతీయులే, ఆజాద్ హింద్ ప్రతినిధే వీటిని పాలించాడు 7-ఫౌజు ఇండియా-బర్మా సరిహద్దు దాటినప్పుడు రెండు ఫర్మానాలు జారీ అయ్యాయి. ఒకటి స్వతంత్ర భారత ప్రభుత్వ అధ్యక్షుని చేత, రెండవది జనరల్ కావేటే చేత. జపాన్ జయించే భారత్ భూ భాగమంతా ఫౌజు కే అప్పగించబడుతుందనీ, వారే దాన్ని పాలిస్తారని ఫర్మానాల సారాంశం. 8"స్టాంప్ కలె క్టింగ్" అనే వారపత్రికలో టి.యే. బ్రో హెడ్ అనే విలేకరి ఇంఫాలులో ఉపయోగానికి ముక్కాణీ,అణా స్టాంపుల ప్రూఫ్ కాపీలు తానూ చూశానని" ఢిల్లీ కోట" బొమ్మ, "ఢిల్లీ చలో" అనే నినాదం వాటిపై ముద్రించబడి ఉందనీ రెండు భాషలలోనూ "తాత్కాలిక భారత ప్రభుత్వం "అని ఉందనీ, తర్వాత వీటి అవసరంలేక ఆ అచ్చులు భగ్నం చేయబడి స్టాంపులు తగలబెట్ట బడినాయని.కనుక తాత్కాలికప్రభుత్వం ఏర్పడి పరిపాలించటం జరిగింది కనుక దానికి యుద్ధం చేసే హక్కుకూడా ఉన్నదని ఒప్పుకోక తప్పదు.యుద్ధకాలంలో జరిగే పనులు సాధారణ "లా "క్రిందకు రావు. యుద్ధకాలం లో ఒక జర్మన్ పౌరుడు బ్రిటిష్ వాడి నెవరినైనా కాల్చిచంపితే హత్యాద్రోహం కింద శిక్షిస్తారా ?9-అంతర్జాతీయ న్యాయ శాస్త్రం ప్రకారం పరదాస్యం నుంచి విముక్తికావటానికి ఏ దేశమైనా చేసే యుద్ధం ధర్మ సమ్మతమే అవుతుంది. యుద్ధం చేసే ఆ రెండు పక్షాలు స్వతంత్ర రాజ్యాలుగా ఉండనక్కర లేదు. బోయర్ యుద్ధం దీనికి ఉదాహరణ మొదటి చార్లెస్ ను ఉరితీయటాన్ని మీరు ఏమంటారు ?రెండవ జేమ్స్ కధఏమిటి ?"10-ఫౌజు సైనికులు తిరుగుబాటు దార్లే కావచ్చు, కాని 1870లో అమెరికన్ సభాపతి గ్రాంట్ "తిరుగుబాటు దార్ల పోరాటం అంతర్జాతీయ ధర్మం ప్రకారం యుద్ధం కిందకే వస్తుంది "అని బల్ల గుద్ది చెప్పలేదా ? రెండవ పక్షం ఓడిపోయిన వ్యక్తులపై దోషా రోపణ చేయరాదని అమెరికన్ ఫెడరల్ కోర్ట్ ప్రధాన న్యాయమూర్తి పుల్లర్ తీర్పు ఇవ్వలేదా ?11-స్పానిష్ –అమెరికన్ కాలనీలు స్వతంత్రంకోసం స్పెయిన్ దేశం పై తిరుగుబాటు చేస్తే ఆ పోరాటాన్ని సక్రమ యుద్ధం అనే బ్రిటన్ చెప్పలేదా. ప్రభుభక్తి శాశ్వత ధర్మం కాదు. అలా అయితే ఏ పరాధీన జాతీ స్వతంత్రాన్ని పొందనే లేదు 12-ప్రభుభక్తికీ దేశభక్తికీ సంఘర్షణ వస్తే దేశ భక్తినే ఎంచుకోవాలని 1776 అమెరికా స్వాతంత్ర ప్రకటనే గొప్ప నిదర్శనం. ఇదే న్యాయం కాకపోతే ప్రపంచం లో న్యాయాని చోటే ఉండదు 13-"లా ఆఫ్ నేషన్స్ "అనే వాటిల్ ప్రామాణిక ప్రాచీన ఆంగ్ల ధర్మ శాస్త్రం లో "ప్రజల రాజ్య సంరక్షణ కింద ఉన్న ఒక దుర్బల రాజ్యాన్ని, ఆ ప్రజల రాజ్యం రక్షించలేక పోతే, ఆ దుర్బల రాజ్యం వెంటనే స్వతంత్రాన్ని మళ్ళీ పొందుతుంది "అని ఉన్నదాన్ని బట్టి ఆజాద్ హింద్ ఫౌజు నిర్మాణ సందర్భం లో కూడా ఇలాంటిపరిస్థితు లే ఏర్పడ్డాయి 14.చివరగా క్రూరకృత్యాలు హత్యలుజరిపారు అన్న విషయాన్ని ప్రాసిక్యూషన్ సాక్షులే క్రాస్ పరీక్షలో చెప్పలేక పోయారు. ఇక్కడ హింసలు అంటే నియమ ఉల్లంఘన చేసినందుకు శిక్షే కానీ వేరేదీ కాదు అని గ్రహించాలి 15-హత్యల విషయం రుజువే కాలేదు. మహమ్మద్ హుస్సేన్ ను తుపాకీ తో కాల్చినట్లు చేసిన అభియోగం లో ని ముగ్గురు సిపాయిలలో జాగీరాం కు అంతకు ముందు ఎప్పుడూ తుపాకి పట్టనే లేదని చెప్పాడు, ముగ్గురి గుళ్ళూ అతని గుండెలో దిగాయన్న ప్రాసిక్యూషన్ ఆరోపణలో పస లేదనిరుజువైంది కదా. ఇలాంటి మేధో విలసిత అత్యంత అనుభవ పూర్వక భూలా భాయ్ డిఫెన్స్ వాదన కు ప్రభుత్వ మైండ్ బ్లాకై పోయింది. ముద్దాయిలను బేషరతుగా విడిచిపెట్టింది.

బోసు వీరుల విడుదలవగానే భూలా భాయ్ ని అభినందిస్తూ దేశం నలు మూలాలనుంచి అభినందన టెలిగ్రాములు కుప్పలు తెప్పలుగా వచ్చాయి. బోసువీరులూ భాయ్ ని అభినదించారు. బొంబాయి ప్రోగ్రెసివ్ గ్రూప్ సమావేశం లో భాయ్ ప్రసంగిస్తూ "షా నవాజ్, సైగాల్, ధిల్లాన్ లను విచారిస్తున్నప్పుడు భారతజాతీయ సేనకు చెందిన 40వేల మంది ఆఫీసర్లు సామాన్య సైనికులు లాల్ ఖిలాలో విచారింపబడ్డారు. ఈ ముగ్గురు ఆఫీసర్లు భారతీయ యువకులకు ప్రతినిధులు. స్వాతంత్ర్యం తదితర సమస్యల కంటే ఎక్కువ గుణ పాఠం ఫౌజు విచారణలో భారతీయులకు నేర్పింది "అన్నాడు. ఈ విచారణ తర్వాత భాయి రాజకీయాలనుండి విర మించాడు.

భూలాభాయ్ ఆరోగ్యం క్రమంగా క్షీణించింది. దీనికి కారణం ఫౌజు కేసు విచారణలో ఆయన నిద్రాహారాలు మానేసి కృషి చేయటమే అని పెద్దలంతా భావించారు. తీవ్రమైన జబ్బులోకూడా మౌలానా అబ్దుల్ కలాం కోసం" ఆజాద్, ఆజాద్" అని కలవరించాడు. అంతటి మమైక్యం పార్టీతో వ్యక్తులతో ఆయనకు ఉండేది. నాలుగు నెలలు బాధపడి చివరకు 5-5-1946 న స్వాతంత్రం రాకుండానే భూలాభాయ్ దేశాయ్ 68వ ఏట బొంబాయి స్వగృహం లో మరణించాడు. పెద్ద ఊరేగింపుగా ఆయనను స్మశానానికి వేలాది అభిమానులు పౌరులు పెద్దలతో తీసుకు వెళ్లి అంత్యక్రియలు నిర్వహించారు. ఆజాద్ హింద్ ఫౌజ్ సైనిక లాంచనాలతో తమ నివాళి అర్పించింది.

.గాంధీ "మహా నాయకుడు దేశాయ్. ఆయన బాధ కు పరి సమాప్తి లభించింది. అందరికి ఆయన ఆదర్శనీయుడు 'అన్నాడు. ప్రకాశం పంతులు "క్రాస్ పరీక్షలో మేటి. న్యాయ శాస్త్ర మేధావి "అన్నారు. ఆజాద్ "అసెంబ్లీలో నాయకుడుగా గొప్ప దేశ సేవ చేశాడు ఈ కేసు ద్వారా అంతర్జాతీయ న్యాయ శాస్త్రం లో ఒక నూతన అధ్యాయం ఆవిర్భవించింది ".నెహ్రూ "బోసు వీరుల విచారణలో ఆయన ప్రసంగం చిరస్మరణీయం ".జిన్నా "నాతో ఏకీభవించలేదు కాని మాస్నేహం భంగం కాలేదు ".ఆలీఖాన్ "ఆయన ప్రసంగాలు శ్రోత్ర పేయాలు ".కెప్టెన్ షా నవాజ్ "మా దేశ ప్రజలే మమ్మల్ని జపాను చేతిలో కీలు బొమ్మలు అంటారని భయపడ్డాం. దేశాయ్ ధైర్యంగా ముందుకొచ్చి నేతాజీ గౌరవాన్ని, దేశ గౌరవాన్ని కాపాడాడు ".సరోజినీ నాయుడు "దయ ఉదారహృదయం ఉన్నవాడు ఆయన చేసిన దానాలకు లెక్కే లేదు. స్వాతంత్రం కోసం త్యాగం చేశాడు ". కెప్టెన్ సెహ్గల్ "జీవించి ఉంటె స్వతంత్ర భారతానికి ఇంకా ఎక్కువ తోడ్పడి ఉండేవాడు ".రాజాజీ "కుశాగ్ర బుద్ధి కుసుమకోమల హృదయుడు. ప్రపంచంలో ఎక్కడా ఇలాంటి వ్యక్తిని నేను చూడలేదు ".అల్లాడి కృష్ణస్వామి అయ్యర్ "దేశానికి స్వతంత్రం రాకముందే మరణించటం విచారకరం ".కేఎం మున్షి "నేను దేశాయ్ శిష్యుడిని. ఆయన లేని లోటు తీర్చలేనిది ".జెవి మౌలంకర్ "భారత దేశ యోగ క్షేమాలకోసం న్యాయశాస్త్రాన్ని ఉపయోగించిన ఉత్తమ వ్యక్తి ".సర్దార్ పటేల్ "ఆయన సేవలకు దేశం ఎంతో రుణపడి ఉంది ".డా.రాజేంద్ర ప్రసాద్ "ఆయనమరణం నన్ను కలచి వేసింది ".డా.లతీఫ్ "రాజీ పద్ధతిలో సిద్ధహస్తుడు దేశాయ్ ".కే భాష్యం"నాయకులకు ఆయన సలహాలు అత్యంత అవసరమైన తరుణం లో మరణించాడు ".వివి గిరి "రాజనీతిజ్ఞుడైన న్యాయవాది ".రామస్వామి అయ్యర్ "అనేక సంస్థానాలు ఆయన సలహా కోరేవి. ఆరోగ్యం బాగాలేకపోయినా ఫౌజు కేసు చేబట్టిన ధీమూర్తి ". హరేకృష్ణ మెహతాబ్ "దేశాయ్ విశదీకరణ విప్లవకారులకు శిలాశాసనం ".గోపీనాధ బార్డో లాయ్"దేశ స్వాతంత్రంకోసం వాదించిన అత్యుత్తమన్యాయవాది దేశాయ్ 'ఒక ఉజ్వల తార అస్తమించింది "అంటూ ప్రముఖులు నివాళి అర్పించారు. మద్రాస్ లో సానుభూతి తీర్మానం చేశారు. పెక్కు చోట్ల హర్తాల్ జరిగింది. పత్రికలూ ప్రత్యేక వ్యాసాలు రాశాయి. ధన్యజీవిగా అభి వర్ణించాయి.

బ్రిటన్ లో చర్చిల్ ప్రభుత్వం పోయి, లేబరు ప్రభుత్వం రాగానే పార్లమెంటరీ రాయబారులు ఇండియా వచ్చి ఇక్కడి దుస్థితిని ప్రభుత్వానికి తెలియజేశారు. ప్రతిస్టంభన పరిష్కారం కోసం ముగ్గురు మంత్రులను పంపింది. వారొచ్చి,గాంధీ జిన్నా మొదలైనవారితో సిమ్లాలో సంప్రదింపులు జరుపుతుండగా భూలాభాయ్ మరణ వార్త తెలిసింది. భూలాభాయి ఆత్మకు శాంతికలగాలని అందరూ కోరారు

# హరిజన సేవలో శ్రీమతి రామినేని రామానుజమ్మ



మధ్యప్రదేశ్ లోని బిలాస పూర్ లో జన్మించి, ఆంధ్ర ప్రదేశ్ లో కృష్ణాజిల్లాలో ఒక కుగ్రామానికి కోడలుగా వచ్చి మహాత్ముని పిలుపుకు స్పందించి సంఘ సేవలో అందునా ముఖ్యం గా హరిజన సేవలో జీవితాన్ని ధన్యం చేసుకొన్న పునీతురాలు శ్రీమతి రామినేని రామానుజమ్మ. ఆమె చరిత్ర అన్ని తరాలకూ ఆదర్శమే.

'' గాంధీ టోపీ గవర్నర్ ''అని ప్రసిద్ధి చెందిన కృష్ణా జిల్లా పామర్రుకు దాగ్గరలో ఉన్న పెదమద్దాలి కు చెందిన ఈడ్పు గంటి రాఘుపేంద్ర రావు గారి అక్కగారు రామినేని రామనుజమ్మ గారు. తండ్రిగారు నాగన్న గారు. తమ్ముడు రాఘు పేంద్ర రావు గారు మధ్య ప్రదేశ్ లోని బిలాస పూర్ లో వ్యాపారం చేస్తున్నప్పుడు 1880 లో జన్మించారు. రాఘు పేంద్ర రావు గారు ఇంగ్లాండ్ వెళ్లి బారిస్టర్ పాసై ఇండియా కు తిరిగివచ్చి కొంతకాలం న్యాయ వాద వృత్తి చేసి జాతీయ నాయకులు బాల గంగాధర తిలక్ ప్రభావంతో రాజకేయ ప్రవేశం చేసి బిలాస పూర్ మునిసిపల్ చైర్మన్ అయ్యారు. గాంధీజీ నాయకత్వాన ఉద్యమాలలో పాల్గొన్నారు. స్వశక్తితో ఎదిగి రెండేళ్ళు నాగపూర్ ప్రావిన్స్ ప్రధాన మంత్రిగా, ఏడేళ్ళు హోమ్ మంత్రిగా నాలుగు నెలలు గవర్నర్ గా పని చేశారు. ఇంతటి చైతన్య శీలి కి రామానుజమ్మ గారు అక్కగా పుట్టటం అదృష్టం.

రామానుజమ్మ గారు కృష్ణా జిల్లా ఉయ్యూరు కు దగ్గరలో ఉన్న కుమ్మమూరు గ్రామం లో రామినేని వియ్యన్న గారి ని వివాహ మాడి రామినేని వారి ఇంటి కోడలయ్యారు. భర్త మంచి స్థితి పరులు గొప్ప భూస్వామి, గ్రామ మునసబు. వియ్యన్న గారు ఉయ్యూరు లో 1909 లో ఏర్పడిన ''ఉయ్యూరు లిటరరీ అసోసియేషన్ అండ్ సోషల్ క్లబ్ ''కు వ్యవస్థాపక సభ్యులు. ఒక కుమారుడు కౌసలేంద్ర రావు పుట్టిన తర్వాత భర్త మరణించారు. కౌసలేంద్ర రావు గారికి ఈడుపు గంటి రాఘు పేంద్రరావు గారు మేనమామ. హిందీ రాష్ట్రం లో ఉండటం వలన రామానుజమ్మ గారికి సహజం గా హిందీ అలవడింది. మరాఠీలో ప్రావీణ్యం సంపాదించారు. విజయవాడ లో భండారు అచ్చమాంబ గారి వద్ద ఇంగ్లీషు, తెలుగు నేర్చారు. అత్తవారింట కుమ్మమూరు గ్రామం లోనే ఉంటూ పిల్లవానిని పెంచుతూ సమాజ సేవ చేశారు.

హరిజనుల కోసం పాఠశాలను కుమ్మమూరు గ్రామం లో నిర్మించి పేద హరిజన విద్యార్థులకు విద్యా సౌకర్యం కలిగించిన వితరణ శీలి రామానుజమ్మ గారు. భారత జాతీయోద్యమం లో చురుకుగా పాల్గొన్నారు. హిందీ భాషలో మంచి ప్రజ్ఞ ఉండటం చేత 1921 లో ''పుత్రోపహారం ''అనే హిందీ గ్రంధాన్ని తెలుగులోకి అనువదించారు. దీనిలో బాలలు సత్ ప్రవర్తన కలిగి ఉండాలని దానికోసం ఎలా నడుచుకోవాలో తెలియ జేశారు. ఆదర్శం గా జీవించి అనేక సంస్థలకు వ్యక్తులకు దాన ధర్మాలు చేసి విద్యా వ్యాప్తికీ సాంఘిక మార్పులకు దోహద పడ్డారు.

రామినేని రామానుజమ్మ గారు 97 ఏళ్ళు సార్ధక జీవితం గడిపి 1977 లో మరణించారు.

# శ్రీమతి గోళ్ళమూడి రత్నమ్మ

ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధురాలు, ప్రధాన నియంత, దళపతి



1886 లో గుంటూరు జిల్లా తెనాలి తాలూకా చేబ్రోలులో వాసి రెడ్డి సాంబయ్య, పార్వతమ్మలకు గొల్లమూడి తత్నమ్మ ఏకైక సంతానం గా జన్మించారు. చిన్ననాటి నుంచి చదువుపై అమిత శ్రద్ధ కనబరచేవారు. సంపన్న కుటుంబం కనుక ఆడ వారికి ఘోషా పద్ధతి ఉండేది. స్వయం గా నేర్చి తెలుగు కవిత్వం అల్లేవారు. చేబ్రోలుకు చెందిన గొల్లమూడి చంద్ర మౌళి గారితో రత్నమ్మ గారి వివాహం జరిగింది. 1921 లో గాంధీజీ చేబ్రోలు సందర్శించారు. ఆయన ఉపన్యాసాలకు ప్రభావితురాలైనారు. దేశ సేవలో పాల్గొని తానూ ధన్యత చెందాలని నిశ్చయించుకొన్నారు. గాంధీ ప్రభావం తో రాట్నం వడకటం నూలు తీయటం ఖాదీ ధరించటం చేశారు.

దురదృష్ట వశాత్తు రత్నమ్మ గారి భర్త అకస్మాత్తుగా చనిపోవటం తో ఆమె జీవితం లో శూన్యం ఏర్పడింది. సంతానమూ లేదు. ఈ బాధ భరించలేక తల్లడిల్లి పోయారు. క్రమంగా కోలుకొని 1928 మద్రాస్ కాంగ్రెస్ సభలకు హాజరయ్యారు. 1930 ఉప్పు సత్యాగ్రహం లో ఉత్సాహం గా పాల్గొన్నారు. తానూ, తన తల్లిగారు సన్నని నూలు వాడికి దానితో వస్త్రాలు నేయించి కాంగ్రెస్ నేతలకు కానుకగా ఇచ్చేవారు. విదేశీ వస్త్ర బహిష్కరణ లోనూ తీవ్రం గా పాల్గొని విదేశీ వస్త్ర దుకాణాల ముందు పికెటింగ్ నిర్వహించి వాటిని మూయిస్నేవారు. చక్కగా ఉపన్యాసాలు చేస్తూ తోటివారిని ప్రోత్సహించి ఉద్యమం లో పాల్గొనే నేర్పు రత్నమ్మ గారికి ఉండేది. ఇవన్నీ బ్రిటిష్ ప్రభుత్వానికి కారం రాసినట్లనిపించేవి. ఆమెను "విప్లవ వనిత"గా ముద్ర వేసి అరెస్ట్ చేసి ఆరు నెలలు జైలు శిక్ష వేశారు. పది హేను రోజులు జైలులో గడిపిన తర్వాత గాంధీ –ఇర్విన్ ఒడంబడిక ననుసరించి జైలు నుండి విడుదలయ్యారు..

అయినా రత్నమ్మగారు ఉద్యమ కార్యక్రమాలను ఆపలేదు. మరింత ఉత్సాహం గా నిర్వహించారు కాంగ్రెస్ వాలంటీర్ లతో కలిసి గ్రామాలు పర్య టించి స్వాతంత్ర సముపార్జన అవసరాన్ని తెలియ జేసేవారు ఖాదీ ప్రచారమూ నిర్వహించారు. శాంతి సైనికుల శిక్షణ కోసం శిబిరాలు నిర్వహించారు.పురుషులపై పోలీసులు లాఠీ చార్జి చేసి అరెస్ట్ చేస్తే స్త్రీలతో కలిసి పికెటింగ్ చేశారు. ఆమె మహా చురుకుగా ఆలోచించి అంతే వేగం గా కదిలేవారు. ఎక్కడ పికెటింగ్ జరిగినా రత్నమ్మ గారు ముందు ఉండేవారు. మార్గ దర్శనం చేసేవారు. ప్రోత్సాహం ఇచ్చి ముందు నిలిచేవారు.

1923 శాసనోల్లంఘన సమయం లో ఆమె ముందుండి ఉద్యమించి, పికెటింగ్ చేస్తే అరెస్ట్ చేసి వదిలిపెట్టారు. ఏ మాత్రం భయ పడకుండా మళ్ళీ స్త్రీలతో 75 ఏళ్ళ వృద్ధురాలైన తల్లిగారితో కలిసి సత్యాగ్రహం చేశారు. పోలీసులు మళ్ళీ వీరందర్నీ అరెస్ట్ చేసి విచారణ జరిపి ఆరు నెలలు ఖైదు విధించారు. విడుదల వగానే తీవ్రంగా మళ్ళీ ఉద్యమాలు నిర్వహించారు.

1935 గుంటూరు "ఆంధ్ర రాష్ట్ర మహిళా సభ "కు అధ్యక్షత వహించి ఉద్యమ తీవ్రతను తన ప్రసంగం లో వివరించారు. ఆమె కృషికి మెచ్చిన రాష్ట్ర కాంగ్రెస్ సంఘం రత్నమ్మగారిని "మహిళా నియంత లందరిపైనా "దళాధి పతిగా, ప్రధాన నియంతగా" నియమించింది. రెట్టించిన ఉత్సాహం తో స్త్రీలందరినీ అధిక సంఖ్యలో ప్రోత్సహించి శాసన ధిక్కారం చేయిన్చారామే. ఇక ఆమెను ఆపటం కష్టం అనుకొన్న బ్రిటిష్ ప్రభుత్వం అరెస్ట్ చేసి పది నెలలు శిక్ష విధించింది. రైతు బాంధవుడు ఆచార్య రంగా నిడుబ్రోలు లో ప్రతి ఏడాది నిర్వహించే రాజ కీయ పాఠశాలో రత్నమ్మ పాల్గొనేవారు. దేశం లో ఏమూల కాంగ్రెస్ సమావేశాలు, సభలూ జరిగినా తప్పకుండా వెళ్లి హాజరయ్యేవారు. జిల్లా కాంగ్రెస్, రాష్ట్ర కాంగ్రెస్ సభ్యురాలై కాంగ్రెస్ ప్రచారం చేశారు.

1936 ఎన్నికలలో గుంటూరు జిల్లా బోర్డుకు తెనాలి రెవిన్యు ఫిర్కా నుండి రత్నమ్మగారిని కాంగ్రెస్ అభ్యర్ధిగా ఎంపిక చేశారు. 1939లో గుంటూరు జిల్లాబోర్డు సభ్యులయ్యారు. 1939లో చేబ్రోలు లో మహిళా గ్రంధాలయాన్ని స్థాపించి అధ్యక్షురాలైనారు. మహిళాభి వృద్ధే దేశాభి వృద్ధి అని త్రికరణ శుద్ధిగా నమ్మి పని చేసేవారు. చేబ్రోలు లో మరుసటి ఏడాది స్త్రీలకూ హిందీ విద్యాలయం ఏర్పాటుకు సాయపడ్డారు. అదే తర్వాత గుంటూరు హిందీ మహా విద్యాలయం గా పేరు పొందింది. ఏది చేపట్టినా అభి వృద్ధి చేసి చూపి సామర్ధ్యాన్ని నిరూపించిన మహిళా మాణిక్యం రత్నమ్మ గారు. ఆమె చొరవ, పూనిక అలాంటిది. ధన సహాయం విరాళాల సేకరణ వనరుల చేకూర్పు లలో ఆమె తోడ్పాటు మరువ లేనిది.

1940 వ్యక్తి సత్యాగ్రహం లో ముందున్నారు. క్విట్ ఇండియా ఉద్యమం లో పాల్గొని అరెస్ట్ అయి శిక్ష పడకుండానే విడుదలయ్యారు రత్నమ్మగారు. 1944 జనవరి 26 స్వతంత్ర వేడుక లను పెద్ద ఎత్తున బ్రహ్మాండం గా జరిపారు. దీనికి ఫలితం ఆరు నెలల కారాగార శిక్ష అనుభవం. 1945 నిడుబ్రోలు ఆంధ్ర మహిళా శిక్షణ కేంద్రం ఏర్పరచారు. గురువుగా ఉండి అన్నీ పకడ్బందీ గా చేశారు. అదొక పండుగ లాగా జరిగిందని ఇప్పటికీ జనం చెప్పుకొంటారు. 1946 ఎన్నికలలో కాంగ్రెస్ అభ్యర్ధుల విజయానికి తీవ్ర కృషి చేశారు.

సత్తెన పల్లి లో తన గురువు గారి మఠానికి విరాళాలు ఇచ్చి, సేకరించి తోడ్పడ్డారు. శాశ్వత ఆదాయం లభించే ఏర్పాటు చేశారు. చేబ్రోలు లో గురువుగారి పేర మఠం కట్టించినిర్వహణ కోసం భూమిని, నిధిని సమకూర్చారు. స్వయం గా బ్రహ్మ విద్య బోధించారు. ఇక్కడే మహాత్ముని కస్తూరి బాయిల చిత్రపటాలను ఆవిష్కరించారు. గ్రంధాలయాన్ని కూడా స్థాపించి స్వాతంత్ర్య సమరయోధులను ఆహ్వానించి గౌరవించి సత్కరించేవారు. రత్నమ్మ గారి తల్లిగారు స్వాతంత్రోద్యమం లో పాల్గొని జైలు శిక్ష అనుభవించారు. ఆమె 91 ఏట గాంధీజీ జయంతి నాడు మరణించారు. అప్పటినుండి రత్నమ్మ గారు గాంధి జయంతిని, తల్లిగారి వర్ధంతిని కలిపి ఘనం గా నిర్వహించేవారు. తనకున్న సంపద నంతటినీ దేశం కోసం వినియోగించిన త్యాగ మూర్తి రత్నమ్మగారు. 88ఏళ్ళ ధన్య జీవితాన్ని గడిపి దేశ భక్త గొల్లమూడి రత్నమ్మ గారు 5-7-1972 న స్వర్గస్తులయ్యారు. రత్నమ్మ గారి జీవితం స్ఫూర్తిదాయకం, చిరస్మరణీయం. ఆమె ఒక మహిళా మాణిక్యం.

# ఘన "నీలం " మా గురువు సంజీవ రెడ్డి

నాకు ఎనిమిది తొమ్మిది ఏళ్ళ వయసులో (1948-49) అనంత పురం జిల్లా హిందూ పూర్ లో మా నాన్న మృత్యుంజయ శాస్త్రి గారు అక్కడి ఎడ్వర్డ్ కారోనేషన్ మునిసిపల్ హైస్కూల్ లో సీనియర్ తెలుగు పండితులుగా పని చేస్తున్న కాలం లో మొదటి సారిగా ఆ స్కూల్ గ్రౌండ్ లో జరిగిన సభలో నీలం సంజీవ రెడ్డిని, బాబూ రాజేంద్ర ప్రసాద్ ను చూశాను.. రెడ్డి మాట తీరు నాకు ఎందుకో మహా నచ్చింది. ఆయన పై వీరాభిమానం మనసులో ఏర్పడి పోయింది. అలాగే రాజెన్ బాబు అన్నా ఆరాధనా భావం మనసంతా నిండి ఉంది అప్పటికీ ఇప్పటికీ. ఆ తర్వాత నా చదువు, ఉద్యోగం లో రెడ్డిపై గాఢ మైన అభిమానం పెరిగింది. ఆయన పదవిలో ఉన్నాలేక పోయినా పదవులను తృణ ప్రాయం గా వదిలేసినా ఉన్నత శిఖరాలు అధిష్టించినా ఇది పెరిగిందే కాని తగ్గలేదు. నాకు తోడూ నాతో పని చేసిన నాసహా ఉపాధ్యాయుడు పసుమర్తి ఆంజనేయ శాస్త్రి కీ స్వర్గీయ టి.ఎల్.కాంతా రావు కూ కూడా రెడ్డిపై నాలానే అభిమానం ఉండేది మేము రెడ్డిని "మన గురువు గారు లేక మన గురువు "అని మా సంభాషణల్లో అనుకొనే వాళ్ళం. అందుకే ఆయన్ను గురువు సంజీవ రెడ్డి అన్నాను. మరి ఆయన శీలం నీలమణి కనుక ఘన నీలం అన్నాను









.

బ్రహ్మానంద రెడ్డి కాంగ్రెస్ (ఓల్డ్ కాంగ్రెస్) పార్టీ తరఫున ప్రచారం చేస్తూ శిష్యుడు పెండేకంటి వెంకట సుబ్బయ్య తో పర్యటన చేస్తూ ఉయ్యూరు కు వచ్చినప్పుడు చూశాను అప్పటికే పెండేకంటి గురువుకు పంగనామాలు పెట్టి బాక్ టు పెవిలియన్ అయ్యాడు. రెడ్డిఒక్కడే ఉయ్యూరు వచ్చాడు. రహదారి బంగళాలో ఉన్నాడు. అప్పుడు ఇంకా మీటింగ్ మొదలు కాలేదు. జనమూ పెద్దగా లేరు. లోపల వాలు కుర్చీలో తెల్లటి ఖద్దరు పంచ, ఖద్దరు లాల్చీ నెత్తిన గాంధీ టోపీ తో కూర్చుని ఉన్నాడు. అప్పుడు ధైర్యం గా నేను ఆయన దగ్గరకు వెళ్లి పలకరించి నమస్కారం చేశాను. షేక్ హాండ్ ఇచ్చాను సంతోషం గా స్వీకరించాడు. కాని జన ప్రభావం లేనందున మనసులో కొంచెం కలవరం గా ఉన్నట్లు అని పించింది. ఆ తర్వాత మీటింగ్ ప్రారంభామవటం ఆయన మాట్లాడి వెళ్లి పోవటం జరిగింది. కనుక "నా అభిమాన హీరో" ను కలిసి, తాకి, మాట్లాడిన అను భూతి నాకెంతో గర్వం గా ఉండేది. ఇది అందరికి చెప్పి పులకరించి పోయే వాడిని అంతటి అదృస్టం నన్ను వరించిందని పొంగిపోతానేప్పుడూ.

సంజీవ రెడ్డి ని కాంగ్రెస్ పార్టీ దేశ ప్రెసిడెంట్ పదవికి కాంగ్రెస్ అధికార కమిటి ఇందిరా గాంధి నాయకత్వం లో ఆమోదించి డిక్లేర్ చేసింది. ఇది ఆ తర్వాత ఇందిరకు ఇష్టం కాక గిరి ని బరిలో దింపింది, అంతరాత్మ ప్రబోధం అంది. పార్టీ కాండిడేట్ రెడ్డి ఓడిపోయాడు చెంచాలని పిలువ బడ్డ "గిరి 'ప్రెసిడెంట్ అయ్యాడు హోరా హరీ జరిగిన ఈ పోరాటం లో నేను రెడ్డి నే సమర్ధించా. రెడ్డి గెలవాలని అందరితో చెప్పేవాడిని మా ఆంజనేయ శాస్త్రి కూడా అలానే కలలు కన్నాడు. కాని ఓడిపోయాడు. ఓడినా హుందాగా వెళ్లి పోయి తన పుట్టిన ఊరిలో జామ తోటలో కూర్చున్నాడు

అవసరమైతేనే మాట్లాడేవాడు. కాని దేశం క్లిష్ట పరిస్తితుల్లో ఉంటె తన అభిప్రాయాన్ని కుండ బద్దలు కొట్టి నట్లు చెప్పే నైజం ఖలేజా ఉన్న మొనగాడు రెడ్డి. సంకోచం నదురూ బెదురూ ఉండేది కాదు అందుకే నాకు అభిమానం పెరుగుతూ వచ్చింది జనతాపార్టీ ఏర్పడటంలోక నాయక, జయప్రకాష నారాయణ నాయకత్వం లో రెడ్డి పని చేసి ఆంద్ర ప్రదేశ లో జనతా పార్టీ వారంతా పార్ల మెంటు ఎన్నికలలో ఒడి పోతే తానొక్కడే గెలిచి రెండో సారి స్పీకర్ అయి మొరార్జీ ప్రధాని అయి రెడ్డినే ఏకగ్రీవం గా ప్రెసిడెంట్ ను చేయటం చారిత్రాత్మక విషయం. బంతి కింద పడినా మళ్ళీ పైకి ఎగురుతుందని తెలియ జెప్పిన పరమ సత్యం. అందుకే ఆయనపై నా ఆరాధనా భావం పెరుగుతూనే ఉంది. ఒక మట్టి మనిషి గ్రామ స్తాయి నుండి దేశ స్తాయిలో ప్రధమ పౌరుడు అవటం, ఈ మధ్యలో స్పీకర్ కేంద్ర మంత్రి రాష్ట్ర ముఖ్యమంత్రి మంత్రి పదవుల్ని అలంకరించటం పార్టీ పదవులకు శోభ తేవటం అసాధారణమైన విషయం అందుకే రెడ్డి అంటే అంతటి అభిమానం

.'



భారత దేశానికి సంజీవ రెడ్డి ఆరవ రాష్ట్ర పతి 1977 నుంచి 82 వరకు పదవిలో ఉన్నాడు దానికి వన్నె తెచ్చాడు అప్పుడు వైస్ ప్రెసిడెంట్ బసప్ప దానప్ప జెట్టి హిదయతుల్లాలు రెడ్డి తర్వాత జెట్టి ఆక్టింగ్ ప్రెసిడెంట్ అవగా జైలు సింగ్ ప్రెసిడెంట్ అయ్యాడు. అంతకు ముందు సంజీవ రెడ్డి రెండవ సారి నాల్గవ లోక్ సభ స్పీకర్ అయ్యాడు. మార్చ్ 77 నుంచి జులై పదిహేడు వరకు చేశాడు అంతకు ముందు బలీరాం భగత్ ఉండేవాడు రెడ్డి తర్వాత కే.ఎస్.హెగ్డే అయ్యాడు ఆంద్ర ప్రదేశ్ ముఖ్య మంత్రిగా సంజీవ రెడ్డి 1962 నుంచి 64 వరకు పని చేశాడు అప్పుడు గవర్నర్ భీమ సేన్ సచార్ రెడ్డికి ముందు దామోదరం సంజీవయ్య తర్వాత కాసు బ్రహ్మానంద రెడ్డి అయ్యారు ఇలా కీలక పదవుల్లో ఉన్నాడు

సంజీవ రెడ్డి పుట్టిన ఊరు అనంతాపురం జిల్లాలోని "ఇల్లూరు "అనే పల్లె టూరు ప్రాధమిక విద్య ఇక్కడే చదివి తర్వాత మద్రాస్ అడయార్ లోని దియాసఫికల్ స్కూల్ లో చేరి,అనంతపురం లో డిగ్రీ పూర్తీ చేశాడు. నాగరత్నమ్మ ను వివాహమాడాడు వీరికి ఒక కొడుకుముగ్గురు కూతుర్లు. గాంధీజీ పిలుపు విని స్వాతంత్ర సమరం లో పాల్గొన్నాడు యూత్ లీగ్ కు నాయకుడయ్యాడు. ఆంద్ర ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ సెక్రటరి గా పదేళ్లున్నాడు క్విట్ ఇండియా ఉద్యమలో చేరి అరెస్ట్ అయి 1940 -45 కాలం లో జైలు లో ఉన్నాడు 1942 లో విడుదల అయినా మళ్ళీ ఖైదీ అయి అమరావతి జైలు కు పంప బడ్డాడు అక్కడే ప్రముఖ స్వాతంత్ర సమారయోధులు ప్రకాశం పంతులు కామ రాజు సత్య మూర్తి వి వి.గిరి లతో శిక్ష అనుభ వించాడు.

1946 లో సంజీవ రెడ్డి మద్రాస్ లెజిస్లేటివ్ అసెంబ్లీ కి ఎన్నికై, లెజిస్లేటివ్ పార్టీ కి సెక్రటరి అయ్యాడు భారత రాజ్యంగా రచనా సంఘం లో సభ్యుడయ్యాడు మద్రాస్ ప్రభుత్వ ప్రోహిబిషన్ అడవులు గృహ మంత్రిగా పని చేశాడు 1951లో ఆంద్ర

ప్రదేశ్ కాంగ్రెస్ కమిటి ప్రెసిడెంట్ గా ఉన్నాడు 1952 లోఆంద్ర రాష్ట్రానికి టంగుటూరి ప్రకాశం పంతులు గారు ముఖ్య మంత్రి సంజీవ రెడ్డి ఉప ముఖ్య మంత్రి గా పని చేశారు తెలంగాణా తో కలిసి ఆంద్ర ప్రదేశ్ ఏర్పడ్డప్పుడు ఆంద్ర ప్రదేశ్ కు మొదటి ముఖ్య మంత్రి 1956-60 లో సంజీవ రెడ్డి అయ్యాడు రెండవసారి ముఖ్య మంత్రిగా 62-64 ఉన్నాడు మొత్తం మీద అయిదేళ్ళు ముఖ్య మంత్రిగా చేశాడు. శ్రీ కాళ హస్తి నుంచి ద్రోణా చలం నుంచి శాసన సభకు ఎన్నికయ్యే వాడు శ్రీశైలం నాగార్జున సాగర్ ప్రాజెక్టుల నిర్మాణం రెడ్డి హయాం లోనే ప్రారంభమయ్యాయి శ్రీశైలం ప్రాజెక్ట్ నుముఖ్యమంత్రి చంద్ర బాబు నాయుడు "నీలం సంజీవ రెడ్డి సాగర్ " "అనిమార్చి గౌరవమ్ కల్గించాడు రెడ్డి గ్రామీణాభి వృద్ది వ్యవసాయం లకు అధిక ప్రాధాన్యతనిచ్చాడు 1964 లో అఖిల భారత కాంగ్రెస్ కు అధ్యక్షుడైనప్పుడు సంజీవ రెడ్డి ముఖ్య మంత్రి పదవికి రాజీ నామా చేశాడు. బస్సుల జాతీయీకరణ లో సుప్రీం కోర్ట్ చేసిన వ్యాఖ్యానానికి స్పందించి 1964 లో ముఖ్యమంత్రి పదవి నుంచి తప్పుకొన్నాడు.

కాంగ్రెస్ ప్రెసిడెంట్ గా బెంగుళూర్ భావనగర్ పాట్నా లలో భారీ సదస్సులు నిర్వహించాడు నీలం. 1962 గోవా కాంగ్రెస్ సభలో గోవా విముక్తి ని చైనా దురాక్రమణ ను తిప్పి కొట్టటానికి చేసిన ప్రసంగం ఏంతో స్పూర్తి నిచ్చి రెడ్డి నాయకత్వానికి యేన లేని కీర్తిని తెచ్చింది. లాల్ బహదూర్ శాస్త్రి ప్రధాన మంత్రి గా ఉన్నప్పుడు సంజీవ రెడ్డి కేంద్ర మంత్రి వర్గం లో ఉక్కు గనుల శాఖా మంత్రిగాఇందిరా ప్రభుత్వం లో సివిల్ ఏవియేషన్ షిప్పింగ్ శాఖా మంత్రిగా సమర్ధం గ 1967 వరకు పని చేశాడు పని చేశాడు అప్పుడే విమాన ప్రమాదం లో హోమీ జహంగీర భాభా అనే అను శాస్త్ర వేత్త మరణించాడు 1969 లో దేశాధ్యక్ష పదవికి పోటీ చేసమయం లో స్పీకర్ పదవికి రాజీ నామ చేశాడు గిరి చేతిలో స్వల్ప మెజారిటి తో ఇందిరా కుతంత్రం తో ఓడిపోయినా తర్వాత అనంత పురం వెళ్లి పోయి వ్యవసాయం చేసుకొంటూ కాలం గడిపాడు.

జనతా పార్టీ చేతిలో ఇందిరా ఓడిపోయినప్పుడు రెడ్డి లోక్ సభకు ఎన్నికై రెండో సారి స్పీకర్ అయి ఏకగ్రీవం గా 1977 లో రాష్ట్ర పతి అయ్యాడు ఓడి మళ్ళీ ఆ పదవిని దక్కించుకొన్న వాడుగా చరిత్ర పుటల్లో నిలిచి పోయాడు రెడ్డి ఇలా ఏక గ్రీవం గా అయిన మొదటి వాడని పించుకొన్నాడు నీలం. మొరార్జీ చరణ్ సింగ్ మళ్ళీ ఇందిరా ప్రభుత్వాలలున్నప్పుడు నీలమే ప్రెసిడెంట్.. తన జీవిత చరిత్రను "reminiscences and reflections of a president "గా రాసుకొన్నాడు.

అంతకు  ముందు "వితౌట్ ఫియర్ ఆర్ ఫేవర్ "పుస్తకం రాశాడు పి.వి.నరసింహ రావు ఆత్మ కదా లో మహేంద్ర నాద కేరక్టర్ సంజీవ రెడ్డియే ఆయనకు ఆయన శిష్యుడైన బ్రహ్మానంద రెడ్డి కి జరిగిన రాజ కీయ పోరు నరసింహ రావు చిత్రించాడు. 1996 లో ఎనభై మూడేళ్ళ వయసులో సంజీవ రెడ్డి నీలం అమరుడైనాడు. విలువలకు నిర్భీతికి నిజాయితీకి పట్టుదలకు రాజకీయ చాణక్యానికి, పెద్దమనిషి తత్వానికి హుందా తనానికి,ఆత్మా గౌరవానికి, నిబద్ధతకు,అంకిత   భావానికి మీదు మిక్కిలిమహా దేశ భక్తికి జాతీయతకు  నీలం సంజీవ రెడ్డి గొప్ప ఉదాహరణ అందుకే ఆయన అంటే అంత ప్రేమాభిమానాలు నాకు

నీలం వారి శత జయంతికి రాష్ట్ర పతి ప్రణబ్ ముఖర్జీ రావటం అయన పై ప్రశంసలు కురిపించటం అటు  కేంద్రం ఇటు  రాష్ట్ర ప్రభుత్వం. చేసిన ఘన మైన ఏర్పాటు లు అభినంద నీయం. కాని మాజీ ప్రధాని బహు భాషా కోవిదుడు ప్రధాని అయిన మొదటి ఆంధ్రుడు  పాముల పర్తి వెంకట నరసింహ రావు గారి వర్ధంతిని ప్రభుత్వ కార్య క్రమంగా చెయ్యక పోవటం క్షమించా రాని నేరమే.

# మహా త్యాగి మద్దూరి అన్నపూర్ణయ్య

ఆధారం –శ్రీ రావినూతల శ్రీరాములు రాసిన "మహాత్యాగి మద్దూరి అన్న పూర్ణయ్య జీవిత చరిత్ర "

భార్యా పిల్లల్ని పోషించే బాధ్యతకూడా దేవుడిపై భారం వేసి, దేశం కోసం 55ఏళ్ళు దీక్షగా శ్రమించి, అందులో 11సంవత్సరాలు జైలులో గడిపిన మహా త్యాగి మద్దూరి అన్నపూర్ణయ్య ఈ తరం వారికి ఎవరికీ తెలియదు. కాంగ్రెస్, నవశక్తి, జయభారత్, వెలుగు పత్రికలు నడిపి, స్వతంత్రం ముందూ ఆతర్వాత కూడా నిర్భయంగా "కలం ఖడ్గాన్ని " విశ్రుంఖలంగా ప్రయోగించిన నిస్వార్ధ పాత్రికేయ ప్రముఖుడు. స్వాతంత్ర్యం వస్తే కులం, గిలం పోయి, ఆస్తిపాస్తులన్నీ అందరివీ అవుతాయని, అందరూ సమానంగా అనుభవించ వచ్చువని నమ్మిన సామ్యవాద స్వప్నాలు కన్నస్వాతంత్ర్య సమర యోధుడు. అల్లూరి, నేతాజీవంటి విప్లవ నాయకులతో, గాంధీ, జయప్రకాష్ వంటి అగ్రశ్రేణి జాతీయ నాయకులతో భుజం భుజం కలిపి సాగిన అగ్రశ్రేణి దేశీయ నాయకుడు. జర్నలిస్ట్, కవి, నవలాకారుడు. ప్రకాశం,, పివిజి రాజు పుచ్చలపల్లి, రంగాలకు అభిమానుడు. కానీ స్వాతంత్ర్యం వచ్చాక ఆయనకు ప్రాధాన్యమే లేకుండా పోయింది. అసెంబ్లీకి రాజమండ్రి నుంచి పోటీ చేసి ఓడిపోయాడు. స్వతంత్ర భారత దేశ రాజకీయాలకు పనికి రాని వాడు అనిపించుకొన్న లౌక్యమెరుగని పెద్దమనిషి. మొక్కు బడిగా ఆయన శతజయంతి ఉత్సవం జరిపారు. స్వాతంత్ర్య ఉద్యమకాలం లో అనేక అపూర్వ త్యాగాలు చేసి స్వతంత్రం రాగానే జాడ కనిపించకుండా పోయిన మహోన్నతనాయకులలో మద్దూరి వారుకూడా ఒకరు.



అన్నపూర్ణయ్య గారు జైల్లో మగ్గుతుంటే ఇంటిదగ్గర కుటుంబం గర్భ దరిద్రం లో మగ్గిపోయేది. భార్య రమణమ్మ గారు మహా సాధ్వి. ఆయనకు కార్డు రాయటానికి కూడా ఆమెచేతుల్లో కాణీ ఉండేదికాదు. ఒక కార్డు మాత్రం "ఏ దినం కార్డు కోసం ఎదురు చూస్తారో, ఆ దినం ఈకార్డు ను చూసి తృప్తి పడండి "అని తేదీ కూడా వేయకుండా రాసింది ఆమహా ఇల్లాలు.. ఈడొచ్చిన ఆడపిల్లలకు చేతనైన రీతిలో పెళ్ళిళ్ళు జరిపి బాధ్యత తీర్చుకొని ఆత్యాగమయి అసువులు బాసింది. భార్య మరణ వార్త విన్న అన్నపూర్ణయ్య తన బాధకు అక్షరాకృతి కల్పించి "చేత కాసు లేదు, చెరసాలలో భర్త –పిల్ల పెళ్లి కూడా పెనిమిటి లేకనే –నీవే చేయవలసి వచ్చె నీలవేణి-జనులసాయమైన, ధనసాయమైన –లేకపోయేనే నీకు లేమి గల్గె-వలదు నా బాధ పరమ శత్రువునకైన –బ్రతికి యున్నాడ జీవచ్చవంబ నగుచు "'

గ్రంథాలయోద్యమ నాయకులు గాడిచర్ల హరి సర్వోత్తమరావు గారి తర్వాత పత్రికలలో రాసి జైలు కెళ్ళి పుష్కరకాలం కారాగారం అనుభవించిన జర్నలిస్ట్ మద్దూరి అన్నపూర్ణయ్య గారు. ఈ గాంధీ జయంతి నాడు అలాంటి త్యాగ మయుని గురించి తెలుసుకొందాం.

ఆధారం –మహాత్యాగి మద్దూరి అన్నపూర్ణయ్య గారి జీవిత చరిత్ర –రచయిత-శ్రీరావినూతల శ్రీరాములు.

ఆంధ్ర భీష్మన్యాపతి సుబ్బారావు, యుగకర్త కందుకూరి వీరేశలింగం, ఆంధ్ర కేసరి ప్రకాశం, ఆంధ్ర బెర్నార్డ్ షా చిలక మర్తి, గాంధేయవాది బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం,వందేమాతరం ఉద్యమనాయకుడు గ్రంథాలయోద్యమ సారధి గాడి చర్ల హరి సర్వోత్తమ రావు గార్ల కార్యక్షేత్రమైన రాజమండ్రి లో, "ఆఖరి శ్వాస వరకు రాజమండ్రిలోనే ఉంటూ దేశసేవ చేస్తాను"అని భీష్మ ప్రతిజ్ఞ చేసి నిలుపుకొన్న మద్దూరి అన్నపూర్ణయ్య గారి కార్యభూమి కూడా రాజమండ్రి యే.

పిఠాపురానికి 8మైళ్ళ దూరం లో ఉన్నకొమరగిరి గ్రామం లో మద్దూరి కోదండ రామ దీక్షితులు సంపన్న గృహస్తు, నిరతాన్న దాత. ఒక బాపడు అన్నదానం తో ఇంతటి పేరురుతెచ్చుకోవటం ఏమిటని పిఠాపురం రాజా ఆశ్చర్యపోయి, మారు వేషాలతో వందమందితో వేళకాని వేళ దీక్షితుల వారింటికి భోజనానికివచ్చాడు. అందర్నీ సాదరంగా ఆహ్వానించి, అప్పటికప్పుడు నాలుగు బస్తాల బియ్యం తెప్పించి, గాడిపొయ్యి మీద క్షణాలలో వంట చేయించి అందరికి తృప్తిగా భోజనాలు పెట్టించాడు. భోజనానంతరం రాజు తనను తాను పరిచయం చేసుకొని, తక్షణం దీక్షితులుగారికి కొంత భూమి ఈనాము గా ఇచ్చినట్లు చెళ్ళపిళ్ళవారు తమ కథలు –గాథలు లో చెప్పారు. దీక్షితుల గారి పరమ యోగ్యతను గుర్తించి రాజు ఆయన్ను సాదరం గా ఆస్థానానికి పిలిపించి సత్కరించాలనుకొన్నారు. దీక్షితులు గారు వెళ్ళే సరికి రాజు స్నానం చేస్తున్నాడు. తడి బట్టలతోనే వచ్చి ఆహ్వానించి తర్వాత గౌరవించాడు. అలాంటి దీక్షితుల గారి స్వయానా మనవడే మన మద్దూరి అన్నపూర్ణయ్య గారు.

మద్దూరి జయరామయ్య రాజమ్మ దంపతుల నలుగురు సంతానం లో పెద్దవాడు కోదండ రామ దీక్షితులు, రెండవవాడు బుచ్చి వెంకయ్య, మూడు అన్నపూర్ణయ్య, నాలుగు కృష్ణమూర్తి. అన్నపూర్ణయ్య కొమరగిరిలో 20-3-1899 పుట్టారు. చదువు కొమరగిరి, పెద్దాపురం లో జరిగింది. 1911 జూన్ లో కాకినాడ కాలేజి హైస్కూల్ లో థర్డ్ ఫారం ఎ సెక్షన్ లో, విప్లవ వీరుడు అల్లూరి సీతారామరాజు సి సెక్షన్ లోనూ చేరి చదివారు. పూర్ణయ్యగారి పెద్దన్న ఈ కాలేజిలోనే ఇంటర్ చదివేవాడు. ఆ సంవత్సరం డిసెంబర్ 11న అయిదవజార్జి రాజు పట్టాభి షేక మహోత్సవం కాకినాడలో వైభవం గా జరుపుతున్నారు. విద్యార్దులు "శశిరేఖా పరిణయం "నాటకం ప్రదర్శించాలనుకొన్నారు. పూర్ణయ్యగారి అన్న దీక్షితులు రఘుపతి వెంకట రత్నం గారి ప్రియ శిష్యుడు. ఆయన శశిరేఖగా తమ్ముడు,అల్లూరి రామరాజు చెలికత్తెలుగా వేషాలు వేశారు. వీరిద్దరూ అద్భుతంగా నటించి ప్రశంసలు పొందారు. అల్లూరి నారద పాత్రకూడా గొప్పగా పోషించి మధుర కంఠంతో పద్యాలు శ్రావ్యంగా పాడి అందర్నీ మెప్పించాడు. ఈ వేడుకలలోనే నాయుడుగారికి "రావు బహదూర్ "బిరుద ప్రదానం జరిగింది. పూర్ణయ్య ఆబిరుదు తనకే వచ్చినంతగా సంతోషిస్తే, అల్లూరి ముభావంగా ఉన్నాడు. విద్యార్దులందరికీ జార్జి బొమ్మతోపాటు జర్మన్ సిల్వర్ పతకాలు కూడా ఇచ్చారు. ఏకంగా అయిదు మెడల్స్ సాధించిన అన్నపూర్ణయ్య అల్లూరికి ఇస్తే, ఆగ్రహం తో విసిరి అవతలపారేసి "పిచ్చోడా !ఈ పతకం మన బానిసత్వానికి చిహ్నం రా "అని, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

చాలా సేపటికి తేరుకొన్న అన్నపూర్ణయ్య సీతారామ రాజు సాహచర్యం తో దేశ భక్తి ప్రపూర్ణుడయ్యాడు. దేశ సేవకు బి.ఎ. డిగ్రీ అవసరం లేదన్నాడు అల్లూరి. పూర్ణయ్యమాత్రం డిగ్రీపొంది లాయర్ కావాలనుకొన్నాడు. స్వేచ్చా జీవనానికి న్యాయవాద వృత్తి బేష్ అనుకొన్నాడు. తాను త్వరలో సన్యాసిగా మారి దేశమాతకు అంకిత మౌతానని అల్లూరి చెబుతూ ఉండేవాడు. అర్ధాంతరంగా చదువుమానేసి అల్లూరి ఎక్కడికి వెళ్ళాడో ఎవరికీ తెలీదు.

ఒక రోజు అన్నపూర్ణయ్య రైలులో పిఠాపురం నుంచి కాకినాడకు బయల్దేరాడు. టికెట్ కౌంటర్ దగ్గర "అన్నపూర్ణయ్యా "అనే పిలుపు వినిపించి, తననుకాదేమో అనుకొన్నాడు. మళ్ళీ ఆపిలుపు వినిపిస్తే, అటుకేసి తిరిగి చూస్తే సన్యాసి వేషంలో చిన్ననాటి స్నేహితుడు అల్లూరి సీతారామ రాజు కనిపించి ఆశ్చర్యపోయాడు. ఏమిటీ వేషం "?అని అడిగితే "చిన్నప్పుడే చెప్పాకదా "అని సమాధానం. తనదగ్గర ఒక మహాపురుషుడు ఉన్నట్లు మహా సంబరపడిపోయాడు పూర్ణయ్య. తనతో కాకినాడ రమ్మన్నాడు. ఆ అవకాశం లేదన్నాడు రాజు. ఎక్కడికి ప్రయాణం అని అడిగితే "నా జీవితం ప్రజా సేవకే అంకితం అని ఆనాడే చెప్పానుకదా "అన్నాడు అల్లూరి. "అనిబిసెంట్ గై హోం రూల్ లో చేరతారా ?"మద్దూరి ప్రశ్న. "నా గురించి క్రమంగా వింటావులే "అని చెప్పాడు రాజు. ఇద్దరూ ఎవరి ప్రయాణం వారు సాగించారు.

హోంరూల్ ఉద్యమం ఉవ్వెత్తుగా ఎగసి పడుతున్నకాలం లో అనిబిసెంట్ శిష్యుడు రాం కాకినాడ వచ్చి గంభీర ఉపన్యాసాలతో ప్రేరణ కల్గించాడు. ప్రిన్సిపాల్ నాయుడు గారు విద్యార్థులు ఆ సభలలో పాల్గొన కూడదని నిషేధం విధించారు. ఏం జరిగితే అది జరుగుతుందని మొండి ధైర్యంగా పూర్ణయ్యగారు మీటింగ్ కు వెళ్లి, మర్నాడు ప్రిన్సిపాల్ కు తాను ఉత్తర్వు దిక్కరించాననీ ఏ శిక్షకైనా సిద్ధమే అని చెప్పారు. ఆయన వార్నింగ్ ఇచ్చి వదిలేశారు. బిసెంట్ తన "న్యు ఇండియా "పత్రికలో బ్రిటిష్ వారిపై నిప్పులు కక్కుతూ రాసేది. ఈయన వాటిని భగవద్గీత లా పవిత్రంగా భావించి చదివే వారు. కాలేజి ఎక్సెల్సియర్ సైటీకి రెండేళ్ళు కార్యదర్శి గా పని చేసి, "ఇండియా స్వరాజ్యానికి అన్ని విధాలా అర్హమైనది "అని ప్రసంగించారు.

రాజమండ్రి కాలేజీలో బి ఏ చదువుతూ పూర్ణయ్యగారు "బ్రిటిష్ రాజరికమే మన దేశ దారిద్ర్యానికి కారణం "అని ఎలుగెత్తి చాటారు.కోపం వచ్చిన ప్రిన్సిపాల్ ను "అడుగో ఆ దొంగ మీ ముందే నిలబడ్డాడు "అనగానే అందరూ ఫక్కుననవ్వారు. అప్పటికే అన్నపూర్ణయ్య అంటే "ఎదిరించే వాడు "అనీ "ఈ సీతయ్య ఎవరిమాటా వినడు "అనే ముద్ర పడి పోయింది. 'స్వాతంత్ర్య సమరం లో తాను ఎలా ప్రవేశించిందీ అన్నపూర్ణయ్య గారు తన "జయభారత్ "పత్రికలో ధారావాహిక గా రాశారు. 1920 సెప్టెంబర్ 1న కలకత్తాలో జరిగిన "స్పెషల్ కాంగ్రెస్ "లో విద్యార్దులు చదువులు మానేయాలని తీర్మానం చేసింది అది. పూర్ణయ్య గారి పై గొప్ప ప్రభావం కలిగించినా, ఆర్ధిక బలం లేదు. భార్య కాపురానికి ఇంకా రాలేదు. కుటుంబ పోషణ భారం కూడా ఉంది. భార్య "తొందరపడి నాన్ కో ఆపరేషన్ ఉద్యమం లో చేరకండి "అని ముందే రాసి హెచ్చరించింది కూడా.

ఆ సమయం లో డా పట్టాభి రాజమండ్రి వస్తే విద్యార్దులుగా ఆయనకు సహాయపడ్డారు. న్యాపతి సుబ్బారావు గారుకూడా వచ్చి 1907 లో ఏం జరిగిందో గుర్తు చేసుకోమని హెచ్చరించారు. అంటే గాడి చర్ల మొదలైన విద్యార్దులు విపరీతంగా నష్ట పోయారని అర్ధం. నవంబర్ 30రాత్రి అంతా దీర్ఘం గా ఆలోచించారు పూర్ణయ్య.అల్లూరి జ్ఞాపకం వచ్చాడు. ఇక ఆలోచించలేదు దేశ సేవకు అంకిత మవ్వాలని నిర్ణయించుకొన్నారు. డిసెంబర్ 2న జాతీయ విద్యాలయ లెక్చరర్ డా సుబ్రహ్మణ్యం గారి దగ్గరకు వెళ్లి,వెంటనే "ఆంధ్ర యువజన స్వరాజ్య సభ "స్థాపించారు. 1907 లో బిపిన్ చంద్రపాల్ రాజమండ్రి వచ్చినప్పుడు, ఆయన విజ్ఞప్తి మేరకు న్యాపతి సుబ్బారావు సత్యవోలు గున్నేశ్వరరావు, డాక్టర్ శివరాజు వెంకట సుబ్బారావు మొదలైన వారు భూరి విరాళం అందించి జాతీయ కళాశాల స్థాపించారు. 1920వరకు దీని నిర్వహణ భారం డా.బ్రహ్మజోష్యుల సుబ్రహ్మణ్యం వహించారు.

అన్నపూర్ణయ్య గారు కాలేజి మానేసిజాతీయ పాఠశాలలో లెక్చరర్ గా చేరారు. 1924 లో ఆయనతోపాటు "కాంగ్రెస్ "పత్రిక కూడా సీతానగరానికి మారింది. విద్యాలయం ఆధ్వర్యం లో దీన్ని ముద్రించేవారు. 1928 మార్చి 11న జనరల్ బాడీ మీటింగ్ లో తీర్మానం చేసి ప్రెస్ ను ఆశ్రమానికి ఉచితంగా అందించారు. పూర్ణయ్యగారు జైలులో ఉండగా, పత్రిక వారు బకాయి ఉన్న డబ్బునూ రద్దు చేస్తూ తీర్మానించారు. విద్యాలయానికి సుబ్రహ్మణ్యం గారి సోదరుడు సీతారామయ్యగారు అధిపతిగా ఉండేవారు. ఈయన 1922 లో ప్రభుత్వ ఉద్యోగానికి రాజీనామా చేసి ఇందులో చేరారు.

1921 జనవరి 23 న రాజమండ్రి లో గోదావరి జిల్లా మహాసభలు వైభవం గా జరిగాయి. సుబ్రహ్మణ్యం గారు ఆహ్వాన సంఘాధ్యక్షులు. అయ్యదేవర కాళేశ్వరరావు వంటి ప్రముఖులు పాల్గొన్న ఈ సభకు ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణగారు అధ్యక్షత వహించి "ఆత్మ గౌరవం పెంచని, జీవన భ్రుతికి తోడ్పడని ఆంగ్ల విద్య వదిలేసి విద్యార్ధులు దేశ సేవకు నడుం కడితే ఏడాది లోపే స్వతంత్రం సిద్ధిస్తుంది "అని ప్రకటించగానే, అప్పటికప్పుడు పూర్ణయ్య గారు మొసలికంటి తిరుమలరావు, కాండ్రేగుల రామచంద్రరావు, సబ్నవీసు కృష్ణారావు, క్రొవ్విడి లింగరాజు మొదలైన 55మంది విద్యార్ధులు దేశ సేవకు అంకిత మౌతామని ప్రతిజ్ఞ చేశారు. 1921 లో మద్దూరి, సబ్నవీసు ల ఆధ్వర్యం లో విద్యార్ధి మహాసభలు భారీగా నిర్వహించారు. అక్కడే "ఆంధ్రయువజన స్వరాజ్య సభ "ప్రారంభమైంది.

1922 లో అన్నపూర్ణయ్యగారు "తిలక్ మహారాజు చరిత్ర "30పేజీలలో రాసి ప్రచురించారు. తిలక్ ను పరశురామునిగా, గాంధీని,ఆతర్వాత అవతారమైన శ్రీ రామునిగా వర్ణించారు. "తిలక్ అంటే స్వరాజ్యం అని అర్ధం.తిలక్ స్వరాజ్య నిధి కోటీ పది లక్షలు పోగు చేసి, నిత్యం ఆయన నామస్మరణ చేస్తున్నాం "అని రాశారు. ఆంధ్రయువజన స్వరాజ్య సభ గత మార్చిలో ప్రారంభమైందనీ, ఐకమత్యం తో భారత స్వాతంత్ర్యం సాధించటమే ధ్యేయమని, 16నుండి 30ఏళ్ళ వయసున్నవారంతా దీనిలో సభ్యులవటానికి అర్హులని, సంవత్సర చందా కేవలం ఒక్క రూపాయి మాత్రమె నని, కాంగ్రెస్ సంఘాలలో సభ్యులుగా చేర్చటం రాట్నాలు నెలకొల్పటం అప్పటికే చేశామని, మద్యపాన నిషేధం మొదలైన జాతి ఉద్ధరణ కార్యక్రమాలు చేబట్టాలని, దీనికి దేశభక్తులు శ్రీ టంగుటూరు ప్రకాశం పంతులుగారు అధ్యక్షులనీ. కేంద్రస్థానం రాజమండ్రి అనీ తెలియ జేశారు అన్నపూర్ణయ్యగారు.

22-3-1922 న అన్నపూర్ణయ్య గారు ఆంధ్రయువజన స్వరాజ్య సభ తరఫున "కాంగ్రెస్ "అనే సైక్లో స్టైల్ వార పత్రిక ప్రారంభించారు. క్రొవ్విడి లింగరాజుగారు సహాయ సంపాదకులు. అందులోని ఒక వ్యాసం దేశ ద్రోహం నేరం కింద వస్తుందని సంపాదకులైన మద్దూరి వారికి 18 నెలలు శిక్ష విధించింది బ్రిటిష్ ప్రభుత్వం 1923 ఫిబ్రవరి నుంచి 1924 జూన్ 13 వరకు రాజమండ్రి, వేలూరు జైళ్లలో మొదటి సారిగా శిక్ష అనుభవించారు. 1924 డి సెంబర్ లో రాజమండ్రికి 13మైళ్ళ దూరాన సీతానగరం లో డా సుబ్రహ్మణ్యంగారు "గౌతమీ సత్యాగ్రహ ఆశ్రమం "నిర్మించగా కాంగ్రెస్ పత్రిక అక్కడి నుంచే వెలువడేది. లింగరాజుగారితోపాటు రామ చంద్రుని వెంకటప్ప కూడా అందులో పని చేసేవారు.



దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు ఈ పత్రిక కోసం "జర్మన్ క్రెడిల్ టిప్ టాప్"కొనిచ్చారు దాదాపు మూడు వేల పౌన్ల టైప్ మెటీరియల్ కూడా అందించారు.మొదట్లో చందాదారులు 600మంది ఉండేవారు క్రమంగా పెరిగారు. తేలికైన వాడుక భాషలో ఉండటం వలన యువకులను బాగా ఆకర్షించింది 1857నాటి విప్లవ వీరుల గాథలను ధారావాహికంగా ప్రచురించేవారు. కాంగ్రెస్ సంపాదకీయాలు బ్రిటిష్ ప్రభుత్వం పై నిప్పులు కురిపించేవి.హిందూ ముస్లిం తగాదాలకు కారణం ప్రభుత్వమేననీ, కోర్టుల్లో జరిగే విచారణ కేవలం బొమ్మలాటనీ, కాంగ్రెస్ బరువు బాధ్యతలు మోయాలనీ అవసరమైతే" ఇండిపెండెంట్ పార్టీ "కూడా పెట్టాలనీ, పోలీసు దుష్కృత్యాలు బ్రిటిష్ వారికి కాలం చెల్లిందని తెలియ తెలియ స్తున్నాయనీ, ఖద్దరు దారుల బట్ట లూడ దీసిన పోలీసు అధికారులు ముస్తఫా ఆలీ ఖాన్, డప్పుల సుబ్బారావు లు అపర రాక్షసులు, దుశ్శాసనులు, నీ దేశం బతికి బట్టకడితే నువ్వు చస్తేమాత్రమేం "వంటివి నిప్పుల్లో కొన్ని మాత్రమే.

1926 జులై 16 సంచిక అల్లూరి జయంతి ప్రత్యేక సంచికగా కాంగ్రెస్ వెలువడింది గాంధీ గారి అభిప్రాయం రాసి పంపమని కోరితే, ఆయన జీవిత విశేషాలు తెలుపమని రాయగా రాసి పంపిస్తే, 1929 జులై 18 యంగ్ ఇండియా లో బాపూ "రామరాజు శీలవంతుడు నిరాడంబర త్యాగి. ధైర్యం ఉన్నతాశయాలున్నవాడు. పితూరీ దారుడు కాదు. గొప్ప దేశభక్తుడు. ఆయన దేశ భక్తినీ చాతుర్యాన్నీ సాహసాలను యువకులు ఆదర్శంగా తీసుకొని ముందుకు సాగాలి. నాకు సాయుధ విప్లవం పై సానుభూతీ అభిమానం లేవు. రాజు అహింసా పద్ధతిలో పోరాడి ఉంటె యెంత బాగుండేదో "అని నిష్కర్షగా రాశాడు.

1927 నుంచి అల్లూరి జయంతి ఘనం గా నిర్వహించాలని, అన్నపూర్ణయ్యగారు అనుకొన్నా, పెద్దలు సహకరించలేదు. అధ్యక్షత వహించటానికి కూడా ఎవరూ ముందుకు వచ్చేవారు కాదు. మొదటి సభకు వేమవరపు రామదాసు అధ్యక్షత వహించారు.

అల్లూరి రెండవ జయంతి రాజమండ్రి లో దండు నారాయణ రాజు అధ్యక్షతన జరిగింది. బెజవాడ మొదలిన చోట్లకూడా జరిగాయి. మద్రాస్ రిపబ్లికన్ కాంగ్రెస్ లోనూ, 1928 డిసెంబర్ కలకత్తా కాంగ్రెస్ యువజన సభలో అల్లూరి ని కీర్తించారు. 1929 మూడవ జయంతికి నేతాజీ సందేశం పంపారు. గుంటూరు, బందర్ లలో కూడా అల్లూరి జయంతి జరిపారు. మచిలీపట్నం సభలో పట్టాభి సీతారామయ్య ఘన నివాళులు అర్పించారువిప్లవ వీరుడు అల్లూరి సీతారామ రాజు కు. 1936 జూన్ 23న ఏలూరులో జరిగిన అల్లూరి వర్ధంతి సభకు వెళ్లాలని ప్రయత్నం చేసిన మద్దూరి, గారపాటి సత్యనారాయణ, బసవరాజు రంగశాయి లపై ప్రభుత్వం నిషేధాజ్ఞలు జారీ చేసింది. 1929 మే 9 న గాంధీ "కాంగ్రెస్ పత్రిక"కార్యాలయాన్ని సందర్శించి, అక్కడ సిబ్బంది అందరూ, చాపలపై కూర్చుని ముందున్న రాతబల్లపై కాగితాలు పెట్టుకొని రాయటం చూసి బాగా సంతోషించాడు. అన్నపూర్ణయ్య, పందిరి మల్లికార్జునరావు లు గాంధీతో సుదీర్ఘంగా చర్చలు జరిపారు. మే16 యంగ్ ఇండియా పత్రికలో "కాంగ్రెస్ తెలుగు వారపత్రిక ఆశ్రమం నుంచే స్వయం పోషకం గా వెలువడుతోంది.సంపాదకుడు మద్దూరి అన్నపూర్ణయ్య రాజద్రోహం నేరం కింద నిర్బందితుడై గౌరవం పొందారు. ఆయన ఖైదులో ఉన్నా పత్రిక నడుస్తోంది "అని రాశాడు.

"కాంగ్రెస్ "మొదటి పత్రిక ఒక ఫుల్ స్కేప్ కాగితం పై సైక్లో స్టైల్ లో వెలువడింది తర్వాత 14పేజీలలో రాయల్ సైజ్ లో వచ్చేది. "విదేశీ వస్తువులు బ్రిటిష్ వస్తువులు, మత్తు పదార్ధాల ప్రకటనలు పత్రిక ముద్రించదు.ఆధిని వేశ ప్రతిపత్తికి అనుకూలం గా సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని ప్రతిపాదిస్తుంది "అని పత్రిక నివేదికలో పేర్కొన్నారు.తెలుగు అక్షరాలతో హిందీ పాఠాలుప్రచురించేవారు. ప్రముఖ పాత్రికేయుడు కోటం రాజు రామారావు వచ్చి చూసి సిబ్బంది అందరూ అన్ని పనులుఅచ్చు కూర్పుతో సహా చేస్తున్నారు అని మెచ్చాడు. రామచంద్రుని వెంకటప్ప రాసిన "చిచ్చల పిడుగు "ఏకాంకిక ను 1929 మే 7 పత్రికలో ముద్రించినందుకు దేశ ద్రోహం కింద అన్నపూర్ణయ్య గారికి రెండున్నరఏళ్ళ జైలు శిక్ష పడింది. మే 13న అరెస్ట్ కాగా క్రొవ్విడి లింగరాజు సంపాదకు డైనాడు. 1930 మార్చి పత్రిక లో భగత్ సింగ్ ఉరితీతను ఖండిస్తూ "వీరబలి "వ్యాసం ప్రచురించినందుకు లింగరాజుకు రెండేళ్ళ ఖైదు శిక్ష విధించారు. అన్నపూర్ణయ్య గారి అరెస్ట్ తర్వాత హిందూ పత్రిక లో ఒక అన్నపూర్ణయ్య ఒక ప్రకటన ఇచ్చారు. "మా నాయకుడు సాంబమూర్తి అరెస్ట్ అయ్యాక, నా అరెస్ట్ ఆశ్చర్యం కలిగించలేదు. ఈ ఏడు దేశమంతా జరిగిన యువజనుల అరెస్టులు చూస్తె స్వాతంత్ర్య ఉద్యమాన్ని అణచి వేయటమే అధికారుల లక్ష్యం అనిపిస్తోంది. ఇది మా పత్రికపై దురాక్రమణ గా భావిస్తాము. మేము భయపడలేదు. ఇద్దరు సంపాదకులను జైలులో పెట్టినప్పుడేమేము బతికి బట్టకట్టాం. నా నిర్బంధం తర్వాతకూడా బావుటా ఎగురుతూనే ఉంటుంది. ఈ కస్ట సమయం లో ప్రజలు మాకు అండగా నిలబడుతారనటం లో సందేహం లేదు ".మద్దూరి అరెస్ట్ ను ఖండిస్తూ కలావెంకటరావు స్టేట్ మెంట్ రాసిస్తే టెలిగ్రాఫ్ వాళ్ళు తీసుకోలేదు.

లింగరాజు అరెస్ట్ తర్వాత వెంకటప్ప ఎడిటర్ అయ్యాడు. 1931 సెప్టెంబర్ లో జైలు నుంచి విడుదలై మద్దూరి మళ్ళీ సంపాదక బాధ్యతలు చేబట్టారు. 1932 జనవరిలో పోలీసు దాడి వరకు ఆయనే సంపాదకుడు. 1922 లో ప్రారంభమై పదేళ్ళలో చరిత్ర సృష్టించింది. కాంగ్రెస్ పత్రిక తో సంబంధమున్న వెంకటప్పయ్య, కాండ్రేగుల రామ చంద్రరావు, చుండ్రు పట్ల హనుమంతరావు లుకూడా జైలు కెళ్ళారు.

1929 మే 21న స్వాతంత్ర్య సంచికగా వెలువడిన కాంగ్రెస్ పత్రిక ను ఆంధ్రపత్రిక సమీక్షిస్తూ "10వ తేదీ 8వ సంపుటి16వ సంచిక లో 16పేజీలున్నాయి. స్వాతంత్ర్యయుద్ధ నాయకుడు నానా డూండీ పంత్ సాహెబ్, జగదీశ పురాధీశుడు 80ఏళ్ళ వృద్ధురాణాకుమార్ సింహ ల ముఖ చిత్రాలతో ఆద్యంతం గంభీరంగా ఉన్నది. చిచ్చులపిడుగు ఏకాంకిక, రాణాకుమార సింహుడు,, 1857ఝాన్సీ లక్ష్మీ బాయ్ అగ్ని ప్రవేశం, తాంతియా తోపీ వ్యాసాలూ, కవికుమారుల కుసుమాంజలి మొదలైనవి ఉన్నాయి "అని మెచ్చింది.

"చిచ్చులపిడుగు " ఏకాంకిక రాసిన రామచంద్రుని వెంకటప్ప స్వగ్రామం ఒంగోలుదగ్గర టంగుటూరు. అచ్యుతుని వెంకటరావు అనే మారు పేరుతో కాంగ్రెస్ ప్రచారం చేసి ఆరునెలలు జైలు కెళ్ళాడు. రాజమండ్రి జైలులో బులుసు సంబమూర్తిగారితో పరిచయమేర్పడి కుడిభుజంగా ఉంటూ, విడుదల తర్వాత ఆయనతో కాకినాడ చేరాడు. సీతానగరం ఆశ్రమం ఏర్పడినప్పుడు మూర్తిగారు అతనిని డా సుబ్రహ్మణ్యం గారికి అప్పగించారు. వెంకటప్ప మద్రాస్ లో జరిగిన "నీల్ "సత్యాగ్రహం లో ముఖ్యపాత్ర పోషించాడు. ఆంగ్ల సంస్కృతాలు క్షుణ్ణంగా అభ్యసించినవాడు, గొప్ప పరిశోధకుడుకూడా. "చెన్నపట్నం తెలుగు పట్నం "అనే ఆయన పుస్తకం బాగా ప్రచారమైంది. ఆంధ్రులలో స్వాతంత్ర కాంక్ష పెరటానికే చిచ్చుల పిడుగు రాశానని చెప్పాడు.

నాటిక మొదటి రంగం లో మంగల్ పాండే స్వగతంగా "ఓ ఆంగ్లపిశాచామా ఇంకా నీ ఆకలి తీరలేదా ఎప్పటికి తీరుతుందే రాక్షసీ "అన్న డైలాగ్ ఉద్రేకం కలిగిస్తుంది. రెండవ రంగం లో పాండే -హ్యూసన్, బౌ అనే ఆంగ్ల అధికారులను కాల్చగా గురి తప్పుతుంది. చివరికి బౌ ను అనేక కత్తిపోట్లతో చంపేస్తాడు. ఈలోగాహ్యూసన్ లేవబోతుంటే ఒక సిపాయి తుపాకిడమతో కొట్టి చంపేస్తాడు. కాసేపటికి వీలర్ అనే సైనికాదికారివచ్చి మంగలపాండ్యాను బంధించమని ఆర్డర్ ఇస్తాడు. పాండ్యా బ్రాహ్మణుడు కనుక అతనిపై ఎవరూ చెయ్యి వెయ్యరని జిమేదారు చెబుతాడు. ఇంతలో హీర్సే అనే మరో సైనికాధికారి తన ఇద్దరు కొడుకులతో అక్కడికి వచ్చి పాండే ను చంపటానికి సిద్ధపడితే, పాండ్యా తనను తానే కాల్చుకొనగా, గాయపడిన అతడిని జమేదారు ఆస్పత్రికి చేరుస్తాడు. పాండ్యా ఉరితీసే ఘట్టం తో మూడవ రంగం ముగుస్తుంది. ఉరి తీసేముందు చివరి కోరిక ఏమిటి అని అడిగితే "మీ జాతి వాళ్ళందరికీ ప్రాణాలపై ఆశ ఉంటే, మా దేశం విడిచిపొండి"అంటూ ఉరికంబం ఎక్కుతాడు మంగళ పాండ్యా. రచయిత నాటకం చివర అహింసావాదం ప్రవేశపెడితే అన్నపూర్ణయ్యగారు దాన్ని తీసేసి పత్రికలో వేశారు. నాటికను ప్రభుత్వం నిషేధించటం దువ్వూరిగారికి రెండేళ్ళు శిక్షపడటం మనకు తెలిసిన విషయమే. 1929లో గుంటూరులోయూత్ లీగ్ ఈ నాటికను మునిసిపల్ చైర్మన్ బారిస్టర్

నడింపల్లి నరసింహారావు, అండ దండలతో పోలీసుల కళ్ళు కప్పిఆమంచర్ల గోపాలరావు, కోనవల్లి సుబ్రహ్మణ్యం, మాడభూషి వెంకటా చారి ప్రదర్శించారు. ప్రేక్షకులలో కొండా వెంకటప్పగారు కూడా ఉన్నా, సాక్ష్యం దొరక్క యెవరినీ అరెస్ట్ చేయలేదు. నాటిక రచయిత పేరు చెప్పమని దువ్వూరి వారిని, లింగారజుగారినీ యెంత ఒత్తిడి పెట్టినా పత్రిక నైతిక సూత్రాలనను సరించి చెప్పటానికి నిరాకరించారు.

1950 లో ఈ నాటికపై నిషేధం తొలగింది. రచయిత స్వయంగా దాన్ని ప్రచురించి అన్నపూర్ణయ్య గారి దివంగత వీర ధర్మపత్ని మద్దూరి వెంకట రమణమ్మగారికి అంకితమిచ్చాడు. తానే రచయితను అని కోర్టులో చెప్పటానికి సిద్ధపడినా, పూర్ణయ్య గారు వద్దు అని వారించటమేకాక వేలూరు జైలుకు వెడుతూ ఒక ఉత్తరం లో "నీ రచన మూలంగానేను బాధ పడ్డానని ఎప్పుడూ అనుకోలేదు. నేను దాన్ని చూసి చదివి మెచ్చి ప్రచురించాను. పూర్తి బాధ్యత నాదే. నువ్వు బాధపడకు. నేనేదో మర్యాద కోసం రాయటం లేదు మనఃపూర్వకం గా ఈలేఖ రాస్తున్నాను "అని రాసిన మహోత్కృష్ట హృదయం. ఉత్తమ సంపాదకత్వ లక్షణం అన్నపూర్ణయ్య గారిది.

తనపై మోపిన నేరానికి సమాధానంగా దువ్వూరి వారు కలెక్టర్ ఎదుట సుదీర్ఘ ప్రకటన చేశారు-"1857నాటి స్వాతంత్ర్య సమరాన్ని సహజంగా చరిత్ర ఆధారంగా చూపటమే నా ఉద్దేశ్యం. పాండ్యా ధైర్యశాలి అయిన నాయకుడు ఇది నిజగా జరిగిన కథ. కాని అతడిని ఆదర్శ ప్రాయుడుగా చూపించలేదు. నేను దౌర్జన్య రాహిత్యవాదిని.నాకతడు ఎలా ఆదర్శం అవుతాడు?.అతడు తొందరపడ్డాడు లేకపోతే ఇండియాకు స్వాతంత్ర్యం ఎప్పుడో వచ్చి ఉండేది నా పత్రిక దౌర్జన్యం సహించదు. నా కాంగ్రెస్ లోకాని, యువజన సంఘం లోకానిదౌర్జన్యం అనే మాటే వినిపించదు.కనుక నాలో దౌర్జన్యం ఎలా వస్తుంది ?సర్వమత సమత్వాన్ని ఆచరించే యువజన సంఘం అధ్యక్షుడ నైన నేను మత విద్వేషాన్ని ఎలా పెంచుతానని అనుకొన్నారు మీరు "?

వీర సావర్కార్ రాసిన "భారత స్వాతంత్ర్య సమరం ",చార్లెస్ బాల్ రాసిన "మ్యుటిని చరిత్ర –రాబర్ట్స్ ప్రభువు ","ఇండియాలో నా40సంవత్సారాల జీవితం "అనే పుస్తకాలే తన చిచ్చులపిడుగు నాటికకు ఆధారం అని రచయిత వెంకటప్పయ్య చెప్పాడు. మెడోస్ టైలర్ "రాసిన "సీతా "నవల దీనికి ఆధారమన్నారు లింగరాజుగారు..

బెంగాల్ యువకుడు జతీన్ బోస్ జైలులో మానవతా దృక్పధం కోసం 63రోజులు నిరాహార దీక్ష చేసి 14-9-1929 న అమరజీవి అయ్యాడు. అతడి దీక్షకు మద్దతుగా మద్దూరి,ఆచార్య రంగా రాజమండ్రి గోదావరీ తీరంలో గొప్ప సభ నిర్వహించారు. జతీన్ మరణంతో కళ్ళు తెరిచిన ప్రభుత్వం ఖైదీలను A.B,Cతరగతులుగా విభజిస్తూజైలు నిబంధనలు మార్చింది. అన్నపూర్ణయ్య గారి అరెస్ట్ కు ముందు ఈమార్పులు రాలేదు తర్వాత వచ్చినా అమలు చేయమని ఆయన కోరనూ లేదు. ప్రభుత్వానికీ ఆ ఇంగితం కలగలేదు. మద్రాస్ శాసనమండలి లో ఈవిషయం చర్చకు వస్తే, అనంతపురం నుంచి వెలువడే "శ్రీ సాధన "పత్రిక "న్యాయశాఖ చూసే కృష్ణన్ నాయర్ భారతీయుడై ఉండికూడా ఈ అకృత్యానికి ఒడిగట్టటం దారుణం "అని విచారం వ్యక్తం చేస్తూ రాసింది. ప్రతిపక్షకాంగ్రెస్ నాయకుడు సత్యమూర్తి ఘోరం అని నిరసన తెల్పి" ఈ తీర్మానం తెచ్చిన ప్రభుత్వ సభ్యుడు మద్రాస్ చరిత్రలో నామరూపాలు లేకుండా చనిపోతాడు కాని అన్నపూర్ణయ్య పేరు మాత్రం సువర్ణాక్షరాలతో లిఖించబడుతుంది. దేశ గౌరవ, స్వాతంత్ర్యాలను పరిరక్షించిన వ్యక్తిగా భావితరం అన్నపూర్ణయ్య ను జ్ఞాపకం ఉంచుకొంటుంది "అని అద్భుత ప్రసంగం చేశాడు.

ఆంధ్ర దేశం లో అతివాద ప్రథమ నాయకుడు బులుసు సాంబమూర్తిగారు. ఈయనే తనగురువు అన్నారు పూర్ణయ్యగారు. 1921 తూగోజి రాజకీయ మహా సభలో పూర్ణ స్వరాజ్యం సాధించాలని బులుసు ప్రతిపాదించారు. ప్రకాశం తొందర పడవద్దని హితవు చెప్పారు. తీర్మానం నెగ్గించుకొన్నారు సాంబమూర్తి. ఆయన తీర్పే ఆనాడు అందరికీ శిరోధార్యం. కాంగ్రెస్ సభలలో కొడుకు చనిపోయినా సభలలో పాల్గొన్న స్థిత ప్రజ్ఞుడు సాంబమూర్తిగారు. 1928 లో మద్దూరి వారికీ అఖిలభారత కాంగ్రెస్ సభ్యత్వం లభించింది. 1927 మద్రాస్ కాంగ్రెస్ సభలో నెహ్రు శ్రీనివాస అయ్యంగార్ డాక్టర్ అన్సారి మొదలైనవారు పట్టుబట్టి సంపూర్ణ స్వరాజ్యం తీర్మానం చేయించారు. దీనితో స్వతంత్ర సాధనకు బలం చేకూరి అయ్యంగార్ అధ్యక్షతన " ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్" ఏర్పడింది. నెహ్రు బోస్ లు కార్యదర్శులు. సాంబమూర్తి సర్దార్ శార్దూల్ సింగ్, అన్నపూర్ణయ్య గార్లు ముఖ్య కార్తకర్తలు.

లీగ్ కు ఆంధ్రాలో బులుసు అధ్యక్షులు. దువ్వూరి వారు విస్తృతంగా పర్యటించి లీగ్ కు గొప్ప మద్దతు కూడా గట్టారు. పత్రిక కూడా సంపూర్ణ స్వరాజ్యం కే మద్దతు ప్రకటించింది. 1936 ఫిబ్రవరి 29 నెల్లూరు జిల్లా యువజనులను ఉద్దేశించి ప్రసంగించి పూర్ణయ్యగారుకాంగ్రెస్ ను వశం చేసుకొని "కార్మిక కర్షక పరిషత్ "స్థాపించారు.

రాజమండ్రి అల్యూమినం వ్యాపారానికి అనువైన చోటు. కాంగ్రెస్ అభిమాని సేట్ జీవన్ లాల్ ఈ వ్యాపారం కోసం రాజమండ్రి వచ్చాడు.గ్రామీణ ప్రాంతాలలో పని చేసేవారికి తన ఆదాయం లో కొంత భాగం కేటాయిస్తానని సుబ్రహ్మణ్యం గారికి హామీ ఇచ్చాడు. సీతానగర్ ఆశ్రమ స్థాపనకూ లాల్ బాగా ఆర్ధిక సాయం చేశాడు. గ్రామోద్యోగులతో రాజీనామా చేయించి ఉద్యమం లో చేర్పించాడు. 14ఎకరాలలో ఉన్న ఆశ్రమం అందరి సహకారం తో 12పక్కా ఇళ్ళుకట్టించింది. మంచినీటి వసతి, ఖద్దరుప్రచారం ఉచిత వైద్య సేవ, పత్రిక నిర్వహణ ముఖ్యకార్యక్రమాలుగా ఆశ్రమం వర్ధిల్లింది. మద్దూరి వారి తమ్ముడు కృష్ణమూర్తి,వంగల సత్యనారాయణ కంపోజింగ్ చేసేవారు. ఆశ్రమవాసులు కుటుంబాలతో ఉండేవారు. అవసరాలను బట్టి జీతాలు అందేవి. సుబ్రహ్మణ్యం గారికి 50,దువ్వూరికి 49,లింగరాజుగారికి కు 35 రూపాయల జీతం.ఇదొక సామ్యవాద ప్రయోగంగా ప్రశంసలు పొందింది. 1933 లో గాంధీ రెండవ సారి ఇక్కడికి వచ్చి 1932 లో ఆశ్రమం పై జరిగిన దాడికి మనస్తాపం చెందాడు.

1932 జనవరి 5న మద్రాస్ గెజిట్ లో ఆశ్రమం చట్ట విరుద్ధమైనదని ప్రకటించింది. ఆశ్రమ కృషి దేశమంతా హర్షించింది. 1930 లో సీతానగరం పోలీస్ కాంప్ గా మారింది. సత్యాగ్రహ శిక్షణ ఆశ్రమం లో జరిగినంతకాలం ప్రజలు తండోపతండాలుగా తీర్ధ ప్రజలా వచ్చి సందర్శించేవారు. శిక్షణకు దేశం నలుమూలలనుంచి వచ్చేవారు. అనంతపురం నుంచి వచ్చిన హరే సముద్రం నరసింగరావు "ఈ ఆశ్రమంలో నెలరోజులు గడిపాను దాదాపు 200కుటుంబాలవారు ఇందులో పని చేస్తున్నారు. పెద్ద ఖాదీ భాండారం ఉంది నెలకు రెండువేలరూపాయల ఖద్దరు తయారు చేస్తున్నారు. కాంగ్రెస్ వారపత్రిక నడుపుతున్నారు. గొప్ప ఆస్పత్రి, గ్రంధాలయఉన్నాయి. అనాథ పిల్లలు చాలామంది పని చేస్తున్నారు. ఆశ్రమనిర్వాహకులు సుబ్రహ్మణ్యంగారు ప్రస్తుతం వెల్లూరు జైలులో ఉన్నారు. ఇక్కడ శిక్షణ పొందిన వందమంది తో మేము మహర్షి బులుసు సాంబమూర్తి గారి నాయకత్వం లో సాయంత్రం నాలుగు గంటలకు కాకినాడ బయల్దేరి, ఒకగంటలో కాకినాడ చేరాం. ఆ దృశ్యం చూడాల్సిందే కాని రాయనలవి కానిది. అప్పటికే గాంధీజీ దండి చేరి ఉప్పు సత్యాగ్రహం చేస్తున్నారు. మేమూఆయన ఆజ్ఞా అనుసరించి కాకినాడలో చట్ట ధిక్కారం చేసి ఉప్పు తయారు చేశాం. రోజుకు 5లేక 6మణుగుల ఉప్పు నెలరోజులు తయారు చేసి బహిరంగం గా అమ్మితే వెయ్యి రూపాయలు వచ్చాయి "అని రాశాడు

మహాత్ముడు పరవశించే అన్ని రంగాలలో అగ్రగామిగా ఉన్న సీతానగరం ఆశ్రమాన్ని విచ్చిన్నం చేయాలనే కుట్రతో, దాన్ని చట్ట విరుద్ధంగా ప్రభుత్వం ప్రకటించగా,, 1932 జనవరి 18న పోలీస్ సూపరింటెండెంట్ 400మంది రిజర్వు పోలీసులతో ఆశ్రమాన్ని ముట్టడించగా, డిప్యూటీ ముస్తఫా ఆలీ సత్యాగ్రులపై క్రూరంగా వ్యవరించాడని ప్రతీతి. వచ్చీ రాగానే అలీ ఆశ్రమ వాసులందర్నీన ఒకచోటకు చేర్చి "This Ashram is declared as an un-law ful body by the government. You are therefore all requested to disperse immediatlely "అన్నాడు. అన్నపూర్ణయ్య గారు గంభీరం గా "The Ashram is our home. We live or die here. Therefore we cannot disperse "అన్నారు. పోలీసులు అయిదు నిముషాల సేపు వారి తలలపై నాట్యమాడారు. పూర్ణయ్య దీక్షితులు కృష్ణమూర్తి వెంకటప్పయ్య గార్ల తలలు పగిలి రక్తం కారింది. కృష్ణమూర్తి అన్నగారిని కాపాడేందుకు అన్నయ్య ను ఆలింగనం చేసుకొన్నాడు ఫలితంగా లాఠీ దెబ్బలతో స్పృహ కోల్పోయి, ఆస్పత్రిలో రెండు నెలలు ఉండాల్సి వచ్చింది.

క్షతగాత్రులపై కన్నెత్తి కూడా చూడకుండా ఖాన్ ఆశ్రమ ఆస్తి ధ్వంసం చేయటం లో మునిగి పోయాడు. ఆశ్రమ వాసులతో పాటు అన్న పూర్ణయ్య గారికీ నాలుగేళ్ళు శిక్ష పడింది. 1932 ఫిబ్రవరి 1నుండి 1936 ఫిబ్రవరి వరకు కడలూరు, వేలూరు, రాజమండ్రి బళ్ళారి చిరుచినాపల్లి జిల్లాలో దువ్వూరి శిక్ష అనుభవించారు. పదేళ్ళు దేదీప్యమానం గా వెలిగిన ఆశ్రమం 1933 చివరలో ముగింపు దశకు రాగా, ఒక్కొక్కరే ఆశ్రమం వదలి వెళ్ళిపోయారు.

విడుదల కాగానే ముందు రాజమండ్రికే వచ్చి,లింగరాజు గారితో కలిసి మద్రాస్ లో ప్రకాశంగారి 'స్వరాజ్య "పత్రికలో చేరారు. ఉద్యమము విరమించిన 10నెలలతర్వాత తాపీగా దువ్వూరి ని విడుదల చేశారు. ఆయన అరెస్ట్ కు హింసా వాదం కారణం కాకపోయినా అతి ప్రమాదకరమైన దేశ ద్రోహి అనే కారణం మోపారు.

జైలు జీవితం లో అన్నపూర్ణయ్య గారికి చిత్ర విచిత్రానుభవాలు కలిగాయి. రష్యా సోషలిం,మార్క్సిజం గురించి అవగాహన కలిగింది. 1936 సెప్టెంబర్ 26,27తేదీలలో కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీ రెండవ మహాసభలు రాజమండ్రి లో జరిగాయి. దువ్వూరి ప్రధాన కార్య దర్శి, పుచ్చలపల్లిసుందరయ్య గారు సహాయ కార్య దర్శిగా ఎన్నికయ్యారు. జాతీయ కార్య దర్శి జయప్రకాష్ నారాయణ మద్దూరికి బాగా సన్నిహితులయ్యారు. ఆంధ్ర పర్యటనలో ఆయన వెంట నే ఉన్నారు మద్దూరి. "భారత దేశం లో సోషలిజాన్నిపూర్తిగా అర్ధం చేసుకొని భాష్యం చెప్పగల ఏకైక వ్యక్తి జయప్రకాష్ "అని గాంధీ చేత ప్రశంసలు పొందారు జయప్రకాష్. ఆయన రాసిన "వై సోషలిజం "పుస్తకాన్ని మద్దూరి సూచనపై మహీధర జగన్మోహనరావు "సోషలిజం ఎందుకు ""పేరుతొ అనువాదం చేశాడు. దీనికి మద్దూరి వివరణాత్మక ముందు మాటలు రాశారు. జమీందారీల రద్దు,ప్రభుత్వానికీ రైతుకు మధ్య దళారీ లు పోవాలని వీరి ముఖ్యసిద్ధాంతం. గాంధీ అదేమీ కుదరదు అలాంటి స్థితివస్తే తానుకూడా పోరాటం చేస్తాను జమీందార్లు ధర్మకర్తలు అన్నాడు. ఈ విషయాలన్నీ పుస్తకం లో వివరం గా చర్చించారు లోక నాయక జయప్రకాష్. దువ్వూరికి రష్యానేత లెనిన్ పై చాలా గౌరవం. "జోహారు లందుకో మా జోదు లెనిన్ "అనే గేయం కూడా రాశారు. జయప్రకాష్ ను " భారత లెనిన్"అని కీర్తించారు దువ్వూరి.

కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీ ప్రధాన కార్యదర్శి అన్నపూర్ణయ్య గారు పార్టీ నియమావళి 1937 మార్చిలో ప్రకటించారు. అందులో ముఖ్యమైనవి –కాంగ్రెస్ సభ్యులే సోషలిస్ట్ పార్టీ సభ్యులు, మార్క్స్ సిద్ధాంతాలను అంగీకరించాలి. వర్గపోరాట శాస్త్రాన్నీ, అభ్యాస విదుల్నీ తెలుసుకోవాలి.

అఖిలభారత కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీ కార్యక్రమ ఆదర్శాలు –1-ఉత్పత్తి దారులైన జన సామాన్యానికి రాజ్యాధికారం అప్పగించాలి. 2-దేశ ఆర్ధికాన్ని నియమిత పద్ధతుల్లో ప్రభుత్వమే నడుపుతూ అభి వృద్ధి చేయాలి 3 –ఉత్పత్తి,పంపకం, మారకం క్రమేణా సంఘపరం చేయాలి 4-ప్రభుత్వమే విదేశీ వ్యాపారం చేయాలి 5-సంస్థానాలు, జమీందారీ విధానం షరతులు లేకుండా రద్దు చేయాలి. 6-సహకార పరపతి సంఘాలు నెలకొల్పాలి 7-రైతులకు మళ్ళీ భూమి పంచాలి. 8-సహకార వ్యవసాయం ప్రోత్సహించాలి 9-కార్మిక కర్షకుల అప్పు రద్దు చెయ్యాలి 10-పని చేసే హక్కు గుర్తించాలి 11-శక్తికొద్దీ పని, అవసరం కొద్దీ ప్రతిఫలం సూత్రం అంగీకరించాలి 12-మేజర్లు అందరికీ వోటింగ్ హక్కు ఇవ్వాలి 13-కులమత పక్షపాతం లేకుండా ప్రభుత్వ పాలన సాగాలి 14-స్త్రీ, పురుష భేదం ప్రభుత్వం పాటించ కూడదు 15-పబ్లిక్ డెట్ ఆఫ్ ఇండియా ను ఎగ వెయ్యాలి.

ఆంధ్ర జయప్రకాష్ –జయప్రకాష్ నారాయణ జీవితానికి అన్నపూర్ణయ్య గారి జీవితానికీ చాలా సామ్యం ఉన్నది. ఇద్దరూ యువజనాకర్షణలో సిద్ధ హస్తులు. జాతీయ ఉద్యమం లో వామపంధా అనుసరించిన త్యాగమూర్తులు. మొదట్లో కాంగ్రెస్ తర్వాత మార్క్సిజం అధ్యయన శీలురు. "వెలుగు "పత్రికలో మద్దూరి "

1953 వేసవి శిక్షణలో జెపి పూనాలో 21రోజులు ఉపవాసం చేసి, నాస్తికత్వం నుంచి ఆస్తికత్వానికి మారాడు. 1953 సెప్టెంబర్ లో "బొంబాయి సోషలిస్ట్ జనరల్ కౌన్సిల్ ఆధిభౌతిక వాదం నా సమస్యలను పరిష్కరించలేకపోయింది. నేను ఇవాళ మార్క్సిస్ట్ ను కాను "అని చెప్పాడు అంటూ రాశారు. మానవులమధ్య ప్రేమ బంధం గాఢం గా ఉండాలి. జయప్రకాష్ నిర్ణయం దివ్యమైనది. కేవల నాస్తికుడు పరమ ఆస్తికుడై ప్రేమ తత్వాన్ని శరణు జొచ్చాడు. మహా పురుషుల గమ్యం ఇదే..ఆ గమ్యాన్ని చేరిన జెపి కి ఇవే జోహార్లు అని రాసినమాటలు అక్షరాలా అన్నపూర్ణయ్యగారికీ వర్తిస్తాయి. ప్రజా సేవలో 33 ఏండ్లు పండిపోయి 1953 డిసెంబర్ 2న అన్నపూర్ణయ్య గారు తాను ఏ పార్టీకీ చెందను అని ప్రకటించారు. ఆత్మ విచారణ మార్గం లో గురువును వెతుక్కొంటూ మెహర్బాబా శిష్యుడయ్యారు మద్దూరి.

యువజన శిక్షణా శిబిరాలు –గాంధీ ఆశీస్సులతో 1934 లో జయప్రకాశ్ మొదలైన వారు కాంగ్రెస్ లో అంతర్భాగం గా "కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీ "స్థాపించారు. 1937 లో కమ్యూనిస్ట్ పార్టీపై నిషేధం ఉంది. బలం పుంజు కోవచ్చునని వాళ్ళు ఈ పార్టీలో చొచ్చుకుపోయారు. ఆంధ్ర యువకులకు మూతన రాజకీయ దృక్పధం అలవాటు చేయటానికి కొత్తపట్నం లో వాలంటీర్ల శిక్షణా శిబిరం నిర్వహించారు. ఇది ఒంగోలుకు తూర్పున పది మైళ్ళ దూరం లో సముద్రం ఒడ్డున శిబిరం. 170మంది వాలంటీర్లు చేరారు. వీరిలో పుచ్చలపల్లి సుందరయ్య, కొల్లా వెంకయ్య, మాకినేని బసవపున్నయ్య, జొన్నలగడ్డ రామలింగయ్య, పిడతల రంగా రెడ్డి మొదలైన వారున్నారు. ఇందూలాల్ యాజ్ఞిక్, జహీర్, జోరాబేగం, స్వామి సహజానంద సరస్వతి, ఆచార్య రంగా, జయప్రకాష్ నారాయణ, అచ్యుత పట్వర్దన్, బాట్లివాలా, సిపి అల్లం గో ఉపన్యాసాలిచ్చి అవగాహన కల్పించారు.

ఆంధ్రరత్న దుగ్గిరాలవారి ముఖ్య శిష్యుడు జనాబ్ గౌసు బేగం వాలంటీర్ దళాధిపతి. చంద్ర రాజేశ్వరరావు డ్రిల్లు, అన్నాప్రగడ కామేశ్వరావు గెరిల్లా పద్ధతులు నేర్పేవారు. అల్లూరి సత్యనారాయణ రాజు, ఆయన భార్య, అన్నా ప్రగాడ, ఆయన సతీమణి కూడా పాల్గొన్నారు. శిబిర నిర్వహణ బాధ్యతా అన్నాప్రగడ, మద్దూరి,అల్లూరి సేతి చలపతిసాగి విజయ రామరాజు వహించారు. స్థానికుల తోడ్పాటుతో జయప్రదంగా జరుగున్న ఈ శిబిరాన్ని ప్రభుత్వం నిషేధించింది.1937 మే 21న గుంటూరు జిల్లా కలెక్టర్ పెల్లోడి రెండు వాన్ల రిజర్వ్ తో వచ్చి, వాలంటీర్లపై లాఠీ చార్జి చేశాడు. అన్నా ప్రగడ,అన్న పూర్ణయ్య గార్లకు బాగా దెబ్బలు తగిలాయి. భారత జాతీయ కాంగ్రెస్ ఆవిర్భావం గురించి అన్నపూర్ణయ్య గంభీర ఉపన్యాసం చేశారు. 1942 లో దువ్వూరికి ఇచ్చిన చార్జి షీటు లో శిబిరం లోనిషేధిత కమ్యూనిజం గూర్చిబోధించారని ఆరోపణ ఉన్నది. తాను ఆపని చేయసే లేదు అని దువ్వూరివారు తీవ్రంగా ఖండించారు.

1938 మే 4న ఆంధ్రా కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీ ఆధ్వర్యం లో గుంటూరుజిల్లా మంతెన వారిపాలెం లో అన్నాప్రగడ యువజన శిక్షణా శిబిరం నిర్వహించాడు. దీన్ని ప్రభుత్వం నిషేధించలేదు. అన్న పూర్ణయ్య ఇక్కడా జాతీయోద్యమం సోషలిజం గూర్చి మాట్లాడారు. మాడభూషి వెంకటా చారి, చండ్ర, సివికే రావు, కంభం పాటి సత్యనారాయణ పివి శివయ్య, జొన్నలగడ్డ, అధ్యాపకులుగా ఉన్నారు ఎస్ ఏ డాంగే,పిసి జోషి, అధికారి మొదలైన పెద్దలు ప్రేరణ కలిగించారు. మాదల వీరభద్రయ్య రాసిన గేయాని అన్న పూర్ణయ్య గారు పాడి స్ఫూర్తి క లిగించారు.

1936, 37లో మద్దూరి విస్తృతంగా గోదావరి జిల్లాలో పర్యటన చేసి యువకులను సోషలిం వైపు ఆకర్షించారు.బట్ట గుండులో జరిగిన తమిళనాడు సోషలిస్ట్ సభకు అధ్యక్షత వహించారు ఏలూరు లో జరిగిన పగోజి సభకు అధ్యక్షత వహించగా శ్రీమతి కమలకుమారి ప్రారంభించారు. అదేకాలం లో రాజమండ్రి అల్యూమినం, ప్రెస్ వర్కర్లను సంఘటితం చేసి వారి యూనియన్ లకు అధ్యక్షుడై కార్మిక సంక్షేమానికి యెనలేని కృషి చేశారు అన్నపూర్ణయ్య.

అన్నపూర్ణయ్య గారు నాలుగు అంకాల అసంపూర్ణ నాటకం రాసి పేరు పెట్టలేదు. అనాధ విద్యా వంతుడికి బ్రాహ్మణ కన్యకు పెళ్లి జరిగి, ఇద్దరూ స్వతంత్ర సమరంలో జైలుకు వెళ్ళటం ఇందులో కథ.స్వాతంత్ర్య పోరాటగాథను "అక్క "నవలగా రాశారు కాని అలభ్యం. భార్యమరణం పై "వీరపత్ని "గేయం రాశారు. అది గొప్ప ఎలిజీగా నిలబడింది.

శ్రీమతి వెంకట రమణమ్మ –అన్నపూర్ణయ్యగారి భార్య వెంకట రమణమ్మ. 2-3-1906 న పెద్దాపురం లో పుట్టారు7-6-1919 న అన్నపూర్నయ్యగారితో పెద్దాపురం లో పెళ్లి జరిగింది. ఆమెకు 14,ఆయనకు 20 వయసు. కట్నకానుకల విషయం లో తేడావచ్చి వేరొక సంబంధం చేయాలని తండ్రి భావిస్తే ఆమె ఈయన్నే పెళ్లి చేసుకొంటానని భీష్మించి పెళ్ళాడింది. ఉద్యమం కోసం చదువు మానవద్దని ఆమె ఆయనకు ఉత్తరం రాసింది. కానీ ఆయన వినలేదు. కానీ ఆమె సాహచర్యంతో ఆయనలో గొప్ప మార్పు వచ్చింది. 1925 లో ఈ దంపతులు గౌతమీ ఆశ్రమం లో చేరారు. 192 7లో పుట్టిన కూతురికి రాజేశ్వరి పేరు పెట్టారు. 1932 లో సీతానగర ఆశ్రమం చట్ట విరుద్ధమని ప్రభుత్వం ప్రకటిస్తే, ముందుగా ఆడవారిని బయటికి పంపిస్తుంటే రమణమ్మ గారు మాత్రం "మగవారితో పాటే మేము "అని అక్కడే ఉన్నారు. తర్వాత పెద్దలు నచ్చ చెప్పి పంపించారు.

రాజమండ్రిలో విదేశీ వస్త్రాల దుకాణాలవద్ద పికెటింగ్ చేయగా రమణమ్మ గారిని గారిని అరెస్ట్ చేసి ఆరు నెలలు జైలులో ఉంచారు. 1934 అక్టోబర్2 గాంధీ జయంతి నాడు ఆమె రాజమండ్రిలో ఖద్దరు వస్త్రాలు అమ్మారు.7-7-1935న దంపతులు గౌతమీ ఆశ్రమం వదలి రాజమండ్రి చేరారు. 1937 లో వీరికిపుట్టిన కొడుకు తాతగారిపేరు జయరాం అనిపెట్టారు. 1935లో ఆమెకు తీవ్రంగా జబ్బు చేసింది. కాంగ్రెస్ స్వర్ణోత్సవాల బాధ్యత దువ్వూరిపై పడింది. తన ఆరోగ్యం గురించి బాధ పడవద్దనియధా ప్రకారం కార్యక్రమాలు చేయమని కోరిన ఉత్తమా ఇల్లాలు. 6-4-1940 న అన్నపూర్ణయ్యగారిని ఖైదు చేసే నాటికి కుమార్తెకు 13,కొడుక్కి 3ఏళ్ళు. స్థిరాస్థి శూన్యం. 1945జూన్ లో ఆయన విడుదల అవటానికి రెండేళ్ళ ముందే ఆమె చనిపోయారు. 1940-43 మధ్యకాలం ఆమెకు గడ్డుకాలం. పిల్లల్ని ఎలాపోషించిందో ఊహకు అందని విషయం. పుట్టింటి కొల్లూరి వారే కొంత అండగా నిలిచారు.

దువ్వూరి ఎక్కువకాలం వెల్లూరు సెంట్రల్ జైలులో ఉన్నారు. ఆయననుంచి భార్యకు ఉత్తరాలు వచ్చేవికావు. ఎప్పుడైనా ఈమె కార్డు రాసేది. 1942 లో భర్తను బేషరతుగా విడుదల చేయమని లేకపోతే కుటుంబ పోషణకు డబ్బు మంజూరు చేయమని రమణమ్మగారు ప్రభుత్వానికి అర్జీపెట్టారు. ప్రభుత్వం నెలకు 15రూపాయలు మంజూరు చేసింది. తర్వాత అది చాలదనిపెంచమని, కూతురి పెళ్లి చేయటానికి ధనం సాయం చేయమని ప్రభుత్వాన్ని కోరారు. 1942 జులై నుంచి జీవన భ్రుతి 25రూపాయలు చేశారు. పుట్టింటి అండకోసం కాపురం ఏలూరు కు మార్చారు. 1942 ఆగస్ట్ లో కూతురుపెళ్లి అనీ 200రూపాయలు మంజూరు చేయమని లేకపోతే 13రోజులు పెరోల్ పై విడుదల చేయమని పూర్ణయ్యగారు ప్రభుత్వాన్ని కోరితే నిర్దాక్షిణ్యంగా తిరస్కరించింది. తనతమ్ముడు సూర్యనారాయణ శాస్త్రికి కూతురు రాజేశ్వరి నిచ్చి వెంకటరమణమ్మగారు 1942ఆగస్ట్ 28 న తండ్రి జైలులో ఉండగానే వివాహం జరిపించారు. పెళ్లి ఖర్చులు 512రూపాయలు అందులో 200రూపాయలు రమణమ్మగారు అప్పుగా తెచ్చినవే.

6-12-1943 వెంకటరమణమ్మగారు 37వ ఏటనే తుదిశ్వాస విడిచారు. చివరిరోజులలో భర్తను చూడాలని ఆరాట పడిన ఆమె తపన అర్ధం చేసుకుని, దువ్వూరి పెరోల్ కోసం అప్ప్లై చేశారు. ఆర్డర్ వచ్చేలోపే ఆమె మరణ వార్త టెలిగ్రాం చేరింది. ముందుగా లింగరాజుగారు చూసి ఎలా చెప్పాలో అర్ధంకాక దిగాలుగా ఉంటే, దువ్వూరి "ఏమిటీ రమణమ్మ పోయిందా ?""అని అడిగారట. టెలిగ్రాం చేతికివ్వగా చదివి మౌనంగా ఒక మూల కెళ్ళి కూర్చున్నారు. 1947స్వాతంత్ర్య దినోత్సవం నాడు కొవ్వూరులోని వీరస్మరణ మందిరం లో రమణమ్మ గారి చిత్రపటాన్ని శ్రీమతి చుండూరు వెంకటరత్నమ్మగారు ఆవిష్కరించి అంజలి ఘటించారు.

1945 జూన్ లో జైలు నుండి విడుదలయ్యాక మద్దూరి అన్న పూర్ణయ్యగారు ఏకాకి అయ్యారు. రెండేళ్లక్రితమే భార్య చనిపోవటం కూతురు అత్తారింట్లో ఉండటం కొడుకు విద్యాబుద్ధులను మేనమామలే చూస్తూండటం వలన ఆయన దగ్గర ఎవరూ లేరు. రాజమండ్రిలో బావమరది ఇంట భోజనం చేస్తూ మళ్ళీ ప్రజాసేవలో నిమగ్నమయ్యారు. అప్పటికే ఫార్వర్డ్ బ్లాక్ తో సంబంధాలు వదిలేశారు. కాంగ్రెస్ తో సంబంధం కొనసాగించారు. 1945కి కాంగ్రెస్ లో గ్రూపులు ముఠాలు ఎక్కువయ్యాయి. ఈయన వాటికి అతీతులు. రాజమండ్రి పట్టణ కాంగ్రెస్ అధ్యక్ష ఎన్నికలో పూర్ణయ్య గారు నామినేషన్ వేశారు. కాంగ్రెస్ లో బలమైన వర్గామున్న డా ఎబి నాగేశ్వరరావు ప్రత్యర్ధి. అందులోని ఇద్దరు మద్దతు ఇవ్వటం తో దువ్వూరి టౌన్ కాంగ్రెస్ అధ్యక్షులుగా ఎన్నికై,, 1948జనవరి 25వరకు ఉండి,ప్రత్యేక సోషలిస్ట్ పార్టీ ఏర్పడటం తో కాంగ్రెస్ కు రాజీనామా చేశారు. 1946 శాసన సభ స్థానం నుంచి మద్రాస్ శాసన సభకు కాంగ్రెస్ అభ్యర్ధిగా రాష్ట్ర కాంగ్రెస్ సంఘం ప్రతిపాదించినా, కొందరు హైకమాండ్ తో అన్నపూర్ణయ్య నేతాజీ అనుచరుడనీ, ఆయనకు టికెట్ ఇవ్వద్దని ఒత్తిడి చేశారు. క్రొవ్విడి లింగరాజుకు టికెట్ వచ్చింది. ప్రజలు సహించలేక లింగరాజుకు ప్రచారం చేయమని నిరశన తెలిపారు. వారికి నచ్చ చెప్పి లింగరాజు పక్షాన నిలిచి గెలిపించారు పూర్ణయ్య.

తన తొలి ప్రేయసి పత్రికా రచన అని దువ్వూరి ఎప్పుడూ చెప్పేవారు. రాజమండ్రిలో మొదటి స్వాతంత్ర్య దినోత్సవం 1947 ఆగస్ట్ 15న పట్టణం లో 60చోట్ల గొప్పగా వేడుకలు జరిగాయి. మొదట పంజా రోడ్డులోని పార్కు వద్ద దువ్వూరి గాంధీ విగ్రహం ఆవిష్కరించారు అప్పటినుంచి ఆ పార్కు మద్దూరి వారి పేరుమీదుగా పిలువబడింది.1997లో శ్రీ భాట్టం శ్రీరామ మూర్తి అన్న పూర్ణయ్యగారి విగ్రహాన్ని ఇక్కడ ఆవిష్కరించారు. లాంచీ రేవులో నేతాజీ విగ్రహాన్నీ, ఈయనే ఆవిష్కరించారు. గౌతమీ వ్యాయామ శాల, ప్రభుత్వ బాలికా విద్యాలయం సభల్లో ప్రసంగించారు. సాయంత్రం 50 వేలమంది ఉన్న సభలో దువ్వూరి గంభీరోపన్యాసం చేశారు.

శ్రీ పివిజి రాజు ఆర్ధిక సాయంతో దువ్వూరి "జయ భారత్ "పత్రిక స్థాపించారు. యర్రమిల్లి నరసింహారావు, భాట్టం సహాయ సంపాదకులు 1947 నవంబర్ 1న మొదటి సంచిక వెలువరించి "సోషలిస్ట్ వారపత్రిక "అన్నారు. సంపాదకీయం తోపాటు అమృతారావు కలం పేరుతో "కలం చిందులు "రాసేవారు మద్దూరి. చిన్న కదా కవిత జనవాక్యం శీర్షికలు ఉండేవి. ఒక్కోసారి ప్రముఖ దేశభక్తుని ముఖ చిత్రం వేసేవారు. 1947 ఆగస్ట్ 27 సంచిక ప్రకాశంగారి చిత్రం తో వచ్చింది. ఆయన గురించి రాస్తూ "ఆంధ్రులకు ఏ సమస్యమీదా ఏకాభిప్రాయం లేదు కానీ, ప్రకాశంగారిని పూజించటం లో మాత్రం ఏకీ భావం ఉంది కారణం ఆయన ధైర్య సాహసాలు త్యాగం. ఈ సుగుణాలున్న వారు చాలామంది ఉన్నా ఆపద ఎక్కడ ఉంటె ప్రకాశం అక్కడ ప్రత్యక్షమౌతాడు. వరదలు తుఫాన్లు వచ్చి ప్రజలు నిలువ నీడ లేక అల్లాడుతుంటే ఆంధ్ర కేసరి వాలిపోవాల్సిందే."

సోషలిస్ట్ నాయకులు అచ్యుత్ పట్వర్ధన్, లోహియా, కమలాదేవి, అశోక్ మెహతా, పివిజి రాజుగార్లను పత్రికలో ఘనంగా పరిచయం చేశారు దువ్వూరి.

1-అచ్యుత్ పట్వర్ధన్ –విఖ్యాత సోషలిస్ట్ నాయకుడు.కాశీ విశ్వవిద్యాలయంలోప్రోఫెసర్ పదవికి రాజీనామా చేసి రాజకీయాలలో చేరి లక్నో ఫైజా పూర్ ఎఐసి సి సభ్యుడై, తర్వాత నిరాకరించి 1942 ఆగస్ట్ విప్లవం లో 3 ఏళ్ళు అజ్ఞాతం లో ఉంటూ అరుణా ఆసఫాలీ సహాయంతో ఆగస్ట్ విప్లవం నడిపాడు సతారాలో బ్రిటిష్ ప్రభుత్వం బదులు స్వదేశీ ప్రభుత్వం నడిపిన ఘనుడు. అన్న రావుసాహెబ్ కూడా దీటైనవాడు. వారి కుటుంబం మహారాష్ట్రలో చాలా ప్రభావమైనది. అచ్యుత్ అనర్గళవాగ్ధాటికి ముగ్ధులు కావాల్సిందే.

రామ మనోహర్ లోహియా-విజ్ఞాని.ఎఐసిసి విదేశాంగ శాఖ కార్యదర్శి గా పేరు పొందాడు సోషలిస్ట్ పార్టీ జాతీయకార్యవర్గ ప్రముఖుడు ఆగస్ట్ విప్లవాన్ని తేజో వంతంగా నడిపిన ధీరుడు. ఎర్రకోటలో జయప్రకాష్ తో పాటు జైలు జీవితం గడిపిన యోధుడు.

శ్రీమతి కమలాదేవి-అఖిలభారత మహిళామండలి అధ్యక్షురాలు. భారత నారీరత్నం. ఏఐసిసిసి సభ్యురాలు. సామ్యవాద భారత్ కోసం తీవ్ర కృషి చేసిన నారీమణి

శ్రీ అశోక్ మెహతా –సోషలిస్ట్ పార్టీ నిర్మాతలలో ఒకడు. హింద్ మజ్దూర్ సభ నిర్మాత కూడా మేధావి వక్త విద్యా సంపన్నుడు అరుదైన వ్యక్తిత్వమున్నవాడు ప్రజలను నడిపించే అమోఘ శక్తి ఉన్నవాడు. ప్రజాసోషలిస్ట్ పార్టీ ప్రధాన కార్యదర్శి. మధ్యప్రదేశ్ నున్చిపార్లమెంట్ కు నిలబడ్డాడు ఆయన్ను గెలిపించిన గౌరవం పొందాలి. చిన్నవయస్సు దేశభక్తుడు. కార్మిక కర్షకనాయకుడు. బహుళ గ్రంధకర్త మహా మేధావి. నిర్మాణ శక్తి సంపన్నుడు నిష్కళంక సేవామూర్తి.

శ్రీ పివిజి రాజు –"భూమి నంతటినీ జాతీయం చేసే బిల్లు రావాలి దీనితో పాతపద్ధతులు ఆచారాలు తొలగిపోయి భూమి అంతాప్రభుత్వ పరమౌతుంది. సామ్రాజ్యవాదుల అడుగులకు మడుగులొత్తే జమీందారీ వ్యవస్థ రద్దు త్వరగా జరగాలి. జయప్రకాష్ అడిగిన వెంటనే సోషలిస్ట్ పార్టీకి 10వేల రూపాయల విరాలమందించిన వదాన్యుడు పివిజ్ రాజు "

ఇంతటి మహత్తర వారపత్రిక కొన్ని సంవత్సరాలే నడిచి మూలపడింది.

కేంద్ర సోషలిస్ట్ పార్టీ అధ్యక్షుడు ఆచార్య నరేంద్రదేవ్. ప్రధానకార్యదర్శి జయప్రకాష నారాయణ్ ఆంధ్రలో సోషలిస్ట్ పార్టీ ఆడ హాక్ కమిటీ ఏం బాలకృష్ణ కార్యదర్శిగా, మద్దూరి చక్రధర్ వగైరా సభ్యులతో 1950 మే నెలలో ఏర్పడింది. జయప్రకాష్ ఆంధ్రలో పర్యటించినప్పుడు మద్దూరి ఆయన వెంట ఉంటూ ప్రసంగాలకు తెలుగులో అనువాదం చేసేవారు. బహిరంగ సభలకు జనం బాగా వచ్చేవారు. తనపర్యటన లో వసూలైన లక్షరూపాయలు ఆంధ్ర రాష్ట్ర పార్టీకి ఇచ్చాడు జెపి.

1952 జనరల్ ఎన్నికలలో మద్రాస్ శాసనసభకు ఆంధ్రనుంచి ఆరుగురు సభ్యులు సోషలిస్ట్ పార్టీ తరఫున ఎన్నికయ్యారు. ఈ పార్టీకి విశాఖజిల్లా బలమైన కేంద్రం. మద్దూరిని శాసన సభ్యుడిగా చూడాలని పివిజి రాజు ఆశపడ్డాడు. ఏదోఒక నియోజకవర్గం నుంచి పోటీచేయమని వొత్తిడి చేశాడు. రాజమండ్రి నుంచే పోటీ చేస్తానని మృదువుగా తిరస్కరించారు మద్దూరి. 1952 లో ఆంధ్రరాజకీయం డోలాయమానంగా ఉంది. ప్రకాశం కాంగ్రెస్ ను వదిలి ప్రజాపార్టీ పెట్టటం అండర్ గ్రౌండ్లో అప్పటిదాకా ఉన్న కమ్యూనిస్ట్ లు బయటికొచ్చి ఎన్నికలలో నిలబడటం తో రాజమండ్రి స్థానానికి నాలుగుపార్టీలు పోటీ పడ్డాయి. కాంగ్రెస్ తరఫున డా కే ఎల్ నరసింహారావు, ప్రజాపార్టీ నుంచి క్రొవ్విడి లింగరాజు, సోషలిస్ట్ పార్టీ నుంచి అన్నపూర్ణయ్యగారు కమ్యూనిస్ట్ అభ్యర్ధిగా చిత్తూరి ప్రభాకర చౌదరి పోటీ చేశారు. ఆంధ్రాయూని వర్సిటీ సోషలిస్ట్ విద్యార్ధినాయకుడు ఎవికే చైతన్య రాజమండ్రి లో ఉండి మద్దూరికి తీవ్ర ప్రచారం చేశాడు. మైకుకట్టిన కారులో మద్దూరి ప్రచారం చేస్తూ తన రాజకీయం వివరిస్తూ, 14ఏళ్ళు జైలులో ఉన్నానని తెలియజేస్తూ, గెలిచినా ఓడినా రాజమండ్రిలోనే ఉంటూ ప్రజాసేవ చేస్తానని వాగ్దానం చేస్తూ ప్రచారం చేశారు. ప్రచారం ఉధృతంగా ఉన్న సమయం లో కాంగ్రెస్ ను దుయ్యబడుతూ ప్రచారం చేసి ఒకరోజు అర్ధరాత్రి 12గంటలకు కాంగ్రెస్ అభ్యర్ధి నరసింహారావు ఇంటి తలుపుతట్టారు మద్దూరి. ఆయనకొడుకు తలుపు తీసి ఆశ్చర్యపోగా "మీ నాన్న ఉన్నాడా ??"అంటూ లోపలి వెళ్ళగా ఆయన దువ్వూరి వారిని భోజనం చేసి వెళ్ళమని బలవంతం చేసి దగ్గరుండి తినిపించాక గంటసేపు ప్రత్యర్ధులిద్దరూ కులాసా కబుర్లు చెప్పుకొన్నాక పూర్ణయ్యగారిని రిక్షా ఎక్కించి గౌరవంగా పంపారు రావుగారు. కానీ విజయం కమ్యూనిస్ట్ లదేఅయింది. ఓడినా విచారపడ లేదు మద్దూరి "స్వాతంత్ర్యం నాగురించికాదు. భావి తరాలకోసం. కాంగ్రెస్ కు రిజైన్ చేసిన నరేంద్ర దేవ్ వంటినాయకులు బై ఎలెక్షన్ లో ఓడిపోలేదా? గెలుపు వోటములు ముఖ్యం కాదు. ఇక భవిష్యత్తు అంతామనదే "అని కార్య కర్తలను ఊరడించిన స్థిత ప్రజ్ఞుడు మద్దూరి అన్నపూర్ణయ్యగారు.

1948 లో సోషలిస్ట్ పార్టీ ఏర్పడినప్పుడు అన్న పూర్ణయ్య గారు ప్రధానకార్య దర్శిగా పార్టీ విస్తరణకు నిర్విరామ కృషి చేశారు. 1952లో సోషలిస్ట్ లంతా కలిసి ప్రజా సోషలిస్ట్ పార్టీ పెట్టినప్పుడు బొంబాయిలో జరిగిన జనరల్ కౌన్సిల్ కు మద్దూరి హాజరైనా, ఆ విలీనం ఆనయనకు నచ్చలేదు. ఆంధ్ర పార్టీలో ఆయనకు గౌరవస్థానం ఇవ్వలేదు.ఆయన క్రమంగా రాజకీయాలకు దూరమౌతున్నారు. ఆధ్యాత్మికత వైపు దృష్టి సారించి అవతార్ మెహర్ బాబా వైపు ఆకర్షింప బడి 1953 జులై 10న "వెలుగు "వారపత్రిక ప్రారంభించి మొదటి సంచికలో "అబద్ధం రాజ్యమేలుతోంది. ప్రేమ సత్యం దూరమయ్యాయి "స్వతంత్ర భారత బానిసల్లారా లేవండోయ్ "అని ప్రజల్ని మేల్కొల్పాల్సిన సమయం వచ్చింది. భుక్తి ముక్తి చూపిస్తుంది వెలుగు పత్రిక. సోషలిజంద్వారా భుక్తినీ నీలోని వెలుగు చూపించి మేల్కొల్పి ముక్తినీ కల్పిస్తుంది "అని రాశారు జయప్రకాష, ఆంధ్రకేసరి ఆశీర్వదించారు. ప్రజా సేవలో 33ఏళ్ళు గడిపి 1953 డిసెంబర్ 2నుంచి తాను ఏ పార్టీకీ చెందని ప్రజా సేవకుడుగా మిగిలారు. మెహర్ బాబా కీర్తి వ్యాపించటానికి మద్దూరి చేసిన కృషి అద్వితీయం. 1954 ఫిబ్రవరి 20 నుంచి 11 రోజులు మెహర్ బాబా ఆంధ్రలో పర్యటించినప్పుడు మద్దూరి వెన్నంటి ఉండేవారు. ఆయనపై ప్రత్యేక సంచిక తెచ్చారు. సభలలో అప్పటికప్పుడు ఆంగ్లకవితలు రాసి చదివి బాబాకు సమర్పించేవారు.

ఏలూరులో బాబా అన్నపూర్ణయ్య గారి అల్లుడు ఇంట్లో కుటుంబం వారందర్నీ ఆశీర్వదించి పూర్ణయ్య గారితో అయిదు నిమిషాలు ప్రత్యేక ఏకాంత దర్శనమిచ్చారు. ఆంధ్రలో ఇలాంటి అవకాశం ఎవ్వరికీ దక్కలేదు. ఒక్క మద్దూరికే దక్కింది ఆ అదృష్టం. కళా వెంకటరావు, పాలకొడేటి సూర్య ప్రకాశరావు మద్దూరిబుచ్చి వెంకయ్య, మద్దూరి కృష్ణమూర్తి, నరసింహ దేవర సత్యనారాయణ లను బాబా ఆశీర్వదించారు మద్దూరివారి ప్రత్యేక ఆహ్వానం తో వచ్చిన మహర్షి బులుసు సాంబమూర్తి గారిని బాబా ఆలింగనం చేసుకొని ప్రత్యేక ఆసనం పై కూర్చోబెట్టారు.

1954 వేసవి ఎండలకు మద్దూరి ఆరోగ్యం దెబ్బతిన్నది. రాజమండ్రిలో బావమరది కొల్లూరి కృష్ణ శాస్త్రి ఇంట్లో భోజనం చేస్తూ కాలం గడిపారు ఒక హోటల్ యజమాని మద్దూరికి ఉచితంగా భోజనం ఏర్పాటు చేశాడు. సెప్టెంబర్ లో ఏలూరు వెళ్ళారు అక్కడే సెరిబ్రల్ మలేరియా వచ్చి 1954 సెప్టెంబర్ 11న మహాత్యాగి మద్దూరి అన్నపూర్ణయ్యగారు 65వ ఏట మరణించారు మరణవార్త టెలిగ్రాం ద్వారా తెలుసుకొన్న మెహర్ బాబా ఆయన తనలో లీనమయ్యారని తెలియ జేశారు ఏలూరులోనే అంత్యక్రియలు నిర్వహించి చితాభస్మాన్ని రాజమండ్రి లో గోదావరిలో నిమజ్జనం చేశారు.

అన్న పూర్ణయ్య గారికి నివాళులర్పించిన నేతలు ఆయన త్యాగనిరతిని బహుదా ప్రశంసించారు. మధు దండావతే -,"విలువలు పునరుద్ధరించిన నేత మద్దూరి. ఆయనజీవితం యువతకు స్ఫూర్తి "వావిలాల-"వేలూరు జైలులో ఆయనతో గడిపి ఎన్నో విషయాలు నేర్చుకొన్నాను. సర్దార్ గౌతు లచ్చన్న-న్యాయానికి నిలబడే శక్తి ప్రజల్లో కల్గించాడు ".నండూరి ప్రసాదరావు "నిస్వార్ధ సేవకుడు కూతురు స్కూలుఫీజు కూడా చెల్లించలేని స్థితిలో ఉండేవాడు ".నార్ల-"ఆయన నాగురువు. నా మొదటి రచన ను కాంగ్రెస్ పత్రికలో ప్రచురించి ప్రోత్సహించారు. 'తులసి గంగాధరరావు –"క్వారీ వర్కర్స్ సభకు ఆహ్వానించి రమ్మంటే యెంత సేపు చూసినా రాకపోతే నేను అడిగితే "రావటానికి రిక్షా బాడుగ డబ్బులు లేవు. "అన్నారు మీ డబ్బు ఏం చేశారు అని అడిగితే "భూపతి కోటేశ్వరరావు కు కొంత, ప్రెస్ కు కొంత,ఎవరెవరో వచ్చి అడిగితె వారికీ ఇచ్చి భోజనం లేకుండా ఉండిపోయాను "అని చెప్పిన మహాత్యాగి "శ్రీమతి రాజ్యం సిన్హా "కృష్ణాజిల్లా ముదునూరులో ఉండే మా నాన్న అన్నే అంజయ్య గారు వీరూ, నేతాజీ శిష్యులు. వక్త రచయితా ఉద్యమనిర్మాత మద్దూరి ", 'భాట్టం శ్రీరామమూర్తి –"ఆయన నా గురువు అనిచెప్పి గర్వపడుతున్నాను. మా వర్ణాంతర వివాహం దగ్గరుండి జరిపించిన విశాల హృదయుడు ",మద్దూరి జయరాం "మా తండ్రిగారికి స్థిర చరాస్తులు లేవు. ప్రభుత్వం ఇచ్చే ఐదు ఎకరాల భూమికంటే అభిమానులు సన్మానించి ఇచ్చిన రెండు రూపాయలే గొప్ప గా భావించేవారు. చనిపోవటానికి ఏడాదిముందు నన్ను యూనివర్సిటీలో చేర్పించారు నాన్న "

అన్నపూర్ణయ్యగారు నడిపిన పత్రికలు -నవవ శక్తి, జయ భారత్, వెలుగు,

# అచ్యుత పట్వర్ధన్

ఆగస్ట్ ఉద్యమ వీరుడు, సోషలిస్ట్ పార్టీ నిర్మాత –అచ్యుత పట్వర్ధన్

ఆధారం –శ్రీ గోపరాజు వెంకటానందం 1946 లో రచించిన "ఆగస్ట్ ఉద్యమవీరుడు అచ్యుత పట్వర్ధన్ '



5-2-1905 న మహారాష్ట్రలోని అహ్మద్ నగర్ లో అచ్యుత పట్వర్ధన్ జన్మించాడు. తల్లి తండ్రీ వైపు వారంతా సాంప్రదాయ కుటుంబీకులే.తండ్రి గొప్ప ప్లీడర్ మహాదాత. తల్లి వీరమాత. వీరి సంతానమంతా స్వాతంత్రోద్యంలో పాల్గొన్న వాళ్ళే, తల్లి కూడా తన 60వ ఏట ఉద్యమం లో పాల్గొని జైలు కెళ్ళింది. అచ్యత్ అన్న రావు చాలాసార్లు జైలు కు వెళ్ళాడు. సోదరి విజయ 1942 ఉద్యమం లో కాలేజీ మానేసి ఉద్యమం లో చేరి అన్నకు, జయప్రకాష్ నారాయణ కు కార్యదర్శిగా పని చేసింది. ఈ రహస్యోద్యమం లో ఆమెకు తెలిసిన రహస్యాలు ఇంకెవ్వరికీ తెలియవు. గాంధీ గారి "డు ఆర్ డై"అనుసరిచి సోదరుడు, సోదరి పని చేశారు.

అచ్యుత్ మంచి సంగీత గాయకుడు. అన్ని వాయిద్యాలు వాయించేవాడు. చిన్నప్పటినుంచి దేశభక్తి గీతాలు పాడేవాడు. లెక్కలు వచ్చేవికావు. సంపన్న కుటుంబం కనుక ఇల్లు నిత్యాన్నదానాలు అతిధులతో కళకళ లాడేది. బాగా ధనవంతుడైన పినతండ్రికి పిల్లల్లేక అచ్యుత్ ను దత్తత తీసుకొన్నాడు. అచ్యూత్, రావు అహ్మద్ నగర్ లో మెట్రికులేషన్ పూర్తి చేసి, బెనారస్ కాశీ విశ్వవిద్యాలయం లో చేరారు. 1893నవంబర్ 16 అనీబిసెంట్ ఇండియారాగా జనం బ్రహ్మ రధం పట్టారు. ఆమె భారత్ నే మాతృభూమిగా భావించి దాస్య విముక్తికి సంకల్పించింది. ఇక్కడే దివ్యజ్ఞాన సమాజం స్థాపించి ప్రపంచమంతా వ్యాపింప జేసింది. మానవ సేవ పరమావధిగా ఉన్న ఆ సమాజం వైపు అచ్యుత్ తండ్రి ఆకర్షితు డయ్యాడు.



1898జూన్ 6న లో బీసెంట్, కొందరుకలిసి "సెంట్రల్ హిందూ కాలేజి "స్థాపించారు.దీనికి ప్రిన్సిపాల్ గొప్ప విద్యావేత్త డా జి ఎస్ అరండేల్. ఇందులో పని చేసేవారంతా సేవాభావం తో చేసేవారే. ఒకరినిమించి మరొక ప్రజ్ఞా దురీణులు. భగవాన్ దాస్, గోవిందదాస్, గుర్తు, లాంగ్ వంటి మేదావులున్నారు. కొంతకాలం గడిచాక పండిత మదన మోహన మాలవ్యా దీన్ని తీసుకొని హిందూ విశ్వ విద్యాలయం గా మార్చాడు. ఇక్కడ చదివిన అచ్యుత్ సోదరులు పీకే తెలంగ్, జ్ఞాన్ చంద్ ల శిష్యులై వారి అడుగుజాడల్లో నడిచారు. రావు వక్తృత్వం లో దిట్ట ఎన్నో బహుమతులు పొందాడు. ఒకసారి విశ్వ విద్యాలయ పార్లమెంట్ కు అచ్యుత్ ప్రధానిగా ఉన్నాడు. ఎం.ఎ.పాసై అచ్యుత్ యూరప్ వెళ్లి వచ్చి ఇక్కడే ఆర్ధిక శాస్త్ర లెక్చరర్ గా చేరి పని చేశాడు.

దేశం లో శాసనోల్లంఘన ఉద్యమం మహాఊపుగా సాగుతోంది. రావు అప్పటికే ఉద్యమంలో చేరి జైలు కెళ్ళాడు. బొంబాయ్ ఉద్యమానికి గొప్ప కేంద్రమైంది. ప్రచారం కోసం ఉమాశంకర దీక్షిత్ ఒక రహస్య పత్రిక స్థాపించి నడిపాడు. పట్వర్ధన్ వెంటనే తానూ రహస్య ఉద్యమం లో చేరి జైలుకెళ్లాడు. ప్రభుత్వ జైళ్ళు అన్నీ సత్యాగ్రహులతో నిండిపోయాయి. ఉద్యమం చల్లబడింది. యువకుల్లో ఉద్రేకం ఉప్పొంగింది. గాంధీ రాజకీయాన్ని సాంఘి కోద్యమం గా మార్చాడు. రష్యాలో లెనిన్ నాయకత్వం లో సామ్యవాద రాజ్యం స్థాపించటం ఇక్కడి యువకులకు అర్ధమై, ఇక్కడ ఉద్యమానికి "స్వరాజ్యం "అన్నదానికి నిర్దిష్టరూపం ఇవ్వలేక పోవటం గమనించి తామే నడుంకట్టాలని యువత భావించింది. సామ్యవాదమే పరిష్కారం అని నిర్ణయించారు.

ఈ సామ్య వాద సిద్ధాంతానికి నాసిక్ జైలు ప్రధాన కేంద్రమైంది. జయప్రకాష్, అచ్యుత పట్వ ర్ధన్, అశోక్ మెహతా, మీనూ మసానీ మొదలైనవారు కలిసి సిద్ధాంత రూప కల్పన చేశారు. 1934 మే నెలలో పాట్నా అఖిలభారత కాంగ్రెస్ సమావేశం లో శాసనోల్లంఘన విరమిస్తూ, శాసన సభా ప్రవేశానికి వీలుకలిగిస్తూ

తీర్మానం చేశారు. అప్పుడే జయప్రకాష్ పట్వర్ధన్లు, ఆచార్య నరేంద్ర దేవ్ అధ్యక్షత న సమావేశమే కాంగ్రెస్ మితవాద మార్గాన్ని తీవ్రంగా విమర్శించి, కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీ స్థాపించి, యువకులకు భాగస్వామ్యం కల్పించారు.

యువకిశోరం అచ్యుత్ పట్వర్ధన్ పాట్నాలో కాంగ్రెస్ పై నిప్పులు కక్కుతూ రాట్నం –ఖద్దరు తో స్వరాజ్యం రాదనీ ఉపన్యసించాడు. కాంగ్రెస్ నాయకులీ ప్రసంగానికి ఆశ్చర్యపోయారు. 1936 లక్నో కాంగ్రెస్ కమిటీ సభలో కూడా పట్వర్ధన్ కాంగ్రెస్ ను తీవ్రగా విమర్శించాడు. యువకుల మనోభావం అర్ధం చేసుకొన్న నెహ్రూ నిర్మించిన అఖిలభారత కాంగ్రెస్ కార్యవర్గం లో సామ్యవాద యువకులైన ముగ్గురు-జయప్రకాష్, నరేంద్ర దేవ్, పట్వర్ధన్ లకు అవకాశం కల్పించాడు . మర్యాదగా తిరస్కరించాడు పట్వర్ధన్. అప్పటికి అతని వయసు 30 మాత్రమే. పదవీ వ్యామోహం ఆయనకు లేదన్నదానికి ఇదే నిదర్శనం.

1939 లో రెండవ ప్రపంచ యుద్ధం మొదలయ్యాక. ఇండియాను యుద్ధంలోకి దించ వద్దని వాక్ స్వాతంత్ర హక్కు ఇవ్వమని గాంధీ వైస్రాయి లిన్ లిత్ గో తో మాట్లాడి విఫలుడయ్యాడు.రాష్ట్రాల కాంగ్రెస్ మంత్రివర్గాల చేత రాజీ నామా చేయించాడు గాంధీ. వేరే మార్గం లేక గాంధీ వైస్రాయియికి లేఖరాసి, వినోబా భావేతో వ్యష్టి సత్యాగ్రహం ప్రారంభింప జేశాడు. యుద్ధ వ్యతిరేక నినాదాలు చేస్తూ సత్యాగ్రహం లో జనం పాల్గొని జనం స్వచ్చందంగా జైలుకు వెళ్ళారు. వ్యష్టి సత్యాగ్రహం ప్రజాపోరాటం కాజాలదు అని కమ్యూనిస్ట్ లు భావించినా ప్రపంచామంతావ్యష్టి సత్యాగ్రహం తో మారు మోగింది. ప్రతిపోరాటం లోనూ ఏదో ఒక సాకుతో కమ్మీలు తప్పించుకొనేవారు. ఉప్పు సత్యాగ్రహాన్నికూడా "ప్రజల పోరాట శక్తి తగ్గించే మత్తు మందు "అని పెదవి విరిచారు. వ్యష్టి సత్యాగ్రహాన్ని "పూలదండల సత్యాగ్రహం "అని హేళన చేశారు, 1942 ఆగస్ట్ ఉద్యమాన్ని "ఆగస్టు అల్లర్లు "అనీ జపాన్ ఏజెంట్లు, పంచమాంగ దళం వాళ్ళు చేస్తున్న దౌర్జన్యా చర్యలనీ ప్రచారం చేసిన ప్రబుద్ధులు కమ్యూనిస్ట్ లు. ఊరందరిదీ ఒకదారి ఉలిపి కట్టేది మరో దారి అనే సామెత వీరిది.

వ్యష్టి సత్యాగ్రహం రోజుల్లో పట్వర్ధన్, అశోక్ మెహతా జైలు జీవితం గడుపుతూకలిసి "కమ్యూనల్ ట్రయాంగిల్ ఇన్ ఇండియా "అనే ఉద్గ్రంధం రాశారు. మహాదేవ దేశాయ్ దీన్ని మెచ్చారు క్రిప్స్ రాయబారం విఫలమయ్యాక గాంధీ "క్విట్ ఇండియా "ఉద్యమం మొదలు పెట్టాడు. 1942 ఆగస్ట్ 7 న బొంబాయి కాంగ్రెస్ మహా సభలలో అంతిమ స్వాతంత్య్ర సమరం చేయాలని నిర్ణయించారు.చివరి హెచ్చరిక ఇవ్వటానికి గాంధీకి సర్వాధికారాలు ఇస్తూ కాంగ్రెస్ తీర్మానించింది. ఆయన ఉద్రేకం తో ఊగిపోయి ప్రసంగించి "డు ఆర్ డై"నినాదం ఇచ్చాడు. తొమ్మిదో తారీకున జరిగే కాంగ్రెస్ కమిటీలో తీర్మానం ఆమోదించాలి. 8రాత్రికే తెల్లప్రభుత్వం భయపడి గాంధీని కార్యవర్గ సభ్యులను అరెస్ట్ చేసి కనిపించని చోటికితీసుకు వెళ్ళింది.

దిశా నిర్దేశం చేసే వారు లేక ప్రజలు పెతకసాగారు. విషవాయువు లాఠీచార్జి, కాల్పులతో ప్రభుత్వం భీభత్సం సృష్టించింది. గాంధీ ఆదేశాన్ని అనుసరించి ప్రభుత్వం తో పోరాటానికి ప్రజలు సిద్ధపడ్డారు. అరెస్ట్ కు ముందు గాంధీ దగ్గరకు బాలకృష్ణ శర్మ వెళ్ళి "మాకిచ్చిన కార్యక్రమం ఏమిటి ??"అని అడిగాడు. గాంధీ కోపం తో "నా ఉపన్యాసం అంతా కార్యక్రమమే. దాన్ని అర్ధం చేసుకోలేని వాళ్ళను నమ్మి యుద్ధం ఎలా చెయ్యను ?"అన్నాడు. దీనినే శిరోధార్యంగా భావించి ప్రజలు ఉద్యమించారు. దేశమంతా విప్లవజ్వాలలు ఎగసి పడ్డాయి. ఎక్కడ చూసినా స్వాతంత్య్ర వీరుల రక్త ప్రవాహాలే. బొంబాయిలో ఏడు రోజులు ప్రభుత్వమే లేదని పించారు. మధ్య రాష్ట్రాలలో ఆరుజిల్లాలు ఉత్తరాష్ట్రాలలో 13జిల్లాలు, ఆంధ్రా అస్సాం బెంగాల్ రాష్ట్రాల్లో కొన్ని జిల్లాలు బ్రిటిష్ ప్రభుత్వ అధికారానికి ప్రజలు తాత్కాలికంగా స్వస్తి చెప్పారు.

ఆగస్ట్ 9నుంచి 1942 డి సెంబర్ చివరి వరకు ప్రభుత్వ దౌర్జన్యకాండల ఫలితాలు సెంట్రల్ అసెంబ్లీలో హోం మెంబర్ వివరాలు ప్రకటించాడు. అరెస్ట్ అయినవారు -66,229,జిల్లాలో మగ్గుతున్నవారు -18,000 .మిలిటరీ పోలీస్ కాల్పుల్లో చనిపోయినవారు -940,తుపాకీ గాయాలైనవారు -1630.మిలిటరీ సాయంకోరిన చోట్లు -60,తుపాకీ కాల్చవచ్చిన సంఘటనలు -538,విమానాలద్వారా ప్రేల్చిన ప్రదేశాలు -5.

జయప్రకాశ నారాయణ, అచ్యుత పట్వర్ధన్, రామమనోహర్ లోహియా, అరుణా ఆసఫాలీ మొదలైన వారు రహస్య మార్గాలద్వారా విప్లవాన్ని సాగిస్తూ, ప్రజల ఉద్రేకాన్ని ఒక క్రమ పద్ధతిలో నడిపారు. ప్రభుత్వం కంటపడకుండా పట్వర్ధన్ నిర్వహించిన పాత్ర చిరస్మరణీయం. పట్వర్ధన్ నాయకత్వం లో మహారాష్ట్ర సతారా జిల్లాలో ప్రజలు బ్రిటిష్ ప్రభుత్వాన్ని తొలగించి ప్రజలే ప్రభుత్వాన్ని నడిపి చరిత్ర సృష్టించారు. రహస్యంగా అచ్యుత్ "క్విట్ ఇండియా "పత్రిక లను రాసిదేశామంతా వెదజల్లాడు. అచ్యుత్ లోహియా, ఉషా మెహతా రహస్య రేడియో ద్వారా దేశమంతా ప్రచారం చేశారు. చివరికి ప్రభుత్వం కనిపెట్టి పట్టేసింది. జయప్రకాష్ లోహియాలను అరెస్ట్ చేసింది. పట్వర్ధన్ ఉషాలిద్దరూ ప్రభుత్వం కన్ను గప్పుతూ, రహస్య కార్యకలాపాలు చేస్తూ ప్రజా మార్గదర్శకత్వం చేశారు. విసిగి వేసారిన ప్రభుత్వం వీరిపై ఉన్న అరెస్ట్ వారెంటు ఉపసంహరించుకొన్నది.

అజ్ఞాతవాసం లో పట్వర్ధన్ చేసిన మహాకార్యం సతారా జిల్లాలో బ్రిటిష్ ప్రభుత్వ కూకటి వ్రేళ్ళను పెకలించిపారేసి ప్రజాప్రభుత్వం అనే ప్రతి సర్కార్ లేక పారలల్ గవర్నమెంట్ నిర్మించి పాలించటమే. చత్రపతిశివాజీ స్ఫూర్తితో ఆయన అలా నిర్వహించాడు. రెండేళ్ళు అయ్యాక అకస్మాత్తుగా మిలిటరీ గుంపులు సతారా చేరి భీభత్సం సృష్టించి ప్రజలను భయభ్రాంతులను చేసి సతారా జిల్లా వశపరచుకొన్నారు. కామ్రేడ్ నోలీ బాట్లీ వాలా ఆజాద్ హింద్ ఫౌజు న్యాయ విచారణకు కావలసిన భోగట్టా సేకరించటానికి వచ్చి, అక్కడ బ్రిటిష్ ప్రభుత్వం పెట్టిన హింసా దౌర్జన్యాలు తెలుసుకొని పత్రికా ముఖంగా ప్రకటించాడు. ఇన్ని చేసినా ప్రజల స్వాతంత్య్ర కాంక్ష పెరిగిందేకాని తగ్గనే లేదు. గొప్ప సంచలనం ఆగస్ట్ ఉద్యమం కలిగించింది. దీన్ని కమ్యూనిస్ట్ పార్టీ తప్ప అన్ని పార్టీలు హర్షించాయి.

అచ్యుత్ అజ్ఞాతం లో ఉన్నప్పుడు ఒక వింత సంఘటన జరిగింది. ఆయన్ను పట్టిస్తే 5వేలరూపాయలు బహుమానంగా ఇస్తామని ప్రభుత్వం ప్రకటించింది. ఆబహుమతి పొందాలనే తహతహతో ఒక పోలీస్ ఆఫీసర్ పోలీసులతో సతారాజిల్లలో అనుమానమున్న గ్రామాలన్నీ వెతికి వెతికినిరాశ తో వెనక్కి వెళ్లిపోతుంటే,

అతడు ఎక్కిన రైలులోనే పట్వర్ధన్ ప్రయాణించాడు. ఆ రాత్రి ఆపోలీసాఫీసర్ పక్కనే కూర్చున్నాడుకూడా. కానీ గుర్తించలేక దిగులుమొహం తో పూనాలో దిగి వెళ్ళిపోయాడు. ఇలాంటి సంఘటనలు కథలుగాథలుగా ఆనాడు చాలా చెప్పుకొనేవారు.

వైస్రాయి వేవెల్ సిమ్లా సమావేశ సన్నాహం లో ఉంటే, పట్వర్ధన్ సతారలో ఒక బహిరంగ సభలో ఉపన్యాసం చేశాడు. అజ్ఞాతం లో ఉంటూ బొంబాయి కాంగ్రెస్ సమావేశానికి హాజరయ్యాడు. 1945 డిసెంబర్ 11న కాంగ్రెస్ కార్యవర్గం సమావేశమై ఆగస్ట్ ఉద్యమం ఆజాద్ హింద్ ఫౌజు యడల అవలంబించినా వైఖరి వలన వైఖరి కాంగ్రెస్ అహింసా సిద్ధాంతంపై అపోహలు కలిగాయని తెలుసుకొని నివారించేప్రయత్నం లో ఒక తీర్మానం చేసింది. సమావేశం లో పట్వర్ధన్ కాంగ్రెస్ పెద్దల వైఖరిని తీవ్రంగా విమర్శించి అచ్యుత్, అరుణా కలిసి కాంగ్రెస్ అధ్యక్షుడుమౌలానా ఆజాద్ కు ఒక పెద్ద లేఖ రాసి అంద జేశారు. దీనికి కాంగ్రెస్ చరిత్రలో గొప్ప ప్రాధాన్యత లభించింది. ఆ లేఖలోని ముఖ్య విషయాలు "కాంగ్రెస్ నాయకుల అరెస్ట్ తర్వాత ప్రజలకు నాయకత్వం లేక ఎవరికి తోచినట్లు వారు నడిచారు. మేము అజ్ఞాతంలో ఉంటూ సమాంతర ప్రభుత్వాలను ఏర్పాటు చేసి మూడేళ్ళుపాలించాం. ప్రజలు మాకు మద్దతునిచ్చారు. మాదీ అహింసా విధానమే. పోలీసులు యెంత దౌర్జన్యం చేసినా మేము పోరాడామేకాని లొంగి పోలేదు. ప్రజా సంఘటన శక్తి అపారం కాగా, మేము మోతాదు లను బుద్ధిపూర్వకంగా ప్రయోగించాం. లేకపోతే శిక్షణ లేని ఆగస్ట్ ఉద్యమ మహా సంరంభం కొన్ని వారాల్లోనే దిగజారి పోయేది. మా అమోఘ నిశ్చయానికి మా అంతరాత్మ సాక్షి. దూర ప్రాంతాలవారికీ వార్తలు అందించగలిగాం. కాంగ్రెస్ ఆమోదం లేకుండానే ఒక రాష్ట్రంలో సహాయనిరాకరణ ఉద్యమం జయప్రదంగా చేశాం. కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ అనే తోక కాంగ్రెస్ శరీరాన్ని ఆడిస్తోందని గ్రహించండి. కాంగ్రెస్ ప్రజా భిమానం ఉప్పెనలో ఉంది. దీనికి మీ దగ్గర నివారణ లేదు పరిపాలనా విధానం గురించి ప్రనణాళికలేదు మీకు. సత్యాగ్రహం విఫలమైనా ఎన్నికల విజయం పంచుకొన్నాం. శాసన సభలు రాజీమార్గానికి విఫలమైనప్పుడు, నిర్మాణకార్యక్రమం ఆదర్శంగా మిగిలిపోయినప్పుడు, ముఖ్య వ్యవస్థ నిరోధక శక్తి తగ్గుతున్నప్పుడు, జైలుకు పోవటం నామమాత్రం అయినప్పుడు, కాంగ్రెస్ విషమ పరిస్థితి ఎదుర్కోక తప్పదు.ఈ ప్రశ్నలన్నీ మమ్మల్ని బాధించాయి గాంధీ అభిప్రాయానికి భిన్నంగా కాంగ్రెస్ చాలా సార్లు అహింసా తీర్మానం చేసింది. 1940 జులై 7న కాంగ్రెస్ అధ్యక్షుడు "కాంగ్రెస్ ప్రపంచ శాంతి స్థాపించే సంస్థకాదు రాజకీయ సంస్థ. అహింస విషయంలో గాంధీతో నడవలేదు. అరాచకం, విదేశ దాడి పెరిగితే హింసా విధానం పూర్తిగా విడవగలమని మాలో చాలా మంది అనుకోము "అన్న విషయం గుర్తుందా ?గత సంఘర్షణల్లో పాల్గొన్న వారనేకులు ఇపుడు నోరు విప్పలేకపోతున్నారు. మేమేదో తప్పుచేశామనే తీర్మానం మాకు బాధ కలిగించింది. మేము దోషం చేశామని అనుకోవటం లేదు. మేముకోరేది ఆత్మగౌరవ సంర్ధనం కాదు. మా దృక్పధ గణ్యతను సమర్ధించమని కోరుతున్నాం. మాకోరికను మీరు హర్షించగలరని భావిస్తున్నాం."

నాలుగేళ్ళు అజ్ఞాత వాసం లో గడిపి ఆగస్ట్ ఉద్యమవీరుడు, కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీ నాయకుడు అచ్యుత్ పట్వర్ధన్ బొంబాయి రాగా అఖండ ప్రజావాహిని వీరోచిత స్వాగతం పలికింది. కాంగ్రెస్ నాయకులుమాత్రం రాలేదు మొహం చెల్లక. తర్వాత పూనాలో కూడా అఖండ స్వాగతమిచ్చారు ప్రజలు. అక్కడ ప్రసంగిస్తూ "అంతిమస్వాతంత్ర్యంకోసం పోరాడాలి. కాంగ్రెస్ విధానాల్లో పెద్ద మార్పురావాలి సంపూర్ణ స్వాతంత్ర్యమే మన ధ్యేయం. బ్రిటిష్ ప్రభుత్వాన్ని నామరూపాలు లేకుండా చేయాలి. ఆత్మ బలిదానానికి సంసిద్ధులై మనం పనిచేయాలి. పెద్ద విప్లవ సైన్యం నిర్మించాలి.కార్మిక సంఘాలలో కమ్యూనిస్ట్ ల ప్రాధాన్యత తొలగించటానికి కాంగ్రెస్ సోషలిస్ట్ లు నడుం కట్టాలి 'అని గర్జించాడు. వల్లభాయి, విఠలుభాయి సోదరుల్లా రావు భాయ్, అచ్యుత్ సోదరులు భారత స్వాతంత్రోద్యమం లో కలిసిపని చేశారు. పటేల్ బార్డోలీ వీరుడైతే, పట్వర్ధన్ సతారా వీరుడు.

పట్వర్ధన్ విజ్ఞాన సముద్రుడు. ఆయన ఇంటి లైబ్రరీలో దేశం లో ప్రచురితమైన ప్రతిరాజకీయ పుస్తకం దొరుకుతుంది. ఆయన చదవని రాజకీయ పుస్తకం లేదు. అన్ని విషయాలపై ఉత్తమ గ్రంధాలన్నీ ఆ ఇంట్లో ఉంటాయి. అజ్ఞాతవాసం లో ఉంటూ రైళ్ళరాకపోకల్ని తెలుసుకొంటూ వాటికి ఆటంకం కలిగించేవాడు. రైల్వే అధికారులకు సింహ స్వప్నంగా ఉండేవాడు. ఎంత విప్లవవాది అయినా గాంధీ పేరు చెబితే వినమ్రుడయ్యేవాడు. లోహియాలాగా" గాంధియన్ సోషలిస్ట్". తుది నిర్ణయం లో కాంగ్రెస్నే అనుసరిస్తారిద్దరూ. కాంగ్రెస్ ను విప్లవాత్మకం చేసే ప్రయత్నం చేశారు. పోరాటం పెరిగినకొద్దీ అతి వాదం పెరిగి దాన్నే అనుసరించాల్సి వచ్చింది. అతివాద చైతన్యం పెరిగింది. రాజకీయ చైతన్యానికి మహాత్ముడే కారణమని పట్వర్ధన్ ప్రగాఢ విశ్వాసం. అప్పటికి పాతికేళ్ళ క్రితం "స్వరాజ్యం నా జన్మ హక్కు "అన్నందుకు తిలక్ మహాశయుడిని తెల్లప్రభుత్వం ఆరేళ్ళు ఖైదులో ఉంచింది. గాంధీ వల్లనే వాక్ స్వాతంత్రం వచ్చి,"మా దేశం విడిచిపొండి"అని ఆజ్ఞాపించగలుగుతున్నాం. స్వతంత్ర వృక్షాన్ని పెంచి పెద్దదాన్ని చేసింది కాంగ్రెస్. కాంగ్రెసే మహాత్ముడు మహాత్ముడే కాంగ్రెస్. ఆయన సాధించేది సత్య సామ్రాజ్యం అని అభిప్రాయ పడ్డాడు పట్వర్ధన్. గాంధీని చూస్తే పూనకమే వస్తుంది ఆరాధనాభావం తో పులకించి పోయేవాడు. పెద్దల మితవాదం మాత్రం నచ్చలేదు కుండబద్దలుకొట్టినట్లుగా నిష్కర్షగా దాన్ని ఖండించాడు. స్వతంత్ర పోరాటం లో గాంధీ మితవాదం అతివాదులకు ఏమీ అడ్డు రాదు అని కాంగ్రెస్ సోషలిస్ట్ ల మనోభావం. అతివాద కార్యక్రమాలు చేబట్టినప్పుడే అతి వాదం వస్తుంది మాటలతో రాదు. దీనికి విరుద్ధంగా "ప్రజా విప్లవమే మార్కిస్ట్ ల పంథా "గా ఉండేది. స్వతంత్ర ఉద్యమలో ఎన్నో తప్పటడుగులు వేశారు కమ్మీలు. ఒక నిర్దుష్ట కార్యక్రమం ఇచ్చి నడపగలిగినవారిలో పట్వర్ధన్ ఒకడు.

1942 స్వతంత్ర భారత రేడియో కేంద్రం గురించి ఉషా మెహతా చెప్పిన విషయాలు –1942"ఆగస్ట్ ఉద్యమ కాంగ్రెస్ ఉద్దేశ్యాన్ని ప్రజలకు తెలియజేయాలని దీన్నినేనూ నా సహచరులు కలిసి ఏర్పాటు చేశాం ఆగస్ట్ 20న మొదటి ప్రసారం చేశాం. అప్పుడులోహియా బొంబేలో అజ్ఞాతంలో ఉన్నారు. డిసెంబర్ లో ప్రసారాలు నిలిపేశాం. ప్రచారప్రసారాలు లోహియా రాసేవారు. కొన్ని నేనూ పట్వర్ధన్ రాశాం. వేటిని రేడియోలో చదవటానికి మాజీ ప్రొఫెసర్ కుందస్తూర్ ఉన్నారుకాని ఆమె అరెస్ట్ కాలేదు. అందుకని గ్రామఫోన్ రికార్డులుగా ప్రసంగాలు తయారు చేసి వాటితో ప్రసారం చేసేవాళ్ళం. కాంగ్రెస్ కమిటీ చేసిన ఉపన్యాసాలు రికార్డ్ చేసి రేడియోలో ప్రసారం చేశాం. మొదట్లో రోజుకొక్కసారి తర్వాత రెండుసార్లు ప్రసారం చేశాం. రేడియో యంత్రాగం బొంబాయిలో ఒక ప్రసిద్ధ న్యాయవాది

అల్లుడి ఇంట్లో ఉండేది.పోలీసులు ఆచూకీ చేసి నన్ను అరెస్ట్ చేస్తారని తెలిసి, ఆరోజు నేనే రేడియో ప్రసారం చేసి చివర్లో వందేమాతరం రికార్డ్ వేస్తుంటే, పోలీసులువచ్చి నన్ను అరెస్ట్ చేశారు. వాళ్ళు నాలుగుగదులు దాటిరావాలి. తాళాలు పగలకొట్టి వచ్చి నన్ను అరెస్ట్ చేశారు. "అని వివరించారు.

ఉషా, ఆసఫాలీ, పట్వర్ధన్, ఆజాద్, జయప్రకాష్ వంటి నిస్వార్ధ త్యాగధనులు "స్వాతంత్ర్యం మా జన్మ హక్కు "అని చాటి చెప్పటానికి ఎన్నో కష్టనష్టాలు అనుభవించారు. 1946 జూన్ 8న కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీ నాయకులు పట్వర్ధన్ లోహియా జయప్రకాష్ అరుణా ఆసఫాలీ లు ఒక ప్రకటన చేస్తూ "భారత్ లో బ్రిటిష్ పెట్టుబడిదార్లు దొడ్డిదారిన ప్రవేశించారు. వారినుండి మనదేశాన్ని మనం కాపాడుకోవాలి. ఇదే సోషలిస్ట్ పార్టీ ఆదర్శం ".అని చెప్పారు.

కాంగ్రెస్ లో ఉంటూ సోషలిజాన్ని సాధించలేమని గ్రహించి ఈ సోషలిస్ట్ లు 1947లో పట్వర్ధన్ నాయకత్వం లో "సోషలిస్ట్ పార్టీ ఆఫ్ ఇండియా "స్థాపించారు. 1950 లో అచ్యుత పట్వర్ధన్ రాజకీయాలనుంచి విరమించాడు. మళ్ళీ సెంట్రల్ హిందూకాలేజిలో ప్రొఫెసర్ గా పనిచేసి 1966 లో రిటైరయ్యాడు. తర్వాత పూనా లో ఎవరికీ అందుబాటులో ఉండకుండా, ఉత్తర ప్రత్యుత్తరాలుకూడా జరపకుండా ఒంటరిజీవితం గడిపాడు పట్వర్ధన్ రెండు గ్రంధాలు రాశాడు -1. *Ideologies and the perspective of social change in India* 2- *The communal triangle in India*.

ఆగస్ట్ ఉద్యమమమహానాయకుడు సోషలిస్ట్ పార్టీ స్థాపకుడు అచ్యుత్ పట్వర్ధన్ 1992 ఆగస్ట్ 5న 87వ ఏట వారణాసి లో మరణించాడు. త్యాగమూర్తి అచ్యుత్ పట్వర్ధన్.

# దివి సీమ గాంధి శ్రీ మండలి రాజా గోపాల రావు





మహాత్మా గాంధి కృష్ణా జిల్లా దివి తాలుకా 1930 ప్రాంతం లో పర్యటించినపుడు అక్కడి ప్రజలు బ్రహ్మ రధం పట్టి అరవై ఎడ్ల బండీలతో వూరేగించారుం. ఆ దృశ్యాన్ని తన తొమ్మిది ఏళ్ళ వయసు లో చూచే మహద్భాగ్యం తనకు కలిగింది అని ఉప్పొంగి పోయారు ఈ రోజు అంటే ఆగస్ట్ ముప్ఫై వ తేదీన 91 వ సంవత్సరం లోకి ప్రవేశించిన శ్రీ మండలి రాజా గోపాల రావు గారు. వారితో నాకు పదేళ్ళ క్రితం పరిచయం అయింది. ఆ కాలమ్ లో శ్రీ సింహాద్రి వెంకటేశ్వర రావు గారు "దివి సాహితీ మిత్రులు " అనే సాహితీ సంస్థను స్థాపించి ప్రతినెల ఒక సాహితీ సభ ను అవనిగడ్డ లో నిర్వహిస్తుండే వారు. ఒకసారి ఏదో సభలో నా ప్రసంగం విని వారు నన్ను వారి సభలో ప్రసంగించమని కోరారు. ఆ సభలో మొదటి సారి శ్రోత గా విచ్చేశారు. రాజా గోపాల రావు గారు. ఆ సభలో నేను శతావధాని వేలూరి శివరామ శాస్త్రి గారి కధలను గురించి మాట్లాడిన గుర్తు. వారు చాలా ఆనంద పడ్డారు. నన్ను అభినందించారు. ఆ తర్వాత నేను ఇంకో ఆరు సభల్లో అవనిగడ్డ లో మాట్లాడాను. వారు దాదాపు అన్నిటికి వచ్చినన్ను అభినందిస్తూ ఒక మాట అన్నారు "మాస్టారు. మీరు మాట్లాడితేనే ఇక్కడి సభలకు వస్తున్నాను. మిగిలిన వాటికి నాకెందుకో వెళ్లాలని పించదు" అని నన్ను ఆప్యాయం గా, ఆత్మీయునిగా భావించి చెప్పారు. అప్పుడే వారి గురించి పూర్తిగా తెలుసుకొన్నాను. వారు రాసిన పుస్తకం ఒకటి నాకు ఇచ్చారు. అది చదివి నా భావం వారికి లేఖ లో రాశాను. దానికి వారు సహృదయతతో తరచూ ఫోన్ లో సంభాషించే వారు.. ఈ మధ్య ఆరేడు సంవత్సారాలుగా మా ఇద్దరి మధ్య ఎలాంటి పలకరింపులు లేవు. ఈ మధ్య నేను బెంగుళూర్ లో వున్నపుడు వారు ఇంటికి మా అబ్బాయి రమణ కు ఫోన్ చేసి నన్ను గురించి వివరాలు తెలుసుకోన్నారట. నేను ఉయ్యూరు వచ్చిన తర్వాత రెండు మూడు సార్లు ఫోన్ చేసి ఎంతో ఆప్యాయంగా మాట్లాడారు. తనకు తొంభై వెళ్లి ఈ నెల ముప్ఫై వ తేదీకి తొంభై ఒకటి వస్తుందని నన్ను చూడాలని తనకు వుందని, కాని వయోభారం వల్ల రాలేక పోతున్నానని కాని ఎప్పుడో ఒకప్పుడు తప్పక వచ్చినన్ను చూసి వెళ్తానని మొన్న అన్నారు. అప్పుడు నేను వారితో నేనే వారింటికి పులిగడ్డకు వారి జన్మ దినోత్సావం నాడు వచ్చి హాప్పీ బర్త్ డే చెప్పి వారి ఆశీస్సులు తీసుకొని వారి తో ముఖాముఖి మాట్లాడుతానని చెప్పాను. అన్న మాట ప్రకారం ఇవాళ ఉదయం పులిగడ్డ వెళ్లి వారి ఇంటిలో వారిని దర్శించాను. పదేళ్ళ క్రితం ఎలా వున్నారో ఇప్పుడు అలాగే అదే ఆరోగ్యం తో వున్నట్లు కనిపించారు. దంపతులిద్దరూ ఎంతో ఆత్మీయం గా ఆదరించి, స్వీటు హాట్, పళ్ళు టీ ఇచ్చి తమ అతిధి మర్యాదను చూపించారు.

తన జీవితం గురించి చెప్పమని నేను అడిగాను. తాను పులిగడ్డ లోనే జన్మించానని, తాము కాపు కులస్తులమని తమ కుటుంబానికి తాతల తరం లో మూడు వేల ఎకరాల సుక్షేత్రమైన పొలం ఉండేదని, అయితే దివి సీమలో కాలువలు సాగు కోసం త్రవ్వినపుడు దాదాపు పొలాలన్నీ దానిలో పోయాయని ముంపుకు గురి అయి కొంత నష్టం జరిగిందని, తండ్రుల కాలమ్ లో దాదాపు ఏమీ మిగల లేదని. తమ తరం లో అనుభవించటానికి అసలు సెంటు భూమి కూడా లేదని శిస్తు కట్టే పరిస్థితి లేదని నవ్వుతు చెప్పారు. పిత్రార్జితం అయిన స్థలం లో ఒక రేకుల షెడ్డు వేసుకొని వారు వుంటున్నారు. యెనభైఒక యేళ్ళున్న

భార్య గారితో. ఆనాడు బస్తా వడ్లు రెండు రూపాయలేనని కాని శిస్తు మాత్రం ఎనిమిది నుంచి పది రూపాయలు పడేదని శిస్తు కట్టటానికి మూడు లేక నాలుగు బస్తాలు అమ్మితే కాని కట్టలేక పోయేవారమని, కట్టక పోతే బ్రిటిష్ ప్రభుత్వం జప్తులు చేసేదని దాంతో కూడా పొలాలు అన్నీ హారతి కర్పూరం అయాయని ఆవేదన తో చెప్పారు.. తన తొమ్మిదవ ఏట గాంధీజీ ని చూసే భాగ్యం కలిగిందని, ఆ ప్రభావం తన మీద బాగా వుందని అప్పటినుంచి ఖద్దరు కడుతూనే వున్నానని చెప్పారు. గ్లోసి పోసి ఖద్దరు పంచ,ఖద్దరు లాల్చి, పైన అంచు ఖద్దరు ఖండువా ఇదీ వారి వస్త్ర ధారణ. అంతా తెల్లని తెలుపే. మీసం. జుట్టు తెలుపు. వారి మాట స్వచ్చమైనది, మనసు స్వచ్చం, వేషం స్వచ్చం, హృదయం స్వచ్చం. నుదుట యెర్రని కుంకుమ బొట్టు. వారిని చూడగానే రెండు చేతులు ఎత్తి నమస్కరించ బుద్ధి కలుగుతుంది. ఆ కళ్ళల్లో కాంతి, వెలుగు, చిరునవ్వు మనకు వారిపై గౌరవభావం ఏర్పడుతుంది. శాకాహారం తన ఆరోగ్య రహస్యం అన్నారు. గాంధీజీ చెప్పినట్లు తనకు "సత్యమేవ జయతే" అనేదే మంత్రమని, తన బలం సత్యమేనని, సత్యానికి మించింది లేదని, తాను ఎప్పుడు అసత్యం చెప్పలేదని, లేని దానికోసం ఆరాటం లేదని, ఉన్నదానితో సంతృప్తి పొందటమే తన జీవితం అని చెప్పారు.

మెట్రిక్ మాత్రమే పాస్ అయిన గోపాలరావు గారు ఆంగ్లం లో మంచి ప్రవేశం పొందారు. చక్కని ఇంగ్లీష్ మాట్లాడుతారు, రాస్తారు. ట్యూషన్ చెప్పి జీవితం కొంత కాలమ్ గడిపారు. తరువాత రెవిన్యూ లో ఉద్యోగం పొందారు. అందులో రెండు ప్రమోషన్స్ పొంది అవనిగడ్డ లో నలభైఏళ్ళ క్రితం రిటైర్ అయారు. క్విట్ ఇండియా ఉద్యమం లో తాను పాల్గోన్నా ని తన అనుభవాన్ని తెలిపారు. అవనిగడ్డ లో రెవిన్యూ కార్యాలయం ముందు ఆ నాటి ఇంగ్లీష్ రెవిన్యూ ఆఫీసర్ ఎదుట త్రివర్ణ పతాకం చేతబట్టి "If you do not quit India, I will crush you" అని బిగ్గరగా అరిచానని, అందరు తన్ను ఆశ్చర్యం తో చూశారని, తనను అరెస్ట్ చేయిస్తానని దొర ఆదేశం జారీ చేస్తుంటే, తనవాళ్ళు తన్ను బలవంతం గా ఇంటికి తీసుకొని వెళ్లారట. అయితే ఏ క్షణంలో నైనా అరెస్ట్ వారంట్ జారీ చేసే అవకాశం వుందని తన తండ్రి, కుటుంబం చెప్పగా తాను అజ్ఞాతం లో కి వెళ్లానని, అలా ఒక సంవత్సరం under ground లో ఉన్నాననీ చెప్పారు. అయితే వూరు వదిలి వెళ్లలేదని పొలాల్లో వున్న ఇళ్ళలో వుంటూ స్థానాలు మారుస్తూ ఎవ్వరికీ కనపడకుండా గడిపానని. పాలేళ్ళు తాను ఎక్కడ వున్నానో తెలుసుకొని భోజనాన్ని రహస్యం గా తెచ్చే వారని అన్నారు.



స్వాతంత్ర్యం పొందిన తర్వాత తనకు రాష్ట్ర ప్రభుత్వం స్వాతంత్ర సమర యోధులకు ఇచ్చే పెన్షన్ మంజూరు చేశారని, అదే తనకు ఆధారం అనీ అన్నారు. రెవిన్యూ లో పనిచేస్తూ ఆస్తి కూడ పెట్టుకోని ఆదర్శ ఉద్యోగి గోపాలరావు గారు. ధర్మమే మార్గంగా, అహింస పరమావధిగా జీవితాన్ని పండించు కొంటున్నారు.

ఎక్కడ కాంగ్రెస్ సభలు జరిగినా తాను వెళ్లెవాడినని, దాదాపు ఎక్కువ భాగం నడిచే వెళ్లెవాడినని, సామాన్య జీవితమే తనకు ఇష్టమని చెప్పారు. అవనిగడ్డలో చిరువోలు రాదా కృష్ణ మూర్తి గారు అనే బ్రాహ్మణుడు ఖద్దరు దుకాణం నడుపుతూండే వారనీ, వారే తనకు ఆదర్శమని, ఆయన గురువు అనీ, ఆయన దుకాణం లో అందరు కలిసి దేశ విషయాలు చర్చిన్చుకోనే వారమని సభలకు ఏర్పాట్లు తామేచేసే వారమని అన్నారు. ప్రకాశం, పట్టాభి, కాకాని, బ్రహ్మయ్యలతో చాలా గొప్ప పరిచయాలుండే వని, తాను ఎప్పుడు కార్యకర్తగానే వున్నానని చెప్పారు. చంద్ర రాజేశ్వర రావు, సనకా బుచ్చి కోటయ్య, సుందరయ్య లతో పరిచయం వుందని ఇక్కడ అన్ని భావాలవారు వృద్ధి చెందారని తెలిపారు.



దేశం లో అవినీతి వ్యతిరేక ఉద్యమం జరుగు తోంది కదా మీ అభిప్రాయం ఏమిటి అని అడిగితె అవినీతి వెళ్ళు పాతుకొని పోయిందనీ, దాన్ని రూపు మాపటం ఎవరి వల్ల కాదని అంతగా దేశం భ్రష్టు పట్టి పోయిందని ఆవేదన చెందారు. యే ఆదర్శం తో స్వాతంత్ర్యాన్ని పొందామో దానికి వ్యతిరేకం గా జరుగుతూన్డటం బాధాకరమని బాధ పడ్డారు. ఆదర్శం అనేది లేక పోవటం జాతికి పట్టిన పట్టిన చీడ అన్నారు. దాన్ని పొందక పొతే జాతికి భవిష్యత్తు లేదు అని గట్టిగా చెప్పారు. యువకులకు ఇచ్చే సందేశం ఏదైనా ఉందా అని అడుగగా, యువశక్తిని తక్కువ అంచనా వెయరాదనీ, దాన్ని వ్యవస్తీకరిస్తే దేశానికి బలం జీవంకలుగు తాయి అన్నారు. అవినీతి లేని సమాజం ఏర్పడటానికి అందరు సహకరించాలన్నారు. ఆ రోజు కోసం తానూ ఎదురు చూస్తున్నాను అని చెప్పారు.

తన భార్య తనకు దూరపు బంధువు నని తనకు జీవిత భాగ స్వామి అవటం తాను చేసుకొన్న పుణ్యమేనని ఆనందం గా చెప్పారు. ఆమెను "ఏమండీ !గోపాల రావు గారు ఆదర్శం, ఆదర్శం అంటూ ఏమీ పెద్దగా సంపాదించలేదు, మంచి ఇల్లు కట్టలేదు, రేకుల షెడ్ లో కాపురం ఇంట్లో ఆదినికమైన వసతులు లేవు. మీకు బాధ గా లేదా ?" అని నేను అడిగితె ఆ దొడ్డ ఇల్లాలు" నాకు వారి మీద ఏమీ కోపం లేదు. వారు యెంత సంపాదిస్తే దానితోనే జీవితాన్ని గడపటం నేర్చుకొన్నాం. పిల్లలందరికీ మంచి చదువులే చెప్పించాము. అందరు చక్కగా అభివృద్ధి చెందారు. ఇదంతా మా వారి మంచితనం వల్లనే. మాకు అతిగా కోరికలు లేక పోవటమే మా ఆనందానికి కారణం" అని స్పష్టం గా చెప్పారు. "మీరు గోపాల రావు గారి భార్యగా గర్వ పడుతున్నారా, సంతృప్తి తో వున్నారా ?" అని అడిగితె తాను పూర్తి సంతృప్తి తో వున్నా నని, అది లేదు ఇది లేదు అనే ఆరాటం తమ కుటుంబం లో లేదని ఇప్పటికి గోపాలరావు గారి తమ్ముడి కుటుంబం, తమ పిల్లలు అందరు గోపాల రావు గారి కుటుంబం గానే ప్రవర్తిస్తున్నామని గోపాల రావు గారి మాటే అందరికి శిరో దార్యం గా భావించటం తమ పిల్లల గొప్పతనం అనీ అన్నారు. ఉమ్మడి కుటుంబ భావన తమ బలం అన్నారు.

ఆ ఆదర్శ దంపతులకు శుభాకాంక్షలు అందజేసి ముకుళిత హస్తాలతోనమస్సు లందించి, వారి వద్ద శెలవు తీసుకొని వారికి "మా అక్కయ్య -అనురాగ కవితా సంపుటిని " అందజేసి, ఇంటికి బయల్దేరాను. మా కుటుంబం కలకాలం సుఖసంతోషాలతో వర్ధిల్లాలని ఆ వృద్ధ దంపతులు నన్ను మనస్పూర్తిగా ఆశీర్వదించి నాకు వీడ్కోలు చెప్పారు. ఈ అనుభవం నాకు చిరస్మరణీయం గా వుంది.

కృష్ణా జిల్లా అవనిగడ్డ దగ్గర పులిగడ్డ గ్రామంలో శతాధిక వృద్ధులు, కాంగ్రెస్ నాయకులు స్వాతంత్ర్య సమరయోధులు, నిరాడంబర జీవి నాకు ఆత్మీయులు, గాంధీ మహాత్ముని అనుచరులు శ్రీ మండలి రాజగోపాలరావు గారిని వారింట్లో 2014 ఫిబ్రవరి లో సందర్శించనప్పుడు వారి దంపతుల ఫోటో, వారు 2001 లో నాకు ఆత్మీయంగా రాసిన ఉత్తరం



మళ్ళీ కొన్ని నెలల తర్వాత నేనూ మా శ్రీమతీ, మాపక్కింటి మామ్మ గారు మా దంపతుల వివాహ వార్షికోత్సవ సందర్భంగా కారులో ఉదయం బయల్దేరి, శ్రీరంగపురం శ్రీకాకుళం నడకుదురు దేవాలయాలు దర్శించి నడకుదురులోని అరుదైన పాటలీ వృక్షాలకు అబ్బురపడి మోపిదేవి వెళ్లి శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామిని. దర్శించి, పులిగడ్డ వెళ్లి శ్రీ మండలి రాజ గోపాలరావు దంపతుల ఇంటికి వెళ్లి దర్శించి వారి ఆతిథ్యం ఆశీస్సులు పొంది వారి పెరటిలో కాసిన అరుదైన రామాఫలాలు ఆప్యాయంగా ఇస్తే స్వీకరించి ,అవనిగడ్డ మీదుగా మండలి కృష్ణారావు గారి వారధి దాటి రేపల్లె దగ్గరున్న పేటేరు వెళ్లి నేత చీరలు కొని అక్కడి మగ్గాలను పరిశీలించి, రేపల్లెలో టిఫిన్ చేసి సాయంత్రానికి ఉయ్యూరు చేరా ము. మండలి వారి తో తీసుకొన్న ఫోటోలు వారికి పోస్ట్ లో పంపితే అందినట్లు ఫోన్ చేసి చెప్పారు .

2018 లో ఎందుకో మండలి వారు గుర్తుకు వచ్చి వారింటికి ఫోన్ చాలా సార్లు చేస్తే ఎవరూ ఎత్తలేదు. అనుమానం వచ్చి అవనిగడ్డలో ఉండే సరసభారతి అభిమాని అయిన ఒక ఫోటో స్టూడియో అధినేతకు ఫోన్ చేసి అడిగితే, రాజగోపాలరావు గారు మరణించి కొన్ని నెలలు అయిందనీ, వారి శ్రీమతిని కుమారులు తీసుకు వెళ్ళారని తెలియ జేశారు. అయ్యో అనుకొన్నాం.

ఇంతటి గొప్ప మహానుభావుడి గురించి ఆనాటి విద్యామంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు గారు, ఆయన కుమారుడు మాజీ మంత్రి శాసనమండలి ఉపాధ్యక్షుడు శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారు కానీ, ఎప్పుడూ అక్కడ జరిగిన సభలలో ప్రస్తావించిన దాఖలా నాకు కనిపించలేదు. వారికి వేదికపై సన్మానం చేసినట్లు పత్రికలలో వారి గురించి రాసినట్లు కూడా లేకపోవటం దురదృష్టం. ప్రచారం కోరని నిండైన మహామనీషి శ్రీ మండలి రాజ గోపాల రావు గారితో నాకు పరిచయం అవటం వారు నాకు ఫాన్ అవటం నాకు వారు ఆరాధ్యులవటం నా అదృష్టమే.

# భారత స్వాతంత్ర్యోద్యమంలో

## మనం మరచిన బీహార్ స్వాతంత్రోద్యమ నాయకులు

భారత స్వాతంత్ర్య సమరం కు ప్రత్యేక త ఉంది. డాక్టర్ రాజేంద్ర ప్రసాద్, జయప్రకాష్ నారాయణ వంటి ఎందరో త్యాగ మూర్తులు పుట్టిన గడ్డ అది. వీరితో బాటు సంతాలులు, ఆదివాసీలు తమ అస్తిత్వ, పోరాటం లో, క్రైస్తవ వ్యాప్తిని ఎదుర్కొనటం లో, స్వాతంత్ర్య సాధనలో కృషి చేసి ధన్యులయారు. వారి ని మనం మార్చే పోయాం. అలాంటి వారిని జ్ఞప్తికి తేవటానికి చేసిన ప్రయత్నమే ఇది.

### 1 సంతాల్ నాయకుడు – బాబా తిల్కా మంజి

బ్రిటిష్ వారిపై 1789 లో బ్రిటిష్ వారిపై మొట్టమొదటి సరిగా దాడి చేసిన స్వాతంత్ర్య సమార యోధుడు సంథాల్ కులానికి చెందిన బాబా తిల్కా మంజీ. మంగళ పాండే తిరుగు బాటు చేయటానికి వందేళ్ళ ముందే బాబా తిరుగు బాటు బావుటా ఎగరేశాడు. సంతాల్ తెగ వారినందరినీ ఐక్యపరచి "ముక్తి దళ్ "గా ఏర్పరచి బ్రిటిష్ వారు కొల్ల గోడుతున్న సంపదను వారి దౌర్జన్యాలను ఎదిరించాడు. 1784 మొదటి సారిగా" సంథాల్ హల్" అనే పేర ఈ తిరుగు బాటు ప్రారంభ మైనట్లు చరిత్ర చెబుతోంది. 1770లో ఆ ప్రాంతం లో పెద్ద కరువు వచ్చి వేలాది మంది ఆకలితో మరణించారు. చిన్న విలియం పిట్ ఆజ్ఞలపై కోర్ట్ ఆఫ్ డైరెక్టర్లు జమీందారుల తో సర్దు బాటుకు పదేళ్ళ గడువు ఇచ్చారు. 1880లో జమీన్దారికి సంథాల్ తెగకు మధ్య సంభాషణలు పెద్దగా జరగనే లేదు.



విసుగెత్తి పోయిన సంథాల్ గ్రామస్తులు బాబా తిల్కా మంజీ నాయకత్వం లో బ్రిటిష్ కమీషనర్ (లెఫ్టి నెంట్ )పై నా, రాజ మహల్ పైనా "గుయెల్"అనే ఒకే గుండు పేల్చగల తుపాకులతో(సింగిల్ షాట్ గన్ ) దాడి చేసి కాల్చి చంపేశారు. బ్రిటిష్ సైనికులు వీరున్న "తిలాపూర్ అరణ్యం "ను దిగ్బంధం చేశారు. అక్కడి నుండే చాలా వారాలు బ్రిటిష్ సైన్యం పై పోరాడాడు మంజీ. చివరికి బ్రిటిష్ సైన్యం 1784లో మంజీ ని పట్టుకొన్నది. అతన్ని గుర్రపు తోకకు కట్టి అక్కడి నుంచి కలెక్టర్ నివాసానికి భాగల్పూర్ దాకా ఈడ్చుకు వెళ్ళారు. అప్పటికి చితికి, రక్తం ఓడుతున్న అతని శిధిల శరీరాన్ని మర్రి చెట్టుకు వేలాడదీసి ఉరి తీశారు.

భారత దేశ స్వాతంత్ర్య సిద్ధి తర్వాతబాబా ను ఉరి తీసిన ప్రదేశం లో ఒక శిలా విగ్రహాన్ని నిర్మించి గౌరవించారు. భాగల్పూర్ ఎస్ పి నివాసానికి బాబా పేరుపెట్టారు.భాగల్పూర్ యూని వర్సిటి కి "బాబా తిల్కా మంజీ భాగల్ పూర్ యూని వర్సిటి "గా నామ కరణం చేశారు.

### 2 ఆది వాసీ దేవుడు బిశ్రా ముండా

1875-లో పుట్టి 1900 లో ఇరవై అయిదేళ్ళకే వీర మరణం పొందిన ఆదివాసీ నాయకుడు, స్వాతంత్ర్య సమర యోధుడు, హీరో – బిశ్రా ముండా.ఈ నాటి బీహార్ –జార్ఖండ్ ప్రాంతాలలో "మిలీనేరియన్ ఉద్యమం "సాగించిన వీరుడు. ఇదే తర్వాత గొప్ప స్వాతంత్ర్య సమరం గా రూపు దాల్చింది. భారత పార్ల మెంట్ సెంట్రల్ హాల్ లో అతని చిత్రపటాన్ని ఉంచి గౌరవిస్తున్నారు. ఆ యువ హీరో సాధించిన విజయాలు అద్భుతం గా ఉంటాయి.



15-11-1875 న బీహార్ లోని రాంచి జిల్లాలో బిశ్రా ముండా గురువారం నాడు జన్మించాడు. ముండాతెగ ఆచారం ప్రకారం గురువారం పుట్టిన వారు ఏంటో పేరు ప్రఖ్యాతులు సాధిస్తారు. తండ్రి సుగన ముండ. తలిదండ్రులు పిల్లల్ని తీసుకొని జీవిక కోసం బీర్బంకి దగ్గర కురుమ్దా చేరారు. ఇతని బాల్యం తలిదండ్రుల వద్దే "చల్కాద్ "లో గడిచింది. తోటిపిల్లలతోఇసుక లో, మట్టిలో ఆడి బాగా బల సంపన్నుడయ్యాడని జానపద గీతాలు తెలియ జేస్తున్నాయి. బోహండా అడవుల్లో గొర్రెలు మేపాడు. వయసు వచ్చాక ఫ్లూట్ వాయించటం బాగా వచ్చింది. గుమ్మడి కాయ బుర్రకు ఒక తీగె కట్టి(తుయిలా) అనే వాద్యం తయారు చేసి దానిపైనా బాగా వాయించేవాడు. అఖారా అనే నాట్యం చేసే ప్రదేశం లో హాయిగా గడిపే వాడు. అతనితో బాటున్న స్నేహితులు అతని నోటి నుండి విచిత్రమైన మాటలు వచ్చేవని చెప్పుకొనే వారు.

బీదతనం తో కుంగిపోతున్న తండ్రి బిశ్రా ను అయుబాటు లో ఉన్న మేన మామ ఇంటికి తీసికెళ్ళాడు. అన్న ముండా సాంప్రదాయం తో పెళ్లి చేసుకొని తండ్రిని చేరాడు. బిశ్రా మేనమామ ఇంట్లో రెండేళ్ళు న్నాడు. సలగా లో జైపాల్ నాగ పెట్టిన బడిలో చేరి చదివాడు. తల్లి చిన్న చెల్లెలు"జొని " తో చనువుగా తిరిగాడు.. ఆమెకు అతనంటే ఇష్టం. పెళ్లి అయి ఆమె అత్తారింటికి వెళ్ళిపోయింది. క్రిస్టియన్ మత ప్రచారకుడు వీరి గూడానికి వచ్చి ముండా సాంప్రదాయం వదిలి క్రైస్తవులుగా మారమని బోధిస్తుంటే బిశ్రా ఎదురు తిరిగాడు. చదువులో చురుకుగా ఉన్న బిశ్రాను గురువు జర్మన్ మిషన్ స్కూల్ లో చేరమన్నాడు. క్రిస్టియన్ అయితేనే అందులో ప్రవేశం ఉంటుంది. క్రిస్టియన్ గా మారి చేరి చదివాడు. కొద్దికాలం చదివి వదిలేసి వైష్ణవ భక్తుడు "ఆనంద్ పాండే "ను చేరి హిందూ ధర్మాన్ని బాగా అభ్యసించాడు. ఆయన ప్రేరణ తో రామాయణ, మహా భారతాది గ్రంధాలన్నీ చదివాడు.

చైబాసాలో 1886 నుండి నాలుగేళ్ళు ఉన్నాడు. క్రైస్తవ మత ప్రచారాలు అతన్ని జాగ్రుతుడ్ని చేశాయి తన మతమేదో విస్పష్టం గా అర్ధమైంది. భావాలు బలీయం అయి క్రైస్తవానికి, మిషనరీకి వ్యతిరేకం గా మారిపోయాడు. జర్మన్ మిషనరినుండి కుటుంబం వేరైపోయి సర్దార్ల తోకలిసి వ్యతిరేకం గా పని చేశాడు. బలపడుతున్న సర్దార్ ఉద్యమం లో చేరి ప్రభుత్వం పెడుతున్న ఆంక్షలను ఎదిరించాడు. రక్షిత అరణ్యాలలో ప్రభుత్వం కల్పించిన హక్కులను హరిస్తే వూరుకోసేది లేదని ముండా ఉద్యమం చేశాడు. సింగ్బం, పాలమౌ, మానభం అరణ్య ప్రాంతాలలో వారి హక్కులను తెల్పటానికి చర్యలు చేబట్టమని ప్రభుత్వం పై ఒత్తిడి తెచ్చాడు. ప్రభుత్వం అడవుల్ని బ్లాకులుగా విడగొట్టి సేద్యపు భూమి ని, పనికి రాని నేలను గుర్తించి సరిహద్దులు నిర్ణయించింది. యువ కిశోరం ముండా పాడు పడిన బావులను మరమ్మతు చేశాడు. గార్బెరాలో ఉన్న దొమ్బారి చెరువును బాగు చేశాడు.

దగ్గరే ఉన్న సింగభం లోని సంకర గ్రామంలో ఉన్న ఒకమ్మాయి తనకు ఇల్లాలుగా ఉండే అర్హతలున్నాయని గుర్తించి ఆమె తలిదండ్రులకు ధనం, వజ్రాలు ఇచ్చి ఒప్పించాడు. కాని అతను జైలు కెళ్ళి తిరిగి వచ్చేసరికి ఆమె కృతఘ్నురాలై ఉండటం గమనించి ఆమెను వదిలి పెట్టి వెళ్ళిపోయాడు. ఇద్దరు అమ్మాయిలూ పెళ్లి చేసుకోమని సిద్ధపడ్డారు. కొద్దికాలం తర్వాత బిర్సా కుఏక పత్నీవ్రతం గురించి ఆలోచన వచ్చింది. చుట్టుప్రక్కల జరుగుతున్న విషయాలన్నీ బాగా పరిశీలించేవాడు. రైతులకు అన్యాయం జరుగుతోందని, అడవిపుత్రులను తీవ్రం గా క్షోభ పెడుతున్నారని గ్రహించాడు. కొత్త మతాన్ని ఏర్పాటు చేయాలని ఆలోచించాడు. క్రిష్టియానిటి నుండి మారిన సర్దార్లు అందరూ అతని వైపే ఉన్నారు. చర్చి విధించే టాక్స్ అంటే కంపరం రేగిందిజనాలలో. ఒకే దేవుడు అనే భావన వ్యాప్తి చేశాడు వారిలో. అది వారికి బాగా నచ్చింది. బిర్సా ఒక దేవ దూత అయ్యాడు వారికి. అతని సిద్ధాంతం లో డబ్బు ఖర్చులేదు. ముండాలు, ఒరాన్లు, ఖరియన్లు బిర్సా అంటే దేవుడుగా భావించి అతన్ని చూడటానికి తండోప తండాలుగా వచ్చారు. తమపాపాలను పోగొట్టేవాడనే నమ్మకం కలిగింది. అందరూ బిస్రలైట్లు గా మారిపోయారు. "ధర్తి ఆబా" అనే పేరు అందరి పెదవుల మీదా పలుకుతోంది. హిందువులు ముస్లిం లు కూడా విపరీతం గా వచ్చి ఈ కొత్తమతం లో చేరిపోయారు. హిందూ విధానాలను వ్యాపింప జేస్తూ మతం మారి క్రైస్తవులైన వారిని మళ్ళీ పాత పద్ధతిలోకి రమ్మని ప్రచారం చేశాడు. మన్య వీరుడై దేవదూతగా భాసించి సాక్షాత్తు వారికి దేవుడే అయ్యాడు బిర్సా ముండా. గోపూజ చేయమని ఆవును చంప వద్దని కూడా ప్రచారం చేశాడు.

బ్రిటిష్ కాలనీ వ్యవస్థ రైతులకు మేలు చేయకుండా జమీందారీ వ్యవస్థకు కొమ్ము కాసింది. ఆది వాసీలు తమ వద్ద ఉన్న పాత పని ముట్ల తో వ్యవసాయం చేస్తూ, అధిక దిగుబడిని సాధించలేక పోయారు. అప్పుడు ప్రభుత్వం చోటా నాగ పూర్ లోని భూములను మన్య జనులకు కాక ఇతరులకిచ్చి వ్యవసాయం చేసుకోమన్నది. మన్య రైతుల్ని తరిమేసి భూములాక్రమించి వారందరూ దాష్టీకం చేశారు. దీనితో "తికాదార్స్ "అనే ఒక కొత్త వర్గం పుట్టింది. 1856లో ఆరు వందమ మంది జాగీర్దార్లు ఉండే వారు. వారికి ఒకటి నుంచి నూట యాభై గ్రామాలపై ఆధిపత్యం ఉండేది. దీనితో అప్పటిదాకా ముండా,ఒరాన్ నాయకుల అధికారం తగ్గిపోయింది. కొన్ని గ్రామాలలో ఈ ఆదివాసీలకు భూమిపై హక్కులు లేకుండా నిలువ నీడ కూడా లేని పరిస్తితి ఏర్పడి వ్యవసాయ కూలీలుగా ఉండాల్సిన దుస్తితి వచ్చింది.

ఈ దారుణ పరిస్తితులకు కలత చెందిన బిర్సా తదితర ముండా నాయకులు ఎదిరించి పోరాడారు. తమ అటవీ భూములపై తమకే హక్కు ఉండాలని పోరాటం సాగించారు. మధ్య వర్తులను బ్రిటిష్ వారిని తొలగించాలని డిమాండ్ చేసి ఉద్యమించారు. బ్రిటిష్ ప్రభుత్వం మాయోపాయాలు పన్ని బిర్సా ముండా ను 3-2-1900 న చక్రదార్ పూర్ లోని జామ్కోపాయ్ అడవిలో బ్రిటిష్ వారిపై పోరాటం చేస్తూ సహచర గెరిల్లా సైన్యం తో కలిసి పడుకొని ఉండగా పట్టుకొని జైల్లో పెట్టి హింసించింది. అతనితో బాటు 460 మంది గెరిల్లా సైనికులను అరెస్ట్ చేసింది. కొంతమందికి యావజ్జీవకారాగారం, ఇరవై ముగ్గురికి పద్నాలుగేళ్ళు జైలు విధించారు. బిర్సా యెడల పాశవికం గా ప్రవర్తించింది. బిర్సా 9-6-1900 న రాంచీ జైలు లో దారుణ మరణానికి గురైనాడు. కలరా సోకి చనిపోయాడని జైలు అధికారులు చెప్పారు. ఆ లక్షణాలేవీ లేవని తర్వాత తెలిసింది. పాతిక ఏళ్ళు మాత్రమె జీవించిన బిర్సా ముండా ఆదివాసీలకు ప్రత్యక్ష దైవం అయి బ్రిటిష్ పాలకుల గుండెల్లో సింహమై గడ గడ లాడించాడు. అతని మరణం తో ఉద్యమం నీరుకారిపోయింది. కాని రెండు విషయాలు స్పస్టమైనాయి. ఆదివాసీల భూములు ఇష్టం వచ్చినట్లు "దికూస్ "లు లాక్కొనే వీలు లేదని, బ్రిటిష్ కాలనీ వాసుల అన్యాయాన్ని దౌర్జన్యాన్ని ఆదివాసీలు చూస్తూ ఊరుకోరని తిరగబడి బుద్ధి చెబుతారని వారిలో పోరాట పటిమ ఉందని తెలిసింది. ముండాతన తోటి వారికి ఇచ్చిన పిలుపు "బ్రిటిష్ రాణి ప్రభుత్వం ఇక్కడ అంతమొందాలి. మన రాజ్యాన్ని మనం స్థాపించుకోవాలి "అనేది ఒక మంత్రమై పని చేసి బీహార్, మధ్య ప్రదేశ్, ఒరిస్సా, పశ్చిమ బెంగాల్ లలో ప్రతిధ్వనించి ఆదివాసీల ఐక్యతకు, హక్కుల పరిరక్షణకు దారి చూపింది.

బిర్సా జన్మించిన నవంబర్ పదిహేనును కర్నాటక లోని కొడగు, మైసూర్ జిల్లాలలో జయంతి వేడుకలను ఘనం గా నిర్వహిస్తున్నారు. జార్ఖండ్ రాజధాని రాంచిలో కోకార్ లో ఉన్న బిర్సా సమాధిని సందర్శించి నివాళులర్పిస్తారు. రాంచి లోని విమానాశ్రయానికి బిర్సా ముండా విమానాశ్రయం అని పేరుపెట్టి గౌరవించారు. సింద్రీలో బిర్సా ఇన్స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీని, కాన్పూర్ లో బిర్సా ముండావనవాసీ చాత్ర వాస్ ను, బిర్సా ముండా క్రీడా మైదానం, బిర్సా ముండా సెంట్రల్ జైలు, బిర్సా సేవా దళ్, పురూలియాలో బిర్సా ముండావ్యవసాయ విశ్వ విద్యాలయాన్ని ఏర్పరచారు. బిర్సా పై ఒక నవల రాసి దాన్ని సినిమాగా తీశారు. విప్లవం పేరుతొ అశోక్ శరణ్ 2004లో తీసిన హిందీ సినిమాలో అయిదు వందల మంది బిస్రలైట్లు నటించారు. రామన్ మాగ్ సేసే అవార్డ్ విన్నర్ మహా శ్వేతా దేవి బిర్సా జీవితం, ఆయన బ్రిటిష్ వారిపై చేసిన గెరిల్లా పోరాటాల నేపధ్యం గా "అరణ్యే అధికార "అనే బెంగాలీ నవల రాసి సాహిత్య అకాడెమీ బహుమతిని పొందింది. యువకులకోసం ఆ నవలను తర్వాత సంక్షిప్తం గా రాసి ప్రేరణ కలిగించింది.

ఈ విధం గా ఇద్దరు బీహారీ ఆదివాసీ స్వాతంత్ర్య సమార యోధులను గురించి తెలియ జేసే మహద్భాగ్యం నాకు కలిగిందని సంతోషిస్తున్నాను

## 3 అస్సాం స్వాతంత్ర్య సమార యోధురాలు –కనక లతా బారువా

అస్సాం మహిళా సింహం, అమర జీవి, ప్రముఖ స్వాతంత్ర్య సమార యోద్దురాలు జాతీయ జెండా ఆవిష్కరిస్తూ, బ్రిటిష్ వారి తుపాకి గుళ్ళకు అసువులుబాసి వీరమరణం చెందిన సాహసురాలు కనకలతా బారువా. ఈమె కూడా ప్రస్తుతం విస్మృత యోదురాలై పోయింది. ఆమె గురించి వివారాలు తెలుసు కొందాం.



అస్సాం లోని దరంగ్ జిల్లా బోరంగ బారిలో కనకలతా బారువా 22-12-1924 న జన్మించింది. తండ్రి కృష్ణ కాంత్. తల్లి కామేశ్వరి బారువా. తాతగారు ఘనా కాంత బారువా దరంగ్ జిల్లా లో గొప్ప వేటకాడు. ఆమె పూర్వీకులు డోలా కారి బారువా రాజ్యానికి చెందిన వారు. దోలకారి ఇంటిపేరును వదిలేసి బారువా పేరునే ఉంచుకున్నారు. అయిదేళ్ళకే తల్లిని, పదమూడేళ్ళ వయసులో తండ్రిని కోల్పోయినదురదృష్ట వంతురాలు కనక లత. మూడో క్లాస్ వరకు మాత్రమె చదివి, కుటుంబం లోని చిన్న పిల్లలను సంరక్షించే ఉద్దేశం తో చదువు మానేసింది.





క్విట్ ఇండియా ఉద్యమం లో అస్సాం లోని గోహ పూర్ సబ్ డివిజన్ లో యువత "మృత్యు వాహిని "'దళాన్ని ఏర్పాటు చేసి బ్రిటిష్ వారిని ఎదిరిస్తుంటే కనకలత కూడా అందులో చేరి పోరాడింది. 20-9—1942నా డు మృత్యు వాహిని దళం స్థానిక పోలీస్ స్టేషన్ పై జాతీయ పతాకను ఎగర వేయాలని నిశ్చయించింది. గ్రామస్తులందరూ నిరాయుధులుగా కనక లత నాయకత్వం లో ఊరేగింపుగా పోలీస్ స్టేషన్ కు చేరుకొన్నారు. అప్పుడు ఆ పోలీస్ స్టేషన్ ఇంచార్జి పోలీస్ ఆఫీసర్ రేవతి మోహన్ సోమ్. జనం ఉద్దేశ్యం గ్రహించి, ముందుకు అడుగు వేస్తె తీవ్ర పరిస్తితులను ఎదుర్కోవాల్సి వస్తుందని హెచ్చరించాడు. పోలీసుల హెచ్చరికలకు వీసమంతా కూడా భయపడకుండా జైజై లు కొడుతూ వాహిని దళం స్టేషన్ ను సమీపించింది. కనక లత చేతిలో జాతీయ పతాకం రెప రెప లాడుతోంది. దాన్ని పోలీస్ స్టేషన్ పై ఎగరేయాలనే ఉత్సాహం తో ఆమె ముందుకు నిర్భయం గా అడుగులు వేస్తూ దూసుకు పోతోంది. పోలీసులు ఆమె పై కాల్పులు జరిపారు. ఆమె చేతిలోని జెండాను ఆమె వెనకే ఉన్న ముకుంద కాకోటి తీసుకొని ముందుకు వెళ్ళగా పోలీసులు తుపాకీ గుళ్ళ వర్షం కురిపించారు. ఈవిదం గా పోలీస్ ఆక్షన్ లో కనకలతటా బారువా, ముకుంద కాకోటి ఇద్దరు ప్రాణాలు అర్పించి అమర జీవులైనారు. మాతృభూమి సంరక్షణ కోసం ధైర్యం గా జాతీయ జెండాను ఎగర వేసే ప్రయత్నం లో అమరజీవి అయిన కనకలత వయస్సు అప్పటికి పది హేడేళ్లు మాత్రమే నని తెలిస్తే ఆ యువతి సాహసానికి నివ్వెర పోతాం..

భారతీయ తీర రక్షణ ఫాస్ట్ పెట్రోల్ నౌకకు 1977 కనకలతా బారువాగా నామకరణం చేసి ప్రభుత్వం గౌరవించింది. 2011 లో గౌరీ పూర్ లో కనకలత నిలు వెత్తు విగ్రహాన్ని ఏర్పరచి ప్రభుత్వం నివాళు లర్పించింది.

## 4 అస్సాం లో క్విట్ ఇండియా ఉద్యమం లో ఉరితీయ బడ్డ – కుషాల్ కొన్వార్

అస్సాం లోనే మరో స్వాతంత్ర్య సమార యోధుడు క్విట్ ఇండియా ఉద్యమం లో అసువులు బాసి అమరుడైనాడు. ఆయనే కుశాల్ కొన్వార్. 21-3-1905 న అస్సాం లోని ఈ నాటి గోలా ఘాట్ జిల్లా సరూపతార్ దగ్గర బలిజాన్ లో కుశాల్ కొన్వార్ జన్మించాడు. బెజ్ బారువా స్కూల్ లో చదివాడు. గాంధీ గారి సహాయ నిరాకరణ పిలుపుకు ఉత్తేజితుడై ఇష్టం గా పాల్గొన్నాడు. మహాత్ముడి మంత్రం' సత్యం. అహింస స్వరాజ్యం "కొన్వార్ పై గొప్ప ప్రభావాన్ని కల్గించింది.



ఈ భావ వ్యాప్తికి ఒక ఎలిమెంటరి స్కూల్ పెట్టి అందులో గౌరవ ఉపాధ్యాయుడు గా పని చేసి విద్యార్ధులలో జాతీయ స్ఫూర్తి రగిలించాడు. తరువాత బలిజాన్ టీ ఎస్టేట్ లో గుమాస్తాగా,సూపర్వైజర్ గా చేరి పని చేశాడు. మనసంతా మహాత్ముని పిలుపే నిండిపోయి, పూర్తిగా స్వాతంత్ర్య సమరం లో అంకితభావం తో పని చేయాలనే నిర్ణయానికి వచ్చాడు. సరూపతార్ ప్రాంతం లో కాంగ్రెస్ పార్టీని స్థాపించి, బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకం గా సత్యాగ్రహం సహాయ నిరాకరణ ఉద్యమాలు నిర్వహించాడు. సరుపతార్ కాంగ్రెస్ ప్రెసిడెంట్ గా ఎన్నుకో బడ్డాడు.

1942 ఆగస్ట్ 8న బొంబాయి లో కాంగ్రెస్ సమావేశం లో మహాత్ముడు "క్విట్ ఇండియా "పిలుపు నిస్తూ తీర్మానాన్ని ఆమోదింప జేశాడు. భారత దేశం నుండి పూర్తిగా బ్రిటీష్ వాళ్ళు వెళ్లి పోవాల్సిందే అన్నది ఆ తీర్మాన సారాంశం. గాంధి అక్కడి నుంచే "విజయమో వీర స్వర్గమో "అనే పిలుపు నిచ్చాడు ఇది దేశ జనాలకు మంత్రమే అయింది.దీనికి బ్రిటిష్ ప్రభుత్వం ఆగ్రహం చెంది గాంధి తో సహాఅనేక మంది జాతీయనాయకులను అరెస్ట్ చేసి జల లో పెట్టించింది. కుల మతాలకు అతీతం గా ఆ సేతు హిమాచల పర్యంతం ప్రజలు వీధుల్లోకి వచ్చి బహిరంగం గా "క్విట్ ఇండియా "నినాదాలు చేస్తూ "వందే మాతరం "అంటూ నినదిస్తూ ఉద్యమం చేసి బ్రిటిష్ వారి గుండెల్లో నిద్ర పోయి కంటికి కునుకు లేకుండా చేశారు. గాంధి శాంతియుతం ఆ సత్యాగ్రహం చేయమని పదే పదే చెప్పినా కొన్ని చోట్ల హింసా దౌర్జన్యం చోటు చేసుకొని భీభత్సం సృష్టించింది. ప్రభుత్వ ఆఫీసులను రైలు, బస్సులను తగల బెట్టి కమ్యూని కేషన్ లను విధ్వంసం చేశారు ప్రజలు ప్రజల ఆగ్రహానికిది పరా కాష్ట గా నిలిచింది.

అస్సాం లో కూడా క్విట్ ఇండియా ఉద్యమం ఊపు అందుకొన్నది. అస్సాం ప్రదేశ్ కాంగ్రెస్ నాయకులు గోపీనాద్ బర్డోలోయ్, సిద్దినాద శర్మ లను బొంబాయి కాంగ్రెస్ సభల నుంచి తిరిగి వస్తుండగా బ్రిటిష్ ప్రభుత్వం అరెస్ట్ చేసింది. అస్సాం మిగతా ప్రాంతాల నాయకులైన బిష్ణురాం మేధి, బిమలా ప్రసాద్ చాలిహా మొదలైన వారినీ జైలు లో పెట్టింది. మిగిలిన దేశం తో పాటు అస్సాం కూడా హింసా ప్రజ్వలనం తో అట్టుడికి పోయింది. 10-10-1942 న మంచు దట్టం గా కమ్ముకున్న సమయం లో గోలా ఘాట్ జిల్లా లోని సారూ పాటర్ వద్ద రైల్వేలైన్ కున్న స్లీపర్లను కొందరు తొలగించారు. అదే దారిపై నడిచిన మిలిటరీ ట్రెయిన్ పట్టాలు తప్పటం వలన వందలాది బ్రిటిష్, అమెరికన్ సైనికులు ప్రాణాలు పోగొట్టుకొన్నారు. బ్రిటిష్ ప్రభుత్వం ఆ ప్రాంతం లో సైనికులను మొహరించి దోషులను పట్టుకొనే ప్రయత్నం తీవ్రం గా చేసింది. కని పించిన ప్రతివాడిని విపరీతం గా కొట్టి హింసించి అరెస్ట్ చేసి. టెర్రర్ సృష్టించింది ఆ ప్రాంతం లో.



ఈ రైలు కుట్రకు ముఖ్య పాత్రధారి కుశాల్ కొన్వార్ అని భావించి వెతికి పట్టుకొని అరెస్ట్ చేసింది. మహాత్ముని అడుగు జాడల్లో అహింస సత్య వ్రతం తో ఉద్యమాన్ని నడుపుతున్న కుశాల్ కు ఈ కుట్ర తో ఏమీ సంబంధం లేని అమాయకుడు. ఈ విషయాన్ని ప్రజలంతా ముక్త కంఠం తో మొత్తుకొన్నారు. కాని ప్రభుత్వానికి కళ్ళు చెవులు ఉండవనే సామెత రుజువు చేసింది బ్రిటిష్ ప్రభుత్వం. కుశాల్ మాత్రమె దీనికి ముఖ్య సూత్ర దారి అని నమ్మి, అతన్ని గోలాఘాట్ నుంచి తీసుకొని వచ్చి 5-9-1942న అరెస్ట్ చేసి జోర్హాట్ జైలు లో పెట్టింది. సి.ఏం హంఫ్రీ నాయకత్వం లోని కోర్టు ఏ రకమైన ఆధారాలు లేక పోయినా, చూప లేక పోయినా కుశాల్ దోషి అని నిర్ధారించింది,ఉరిశిక్ష వేసింది. కుశాల్ భార్య ప్రభావతి జోర్హాట్ జైలుకు వచ్చి నిర్దోషి, అమాయకుడు అయిన తన భర్తకు ను దోషి అని అని తేల్చటం భరించ లేక వల వలా ఏడ్చేసింది. ఆమెను ఓదారుస్తూ కుశాల్ "వేలాది మంది స్వాతన్నత్ర్య సమర సైనికులు ఉండగా నామాతృదేశం కోసం ప్రాణాలను అర్పించే అరుదైన గౌరవం నాకు భగవంతుడు కల్పించాడు ఇది నాకు అదృష్టం "అని ఆనందం గా సంతృప్తిగా చెప్పిన దేశ భక్తుడు కుశా ల్. ఉరి శిక్ష అమలు అయ్యేదాకా జైలు లో భగవద్ గీత చదువుకొంటూ, ప్రార్ధనలు చేసుకొంటూ కాలం గడిపిన స్తిత ప్రజ్ఞుడు కొన్వార్.

15-6-1943 తెల్ల వారుజామున 4-30 గం లకు కుశాల్ కొన్వార్ ను జోర్హాట్ జైలు లో ఉరితీశారు. ఉరికంబం ఎక్కి ధైర్యం గా "ఇంక్విలాబ్ జిందాబాద్ "అంటూ నినాదాలు చేసి, తనకిష్టమైన ప్రార్ధనగీతం "పార్ కోరా రఘునాధ –సంసార సాగర " పాడు కొంటు అసువులు బాసి అమరజీవి అయ్యాడు. 'మహాత్మా గాంధీ "జీవించటం మరణించటం అనే కళా మర్మం తెలిసిన వాడే అసలైన సత్యాగ్రహి. అలాంటి అరుదైన సత్యాగ్రహి షహీద్ కుశాల్ కొన్వార్ "అని ప్రశంసించాడు.

కుశాల్ కొన్వార్ నిర్భీతికి ఒక ఉదాహరణ –బలిజియన్ టీ ఎస్టేట్ లో సూపర్ వైజర్ గా కుశాల్ పని చేస్తున్నప్పుడు, పక్కనే ఉన్న ఇంగ్లీషు దొర విల్సన్ యజమానిదైన జముగురి టీ ఎస్టేట్ కి చెందిన అరవై డెబ్బై ఆవులు వీరి టీ తోటల్లోకి చొరబడి నాశనం చేస్తూంటే కుశాల్ వాటినన్నిటిని తాళ్ళతో బంధించాడు. ఆ ఆవుల్ని కాసేవాడు వచ్చి విడిచిపెట్టమని కోరితే, వాళ్ళ యజమానినే వచ్చి అడగమని చెప్పాడు. వాడువెళ్లి చెబితే దొర వచ్చాడు. ఇద్దరి మధ్యా మాటా మాటా పెరిగి దొర కర్రతో కొన్వార్ ను కొట్టబోతే కొన్వార్ వెంటనే చెప్పు తీసి పీత కొట్టుడు కొట్టేశాడు..కుశాల్ తీవ్రత ధైర్య సాహసాలకు భయపడి దొర పారిపోయాడు. ఈ సంఘటన తో అతని పేరు ఆ ప్రాంతమంతా మారు మోగి రైతు సంఘానికి నాయకుడిగా ఎన్నుకొన్నారు. కుశాల్ కొన్వార్ బలిదానం వృధా పోలేదు. భారత దేశం స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొన్నది.

ముస్లిం మహిళల పాత్ర

భారత స్వాతంత్ర్య పోరాటం లో ముస్లిం మహిళలు గణ నీయమైన పాత్రనే పోషించారు. పరదా వెనక దాగి కూర్చోలేదు. మగవారితో సమానం గా వీధుల్లోకి వచ్చి పోరాటం చేశారు. మొదటి సారిగా షా అబ్దుల్ అజీజ్ దేహివి బ్రిటిష్ పాలనకు వ్యతిరేకం గా "జీ హాద్"పిలుపు నివ్వగా, ఉలేమాలు మొదలైన వారంతా దేశ వ్యాప్తం గా బ్రిటిష్ వారి దాస్టీకానికి నిరసన తెలియ జేశారు. అప్పటిదాకా పరదాల చాటునే ఉంటున్న ముస్లిం మహిళలు బహిరంగం గా నినాదాలు చేసి తీవ్ర నిరసన తెలిపారు. ఈ జీహాద్ ఉద్యమం 1857లో బలపడి 1947 స్వాతంత్ర్య సాధన వరకు కోన సాగింది. ముస్లిం మహిళలు భర్తలు ఉద్యమం లో ఇంటికి దూరం గా ఉన్నప్పుడు కుటుంబ బాధ్యతలన్నిటినీ తామే స్వీకరించి తండ్రులకు కొడుకులకు బంధువులకు ప్రేరణ కల్గించి ముందుకు నడిపించారు. బాహాటం గా స్వాతంత్ర్య దీప్తిని రగిలించారు. అహింసా, హింసా విదానాలలోను భాగ స్వామినులయ్యారు. ఈ మహిళలు ఉన్నత కుటుంబాలకు ఉన్నత విద్య నేర్చిన కుటుంబాలకు చెందిన వారు మాత్రమే కాదు, సాధారణ కుటుంబాలకు గ్రామీణ ప్రాంతాలకు చెందిన విద్యా గంధం లేని ముస్లిం మహిళలు కూడా ఎందరో ఉన్నారని గ్రహించాలి. ఇప్పుడు కొందరు ముస్లిం మహిళా దేశ భక్తుల పోరాట పటిమల గురించి తెలుసు కొందాం.

## 5 బీగం హజ్రత్ మహల్



నవాబ్ వాజిద్ ఆలీ షా భార్య అయిన బీగం హజ్రత్ మహల్ తన భర్త కలకత్తాకు ప్రవాసానికి వెడితే బాధ్యతలను చే బట్టింది. భారత ప్రధమ స్వాతంత్ర్య సమరం లోని నాయకులతో కలిసి పని చేసింది. సర్ హెన్రి లారెన్స్ మొదలైన ఆఫీసర్లను వెల్ల గొట్టి లక్నో రెసిడెన్సి ని ముట్టడించి వశ పరచు కొన్నది. జెనరల్ హేవ్ లాక్ ఆఫీసర్లకు సైన్యానికి రక్షణ గా వచ్చినా విఫలమైనాడు. తర్వాత వచ్చిన కాంప్ బెల్ లక్నో ను తిరిగి స్వాధీనం చేసుకోవటం లో విజయం పొందాడు. బీగం ను బలవంతం గా వెనక్కి మరలేటట్లు చేయ గలిగాడు. బ్రిటిష్ వారి దయా దాక్షిణ్యాలు తనకక్కర లేదని క్షమా భిక్ష వేడనని ఖచ్చితం గా చెప్పింది. బ్రిటిష్ వారికి దొరక కుండా తప్పించుకుంటానని ధైర్యం గా ప్రకటించింది. తనకొడుకు యువరాజు బిర్జీస్ ఖాదిర్ ను అవద్ కు రాజును చేసింది. కొద్ది కాలమే అతను పరిపాలించాడు. బ్రిటిష్ ప్రభుత్వం అతన్ని పదవి నుండి తప్పించింది. తల్లి బీగం హజ్రత్ మహల్ నేపాల్ దేశానికి చేరి ప్రవాస జీవితం గడిపింది. 1820లో జన్మించిన బీగం నేపాల్ లోనే 7-4-1879లో యాభై తొమ్మిదో ఏట మరణించింది. ఆమె జీవిత విశేషాలు మరిన్ని తెలుసు కొందాం.



బీగం అసలు పేరు మొహమ్మది ఖానుం. అవద్ లోని ఫైజా బాద్ లో జన్మించింది. ఆమె రాజు గారి ఆస్థానం లో పని చేసింది. తలిదండ్రులు ఈమెను అమ్మేశారు. ఖవాసిన్ అయింది. తరువాత రాజ ప్రతినిధులకు అమ్ముడు పోయింది. అక్కడ "పారి "అయి అవద్ రాజు లలో చివరి వాడైన వజీర్ అలీ షాకు కు చిన్న భార్య అయి బీగం హజ్రత్ మహల్ పేరు తో స్థిర పడింది. బ్రిటిష్ ప్రభుత్వం అవ ధ్రాజ్యాన్ని లోబరచుకోవటం తో షా కలకత్తాకు పారిపోయి ప్రవాస జీవి అయ్యాడు. భర్త తో విడాకులు పొందినా రాజ్య వ్యవహారాలను బీగం చే బట్టింది. అవద్ –ఇప్పుడున్న ఉత్తర ప్రదేశ్ లో చాలా పెద్ద ప్రాంతం గా ఉండేది. రాజా జైలాల్ సింగ్ వంటి దేశ భక్తుల తో కలిసి బ్రిటిష్ వారిపై ప్రధమ స్వాతంత్ర్య సమరం చేసింది. నానా సాహెబ్ తో కూడా కలిసి బ్రిటిష్ సైన్యాన్ని ఎదిరించింది. శహజన్ పూర్ పై గైజాబాద్ మౌలవి తో తో కలిసి దాడి చేసింది.

ఈస్ట్ ఇండియా కంపెనీ దేశం లోని ప్రార్దనా మందిరాలను రోడ్ల నిర్మాణం పేరు తో కూల గొట్టి చర్చిలను నిర్మిస్తూ ఉంటె వ్యతిరేకించింది. దైవారాధనకు స్వేచ్ఛ ఉండాలి అని ఎదురు తిరిగింది. ఈ విషయం లో ఆమె "పందులను తింటూ మద్యం సేవిస్తూ, తుపాకీ కాట్రిడ్జ్ లకు పంది కొవ్వు కలిపినతీపి పదార్ధాలను పూసి, రోడ్ల విస్తరణ పేరు తో హిందూ ముస్లిం దేవాలయాలను కూల్చి వేస్తూ చర్చిలు నిర్మిస్తూ, మత ప్రచారకులను వీధుల్లో తిప్పి క్రిస్టియన్ మత ప్రచారం చేయిస్తూ,ఇంగ్లీష్ స్కూళ్ళు ఏర్పరచి, ఇంగ్లీషు, సైన్సు నేర్పటానికి స్టైఫెండ్ ఇస్తూ, ఇప్పటిదాకా హిందూ ముస్లిం ల దేవాలయాల విషయమే పట్టించు కోకుండా

అశ్రద్ధ చేసి,మీరు చేస్తున్న మీ నిర్వాకాన్ని చూస్తె మత విశ్వాసాలలో మీరు తలదూర్చరని నమ్మకం ఎక్కడ కనీ పిస్తోంది '?'అని సూటిగానిప్పులు కక్కుతూ ప్రశ్నించిన ధీర వనిత బీగం.

చివరికి నేపాల్ కు శరణార్ధిగా వెళ్ళాల్సి వచ్చింది. మొదట అక్కడి ప్రధాని జంగ్ బహదూర్ ఆమె ప్రవేశాన్ని అడ్డగించినా తర్వాత అంగీకరించి ఆశ్రయ మిచ్చాడు. ఆమె నేపాల్ లోనే చనిపోయింది. ఆమె దేహాన్ని ఖాట్మండు లోని జామా మసీద్ లో "ఒక అనాధ "గా ఖననం చేశారు. అంతటి మహారాణికి స్వాతంత్ర్య సమర మహిళకు ఎంతటి దుర్గతి?. బీగం 135 వ వర్ధంతి నాడు జామా మసీద్ లోని ఆమె సమాధిపై భారత, నేపాల్ రాయ బారులు పుష్ప గుచ్చాలు సమర్పించి నివాళు లర్పించారు. ఇండియాలో లక్నో లో పురాతన పార్కుకు 15-8-1962 స్వాతంత్ర్య దినోత్సవం నాడు ఆమె పేరు పెట్టి గౌరవించారు. ఒక పాల రాతి స్మృతి చిహ్నాన్ని అక్కడ నెల కోల్పారు. 1984 మే పది న భారత ప్రభుత్వం బీగం పేరిట 15,00,000లపోస్టల్ స్టాంప్ ల ను విడుదల చేసి ఆమె స్వాతంత్ర్య దీక్షను శ్లాఘించింది.

## 6 ఖిలాఫత్ ఉద్యమానికి ఊపిరులూదిన - బి అమ్మా అనే ఆబాది బేగం

'బి అమ్మా "అనే ఆబాది బేగం షౌకత్ ఆలి మొహమ్మదాలి సోదరుల తల్లి. అందరూ ఆప్యాయం గా బి అమ్మా(నాయనమ్మా) అని పిలిచేవారు. ఉత్తర ప్రదేశ్ లోని రాం పూర్ లో ఆబాది బానో బేగం 1852లో జన్మించింది. బ్రిటిష్ పాలనకు ముందు వెయ్యేళ్ళు మన దేశాన్ని పాలించిన ముస్లిం రాజ వంశీకురాలామే. 1857మొదటి స్వాతంత్ర్య సమర కాలానికి ఆమెకు అయిదేళ్ళు. అందువల్ల స్కూల్, కాలేజి లలో ఆమె చదవ లేక పోయింది. కాని ముస్లిం మత పద్ధతుల్లో, సంస్కారం లో ఆమె పెరిగి అలవర్చుకోన్నది. అల్లా అన్నా ఆయన అనుచరులన్న గొప్ప భక్తీ తో ఉండేది. ఇస్లాం కోసం సర్వం త్యాగం చేసే గుణం ఉన్నది. ఆమె క్రమ శిక్షణా జీవితాన్ని చూసి పెద్దలే ఆశ్చర్య పోయేవారు. చిన్న వారు ఆదర్శం గా గ్రహించేవారు. రాంపూర్ రాజ్యం లో ప్రముఖ అధికారి అబ్దుల్ ఆలీఖాన్ కిచ్చి ఆమె పెళ్లి చేశారు. వీరికి మౌలానా షౌకత్ ఆలీ, మహమ్మదాలీ, జుల్ ఫికర్ అలీ,నవాజిష్ ఆలి అనే నలుగురు కొడుకులతో బాటు ఒక అమ్మాయి పుట్టారు. నవాజిష్ ఆలి బాల్యం లోనే చనిపోయాడు. ముప్ఫై ఏళ్ళకే భర్త మరణించాడు. పిల్లల్ని పోషించి పెద్ద చేసే పెద్ద బాధ్యత ఆమె పై పడింది.



నవాజిష్ ఆలి చనిపోయినపుడు బంధువులు, ప్రజలు ఆమెను ఓదార్చటానికి వస్తే "భగవంతుడి దయ ఎలా ఉంటె అలా జరుగుతుంది. అయన ఏది ఇస్తే దాన్నే స్వీకరించాలి. మన కు ఆయనే దిక్కు "అని, వచ్చిన వారినే ఓదార్చింది. ఆమె హాజ్ యాత్రకు మక్కా వెళ్ళినప్పుడు అక్కడి పవిత్ర శిలను స్పృశించి తన పిల్లలు యదార్ధ ముస్లిం లుగా ఎదిగేట్లు ఆశీర్వ దించమని ప్రార్ధించింది. ఆమె చదువుకోక పోయినా ఇండియా పాకిస్తాన్ ప్రాంతం లో ఉన్న ముస్లిం లందరూ విద్యా వంతులు కావాలని కోరుకొనేది. తన కొడుకుల్ని బాగా చదివించింది. చివరికొడుకు మహమ్మద్ ఆలి బుద్ధిలో హృదయం లో ఎన్నదగిన వాడని పించుకొన్నాడు. అన్నిటా దూసుకు పోయే స్వభాం అతనిది. అతని ప్రతిభ దేశ విదేశాలలో మారు మోగింది. ఒక సారి ఎవరో తల్లి వద్ద ఈ కొడుకు గొప్ప తనాన్ని పొగుడుతుంటే కొడుకు ను తీర్చిన తల్లి అని ఆమెను కీర్తిస్తుంటే ఆమె "అల్లా ఎవరికి గౌరవం కల్పించాలో వారికి కల్పిస్తాడు అందులో నా ప్రమేయం లేదు. అంతా అల్లాదయ "అంది నిగర్వం గా.

బ్రిటిష్ పాలనలో కొందరు ముస్లిం లు పాశ్చాశ్చ సంస్కృతి పట్ల వ్యామోహం చూపించారు. వారిని "బిడ్డల్లారా ఆ వ్యామోహాన్ని వదలండి. మన పద్ధతిలో జీవించండి బ్రిటిష్ వారిచ్చే బిరుదులూ, పదవులు తీసుకో వద్దు" అని హితవు చెప్పిన దేశ భక్తురాలు. 1972 లో జరిగిన అఖిల భారత ముస్లిం సమ్మేళనం లో 62ఏళ్ళ ఈ నానమ్మ (బి అమ్మ)పాల్గొని చరిత్రాత్మకమైన ఉపన్యాసం చేసి అందరికి దేశ భక్తిని రంగ రించి పోసి చిరస్మరణీయం గా నిలిచింది. ఆమెకుమారులు షౌకత్ ఆలి మహమ్మదాలి లు బ్రిటిష్ వారి ఏ ప్రలోభానికి లొంగకుండా నిర్దుష్ట జీవన విధానాన్ని సాగించి ఆదర్శం గా నిలిచారు. అల్లా కు తప్ప దేనికీ భయపడని ధీరో దాత్తులయ్యారు. ఇదంతా బిఅమ్మ ప్రభావమే. ఖలీఫా ను విధ్వంసం చేసే బ్రిటిష్ వారిపై ఈ సోదరులు జీవితకాలమంతా పోరాటం చేస్తూనే ఉన్నారు. వారిద్దరిని ప్రభుత్వం అరెస్ట్ చేసి జైలు లో పెట్టినప్పుడు ఆమె ఆశ్చర్యానందాలకు అవధుల్లేవు. జైలుకు వెళ్లి వారిని పరా మర్శిస్తూ నమ్మిన సిద్ధాంతం కోసం కష్టాలకు ఓర్చుకొమ్మని ఒక వేళ అవసరమైతే జీవితాన్ని త్యాగం చేయటానికైనా సంసిద్ధులు గా ఉండమని బోధించిన మాతృ మూర్తి ఆమె.



కొడుకులు జైలు లో ఉన్నప్పుడు ఖిలాఫత్ ఉద్యమ పగ్గాలు చే బట్టి అందరికి ప్రేరణ కల్గించింది. పెద్ద పెద్ద బహిరంగ సభలు నిర్వహించి ఉపన్యాసాలు చేసి "ముస్లిం ఉమ్మా " సర్వాది కారాలను ఐక్యత తో కాపాడుకోమని ఉద్బోధించింది. ఆమె నినాదం "ఖిలాఫత్ కోసం మీ ప్రాణాలు త్యజించండి "అన్నది ఒక మంత్రమై వ్యాపించింది. ఈ మంత్రమే కులమత వర్గ రహితం గా దేశమంతా వ్యాపించింది. 1924 మార్చ్ లో ఖిలాఫత్ ను బ్రిటిష్ ప్రభుత్వం నిషేధించింది. ఆ నవంబర్ పదమూడున లోపే నానమ్మ మరణించింది. కాని ఆమె ఉద్యమ దీప్తి ముస్లిం మహిళల పై గొప్ప ప్రభావం చూపి తిరుగు లేని బలాన్ని ప్రదర్శింప జేసింది. ఇంతటి ప్రభావ శీలి బి అమ్మ. ఖిలాఫత్ ఉద్యమ ఫలితం గా ముస్లిం సమైక్యత ఏర్పడి పాకిస్తాన్ దేశం ఏర్పాటు కావటానికి మార్గం సుగమం అయింది. ఇది బి అమ్మ ఖిలాఫత్ ఉద్యమ దీక్షా ఫలితమే.

## 7 జుబైదా దావూది

మౌలానా షఫీ దావూది భార్య అయిన జుబైదా దావూది బ్రిటిష్ వారి తో పోరాడిన దీర వనిత. సహాయ నిరాకరణ ఉద్యమం లో ప్రముఖ పాత్ర వహించింది. భర్త, బంధువులకు చెందిన విదేశీ వస్త్రాలు సేకరించి బహిరంగం గా కాంగ్రెస్ ఆఫీస్ వద్ద తగల బెట్టింది. ఇంటింటికి తిరిగి విదేశీ వస్త్రా లను పోగు చేసి తగల బెట్టించేది.



బహిరంగ సభల్లో ధైర్యం గా పాల్గొని ఉత్సాహ పూర్వక ప్రసంగాలు చేసి మహిళలను స్వాతంత్ర్యోద్యమం లో భాగస్వాములను చేసింది. ఉద్యమం తారా స్థాయిలో ఉన్నప్పుడు విద్యార్థులు స్కూళ్ళు, కాలేజీలు మానేస్తే, వారికోసం ఆమె భర్త మౌలానా షఫీ ప్రత్యేకం గా ఒక స్కూల్ ను ఏర్పాటు చేసి చదువు నేర్పించాడు. జుబేదా వారికి భోజనం వసతి సౌకర్యాలు సమకూర్చేది.

## 8 అజిజాన్

1832లో లక్నో లో పుట్టిన అజిజాన్ ముస్లిం స్వాతంత్ర్య యోధురాలు. సారంగి మహల్ లో ఉమ్రావ్ జాన్ తో ఉండేది. 1857జూన్ నాలుగున హిందూ ముస్లిం లు ఏకమై ఐక్యం గా కలిసి తనతో పాటు బ్రిటిష్ వారిని ఎదిరించి పోరాడి స్వాతంత్ర్యాన్ని సాధించటానికి కలిసి రమ్మని నానా సాహెబ్ పిలుపు నిచ్చాడు. ఆ పిలుపుకు వెంటనే స్పందించిన అజిజాన్ నానాసాహెబ్ తో కలిసి తెల్ల వాళ్ళపై పోరాటం చేసింది. మహిళా సైన్యాన్ని ఏర్పరచి నాయకత్వం వహించింది. యుద్ధనైపుణ్యం బాగా తెలిసిన అజిజాన్ మిగిలిన మహిళలకు యుద్ధ సామగ్రిని ఎలా ఉపయోగించాలో శిక్షణ నిచ్చి నేర్పింది. బ్రిటిష్ సైన్యం పై ఒక కన్ను ఎప్పుడూ వేసి ఉంచి, వారి ఆను పానులను స్వాతంత్ర్య సమార యోధులకు ఎప్పటికప్పుడు తెలియ జేసేది. అయితే ఆమె ను వెంబడించిన బ్రిటిష్ వారు ఆమెను బంధించి జెనరల్ హావ్ లాక్ ముందు నిల బట్టారు. చేసిన తప్పులు ఒప్పుకొంటే క్షమిస్తానని హావ్ లాక్ అన్నాడు. ఆమె తిరస్కరించింది. వారి చేతుల్లో అజిజాన్ వీర మరణం పొందిన అసామాన్య పోరాట యోధురాలు.

## 9 అంజది బేగం

మౌలానా అహ్మద్ ఆలీ జోహార్ భార్య అంజది బేగం. రాంపూర్ లో ఉన్నత కుటుంబానికి చెందిన మహిళ.భర్త జోహార్ రాజకీయ తాత్విక ఆలోచనలను అనుసరించింది. భర్త తో బాటు అనేక సమావేశాలకు వెళ్ళేది. సత్యాగ్రహ ఉద్యమానికి, ఖిలాఫత్ ఉద్యమానికి ధన సేకరణ చేసి అందించేది. మహాత్మా గాంధి గారి ప్రయాణపు ఖర్చులన్నీ తానె స్వయం గా భరించి ఆయన సభలను ఏర్పాటు చేయించి ప్రజలలో జాతీయ ఉద్యమ స్ఫూర్తి కలిగించిన సేవా పరాయణురాలు అం జది బేగం.



## 10 సాదత్ బానో కిచ్లూ

సాదత్ బానో కిచ్లూ డాక్టర్ షఫియుద్దీన్ కిచ్లూ భార్య. ఉర్దూ, పర్షియన్ భాషల్లో గొప్ప పాండిత్యం ఉన్న మహిళ. అనేక కవితలు,రచనలు చేసి, ప్రచురించి ప్రజల్ని ప్రభావితం చేసింది. దీనికి ఏంతో ధైర్యం కావాలి. ఆ నాటి సంఘం పరిస్తితులలో ఒక ముస్లిం మహిళ ఇలా బహిరంగం గా కవిత్వం రచనలు చేసి తన మనో భావాలను బయట పెట్టటం నేరం అని మత పెద్దలు భావించే రోజులవి. 1920 లో భర్త కిచ్లూ అరెస్ట్ అయినప్పుడు ఆమె "దేశ సేవలో నా భర్త జైలుకు వెళ్ళటం నాకు గర్వం గా ఉంది "అని ప్రకటించిన ధీరో దాత్తురాలు సదాత్ బానో. "దేశం కోసం వ్యక్తీ చేసే త్యాగం వెయ్యి జన్మలెత్తిన భాగ్యం "అనేది. సహాయ నిరాకరణ ఉద్యమంలో చురుకుగా పాల్గొనేది. భర్త స్థాపించి,చైర్మన్ గా ఉన్న "స్వరాజ్ ఆశ్రమం "లో సేవలందించింది.

## 11 జులేఖా బేగం

మౌలానా అబుల్ కలాం ఆజాద్ గారి భార్య జులేఖా బేగం. చాలా ధైర్య సాహసాలున్న మహిళ. కలాం గారు గాంధి గారి నాయకత్వం లో స్వరాజ్య ఉద్యమం లో ముందుకు దూసుకు పోతున్నప్పుడు, ఇంటికి దూరమై జైలు పాలైనప్పుడు ఆమె ఎన్నో ఆర్ధిక ఇబ్బందుల్ని ఎదుర్కొన్నది కాని ఏనాడు భర్త మార్గానికి అడ్డుగా నిలబడ లేదు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో భర్తను ఏడాది పాటు ఖైదు చేసినప్పుడు గాంధీ గారికి 'నాభర్తకు ఏడాది జైలు శిక్ష వేశారు. అది ఆయన చేసిన పోరాటానికి చిన్న శిక్షే. ఇంత తక్కువ కాలం శిక్ష పడుతుందని మేము ఊహించ లేదు. ఈ విషయం లో ఆయన శక్తి సామర్ధ్యాలకు తగిన సరైన న్యాయమైన శిక్ష కాదు. ఈ రోజు నుండి నేను బెంగాల్ ఖిలాఫత్ కమిటీ కార్య భారాన్ని వహించి నా శక్తి సామర్ధ్యాల మేరకు పని చేస్తాను "అని రాసిన దేశ భక్తురాలు బేగం. ఇలా రాయటానికి ఎంత తెగువ సాహసం కావాలో అన్నీ ఆమెకున్నాయని రుజువు చేసింది. సహజం గా ఆమె అనారోగ్యమనిషి. అయినా ఆమె ధైర్యానికి ఆశ్చర్యం వేస్తుంది. భర్త అరెస్ట్ ను నిబ్బరం గా భరించి స్వాతంత్ర్య పోరాటం లో ముందుకు దూకిన జుఖా బేగం అందరికి ఆదర్శ ప్రాయం.

## 12 నిషాత్ ఉన్నీసా బేగం

భర్త మౌలానా హస్రత్ మోహాని 1916 ఏప్రిల్ పదమూడున రెండవ సారి అరెస్ట్ అయినప్పుడు స్వాతంత్రోద్యమం లో చురుగ్గా పాల్గొన్న మహిళ నిషాత్ ఉన్నీసా బేగం.బ్రిటిష్ కోర్టులలో ఆమె భర్తకు పబ్లిక్ రిలేషన్ ఆఫీసర్ గా పని చేసేది భర్తకు కేసుల్లో ఏంతో సాయం చేయటం తో బాటు, ఏంతో దేశభక్తినీ కలిగి ఉండేది. ఆర్ధికం గా వెసులు బాటు లేకపోయినా ఇతరులకు సాయం చేయటానికి ముందు ఉండేది. భర్త తో సభలూ సమావేశాలకు హాజరై రాజకీయాలను బాగా అర్ధం చేసుకొన్నది. భర్త రాసిన పుస్తకాలను మేగజైన్ లను అమ్మి తమ ప్రయాణపు ఖర్చులకు ఉపయోగించేది. 1921లో అబ్దుల్ హమీద్ ఖాజా భార్య బేగం ఖుర్షీద్ ఖాజా తో కలిసి కాంగ్రెస్ సబ్జెక్ట్ కమిటీకి నాయకత్వం వహించింది. స్వదేశీ ఉద్యమం లో చేరి ఆలీఘడ్ లో మౌలానా మోహాని ఏర్పాటు చేసిన ఖిలాఫత్ స్టోర్స్ కు సాయం చేసింది. క్వాజా అహ్మద్ జైలుకు వెళ్ళగానే భార్య కుర్షీద్ ఆయన నడుపుతున్న "హింద్ "పత్రిక బాధ్యతలు తీసుకొన్నది. జామి మిల ఇస్లామి బాధ్యతలను కూడా ఆయన లేనప్పుడు స్వీకరించి పని చేసింది. 1930 లో హమీదియా బాలికల సెకండరి స్కూల్ ను ఏర్పాటు చేసి విద్యా వ్యాప్తికి కృషి చేసి నిర్వహించింది. ఇది తరువాత డిగ్రీ కాలేజ్ అయింది.

## 13 రజియా ఖాటూన్

నజీరుద్దీన్ కుమార్తె అయిన రజియా ఖాటూన్ బ్రిటిష్ పాలనను ఎదిరించిన మొట్ట మొదటి బెంగాల్ ముస్లిం మహిళ.దీనికి కినిసిన బ్రిటిష్ ప్రభుత్వం ఆమెను అరెస్ట్ చేసి "కాలాపానీ "జైలు లో ఉంచారు. అక్కడే ఆమె ప్రాణాలు విడిచింది. బారిస్టర్ ఆసిఫ్ అలీ తల్లి అక్బరీ బేగం ఆ రోజుల్లో ముస్లిం మహిళలను ప్రేరణ కలిగించి స్వాతంత్ర్య ఉద్యమం లో పాల్గోనేట్లు చేసింది. సహాయ నిరాకరణ మొదలైన ఉద్యమాలను వెంట ఉండి నడిపించింది. 1920 మే లో ఆమె ఒక చారిత్రాత్మక ప్రసంగం చేసింది. అందులో ఆమె "మనం మన మతాన్ని పూర్తిగా విశ్వసించి, అనుసరించాలి దీనికి వ్యతిరేకులైన వారిని సాంఘికం గా బహిష్కరించాలి "అని పిలుపు నిచ్చిన ఉద్యమ కారిణి రజియా ఖాటూన్.

వీరు మాత్రమె కాదు ఇంకా ఎందరో ముస్లిం మహిళా మణులు స్వాతంత్ర్య ఉద్యమం లో మగవారికి దీటుగా నిలిచారు. ముజఫర్ నగర్ కు చెందిన అస్గారి బేగం బ్రిటిష్ సైన్యం తో ధైర్యం గా పోరాడి ఓడిపోతే బ్రిటిష్ కిరాతకులు ఆమెను నిలువునా కాల్చేశారు. ముజఫర్ నగర్ కే చెందినా హాబీబా, రహీమి ఇద్దరు బ్రిటిష్ సైన్యాన్ని ముందుకు రాకుండా అడ్డగించి, వారికి చిక్కి ఉరి తీయబడ్డ దేశ భక్తులు. జహీదా ఖాటూన్ షెర్వాని దేశ భక్తీ గీతాలు రాసి పాడి అందర్నీ ఉత్తేజితుల్ని చేసింది. ఖదీజా బేగం ఇంటింటికి తిరిగి స్వదేశీ వస్తువులనే వాడమని ఖాదీ దుస్తులే ధరించమని ప్రచారం చేసింది. మునీరాబెగం, అమీనా కురేషి, ఫాతిమా కురేషి అమీనా త్యాబ్జీ,హమీదా త్యాబ్జీ బేగం షకీలా లుక్మాని, ఫాతిమా టై దలీ, శాఫాట్ ఉన్నీసా, సఫియా సాద్, బేగం కుల్సూం శియాని, అస్మత్ ఆరా ఖాటూన్,

సుఫ్రా ఖాటూన్, బిబి అమాతుల్ ఇస్లాం, ఫాతిమా ఇస్మాయిల్, సుల్తానా హయత్ అన్సారి, హాజరా బేగం, జుహ్రా అన్సారి మొదలైన ఎందరో ముస్లిం మహిళల త్యాగాల వల్లనే మన స్వాతంత్ర్యం వచ్చిందని మనం మరువ రాదు. 225మంది ముస్లిం మహిళలు స్వాతంత్ర్య ఉద్యమం లో అసువులు బాసి అమరులైనారు.

ఈ నెలలో వచ్చే భారత స్వాతంత్ర్య దినోత్సవం సందర్భం గా ఈ ముస్లిం మహిళా త్యాగధనుల్ని ఒక సారి స్మరించటానికి నేను చేసిన ప్రయత్నమే ఇది. వీరి జీవితాలకు సంబంధించిన పూర్తీ వివరాలు రికార్డ్ కాలేక పోవటం విచారకరం. నాకు అందిన సమాచారాన్ని బట్టి మాత్రమె రాయగలిగానని మనవి చేస్తున్నాను.

## 14 ఒరిస్సా "చిన్నారి మదర్ తెరిస్సా ",స్వాతంత్ర్యోద్యమ నాయకురాలు –పార్వతి గిరి

పశ్చిమ ఒరిస్సా కు చిన్నారి మదర్ తెరిస్సా అని పించుకొన్న పార్వతి (పార్వతి)గిరి ప్రముఖ సాంఘిక సంస్కర్త, స్వాతంత్ర్య సమర యోధురాలు. ఒరిస్సా లోని సంబల్ పూర్ జిల్లా బీజాపూర్ దగ్గరున్న సమలైపాదర్ అనేగ్రామం లో 1926 లో జన్మించింది. ఈమె జననానికి ముందే స్వాతంత్ర్యోద్యమ విషయం ఒరిస్సా లోని అన్ని గ్రామాలకు పాకింది. పార్వతి జన్మించిన గ్రామం రాజకీయాలకు ముఖ్య కేంద్రం గా ఉండేది. లక్ష్మీనారాయణ మిశ్ర, దుర్గా ప్రసాద్ గురు మొదలైన ఉద్యమ నాయకులు అక్కడ నుంచే పని చేశారు. అక్కడే కాంగ్రెస్ సభల గురించి చర్చలు తీవ్రం గా జరిగేవి. స్కూల్ లో చదువుతున్నప్పుడే పార్వతికి రాజకీయాలపై ద్రుష్టిపడి, తానూ వారిలా ఉద్యమాలలో పాల్గోవాలనే కోరిక ఏర్పడింది. అక్కడ జరిగే కాంగ్రెస్ సభలకు హాజరౌతూ, ప్రేరణ పొందేది. మూడో క్లాస్ చదువుతున్న పార్వతి కాంగ్రెస్ సభ్యత్వం కోసం గ్రామాల వెంట తిరిగి చేర్పించేది.



1937 లో సంబల్ పూర్ లో కాంగ్రెస్ సభ జరిగింది. కాంగ్రెస్ నాయకులు ఆమె చురుకుదనాన్ని గుర్తించి తండ్రిని ఆమె సేవలు కాంగ్రెస్ సంస్థకు అవసరమని, తమకు ఆమె ను కార్య కర్తగా తీర్చి దిద్దే అవకాశం ఇవ్వమని అర్ధించారు. మరుసటి సంవత్సరం సంబల్ పూర్ లో పెద్ద కాంగ్రెస్ కార్య కర్తల సమావేశం జరిగింది. మాలతి చౌదరి, ప్రాణ కృష్ణచౌదరి వంటి ప్రముఖులు పాల్గొని ఉత్తేజకరమైన ప్రసంగాలు చేశారు. మళ్ళీ కాంగ్రెస్ నాయకులు పార్వతి తండ్రిని ఆమె సేవలు పార్టీకి అందించే సహాయం చేయమని విన్నవించారు. అనేక సార్లు ఆలోచించి తండ్రి ఒప్పుకొన్నాడు. రమాదేవి నడుపుతున్న బారి ఆశ్రమం లో పార్వతి చేరింది.

ఒక మైనర్ బాలిక ఇలా ఇల్లు వదిలి ఒక ఆశ్రమంలో చేరటం అ నాడు సంప్రదాయ ఉన్నత కుటుంబాలలో జరగని విషయం. ఆమెయే ఆద్యురాలై అందర్నీ ఆశ్చర్యం లో ముంచేసింది. కూతురుకున్న అకుంఠి దీక్ష, సేవాభావం, మాతృదేశ భక్తీ కి ముగ్ధుడైన తండ్రి ఆమె సేవలు దేశానికి అవసరమని అది తమ కుటుంబానికి వరమని భావించి సమ్మతించాడు. ఒక అజ్ఞాత కుగ్రామం లో పుట్టిన చిన్న పిల్ల ప్రముఖ పట్నం జైపూర్ లోని బారి ఆశ్రమానికి వెళ్ళటం, అక్కడ ఉండి పని చేయటం వింతగా అందరూ చెప్పుకొనే వారు. 14-1-1938 నఇల్లు వదిలి బారి ఆశ్రమం లో పార్వతి చేరింది. ప్రభావతి దేవి అనే బాల్య వితంతువు కూడా పార్వతి తో బాటే ఆశ్రమం లో చేరింది. పార్వతి కుటుంబం వారు ఎన్నో సార్లు ఆశ్రమం వదిలేసి ఇంటికి వచ్చేయమని ఇద్దరిపై ఒత్తిడి తెచ్చారు. కాని స్తిర చిత్తం తో అక్కడే ఉండిపోయారిద్దరూ. ఆశ్రమం లో రమాదేవి, గోప బంధు చౌదరి ఏంతో సంతోషించారు.

ఈ నాటి ఆశ్రమాలు గా కాకుండా ఆశ్రమాన్ని ఏంతో క్రమశిక్షంతో నైతిక విలువలతో రమాదేవి నడుపుతోంది. ఇలాంటి ఆశ్రమాలను "సంగ్రామి శిబిర", "అహింసా తీర్ధ "అనే వారు. గోప బంధు డిప్యూటీ కలెక్టర్ గా పని చేస్తూ గాంధీగారి పిలుపు విని స్వరాజ్య ఉద్యమం లో చేరి పని చేస్తున్నాడు. రామా దేవి, గోప బంధుల అమిత ప్రేమ ఆదరణలు, వారిద్దరూ గాంధీగారి ప్రభావానికి లోనవటం పార్వతి పై కూడా ప్రాభావం కలిగించి దేశ సేవలో ధన్యత చెందాలనే నిశ్చయానికి వచ్చింది. ఆశ్రమంలో ఉన్న వారందరినీ కంటికి రెప్పలాగా చూసుకొంటూ ప్రేమ దయా సాను భూతులను వారిపై వర్షించింది. 1940 లో సత్యాగ్రహం ఉద్యమం సూటిగా ప్రారంభ మైంది. అన్ని ఆశ్రమాలు సంగ్రామ శిబిరాలుగా మారిపోయాయి. స్వరాజ్య పోరాట యోధులతో నిండిపోయాయి.

పార్వతి గిరి స్వగ్రామం బారాగర్ కు తిరిగి వచ్చి,సంబల్ పూర్, పద్మాపూర్, పనిమార, ఘెంస్ మొదలైన చోట్లకు వెళ్లి ప్రజలను ఉత్తేజ పరచి మీటింగులు నిర్వహిస్తూ స్వరాజ్య కాంక్ష కలిగించి బ్రిటిష్ పరపాలనాను వ్యతిరేకించేలా సంసిద్ధులను చేసింది. గ్రామాల్లో, పట్టణాలలో నూలు వడకటం దారం తీయటం అందరికి నేర్పింది. సంబల్ పూర్ లో శ్రద్ధాకర్ సుపాకర్ అనే సమార యోధుడి తల్లి దగ్గర ఉండేది. గాంధీగారి "ఖాదీ ఆందోళనోద్యమం "లో చురుకు గా తానూ పాల్గొని అందరిని పాల్గోనేట్లు చేసింది. క్విట్ ఇండియా ఉద్యమం దేశమంతా వ్యాపించినట్లే ఒరిస్సాలోని గ్రామ గ్రామాన వెల్లి విరిసింది. సామలై పాదార్, పనిమార, ఘెంస్ వంటి ప్రముఖులు నాయకత్వం వహించగా, రామ చంద్ర గిరి ఉజ్జల్ గిరి, మంగళ గిరి, ద్వితీయ గిరి, కుబేర్ గిరి మంగళ గిరి, ద్వాదదేసి రానా మొదలైన అనుచరులు పాల్గొని అరెస్ట్ అయి జైలుకు వెళ్ళారు.

యువకులను ఒక దళం గా ఏర్పరచి నాయకత్వం వహించి పార్వతి గిరి బ్రిటిష్ వ్యతిరేక నినాదాలు చేస్తూ "క్విట్ ఇండియా "అని అరుస్తూ ప్రదర్శన నిర్వహించింది. ఆమె ఇంకా మైనర్ బాలికే. కనుక పోలీసులు ఆమెను అరెస్ట్ చేయటానికి జంకారు. మరుసటి రోజు ముగ్గురు పిల్లలతో కలిసి పార్వతి గిరి బార్గా లోని s.D.O.ఆఫీస్ కు వచ్చింది. అక్కడ కుర్చీలో కూర్చుని తానే జడ్జిగా నటించింది. ఒక కుర్రాడు లాయర్ గా మరొకడు బంట్రోతు గా సీన్ సృష్టించారు. ఎస్ డి వో. లోపలి ప్రవేశించగానే జడ్జి స్తానం లో ఉన్న పార్వతి ప్యూన్ గా నటిస్తున్న కుర్రాడిని అసలైన దోషిని బంధించి తాడుతో లాక్కుని తన దగ్గరకు తీసుకొని రమ్మని ఆర్డర్

జారీ చేసింది. ఇది చూస్తున్న పోలీసులు ఆమె చుట్టూ చేరి కుర్చీ లోంచి లాగి పారెయ్యటానికి ప్రాయత్నిదారు. ప్రభుత్వ వ్యతిరేక చర్యలు చేసినందున ఆమెను బంధించి రెండేళ్ళు జైలు శిక్ష విధించారు. ఇందులో పార్వతి గిరి భావం –బ్రిటిష్ వలస పాలన, వారి పెత్తనం భారత దేశం లో ఉండరాదనే.

బారాగర్ కోర్టులో మరొక ఉదంతం జరిగింది. బారాగర్ కోర్టు కు వెళ్లి బార్ లో లాయర్ కూర్చునే సీట్ లో కూర్చుంది. అభం శుభం తెలియని ఆ పిల్ల లాయర్లందరిని కోర్టు విడిచి బయటికి వెళ్ళిపొమ్మని ఆర్డర్ వేసింది. బ్రిటిష్ ఆఫీసర్లకు ఇండియా లాయర్లు సహక రించ కూడదనే ఆమె ఉద్దేశ్యం. ఆమె మాట విని కొందరు లాయర్లు బయటికి వెళ్ళిపోయారు. మిగిలి వెళ్ళని వారి చేతులకు గాజులు తొడిగింది ఈ చిన్నారి పిడుగు. ఆ వయసులో ఆమె చూపిన ధైర్య సాహసాలకు, చొరవకు దేశ ప్రజలంతా హర్షించి ఆశీర్వ దించారు. త్రికరణ శుద్ధిగా గాంధీజీ బోధించిన సూత్రాలనే నమ్మి పాటించింది పార్వతి గిరి.

అనాధలకు విధి వంచితలకు ఆమె ఎన్నో సేవా కార్య క్రమాలు నిర్వహించింది. ఆమె చిరస్మరణీయ వ్యక్తి మాత్రమె కాదు, ఒక సేవా సంస్థ సమగ్ర రూపమే పార్వతి.

## 15 ట్రావెన్ కూర్ ఝాన్సి రాణి –అక్కమ్మ చెరియన్

అక్కమ్మ చెరియన్ మంచి విద్యా వంతురాలు. మిడిల్ స్కూల్ టీచర్ గా పని చేసింది. ఆ కాలం లో "బుడత కీచులు "అనబడే పోర్చు గీసు వాళ్ళు, బ్రిటిష్ వాళ్ళ భారతీయుల యెడ చాలా క్రూరం గా ప్రవర్తించేవారు. సరిహద్దులు దాటి చొరబడి భీభత్సం సృష్టించేవారు. దయా దాక్షిణ్యాలు వాళ్ళ డిక్షనరీలో కనిపించేవికావు ఇళ్ళల్లో చొరబడి నిప్పు పెట్టె నీచులు. వీటన్నిటిని చూసి సహించలేక చెరియన్ ఉద్యోగానికి రాజీనామా చేసి స్వాతంత్ర్య యుద్ధం లో పాల్గొన్నది అన్ని అందోళనలలో చురుగ్గా పని చేసింది. 1938 లో కేరళలో కాంగ్రెస్ పార్టీని బ్రిటిష్ ప్రభుత్వం నిషేధించింది. దీనికి నిరసనగా అక్కమ్మ చెరియన్ అందరిని కలుపుకొని బ్రహ్మాండ మైన నిరసన ప్రదర్శనను తాంపనూర్ నుంచి కౌడియార్ పాలస్ వరకు నిర్వహించింది. దీనిపై స్పందించిన ప్రభుత్వం వారిపై కాల్పులు జరుప బోతున్నట్లు ప్రకటించింది. ముందుగా తనను కాల్చి తర్వాత తన అనుచరులను కాల్చమని చెరియన్ ముందుకొచ్చి ధైర్యం గా తుపాకులకు గుండెను ఎదురు పెట్టి నిలబడింది. కంగు తిన్న బ్రిటిష్ ప్రభుత్వం కాల్పుల ఆర్డర్ ను ఉపసంహరించుకోన్నది.



ఆమె సాహసానికి మహాత్మా గాంధి "ట్రావెంకూర్ ఝాన్సి రాణి "అని ఆమెను శ్లాఘించాడు. ఇది ఆమె జీవితం లో ఒక సాంపిల్ మాత్రమే. భారత ప్రజలకు వ్యతిరేకం గా బ్రిటిష్ ప్రభుత్వం చేబట్టిన అన్ని పనులను ఎదురొడ్డి నిల్చి నిరసన తెలుపుతూ, ఆందోళన చేస్తూ ఉద్యమాలు నిర్వహిస్తూ జీవిత మంతా గడిపిన శ్రేష్టవీర వనితఆమె

## 16 కుట్టిమాలు అమ్మ

ఈమె మరొక పోరాట యోధురాలు. బ్రిటిష్ వారిని ఎదిరించి నిలిచినా స్త్రీ మూర్తి. మహిళలను ఐక్యపరచి పోర్చుగీస్ వారికి వ్యతిరేకం గా ఉద్యమించింది. విదేశీ వస్త్రాలు ధరించవద్దని కేరళ ప్రజలను కోరింది.. **సహాయ నిరాకరణ, క్విట్ ఇండియా ఉద్యమాలు నిర్వహించి అరెస్ట్ అయి జైలుకు వెళ్ళింది.**



. సహాయ నిరాకరణ, క్విట్ ఇండియా ఉద్యమాలు నిర్వహించి అరెస్ట్ అయి జైలుకు వెళ్ళింది.

## 17 అమ్ము స్వామినాధన్

నేతాజీ సుభాస్ చంద్ర బోస్ కు అత్యంత విధేయుడు అమ్ము స్వామినాధన్ భర్త నాయర్. సుభాస్ బాబు లాగా ధైర్య వంతుడు అలానే ప్రవర్తించేవాడు. అన్ని ఉద్యమాలలో పాల్గొని అనేక మార్లు జైలు శిక్ష అనుభవించాడు. భర్త బోసు బాబు అడుగు జాడల్లో నడిస్తే భార్య అమ్ము స్వామినాధన్ గాంధీ మహాత్ముని అహింసా

సిద్ధాంతాన్ని నమ్మి, ఉద్యమాలు నిర్వహించింది. దీని వలన కేరళీయుల హృదయాలలో ఆమె అమ్మగా నిలిచిపోయింది. కేరళ అసెంబ్లీ శాసన సభ్యురాలుగా, కేరళ నుండి రాజ్య సభకు ఎన్నికైన పార్ల మెంట్ సభ్యురాలుగా **ఆమె సేవలు అందించింది.**



ఇంకా కొంతమంది స్త్రీ సమర యోధులు ఉన్నా వారి గురించి రికార్డుల్లో ఎక్కడా కనిపించక పోవటం దుర దృష్టం.

## 18 మొహమ్మద్ అబ్దూర్ రేహిమాన్

కొచ్చిన్ రాష్ట్రం కొడంగల్లూర్ జిల్లాలోని అజ్జికోడ్ లో రేహిమాన్ 1898లో జన్మించాడు. మద్రాస్ లో ఆలిగ్హాడ్ లలో విద్య నేర్చాడు. ఆలిగ్హాడ్ యూని వర్సిటిలో చదువుతూ మలబార్ లో సహాయ నిరాకరణ, ఖిలాఫత్ ఉద్యమాలలో లో పాల్గొని చదువుకు స్వస్తిపలికాడు. 1921 లో "మోప్లా తిరుగు బాటు "జరిగినప్పుడు శాంతి భద్రతల పరిరక్షణ కోసం తీవ్రం గా కృషి చేశాడు. మోప్లా తిరుగు బాటు దారుల తీవ్రతను తగ్గించటానికి ప్రయత్నం చేసినప్పటికీ రేహిమాన్ ను బ్రిటిష్ ప్రభుత్వం అరెస్ట్ చేసింది. రెండేళ్ళు జైలు శిక్ష అనుభవించాడు.



1930 కాలికట్ బీచ్ లో ఉప్పు సత్యాగ్రహాన్ని చేస్తున్న రేహిమాన్ ను పోలీసులు చితకబాది అరెస్ట్ చేసి కన్ననూర్ సెంట్రల్ జైలు లోతొమ్మిది నెలలు నిర్బంధించారు".ఒ ఆల్ అమీన్ ఒ " అనే పత్రికను 1929 నుండి పదేళ్ళు నడిపాడు. ప్రభుత్వ దమనకాండ వలన పత్రిక మూసి వేయాల్సి వచ్చింది. కాలికట్ మునిసిపల్ కౌన్సిల్ 1931నుంచి మూడేళ్ళు మెంబర్ గా ఉన్నాడు. మలబార్ డిస్ట్రిక్ట్ బోర్డ్ మెంబర్ గా కూడా పని చేసి తర్వాత మద్రాస్ లెజిస్లేటివ్ అసెంబ్లీ కి 1937 లో ఎన్నికైనాడు.

1937 కేరళ కాంగ్రెస్ ప్రెసిడెంట్ గా, 1939 జాతీయ కాంగ్రెస్ సభ్యుడిగా ఉన్నాడు. నేతాజీ కి వీర విధేయుడైన రేహిమాన్ ఫార్వార్డ్ బ్లాక్ లో చేరి సేవలందించాడు. రెండవ ప్రపంచ యుద్ధం మొదలవగానే రేహిమాన్ ను అరెస్ట్ చేసి 1940 నుండి 1945 వరకు అయిదేళ్ళు జైలు లో ఉంచారు. విడుదల కాగానే కాలికట్ వెళ్లి మళ్ళీ కాంగ్రెస్ లో క్రియాశీలకం గా పని చేశాడు. ఒక బహిరంగ సభలో ప్రసంగించి 22-11-1945 నమహమ్మద్ అబ్దూర్ రేహిమాన్ మరణించాడు. ముస్లిం లీగ్ చెప్పే ద్విజాతి సిద్ధాంతాన్ని రేహిమాన్ పూర్తిగా వ్యతిరేకించేవాడు. మంచి వక్త రచయితా సమర్ధ నాయకుడు, సాహస స్వాతంత్ర్య యోధుడు రేహిమాన్ లేని లోటు తీర్చలేనిదే.

## 19 జోన్ ఆఫ్ ఆర్క్ ఆఫ్ ఇండియా " రాణి మంగై వేలునాచియార్

పద్దెనిమిదవ శతాబ్దిలో బ్రిటిష్ వారిపై ఎదురు తిరిగిన రాణి మంగై వేలునాచియార్ 1730లో మంగై మల్లార్ సెల్ల ముత్తు సేతురామన్, రామ నాద పురం రాజ్యానికి రాణి సాకంది ముతాల్ దంపతులకు జన్మించింది. రాజ వంశానికి ఏకైక గారాల పుత్రిక ఆమె. మగ సంతానం లేనందున వేలునాచియార్ యువరాజును పెంచిపోషించారు. గుర్రపుస్వారీ కత్తియుద్ధం కర్ర సాము, విలు విద్య, మొదలైన యుద్ధ విద్యలన్నీ నేర్చుకొన్నది. ఉపాధ్యాయులను ఏర్పరచి ఆమెకు రాజాన్తః పురం లోనే ఫ్రెంచ్ ఇంగ్లీష్ ఉర్దూ భాషలను తలి దండ్రులు నేర్పించారు. ఈ విధం గా ఆమె అన్ని విద్యలలో ఆరి తేరింది. సకల విద్యా సరస్వతిగా ఖ్యాతిపొంది రామ నాడు రాజ్యాన్ని పరిపాలించే సమర్ధత పొందింది.



పదహారేళ్ళ వయసులో ఆమెను శివ గంగై మన్నార్ ముత్తు వడుగ నాదర్ కిచ్చి వివాహం చేశారు. 1772లో ఆమె రాజ్యం పైకి బ్రిటిష్ సైన్యం దాడి చేసింది. భీకరం గా జరిగిన పోరులో ఆమె భర్త, ముత్తు వడుగ నాదర్ కుమార్తె యువరాణి గౌరీ నాచియార్ కూడా కైలయార్ కోయిల్ యుద్ధం లో మరణించారు. ఈ యుద్ధం కాలియార్ కోయిల్ పాలస్ లో జరిగింది. అంతః పురాన్ని పురాన్ని లెఫ్టి నెంట్ కల్నల్ బోన్ జోర్ ముట్టడించాడు. ఆమె కలత చెంది బ్రిటిష్ వారి నెదుర్కొని బుద్ధి చెప్పాలని నిశ్చయించుకొన్నది. దళవాయి తాండవ రాయ పిళ్లే, ముత్తు సోదరులు తీవ్రం గా గాయ పడ్డారు. సంస్థానాన్ని ఎలాగైనా దక్కిన్చుకొంటామని వారు శపథం చేసి ముందుకురికారు. దళవాయి పిళ్లే శివ గంగ సంస్థానం లో అరివీర భయంకరుడైన పోరాట యోధుడు. తాండవ రాయకూడా లబ్ధ ప్రతిష్టుడైన పరిపాలకుడు ముగ్గురు రాజుల దగ్గర పని చేసిన అనుభవం ఉన్న వాడు వీర విధేయుడు కూడా.

వీరిద్దరూ వ్యూహం పన్ని రాణిని ఎవరికీ కనిపించకుండా కొన్ని రోజులు ప్రదేశాలు తిరుగుతూ దాక్కోమని సలహా చెప్పారు. సుల్తాన్ హైదర్ ఆలీ కి రాణి తరఫున దళవాయి బ్రిటిష్ వారిని ఎదిరించటానికి తమకు అయిదు వేల మంది సైనికులను అయిదు వేల మంది ఆశ్వికులను పంప వలసిందిగా ఒక విన్నపం తో కూడిన ఉత్తరం రాశాడు. దురదృష్ట వశాత్తు దళవాయి ముసలి తనం తో చనిపోయాడు. అప్పుడు రాణి అతని కొడుకు తో కలిసి మైసూర్ వెళ్లి హైదరాలిని చూడాలను కొని వెళ్లి కలిసింది. ఈస్ట్ ఇండియా కంపెనీ పెడుతున్న బాధలన్నిటిని ఉర్దూలో రాణి హైదరాలి కి స్పష్టం గా తెలియ జేసింది. తప్పని సరిగా సహాయం చేస్తానని హైదరాలి వాగ్దానం చేశాడు. రాణి పట్ల ఏంతో, సానుభూతి,సహృదయత చూపించాడు ఆలి.

వెంటనే హైదర్ దిండిగల్ లో ఉన్న సయ్యద్ కర్కి కి సందేశం పంపి ఐదువేలమంది కాలి భటులను అయుదు వేల మంది ఆశ్విక దళాన్ని రాణికి అందజేయమన్నాడు. అతడు అలాగే ఏ ర్పాటు చేశాడు. ముత్తు సోదరుల బలం తో ఈ సైన్యం తో రాణి శివ గంగ వైపుకు దూసుకు పోతోంది. ఆర్కాట్ నవాబు రాణి ముందుకు వెళ్ళకుండా ఎన్నో అడ్డంకులు కల్పించాడు. హైదరాలి ఇచ్చిన సైన్యం ముత్తు సోదరుల సైన్యం తో బల పడిన రాణి సైన్యం అడ్డంకులు అన్నిటిని అదిగ మిస్తూ అప్రతి హతం గా సాగి పోయి శివ గంగ చేరింది. ఆర్కాట్ నవాబును యుద్ధం లో ఓడించి బందీగా పట్టుకొన్నది. శివ గంగ సంస్థానాన్ని హైదరాలీ సమకూర్చిన సైన్యం తో మళ్ళీ స్వాధీన పరచుకొంది. శివ గంగ సంస్థానానికి రాణి అయ్యి "శివగంగ సింహం "అని పించుకోన్నది రామనాధ పురం యువ రాణి. వేలు నాచియార్ బ్రిటిష్ ఇమ్పీరియలిజాన్ని ఎదిరించి పోరాడిన మొట్ట మొదటి రాణి. ఝాన్సి లక్ష్మి బాయి కంటే 85సంవత్సరాల ముందే రాణి మంగై వేలు నాచియార్ బ్రిటిష్ ప్రభుత్వం పై తిరగ బడి యుద్ధం చేసిన వీర వనిత అని చరిత్రకారులు రాశారు. ఆమెను "జోన్ ఆఫ్ ఆర్క్ ఆఫ్ ఇండియా "అనీ గౌరవం గా పిలుచుకొంటారు.

## 20 గోవా మహిళా మూర్తులు

గోవాలో 1926 మే నెల 26 న ఆంటోనియో ఆలివర్ డీ సెల్వజార్ పోర్చుగల్ లో అధికారం లోకి రావటం తో రిపబ్లిక్ పాలనఅంతమైంది.. వాస్కోడి గామా, ఆల్బు కెర్క్ లతర్వాత ఇతనితో క్రూరపాలన అంతమైంది పోర్చుగీసు అధికారం తో పెత్తనం చెలాయిస్తున్న సాలాజార్ కబంధ హస్తాలనుండి విడుదలై భారత దేశ విముక్తి కోసం పోరాడుతున్న యావద్భారత దేశం తోపాటు గోవా కూడా కలిసి అడుగులు వేయాలని నిశ్చయించింది. సాలాజార్ ప్రజల నోరు నొక్కి బహిరంగ సమావేశాలకుకాని, భావప్రకటనకు కానీ అవకాశం ఇవ్వకుండా పౌరహక్కులకు తీవ్ర విఘాతం కలిగించాడు. అన్ని హక్కులను నిషేధించి తన క్రూర పైశాచిక నియంతృత్వాన్ని చెలాయించాడు. రాజకీయ సమావేశం జరపాలంటే గవర్నర్ దగ్గర ముందు అనుమతి పొందాల్సి వచ్చేది. 1933 కలోనియల్ యాక్ట్ ద్వారా ప్రజల సర్వ హక్కులు నిషేధానికి గురయ్యాయి. స్వేచ్చాప్రియులైన గోవన్లు దీన్ని జీర్ణించుకోలేక తిరుగుబాటు చేయాల్సి వచ్చింది' అంతకంటే వారికి గత్యంతరం కనిపించలేదు.

క్రమంగా సంస్థలు ఏర్పడి, జాతీయ కార్యక్రమాలు నిర్వహిస్తూ ప్రజలను చైతన్య పరుస్తున్నారు. ఈ ఉద్యమం లో మహిళలు తామేమీ పురుషుల కు వెనుకబడిలేమని తెలియజేస్తూ ముందుకు దూకి స్వాతంత్రేచ్చతో రగిలిపోయారు. గోవా, డయ్యు డామన్ ల విముక్తికి సంఘటితంగా నడుం కట్టి కదిలారు.

.అందులో పౌరహక్కుల ఉద్యమ ప్రధమమహిళా నాయకురాలుగా ప్రమీలా కాంత్ జంబోలికర్ అగ్ర శ్రేణిలో నిలిచింది. గోవా సేవా సంఘం ఆధ్వర్యం లో ఆమె అనేక కార్యక్రమాలు నిర్వహించి మహిళా చైతన్యాన్ని ద్విగుణీకృతం చేసింది. 1946 లో ఆమె గోవా జాతీయ కాంగ్రెస్ సభ్యురాళ్ళలో ప్రధమ స్థానం పొందింది. 21.-7-1946 న ఆమె మడగావ్ లో "ప్రభాత భేరి "ఉద్యమానికి నాయకత్వం వహించింది. పోర్చుగీస్ ప్రభుత్వం ఆమెను అరెస్ట్ చేసి తీవ్రంగా కొట్టి హింసించింది. కస్టడీ లో ఉండగా పోలీస్ కమాండెంట్ అడిగిన ప్రశ్నలకు అత్యంత ధై ర్యం గా సమాధానాలు చెప్పి దిమ్మ తిరిగేట్లు చేసింది. మళ్ళీ ఉద్యమాలు చేస్తే బాలిక అనికాని

మహిళఅనికాని చూడకుండా బట్టలు విప్పించి బాదేస్తానని భయపెట్టాడువాడు. వదిలేశాక ఆమె రెట్టించిన ఉత్సాహం తో మళ్ళీ ఉద్యమం చేసి అరెస్ట్ అయి ఏడాదిపాటు జైల్లో ఉంది

మహిళా కార్య కర్తల ఉద్యమపోరాటం 18-6-1946 న రామ మనోహర్ లోహియా మార్మగోవాలో ప్రసంగించిన సభతో తీవ్ర రూపం దాల్చింది. గోవన్ల పౌరహక్కుల కోసం ప్రభుత్వం తో పోరాటం చేయాలని లోహియా తీవ్ర స్వరం తో ఉద్రేకంగా మాట్లాడి గొప్ప ప్రేరణ కలిగించాడు. అప్పటిదాకా గోవాలోనియంతృత్వసాలజార్ పోర్చుగీసు పాలనలో ఎవరూ ఏ మార్పును తేలేరు అనుకొన్న నమ్మకాన్ని బద్దలు చేశాడు లోహియా. ఆయన కాలు పెట్టటం తో అంతా ఒక్క సారిగా మారిపోయింది. అంత గొప్ప ప్రేరణ కలిగించాడాయన. స్వాతంత్ర పిపాస విజృంభించింది. అన్ని నిషేధాలను ఉల్లంఘించి గోవా నాలుగు చెరగులా ఉన్న గోవన్లు వెల్లువగా ఉద్ధృతప్రవాహంలా దూసుకొచ్చి సభలో పాల్గొని ఆత్మ విశ్వాసాన్ని చాటి చెప్పారు. చేసేదేమీలేక ప్రభుత్వం లోహియాను అరెస్టుచేసింది. ఆయనతోపాటు వత్సలా పాండురంగ కీర్తనీ అనే యువతి కూడా ఉపన్యాసం ఇవ్వటానికి ముందుకు రాగా అరెస్ట్ అయింది. పోలీస్ కమాండెంట్ ఫిగారేడో ఆమెను "ఎందుకు జై హింద్ అని అరిచావు ?"అని అడిగితే ఆమె "జై హింద్ నినాదం మాలో స్వాతంత్రేచ్ఛ, దేశభక్తి కలిగించి ధైర్యాన్నిస్తుంది "అని భయపడకుండా చెప్పింది. ఈమె అరెస్ట్ అయ్యాక 40 మంది మహిళలు ఊరేగింపుగా వెళ్లి జై హింద్ నినాదాలు చేస్తూ పోలీస్ స్టేషన్ ను చుట్టు ముట్టి వత్సలను విడుదల చేయాలని డిమాండ్ చేశారు లేకపోతే తమనుకూడా అరెస్ట్ చేయమని డిమాండ్ చేశారు. అత్యంత నాటకీయంగా జరిగిన దీనికి కమాండెంట్ గుక్క తిప్పుకోలేక ఆమెను విడుదల చేశాడు. కానీ ఆమె మాత్రం లాకప్ నుంచి బయటకు రానని భీష్మించింది. అప్పుడు ఆఫీసర్ ఆమెను పోలీస్ స్టేషన్ నుంచి బలవంతంగా బయటికి నేట్టేసి ఊపిరి పీల్చుకున్నాడు.

గోవా జాతీయ కాంగ్రెస్, గోవా సేవా సంఘం, గోమంతకీయ తరుణ సంఘం మొదలైన రాజకీయ సంస్థలు గోవాలోని బాలికలను స్త్రీలను పౌరహక్కుల కోసం బా గా ప్రభావితం చేశాయి. వీరందరూకలిసి ఎన్నో ప్రభాత భేరీలు సత్యాగ్రహాలు, మూడురంగుల జండా ఎగరేయటాలు, కరపత్రాలు పంచటాలు తో ఉద్యమానికి గొప్ప ఊపు తెచ్చారు. జూన్ 18 ఉద్యమంలో లలితా కాంటక్, (లలితామాధవ్, వెలింగకార్ )కూడా ముఖ్యపాత్ర పోషించింది. ఆమె మార్ గోవాలో మీటింగులపై నిషేధాన్ని ఎత్తేయాలని రోజు ప్రభాతభేరి నిర్వహించేది. 1946 జులై 21 న ప్రమీలాబాయ్ జమ్బ్యాల్కర్, లలితా కాంటక్ ల ఆధ్వర్యం లో భారత జాతీయ జెండాను ఎగర వేసే ప్రయత్నం చేస్తూండగా పోలీసులు అడ్డుకొని వాళ్ళ చేతుల్లోని జెండాను బలవంతంగా లాగేసి వాళ్ళనుచితకబాదారు.

పౌరహక్కుల ఉద్యమం లో వీరితో పాటు చేతులు కలిపినమహిళలలో కృష్ణ హెగ్డే, విఠా హెగ్డే,, కృష్ణ లోతిల్కర్, ముక్తా ఖరాపుర్కర్, ఉమాబాయి శిరాలి, ఇందిరా బైసె, జీవన్ కరపుర్కర్ వంటి త్యాగ-శీల మహిళా మాణిక్యాలెందరో నిరంకుశ సాలాజార్ పోర్చుగీస్ పాలననుండి విముక్తికై అవిశ్రాంతంగా ఉద్యమించి చరితార్ధులయ్యారు. ఈ స్వాతంత్ర్య దినోత్సవం నాడు వారిని ఒకసారి స్మరించి ప్రేరణ పొంది ధన్యులమవుదాం.

## 21 మధ్య ప్రదేశ్ ఆది వాసి స్వాతంత్ర్య యోధుల్ని బందిపోట్లుగా రికార్డ్ చేసిన ప్రభుత్వం

16-3-1943 న మధ్యప్రదేశ్ లోని సాత్పురా పర్వతాలలోని అఖ్రాని కోట దగ్గరున్న ఒక లోయ లో తల దాచుకొంటున్న వందలాది ఆదివాసీ స్త్రీలపైనా మగవారి పైనా బ్రిటిష్ సైన్యం, పోలీసులు ఆకస్మికం గా దాడి చేసి, చాలామందిని దారుణం గా తుపాకులతో చంపేసి, మిగిలిన వారిని లాక్కెళ్ళి జైలు పాలు చేశారు. అంతేకాదు వారినందర్నీ బందిపోట్లుగా చిత్రించారు. ఈ సంఘటన జరగటానికి నేపధ్యం ఉంది. ఆ వివరాలు తెలుసుకొందాం.

తలోడా జిల్లా, మార్వాద్ తాలూకా మార్వాడ కు చెందినా ఆప్ గులాం మహారాజ్ అనే యోగి తన శిష్యులను సారా, కల్లుతాగ వద్దని, మరే విధమైన మత్తు పదార్ధాలకు బానిసలు కావద్దని బోధించేవాడు. శిష్యులు అత్యంత వినయం తో ఆయన మాటలు పాటిస్తూ వీటికి దూరం గా ఉంటూ జీవిస్తున్నారు. గులాం మహారాజ్ మరణం తర్వాత ఆయన చిన్న తమ్ముడు రామదాస్ మహారాజ్ సారా వ్యతిరేక ఉద్యమాన్ని స్వీకరించి నడిపి ఆది వాసుల జీవితాలలో వెలుగు రేఖలు నింపాడు. ఈ ఉద్యమము వల్ల సారాషాపు యజమానులు తీవ్రం గా నష్టపోయారు. సారా తాగేవాళ్ళకూ ఇబ్బందిగానే ఉంది. తాగుబోతులు, సారా విక్రేతలు ఏకమై సారా వ్యతిరేకతను తీవ్రం గా ఎదుర్కొన్నారు. తరచూ వీరిద్దరిమధ్య ఘర్షణలు జరుగుతూ ఉండేవి.

బ్రిటిష్ వాళ్ళు బ్రిటిష్ వైన్ ను, వైన్ షాపుల వాళ్ళు అమ్ముతున్నందున సహజం గా నే షాపు యజమానుల కొమ్ముకాసి ఉద్యమాన్ని బల పడకుండా చేస్తున్నారు. రామదాస్ మహారాజు ను ప్రభుత్వ వ్యతిరేక విప్లవ కారుడిగా ముద్ర వేశారు. అంతేకాక మహారాష్ట్ర నుండి ఆయన్ను,అనుచరులను బహిష్కరించారు. అనేకమంది నమ్మకమైన అనుచరులతో, అందులో ముసలి వారితో కలిసి నర్మదా నది వెంబడి ప్రయాణం చేస్తూ మధ్యప్రదేశ్ లోకి ప్రవేశించాడు మహారాజ్.

జిల్లా కాంగ్రెస్ కమిటీ ప్రెసిడెంట్ శంకర వినాయక్ ఠాకూర్ రామదాస్ మహారాజును బహిష్కరణను వ్యతిరేకించి ప్రజల్లో కలిసి పొమ్మని కబురు చేశాడు. దానిని మన్నించి రామదాస్ మహారాజ్ అనుచరులతో వచ్చి అఖ్రానిరి కోట దగ్గరున్న లోయలో తల దాచుకొంటున్నారు. ఇదీ పై సంఘటనకు నేపధ్యం. నిరాయుధులు, శాంతి యుతులు అయిన ఆదివాసీలపై బ్రిటిష్ సైన్యం, పోలీసులు ఆకస్మికం గా దాడి చేసి నిర్దాక్షిణ్యం గా వందలాది మందిని తుపాకి గుళ్ళకు బలి టుచేశారు. చనిపోయిన వారి శవాలను ఎడ్ల బండి మీద కట్టెల మోపులు పేర్చినట్లు పేర్చి తలోడా పోలీస్ స్టేషన్ కు చేర్చారు. ఈ దారుణ మారణ కాండకు ఆనాడు ఆరవ తరగతి చదువుతూ, ఇప్పుడు మాజీ శాసన సభ్యుడుగా ఉన్న జనార్దన పోహార్య వాల్వి ప్రత్యక్ష సాక్షి. ఈ దారుణ కిరాతక హత్యలు సరిగ్గా ఏ ప్రదేశం లో జరిగిందో ఆయన గుర్తు చేసుకొని చెప్పాడు.

దీని తర్వాత రామ దాస మహారాజును అయన స్వగృహం లో గృహ నిర్బంధం లో ఉంచారు పోలీసులు. మిగిలిన వారిని అరెస్ట్ చేసి జైలు లో పెట్టారు. తరువాత శంకర్ వినాయక్ ఠాకూర్ వారిని జైలు నుండి విడిపించాడు. ఈ పోలీస్ కిరాత కృత్యం లో చని పోయిన, అరెస్ట్ అయిన అమాయకులైన ఆది వాసీలను బంది

పోటు దొంగలుగా పోలీసు రికార్డుల్లో నమోదు చేయటం మరీ దారుణం. మనకు స్వాతంత్ర్యం వచ్చి అరవై అయిదేళ్ళు దాటినా ఇంకా ఆ సమర యోధుల్ని "డకాయిట్లు "గా రికార్డుల్లో ఉంచటం జాతికే సిగ్గు చేటు. మన అసమర్ధ ప్రభుత్వాల నిర్లక్ష్యానికి ఉదాహరణ.

ఈ వివరాలన్నీ సంతోష్ మిరాఘే అనే టీచర్ "ట్రైబల్ ట్రబుల్స్" 'పుస్తకం లో రాశాడు.

అపూర్వాంధ్ర పూర్వామాత్యులు

శీర్షిక చూసి గాబరా పడకండి. రాజరిక వ్యవస్థలో పేరుపొందిన గొప్ప తెలుగు మంత్రులు అనిభావం. మంత్రి, అమాత్య, ప్రెగ్గడ పర్యాయపదాలు. సరదాకోసం పై హెడ్డింగ్ పెట్టాను. తమ శేముషితో, రాజుకు, రాజ్యానికి, ప్రజలకు విశేష సేవలు అందించిన నాటి మంత్రి పుంగవులలో కొందరిని గురించి తెలియ జెప్పే ప్రయత్నమే ఇది.

ఆధారం –ప్రాచీన హిందూ దేశ రాజ్యాంగ చరిత్ర, కన్నడ దేశ చరిత్ర, ప్రాచీన గ్రామసభల న్యాయ పరిపాలన, దండనాథులు, దుర్గాధిపతులు వంటి అమూల్యగ్రంథాలు రచించిన విమర్శక శిరోమణి, సాహిత్య విశారద బ్రహ్మశ్రీ కోన వేంకటరాయ శర్మగారు 1950 లో రచించిన "సచివోత్తములు " పుస్తకం

## 1 రావుల వజ్జియప్రెగ్గడ

క్రీశ 10వ శతాబ్దికి చెందినవాడు రావుల వజ్జియప్రెగ్గడ.ఈయన గురించి తెలుసుకోవటానికి ముందుగా కొన్ని విషయాలు తెలియాలి. 64కళలో ప్రజ్ఞావంతుడైన దానార్నవుడికి, ఆర్యామహాదేవికి శక్తివర్మ, విమలాదిత్యుడు కొడుకులు. శక్తివర్మను చాళుక్య నారాయణుడు, చాళుక్య చంద్రుడని పిలుస్తారు. తండ్రిలాగానే "సర్వలోకాశ్రయ శ్రీ విష్ణు వర్ధన మహారాజాది రాజు "పేరుతో శక్తివర్మ పట్టాభిషేకం చేసుకొని 12ఏళ్ళు పాలించాడు. ద్రవిడులైన చోళులకు సాయం చేయాలని చిన్నప్పటి నుండి ఇతనికి ఉండేది. చేజారి పోయిన తండ్రి సామ్రాజ్యాన్ని మళ్ళీ పట్టుకోవాలనే ప్రయత్నం లో ఉండగా జటా చోడ భీముడు విషయం తెలుసుకొని విఫలుడిని చేశాడు. బలపడిన శక్తివర్మ మళ్ళీ జటా చోడు నిపైకి యుద్ధానికి రాగా శక్తివర్మకు చేయూతగా చోళ చక్రవర్తి రాజకేసరివర్మ తన సైన్యాన్ని బాసటగా పంపగా జటా చోడు ని ఓడించి వేగీ రాజ్యాన్ని కైవశం చేసుకొన్నాడు. దానార్నవుడి సంతతి మళ్ళీ అధికారం లోకి వచ్చిందని కంటిలో నిప్పులుపోసుకొన్న చోళ, పాశ్చాత్య, చాలుక్యరాజ్యాలు సహించ లేకపోయాయి. చోళ చక్రవర్తి శక్తివర్మకు సాయం చేయటం లో, వేంగీ సామ్రాజ్యాన్ని ఆక్రమించాలనే బలమైన కోరిక ఉంది. రాజనీతి ఉపయోగించి తన కూతురు కుందవ మహాదేవి ని శక్తివర్మ తమ్ముడు విమలాదిత్యునికిచ్చి పెళ్లి చేసి తనదగ్గరే పెట్టుకొని వేంగీ రాజ్యాన్ని చోళులు హస్తగతం చేసుకొన్నారు.

ఇది కల్యాణి చాళుక్యులకు ఇష్టం లేదు. కాని అప్పుడు వాళ్ళు రాష్ట్ర కూటులను ఓడించి కర్నాటక సామ్రాజ్యాన్ని కైవశం చేసుకోవటం తో వేంగీ రాజ్యంపై దృష్టిపెట్టలేక పోయారు. దానార్నవుడు యుద్ధంలో చనిపోయేనాటికి శక్తివర్మకు ఆరేళ్ళు విమలాదిత్యుడికి నాలుగేళ్ళు వయసు. మంత్రులుకాని ఆప్తవర్గం కాని అతనిపెద్ద కొడుకు శక్తి వర్మను రాజును చేసే సమర్ధులు కాలేకపోయారు. అప్పటికి జటా చోడుడే శక్తి యుక్తి సామర్ధ్యాలున్నవాడు. ఇతని వీరోచిత కార్యాలన్నీ కంచి లో విజయస్తంభంపై చెక్కబడి ఉన్నాయి. ఇతనిపూర్వులు రాజ చాళుక్య వంశానికి బంధువులు సామంతులు, రేనాటి ప్రభువులు. ప్రజోపకారమైనన తటాకాలు నిర్మించటం దేవాలయాలు కట్టించటం చేశారు. అనితర సాధ్య బలపరాక్రమ విక్రమాలున్న జటాచోడుడు "సంగ్రామ విజయ, అరసరాభరణ, సమరైక వీర,రణరంగమల్ల,విక్రమ ధనంజయ "బిరుద విరాజితుడు. ఇతని సోదరి వేంగీ చాలుక్యులలో చిన్నకోవకు చెందిన యుద్ధమల్లుని కొడుకైన బాదవుని భార్య. కనుక బాదవుని కి వేంగీ సామ్రాజ్యాధిపతి కావాలనే సంకల్పం ఉండటం వలన ఇమ్మడి రాజు ను ఓడించి "సమస్త భువనాశ్రయ శ్రీ విజయాదిత్య "పేరుతో వేంగీ సామ్రాజ్యానికి చక్రవరి అయ్యాడు.

బాదవునికి సంతానం లేకపోవటంతో, భార్యకు రాజ్యాధికారం సంక్రమించి న వేంగీ సామ్రాజ్యాన్ని "స్వభగినీ పదమండ్ర మండలం "పేరుతొ జటాచోడుడు పాలన సాగించాడు. ఈ సమయం లోనే దానార్ణవ, నృపకాములను యుద్ధం లో చంపేసి మొత్తం ఆస్తి హరించి ఇష్టారాజ్యంగా పాలించాడు. అతని శక్తియుక్తులను ఎదిరించగల మొనగాడే వరూ లేకపోవటం తో కీర్తి దిలీపుడై, సమర ధనుస్జయుడై చెలరేగాడు.తండ్రి రాజ్యాన్ని మళ్ళీ హస్తగతం చేసుకొనే శక్తివర్మ ప్రయత్నాలన్నిటిని చోడుడు భగ్నం చేశాడు. అయినా ప్రయత్నాలు మానని అతనిని "మృగాధివ సతిం మాయాం హరేఃపౌరుషం "అని కవి కీర్తించాడు. పట్టువదలని విక్రమార్కుడి లాగా 27ఏళ్ళు జటా చోడుడు తో యుద్ధం చేసి చివరికి ఓడించి తన రాజ్యాన్ని తిరిగిపొందాడు శక్తివర్మ.

ఇమ్మడి తైలపుడు చనిపోయాక చోడుడు ఏకాకియై, విసుగు చెంది, వృద్ధాప్యం మీదపడి కర్నాటక రాజ్యానికి వెళ్ళిపోయేప్రయత్నం లో ఉండగా, శక్తివర్మ ప్రయత్నాలు తెలిసి వెనక్కివచ్చి, అతనితో యుద్ధం చేసి ఓడిపోయాడు. 27ఏళ్ళ పగ చల్లారటానికి చోడుడి బంధు మిత్రులనదర్నీ చంపేయించి అతని వంశాన్ని నిర్వంశం చేశాడు శక్తి వర్మ. కళింగం పైకి దండెత్తి చోడభీముని ప్రతినిధి ని ఓడించి చంపి రాజ్యాన్ని ఇమ్మడి వజ్రహస్తుడికిచ్చి పూర్వపు మైత్రి కొనసాగించాడు. ఇదంతా వికారి సంవత్సరం లో క్రీ శ 999-1000కాలం లో జరిగింది.

ఈవిధంగా తండ్రి రాజ్యాన్ని తిరిగి సంపాదించుకొన్న విక్రమాదిత్యుడే శక్తివర్మ. అనాధ ఐన వెంగీసామ్రాజ్యానికి సనాదుడై చాళుక్య నారాయణుడయ్యాడు.అప్పుడే ఇతని తమ్ముడు యువరాజైన విమలాదిత్యునికి చోళరాజు తన కూతురును క్రీశ.1002 లో ఇచ్చి వివాహం చేశాడు. శక్తివర్మ రాకతో వేంగీ సామ్రాజ్యం లో శాంతిభద్రతలు సుస్థిరమయ్యాయి. వరాహ చిహ్నమున్న బంగారు నాణాలు ముద్రించాడు శక్తివర్మ.

1011 లో శక్తివర్మ మరణం తర్వాత తమ్ముడు విమలాదిత్యుడు వేంగీ సామ్రాజ్యాధిపతి అయ్యాడని "కోరుమిల్లి "శాసనం తెలియ జేస్తోంది. రణస్థపూండిశాసనం లో జ్యేష్ట శుక్ల పంచమి గురువారం పుష్యమి నక్షత్ర సింహలగ్నం లో పట్టాభి షిక్తుడైనట్లున్నది. "ముమ్మడి భీముడు, బిరుదాంక భీముడు, త్రిభువనాం కుశుడు

"అనే సార్ధకబిరుదులుపొందాడు.1014లో తమిళనాడు తిరువయ్యార్ లో పంచనాధేశ్వరస్వామికి ద్రవ్యం అందజేసిన శాసనం ఉన్నది. జైనమతావలంబి అయినా పరమతసహనం కలవాడు. ఇతనికికి ఇద్దరుభార్యలు కుందమాదేవి, మేడమాదేవి. కుందమకు రాజరాజు, మేడమ కు విజయాదిత్యుడు కొడుకులు. రాజరాజును తండ్రివైపువారు విష్ణు వర్ధనుడు అనీ, తల్లివైపువారు రాజరాజు అనీ పిలుస్తారు. వజ్జియప్రెగ్గడ తో మొదలెట్టి,శాఖా చంక్రమణం చేశాం కదూ. ఇప్పుడు ఆయన అవసరం వచ్చింది.

విమలాదిత్యమహారాజు పరిపాలన కు మహామాత్యుడు వజ్జియప్రెగ్గడ విశేషమైన కృషి చేశాడు. ఆయన రాజనీతి అపూర్వం. వేంగీ సామ్రాజ్యాధిపతి కుబ్జ విష్ణువు అయినప్పటినుంచి వేంగీ సామ్రాజ్యానికి చక్రవర్తి పరమ మహేశ్వరుడైన సుక్షత్రియుడే అధిష్టించాలి అనే సంప్రదాయం ఏర్పరచి నిలబెట్టాడు. ఇది చాలుక్యవంశ మర్యాదగా వేంగీ చాళుక్యుల రాజనీతిగా పేరుపొందింది. వేంగీచాలుక్యుల ఇలవేలుపు దాక్షారామ భీమేశ్వరస్వామి.

ఆకాలం లో "త్రికాలయోగి సిద్ధాంత దేవముని "అనే ఒక జైనముని "కొండ కుందాన్వయానికి చెందిన నంది గణంవాడు, దిగంబర జైనుడు, గోల్లాచారి శిష్యుడు ఆంధ్ర దేశానికి వచ్చాడు ప్రచారంబాగా చేసి జనాన్ని జైనంలోకి మార్చాడు. ఈయన సమకాలికుడు ప్రభాచంద్రుడు దారానగరరాజు భోజరాజు చేత సత్కారం పొందాడు. విమలాదిత్యుడు భోజుని మిత్రుడే. విమలాదిత్యుడికి హిందూ ధర్మం పై విరక్తికలిగి జైనాన్ని స్వీకరించినా రణస్థిపూండిశాసనం నాటికి ఇంకా పరమమాహేశ్వరుడే. కలిదిండి శాసనం ప్రకారం ఇంకా అభిషిక్తుడు కాని రాజరాజు రాజప్రతినిధి మాత్రమె. రాజరాజు మంత్రి వజ్రాదిత్యుడు, త్యాగి విమలాదిత్యుడు కలిసి మనుధర్మ ప్రవర్తకులైన రాజప్రతినిధి వర్గాన్ని ఏర్పరచి సామ్రాజ్య రక్షణ బాధ్యత అప్పగించటంలో విమలాదితుని సర్వసంగ పరిత్యాగం మహామాత్యుడు వజ్జియప్రెగ్గడపై ఉన్న అపారమైన నమ్మక విశ్వాసాలు ఆయన శేముషీ సంపన్నత కారణాలు. ఈ ఏర్పాటు జరిగిన ఒక ఏడాదికే విమలాదిత్యుడు మరణించాడు.

రాజరాజు వేంగీ చక్రవర్తి అవగానే సవతి తమ్ముడు వీర విజయాదిత్యుని యౌవరాజ్య పట్టాభి షిక్తుని చేశాడు. సందట్లో సడేమియా అన్నట్లు ఇదే సమయంలోకళింగరాజు మధుకామార్ణవుడు రాజరాజు కు శత్రువుకాగా, దాయాదులను విరోధులను ఓడించాకమాత్రమే రాజ రాజు అభిషిక్తుడయి,మధురాంతక దేవుడు అనిపిలువబడే రాజేంద్ర చోళుని కుమార్తె అమ్మంగ దేవిని 1023లో పెళ్ళాడాడు. ఇదంతా వజ్జియప్రెగ్గడ ప్రతిభావిశేషాలవలననే జరిగిందని 1023రణస్థిపూండి శాసనం తెలియజేస్తోంది. ఇందులోనే ప్రెగ్గడవంశ గోత్రాది విశేషాలున్నాయి –

"మద్భక్తాయ కృత క్లేశాయ"కారమ చేడు "వాస్తవ్యాయ కౌండిన్య గోత్రాయామాత్య శిఖా మణ్యే బుధ వజ్ర ప్రాకారాయ, సౌజన్య రత్నాకరాయ వజ్జియప్రెగ్గడఇతిప్రసిద్ధాభిధానాయ భవద్విషయో "పారువటి"నామ గ్రా మేణసార్ధం రణస్థిపూండి నామగ్రామోగ్రహారీ కృత్య మత్సంవర్దిత్వా నిమిత్తే,మాయాదత్తఇతి విదిత మస్తునః ".వజ్జియకౌండిన్య గోత్రుడు. ద్రోణమంత్రి పౌత్రుడు, హరిదత్త వరప్రసాదుడైనదత్తామాత్యుని కుమారుడు. ప్రభు మంత్రోత్సాహ శక్తిమంతుడు. తల్లి పతివ్రత చీడమాంబ. వజ్జియ బుద్ధిలో బృహస్పతి. సుహృద్వత్సలుడు. అవిరళ జపహోమ తత్పరుడు, సకల వేదార్ధ నిష్ణాతుడు. శుచి, దాని. చతురసత్య వచో నిరతుడు. బుధ వజ్ర ప్రాకారుడు, శ్రీకంఠ పాదార వింద షట్పదుడు,సౌజన్య రత్నాకరుడు, స్వామికార్యనిర్వహణ దక్షుడు. త్రికరణాల చేత పవిత్ర చరిత్రకల కౌండిన్య మహర్షి వంటివాడు, మిక్కిలి శివభక్తుడు. యజ్ఞయాగాది క్రతువులెన్నో చేసినకర్మిష్టి,విప్రకుల భాస్కరుడు, అగ్నిష్టోమ, అతిరాత్రాది క్రతుకర్త, అతిధి అభ్యాగతులకు కొంగుబంగారం. పురోడాశ పవిత్ర వక్త్రుడు. విద్వాంసుల, వేదవిధిజ్ఞుల, సోమయాజుల ను సత్కరించటం లో సాటిలేనివాడు, శ్రమణులు, దిగంబర జైనులు వీరు వారు అనే భేదం లేక ఆదరించేవాడు.

మన ప్రెగ్గడ రాజకార్యాలను తన భవ్య హర్మ్యం నుంచే సాగించేవాడు. ఈ భవనానికికి ఒకప్రక్క ఉద్యానవనం దానిమధ్యలో నుయ్యి, రెండవవైపు గోష్టాలు,అందులో ముచ్చటైన కపిలదేనువు. దాని క్షీరాన్నే త్రాగే అలవాటున్నవాడు. భార్యాభర్తలు ప్రత్యూషకాలం లో లేచి కపిల ధేనువు సందర్శనం చేసి పూజించేవారు. అన్నికులాలవారికీ ఆవుపాలు పంచి పెట్టేవారు ఆ దంపతులు. ఆపాలుత్రాగి ఎవరికీ ఏజబ్బులూ రాకుండా ప్రజలు ఆనాడు ఉత్సాహాలతో ఉండేవారు. వేదాధ్యయనం కూడా ఉండటం తో ఇల్లు ఒక గురుకులంగా భాసిల్లేది. విమలాదిత్య మహారాజు కు ముఖ్య సచివుడై యుద్ధంలో ధర్మం లో మంత్రాంగం లో సాయపడుతూ సామ్రాజ్యాభి వృద్ధి ప్రజాసంక్షేమం రెండుకళ్ళుగా భావించి సేవచేసిన చిరస్మరణీయుడు వజ్జియ ప్రెగ్గడ. ఈయన గురించి ఇదే మొదటిసారి నేను తెలుసుకోవటం. నా అనందాన్ని మీతో పంచుకోవటమే నేను చేసినపని

## 2 చెల్లకి గంగాధర మంత్రి

వేంగి దేశం లో చెల్లకి పురానికి చెందిన చెల్లకి గంగాధర మంత్రి మహామండలేశ్వరుడు రెండవ ప్రోలరాజు మహామాత్యుడు. 12వ శతాబ్దివాడు. ఆరువేల నియోగి బ్రాహ్మణుడు. ప్రోలరాజు ఇతనిని మహామంత్రి ని చేసి, "యనుకొండ "లో నివాసం ఏర్పాటు చేశాడు. కరీం నగర శాసనం లో ఇతని గురించి వివరంగా ఉంది – "చనువు మెయి నగరి లో దగు –పనులెల్లను బెంపు మెరసి పరికించుచునే-ర్పును భక్తియుక్తి నతిముద –మున జేయుచు దత్పరోక్షమున మతియుఙ్రభన్ "

"ఘోరతరాజి లోలుడత్యకుటిల చిత్తు దీతడని"ఆదరం తో గంగాధర మంత్రిని పిలిపించాడు "అప్రకటిత కీర్తి ప్రోలజనపాలుడు ". ఇతని వంశ మూల పురుషుడు కొమ్మనమంత్రి. ఆయన ప్రతిభతో కీర్తిపొంది చెల్లకిలో ఉండగా అతనికి బంధు చింతామణి, శ్రీయుతుడు ఐన నారాయణుడు కొడుకుగా పుట్టాడు. భార్య ఐతమాంబ. వీరికొడుకు గోవిందుడు. ఇతని భార్య తురకమాంబ. వీరి పుత్రుడే మన గంగాధరుడు.

"వ్యోజ దండనాథు డనేవాడు యుద్ధం లో చనిపోగా, ఆ అమాత్యపదవి గంగాధరుని వరించింది. ప్రోలరాజుకాలం లో కాకతి రుద్ర దేవుడికాలం లోకూడా మంత్రిపదవిలో రాణించాడు. అందరి అభిమాన గౌరవాలు అందుకొన్నాడు. అమాత్యపదవి, నియోగ వృత్తి సక్రమంగా నిర్వర్తిస్తూ బ్రాహ్మణులనుకాపాడుతూ, అనేక

దేవాలయాలు కట్టించి, పూజా పునస్కారాలకు అవకాశం కల్పించినట్లు కరీం నగర శాసనం లో ఉన్నది. "శ్వేతాతపత్రం "అంటే తెల్లగొడుగు గౌరవ చిహ్నంగా ధరించేవాడు. అన్ని నియోగ వృత్తులపైనా, సర్వాధికారాలు ఉన్న మహామాత్యునిగా కాకతి ప్రతాప రుద్రుడు కూర్చోబెట్టాడని తెలుస్తోంది.

తరువాత కాకతీయ బేతా భూపాలుడి కాలం లోనూ సమర్ధంగా మంత్రిపదని నిర్వహించాడు గంగాధరమంత్రి. మహత్తర యశో విరాజితుడై, అగణిత శౌర్య సంపన్నుడు అయి, బేతరాజు గౌరవాదరాలు పొంది "సబ్బి సాయిర మండలం "ను సర్వజన మనోరంజకం గా పరిపాలింప జేసింది వైజనాథ మహా మంత్రి. ఈ మంత్రికి, యాకమాంబికకు జన్మించినవాడు బేతన ప్రగడ రెండవ ప్రోలరాజు మంత్రి. ఈ భార్యాభర్తలు జైనమతావలంబులు. రెండవ ప్రోలరాజు 1107నుంచి 1157వరకు యాభై ఏళ్ళు అవిచ్చిన్నంగా పాలించాడు.

ఓరుగల్లు పురనిర్మాణం ఈప్రోలరాజుతో ప్రారంభమైందని అంటారు. తాను గెలిచిన దేశ ప్రజలు హాయిగా జీవించటానికి ఈ పుర నిర్మాణం చేశాడట.ఒకసారి ఇక్కడ అమ్మకానికని సరుకులతో వచ్చిన బండి ఇక్కడ ఒక రాతికి తగిలి తలక్రిందులైతే, ఆ బండీ పట్టా ఆశ్చర్యంగా బంగారం అయిందట. ఈ విషయం ప్రోలరాజుకు తెలిసి ఆ రాయి స్పర్శవేది అయిన శివలింగం గా భావించి, స్వయంభు గా దానిని అక్కడే ప్రతిష్టించి, ఆలయం కట్టించి, పూజాదికాలు ఏర్పాటు చేసి క్రమంగా ఓరుగల్లు పట్టణ నిర్మాణం సాగించి క్రమాభి వృద్ధి చేశాడు. ఇతని తర్వాత వచ్చిన రాజులు అక్కడ బలవత్తరమైన, శత్రు దుర్నిరీక్షణమైన వప్రము అంటే కోట కట్టారు. అదే వరంగల్లుకోట.

గంగాధర మంత్రి మహామాత్యుడైన తర్వాత హనుమకొండ ను నగరంగా నిర్మించాడు. ఎటుచూసినా కోనేరులు దేవాలయాలు, ఆరామాలు చెరువులతో అంటే సప్త సంతానాల ప్రతిష్టలతో హనుమకొండ శోభించేట్లు చేశాడు. ప్రభువు అనుమతితో విద్వజ్జనాలను పిలిపించి గొప్ప క్రతువు చేయించి,వారికి "డొండొండు"అనే అగ్రహారాన్ని యిచ్చి వారికి పౌరసత్వం అంటే సిటిజన్ షిప్ ఇప్పించాడు –

"పురుషనిధి, పురుషరత్నము –పురుషోత్తమ మూర్తి యనుచు బొగడగ జనులు –త్కరుషమతి వెలయంగం ద్రైపురుషుల జేసితి బ్రతిష్ట పూజర్థముగాన్ "అని చెప్పుకోవటం వలన ఆ అగ్రహారం లో త్రిమూర్తి ప్రతిష్ట చేశాడు గంగాధరమంత్రి అని తెలుస్తోంది –

"పరమేశుడు, హరి, బుద్ధ-స్వరూపుడై యప్పురవరుల వచించు జినో –హరి యనెడుపట్టశాలం-జిరముగ బుద్ధ ప్రతిష్ట జేసితి భక్తిన్ "అని ఉన్నదాన్ని బట్టి బుద్ధాలయం కూడా నిర్మించాడు. ఈ విధంగా ప్రజలకు అవసరమైన అన్ని పనులను చేస్తూ, రాజుకు విధేయుడుగా ఉంటూ, కాకతీయ ఆంధ్ర సామ్రాజ్య అభ్యుదయానికి గంగాధర మంత్రి యెనలేని సేవలు చేశాడు.

ప్రోలరాజు తర్వాత అతడికొడుకు రుద్ర దేవుడు రాజై,హనుమకొండ రాజధానిగా ఉండటం ఉచితం కాదనుకొని, ఓరుగల్లుకు రాజధాని మార్చినట్లు "శివయోగ సారం "లో ఉన్నది. గంగాధరమంత్రి ప్రోలరాజు దగ్గర మంత్రిగా ఉన్నప్పుడు రాజధాని హనుమకొండ, రుద్రదేవుని మంత్రిగా ఉన్నప్పుడు రాజధాని ఓరుగల్లు అని తెలుస్తోంది. 1170"నగు నూరు" శాసనంలో కవిబ్రహ్మ తిక్కన చెక్కించిన పద్యాలున్నాయి –చివరిది

"సుర కరిపతి మృగపతి హరి-సురసతి ధవళ సరసి రుహ, శక్తిరుహ సద్రుక్-సురు చిర విశద యశో భా-సుర నిధిచే సుకవి తరణి సురనిధి చేతన్".నాలుగు దిక్కులావిజయ స్తంభాలు నాటించి, మిక్కిలి ప్రతాపశాలియై, అనేక తెలుగు గ్రంధాలను అంకితం పొంది, సప్త సంతానాలను పొందిన ధన్యుడు చెవికి గంగాధర మంత్రి. తానూ చేసిన సుహృత్ కార్యాల వివరాలను శాసనం పై చెక్కించాడు.

రుద్ర దేవుని అనుమకొండ వేయిస్తంభాలగుడిలోని 1162 శాసనం

అనుసరించి కాకతీయ రుద్ర దేవుని సామ్రాజ్యం తూర్పున బంగాళాఖాతం, దక్షిణాన శ్రీశైలం, పడమర కటకం, ఉత్తరాన మాల్యవంతం వరకు విస్తరించి ఉన్నది. ఇంతటి విశాలసామ్రాజ్యాన్ని రుద్ర దేవ చక్రవర్తి పాలిస్తుంటే, దానికి సర్వవిదాలా తోడ్పడినవాడు గంగాధరమంత్రి. హిడంబాశ్రమం, నగనూరు, అనుమకొండ మొదలైన చోట్ల దేవాలయాలు పుష్పారామాలు నిర్మించాడు. ఈయన ప్రోత్సాహంతో రుద్రదేవుడు సకల శాస్త్ర పరాయణుడై, రామేశ్వర దీక్షితుని వద్ద విద్యలు నేర్చి, రాజనీతి పెంపు చేసుకొని, కవిత్వం చెబుతూ ఆస్వాదిస్తూ గురువుగారికి విన్నకొండ సీమలో శివపురం అనే గ్రామాన్ని మొదటగా దానం చేసి ఖాజీపేటలో దాన స్తంభాన్ని వేయించాడు.

అనుమకొండను మాధవవర్మ మొదలైన వారు పాలించినా ప్రోలరాజువంటి స్వాతంత్ర్య దీక్ష ఉన్నవారుకాలేకపోయారు. చాలుక్యరాజ్య ప్రాభవం సన్నగిలుగిలు తుండగానే ఆంధ్ర సామ్రాజ్యం నెలకొల్పి ఆంధ్రుల వ్యక్తిత్వాన్ని కాపాడినవాడు ప్రోలరాజు. తనలో దాగి ఉన్న రాజనీతి, సమయజ్ఞత శౌర్య ధైర్య సాహసాలు, ఔదార్య గాంభీర్యాలు పురి విప్పిన నెమలిలా విజృమ్భించి ఉపయోగపడినాయి. ఈ సామ్రాజ్యానికి శ్రీరామ రక్ష చెల్లకి గంగాధర మంత్రి ;'

## 3 గోపరాజు రామయమంత్రి

కాకతీయ గణపతి దేవుని మంత్రి గోపరాజు రామయమంత్రి. 1166నుంచి 1290వరకు గణపతి దేవునికాలం కనుక 13వ శతాబ్దివాడు. ధరణికోట రాజధానిగా రాజుపాలించాడు. 1193 లో అధికారం లోకి వచ్చినట్లు చిలుకూరి వీరభద్రరావు గారన్నారు. త్రిపురాంతక శాసనం బట్టి 62ఏళ్ళు పాలించాడు. రాజధానిని ధరణికోటనుంచి ఓరుగల్లుకు మార్చి, శివాలయాలు చెరువులు భవనాలు కట్టించాడు. గ్రామాలు ఏర్పాటు చేశాడు. "కొండవీటి దండకవిలె "లో

"శ్రీమాన్గణపతిర్భూపో గజపత్యాన్వయోద్భావః –ఆస్తి భూ మండలే తస్య బహవస్సంతి మంత్రిణః-తేషాం శ్రేష్టతమమాత్యో-యాజ్ఞవల్క్యోత్తమా ద్విజః – గోపరాజాన్వయోత్పన్నో –రామాఖ్యో గణికాగ్రణీః-రక్తాస్యబ్దే మాసి భాద్రపదే బహుళ పక్షకే –దర్శేర్క గ్రహణే-పుణ్య కాలేన్గారక వాసరే"అనేదానిలో ఉన్నప్రకారం గోపయమంత్రి రక్తాక్షి సంవత్సర భాద్రపద బహుళామావాస్య మంగళవారం కృష్ణాతీరం లో సూర్యగ్రహణకాలం లో, రాజు అనుగ్రహం తో కరణీక బ్రాహ్మణులకు ఇచ్చాడని తెలుస్తోంది.

రామయమంత్రి తిరుపతికి వెళ్లి తిరిగివస్తూ 1066లో సత్తెనపల్లి దగ్గర మాదల గ్రామం లో ఒక బ్రాహ్మణుడి ఇంట ఉండి, తాను పెట్టాల్సిన ఆబ్దికాన్ని సంతృప్తిగా పెట్టటానికి మొదటిరోజునే బ్రాహ్మణులను ఏర్పాటు చేసుకొని, అందులో ఒకాయన కట్టాల్సిన పన్ను చెల్లించనికారణంగా,ఆ వూరికంసాలి, కారణాలు పిలిపించి "బండకొయ్య "వేయించి నందున భోక్తగా రావలసినవాడు ఎంతకీ రాకపోతే, మనుషులనుపంపి వాళ్ళిద్దరికీ నచ్చచెప్పే ప్రయత్నం చేసినా, తానె వెళ్లి చెప్పినా, వినకపోతే, పితృకార్యం ఎలాగో అలా అయిందనిపించి, రాజధానికి వెళ్ళిపోయాడు. రామయమంత్రి ప్రతీకారం తీర్చాలి అని మనస్సులో సంకల్పం చేసుకొని.

ఆతర్వాత సూర్యగ్రహణం రోజున సంకల్పం చెప్పటానికి బ్రాహ్మణులేవ్వరూ రాకూడదని శాసనం చేసి, గణపతి ప్రభువుతోకలిసి కృష్ణా స్నానానికి వెళ్ళాడు. తాను సంకల్పం చెప్పుకొని స్నానం చేసి ప్రభువుకు సంకల్పం చెప్పటానికి బ్రాహ్మణుడు ఎవరూ లేనందున రాజు ను అడిగి రామయ మంత్రి తానే ఆయనకు సంకల్పం చెప్పి పుణ్య గ్రహణ స్నానం చేయించి, ఆయన అనుమతితో 7గడియలు ముద్రాధికారం పొంది, చేతిలో నీళ్ళు విడిపించుకొన్నాడు. రికార్డ్ లన్నీ పరిశీలించి బ్రాహ్మణుడికి అన్యాయం చేసిన కంసాలిని పదవినుంచి తప్పించి, ఆపదవులకు 434మంది బ్రాహ్మణులను గ్రామాలలో నియమించాడని "కొండవీటి దండకవిలె "తెలియ జేస్తోంది. అందుకే రామయమంత్రికి "కరణీకోద్ధారకుడు "అనే బిరుదు వచ్చింది. కొండవీటి చరిత్రను జయనాగ దేవ భట్టర్, బోలమరాజు కోనప్ప, అన్నమరాజు అనే ముగ్గురు "దండ కవిలె "గా శాలివాహన శకం 1250నలనామ సంవత్సరం లో రాశారు,అదే దాని చరిత్రకు ఆధారం.

కృష్ణవేణీ తీరం లో ఆ నాడు గణపతి చక్రవర్తికి, మహామాత్యుడు గోపరాజు రామయ మంత్రికి జరిగిన సంభాషణకు సంబంధించిన మూడు చాటువు ప్రచారం లో ఉన్నాయి –

"అవగత శబ్ద శాస్త్ర చయులైన, మహాత్ములు, పండితోత్తముల్ –భువనతలంబు నందధిక పూజ్యులు వారటులుండ గూటికై –నవనవ కల్పనావిది చణత్వముతోడినబద్ధమాడు నీ –కవులట,దానపాత్రులట –గౌరవమందుట జూపె చిత్రముల్ "అని చక్రవర్తి అంటే –అమాత్యుడు

"మానఘనుండు, బ్రహ్మకుల మండనమూర్తి, పరోపకారి దు-ర్దానదురాన్నముల్ గొనడు-తప్పడు స్వామి హితైక కార్యముల్ –దీనులబ్రోచు, బాంధవ విధేయుడు, డస్సియు,వేట బూనడింపూనిన భక్తితోడుత"నియోగి కోసంగిన దానమల్పమే ?"అని ఝూడించి, మళ్ళీ తగుల్కొని-

"వ్రాయుట దోషమా?, వికృతి వైదికమా?సుతదార రక్షణోపాయముకై "నియోగి "నయి, పార్థివ సేవనొనర్చునంతనే –పాయునె వంశశీలములు,బాగుగ మున్నల చిత్రగుప్తు లున్ –వ్రాయరె యెల్లలోకముల వారలు సేసిన పుణ్య పాపముల్ "అంటూ కడిగిపారేసి మూడోపద్యం లో –

"కవి కమలాసనుండు, త్రిజగత్పతియైన పినాకపాణి యుం –గవియె,తలంపగా గవులుకారె,పరాశర, బాదరాయణుల్, కవికృత పుస్తక గ్రహణ గర్వితులల్పులు పూజనొందగా-గవులట! దానపాత్రముల్ గారట !యిట్టివిపో విచిత్రముల్ "అని మళ్ళీ మాట్లాడకుండా రామయ మంత్రి చేశాడని "ద్వావింశ న్మంత్రిచరిత్ర "లో ఉన్నదట.

"గణక నిర్వాహంబు గల్పించె నూరూర మహి గోపరాజు రామ ప్రధాని "అనీ, '

"ధరగోపరాజు రామన కరణీకము లుద్దరించు కాలము దలపన్ –గిరి ఋతు గగన శశాంకులు -గరమొప్పెడు శకము నాటి కాలంబయ్యేన్ "అనీ చాటువులు చేటలతో రామయమంత్రి గొప్పతనాన్ని చాటి చెబుతున్నాయి.

రామయమంత్రి చెక్కించిన ఒక శాసనం లో

ధనధ గొపరాజ కుల
దీపకుఁ డై తగు రామమంత్రి పం
గాణుల యందు నిశ్చలత
నానిన యీ కరణీక ధర్మముల్

--

రామయమంత్రి గుంటూరుతాలూకా "తంగెళ్ల మూడి "గ్రామస్తుడు. యాజ్ఞవల్క్యనియోగి. కాశ్యప గోత్రీకుడు. ఆపస్తంభ సూత్రుడు

## 4 తరిగొప్పుల దత్తన మంత్రి

విజయనగర చక్రవర్తి వీరనరసింహరాయల ప్రధానమంత్రి తరిగొప్పుల దత్తన అని "చంద్రభాను చరిత్ర "లో ఉంది

"దత్తనమంత్రి మహా విపక్ష దుర్మద బల మర్మదాభరణ –దురంధర సంగర చాతురీ విశారాదుడగు వెంకట క్షితి పురందరునప్రతిమాన రాజ్య సంపదలు భరింపనాకు లిడు భ వ్యగతి శ్రితపారిజాతమై ".వీరనరసింహుడు 1586నుంచి 1614వరకు పాలించాడు. కనుకదత్తన 16వ శతాబ్దివాడు. వసుచరిత్ర అంకితం తీసుకొన్న తిరుమలరాయల నాలుగవ కుమారుడే వేంకటపతి రాయలు. అలియ రామరాయల సోదరుడు తిరుమలరాయుడు. తళ్ళికోట యుద్ధం లో రామరాయలు చనిపోయాక, తిరుమలరాయడు సదాశివరాయలకు ముఖ్యమంత్రి గా ఉండి,1570లో సదాశివరాయలమరణం తర్వాత రాజ్యం ఆక్రమించి మూడేళ్ళు పాలించగా రెండవకొడుకు శ్రీరంగరాయలు 1574నుంచిరాజ్యానికి వచ్చాడు.

తళ్ళికోట యుద్ధం తర్వాత తురుష్కదండయాత్ర వలనవిజయనగరం భస్మంకాగా తిరుమలరాయలు రాజధానిని పెనుగొండకు మార్చాడు. ఇతనితర్వాత శ్రీరంగరాయలు ఆతర్వాత వేంకటపతిరాయలు రాజ్యం చేశారు. రంగరాయల కాలం లో బీజాపూర్ నవాబులు పెనుగొండను లాక్కోటం వలన చంద్రగిరి రాజధాని చేసుకొన్నాడు. వెంకటపతిరాజ్యానికి వచ్చేనాటికి చంద్రగిరి రాజధాని. "రామరాజీయ గద్యం "లో –"తనకు వేలూరు వరరాజధాని గాగ –వీర వెంకటరాయ విభుడు మిగుల ధరణి బాలించే ధర్మతత్పరత జెలగి "అని ఉండటం వలన రాజధాని వేలూరుకు మారి "రాయల వేలూరు "అయింది.

తిరుమల రాయడు తాను బ్రతికి ఉండగానే కొడుకులతో కొన్ని ప్రదేశాలలో పాలన చేయించినట్లు, తానూ విద్యా వినోదగోష్టితోకాలక్షేపం చేసినట్లు "శృతి రంజని "పద్య చరణం –"నమదరి నృపమౌళిస్తోమ నీరాజితాన్ఘ్రి "వలన తెలుస్తోంది. "బుధు లెన్నవలయు రాజాధిరాజ –రాజపరమేశ సకల కర్ణాటకాంధ్ర –రాజ ధౌరేయ తిరుమలరాయ తనయ –చంద్రుడగు వేంకటపతి క్షితీంద్ర మణికి "

ఇంతటి ప్రతాప శౌర్య ధైర్యశాలి వేంకటపతి రాయలు ముఖ్య సచివుడై తరిగొప్పుల వంశం నాగమ్మ మల్లన దంపతులకు నరసయామాత్యుడు పుట్టాడు. అసామాన్య యశో విభూషితుడై,ఆశ్రిత బాంధవుడై, అనంత పద భక్తుడుగా విరాజిల్లాడు. భార్య తిప్పాంబ మహాపతివ్రత. అన్నదానం, పరిచార్యలలలో పేరు పొందింది. వారిది అన్యోన్య దాంపత్యం. వీరికి అప్పన దత్తన మల్లన కొడుకులు అని చంద్రభాను చరిత్ర చెబుతోంది. అప్పన నిరతాన్న దాననిది. లోకబంధుడు. ఇతని తమ్ముడే దత్తనామాత్యుడు

"పటు కార్యదక్షుడు ".రాజు ఈ క్రిందివిధంగా అతడినిపొగడినట్లు "చారు చంద్రోదయం "లో ఉన్నది

దత్తన మంత్రి మధ్వమతాను చరుడు. స్వతంత్ర కౌశిక గోత్రుడు. సత్తెనపల్లి తాలూకా "రాజనాపుర "వాస్తవ్యుడు. ఆర్వేల నియోగి మధ్వుడు.ఈ వంశీకులు విజయనగర సామ్రాజ్యం లో తిరువనతపురం మైసూర్ లలో కూడా ఉన్నారట. టిప్పుసుల్తాన్ తండ్రి హైదరాలీకి టిప్పుసుల్తాన్ కు మంత్రి పూర్ణ య్యమంత్రి ఈ శాఖవాడే.

## 5 రాయసము గోవింద దీక్షితులు

చెవ్వప్ప నాయకుడు తంజావూరు పాలించేటప్పుడు 1521లో తనకొడుకు అచ్యుతప్ప నాయకునికి యౌవరాజ్య పట్టాభిషేకం చేశాడు. వ్యవహార కుశాలుడవటం వలన పాలన తండ్రిదైనా అచ్యుతప్ప రాజకీయవ్యవహారాలన్నీ చూసి "మహామండలేశ్వర "బిరుదుపొందాడు.ఇతనికాలం నుంచే,తంజావూరు రాజులు విజయనగర రాజులకు సామంతులుగా ఉండటం ప్రారంభమైంది. ఏడాదికి 40లక్షలకప్పం చెల్లిస్తూ, యుద్ధం వస్తే తోడ్పడేవారు. ఇతనికాలం లోనే విజయనగరాన్ని తిరుమల, శ్రీరంగ, వేంకటపతి రాయలు పాలించారు. తుళువ సదాశివరాయలతర్వాత పాలన ఆరవీటి వారిదే. అచ్యుతప్ప పేరుకు సామంతుడేకాని యదార్ధానికి చాలా స్వతంత్రంగా ఉండేవాడు. కానీ 1584లో మళ్ళీసొంతుడిగాఉంటూ విధేయడయ్యాడు. "సంగీత సుధ" పీఠికలో, "అప్రతీపః కౌమార ఏవాభ్రుత రాజ్యభారః –నిర్జిత్య సామంత నృపవర్గం –మహీ మహేంద్రః –లక్ష్మాశ్చసర్వాన్యపి మండపాని –దివ్యాని రత్నాభరణాని "అనీ, రామేశ్వరాది తీర్ధాలలో కొత్త రాజగోపురనిర్మాణం చేశాడని, రామసేతువు లో లక్షలద్విజులకు అన్న సంతర్పణ చేశాడని ఉంది. రాజచూడామణి దీక్షితులురాసిన "రుక్మిణీ పరిణయ "కావ్యం లో "మాయూర. మధ్యార్జున కుంభ ఘోణ-శ్రీ చంపకారణ్య ముఖ స్థలేషు-మహత్తరం" మండప " మాతతాన భక్త్యా మహత్యాపర మచ్యుతేంద్రః "అని అచ్యుతప్పనాకకుని యశో విశేషాలు ఉన్నాయి.

అచ్యుతనాయకుని సచివుడు గోవింద దీక్షితుడుమహామంత్రజ్ఞుడు, మహాకవి, గాయకాగ్రేసరుడు, మహాయజ్వ. అప్పయ దీక్షితులతో మీమాంస చర్చచేసిన పండితాఖండలుడు. మీమాంస శాస్త్రం పై స్వతంత్ర గ్రంథాలు రాసిన విద్వద్ వరేణ్యుడు. "సార్వ చిత్య, సర్వతోముఖా తిరాత్ర,సాగ్ని చిత్యాప్త, వాజపేయాది యజ్ఞాలు చేసిన కర్మిష్టి."పదవాక్యప్రమాణ పారావార పారీణ, అద్వైత విద్యాచార్య "బిరుదులుపొందినవాడు. ఈ మహామంత్రి ఆజ్ఞను శిరసావహించి రఘునాథ రాయలు సంగీత సుధ"రాస్తే, గోవింద దీక్షితులు పీఠిక రాశాడు. కనుక చెవ్వప్ప నాయకుడు బ్రతికి ఉండగానే అచ్యుతప్పకు రఘునాధరాయలు పుట్టాడని అర్ధమౌతోంది. అచ్యుతప్ప, గోవింద దీక్షితులు రఘునాధునికి విద్యాబుద్ధులు, రాజనీతి నేర్పించి వివేక శీలుని చేశారు. గోవింద దీక్షితులు చేసిన యజ్ఞాలకు కొడుకు యజ్ఞనారాయణ దీక్షితుడే అధ్వర్యుడు. ఆయజ్ఞాలలో రఘునాథ నాయకుడు గోవింద దీక్షితులకు తండ్రి ఆనతిప్రకారం ముత్యాలగొడుగు పట్టేవాడట

అచ్యుతప్పగోవింద దీక్షితుల అన్యోన్యాన్ని వర్ణించే ఒక శ్లోకం –'త్రినామాద్యంత నామానౌ –మహీక్షిద్దీక్షితా ఉభౌ –శస్త్ర శాస్త్రే చ కుశలా –వాహ వేషు హవేషు చ "అచ్యుతుడు "ఆ రబ్య బాలా దతి భక్తి శాలి "ముసలి ఆ వరకు బ్రతికి, రాజ్యాన్ని రఘునాధునికి అప్పగించి శ్రీరంగానికి వెళ్లి "ముకుంద చింతనము "తో గడిపి 1615లో మరణించాడు. –'శ్రీరంగ స్థల సంగతో బుధకులం –శీతాంశు రుర్వీమివ ప్రాప్త స్స్వష పుపోష శేష శయనే భక్తః పరే ధామని "అని సాహిత్యరత్నాకరం లో ఉంది. అచ్యుతప్ప జీ వించి ఉండగానే అతన్ని ఒప్పించి రఘునాథ రాయలను రాజ్యానికి అభిషిక్తుడిని చేశాడు గోవింద దీక్షితులు అని "సాహిత్యరత్నాకరం "లో ఉన్నది –"భాద్రాసన స్థిత విధి ప్రథితం విభూత్యా –నిత్యాగ్ని హోత్ర భావయా నిటలేమహీన్ద్రో –ఆ చంద్ర తారక అధీశ్వరతా నిధానం – గోవింద దీక్షిత గురుః కురుతేస్మ పట్టం "

రఘునాథ రాయల పట్టాభి షేకం అయినప్పతినుంచి, గోవింద దీక్షితులను అర్ద సింహాసనం ఇచ్చి గౌరవించాడు. కొంతకాలానికి గోవింద దీక్షితులు చనిపోయాడు. తన సంగీత సుధలో రఘునాధుడు గోవింద దీక్షితులను "జయంతి సేనా దిమరాగ,రామానందాది తాళాన్ రచయాన్ నవీనాన్ –సంగీత విద్వాంస ముపాది శస్వం-విపంచికావావిచాక్షణానాం"అని దీక్షితుల సంగీత ప్రతిభను కొత్తగా కనిపెట్టినరాగాలను తాళాలను స్తుతించాడు. గోవింద దీక్షితులు స్వయంగా "సంగీత శాస్త్ర నిక్షేపం "గ్రంథం రాశాడు.ఇందులో 72ప్రస్తార మేళాలను చెప్పాడు. వేంకటమఖి రాసిన"చతుర్దండి" గ్రంథంకంటే ఇది ప్రాచీనమైనది. కనకాంగి రత్నాంగి ఖరహర ప్రియ రాగాలు దీక్షితులదానిలో ఉన్నాయి. ఇవే వేంకటమఖికి ఆధారం. రఘునాధుని వీణ మెట్లక్రమాన్ని కాదని సప్తస్వరాలకు సర్వకాలాబాధితమైన మెట్లు ఉన్న "సరస్వతీ వీణ "తయారు చేసి,72మేళకర్తలను ఏర్పరచిన ప్రజ్ఞాశాలి వెంకటమఖి. జయదేవుని గీత గోవిందాన్ని అనుసరించి సంగీత సద్గురు త్యాగరాజ స్వామిపై 24అష్టపదులు రాశాడు.

చెవ్వప్ప నాయకుని కాలం నుంచే నేపాలనే జాప్నా తంజావూరికి కప్పం కట్టే సామంత రాజ్యంగా ఉండేది. అచ్యుతరాయల హితవుప్రకారం చెవ్వప్పనాయకుడు కార్యవాది యై రాజధాని తంజావూర్ చేసుకొని అది తమిళప్రాంతం లో ఉండటం చేత, ఆంధ్ర ప్రాంతం నుండి మంత్రులు దండనాధులు, పండితులు, కవిశేఖర గాయకులను నాట్యకత్తె లను తంజావూరుకు తీసుకుపోయాడు. అలా వెళ్లినవారే గోవింద దీక్షితుల వంశం కూడా.

గోవింద దీక్షితులు వశిష్ట గోత్రుడు "రాయసాన్వయ పయః పారావార రాకా సుధాకరుడు ".భార్య నాగాంబిక.ఈయన పేరుతో తంజావూరు జిల్లాలో లో గోవిందాపురం, దీక్షిత సముద్రం గ్రామాలేర్పడ్డాయి. గుంటూరు ప్రాంతం నుంచే ఈయనవంశం వారు అక్కడికి వెళ్ళారు. అచ్యుతప్ప కావేరి నదికి ఆనకట్ట కట్టి ఎన్నో ధర్మకార్యాలు చేసి, 1577లో మధ్వ స్వామి విజయేంద్ర తీర్ధులకు ఒకగ్రామం దానం చేశాడు. కోటలోని "లక్ష్మీ విలాస భవనం "లో మంత్రాంగం నిర్వహించేవాడు. ఈ సభలో రఘునాధునికి దీక్షితమంత్రి శత్రు సంహారం కోసం ఒక్కొక్కరిని తాకమని అంటే ఒక్కొక్కరినే ఎదుర్కొని చంపమని సలహా ఇచ్చేవాడని సాహిత్య రత్నాకరం లో ఉంది. ఇలా చేస్తేశాత్రువుల ఐక్యతకు అవకాశం ఉండదని భావం.

రఘునాధరాయలు దిగ్విజయ యాత్రలకు వెళ్ళే టప్పుడు రాజ్యభారం అంతా దీక్షితుల పైన వేసి వెళ్ళేవాడని అంతటినమ్మకం ఉండేదని సాహిత్యరత్నాకరం లో ఉంది –""ధరాధురం నిజ సచివే నివేశ్యచ –సరోహితా త్సదసి సరోష మీక్షణా –దనీకినీమధసమనీ నహత క్షణాత్ "గోవింద దీక్షితులకొడుకులు యజ్ఞనారాయణ దీక్షితులు, వెంకటేశ్వర దీక్షితులు, లింగాధ్వరి. లింగాధ్వరి వేదార్ధ తత్వ నిర్ణయం, శివసహస్రనామ భాష్యం రాశాడు. నారాయణ దీక్షితులు "సాగ్నిచిత్సర్వ క్రతుయాజి. రఘునాధరాయల చరితం, సాహిత్యరత్నాకరం రఘునాథ భూప విజయం రఘునాథ విలాస నాటకం రాశాడు. ఇతడు రఘునాధుని

శిష్యుడే. కావ్యనాటకాలంకార సాహిత్యాలను ప్రభువు వద్దే నేర్చాడు. వెంకటేశ్వర దీక్షితులు వాజపేయయాజి. సాహిత్య మీమాంస, కర్మాంత వార్తిక, వార్తికాభారణ చతుర్దండి ప్రకాశిక మొదలైనవి రాశాడు. మహాకవి వల్లభుడైన నీలకంఠ దీక్షితునికి గురువుకూడా. ఇలా గోవింద, దీక్షితుల వంశంవారు ఆంధ్రదేశం గుంటూరు సీమనుంది తమిళదేశం తజావూరు సీమకు తరలివెళ్లి అక్కడ సాహిత్య సంగీత, వేదవేదాంగ, క్రతువిదులలోనూ మంత్రాంగం లోను కీర్తి ప్రతి స్టులై, అందరూ మహానుభావులే అనిపించుకొన్నారు.

## 6 పసుదోవ పంపన భట్టు

క్రీ శ 902లో వేంగిగిరాజ్యం లో పరాశర గోత్రుడు, ఆర్వేల నియోగి, వేద,వేదంగ, మీమాంస శాస్త్ర పారంగతుడు పసుదోవ గ్రామంలో పంపనభట్టు జన్మించాడు. వాఙ్మయ మహోదధిలో ఈదులాడినవాడు. షట్కర్మ నిరతుడు. తండ్రి కేశవ శర్మ సర్వ శాస్త్ర తత్వ విదుడు.తాత పంపన బ్రహ్మ తుల్యుడు. లక్ష్మీశ్వరం అనే పేరున్న "పులిగెరె"పట్నం రాజధానిగా పాలించిన చాళుక్యరాజు 'అరి కేసరి "కి ప్రధానామత్యుడుగా ఉన్నాడు.. తండ్రి వైదికమతం వదిలి జైనమతం తీసుకొన్నాడు.

భువనైకమల్లుడు అనే పేరుతోవీర విజయాదిత్యుని సమకాలికుడు ఇమ్మడి సోమేశ్వరుడు, కర్నాటక రాజ్యాన్ని ఎనిమిదేళ్ళు పాలించాడు. తమ్ముడు విక్రమాదిత్యునితో వచ్చిన వైరం వలన పదవి కోల్పోయి కారాగారం లో బందీ అయ్యాడు. ఇతని చివరిరోజులూ దీనం గానే గడిచాయి. కానీ ముసలితనం లో అంటిరాజ్యానికి వచ్చిన 12ఏళ్ళకు కొడుకుపుట్టాడు. యితడు బతకడు అని కార్తాంతికులు చెప్పగా, ఆరోగ్యంగా జీవించాలని "మావిం డేరు","కృందిడి"అనే రెండు అగ్రహారాలను పసుదోవ వాస్తవ్యుడు పంపన భట్ట మహామంత్రికి దానంగా ఇచ్చాడు. కాని విధివైపరీత్యం వలన ఆకుర్రాడు బతికి బట్టకట్టలేదు. చివరికి హతాసుడై సంతాన రహితుడుగా 1076లో చనిపోయాడు. ఇతనితో వేంగీ రాజ్యం లో చాళుక్యరాజ వంశం అంతమైంది. నిజానికి విజయాదిత్యుడే చివరి సత్యాశ్రయ కులజుడు. ఇతడు మరణించిన సమయం లోనే కర్నాటకం లో భువనైకమల్ల సోమేశ్వరుడు పదవిపోగొట్టుకొని దుర్మరణం చెందాడు. ఈవిషయాలను "ర్యాలి "శాసన కర్త "ముత్తయభట్టు " విపులంగా వివరించాడు.

క్రీశ 941లో పంపనభట్టు మొదటి జైన తీర్థంకరుల చరిత్ర "ఆదిపురాణం "రాయటమే కాక "విక్రమార్క విజయం "అనే" పంప భారతం "రాశాడు. తండ్రికేశవ శర్మ వేంగిని వదలి కర్నాటక చేరాడు. వేముల వాడ చాళుక్యులలో గొప్పయోదుడైన ఇమ్మడి నరసింహుని ఆధిపత్యం లోనే ముమ్మడి ఇంద్ర వల్లభుడి యుద్ధాలన్నీ జరిగాయి. లాట, మాళవ, ఘూర్జర, ప్రతీహారులను ఓడించి విజయాలు సాధించటం ఇమ్మడి నరసింహుని సైన్య వ్యూహం వలననే. ఇంతగొప్ప చమూపతి ఆ శతాబ్దం లోభారత దేశం లో లేడు అంటారు. ఇతడి కొడుకే ఇమ్మడి అరికేసరి 930లో మండలానికి అధిపతి అయ్యాడు. ఇతడు రాష్ట్ర కూట రాజు ముమ్మడి ఇంద్రవల్లభునికి మేనల్లుడు. ఇంద్ర భూపతి తనకుమార్తె"రేవక "నుమేనల్లుడు అరికేసరి కిచ్చి పెళ్లి చేసి మామగారుకూడా అయ్యాడు. బద్దగని ముమ్మనుమడైన అరికేసరి నాల్గవ గోవింద రాజు సమకాలికుడు.

అరికేసరి ముఖ్యమంత్రి మన పంపన భట్టు. వేంగిగిమండలం లోని కమ్మనాడులో ఉన్న వేంగిపర్రు గ్రామస్తుడు. మహామంత్రి పంపకవి కంటే పెద్దవాడు, సమకాలికుడు పొన్నకవి శాంతిపురాణ,, భువనైక రామాభ్యుదయ కావ్య కర్త. కమ్మనాడులోని పుంగనూరులో నాగమయ్య అనే బ్రాహ్మణుడికి మల్లపయ్య, పొన్నమయ్య కొడుకులు. శాంతిపురాణం రాశాడు. ముమ్మడి కృష్ణభూపతికి "భువనైక రామాభ్యుదయం "అంకితమిచ్చిన పొన్నకవి"ఉభయకవి చక్రవర్తి"బిరుదాంకితుడు. ఉత్తర ఆర్కాడులో వాణియంబాడి వాస్తవ్యుడు. మల్లపయ్య, పొన్నమయ్య మొదలైనవారు పొన్నకవివంటి వారికి ఆశ్రయమిచ్చి కన్నడ కావ్యరచనకు ప్రోత్సహించారు. అప్పుడు మన తెలుగు రచనలకు ప్రోత్సహించినవారు లేరు. చాళుక్యులే తెలుగు దేశికవితను ప్రోత్సహించారని నన్ని చోడుని కమార సంభవ పద్యం –"మును మార్గ కవిత లోకం-బున వెలయగ, దేశికవిత బుట్టించి తెనుం –గు నిలిపి రంధ్రవిషయం –బున జన చాళుక్యరాజు మొదలగు బలువుర్ "వలన తెలుస్తోంది. గుణగుని పూర్వీకులైన పూర్వ చాళుక్యులలో ఒకరు తెలుగు దేశికవిత్వం పుట్టించాడని భావించాలి.

ఇమ్మడి నరసింహుడు 914నుంచి 930వరకురాష్ట్రకూటరాజు ముమ్మడి ఇంద్రునికి సామంతుడు. ఇతడికొడుకు అరికేసరి. అరికేసరి ప్రధానమంత్రి పంపన భట్టు. ఇదీ వరస.

## 7 వాణస కందన మంత్రి

ఓరుగల్లు దగ్గర రామగిరి దుర్గాదీశుడు ముప్ప ధరణీపతి మహామాత్యుడు వాణస కందన మంత్రి. ఈయనకు ఆశ్రితుడు మడికి సింగన బహు గ్రంథ కర్త. సింగన కందనమంత్రిపేర"నీతి తారావళి "రాసినట్లు ఉందికాని అలభ్యం. సింగన పద్మపురాణం లో "మంత్రం రక్షణ కళాచాతుర్య, సాహిత్య గీత రసాస్వాదన లోకమానస సదా ధర్మజ్ఞ శ్రీ ముప్పిడీశ్వర కారుణ్య కటాక్ష వర్ధిత మహా సౌభాగ్య భాగ్యోదయా "అన్నాడు కందనమంత్రి తాతలు కాకతి గణపతి సామంతులుగా గణపేశ్వరం మొదలైన చోట్ల దేవాలయ ప్రతిష్ట చేసినట్లున్నది. మడికి సింగన తిక్కనగారి కొడుకు కొమ్మనకు దౌహిత్రుడైన అయ్యలమంత్రికొడుకు. ఇతడు అనవోత రెడ్డికిమంత్రి. అందుకే సింగనకు రాజనీతిబాగా అలవడింది. విద్యానగర కంప తాజు సింగన కాలం వాడు. మనుమంచి భట్టు ఏలిక కంపరాజు. భట్టు "శాలిహోత్ర "అనే అశ్వ శాస్త్రం ను "హయలక్షణ సారం "గా ఇతడు తెలుగు చేశాడు. ఇది చాళుక్య కంపభూపతికి అంకితం.

గోదావరి నది దక్షిణ తీరం లోని "పబ్బినాటి రాష్ట్రాన్ని రామగిరి రాజధానిగా ముప్పభూపాలుడు పాలించాడు. ఈయనకు "సకల సామ్రాజ్యభార ధురంధరుడు, ధర్మ చరితుడు, నీతి చాతుర్య వివేక విశేష సర్వ లక్షణ లక్షితుడు, ఛత్ర చామర ఆందోళికాదిరాజ చిహ్నాలతో అలరారే కాశ్యపగోత్రుడైన కందన మహామాత్యుడై వర్ధిల్లాడు ఇతని ముత్తాత తండ్రి "నన్నయ "గణపతి దేవుని మంత్రి. ఈనన్నయ దాన రాధేయుడు, మాన్యుడు. ఇతనికొడుకు మల్లన "మొలగూరు "లో

రామేశ్వరాయ మొదలైన విగ్రహ ప్రతిష్ట చేశాడు. "చంద్ర చంద్రికాకాశసమాన మూర్తియగు గౌరమ మల్లన మంత్రి –దిక్కులన్ వాసికి నెక్కి భక్తిని నవావారణమై గుడికట్ట రామేశు బ్రతిస్ట జేసి నుతికెక్కెననన్మోలగూరి వాకిటన్ "

కందనమంత్రి పెద్దన్న కేసన మంత్రి ముప్పభూపాలుని మంత్రిగా ఉండి ధర్మకార్యాలతో ప్రసిద్ధి పొందాడు. 1430లో రాసిన" సకలనీతిసారం "దైవాంకితమే అయినా సింగన -అయ్యలమంత్రి సింగ మాంబకు పుత్రుడని తెలుస్తోంది. ఇంతకీ అయ్యలమంత్రి ఎవరు ?ఆత్రేయ గోత్రుడు పవిత్ర చరిత్రుడు పేరయమంత్రి కూతురు సింగ మాంబ ను పెళ్ళాడి, రాజమహేం ద్రపురాదినేత అయిన తొయ్యేటి అనపోతన మంత్రి యై, గౌతమికి ఉత్తరాన "పెద్దమణికి అగ్రహారం "లో ఆరామ క్షేత్రాదులు కట్టించి అన్నదాత బిరుదుపొందిన అల్లాడ మంత్రి కొడుకు. ఈ అయ్యలమంత్రికొడుకులు సింగన, అనంతయ్య, అబ్బయ, నారయ్యలు. ఇందులో సింగన కు ముప్పభూపాలుడు రామగిరి సీమలో అనేక గ్రామాలను దానం చేశాడు. సింగనకు సంగీతనాచార్యుడు తాళ్ళపాక తిరుమలయ్య గురువు అద్దంకి సీమవాడు "పరవాడి భద్రవారణ "బిరుదున్నవాడు.

ముప్పరాజు తెలుగురాయడు రాజ్యం చేసేకాలం లో కందనమంత్రిగా ఉన్నాడు. ముప్పడు మంత్రక్షణ కళా చాతుర్యుడు సాహిత్య గీత రసాస్వాదన పరుడు అని సింగన పద్మపురాణం లో రాశాడు. కృష్ణానది దక్షిణ తీరం లోగుంటూరు జిల్లా మంగళగిరి దగ్గర "రావెల "అగ్రహారం ఏలుతూ అక్కడ గోపీనాథ ఆలయం నిర్మించిన అల్లాడ మంత్రి ముని మనవడే మన కందన మంత్రి. కనుక రావెల వాస్తవ్యుడు.

## 8 చుండి కాళయా మాత్యుడు

16 వ శతాబ్దికి చెందిన చుండి కాళయామాత్యుడుఆర్వేల నియోగి ఆపస్తంభ సూత్రుడు, కౌశిక గోత్రీకుడు చుండి రాజ్య ప్రధానమంత్రి. శివపూజా రతుడు. తల్లి సోమాంబ. తండ్రి రామమంత్రి.

కాళయామాత్యుడు అదీంద్ర ధైర్యుడు, స్వామి ద్రోహర గండ నవ సమీరబలుడు, రుద్రాక్ష భూతిభూషణ ముద్రాంకు డు. దుస్సహగ దూరుడు,నభ స్సింధు సమాన కీర్తి భరితాంకుడు,నిస్సీమ భూప్రదాత,అఖిల విద్యాపతి, విస్సాంబాపతి,శౌర్య ధనుడు, రాదేయ సమాన దానపరుడు, బంధుప్రియుడు ఇతని ఆజ్ఞాప్తి సామంత సీమంతినుల కొప్పువిరులకు వేసవి గాలి అని ఇతని బంధువు పెదపాటి ఎర్రన రాసిన "మల్హణ చరిత్ర "లో వర్ణింపబడింది. ఇతడు నేపాల, కురు, నిషధ, అంగ, వంగ, గౌళ, గాంధార, మగధ,కొంకణ, విదేహ నృప మహాస్థాన కవి. మల్హణ చరిత్ర అంకితం పుచ్చుకున్నవాడు. ఇతనికీర్తి శైలేంద్ర కన్యాదీశ కంఠ హాలహలాంకంబు కప్పేస్తుంది. ఇతని కీర్తి దిగంతాలకు వ్యాపించగా, తనమనోహర మూర్తి మానినీ జనములను మరులు గొల్పింది.ఇతడు సుకవి ఫణిత వర గుణమణి గణాభరణ శాలి. విస్సాంబను ఉద్వాహం చేసుకొన్నాడు. అతనిది విభీషణుడి పట్టు. రాష్ట్రాలకు శ్రీరామ రక్ష.ఆజ్ఞ సుగ్రీవాజ్ఞ."రామయ కాళుడు అనంత యశుడు".

పండితా రాధ్య చరిత్ర నుండి విషయంతీసుకొని, మల్హణ కథ ప్రధానంగా, శ్వేతుని వృత్తాంతం ప్రాసంగికం గా పెదపాటి ఎర్రనకవి "మల్హణ చరిత్రను "శృంగార రసాభ్యుదయంగా రచించి మనకు కాళయ మంత్రి ప్రతిభా విశేషాలు అందించాడు.

## 9 ఓరూరు అనంతయ్యమంత్రి

14వ శతాబ్దికి చెందినా ఓరూరు అనంతయ్యమంత్రిదక్షిణ దేశం లోని దండకారణ్యం దగ్గర దేవరకొండకు సమీపం లో ఓరూరుఅనే పల్లెలో నందవరీక నియోగి బ్రాహ్మణ కుటుంబం లో పుట్టాడు. తండ్రి "డాకరాజు".భార్య మేళాంబ.చౌదేశ్వరీ దేవి అనుగ్రహంతో వీరికి చిక్కప్ప పుట్టాడు. పుట్టిన కొద్దికాలానికే తండ్రి మరణం. అయిదేళ్ళ కొడుకును తీసుకొని తల్లి ఊరూరూ తిరుగుతూ చివరికి బుక్కరాయలు పాలించే విజయనగరం చేరింది. వేపుపైఉన్న కొడుకున్ చక్రతెర్థందగ్గరున్న కోదండ రామాలయం దగ్గర దింపి భిక్ష కోసం ఊళ్లోకి వెళ్ళింది.నిద్ర పోతున్న ఆకుర్రాడికి ఒక ఘటసర్పం పిల్లాడికి ఎండ సోకకుండా పడగా విప్పిగొడుగులా నిలిచింది. అటుగావచ్చిన ఒకపాములాడికి ఇది గొప్ప వింతనిపించి ఈ బాలుడు దశ ఉన్నవాడైతే నేనిప్పుడు నాగస్వరం ఊడితే అనాగుపాము మళ్ళీ రావాలి అనుకొనిఊదగా,ప్రక్కనే ఉన్న పుట్టలోని ఆనాగం మళ్ళీ వచ్చి బాలుడి శిరసుపై పాడగా నీడ పట్టి రెండు గంటలు ఆడి. వెళ్ళిపోయింది.మళ్ళీ అవాక్కైన ఆ "నాగాభోగి "అంటే పాములాడు ఆపిల్లాడిని లేపి హత్తుకొని విషయం చెప్పి, "నీకు అదృష్టం కలిసివస్తే నాకేమిస్తావు ?"అనిఅడిగితే'నాకే మహర్దశ ప్రాప్తిస్తే కొన్ని చెరువులు నగరాలు నీపేర నిర్మిస్తాను "అని చెప్పాడు. మళ్ళీ కుర్రాడిని ముద్దాడి వాడు వెళ్ళిపోయాడు భిక్షాటనకు వెళ్ళిన తల్లి మేళమ్మతిరిగివచ్చింది. కొడుకువల్లన అంతా తెలుసుకొని అబ్బురపడింది తల్లి.

రోజు తానూ అతడిని వదిలి వేడుతున్నదుకు బాధపడుతూ అన్నిమాటలు చెప్పి వెళ్ళేది అతడుకూడా తల్లికి తలవంపు వచ్చే పనులు చేయనని తల్లికి తప్పక సంతోషం కలిగిస్తానని తమక్కాలు కలకాలం ఉండవని చెప్పేవాడు. బుక్కరయలమంత్రి నారాయణ దగ్గరకు ఒకరోజు ఆమె వెళ్లి తన దీనగాద విన్నవించగా అతడు దయాళువై వారిద్దర్నీ తనింట్లో ఉంచుకున్నాడు. చిక్కన్నకు ఉపనయనం చేసి చదువు చెప్పించి, తీర్చిదిద్ది రాజసభకు తనతో తీసుకెళ్ళేవాడు. ఒకరోజు అర్ధరాత్రి ఢిల్లీపాదుషా నుంచి ఒకఫర్మానావస్తే, దాన్ని చదివి చెప్పటానికి సమాధానం రాయటానికి లేఖకుడేవరూ దొరక్కపోతే భటులు వెతుకుతుంటే చావడి అరుగే తలగాడా గా నిద్రపోతున్న చిక్కన్న కనిపించగా, లేపి రాజ భవనం లోకి తీసుకెళ్ళారు. చిక్కన్న దాని చక్కగా చదివి వివరించి సంతోషం కలిగించి, ఇంటికి వెళ్ళాడు.

మార్నాడు బుక్కరాయల సభలో పాదుషా లేఖకు సమాధానం రాయమని వ్రాయస గాండ్లకు చెబితే అందులోని పదబంధం తమకు అర్థంకావటం లేదుకనుక సమాధానం రాయటానికి అశక్తులం అన్నారు. లేఖ కనబడక పోవటంతో చిక్కన్నను మళ్ళీ పిలిపించి ఆలేఖకు కాపీ రాయమని కోరాడు. రాత్రి తాను చదివిన విషయాలన్నీ గుర్తు ఉండటంతో అలాగే లేఖ కాపీరాసి ఇచ్చి వెళ్ళిపోయాడు. రాజు అంతఃపురం వెళ్ళే దూలం నేర్రెలో ఉన్న పాదుషాఉత్తరం చూసి, చిక్కన్న రాసిన దానితో పోల్చి చూసి, అతడి బుద్ధి విశేషాలకు ఆశ్చర్యపడి, తానూ కొలువున్న సభకు సగౌరవంగా ఆహ్వానించి, మెచ్చుకొని "అమాత్యపదవి "తోపాటు "ఒడయరు "బిరుదు ప్రదానం చేశాడు.

మరొక సారి మంత్రులందరూ కొలువులో ఉండగా తానూ రాజకీయ కార్య మగ్నుదవటం వలన చిక్కన్నకు పూర్తీ అధికారం తోపాటు ధనాగారమూ రాజముద్రిక అప్పగించి వెళ్ళాడు.రాజాజ్ఞను శిరసావహించి నిత్యం సభకు వెడుతూ వ్యవహారాలూ చూస్తూ, రాజులేని కొరత కనపడకుండా చేస్తున్నాడు. అతని రూపయవ్వన శేముషీ వైభవానికి ముచ్చటపడిన రాణి మోహపడి అతడిని తన మందిరానికి తీసుకురమ్మని చెలికత్తెను పంపింది. కొంచెం తటపటాయియించి రాణి ఆజ్ఞ కాదంటే ఏం ప్రమాదమో అనుకోని వెళ్ళాడు. ఆమె అకస్మాత్తుగా వచ్చి అతడిని గాఢంగా హత్తుకొని ప్రేమ కురిపిస్తే "అమ్మా !నువ్వు తల్లిలాంటి దానివి.కామం పనికి రాదు. నేను బ్రహ్మ చారిణి. ఇక ఇప్పటినుంచి ఏ స్త్రీముఖమూ చూడను. బ్రహ్మ చర్యం పాటిస్తా "అని చెప్పి పాదాలకు నమస్కరించి వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు.

మర్నాటినుంచి రాజాస్థానానికి వెళ్ళలేదు. బుక్కరాయలకు ఒక లేఖ రాసి అందులో ఆయన తనపై మోపిన కార్యభారాన్ని ఆ రోజు వరకు సంతృప్తిగా నేరవేర్చగాలిగానని కాని ఒక అవాంతర పరిస్థితి ఎదురై తన స్వాస్థ్యం దెబ్బతిన్నదని, ధర్మజ్ఞుడైన రాజు వెంటనే వచ్చి, తనభారాన్ని తీసెయ్యమని ప్రాధేయపడ్డాడు. రాజు వెంటనే వచ్చి విషయం అంతా తెలుసుకొని తానూ అతడికి తగిన కన్యతో పెళ్లి చేయాలని యోచిస్తుండగా తొందరపడి చిక్కన్న బ్రహ్మ చర్య వ్రతం తీసుకున్నందుకు బాధపడి మరేదైనా వరం కోరుకోమన్నాడు చిక్కన్న "ప్రభూ !మీ ధనాగారం లోని ధనం అంతా నాకు ఇచ్చెయ్యండి "అనికోరగా అంతా ఇచ్చేసి పంపించాడు.

చిక్కప్ప సంతోషం తో పెనుగొండవైపు ఉత్తర దిశలో ప్రవహించే ఏటి ఒడ్డున ఒక తటాకం నిర్మించి, దీనికి ఉత్తరాన ఒకగ్రామం ఏర్పాటు చేసి పాములవాడికి తానిచ్చిన మాట నిలబెట్టుకొని దానికి "నాగ సముద్రం "పేరుపెట్టాడు. దీనితో ఆగకుండా అగస్త్యాశ్రమం దగ్గర గాట్లను చీల్చుకొని ప్రావహించే పెన్నేటి కి అడ్డకట్ట కట్టించి, ఒక చెరువు త్రవ్వించే పనిలో పొద్దునా సాయంత్రం వచ్చి చూస్తూన్న అతని కార్య దీక్షకు ముచ్చటపడి ఒక జవ్వని అక్కడ ప్రవాహ వేగామాపటం ఎవరి తరం కాదని కనుక వ్యర్ధ ప్రయత్నం మానుకోమని చిత్రావతి నది ఒడ్డున తటాకం నిర్మిస్తే భేషుగ్గా ఉంటుందని చెప్పి అదృశ్యమైంది. మర్నాడు అతనికి ఆమె చెప్పినమాటలు యదార్ధమే అనిపించి అక్కడవదిలేసి, గార్గాశ్రమ భూమిగా పేరొందిన చోట దేవరకొండదగ్గర చదునైన ప్రదేశం లో మహావేగంగా ప్రవహించే 'పాండునది"ని చూసి, తగిన ప్రదేశం అని నిర్ణ్నయించి అక్కడ ఒక చెరువు నిర్మించి, దానికి తూర్పు పడమరలలో రెండు తూములు అంటే అలుగులు ఏర్పరచి, రెండు వైపులా గ్రామాలు ఏర్పాటు చేసి తూర్పువైపు దానికి రాజుపేర "బుక్కరాయ సముద్రం "అనీ, పడమటి వైపుదానికి రాణి అనంతాంబ పేర "అనంత సాగరం "అనీ పేర్లు పెట్టాడు.

చిక్కనామాత్యుడు అనంత సాగరం దగ్గర కృష్ణగిరిలో దేవాలయం కట్టించి ప్రాణలింగాన్ని ప్రతిష్టింధి 1364లో ఒక శిలాశాసనం వేయించాడు. మరొక సారి నల్లగుట్ట లమధ్య ప్రవహించే చిత్రావతి నదిని చూసి దానిదగ్గర కరకట్ట పోయించి ఆ నీరు నిలవ ఉంచితే సాగుకు త్రాగటానికి పుష్కలంగా నీరు లభిస్తుందని భావించి వేలాది మంది కూలివాళ్ళను, వడ్డెర వాళ్ళను పిలిపించి తటాకం నిర్మించి ఒడ్డున శ్రీ చౌడేశ్వరి దేవాలయం, వినాయక దేవాలయం కట్టించి, అక్కడే కొన్నేళ్ళు ఉండి సంతృప్తిగా ప్రాణాలు వదిలేశాడు. స్వార్ధం, స్వాభిమానం లేని, శుద్ధమనస్కుడు, పరోపకారి, ఔదార్య ఘనుడు చిక్కనామాత్యుడు ధన్యజీవి.

## 10 నండూరు కొమ్మనమంత్రి

తూర్పు చాళుక్యులతర్వాత వేంగి దేశాన్ని వెలనాటి చోడులు 1016నుంచి 1161వరకుపాలించారు. వీరిశాసనాలలో పిఠాపుర శాసనం ముఖ్యమైనది. వీళ్ళను ధర్మరాజు సేవకుడైన ఇంద్ర సేనుడు దగ్గరనుంచి అందర్నీ శూద్రరాజులుగా భావించారు. వీరిది మధ్య ప్రదేశ్ లోని కీర్తిపురం. మల్లవర్మ తెగలో 5వ వాడు మొదటిమల్లవర్మ "షట్సహస్ర దేశాన్ని జయించి ధనదపురం రాజధానిగా పాలించాడు. ఇతడు త్రిలోచనపల్లవుని సాయంతో దేశం పై హక్కు పొందాడు. తూర్పు చాళుక్యులను అనుసరించే వీరిలోఇతడే చివరివాడు అని డా.హల్ట్ చెప్పాడు. యితడు త్రినేత్ర పల్లవుడితో యుద్ధం చేస్సినట్లు శాసనాలున్నాయి. ఇతనిపూర్వులు 9వ శతాబ్దిలో వెలనాడును స్వతంత్రంగా పాలించారు. ఈ రెండుతెగలవారు వెలనాటిపల్లవుల అభిమానం పొందారు. కేయూరబాహు చరిత్రలో ఈ విషయముంది.

వెలనాటి మహా మండలేశ్వరుడు కొంక భూపతి 1139 నుంచి 1191 వరకు సనదుప్రోలు రాజధానిగా రాజ్యమేలాడు. సుమారు 195 ఏళ్ళు ఈ వంశజులు పాలించారు. గుంటూరుజిల్లా చందవోలు లేక చందోలు కే ధనదపురం అని పేరు. "నిఖిల విభ వనములకు నెలవగుచు వెలయు –ధనదుపురము న కెనయు ధనదుపురం "అని కీర్తి పొందింది. వెలనాటి దుర్జయ ఆస్థానం లో "కార్యఖడ్గప్రవీణుడు, అసమాన తేజస్సంపన్నుడు కొమ్మన మంత్రిగా ఉన్నాడు. కొంకరాజు పాలనలో చివర రోజులలో పాకనాడు జయించి స్వాధీనం చేసుకొన్నాడని బాపట్ల భావనారాయ స్వామి దేవాలయం లో 1190-91 శాసనం లో ఉన్నది –"రమణీయ ధనదుపుర వర –మమరనిజరాజధానియై యుండ, గనక –రము నెల్లూరు లోపుగ-గ్రమమొనరగ నేలె బాహుగర్వమువెలయన్ ".కొంకభూపతి ఈ చందోలు రాజధానిగా ముఖలింగం నుంచి సింహపురి అంటే నెల్లూరు వరకు ఏలుబడి చేశాడు. "ఏక వింశతి సహస్ర గ్రామ సంఖ్యాకమై –ధరనణి నేర్చిన "పాకనాడు "నిజ దోర్దండైకలగ్నంబుగా –ధర బాలించె "నమాత్యకొమ్మన "జగ –త్ప్రఖ్యాత చారిత్రుడై ".ఇతడి కొడుకు రాజేంద్ర చోడుడి ఆజ్ఞతో కొమ్మనమంత్రి పాకనాడు ఏక వింశతి

సహస్ర గ్రామాలు జయించాడు. కులోత్తుంగ చోళుని పాలనలోకూడా వేంగి పై కల్యాణి, కటకం సామంతరాజులు దండెత్తారుకాని సనదుప్రోలు కటక దండ నాధుల సహాయంతో పెద్ద సైన్యంతో కొమ్మన మంత్రి మన్నేరు, కొత్త చెరల ప్రాంతాలలో పోరాడి రాజుకు జయం చేకూర్చినట్లు మంచన రాసిన "కేయూరబాహు చరిత్ర "లో కనిపిస్తుంది –"మావతుల తలలు తలపుడికి వేసి మావంతు తలలు, శత్రురాజశిరములు ద్రొక్కించు రాగే దిరుగవాగే నుబ్బేడు తన వారువంబు చేత -మహిత శౌర్యండుకొమ్మనా మాత్య వరుడు "అని అతని గుర్రం, ఆయన చేసిన సాహసం వర్ణించాడు. కొత్త చర్లయుద్ధం లో కొమ్మనమంత్రి వీర విక్రమ పరాక్రమ దీశక్తులు అనుపమానం అని అర్ధం., యుద్ధమే వృత్తిగా,శస్త్ర విద్యా గర్వితులైనవారు చేసే యుద్ధాన్ని "విద్యాంకం "అంటారని"అభిలషి తార్ధ చింతామణి "లో సర్వజ్ఞ సోమేశ్వరుడు చెప్పాడు.కనుక కొమ్మన మంత్రి "విద్యాంక బిరుదుకు సర్వవిధాలా అర్హుడే. పాకనాటికి వాయవ్యంలో ఉన్నదుర్గమే కొత్త చర్ల.

11వ శతాబ్దం నాటికి తెలుగు దేశంలో దేశ భాగాలకు "విషయం" అనీ" నాడు" అనీ "రాష్ట్రం" అనీ సమానార్ధాలుగా వాడేవారు. 14,15శతాబ్దాలకు రాష్ట్రం అంటే నాడు, విషయం లకంటే పెద్ద భూభాగం అనే అర్ధం ఏర్పడింది.. "తుంగభద్రా తరంగిణ్యాః ప్రాగ్దేశం వెలనాడితి"అంటే తుంగభద్రానదికి తూర్పున ఉన్నది వెలనాడు అని అర్ధం. దీనికే "ఆరువేల దేశం " అనే పేరు. నాల్గవ విష్ణువర్ధన మహారాజుకాలంలో 12వేలగ్రామాలుగా వేగినాడు ఉన్నది. తర్వాత ఆరువేల మూడువందల దేశంగా ఉండేది. మొదటి కులోత్తుంగుని కాలం లో 16వేలగ్రామాల దేశంగా ఉండేదని పిఠాపురం శాసనం ఉవాచ. కొండపడమటి దేశం లో 13గ్రామాలున్నాయని –"ఆంధ్రా త్పతః పశ్చిమతో క్షితిః"అన్నారు.దీనినే "ఆంధ్ర పథం" అన్నారు. గుండ్లకమ్మకు దక్షిణాన వెలికొండలు నుంచి సముద్రం వరకు ఉన్నది "పాకనాడు ".అంటే ఇప్పటి నెల్లూరు మండలం ఒంగోలుతాలూకా, కడప మండలం తూర్పుభాగం కలిస్తే పాకనాడు.

వెలనాటి దుర్జయులలో చివరిరాజు పృద్వీశ్వరుడి రాజ్యం శ్రీకూర్మందాకా ఉండేది. కళింగరాజులు ఇతనికి కప్పం చెల్లించేవారు. ఇతన్ని చంపినవాడు తిక్కరాజు రాజేంద్ర చోడుడి కొడుకు. ఇతనిమంత్రి కేతన. తిక్కనగారి నిర్వచనోత్తర రామాయణం లో దీన్ని చెప్పాడు –"ఆకాశ మరుచ్చ శివకాశ సురాశన, తార కేశ,నీకాశత రాభి రోచి రవకాశ వికాస యశో విలాసుడై ". ఇతడితండ్రి కొమ్మన –"ఆ కొమ్మనప్రగడ సుతు –డై కేతన చోడ భూవరాత్మజుడై –ధైర్యాకరుడగు పృద్వీశ – మహాకాన్తుని మంత్రియయ్యే సెంతయు బెర్మిన్ "

పృద్వీశుని ఆప్తమిత్రుడు కేతన. కొమ్మన ప్రగడ –"వాగ్దేవీ స్తన హార నిర్మల యశో వాల్లభ్యం ఉన్నవాడు. యశో భూషితుడు, కౌశిక గోత్రీకుడు. "కొంక విభు రాజ్యాధిష్టుధి ఉండగా, సంధి విగ్రహ ముఖ్య "కార్యాలు నిర్వర్తించాడు. రిపు క్షితీశ బహు సైన్య ధ్వంస నా టోపం ఉన్నవాడు. తండ్రి గోవిందుడు. ప్రతిఏడాది 75పుట్లధాన్యం పండే భూములు, తొమ్మిదికోట్ల రొఖం వందలాది ఏనుగులు,40వేల గుర్రాలు ఉన్న మహా విభవ సంపన్నుడైన కులోత్తుంగ రాజేంద్ర చోళునికి ఇష్టసచివుడు, తంత్ర ముఖ్యుడు కొమ్మన ప్రధాని. కొమ్మన నిర్మించిన తటాకాలు దేవతా విగ్రహాలు గుడులు గోపురాలు లెక్కకు అందవు. దండనాదాగ్రణి గోవింద ప్రగ్గడ వెలనాటి కొమ్కరాజు వద్దమంత్రి. కొడుకు కొమ్మన దండనాధుని కొడుకు కేతన తిక్కమహీపాలుడిఆత్మ సచివుడు. కేతనకొడుకు భీమన రణవీర రణరంగడు. మునిమనవడు గుండన మనుమసిద్దిరాజు కార్యా చారుడు. ఏటా జరిగే కాకుళేశ్వరుని తిరునాళ్ళకు వచ్చే తీర్ధ ప్రజలకు గుండనమంత్రి రత్నాలు, మాడలు విరివిగా ఇచ్చేవాడు. అంటే కొమ్మన మంత్రి తండ్రి గోవిందా మాత్యుడు, గుండనమంత్రివరకు అందరూ రాచకార్యాలలో ఖడ్గ పరాక్రమం లో సాటిలేనివారే. ఆపస్తంభ సూత్రుడు, కౌశిక గోత్రుడు, ఆర్వేల నియోగిబ్రాహ్మణుడు కొమ్మనమంత్రి కృష్ణా గోదావరి మండలంలోని నండూరు గ్రామస్తుడు.

## 11-రాయూరు యల్లన మంత్రి

12వ శతాబ్ది రాయూరి యల్లన మంత్రి కమ్మనాడు రాయూరు వాస్తవ్యుడు. ఆ పురం అపర అమరావతిగా వైభాగంలో ఉండేదని 1158అమరావతి శాసనం లో ఉన్నది –"శ్రీకాంతా నిలయంబు శిష్టజనతాసేవ్యంబు, శాలీవనానీక ప్రాంత జలాశాయోద్గత లసన్నీరేజ శోభాన్వితం "యల్లన మంత్రి ధిషణ బహుదొడ్డది అవటం వలన 13వ ఏటనే మంత్రిపదవి పొంది, సత్కవి బంధుమిత్ర జన సంపత్కారి అయ్యాడు. శుద్ధ ప్రతిభా ప్రపంచిత లసన్మార్గ స్థితి తో అభ్యుదయ పరంపరగా ఎదిగాడు –"పదమూడేడులనాడు అమాత్యపదవిం బ్రాపించి తత్సంపదాస్పదుడై –సత్కవిబంధుమిత్ర జనసంపత్కారి అనిపించాడు. ఈమంత్రి పాలిత ధర్మ మార్గుడు, అనుపాలిత సత్య విలాసుడు, ఉన్మీలిత సర్వ శాస్త్రమతి, మిత్రజనాంబుజమిత్రమూర్తి అంటే స్నేహితులనే పద్మాలకు సూర్యుడు, అగ్లాలిత కీర్తి, నిశ్చలితలక్ష్మీ సమన్వితుడు.

తెలుగు చోడుడులకు "కొణిదెన "రాజధాని. వీళ్ళు అనేకదేవాలయాలు కట్టించారు కవులను ఆదరించి భాషాభిమానం పెంచారు. యల్లన మంత్రి తండ్రికూడా చోడులమంత్రిగా ఉండేవాడు –"త్రిభువన గీతకీర్తి, నరదేవ శిఖామణి, కామధారుణీ ప్రభు తనయుండు, మాండలికభర్గుడు, భర్గ పదాబ్జ షట్పదుడు అంటే మహా శివభక్తుడు, అభి నవరాముడు,అర్యమకులాగ్రణి"గుండియ పూండి "భక్తితో త్రిభువన మల్ల దేవుడుప్రతీతిగా శంభునకిచ్చె బ్రీతితోన్ ". నన్ని చోడమహారాజు మంత్రి శంభుడు. ఈ శంభుమంత్రికి త్రిభువనమల్లుడు "గుండియ పూండి "అగ్రహారం ఇచ్చాడు. శంభునికొడుకు అన్నమంత్రి తాను సంపాదించింది దీనులకు బంధువులకు, దేవాలయ నిర్మాణాలకు ఖర్చు చేశాడు. ఇలాంటి శుద్ధమనస్కుని కొడుకే మన యల్లనమంత్రి. భారద్వాజ గోత్రికుడు ఆపస్తంభ సూత్రుడు. 13ఏళ్ళకు మంత్రిపదవి పొంది, వాజ్మయ సారస్వత, మతవిషయాలను చక్కగా అభివృద్ధి చేశాడు.

క్రీశ.6వ శాతాబ్దినుంచే శాసనాలలో గద్య పద్యాలు వచ్చాయి. 1145కు పూర్వం ఉన్న పద్యకవితలో అద్భుత ధారాశుద్ధి కనిపించి పక్వ దశకు వచ్చిందని పిస్తుంది. యల్లనమంత్రి వైదుష్యాన్ని, అతనిరాజు రాజు వైభోగాన్ని తెలిపే శాసన పద్యాలన్నీ అందుకే రసగుళికలుగా మనకు ఇందులో కనిపిస్తాయి.

## 12 పింగళి మాదన్న మంత్రి

నియోగిబ్రాహ్మణుడు భారద్వాజ గోత్రీకుడు పింగళి మాదన్న మంత్రి 17వ శతాబ్ది వాడు. తండ్రి భానోజీ, తల్లి భాగ్యమ్మ. చిన్నప్పుడే చదువు బాగా నేర్చి గోల్కొండకు వెళ్లి మీర్ జుమ్లా అనే ఉద్యోగి వద్ద నెలకు 10"గిల్డరు"ల జీతం తో గుమాస్తాగా చేరాడు.అన్న అక్కన్న కొంచెం తొందరపాటువాడు,కాని పండితుడు. మాదన్న ఉపాయా శాలి. వీరిద్దరి తెలివి తేటలు తానీషాకు తెలిసి, ఇద్దర్నీ ఆహ్వానించి "వసాఉత్"ఉద్యోగులుగా చేర్చుకొని ఆంతరంగికులుగా చేసుకొన్నాడు. తానీషా అసలు పేరు అబుల్ హసన్. ఉన్నతకులం లో పుట్టినా బాల్యం లోనే ఆస్తిపాస్తులు హరించుకుపోయి దరిద్రం అనుభవించి ఐహిక సుఖాపేక్షతోపాటు మోక్షాపేక్షకూడా పెంచుకొన్నాడు. అప్పుడు గోల్కొండలో సయ్యద్ రాజ్ కొత్తాల్అనే పైగంబర్ మహాతపస్వి ఉండేవాడు. ఈయనను గురువుగాభావించి 14ఏళ్ళు యోగాభ్యాసం, భక్తీ నేర్చాడు.

అప్పటి రాజకీయ పరిస్తితులుఅస్తవ్యస్తంగా ఉన్నాయి. సుల్తాన్ అబ్దుల్లాకు మగసంతానం లేదు. ముగ్గురుకూతుళ్ళు.పెద్దకూతురు ను సయ్యద్ అహమ్మద్ కు ఇచ్చి పెళ్లి చేయగా, మామగార్ని కీలుబొమ్మ ను చేసి తానే అధికారం చెలాయించాడు. రెండవ కూతుర్ని ఔరంగజేబు కొడుకు మహమ్మద్ సుల్తాన్ కిచ్చి పెళ్లి చేశాడు. మూడవ కూతుర్ని పెద్దల్లుడి ఆశ్రితుడైన సయ్యద్ సుల్తాన్ కిచ్చి పెళ్లి చేస్తానని వాగ్దానం చేసి రేపు పెళ్లి అనగా వాడు తనను వెక్కి రించాడని ఈర్ష్యాసూయలతో మాట నిలబెట్టుకోకుండా, తనకు అణగిమణగి ఉంటాడని తానీషాకిచ్చి పెళ్లి చేశాడు. మామగారు మరణించగానే పెద్దల్లుడు సయ్యద్ అహమ్మద్ సుల్తాన్ అవటానికి ఉబలాట పడ్డాడు. ఐతే వీడి అహంకారం వెకిలితనం వలన అనేకులు శత్రువులై సేనాని సయ్యద్ ముజఫర్, మహల్దారు మూసాఖాన్ లు పెద్దల్లుడిని జైలు లోపెట్టి మూడవ అల్లుడు అబుల్ హసన్ ను "తానీషా" అనే పేరుతో సుల్తాన్ చేసి తాము మంత్రులయ్యారు వీరిద్దరి కపటనాటకాలు గమనిస్తున్న తానీషా వీళ్ళని తప్పించే ఉపాయమాలోచిస్తూ అమాయకుడిగా నటించాడు.,

అక్కన్నమాదన్నల ప్రభుభక్తి తెలివి తేటలు బుద్ధి సూక్ష్మత, సామ్రాజ్య రక్షాబాధ్యతలు గుర్తించి ముజఫర్, మూసాలను ఖైదు చేసి మాదన్న కు "సూర్యప్రకాశరావు "అనే బిరుదు ఇచ్చి మహామాత్యుని చేసి రాజ్యభారం అప్పగించి వేదాంత గోష్టిలో కాలంగడిపాడు తానీషా.అక్కన్న మహా సేనాని గా, మాదన్న మహామంత్రిగా, మరోతమ్ముడు వెంకన్న "రుస్తుం రావు "అనే బిరుదుతో ఫౌజు దారు అయ్యారు. మాదన్నమంత్రి మః నేర్పుతో సామ్రాజ్య రక్షణభారం అంతా నిర్వహించి జనరంజకపాలన చేశాడు. ఉత్తరాన కళింగ, దక్షిణాన పుదుచ్చేరి వరకు గోల్కొండ సామ్రాజ్యాన్ని అభి వృద్ధి చేశాడు. విదేశాంగనీతిలో దిట్ట మాదన్న.ఢిల్లీ సుల్తాన్ ఔరంగజేబు కు కప్పం కడుతూ విధేయంగా మెలిగారు గోల్కొండ నవాబులు.

మహారాష్ట్ర లో శివాజీ ఉద్ధృతంగా బల శౌర్యాలతో రాజ్యాలు జయిస్తూ సామ్రాజ్యం దక్షిణా పథం అంతావిస్తరిస్తున్నాడు. ఔరంగ జేబుతో స్నేహం పాముతో స్నేహం అని గ్రహించి, దగ్గరశత్రువు శివాజీతో తానీషాకు స్నేహం చేకూర్చాడుమాదన్నమంత్రి. గోల్కొండకు శివాజీ అండగా ఉండి,తాను స్వాధీనం చేసుకొంటున్న దక్షిణాపథం లోని కొంతరాజ్యం ధనం గోల్కొండకు ఇచ్చేట్లు,దీనికి బదులుగా తానీషా శివాజీకి కొన్ని లక్షల వరుమానం ఇచ్చేట్లు మాదన్నమంత్రి ఒడంబడిక కుదిర్చాడు. ఇది ఔరంగ జేబు కు ఎక్కడోకాలి తానీషాను అదుపులోపెట్టటానికి ప్రత్యేకరాయబారిని నియమించాడు. బిజాపూర్ నవాబు ఎప్పటికప్పుడు యుద్ధానికి సిద్ధమవుతూనే ఉన్నాడు.

రాజకీయ చతురత, శక్తియుక్తులున్న మాదన్నమంత్రి ఇదంతా వెయ్యికళ్ళతో గమనిస్తూ, విదేశీ వర్తకులకు సకల సౌకర్యాలు సమకూరుస్తూ ఉన్నాడు. కాని కొందరు దర్బారీయులకు అంతఃపుర స్త్రీలకూ మాదన్న పై అసూయ ఏర్పడి తానీషాకు ఆయనపై పితూరీలు చేస్తున్నారు. వీటిని పడచెవినిపెట్టాడు తానీషా.శివాజీపై మాదన్న పెట్టుకొన్న ఆశలు శివాజీ మరణంతో నిరాశలయ్యాయి. ఈలోగా బీజాపూర్ పై ఔరంగజేబు దాడి చేస్తూ, వాళ్లకు సాయం చేస్తే తానీషాకు తగిన శాస్తి జరుగుతుందని హెచ్చరించాడు. కాని రహస్యంగా బిజాపూర్ నవాబుకు సాయం అందించాడు.

ఎలాగైనా గోల్కొండను స్వాధీనం చేసుకోవాలని ఔరంగజేబు ఆత్రం. తానీషా" కాఫర్" అయిన అక్కన్నమంత్రి చెప్పుచేతల్లో ఉన్నాడని వ్యసనాలకు బానిసయ్యాడని ఆగ్రహంతో దుష్ప్రచారం చేయించాడు. తానీషాతో యుద్ధానికి సర్వదా సిద్ధంగా ఉండమని రాయబారికి వర్తమానం పంపాడు. దర్బారీయుడైన "అత్తేమత్తయ రాయని "మహాసేనాని అగౌరవపరచాడని తెలుసుకొని, అతడిని బుజ్జగించే ప్రయత్నం చేసినా అతడు అవమానం మర్చిపోలేకపోతున్నాడు. ఢిల్లీ సుల్తానుకు గోల్కొండ నవాబుకు మధ్య పరస్పర కుట్రలు కుతంత్రాలు పెరిగి, గోల్కొండపై మొగలాయి దండయాత్ర ప్రారంభంకాగా'అత్తేమత్తయ రాయడు మాదన్న, తానీషా, సేనానులపై ద్వేషం పెరిగేట్లు చేశాడు.

పాదుషాకొడుకు షా ఆలం గోల్కొండ పైకి దండెత్తివచ్చాడు.కప్పం చెల్లిస్తూనే తానీషా రాయబారం నడిపాడు. అక్కన్న మాదన్నలను పదవులనుంచి తొలగించమని సుల్తాన్ ఫర్మానా జారీచేశాడు. గ్రహించిన అక్కన్నమాదన్నలు తామే పదవికి వీడ్కోలు పలికారు. ఒకరోజు వీరిద్దరూ బంగారుపల్లకిలో వస్తుంటే అత్తిమత్తయ రాయడి సైనికులు అకస్మాత్తుగా వారిపై పడి తలలు నరికేసి, శరీరాలను మట్టిలో ఈడుస్తూ, వారి బంధువులను హిందువులు ఎక్కువగా ఉన్న చోట్ల బీభత్సం సృష్టించి వారినీ చంపేశారు. మాదన్నకు సంతానం లేదు. అక్కన్న కొడుకు మల్లన్నను ఒక తురక అతనుజాగ్రత్తగా కాపాడి పెంచాడు. అక్కన్నమాదన్న మరణ వార్త తానీషా విని చాలా దుఃఖించాడు.

తానీషా పాదుషాకు లొంగిపోయి, ఒక లేఖ రాశాడు. గోల్కొం డ మొగలాయీలు స్వాధీనం చేసుకొని తానీషాను దౌలతాబాద్ కోటలో బంధించారు.14ఏళ్ళు బందీగా మగ్గిపోయి క్రీశ 1602లో తానీషా చనిపోయాడు.

## 13-గోపాలుని నన్ని(న్న)య భట్టు

11వశతాబ్దికి చెందిన గోపాలుని నన్ని(న్న)య భట్టు రాజరాజేంద్ర నరేంద్రుని ముఖ్యామాత్యుడు, ఆస్థానకవి. రాజేంద్ర చోళుడు కన్యాకుమారి వరకు దక్షిణ దేశం జయించి, గొప్ప నౌకాబలంతో సింహళాన్ని వశపరచుకొని, పశ్చిమ సముద్రం లోని 12వేల దీవులను ఆక్రమించి, తూర్పునున్న" పెగు "రాజ్యాన్ని, నికోబార్, అండమాన్ దీవులతో సహా" శ్రీ విషయం "ను సామంత రాజ్యం గా చేసుకొన్నాడు. దీనితో ఆగక బీహారు, ఉత్కళ, వంగ దేశాలు జయించి "గంగైకొండ చోళుడు "బిరుదు పొందాడు. అప్పటికే ఉత్తర భారతం గజనీ దండయాత్రలకు గురై దిక్కు తోచక ఉన్నది. చోళచక్రవర్తులు హిమాలయం నుంచి రామేశ్వరం దాకాఏకచ్ఛత్రంగా పాలించాలనే సంకల్పం తోఉండగా రాజరాజు రాజేంద్ర చోళుడికి అల్లుడయ్యాడు. రాజరాజు కొడుకు రాజేంద్ర చోళుడిమనవరాలి మొగుడే.

ఈ సమయంలో వేంగీ రాజ్యం తమ వశం కావాలనే కోరికకూడా కలిగింది. 1070 లో రాజరాజు కొడుకుచోళచక్రవర్తి అయి "కులోత్తుంగ చోళుడై "తాతగారిలాగా ప్రతిభా వ్యుత్పత్తులతో 49ఏళ్ళు రామేశ్వరం నుంచి కళింగ దాకా పరిపాలించి కీర్తిపొందాడు. వైదిక, వర్ణాశ్రమ ధర్మాలతో వైదికమతాన్ని పునరుద్ధరించాలన్న తలంపుతో, అందులో నిష్ణాతుడైన నన్నియభట్టు ను సమాదరించి –"జననుత కృష్ణ ద్వైపా-యన ముని వృషభాభి హిత మహాభారత బ-ద్ధ నిరూపితార్ధ మేర్పడ -దెనుగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్ "అని నన్నయను కోరాడు రాజరాజు. తెలుగు చేయటమే కాదు భంగ్యంతరంగంగా కూడా చెప్పమన్నాడు. ఇలాంటి సదాశయాన్ని మెచ్చిన కవినన్నాయ"సమస్త వర్ణాశ్రమ వర్ణ ధర్మ రక్షణ మహా మహిమన్మహి నొప్పు సర్వ లోకాశ్రయుడు "అని రాజును పొగిడాడు. అగస్త్య మహర్షి "సుప్రుత్సమితాత్ కాంతా సమ్మతయా యయా సరసతయా మాపాద్య కావ్య శ్రియా కర్తవ్యే "అని చెప్పింది శిరో దార్యంగా భావించి, కర్తవ్యమ్ లో ఆసక్తి అకర్తవ్యం లో అనాసక్తి కలిగించటం ముఖ్య లక్షణం గా భావించాడు. అందుకే "ధర్మ తత్వజ్ఞులు ధర్మ శాస్త్రంబని, ఆధ్యాత్మ విదులు వేదాంతమని నీతికోవిదులకు నీతిశాస్త్ర మని, కవులకు మహాకావ్యమనీ లాక్షిణులకు లక్షణ శాస్త్ర మని, ఐతిహాసకులకు ఇతిహాసమని, పౌరాణికులకు పురాణ సముచ్చయమనిభావిం చేట్లు వేదవ్యాసమహర్షి మహా భారతం రాశాడని భారతం ధర్మమూలం,పంచమవేదం అనీ నన్నయ చెప్పాడు.

ఇంతకూ నన్నియభట్టు ఎలా ఉండేవాడు ?"స్వస్థాన వేష భాషాభిమతా స్సంతో రస ప్రలుబ్ధ ధియః ".అవిరళ జపహోమతత్పరుడు, సంహితాభ్యాసుడు, తెలుగులోమహాభాత సంహితా రచన బంధుడు, సమస్త పురాణ వేత్త, లోకజ్ఞుడు. ఈయన నిష్ట"రమణీయార్ధ ప్రతిపాదిత శబ్దాలపైనా, ఉచ్చారణ మీదా. దీనినే అక్షర రమ్యత అన్నాడు. ఉచ్చారణవలన నాదోత్పత్తి చేసిన నాదబ్రహ్మ. విపుల శబ్ద శాసనుడు. శిలాశాసనాలలోనూ, అవ్యవస్థంగానూ ఉన్న శబ్దాలను తీర్చిదిద్ది నియతికల్పించి తెలుగు సంస్కృతపదాలకు ఛందస్సులకు తీయదనం తీర్చిదిద్దిన అక్షర శిల్పి.

నన్నియభట్టు రాజరాజుకు కులబ్రాహ్మణుడు. అంటే పురోహితుడుకాదు.వీరమంత్రి అన్న మాట. చాళుక్య శాసనాలలో, కర్నాటక రాజ శాసనాలలో కుల బ్రాహ్మణ శబ్దానికి పురోహితుడు అనే పర్యాయ పదం ఎక్కడా లేదు. శాసనాలు రాసే అధికారం మహా మంత్రులకే ఉండేది పురోహితులకు లేదు. "కులీనా శ్చాను రక్తాశ్చ కృతాస్తే వీరమంత్రిణః"అనే దాన్నిబట్టి నన్నయ రాజరాజుకు వీరమంత్రి. లౌకిక కార్య సాధకుడు మంత్రి. అలౌకిక కార్యసాధకుడు పురోహితుడు అని అర్ధం చేసుకోవాలి.

తూర్పు చాళుక్యులలో ఐదవవాడు సర్వ లోకాశ్రయుడిని "మంగి యువరాజు "అంటారు. ఇతని తండ్రి రెండవ విష్ణు వర్ధనుడు, తాత ఇంద్రభట్టారకుడు, ముత్తాత కుబ్జ విష్ణు వర్ధనుడు. సర్వ లోకాశ్రయుడు క్రీశ 672నుండి 696వరకు 27ఏళ్ళు పాలించాడు. చందలూరు శాసనం లో "పరమ బ్రహ్మణ్యః మహారాజానుభావ శ్రీ సర్వ లోకాశ్రయ మహారాజః కమ్మరాష్ట్రేచెందలూరు గ్రామేయకాన్ అత్రగత సర్వ గత "సర్వ నైయోగిక "వల్లభాంశ్చజ్ఞాపయతి "అని ఉన్నదానిలో "సర్వ నైయోగిక వల్లభాన్ "అనే మాట "రాత్నాలమూట"అన్నారు కొమర్రాజు లక్ష్మణరావుగారు.738లో జాయకదేవ మహారాజు ఆస్థానం లో "భట్ట నారాయణుడు "అనే మహామాత్యుడు మౌద్గల్య గోత్రీకుడు ఈశ్వరభట్టుకు అగ్రహారం ప్రదానం చేశాడు. రారాజు తండ్రి విమలాదిత్యుని మంత్రి రావుల వజ్జియ ప్రగ్గడ కొండిన్యగోత్రుడు, కారం చేడు వాడు. కనుక నన్నయకు చాలాకాలం పూర్వమే శాఖా భేదాలు ఏర్పడి ఉన్నాయి.

లోకజ్ఞుడు నన్నియ "సత్ప్రతిభాభి యోగ్యుడు,నిత్య సత్యవచనుడు కనుక తనరాజుకు రాజ్యం చేకూర్చాలనుకొన్నాడు. అప్పటికి భారత రచన చేయలేదు. రాజరాజే నిలకడ లేకుండా, దేశం వదిలి తిరుగుతుంటే నన్నయకు రాసేఅనురక్తి ఓపికా అప్పటికి లేవు. నన్నయ సుకృతమో లేక రాజరాజు అదృష్టమో వాణస వంశ రత్నాకరుడైన నారాయణభట్టు సహాధ్యాయి అవటం,అతని సాయంతో త్రైలోక్యమల్లుని మంత్రి మధుసూదనయ్యను దర్శించి,మళ్ళీ రాజరాజుకు 1051లో వేంగీ సామ్రాజ్యం ఇప్పించాడు. 1050లో తిరువయ్యార్ లో ఉన్న రాజరాజ నరేంద్రుడు 1051లోనారాయణభట్టుకు రెండు ఏరులమధ్యలో ఉన్న"నందమపూడి "గ్రామాన్ని దానంగా ఇచ్చినట్లు, అతడు ప్రాకృత పైశాచీ, కర్నాటక ఆంధ్ర సంస్కృతాది భాషలలో నిష్ణాతుడైనట్లు నన్నియ రాసిన శాసనం లో ఉంది.

తన కులబ్రాహ్మణుడైన నన్నియభట్టురాజనీతి వలన రాజరాజనరేంద్రునికి మళ్ళీ రాజ్యం సంక్రమించటం కాక విజయాదిత్యునివలన కష్టాలూ తప్పాయి. ఒలంబవాడికి విజయాదిత్యుని సామంత రాజును చేయటం తో సమస్యలు తీరాయి. యుద్ధాలుఆగిపోయాయి. రాజరాజు పాలన చివరి పదేళ్ళలో 1051నుంచి, 1061వరకు శాంతి సౌఖ్యాలతో రాజ్యపాలన చేయగలిగాడు. రాజరాజు వెంటనే తన రాజధానిని వేంగి నుంచి రాజమహేంద్రానికి మార్చాడు. సుస్థిర శాంతి చేకూరటం తో తనుకు ఇంత మహోపకారం చేసిన నన్నియను మహాభారతానువాదానికి ప్రోత్సహించాడు. 1051-55మధ్యలో నిండు పేరోలగం లో రాజు నన్నియ నుసంస్కృత భారతాన్ని తెలుగు సేయమని ఆనతిచ్చాడు. ఆతర్వాత జరిగిన విషయమంతా ముందే చెప్పుకొన్నాం.

## 14 నండూరు గుండమంత్రి

13వ శతాబ్ది వెలనాటి బ్రాహ్మణుడు నండూరు గుండమంత్రి వెలనాటి రాజేంద్ర చోడుడి మంత్రి. బాపట్లతాలూకా నండూరు వాసి. ఇతనికి శివలెంక మంచన కవి తన కేయూరబాహు చరిత్ర కావ్యం అంకితమిచ్చాడు. ఇతని తాత కు దాత గోవిందన వెలనాటి గొంక భూపతి మంత్రి. గొంక రాజు చివరిరోజుల్లో పాకనాటిపై దండెత్తినట్లు బాపట్ల భావనారాయణస్వామి ఆలయ శాసనం లో ఉంది. గొంకన నెల్లూరుదాక పాలించాడు. కులోత్తుంగ చోళుడికాలం లోవేంగిపై కల్యాణి, కటకం సామంతులు దండెత్తివచ్చినా, కొమ్మనమంత్రి కొత్తచర్లదగ్గర వారిని ఓడించి రాజుకు విజయం చేకూర్చాడు. మూడవ గొంక రాజు తర్వాత 1186లో ధనదుప్రోలు సింహాసనమెక్కిన వెలనాటి చివరి రాజు. శ్రీకూర్మం దాకా రాజ్య విస్తరణ చేశాడు. ఇతన్ని చంపిన తిక్కరాజు రాజేంద్ర చోడుడి కొడుకు. తిక్కరాజుమంత్రి కేతన. కేతన మనవడే గుండన మనుమసిద్ధి రాజు మహా సచివుడు. మన్మసిద్ధి తండ్రి తిక్కరాజు పృథ్వీశుడిని చంపాడు. తిక్కరాజు 1250వరకు రాజ్యం చేశాడు. కేతన మనవడు గుండనకు కేయూరబాహు చరిత్ర అంకిత మివ్వటం చేత ఇతనికాలం 13వ శతాబ్ది. "ధరణిం దాన గుణుండ వీవని, కవీంద్ర శ్రేణి వర్ణింప గా బిరుడదుల్నిండిన గుండ యేంద్రునకు "అనే పద్యాన్ని బట్టి యితడు దాతలకే గురువు కవుల పొగడ్తలు అందుకొన్నవాడు, అనేక బిరుదులున్నవాడని తెలుస్తుంది. మంచన నన్నయ తిక్కనాదులను స్తుతించలేదు.

గుండనమంత్రి "ప్రజ్ఞ సంభావిత కావ్య దక్షుడవు భావ్యమతిన్ ద్విజదేవ "అని సంబోధించి ఒకకావ్యం రాసి అంకితమివ్వమని కోరాడు. అందులో "స్థాయి రసము శృంగారంబై యలవడ గథలు నీతులైయెడనెడరా"గేయూరబాహు చరితము "సేయుము –నీ వంద్రభాష శిల్పము మెరయన్ "అని చెప్పాడు. "సుగుణుని నినుబొంది మదీయ కవిత నెగడుం బుడమిన్"అని తృప్తితో గుండనమంత్రికి అంకితమిచ్చాడు మంచనకవి. ప్రతియేటా జరిగే కాకుళేశ్వరుని ఉత్సవాలలలో గుండన మంత్రి మాడలు, రాత్నాలు,సువర్ణం అర్థులకు, అర్థులకు యిచ్చి సంతృప్తి పరచేవాడని వర్ణించి చెప్పాడు. అదీ గుండన ఔదార్యం. అందుకే స్తుతిపాత్రుడయ్యాడు

. " అపూర్వాంధ్ర పూర్వామాత్యులు "సమాప్తం.

ఆధారం – ఆధారం –ప్రాచీన హిందూ దేశ రాజ్యాంగ చరిత్ర, కన్నడ దేశ చరిత్ర, ప్రాచీన గ్రామసభల న్యాయ పరిపాలన, దండనాథులు, దుర్గాధిపతులు వంటి అమూల్యగ్రంథాలు రచించిన విమర్శక శిరోమణి, సాహిత్య విశారద బ్రహ్మశ్రీ కోన వెంకటరాయ శర్మగారు 1950 లో రచించిన "సచివోత్తములు " పుస్తకం

చరిత్ర కెక్కని చరితార్దులు

ఆధారం –ఆచార్య బిరుదరాజు రామరాజు గారి "చరిత్ర కెక్కని చరితార్దులు "-(విస్మృత కవులు –కృతులు )

## 1 రాజా బహరీ పామనాయక భూపాలుడు

18 వ శతాబ్దం మధ్యలో సురవరం సంస్థానాన్ని వైభవంగా పాలించినవాడు రాజా బహారీ పామనాయక భూపాలుడు. అసలుపేరు రాఘవ భూపాలుడు. పీతాంబర నాయకుని పౌత్రుడు. తండ్రి రమణ భూపాలుడు, తల్లి లక్ష్మమాంబ. సురపురమే షోరాపురమైంది. దీన్ని బేడరు లేక" నిర్బయులు" అనే తెలుగు నాయకులు పాలించారు. వీరు అనాగరికులని, మైసూరులోని దక్షిణ మహా రాష్ట్ర వీరి ఆదిమ నివాసమని తెలుస్తోంది. ఈ రాజులలో చివరివాడు బాలుడుగా ఉన్నప్పుడు కల్నల్ మెడోస్ సంస్థానాదికారి గా ఉండి, అతనికి యుక్తవయసు రాగానే 1853లో రాజ్యాన్ని అప్పగించాడు. 1857ప్రధమ భారత స్వాతంత్ర్య సమరం లోపాల్గొనటం వలన యితడు బంధింపబడి మరణ దండన విధించారు. కాని పునర్విచారణలో అయిదేళ్ళు కారాగార వాసం తో రాయవేలూరుకు పంపారు. కాని మార్గమధ్యమం లో ఆత్మహత్య చేసుకొన్న తొలితరం స్వాతంత్ర సమరయోధుడుగా వన్నె కెక్కిన త్యాగ శీలి అయ్యాడు. ఈ విప్లవ యుద్ధం లో నిజాం నవాబులు బ్రిటిష్ వారికి సాయం చేయటం వలన సుర పుర సంస్థానాన్ని బ్రిటిష్ వారు నవాబులకు భక్షీస్ గా అప్ప చెప్పారు.

ఇంతటి ఘన చరిత్రకాల వీర వంశం లో పుట్టిన పామ నాయక భూపాలుడు కూడా అరివీర భయంకరుడే. ఈయనకాలం లో శ్రీ బుక్కపట్టణం అణ్ణయ్య దీక్షితులు, శ్రీమన్నిగమాంత దేశికులు గా భావింపబడిన శ్రీ బుక్కపట్టణం శ్రీనివాస దీక్షితులు సోదర కవులు ధర్మవరం నుంచి సురవరం వచ్చి రాజగురువులయ్యారు. రాజును "పరమభాగవత భక్తి తాత్పర్యుడు "అని మెచ్చారు. అణ్ణయ్య దీక్షితుల కుమారుడు కిరీటి వెంకటాచార్యులు. ఈ ముగ్గురు భారత దేశమంతా పర్యటించి కవితా విజయ దుందుభులు మ్రోగించారు.

పామనాయకుడు రాజుమాత్రమేకాక స్వయంగా కవికూడా. "భార్గవ పురాణం "అనే వైష్ణవ గ్రంథం రాశాడు. ఇందులో 8ఆశ్వాసాలున్నాయి.ఈ రాజులకులదైవం వేణుగోపాలస్వామికి అంకితం.రాజు ఆస్థాన కవుల వర్ణన ప్రకారం ఈ రాజవంశానికి మూల పురుషుడు సీతా రామ లక్ష్మణులను గంగను దాటించిన గుహుడు. ఈ వంశం లో ప్రసిద్ధులు నరసింహ మహీపాలుడు,వడియర నాయకుడు పెదపామ ధరణీ నాథుడు, పీతాంబరావనీ పాలుడు మొదలైన 15మంది.

బేడరు నాయక రాజులు బిజాపూర్ గోలకొండ నవాబులకుసహాయపడి ఔరంగజేబుతో యుద్ధం చేశారు. పూర్వం వీళ్ళకు రాజధాని వాకిన్ ఖేడా. దీనినే "వాగినగిరి" అంటారు. ఇక్కడి వేణుగోపాలస్వామి వీరికి ఆరాధ్య దైవం. ఈ దుర్గాన్ని ఔరంగజేబు 1704లో జయించాడు. జేబు చనిపోయాక వీరు మళ్ళీ దుర్గాన్ని స్వాధీన పరచుకున్నారట. పామభూపాలుడు "దిగంత కీర్తికాంతా మనోహరుడు ","సకల ధర్మ ప్రతిపాలకుడు "అని కీర్తి పొందాడు. అతని "భుజప్రతాప శిఖి శిఖా పరంపరలకు అహిత భూ భ్రున్నికాయంబు శలభ నిచయంబు మాడ్కి విలసిల్లె నట ".

రాజు రాసిన భార్గవ పురాణం అంటే పన్నిద్దరాళ్వారుల చరిత్రమే. రాజుకు వేణుగోపాలుడు కలలో కన్పించి ఈ కృతి చేయమని ఇలా ఆనతిచ్చాడు –

"పరమ వివేక శీలుడవు, బ్రాహ్మణ పోషణ తత్పరుండ వై-యరయుట, యేను బ్రాహ్మణ మఖాభి వశాప్తి దనర్చు టున్కి, నిన్

వరమతి బ్రోవ నిచ్చటికి వచ్చినవాడను నొక్క సూక్తి భ –వ్య రచన జేతు నీ కిపుడు బాలక పామ ధరాధి పాలకా "

"అస్మత్ప్రభావ మౌనట్టి శ్రీ విష్ణు పురాణంబు తెనుగున రసికు లెన్న –కృతి రచియింపించి తత

భక్తి మా కంకితంబు చేయించిన ధన్యమతివి

యరయ పన్నిద్ద రైనట్టి మద్భక్తుల చరితంబు, నాంధ్ర భాషా ప్రబంధ –మును జేసి మా కిష్టముగ సమర్పణము గావించినచో పృధివీ స్థలమున

సకల పుణ్య తరా (ఫలా )వాప్తి సంఘటించు-నీ కనుచు సురపుర వాసుడై కడంగు

దేవుడా కృష్ణమూర్తి యద్రుశ్యు డౌట-మేలుకని మానసోత్సాహ లీల దనర.

పామ భూపాల నాయకుని కవిత్వానికి మరొక మంచి పద్యం చూద్దాం –

మత్తేభం –పర్వ తత్త్వార్థ పరిష్క్రియాభిరతి, శుంభ త్పాండ్య భూమండలే -శ్వర సద్విష్ణవతా విధాయి, కరుణాంచద్భట్ట పాదార్య, సా

దర లీలా చిద చిద్విశిష్ట మత సిద్ధాంత స్ఫురద్దర్పణాం-తర విద్యోదిత దివ్య విగ్రహ నమద్భక్తాదరానుగ్రహా "

ఇంతటి ఉత్తమ గ్రంథం మరుగున పడి పోయినందుకు ఆచార్య బిరుదరాజు రామరాజు గారు మిక్కిలిగా విచారించారు.

## 2 భారి గడ్పుల ధర్మయా మాత్యుడు

ఆరు ఆశ్వాసాల "నృసింహ పురాణం "రాసిన బారి గడ్పుల ధర్మయా మాత్యుడుకూడా విస్మృత కవి అయ్యాడు. దీని శిధిల తాళపత్ర గ్రంథం గద్వాల సంస్థానం నుంచి ఆచార్య బిరుదరాజు రామరాజు గారు సంపాదించి ఆ కవి, కృతి చరిత్రను లోకానికి అందించి పుణ్యం కట్టుకొన్నారు. ఇందులోని చివరి పత్రం వలన రాసిన తేదీ తెలిసింది. ఇది 250ఏళ్ళ నాటి గ్రంథంగా రాజు గారు పేర్కొన్నారు. మొదటి భాగం లో ఇష్టదేవతాస్తోత్రాలు ఉండి ఉండవచ్చు. రెండవ కమ్మ లో ఆంజనేయ స్తుతి ఉంది. తర్వాత మూడు పద్యాలలో పూర్వ గీర్వాణ, ఆంధ్ర కవుల ప్రశంస ఉంది.

కం."మనమున నే భజియింపుదు-ననయము వాల్మీకి వ్యాసు ననిమిష మౌనిన్

ఘన సుర వందితులను స-న్ముని మాన్యుల హరికథాను మోదిత మతులన్ ".

ఉ-"చారు మనః ప్రమోదమున సంస్కృత కావ్యమునం బ్రవీణులౌ –ధీర మయూరు, బాణు,జయదేవుని జోరుని గాళిదాసునిన్

భారవి, మాఘు,బిల్హణుని, బైరవునిన్, శివభద్రునిన్, హరిన్ –గూరిమితో నుతింతు మదిగోరిన కోర్కి కనుగ్రహింప గన్"

కం-తగ నంధ్ర భాష నేర్పరు-లగు నన్నయ భట్టు తిక్కనాహ్వాయు,భీమున్

సుగుణుని బమ్మెర పోతన –నొగి భాస్కరు రంగనాథు నొనర దలతున్ "

ఇందులో నృసింహపురాణం రాసిన కవిత్రయం లోని ఎర్రన గురించి లేకపోవటం ఆశ్చర్యమే. తర్వాత రెండు పద్యాలలో కుకవి నిరాదరణ చేశాడు. తర్వాత తన ఇష్ట దైవం "బారిగడుపుల నరసింహస్వామి "ని ఒక పవిత్ర స్థలంలో లో కూర్చుని ప్రార్థించాడు కవి. బారిగడుపుల గ్రామం జటప్రోలు సంస్థానం లో ఉంది. ఊరు,ఇష్టదైవం ఒకటేకనుక ఇంటిపేరు కూడా బారి గడుపుల అయి ఉంటుంది. స్వామి ప్రత్యక్షమయ్యాడు రెండు "సీసా"లతో ఆస్వామిని నుతించాడు.తర్వాత వచనం లో "పూర్వం ద్విపద రూపంగా నృసింహ పురాణం రాసి నాకు అంకిత మిచ్చావు"అన్నాడు స్వామి. అది ఏమైందో తెలియదు.

తర్వాత ఉన్న రెండు కందపద్యాలు-

"విను మెరిగించెద నే నీ –జనకుని గరుణించినాడసాక్షాత్కారం

బున మిమ్ము బ్రోతునేని –ట్లనుదినము ను సంతసిల్లుమని కడిమి మెయిన్ ""

"ఒగి నరసింహ పురాణం -బగణితమది వచన కావ్యమై భువి బరగం

దగ రచియింపుము ఈ కృతి-జగతి బ్రవర్తిల్లు చుండు శాశ్వత మగుచున్ "

వచనకావ్యం అంటే ఇప్పుడు మనకున్న వచనకావ్యం కాదన్నారు బిరుదు రాజు వారు. భగవ దాజ్ఞను తండ్రికి తెలిపాడు. ఆయన కొడుకుతో –

కం-"పరగ మన భాగ్యమున శ్రీ –ధరుడార్త శరణ్యు డతిముదంబున మనలం

గరుణించి ఇచట ప్రబలిన –తెరగేనెరిగింతు వినుము ధీర విచారా "అని అనునయించి –

గీ-"ప్రబలముగ కశ్యపు బ్రహ్మ మౌని- మహితుడై గౌతమీ మధ్యదేశ

మునను తపమతి నిష్టతో మొనసిచేయ –వరదుడై చక్రి వేడుము వరములనిన "

ఉ-"సన్నుతులోలి జేయుచును సంయమి చంద్రుడు విన్నవించెనో –పన్నగతల్ప, ఆర్తజన బాంధవ నన్గరుణించితేని నీ

విన్నగభూమి నిల్వు మది ఇష్టము నాకనినం, బ్రియంబుతో –వెన్నుడు నిల్చి మౌనికిని వేడ్క జనింప బ్రసన్న చిత్తుడై"అని పూర్వ విషయం తెలియజేసి తండ్రి కొడుకుతో "ఈ ప్రదేశానికి పూర్వం చరణాద్రి అనే పెరున్నదని, కలియుగం లో అది "కాళ్ళకల్లు"అయిందని, ఆదేవుడిని నిశ్చలభక్తితో పూజించానని, కలలో దేవుడు కన్పించి కశ్యపుడు తనను ఇక్కడ ఉండిపోమ్మన్నాడని నువ్వుకూడా కాశ్యప గోత్రీకుడవు కనుక ఈ గిరి గహ్వరం లో బారిగాడుపుల నరసింహ మూర్తిగా వెలుస్తాను తనకు ఒక కోవెల కట్టించమని ఆనతిచ్చాడు. అలాగే చేశాడు కృతికర్త తండ్రి. కనుక నృసింహ పురాణ ప్రబంధా ఆ దేవ దేవుడికే అంకితం చేయమని హితవు చెప్పాడు కవిగారి తండ్రి.

ఇది నృసిమ్హపురానమే అయినా జయ విజయుల మూడు జన్మల చరిత్ర కూడా ఉంది. మొదటి ఆశ్వాసం లో "శ్రీ బారిగడుపుల నృసింహ వర ప్రసాద కాశ్యపగోత్ర పవిత్ర తిమ్మయామాత్య పుత్ర,రంగనాహ్వాయ సహోదర ధర్మయ నామధేయ ప్రణీతంబైన నృసింహ పురాణంబను మహా ప్రబంధంబునందు నైమిశారణ్య వర్ణనం బును శౌనకాదిమునుల మహత్వమును, నారదాగామనంబును, నారదుడు భక్తివిజ్ఞానబోధయును –"వగైరా వగైరా ఉన్నట్లు చెప్పుకొన్నాడు.

## 3 శేషభట్టరు శింగరాచార్యులు

జటప్రోలు సంస్థానాధీశులైన సురభివారు మంచి కళాపోషకులు. కాకతీయ, విజయనగర, గోల్కొండ రాజులకు సామంతులు గా ఉన్నారు. శ్రీ వెల్లాల సదాశివ శాస్త్రి గారు "జటప్రోలు సంస్థానాధీశ్వరుల చరిత్ర "రాశారు. ఈ సంస్థాన రాజులలో 21వ తరానికి చెందిన చిన్నమాధవరావు భూపాలుని ఆస్థానకవి యే శేషభట్టరు

శింగ రాచార్యులు "శూద్ర ధర్మోత్పల ద్యోతినీ స్మృతి కౌముది "అనే ధర్మశాస్త్ర గ్రంధం రాశాడు. దీనికి సంస్కృత మూలం 14వ శతాబ్దికి చెందిన శ్రీ రాయ మదనపాలుడు రాశాడు. చిన మాధవరాయలు"చంద్రికా పరిణయం "అనే ప్రౌఢ ప్రబంధాన్ని రాసిన నరసింగ రాయల కొడుకు. కనుక మన కవి 18వ శతాబ్దివాడు అని బిరుదు రాజువారు తేల్చి చెప్పారు. కవి రాసిన శిధిల తాళపత్ర గ్రంధాన్ని ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వానికి గద్వాల సంస్థానాధీశులు కానుకగా అందజేశారు.శింగరాచార్యకవి సుదీర్ఘమైన పీఠిక రాశాడు. సురభిరాజుల వంశావళిని విపులంగా చర్చించాడు.

ఈ గ్రంథం సంస్కృత శ్లోకంతో ప్రారంభమైంది. అదీ శిధిలంగా అసంపూర్ణం గానే ఉన్నది

శ్లోకం –"శ్రీ రాజ శేఖరః పాయాద ---తమ భవాన్వితః -శ్రీమన్మాధవ రాజేంద్రం పంటపల్లి పురాధిపం

శ్లోకం –శ్రీ రామా పరిరంభ జ్రుంభణమునన్ జెన్నొందు వక్షంబునన్ –దారం బూనని, తారహారము మహోద్యల్లీలలందాల్చి భో

గారూడిం దాగు సింగ పట్టణ నృసింహస్వామి బ్రోచుం దయన్ -సూరీంద్రా వంశ వనశీలునిన్ సురభి వంశ్యున్ మాధవోర్వీశ్వరున్"

తర్వాత లక్ష్మి శివ పార్వతీ వృషాకపి (శ్లేష )వృషాకపాయి(శ్లేష )వినాయక ఆన్జనేయాది దేవతలను రాజుకు సకల సౌభాగ్యాలు ప్రసాదించమని ప్రార్ధించాడు. మాధవరాయలకు ఉనికి పట్టు అయిన 'పంటపెల్లి "పురవర్ణన విపులంగా చేశాడు. ఆగ్రామం ఇప్పుడు "పెంట్లేల్లి "గా మారింది. ఇది కొల్లాపురానికి అయిదు మైళ్ళ దూరం లో ఉన్నది.కావ్యం లో ప్రబంధ వర్ణనలన్నీ గుది గుచ్చాడు. రాజు గుణగానం పలురకాలుగా చేశాడు –

కం-"నరసింగ మాధవేంద్రుని-స్థిరతర సత్కీర్తి చెలగ దిశలన్

కరిభిద్దర గిరిభిచ్చర –కరిభిద్వర శైలతుల్య కాంతి స్ఫురణన్ "

అంటూ రాయల ఆస్థానకవి చెప్పిన కరిభిద్గిరిభిద్ తరహాలో చెప్పాడు. బిజ్జల తిమ్మభూపాలుని రెండవభార్య పెద్దకొడుకు నరసింహరాయలు మాధవ రాయలకు స్నేహితుడై ఉంటాడని రామరాజుగారు ఊహించారు. మాధవరాయల తండ్రీ, తాతకూడా కావ్యాలు రాశారు. శేషభట్టరుకవి శ్రీకేశవ విలాసం వంటికావ్యాలు రాశాడు. బారిగడుపులనారసింహుడు కలలో కన్పించి శ్రీరాయ మదనపాలుడు రాసిన ధర్మశాస్త్రాన్ని తెలుగులో రాసితనకు అంకితమివ్వమని ఆదేశించాడు. తర్వాత 60పద్యాలలో సురభి వంశ వర్ణన చేశాడు. గ్రంధరచన 13-7-1760అని కవి చెప్పాడు.

బ్రాహ్మీ ముహూర్తం లో చేయాల్సినపనులు, దంతధావన విధి, శూద్ర ప్రాతఃకాల, మాధ్యాహ్నిక స్నానవిధి, శూద్ర బ్రహ్మయజ్ఞ తర్పణ విధానం, శ్రాద్ధపద్ధతి, భోజనపద్ధతి వివరంగా రాశాడు. కావ్యంలోని వచనాలు ఆనాటి వ్యావహారిక భాషకు మంచి ఉదాహరణలు అని, పీఠిక ఆనాటి చారిత్రిక విషయాలకు దర్పణం అని అన్నారు బిరుదురాజువారు.

## 5 బోయినపల్లి కుమార వేంకటరాయలు

"కవిరాజుల చరిత్రయేకాదు,రాజకవుల చరిత్ర కూడా కాలగర్భం లో కలసిపోయింది "అని ఆచార్య బిరుదరాజు రామరాజుగారు బాధ పడ్డారు. బోయినపల్లి కుమార వెంకట రాయలు పానగల్లు దుర్గాధిపతి ఐన పద్మనాయక ప్రభువు. కవి పండితులను పోషించటమేకాకుండా సప్త సంతానాలను ప్రతిష్టించినవాడు. కాలం 17వ శతాబ్ది మధ్యభాగం. "ద్రౌపదీ పరిణయం "అనే అయిదు ఆశ్వాసాల ప్రబంధం రాసి, తిరుపతి వెంకన్నకు అంకితమిచ్చాడు.

ప్రారంభపద్యం –

"శ్రీ వత్సాంకము భూమి భామయను దృష్టిం జేస్తలం దత్సమీ –క్షా వృత్తిన్,దన దివ్య కౌస్తుభమణీ చ్చాయన్నిరోధించి లీ

లా వైముఖ్యము దోపకుండ నలమేల్మంగం భరీ రంభ సౌ-ఖ్యావిర్భూతి నలర్చు వెంకట నగాధ్యక్షుండు మమ్మేలుతన్ "

రెండవ పద్యం లో కవి ఇలవేల్పు నరసింహస్వామి స్తుతి చేశాడు. తర్వాత దైవప్రార్ధన 11వ పద్యం లో తన ఆచార్యుడై సముద్రాల తిరుమలాచార్య దౌహిత్రుడైన వేంకటాచార్యకుమారుడు కొనపాచార్య మొదలైన వారి విశేషాలు చెప్పాడు.12వ పద్యం లో తండ్రి గురించి చెప్పి తర్వాత పూర్వకవుల్లాగా కుకవి నిందా చేశాడు. ఒకరోజు స్వప్నం లో "కలుములీనెడు కేలు గల మేలు నెలమేలు నలమేలు మంగ ముంగ లను టెనయగా" ఏడుకొండలవాడు కనిపించి, తనకు ఒక కృతితిరాసి అంకితమిమ్మని కోరాడు.

మర్నాడు కొలువులో విషయం చెప్పి బోరవెల్లి నరసింహకవి ని పిలిపించి గౌరవించగా. కవి రాజు గారి ప్రతిభను ఇలామెచ్చాడు సీసం లో –

"గోపగోపక గోపగోపనల్ నలువొందు-నీ దయోదయ భోగ నియతికలన –రాజరాజవ రాజ రాజజుల్ జులుకన –నీనిదాన ధనారి నిధాన నిధులు

ధర్మ ధర్మజ ధర్మ ధర్మముల్ ములుసూప –వరయ నీ శమన సత్యరుతి గతుల –రామరామారామ రామమూర్తులతుల –నీబల ధర్మార్ధ నిశ్చయములు

గీ –గండ భేరుండ గండరగండ చండ-నమర నిశ్శంక బిరుదాంక సదకలంక

పద విశంకట వెంకట ప్రభు కులాధి – నాయక కుమార వెంకట రాయ ధీర"అని పొగిడాడు. సంతోషపడినరాజు వెంకటరాయడు –

శా-"ఆర్వేలాన్వగేయ రాయసము మల్లామాత్య సూర్య న్వయా-యోర్వీదేవ మత స్వతంత్ర కపి గోత్రోద్భూత దత్తాహ్వయాం

తర్వాణి ప్రియ సూను కృష్ణ విదుషా త్మప్రోద్భవుం డైనయా –బోర్వెల్లీ పుర నారసింహ కవి సంబోధించి ఇట్లంటొగిన్"అని కవిగారి వంశజుల ఘనతను పొగిడాడు రాజు –

"మీ తాతతాతకు భ్రాతృజ సూతి గ –దా రాయసము మల్లసూరి చంద్ర

భాను చరిత్ర మొప్పగ జెప్పె,మీ తాత –దత్తన్న శబ్దశాస్త్ర ప్రవీణు-డతని సుతుండు కృష్ణపు యయాతి చరిత్ర –మిశ్రకావ్యమొనర్చె మీ జనకుడు

చేసితివీవు దక్షిణకాశ్యలంపురి -నృహరి దయోదయో మహిత కలిత

గీ-కృతి యతని కంకితముగ బండితుల మతుల –సెనయ సావర్ణ కాఖ్యాన మనగ నొకటి

యుభయభాషా విశేషోక్తియు (శిధిలం )-సిద్ధముగ సాంప్రదాయ ప్రసిద్ధి గనుచు “

ఈపద్యాలలో బోరవెల్లి నరసింహకవి తండ్రి తాతలగురించి వారి రచనలగురించి మనకు తెలుస్తోంది. కాని మన దురదృష్టం ఆ ప్రబంధాలజాడ కనిపించనే లేదు. కుమారరాయ ప్రభువుకు బోరవెల్లి కవి “గురుడే గురుడే వరుడే “అయి పూజనీయ స్థానం పొందాడు.

రాజు కవికి తన స్వప్న వృత్తాంతం చెప్పగా కృతి చేయమని కవి ప్రోత్సహించగా గురుకవిని సన్మానించి రచన ప్రారంభించాడు కుమారరాయ ప్రభువు. ముందుగా “పెన్నాల గోత్రం లో బోయినపల్లి పద్మనాయక కులం లో గండ భేరుండ బిరుదున్న రాక్షమనాయకుడు పుట్టాడు. ఇతని తర్వాత రామరాయలు తిమ్మరాయలు కోననాయకుడు రాజులయ్యారు. కోన కు అప్ప, మాద, తిమ్మ,వెంకట అనే కొడుకులున్నారు. కుతుబ్ షాహీ చేత వీరు సత్కారం పొంది మెతుకు గిరి దుర్గాధిపతులయ్యారు. తిమ్మనాయకుడికి “విభాళ సాళువ”బిరుదు ఉంది. చివరివాడైన వేంకటరాయలు పానుగల్లు ప్రభువు. ఇతని పెద్దభార్యకొడుకు కోనరాయలు చిన్నభార్య నరసంబ కొడుకే ద్రౌపదీ కళ్యాణ ప్రబంధకర్త మన కవిరాజు వేంకటరాయలు గండభేరుండ బిరుదు పొందాడు.

ప్రతి ఆశ్వాసం చివర గర్భ బంధకవిత్వాన్ని దట్టించాడు. చివరిదైన పంచమాశ్వాసం లోని ఒకమత్తేభ పద్య స్వారస్యం చూద్దాం

“అతులంబై ఆకలంకమై ప్రభు సమాజాకర్ణ్యమై,వర్ణ్యమై- యతి పాపావహమై, శుభావహమునై, యాచంద్ర తారార్క, సు

స్థితమై యుండెడు గాక వెంకట నగాధిస్వామి యుష్మద్గుణాం-కిత మేతత్కృతి యీ క్షితిన్ కవిజనాంగీకార సారోన్నతిన్ “

## 6 తురుమిళ్ళ రామన

“ప్రబంధ యుగానికి చెందినవాడైనా, మరుగునపడ్డ మాణిక్యం –శేష ధర్మాలను ప్రబంధంగా రాసిన తురుమిళ్ళ రామన “ అని వ్యధ చెందారు బిరుదరాజువారు. ప్రాచీనులలో తామరపల్లి తిమ్మయ్యావధాని, వెణుతురుపల్లి విశ్వనాధకవి, కొడిచర్ల శ్రీనివాసకవి, కానాల నరసింహకవి,ఆధునికులలో చెదలువాడ సుందర రామ శాస్త్రి, అల్లమరాజు సుబ్రహ్మణ్య కవి, నోరి గురు లింగ శాస్త్రి, ఎస్ శఠకోపాచారి మొదలైనవారు శేషధర్మాలను ప్రబంధాలుగా కూర్చారు. వీరందరికీ ప్రాచీనుడు తురుమిళ్ళ రామన అని రామరాజుగారి అభిప్రాయం. కోడి చెర్ల, కానాల వారి గ్రంధాలు ముద్రింప బడలేదని మిగిలినవారివన్నీ ముద్రితాలేనని కానీ రామన గారి గ్రంథం అముద్రితం అనీ రాజు గారు ఉవాచ. కాలం 16వ శతాబ్దం. వనపర్తి సంస్థానం వారు ఆంధ్ర సారస్వత పరిషత్తుకు ఇచ్చిన వ్రాత ప్రతి ఉన్నది.

మొదటిపద్యం –

“శ్రీమించన్ సరసోదయుండయి, మహా సింహాసనా రూఢుడై-దామస్ఫూర్తి నెసంగి తమ్ములకు సత్యానంద సంధాయియై

ప్రేమన్ జక్రమునేలు శార్వర హరున్ శ్రీరామ ధాత్రీశ భా –వామేయ ప్రథ మానుడై యలరు పద్మాదీశ్వరు న్ గొల్చెదన్ “

ఆశ్వాసాంత గద్యం లో “నందవర వంశ సుదాంభోనిదాన సుధాధామ, మనీషా నిర్జిత భోగిరాజ నాగారాజామాత్య తనూజ, సకల విద్వజ్జన జేగీయమాన సద్గుణ సాంద్ర తురుమిళ్ళరామన కవీంద్ర ప్రణీతంబైన”హరివంశోక్త శేష ధర్మబు “నందు సర్వంబును అష్టమాశ్వాసము. “అని తనగురించి చెప్పుకొని శ్రీరామునికి అంకితం చేశాడు కవి. రెండవపద్యం లో సీతాసాధ్వి వర్ణన చేశాడు. తర్వాత రామ సోదరులగురించి చెప్పాడు. తనగురువు రఘురామ భట్టా చార్యుడని అన్నాడు. కంచర్లగోపన్న అనే రామదాసు కూడా ఒక రఘునాధ భట్టాచార్యులకు అంజలి ఘటించాడని బిరుదరాజు వారన్నారు. తర్వాత పూర్వకవులను, ఆ తర్వాత తనకు తోడ్పడిన కవిమిత్రులను పేర్కొన్నాడు. అందులో “అత్యుత్తముడు భద్రిరాజు తమ్మన సూరి “అన్నాడు. ఈయనకావ్యం కూడా మరుగునపడి పోవటం దురదృష్టం.

కలలో శ్రీరాముడు కన్పించిన వర్ణన పద్యం మొల్ల పద్యాన్ని పోలి ఉంటుంది. -

"పెడద కన్నులవాడు పేల్పురా రతనంబు నిద్దంపు మై నిగానిగలవాడు –మందహాసమువాడు,మందార శాఖి శాఖోప మాయత భుజాయుగమువాడు

మెరుగు చెక్కులవాడు, మేలి పున్నమ చందమామ గేరెడు ముద్దుమోమువాడు –మణి కిరీటమువాడు, మహనీయ ముక్తాసరంబులు గల పేరురంబువాడు

తళుకు బంగరు వ్రాత దువ్వలువవాడు –జనక నందన చెంగట దనరువాడు

రమ్య భక్తాను వర్తి శ్రీరామమూర్తి –యలర సాక్షాత్కారించి యిట్లనుచు బల్కె".

"తురుమిళ్ళ కులాబుధిపూ-ర్ణరాజన్యధిరాజ రామన సుధీంద్ర భళీ

హరివంశ శేష ధర్మము –ఉురుమతి తెనుగించు భాగ్యమొదవెన్నీకున్ "

అని మెచ్చి "శేష ధర్మ పావన చరితంబు తన్మహిమ వాక్పతి కైన గణింప శక్యమే"అని చెప్పాడు జగదభిరాముడు. రామనకవి కూడా పోతన కవి లాగే దీన్ని తనకు పూర్వం ఎవరూ రాయకపోవటం తన అదృష్టం అనుకొన్నాడు. గౌతమ గోత్రీకుడైనకవి గోత్రకర్త గౌతముడని,ఆవంశం లో తిమ్మన, రామన,పెద్దఎల్లయ వగైరాలతర్వాత 12వ వాడైన లోకన్న గోపమ్మ దంపతులకు చిట్టినమంత్రి, పాపన, రామనమంత్రి జన్మించారని చెప్పాడు. తర్వాత ప్రభువుల వర్ణన వారి ఉదారత రాసి వేములపుర పాలకుడైన కూనపులి చిన్ననాయకుడు కార్యనిర్వాహకర్త అన్నాడు. ఈ గ్రామం కడపమండలం పులివెందుల తాలూకాలో ఉంది.. కడప మండలం లోని కుమాళ్ళకాల్వ, వేల్పుల పులివెందులమండలం లో పుణ్యకార్యాలు చేశాడుకవి.

రామనమంత్రి చిత్ర బంధ కవిత్వం" పేనటం "లోనూ దిట్ట. నాలుగవ ఆశ్వాసం చివర భుజంగ ప్రయాత గర్భిత స్రగ్విణి వృత్తం రాశాడు –

"రాజమానోదయా రమ్య తేజోహరీ - యాజి భూ నిర్భయా, యాత్మనానాహరీ

భ్రాజితార్యాశయా మ్రుద్రు వాటీ హరీ –రాజితార్కాన్వయా రావణారీహరీ"

పంచమాశ్వాసం చివర ఖడ్గబంధంతో ఒకపద్యం రాసి తన సత్తా ఏమిటో చాటాడు రామన కవి. -"ధీరవార సాహసార్క దివ్య సేవ్యభవ్యదా –దారితోగ్ర పంక్తికంఠదక్షజాభి వర్ణితా

తారహార తారకావదాతసద్గుణాస్పదా-దారుణాఘుమేఘు మారుతా వనవ్రతా "

ఇలాంటి ప్రతిభ, వ్యుత్పత్తులున్న తురుమిళ్ళ రామకవి "హరివంశ శేషధర్మప్రబంధ కావ్యం "వెలుగు చూడకపోవటం తెలుగువారి దురదృష్టమే.

## 7 ఇనుగండ్ల కృష్ణ ప్రధాని

"ధర్మరాజాశ్వమేధం "అనే అయిదు ఆశ్వాసాల ద్విపదకావ్యం రాసిన ఇనుగండ్ల కృష్ణ ప్రధాని ఏ కాలం వాడో తెలియదు. అతని కావ్యం వ్రాతప్రతికూడా శిధిలావస్థలో దొరికింది. దీన్ని శ్రీరంగపతికి అర్పితం చేశాడు కవి. ఆశ్వాసాంత గద్యం లో తండ్రి ఇనుగండ్ల సోమమంత్రి అని, తిరుమల వేంకటేశ దేశికుని చరణ సేవకుడైన తాను రాశానని చెప్పాడు. దీనినిబట్టి కవి ఆశ్వలాయనస గోత్రీకుడని,నందపురాగ్రహారవాసి అని తెలుస్తోంది. ఇనుగంటి వెంకన్న అగ్రహారం, నందపురి వలస అనే గ్రామాలు విశాఖజిల్లా గజపతినగరం తాలూకాలో ఉన్నాయని, కవి ఇక్కడి వాడోకాడో చెప్పలేమని బిరుదరాజువారన్నారు. గద్వాలలో తిరుమలవంశీయులన్నారని రాజుగారన్నారు.

ద్విపదకావ్యాన్ని కవి శ్రీరంగనాయకస్వామి స్తోత్రం తో ప్రారంభించాడు.

"శ్రీలక్ష్మి యనుమించు చెలువు వహించు –నీలమేఘుస్ఫూర్తి నెరమించు మూర్తి

కావేరి నడుమ భక్త జనావళి బ్రోవ –తావేరి కొనియున్న ధర్మానువర్తి

అనుపమ శంఖ చక్రాది సమస్త –ఘనసాధనంబుల గనుపట్టు దీరు

ప్రణవ మంత్రాస్పద సంధాయి సకల సంస్థాయి – శ్రితపుణ్య ఫలదాయి శ్రీరంగశాయి

పాద సరోజముల్ భక్తి సేవించి -ఆ దేవదేవుని ఆత్మలో నుంచి "

జైమిని భారతం లో "ధర్మమర్మములకు దావలమైన, ధర్మరాజేశ్వమేధ విదానమేను దేవకీ సుతు కృపద్విపదకావ్యంబు –గావింతు "అని చెప్పి కథాక్రమమ వివరించాడు. సరళమైన కవిత్వం తో మనసుకు హత్తుకోనేట్లు రాశాడు. వ్యాసుడు ధర్మరాజుకు హయమేధ విధానం సవిస్తరంగా తెలియజేసి అంతర్హితుడయ్యాడు..

## 8 పూడూరి కృష్ణయామాత్యుడు

భగవద్గీతకు అనువాదం తెలుగులో చేసిన పూడూరి కృష్ణయామాత్యుడు 18వ శతాబ్దివాడు. యోగానంద గురువరుని శిష్యుడను అని చెప్పుకున్నాడు. తన అనువాదానికి "శ్రీ భగవద్గీతార్ధ దర్పణం "అని పేరుపెట్టాడు అయితే యోగానంద అవధూత "గురు శిష్య సంవాదము ",ఆత్మైక్య గీత"ద్విపద గ్రంథాలురాశాడు. పూడూరు గద్వాలకు దగ్గరున్న చారిత్రిక ప్రదేశం. జైన శైవ వైష్ణవాలకు నెలవు. అవధూతగారి రచనలు తెలంగాణలో బాగా ప్రచారంగా ఉన్నాయి –

"------(శిధిలం )మహిన్ జిన్మాత్రమై నిత్య శో –భా సంపన్నత చే, త్రిమూర్తికలనన్ భాసిల్లు బ్రహ్మంబు, నెం

తే సమ్మోదమునం భజించి, గురుభక్తిన్ నే కృతార్ధుండనై-వ్యాసుం గొల్చి సరస్వతిన్ దలచెదన్ భవ్యార్ధ సంసిదికిన్"అని మొదటిపద్యం రాశాడు. తర్వాత వచనం లో "శ్రీభగవద్గీతా శాస్త్రంబంధ్రభాష రచియింపంబూని రెండవ అధ్యాయంబు మొదలుగా భగవంతుండు అర్జునునకు తత్వోపదేశంబొసంగె గావున సాంఖ్య యోగం" నుంచి ప్రారంభిస్తున్నానని చెప్పాడు. ఒకేఒకపద్యము, చిన్నపీఠికతో ముగించటం ఆశ్చర్యంగా ఉందని వేదాంతం కవిని మింగేసిందని ఇంతటి విరాగి చరిత్రలో కనిపించడని బిరుదరాజువారు అన్నారు. అంటే అర్జున విషాదయోగాన్ని వదిలేశాడు కవి.. కనుక కావ్యం 17అధ్యాయాలకే పరిమితం.

"ఉదితాశ్రు పూర్ణ నేత్రుడు –సదయ హృదయుడై గిరీటి సమ్మద మెదలో

వదలుచు శోకంబందగ-పదిలంబుగ శౌరి పల్కె భాసుర ఫణితిన్"

అనే కందపద్యం సాంఖ్య యోగం లోని "తంతథా కృపయావిష్టుం"శ్లోకానికి అనువాదం. తర్వాత ఉన్న మూడు శ్లోకాలభావాన్ని ఒక్క సీసం లో కుదించాడుకవి. ఆ తర్వాత -

"భోగములర్ధ కామములు బొల్పగు రక్త విలేపనంబులౌ –నా గురుమిత్ర హంతనయి, యట్టిది నే భుజియింప నేరను-

ద్వేగమతిన్ విధర్మ గతి విశ్రుతమౌ సమర ప్రకాశితో –ద్యోగము బూనగా జయము నోజ బరాజయ మెట్టు లుండునో"అని సందేహించాడు కిరీటి.

శ్రీ కృష్ణుడు అర్జునునికి చెప్పిన స్థిత ప్రజ్ఞుని లక్షణాలను తరువోజ లో చెప్పాడు. మరో తరువోజలో "తగునింద్రియముల చేతను విషయాళి నాహరించుట( నిరా )హారియనగ"అని చెప్పి కందం లో-

"స్థిరమగు ప్రజ్ఞ కలనం –బిరువొందుదు సాధనేచ్చ నెనయు నపుడ త

ద్గురుతర యత్నము జేయుట –పరమావశ్యకమ్ము సుమ్ము పాండవ వర్యా "

ఇలాకొనసాగించి ఉపేంద్ర వజ్ర లో –

"ఈ సాంఖ్య యోగంబున నింద్ర సూనున్ –ధీ సంస్తుతిన్ బూన్చిన దేవదేవున్

శ్రీ సక్త పాదాబ్జుని చిత్స్వరూపున్- నే సంస్తుతిన్ జేసెద నిర్మలాత్మున్ "అని పూర్తి చేసి గద్యం లో –శ్రీ మద్యోగానంద గురువర కరుణా పాత్ర వాసుదేవ ద్వాదశాక్షరీ మంత్రరాజ విద్యానుష్టాన పవిత్ర కౌండిన్యసగోత్ర పూడూరి కొదండయామాత్యపుత్ర, కృష్ణయ నామధేయ ప్రణీతంబైన శ్రీ భగవద్గీతార్ధ దర్పణంబు నందు సాంఖ్యయోగంబను ద్వితీయాధ్యాయంబు. శ్రీ యోగానంద గురవేనమః –శ్రీ వేద వ్యాసాయనమః.

ఇది కేవలం గీతకు అనువాదమేకాక "టీకాప్రాయమైన అనువాదం "అన్నారు రామరాజుగారు

## 9 లయగ్రాహి గరుడాచలకవి

"కౌసలేయ మహా ప్రబంధం "అనే అయిదు ఆశ్వాసాల కావ్యరచన చేసిన లయగ్రాహి గరుడాచలకవి చరిత్రకెక్కని చరితార్ధుడు. పాకనాటి రెడ్ల బోరవెల్లి సంస్థానకవి. మిడమిళ్ళ గోత్రికుడు. ఇంటిపేరు ముష్టిపల్లి.. ఒకప్పుడు స్వతంత్ర సంస్థానం గాఉన్న బోరవల్లి తర్వాత గద్వాల సంస్థానం లో కలిసిపోయింది. బోరవల్లి రాజుల

కులదైవం శ్రీకేశవస్వామికి కవి తన రచన అంకితం చేశాడు. సంస్థానాధీశ్వారుల చరిత్రకూడా ఇందులో రాసి ప్రభుభక్తి చాటుకున్నాడు, గద్వాల పెద సోమభూపాలునికి మనకవి సమకాలీనుడు.

మొదటిపద్యం –

ఉ-శ్రీ విలసిల్లు బోర్వెలి పురిన్ తెలిదీవిని నిల్చు వైఖరిన్ –భావము రంజిలన్ నిలిచి భాసిలు కేశవదేవు డాత్మ వ

ఙ్లో వితతాలయంబునను కూర్మిన నిల్పిన రీతి నిల్పుతన్ –శ్రీవనితా శిరోమణిని,శ్రీ గిరియమ్మ గృహాంతరంబునన్ "

తర్వాత మిగిలిన దేవతల, బోరవెల్లి రాజుల మరో ఇలవేల్పు పోల్గంటి సోమేశ్వరస్వామిని స్తుతించి, తొమ్మిదవ పద్యం లో భారత,రామాయణాలు రాసినకవులకు అంజలి చేర్చి,నాలుగోపాదం లో మురారి కవిని "కవి సన్నుతేత జగన్నాటకో ద్వృత్తి పేరెన్న నలరు మురారి గొలుతు "అని స్పెషలైజ్ చేశాడు. అంటే మురారి అనర్ఘ రాఘవ నాటకమేకాక జగన్నాటక రూపకాన్ని కూడా రాసినట్లు కవి చెప్పాడు. శేషాచలుడు అనేకవి జగన్నాటకం అనే ప్రబంధం రాశాడని, ఇది ప్రబోధ చంద్రోదయంలాగా వేదాంత పరమైనదని బిరుదురాజువారు పేర్కొన్నారు. గరుడాచలకవి రచనకూడా ఇలాంటిదేనేమో.

11నుంచి 16వ పద్యం వరకు తనపూర్వులగురించి చెప్పాడు. అందులో మొదటివాడు మాధవకవి క్రష్ణదేవ రాయలచే సత్కరింపబడ్డాడు-

"మాధవ భక్తి యుక్తు డసమాన కవిత్వ గురుండు కృష్ణ-రాయాధిప దత్త సద్గజ వరాది మహాబలశాలి, గం

గా ధర కీర్తి సాంద్రుడు జగత్కవి చంద్రుడు మత్కులేంద్రుడౌ-మాధవు డస్మదాదులకు మాన్యుడుగాడె తలంచి చూచినన్ ".

రాయలచే సత్కరింపబడిన ఆమాధవకవి రచనలు ఏమయ్యాయో తెలీదు. మాధవకవికున్న ముగ్గురు కొడుకులలో రెండవవాడు రామభద్రుడి చిన్నకొడుకుకి తిమ్మయ్య, కృష్ణయ్య రామన్నలు కొడుకులు. రామన్నకు నారాయణ, సీతాపతులు కుమారులు మనకవికి తాతలు. లయగ్రాహి గరుడాద్రి అనే మనకవి తండ్రి నృసింహకవి. కనుక వంశం లో అందరూ కవులే. తర్వాత శార్దూలం లో తన గురువు యోగానంద కవీంద్రుడు అని చెప్పుకొన్నాడు. బహుశా మనకవికి అతడు అన్నయ్య అయి ఉంటాడని రాజుగారి ఊహ. కందంలో తన తండ్రులగూర్చి –

"సీతాపతి తనయుల వి-ఖ్యాతుల సంజీవి వెంకటాఖ్యుల సుకవి

వ్రాత స్తుత కవితాఘను –మా తండ్రి నృసింహ కవిని మాటికి దలతున్ "

తర్వాత కుకవి నిందా చేశాడు. ఒకరోజు కలలో కేశవస్వామి కనిపించి "బాలక నా గృహంటిపుడుబాయక విద్యలు నేర్చినావు –భూపాల సభాంతరాళముల పండితులౌనన"సత్కవిత్వం రాశావని, కౌసలేయ చరితం రాసి అంకితమివ్వమని కోరాడు. తనకు గుడికట్టిన గిరియమ్మ తనపై కృతి రచన కోరిందనీ చెప్పాడు

"కం –"గిరియమ్మ నాకు మెచ్చుగ-శరణము గట్టించి, యొక్క సత్కృతి నాపై

విరచింప జేయవలెనని –కరమరుదుగ దలచినది జగద్ధితమిదియున్ "అన్నాడు స్వామి. ఆమెకుకూడా కలలో కన్పించి నువ్వు రాస్తున్నట్లు చెప్తాలే అనీ అన్నాడు.. నీ అభీష్టాలు తీర్చే నీ ఇలవేలుపు శ్రీ నరసింహ మూర్తిని నేనే "అని అభయమూ ఇచ్చాడు కేశవుడు. మర్నాడు ఉదయాన లేచి కృష్ణ వేణికి వెళ్లి పుణ్య స్నాదులు చేసి గిరియమ్మను సందర్శించగా ఆమె కృతి రాయమని కోరి సత్కరించి పంపింది.

కవి గిరియమ్మ వంశ చరితను నిండుగా రాశాడు. గిరియమ్మ గద్వాలరాజు పెదసోముని కూతురు, బోర్వెల్లి చినసోముని భార్య గద్వాల, బోర్వెల్లివారిది ఒకటే గోత్రం. అంటే సగోత్రీకులమధ్య వివాహం అన్నమాట. అయోధ్యానగర వర్ణన పద్యం –

"శ్రీ నిలయాగ్ర జస్థితి ధరించి గురూన్నత రీవిచే సుద-ర్మానగు భోగభాగ్యము లహర్నిశ మీయగనోపిసాద శో

భానిరవద్య నిర్జర శుభక్రియ లూని యసాధ్యమై యయో –ధ్యానగరంబు పోల్చు వసుధన్ వసుధామ నియుక్తి స్వర్గమై "

గ్రంథం రాయబడిన లిపి ఒకరకంగా, ఆశ్వాసాంత గద్యాల లిపి మరొక రకంగా ఉందని ఆచార్య బిరుదరాజువారన్నారు. ఒకగద్యం లో"అష్టవిధ భాషా కవిత్వ సంపన్న సారస్వ తాభినందిత "అనే విశేషణం అధికంగా కనిపించిందట. అదే కాలం లో గిరియమ్మ దత్తపుత్రుడు వెంకటపతి కాలం లో చింతలపల్లి ఛాయాపతి అనేకవి రాఘవాభ్యుదయం అనే మహా ప్రబంధాన్ని రాశాడట

## 10 నాడ గౌడు ముష్టిపల్లి వెంకటభూపాలుడు

గద్వాల సంస్థానం లోని రాజవోలు ను ఇప్పుడు రాజోళి అంటున్నారు, ఇక్కడ తుంగభద్రానది తుంగ, భద్ర అనే రెండు పాయలుగా ప్రవహిస్తుంది. రెండుపాయలమధ్య ఏర్పడిన లంకలో రాజవోలు కోటలు, ప్రాసాదాలు శిధిలమై కన్పిస్తాయి. దుర్గమధ్యమం లో శ్రీ రామనారాయణ ఆలయం, ఊరికి రెండుమైళ్ళ దూరం లో నది ఒడ్డున రామేశ్వరాలయం, ఆలయం ముందు చాళుక్య భూలోకమల్లుని శాసనం ఉన్నట్లు శ్రీ మారేమండ శ్రీనివాసరావు తెలియజేశారు. రెడ్డిరాజులైన పాకనాటి, మిడిమిళ్ళ గోత్రీకుల ఇంటిపేరు ఒకటే "ముష్టిపల్లి ".రాజవోలు రాజధానిగా ఈ రెండుప్రాంతాలను పాలించారు. కొంతకాలం స్వతంత్రంగా ఉండి తర్వాత గద్వాల సంస్థానం లో కలిసిపోయారు.

రాజవోలు రాజు నాడగౌడు వెంకటభూపాలుడు అనేక గ్రంధాలు రాసిన భక్తకవి కూడా. ఈతడు రాసిన "దివ్య దేశ మహాత్మ్య దీపిక "అనే ద్విపదకావ్యం 23తాళపత్రాలలో లభించింది. ఇందులో 108 వైష్ణవ దివ్య క్షేత్రాలు వాటి మహాత్మ్యం వర్ణించబడి ఉంది. మొదట్లో కృతికర్త, కృతిభర్త వంశ చరిత్రలు చెప్పాడు. ఈ కృతిని రాజవోలు కేశవస్వామికి అంకితమిచ్చాడు. ఈ రాజులకు ప్రోల్గంటి సోమేశ్వరుడు మరొక ఇలవేల్పు. గ్రంధకర్త మూలపురుషుడు ముష్టిపల్లిఇమ్మడి ఎల్లారెడ్డి సోదరుడు చినరెడ్డి.భార్య లక్ష్మాంబ.వీరికొడుకు పిన విభుడు కొడుకే మన వెంకట భూపాలుడు.

సరళమైన తెలుగులో గ్రంథం నడిపించాడు. అడుగడుగునా భగవద్భక్తి ప్రవహిస్తుంది. ఈ రాజు దీనిసేకాక "రాజవోలి వెంకటేశ్వర శతకం "కూడా రాశాడు కాని అది శిధిలంగా ఉందని రామరాజుగారన్నారు. ఇందులో 108పద్యాలు. రాజవోలి వెంకటేశ్వర స్వామికి అంకితం.

కం-శ్రీ రమణీ ప్రాణేశ్వర –వారిజ లోచన మురారి ---నమ

స్కారమిదె,రాజవోలి వి-హారుని వలెకరుణ వేంకటాచల రమణా""

చివరిపద్యం - "నరహరి యెప్పుడు చాలా –నిరతము మదినమ్మినాడ,నీ దాసుని ననున్

మరువకుము రాజవోలీ –హరిలీలలను కరుణ వేంకటాచల రమణా"

శతకం లో కొన్నిపద్యాలు ర ప్రాసతో కొన్ని న ప్రాసతో కొన్ని ల ప్రాసతో, మరికొన్ని బిందుపూర్వక ద కారప్రాసతో ఉన్నాయని రాజుగారు చెప్పారు. శతకం ముగియగానే "రాజవోలి వెంకటేశ్వర కీర్తనలు "రాశాడు. అందులో తోడిరాగం ఆటతాళంలో ఉన్న కీర్తన –

"భారంపు సంసార వలల మిమ్ము చేరనైతిగా ఓరంగా –ఏ రీతిగ నను దయజూచి రక్షించెదొ కారుణ్యము మీరగా ఓ రంగా.

ఈ కీర్తనలమధ్య కొన్ని ద్విపదలు కూడా ఉన్నాయట.అందులో ఒకటి –

"శ్రీరామ చంద్ర యాశ్రిత సన్మునీంద్ర-కారుణ్య సాంద్ర భాస్కర వంశ చంద్ర "

ఒక కీర్తన శివపరంగా కూడా రాశాడు –

"మరచేవేలరా నన్నూ –కోరి చేరితి నిన్నూ

'మరచేవేలరా నన్నూ-మరువవద్దురనన్ను పరవతాల మల్లేశ్వరా "

రజతాచల నివాసా ఎప్పుడు నిన్ను –భజియింతు చిద్విలాసా

భుజగేంద్రహార –సకలభువనాదార భక్తవరదా

గజచర్మాంబర ధారా-సకలముని స్తోత్ర

నిజముగ వరము –----ద్విజరాజ శేఖరా ఎరా దిగ్విజయమీయరా

ఆనందకరమైన రాజవోలి హరి-పూనిక వేంకటేశుని మానుగ సఖుడైన మల్లేశ్వరా –దాసుని నన్నేలరా "

ఇవన్నీ 17వ శతాబ్దపు రచనలై ఉండవచ్చునని ఆచార్య రాజుగారు భావించారు.

## 11 అత్తాను రామానుజా చార్యులు

24శిధిల తాళపత్రాలలో "రుక్మిణి కొర వంజిని" ద్విపదకావ్యం రచించిన అత్తాను రామానుజాచార్యులకాలాదులు తెలియవు. ఇది ప్రాచీన యక్షగానానికి చెందిన ప్రాచీన కొరవంజి. ఇష్ట దైవతాప్రార్ధన చేసి తర్వాత తనగురించి కవి చెప్పుకొన్నాడు.

"మునిగ్రామ వాసుడగు మూర్తిగలయట్టి – వనధి యగు పాండ్రాజు వంశపావనుడ

అత్తాను సంబంధమైనట్టి వాడ –అత్తాను రామానుజాచార్య సాహ్వాయుడ

కరమొప్ప రుక్మిణీ కళ్యాణ సరళి –కరమర్థితో యక్షగానంబు రీతి

కొరవంజి జేసెద కూర్మితో ననుచు –ధరణిపై మదిలోన దలచినయంత “

శ్రీరంగనాధుడు మనసులో కనిపించి కృతి రచించ మనగా ”గురుతుగా మదన గోపాలునకు –కొరవంజి జేసెద కుంభిని పెలయ ‘అని మొదలుపెట్టి రాశాడు. గుంటూరు, మహబూబ్ నగర్ జిల్లా,లలో మునిపల్లె గ్రామం ఉన్నది. కవి తండ్రిపేరుకాని, తాతపేరుకాని” పొంద్రాజు” అయి ఉండాలని బిరుదరాజువారు ఊహించారు. కాలం మాత్రం 16 వ శాతాబ్దికాదు అన్నారు. కావ్యం చివరలో కృతిభర్త అయిన స్వామిని స్తుతించాడు. కురవంజిలో జంపె సువ్వాల మంగళహారతులు ద్విపదలు ధవళాలు ఉన్నట్లు రాజుగారన్నారు.

రుక్మిణీ కృష్ణుల వివాహ సందర్భంగా కొట్నాలు దంచినప్పుడు” సువ్వాల “రాశాడుకవి

“కూరిమితో బంగారు కుందనాలో కొలుచు నించి –గారవించి సతులు రోకళ్ళు దంపుచూ

సువ్వి రంగనాధ సువ్విసువ్వి వేంకటేశ సువ్వి –సువ్వి కృష్ణరాయ సువ్విలాలె”

ముత్తైదువులు కాంతుడైన కృష్ణుని పాటలతో ఇలా స్తుతించారు –

“నాదా వినోది కృష్ణ నాధా కృష్ణా – వన్నె సన్న సూది పచ్చ గన్నెరాలు కృష్ణభోగి

సన్నరాజనాలు, జీలసర్లు దంపుచూ –ఉబ్బి నిక్కి జంగ జూచి ఉవిదలెల్ల చెమట జార

గబ్బి గుబ్బ లదరగాను కలయ దంచిరీ –ఎంచి పెండ్లి మోపు ఇంట –

పంచగతుల జేరి వాయించ దొణగిరీ”.

## 12-సర్వజ్ఞ పద్మనాయక భూపాలుడు

అత్తాను రామానుజా చార్యుని ;;శ్రీ రుక్మిణి కురవంజి “తాళపత్ర గ్రంధం లోనే సర్వజ్ఞ పద్మనాయక భూపాలుని “సారంగధర చరిత్ర –యక్షగానం “కూడా ఉందట. కులం, పదవులు, బిరుదాలు మాత్రమె కావ్యం లో ఉన్నాయి.సర్వజ్న బిరుదు ఇద్దరు ముగ్గురులకు ఉంది. చాలాశిధిలంగా ఉన్న గ్రంధం చదవటానికి ఇబ్బంది గా ఉందని బిరుదరాజు గారువాచ. కంట్లో వత్తులు వేసుకొని ప్రతి అక్షరాన్నీ కొన్ని వారాలు చదివారట రాజుగారు. ఇక్కడ మనకు వ్యాఖ్యాన చక్రవర్తి మల్లినాధసూరి పడిన కష్టాలు గుర్తుకొస్తాయి. ఆయన కంటి రెప్పలకు దారాలు వాటికి చివర రాళ్ళు కట్టుకొని సంస్కృతకావ్య వ్యాఖ్యానం రాశాడు చివరి రోజుల్లో.

ఆటతాలం లో –శ్రీ విభుని బూజించి వాక్పతి ------యెపుడు-నవని పార్వతీశ్వరు ప్రస్తుతింతున్

విఘ్న రాజుకు మొక్కి ----వాగ్వితతి నిర్విఘ్నముగ శ్రీ యక్ష ---వేడుకొందున్”

వ్యాసభట్టార్య వాల్మీకి మదిని గొలిచి –ఆశుగ బ్రహ్మాది మునులకు నాంజనేయు

పూని దత్తిలచరన కోహల క్రుంగవాజి ల –గాన శాస్త్ర ప్రబంధ కర్తల కరుణ వడసి

తివిరి బాణమయూరుల చిత్తమున నిలిపి తక్కిన కవి వరేణ్యుల కెల్ల”

తర్వాత ద్విపదల పేరిటఉన్న పంక్తులున్నాయి. తర్వాత వచనం ఉన్నది –ధనకనక వస్తు వాహన సమృద్ధి వడసి ---నిత్యమై విజయలక్ష్మి గలిగి ----లక్ష్మి పరిపూర్ణమై “

కవి తాను “కాచమ దేవి గారాల సుతుడను “అని చెప్పుకొన్నాడు. గురువుఆచార్య మణి భట్టరు, కోరుకొండకు చెందిన పరాశరభాట్టరే మణిభట్టరు అంటారు రాజుగారు. శ్రీశైలానికి ఉత్తరానున్న ఉమామహేశ్వరమే కవి చెప్పిన ఉమాచలం అన్నారు.

తలవరులమాటలను ఉత్కళికలో రాశాడు –”ఉభయకుల పావనుడగా ఉద్భవించి –పరగిన శుభ గుణోజ్వల సజ్జనుడ రాసుతుడ---అయ్య ఇదిగోరాజు మనసు లరసి చూసి –పోయిరి చయ్యనను పయనంబుగావలె సజ్జనుడా “

ఇది యక్షగానం అవునోకాదో, కవి సర్వజ్ఞుడు రేచర్ల వంశంవాడో కాదో ఇంకా తేలాల్సిన విషయం అన్నారు బిరుదరాజు వారు. ఇంత శ్రమపడి ఈ కృతి విషయాన్ని లోకానికి అందించిన ఆచార్య బిరుదరాజువారికి తెలుగుజాతి ఏమిచ్చి ఋణం తీర్చుకోగలదు ?

## 13 ఏదుట్ల శేషాచలుడు

జగన్నాటక కర్త ఏదుట్ల శేషాచలుడు గద్వాల సంస్థానకవి. కవి సంగీత సాహిత్య భరత శాస్త్రాది కళలలో నిష్ణాతుడు. కౌండిన్య గోత్రుడు. చెన్నయ పండితుని పౌత్రుడు, నాగభూషణ పండితుని పుత్రుడు. వనపర్తిదగ్గర ఖిల్లా గణపురవాసి. ఏదుట్ల నుంచి ఇక్కడికి వచ్చి స్థిరపడ్డాడు. పూర్వకవి స్తుతిలో పింగళి సూరన ను స్మరించటం చేత అతని తర్వాత కాలం వాడు అనుకోవచ్చు. జగన్నాటకం అయిదు ఆశ్వాసాలకావ్యం. గ్రంథం బాగా జీర్ణావస్థలో ఉన్నది.

మొదటి పద్యం

"శా.శ్రీ సీతాంత మండలంబున వర శ్రీ గంధమున్ బూసి సా-ఖ్యానంబౌ తన విశ్వరూపము కడున్ భద్రంబుగా వ్రాసి యో

హో సాధ్వీ బహుభారమ య్యెనని నర్మోక్తుల్ పచారింపుచున్ –హాస క్రీడలు సల్పు రాఘువుడు కృత్యాదికృపన్ బ్రోవుతన్ "

పూర్వకవులు ఎవరూ చేయని నవగ్రహ, అష్ట దిక్పాలక, 45గురు మునులను స్తుతించాడు.అందులో ఆంజనేయ స్తోత్రం –

సీ-"ఏ మహాసత్త్వుండు రామకార్యంబున గిరులెల్ల నచ్చన గిల్ల లాడె-ఏ బలప్రఖ్యాతు డేడు వారాసులు కాల్వల రీతి లంఘనము జేసె

ఏ సింహ విక్రముం డెలమి రక్షః కుంజరాలి నీగల రీతి నణచి పుచ్చె-

ఏమహా సమకాయు డింద్రారి ఖండించు పేళతారలు కటి ప్రేల బెరగె

దారగిరి చాలన క్రియా దక్ష శక్తి –పాత సౌమిత్రి జీవమే ప్రభుడొసంగె

నట్టి గుణవంతు ధీమంతు, నదిక శాంతు –ప్రకట జయవంతు హనుమంతు బ్రస్తుతింతు"

తర్వాత సుకవి స్తుతి కుకవి నింద చేసి, తనవంశం గురించి చెప్పాడు గురువు పేరు చెప్పకుండా "గురువు "అని మాత్రమె చెప్పాడు –

"అమర మంత్రోపదేశంబు విమలతయును –పుణ్య జనవర్ధనంబును, బుధ సమీప

వర్తనము, కావ్యచింత యవ్యాయ నివాస –మడరు శ్రీ గురుదేవు నే నభినతింతు " అనటం లో కవి ఆధ్యాత్మిక స్థితి గోచరించిందన్నారు రాజుగారు. తనవంశ మూలపురుషుడు ఎర్రయ. చివరికి నాగభూషణ సుబ్బమాంబలకు కవి పుట్టాడు. తాతముత్తాతలు ఎక్కడి వారో చెప్పలేదుకాని తండ్రి "ఖిల్లా గణపుర మందిరుడు "అన్నాడు. భరత శాస్త్ర ఆధ్యాత్మ విద్యాను సారం అయిన "జగన్నాటకం " కథా సూత్రం చెప్పాడు.

" మేటిగవిశ్వరూపుడు నమేయ గుణుండగునట్టి బ్రహ్మ, జం –జాటము మీర నొప్పగ నజస్రము ---టకైటనర్చినీ

నాటక మాతకుందగిన నాణేములైనటు వంటి వస్తువుల్ –దీటు కోనంగ జేసె నతి ధీరత నా ----దంబు నొందగన్ "

కం.-వడిగల తాండంబనగా –కడువడి లాస్యంబనంగ ఘనమగు నీ రెం

డడ రించి వీ ---దగి-- -నదలక సామాజికంబు సంపాదించెన్ "

కం-వర తాండవ నటనమునకు –పురుషుడువలె,లాస్య నృత్యమునకు చతురతయై

సరసికయగు సతిగావలె -నిరవుగ నీ ఇచ్చ ---ములు జూడన్ "

ఇలా చూడగానే ఒక అవ్యక్త మిధునం ఆవిర్భవించటం వలన, సకల సామాజిక ఉత్పత్తి జరిగిందనే సృష్టి క్రమం చెప్పాడు. సామాజిక స్తవాన్ని స్రగ్విణి పంచచామరం, వనమయూరి, భుజంగప్రయాత, దోదక, మత్తకోకిల వృత్తాలలో చేశాడు. తర్వాత వచనం, చూర్ణిక,ఆశ్వాసాంతపద్యాలు రాశాడు. ఈ మహాకావ్యం లో అహంకారుడు అనేవాడు మమకారి అనే భార్యతో తన ప్రభావం చెప్పటం, మోహుడు తనస్థితి చెప్పటం, కామం రతి,లోభ తృష్ణ వర్ణన వీరిమధ్యవైరం వివేకుడు సుమతి సమేతంగా వచ్చి కలహం మాన్పించటం ఉంటుంది. ప్రబోధ చంద్రోదయం లోని కథపోలిక కొంత కనిపిస్తుంది.

శేషాచలుని రెండవ కృతి "బొరిగడుపుల నరసింహ శతకం ".అన్నీ సీసపద్యాలే. నృసింహ స్వామిని ఆపాదమస్తకం వర్ణించాడు. స్వామి వైభవ పద్యాలు షోడషోపచారాలుగా ఉంటాయి. ఎత్తు గీతలలో"ప్రీతి ననుబ్రోవు దయతోన యాతుధాన –గణ కరటి సింహ సింగ పట్టణ నృసింహ "అనే ఉంటుంది. మచ్చుకొక పద్యం –

"ప్రాగ్గిరి మీదను బాలాతపచ్చద సాంద్ర దీధితి నెల్ల సమయ జేసి –కమల కైరవ షండకర్ణికాంతస్థమౌ పు ప్పొడికాంతుల గప్పి పుచ్చి

పదియారు వన్నెల బరగి సువర్ణమౌ బంగారు చాయలపాటి నొంచి

దిననాథుడస్తమించిన వేళల సెలంగు సాంధ్య రాగంబుల సవురు సవిరి

యలరి పీతాభమై చెలువమరుచున్న-వస్త్ర యుగ్మంబు నొసగెద వసుమతీశ

"ప్రీతి ననుబ్రోవు దయతోన యాతుధాన –

గణ కరటి సింహ సింగ పట్టణ నృసింహ ".

ఈ శతకం తర్వాత తాటి ఆకులపై మూడు పద్యాలు నారాయణ పుర కృష్ణునిపై రాశాడు. అదెక్కడున్నదో తెలీదు అంటారు ఆచార్య బిరుదురాజు వారు –చివరి గీతపద్యం –

"వెలది బోలు వెల్లి విరియంగనిన్ను దా –నమర వాడి దేల యందె బొమ్మ

ఎత్తుకోలు దిన్నె లిట్టి పల్లూరకె- యేల నీకు దాని నేలు కృష్ణ "

" ఏదుల శేషాచలకవి ఏకాలం వాడో తెలియకపోయినా, ఆయన జగన్నాటక కృతి" త్రికాలాలకు చెందినది "అని ఆచార్య బిరుదరాజువారు గొప్ప సర్టిఫికెట్ ప్రదానం చేశారు.

## 14 పొత్తపి వెంకటామాత్యుడు

"నూట ఎనిమిది దివ్య తిరుపతుల సుబ్బరాయ శతకం "రాసిన పొత్తపి వెంకటామాత్యుడు రాయలసీమకవి. అన్నీ సీసాలే. మొదటిపద్యం చివర –మహితరోపాయ ధూర్జటి మతః విదేయ –సూర్య శతకోటి నిభకాయ సుబ్బరాయ "అని ఉంది. ప్రారంభం లో అశ్వత్థ నారాయణుడు. పెన్న జూటురి చేన్నరాయలను, వజగిరి నృసిమ్హుని, కోన రంగేశుని, హొన్నూరి రాయని స్తుతించటం చేత ఈ క్షేత్రాలన్నీ అనంతపుర మండలం లో ఉండటం వల్లా కవి రాయలసీమ లోని అనంతపురం మండలం వాడై ఉంటాడని రాజుగారి అభిప్రాయం. 2నుండి 108పద్యంవరకు 108 దివ్య తిరుపతుల వర్ణన చేశాడు. 109పద్యం లో తనగురించి చెప్పుకొన్నాడు

"ముదితాత్ముడగు పెదముల్కి వెంగనకేను పౌత్రుండ, హరితస గోత్రజుండ-అనఘు పొత్తపి చెన్నయామాత్య సూనుండ, మహిత చారిత్రుడ,మానధనుడ

కామక్షమాంబను ఘనసాధ్వి గర్భ జలధి చంద్రుడ, మహా సరసి గుణుడ-సిరిమించు రాయల చెర్వు యబ్బారుడ?,ఘనుడ వెంకట నామకవి వరుడ

ధర్మ చరితుండ నిరతాన్న దాతవనుచు –నీకు మ్రొక్కెద నను బ్రోవు లోక వంద్య

మహితరోపాయ ధూర్జటి మతః విదేయ –సూర్య శతకోటి నిభకాయ సుబ్బరాయ ".

కవి వంశంవారు పొత్తపి నుంచి వచ్చి అనంతపురం లో స్థిరపడ్డారు కనుక ఇంటిపేరు "పొత్తపి "అయింది. తాతపేరుకు ముందు పెదముల్కి, తండ్రి పేరుముందు పొత్తపి, తన పేరుకు ముందు రాయల చెరవు ఊళ్ళ పేర్లున్నాయి కనుక "మూడుతరాలలో మూడు ఊళ్ళ చెరువు నీరు త్రాగి ఉంటారు "అని చమత్కరించారు ఆచార్య రాజుగారు. 110వ పద్యం లో ఈ కృతికి తనను ప్రోత్సహించిన వారి గురించిరాశాడుకవి. కవి శైలీ రమ్యతకు ఒక పద్యం-

"వినయ భక్తి స్థానమున భుక్తినొసగెడు దేవుని నెదనెంచి దిగులు బూని –సారంగముల రెంటి సారంగమున గూర్చి సారంగధరు జూచి సరసుడనుచు

పండు వెన్నెలలోనిపండు వెన్నెలగాంచి పండు వెన్నెలగల బయలు బట్టి

పరితాపమందక పరితాపమును దీర్చి పరితాపహరు గురు ప్రస్తుతించి

జ్ఞానమార్గంబు దెలిసిన మానవుండు –అధికుడన మించి సత్పథ మందకున్నె

మహితరోపాయ ధూర్జటి మత విదేయ –సూర్య శతకోటి నిభకాయ సుబ్బరాయ".

"తత్వావతార దశకం "అనే పద్యం సొరు గమనిద్దాం –

"శ్రీమద్వరంబున చెన్నొందుగుణనాథు సేవేళ నాత్మలో సెన్నికొనుచు –అల మచ్చెమై నీటి కెదురెక్కవలెగాని,మూపున పెనుగొండ మోవరాదు

ఘోణియై ముస్తెను గోరాడవలె గాని, దిగు లొందగా నోరు దెరువరాదు-దీనత నొక్కరి తిరియ గావలె గాని తెంపున నృపతుల ద్రుంపరాదు

కట్టవలెగాని రోకట గొట్టరాదు – ఉండవలెగాని కత్తి మెండొడ్డ రాదు

మహితరోపాయ ధూర్జటి మతః విదేయ –సూర్య శతకోటి నిభకాయ సుబ్బరాయ"

ఇందులో చక్కని వ్యాజస్తుతి కనిపిస్తోంది కృష్ణాజిల్లా కాసులపురుషోత్తమకవి గుర్తుకొస్తాడు

5-త్రిలోక భేది

"సకల ధర్మ సారం "కర్త త్రిలోక భేది. ఇది అసలుపేరో బిరుదో తెలీదు. పీఠిక లేని 4ఆశ్వాసాల గ్రంధం. మధ్యలో కృతిపేరు "సకలధర్మ సారాయం "అయింది. ఆశ్వాసాంత గద్య లో కవి తనను గురించి చెప్పాడు –"నవరసానుబంధ బంధుర ప్రబంధ నిబంధ చాతురీ ధురీణ, సకల విద్యా ప్రవీణ గౌతమగోత్ర పవిత్ర గౌరనామాత్య పౌత్ర,, రామయమంత్రి పుత్ర,సకల జన స్తోత్ర సంభావిత త్రిలోకభేది ప్రణీతంబైన హరి వంశము నందు "సకలధర్మ సారాయంబు నందు "కవి గౌరనమంత్రికి మనుమడు అయి ఉండచ్చునని బిరుదరాజు వారూహించారు. కాలం 1485 అయి ఉండచ్చు. శిదిలభాగం తర్వాత ఉన్న కందపద్యం, పంచ చామరం లలో శివ్వనమంత్రి శివపూజా దురంధరత్వం చెప్పాడు –

'కం-శివపూజా పరిపూర్ణా-స్తవ జంగమ పాదపద్మసంసేవక, స

ద్వివర విహార, మహామహ - కవి జన సన్మిత్ర తాపఘన సత్పుత్రా "

పంచచామరం –"సదా సదాశివార్చనాది సారసాప్త తేజ, దుర్మదా,మదాదినాగసింహ మానతస్ఫుర స్థిరా

న్వదాన్వదాను దానకర్ణ పారిజాత జాత సం-పదా పదాభిరాన లోకపావనాంగ సంప్పదా"

రెండవ ఆశ్వాసం లో కృతి పతి గురించి –

"శ్రీ మల్లికార్జునార్పిత –ప్రేమాతిశయాను రాగ పృద్వీజన సు –

త్రామ, కరుణాపయోనిధి సీమాంతర జయవిహార శివ్వగ భీరా "

తృతీయాశ్వాసం చివర చెప్పినపద్యం బట్టి శివ్వ మంత్రి అసాధారణ ప్రతిభ కలవాడని తెలుస్తుంది. అందులోని మాలిని పద్యంలో శివ్వన తల్లి మల్లమాంబ అని తెలుస్తుంది. కవికీ శివ్వనమంత్రికి ఎలాటి సంబంధముందో తెలీదు. నాలుగవ ఆశ్వాసం లో "పాండవులకు సకల ధర్మంబులు దెలుపుటయు, వారి సన్నిధికి దూత ఏ తెంచుటయు,కృష్ణుడు ద్వారక కేగుటయు అను కథలు గలవు "అని చెప్పాడు కవి.

వ్రాయసకాడు తన ఊరి పేర్లు కూడా చేర్చాడని, తప్పులుంటే క్షమించమని విన్నపం కూడా చేశాడని రాజుగారన్నారు –

పెద్దలయివారు ప్రేమతో జూచియు –దిద్దరయ్య మీరు తిట్టబోక

సద్దు శాయకురయ్య జాగేలరా మొగిలి –గిద్దె రంగధామ కీర్తి ధామా "

"కాళిదాసుకవిత్వం కొంత, తనపైత్యం కొంత"అన్నట్లు తయారు చేశాడు వ్రాయసకాడు. అతడు వెంకటేశం అనే వైష్ణవ నియోగి బ్రాహ్మణుడు. మెహబూబ్ నగర మండలం షాద్ నగరం తాలూకాలో మొగిలి గిద్దె గ్రామం ఉన్నదని,వ్రాసిన తేదీ 3-1-1646.అంటే గ్రంథంపుట్టాక 200 ఏళ్ళ తర్వాత వ్రాయసగాడు ఈ ప్రతిని రాశాడని ఆచార్య రాజుగారు చెప్పారు.

## 16 గోపతి లింగకవి

తెలంగాణలో వీర శైవాన్ని వ్యాప్తి చేసిన వారిలో మధ్యయుగానికి చెందిన గోపతి లింగకవి కూడా ఒకడు. కృతిభర్త మెదకు మండలం వాడు కనుక కవి కూడా ఆ ప్రాంతం వాడే అయి ఉంటాడని బిరుదరాజువారూహించారు. అనేక రచనలు చేసినా రెండు మాత్రమే లభ్యం 1-చెన్నబసవపురాణం 2-అసమగ్రంగా ఉన్న"అఖండజ్ఞాన మనఃప్రబోధ వచన కావ్యం. ఈ కవి అంగడిమఠం వీర శైవాచార్యులకు శిష్యుడు. ఇంటిపేరు తుమ్మా. తాత శివరామ లింగం. శివరామ లింగం, మల్లమాంబా దంపతులకు జన్మించిన పాపయ లింగం, మల్లమాంబా దంపతులకు గోపతి లింగకవి జన్మించాడు =

"శివ దేవియు మజ్జననియు –శివ దేవుడు తండ్రి సుప్రసిద్ధముగాగన్

శివభక్తులు బంధువులును –శివ కుల జనితుండ నిరత శివ గోత్రుడన్"

చెన్నబసవ పురాణానికి విపులంగా పీఠిక రాశాడు. శివ, గురు,ప్రమథగణ పాల్కురికి సోమన స్తుతి చేశాడు. పిడపర్తి బసవన్న, కొడుకు సోమలింగం గార్లపాటి లక్కయ్య లను స్మరించటం చేత కవి 16వలేక 17 శతాబ్ది వాడై ఉంటాడని రాజుగారన్నారు. గురుపరంపర తర్వాత ప్రబంధరచన ఉద్దేశ్యం చెప్పాడు. శ్రీ గిరీశ్వరుడు జంగమాకృతి ధరించి కవితో –

"సురుచిర గ్రంథము లారును –వర సుస్తవ మొకటి, టెక్కు వచనంబులు

స్థిర శతకము లైదును శ్రీ –కర కేదారీశు నోము కథయునుమరియున్"

మరియు మంగళాష్ట కాలు, విఘ్నేశ్వర వీరేశ్వర మల్లేశ్వర రామేశ్వరాష్టకాలు, శారద పదాలు జాజర పదాలు రాశాడని, ఇప్పుడు ఈ కృతిరాసి అంకితమివ్వమని కోరాడు. అలాగే చేద్దామని అనుకోగా తండ్రి కలలో కనిపించి అలాగే కోరాడు. అప్పుడు తమ్మడిపల్లె సిద్దయ్య అనే మాహేశ్వరుడు వచ్చి కృతిభర్త ఐన కాసాల పరబణ్ణ వీర మహేశ్వర ఆచార సంపద గుణగణాలు,వంశావళి వివరించాడు. పరబణ్ణ చిరు తొండనంబి కులం వాడట. అతని తమ్ముడు గర్రెపల్లి బసవలింగం. పీఠికలో పూర్వకవుల, స్మృతి శృతి పురాణ ఇతిహాసాల వాక్యాలు అధర్వణవేదం జాబాలిక ముండక ఉపనిషత్ బ్రహ్మాండ స్కాంద విష్ణు పురాణ, వీరాగమ విశ్వాగమ రహస్యం, ప్రభులింగలీల వేమన పద్యాలనుండి కూడా ఉదాహరణలున్నాయి. కనుక కవి వేమన తరవాతవాడు ఐ ఉంటాడు. తాళపత్ర ప్రతి రాసినవాడు కవికొడుకు మల్లయ్య.

గోపతి లింగాని రెండవ కృతి "అఖండజ్ఞామనః ప్రబోధ వచన కావ్య ప్రబంధము. పీఠిక అసమగ్రం. శివ స్తోత్రం ' అంగ డీశ్వరు డైన గురు స్తుతి, తలిదండ్రుల, పురాతన అధునాతన భక్తగణంవివరాల తర్వాత తోటక మఠంకు చెందిన గురువు స్తుతి, కొలనుపాక సోమేశ్వరస్వామి స్తుతి చేశాడు. "అమరున్ పాదపములున్,ఖగంబులు నిత్యానంద సింధుల్ పురిన్ –అమరున్ గోవులు కామధేనువులు పుణ్య క్షేత్ర సద్వర్ణనం-

బమరేంద్రాబ్జభవాచ్యుతాదుల కవశ్యం బన్నపూర్ణాంబకున్-భ్రమరా దీశునికున్ సుఖావహము సామ్రాజ్యైక తత్పీఠమున్"

"కమలహితుండు, తారలును సుదాకరుడున్ గ్రహంబులున్-అమరులు, తాపసేం ద్రులు మహా భయమంద పురంబు చుట్టునన్

గమిగొని భైరవుల్ ప్రహరి గాచుచు దా విహరింపు చుందుర - క్కమల విరోధి మౌళిపద కంజములున్ మదిలో దలంపుచున్ "

ఈ కవి ఇతర కృతులేమయ్యాయో ఆశివునికే ఎరుక.

## 17 నేబతి కృష్ణయామాత్యుడు

అమాత్యుడు, కవీశ్వరుడు అయిన నేబతి కృష్ణయామాత్యుడు కవిపోషకుడు, మహమ్మదీయ సుల్తానుల సభకు అలంకార మైనవాడు. కాని చరిత్ర మరుగునపడటం విధి వైపరీత్యం. కౌండిన్య గోత్రీకుడు. తండ్రి కమలయామాత్యుడు తల్లి కొండాంబ. గోల్కొందదగ్గర సిద్ధలూరు పుట్టినవూరు. దీనికి దగ్గరున్న

అనంతగిరి లక్ష్మీ నరసింహస్వామి ఇలవేల్పు. మహమ్మద్ ఖులీ కుతుబ్ షా అనే మహమ్మద్ షాహి ప్రదానమందలిలో, కవులలో ఒకడు గా ఉన్నవాడు. "రాజనీతి రత్నాకరం "అనే ఆరు ఆశ్వాసాల కావ్యం రాసిన ఘనుడు.

పీఠిక లో సమకాలీన రాజకీయ, సాహిత్య చరిత్ర రాశాడు.. గురువు కందాళ రంగా చార్యుడు. తర్వాత వైజయంతీ విలాసకర్త అయిన సారంగు తమ్మయ గురువు కందాళ అప్పు గారిని, తర్వాత ముడుంబ సాదు భట్టాచార్యులను స్మరించాడు. చరిత్ర కెక్కని గురు మూర్ధన్యుడు, శతావధాని, ద్రావిడ ఆమ్నాయ తత్వ రసజ్ఞుడు, కర్నాటక్షమాభ్రుత్సభాంతర పూజ్యుడు మరిం గంటివెంకట జగన్నాధా చార్యులను కూడా స్మరించటం విశేషం. ఇంతటిమహాకవి కృతులకూ చిరునామాలేదు. తనకవితావైభావాన్ని గురువు నోట పలికించాడు కవి –

"స్వర్దునీ వీచికా సంఘాత ఘుమఘుమ న్నిర్ఘోషములమించి నీటు గెల్చి –వాగ్భామినీ పాద వనజాత కంచనాంగదఝూళంఝూళ రావగతుల దెగడి

నిర్ఝర ద్రుమ జాల నిస్సర న్మకరందధమధమన్నద సంతతుల గేరి –కాంచీ నితంబినీ కాంచీ లతా ఘుంటికా ఘుణంఘుణరావక్రమము మించి

వెలసే భవదీయ సరసోక్తి విరచితాననవద్య గద్య సుపద్య కావ్య ప్రబంధ

దండకోదాహరణ కవితా నిగుంభనములు కృష్ణ ప్రధానీంద్ర నవరతీంద్ర "

"కోనమ దేవీవల్లభ గానకళాలోల సకలకవి బాంధవ ర-క్షా నిధి వైష్ణవ కల్పక దీనిది కమళేంద్రు నేబతి ప్రభు కృష్ణా "

కవిభార్య పేరు కొనమ. 84దుర్గాల ఏలిక అయిన కుతుబ్ షా సుల్తాను కవికోటిలోనివాడు మంత్రికూడామనకవి. కుతుబ్ షాను మనకవులు మల్కిభరాముడు అని,ఇభరాముడని స్తుతించారు. కవి తండ్రికమలయామాత్యుడు మల్కిభరాముడు మెచ్చగా, పానుగంటి పట్టణాధ్యక్షుడై,ఏకాదశీ వల్లభుడై, ద్వాదశీ చూర కారుడై, సత్యవాక్యపాలకుడై, సరస సంగీతమహిమలతో ఆది కవుల వలే విరాజిల్లాడు. వంశమూలపురుషుడు అన్నమరాజు. ఏడవ తరం వాడు కృష్ణయామాత్యుడు. ఇంటి పేరైన నేబతి –నియాబత్ పదానికి తెలుగు. అర్ధం రాయబారి లేక స్థానాపతి. ఇందులో రెండవతరానికి చెందిన నాగరాజు బిదందకోట సుల్తాను శహాకు నేబతి అంటే స్థానాపతిలేక రాయబారి.

కవి విశిష్టాద్వైత మతానికి చెందిన నియోగి బ్రాహ్మణుడు. ఈకవికి 300 ఏళ్ళ ముందుదూబగుంట నారాయణకవి" పంచతంత్రం "రాశాడు.. కృష్ణయామాత్యుడు తనకావ్యం లో 20పద్యాలలో శ్రీరంగపురవైభావం వర్ణించాడు. తర్వాత సుదర్శన చక్రవర్తి వర్ణన చేశాడు. ఆశ్వాసాంతపద్యాలలో అందులోని విశేషాలు తెలిపాడు. కావ్యాన్ని 6-12-1838న టోనాల అప్పన్న కుమారుడు వెంకటాద్రి వ్రాతప్రతి రాశాడు. "నేతటికాలమున నీ తాటియాకుల గొడవ యెరికిని పట్టిరాక పెట్టికి బుట్టిన బిడ్డ వలె నున్నది"అని ఆచార్య బిరుదురాజు రామరాజుగారు వ్యధ చెందారు.

## 18-పరశురామ పంతుల లింగమూర్తి గారి రెండు శతకాలు

రెండు అముద్రిత శతకాలు రాసిన పరశురామపంతుల లింగమూర్తి " శ్రీ సీతారామాంజ నేయం "అనే అద్భుత ఆధ్యాత్మిక గ్రంధం రాసిన తెలంగాణా కవి. శేషాద్రి రమణకవులు కూడా పై రెండు శతకాలను ప్రస్తావించలేదు. వంగూరి సుబ్బారాగారు "మనకృతకం "గురించి చెప్పారు. బిరుదురాజు రామరాజుగారు మాత్రం అముద్రితాలైన లింగమూర్తి గారి "ఆత్మారామ శతకం ",,గోవింద శతకం" గురించి త్రివ్వితీసి లోకానికి చాటారు. నియోగి బ్రాహ్మణుడైనఈ కవి వంశంవారు మహారాష్ట్ర నుండి వలసవచ్చారు. ఈ ఇంటిపేరు వాళ్ళు అంబాల, ఈదులవాయ మట్టేవాడలలో ఉన్నారట. కవికాలం 18శతాబ్ది. సీతారామాన్జనేయం 1760లో రచింపబడి ఉంటుందిఅని శేషాద్రి రమణ కవులూహించారు. రతి మన్మధ విలాసం, జీవన్ముక్తిప్రకరణం, బ్రహ్మనారద సంవాదం, తారకయోగం, మానస శతకం, సీతారామాంజనేయం లింగమూర్తిగారి కృతులని వారు చెప్పారు. తర్వాత "సీతపాట "అనే అద్భుత గేయకావ్యం వచ్చిందని రాజుగారన్నారు. కవి పోతన్న, రామదాసు వంటి భక్తకవి వేదాంత వేత్తకూడా. భక్తీ వైరాగ్యాల కూడలి లింగామూర్తికవి అన్నారు బిరుదు రాజువారు. ఓరుగల్లులో మట్టేవాడ ఒకభాగం అక్కడ కవి గారి గృహం ఇప్పటికీ దర్శనీయమే. దీన్ని ప్రభుత్వం భద్రపరచాలని కోరారు. ఈ రెండు శతకాలు మరికొన్ని పంచరత్నాలు రెండు" బెత్తెలపొడవున్న" 34తాటాకులపై వ్రాయబడ్డాయి.

ఇందులో ఆత్మారామ శతకం లో 108కందపద్యాలున్నాయి. 100పద్యాల తర్వాత" శ్రీ రామార్పణమస్తు" అని ముగించి, తర్వాత ఆరు పద్యాలలో గురు స్తుతి, కృతి ప్రశంస, ఫలశ్రుతి చెప్పాడు. రుచికి కొన్ని కందాలు –

"నరనారాయణము మన –మిరువురము నవిద్యవలన నేకాత్ముల,

మక్షర పురుష, పరమపురుషుల –మరయంగా విద్యవలన నాత్మారామా ".

"నిమ్నోన్నతములుగాని సు-షుమ్నామార్గమున నిన్ను జూచి జిత ప్ర

ద్యుమ్నులగు యోగిపుంగవు –లామ్నాయ విధిం భజింతు రాత్మారామా "

"గురుడనగా నీశ్వరుడగు –స్థిరమతి శిష్యుండంన జీవాత్ముండ

య్యిరువుర కైక్యస్థానం –బరయంగా పరమపదము నాత్మారామా "

"ఇల పరశురామ పంతుల –కులజ శ్రీ లింగమూర్తి గురుడవు నీపై

పలికితివి గాక నితరుల –కలవడునే యిట్లుబలుక నాత్మారామా "

ఈ శతకాన్ని నక్కా నరసంభట్లు అనే వ్రాయసగాడు 27-4-1798న రాసినట్లు రాజుగారు ధృవీకరించారు.

15వ కమ్మ రెండవ వైపు "గోవింద శతకం "ప్రారంభమైంది. 111కంద పద్యాలు. ఇందులోకూడా వందవ పద్యం తర్వాత "శ్రీరామా "అని ముగించి మిగిలిన 11పద్యాలలో మిగిలిన విషయాలురాశాడు. ఈ శతకం లో భక్తీ, వేదాంతం రెండూ ఉన్నాయి-

"శ్రీ లక్ష్మీ నారాయణ –నీలాంబుద నిభ శరీర, నిగామాధారా

లీలావిహార, నిర్మల –శీల, చిదానందకంద శ్రీ గోవిందా "

"యోగకర, యోగవిద్వర – యోగాభ్యాస ప్రవీణ,యోగాధారా

యోగైశ్వర్య పరాయణ –యోగానందానుభూతి యుత గోవిందా "

"క్షరతత్వము నంటక న –క్షర పురుషుని మించి సర్వ సాక్షి యనంగా

పురుషోత్తముడని వెలసిన –పరాత్ముని నిను భజింతు వర గోవిందా "

83వ పద్యం నుంచి వివిధ అవతార స్తోత్రాలురాశాడు –

"ధరణీ సురవరద మహా –పరశు ధర, నృపాల జలధి బడబానల, భా

సుర సు తపోధనఘన సుం –దర, భార్గవ రామ రూపధర గోవిందా "

"ఈ స్తోత్ర రత్నరాజము –కౌస్తుభ మణి తుల్యముగను,గని, కానుకగా

హస్తాబ్జంబుల గైకొని –విస్తరముగ మై ధరింపవే గోవిందా "

తర్వాత ఒకపద్యంలో తనను గురించి చెప్పాడు.

వ్రాయసకాడు నక్కా నరసంభట్లు "శ్రీసీతారామ పరబ్రహ్మణేనమః, శ్రీ లింగమూర్తి పరబ్రహ్మణే నమః "అని రాసి తానొక పద్యం రాశాడు. వ్రాతకాలం 28-4-1798అన్నారు రాజుగారు

"దయ నాదరింపు భక్త హృ –దయ,నా ఫణిశయన వికసితాంబుజ నయనా

నయనామయ నామయ నా-భయ నాశము చేసి మమ్ముపాలింపు హరీ "

ఈ రెండు శతకాల తర్వాత పంచరత్నాలున్నాయి –ఒకపద్యం –

సీ-"మొదలు ప్రాణాపానములను,తద్రేచక పూరక కుంభకంబులను నవి మెలంగు,నిడా, పింగళా సుషుమ్నల హంసత్వమునే సాక్షి తానె తెలియు

వికచహృత్కమల కర్ణిక యందు ఘోషించు ప్రణవనాదంబు నే ప్రభు డెరుగు -భ్రూ మ, ధ్యమమును చూపులను, నానావిధ కళలను మనము నే ఘనుడు గాంచు

నతడె ప్రత్యగాత్ము డతడెవో పరమాత్ము –డతడె వాసుదేవు డతడె శివుడు

అతడెస్వప్రకాశకుడైన శ్రీమన్మహా –దేవ లింగమూర్తి దివ్యకీర్తి "

ఇలా నాలుగుపద్యాలురాసి తర్వాత అయిదవ సీసపద్యానికి "సాంఖ్యం" అని, ఆరవదానికి "అమనస్కం" అని శీర్షికలుపెట్టాడు. వీటి తరవాత "శ్రీరామరామేతి రమే రామే మనోరమే "మొదలైన పంచరత్న శ్లోకాలున్నాయి. వీటి తర్వాత వీటి తెలుగుఅనువాద గీతపద్యాలున్నాయి –

"శ్రీమనోరమ శ్రీరామ రామరామ –యనుచు రమియించు రాముని యందు రామ

నామము వరానన సహస్రనామ తుల్య –మట్లు గావున దీని నీ వవధరింపు "

మందారమకరంద తుందితాలైన వేదాంత పద్యాలు రాయటం పరశురామపంతుల లింగమూర్తిగారికి ఎన్నతో పుట్టిన విద్య అనిపిస్తుంది వారి "శ్రీ సీతారామాంజేయం "చదివి పులకించని తెలుగువాడు లేడు అని నా అభిప్రాయం. ఈ శతకాలు అలాంటివే.

వీటిని కూడా వ్రాయసకాడు నక్కా నరసంభోట్లు 29-4-1798న రాసినట్లున్నది. యితడు లింగమూర్తికవిని దర్శించి తరించినట్లు చెప్పుకొన్నాడు

## 19 పాల్కురికి సోమనాథుని "మల్లికార్జున పండితారాధ్యోదాహరణకావ్యం "

పాల్కురికి సోమనాధుడు "ఉదాహరణ యుగ్మం "రచించాడని పిడుపర్తి సోమనాథుడు చెప్పాడు. సోమన ఉదాహరణ కావ్యం అంటే "బసవ ఉదాహరణ కావ్యమే" అని అందరికి తెలుసు. కానీ బిరుదురాజు వారికి కరీం నగర మండలం లో ఒక తాళపత్ర గ్రంథం లభించిందని, దానిలో సోమనాథ భాష్యం తోపాటు చాలా లఘు కృతులున్నాయని అందులో పండితా రాధ్య ఉదాహరణం ఒకటని రాజు గారు చెప్పారు. రాజుగారు చెప్పేదాకా అలంటి ఉదాహరణ కావ్యం ఉందని ఎవరూ చెప్పలేదట. వ్రాయసకాడు రాసిన తేది 3-5-532అని తేల్చారు.

శ్లోకం –అద్వైతోద్ధత కుంభి కుంభ దళనోద్యద్రౌద్ర పంచాననో –గర్వోదంచిత పాంచరాత్ర నిబిడ ప్రాలేయ చండ ద్యుతిః

పాషండాబ్ధ మహాగజో విజయతే బౌద్ధాద్రి ఘోరాశనిః-శ్రీమత్పండిత మల్లికార్జున గురుర్వి ద్వాత్సదాపూజితః"

"పండితారాధ్య నామేతి పంచాక్షర సముద్భవం –సకృత్ స్మరంతి ఏ భక్తా స్తేజనాః పుణ్య కారిణాః"

మాలిని –"శివకర శివ సౌఖ్యా శిష్ట భక్త్యైక ముఖ్యాః-వివిధ పరమ శీలా, వేద శాస్త్రానుపాలాః

ప్రవిమల పరభావా, పండితారాధ్య దేవా –తవిలి మిము భజింతున్ దద్దయుం బ్రస్తుతింతు "

ప్రధమా విభక్తి పద్యం –శా –శ్రీమత్పండిత మల్లికార్జునుడు పైశిష్ట్యోల్ల సచ్చర్యుడు –డుద్దామ ప్రోద్ధత వీరభక్తి నిధి, నిత్యశ్లోకు డుద్యన్మని

స్తోమ స్తోత్రుడ గణ్యపుణ్యుడతి తేజో రాశి, సంయగ్దయా –దాముం డీవుతమాకు భక్తియు, ప్రసాదార్ధక్రియా సక్తియున్.

కళిక – "మరి శుద్ధమార్గమందు, శైవమార్గ మండనుండు –తురువణించు భవ దుర్గ ఖండనుండు

చిరతర ప్రణవసిద్ధమాంత్రికుండు –పరమభక్తివిని బద్ధ తాంత్రి కుండు-మునిగణప్రచయ ముఖ్య వందితుడు

జనిత చిన్మయ సుసౌఖ్య వందితుడు –అలఘు సంచిత శివైక్య భావనుండు –ఎలమి సర్వ జగదేకపావనుడు. "

ఉత్కళిక –"తనవిభుత్వమును –ఘనమహత్వమును –ధరణి నింపుమని –హరుడు పంప బని

వడసి చెన్నమఠ-నోడలు గొన్న పర –మము దయా తనుడు –దమిత యాతనుడు

ఇలాగేసప్తమీ విభక్తిదాకా పద్యాలు చెప్పి సంబోధన ప్రధామావిభక్తిలోనూ చెప్పాడు చివరగా రాసిన, సార్వవిభక్తికం లోని రెండు శార్దూల పద్యాలు-

## 20 పేముల రామభట్టు

మహబూబ్ నగర్ మండలం "మానవతీపురం " అనే మానాజీపేట ను "తూము " వంశపు రెడ్లు పాలించారు. వీరు స్వయంగా కవులు కావ్యకర్తలేకాక కవి పండితులకు ఆశ్రయమిచ్చారు తూము రామచంద్రా రెడ్డి మహీపాలుడు **"అలమేలు మంగా పరిణయం "** కావ్యం రాశాడు. ఇతని కొడుకు పరాశురామ రెడ్డి 'ఆస్థానంలోని పేముల రామభట్టు **"గౌరీ విలాస "** కావ్యం రాశాడు. 19 వ శతాబ్ది వారు. ఇది దళసరి కాగితాలపై రాయబడి ఆంధ్ర సారస్వత పరిషత్తులో ఉన్నది. మొదటి రెండు కాగితాలు పోయాయి మూడవదానిలో కృతికి ప్రోత్సహించిన పరశురామ రెడ్డి అతని వంశ వర్ణన ఉన్నది. అతడు భూరి మేధాధరుడని, శివాచారుడు సత్య సంకల్పుడు, అనేక ధర్మశాస్త్ర కోవిదుడు "అని వర్ణించాడు కవి. ఒకసారి ఆయనకవిని పిలిపించాడు –

"శ్రీ లక్ష్మీ నరసింహా మంత్ర ఫలసంసిద్ధి ప్రకాశుండు స –చ్చీలుం డాశ్రిత చందనుండు విలసత్ క్షేపాల గోత్రాంబుధి

ప్రాలేయాంశుండురుప్రతాప పరిజిత్ప్రౌడుండు సత్కీర్తి –కళా యుక్తుడు, రామ చంద్ర ధరణీ పాలాత్మజుప్మోగిం డొగిన్ "

అతని కొలువులో ఒకప్రక్క సకల కళా ప్రఘటికులు, మరోప్రక్క నిఖిల శాస్త్రిక చయము, ఇంకొకవైపు సుకవీంద్ర నికరం, మరోవైపు సిద్ధాంత, జాతక విదులు, వేరొకవైపు మకరాంక శశాంక సుకుమార మహీపాలుడు వేరేవైపున పురాణక సమూహము, గాయక జనము, సకల సైనికగణము, చతురోపాయ విషయ శక్తి యుక్తులైన అమాత్యగణం,,వారితో ఆదికావ్య చర్చ చేస్తున్న రాజు కనిపించారు కవికి. కవి కౌండిన్య గోత్రుడు, లక్షీనరసింహా వెంకమాబల పుత్రుడు. కవిని రాజు –

"క్షేపాల గోత్ర జలధి, ని –శాపతి మా తండ్రి రామ చంద్ర కవీం ద్ర

క్ష్మాపాలుం డలమేల్మం-గా పరిణయ మనగ విష్ణు కథ రచియించెన్"

అని చెప్పి కవిని శైవ ప్రబంధం ఒకటి రాసి కీర్తి పొందమని కోరాడు. సరే అని రాశాడు "గౌరీ విలాస "కావ్యాన్ని. పరశురామ రెడ్డి వంశ వర్ణన చేశాడు ముందుగా –

"ఆచలేశ్వరులుగాని, యచలేశ్వరులుగారు భూరి దర్పోద్య ద్విభూతి గతుల –గోప గాని సింహులుగాని, గోపసింహులుగారు చటులబాహాబల శౌర్యగతుల

నారా బిడౌజులుగాని, నారా బిడౌజులుగారు వినతారి జయ దశా విభవ గతుల –రాజాంగ జులు గాని రాజాంగజులుగారు తగ కళారూప సౌందర్యగతుల "అంటూ జనం జయ ధ్వానాలు చేసే వంశం తూము వంశం అన్నాడు. అయ్యపురెడ్డి కి నాలుగవతరం లో రామ చంద్రా రెడ్డి రంగమ్మలకు పరశురామ రెడ్డి జన్మించాడు. స్వప్నం లో శివుడుకన్పించి కావ్యాన్ని తనకు అంకితమివ్వమన్నాడు –ఆ శివుని వర్ణన –

"వలనొప్ప నెమ్మేని నలడిన పలుబూది కనుగొన చలువ చందనముగాగ-కుడి దెస జారంగ విడిచిన పల్ పాపగమి పైడి తీపె జందెములుగాగ

జిముక వాల్ నాగ బెత్తేము డమరుకము ముమ్మొనవాలు కై యాయుధములుగాగా-చలిమిరి కొండ ముద్దులకూతు రెల్లపు డర మేనవదలని యతుకుగాగ

నొక్క తెలియాలబోతు బాల్ జిక్కినెక్కి-కనులపండువుగా నొద్ద గానబడుచు

తొలి మెయిళ్ల రొదోయ దోచ బిలిచి –గట్టు విలుకాడు కలలోన నిట్టులనియె"

దీనితార్వత శివ స్తోత్రం దండకం రాశాడు. తర్వాత తాను కోనయార్యుని,కొండమాంబల కు జన్మించిన రామయ్యకు పుట్టిన లక్ష్మీ బృసింహా వెంకమ్మల పుత్రుడనని చెప్పాడు గోత్రం కౌండిన్య.

గౌరీ విలాసం 6ఆశ్వాసాల ప్రౌఢప్రబంధం. పార్వతీ శివుల ప్రణయకలహం, శివుడుఅలకతో వెండికొండ విడిచి రామచంద్రా రెడ్డి కట్టిన శివాలయం లో ఉండటం, పార్వతీ,శివ విరహం, చిలుకరాయబారం మళ్ళీ ఇద్దరూ కలుసుకొని మానవతీపుర దేవాలయం లో ఉండిపోవటం కధ.ఆరవ ఆశ్వాసం లో పరశురామ రెడ్డి తండ్రి అతనికి రాజ్యం అప్పగించటం రాజ్యపాలన వేట ఉంటాయి. పూర్వ ప్రబంధాలలోని భావాలు, పద్యాల అనుకరణ బాగా ఉంటుంది. మేడలమీద హంసల వర్ణన బాగుంది –

"ఒంటి పాదమూని యొక్కచిత్తము నిల్పి –యూపిరదిమి పట్టి, చూపు దాచి

గోపురముల మీద కొన్ని రాయంచలు –తపము సేయు మునుల తాల్మి బూని "

తెలంగాణలో భోజనాలకు కూర్చునే విధానాన్ని "చకిలం మొకిలం "అంటారని రాజగారు చెప్పారు. వీణ వాయించే స్త్రీ వర్ణనలో కవి ఈమాటను ప్రయోగించాడు –

"కనులరమోడ్పు చేసియు, "చకల్ మొకలంబుగ" గోరుచుండి'అని చెప్పాడు.

పట్టణ స్త్రీలు కవిగారికి దశావతారాలుగా దర్శనమిచ్చారట –

"ఝషకనేత్ర, కమఠ చరణాబ్జగోల హ –ర్యక్ష మధ్యబాల రామరాజ

వదన కృష్ణవేణి, వర బుద్ధి కల్కి నా-తరుణులలదిరి పది యవతార గతుల "

ఇంతభావ స్ఫోరకంగా రాసిన తెలుగు కవి ఉన్నాడా ?అనిపిస్తుంది. తటాక వర్ణన శ్రీనాధుని నైషధం లోని "శేష పుచ్ఛచ్చాయ చెలువారు బిసములు "పద్యాన్ని పోలి రాశాడు –

"అహిరాజ పుచ్ఛ ప్రభానల ద్విసపాళి యంతరస్థాభ్రము పదంతములు గ-సంఫుల్ల సితపద్మ సత్ప్రభల్ యామినీ హస్తి రాడ్గమన రేఖాంకురములుగ

ప్రతి ఫలితోపాంత వితత భూజాతముల్ కుక్షి నిక్షిప్త సత్క్షుధరములుగ-కమలినీ మకరంద కాంక్షా చలద్భృంగజాలముల్ గరళాతి కీలలును గ

లలితశైవా జాలికా లతికలరయ – భీమ బడబానలోద్భవ దూమములుగ

క్షీర కలశధిబోలె గంభీరమైన –యత్తటాకంబు గాంచె దైవోత్తముండు"

శివుని వెతకటానికి పార్వతి సఖులతో బయల్దేరిన సందర్భంలో చెలులమాటలు –

"ఘనసారమా శరద్ఘన సారవర్ణుని, ఘనసార గంధితో గలవు మనవె-మదన భూజాతమా మదనాపకారు నీ మదనాగ గతి వెతల్ మాన్పమనవె

కాంచన దుగ్ధమా కాంచనాచల ధర్మ్మకాంచననాసరక్షించుమనవె-కాదంబమా భూత కాదంబపతి నీలి కాదంబికా దేవి, గల్పుమనవె

కల్ప భూజమ భక్త సంకల్ప దువిద-గల్ప గదెమోహవారధి గల్పకయును

ఏలకీ భూజమా సద్దయాలవాలు – నీ లతాంగిని దయతోడ నేలు మనవె"

మన్మధుని జైత్రయాత్రావర్ణన తమాషాగా చేశాడు –

"పచ్చపిట్ట పఠాన్ సిపాయిల్ సవారి, భేష్షాబాషు వహవా పసందనంగ-మొకము లెత్తుకొని శారిక వంది మాగధుల్ బహుపరాగ్సార భళాభళి యనంగ

రభసంపు నెమ్మి వీర భటాళిఝళిపించు ఉక్కు కత్తులును తళుక్కనంగ-శీతువు పిట్ట బంట్రోతు తుపాకి చప్పుళ్ళు ఢమి ల్లుఢమిల్లుమనగ

అంచలిరువంక చోపుదార్లై గడంగి –జరగకుడు ఖబడ్దార్బరాబరి యనంగ

మారుడప్పేళ ననికై స్వారి వెడల –తనబలంబుతో శృంగారవనము జేరె"

వసుచరిత్ర అనుకరణ పద్యాలు ఎక్కువగా ఉన్నాయి. అంతమాత్రం చేత కవి ప్రతిభ తక్కువ ఏమీ కాదనిపిస్తుంది. పరశురామ రెడ్డికి దాక్షాయణి కలలో అద్భుతంగా కనిపించింది –

"వర నీల కంధర స్ఫురదాభ లిరుప్రక్క కమలభాసుర కరంబు –ఘన పుండరీక శోభన చేల మిరువంక నిరువంక ననల బంధుర దృశంబు

నవ సుధా ధరబింబ సవిభవం బిరుదేవసిత పయోధర విభాతి –తారకాస్థిర సత్ప్రదానంబు లిరుదెస నిరుదెస నాహీనకాభరణ కాంతి

పలుకు భేదంబుగా బల్కు వలవకయును –వలచి ఇచ్చిన నరమేనగలసి శౌరి

చెలువుడు ను దాను గలియుట దెలుపవచ్చి –కలను భూపాలకునిమ్రోల నిలువబడియె"

ఆరవ ఆశ్వాసం లోని శివునిపై చెప్పినపద్యం –

"అమితాహి కులేశ్వర హారధరా –హిమభాను జితా రేణ కరా

కమలాంబక చేత సగర్వహరా –విమలాభ్ర ధునీ దృత విష్ణుకరా "

## 21 కుందావరుల గోపాలసూరి

కరీంనగర్ జిల్లా ములకనూరు కి చెందిన కుందావరుల గోపాలసూరి **"సంవరణ చరిత్రము"** రాశాడు. సుమారు 1850 కాలం. బ్రహ్మ వైవర్తపురాణం లోని **"శ్రీకృష్ణజన్మఖండం"** కావ్యం కూడారాశాడు కాని అముద్రితం. ములకనూరు హనుమకొండకు దగ్గర. అక్కడ మోతుకూరి వారింట శ్రీకృష్ణజన్మఖండం కావ్యాన్ని తానూ చూశానని బిరుదురాజు వారువాచ. గోపాలసూరి పండరినాధుడు అనేకవికి సమకాలికుడు.

సంవరణ చరిత్ర అంటే తపతీ –సంవరుణుల "కథ. అద్దంకి గంగాధరకవి "తపతీ సంవరణ ఉపాఖ్యానం " ప్రబంధవిధానం లో రాశాడు. రాజుగారివద్ద 233 పద్యాల ప్రధమ ఆశ్వాసం మాత్రమె ఉందట. కవి కౌండిన్య గోత్రీకుడు. తాత నాగశాస్త్రి. తండ్రి వెంకటశాస్త్రి. పెద్ద ప్రబంధంగా రచించే ప్రణాళిక తో ఉన్నట్లు కనిపిస్తుంది. ఇష్ట దేవతాస్తుతి, పూర్వకవి స్తుతి కు కవినింద, శ్రీ వెంకటేశ్వరునికి అంకితముగా షష్ట్యంతాలు, సూతర్షి మహర్షులకు ఈ కథ వివరించటం, హస్తినాపురం అక్కడి విశేషాలు హస్తినరాజైన సంవరుణుడి కీర్తిప్రాభవాలు, తపతీ సౌందర్యమ. ఇద్దరిమధ్యప్రేమ, నారద రాయబారం, తల్లి చాయాదేవి దగ్గర తపతి భజన. వేటకై వచ్చిన సంవరుణుడు చూడటం, ఆమె సఖి కీరవాణి భూలోకపు వింతలు తల్లికి చెప్పటం, విరహం, సంవరుణుడిని తెచ్చి తపతికి అప్పగిస్తానని కీరవాణి చెప్పటం మొదటి ఆశ్వాసం కథ.

విష్ణుస్తుతి –

"శ్రీ రంజిల్లమనోజ్ఞ సౌధమున లక్ష్మీ భూవదూటుల్ ప్రియో-దార స్వానురతానురాగగరిమల్ తర్కింపగా గూడసం

చారుండై చని, భూమి దేవి నాయనాబ్జాతంబులన్ మూసి శ్రీ –నారిన్ చుంబన కేళి దేల్చు విభునిన్ భావింతు భావంబునన్ "

శివపార్వతుల వర్ణన –

"యెక్క కోడెలమిన్న మెక్కగా విసమెన్న జడముడిపై పాలకడలి వెన్న –యొడలునిండ విభూతి, ఎడమ దిక్కున నాతి,కడకంట నమృతంబు వెడలు రీతి

మెడను పాములజోడు, మేటి గుబ్బలవీడు మొనసి కరంబున ముద్దు లేడు-ఎదను పుర్కల చెన్ను, నుదుట చిచ్చులకన్ను, సరిలేని కేశపుంజములు మిన్ను

సకల దేశస్థు, డఖిల యోగీంద్ర హృదయ –జలజమదధుపాయ మానుండు శంకరుండు

భూరికారుణ్య రస ఝరీ పూర్ణ దృష్టి-మించి మత్కావ్య మరసి పోషించుగాత"

"తొడలపై నిషణ్ణు డయితోరపు వేడ్క మనంబు నిండ చ –న్గుడుచుచు కుమారు నాస్యమున కోమలనీల నిజేక్షణంబులన్

బొడగని కప్పు కాటుకను, బుద్ధి కరంబున మాటిమాటికిన్ –దుడుచు గిరీంద్ర కన్య దయతోడుత మత్కృతి పెంపు జేయుతన్"

ఇతర కవుల సానుభూతికోసం –"కడుపునిండా కాన్పు కన్నవారికి ఇతరులకాన్పు పై కరుణ కలిగినట్లు, తానూ కావ్యకర్త ఐనవాడు ఇతరకవులకావ్యాలపై సానుభూతి చూపిస్తాడు "అన్నాడు.

తపతిపై మనసుపారేసుకొన్న సంవరుణుడు –

" ప్రణుతింప లోకేశ్వరత్వ మాత్రమెకాదు, కమలాసనత్వము కలిగి యుండు –శ్రీ మోహనత్వ సంసిద్ధి మాత్రమె కాదు,ఘనసంభవ దశత్వ మెనయు చుండు

సరవి రాజావతంసత్వ మాత్రమెకాదు,ధవళ దేహత్వంబు దనరు చుండు –కనుగొన జైవాతృత్వమెకాదు, రామాతను ప్రీతి ప్రబలియుండు

నహహ రాజన్యవరుడు దుస్సహవియోగ –భారపరిభూతుడై, బ్రహ్మ శౌరి శర్వ

కైరవాప్తుల కెనయయ్యె చారులీల –ధూర్జటికిని కంఠ నైర్మల్యంబు తొడవుగాదె"

సరస్సు వర్ణన –

"నిఖిల యువజన జనకలా నిరత సరసి –జాశుగా దీర్ణసింహనాదానుకారి

బర్హి నినదంబు తత్సరః పరిసరంబు –జగధదీశుండు సూచి యుత్సవము బొందె"

మంచి కావ్య రచన చేసిన కుందా వరుల గోపాలసూరి కావ్యమంతా లభించి ఉంటె బాగుండేది. మొదటి ఆశ్వాసపు మెతుకును బట్టి మిగిలిన కావ్యాన్నపచనం గురించి చెప్పాల్సి వచ్చింది

## 22 శివరామ లింగరాజు (చివరిభాగం )

మూడు ఆశ్వాసాల "శైవాచార సంగ్రహం "రాసిన శివరామలింగరాజు భారద్వాజ గోత్రీకుడైన క్షత్రియకవి. తండ్రి హరిరాజు తల్లి సీతమ్మ. గురువు గోకర్ణ మఠాధిపతి సోమశేఖరుడు.. కాకతి, చాళుక్య సీమలలో క్షత్రియ వీర శైవులు లేరని, తెలంగాణా లేక రాయలసీమ వాడు అయి ఉంటాడని రాజుగారన్నారు. వంశక్రమంలో బర్బర దేశాధీశ్వరుడు శంఖాన్వయుడు మూలపురుషుడు. అతడికి అయిదవతరం వాడు మనకవి. ఇతనికావ్యం స్కాందపురాణం లోని **"శంకర సంహిత"** కు ఆంధ్రానువాదం. ధారాశుద్ధి ఉన్నకవిత్వం రాశాడు. ఇది చదివితే 18 వ శతాబ్దికి కావ్యభాష ఎలా రూపు దాల్చిందో తెలుస్తుందన్నారు బిరుదురాజు వారు. కల్హారపుష్పం -కలుహార పుష్పం, -అరహము –అర్హము, సుదర్శన -సుదరిసిన –, పిత్రు తోషణము –పితరు తోషణము,శ్రీ రుద్రీయము –శ్రీ రుద్రియము గా మారాయి.

మొదటి ఆశ్వాసం లో శివుడు కుమారస్వామికి చెప్పినదాన్ని సూతుడు మునులకు చెప్పాడు. ఒక సారి శివలోకం లో కుమారస్వామి అందరి సమక్షం లో సంశయాలు తీర్చమని అడిగితె శివుడు చెప్పినవిషయాలివి. మొదటి ఆశ్వాసం లో లింగార్చన, లింగాదారణ వగైరాలున్నాయి. రెండవ ఆశ్వాసం లో షట్ స్థలాల నిర్ణయం, స్థలధర్మాలు, త్రివిధ ఉపాసనలు భక్తిమార్గాలు, మహేశ్వరుల ప్రవర్తన మొదలైనవి ఉన్నాయి. మూడులో శివయోగులకు చేసే దానాలు, గోప్యార్పణం, తండ్రీకోడుకులైన శ్వేత, పింగళ కథ,శ్రీశైలమహాత్మ్యం,స్వధర్మ నిష్ట వగైరాలున్నాయి.

ప్రారంభ కందపద్యం-

"శ్రీ పార్వతీ వదూధవ –తాపస హృదయాబ్జ భ్రుంగ భగ ధనదార్చిత వి

ద్యోపాయనిలయ నిర్మల –శ్రీపతి చింతాంగ తరంగ శ్రీ గురులింగా "

తర్వాత గ్రంధ ప్రాముఖ్యాన్ని చెప్పాడు. వీరశైవులకు కుల వివక్ష ఉండదుకనుక వంశ చరిత్ర చెప్పుకోలేదు"అంగ త్రివిధ విలక్షణ –లింగాంగికి నొక్క కులము లేదని మదిలో

నంగాభిమాని కేర్పడ-పొంగుచు నెరిగింతు తనువు పుట్టిన కులమున్ "

గ్రంథంచివరలో కూడా దాని ప్రాశస్త్యాన్ని మళ్ళీ చెప్పాడు. రచనాకాలం గురించిపద్యం –

"చనినట్టి శాలివాహన శాతాబ్దంబులు పాటింప పేయు నూర్నూటిమీద –నిరవదగా నేబదేను ప్రమాదీచ విమల వత్సరము నాశ్వీజమందు

బహుళ తృతీయలో భానువాసరమున రచియించి నట్టి నిర్ణయ చరిత్ర "అన్నాడు. ఇది 14-10-1733కు సరిపోయిందని రాజుగారువాచ.

కృతి సమర్పణపద్యం –

"కరణములు మూటి సాక్షగా-గని విలక్ష భావమున నిష్ట లింగ ంబు, ప్రాణ లింగ,

భావలింగంబులై యున్న బ్రహ్మమునకు –భక్తి తోడుత కృతి సమర్పణము చేతు ".

మూడవ ఆశ్వాసం చివరి గద్య రాశాడు. దీని ప్రతి రాసిన విధానం "పరీధావి సంవత్సర ఆశ్వీజ బహుళ దశమి శెనివారం మూడు ఝాములవరకు వీరశైవాచార సంగ్రహం ప్రెతి లో ఉన్న ప్రకారం సున్నపు నోమయ్యకు పాటోజు బైరాగి వ్రాశి ఇచ్చెను. "ఇది 6-11-1852 కు సరిపోతుందని, వ్రాయస కాని వాక్యాలు గతశతాబ్దం తెలుగు వ్యావహారిక భాషకూ, లేఖన సంప్రదాయానికి ఉదాహరణ గా ఉన్నాయని ఆచార్య బిరుదురాజు రామరాజు గారు చెప్పారు.

సమాప్తం

ఆధారం-ఆచార్య బిరుదురాజు రామరాజుగారి "చరిత్రకెక్కని చరితార్థులు ".

మనవి –"చరిత్రకెక్కని చరితార్థు"లైన 22మంది తెలుగు కవులను, వారి రచనలను, విశేషాలను రాసే అదృష్టం దక్కిందని, ఈ వ్యాసాలు రాజుగారు" గోలకొండ "మొదలైన పత్రికలలో 1960-నుంచి 1971వరకు రాసిన పరిశోధనా వ్యాసాలని, వీటిని పై శీర్షికతో 1985లో ముద్రించారని, ఇందులో రెండవవిభాగం లో 12మంది చరిత్రకెక్కని "సంస్కృత కవులు "ఉన్నారని, వారి గురించి నేను రాసిన" గీర్వాణకవుల కవితా గీర్వాణం "మూడుభాగాలలో చోటు పొందకపోతే వారి గురించికూడా "గీర్వాణకవులు"లో త్వరలో రాస్తానని మనవి చేస్తున్నాను. ఈ పుస్తకం వచ్చాక అనేకమంది పైకవులపై పరిశోధన చేసి ఉంటారని, వారు మరిన్ని నూతన విషయాలు ఆవిష్కరించి ఉంటారని భావిస్తున్నాను. సరసభారతి బ్లాగ్ అభిమానులైన సాహితీ బంధువులకు ఈ కవులను పరిచయం చేయటమే నా ముఖ్యోద్దేశం.

ఈ ధారావాహికను చక్కగా చదువుతూ, తెలియని విషయాలు తెలియజేస్తూ నన్ను ప్రోత్సహించిన డా. శ్రీ టి.శ్రీరంగ స్వామి (వరంగల్ ),డా శ్రీ ఉప్పలధడియం వెంకటేశ్వర (చెన్నై )గార్లకు, అభిమానించిన సాహితీ బంధువులకు ధన్యవాదాలు.

# ...సంపూర్ణం...

మీ సలహాలు సూచనలు తెలియచేయండి

గబ్బిట దుర్గాప్రసాద్

Cell : 9989066375

gabbita.prasad@gmail.com
http://sarasabharati.wordpress.com
http://sarasabharativuyyuru.wordpress.com
http://suvarchalaanjaneyaswami.wordpress.com

Telugu Wikipedia
: https://te.wikipedia.org/wiki/%E0%B0%97%E0%B0%AC%E0%B1%8D%E0%B0%AC%E0%B0%BF%E0%B0%9F_%E0%B0%A6%E0%B1%81%E0%B0%B0%E0%B1%8D%E0%B0%97%E0%B0%BE%E0%B0%AA%E0%B1%8D%E0%B0%B0%E0%B0%B8%E0%B0%BE%E0%B0%A6%E0%B1%8D
Gabbita Durga Prasad
Rtd. head Master Sivalayam Street
Vuyyuru 521165 Krishan District
Andhra Pradesh
India

